

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరవిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ సప్తగిరి వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) సప్తగిరి వెబ్ సైట్: https://www.scribd.com/search?query=sapthagiri
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో సప్తగిరి వెబ్ సైట్ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**SaiRealAttitudeManagement**(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

సప్తగిరి వారి వెబ్ సైట్

https://www.scribd.com/search?query=sapthagiri



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సప్తగిరి

## తిరుమల తిరుపతి దేవస్థానముల మాసపత్రిక.

* * *

సప్తగిరి మాసపత్రికలో వ్యాపార ప్రకటనలు ఈ దిగువ కనపరచిన రేట్ల ప్రకారము ప్రచురించబడును.

### ఒక్కొక్క ప్రకటనకు

| | | | | |
|---|---|---|---|---|
| లోపల పేజీలో: | పూర్తి పేజి | .... .... | రు. | 80/– |
| | అర్థ పేజి | .... .... | రు. | 50/– |
| | పావు పేజి | .... .... | రు. | 30/– |
| కవరు పేజీలు: నాల్గవ పేజి | 1 రంగులో | .... .... | రు. | 200/– |
| | 2 రంగుల్లో | .... ... | రు. | 250/– |
| | 3 రంగుల్లో | ... .... | రు. | 300/– |
| లోపల 2 వ పేజి 3 వ పేజి | 1 రంగులో | ... ... | రు. | 150/– |
| | 2 రంగుల్లో | .... .... | రు | 200/– |
| | 3 రంగుల్లో | .... . | రు | 250/– |
| ప్రత్యేకస్థలము లోపల పేజీలో | 1 మొట్టమొదటిపేజి | .. .. | రు. | 150/– |
| | 2 చివరిపేజి | .... .. | రు. | 110/– |
| | 3 వార్తలపేజికి ఎదురుపేజి | 1 పేజి | రు. | 100/– |
| | | ½ పేజి | రు. | 60/– |

### సాంకేతిక సమాచారము

| | | | |
|---|---|---|---|
| స్క్రీన్: | కవరుపేజీలు | .... | 80 నుండి 100 |
| | లోపలపేజీలు | .... | 65 నుండి 80 |
| పేజిపరిమాణము (బ్లాకులకు) | పూర్తిపేజి | .... | 24 సెం మీ × 19 సెం. మీ |
| | అరపేజి | . | 12 సెం మీ × 19 సెం. మీ |
| | పావుపేజి | ... | 6 సెం మీ × 19 సెం. మీ |

ప్రకటనకు సంబంధించిన విషయములు, బ్లాకులు, సంస్థలవారే సరఫరా చేయవలయును.

గమనిక : 1, 4వ కవరు పేజి తప్ప మిగిలిన పేజీలలో 6 నెలసరి సంచికలకు ముందుగా డబ్బు చెల్లించి స్థల నిర్ణయము చేసుకొనువారికి ప్రకటన రేట్లపై 10% ను 12 సంచికలకు స్థల నిర్ణయము చేసుకొనువారికి 15% శాతమును ముదరా ఈయబడును.

2. ఈ వ్యాపార ప్రకటనల విషయము ముందు తెలుపక, కారణములు తెలుపకయే ఏ ప్రకటననైనను నిరాకరించు హక్కు సంపాదకునకు కలదు.

కార్యనిర్వాహక అధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానం.



దేవదేవుఁ డితఁడే దివ్యమూరితి
యేవలఁ జూచినఁ దానే యీరూపై వున్నాఁడు

వెంకటాచలముమీఁది విశ్వరూప విశేషము
అంకెల ననంతావతారాలైన విశేషము
లంకె సింగారాది సర్వాలంకార విశేషము
యింకని మహిమలతో నీరూపై వున్నాఁడు.

అందరిలో నంతర్యామియైన విశేషము
కందర్పుఁ బుట్టించిన ఘన విశేషము
ముందు జగము సృష్టించి మూలమైన విశేషము
యిందరితోఁ గూడుకొని యీరూపై వున్నాఁడు

పరము (మ?) యోగీంద్రు లెల్ల భావించిన విశేషము
అరుదైన వేదవేదాంతార్థ విశేషము
పరగ నలమేల్మంగపతియై (శ్రీ) వేంకటేశుఁ
డిరవై దాసులఁ గావ నీరూపై వున్నాఁడు.

అన్నమాచార్య. సం. 10—151.

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

జనవరి 79

సంపుటి 9 సంచిక 8

విడిప్రతి 0–50 పైసలు

సం॥ చందా రు. 6–00



గౌరవసంపాదకులు:

శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్

ఐ. ఏ. ఎస్,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2322

ప్రచురణకర్త – సంపాదకుడు:

కాట్రపాటి సుబ్బారావు

ఎమ్. ఏ.,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

ముద్రాపకుడు,

ఎమ్. విజయకుమార్ రెడ్డి,

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2340


* సప్తగిరిలో ప్రచురణలకు పారితోషికములేదని గమనింప గోర్తాము. సం॥

## విషయసూచిక



## అన్నమప్రభ

అనుబంధం



* 37 పేజీ సింహంలో అన్నివిధాల వ్యయం బదులు 'జయం' అని చదువుకోవాలి. ॥ సం॥

ముఖచిత్రం: శ్రీ వేంకటేశ్వరస్వామి తిరుమల

# సంపాదకీయము

వేదాలు అంటే చాలు, మొదట ప్రారంభమయ్యేది అవి పౌరుషేయాలా అపౌరుషేయాలా అన్న వాదాలు. ఇవి చాలా పరుషంగా పౌరుషవంతంగా ప్రారంభమై వక్తల తార్కిక ప్రతిభకు, తరతరాల వైషమ్యాలకు తార్కాణాలౌతున్నవే తప్ప సత్యావిష్కరణకు సాధనాలు కావటంలేదు. ఎవరన్నా మధ్యేమార్గంగా సమన్వయం చేస్తే వేదాలపై ఈ వాదాలు చల్లబడ్తాయేమో.

'విద్' ధాతువు తెలియు, జ్ఞానము అన్న అర్థాలున్నాయి. ఈ జ్ఞానం సత్యమని అనంతమని, బ్రహ్మమని అన్నారు. అఖిల చరాచర సృష్టిలో ప్రతిదీ ఒక నిర్ణీత పరిధిలోనే నడుస్తున్నదే తప్ప, కొన్ని వేల ఏళ్ళ (అంతకు తగ్గించినా ఎక్కించినా ఒరిగేదేమీలేదు.) గతిలో వ్యత్యస్తమైన దాఖలాలులేవు. ఈ సర్వనియామకశక్తిని తెలిపేది, తెలిపే శక్తిగలది నిజమైన జ్ఞానం. అదే వేదం. ఆ జ్ఞానానికి ఆవిర్భావకరూపం నాదం. అందువల్ల వేదాలు విశ్వవిరాట్ నిశ్వాసాలనిఅన్నారు. సృష్టి నిర్మాణ వైచిత్రిలో తీవ్రజిజ్ఞాసగల కొందరు ఒక్కొక్కఅంశంపైన మనస్సును, తమఅనుభవాలను కేంద్రీకరించి తపించి మధించగా, వారికిఅతీంద్రియ జ్ఞానం, ప్రకృతి మూలరూపం—తదంశలు, వివిధపరిణామాలు — ఈ విధంగా చేతనాచేతనవస్తుజాలాన్నిగూర్చి గోచరించగా వాటిని తమ అంతేవాసులకు, అనుయాయులకు వివరించారు. ఇలా అగమ్యంగా అగోచరంగా ఉన్న జ్ఞానాన్ని దర్శించి చెప్పగల్గినవారు కనుక వారిని ద్రష్టలన్నారు. సత్యావిష్కరణకు వాగ్రూపమే సాధనమైంది గనుక, ఆ స్వరం ఉదాత్తానుదాత్తాది భేదాలతో ఉండి లిపిముఖ ప్రకటనంలో అసాధ్యంగనుక, ఆ పరమపురుషుని నిశ్వాస స్వరూపమైన అనంత విజ్ఞానం చతుర్ముఖ బ్రహ్మకు గోచరమై స్పష్ట వాగ్రూపం పొంది, ద్రష్టలద్వారా వ్యాఖ్యాతమూ, వ్యాకృతమూనై పరంపరాగతంగా గురుశిష్యసంబంధం, పితృ పుత్ర రూపక బాంధవ్యంలో మననాటి వరకు మనగల్గింది.

ఐతే దేహం నశ్వరం. తామరాకుమీది నీటి బుడగలాగా పలువర్ణరంజితమై ఎప్పుడో ఒకనాడు "టప్"మనేదే. మన మీనా డనుకుంటున్న ఈ మాట వాళ్ళు ఏనాడో గ్రహించివేసిన విషయం గనుక తమ కవగతమైన విజ్ఞానాన్ని వీలైనంతవరకు లిపిబద్ధం చేసే ప్రయత్నం చేశారు. ఈ ప్రయత్నాలకు ప్రాతిపదిక రూపంగా, మాహేశ్వర సూత్రా విర్భావాన్ని తీసుకోవచ్చు. వ్యాకృతమైన భాషా స్వరూపం ఆధారంగా ఉపనిషత్తులు, వివిధశాస్త్రాలు ఏర్పడి ద్వాపరం నాటికి వాఙ్మయారణ్యం కాగా కాలగతిలో లుప్తమైనవాటిని, చేర్పులను శోధించి కృష్ణద్వైపాయనుడూ పరాశరాత్మజుడైన వ్యాసభగవానుడు, ఈవేదవాఙ్మయమంతా ఈ యీభాగాలలో ఈ విధంగా నమీకృతమై ఉన్నది—అని వేదాలను విభజించి తత్సంబద్ధ ఉపనిషదాది వాఙ్మయా విష్కరణకు మూలపురుషుడయ్యాడు. వేదోపనిషద్బృంహితమైన వాఙ్మయ సారాన్ని తత్కాలపు భాషలో, నిబద్ధంచేసి, కథారూపకమైన అష్టాదశ పురాణాలకు కూడా కారణభూతుడయ్యాడు. కాలక్రమాన లిపి పరిణతి పొంది, వైజ్ఞానిక విజయమూతోడై ఆ వేదవాఙ్మయాన్ని క్రమబద్ధంగా గ్రంథాలుగా రూపొందించడమే గాక నాదాన్ని పదికాలాల పాటు పదిలపరచి ముందు తరాలవారి కందించే అవకాశం కూడా ఏర్పడింది.

మరి ఇందరు మహనీయుల నిరంతర కృషివల్ల ఈనాడు మనకు లభించిన మహత్తర వాఙ్మయ మహోదధినికూడా నిస్సారమైన పౌరుషేయా పౌరుషేయ వాదదావాగ్నితో ఇంకించివేస్తున్నాం. సమరస భావాన్ని నశింపజేసి సమర భావాన్ని రెచ్చగొట్టేకన్న ఒకరకంగా వేదాలుపౌరుషేయాలు, అపౌరుషేయాలు అని తృప్తిపడవచ్చుకూడా. ఈ ప్రకృతిలో శ్రీకృష్ణుడుతప్ప మిగిలినదంతా స్త్రీ స్వరూపమే అని మీరా చెప్పినట్లు పురుష శబ్ద వాచ్యార్థతగల ఏకైక పురుషుని గురించినవి గనుక పౌరుషేయాలు. ఆ పరమాత్మచేత గూడా చెప్పబడక, పాంచభౌతిక పురుషరూపులకుకూడా—గోచరించినవి మాత్రమే అయినందువల్ల అపౌరుషేయాలు అన్నా తప్పులేదు.

ఇంతకీ 'ధర్మోరక్షతి రక్షితః' అన్నట్లు సార్వకాలిక ధర్మస్వరూపమైన వేదాన్ని రక్షించి పోషించు కోవటమే మనకర్తవ్యం.

ఇలా అనూచానంగా అనుశ్రుతంగావచ్చే వేద వాఙ్మయాన్ని, స్వరసహితంగా రక్షించు కోవటానికి గురుకుల సంప్రదాయాలు, ఏ కారణం చేతనైనా స్వాధ్యాయాదికాలు మరుగునపడే దుస్థితి ప్రాప్తిస్తే కనీసం బాహ్యరూపం, వాచ్యార్థంతోనూ సమాజానికి లభించేందు లిపి, ముద్రణాలు తోడ్పడ్తున్నవి.

కనుకనే దేవస్థానం, తనకు సంబంధించినంత వరకు ఏ వాదాల జోలికిపోకుండా, వేదవాఙ్మయ పరిరక్షణకు యథాశక్తి తోడ్పడుతున్నది. సస్వర వేదవాఙ్మయ రక్షణకు, ఈ నాటికే కనుమరుగైన వేదశాఖలకురూపాలుగాఉన్న వారినుండి ఆయాభాగాలను టేప్‌రికార్డుచేసే కార్యక్రమాన్ని చేపట్టింది. అనుశ్రుతంగా వచ్చే వేదాధ్యయన రక్షణకు, కుమారాధ్యయన పథకాన్ని స్వీకరించి వేదవిధుల సంతతి పాశ్చాత్య విద్యావిమోహితులు కాకుండా వేదరక్షణలోనే తమ ప్రశాంత జీవితాలను గడుపుతూ ఆధ్యాత్మిక జ్ఞానజ్యోతిని దేశం నలుమూలలా వెదజల్లేందుకు తోడ్పడుతున్నది. (40వ పేజి చూడుడు)

# వేదధర్మోద్ధరణ - మనకర్తవ్యం.

హిందూధర్మప్రతిష్ఠానం ఆధ్వర్యాన వేద విదులసమక్షంలో జరిగే ఈ స్వాధ్యాయ ప్రవచనయుత ఘనస్వస్తి సదస్సును ప్రారంభించేందుకు, పాల్గొనే సదవకాశం నాకు కల్గినందుకు మహానందంగాఉంది. ఆంధ్రప్రదేశ్ లో వేదవిద్యాకేంద్రం అనదగ్గ కోనసీమప్రాంతంలోని వేదవిదులలో నిష్ణాతులు ఈసభలో పాల్గొంటున్నారనికూడా తెలుసుకున్నాను. ప్రతిహిందువూ, చివరకు పాశ్చాత్యులైన భారతచరిత్ర శోధకులుకూడా వేదాలు హైందవధర్మానికి వెన్నెముక అని జీవకర్రఅని ఒప్పుకుంటున్నారు.

ఎంతటి గొప్ప భౌతికవిజ్ఞానవేత్తకైనా లోతెరుగసాధ్యంగాని, విగూఢజీవనసత్యాల ఆవిష్కరణకు మానవుని ప్రబోధించే అపూర్వవిజ్ఞాన భాండాగారం వేదవాఙ్మయమని నా నమ్మకం. వేదాలలో తరచు పేర్కొనబడే వశిష్ఠ, జమదగ్ని, భరద్వాజ, విశ్వామిత్రాది బ్రహ్మర్షిసత్తములను ప్రభవింపగల అదృష్టం, ఘనత, ఒక్క భారత జాతికే దక్కింది. అంటే, భారతదేశం, ప్రాపంచిక విషయావృతమైన మన సామాన్యమేధకు అందని, అంచిత్య జ్యోతిని సందర్శించి, ఆ ఆధ్యాత్మిక సత్యాలను భావితరాలవారికి అక్షరరూపంలో సంతరించిన మంత్రద్రష్టల క్రీడాస్థలమన్నమాట. ఐన్‌స్టీన్‌లాంటి ఆధునికవిజ్ఞానవేత్త కూడా - అతిగహనమైన విశ్వాంతరాళంలో ఏ మూలనుండి మానవుడు ఆవిర్భవిస్తున్నాడు, మరల, మరణించిన తరువాత ఏ మూలకు చేరుతున్నాడన్న మహత్తర సత్యం మనకగోచరమే అని తపనపడ్డాడు. ఇక ఉపనిషత్తులను గూర్చి పాశ్చాత్య తత్త్వవేత్త మాక్సుముల్లర్ అవి తన కిహంలో సహానుభూతి, పరంలోప్రశాంతిని ప్రసాదిస్తాయని ఘోషించి, వైజ్ఞానికుల భావనకు అందని సత్యావిష్కరణంచేశాడు. అంటే ప్రాచీనభారతంలోని ఋషులలాగా అంతర్ముఖులైనవారు మాత్రమే అనుభూతి పూర్వకంగా ప్రకటించదగిన సత్యాలన్నమాట. వేదవాఙ్మయప్రశస్తి ఇదన్నమాట నిజంగా మనం గర్వించదగ్గ విషయం.



2-12-78 న తిరుపతిలో ఘన స్వస్తి సభలో రాష్ట్ర దేవాదాయమంత్రి శ్రీ వి. వెంకట నారాయణగారి ప్రసంగ పాఠము.

ఎంత ప్రతికూల వాతావరణం ఉన్నా, దాన్ని అధిగమించి, వేదవేత్తలను పలువురిని ఈనాడు మనకళ్ళతో చూడటం నిజంగా ఆనందదాయకమైన విషయం. కాని, విశ్వవిద్యాలయాలలోని అధ్యాపనానికి, సాంప్రదాయకమైన పాండిత్యానికి, అగాధం ఏర్పడటం నిజంగా విచారకరం. దురదృష్టవశాత్తు ఒకరినొకరు అర్థంచేసుకోలేకపోవటంవల్ల, బాగా చదివినవారికి కూడా ఎవరు మంచిపండితులో అర్థం కాకుండా ఉంది.

ఆంగ్లవిద్యావిధానం ఆధునికంగా విశాలదృష్టిని పెంచినా, మన ప్రాచీనసంస్కృతిలోని విలువలు మరచిపోయామనే చెప్పక తప్పదు. అనిబిసెంట్ లాంటి పాశ్చాత్యవనిత ఇక్కడదాకావచ్చి 'భారతదేశం ఆత్మకోల్పోయింది, భారతీయులు వేదవాఙ్మయం పునరుజ్జీవింపచేయాల"ని బోధించవలసివచ్చింది.

గత కొన్నిశతాబ్దాలుగా వేదవాఙ్మయాధ్యయనం తన ఉనికిపట్టులోనే క్రమంగా మాయమౌతూవచ్చిందన్న విషయం అందరికీ తెలిసింది. సుమారు ఆరేడు శతాబ్దాలకాలం దేశం పరపాలనలో అంటే మొదట మహమ్మదీయులు, ఆ తరువాత ఆంగ్లేయుల పాలనలో ఉండటమే ఇందుకు కారణము. మన సాంప్రదాయక శిక్షణావిధానానికి ఉరి అనదగ్గ ఆంగ్లవిద్యాబోధనవిధానాన్ని ఒకటిన్నర శతాబ్దాలక్రిందట మెకాలే ప్రారంభించినప్పటినుండీ ఇంగ్లీషు విద్యావిధానమే క్రమంగాప్రజలమనుగడకు మార్గమైంది. వేదసంస్కృత భాషా వేత్తల కాళ్ళక్రింద నేలకరిగిపోయింది. ఈ రోజుల్లో వేదం చదివినవారికి వివాహం కాలేనిస్థితి రావటం శోచనీయం.

ఈ పరిస్థితులలో, సాంప్రదాయకవిద్యావిధానం, ఆధునిక విద్యావిధానపు మరుగున పడిపోకుండా రక్షించుకోవటం మన బాధ్యత. నిజానికి మనం కోట్లరూపాయలు వెచ్చించి నడుపుతున్న విశ్వవిద్యాలయాలలో, పాఠశాలలో ప్రతిరోజూ సమ్మెలు జరుగుతు వేదనకల్గిస్తున్నై. ఇదిగాక విద్యాధిక నిరుద్యోగుల సమస్య మనకెదురౌతున్నది. కనుక, ఐశ్వర్యాధికారాలకు ప్రతిబింబంకాని, ఉన్నతప్రమాణాలనే ప్రతిబింబించే సంస్కృతిని రక్షకవచంలాంటి వైదికధర్మాన్ని, జాతికి ఉద్ధరించి పోషించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

(39వ పేజీలో చూడుడు)

# శ్రీభాగవత పురాణము

శ్రీ డి. నాగసిద్ధారెడ్డి
తిరుపతి

శ్రీభాగవతపురాణమునుగూర్చి వివరించుటకుముందు పురాణవాఙ్మయము, దాని స్వరూపస్వభావములు, అందు భాగవత ప్రాశస్త్యము మున్నగు విషయములను దిఙ్మాత్రముగ తిలకింపవలసియున్నది. భారతీయుల ఆధ్యాత్మిక సంపదకు వేదములు, వేదాంగములు, ఉపనిషత్తులు, ధర్మశాస్త్రములు, ఇతిహాసములు, పురాణములు మున్నగునవి మూలకందములు. ధర్మార్ధకామమోక్షములనెడి చతుర్విధపురుషార్ధములను సాధించి తరింపవలెనన్నచో మన ప్రాచీనసంస్కృతి యందలి సారమును, తదౌన్నత్యమును గ్రహింపక తప్పదు. అందుకు వేదాదులే శరణ్యము, కాని అవి సర్వజన సులభసాధ్యములుకావు. అందలి పరమార్థమును సుజ్ఞాతము చేయగలిగిన మహనీయ సాధనములు పురాణములు. ఉపనిషద్వేదవేదాంగ రహస్యమును, సృష్టి స్థితి విలయాత్మకుడగు పరమాత్మని పరతత్త్వ స్వరూపమును కథోపాఖ్యానముల ద్వారా సామాన్య జనులకు సైతము విదితముచేయు సామర్థ్యముగల సారస్వత మూర్తులీ పురాణములే. సంఘజీవియగు మానవుడు నైతికముగ పతనమునంది ధర్మవ్యతిరిక్తుడై సమాజమునకు భయావహుడై నప్పుడతనిని ధర్మబాహ్యునిగానీక నైతికపు విలువలను మిత్రునివలె ప్రబోధించుచు సంఘశ్రేయోగామిగ మరల్చుటకివి యెంతేని సమర్థములు. అందుచేత వీనిని మిత్రసమ్మితులని పెద్దలు పేర్కొన్నారు. ఆర్షసంస్కృతీ సస్యములను భారతీయ హృదయక్షేత్రములయందు పండింపగల సుధారసప్రవాహములగు నీ పురాణముల ప్రాశస్త్యము ఛాందోగ్యోపనిషదాది గ్రంథముల యందిట్లు ప్రస్తుతింపబడినది.

## పురాణప్రాశస్త్యము

1) " ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం
సామవేదమధర్వణమ్, చతుర్థమితిహాస
పురాణం పంచమం వేదానాం వేదమితి "
— (ఛాందోపనిషత్తు)

(భగవంతుడా! ఋగ్యజుస్సామములను, నాల్గవదియగు అధర్వణ వేదమును, వేదములలో ఐదవదియగు ఇతిహాస పురాణములను చదువుచున్నాను.)

2) " వేదాః ప్రతిష్ఠితాస్సర్వే పురాణేష్వేవ
సర్వదా " — (నారదీయము)

(సమస్తవేదములును సదా పురాణములయందే ప్రతిష్ఠితములై యున్నవి)

3) " వేదవన్నిశ్చలం మన్యే పురాణార్థం ద్విజో
త్తమాః ।
వేదాః ప్రతిష్ఠితా స్సర్వే పురాణే నాత్ర
సంశయః ॥ — (స్కాందము)

(ద్విజోత్తములారా! వేదమువలె పురాణప్రతిపాద్యమగు నర్థముకూడ శాశ్వతమైనది. సమస్తవేదములు పురాణమునందే ప్రతిష్ఠితములై యున్నవి. సందేహములేదు)



4) " యో విద్యాచ్చతురో వేదాన్ సాంగోప
నిషదో ద్విజః ।
న చేత్పురాణం సంవిద్యాన్నైవ సస్యా
ద్విచక్షణః ॥ " — (వాయుపురాణము)

(ఏ ద్విజుడు సాంగోపనిషత్తులైన నాలుగు వేదముల నెరింగియు, పురాణము నెరుంగడో అట్టివాడు పండితుడనిపించుకొనడు.)

5) " శ్రుతిస్మృతీ ఉభే నేత్రే, పురాణం హృద
యం స్మృతమ్ ।
ఏతత్త్రయుక్త ఏవ స్యాద్ధర్మో నాన్యత్ర
కుత్రచిత్ ॥ " — (దేవీభాగవతమ్)

(విరాట్పురుషునికి శ్రుతిస్మృతులు రెండును నేత్రములు, పురాణము హృదయమని చెప్పబడినది. దీనిచేత చెప్పబడినదే ధర్మము. వేరొకచోట ఎందును అది చెప్పబడలేదు.)

6) " ఇతిహాస పురాణాభ్యాం వేదం సముప
బృంహయేత్ ।
బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం
ప్రతరిష్యతి ॥ " — (భారతము)

(ఇతిహాసపురాణములచే వేదమును విస్తరింపచేయవలెను, అరకొరగా చదివినవానినుండి వీడు నన్ను మోసగించునని వేదము భయపడుచున్నది.)

7) " అస్యమహతో భూతస్య నిశ్వసిత మే
తద్యదృగ్వేదో ।
యజుర్వేదస్సామవేదోఽ థర్వాంగీరస
ఇతిహాసపురాణమ్ ॥ " —
(వాజసనేయ బ్రాహ్మణోపనిషత్తు)

(ఋగ్యజుస్సామాధర్వ వేదములు, ఇతిహాసపురాణములు, ఆ మహాభూతము యొక్క (పరబ్రహ్మముయొక్క) నిశ్వాసములు మాత్రమే.)

3) " పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం
బ్రహ్మణాస్మృతమ్ ।
అనంతరం చ వక్త్రేభ్యో వేదాస్తస్య
వినిర్గతాః ॥ " — (వాయుపురాణము)

(సర్వశాస్త్రములలో పురాణము మొదటిదని బ్రహ్మచే చెప్పబడినది. ఆ పిమ్మటనే అతని ముఖములనుండి వేదములు బయలు వెడలినవి.)

9) శ్రుణు మోహిని మద్వాక్యం వేదోఽయం
బహుధా స్థితః ।
యజ్ఞకర్మక్రియావేదః స్మృతిర్వేదో
గృహాశ్రమే ॥
స్మృతిర్వేదః క్రియావేదః పురాణేషు
ప్రతిష్ఠితః ।
పురాణపురుషాజ్జాతం యథేదం జగ
దద్భుతమ్ ।
వేదార్థాదధికంమన్యే పురాణార్థం వరాననే॥
— (నారదీయము)

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం

నారాయణవనం.

★

### నిత్యకార్యక్రమ వివరాలు

| | | | |
|---|---|---|---|
| సుప్రభాతం ఉ॥ | 6-30 | నుండి | 7-00 |
| విశ్వరూపదర్శనం | 7-00 | ,, | 8-30 |
| తోమాలసేవ | 8-30 | ,, | 9-00 |
| కొలువు, అర్చన | 9-00 | ,, | 9-30 |
| శాత్తుమొర & గంట | 9-30 | ,, | 10-00 |
| సర్వదర్శనం | 10-00 | ,, | 11-30 |
| 2-గంట, అష్టోత్తరం (ఏకాంతం) | 11-30 | ,, | 12-00 |
| తీర్థానం | 12-00 | | |
| సర్వదర్శనం సా॥ | 4-00 | ,, | 6-00 |
| తోమాలసేవ, అర్చన (ఏకాంతం) | 6-00 | ,, | 6-30 |
| రాత్రి కైంకర్యం | | | |
| శాత్తుమొర | 6-30 | ,, | 7-00 |
| సర్వదర్శనం | 7-00 | ,, | 8-45 |
| ఏకాంతసేవ | 9-00 | | |

### ఆర్జితాదుల వివరాలు

| | | |
|---|---|---|
| అర్చన, అష్టోత్తరం .... | రు. | 3-00 |
| హారతి .... | రు. | 1-00 |
| కొబ్బరికాయకు .... | రు. | 0-50 |
| సహస్రనామార్చన .... | రు. | 5-00 |
| పూలంగి (గురువారం మాత్రం) .... | రు. | 1-00 |
| అభిషేకానంతర దర్శనం (శుక్రవారం) | రు. | 1-00 |
| తిరుచ్చి వాహనోత్సవం (వాహకుల రుసుముకాక) | రు. | 15-00 |
| సింగమొరై ఖర్చులు .... | రు. | 2-50 |

(ఓ మోహినీ! నా మాట వినుము. వేదములు వివిధరూపములు గలవి. యజ్ఞకర్మములందు క్రియావేదమనియు, గృహస్థాశ్రమమున స్మృతివేదమనియు వ్యక్తమైనవి. పురాణములయందీ క్రియావేదస్మృతిర్వేదములు ప్రతిష్ఠింపబడినవి. అద్భుతమైన యీ ప్రపంచము పురాణపురుషునినుండి పుట్టినట్లే యీ వాఙ్మయమంతయు పురాణములనుండియే యుద్భవించినది. కావున నోవరాననా! వేదార్థముకంటె పురాణార్థమే అధికమని భావించుచున్నాను.)

### నిర్వచనము

ఇట్లు వివిధ విధముల వినుతింపబడిన యీ పురాణములు నీతిధర్మములకు నిలయములు, కర్తవ్యాకర్తవ్య ప్రబోధకములు. వేదములవలె మిక్కిలి ప్రాచీనములునై యున్నవి.

పురాణశబ్దమును —

1) పురానవం భవతి పురాణమ్
(యాస్కనిరుక్తము),
(పాతదయ్యును క్రొత్తదగుటవలన పురాణము)

2) పురాభవమితి పురాణమ్(శబ్దకల్పద్రుమము)
(పూర్వము కలిగినది కావున పురాణము)

3) పురాపూర్వస్మిన్ భూతమితి పురాణమ్
(అమరకోశము),
(పూర్వము జరిగినది కావున పురాణము)

4) పురానీయతే ఇతిపురాణమ్ (వాచస్పత్యము)
(ప్రాచీనమయ్యు ఇపుడు మనచేత గ్రహింబడుచున్నది కావున పురాణము)

5) యస్మాత్పురాహ్యనక్తీదం పురాణం తేన వా స్మృతమ్।
నిరుక్తమస్య యో వేదస్సర్వపాపైః
ప్రముచ్యతే (వాయుపురాణము).
(పూర్వవిషయమును వ్యక్తము చేయుచున్నది కావున ఇది పురాణము. దీని నిర్వచనమును తెలిసికొన్నవాడు సమస్త పాపములనుండి విడువబడును.)

6) పురా పరంపరాం వష్టి-పురాణం తేన వా
స్మృతమ్ (పద్మపురాణము),
(ప్రాచీనకాల పరంపరను చెప్పునది కాన పురాణము)

7) యస్మాత్పురా హ్యభూచ్చైతత్ పురాణం, తేన
తత్స్మృతమ్ (బ్రహ్మాండపురాణము),
(పూర్వమెపుడో జరిగినది కావున పురాణము)

8) పురాతనస్య కల్పస్యపురాణాని విదుర్బుధాః
(మత్స్యపురాణము)
(పూర్వయుగమునకు సంబంధించిన వానిని పురాణములని పండితులెరుంగుదురు.)

9) ప్రాగ్వృత్తకథనం పురాణమ్ (శుక్రనీతి)
(ప్రాచీనవృత్తకథనమే పురాణము.)

అని నిఘంటువులు పురాణములు నిర్వచించినవి. ఈ నిర్వచనములన్నియు నిట్లుండగా "పురాఽపి నవమ్ పురాణమ్" — అను నొకసూక్తి బహుళప్రచారము నందియున్నది. పురాణములు ప్రాచీనములే యైనను వానియందు నవీనగాథా విశేషములెన్నియో చేరుచువచ్చుటవల్లను, పరతత్త్వస్వరూపము భిన్నభిన్న మార్గములలో వివరింపబడియుండుటవల్లను ఇవి నిత్యనూతనములని చెప్పవచ్చును. బ్రహ్మపదార్థవిజ్ఞానము నిత్యనూతనమనుటలో సందేహమేమున్నది?

### లక్షణము

పురాణముల యందలి వస్తుతత్త్వము ననుసరించి వీనికి ప్రాచీనులు పెక్కురు లక్షణనిర్ణయమొనరించిరి. వానిలో అమరసింహుడు కావించిన క్రింది లక్షణము ప్రాచుర్యము నందియున్నది.

"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ।
వంశానుచరితంచేతి, పురాణం పంచ
లక్షణమ్ ॥

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము అనెడు నీయైదు లక్షణములు గలది పురాణమని భావము. మార్కండేయ, విష్ణు, కూర్మ, అగ్ని, మత్స్య, వాయుపురాణాదులుగూడ నీపంచ లక్షణములను చక్కగ నిర్వచించినవి.

(33వ పేజీలో చూడుడు)

# ధర్మకర్తల మండలి నిర్ణయాలు

1, 17-11-78 తేదీ జరిగిన సమావేశం.

1-11-78

దేవస్థానం ధర్మకర్తలమండలి అధ్యక్షులపై సభ్యులకు విశ్వాసం లేనిపక్షంలో విశ్వాసరాహిత్య తీర్మానం చేసేందుకు ప్రస్తుతచట్టంలో అవకాశం లేనందున మండలిలో 2/3 వంతు సభ్యులు ఉట్టి ప్రతిపాదనకుఅనుకూలంగా ఓటుచేసినపక్షంలో అధ్యక్షుని అభిశంసనం లేదా పదవీచ్యుతికి చేసే అవకాశాన్ని కల్పిస్తూ మండలి అధ్యక్షులు సమావేశానికి హాజరుకాని పక్షంలో ఆ పదవిని తాత్కాలిక ఖాళీగా భావించి, మండలి సమావేశాలు నిర్వహించేందుకు కార్యనిర్వహణాధికారికి అధికారం ఇస్తూ, అదీ వీలుకాని పక్షంలో ఒక ఉపాధ్యక్షుని పదవిని కల్పిస్తూ శాసనం చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరటమైనది.

17-11-78

ధర్మకర్తలమండలి అధ్యక్షులను తొలగిస్తూ ప్రభుత్వంచేసిన ఉత్తరువును పరిశీలించినమీదట సదరు చర్యను హర్షించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ కార్యదర్శి డా॥ ఎన్. రమేశన్ అధ్యక్షతన కార్యకలాపాలు కొనసాగించేందుకు ధర్మకర్తలమండలి నిర్ణయించటమైనది.

తిరుమలలోని ట్రావెలర్స్ బంగళా ప్రాంతములోని ప్రతి 5 కాటేజీలకు, తిరుపతి తిరుమల అతిథిభవనాలకు ఒక్కొక్క అటెండరు, తిరుమలలో మిగత కాటేజీలకు పదింటికి ఒక అటెండరును, ప్రతి ప్రాంతానికి ఒక్కొక్క లోయర్ డివిజన్ క్లర్కు నియమించాలన్న ధర్మకర్తల మండలి 17-8-78 తేదీ తీర్మానం దృష్ట్యా 110 అటెండర్ల ఉద్యోగాలు, 8 గుమాస్తా ఉద్యోగాలు కల్పించ నిర్ణయించటమైనది.

దేవస్థానంలోని వేదపారాయణం దార్లను 430-20-650-25-800 జీతంలోని వేదపండితులతో సమానంగా చేస్తూ, వారికి వేద పండితుల జీతములు పెరిగిననాటినుండి పాతబకాయిలుకూడా ఇవ్వవలసిందిగాను, జీతభత్యాలన్నిటిలోను ఇకముందుకూడా సమానంగానే పరిగణించేందుకు నిర్ణయించటమైనది. దీనికి సంబంధించిన నిబంధనలు సవరింప చేసేందుకు కార్య నిర్వహణాధికారిని కోరటమైనది.

దేవస్థాన అభివృద్ధి కార్యక్రమాలకుగాను అవిలాలగ్రామంలో బుగ్గమఠానికి చెందిన ఎ. 44 71 సెంట్ల భూమిని తీసుకోవాలని 15-2-78న చేసిన తీర్మానాన్ని విరమిస్తూ, ఆ స్థలాన్ని దేవస్థానఉద్యోగుల సహకార గృహనిర్మాణ సంస్థకు ఈయవలసిందిగా కమీషనర్‌ను అభ్యర్థించటమైనది,

దేవస్థానం ఉద్యోగుల గృహనిర్మాణ కార్యక్రమానికి గాను దేవస్థానం లోగడ కొలుకిచ్చిన 100 ఎకరాలస్థలాన్ని తిరిగి స్వాధీన పర్చవలసిందిగా శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయాన్ని కోర నిర్ణయించటమైనది.

శ్రీ వేంకటేశ్వర శిల్పశిక్షణ కేంద్రం సూపరింటెండెంటుగా శ్రీ వి.ఇ.ఎన్. దైవషణ్ముఖనాథస్థపతిని తిరిగి నియమించటమైనది.

అన్నమాచార్య కీర్తనల ప్రచారానికి గాను శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి చెందిన. అన్నమయ్య కీర్తనలలో అలంకారాలు అన్న విషయంపై పరిశోధకురాలు కుమారి కె. వాణికి నెలకు రు. 250/- వంతున రెండేండ్లపాటు విద్యార్థివేతనాన్ని మంజూరు చేయటమైనది.

దేవస్థాన ప్రాథమిక పాఠశాలలో 3వ తరగతినుండి సంస్కృతం బోధించాలన్న ప్రభుత్వసూచనకు వీలుగా దేవస్థానపు శ్రీ వేంకటేశ్వర అప్పర్ ప్రైమరీ పాఠశాలలో సంస్కృతపండితుని ఉద్యోగమును 290-11-400-15-520 వేతనంమీద కల్పించటమైనది,

ఇంతవరకు ప్రభుత్వ దేవాదాయశాఖ నిర్వహిస్తున్న వేదరక్షణ కుమారాధ్యాపక పథకాన్ని ఇకనుండి దేవస్థానమే నడపాలని నిర్ణయించి అందుకుగాను రు. 1,53,360/- లు మంజూరుచేయటమైనది.

తిరుపతిలో మరొక్క జూనియర్ కళాశాల అవసరమని, దేవస్థాన కళాశాలల పాలకమండలి నిర్ణయాన్ని సూత్రప్రాయముగా ఆమోదిస్తూ, నికరంగా ఇచ్చే కొంత ధన విరాళంతో ప్రభుత్వం ఈకళాశాలను నడిపే అవకాశాలను పరిశీలించవలసిందిగా కార్యనిర్వహణాధికారిని కోరటమైనది.

శ్రీ పద్మావతీ మహిళాసాంకేతిక విద్యాలయం ప్రత్యేకాధికారి శ్రీ కె. యల్. నరసింహంను ఆ పదవిలో మరి 3 సంవత్సరాలపాటు కొనసాగించేందుకుప్రభుత్వాన్ని కోరటమైనది.

శ్రీ వేంకటేశ్వర బాలమందిరంలోని పిల్లలకు పాలపరిమాణాన్ని ఒక్కొక్కరికి రోజుకు 100 మిల్లీలీటర్ల నుండి 200 మిల్లీలీటర్లకు పెంచటమైనది.

1977 లో శ్రీవారిమహారథానికి హైడ్రాలిక్ బ్రేకులు అమర్చిన కార్యక్రమంలో భారత్ హెవీ ఎలక్ట్రిల్ సంస్థవారి పరికరాల విలువకు రు. 1.5 లక్షలుమంజూరుచేయట

(34 పేజీలో చూడుడు)

భగవత్ స్తోత్రములయందు సాధారణముగా ఫలశ్రుతులు గలిగియుండుట మనము గమనించి యున్నాము. "ఇట్టి ఫలశ్రుతులు కల్పించుటకు కారణమేమని." యొకపరి యోచించిన కడుంగడు విచిత్రములలో విషయంబులు తేటతెల్లంబగు చుండును సాధారణముగా మానవులు ఫలాపేక్ష లేనిదే యే కార్యమునను చేపట్టరుకదా! ఈ విషయము మన నిత్యానుభవములో చూచుచున్నాము.

ప్రార్థనల యందును, వ్రతముల యందును, పూజ, పునస్కారములయందు స్త్రీ, పురుషులకు వేర్వేరు ఫలశ్రుతులు మన పూర్వీకులు నియమించి యుంచినారు.

వ్రతముల మహిమ చాటు ఫలశ్రుతుల ప్రభావము వలన మన సనాతన ధర్మము నాటినుండి. నేటి వరకు జీవించియుండుటకును; పామరజనమును, నాస్తికులను, ఆస్తికత్వమునకు మార్పు చేయగలశక్తి నిచ్చుటకును తోడ్పడినవి.

లక్ష్మీస్తోత్రము చదివిన మనుజులు సంపన్ను లగుదురను భావము మనలో నున్నది. నమ్మకముతో, నిర్మలహృదయముతో, శుచి (బాహ్యాంతర)తో నొనరించినట్టి ఏ ప్రార్థనయైనను భగవంతుడాలకించి, ఉచితరీతిని మనలను కష్ట సమయముల నుండి రక్షించుట మన నిత్యానుభవములో నొకభాగము. అటులగాక, వేరొక్క సమయమున మనము ఫలాపేక్షతో జరుపు ప్రార్థనల యొక్క ఫలితము దక్కకుండు నటుల భగవంతుడు మనల నావేదన పరుప వచ్చును. అట్టి సమయంబు లనేకంబులు మన స్వానుభవములో నున్నవి, 'అట్టి పరిస్థితులకు కారణములిట్లు 'ని నాకు దోచుచున్నవి.

1. మానవుల యల్పత్వము జూపుటకు దైవమాడిన 'నాటకము' లేక 'మాయ' ప్రభావము కావచ్చును.

2. మన అహంకార, దర్పము అణగించుటకు;

3. ఐహిక విషయములనుండి మనలను విముక్తులను చేయుటకు, లేదా,

4. కార్య — కారణంబులకు కర్తను "నేనను" భావమును మననుండి వేరు చేయుటకు;

5 మోక్ష సాధనములగు భక్తి, జ్ఞాన వైరాగ్య మార్గముల వైపు మనలను తరలించుటకు;

6. వాక్యార్థముల నుండి మన మేధస్సును సూచ్యార్థముల వైపునకు మార్పుటకు కావచ్చును.

అల్పములు, అనిర్మలములు, అశాశ్వతములు, క్షణికములు అయిన ప్రాపంచిక విషయముల కొరకు ప్రార్థనలు సలిపి, సమయము వ్యర్థము చేయుటకంటెు, నిష్కామముగా. ఫలాపేక్షా రహితముగా ప్రార్థనలు జేసి, ఫలశ్రుతికై ఆశించక

# ఫలశ్రుతి

శ్రీ రుద్రావఝుల రామకృష్ణారావు

"సర్వం కృష్ణార్పణమస్తు" అను భావమును పెంపొందించు కొనిన నిర్మలము, నిత్యము, సత్యము, అనశ్వరము అయిన బ్రహ్మమును, తదాశీర్వాదమును సాధించుట క్లిష్టమయినది కాదు.

'నిత్యమూ అంతఃకరణ శుద్ధిగా జేసిన పూజలు; వ్రతములఫలితముగా మనుజులు 'మోక్షప్రాప్తి' నొందెద రనుట అతిశయోక్తికాదు.

బీజాక్షరములను, మంత్రాక్షరములను శ్లోక, స్తోత్ర, మంత్రములందుంచి, మనకు ఫలశ్రుతు లెఱుగజూపి, పరోక్షముగా మనచే భగవత్ప్రార్థనలు చేయునట్లు; మనకు మోక్షపథము నందించుటకు, మనపూర్వీకులు సూచించిన అత్యున్నత సాధనములీ ఫలశ్రుతులు కావచ్చును. ఎంతటి విద్వాంసునకైనను, అవసానదశ యందొక భగవన్నామ స్మరణమే భవసాగర తరుణోపాయమనియు తన విద్వదెట్టిదైనను, ఎందులకూ కొరగాదని, ఆది శంకరుల 'భజగోవింద' శ్లోకములు బాహ్యముగనూ, సూక్ష్మముగనూ, సూచించుచున్నవి.

విద్యార్థీ లభతే విద్యాం
ధనార్థీ లభతే ధనం
పుత్రార్థీ లభతే పుత్రా
న్మోక్షార్థీ లభతే గతిమ్॥

(సంకట నాశన గణేశ స్తోత్రము - 6)

ఇందు గణేశస్తుతి వలన ఎవ్వని కేది కావలయునో అయ్యది చేకూరునని యున్నది. అట్టి ఫలితము లభింపనియెడల పైన సూచించిన కారణంబులేవైననూ కావచ్చును.

సువర్ణధారా స్తోత్రం య
చ్ఛంకరాచార్య నిర్మితమ్।
త్రిసంధ్యం యః పఠేన్నిత్యం,
సకుబేర సమో భవేత్॥

కనకధారా స్తవము—25

కనకధారా స్తోత్రములో వాక్యార్థమును గ్రహించిన ఆ స్తోత్ర పఠనమంత్రమున మనుజుడు కుబేరుడుగా మారవలె. కాని, అందలి భావము స్తోత్రపఠనమాత్రమున భౌతికముగా మానవుడు కుబేరుడగునని కాక పోవచ్చును. ఆధ్యాత్మికముగా కుబేరత్వము సాధించుట కిది యొక మార్గమని గ్రహించవలెను. కావున ఆ మహాశక్తిని ఆ జగన్మాతను "నీ దివ్యపదము లను మహా భాగ్యమును మాకు ప్రసాదింపుము తల్లీ" అను ప్రార్థనలోని సూచ్యార్థమును గ్రహించి, నిర్మల మనస్సుతో పూజించిన, ఆ జగజ్జనని, కరుణించదా? మనము విలువనిచ్చు ఈ ప్రాపంచిక ద్రవ్యములు ప్రసాదించుటలో ఆ తల్లి మనలను కుబేరులుగా జేయగలిగిన, మనకు అట్టి పథమునకు మారుగా మోక్షమును కోరుకొనుటలో తప్పేమున్నది?

నశ్వరములు, క్షణికములగు సంపత్తులను కోరుకొనక, పూజా ద్రవ్యములను చేకొని, "పదినిజమో; అఖండసౌఖ్యమో సౌభాగ్యమో, నాశరహితమో అట్టి మహా భాగ్యమును మాత్రము ప్రసాదింపుము" అని ఆయమ్మను వేడుకొందము. (33వ పేజీలో చూడుడు)

# ధర్మశాస్త్రము - ఆచారకాండ

## పౌషమాస విశేషాలు

పుష్యమాసము పౌషమాసమనబడును. పుష్యమీనక్షత్రయుక్త పౌర్ణమి గల మాసము. సాధారణముగా ధనుర్మాస మగును.

పుష్యమాసము శూన్యమాసము. ఈ మాసములో ధన్వి (మన్మథుడు) సూర్యునితోగూడి యుండును. సూర్యునితోనే ఉదయాస్తమయములు గల్గును. ఆకాశముననే వేళను శృంగార రసాధి దేవత కనబడడు. ప్రేమాంకురములైన తలయెత్తి పొడచూపరాని శూన్యదినములివి. కాబట్టి పుష్యము శూన్యమాసమనబడినది. ఈ మాసమందు మకరసంక్రాంతి (జనవరి 13, 14 తేదీల) వచ్చును

పుష్యమీ నక్షత్రమునకు "తిష్యమి" "సిధ్య" యనియును పేర్లుగలవు. బాణమువంటి రూపముగల మూడు చుక్కల వరుస తిష్యమియందురు. "సరటాత్రీణి" ఊసరవెల్లి వంటి మూడు చుక్కలు పుష్యమియని వరరుచి వాక్యము. అధునాతనులు వెలిమబ్బు (White Nebula) గాను, వెండి కంచముగాను తెల్లని మచ్చగాను గుర్తించు చున్నారు.

పుష్యమికి అధిదేవత బృహస్పతి ఈ మాసమున జన్మించిన పురుషునకు అనంతుడని, స్త్రీకి లక్ష్మియని మాస నామము లగును.

పుష్యమాసమున (జనవరి 13, 14) మకరసంక్రాంతి పగలు అయిన పరమందు నలుబది ఘడియలు పుణ్యకాలము. గడియ మొదలుకొని అల్పమైన దినశేషముండగా సూర్యుడు మకరమందు ప్రవేశించిన సంక్రాంతికి సమీపమైన పూర్వపు ఘడియలలోనే స్నాన దాన శ్రాద్ధ భోజనాదులు చేయవలెను. స్వల్పదిన శేషములో మకర సంక్రాంతికి పూర్వమే పుణ్యకాలముగా నెఱుంగునది. రాత్రి పూర్వ భాగమున పరభాగమున నిశీధమందు గాని సంక్రాంతియైన యెడల ఉత్తరదినము దిన పూర్వార్ధము పుణ్యతరము. అందుసూర్యోదయాది 5 ఘడియలు పుణ్యతమము. అనగా సంక్రాంతి సమీపమైన కొలది పుణ్యాతిశయము ఘడియలకని అర్థము. పుష్యశుద్ధ సప్తమినాడు మకరసంక్రాంతియైన గ్రహణముకంటె పుణ్యతమము. సంక్రాంతి ప్రవేశమగు నహోరాత్రమున నుపవాసము విహితము. ఈ యుత్తరాయణ పుణ్యకాలమందు తిలధేనుదానము, శివాలయమందు తిలదీపదానము తైలాభ్యంగనము, తిలదానము, హోమము, తెల్లనువ్వులచే దేవతర్పణము, తిలలు తండులములు గలిపి శివుని పూజించుట, పితృతర్పణము, ఘృతముచే శివునకభిషేకము మహాఫలదములు.

పుష్యశుక్లాష్టమీ బుధవారముతో గూడిన స్నాన జప హోమతర్పణాదులు చేయవలెను. పౌషశుక్లైకాదశి మన్వాది. రైవతమన్వాది. పూర్వదశ వ్యాపిని గ్రాహ్యం. ఈ యేకాదశియందు గాని పౌర్ణమియందుగాని అమావాస్యయందు గాని మాఘస్నానారంభము చేయవలెను. పుష్యశుక్ల షష్ఠి సుబ్రహ్మణ్యార్చనము. తుళువషష్ఠి — ఏకాదశి వైకుంఠ ఏకాదశి. శ్రీరంగమున ద్వారదర్శన మహోత్సవము. శుక్లద్వాదశి కూర్మ ద్వాదశి రఘూత్తరతీర్థరపుణ్యదినం. పుష్యబహుళ చతుర్థి సంకష్టహర చతుర్థీవ్రతం పుష్య బహుళపంచమి శ్రీ త్యాగరాజస్వామి నామారాధనం, అపరాహ్ణ వ్యాపిని గ్రాహ్యం షష్ఠి. సత్యకామ తీర్థరపుణ్య దినం. సప్తమి నరహరి తీర్థర పుణ్యదినం. సప్తమీ అష్టమీ, నవమీ త్రిస్రోష్టకాః. అపరాహ్న వ్యాపినీ గ్రాహ్యం.

చతుర్దశి విద్యాధీశతీర్థర పుణ్యదినం అమావాస్య పురందర దాసర పుణ్యదినం మకర సంక్రాంతియైన తరువాత వచ్చు మృగశీర్ష కొవలూన్ ఎంబెరు మానార్ తిరునక్షత్రం. పునర్వసు ఎంబార్ తిరునక్షత్రం. మఘ తిరుమళిశైయాళ్వారు తిరునక్షత్రం విశాఖ గురుకావలప్పన్ తిరు నక్షత్రం.

శ్రీ జ్యోతిష పండిత పంతుల విశ్వనాథం,
అనకాపల్లి

# తిరుమల తిరుపతి దేవస్థానములు తిరుపతి.

## అమ్మకంలోనున్న తెలుగు ప్రచురణలు

| గ్రంథములు | | రచయిత - వ్యాఖ్యాత - సంపాదకుడు | |
|---|---|---|---|
| అన్నమాచార్య జీవిత చరిత్ర | | తాళ్ళపాక చిన తిరువేంగళనాథుడు | 7–25 |
| అష్టోత్తర సహస్ర నామం | | తి. తి. దేవస్థానం | 0–75 |
| ఆర్షసంస్కృతి | | శ్రీ కల్లూరి చంద్రమౌళి (ర) | 4–00 |
| అష్టాదశ రహస్యములు భా 1 | | శ్రీ టి. కె. వి. యన్. సుదర్శనాచార్య | సం. 3–94 |
| ,, భా 2 | | ,, | సం. 2–00 |
| శృంగారసంకీర్తనలు (2-వ ముద్రణ) | సం. 12 | శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ | సం. 10–50 |
| శృంగార సంకీర్తనలు | సం. 14 | శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ,<br>శ్రీ ఎ. వి. శ్రీనివాసాచార్యులు | సం. 3–00 |
| శృంగార సంకీర్తనలు | సం. 15 | శ్రీ ఎ. వి. శ్రీనివాసాచార్యులు | సం. 3–00 |
| శృంగార సంకీర్తనలు | సం. 16 | శ్రీ ఎ. వి. శ్రీనివాసాచార్యులు | సం. 3–00 |
| శృంగార సంకీర్తనలు | సం. 17 | శ్రీ ఎ. వి. శ్రీనివాసాచార్యులు | సం. 6–85 |
| శృంగార సంకీర్తనలు | సం. 18 | డా॥ పి. టి. జగన్నాథరావు | సం. 6–00 |
| శృంగార సంకీర్తనలు | సం. 19 | శ్రీ ఆర్. అనంతకృష్ణశర్మ,<br>శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ | సం. 6–00 |
| శృంగార సంకీర్తనలు | సం. 20 | శ్రీ ఆర్. అనంతకృష్ణశర్మ,<br>శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ | సం. 8–50 |
| శృంగార సంకీర్తనలు | సం. 21 | డా॥ పి. టి. జగన్నాథరావు | సం. 10–00 |
| శృంగార సంకీర్తనలు | సం. 22 | శ్రీ ఆర్. అనంతకృష్ణశర్మ,<br>శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ | సం. 10–00 |
| శృంగార సంకీర్తనలు | సం. 23 | డా॥ పి. టి. జగన్నాథరావు | సం. 15–00 |
| శృంగార సంకీర్తనలు | సం. 24 | శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ | సం. 10–00 |
| శృంగార సంకీర్తనలు | సం. 25 | ,, | 10–00 |
| అన్నమాచార్య సంకీర్తనలు | సం. 2 | శ్రీ కామిశెట్టి శ్రీనివాసులుశెట్టి | 1–00 |
| ఆండాళ్ వైభవం | | శ్రీ కల్లూరి చంద్రమౌళి (ర) | 0–75 |
| భగవద్గీత | | స్వామి ప్రణవానంద | 25–00 |
| హనుమల్లీలా తరంగిణి | | శ్రీ కుంటముక్కల రామారావు | 15–00 |
| శ్రీపదాంధ్రకందరామాయణం | | | 15–00 |
| రామాయణం | | ఉషశ్రీ | 15–00 |
| రామకథా సుధ | | స్వామి శివానంద | 5–00 |
| అన్నమయ్య పాటలు స్వరముతో భావవివరణతో | | శ్రీ ఆర్. అనంతకృష్ణశర్మ<br>శ్రీ నేదునూరి కృష్ణమూర్తి<br>శ్రీ కామిశెట్టి శ్రీనివాసులుశెట్టి | సం. 7–25 |
| అందియకత | | శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి | వా 2–50 |

(32 వ పుటలో)

# అక్రూరుడు చూసిన విశ్వరూపము

శ్లో॥ కదాబృందారణ్యే విపుల యమునాతీర పులినే
చరంతం గోవిందం హలధరసుదామాదిసహితం।
అహోకృష్ణస్వామిన్ మధురమురళీ మోహన విభో
ప్రసీదేతిక్రోశన్నిమిషమివనేష్యామి దివసాన్॥

కంసుడు చాలవఱకు తనవద్ద సున్న రాకసభృత్యులను ఒక్కొక్కనిగా రామకృష్ణుల నంతముజేయబంపెను. కాని వారాపని చేయలేకపోవుటయేగాదు అందరును రామకృష్ణులచేతిలోనే మడిసిరి. మిగిలిన కొలదిమందిని వ్రేపల్లెకు పంపినచో మధురలో తనకు రక్షణే లేకుండపోవును. అందుచే రామకృష్ణులనే మధురకు రప్పించి, అక్కడ వారింజంపుటకు అనేకచోట్ల నగరములో ప్రవీణులను నిల్పెను. వారిని మధురకు తీసికొనివచ్చుటకు ధనుర్యాగమనెడి వ్యాజము నేర్పాటుచేసి, యాగము చూడ వారిని తీసికొనిరమ్మని వారికిష్టుడగు అక్రూరుని బంపెను.

అక్రూరుడు తనకిష్టము లేకున్నను, కంసునకు వెఱచి, వెళ్లి రామకృష్ణులను రథముపైనెక్కించి తీసికొనివచ్చుచుండెను. వారిని మధురకెందుకొఱకు కంసుడు పిలిపించెనో అతడెఱుగును. అచ్చట వారింజంపుటకు చేసిన యేర్పాటులును ఆతనికి తెలియును, రామకృష్ణులాతని యారాధ్యదేవతారూపులు. కాని వారు బాలురనెడి ప్రాకృతికభావమాతని మనస్సునువీడలేదు

శ్రీ గరిమెళ్ళ వీరరాఘవులు
విశాఖపట్టణము

"అయ్యో! నాచేతులమీదుగా ఇట్టి చిన్నపిల్లలను తీసికొనిపోయి మృత్యుదేవతా గహ్వరమున కందించుచున్నానే" యను చింతతో ఆతడు మనుస్సులోనే దుఃఖించుచుండెను. ఆ భీతినిపోగొట్టి, ఈ మధురాప్రవేశము తన కాపదతేజాలదనియు, తాను విష్ణువి అవతారమనియు, కంసాదిదుష్టులను సంహరించుటకే అవతరించితిననియు, అక్రూరునికి చింత అనవసరమనియు, ఆతని మనంబునకు ధైర్యము కలిగించవలసియున్నది. భగవంతుడు భక్తులవిచారమును సహింపలేడు గదా! అందుకొరకు అక్రూరునికొక విశ్వరూపమును ప్రదర్శించు నవసరము కలిగెను.



వారు మధురకువచ్చుదారిలో యమునానదియొద్దు చేరునప్పటికి సంధ్యాసమయమగుటచే అక్రూరుడు వారిని రథమున నుండ వేడి తానుపోయి యమునలోస్నానమాచరించి అర్ఘ్యమీయబోగా ఆ నీటిలో రామకృష్ణులు మునిగికనబడిరి. అయ్యో! కొట్టుకొనిపోవుచున్నారేమోనని రెండడుగులు ముందుకువేసి పట్టుకొనబోయెను. వారందలేదు. భగవంతుడంత తేలికగాపట్టుపడునా? అక్రూరుడది భ్రాంతియనుకొని, "రథమున గూర్చుండబెట్టి వచ్చితిగదా, నాకు తెలియకుండ నీటిలో నెట్లుమునుగుదురు. ఇది భ్రాంతియే!" యనుకొనెను. కాని మనస్సు ఉద్వేగించుచుండెను. వెంటనే యొడ్డుపైకెక్కి రథమువంక జూచెను. రామకృష్ణులు రథమునందేయుండిరి. ఇది భ్రాంతియే! అనుకొని మరల అర్ఘ్యమీయ నీటిలో దిగెను. మఱల వారు నీటిలో కనబడిరి. ఇది భ్రాంతికాజాలదు! అతడాశ్చర్యముతో జూచుచుండెను. బమ్మెరపోతన ఇక్కడనొక చక్కని సార్ధకమైనపదమును ప్రయోగించెను. 'భక్తమనోరథస్థులన్' నీటజూచెనట. అనగా భక్తుల మనస్సనెడి రథముపైనధివసించిన వారిని అనిఅర్థము. లేక భక్తుల అభీష్టమునందు సాక్షాత్కరించినవారు అనిభావము. సతతధ్యానపరులకు ఎల్లెడలను ధ్యేయమూర్తి కనబడును. అదియే ధ్యానపరమావధి. ఇతడు అర్ఘ్యమిచ్చుట కుద్దేశించు సూర్యదేవుని స్థాన

(29 వ పుటలో చూడుడు)

# ధనుర్మాసము యొక్క ప్రాముఖ్యత

సంవత్సరమునగల పన్నెండు మాసములయందు ధనుర్మాసము ఉత్కృష్టమయినది. ఈమాసమును మార్గశిరమాసమని, మార్గశిమాసమని జనులు వ్యవహరింతురు.

ఈ సంవత్సరమున ధనుర్మాసము డిశంబరు 16 నుండి ప్రారంభమగును. సూర్యుడు ధనూరాశిలో ప్రవేశించినది మొదలు మకరరాశిలో ప్రవేశించువరకు ఈమధ్యగల కాలం ధనుర్మాసము, అనగా ఈ 30 రోజులు భక్తిశ్రద్ధలతో భక్తులు ధనుర్మాసవ్రతమును చేయుదురు.

ఈమాసముయొక్క విశేషమును గీతాచార్యుడయిన శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతయందు తెలియజేసియున్నాడు. (మాసానాం మార్గశీర్షః, ఋతునాం కుసుమాకరః) అనగా మాసములయందు ఉత్తమమయినది అనిఅర్థము. అందువలననే ఈమాసమునకు విశేషప్రాముఖ్యము ఇవ్వబడినది.

సాధారణముగా ప్రతిసంవత్సరం ధనుర్మాసపూజలు అన్ని విష్ణ్వాలయములలో జరుగును. మరియు ఇతర ఆలయములయందు సైతము ఆయా శాస్త్రప్రకారము జరుగును.

ఈధనుర్మాసము నందు గోదాదేవి. తిరుప్పావై ప్రబంధమును ఆశ్రయించి, శ్రీరంగధాముని ఈ శరీరముతోనే ఐక్యము పొందెను. తిరుప్పావై ప్రబంధమునందు ముప్పై పాశురములు యుండును. ప్రతి పాశురమునందును అమూల్యమయిన అర్థము యిమిడియున్నది. రోజునకు ఒక పాశురమువంతున భక్తులు 30 రోజులకు 30 పాశురములతో భగవంతుని ధ్యానించుదురు.

తిరుప్పావై ప్రబంధమునందు భగవద్గీతార్థము యిమిడియున్నది. ప్రతి ఆలయమునందును క్రమం తప్పక ఈ ధనుర్మాసవ్రతము ఆచరింపబడును. ఈ ఆచారము ఇప్పటికీ అన్ని దేవాలయములందు పాటింపబడుచున్నది.

ఈ ధనుర్మాసముయొక్క ప్రాశస్త్యము జ్యోతిషశాస్త్రమున నామకరణాదుల విషయమున మార్గశీర్షే చ వాగ్దేవి అని మార్గశిర మాసముయొక్క ఔన్నత్యము చక్కగా నివరింపబడియున్నది.

శ్రీ పి. యల్. రాజేంద్రన్
శ్రీ పద్మావతీపురం

శ్రీవిష్ణుభక్తులచేత దేశము నలుమూలలయందు, అత్యంతప్రధానముగా భగవద్భాగవత్కైంకర్యరూపమున అనుష్ఠింపబడునది - ఈ ధనుర్మాసము.

ఇది కేవలము 30 రోజులు మాత్రమే చేయదగు వ్రతము,

పూర్వము గోపికలు శ్రీకృష్ణునియొక్క కైంకర్యమునకై ఈ ధనుర్మాసవ్రతమును ఆచరించి తమకోరికలు సఫలము చేసికొనిరి.

ఈ కలియుగమున శ్రీవిష్ణుచిత్తునకు కుమార్తెఅయిన శ్రీగోదాదేవి 30రోజులు ఈవ్రతమును ఆచరించి భగవంతునిపొందగలిగెను.

ఈ వ్రతము సులభతరమయినది. ఈ వ్రతమును నాలుగు వర్ణములవారును ఆచరించి తరించగలరు. దీనియందు సందేహములేదు.

## వ్రతవిధానము

ధనుర్మాసము మొదటిరోజు మొదలు అనగా డిశంబరు 16 నుండి వరుసగా 30 రోజులు అతి భక్తిశ్రద్ధలతో ఈవ్రతమును ఆచరించవలెను.

ప్రాతఃకాలమున 4గంటలకు నిద్రలేచి కాలకృత్యములు తీర్చుకొని, స్నానమాచరించి, మడిబట్టలుధరించి, నుదుట ఊర్ధ్వ పుండ్రముతో ఆరాధన ప్రారంభించవలెను.

అర్ఘ్యపాద్యాదాలు సమర్పించి, చందన అలంకారములను సమర్పించవలెను. పిమ్మట శ్రీ కృష్ణ- శ్రీరామ- శ్రీలక్ష్మీ అష్టోత్తర శతనామముల, తులసి పుష్పములతో అర్చన చేయవలెను. తగిన కాలము, అవకాశము కలవారు శ్రీ విష్ణు సహస్రనామముతోను, శ్రీగోదాఅష్టోత్తర శతనామములతో అర్చించుటయు కొందరిండ్ల యందు వాడుకలోయున్నది.

తరువాత ధూపదీపములు సమర్పించి, పొట్టుపెసరపప్పు, బియ్యముకలిపి వండిన పొంగలిని ఆరగింపు చేయవలెను. గోదాదేవిచే అర్పించబడిన తిరుప్పావైప్రబంధమున దినమునకు ఒకపాశురము వంతున ధ్యానించవలెను.

మధ్యాహ్నమందు వీలున్న యెడల పాశురములకు అర్థములతోను, వ్యాఖ్యానములతోను కాలక్షేపము చేయవలెను. ఇదియే ధనుర్మాసవ్రతము. ఈ విధముగా క్రమము తప్పకుండా ఈ 30 రోజులు

(31 వ పేజి చూడుడు)

# శ్రీనివాసప్రబంధము

శ్రీమాన్ సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులు, కడప

(గతసంచిక తరువాయి)

శా॥ ఆశైలంబున యజ్ఞపోత్రి వరదుండై దివ్యసారూప్యల-
క్ష్మీశోభాకరవత్సదేశమణిరుక్మిమ్రితిశాంతుడై
ప్రాశస్త్యంబున నుండు; నిత్యకరుణాపారంగతా
తుండు లి-
ప్సాసేవాఽగతదేవతావిభుఁడు కల్పాంతంబు
సీమంబుగన్. ౨౬౪

కం॥ అపుడపుడు దోఁచు భక్తుల-
కపలాపము లేక; తోఁచినప్పుడు వరముల్
గృపసేయు నవ్విలాసము
లపురూపములై సకవిత లాద్యర్షులకున్. ౨౬౫

గీ॥ కల్పకల్పంబునందు నీకరణి ధరణి-
నుద్ధరించును సౌకర్యలబ్ధతనుఁడు—
నతఁడు సితప్రోతియగుటఁ గల్పాహ్వయమ్ము
గలిగెఁబో శ్వేతవారాహకల్ప మనుచు. ౨౬౬

ఉ॥ సాధుగణంబు సేగిఁబడి సైరణ సేయఁగలేక
కావు మో-
శ్రీధర! యంచు వావిడిచి బీఱిన యప్పుడు,
రాక్షసాంశజుల్
మీఁదికి దూఁకి యుర్వి నవలీలగఁ జేతులఁ ద్రిప్పు
నప్పు, డు-
త్పాదితధర్మయై పుడమితల్లి వగన్ దురపిల్లి
నప్పుడున్. ౨౬౭

కం॥ నరదేవాదిశరీరము-
లరుదార ధరించి వచ్చు నభవుఁడు ధర్మే-
తరులను బరిమారిచి శా-
సురముగ ధర్మంబు నిలిపి సుజనులఁ బ్రోచున్. ౨౬౮

కం॥ శరణార్థుల రక్షింపను
దురితమతులఁ జంపఁ బుడమి తొదలు దొలంపన్
హరియెత్తినయవతరములు
నరులకు లెక్కింపనగునె నైకవిధమ్ముల్. ౨౬౯

కం॥ వనజజునకు దక్షుండను-
తనయుండు మహాతపఃప్రతాపావజిత-
ప్రణుతప్రజాపతిత్వ-
ప్రణష్టధిషణావివేకపథుఁ డొకఁ డుండెన్. ౨౭౦

సీ॥ అతనికిఁ బదునార్వు రాత్మజాతలు నవ్య
తారుణ్యలావణ్యధననిసర్గ-
రమణీయ లాభిజాత్యమువారు, వారిలోఁ
బదుమువ్వరను జెట్టఁ బట్టె దర్మ
పురుషుఁడు; నిర్జరముఖుడైనవహ్ని స్వా
హాసతీహృదయప్రియంకరుఁడు;
పితృదైవతము లొక్క-వెలఁది గైకొనిరి ప్రి
యమ్మగుబుజువర్తనమ్ముదాని;

గీ॥ తనయలందరిలోనఁ దద్దయునుఁ జేర్మి-
గలసతీదేవి యభవునంఘ్రులను జేర్చె
దక్షుఁ డొకతెల్వి మెఱపువితాన దోఁచి
ధన్యమైనట్టియూరగ్వధమ్ము వోలె. ౨౭౧

చ॥ అతిశయితామరోత్తమ మహత్వముకల్మి సమస్తలోకస-
న్నుతి గనినట్టి ధర్మునకు నుత్తమశీలకు మూర్తిదేవికిన్
సుతుఁడయి యుద్భవించె మధుసూదనుఁ డొక్కడ
రెండురూపులై
ప్రతతతపస్సమాత్తవిభవమ్ము జగమ్ముల బోధ
సేయగన్. ౨౭౨

క॥ నరనారాయణులన ని
ర్వురు; జగముల కాదిఋషులు పురుహూతయశ-
స్ఫురణాదాయకచాప-
స్ఫురద్విశిఖరాత్రిచరనిషూదనసారుల్. ౨౭౩

సీ॥ వారిపుట్టినవేళ పవనుండు హవ్యగం
ధవహుండు మందమందమ్ము వీచె;
సలిలధౌతములై నచక్కటి నష్టది
క్కులు తొల్లి లేనట్టితెలివి సెంచె;
పలుకుదుందుభులసంవాదిగా దివినుండి
సురపొన్న విరులదొంతరలు రాలె;
నిర్జరీసందోహనృత్తోత్సవములతో
గాంధర్వగమకభంగములు విరిసె;

గీ॥ కడలినీరంబులను ప్రాతకచ్చు వదలె;
నదులు నడకల క్రొత్తయందములు వోసె;
నరులమదులు సమాధిమగ్నమ్ములట్టు
లోకమహానందవార్ధిలో నోలలాడె. ౨౭౪

(సశేషము)

# శ్రీ వరాహపురాణం



ఇది శ్వేతవరాహకల్పంలోని వైవస్వత మన్వంతరం. మనమున్నది జంబూద్వీపంలోని భరతఖండంలో. మనస్వామి వెలసింది ఆది వరాహ పుణ్యక్షేత్రంలో. ఈ క్షేత్రానికి ఎన్ని పేర్లున్నా సంకల్పంలో ముందు చెప్పుకోవాల్సింది ఆదివరాహ క్షేత్ర మనే. శ్రీవారి ఆలయాన్ని దర్శించాలన్నా ఆదిగా వరాహమూర్తి దర్శనమే ముఖ్యం. సమస్త వైదిక వాఙ్మయాన్ని సామాన్యుల కందించాలనే తపన గల దేవస్థాన ప్రయత్నాలలో – ఇది ఉడుత భక్తిగా సప్తగిరి సమర్పణం. సం॥

శ్రీవేంకటేశ్వర వరాహస్వాములు

కలియుగంలో కూడా పిలిస్తే పలికే దైవం వేంకటనాయకుడు. ఆయనకు తిరుమలపై ఆశ్రయమిచ్చినవాడు వరాహస్వామి. ఆయన యెవరు? యీయన యెవరు? ఇద్దరూ ఒకేస్వామియొక్క భిన్న రూపాలు. వేరు వేరు పనులమీద వేరు రూపాలతో భూమి కవతరించి వేరువ్యక్తులున్నట్లు భక్తసంతరణంకోసం లీలావినోదము జరిపారు. వరాహవేంకటేశ్వర స్వాములసంబంధం భక్తాహ్లాదకరం.

తిరుమలకు వరాహగిరి అన్న పేరు

ప్రళయకాలంలో సర్వం జలమయమై పోగా భూమిని తాను వరాహావతారమెత్తి ఉద్ధరించి బ్రహ్మసృష్టికి అవకాశం కల్పించాడు విష్ణుమూర్తి. అడ్డగించిన హిరణ్యాక్షుని సంహరించాడు. ఆ శ్వేతవరాహ రూపంతో కొంతకాలం భూలోకంలోఉండ దలుచుకొన్నాడు. అపుడు వైకుంఠంనుంచి గరుడుడు విష్ణుమూర్తి క్రీడాచలాన్ని మోసితెచ్చి వరాహస్వామి ఆజ్ఞప్రకారం ప్రస్తుతం ఉన్నచోట ఉంచాడు. దీనినే నారాయణగిరి అనేవారు. అందుపై ఉన్న స్వామిపుష్కరిణికి పశ్చిమభాగంలో ఉన్న విమానంలో ఆయన ఉండేవారు. అనంతరం బ్రహ్మాదిదేవతలూ, ఋషులూ, గంధర్వులూ, మరుత్తులూ వచ్చి - భీకర సూకరరూపంతోభూమినుద్ధరించారు. భక్తరక్షణకు మరో సౌమ్యరూపంతో ఇక్కడే ఉండండని ప్రార్థిస్తే - సరే అలాగే అవతరిస్తానని కాలాంతరంలో శ్రీనివాసులుగా అవతరించారు. వరాహక్షేత్రం ఇలా నెలకొన్నందున తిరుమలకు వరాహగిరి అన్న పేరు వచ్చింది.

తొండమాను చక్రవర్తి - భూవరాహం

తొండమానుచక్రవర్తి రాజ్యం చేస్తున్నపుడు వసువనే నిషాదుడుండేవాడు. దేవదేవుడు వరాహరూపంతో అతని శ్యామాకవనంలో ప్రవేశించి తినివేసేవాడు. ఒకరాత్రి అతడు ఆ వరాహాన్ని చూచి తరుముకొని వెళ్ళాడు. అది రాత్రంతా పరుగెత్తి తెల్లవారేముందొక వల్మీకంలో ప్రవేశించింది. వసువు దానిని త్రవ్వబోతే భూవరాహం పైకి వచ్చింది. వసువు మూర్ఛిల్లాడు. వసువు కొడుకు స్తోత్రం చేశాడు. స్వామి తండ్రి నావేశించి-పోయి రాజుతో నేనిక్కడ నివసిస్తున్నానని చెప్పి ఆయనద్వారా నాకు ఆలయాదులు నిర్మింప జేయమని చెప్పాడు. అతడలా చెప్పగా రాజది నిర్మించాడు.

---

శ్రీ ఏలూరుపాటి అనంతరామయ్య

అధ్యక్షులు కె వి.కె. సంస్కృత కళాశాల,
గుంటూరు

---

అంజనాదేవి వరాహస్వామి దర్శనం

త్రేతాయుగంలో అంజనాదేవి పుత్ర సంతతి కోరి తపస్సు చేయటానికి ముందు శ్రీవరాహస్వామి దర్శనంచేసింది. ఆమె తపస్సుచేసిన అద్రి కనుకనే దీనికి అంజనాద్రి అన్న పేరు కలిగింది.

ఆకాశరాజు వరాహస్వామి దర్శనం

ఆకాశరాజు పూర్వజన్మలో మాధవుడనే బ్రాహ్మణుడు. ఆయన అపుడు పాపకార్యాలుచేశాడు. ఇతరులతోకలిసి ఆయన వేంకటాద్రి ఎక్కేసరికి ఆయనపాపాలు భగ్గున మండిపోయాయి. అందరూ శ్రీవేంకటాచలమాహాత్మ్యాన్ని ప్రశంసిస్తే బ్రహ్మ ప్రత్యక్షమై నీ పాపం పోయింది, నీవు స్వామి పుష్కరిణిలో స్నానంచేసి, వరాహస్వామిని దర్శించి శరీరం విడిచి ఆకాశరాజువై పుట్టి పద్మావతీదేవికి తండ్రి వవుతావని చెబుతాడు.

వరాహస్వామికి ప్రథమదర్శనమూ ప్రథమనైవేద్యమూ

వరాహస్వామి వృషభాసురుని సంహరించి తిరిగి వస్తుండగా అరుణోదయసమయంలో వేంకటాచలంపై పర్యటిస్తున్న శ్రీనివాసులు కనిపించాడు. వరాహస్వామి ఎవరు నీవని గర్జించి అతనివైపు వెడితే ఆయన పుట్టలో ప్రవేశించాడు. ఆయన వైకుంఠుడని తెలుసుకొని ఈయన పలకరిస్తే, ఈయనా ఆయనే అని తెలుసుకొని, ఆయనా మాట్లాడాడు. తాను వచ్చినసంగతి చెప్పి, కలియుగాంతంవరకూ ఇక్కడే ఉందామనుకొంటున్నాను. కనుక నాకు ఉండటానికి స్థలం ఇమ్మన్నాడు.

వరాహస్వామి స్థలం ఖరీదిచ్చి కొనుక్కొమ్మన్నాడు.

శ్రీనివాసుడు తనలేమి చెప్పి, స్థలమిస్తే అందుకు బదులుగా నీకు ప్రథమ దర్శనమూ, ప్రథమనైవేద్యమూ జరిపిస్తానన్నాడు.

వకుళమాలిక వరాహస్వామి వంటకత్తె

వరాహస్వామి అంగీకరించి, వంద అడుగుల స్థలమే కాక తన వంటఆమె వకుళమాలికను కూడా ఆయన వంటకు ఇచ్చి, ఆమెద్వారా శ్రీనివాసుని భోజనం కోసం శ్యామాకాన్నం, తేనె పంపేవాడు. ఇలా శ్రీవరాహస్వామి శ్రీవేంకటేశ్వర స్వామికి ఇంటికి స్థలమూ, వంటకు మనిషినీ, వంటసామగ్రినీకూడా ఇచ్చాడన్న మాట.

శ్రీనివాసుని కులదైవం - శ్రీవరాహస్వామిచేంత ప్రతిష్ఠ

శ్రీనివాసుడు ఓయింటివాడయే ఘడియ

(26వ పేజీలో చూడుడు)

# శ్రీ వేదాంత దేశికులు

(గతసంచిక తరువాయి)

అప్రాకృత దివ్య దేశమైన వైకుంఠమందు, సకల విధ పరిజన పరిచ్ఛేద సహితుడై లక్ష్మీదేవితో నిత్యానందానుభవమందుండువారు.

పరమాత్మ స్వరూపమునకు, సకల వస్తువులును లక్ష్మీ సహితమైన శరీరము. దీనికిని, దివ్యమంగళ విగ్రహమునకును ఉన్న వ్యత్యాస మేమనగా దివ్యమంగళ విగ్రహము శుద్ధ సత్త్వద్రవ్యమయమై దివ్యభూషణాయుధాలంకృతమై నిత్యమై ప్రీత్యతిశయముతో, ఆశ్రితానుగ్రహమునకై స్వీకరింపబడిన పరవాసుదేవరూపము. ఈ రూపమునకు సర్వవిధ శక్తులున్నవి. దీని అంశములనుండియే వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు రాముడు, కృష్ణుడు, మొదలైన రూపములను స్వీకరించి పరమాత్ముడు ఆశ్రిత వాత్సల్యముతో అవతరించెను. అట్లే లక్ష్మీదేవియు, పరవాసుదేవ రూపములో చేరియున్న తన రూపముయొక్క అంశలతో సీత, రుక్మిణి మొదలైన అవతార రూపములను స్వీకరించి, పరమాత్మకు సహాయముగా జగదుద్ధారమునకై అవతరించును.

జగత్తులోని సకల వస్తువులు పరమాత్మకు శరీరమై యుండుటచే అవియును రూపములే. అందుచేతనే ప్రతివస్తువు వేరువేరుగా పరమాత్ముని శరీరమని శ్రుతి స్మృతిపురాణములెల్ల ఉపదేశించుచున్నవి. దీనిచే పరమాత్మునకు జగత్తునకు శరీరాత్మ భావము సిద్ధించును.

సకల జగత్తు పరమాత్ముని శరీరమైనచో ఏక దేహావయవ న్యాయముచే సకల ప్రాణములును, పరస్పరము, ఆనుకూల్యమునందుండవలెను. నిరతిశయము, నిరుపాధికమునైన ఐకమత్యముతో పరమాత్ముని ముఖోల్లాసమునందే ఉండనొప్పును. ఇదే రహస్యార్థమని ఆచార్యులవారు తెలిపియున్నారు.

పరమాత్మునికి ప్రపంచమే రూపమని తెలిసమీదట. ఆ రూపము మూలముగనే అతనిసేవ చేయవలసియున్నది. అనగా ప్రత్యక్ష రూపమైన లోకము మూలకముగా సేవచేయవలెనని చెప్పినట్లైనది. ఇదే శరీరాత్మ భావోపదేశము

చరాచరాణి భూతాని సర్వాణి భగవద్వపుః।
అత స్తదానుకూల్యం మే కార్యమిత్యేవనిశ్చయః॥

'సృష్టిచే అభివ్యక్తమై కూడియున్న ఎల్ల చరాచర వస్తువులును భగవంతుని దేహము. అందుచే ఎల్ల వస్తువులతోడను అనుకూలముగా వర్తింపవలెననునది నా నిశ్చయము.' ఈ విధముగా భగవచ్ఛాస్త్రమైన అహిర్బుధ్న్య సంహిత యందు తెలుపబడియున్నది.

జగత్తులో దేహముకంటె ప్రియమైన వస్తువు వేరొకటిలేదు. జగత్తే భగవంతునికి దేహమని చెప్పు శాస్త్రము భగవంతునికి ప్రపంచ విషయమై నిరతిశయ ప్రీతి కలదు అని చాటుచున్నది. అట్లే భగవద్భక్తులైన భాగవతులు, ఈ విషయములో ఉండదగు విధానమును సూచించుచున్నది. ఈ శరీరాత్మభావము అపృథక్సిద్ధ సంబంధముకలది గాని ప్రసిద్ధికలదు. ఇది సకలవస్తువుల సూక్ష్మమును స్థూలమునైన అవస్థలయందు సర్వదా ఉండదగిన సంబంధము. ఇదిసర్వవ్యాపకత్వ, సర్వాధారత్వ సర్వాంతర్యామిత్వ రూపములతో నొప్పుచున్నది.

పరమాత్ముని వ్యాపారము:

పరమాత్ముడు తనతో సమానముగా ఆనందము అనుభవించు యోగ్యత యున్న అనంతకోటి జీవాత్మలు జగత్తులో కష్టసంకటములను అనుభవించుచుండుట చూచుచున్నాడు. సర్వదా సర్వ ప్రకారములచే సకల జీవాత్మల యొక్క ఉద్ధారమునకై కృషి చేయుచున్నాడు. ఇతని వ్యాపారమంతయు ఐదువిధములుగా నడచుచున్నవి. 1. సృష్టి 2. స్థితి 3. సంహారము 4. అంతఃప్రవేశము 5 నియమనము జడ వస్తువులకు సంకోచ

శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి,
ఆలిఘర్

వికాసములు గలవు. జీవాత్మ తత్త్వమునకు స్వరూపములో పరిణామము లేదు. పరిణామ ముండుటచే సృష్టి కూడును. అయినను, స్వభావధర్మభూత జ్ఞానమునను పరిణామముండుటచే దాని మూలకముగా శరీరేంద్రియ సంబంధమును సృష్టిగలదు. ఇట్లే స్థితి సంహారములును ప్రసిద్ధములు. సృష్టియైన వస్తువులయందు అను ప్రవేశమనబడు సాన్నిధ్యమే అంతః ప్రవేశము. దీనిని సర్వవస్తు పరిపూర్ణమైన సర్వశక్తి ప్రకాశనసామర్థ్యమని చెప్ప వచ్చును. నియమనమనగా సర్వ వస్తువులను ఆయా స్వభావమందుంచు నధికారము. వీని నన్నింటిని ఒక్కటిగా చేర్చినచో మోక్ష ప్రధానమగును. అదియే పరమాత్ముని కృషియగును. ఒక్కచో

(25 పేజీలో చూడుడు)



# అన్నమప్రభ

*

తాళ్ళపాక వంశం వారి సాహిత్యాన్ని వెలికిదీసి, ఆస్తిక ప్రపంచాని కందించేందుకు తిరుమల తిరుపతి దేవస్థానం చేస్తున్న ప్రయత్నాలు అందరికీ తెలిసినవే. సప్తగిరి పత్రికలో కూడా పలుశీర్షికలలో తాళ్ళపాక సాహిత్యాన్నిగూర్చి వ్యాసాలు ప్రచురిత మౌతున్నై. ఈ వ్యాసాలన్నీ ఒకేచోట చోటుచేసుకుంటే సముచితంగా ఉంటుందన్న అభిప్రాయంతో అన్నమ ప్రభ అనే అనుబంధం క్రింద ఈ వ్యాసాలు ప్రచురిస్తున్నాము.

॥ సం ॥

## విషయాలు

★



★

* అనివార్య కారణములవలన అన్నమాచార్య సారస్వత కళారాధనము, అన్నమ స్వరలహరి ప్రకటింపబడలేదు.

# అన్నమయ్యలోని కొన్ని సంధివిశేషాలు

'సంప్రదాయజ్ఞానసహితుఁడైన

మనుజుస్తవితయువేదమంత్రము'[1]

అని నమ్మినవాడు తాళ్ళపాక అన్నమాచార్యుఁడు. అందుకే చినతిరుమలాచార్యుఁడు

'జగతిగలచెల్లుబడి
నగినగిభాషించునట్టినానుడిపలుకుల్
తగదనరహిచెడుఁబువ్వులు
సొగసుడుగం బిసికికంపుచూచిన
భంగిన్'[2]

అని పేర్కొనెను.

తాళ్ళపాక అన్నమాచార్యుఁడు భక్తి తత్త్వాన్ని ప్రబోధించగోరి ఆనాటి ప్రజల భాషకు సన్నిహితమైనరీతిలో పదకవితను సాగించినాడు. అన్నమయ్య పదసాహిత్యాన్ని పరిశీలిస్తే వీరు వ్యావహారికాంధ్రాన్నే పాటించి భిన్నమైన రూపాలను గ్రంథస్థము చేసినట్లు కన్పడుతున్నది. అన్నమాచార్యులు క్రీ. శ. 15 వ శతాబ్దివాడై పూర్వవ్యాకరణ గ్రంథాల పరిశీలనాశీలియైనను ఇతడు చేసిన సంధివిధానం పెక్కురీతుల సాగింది.

కేతన - ఆంధ్రభాషాభూషణమున
మొదలిపదముతుదివర్ణము
వదలకపైపదముమొదలివర్ణము
తోడం
గదియగ సంధులునాఁదగు

అని సంధిలక్షణాన్ని నిర్వచించెను. చిన్నయసూరి బాలవ్యాకరణంలో 'పూర్వపర స్వరంబులకుం బరస్వరంబేకాదేశంబగుట సంధి యనంబడు' - అని చెప్పెను. పూర్వకాలంనుండియు వ్యాకర్తలు సంధి నిర్వచనాన్ని వివిధరీతులుగా పేర్కొన్నారు. ప్రాజ్ఞన్నయయుగాన్నుండి పరిశీలిస్తే సంధి స్వరూపానికి ఒకవ్యవస్థితి కన్పించదు. దీనికి కారణము ఆనాటి ప్రజలభాషలోని మాండలిక ప్రభావంకావచ్చు. ఉదాహరణానికి రాముడు - అతడు - ఉత్వసంధిచే రాముఁడతఁడు కావాలి కాని శాసనభాషయందు రాముఁడు అతఁడు అని అచ్చుశేషించియు, లేక రాముఁడు యతఁడు అని యడాగమ రూపాలను చేయటంకాని కన్పిస్తుంది. అంతేగాక సంస్కృతసంధికి తెలుగుసంధి విధానంచేయటంకూడ శాసనభాషయందు కన్పిస్తుంది. దీనికి కారణము ఆనాటి ప్రజలభాష శాసనస్థము గావింపబడుటయే! ఆ విధంగానే అన్నమాచార్యుఁడు సంధిచేయవలసిన సందర్భాలందు యడాగమ, వడాగమాలనుచేయుట. సంస్కృతసంధికి తెనుఁగు వ్యాకరణాంశాలను అనుసరించుట, క్త్వార్థకేకారాలకు సంధి చేయుట ఆగమ సంధివిధానాన్ని అనుసరించకపోవుట మొదలగు అంశాలెన్నో మనకు కన్పిస్తాయి,

'ఉత్తునకచ్చు పరంబగునప్పుడు సంధియగు' అని చిన్నయసూరి. కాని అన్నమాచార్యుఁడు కూడా ఉత్వ సంధిచేసెను.

ఒప్పలర (సం. 12-కీ 59) - ఒప్పు-అలర
పంతమాడి (సం.12-కీ.67)-పంతము-ఆడి
చెమటలార (సం.12-కీ.116) -చెమటలు-
ఆర — మొదలగునవి ఉదాహరణాలు.

'కర్మధారయంబులందుత్తునకచ్చుపరంబగునపుడుటుగాగమంబగు' అని టుగాగమ సూత్రము. కాని కర్మధారయరూపాలకు ఉత్వసంధి చేయటం గమనింపవచ్చును.

అలరమ్ములు (సం. 12-కీ. 79) - అలరు-
అమ్ములు

తలిరాకు (సం.12-కీ.319) - తలిరు-ఆకు
చిగురాకు (సం.12-కీ.79) - చిగురు-ఆకు

అలరుటమ్ములు, తలిరుటాకు, చిగురుటాకు మొదలగు కర్మధారయ రూపాలకు బదులు ఉత్వసంధి చేయటం ఆనాటి ప్రజలభాషను గ్రంథస్థం చేయటమే కారణము కావచ్చును.

రుగాగమము కర్మధారయము పేర్వాది రుగాగమము కర్మధారయము నందలి పేర్వాది శబ్దాలకు, తత్సమశబ్దాలకు వస్తుంది. 'ఎప్పుడుగానిరాఁడో యెంతదడవాయకాని చప్పుడాలకించి జల్లురనెనమ్మా' (సం.12-కీ.46) అనుకీర్తనలో 'జల్లురనె' రూపాన్ని గమనిస్తే రుగాగమము కన్పిస్తుంది. ఇట 'జల్లు' అన్నది కర్మధారయముకాదు. అయినను ఉత్వసంధిచోట్ల రుగాగమాన్నిచేయటం ఇందలి విశేషము.

'సంధిలేనిచోట స్వరంబుకంటెంబరంబయిన స్వరంబునకుం యడాగమంబగు' అను యడాగమ సూత్రానికి భిన్నంగా సంధి చేయదగిన స్థలాలందే యడాగమాన్ని చేశాడు.

అదరిపాటుయేకాంతాన (సం. 12-కీ. 46)-
అదరపాటు-ఏకాంతాన

నోమియెటువంటిదో (సం. 12-కీ. 67) - నోము-ఎటువంటిదో

ఈ రూపాలకు ఉత్వసంధివర్తించగ-అదరి పాటేకొంతాన, నోమెటువంటిదో అని నిత్యరూపాలు రావల్సియుంది. కాని అన్నమాచార్యుఁడు సంధిసందర్భాల్లో యడాగమంచేయటం అతనిస్వాతంత్ర్యాన్ని నిరూపిస్తోంది.

యడాగమానికి బదులుగ ఈతఁడు పదకవిత్వంలో 'వ'కారాగమాన్ని చేస్తాడు 'వ'కారగమాన్ని ఏ వ్యాకర్తలు నిర్దేశించనప్పటికి వ్యవహారంలో ప్రచారమునున్న రూపాలను అల్లేగ్రథస్థము చేశాడు,

పలుమరువుట్లపండుగను (సం. 12-కీ 57) - పలుమరు-ఉట్లపండుగను

దగ్గరమ్మవూడిగాలు (సం.12-కీ.14)-దగ్గరమ్మ-ఊడిగాలు

నివురము (సం. 12-కీ. 45) - నీ-ఉరము

పై ఉదాహరణాల్లో 'ఉత్తునకచ్చుపరంబగునప్పుడు సంధియగు' అనుసూత్రముచే 'పలుమరుట్లపండుగను', కానిచో యడాగమంచేస్తే 'పలుమరుయుట్లపండుగను' అవుతుంది. కాని ఇట 'పలుమరువుట్ల పండుగను' అని వకారాగమం కన్పిస్తున్నది.

'అత్తునకు సంధిబహుళముగానగు' - అను సూత్రానికి ఉదాహరణముగ ఈతని పదకవిత్వంలో ఉదాహరణలు కన్పిస్తున్నాయి.

వలచినంగనలు (సం.12-కీ.45) - వలచిన అంగనలు -

ఇట యడాగమము రావలసియుంది. కాని సంధిచేయటం ప్రత్యేకత.

అన్నమయ్య ఉన్నరూపాలను ఉన్నట్లుగాకూడ వ్రాశాడు. అనగా ఎటువంటి వ్యాకరణప్రక్రియ జరగని రూపాలని అర్థము. ఉదాహరణానికి

యుగాలైనవి - ఉద్దవుఁడా (సం. 12-కీ. 56) - ఇట సంధి లేదు కాబట్టి యడాగమము రావలసియుండగా ఏ వ్యాకరణ కార్యాన్నిచేయక అచ్చుతోయుంచెను. ఈ విధంగానే

ఉత్తరమిత్తముగాని - ఊరకుండలేము (సం. 12-కీ. 17)

చందురుడైనది-అందున (సం.12-కీ 134)

చల్లి-ఇది (సం. 12-కీ. 228) రూపాలను చెప్పవచ్చు.

'క్త్వార్థంబైన యిత్తునకు సంధిలేదు భూతకాలాన్ని తెలుపు అసమాపకక్రియ

---

కుమారి కేసర్ల వాణి

తిరుపతి.

---

క్త్వార్థము. అట్టి అసమాపక క్రియలకు సంధిరాదని సూత్రార్థము. సంధిలేనియెడల 'సంధిలేనిచోటస్వరంబుకంటెంబరంబయిన స్వరంబునకు యడాగమంబగు' అనికలదు దీన్నిబట్టి క్త్వార్థకేకారాలకు సంధిచేయటం వ్యాకరణ విరుద్ధమని విదితమే. కాని అన్నమాచార్యుఁడు క్త్వార్థకాలకు సంధి చేసెను.

ఒరగుండి (సం.12-కీ 68) - ఒరగి-ఉండి

వుండో (సం.12-కీ.63) - వుండి-ఓ

మడచిత్తునా (సం. 12-కీ. 64) - మడచి-ఇత్తునా

తేలాడువాడు (సం. 12-కీ. 294) - తేలి-ఆడువాడు

సామాన్యంగా ఆగమాల్లో రుగాగమము, యడాగమము, టుగాగమము, పుగాగమము గలవు. కాని అన్నమయ్య క్రొత్తఆగమాలను ప్రవేశపెట్టెను. 'ఇందమంటా' అనురూపానికి 'అత్తునకు సధిం బహుళముగానగు' అను సూత్రంచే 'ఇందంటా' అని కావలసియుండగా 'మ' అనుదాన్ని ఆగమంగాచేసి 'ఇందమంటా' చేసెను.

గసడదవాదేశ విషయంలో పూర్వకాలమునుండీ భిన్నాభిప్రాయములు గలవు 'ప్రథమమీఁది' పరుషములకు గసడదవలు బహుళముగానగు'

సోలగిలినదివో (సం.12-కీ.37)- సోలగిలినది-వో

వెరగందినదివో (సం. 12-కీ. 37) - వెరగందినది-వో

సోలగిలినది, వెరగందినది యన్నవాటిని ప్రథమాంతాలుగా గ్రహించి గసడదవాదేశాన్ని చేసాడు. ఇంతియేగాక గసడదవాదేశరూపాలుగా కొన్ని కన్పిస్తున్నాయి.

యింతులువుట్టుదురా (సం.12-కీ.303)

అంగనవుట్టెను (సం.12-కీ.308)

జన్నెవట్టినది (సం.12-కీ.315)

కళాద్రుతప్రకృతిక విభాగంలో కూడా అన్నమయ్య తన పంథాను సాగించెను. 'ఏలుండు' (సం.12-కీ.101) - 'ఏల' అను దాన్ని కళగాగ్రహిస్తే 'ఏలయుండు' అను యడాగమరూపము. ద్రుతప్రకృతికంగా గ్రహిస్తే 'ఏలనే + ఉండు' - 'ఏలనుండు' అనియు అవుతుంది. కాని ఈతఁడు ఏల + ఉండు అనుదానికి 'అత్తునకు సంధి బహుళముగానగు' అనుసూత్రాన్ని వర్తింపజేసి 'ఏలుండు' అనిగావించెను. దీన్ని బట్టి 'ఏల' రూపాన్ని కళగాను, ద్రుతముగాను భావించక మిక్కిలి నూత్నత్వాన్ని సాధించినట్లు చెప్పవచ్చును.

కర్మధారయ మువర్ణకానికి పుంప్వాదేశము చేయాల్సిన సందర్భాల్లో వైవి

ధ్యము కన్పడ్తుంది. 'కర్మధారయములందు మువర్ణకంబునకుం బుంపులగు' - వెక్కసము-మఅపు. కర్మధారయపుంప్వాదేశము జరిగి వెక్కసపుమఅపు (సం.12-కీ 137), పల్లదపుచలిగాలి (సం. 12-కీ 42) రూపాలేర్పడ్డాయి.

'కప్పురము' అన్నరూపానికి 'కప్పురమ-' వికృతి. దీనికి పుంప్వాదేశమువస్తే 'కప్పురపు' అగును.

కప్పురపుఁబలుకు (సం.12-కీ.23)

కప్పురశయ్య (సం. 12-కీ. 4) - ఇట 'కప్పురము' అను రూపానికి ఒకచోట పుంప్వాదేశము కల్పించి, మరొకచోట కల్పించకయు గ్రంథస్థముచేసెను. ఇటులొకచోట వ్యాకరణాంశానుసారియై, మరొకచోట స్వతంత్రప్రవృత్తినిసాగించుట కేవలవ్యావహారిక ప్రయోగాలను గ్రంథస్థము చేయుటమేయని చెప్పవచ్చును.

వ్యవహారప్రాబల్యాన్నిబట్టి కొన్నిసందర్భాల్లో వర్ణాలుచ్యుతము చేయబడినవి. అలిగితివి + అట - అలిగితట - అనుటలో 'వ'వర్ణము జరిగింది.

ప్రాతాదుల విషయంలో అన్నమాచార్యుఁడు బహుళవిధానాన్ని పాటించాడు. 'సమాసంబునంబ్రాతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్లలోపంబుబహుళంబుగానగు' అను బహుళవిధానాన్ని పాటించి- పూవు+పానుపు (సం. 12-కీ. 25) అను రూపానికి పూలపానుపు అన్నరూపము చేసెను. అల్లే లేనగవు (సం.12-కీ.31)

కొమ్మాది (సం.12-కీ.44) అనురూపాలు.

ప్రాతాదులతొలియచ్చులోపము బహుళముగాన లేతమాయలు (సం.12-కీ.85)

లేతచిగురు (సం. 12-కీ. 35) అని అల్లేయుంచెను.

ద్రుతప్రకృతికాల్లో సైతం వకారాగమాన్నిప్రవేశపెట్టెను. ఆతనితో వొయ్యారము(సం 12-కీ 69)-ఆతనితోన్-ఒయ్యారము. ఆతనితోన్ - ఒయ్యారము - అను రూపానికి 'ఆతనితోనొయ్యారము' అని ఏర్పడవలసియుండగా వడాగమము చేసి 'ఆతనితో వొయ్యారము' అని చేసాడు.

ద్రుతప్రకృతికముమీది పరుషాలకు సరళాలగుట సామాన్యము. కాని సామాన్యప్రజానీకమునకల రూపాలను ప్రవేశపెట్ట దలచిన వాడగుటచే తద్భిన్నస్థలాలందు కూడ పరుషాలకు మారుగా సరళాలను వాడెను. ఉదాహరణం: గండుగోయిల (సం-12-కీ-305) కోయిలలోని కకారానికి గకారమును వ్యావహారిక ప్రసిద్ధిని బట్టి గ్రంథస్థము చేసెను.

కర్మధారయ పుంప్వాదేశము 'కొంత' అనురూపమందు, ప్రయోగించాడు. కొంతంపుకనుఁగొనల (సం.12-కీ 31). ఇట 'కొంతము' అనియున్న 'కర్మధారయంబులందు మువర్ణకమునకు బుంపులగు' అను సూత్రంచే 'కొంతంపు' అగును. కాని 'కొంత' అనునదే రూపముకాని 'కొంతము' కాదు కావున ఇది విలక్షణరూపమని చెప్పవచ్చును.

సంస్కృతసంధి వర్తించాల్సిన రూపాలకు తెలుగుసంధి విధానాన్నిచేయటం గమనించవచ్చును.

'ఇకోయణది' సూత్రప్రకారం రావలసిన యణాదేశానికిమారుగ యడాగమాన్ని చేసాడు.

విధీయవధానం - (సం. 12-కీ. 19) - విధీ-అవధానం

ధీయవధానం(సం.12-కీ.18)ధీ-అవధానం

సుధీయవధానం(సం. 12-కీ. 18) — సుధీ-అవధానం

ఈ రూపాలకు యణాదేశమువచ్చి విధ్యవధానం, ధ్యవధానం, సుధ్యవధానం అని కావలసియుండగ 'సంధిలేనిచోట స్వరంబుకంటెంబరంబయిన స్వరంబునకు యడాగమంబగు' అను సూత్రమునందు వలె యడాగమంచేయుట, అందులోను సంస్కృతసంధికి తెలుగుసంధి విధానమనుసరించుట అన్నమయ్య స్వతంత్రతను చాటుచున్నది.

వ్యాకృతము అవ్యాకృతమునైన భాషను 'ఇదంబ్రాహ్మమిదంక్షాత్రం' అన్నట్లు నిర్లక్ష్యముగా లొంగఁదీసికొని ప్రయోగించు సిద్ధహస్తుఁడు అన్నమాచార్యులు అన్న శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారి వాక్యాలు ఇట అనుసంధింపదగియున్నవి.*

---

1. సంకీర్తనలక్షణం - ప23 - చిన్నతిరుమలాచార్యుఁడు

2. సంకీర్తనలక్షణం - ప 59 - చిన్నతిరుమలాచార్యుఁడు

# శ్రీ అన్నమాచార్య సంకీర్తనామృతము

శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి

అవ:— సంకీర్తనము మున్నగు ఉపాసనలతో భగవంతుని భజించుచే వేద సమ్మతమైనసంసారతరణోపాయ మనుచున్నాడు —

51

సామంతం

ఏవం శ్రుతిమత - మిదమేవ త
ద్భావయితు [1] మతః - పరం నాస్తి ॥పల్లవి॥

1. అతుల జన్మ భో - గాసక్తానాం
హిత వైభవసుఖ - మిదమేవ,
సతతం శ్రీహరి - సంకీర్తనం త-
ద్వ్యతిరిక్త సుఖం - వక్తుం నాస్తి ॥ ఏవం ॥

2. బహుళమరణ పరి - భవ చిత్తానా-
మిహపర సాధన - మిదమేవ,
అహిశయనమనో - హరసేవా త -
ద్విహరణం వినా - విధిరపి నాస్తి ॥ఏవం॥

3. సంసార దురిత - జాడ్య పరాణాం
హింసా విరహిత - మిదమేవ,
కంసాంతక వేం - కటగిరి పతేః ప్ర-
శంసైవా [2] ప - శ్చాదిహ నాస్తి ॥ ఏవం ॥

(5–4)

అర్థము:- (ప) ఏవం = ఈ చెప్పబోవు రీతిగా, తత్ = ప్రసిద్ధమైన, శ్రుతిమతం = వేదమతము, ఇదం ఏవ = ఇదియే; భావయితుం = భావించుటకు, అతఃపరం = దీని కంటె వేఱైనది (శ్రేష్ఠమైనది), నాస్తి = లేదు.

1. అతులజన్మభోగా సక్తానాం = సాటిలేని జన్మభోగములయందు ఆసక్తులైన వారికి, హితవైభవసుఖం = మేలుగూర్చు ఐశ్వర్యసుఖము, ఇదం ఏవ = ఇదియే; (అది) సతతం = ఎల్లప్పుడు, శ్రీహరి సంకీర్తనం = శ్రీమన్నారాయణుని సంకీర్తనమే, తద్వ్యతిరిక్తసుఖం = దానికంటె వేఱైనసుఖము, వక్తుం = చెప్పుటకు, నాస్తి = లేదు.

2 బహుళమరణ పరిభవచిత్తానాం = అనేకములైన మరణములనెడు అవమానములతో గూడిన మనస్సు గలవారికి, ఇహపరసాధనం = ఈ లోకమందును-పరలోకమందును (ఉత్తమగతికి) సాధనమైనది, ఇదం ఏవ = ఇదియే; (అది) అహిశయన మనోహర సేవా = శేషశయనుడైన శ్రీహరియొక్క మనోహరమైన సేవయే, తద్విహరణంవినా = ఆ సేవా విహారము దప్ప. విధిః అపి = (మరొక) విధానము గూడ, నాస్తి = లేదు

3 సంసారదురిత జాడ్యపరాణాం = సంసారపాపమనెడు రోగమునకు వశులైన వారికి, హింసావిరహితం = హింస లేనిది, ఇదం ఏవ = ఇదియే; (అది) కంసాంతక వేంకటగిరిపతేః = కంసనాశకుడైన శ్రీ వేంకటాచలపతి యొక్క, ప్రశంసా ఏవ = గుణకీర్తనమే; పశ్చాత్ = దీనికి వెనుక (దీనికంటె), నాస్తి = మరొక మేలైన (త్రోవ) లేదు.

భావము :— జనులారా! ఇదిగో నేనిప్పుడు ప్రకటించునదే వేదమతము. ఆలోచించి నిర్ణయించుట కింతకంటె శ్రేష్ఠమైన మతము మరొకటి లేదు.

మాటి మాటికి సాటిలేని పుట్టుకలయందును, వాటికి సంబంధించిన సుఖానుభవములయందును, ఆసక్తులైనవారికి మేలైన ఐశ్వర్యసుఖ మిది యొక్కటే. అనవరతము శ్రీమన్నారాయణునిగుణకర్మనామముల సంకీర్తనమే ఆ సుఖము. దానిని మించిన సుఖము చూపి చెప్పుట కేమియు లేదు.

చీటికి మాటికి చావునకు గుఱియగుట అను పరాభవముతో నిండిన హృదయము గలవారికి ఐహికాముష్మికములలో ఉత్తమగతికి సాధనమైనది ఇది యొక్కటే. అది శేషశాయియైన శ్రీమన్నారాయణుని రమ్యమైన సేవయే. ఆ సేవావినోదమునకన్న మరొక వేదసమ్మతమైనవిధానము లేదు.

సంసారకాలుష్య మనెడు రోగమునకు జిక్కి చీకాకైనవారికి హింసా విహీనమైన మార్గ మిదియొక్కటే. అది కంసాంతకుడైన శ్రీ వేంకటేశ్వరుని మహిమలను ప్రశంసించుటయే. దాని కంటె మరొక మేలైన త్రోవ లేనే లేదు.

వి:-చావు పుట్టుకలనెడు క్లేశములతో నిండినది సంసారము. దానినుండి విడివడుటే వివేకవంతుల ముఖ్య కర్తవ్యము.

తం హ దేవ మాత్మబుద్ధి ప్రకాశం
ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే ॥

(శ్వేతాశ్వతరం 6–18)

అని శ్రుతి చెప్పినట్లు మోక్షాపేక్ష గలవారెల్లరు భక్తియుక్తులై మనోబుద్ధులను ప్రకాశింపజేయు ఆ పరమాత్మనే శరణు పొందవలెను.

భగవన్నామ సంకీర్తనము, భగవత్సేవ, భగవద్గుణ ప్రశంస అనునవియే సంసార

1. 'భావైతుం' అను రేకు (1) లోని పాఠము గానానుకూలమైన వికృతరూపము.

2. 'ప్రశంసైవా' అనునదిగూడ అట్టిదే 'ప్రశంసైవ' అనునది శుద్ధపాఠము.

## చందాదారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రిక చందాదారులలో దిగువ పేర్కొన్న సంఖ్య వారి చందా 28–2–79 తేదీకి అంతమగును. చందాదారులు ఈ విషయమును గమనించి M. O. ద్వారా దిగువ పేర్కొనిన ప్రకారము మనియార్డరు కూపనునందు తమ చందా సంఖ్య పూర్తి విలాసమును [illegible]–ని, త్వరలో చందా పంపనియెడల ఆ తేది దరిమిలా పత్రిక పంపబడదు

21 22 24 29 42 85 115 120 124 200 203 258 259 293 309 317 364 374 414 440 445 472 486 488 493 508 710 712 713 1012 1092 1259 1365 1370 1401 1402 1408 1422 1472 1474 1481 1522 1539 1999 2028 2044 2062 2093 2097 2123 2140 2145 2158 2163 2351 2444 2659 3084 3092 3104 3105 3110 3111 3124 3126 3127 3128 3140 3144 3149 3150 3153 3154 3156 3157 3159 3160 3161 3170 3189 3193 3194 3198 3200 3203 3207 3208 3212 3227 3434 3569 3788 3972 4282 4283 4287 4288 4296 4327 4338 4339 4348 to 4354 4357 to 4379 4383 4385 4386 to 4396 4398 to 4405 4407 4411 to 4418 4423 to 4429 4431 to 4436 4485.

గమనిక :– (1) సప్తగిరి చందాలు 15 తేదిలోగా చేరునట్లు పంపవలెను. ఆ తరువాత చేరిన చందాలకు మరునెలనుండి మాత్రమే పత్రిక పంపబడును.

(2) క్రొత్త చందాదారులు కూపనులో 'క్రొత్తచందా' అని పేర్కొనవలెను పాత వారు కూపనులో తమ చందా సంఖ్య నమోదు చేయవలెను.

(3) సప్తగిరి చందాలు ఈ క్రింది అడ్రసుకే తమ పిన్‌కోడ్ తెలియజేస్తూ పంపవలయును.

సప్తగిరి మాసపత్రిక సం॥ చందా రు. 6/–

మార్కెటింగ్ ఆఫీసరు
పబ్లికేషన్ సెక్షన్
ప్రెస్ కాంపౌండ్, తిరుపతి 517501.

క్లేశము నుండి ముక్తులై భగవంతుని జేరుటకు ముఖ్యోపాయము అని అన్నమయ్య ఈ సంకీర్తనమందు ప్రబోధించుచున్నాడు. తాను ఏ మార్గము ననుసరించి బ్రహ్మానందము నొందెనో, ఆ మార్గమునే అనుసరింపుడని ఆ మహాభాగవతుడు తోడి మానవుల నుద్బోధించుట సమంజసమే కదా!

ద్వాపర యుగాంతమున నారదుడు బ్రహ్మ చెంత కరిగి కలిని తరించు ఉపాయమును బోధింపుమని అడిగెను ఆది పురుషుడైన నారాయణుని నామోచ్చారణ మాత్రముననే కలి తొలగు ననియు, అది సర్వవేద రహస్యమనియు బ్రహ్మ చెప్పెను. ఆ భగవన్నామ మేదో సెలవిమ్మని మరల నారదు డడిగెను. బ్రహ్మ 'హరేరామ' అను షోడశనామమంత్రము నుపదేశించి కలి కల్మషమును పోగొట్టుకొనుటకు దానిని మించిన ఉపాయము మరొకటి సర్వవేదములందుంగును లేనే లేదని బోధించెను. ఈ వృత్తాంతము అష్టోత్తరశతోపనిషత్తులలో ఒకటియగు కలిసంతరణోపనిషత్తున గలదు.

"ద్వాపరాన్తే నారదో బ్రహ్మాణం జగామ – 'కథం భగవన్ గాం పర్యటన్ కలిం సంతరేయ' మితి.

సహోవాచ బ్రహ్మ-సాధుపృష్టోఽస్మి. సర్వశ్రుతి రహస్యం గోప్యం తచ్ఛృణు. యేన కలిసంసారం తరిష్యసి. భగవత ఆది పురుషస్య నారాయణస్య నామోచ్చారణ మాత్రేణ నిర్ధూతకలిర్భవతి'

నారదః పునః ప్రపచ్ఛ – తన్నామ కిమితి? సహోవాచ హిరణ్యగర్భః –

'హరే రామ హరే రామ
రామ రామ హరే హరే।

హరే కృష్ణ హరే కృష్ణ
కృష్ణ కృష్ణ హరే హరే॥
ఇతిషోడశకం నామ్నాం
కలికల్మషనాశనమ్।
నాతః పరతరోపాయః
సర్వవేదేషు దృశ్యతే॥"
(ఈశాద్యష్టోత్తరశతోపనిషదః – P. 546)

అనన్యమనస్కుడై యెవడు తన్ను నిరంతరము స్మరించునో అట్టి నిత్యసమాహితచిత్తుడైన యోగికి తాను సులభుడనని గీతలో శ్రీకృష్ణుడు నుడివెను —

అనన్యచేతాః సతతం
యోమాం స్మరతి నిత్యశః।
తస్యాహం సులభః పార్థ।
నిత్యయుక్తస్య యోగినః॥ (గీ 8-14)

శ్రుతిస్మృతులే కాక పురాణములుగూడ భగవత్కీర్తన ప్రభావమును వేనోళ్ళ ప్రశంసించుచున్నవి. భగవంతుని గుణకర్మ నామములను కీర్తించుటయే పాపములను తొలగించుకొనుటకు ఉపాయమని భాగవతము బోధించుచున్నది —

ఏతావతాఽల మఘనిర్హరణాయ పుంసాం
సంకీర్తనం భగవతో గుణకర్మనామ్నామ్॥
(భాగ-6-3-24)

నామ సంకీర్తనం యస్య
సర్వపాపప్రణాశనమ్॥ (భాగ-12-13-23)

నారదాదులు భగవత్సంకీర్తనము చేతనే ముక్తులైరి. ఇతరచింతలు మాని సదా భగవంతునే సేవింపవలెననియు, భక్తులచే కీర్తింపబడువాడై ఆ దేవుడు వెంటనే ప్రత్యక్షమైవారిని స్వస్వరూపానుభవము కలవారినిగా జేయుననియు నారదభక్తి సూత్రములు చెప్పుచున్నవి —

సర్వదా సర్వ భావేన నిశ్చింతితైః
భగవానేవ భజనీయః॥
సంకీర్త్యమానః శీఘ్రమేవ ఆవిర్భవతి
అనుభావయతి భక్తాన్॥
(నా. భ. సూ-79,80)

* * *

అవ:— దీనుల గాపాడుటే దేవుని కర్తవ్యము గాని ధీరుల కాపాడుట కాదనుచున్నాడు —

## 52

### గుండక్రియ

తెలియఁజీకటికి - దీపమెత్తక పెద్ద
వెలుఁగు లోపలికి - వెలుఁగేలా? ॥పల్లవి॥

1. అరయ నాపన్నుని - కభయమీవలెఁగాక
ఇరవైన సుఖిఁ గావ - నేలా?
వరుతఁబోయెడి వాని - వడిఁ దీయవలెఁగాక
దరివానిఁ దివియఁగఁ - దానేలా? ॥తెలి॥

2. ఘనకర్మారంభుని - కట్లు విడవలెఁగాక
యెనసి ముక్తునిఁ గావ - నేలా?
అనయము దర్బలుని - కన్నమిడవలెఁగాక
తనిసినవానికిఁ - దానేలా? ॥తెలి॥

3. మితిలేని పాపక - ర్మికిఁ దా వలెఁగాక
హిత వెలుఁగు పుణ్యుని - కేలా?
ధృతిహీనుఁ గృపఁజూచి - తిరువేంకటేశ్వరుఁడు
తతిఁ గావకుండినఁ - దానేలా? ॥తెలి॥
(6-18)

చీకటి నలుదెసల క్రమ్ముకొన్నప్పుడు వస్తువులను తెలిసికొనుటకై దీపము చేబూనవలెను. అంతేకాని గొప్ప ప్రకాశము లోనికి దీపము జూపవలసిన పనిలేదు గదా!

ఆపదవాతైె దుఃఖించువానికి అభయమిచ్చి కాపాడవలెను గాని, ఎట్టి చీకు చింతలు లేక హాయిగా సుఖించువానిని కాపాడవలసిన పనిలేదు వెల్లువలో కొట్టుకొని పోవువానిని వడిగా గట్టుకు దీయవలెనుగాని గట్టునే ఉన్నవానిని తీయవలసిన పని తనకులేదు గదా!

1. ఇరవైన = స్థిరమైన; వరుతన్ = వెల్లువయందు; తివియఁగన్ = తీయుటకు.
2. ఘనకర్మారంభునికట్లు = దొడ్డ కర్మములలో పూనికగలవాని బంధనములు; అనయము = అత్యంతము, ఎల్లప్పుడు; తనిసినవానికి = తృప్తి పడినవానికి.
3. ధృతిహీనున్ = ధైర్యము లేనివానిని; తతిన్ = అదనులో.

పెద్ద పెద్ద కర్మలలో పూనిక వహించి అందు తగులుకొన్నవాని బంధనములు ఊడదీయవలెను గాని, ఏ బంధనము లేక ముక్తుడై యున్నవానిని గాపాడ నవసరము లేదు. కూటికిలేని నిరుపేద కెల్లవేళల అన్నముబెట్టి పోషింపవలెను గాని, తృప్తిగా దిని త్రేపిన సంపన్నునకు తాను పెట్టవలసిన దేమియు లేదుగదా!

అంతులేని పాపము లాచరించి హీనుడైన వాని నుద్ధరించుటకు తాను కావలెనుగాని, హితమెరిగి పుణ్యము లొనర్చు సుకృతాత్మునికి తనతో (భగవంతునితో) పనిలేదు. ధైర్యము గోల్పోయిన దీనునిపై కృపబూని సమయమునకు రక్షింపకుండినచో శ్రీ వేంకటేశ్వరుడుండి ప్రయోజన మేమి?

విశే: దీనులను, అనాథులను, ఆర్తులను రక్షించుటే భగవానుని ముఖ్య కర్తవ్యము. అందువలననే ఆపద్బాంధవుడుగా అనాథరక్షకుడుగా ఆయన ప్రసిద్ధివహించినాడు. మార్జాల కిశోర న్యాయము ననుసరించి అనన్యగతికులై ప్రపన్నులైన దీనులనెల్ల దేవుడు దీక్షతో అభయమిచ్చి రక్షించవలసియున్నాడు. పిల్లి పిల్ల తన భారము నంతయు తల్లిపైబడవేసి దానిచే కాపాడబడునట్లు, ప్రపన్నులు భగవంతునిపై తమభారముంచి ఆయనకృపతో కడతేరుదురు.

కర్మబంధనముల కతీతులైన పుణ్యాత్ములు మర్కట కిశోర న్యాయము ననుస

# తిరుమలలో వివిధములైన కాటేజిల దినసరి అద్దెలు

1-12-78 నుండి మార్పుటమైనది.

కనుక యాత్రికులు గమనింప గోరుతున్నాము.

| కాటేజి పేరు | 1-12-78 తరువాత అద్దె రోజుకి |
|---|---|
| 1. హెచ్. ఆర్ గవియప్ప కాటేజి. | రు. 100/- |
| 2. నారాయణగిరి కాటేజిలు 1 నుండి 4; 13 నుండి 20. | 40/- |
| 3. ట్రావెలర్స్ బంగళా ప్రాంతం లోపల వైపువి, 1 నుండి 8; ఎ నుండ జి 8-వ వరుస 1; సి. యం. సి. 16; వి. వి సి. 6; కె. వి. ఆర్. 4; వి. వి సి 1: వి వి సి 8; టి. బి. సి. 10. | 30/- |
| 4. పై కాటేజిలలో ఎ భాగం. | 18/- |
| బి. భాగం | 12/- |
| 5. ట్రావెలర్స్ బంగళా బయట వైపువి. వి. వి. సి; యం. బి. సి; ఎ. టి. సి. | 25/- |
| 6. పై కాటేజీలలో ఎ భాగం; | 15/- |
| బి. భాగం. | 10/- |
| 7. టి బి. కాటేజిలు ( 8 వ వరుస ఒక్క గది గలవి. ) | 10/- |
| 8. శ్రీ వేంకటేశ్వర అతిథి భవనం | |
| ఎ. పెద్దగదులు | 35/- |
| బి. మూలగదులు | 25/- |
| సి. మిగిలిన గదులు | 20/- |

కార్యనిర్వహణాధికారి.

రించి (అనగా కోతిపిల్ల తన ప్రయత్నముతోనే తల్లిని విడువకుండునట్లు) తమ సుకృతబలమున తామే తరింపగలరు. వారికి భగవద్రక్షణ వారి ప్రయత్నము వలననే సిద్ధించును. పరమాత్ముడు వారిని ప్రయత్న పూర్వకముగా రక్షింపవలసిన పనిలేదు. వైద్యుడు రోగిపట్ల శ్రద్ధజూప వలెను గాని ఆరోగ్యవంతునికై పాటు పడ నక్కరలేదుగదా! కావున పాపాత్ములపట్లనే భగవంతుడు విశేషించి తన కృపాదృష్టిని ప్రసరింప జేయవలసియున్న దనుట ఇందలి సారాంశము.

ప్రకృత సంకీర్తనమునే పోలిన మరొక సంకీర్తనమును పరికింపుడు —

దేశాక్షి

నిన్నుఁ దలంచి - నీ పేరు దలంచి<br>
నన్నుఁ గరుణించితే - నెన్నికగాక ॥ ॥పల్లవి॥

అధికునిఁ గాచుటే - మరుగు నన్ను -<br>
నధమునిఁ గాచుట - యరుదుగాక నీకు,<br>
మధురమౌ టేమరుదు - మధురమూ, చేదు<br>
మధురమౌటే - మహిలో నరుదుగాక ॥ ॥నిన్ను॥

అనఘునిఁ గరుణింప - నరుదుగాదు నీకు<br>
ఘనపాపుని నన్నుఁ - గాచు టరుదుగాక ॥<br>
కనకము కనకము - గానేల, యినుము<br>
కనక మవుటే - కడు నరుదుగాక ॥ నిన్ను ॥

నెలకొన్న భీతిలో - నిన్నుఁ జెనకితిఁగాక<br>
తలకొన్న సుఖినైనఁ - దలఁచనేల నిన్ను,<br>
ఎలమితోఁ దిరువేంగ - శేశుఁడ నాపాలఁ<br>
గలిగి నీ కృప - గలుగఁజేతువుగాక ॥ ॥నిన్ను॥

(5-27)

( సశేషము )

(16వ పేజీ తరువాయి)
ఒక జీవాత్ముడు సాధనానుష్ఠానముచే అనాది కాలమునుండి చేసిన కృషి ఫలించినదని అతడు సంతోషపడును.

ఇట్టి సృష్ట్యాది వ్యాపారమంతయు, అవాప్త సమస్తకాముడు, సర్వ సంపత్సమృద్ధుడు అఖండ భూమండలాధిపతియు నైన రాజాధిరాజు, కేవలము వినోదము నకై కందుక చతురంగాది లీలలు జరిపినట్లు ప్రయోజనదృష్టితోని లీలారూపమని యును ఆచార్యులవారు నిరూపించి యున్నారు.

సృష్ట్యాది వ్యాపారము పరమాత్ముని లీల. ఏది ప్రయోజనము నాశింపకనే సుఖరూపమై సంతోషానుభావమని చెప్పబడుచున్నదో అదిలీల. సృష్ట్యాది వ్యాపారములకు ప్రకృతివ్యాపారమట్లు ప్రయోజనమేమి అను ప్రశ్నకు ఇక్కడ అవకాశమేలేదు. అయినను, అవాప్త సమస్త కామునికి లీలా ప్రవృత్తి ఎట్టిది అని అన్నచో అవాప్త పదమునకు అవాప్తవ్యమని లేక సకల కామము పరమాత్మునికి అవిలంబముగా సిద్ధించునని అర్థముచేసికొనవలెను. ముక్తిచే జీవుని కెట్లుఆనందముచేకూరునో, యువరాజ్యాభిషేకముచే యువరాజు కెట్లు ఆనందము చేకూరునో దాని కంటెను నూరుపాలు ఆనందము పరమాత్మకు, మహారాజునకు కలుగును సృష్ట్యాది వ్యాపారములో లీలారస నిరూపణము చేసినను, దయారసముగానే లీలారసముండునని, ఆచార్యులవారు రహస్యార్థమును పరిష్కరించి యున్నారు. అందుచే సృష్ట్యాది వ్యాపారములు కూడ దయామూలకములే అని నిర్ణయింపదగి యుండును

## స్వాతంత్ర్యము

పరమాత్మకు నిరంకుశమైన స్వాతంత్ర్యమున్నది. జగత్తులోని సమస్త కార్యములకు పరమాత్ముడు ప్రధాన కారణుడు. సస్యములకు జలము సాధారణ కారణము. బీజశక్తి అసాధారణ కారణము. జలమువలెనే పరమాత్ముడు కార్యసామాన్యమునకు సామాన్య కారణుడై యున్నాడు. ఇక్కడ ప్రాధాన్య మెట్టిదనగా లోకమందు మనుష్యుడు పాకాది క్రియలకు కర్తయగును. ఇతర సాధనములు కారకములు. కర్తకు ఇతర కారకములనుచేర్చి నడిపించు శక్తివల్ల స్వాతంత్ర్యము గలదు. అందుచే కర్తను స్వతంత్రుడని చెప్పు వాడుక గలదు. ఇతని స్వాతంత్ర్యము సాధనములందు అణుమాత్రము వైకల్పమున్నను క్రియకు ఉపయోగపడదు. అయినను, ఇతని జ్ఞానేచ్ఛాప్రయత్నమను కర్తృత్వము కార్య సామాన్యమునకును, సాధారణ కారణమైన పరమాత్ముని సంకల్పముచే ప్రయుక్తమైనది అని సిద్ధాంతము. ఆ పరమాత్ముని సంకల్పము మఱొక్కని సంకల్పాధీనము కానే కాదు. ఇదే పరమాత్ముని యందున్న నిరుపాధికమైన స్వతంత్ర కర్తృత్వము ఇట్టి ప్రధాన కర్తృత్వాను సంధానము పరమాత్ముని ఆశ్రయించుటకు ముఖ్యమైన మూలబీజమై యున్నది.

(సశేషము)

---

(15వ పేజీ తరువాయి)
వచ్చింది. పెళ్ళికి తరలి వెళ్ళేముందు కులదైవాన్ని పూజించాలన్నారు. శ్రీనివాసుల కులదైవం శమీవృక్షమన్నారు. కుమారధారవద్ద ఉన్నదని అగస్త్యుడు చెపితే వెళ్ళి పూజించి, దాని చిన్నకొమ్మ తెచ్చి ఎక్కడ ప్రతిష్ఠించాలంటే, వరాహస్వామి దగ్గర అన్నాడట నారదుడు. శ్రీనివాసుడు వరాహస్వామి దగ్గరకు వెళ్ళి ఆయన అనుమతి తీసుకొని, ఆయనకు సమీపంలో ప్రతిష్ఠించాడట. అంటే శ్రీనివాసునికేకాక ఆయన కులదైవానికి ఆశ్రయమిచ్చాడు వరాహస్వామి. ఇందులో ఇంకొక రహస్యం. వరాహస్వామిని దర్శిస్తే, శ్రీనివాసులు కొలిచేకులదైవాన్ని దర్శించటం జరుగుతుందన్నమాట.

తొండమానునికి వరాహస్వామి అనుమతి

తొండమానుచక్రవర్తి శ్రీనివాసులకు స్వామిపుష్కరిణి దక్షిణతీరాన ఆలయం నిర్మించేటప్పుడు కూడా శ్రీవరాహస్వామి అనుమతి తీసుకొన్నాడు.

## వరాహపురాణం శ్రీవేంకటేశ్వర స్వామి ప్రీతికిపాత్రం

ఈవిధంగా శ్రీవేంకటేశ్వరస్వామిచరిత్రలో అడుగడుగున ప్రముఖసంబంధం కలవాడుశ్రీవరాహస్వామి. అంతేకాదు, ఆ స్వామిచరిత్ర శ్రీవేంకటాచలమూ శ్రీవరాహపురాణాంతర్గతమే. ఇట్టి శ్రీవరాహస్వామిని గురించీ, ఆయనపేర వెలసిన వరాహపురాణంగూర్చి తెలుసుకొనటమూ, అపురాణం పఠించటమూ ఆయనకే కాదు, శ్రీవేంకటేశ్వరస్వామికీ పరమప్రీతికరమనీ ఆయన అనుగ్రహానికొక ఉత్తమ మార్గమనీ వేరే వివరించనక్కర లేదు.

## వేదాదులలో శ్రీవరాహస్వామి ప్రసక్తి

శ్రీవరాహస్వామిప్రసక్తి వేదాలనుంచీ ఉన్నది. వరాహశబ్దమూ వరాహస్వామి వర్ణనాదులూ ఋగ్వేదంలో, తైత్తిరీయ సంహితాదులలో లభిస్తున్నవి. ప్రజాపతి వరాహావతారమెత్తినాడని శతపథబ్రాహ్మణం (14.1.2.11) స్పష్టంగా చెపుతున్నది. ఇదే విషయం తైత్తిరీయసంహితం (7.1.5.1), తైత్తిరీయబ్రాహ్మణమూ (1.1.3,5), కాఠకసంహితా (8.2) చెపుతున్నవి. వాల్మీకిరామాయణంలో బ్రహ్మ వరాహమై వసుంధర నుద్ధరించి



తిరుమలలో ఆది వరాహమూర్తి

సర్వజగత్తునూ సృష్టించాడని ఉన్నది. (2.110.3, 4). తరువాత వివిధపురాణేతిహాసగ్రంథాలలోనూ వివిధసంహితాబ్రాహ్మణారణ్యకాదులలోనూ మనకు వరాహ-తదవతారస్మరణ వర్ణనలు లభిస్తున్నవి. వీటి పరిశీలనంవల్ల అవతారి తొలుత ప్రజాపతిగా పేర్కొనబడి క్రమంగా విష్ణువని స్థిరంగా పేర్కొనబడినట్లు తెలుస్తుంది.

### శ్వేత యజ్ఞ ఆది నృ భూ ప్రళయ వరాహమూర్తులు

అవతారసంఖ్య సర్వే సర్వత్ర ఒకే విధంగా పేర్కొనబడలేదు గాని, వరాహావతారం పేర్కొనబడని అవతారగణనా ప్రసక్తి చాలా అరుదు. మహాభారతం శాంతిపర్వంలో (339.77-102) ఆరే అవతారాలు పేర్కొనబడినవి. వాటిలో వరాహావతారం ఉన్నది. ఆ అధ్యాయం లోనే పైచోటనే కాక, మరోచోట దశావతారాలు పేర్కొనబడినపుడూ బౌద్ధావతారానికి బదులు హంసావతారం ఉన్నది గాని వరాహావతార ప్రసక్తి యథాపూర్వం గానే ఉన్నది. శ్రీభాగవతంలో 1, 2, 10, 11వ స్కంధాలలో నాలుగుచోట్ల శ్రీమహావిష్ణువు వివిధావతారాల ప్రసక్తి, పరిగణనమూ వచ్చినపుడు నాలుగుచోట్లనూ వరాహావతారప్రసక్తి ఉన్నది. పురాణాలలో వరాహావతారప్రసక్తి వచ్చినపుడెల్లా సామాన్యంగా యజ్ఞవరాహంగా పేర్కొంటారు. శ్రీభాగవతంలో (3, 13, 35, 36) విష్ణుపురాణంలో (1.4.32-36) వరాహమూర్తి అవయవాలను వివిధయజ్ఞోపకరణాలుగా వర్ణించారు. పురాణాగమశిల్ప గ్రంథాలలో యజ్ఞవరాహ, శ్వేతవరాహ, ఆదివరాహ, నృవరాహ, భూవరాహ, ప్రళయవరాహమూర్తుల ప్రసక్తులున్నవి. ఇపుడు అవతారాలను లెక్కించేటపుడు మత్స్యావతారాన్ని మొదట లెక్కిస్తారు. కాని పురాణాలలో చాలాచోట్ల వరాహావతారమే మొదట పేర్కొనబడినది. ఉదాహరణకు భాగవతద్వితీయస్కంధసప్తమాధ్యాయమూ, తృతీయస్కంధత్రయోదశాధ్యాయమూ చూడవచ్చు. భగవానుడవతరించినది పృథ్విపైన. ఆ పృథ్వినుద్ధరించిన యజ్ఞవరాహమూర్తిని ముందు పేర్కొనటమూ సమంజసమే అన్నారు పెద్దలు.

### భూమ్యుద్ధరణం ధర్మోద్ధరణ ప్రతీక

వరాహస్వామి భూమినుద్ధరించాడనటమూ, ఆయన యజ్ఞస్వరూపుడనటమూ బట్టి చూస్తే ధర్మోద్ధరణకు ప్రతీకగా ఆ స్వామిని మనవారు ఉపాసించారేమో అనిపిస్తున్నది. భారతదేశచరిత్రలో ధర్మోద్ధారకులుగా పేరొందిన బహురాజన్యులకు వరాహస్వామి ఉపాస్యుడో లాంఛనమో కావటం కనిపిస్తున్నది. ఉదాహరణకు కనోజినేలిన గహడమురాజులూ, గుప్తరాజులూ భూమివరాహోపాసకులనటానికి లభిస్తున్న వరాహప్రతిమలూ, అనేక శాసనాలూ ప్రమాణంగా ఉన్నవి. వారు వరాహప్రతిమలను ప్రతిష్ఠించటమే కాక, వరాహపురాణాన్ని బాగా ప్రచారంచేసినట్లు చారిత్రకులు పేర్కొంటున్నారు. గుప్తులలోనూ ఉజ్జయినిరాజధానిగా ఏలిన రెండవ చంద్రగుప్త విక్రమాదిత్యుడు పురాణాలకు అనేక టీకలూ స్మృతిగ్రంథాలూ వ్రాయించాడనీ హరిహరవరాహాదిప్రతిమలు ప్రతిష్ఠించాడనీ తెలుస్తున్నది. గోవిందచంద్రుని ఆశ్రితపండితుడు లక్ష్మీధరుడు వరాహపురాణమాధారంగా రచించిన తీర్థవివేచన కాండలోని అనేకశ్లోకాలు నేటి వరాహ పురాణంలో లేకపోవటాన్నిబట్టి ఆరోజుల్లో 20,000 శ్లోకాల సంపూర్ణపురాణం లభిస్తూ ఉండిఉంటుందనీ, బహుశః దానిపై పలుటీకలూ ఉండిఉండవచ్చుననీ పండితులు ఊహిస్తున్నారు.

### ధర్మోద్ధారకులకుపాస్యుడు వరాహస్వామి

ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకూ చాళుక్యులు, కాకతీయులు, కొండవీటి రెడ్లు, తదాశ్రితసామంతులూ, వరాహస్వామిభక్తులూ ఆరాధకులూను. వారి చాలా శాసనాల ప్రారంభంలో విధిగా వరాహస్తుతి ఉంటుంది. రెండవచాళుక్య విక్రమాదిత్యుని ఆమదేలపాడు శాసనంలో స్పష్టంగా ఆయన భగవన్నారాయణప్రసాద సమాసాదిత వరాహలాంఛనుడని ఉన్నది. వారి శాసనాలమీద వరాహముద్రా, అంకుశమూ, సూర్యుడూ చంద్రుడూ చెక్కబడి ఉంటవి.

కాకతీయులూ వరాహ లాంఛనులు. వీరి శాసనాలు చాలా వాటిలో వరాహ ప్రశస్తి ఉన్నది. వీట్లలో చాలా సొగసైన కవిత్వమూ ఉన్నది, ఒక శాసనంలో కవి

* "క్రీడావరాహరూపి అయిన విష్ణునికోర మిమ్ము కాపాడుగాక;
దానిమీద భూమి మొగలిమీద తుమ్మెదలా అందగిస్తున్నదని "అన్నాడు.

విజయనగరప్రభువులూ వరాహలాంఛనులే. హంపీలో వరాహస్వామి ఆలయం ఉన్నది. విరూపాక్షాలయాన్ని విధ్వంసకుల నుంచి ఈ స్వామియే కాపాడాడని ఐతిహ్యంకూడా ఉన్నది. దండువస్తున్నది ఆలయధ్వంసానికి. మహావరాహస్వామి ఎదుట కన్పించాడు. వారికి ఆ ఆకృతి పడదు. కనుక, వెనుదిరిగి పోయారట.

ప్రోలయనాయకునివిలసదానశాసనంలో వరాహస్తుతి ఉన్నది. ముమ్మడినాయకుని కోరుకొండ శాసనంలోనూ ఉన్నది.

మహాబలిపురంలో పల్లవుల వరాహ గుహ ఉన్నది. తమిళదేశంలో ఇప్పటికీ భూవరాహన్ వంటిపేర్లు మనం వింటూ ఉంటాము.

సింహాచలం వరాహక్షేత్రం

చాలాచోట్ల వరాహాలయాలున్నవి. సామాన్యంగా వరాహస్వామీ, నరసింహ స్వామీ కలిసి ఉండటం ఉన్నది. కేవల నృసింహక్షేత్రంలో ఆయన ఉగ్రమూర్తి కనుకనేమో నీటికెద్దడి. కాని, వరాహ లక్ష్మీనరసింహస్వామి ఉన్నచోట ఒకచే నీటిబుగ్గ. ఉదాహరణకు సింహాచలం.

భూమినీ ధర్మాన్నీ బాగా పాలించే వారినీ ఆపదలనుంచి రాజ్యాన్ని కాపాడిన వారినీ వరాహస్వామితో పోల్చటం సాహిత్యం అంతటా ఉన్న దే.

శ్రీరామానుజీయులకు పరమప్రమాణం

ఇట్టి వరాహస్వామికి సంబంధించినది వరాహపురాణం. ఇది అష్టాదశపురాణాల లోనూ పన్నెండవది. ఇది భగవద్భక్తివర్ధనమనీ, విష్ణుమాహాత్మ్యసూచకమనీ నారదీయపురాణం ప్రశంసిస్తున్నది. ఇది 24,000 శ్లోకాలపురాణమని భాగవత, దేవీ భాగవత, మత్స్య, నారదీయ పురాణాలు చెపుతున్నవి. కాని, ప్రస్తుతం 10,700 మాత్రమే లభిస్తున్నవి. అంటే ఆరింట మూడువంతులగ్రంథంకూడా మనకు లభించటం లేదన్నమాట. ఇందులో అధ్యాయాలు 218. దాక్షిణాత్యపాఠంకంటె గౌడీయపాఠం పెద్దది. ఇది పూర్వోత్తర భాగాలుగా విభక్తమై ఉన్నది. పూర్వ భాగం భూమివరాహసంవాదాత్మకం. ఉత్తరప్రవిభాగం పులస్త్యకురురాజసంవాద రూపం. ఈరెండవభాగం ఇప్పుడుఅలభ్యం. రామానుజీయవైష్ణవులు మన్నించే బహువిషయాలకిది నిధి. భగవద్గీతాచరమశ్లోకం 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అన్నదీ, శ్రీమద్రామాయణంలో 'సకృదేవ ప్రపన్నాయ' 'పాపానాం వా శుభానాం వా' అన్న శ్లోకాలూ వారికెట్టివో అంతే ప్రధానమైనవి రెండు శ్లోకాలు ఇందులోనివి. "ౕ మనసు స్థిరంగానూ. శరీరం ఆరోగ్యంతోనూ ధాతు సామ్యమూ ఉన్నపుడు విశ్వరూపుని నన్ను సేవిస్తూ స్మరించినభక్తుడు ఒకవేళ మరణ కాలంలో కాష్ఠంలా పాషాణంలా ఐపోయి స్మరించలేనిస్థితిలో ఉంటే అతనిని నేను స్మరించి పరమగతి పొందేటట్లు చేస్తాను" అన్నభావం గలవి. దురదృష్టవశాత్తూ ఇవి కలభాగం ఖిలమై పోయింది.

ద్వాదశద్వాదశి

ఆదిదేవరూపంలో నారాయణునిప్రతిష్ఠ, జ్ఞానకర్మసముచ్చయం, సృష్టికర్మప్రకారం భువనకోశప్రకారం శ్రాద్ధానుష్ఠానప్రక్రియ, శ్రాద్ధవర్జ్యపదార్థాలు, ప్రతిద్వాదశీవిష్ణుపూజాప్రక్రియ, సర్వధాతువులతో భాగవతప్రతిమానిర్మాణం, ప్రతిమాప్రతిష్ఠ, ఆరాధనా ప్రకారం, పాంచరాత్రప్రామాణ్యం – మొదలయిన అమూల్యవిషయాలిందులోఉన్నవి. వీటిలో ప్రతిద్వాదశీవిష్ణుపూజాప్రక్రియ ఆసక్తిదాయకం. ప్రతిమాసశుక్లద్వాదశి నాడూ ఒక్కొక్క అవతారరూపంలో విష్ణువు అర్చనీయుడట. ఈపట్టిక తిలకించండి.

| నెల | | శుక్లద్వాదశిపేరు |
|---|---|---|
| మార్గశిరం | .... | మత్స్యద్వాదశి |
| పుష్యం | .... | కూర్మద్వాదశి |
| మాఘం | .... | వరాహద్వాదశి |
| ఫాల్గుణం | .... | నృసింహద్వాదశి |
| చైత్రం | .... | వామనద్వాదశి |
| వైశాఖం | .... | పరశురామద్వాదశి |
| జ్యేష్ఠం | .... | రామద్వాదశి |
| ఆషాఢం | .... | కృష్ణద్వాదశి |
| శ్రావణం | .... | బుద్ధద్వాదశి |
| భాద్రపదం | .... | కల్కిద్వాదశి |
| ఆశ్వయుజం | .... | పద్మనాభద్వాదశి |
| కార్తికం | .... | — |

రెండు విశేషాలు

వరాహపురాణంలో ఉన్న రెండు విశేషాలు (1) మథురామాహాత్మ్యం (అధ్యా. 152–172), (2) నచికేతోపాఖ్యానం(అధ్యా 193–212). మొదటిదాంట్లో మథురలోని తీర్థాలూ, నాటి భౌగోళిక విషయాలూ ఉన్నవి. రెండవ ఉపాఖ్యానం సువిపులముగా ఉన్నది. ప్రసక్తానుప్రసక్తంగా స్వర్గనరకవర్ణనమూ సవివరముగాఉన్నది.

వరాహపురాణాన్ని శిరసావహించిన ప్రముఖులు

వరాహపురాణంనుంచి బహుగ్రంథ కర్తలు బహుశ్లోకాలు ప్రమాణంగా స్వీకరించారు; బహుగ్రంథాలు దీనిని పేర్కొన్నవి. భవిష్యోత్తరపురాణం 194వ అధ్యాయంలో ధరణీవరాహరూపంలో ఈపురాణ వర్ణనం ఉన్నది. నరసింహపురాణం 1.14 మొదలైన వాట్లలో పలుసార్లు పేర్కొనబడింది.. 7 లేక 8వ శతాబ్దికి చెందిన జీమూతవాహనుడు తన 'కాలవివేకం' లో

# రచయితలకు చిత్రకారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రికకు మత ధార్మిక సంబంధమైన రచనలు, వ్యాసములు, గేయములు, చిత్రములు, ఛాయా (వర్ణ) చిత్రములు పత్రికలో ప్రచురణకుగాను కోర బడుచున్నవి. రచయితలు, చిత్రకారులు ఈ క్రింది విషయములు గమనించవలెను.

★

1. రచనలు చేయువారు 6 అరఠావు పేజీలకు మించకుండా, పేజీలకు ఒక వైపుననే వ్రాసి పంపవలెను. వాటికి సంబంధించిన ఛాయా చిత్రములను కూడ పంపగోరెదము.

★

2. చిత్రములు వేయువారు ఇండియన్ ఇంకుతో వేసి పంపవలెను.

★

3. ఛాయాచిత్రములుపంపువారు చిత్రములలోని వివరములు నిర్దుష్టంగా వ్రాసిపంపవలెను.

4 ప్రచురితమైన వాటికి ఎట్టిపారితోషికము ఈయబడదని గమనింప ప్రార్థన

— సంపాదకుడు,

సప్తగిరి

ఈ పురాణంలోని 24 నుంచి 30వ అధ్యాయంవరకూ గ్రంథంపేరు చెప్పి ఉట్టంకించాడు. ఈకాలంవాడే ఐన నారాయణభట్టు తన 'హితోపదేశం'లోవరాహపురాణంలోని 170.52-54 మొదలైన శ్లోకాలుదాహరించాడు. 10వశతాబ్దికి చెందిన అపరాదిత్యుడు యాజ్ఞవల్క్యస్మృతికి తాను వ్రాసిన టీకలో వరాహపురాణపు 70, 71వ అధ్యాయాలలోని శ్లోకాలనూ, ఈ కాలానికే చెందిన కన్యాకుబ్జరాజు గోవిందచంద్రుని ఆశ్రితుడు. లక్ష్మీధరపండితుడు తన 'కృత్యకల్పతరువు' పద్నాలుగుకాండలలో వ.పు.లోని 23 నుంచి 180 వరకూగలవాటిలో కొన్ని అధ్యాయాలనూ, అనిరుద్ధభట్టు తన 'పితృదయిత', 'హారలత'లలో 187వ అధ్యాయాన్నీ, 11వ శతాబ్దికి చెందిన శ్రీరామానుజమధ్వాచార్యులవారలు తమగీతాభాష్యాలలో ఇందులోని శ్లోకాలనూ, 12వ శతాబ్దికి చెందిన గౌడరాజు బల్లాలసేనుడు తన 'దానసాగరం'లో ఇందులోని 205, 206, 207 అధ్యాయాలను ఉదాహరించారు. పై కల్పతరువు వ్రతవిషయకమై 150, పారలౌకికక్రియావిషయకమై 40 శ్లోకాలను ఉట్టంకించిందని బలదేవోపాధ్యాయులు. 13వ శతాబ్దిలోని దేవణ్ణభట్టు తన 'స్మృతిచంద్రిక'లో ఈ వరాహపురాణం 190వ అధ్యాయంలోని శ్లోకాలనూ, హేమాద్రి తన 'చతుర్వర్గచింతామణి' వివిధఖండాలలో 13 నుంచి 211 వరకూగల అధ్యాయాలనుంచి చాలాఅంశాలనూ ఉదాహరించారు. హేమాద్రి ఇందులోని బుద్ధద్వాదశిని పేర్కొన్నాడు. శ్రీదత్తఉపాధ్యాయుడు 116, 210, 211 అధ్యాయాలనూ శ్రీమాధవవిద్యారణ్యులు తమ సుప్రసిద్ధ 'పరాశరమాధవం'లో 190-202 అధ్యాయాల శ్లోకాలనూ, 14వశతాబ్దిపండితుడు చండేశ్వరఠాకురు తన 'కృత్యరత్నాకరం'లో 39-41, 58, 136, 211 అధ్యాయాశ్లోకాలనూ వరాహపురాణంపేరు చెప్పి ఉదాహరించారు. 15వ శతాబ్ది మహాపండితుడు శూలపాణీ, గోవిందానందకవికంకణాచార్యుడూ, విద్యాధరవాజపేయీ మొదలైనవారు తమ 'దానక్రియాకౌముది' మొదలైన గ్రంథాలలోనూ, 16వశతాబ్దికిచెందిన గోపాలభట్టు, సనాతనగోస్వాములు తమతమ 'హరిభక్తివిలాసం'లోనూ 17వ శతాబ్దిలోని నీలకంఠభట్టపండితుడు తన 'దానమయూఖం'లో 97నుంచి 112 వరకూ గల అధ్యాయాలనూ, ఇతరమయూఖాలలో ఇతరాధ్యాయాలనుంచీ ఉదాహరించారు. శ్రీభారతీయరాయభారతి 'త్రిశక్తిమాహాత్మ్యది' శ్లోకాలనూ, 'సేతుబంధం'లో అక్కడక్కడా, 'సౌభాగ్యభాస్కరభాష్యం'లో ప్రతిపుటలో అడుగడుగునా వరాహపురాణశ్లోకాలు పేరుతోసహా ఉదాహృతాలైనవి

బ్రహ్మపురాణం వరాహవచనం అంటూ (220.44-47) రెండు శ్లోకాలనుదాహరించింది. భవిష్యపురాణంనుంచి అంటూ రెండు శ్లోకాలను వారాహం పేర్కొన్నది. మూడు ప్రత్యేకస్థలాలలో ఉన్న సూర్యదేవాలయాలను ఈపురాణం పేర్కొన్నది. అవి (1) యమునకు దక్షిణాన (2) ఉత్తరప్రదేశ్‌లో కాన్పూరుదగ్గర ఉన్న కాల్పి (కాలప్రియ), (3) పడమట మూలస్థానం (మూల్తాన్)లో. ఇంతకూ ఇది చారిత్రకులదృష్టిలో పన్నెండవశతాబ్దికీవలిది కాదు.

రచనాదృష్టిలోకూడా దీనికి ప్రత్యేకత ఉన్నది. కొన్నిఅధ్యాయాలు పూర్తిగద్యం (74, 81, 83, 86, 87) కొన్ని గద్యపద్యమిశ్రాలు.

### శ్రీవేంకటేశ్వరభక్తులకు వరాహపురాణం శిరోధార్యం

శ్రీవేంకటేశ్వరస్వామి భక్తులకు వరాహపురాణం ప్రత్యేకం వరాహస్వామి వలెనే శిరసాధార్యమైనది. కారణమేమంటే శ్రీవేంకటాచలమాహాత్మ్యం (దీనిసంగతి ఇదివరకే సూచితం), శ్రీవేంకటేశమాహాత్మ్యం, శ్రీవేంకటేశకవచం-ఇవి వరాహపురాణాంతర్గతాలే. అయితే ఇవి ఇపుడు వరాహపురాణంగా లభ్యమౌతున్నగ్రంథపు 10,700 శ్లోకాలలోనివికావు. బహుశః ఖిలభాగం 14,000 శ్లోకాలలోనివి అయివుండవచ్చునని విమర్శకులు ఊహిస్తున్నారు. ఇంకా దుర్గాసప్తశతి, దేవీకవచం, బృందావన రహస్యం, క్షేత్రకాండం మొదలైనవి కూడా వారాహాంతర్గతాలు, ఖిలభాగంలోనివి కావచ్చు.

### తెలుగులో వరాహపురాణం

ఇన్నివిధాల ఉపాదేయమైన వరాహపురాణాన్ని (1) 1480 ప్రాంతాల ఉన్న నందిమల్లయ ఘంటసింగనలు జంటకవులు 12 ఆశ్వాసాల పద్యకావ్యంగా తెలిగించారు. శ్రీకృష్ణదేవరాయల తండ్రి అయిన తుళువనరసరాయల కంకితంచేశారు. కావ్యదృష్టితోచేయబడిన కవిత్రయపఙ్క్తికిచెందిన రసవదనువాదం ఇది. (2) 1513ప్రాంతాల ఉన్న హరిభట్టు అన్నతడూ పద్యబద్ధంగా తెలిగించాడు. ఇతనిదీ మంచికవిత్వమే. కాని ఇతని పుస్తకం అంతగా ప్రచారంలోనికి రాలేదు, ఇదీ యథామూలంకాదు. ఇంకా ఒకటీ అరా సారసంగ్రహాలూ సంక్షిప్తానువాదానువాదాలూ ఉన్నవి. ఇవన్నీ వాటివాటి పరిధులలో ప్రశంసనీయాలే.

### సరిక్రొత్త అనువాదం ఆవశ్యకత:

నేటి చదువరికి అనువుగా, సామాన్యులకూ సులభంగా, యథామూలకంగా, కుదింపు పెంపు మళ్లింపులు లేని వాడుక తెలుగు వచనానువాదం రావలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

### ఈ వ్యాసరచనకు ఆధారాలు:

1. ఆచార్య పండిత బలదేవ ఉపాధ్యాయః పురాణవిమర్శ - ఈవ్యాసంలోని అధికభాగం ఈ గ్రంథభాగాలకు అనువాదప్రాయమో సంగ్రహరూపమో. కనుక వారికి వ్యాసకర్త ప్రత్యేకం ఋణపడ్డవాడు. 2. గోరఖపూర్ గీతాప్రెస్ వారి కల్యాణ సంక్షిప్తవరాహపురాణాంక 51వ సంపుటంలోని ప్రముఖులవ్యాసాలు. 3. శ్రీ బులుసు వేంకటరమణయ్య: ఆంధ్రకవి సప్తశతి. 4. శ్రీఆరుద్ర: సమగ్రఆంధ్రసాహిత్యం 5. డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు(ఎం.ఏ; పి. హెచ్.డి; చరిత్రశాఖాధ్యక్షులు, హిందూకళాశాల, గుంటూరు)గారితో చారిత్రకవిషయగోష్ఠి. 6. శ్రీపరవస్తు రామానుజస్వామి: శ్రీవేఙ్కటాచలమాహాత్మ్యము, తి.తి.దే. ప్రచురణము.

---

* దంష్ట్రాక్రీడారహస్య విష్ణోః రక్షతు వః క్షమా।
యత్ర కేతకసంలీనా భృంగీశృంగీమధారయత్॥
— మక్తలశాసనం, తెలం. శాసన సం. II పుట 153

• స్థిరే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః।
ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపం చ మాం భజన్॥
తతస్తం మ్రియమాణం తు కాష్ఠపాషాణ సన్నిభమ్।
అహం స్మరామి మద్భక్తం నయామి చ పరాంగతిమ్॥

★

---

(11వ పేజీ తరువాయి)

మును రామకృష్ణులాక్రమించిరి. "ధ్యేయస్సదాసవితృమండలమధ్యవర్తీ నారాయణస్సరసిజాసనసన్నివిష్టః" అనిగదా పాంచరాత్రశాస్త్రము ధ్యేయవస్తువును వర్ణించినది! అట్టి సవితృనుపాసనాసందర్భమున పరమధ్యేయమగు నారాయణుడు సంపూర్ణ ఆధికారి, సాలంకృతమూర్తి ఈమారు నీటిలో చూచుచుండగనే రామకృష్ణులకు మారుగా యిట్లు సాక్షాత్కరించెను.

సీ॥ ఆభోగిభోగపర్యంక మధ్యంబున వల
నొప్పుపచ్చనివలువవాని
మేఘంబుపైనున్న మెఱుగుచందం
బున నురమున శ్రీదేవియొప్పువాని
ముసరుతేటులువిప్ప ముఖచతుష్కముగల
తనయుడాదెడిబొడ్డుదమ్మివాని
గదలిన బహుపదక్రమవిశేషంబుల
రవముచూపెడినూపురములవాని

గీ॥ జలజగర్భరుద్రసనకసనందన
సద్విజామరప్రశస్యమాను
చతురుదైనవాని సౌందర్యఖనియైన
వానినొక్క పురుషవర్యుగాంచె॥

ఇదియొక విశ్వరూపము. శేషునిపై ఆ పురుషవర్యుడు శయనించియుండెనట. శేషుడామూర్తికి తన శరీరమునంతను ఉపచారముగా, భోగార్థమర్పించినవాడు. శేషుడు విశ్వము. ఆ విశ్వమంతటను వ్యాపించిన విశ్వమయ విష్ణుమూర్తి విశ్వాత్ముడు. అతడుఅని శేషశాయి కర్థముగదా! "పాదోస్యవిశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" అనెడి పురుషసూక్త వచనప్రకారము త్రిపాద్విభూతికి, విశ్వము పాదమాత్రవిశేషము గాన శేషుడనబడెను. శేషాహి అనంతుడు. అది విష్ణుని అనంతవ్యాప్తిని దెల్పును. "సువర్ణజ్యోతిః" అని తైత్తిరీయ ఉపనిషద్వాక్యము కలదు. పచ్చనివలువ కర్థమది. ప్రళయఅంధకారములోనికి పరమాత్మజ్యోతి ఆవిర్భవించెనని మనువచనము. అందరి పాపముల హరించువాడు లేక ఆకాశమువలె సర్వవ్యాపిఅనుటకు నీలమేఘచ్ఛాయాదేహము

## పిల్లలకు గొడుగు

( గూఢార్థము )

రాముడు :— కృష్ణా! గొడుగు తెఱచితివేల? వాన లేదు ఎండ లేదు.

కృష్ణుడు :— ఇప్పుడు నామనసులో తోచిన దానిని చెప్పెదను వినుము.

రాముడు :— చాలసంతోషము. చెప్పుము. శ్రద్ధతో విందును.

కృష్ణుడు :— దేనిని పట్టుకొని గొడుగును ఎత్తుదువు?

రాముడు :— కాడను పట్టుకొని ఎత్తెదను.

కృష్ణుడు :— ఈ ప్రపంచమున కాధారమైన భగవంతుడే కాడ యనుకొనుము దాని కొనయే దేవు డొక్కడేయని సూచించును.

రాముడు :— కమ్ములను ఏమని భావింతువు?

కృష్ణుడు — ప్రపంచములో నానా దిక్కులలోని నానాదేశములలో నానా భాషలకు సంబంధించిన మతములని భావించెదను.

రాముడు :— ఆ కమ్ములన్నియు కాడతో చేరుచున్నవనుటను ఎట్లు ఊహించెదవు?

కృష్ణుడు :— అన్ని మతములును భగవంతుని చేరుటకుపయోగించు మార్గము లని చెప్పెదను.

రాముడు :— సరేకాని గుడ్డను దేనికి పోల్చెదవు?

కృష్ణుడు :— అదియే ప్రేమ. గుడ్డలేని గొడుగెట్లు నిష్ప్రయోజనమో ప్రేమను పాటింపని మతములును అట్టివే. భగవంతుడే ప్రేమ స్వరూపుడు అని గదా సిద్ధాంతము.

రాముడు :— నీకిట్టి బుద్ధి యెట్లు కలిగినది?

కృష్ణుడు :— శ్రీమద్రామాయణములో మాధ్యాహ్నికస్నానమునకు తమసా నదికి వెళ్ళిన వాల్మీకి స్ఫటికము వంటి నిర్మలముగ నీటినిచూచి భరద్వాజా! ఈ నీరు సత్పురుషుల మానసమువలె నిష్కల్మషముగ నున్నదని చెప్పగా వినియున్నాను. అందుచే గొడుగును చూచునపుడు నాకును ఇట్లు పోల్చి చెప్పవచ్చునని తోచినది.

రాముడు :— మంచిది. ఇక నేనును ఇట్టి పోలికలను గుర్తింప గృహిస్తును.

శ్రీ వంగీపురం రంగస్వామి అయ్యంగారు,
తిరుచానూరు.

సూచకము. ఆతడు లక్ష్మినెన్నడును విడిచి యుండడు. ఆతని హృదయస్థానమునాపె యాక్రమించియే యుండును. లేకున్న సృష్టియేలేదు. ఆతని యిష్టప్రకారము సృష్టిచేయు అధికారిక పురుషుడు బ్రహ్మ ఆమూర్తియొక్క నాభి (Nucleus) నుండియే జనించెను. ఆతడు పుట్టినబొడ్డు తమ్మి సృష్టిచిహ్నము. సవితృమండల మధ్య వర్తి, యొక పురుషుడని తైత్తిరీయనారాయణోపనిషత్తు తెల్పుచున్నది. అట్టిసవితృ మండలమధ్యగతుడై యామూర్తి తన ప్రభలచే ముల్లోకము లాక్రమించి త్రివిక్రముడనిపించుకొనెను. దేవ, మనుజ, ఋషిశ్రేష్ఠుల స్తుతినందెను. "సత్యం, శివం, సుందరం" అగు మూర్తియేఆతడు. ఆతనిని భగవద్గీతపురుషోత్తముడని వ్యాఖ్యానించెను. ఇట్టి లక్షణములతో అక్రూరునికి నీటిలో సాక్షాత్కరించెను. ఆతనిని అక్రూరుడు పాంగరాత్రవిధి ప్రకారమిట్లు పంచతత్త్వస్తుతి చేసెను :— దేవా! నీవు సృష్టికొరకు వ్యక్తమైతివి. నారాయణ స్వరూపుడవు. సృష్టికొరకైన మాయ వలన అహంకారము, పంచభూతములు, మనస్సు, ఇంద్రియములు, సృష్టిబీజములుగా బయల్వెడినవి లోకములన్నియు విడి విడిగా ఏర్పడినవి. మరల నవియన్నియు నీలోనే లయమందుచున్నవి. వీనియన్నింటికిని అతీతమైన పరమాత్మ స్వరూపుడవు నీవు". ఇది ఆ దివ్యస్వరూపుని పరతత్త్వ స్తుతి.

"నీవు సమస్తజీవులకు ఆత్మవై సాక్షిగా నున్న జీవాత్ముడవు. అంతర్గతజ్యోతివి. ఈశ్వరుడవు. సృష్టిక్రమములోవచ్చి అనేక నామరూపములు నీకున్నను వానియన్నిటి సమష్టియగు ఏకరూపుడవుగానేయున్నావు. నీవు జ్ఞానస్వరూపుడవు. జగన్మయుడవైన ఆత్మవు" ఇది అంతర్యామి తత్త్వ స్తుతి.

"చతుర్వ్యూహములుగా అవతరించిన వాడవు. వివిధరూపములుగానున్న సమస్త చరాచరజగత్తు నీలో లయించగా ఘటములోనున్న ఆకాశము బ్రద్దలుకాగా అనంతాకాశములో కలిసినట్లు నీ పరమాత్మ రూపమున కలిసిపోగా యేకఅద్వితీయ రూపముగా నీవుందువు. ఈ సృష్టిలోని పంచభూతములును నీవలననుద్భవించినవి. వివిధవస్తుజీవసంచయము నీ శరీరాంగములు. సర్వదేవతలు నీ యవయవస్థితులై యున్నారు. నీవలననే సర్వము సృజింపబడుచున్నది. నీ యుదరమున సర్వలోకములు ఉన్నవి" ఇది వ్యూహతత్త్వస్తుతి.

"దశావతారములు నీవియే!" ఇది విభవతత్త్వస్తుతి.

"నాకు భిన్నతంబాపి మన్నింపుము" అని ప్రార్థించెను.

అప్పుడు నీటిలో ఆ దృశ్యముమారి అర్చనీయసౌలభ్యమూర్తియగు శేషశాయి రూపము కనబడెను. ఇది అర్చాస్వరూప తత్త్వము. అక్రూరుడు :—

శ్లో॥ "పంచధా పంచాత్మా" అనువచన ప్రకారమామూర్తులదర్శించి పర, వ్యూహ విభవ, అర్చా, అంతర్యామి తత్త్వస్తుతి చేసి ధన్యుడననుకొనెను. మొదట రామకృష్ణులుగా కనబడి, యిట్టి పంచతత్త్వ దర్శనమిచ్చిదా యొక్కడే. అట్టి వానిని ఒకలోకములో ఒకనలుసువలెనున్న కంసుదేమి చేయగలడు' అని యాతనిమనస్సునకు తట్టెను. ఆతనికి చింతబాసెను. ధైర్యము కలిగెను. సర్వమును ఆ దైవాధీనమే అని తలపోసి, మ్రొక్కి, రథము నొద్దకు వచ్చునరికి, అంతవఱకు తాను విడచివెళ్ళిన రామకృష్ణులు అందు కనబడిరి. ఆ విశ్వకారణరూప మంతర్ధానమైనది. పైగా ఏమియు నెఱుగనివాని వలె శ్రీకృష్ణుడు అక్రూరునితో "ఇంత జాగేలయయ్యా? నీటిలో నేమైన విశేషములు జూచుచుంటివా?" యనియడిగెను. 'నీకా రూపసాక్షాత్కారము కలిగించినది నేనేసుమా!' యనియు దీని అంతరార్థము. అక్రూరుడు, "నీలోలేని విశేషములెక్కడ గలవు. సర్వకారణకారుడవు నీవే యని మ్రొక్కెను.

ఇది ఉపాస్యదేవతాస్వరూపము నెఱుకపరచు విశ్వరూపము. అక్రూరుని మనస్తాపమేగాదు సర్వభక్తుల మనోవిచారముల బాపగల అభయస్వరూప విశ్వరూపము. భగవానునికి భక్తపరిత్రాణమునందెంత శ్రద్ధయోగదా. అక్రూరుడు తన మనోవేదనను శ్రీకృష్ణునకు విన్నవించలేదు. కాని ఆతని విచారముడిగెను. ఇదియే నిష్కామ కర్మఫలము.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

*

---

(12వ పేజీ తరువాయి)

వ్రతమును ఆచరించిన విశేషఫలసిద్ధి కలుగును.

కొందరికి మధ్యలో వ్రతము నిలిచిపోవునేమో యను సందేహము కలుగవచ్చును. ఏమయినను విఘ్నములు రావచ్చునని వారి అభిప్రాయము. అటువంటి వారికి ఎటువంటి సందేహము అవసరము లేదు. దైవికముగావచ్చు విఘ్నములకు ఎటువంటి అపకారము జరుగదు. ఎంత వరకుజేసిన అంతవరకు సుఖములుపొందుటకు వీలుయున్నది.

"ముప్పదుం తప్పామే" అనగా ఈ ముప్పైపాశురములు క్రమం తప్పకుండా ఆచరించిన వారికి లోకరక్షకుడగు శ్రియఃపతి ఎనలేని సుఖసంపదలను ఇహపరముల యందు నొసంగును. దీనియందు ఎట్టి సందేహము లేదు, కాన భక్తులు, పండితులు, పామరులు ఈ ధనుర్మాసమును సద్వినియోగము చేసుకొందురని నేను భావించుచున్నాను.

*

| గ్రంథములు | రచయిత - వ్యాఖ్యాత - సంపాదకుడు | |
|---|---|---|
| మణిమేఖల | శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి | అ. 2-75 |
| రాజాజీ మహాభారతం | శ్రీ కె. శ్రీనివాసాచార్యులు (ఆంగ్లమూలము రాజాజీ) | అ. 8-00 |
| రాజాజీ రామాయణం | శ్రీ కె. శ్రీనివాసాచార్యులు (ఆంగ్లమూలము రాజాజీ) | అ. 8-00 |
| రాజాజీ మెచ్చిన భాగవతం | శ్రీ రెంటాల గోపాల క్రిష్ణ | అ. 8-00 |
| దేవాలయములు | శ్రీ కల్లూరి చంద్రమౌళి | అ. 1-50 |
| రామానుజ కీర్తికౌముది | శ్రీ ధనకుధరం వరదాచార్యులు | అ. 10-00 |
| రామనాటక విమర్శనము | శ్రీ పి. బాలక్రిష్ణమూర్తి | అ. 7-20 |
| సచిత్ర సుప్రభాతము | సుప్రభాత ప్రపత్తి మంగళాశాసన శ్లోకాలకు వర్ణచిత్ర వివరణం | 10-75 |
| సిద్ధాంతత్రయ సంగ్రహ | | 2-50 |
| శ్రీనివాస కళ్యాణం | శ్రీనివాస పద్మావతీవివాహం వర్ణించు వర్ణ చిత్రగాథ | 11-50 |
| శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం, లక్ష్మీనారాయణ స్తోత్రం | | 3-00 |
| స్తోత్ర రత్నములు | పురుషసూక్తం, శ్రీ సూక్తం అష్టోత్తర - ముకుందమాల మొదలగునవి కలది | 1-75 |
| వీరబ్రహ్మ పురాణం | | 16-00 |
| టీకా తాత్పర్యములతో సుప్రభాతం | శ్రీ పి. బాలక్రిష్ణమూర్తి | 0-50 |
| స్కాందపురాణం (మహేశ్వరఖండం) | విద్వాన్ సరిపల్లె విశ్వనాథశాస్త్రి | 7-75 |
| స్కాందపురాణం (పురుషోత్తమ జగన్నాథ క్షేత్రమాహాత్మ్యము) | ,, | అ. 3-75 |
| స్కాందపురాణం (శ్రీ వేంకటాచలమాహాత్మ్యము) | ,, | అ. 4-00 |
| శ్రీ యతిరాజ వైభవం | శ్రీ మాడభూషి వెంకట శేషాచార్య | 2-50 |
| శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు | శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి | సం. 1-50 |
| సార సంగ్రహ గణితం | శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి | సం. 1-12 |
| శ్రీనివాస విలాస సేవధి | శ్రీ కోరాడ రామక్రిష్ణయ్య | 4-50 |
| శ్రీ వేంకటాచల మాహాత్మ్యము భా 1 | కలియుగమున శ్రీ వేంకటేశా విర్భావమును గూర్చి వివిధ పురాణములనుండి సేకరణం. సంస్కృతం. తెలుగు లిపిలో | 5-00 |
| శ్రీ వేంకటాచల మాహాత్మ్యము భా 2 | | 4-25 |
| శ్రీ వేంకటాచల మాహాత్మ్యము | వేంకటేశావతరణమునుగూర్చి తెలుగున గద్యరూప వివరణము | 2-00 |
| శ్రీ వేంకటేశ్వర వైభవము | శ్రీ అప్పికట్ల జగన్నాథచార్య | 12-00 |
| తాళ్ళపాక కవుల కృతులు వివిధ సాహితీప్రక్రియలు | డా॥ వేటూరి ఆనందమూర్తి | 30-00 |
| తాళ్ళపాక పద కృతులు | డా॥ వేటూరి ఆనందమూర్తి | 45-00 |

వివరములకు: **మార్కెటింగ్ ఆఫీసరు.**

పబ్లికేషన్ సెక్షన్ ప్రెస్ కాంపౌండ్

తిరుపతి 517501

(8 వ పేజీ తరువాయి)

మన మొనరించు పూజా ఫలితము "సర్వేజనాస్సుఖినో భవంతు" "సర్వ మానవ కల్యాణమే మాకు రక్ష" యని ఆ సృష్టికర్తను వేడుకొనెదము. "ప్రస్తుత జీవితము మన పూర్వజన్మ "ఫలశ్రుతి" అనియెంచి; అదియే మనకు భగవంతుడు నిర్ణయించిన 'గతి–విధి' యని నమ్మి; జన్మరాహిత్యము బడయుటకు ప్రయత్నించెదము గాక: ఐహిక సుఖములయందు ఫలశ్రుతి దక్కుటలేదని ఆముష్మికము కోల్పోవుట క్షేమమా?

సర్వమనో వికారములకు 'స్వస్తి' చెప్పి, శ్రీ వేంకటేశ్వరస్వామిని ఈ విధముగా ప్రార్థించెదము.

1 వినా వేంకటేశం ననాథో ననాథః
సదా వేంకటేశం స్మరామి స్మరామి।
హరే వేంకటేశ ప్రసీద ప్రసీద
ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ॥

తా॥ శ్రీ వేంకటేశ్వరా! నీవు తప్ప నాకు దిక్కెవరూలేరు. గాన నిన్నే సర్వ వేళలయందు గొలుచుదును. శ్రీహరీ! నన్ను రక్షించుము. నాకు ప్రీతి కలిగించుము.

(1 శ్రీ వేంకటేశస్తోత్రమ్—9)

*

(6వ పేజీ తరువాయి)

సర్గము = సృష్టి స్థితి లయములతో కూడిన బ్రహ్మాండోత్పత్తి; ప్రతిసర్గము లేక విసర్గము = కల్పానంతరము జరుగు పునఃసృష్టి, వంశము = దేవబ్రహ్మర్షుల, దేవయోనుల యొక్క గోత్రానుక్రమము; మన్వంతరము = స్వాయంభువ, స్వారోచిషాది చతుర్దశ మనువుల చరిత్ర, వారి పరిపాలనాకాలము; వంశానుచరితము = సూర్యచంద్రాది వంశములయందు జన్మించిన రాజన్యులవృత్తాంతము — అను అయిదు విషయములు పురాణములయందు చక్కగ వివరింపబడి యుండును.

ఈ పంచలక్షణసూత్రమును మనము సునిశితదృష్టితో పరిశీలించినయెడల ప్రపంచముయొక్క ఉత్పత్తివికాసక్రమకథనము గోచరమగును. పురాణములన్నియు దాదాపుగ నీ లక్షణములకు కట్టుబడియుండుటచేత పురాణవాఙ్మయమునకు పై చెప్పిన పంచలక్షణసూత్రము ప్రాణమని పరిగణింపవచ్చును. పురాణములయందీ విషయములేగాక భక్తిజ్ఞానవైరాగ్యాదులు, వైద్య సంగీత జ్యోతిష గణిత వ్యాకరణ ఛందోఽలంకార శిల్పనాట్యాది సమస్త విషయములను చోటుచేసుకొన్నవి. ఇవి యన్నియు ప్రతిపురాణమునందును నుండునని చెప్పలేము. కాని పురాణవాఙ్మయమును సమష్టిగ పరిశీలించినచో వీనినన్నింటిని గుర్తింపగల్గుదుము.

పురాణములన్నియు పై పంచలక్షణములకే కట్టుబడియున్నవని చెప్పలేము. ఇవి మహాపురాణ. ఉపపురాణభేదముచే రెండు విధములనియు, పంచలక్షణ సూత్రము ఉపపురాణములకు మాత్రమేవర్తించుననియు, మహాపురాణములు దశలక్షణసమన్వితములనియు భాగవత పురాణము పేర్కొని ఆ పదిలక్షణముల నిట్లు వివరించినది.

"పురాణలక్షణం బ్రహ్మన్ బ్రహ్మర్షిభి
ర్నిరూపితమ్।
శృణుష్వ బుద్ధిమాశ్రిత్య వేదశాస్త్రానుసారతః॥
సర్గోఽస్యాథ విసర్గశ్చ వృత్తీరక్షాన్తరాణిచ।
వంశోవంశానుచరితం సంస్థాహేతు
రపాశ్రయః॥
దశభిర్లక్షణైర్యుక్తం పురాణం తద్విదోవిదుః।
కేచిత్పంచవిధం బ్రహ్మన్ మహదల్ప
వ్యవస్థయా॥"

(ఓ బ్రహ్మదేవా! బ్రహ్మర్షులచేత పురాణలక్షణమిట్లు నిరూపింపబడినది. వేదశాస్త్రానుసారము బుద్ధినాశ్రయించి నిరూపించబడిన దీనిని వినుము. సర్గము, విసర్గము, వృత్తి, రక్ష, అంతరము, వంశము వంశానుచరితము సంస్థ, హేతువు, అపాశ్రయము అను నీ పదిలక్షణములతోకూడినది పురాణమని దానినెరిగినవారు తెల్పుచున్నారు. కొందరు, పెద్దది, చిన్నది అన్న భేదము ననుసరించి పంచలక్షణములనే పేర్కొనిరి.) వీనికి వివరణమిది.

1. సర్గము = బ్రహ్మసృష్టి. 2. విసర్గము = కశ్యపాది ప్రజాపతులు కావించిన సృష్టి, 3. వృత్తి = ప్రాణులకావశ్యములగు ఆహారాది జీవికాసాధనములు, 4. రక్ష = దుష్టులను శిక్షించుటకై భగవానుడు ధరించిన అవతారములు, లీలలు, 5. మన్వంతరము = స్వాయంభువాది మనువుల చరిత్ర, వారి కాలములలోని ధర్మము మున్నగువాని స్థితి, 6. వంశము = దేవయోనుల బ్రహ్మర్షుల గోత్రానుక్రమము, 7. వంశానుచరితము = సూర్యచంద్ర వంశజులగు రాజుల చరిత్ర, 8. సంస్థ = ప్రళయము, 9. హేతువు = సృష్టికి కారణభూతుడగు జీవునిగూర్చిన వివరము, 10 అపాశ్రయము = ప్రపంచవిషయమున పరమేశ్వరుని సాక్షిమాత్రత్వము.

బ్రహ్మవైవర్త పురాణముగూడ భాగవతమును బలపరచుచు సృష్టి, విసృష్టి, పాలనము, కర్మవాసన, మనుప్రకాశము, ప్రళయము, మోక్షనిరూపణము, హరినామకీర్తనము వివిధదేవతల గుణవర్ణనము అనునవి మహాపురాణములకు లక్షణములని నిర్దేశించినవి. అందుచేతనే శ్రుతిస్మృతులయందు కన్పట్టని సర్వధర్మాది విషయములనుగూడ పురాణములు బోధించుచున్నవనియు, వానియందు లేనిది లేదనియు నారదీయపురాణమిట్లు కీర్తించుటజరిగినది

"యన్నదృష్టం వా వేదేషు తత్సర్వం లక్ష్యతే
స్మృతే।
ఉభయోర్యన్నదృష్టం వా తత్పురాణైః
ప్రణీయతే॥

(వేదములలో దృష్టిగోచరము కానిది స్మృతులలో కనిపించును. ఆ రెండింటి యందును కనిపించనిది పురాణములచేత నిరూపింపబడుచున్నది.)

ఆధునిక విమర్శకులు సైతము పురాణలక్షణములను ఇవియని స్పష్టముగ నిర్దేశింప నసాధ్యమని తెల్పుచు "మానవజీవితమునందలి సమస్తాంశములను స్పృశించు వస్తువు ఏదైనను పురాణమున నుండవచ్చును" అని పురాణములలోని అనంతత్వమును ప్రస్తుతించిరి. (సశేషము

( 7వ పుట తరువాయి)
మైనది (అదిగాక సుమారు రు. 70 000లు విలువకు ఉద్యోగులు యంత్రాల తయారి, కూలి, రవాణా వగైరాల రూపంలో ఉచిత సేవచేశారు.)

తిరుపతిలో మరొక్క కళ్యాణమంటపం కట్టేందుకు తీర్మానించటమైనది.

దేవాదాయశాఖ నిర్వహించే ఆరాధన పత్రికకు 1978-79 సంవత్సరానికి రు. 2,000/- మంజూరుచేయటమైనది.

బొంబాయి, చెంబూరులోని శ్రీసుబ్రహ్మణ్య సమాజ్ ఆలయ భవనాదులకు మొదటగా రు. 1 లక్ష విరాళంఇచ్చి పురోగతిని పరిశీలిస్తూ, ప్రతిపర్యాయమునకు రు. 1 లక్ష వంతున, 5 లక్షల విరాళాన్ని ఆ భవనంలో దేవస్థాన సమాచార కేంద్రం నెలకొల్పేందుకు వసతి కల్పించే నిబంధన మీద మంజూరుచేయమైనది.

తిరుచానూరు గ్రామపంచాయతీకి దేవస్థానంపక్షాన 1977-78, 78-79 సంవత్సరాలకు సాలీన రు. 25,000/-మంజూరు చేయటమైనది.

గ్రామాలలో కళ్యాణమండప నిర్మాణాదులు దేవస్థాన ప్రణాళికలో లేనందున అలాంటి అభ్యర్థనలు తీసుకొనరాదని నిర్ణయించటమైనది.

ఇప్పుడున్న 8 పాతకార్లస్థానంలో 8 క్రొత్త అంబాసిడర్ కార్లను కొనేందుకు నిర్ణయించటమైనది.

తిరుపతిచరిత్ర (తెలుగు) గ్రంథకర్త శ్రీ దీవి రంగనాథాచార్యులుకు 25 ప్రతులు ఉచితంగా ఇచ్చేందుకు అంగీకరించటమైనది.

తిరుపతిలో దేవస్థానపు వినాయక నగర్‌కు నీటి సరఫరాకుగాను ఆర్. సి. సి. నీళ్ళటాంకు నిర్మాణానికి రు. 2 లక్షలు మంజూరుచేయటమైనది.

తిరుపతిలో దేవస్థానం 3వ సత్రము వెనుక, ఉద్యోగుల నివాసభవనం 2బ్లాకుల నిర్మాణానికిగాను రు. 1,42,000/- మంజూరుచేయటమైనది.

బొబ్బిలిలో దేవస్థాన కల్యాణ మంటపానికి రాణి శ్రీమతి లక్ష్మీసుభద్ర గారిచే జరిగే శంకుస్థాపన ఉత్సవానికి దేవస్థాన పక్షాన శ్రీ జి. చంద్రశేఖరం నాయుడును పంపాలని నిర్ణయించటమైనది.

తిరుమలలో దేవస్థాన ఉద్యోగులునివసించే ప్రాంతంలో వారికొరకు ప్రత్యేకంగా ఒక ఆస్పత్రిని ప్రారంభించ నిర్ణయించటమైనది.



తిరుమల తిరుపతి దేవస్థానంవారి శ్రీ వేంకటేశ్వరవైభవం చిత్రం ఆంధ్రప్రదేశ్ పంపిణీహక్కులను 3 ఏండ్లపాటు తీసుకొనే వారికోసం మళ్ళీ పత్రికలలో ప్రకటించాలని నిర్ణయిస్తూ, తగిన నిబంధనలు రూపొందించ వలసిందిగా కార్యనిర్వహణాధికారిని కోరటమైనది.

తిరుమల తిరుపతి దేవస్థానం పక్షాన న్యాయస్థానంలో హాజరయ్యేందుకు శ్రీ టి. కె. టి యస్. ఆర్. తాతాచార్య ఇచ్చే పారితోషికాన్ని హాజరైన ప్రతి దినానికి రు. 50/- నుండి రు. 100/- కు హెచ్చించటమైనది.

తిరుమలలోని శ్రీవేంకటేశ్వర వేద శాస్త్రాగమ విద్యా కేంద్రమునకు చెందిన వేదపాఠశాలలోని దివ్యప్రబంధం పూర్వభాగ శిక్షణకాలాన్ని 4 నుండి 6 సంవత్సరాలకు పెంచుతూ, ఈ శిక్షణకు విద్యార్థి వేతనాన్ని నెలకు రు. 60/- నుండి రు 150/- కు పెంచుతూ కమీషనర్ ఆమోదమును కోరటమైనది.

అన్నపురెడ్డిపల్లెలోని తిరుమల తిరుపతి దేవస్థాన కల్యాణమండపాన్ని అక్కడి బాలాజీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానానికి మరొక్క 5 ఏళ్ళపాటు అద్దెకీయటమైనది,

ద్వారకాతిరుమలలో దేవస్థానసత్రాన్ని మరొక్క 5 ఏళ్ళపాటు ఆ దేవస్థానానికి అప్పగిస్తూ, ఇతర దేవస్థాలకు అప్పగించబడిన తిరుమల తిరుపతి దేవస్థాన సత్రాలు కల్యాణమంటపాదుల విషయంలో ఆయా దేవస్థానాలు సక్రమంగా నిర్వహించగలవనుకొన్న పక్షంలో 5 ఏళ్ళపాటు అప్పగించవచ్చుననీ, లేని పక్షంలో తిరుమల తిరుపతి దేవస్థానమే తిరిగి స్వాధీనపరచుకొని నిర్వహించాలనీ, ఈ నిబంధనే ఈ దేవస్థానపు అన్ని సత్ర, కల్యాణమంటపాదుల విషయంలో వర్తింపజేయాలని తీర్మానించటమైనది.

దేవస్థాన ఉద్యోగుల సంస్థ సాంస్కృతిక కార్యక్రమాలకు గాను రు. 5,000/- ధనం మంజూరుచేస్తూ, కార్యక్రమాలకు కావలసిన దేవస్థానంచేయగల సదుపాయాలన్నీ కల్పించవలసిందిగా, కార్యనిర్వహణాధికారిని కోరటమైనది.

తిరుమల తిరుపతి దేవస్థానంచే లోగడ కాళహస్తీశ్వర దేవస్థానానికి అద్దెకీయబడ్డ సత్రాన్ని తిరిగి స్వాధీన పరచుకొని నిర్వహించ నిర్ణయించటమైనది.

శ్రీకాకుళంజిల్లా పలాస తాలూకా నగ

రంపల్లి హరిజనవాడకు రామమందిర నిర్మాణానికిగాను రు. 10,000 మంజూరు చేయటమైనది.

1970-71 నుండి 1978-79 వరకు తిరుపతి పురపాలక సంస్థకు మామూలు ప్రకారం సాలీనా రు. 1.75 లక్షలు మాత్రం మంజూరు చేయటమైనది.

పశ్చిమ గోదావరిజిల్లా తణుకులో దేవస్థాన సహాయంతో నిర్మాణము కానున్న కల్యాణమండపం వ్యయం 50% దేవస్థానం భరించేందుకు నిర్ణయించటమైనది

దేవస్థానంలో శైవాగమ ఆస్థాన పండిత పదవి అనవసరమని భావించి తీసివేయ నిర్ణయించటమైనది.

1966 వ సంవత్సరపు దేవాదాయచట్టం (17) లో 88 సెక్షన్ 88 (1) వారసత్వపు ఉద్యోగులు - సేవకులు కాని, రు. 530/- లోపు నెలసరి వేతనంగల అధికారులను కార్యనిర్వహణాధికారి, ఈ వేతనానికి పైన గల, వారసత్వ అధికారులు- సేవకులు-కాని, అధికారులను ధర్మకర్తలమండలి నియమించే విధంగాను రూలు 5 (1) క్రింద కమీషనర్‌కు గల పాలకాధికారాలు పేష్కార్ అంతకు పైవారి విషయంలోను దేవస్థాన ధర్మకర్తలమండలికి శాఖాధికారి అధికారాలను దేవస్థాన కార్యనిర్వహణాధికారి నిర్వహించే విధంగాను, రూలు 5 (2) క్రింద దేవస్థానానికి, ఇతర విభాగాలనుండి వచ్చిన అధికారులతో సహా పేష్కారు అంతకు పై వేతనాల అధికారుల ప్రయాణభత్యం మొదలైన బిల్లులకు సంతకంచేసే అధికారం కార్యనిర్వహణాధికారికి మిగిలిన ఉద్యోగుల విషయంలో ఆ అధికారం ఉపకార్యనిర్వహణాధికారికి సంక్రమించే విధంగా చట్టాన్ని సవరించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరటమైనది.

ధర్మకర్తల మండలి 5175/ 17-8-78 తీర్మానంలో స్థానిక విరాళం అన్న నిబంధనను ఉప్పెన బాధిత ప్రాంతమైనందువల్ల సడలించి కృష్ణాజిల్లా దివి తాలూకా, వేములవాడ వేణుగోపాలస్వామి దేవాలయానికి రు. 17,500/- మంజూరు చేయటమైనది.

మేడెచల్ తాలూకా కేసరగుట్టలోని రామలింగేశ్వర స్వామి ఆలయానికి రు. 1,00,000/- మంజూరు చేయటమైనది.

శ్రీకాకుళంజిల్లా, నరసన్నపేట తాలూకా రహమాన్‌పురం, రామమందిర నిర్మాణానికి రు. 5 500 శ్రీకాకుళం తాలూకా ఫజుల్‌బాగ్ పేట హరిజనవాడల రామమందిర నిర్మాణానికి రు. 10,000 మంజూరు చేయటమైనది.

ఇప్పుడు ఖాళీగా ఉన్న డెప్యూటి ఎగ్జిక్యూటివ్ ఆఫిసరు పదవిలో శ్రీ యస్. మునస్వామినాయుడును, ఆయన చిరకాల సేవ చిహ్నంగా అన్ని నిర్బంధాలను సడలించి నియమించటమైనది. ఇంకొక ఉప కార్య నిర్వహణాధికారి పదవిని తిరుపతిలో కల్పించి పేష్కారు తరగతిలో సీనియర్ అయిన శ్రీ వాసుదేవనాయుడును నియమించ నిర్ణయించడమైనది. ఈ రెండు పదవుల వేతనాదికములు దేవాదాయశాఖలోని కమీషనర్ స్థాయిలో ఉండవలెనని కూడ తీర్మానించటమైనది.

శ్రీ కె పీరారెడ్డిని అసిస్టెంటు ఇంజనీర్‌గా ప్రమోట్ చేయడమైనది.

తిరుమల తిరుపతి దేవస్థానముస్థాయిని పురస్కరించుకొని (1) దేవస్థాన ధర్మకర్తలమండలి సభ్యులకు మండలి సమావేశానికి లేదా ఉపసంఘ సమావేశానికి రు. 100 చొప్పున పారితోషికము నిర్ణయించవలెనని తీర్మానించడమైనది.

(2) హాజరైన ప్రతిరోజు అందులో భాగంకుగా రు. 35 లు వంతున కరువుభత్యం చెల్లించవలెనని (3) ప్రతి సభ్యుని నివాస ప్రదేశమునుండి సమావేశం జరుగుప్రదేశమునకు విమాన ప్రయాణం ఖర్చు లేదా I వ తరగతి రైలుచార్జీలు చెల్లించవలెనని; ప్రభుత్వరేట్ల ప్రకారం ప్రయాణమునకు దారిభత్యం చెల్లించవలెనని ఇతర రాష్ట్రములలో నివిచే పక్షంలో రోజుకి రు. 100 గరిష్ఠపరిమితిగా అయిన ఖర్చును చెల్లించవలెనని (4) తిరుమల లేక తిరుపతులలో ప్రతిసభ్యునికి ప్రత్యేక డ్రైవరు, కారు, వారి స్వాధీనములో ఉంచవలెనని, ఇతర ప్రదేశములకు తిరిగేయెడల నిర్దిష్టరేట్ల ప్రకారం డబ్బు వసూలు చేయవలెనని సభ్యులకు చెల్లించే భత్యాలు సమావేశ స్థలములోనే చెల్లించవలెనని మండలి సభ్యుల బిల్లులు చెల్లించుటకు కార్య నిర్వహణాధికారికి, తన బిల్లుల తానే సంతకము చేయుటకు చైర్మెన్‌కు అధికారము ఉండవలెనని కోరుతూ తీర్మానించటమైనది

దేవస్థాన కోశాగారములోని రాళ్ళ- బంగారు ఆభరణాలు వినియోగుచేసి వాటిని బహిరంగ వేలంలో అమ్మటకు గాను పేష్కారు స్థాయిలో ఒక ఆఫీసరు ఒక అప్పర్ డివిజనల్ క్లర్కు ఒక రికార్డు అసిస్టెంటు, పదవులను ఒక ఏడాది పాటు కల్పించ నిర్ణయించడమైనది.

దేవస్థానం సీనియర్ వైద్యాధికారిగా ఉండి దూరప్రాంతములో మరణించిన డా॥ ఎ. బి రామచంద్రారెడ్డి మృతిపట్ల తమప్రగాఢ సంతాపము తెలుపుతూ తీర్మానించడమైనది.

మీ సమస్యకు    ఉత్తమ పరిష్కారం

# సామూహిక వివాహ పథకం

* * *

మీ బ్రతుకు బంగారుబాట కావాలా! అందుకు వివాహం ఒక సమస్యా? కావచ్చు. తరతరాలుగా ఎదుగూబొదుగూ తెలియని మన ఆర్థికవ్యవస్థలో, తమకో తమ వారికో వివాహం అనగానే అదొక సమస్యగా పరిణమించడం సహజం. లక్షాధికారులనుకూడా భిక్షాధికారులను చేయగల నిగూఢ సమస్య (మనకు తెలిసినవే) లెన్నో ఇందులో ఉన్నాయి. మరి రెక్కాడితేగాని డొక్కాడని వారి స్థితి! మనదేశంలో ఇలాంటి వారే ఎక్కువ. వీరి వివాహ సమస్యకు తిరుమల తిరుపతి దేవస్థానపు "ఉచిత సామూహిక వివాహపథకం" కల్పతరువులాంటిది.

## తరతమ భేదాలు లేకుండా అమలు జరిగే ఈ పథకం ముఖ్యాంశాలివి:

* హిందువులైన వారందరికీ ప్రాంతీయ, కుల, భాషాభేదాలు లేకుండా అందుబాటులో ఉంది.

* వివాహం హోమం - హోమంలేకుండా రెండు విధాలుగా జరుగుతుంది. వారి వారి సంప్రదాయాన్ననుసరించి జరుపుకోవచ్చు.

* తిరుమలకు రావటం అనేది తప్ప వధూవరులకు ఖర్చేమీ ఉండదు. ముఖ్యమైన సరంజామా అంటే మంటపాలంకరణ, మంగళ వాద్యాలు, మట్టెలు, మంగళసూత్రాలు అన్నీ దేవస్థానమే ఏర్పాటుచేస్తుంది.

* వధూవరులకు దేవస్థానమె రు. 175/– విలువ వస్త్రబహుమానం కూడా చేస్తుంది.

* ఈ వివాహం జరిగినట్లు ధ్రువపత్రం కూడా ఇస్తుంది.

## మీరు గమనించాల్సింది:

* దేవస్థానం శుభముహూర్తాల పట్టిక పత్రికలలో ప్రకటించిన నెలలోపుగా వధూవరులు, వారి తల్లిదండ్రులు లేదా సంరక్షకులు తమకు వివాహం జరుపుకోగల లేక జరుపగల ఆర్థికస్థితి లేదనే ధ్రువపత్రంతోపాటు దేవస్థానం పత్రాలమీద దరఖాస్తులు పంపుకోవాలి. 18 ఏళ్ళకు పైబడినవారే అర్హులు.

* దేవస్థానం నిర్ణయించిన శుభముహూర్తానికి, దేవస్థానం నిర్ణయించిన రోజుకు ముందుగా తిరుమలచేరాలి.

* నిర్ణయించిన శుభముహూర్తానికి రాలేనివారు ఆ విషయం కనీసం ఒక్కరోజు ముందుగా దేవస్థానానికి తెల్పాలి.

* పొరపాటుగానైనా ముందు తెల్పటం మరచిపోతే, ఇక ఈ పథకంలో పాల్గొనే అవకాశం శాశ్వతంగా పోగొట్టుకుంటారు.

* ఇంకా మిగిలిన వివరాలకు ఈ క్రిందివారితో సంప్రదించండి :

రిసెప్షన్ ఆఫీసర్-II

తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుమల.

# మీరాశి ఫలం

(1-1-79 నుండి 31-1-79)

ఈ నెలలో మీ అదృష్టం.

### మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పా)

రాహువువలన ఆందోళన, శనివలన ధననష్టం లేదా కుమారులు కుమార్తెల నుండి వేర్పాటు. గురువువలన మనశ్శాంతికి భంగం శుక్రుని వలన ధనలాభం లేదా శృంగారం లేదా గృహప్రాప్తి, రవివలన నెలమొదటి పక్షంలో అనారోగ్యం రెండవ పక్షంలో ధనం, జయం, కుజుని వలన 12వ తేదీ వరకు ధననష్టము లేదా అవమానం లేదా అనారోగ్యం తర్వాత రోజులలో ధనలాభం. బుధుని వలన 4 వ తేదీ వరకు శుభం 4 వ తేదీనుండి 24 వ తేదీ వరకు అపకారం, తర్వాత మాసాంతము వరకు ధనలాభం, శత్రువులపై జయంశృంగారం.

### వృషభం

(కృత్తిక 2,3,4,పా, రోహిణి, మృగశిర 1, 2, పా.)

రాహువు వలన వివాదాలు, శనివలన ధననష్టంలేదా అయినవారినుండివేర్పాటు. గురువువలన నిరాశ. శుక్రుని వలన స్త్రీల మూలంగా ఇబ్బందులు, రవివలన అనారోగ్యం లేదా భార్యకు అసంతుష్టి లేదా ధననష్టం లేదా ప్రయత్నాలలో వైఫల్యం. కుజునివలన ధననష్టం, అవమానం; బుధుని వలన 4 వ తేదీ వరకు వివాదాలు తరువాత 24 వ తేదీ వరకు జయం, లాభం, నూత్నవస్త్రప్రాప్తి, మాసాంతము వరకు శని వలన నిరాశ.

### మిథునం

( మృగశిర 3,4 పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పా. )

రాహువు వలన ధనం. శని వలన ధనం సేవక లేదా వాహనప్రాప్తి, దృఢారోగ్యం గృహసౌఖ్యం, గురునివలన కూడా ధనం, జయం, శుక్రుని వలన అవమానం, అనారోగ్యం. రవివలన నెల మొదటి పక్షంలో ప్రయాణం ప్రయాస, రెండవ పక్షంలో అనారోగ్యం లేదా భార్యకు అసంతుష్టి. కుజుని వలన భార్యతో తగాదా నేత్ర లేదా ఉదరబాధ లేదా ధనగౌరవ భంగం. బుధుని వలన 4 వ తేదీ వరకు జయం, 4 వ తేది నుండి 24 తేది వరకు వివాదాలు, ఆ తరువాత కాలంలో జయం ధనం నూత్న వస్త్రాలు లేదా సంతాన ప్రాప్తి.

### కర్కాటకం

(పునర్వసు 4పా, పుష్యమి, ఆశ్లేష.)

శని రాహువుల మూలంగా ధననష్టం. గురువు మూలంగా ధననష్టం లేదా వివాదాలు శుక్రుని వలన ధనం, స్నేహితులు, సంతానం పెద్దలనుండి ప్రశంస బంధువుల రాక కుజుని వలన 12 వ తేది వరకు ధనం జయం గృహోపకరణప్రాప్తి, తరువాత కాలంతో భార్యతో వివాదం. నేత్రబాధ లేదా ఉదరబాధ, బుధుని వలన 4 వ తేదీ వరకు ఇంటిలో వివాదాలు 4 వ తేదినుండి 24 వ తేది వరకు జయం, ఉన్నత పదవి 24 తరువాత మరల వివాదాలు. నెల మొదటి పక్షంలో రవి వలన మంచి ఆరోగ్యం శత్రువులపై జయం. రెండవపక్షంలో ప్రయాణం ఉదరబాధ.

### సింహం

(మఖ, పూ. ఫ, ఉత్తర 1వ పా.)

రాహువు వలన ఆందోళన. శనివలన అయినవారి నుండి వేర్పాటు ప్రయాణం ప్రయాస, ధననష్టం, అధార్మిక ప్రవర్తన. గురువువలన కూడా ప్రయాణం ప్రయాస శుక్రుని వలన మంచి స్నేహితులు ఉత్తేజం. కుజునివలన 12 తేదీవరకు అనారోగ్యం లేదా కుమారులు లేదా కుమార్తెల కారణంగా ఆందోళన లేదా శత్రువుల మూలంగా గాని తన చిరాకు వల్ల గాని భయం. తరువాత కాలంలో ధనం, అన్నివిధాల వ్యయం, రవివలననెలమొదటి పక్షంలో శత్రువుల మూలంగా ఆందోళన లేదా అనారోగ్యం రెండవ పక్షంలో దృఢారోగ్యం శత్రువులపై జయం. బుధుని వలన 4 వ తేదీ వరకు ధనం గృహములో వస్తుసమృద్ధి 4 నుండి 24 వరకు యింటిలో తగాదాలు తరువాత రోజులలో జయం. ఉన్నతపదవి ప్రాప్తి

### కన్య

(ఉత్తర 2, 3 4 పా. హస్త; చిత్ర 1, 2 పా.)

రాహువు వలన ధననష్టం, శని వలన ఆందోళన. శుక్రుని వలన ధనం గౌరవం నూతన వస్త్రాలు జయం. కుజుని వలన మొదటి 12 రోజులలో అనారోగ్యం, లేదా దుష్టబుద్ధుల మూలంగా అపకారం తర్వాత కాలంలో కుమారులు లేదా కుమార్తెల మూలంగాగాని అనారోగ్యం వలన గాని శత్రువుల మూలంగా గాని లేదా తన దుడుకు స్వభావం వలన గాని ఆందోళన రవి వలన అనారోగ్యం లేదా శత్రువుల మూలంగా యిబ్బందులు,బుధుని వలన స్వప్రవర్తన కారణంగా 4 వ తేదీ వరకు ఆందోళన 4 నుండి 24 వరకు గృహసౌభాగ్యం తరువాత కాలంలో ఇంటిలో తగాదాలు.

### తుల

(చిత్ర; 3, 4 పా: స్వాతి, విశాఖ 1, 2, 3 పా;)

రాహువు వలన సుఖం, శనివలన ధనం శృంగారం. గురువువలన ధననష్టం నిరాశ. శుక్రుని వలన ధనం ఆహార ధాన్యాలు గౌరవం సంతానం, రవివలన నెలమొదటి పక్షంలో గౌరవం, ధనం శత్రువులపై జయం రెండవ పక్షంలో అనారోగ్యం. కుజుని వలన 12 వ తేదీ వరకు కుమారుల మూలంగా కాని అక్రమార్జనల వలనగాని ధనం. తర్వాత కాలంలో జ్వరంవలన గాని ఉదరబాధ వలనగాని అనారోగ్యం లేదా దుష్టుల వలన అపకారం. బుధుని వలన 24 వ తేదీ వరకు అవమానం లేదా తన

(40 వ పేజీలో)

వేదవాఙ్మయం, దానిలో ఆసక్తికల వారందరికి వివక్షతా రహితంగా అందుబాటులోఉండాలని, రాష్ట్ర దేవాదాయ మాత్యులు, శ్రీ వి. వెంకటనారాయణ 2-12-78 న, హిందూధర్మ ప్రతిష్ఠానం ఆధ్వర్యంలో ఘన స్వస్తి సహిత చర్చా సదస్సును ప్రారంభిస్తూ అన్నారు.

తిరుపతిలో శ్రీ అన్నమాచార్య కళా మందిరంలో 4 రోజులపాటు జరిగిన ఈ సభల ప్రారంభంనాడు రాష్ట్ర దేవాదాయ మంత్రి పాల్గొన్నారు.

దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ సభకు స్వాగతం చెప్తూ, ధర్మాభివృద్ధి కార్యక్రమాలకుద్దేశింపబడ దేవస్థాన రాబడి, ధర్మాభివృద్ధి కార్యక్రమాల కుపయోగించ వలసినంతగా, ఆ విధంగా ఉపయోగిస్తున్నామా అనేది సందేహాస్పదమనీ, అందువల్ల, ధార్మిక కార్యక్రమాలకు ఇతోధికంగా, ఫలవంతంగా వ్యయం చేయాలనేదే దేవస్థాన సంకల్పమనీ పండితులందరూ ఆలోచించి పథకాన్ని నిర్దేశిస్తే. దేవస్థాన అధికారులు వాటిని అమలుజరుపుతారనీ అన్నారు.

ధర్మప్రతిష్ఠానం కార్యదర్శి డా॥ అర్కసోమయాజి ఈ దేశపు జాతీయజీవనానికి అనేక వేల సంవత్సరాలుగా అర్ష ధర్మం వెన్నెముకేగాదు, ఈ జాతీయజీవన స్రవంతి. అటువంటి వేద విజ్ఞానానికి ఆటపట్టయిన ఈ దేశంలో పండితులు ఈనాడు నిలువనీడలేక, కనీసం ప్రాథమికోపాధ్యాయుల వేతనాలుగల ఉపాధులు కూడా సంపాదించుకోలేక ఇటుప్రభుత్వపు, అటు ప్రజల ఆదరణ లేక రెంటికి చెడ్డ రేవడులైనారు. మెకాలే రూపొందించిన ఆంగ్ల విద్య నవలంభించినవారికే ఉపాధి అన్న విధానం, వేదవిద్య, సంస్కృత భాషలపైన ఆశనిపాతమై పునాదులు కదలించింది. ఈనాడు ఇతర విషయాలపైన, కోట్ల కొలదిరూపాయలు వెచ్చిస్తున్నాం. మానవతా విస్తరణకుగాని, వైజ్ఞానికాభివృద్ధికి గాని0 01%కూడా ఇవితోడ్పడటంలేదన్న విషయం అందరికి తెలిసిందే. పైగా నిరుద్యోగం, క్రమశిక్షణారాహిత్యం పెరిగిపోతున్నవి. విద్యార్థులకు సైతము నైతిక విలువవలన గురించే తెలియనప్పుడు ఆధ్యాత్మికపు విలువలను గురించి వేరే చెప్పనక్కర్లేదు. ఈ స్థితిని చక్కబరచేందుకు భగవంతుడే ఉన్నాడు!

# వార్తాలహారి

అసలు ప్రభుత్వానికి, వేదవిజ్ఞానాన్ని, సంస్కృతభాషను ప్రోత్సహించదల్చుకుంటే ఆ పనిచేయజాలదా! మనసుంటే మార్గముంది. పరిపూర్ణులైన వేద సంస్కృత పండితు లొక్కొక్కరికి జీవన పర్యంతం నెలకు రు. 500/- ఇస్తామని పత్రికలలో ప్రకటించమనండి. తెల్లారేసరికి, వేలకొలది వేదవేత్తలు మనకు లభిస్తారు ఈ కార్యక్రమం 4 పంచవర్ష ప్రణాళికలపాటు నిర్వహించినా చాలు, మనం వేదవిదుల తెగను వినాశంనుండి రక్షించినవాళ్ళమౌతాం. కేవలం గుణకార భాగార సంకలన మాత్రబోధన గల ప్రాథమిక పాఠశాలలపై మనం వెచ్చించే ధనంలో 1 వంతు కూడా ఉండదు.

అయితే సంస్కృత ప్రాశస్త్యం ఏమిటనే ప్రశ్న కలగవచ్చు. ప్రపంచమంతటా భారతీయ సంస్కృతికై పరిశోధనా సంస్థలుఏర్పడటం, పలువురు పాశ్చాత్యులు హిందూధర్మం వైపు మొగ్గుతున్నారన్న విషయాలే ఆ గొప్పతనానికి తార్కాణం. మాక్స్‌ముల్లరంతటి వాడు ఉపనిషత్తులు తనకిహంలో సహానుభూతిని, పరంలో ఆత్మకు శాంతిని ప్రసాదిస్తవన్నాడు. వేదాలు నరునిలోని నారాయణాంశ రూపొందిస్తుంటే ఈనాటి విద్యావిధానం మనిషిని మృగంగా మారుస్తున్నదే తప్ప ఆతనిని మానవీయ స్థాయిలోనన్నా నిల్పలేక పోతున్నది

తిరుమల తిరుపతి దేవస్థానంచే 1) వేదాలకు టేప్ రికార్డు చేయటం 2) వేదాల అనువాదం 3) వేదరక్షణ పథకం 4) కుమారాధ్యయన పథకం చేపట్టింది. వేదాలను టేప్ రికార్డు చేయటమన్నది మంచిపద్ధతే, వర్తమాన పరిస్థితులు ఏ మాత్రం మెరుగు పడకుండా కొనసాగే పక్షంలో కాని వేదపోషణకు సహాయం చేయటం సాధ్యం కాదనే సంకల్పంతో జరిగేవి కనుక మరణాంతర శస్త్రచికిత్స లాంటి కార్యక్రమం అనుకొంటున్నాను. వేదాల అనువాదము గురించి చెప్పవలసివస్తే ప్రతిసంస్కృత పండితుడు వీటిని అనువదించ గలడన్న అపోహ ప్రజలలోవుంది. వేదాలఅర్థము కేవలము బాహ్యంగా కనపడేది కాదని అది తత్త్వచింతనతో కూడినది, శబ్దప్రధానమై వుదాత్తనుదాత్త స్వరాలలో ఒక దివ్యశక్తి నిముడ్చుకొని వున్నదని గ్రహించుకోవాలి. అందువల్లనే యీ వేదవాఙ్మయ ప్రాధాన్యముగురించి చెప్పేందుకు గత వర్ష ఒక వేద సదస్సు జరపడం, ఆధునిక ప్రాచీన వేద విధుల సహకారంతో ఒక వున్నత స్థాయి వేద పరిశోధనాలయం ఏర్పరచి కాని వేదాల ననువదించే సాహసము చేయవద్దని ఏకగ్రీవంగా తీర్మానించటం జరిగింది. ఇక దేవస్థానం వార్షికంగా 10 లక్షల రూపాయలదాకా వ్యయించ సంకల్పమున్న వేద రక్షణ పథకం చాల ప్రశస్తమైనదే. దీనివల్ల పండితుల కుమారులను, వేద విద్యా

ధ్యయనానికి ప్రోత్సహించే అవకాశము ఏర్పడుతుంది.

అన్నిటి కన్న ముఖ్యమైనది. కుమారాధ్యయన పథకము. ఈ శిక్షణ కాలములో ఆకర్షణీయమైన విద్యార్థి వేతనాలు యివ్వటం జరుగుతుందని కనీసం నెలకు రు 500/- వేతనం గల వుద్యోగమో లేదా ఆ గౌరవభృతో ఈ శిక్షణపొందిన వారికి వుంటుందని ప్రకటిస్తే తప్ప వేద పండితుల పిల్లలుగూడ ఆంగ్లవిద్య వైపు మొగ్గుచూపుతారనే నా భయం

జగన్నాథ పండితు లొకప్పుడు యిలా అన్నారు.

"ఢిల్లీశ్వరోవా జగదీశ్వరో వా మనోరథాన్
పూరయితుం సమర్థః,
అన్యైః నృపాలైః పరిదీయ మానం శాకాయ
వా స్యాత్ లవణయవా వా స్యాత్:"

"మా కోర్కెలు తీర్చాలంటే ఢిల్లీశ్వరునకో జగదీశ్వరునికో మాత్రమే సాధ్యం" అలాగే ప్రభుత్వమో, ఆత్మ రక్షణకు గాను సర్వలోక పాలకుడైన శ్రీ వేంకటేశ్వరుడో ఈ వేదరక్షణ భారాన్ని నిర్వహించవలసిందే. నాస్తికులు దేవుడు లేడని, వేంకటేశ్వరుని అభిశంసించేనాడు వేదాలే ఆయన్ను రక్షించాలి.

ఐశ్వర్య మదమత్తోఽపి వేధానుద్ధీర్షసి।
త్వం నాసీతి వేదాధీనా తవ స్తితిః॥

"ఓ వేంకటేశ ప్రభూ! నీ హుండి వెండి బంగారాలతో నింపుకుంటున్నానని గర్వపడకు. వేదాల రక్షణకు నీ సర్వస్వం వెచ్చించు. నీవులేవని నాస్తికు మేలమాడే వేళ ఈ వేదాలే నీకు రక్షణ నిస్తాయి"

దేవాదాయమంత్రి శ్రీ వేంకటనారాయణ మాట్లాడుతూ ఈ దేశానికిసంస్కృతి రక్షణకు స్త్రీలు పట్టుకొమ్మలని, అలాంటి వారిని సైతం వేద వాఙ్మయాధ్యయనం నుండి దూరంగా ఉంచారని. ఆసక్తి కల వారందరికి, ఆ వాఙ్మయాధ్యయనానికి అవకాశాలు కల్పించాలనీ అన్నారు.

సభాధ్యక్షత వహించిన డా॥ వి. రాఘవన్ తమప్రసంగంలో, వేదసదస్సులోగడ చేసిన నిర్ణయాలు అమలుకు రావటం నిజంగా హర్ష జనకమని, వేదాలు సార్వకాలిక విజ్ఞాన భాండాగారాలని, అలాంటి వాటిని నిర్లక్ష్యం చేయరాదనీ అన్నారు.

బర్మాలాంటి దేశాలలో మతాభివృద్ధి ప్రభుత్వంపై ఆధారపడకుండా ప్రజాహితైషిణీ సంస్థలచేత నిధులేర్పరచబడి వుంటాయని ఆ విధంగా ఈ దేశంలో గూడా అలా ఏర్పడితే బాగుంటుందని సూచించారు. వేదవిదులనుకున్న వారిలో కూడా కొందరి మూర్ఖతవల్లకూడా వేద పఠనం తగ్గిపోతున్నదని ఉదాహరణకు శుక్ల యజుర్వేదులు. కృష్ణయజుర్వేదులు కొందరు ఇతరశాఖనుగాని, ఇతర వేదాన్ని గాని అధ్యయనం చేయటం దోషమని భావనలో ఉన్నారని. అది వాస్తవానికి అర్థరహితమే గాక, అన్ని శాఖలవారు అన్ని వేదాలుఅధ్యయనానికిఅర్హులే అన్న విషయాన్ని ఉత్తరభారత దేశంలో ప్రసిద్ధంగా కనబడే ద్వివేది, త్రివేది, చతుర్వేది అనే వంశనామాలే చాటి చెప్తున్నాయని అన్నారు. డా॥ అర్కసోమయాజి వందన సమర్పణతో సభ ముగిసింది మిగిలిన మూడురోజులు ఘన స్వస్తి కార్యక్రమం జరిగింది. 6-12-78 వేదవిదులకు, దేవస్థాన ఉపకార్యనిర్వహణాధికారి శ్రీ యన్. నరసింహారావు ద్వారా సన్మానం జరిగింది.

*

( 4వ పేజి తరువాయి )

ఈప్రయత్నంలో ప్రారంభంగా, మేము వేదరక్షణ పథకాన్ని. కుమారాధ్యాయన ప్రణాళికను ప్రారంభించాం. ఒకవిధంగా, శ్రీవేంకటేశ్వరస్వామి, తనను నాస్తిక ప్రభావంనుండి కాపాడశక్తిగల వేదశాస్త్ర ధర్మాన్ని, వేదవాఙ్మయాధ్యయనాన్ని ప్రోత్సహించవలసిందని మనకు చాట చెప్పేందుకే ఈబహుళధనార్జనచేస్తున్నాడా అనిపిస్తున్నది. హిందూధర్మరక్షణావశ్యకతను గుర్తించిన మన మాన్యశ్రీ ముఖ్యమంత్రిమహోదయులు స్వామివారి హుండీ ధనంలో 10శాతం హైందవధర్మాభివృద్ధికే వెచ్చించాలని మార్గదర్శకసూత్రం ప్రకటించటం జరిగింది. ఈపదిశాతంలో వేద వాఙ్మయంకు అధికప్రాధాన్యం ఇచ్చి శాస్త్రాదుల సాంప్రదాయకాధ్యయనాన్ని మళ్ళీపైకి తీసుకురావాలని నా ఆశ. ఈనాటి శిరోమణి లేక భాషాప్రవీణ పట్టభద్రులు, 10వ వంతు శాస్త్రం మాత్రమే చదువుతున్నారు. శాస్త్రాలు లేదా వేదాలను పునరుద్ధరించలేక, అవి అదృశ్యం కావటమే జరిగితే, తలక్రిందులుగా తపస్సుచేసినా మళ్ళీ మనకు దక్కవు. ఒకసారి చేయిజారిపోతే శాశ్వతంగా జారిపోయినట్లే. ఇప్పటికే సామవేదంలోని పలుశాఖలు మాయమైపోగా, అధర్వవేదం చావుబ్రతుకులమధ్య కొట్టుకొంటున్నది.

ఇటీవలికాలంలో పలువురు పాశ్చాత్య యువకులు హిందూమతంవైపు మొగ్గుతున్నట్లు గావింటున్నాం. కృష్ణధ్యానమతం స్వీకరించిన బ్రహ్మచారులు, సన్యాసులను చూస్తే నిజంగా మనం సిగ్గుపడకతప్పదు. ఇదికాక నెదర్లాండ్స్, డెన్మార్క్, హాలెండ్ లాంటి దేశాలలోని యువకులు వేదాలపై పరిశోధనలు జరిపి డాక్టరేట్‌లు పుచ్చుకుంటున్నట్లు కూడా విన్నాను. అంటే వైదికసంస్కృతిస్థావరం భారతదేశాన్ని వదలిపెట్టిందన్నమాట. ఇటు మనదేశంలో వ్రేళ్ళమీద లెక్కకువచ్చే వేదపండితులు కొద్దిమంది, తమజీవికకు జనం దయాధర్మలపైన ఆధారపడవలసి వస్తున్నది. అందువల్ల ఈ దుస్థితి తప్పించి ఈపవిత్ర భారతదేశంలో వేద శాస్త్రాదులకు వాటి పూర్వవైభవాన్ని కల్పించవలసిన బాధ్యత ఎంతైనా ఉంది. *

(37వ పేజీ తరువాయి)
ప్రవర్తన కారణంగానే భయం. తర్వాత కాలంలో గృహ సౌభాగ్యం.

### వృశ్చికం

(విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

రాహువు వలన వివాదాలు, శనివలన ధనం, లేదా గౌరవ నష్టం, గురువు వలన ధనం, ఆహార ధాన్యాలు, జయం. లేదా సంతానం. శుక్రునివలన శృంగారం. కుజుని వలన నెలమొదటి 12 రోజులలో ఉద్యోగ సంబంధమైన ఆందోళన లేదా శత్రువుల మూలంగా గాని, దొంగల మూలంగా గాని. అనారోగ్యం వలనగాని భయం. తరువాత కాలంలో కుమారుల ద్వారా లేదా అక్రమ మార్గాలద్వారా ధనం. రవివలన నెల మొదటి పక్షంలో ధననష్టం నేత్రబాధ, తరువాత ధనం, గౌరవం. బుధుని వలన 4 వ తేదీ వరకు ధననష్టం, 24 వరకు అవమానం తరువాత కాలంలో తన ప్రవర్తన కారణంగా భయం,

### ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

రాహువు వలన అధార్మిక ప్రవర్తన శనివలన వివాదాలు అనారోగ్యం లేదా అధార్మిక ప్రవర్తన. గురువువలన అనారోగ్యం, ప్రయాణం, ప్రయాస. శుక్రునివలన ధనలాభం, దుబారా. రవివలన నెల మొదటి పక్షంలో ధననష్టంతో పాటు అనారోగ్యం తరువాత కాలంలో నేత్రబాధ ధననష్టం, ఇతరులవలనవంచన కుజునివలన ఉద్యోగసంబంధమైనఆందోళన. శత్రువుల మూలంగా గాని అనారోగ్యకారణంగాగాని, దొంగల మూలంగాగాని ఆందోళన. బుధునివలన అవమానం చెడు సలహాల మూలంగా ధననష్టం.

### మకరం

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ఠ 1.2 పా)

రాహువు వలన ఆందోళన, శనివలన అయిన వారినుండి వేర్పాటు, గురువు వలన ధనం, శృంగారం, శుక్రుని వలన ధనం, మంచి స్నేహితులు, క్రొత్తబట్టలు నెల మొదటి పక్షంలో రవి స్తబ్దుడు, రెండవపక్షంలో ప్రయాణం ఉదరబాధ ధననష్టం, కుజునివలనధనవష్టం, ఆందోళన, బుధునివలన 4 వ తేదివరకు ధనం శృంగారం 4 నుండి 24 వరకు అవమానం అనారోగ్యం, తరువాత కాలంలో వివాదాల మూలంగా చెడు సలహాల మూలంగా గాని కుట్రవలనగాని ధననష్టం.

### కుంభం

(ధనిష్ఠ 3,4 పా, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా)

రాహువువలన వివాదాలు, శని వలన ప్రయాణం. గురువు వలన మనశ్శాంతికి భంగం. శుక్రునివలన వివాదాలు అవమానం, రవివలన నెల మొదటి పక్షంలో జయం గౌరవం ధనం రెండవపక్షంలో దుబారా. కుజుని వలన 12 వ తేదీ వరకు జయం, సుఖం, తరువాత కాలంలో ధననష్టం, ఆందోళనలు బుధునివలన 24 వ తేదీవరకు ధనం, జయం, శృంగారం, వాహన, సంతానప్రాప్తి, ఆ తరువాత కాలంలో అనారోగ్యం, లేదా శత్రువులవలన లేదా అవమాన కారణంగా ఆందోళన.

### మీనం

(పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి.)

రాహువువలన ధనం, శనివలన దృఢారోగ్యం, జయం, గురువు వలన ధనం నూత్నవస్త్రాలు శృంగారం లేదా సంతానం. శుక్రుని వలన ధనం లేదా నూత్న వస్త్రాలు, లేదా శృంగారం, రవి వలన జయం, ధనం, దృఢారోగ్యం, కుజునివలన ధనం, జయం, బుధుని వలన 4 వ తేది వరకు నిరాశ, తరువాత జయం, ధనం, లేదా శృంగారం లేదా వాహనాలు లేదా సంతానప్రాప్తి. *

---

(3వపేజీ తరువాయి) ఇంకొక ప్రక్క వేదవిజ్ఞాన జిజ్ఞాసువులకు తద్వాఙ్మయ సారాన్ని, భావానువాద, పురాణేతిహాస వాఙ్మయాదుల ద్వారా సమకూర్చే ప్రయత్నాలు చేస్తున్నది.

కాని ఈ ప్రయత్నం అనంతం. దేవస్థాన ప్రయత్నాలు మాత్రమే చాలవు. లోగడ ఈ శీర్షికలోనే వివరించినట్లు, బహుముఖ ప్రయత్నాలుకావాలి. గ్రామదేవాలయం, స్థలీయ వేదవిదులు ప్రాతిపదికగా ప్రతి దేవాలయంలోను, వేద పురాణాది పఠనం, అధ్యాపనం, వేద వాఙ్మయ విశేషాలను ముందు ముందు అవగాహన చేసికొనేందుకు వీలుగా ఉచితంగా, వీలైతే ఉదార విరాళయుతంగా సంస్కృత భాషాబోధనం గ్రామస్థాయిలో ప్రారంభం కావాలి. ఇంత జరిగి, తత్ఫలాలు సత్ఫలాలుగా రూపొందిన నాడు మనం అంతో ఇంతో చేసినవాళ్ళమౌతాం. ఈ సార్వజనికమైన ప్రయత్నాలలో ఏ మాత్రం అశ్రద్ధ, అలసత్వం ఏర్పడ్డా, 'వాళ్ళింట్లో దీపం మాదే' అని తృప్తిపడే దుస్థితి ప్రాప్తించినా ఆశ్చర్యంలేదు.

శ్రీ వేంకటేశ్వరుని కరుణాకటాక్షంవల్ల, అంతటి దురవస్థ ఈ దేశానికి పట్టదని, వెనుకటి మాదిరే ఈ దేశం వేద విజ్ఞాన సామ్రాజ్యంగా వెలుగొందు తుందనీ ఆశిస్తూ మకరసంక్రమణ పరశుభాకాంక్షలుగా ఇలా అనుకుందాం.

సహనావవతు, సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వినావధీతమస్తు
మావిద్విషావహై
ఓం। శాంతి శ్శాంతి శ్శాంతిః

---

*Edited and Published on behalf of T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T. T. D. Press by M. Vijayakumar Reddy, Manager T. T. D. Press Tirupati-517501*

# శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానము, తిరుమల

## వివిధ ఆర్జిత ఉత్సవముల ధరల వివరములు.

### దర్శనములు

| | | |
|---|---|---|
| 1. | స్పెషల్ దర్శనము | రు. 25 |
| 2. | తోమాలసేవానంతర దర్శనం | రు 4 |
| 3. | అర్చన సేవానంతర దర్శనం (సహస్ర నామం లేక అష్టోత్తరం) | రు 4 |
| 4. | ఏకాంత సేవానంతర దర్శనం | రు. 4 |
| 5. | పూలంగి సేవానంతర దర్శనము | రు. 4 |
| 6 | అభిషేక సేవానంతర దర్శనము | రు. 4 |

### సేవలు

| | | |
|---|---|---|
| 1. | ఆమంత్రణోత్సవము | రు. 200 |
| 2. | పూలంగిసేవ | రు. 60 |
| 3. | అభిషేకము (పులికాపుసేవ) | రు. 450 |
| 4. | గంబురగిన్నె | రు. 250 |
| 5 | పునుగుగిన్నె | రు. 100 |
| 6. | జాఫ్రాగిన్నె | రు. 100 |
| 7. | కస్తూరిగిన్నె | రు. 100 |
| 8. | సహస్రకలశాభిషేకము | రు. 2500 |
| 9. | తిరుప్పావడ | రు. 5000 |
| 10. | కోవిల్ ఆళ్వారు తిరుమంజనం | రు 1745 |
| 11 | ఐనా మహల్లో డోలోత్సవం | రు. 1000 |

### ఉత్సవములు

| | | |
|---|---|---|
| 1. | వసంతోత్సవము | రు. 2500 |
| 2. | కల్యాణోత్సవము | రు. 1000 |
| 3. | బ్రహ్మోత్సవము | రు. 750 |

### వాహనములు

| | | |
|---|---|---|
| 1. | సర్వభూపాలవాహనములో వజ్రకవచసేవ 72+1 (హారతి) | రు. 73 |
| 2. | బంగారుగరుడ, కల్పవృక్ష, పెద్దశేష, సర్వభూపాల, సూర్యప్రభ ఒక్కొక్కదానికి 62+1 (హారతి) | రు. 63 |
| 3 | వెండిగరుడ, చిన్న శేష, చంద్రప్రభ, ఏనుగు, గుఱ్ఱం, హంస, హనుమంత వాహన సేవ ఒక్కొక్కదానికి 32+1 (హారతి) | రు. 33 |

### అన్నప్రసాదములు (కాలుసోల)

| | | |
|---|---|---|
| 1 | దధ్యోదనము | రు. 40 |
| 2. | పులిహోర | రు. 50 |
| 3. | పొంగలి | రు. 55 |
| 4. | చక్కెరపొంగలి | రు. 65 |
| 5. | సాకరబాత్ | రు. 95 |
| 6. | కేసరిబాత్ | రు. 85 |
| 7. | పాయసము | రు. 85 |
| 8. | సీరా | రు. 155 |

### పదుల ప్రసాదములు

| | | |
|---|---|---|
| 1. | అప్పము | రు. 230 |
| 2. | లడ్డు | రు. 450 |
| 3. | వడ | రు. 250 |
| 4. | పోళీ | రు. 225 |
| 5. | దోసె | రు. 100 |
| 6. | తేనెతోళ | రు. 200 |
| 7. | సుఖియం | రు. 200 |
| 8. | జిలేబి | రు. 450 |

### నిత్యసేవలు

| | | |
|---|---|---|
| 1. | నిత్యకర్పూర హారతి | రు. 21 |
| 2. | నిత్యనవనీత హారతి | రు. 42 |
| 3. | నిత్య అర్చన | రు. 42 |

ష రా.- సహస్ర కలశాభిషేకము ప్రతి బుధవారమునను, తిరుప్పావడ ప్రతి గురువారమునను జరుగును
మిగిలిన వివరములకు ఈక్రింది చిరునామాకు వ్రాయవచ్చును.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,
తిరుమల తిరుపతి దేవస్థానం
తిరుపతి 517501

Regd. No. H/TRP/13

విడిప్రతి 50 పైసలు



## తిరుపతి శ్రీ గోవిందరాజస్వామివారి (తెప్ప) ప్లవోత్సవ క్రమము.

| | | |
|---|---|---|
| 7-2-79 | బుధ | శ్రీ కోదండరామస్వామి వారికి |
| 8-2-79 | గురు | శ్రీ కృష్ణస్వామి వారికి, శ్రీ ఆండాళ్ అమ్మ వారికి |
| 9-2-79 | శుక్ర | శ్రీ గోవిందరాజస్వామి వారికి |
| 10-2-79 | శని | ,, |
| 11-2-79 | ఆది | ,, |

# కామాక్షీదేవికి స్వర్ణసమర్పణం



డా. రమేశన్; కామకోటిపీఠాధిపతులు; శ్రీ ప్రసాద్ దంపతులు.

*

తిరుమల తిరుపతి దేవస్థాన ధర్మకర్తల మండలి, కంచి కామాక్షీదేవి ఆలయ విమాన గోపురం బంగారుపనికి గాను 3 కిలోల బంగారం సమర్పించ నిర్ణయించింది. ఆ ప్రకారం దేవస్థానధర్మకర్తలమండలి అధ్యక్షులు డా. రమేశన్, కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ ఆ బంగారాన్ని కామకోటి పీఠాధిపతులు జగద్గురు శ్రీ శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతీస్వామివారికి 19-1-79న అందజేసి నప్పటి దృశ్యాలు.



డా. రమేశన్, స్వామీజీ, శ్రీ ప్రసాద్

*



కామకోటి పీఠాధిపతులకు అందజేసేముందు, బంగారును మరొక్కసారి తూకం వేస్తున్న దృశ్యం. దేవస్థాన ప్రజాసంబంధాధికారి శ్రీ ఆర్. సూర్యనారాయణమూర్తిని (ఎడమ చివర) స్వామివారిని దర్శించిన పత్రికావిలేఖరులను ఎడమనుండి 4, 5, 6) చూడవచ్చు.

# ముఖచిత్రం

అన్నమాచార్య సాహిత్యానికి సంబంధించినదీ, మల్లిక్ స్వరంతో ఆబాలగోపాలాన్ని ఆనంద పరవశం చేసినదీ. శ్రీ వేంకటేశ్వరభక్త శిఖామణి అన్నమయ్య భావనా ప్రపంచానికి, అన్నమయ భావనా ప్రపంచానికి ఎంతో వ్యత్యాసం ఉంది. మనకు రాళ్ళు రప్పలుగా కన్పడే వాటివిషయంలో అన్నమయ్య భావనే వేరు. ఆతనికి తిరుమలలోని తరులు, విరులు, గిరులు, ఝరులు అన్నీ శ్రీవారి సేవకు తిరుమల రూపంలో నెలకొన్న దేవతా స్వరూపాలే. పర్వతపు ప్రతి వొంపూ ఆపరతత్త్వం పవళించే శేషుని పడగట!



అదివో అల్లదివో హరి వాసము
పదివేల శేషుల పడగల మయము.

అదె వెంకటాచల మఖిలోన్నతము
అదివో బ్రహ్మాదుల కపురూపము
అదివో నిత్యనివాసమఖిలమునులకు
అదె చూడుఁడదె మ్రొక్కుఁడానందమయము.

చెంగట నల్లదివో శేషాచలము
నింగినున్న దేవతల నిజవాసము
ముంగిట నల్లదివో మూల నున్న ధనము
బంగారు శిఖరాల బహుబ్రహ్మమయము.

కైవల్య పదము వెంకటనగమదివో
శ్రీ వేంకటపతికి సిరులైనది
భావింప సకల సంపద రూపమదివో
పావనములకెల్ల పావనమయము —

— (V–23)

ఈ దివ్యభక్తి భావమందార రసాన్ని రూపంగా తీర్చి, స్వామి కైంకర్యం ఈ రూపంగా చేసుకున్నది, ప్రముఖ రేఖాచిత్ర రచయిత, చలనచిత్ర దర్శకులు శ్రీ బాపూ. తీరికలేని తమ సమయాల కలకొద్ది తీరుబడిని సద్వినియోగపరుచుకోగా, అన్నమాచార్య జయంతి సంచికలో ప్రచురితమై కొందరికే అందుబాటైన కొన్ని రేఖా చిత్రాలను అందరికి అందించాలనే - సప్తగిరి ఈ యత్నం. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని 'బాపు' గారికి సప్తగిరి తన శుభాకాంక్షలను అందజేస్తుంది.

తిరుపతి సందర్శించండి!



# తిరుపతి శ్రీ కోదండరామస్వామివారి బ్రహ్మోత్సవ క్రమము

| తేది | వారం | పగలు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
|---|---|---|---|
| 25-3-79 | ఆది | — | సేనాధిపతి ఉత్సవము, అంకురార్పణము |
| 26-3-79 | సోమ | తిరుచ్చిఉత్సవం ధ్వజారోహణము | పెద్ద శేషవాహనము |
| 27-3-79 | మంగళ | చిన్న శేషవాహనం | హంసవాహనము |
| 28-3-79 | బుధ | ముత్యపుపందిరి | సింహవాహనము |
| 29-3-79 | గురు | కల్పవృక్ష వాహనము | సర్వభూపాలవాహనము |
| 30-3-79 | శుక్ర | మోహిని అవతారం | గరుడోత్సవము |
| 31-3-79 | శని | హనుమద్వాహనము | గజవాహనోత్సవము |
| | | సాయంకాలము వసంతోత్సవము | |
| 1-4-79 | ఆది | సూర్యప్రభ వాహనము | చంద్రప్రభ వాహనము |
| 2-4-79 | సోమ | రథోత్సవము | అశ్వ(గుఱ్ఱం)వాహనము |
| 3-4-79 | మంగళ | పల్లకీ ఉత్సవము, తిరుచ్చిఉత్సవము తీర్థవారి అవభృథోత్సవము. | తిరుచ్చి; ధ్వజావరోహణోత్సవము |

ఫిబ్రవరి 79

సంపుటి 9 సంచిక 9

విడిప్రతి 0-50 పైసలు

సం॥ చందా రు. 6-00

గౌరవసంపాదకులు;

శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్

ఐ. ఏ. ఎస్,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2322

ప్రచురణకర్త – సంపాదకుడు:

కొాటపాటి సుబ్బారావు

ఎమ్. ఏ.,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

ముద్రాపకుడు,

ఎమ్. విజయకుమార్ రెడ్డి,

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2340

* సప్తగిరిలో ప్రచురణలకు పారితోషికములేదని గమనింప గోర్తాము. సం॥

## విషయసూచిక



## అన్నమప్రభ

అనుబంధం



* కొన్ని అనివార్య కారణములవలన 'శ్రీనివాస ప్రబంధము' ప్రకటింపబడలేదు.

# సంపాదకీయము

'అనిర్జ్ఞాతాని దైవతాని అవధూయంతే' అన్నాడు భాసమహాకవి. గొప్ప కన్పడకపోతే కొండంత దేవుణ్ణయినా గోరంతగా తీసిపారేస్తుందిట లోకం. అదే మన పరంగా చెప్పుకుని ఒక ఊరి ఊడు మరొక ఊరి పాలేరన్న నానుడి ఏర్పడింది. సర్వవ్యాపి, అనంతజ్యోతి స్వరూపుడు వాచామ గోచరుడైన ఆ స్వామిని గూర్చి తెలియాలంటే ప్రపంచంలో జ్ఞానం – జిజ్ఞాస ఈ రెండు కావాలి. అవి లుప్తమైననాడు నారాయణుడుకూడా నరప్రతిముడౌతాడు. అంతదాకా ఎందుకు, శ్రీనివాసుడు ఎవరో తెలియకనేగదా పద్మావతి చెలికత్తెలు 'ఘన' సన్మానంజరిపినది! బహుశః బాజాభజంత్రీలు వందిమాగధకైవారాలు ఇందుకే ఏర్పడ్డ విశేషాలేమో.

కనుక తెలియదగిన వస్తువెంత గొప్పదైనా, తెలుపగల సాధనం, నిశ్చలబుద్ధితో నిర్మల మనస్సుతో తెలుసుకోగోరే భక్తుడు అవసరం. ఆర్తిగల భక్తులు లేకపోతే, ఆ గొప్పతనాన్ని చెప్పేందుకు భాష సాధనం గాకపోతే ఆ పరమాత్మ కేవలం అంతర్యామిగానే ఉండిపోయేవాడు. ఇది చరిత్ర కంఠిన సత్యం.

ఆదిదేవుని అనంతశక్తిని, స్వరూపాన్ని వేదాలు లేకపోతే మనం తెలుసుకోగలిగే వాళ్ళంగాదు. ఆదిపురుషుని గూర్చిన ఆదివాఙ్మయం గనుకనే అది ఆదిసాహిత్యం, సమీకృత జ్ఞానభండారం అయింది. అలాగే వాల్మీకి లేకపోతే, రాముని దైవీ గుణ సంపత్తి, వ్యాసుడు లేకపోతే, అనంత ప్రపంచ ధర్మం, ప్రాపంచిక రాజకీయ ధర్మసూక్ష్మత, భాగవత రూపంలో శ్రీకృష్ణ దివ్య లీలార్ణవం, ప్రపంచాని కందేవేకావు.

తిరుమల విషయం తీసుకున్నా ఇంతేమరి. ఈనాడు మనకిలా కన్పించే వేంకటేశ్వరస్వామిని, దేవతలు, ఆళ్వారులు వివిధ రూపాలలోచూచినట్లు వర్ణించారుగదా! వారివర్ణనం మనలోభక్తి స్పందనం కల్గిస్తున్నదికదా! కనుక భగవంతునికి, భక్తునికీమధ్య వారధిలాంటిది వాఙ్మయం. దీనినే కవిస్వాభావికమైన ఆత్మవిశ్వాసంతో, సర్వసాహిత్య సామ్రాజ్యప్రతినిధిగా ఇలా అంటాడుఅన్నమయ్య.

నే నొక్కండ లేకుండితే నీ కృపకు పాత్రమేది

పూని నావల్లనే కీర్తి పొందేవు నీవు — ఇది అన్నమయ్య భావనాపటిమకేగాక, ఆత్మ పరమాత్మల శాశ్వతసంయోగస్థితికి అనుసంధానకసూత్రం సాహిత్యమన్న నిత్యసత్యాన్ని కూడా బోధిస్తుంది.

మరి ఆనాటి వేదాలనుండి ఈనాటి అలతి అలతి పదాలలో ఆ విశ్వవిరాట్‌ను వర్ణించే వాఙ్మయ సాగరసారాన్ని ఆర్తులకు జిజ్ఞాసువుల కందించే ప్రయత్నాలే స్థితిలో ఉన్నాయంటే-కదలలేని స్థితిలో ఉన్నాయనే అనాల్సివస్తుంది. ఆ ఆదినారాయణుడే స్వామి పుష్కరిణిగట్టున శ్రీనివాసుడుగావెలసిన ఈ పవిత్ర కేంద్రంలోకూడా, ఎంతో విస్తృత ధార్మికసామ్రాజ్యం రూపొందినా, ధార్మిక వాఙ్మయజ్యోతి మిణుకు మిణుకు మంటూనే ఉండటం జరిగింది. వ్యవస్థలోని మార్పులు వచ్చినప్పుడల్లా వాఙ్మయ ప్రచోదనకు శ్రద్ధచూపటం పెరిగినా, జరగవలసిన వాని ముందు జరిగింది చాల స్వల్పమన్నదే విన్పిస్తూ వచ్చింది.

కాని, కాలక్రమాన బలీయమవుతున్న తపన ఇటీవలి మార్పుతో ఫలరూపం ధరించింది. అందువల్లనే దేవస్థానం శ్రీనివాసదయాధనాన్ని ఈ వాఙ్మయ వారధి బలపడేందుకు వినియోగించ నిశ్చయించింది.

వేదరక్షణ నిధిక్రింద, సంప్రదాయకంగా వేదవిజ్ఞానాన్నిఅంది పుచ్చుకునే విద్యార్థులకు ఉపాధ్యాయులకుపారితోషికాలివ్వటం జరుగుతున్నది. దేవాలయ ప్రావిత్ర్యాన్ని పెంపుచేసేందుకు ఆలయాలలో వేదపారాయణ పథకాన్ని ప్రవేశపెట్టిపండితులను నియమించి, ఆలయందాకా కూడా నడిచే శరీరదార్ఢ్యంలేని పండితులు ఇంటివద్దనే పారాయణం జరిపే పద్ధతిన, పారితోషికా లివ్వబడుతున్నవి. ఇక భక్తిసాహిత్య రంగానికి కిదిస్వర్ణయుగమే. ముద్రణకుగానువచ్చిన గ్రంథాలన్నిటిని దేవస్థానగ్రంథాలుగా ముద్రించటం, బహుకష్ట సాధ్యం గనుక రచనలను పరిశీలించి, ఆయా రచనలను గ్రంథకర్తలు ముద్రించుకునేందుకు వీలుగా ఐదు వేల రూపాయల వరకు ధన సహాయం జరుగుచున్నది.

దేవస్థానం పక్షాన ముద్రితమయ్యే గ్రంథాలకు కర్తలకు నిర్దిష్టమైన ధనం చెల్లించి ముద్రించటం జరుగుతుంది.

ఈ ధార్మిక సాహిత్యాన్ని, దేవస్థాన ఆశయాలను ప్రజల కందించి, దేవస్థానానికి భక్తులకు నడుమ వారధిగా సేవ చేస్తున్న సప్తగిరిలో ప్రచురణలకు పారితోషికా లిచ్చే ఏర్పాటు మళ్ళి చేపట్టటం జరుగుతున్నది.

ఇది దేవస్థానం నుండి వచ్చే ధార్మిక వాఙ్మయ సహాయ ప్రవాహం. దీని సక్రమంగా వినియోగించుకుని దేశంలో దైవీ వాఙ్మయ ఫలవృక్షాలను పెంచి వాటి ఫలాలను ముందు తరాలకు అందించే బాధ్యత భాషా పరిచితులకన్న చేయగల్గిన, చేవగల్గిన పరిజ్ఞానులపైనే ఎక్కువఉంది. ఇది జరగనినాడు సారంగు తమ్మయచెప్పినట్లు 'వజ్రపంజర నిభంబైన సద్భావంబు...కరిగెబోలో నీళ్ళకుం బల్చనై' అన్న అపవాదుకు దేవస్థానం, ఇటు పండితలోకం పాలు గావల్సివస్తుంది. కాని. శ్రీవేంకటేశ్వర కరుణాకటాక్షం వల్ల అంతా సక్రమంగా జరుగుతుందనే ఆశిద్దాం.

ధర్మో రక్షతి రక్షితః అని గదా ఆర్యోక్తి

# శ్రీ వరాహ పురాణం



అనువక్త:

శ్రీ ఏలూరుపాటి
అనంతరామయ్య
అధ్యక్షులు:
శ్రీ కె.వి.కె. సంస్కృత కళాశాల,
గుంటూరు

## ఇష్టదేవతాదిక నమస్కారం

శ్లో॥ కర్ణతాళానిలక్షిప్త
విఘ్న జీమూత సంహతిం।
నతకార్యగతిం వందే
గణాధిపతి మన్వహమ్॥

భా॥ చెవు లనే తాళాలగాలులతో విఘ్నా లనే మేఘాలను చెదరగొట్టి, తనకు నమస్కరించిన వారి పనులకు దిక్కయిన గణాధిపతికి అనుదినమూ ప్రణమిల్లుతున్నాను.

శ్లో॥ సృష్టిస్థితిలయాకార
చక్రభ్రమణకారణం।
నతార్తివారణచణం
నౌమి నారాయణం సదా॥

భా॥ లోకసృష్టిస్థితిలయములనే చక్రాన్ని త్రిప్పుతూ, తనకు మ్రొక్కినవారి బాధలను తొలగించే శ్రీమన్నారాయణుని సదా స్తుతిస్తున్నాను.

శ్లో॥ సమస్తోపనిషత్సార
క్షీరపూర్ణనిజోదరం।
నరం వందే నరవరం
నారాయణసుహృత్వరమ్॥

భా॥ ఉపనిషత్తుల లన్నింటిసారమనే పాలతో నిండిన కుక్షికల నరోత్తముడు, నారాయణుని మిత్రశ్రేష్ఠుడు అయిన నరునికి వందనం,

శ్లో॥ యదప్రాప్య నివర్తన్తే
వచాంసి మనసా సహ।
సత్య లీలాం వర్ణయన్తీ॥
మంబాం వాణీ ముపాస్మహే॥

భా॥ వాక్కులూ మనస్సూకూడా శ్రీమన్నారాయణుని పొందలేక తిరిగి వస్తున్నవి. అట్టివాని లీలలను వర్ణించే సరస్వతీ మాతను ఉపాసిస్తున్నాము.

# హిందూ ధర్మ ప్రతిష్ఠానం, తిరుపతి.

తిరుమల ఆర్ష సంస్కృతి సదస్సు మండపంలో జరిగే

సాంస్కృతిక కార్యక్రమాలు.

---

| | | | |
|---|---|---|---|
| 17-2-79 | భజన | — | శ్రీమతి కందుల కోటీశ్వరమ్మ, హరేరామనామ సంకీర్తన సంఘం. తాడికొండ, గుంటూరుజిల్లా. |
| 18-2-79 | హరికథ | — | శ్రీ మైనంపాటి కేశవరావు భాగవతారు, బుడుగుంట్లపల్లె, రాజంపేటతాలుకా కడపజిల్లా |
| 19-2-79 | వీణ | — | శ్రీ శిష్టు గౌరీపతిశాస్త్రి, శ్రీరామాపురం, కాకినాడ తూ. గోదావరిజిల్లా. |
| 24-2-79 | భజన | — | శ్రీ బి. నరసింహరాజు శ్రీరామభజనమండలి తిరుమల. |
| 25-2-79 | హరికథ | — | శ్రీ చింతా శివరామశాస్త్రి భాగవతార్, వంకాయలవారివీధి, రాజమండ్రి |
| 26-2-79 | వయోలిన్ | — | శ్రీమతి యం. యస్. బాబు ఆకాశవాణి; విజయవాడ |

---

గమనిక: సదస్సు భవనంలో ప్రతిదినం ఉ॥ 10 గం॥ నుండి 11-30 గం॥ వరకు రామాయణ పారాయణం జరుప బడును.

శ్లో॥ వేదాన్విభజ్య, సూత్రాణి,
పురాణాని విరచ్య చ।
ధర్మత్రిపథగాం పృథ్వ్యాం
చాలయంతం మునిం నుమః॥

భా॥ వేదాలను విభజించి, బ్రహ్మసూత్రాలను నిర్మించి, అష్టాదశమహాపురాణాలను వ్రాసి — ఈ మూడురీతుల ధర్మగంగానదిని ప్రవహింపజేస్తున్న వ్యాసులవారిని స్తుతిస్తున్నాము.

శ్లో॥ త్రిమూర్త్యాత్మకత్వేన
కేవలం భానుసన్నిభః।
లిప్యజ్ఞతాంధ్యనాశేన
యస్తం గురుమహం భజే॥

భా॥ త్రిమూర్తి స్వరూపులు కావటం వల్లనే కాక, అజ్ఞానపు చీకటిని నశింపజేసినందునకూడా సూర్యునివంటివారైన గురువులను సేవిస్తున్నాను.

శ్లో॥ మత్తో యద్యపి సంపది
ప్రశిథిలాహంకారవా నాపది
హిత్వా మూర్ధజ సంచయం హి
శరణం గచ్ఛంత ముద్యద్దయః।
పాతి శ్రీగిరిస త్తకాశ్రితవపుః
శ్రీ వేంకటేశః ప్రభుః
శ్రీమానాదివరాహద త్తవసతిః
తం భావయే సర్వదమ్॥

భా॥ సంపదలు వచ్చినపుడు మదించినా, ఆపదలు వచ్చినపుడు ఆ అహంకారం అంతా ఉడిగి, అందుకు గుర్తుగా జుట్టు తీయించుకొని శరణు జొచ్చిన వానిని కాపాడే ప్రభువు శ్రీ వేంకటేశ్వరుడు 'సప్తగిరి'పై ఉన్నవాడు. ఆయన శ్రీమంతుడే కాని ఆదివరాహమూర్తి ఆయనకు ఆవాసభూమి ఈయవలసి వచ్చింది అన్నీ యిచ్చే ఆ శ్రీనివాసుని భావిస్తున్నాను.

(35వ పేజీలో చూడుడు)

# శ్రీ వేదాంతదేశికులు

(గత సంచిక తరువాయి)

ఇట్లు విశిష్టాద్వైత సిద్ధాంతములలో క్లుప్తముగా చెప్పినచో తత్త్వములు మూడు గలవు, ద్రవ్యములు ఆరు గలవు విస్తృతముగా తీసికొనిన తత్త్వముల సంఖ్య ముప్పది యగును. త్రిగుణములు వాని పరిణామములుచేరి ఇరువదినాలుగు, కాలము నిత్యవిభూతి, ధర్మభూతజ్ఞానము జీవాత్మ లక్ష్మీనారాయణ స్వరూపము మొత్తము ముప్పది. తత్త్వత్రయ వాదమందు కాలము, ధర్మభూతజ్ఞానము, నిత్యవిభూతి. వీనియందు ధర్మభూతజ్ఞానము చేతనత్వమునకు గుణభూతమై యున్నది, కాలము, విభూతులు, ఈశ్వర తత్త్వమునకు గుణభూతమై యున్నవి. అందుచేతనే వీనిని పరిగణింపక, మూడు తత్త్వములని వ్యవహరింతురు. ఈ చేతనాచేతన తత్త్వములు ఈశ్వర తత్త్వమునకు గుణభూతములు అను నభిప్రాయముచే ఆది ఒకే తత్త్వమని ఉపదేశ మున్నదని ఆచార్యులవారు చక్కగా సిద్ధాంతమును పరిష్కరించి యున్నారు.

భక్తి:

ఈ సిద్ధాంతము ప్రకారము విషయము తత్త్వము, హితము, పురుషార్థము అని మూడు ప్రకారములు గలదు. తత్త్వ విషయము ముందే చెప్పబడినది. ఇప్పుడు హిత నిరూపణ విషయము హితమనగా కర్తవ్యాంశము. పురుషార్థ మనగా దీని నుండివచ్చు ప్రయోజన హితము. హితము భక్తి ప్రపత్తులను మనుష్య కర్తవ్యము నుండి ఉత్పన్నమగుటచే పరమాత్మాను గ్రహము. భక్తిఅనగా జీవాత్మ పరమాత్మ యాథాత్మ్య జ్ఞాన పూర్వకమై వర్ణాశ్రమ ధర్మమున కనుగుణమై చేయబడు పరమ పురుషుని పాదారవింద ధ్యానము, అర్చన ప్రణామము మొదలైనవి. ఉపనిషత్తులందు దీనిని వేదన, ఉపాసనము బ్రహ్మ విద్య మొదలైన శబ్దములచే వివరింతురు.

భక్తి వాచికము, కాయికము మానసికము అని మూడు విధములు. నామ సంకీర్తనము, మంత్ర జపాది రూపములు వాచికము. అర్చనము, ప్రణామము, ప్రదక్షిణము మొదలైన రూపములు కాయికము. ధ్యానము, ధారణ, సమాధి మొదలైన రూపములు మానసికము. ఇవి మూడును పరస్పరము ఆనుకూల్యముతో ఉండును. శాస్త్రరీతిగా మోక్షమునకు సాధనమై ఉపదేశింపబడిన పరభక్తి అని దీనిని చెప్పదగును. దీనికి హేతువై సాత్త్విక సహవాసము, శాస్త్రాభ్యాసముచే ఉత్పన్నమై పరిపూర్ణ పరమాత్మ విషయకమైన అతిశయ ప్రీతియే భక్తి.

భక్తికి పరభక్తికి గల అంతరమిట్టిది. ఈ పరభక్తియు. భగవంతుని సాక్షాత్కారమునకు ఉత్కటేచ్ఛా రూపమైన అభినివేశమును కలిగించి దీని మూలకముగా పరమాత్మాను గ్రహముచే తాత్కాలికమైన పరిపూర్ణ బ్రహ్మానుభవమును కలుగజేయును. ఇదే పరజ్ఞానము ఎల్లప్పుడు పరమాత్మ సాక్షాత్కారము కలుగుచుండవలెనను తీవ్రమైన అభిలాషను కలుగజేయుచుండును. ఇది పరమభక్తి. ఇట్లు పరమ భక్తియు పరమాత్మని అనుగ్రహము కలుగజేసి సర్వదేశ సర్వకాల సర్వావస్థోచితమైన పరిపూర్ణ పరబ్రహ్మానుభవమును మోక్షప్రాప్తికి పూర్వక్షణమందుండి సాధన యగును.

(సశేషము)

శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి,
అలీఘర్



ఇటీవల ముఖ్యమంత్రి తిరుమలకు వచ్చినప్పుడు ఆయనకు ఆలయంవద్ద ధర్మకర్తలమండలి అధ్యక్షులు డా. రమేశన్, దేవాదాయ కమీషనర్ శ్రీ చంద్రమౌళిరెడ్డి స్వాగతం చెప్తున్న దృశ్యం.

# పురాణములు - వాని విభజనము

పురాణములు మహా పురాణము లనియు రెండు విధములు. సంప్రదాయము ననుసరించి మహా పురాణములు పదునెనిమిది. ఉప పురాణములును పదునెనిమిదియే. దేవీభాగవతము అష్టాదశ మహా పురాణముల నిట్లు పేర్కొన్నవి.

"మద్వయం, భద్వయంచైవ, బ్రత్రయం, వచతుష్టయం,
అ, నా, ప, లిం, గ కూ, స్కా ని
పురాణాని పృథక్ పృథక్"

మద్వయం = మత్స్యమార్కండేయ పురాణములు 2
భద్వయం = భాగవత భవిష్యపురాణములు 2
బ్రత్రయం = బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త పురాణములు 3
వ చతుష్టయం = విష్ణు, వరాహ, వామన, వాయు పురాణములు 4
అ = అగ్ని పురాణము, నా = నారద పురాణము, ప = పద్మ పురాణము, లిం = లింగపురాణము, గ = గరుడ పురాణము, కూ = కూర్మపురాణము స్కా = స్కాందపురాణము).

ఈ పురాణముల యందలి బ్రహ్మవైవర్తమును వైవర్తమని ఔత్తరాహులు కైవర్తమని దాక్షిణాత్యులు వ్యవహరింతురు. అష్టాదశ పురాణములలో శైవపురాణము పేర్కొనబడక వాయుపురాణ ముటంకింపబడినది. కాని, వాయు శైవపురాణములు భిన్నములు గావని మత్స్యపురాణము నందలి యీ శ్లోకము సాక్ష్యమిచ్చుచున్నది.

"యత్ర తద్వాయవేయం స్యాత్ రుద్రమాహాత్మ్య సంయుతమ్।
చతుర్వింశత్సహస్రాణి పురాణం శైవ ముచ్యతే॥"

(రుద్ర మాహాత్మ్యమును వెల్లడించునది వాయువీయము, 24 వేల శ్లోకములు కల శివపురాణమని చెప్పబడు చున్నది.) సుప్రసిద్ధ విమర్శకులకు డా॥ ఎ. డి. పుసార్కర్ గారు వాయు శివ పురాణములు భిన్నములనియు, శివుని కీర్తించు వాయు పురాణమున శివపురాణము నందువలె శివావేశమంతగ కనరాదనియు, ప్రాచీనము వాయవీయము, నవీనము శివపురాణము ననియు వివరించిరి. ఇట్లే అష్టాదశ మహాపురాణములలో స్థానము భాగవత

శ్రీ డి. నాగసిద్దారెడ్డి,
తిరుపతి.

మునకా? దేవీ భాగవతమునకా? యను ప్రశ్న బయలుదేరినది. రెండు శతాబ్దాల క్రిందటనే యీ వివాద ముత్తరదేశమున విజృంభించి దక్షిణ దేశమునకు సైతము ప్రాకినది. కాశీ నివాసియగు గదాకాశీనాథభట్టు దేవీ ఆ భాగవతమే మహాపురాణములలోని దనియు, భాగవతము ఆర్షమేకాదనియు నిరూపించుచు దుర్జనముఖ చపేటిక' యను గ్రంథమును రచించెను. ఇతని వాదమును ఖండించుచు రామాశ్రమి పండితుడు భాగవత మార్షమే యనియు, దేవీభాగవత మనార్షమనియు వివరించి 'దుర్జనపేటికా ఖండనము'- అను నొక గ్రంథమును వెలయించెను. మరియొక పండితుడు రామాశ్రమి పండితుని వాదమును తిరస్కరించుచు 'దుర్జన ముఖ పద్మ పాదుకము'- అను ఖండన గ్రంథమును వెలువరించెను. ఈ రెండు వాదములతో విల్సన్, మెక్డొనల్, పర్గిటర్, కోల్‌బ్రూక్, మేజర్ D. బసు, కొల్హాత్కర్, C. V. వైద్య, B. N. కృష్ణ మూర్తిశర్మ A. N పాయ్ A. D. రామ్ N. శ్రీకంఠశాస్త్రి, గంగానాథఝూ, మల్లాది సూర్య నారాయణశాస్త్రి మున్నగు సుప్రసిద్ధ పాశ్చాత్య ప్రాచ్య పండితులు సైతము భాగస్వాములైరి. వీరి వాదసారాంశ మెట్లున్నను- "బృహద్ధర్మ పురాణాదులు కొన్ని యీ రెంటిని గూడ అష్టాదశ పురాణములలో చేర్చి యుండ వీని మహా పురాణత్వమును మనము చర్చింప పనిలేదు. తక్కిన పురాణమువలె నివియునార్షములే. వృత్రవధాశ్రయమైన భాగవతము వలెనే శుంభ వధాశ్రయమైన దేవీ భాగవతముగూడ చిరకాలమునుండి ప్రశంస కెక్కినదేగాని వేరుగాదు. దీనివలె నదియు ద్వాదశ స్కంధము, అష్టాదశ సహస్ర గ్రంథము. దీనికి శ్రీకారమున్నది. దానికి దేవీ శబ్దము. ఇది భాగవతము. అది మహాభాగవతము ఇది కృష్ణ లీలాశ్రయము. అది పార్వతీ పరమేశ్వర విలాసాశ్రయము. ఈ దృశమైన పోలికలను చూడగా భాగవతమును చూచి దేవీ భాగవత ముదయించినదని తోచుచున్నది." (సంస్కృత వాఙ్మయ చరిత్ర Part II) అను మల్లాది వారి సమన్వయ వాదమెంతయు సమంజసముగ నున్నదని నుడువవచ్చును.

ఉపపురాణములు పదునెనిమిది యని ప్రతీతియేగాని వివిధ పురాణములొసగిన పట్టికలను చూడనవి లెక్కకు మిక్కిలిగ చూపెట్టుచున్నవి. శైవ వైష్ణవ గాణాపత్యాది వివిధ మతములకు ప్రాతినిధ్యము వహించు నీ పురాణములు ప్రస్తుతము 34 కన్పట్టుచున్నవని శ్రీ మల్లాది సూర్య

(33 పేజీలో చూడుడు)

# మహిమ్నస్తవం - దాని మహిమలు

ప్రాచీనకాలములో శివుని కటాక్షము బొందిన భక్తులు ఎందరో కలరు. ఆ పరమేశ్వరుని కటాక్షమపారమైనది.

పరమశివుని భక్తులలో అగ్రగణ్యుడు, శివమహిమ్న స్తవకర్తయైన పుష్పదంతుడు ఆ కోవకు చెందినవాడే. ఇతడు గంధర్వరాజు. తన యుపవన పుష్పములతో, తనివి తీరక, మరియొక రాజు యొక్క ఉద్యానవనములోనికి అదృశ్యరూపమున ప్రవేశించి, కొల్లలుగా పుష్పములను సంగ్రహించి, తెచ్చి యథేచ్ఛముగా శివునారాధించుచుండెను.

వేరొకవైపు ఆ యుద్యానముగల రాజు తన శివార్చనకు పుష్పములు లభించక, ఆపుష్పచోరుని పట్టుకొనుటకై యొనర్చిన యత్నములన్నియూ వ్యర్థములయ్యెను.

చివరకు మంత్రుల యుక్తివలన ఉద్యానవనముచుట్టునూ, శివనిర్మాల్యము వెదజల్లబడెను. పుష్పములపైని భ్రాంతివలన ఎప్పటివలె అదృశ్యుడై ప్రవేశించుచుండ పుష్పదంతునిచే శివనిర్మాల్యము దాటబడినది. కావున యాతని యదృశ్యకరణశక్తి నశించెను. అంతనా యుద్యానపాలకులాతనిని బట్టి రాజాజ్ఞననుసరించి కారాగారమున బంధించిరి. ఎట్టివాడైననూ అపరాధఫలము ననుభవింపక తప్పదని తుదకు గ్రహించి తనచౌర్యమునకు పశ్చాత్తప్తుడై పవిత్రమైన హృదయముతో ఈ శివమహిమ్నస్తోత్రమును గ్రథించి కృతార్థుడయ్యెను.

అమోఘమగు నీ స్తుతికి పరమశివుడు సంతసించి, మెచ్చిప్రత్యక్షమై పుష్పదంతుని అనుగ్రహించి చౌర్యమునుండియూ, కారాగారమునుండియూ విముక్తిని గావించి నిరతిశయమగు శివసాయుజ్య కైవల్యమును ప్రసాదించెను.

శివుని మహిమిందుకలదు కావున శివమహిమ్నస్తోత్రమనియో, మహిమ్నస్తోత్రమనియో దీనికి సరియైన నామకరణము గావలసియుండెను. కాని "మహిమ్నః" స్తోత్రమని విలక్షణముగా వ్యవహరింపబడుచున్నది. కారణమేమియనగా శ్రీపుష్పదంతాచార్యుడు, మహార్షికల్పుడు. కావున తత్కృతస్తోత్రము యొక్క ఆదియందు ప్రయోగింపబడినటులే షష్ఠీవిభక్తిరూపముతో శ్రుతులవలె "మహిమ్న"ము అనియే వ్యవహరింపబడెను.

శ్రీ కాశీక్షేత్రమున జగద్గురు విశ్వారాధ్య సింహాసనపు జంగమవాడిమఠము (బంగాలిటోలా) చౌషష్ఠీ దేవాలయమునకు ఉత్తరమున శ్రీ పుష్పదంతేశ్వరలింగము ప్రతిష్ఠితమైయున్నది.

భారతవర్షపు మధ్యప్రాంతమండలి నీమాడ్ జిల్లాలో ఓంకారేశ్వర జ్యోతిర్లింగ క్షేత్రము కలదు. అచ్చటి మందిరమగు



అమరేశ్వర దేవాలయమున విక్రమశకము 1120 వ సంవత్సరములో (శాలివాహన శకము 985 (క్రీ. శ. 1063) అనగా ఇప్పటికి 876 వత్సరములకు పూర్వము ఈ మహిమ్నస్తవము శిలాశాసనముగా చెక్కబడినది.

కావున వేల వేల సంవత్సరముల నుండియూ నీ స్తుతి వేదమువలె పారాయణము గావింపబడుచున్నది.

స్తుతికావ్యముల పేరెత్తినంతనే మొట్టమొదట గణనకు వచ్చునది మహిమ్నస్తోత్రము. పుష్పదంతుడు అను గంధర్వరాజు రచించినట్లు తెలియవచ్చు నీ శివస్తవము భరతఖండమందంతట చిరకాలము నుండి పఠనప్రచారమందియుండుట యెల్లరకును దెల్లము.

మహాకవి కాళిదాసంతటివాడు మహిమ్నస్తవములోని యీ క్రింది శ్లోకభావమును తన రఘువంశమున కావ్యములో, సంగ్రహించి యనువదించెనన్నచో నీ స్తవముయొక్క ప్రాచీనతగూర్చిగాని ప్రశస్తిని గూర్చిగాని వేఱ వివరింపనక్కరలేదు.

త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి,
ప్రభిన్నే ప్రస్థానే పరమిద మదః పథ్యమితిచ,
రుచీనాం వైచిత్ర్యాదృజు కుటిల నానాపథజుషాం,
నృణామేకో గమ్య స్త్వమసి పయసామర్ణవ ఇవ

బహుధా ప్యాగమైర్భిన్నాః పంథానస్సిద్ధి హేతవః
త్వయ్యేవ నిపతంత్యోఘా జాహ్నవీయా ఇవార్ణవే

(రఘువంశము, 10 సర్గం, శ్లోకము 27)

కావున శివపంచస్తవము లన్నిటిలోను మహిమ్నస్తవమగ్రగణ్యము. మరియూ ప్రాచీనతమమునని నిరాఘాటకముగా జెప్పవచ్చును.

ఈ మహిమ్నస్తవము శంకరాచార్యులకు పూర్వముదయించినదన్న ప్రతీతి యేనాటినుండియో వచ్చుచున్నది. ఆయన నాటికే పుష్పదంతునిస్తుతి పూర్వమనుటయే యిచ్చట గ్రాహ్యము. ఈ క్రిందివానిలో మొదటిది, పుష్పదంతునిది, రెండవది, శంకరాచార్యునిది:—

"త్వం మర్క స్త్వం సోమ స్త్వమసి పవన స్త్వం హుతవహ
స్త్వమాప స్త్వం వ్యోమత్వం ధరణి రాత్మా త్వమితిచ
పరిచ్ఛిన్నా మేవం త్వయి పరిణతా బిభ్రతు గిరం
నవిద్మ స్తత్త్వం వయమిహాతు య త్త్వం న భవసి"

శ్రీ లక్కరాజు ప్రఫుల్లచంద్ర
కదిరి

"భూరంభాం స్యనిలోఽనలోఽమ్బర
మహోర్నాధో హిమాంశుః
పుమానిత్యాభాతి చరాచరాత్మక
మిదం యస్యైవ మూర్త్యష్టకమ్
నాన్యత్కించ న విద్యతే విమృశతాం
యస్మాత్పరస్మాద్విభో,
స్తస్మై శ్రీ గురుమూర్తయే నమ
ఇదం శ్రీదక్షిణామూర్తయే"

ఇందు పుష్పదంతునిశ్లోకము "ఇంద్రం మిత్ర" మిత్యాది ఋఙ్మంత్రము ననుస రించినదని మధుసూదనసరస్వతియన్నాడు.

ఇట్లే శివానందలహరిలోని కొన్నిశ్లోక ములను పుష్పదంతుని పద్యములననుక రించుచున్నవి.

గంభీరార్థకమయ్యు పరతత్వమును సుఖ బోధ్యమును గావించునిది శ్రావ్యమును మనోహరమునగు శిఖరిణీఛందోబద్ధమై యున్నది.

సంస్కృతమభ్యసించు విద్యార్థికిందలి శ్లోకమొకటేని నోటికిరాకుండనుండదనుట కంటే దీని వ్యాప్తిని ప్రశస్తిని వర్ణింప నక్కరలేదు. ప్రత్యక్షముగానో, పరోక్షము గానో సకలశాస్త్రప్రస్థానములకును పరమే శ్వరునియందే తాత్పర్యమనుచూ బోధించు నీక్రింది శ్లోకమును పఠించవలెను.

త్రయీసాంఖ్యం యోగః పశుపతి
మతం వైష్ణవమితి,
ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్య
మితిచ
రుచీనాం వైచిత్ర్యాదృజు కుటిల
నానాపథజుషాం
నృణామేకోగమ్యస్త్వమసి పయసా
మర్ణవ ఇవ

కోటినక్షత్రాలైన నొకచంద్రుని సాటి యగునా. శాశ్వతకీర్తి కిట్టి కృతియొకటి చాలదా!

ఇప్పటికినీ పంచస్తవములలో మహిమ కలదైన ఈమహిమ్నమేవిశేషముగా ప్రచా రమున నున్నది. ఇన్నిమహిమలుగల ఈ మహిమ్నస్తవమును పఠించు భక్తులఇంట శివకటాక్షప్రాప్తి తప్పకుండ లభిస్తుంది. *

నప్తగిరి

# హిందూ ధర్మ ప్రతిష్ఠానం, తిరుపతి.

## అన్నమాచార్య కళామందిరంలో

### కార్యక్రమ వివరాలు.

---

| | | | |
|---|---|---|---|
| 15-2-79 | ఉపన్యాసం | — | శ్రీ ముష్టిగురుమూర్తి; సిద్ధాంతం, పశ్చిమగోదావరిజిల్లా. |
| 16-2-79 | భజన | — | శ్రీమతి కందుల కోటీశ్వరమ్మ, హరేరామనామ సంకీర్తన సంఘం. తాడికొండ, గుంటూరుజిల్లా. |
| 18-2-79 | వీణ | — | శ్రీ శిష్టుగౌరీపతిశాస్త్రి, శ్రీరామాపురం, కాకినాడ తా. గోదావరిజిల్లా. |
| 19-2-79 | హరికథ | — | శ్రీ మైనంపాటి కేశవరావు భాగవతారు, బుడుగుంట్లపల్లె, రాజంపేటతాలుకా కడపజిల్లా |
| 22-2-79 | ఉపన్యాసం | — | శ్రీ సి. హెచ్. బుచ్చిరామయ్య, నండూరు. గుంటూరుజిల్లా |
| 23-2-79 | భజన | — | శ్రీ రాధాకృష్ణ, శ్రీ మారుతిసేవామండలి, తిరుపతి |
| 25-2-79 | సంగీతం | — | శ్రీ యన్. కె. కృష్ణమూర్తి, తిరుపతి. |
| 26-2-79 | హరికథ | — | శ్రీ చింతా శివరామశాస్త్రి భాగవతార్, వంకాయలవారివీధి, రాజమండ్రి |

### అన్నమాచార్యకీర్తనల కచ్చేరి

| | |
|---|---|
| 17-2-79 | శ్రీ యస్. ఆర్. జానకిరామన్, గాత్ర సంగీతశాఖాధ్యక్షులు, శ్రీ వేంకటేశ్వర సంగీత నృత్యకళాశాల |
| 24-2-79 | శ్రీమతి శ్యామల, సంగీతవిభాగ అధికారిణి, పద్మావతీ మహిళాకళాశాల, తిరుపతి |

గమనిక: ప్రతిదినం సాయంకాలం ౫ గం॥ నుండి ౬ గం॥ వరకు రామాయణ పారాయణం జరుప బడును.

శ్రీ కోదండరామస్వామి ఆలయంలో సదస్సు మండపానికిపోయే దారిలో ఉన్న దిగుడుబావిమీది బొమ్మలుగల స్తంభాలను పునరుద్ధరించేందుకుగాను రు. 2000/- మంజూరు చేయటమైనది.

ఒరిస్సా రాష్ట్రం కోరాపుట్ జిల్లా చిత్రకొండలోని బాలాజీ వేంకటరమణ స్వామి ఆలయానికి, పద్మావతీ వేంకటేశ్వరస్వామి వార్ల విగ్రహాలను ఉచితంగా ఇచ్చేందుకు అంగీకరించటమైనది.

ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం లక్నోలోని సనాతన ధర్మసభవారి శ్రీ వేంకటేశ్వరాలయానికి 3 అడుగుల ఎత్తుగల శ్రీ వేంకటేశ్వరస్వామి విగ్రహాన్ని ఇచ్చేందుకు అంగీకరించటమైనది.

కాంచీ పురంలోని శ్రీ కామాక్షి అమ్మవారి ఆలయ విమానం బంగారు పనికిగాను 3 కిలోల బంగారాన్ని, అనవాయితీగా మార్చకుండా ఉండే పక్షంలో, విరాళంగా ఇచ్చేందుకు నిర్ణయించటమైనది.

గోవా రాష్ట్రంలోని, వెర్నాలోని శ్రీ మహాలసనారాయణి దేవాలయ పునరుద్ధార సమితివారికి ఆలయ పునరుద్ధరణకుగాను రు. 25,000/- మంజూరుచేయటమైనది.

తిరుపతి లోని యోగ పరిశోధనా కేంద్రాన్ని పద్మావతీ మహిళా కళాశాలకు చెందిన ప్రస్తుత స్థలంలో కొనసాగించేందుకు అంగీకరించటమైనది.

విశాఖజిల్లా చింతపల్లి తాలూకా రాఘువేంద్ర నగర్ లోని శ్రీ వేంకటేశ్వరాలయానికి కావల్సిన విగ్రహాలను విరాళంగా ఇచ్చేందుకు అంగీకరించటమైనది.

విశాఖ జిల్లాలో ప్రభుత్వ సహాయోగంతో నిర్మింపబడే కళాకేంద్రానికి నిర్వాహక సంఘంలో దేవస్థాన ధర్మకర్తల మండలిపక్షాన సర్వశ్రీ సి. హెచ్. వెంకటరత్నం, జి. వెంకన్న జి. చంద్రశేఖరం నాయుడులను నియమించటమైనది.

కడప: ఖమ్మంలో నిర్మాణం కాబోయే కళాకేంద్రాలకు దేవస్థానం పక్షాన క్రింది వారిని నిర్వాహక సభ్యులుగా నియమించటమైనది.

కడప. సర్వశ్రీ వై. మహానందరెడ్డి, పి. ఆర్. మాధవరావ్; జి. చంద్రశేఖరం నాయుడు, ఖమ్మం; సర్వశ్రీ వి. యస్. గౌడ్, జి. చంద్రశేఖరం నాయుడు, శ్రీమతి టి. శాంతాబాయ్.

రంలను ఏర్పాటు చేసేందుకు నిర్ణయించటమైనది.

దేవస్థానంలో తాత్కాలిక ప్రాతిపదికపైన ఏర్పడి ఏళ్ళుటా పొడిగింప బడే ఉద్యోగాలన్నిటిని శాశ్వత ప్రాతిపదికపై ఖాయం చేస్తూ నిర్ణయించటమైనది.

శ్రీ ఆర్. వాసుదేవనాయుడును తిరుపతిలో ఉపకార్య నిర్వహణాధికారి (జనరల్) గానూ, శ్రీ యస్. మునుస్వామి నాయుడును తిరుమలలో ఉప కార్యనిర్వహణాధికారి గానూ 20-11-78 నుండి నియమించటమైనది.

తిరుమలలోని శ్రీ వేంకటేశ్వర వేద పాఠశాలలోని గ్రేడ్ II సంస్కృత పండి

# ధర్మకర్తల మండలి నిర్ణయాలు

11—12—78, 18—1—79 తేదీలలో జరిగిన సమావేశాలు.

తిరుమలలో 18—10—78 న, యాత్రికులు పోగొట్టుకోగా తనకు దొరికిన బంగారు గొలుసును నిజాయతీతో, అధికారులకు అప్పగించిన, దేవస్థాన ప్రసార విభాగపు సహాయకుడు (హెల్పర్) శ్రీ యస్. పద్మనాభరెడ్డికి ప్రోత్సాహ పారితోషికముగా రు. 50/- ఈయ నిర్ణయించటమైనది.

ఆర్జిత సేవలు జరిపిన గృహస్థులగదులు లేదా కాటేజీలకు ప్రసాదాలను తీసుకొని పోయి ఇచ్చేందుకు గాను పరిచారకుల హోదా, వేతనంలో 17 మంది ప్రసాదం పంపిణీదారుల పదవులు కల్పించటమైనది.

తిరుమల శ్రీవారి ఆలయప్రాంతంలో 21-11-78 నుండి శాంతి భద్రతల రక్షణకు గాను 1 ప్లెటూన్ సాయుధ పోలీసుబలగం ఏర్పాటును ఆమోదిస్తూ, దేవస్థాన దేవాలయాన్నిటిలోను; 'ఎలక్ట్రిక్ ఐ', అలా

తుల ఉద్యోగాలను 320-14-460-15-580 వేతనంపై గ్రేడ్ I పండితులుగా 1979-80 విద్యా సంవత్సరంనుండి మార్చనిర్ణయించటమైనది.

శ్రీ వేంకటేశ్వర సంగీత నృత్య కళాశాలలో శ్రీ కె. వి. జగన్నాథంను 'హరికథ', అధ్యాపకులుగా తిరిగి నియమించటమైనది.

తిరుమల తిరుపతి దేవస్థానం ద్వారా వేదపారాయణ (సంభావన) పథకాన్ని నడిపేందుకు, దేవస్థాన నిధులనుండి రు. 5 లక్షలు మంజూరునుఆమోదిస్తూ ప్రభుత్వం చేసిన సూచన ప్రకారం ఆ సొమ్మును ఆ పథకం పేరిట ప్రత్యేకంగా బ్యాంకులో వేయుటకు నిర్ణయించటమైనది.

మద్రాసులో 98. పీటర్స్ రోడ్డు (మద్రాసు 14) లో 27 గ్రౌండ్ల విస్తీర్ణ

## శ్రీ పద్మావతీ ఆలయం

## తిరుచానూరు

*

విశేష ప్రబోధ కార్యక్రమాలు

సాయంకాలం 6-30 గం॥ నుండి

16-2-79 అన్నమాచార్య కీర్తనలగానం కుమారి ఆర్. జి. శోభారాజు తిరుపతి.

18-2-79 భక్తిగానం కుమారి ఆర్. జి. శోభారాజు

23-2-79 అన్నమాచార్య కీర్తనలగానం కుమారి మైథిలి, తిరుపతి.

25-2-79 హరికథ కోట ధనలక్ష్మి భాగవతి. తిరుపతి

ఆలయ ప్రాంగణంలో ప్రతి సాయంత్రం 4 గం॥ నుండి పురాణ కాలక్షేపం జరుపబడుతుంది.

★

ఇతర ప్రదేశాలలో ప్రత్యేక కార్యక్రమాలు.

చిన్మయామిషన్ కార్యక్రమాలు

15-2-79 అన్నమాచార్యుల శిక్షణ విద్యార్థుల కుమారికలు: పార్వతి, ఉమ, మైథిలి

18-2-79 కుమారి ఆర్. జి శోభారాజు

ఇతర దేవాలయాలలో: కాళహస్తీశ్వర స్వామి దేవస్థానం శ్రీ కాళహస్తి.

25-2-79 కుమారి ఆర్. జి. శోభారాజు, జి. బాలకృష్ణ ప్రసాద్ (సదస్సు కళాకారులు)

*

ములో రు.10లక్షలవిలువగల శ్రీ వాకాడు వీరరాఘవరెడ్డి స్థలాన్ని దేవస్థానపు ఆస్తిగా దానాన్ని ఆమోదిస్తూ, ఆ ప్రాంగణంలో దేవాలయం, ప్రార్థనా మందిరం, కల్యాణమండపం సమాచార కేంద్రం ఏర్పాటు చేసే విషయం పరిశీలించ వలసిందిగా కార్యనిర్వహణాధికారిని కోరుతూ తీర్మానించటమైనది.

తిరుమల తిరుపతి దేవస్థానం నిర్మించిన 'శ్రీ వేంకటేశ్వర వైభవం' పై ప్రజాభిమానం దృష్ట్యా మరల వారం రోజుల ప్రదర్శనకు గాను ఖర్గపూర్ లోని లక్ష్మీ ఎంటర్ ప్రైజెస్ వారి కిచ్చేందుకు అంగీకరించటమైనది

దేవస్థాన సిబ్బందికి వలెనే కల్యాణకట్ట పనివారికి కూడా ఉన్ని దుప్పట్లు ఇచ్చేందుకు అంగీకరించటమైనది.

తిరుమలలోని వసంత మండపాన్ని వివాహాది కార్యక్రమాలకు ఇకముందు అనుమతించరాదని తీర్మానిస్తూ దాని మరమ్మత్తులు చేయించి, సుందరంగా తీర్చ వలసిందిగా కార్య నిర్వాహణాధికారిని కోరటమైనది.

కల్యాణకట్ట లోని వివిధ తరగతుల ఉద్యోగుల వేతనాలను 1-1-79 నుండి ఈ క్రింది విధంగా హెచ్చిస్తూ కమీషనర్ ఆమోదమును కోరటమైనది.

| ఉద్యోగం | నెలసరిఇప్పుడు జీతం | క్రొత్తజీతం |
|---|---|---|
| 1) మంగలి | రు. 330 | రు. 365 |
| 2) షరాఫ్ | రు. 250 | రు 275 |
| 3) అటెండర్లు | రు. 245 | రు. 270 |
| 4) గైడ్లు | రు. 220 | రు. 240 |
| 5) పీక్కుకూలీలు | రు. 205 | రు. 225 |
| 6) పాకీపనివారు | రు. 200 | రు. 220 |

దేవస్థానంలో 27-12-74 న, అంతకు ముందునుండి రోజు కూలీపై (ఎన్. యం. ఆర్) పనిచేస్తున్న వారందరిని, తదితర వర్క్‌చార్జి సిబ్బందిని ఖాయపు ఉద్యోగాలలోకి తీసుకునేందుకు నిర్ణయించటమైనది.

పశ్చిమ గోదావరి జిల్లాలోని పెద నింద్రకొలను, నిడమానూరు, గునపర్తి జగన్నాథపురం, పడమట విప్పర్రు, మంద లపర్రు, కుంచపల్లి, బంగం గూడెం, పెద తాడేపల్లి గ్రామాల హరిజన వాడలలో రామమందిర నిర్మాణాలకుగాను ఒక్కొక్కదానికి 10,000/- మంజూరు చేయటమైనది.

న్యూఢిల్లీలోని శ్రీ వేంకటేశ్వర కళాశాల పాలకమండలిలో సర్వశ్రీ కె. పురుషోత్తమ నాయుడు, డా॥ సి. అన్నారావుల స్థానంలో సభ్యులుగా కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, శ్రీ యం. ఆంకినీడుల నియమిస్తూ, సర్వశ్రీ సి. హెచ్. వెంకటరత్నం, వై. మహానందరెడ్డిలను కొనసాగించ నిశ్చయించటమైనది

సర్వశ్రీ నేదునూరి కృష్ణమూర్తి, లాల్‌గుడి యస్. జయరామన్‌లను దేవస్థాన అస్థాన గాత్ర, వాయులీన విద్వాంసులుగా నియమించటమైనది.

18—1—79 తేది తీర్మానాలు

(29 వ పేజీలో)

---

### పురాణ కాలక్షేపాలు.

తిరుపతిలోని శ్రీ గోవిందరాజస్వామి వారి ఆలయ శ్రీ కోదండరామస్వామివారి ఆలయాల ప్రాంగణాలలో సాయంత్రం 4 గం॥ నుండి 6 గం॥ వరకు పురాణ కాలక్షేపాలు జరుగుతవి.

# శివరాత్రి మాహాత్మ్యం

మహా పర్వదినంగాఁ బరిగణింపబడు చున్న శివరాత్రి, ఒక వ్రతమునకు సంబంధించిన పండుగయని చెప్పవచ్చును.

'ప్రజఘుజస్యతః, భజుణ భేదే ఉణాది పుణ్యాసాధనే ఉపవాసాది నియమ భేదేచ' అనగా, పుణ్యాసాధనమునకై యుపవాసాది నియమములచేఁ జేయు కార్యమునకు వ్రతమని యర్థము. వ్రతములనేక విధములుగా నున్నవి.

వ్రతములవలన కలుగు లాభములను గూర్చి ఆదిత్య పురాణములో—

శ్లో॥ వ్రతోపవాసాన్ ఖలు యో విధత్తే దారిద్ర్య
పాశం స భినత్తి చాశు
వ్రతోపవాసేషు రతస్య పుంసః నైవా
పద శ్శాంతి ముశంతి తజ్ఞాః'

అనగా, వ్రతములు, ఉపవాసములు చేయువాడు తనదారిద్ర్యమును బోగొట్టుకొనుచున్నాడు. అంతేగాక, వానికెట్టి యాపదలను కలుగవు.

దేవలుడు తనస్మృతి గ్రంథములో కూడ—

శ్లో॥ వ్రతోపవాస వియమైః శరీరోత్తాపనై
స్తథా,
వర్ణాస్సర్వేపి ముచ్యంతే పాతకేభ్యో న
సంశయః'

—అని చెప్పియున్నాడు. అనగా, వ్రతోపవాస నియమములచేత మనుష్యుడు తన పాపములనుండి విముక్తి చెందుచున్నాడు.

ప్రతిసంవత్సరము మాఘకృష్ణ చతుర్దశీ దివసమున మహాశివరాత్రి పండుగ చేయబడును. ఆనాడు భక్తులందరు పగలంతయు నుపవాసముండి, రాత్రి యంతయు మేల్కొని యుందురు. దీనికే జాగరమందురు.

'తెలిసికాని, తెలియకకాని, శివరాత్రి వ్రతమాచరించు వాడు మోక్షమును బొందుననియు, ఎన్ని పాపములు చేసిన వాడైన న్నావ్రతమునుజేయు మనుజుడు యమలోకమునుండి తప్పించుకొని, శివలోకమును జెందుననియు పరమేశ్వరుడు పార్వతీదేవికి తెలిపినట్లు లింగ పురాణమునందుఁ గలదు. ఇందుకు నిదర్శనములుగాఁ బెక్కు కథలు స్కాంద, లింగ పురాణములందు కనబడుచున్నవి. అభిప్రాయ భేదములున్నప్పటికిని, వాని



సిద్ధాంత మొక్కటియే యని పండితుల యభిప్రాయము.

శివరాత్రి మాహాత్మ్యము నుగ్గడించు నొక యితిహాసము నిచ్చట నుదాహరింతును.

పూర్వము హేమాంగదుడను రాజు రత్నపురమును పాలించుచుండెను. అతని యొద్ద యజ్ఞదత్తుడను నతడు మంత్రిగా నుండెను. యజ్ఞదత్తునకు సంతానములేదు. అనేక పుణ్యకార్యముల ఫలితముగా, చిర కాలమున కాతని కొక కుమారుడు కలిగెను యజ్ఞదత్తుడాతనికి సుకుమారుడని పేరిడెను. సుకుమారుడు పెరిగి పెద్దవాడగు కొలది, దుర్వ్యసనములకు మిక్కిలి సన్నిహితుడగుచుండెను. జూదము, త్రాగుడు, వ్యభిచారము మొదలగు దుర్గుణము లన్నియు నాతనికలవడినవి.

'మొక్కై వంగనిది మ్రానై వంగునా'

అన్నట్లు, చిన్నతనము నుండియు దుర్వ్యసనముల కలవడిన సుకుమారుని యెవ్వరునేమియుఁ జేయజాలకుండిరి. 'మూడేండ్లలేని సద్బుద్ధి ముప్పదేండ్ల లేద'ను నానుడి సుకుమారుని విషయమున స్పష్టమయ్యెను. తల్లిదండ్రులు దండించినపుడు మాత్ర మికనుండి అట్టి పనుల జోలికి పోనని సుకుమారుడు పలుకుచుండెడివాడు. కాని తన పద్ధతుల నేమాత్రమ తడు విడువలేకపోయెను.



శ్రీ జింకా రంగయ్య,
యూనివర్సిటీ స్కూల్, తిరుపతి





వేటకుకాడై కులస్త్రీల నెందరినో సుకుమారుడు చెఱచ నలతాటుపడెను, అందువలన రాజాతనిని దేశమునుండి బహిష్కరించెను. అతడొక చండాలాంగ నతో వెడలిపోయెను. ఆ చండాలాంగన యిద్దరు కుమార్తెలను కని చనిపోయెను.

వయస్సు ముదిరినను సుకుమారుడు తన దుర్గుణములను విడువలేకపోయెను. కడుపున బుట్టిన కన్యలతోనే కాని పను లను చేసెను. ఆ యూరివారుకూడ వారిని వెళ్ళగొట్టిరి. ఊరివెలుపుల నున్న ఒక కుటీరములో వారు తలదాచుకొనిరి.

మాఘమాసములో ఒకనాడు తన కూతుల యలంకరణమునకై పూలఁ దెచ్చుటకు సుకుమారుడడవికి వెళ్ళెను. ఆనాడు శివరాత్రి యగుటచే, ఒక శివా లయమున భక్తులు శివునకుఁ జేయు చుండిన పూజలను సుకుమారుడలవోకగా విలోకించి, యాపిమ్మట తన దారిం బోయెను. కొంతకాలమున కాతడు వ్యాధి పీడితుడై మరణించెను.

మరణించిన సుకుమారుని గొనిపోవ శివకింకరులును, యమకింకరులునువచ్చిరి. అప్పుడు శివకింకరులు "శివరాత్రినాడు శివునకుఁ గావించిన పూజాది కార్య ములను విలోకించిన పుణ్యప్రభావమున సకల పాప విముక్తుడైన సుకుమారుడు శివసాయుజ్యము నందుట కర్హుడ'ని యమ కింకరులకుఁ దెలిపి, యాతనిని దమ వెంటఁ గొనిపోయిరి.

ఇట్లు, తెలియకయే శివరాత్రినాడు శివునకుఁ గావించిన పూజాది కార్యము లను విలోకించినవారికే శివసాయుజ్యము లభించుచుండగా, భక్తితో శివుని భజించు వారికి ముక్తికలుగు ననుటలో సందేహము లేదుగదా!

ఆంధ్రదేశమున శివరాత్రి పండుగకు మిక్కిలి ప్రాముఖ్యము గలదు. శైవులీ పండుగను మిక్కిలి శ్రద్ధగా జరుపు కొందురు.

*

# క్షేత్రయ్య -

# మధురభక్తి

క్షేత్రయ్య' సంగీత, సాహిత్యాలకు సమానప్రతిపత్తినిచ్చి, అభినయంజోడించి అనన్యసామాన్యంగా పదరచన చేసిన ఉత్తమ వాగ్గేయకారుడు. స్థూలదృష్టికి క్షేత్రయ్యపదాలు లౌకిక శృంగారపూరితాలుగా కనిపించడంలో ఆశ్చర్యంలేదు. కానీ సూక్ష్మంగా పరిశీలిస్తే ఇవి భగవత్పరాలనీ ఆత్మనివేదనైక దృక్పథాలనీ క్షేత్రయ్యది మధురభక్తి అని మధురమధురంగా మనకు అవగతమవుతుంది. మధురరసపరిప్లావితుడైన క్షేత్రయ్య రసరాట్టయిన, శృంగార రసాధినేత అయిన గోపాలదేవునియందు ఆత్మనివేదనం గావించిన విధం అతని పదాల్లో స్పష్టం అవుతుంది.



క్షేత్రయ్యపదాల్లోని మధురభక్తిని ఆస్వాదించేముందు, భక్తి, మధురభక్తి అంటే ఏమిటో, లాక్షణికులు వాటికి ఇచ్చిన నిర్వచనాలేమిటో తెలుసుకోవడం అవసరం. 'భక్తి' అన్నది 'భజ్' ధాతువు నుండి పుట్టింది. అంటే భజించుట; భగవద్భజనమన్నమాట. సహజంగా చిత్తం పరమేశ్వరుని పాదారవిందముల కడకు పోవడాన్నే భక్తి అంటాడు శంకరాచార్యులు[1]. నారదభక్తిసూత్రాలలో "సాత స్మిన్ పర(మ) ప్రేమరూపా" (సూ-2) [ఆ భక్తి పరమేశ్వరునియెడల పరమ ప్రేమరూపంగా ఉంది.] అంటే "ఈశ్వరుని యెడలగల యుత్తమమగు ప్రేమ యేదియో అదియే భక్తియనబడును"[2]. ఇట్లే శాండిల్య భక్తిసూత్రాలలోను "రసా పరానురక్తిరీశ్వరే (సూ-2) - అంటే భగవంతునియెడ గల పరమప్రీతి" (గాఢానురాగం) భక్తి అని చెప్పబడింది. ప్రీతి పరమపూజ్యమైనదైతే భక్తి-భగవంతుని యెడగల ఆ పరమపూజ్యభావమే భక్తి. ఇది తొమ్మిదివిధాలు[3]. అందులో మధుర భక్తి పరమశ్రేష్ఠమైనది. ఈ భక్తిని రస మని నిరూపించినవారు రూపగోస్వామి. భరతుని రససిద్ధాంతమును ఆధారముగ జేసికొని రాధామాధవుల నాలంబనముగాజేసి రాధకు కృష్ణునిపై గల శృంగారరూప భక్తి, రసస్వరూపమైనదని యా రసజనక ప్రక్రియ నంతటిని సాంగో పాంగముగ సంపూర్ణముగ నిరూపించుచు రూపగోస్వామివ్రాసిన గ్రన్థమే "ఉజ్జ్వల నీలమణి" నవరసములకును మూలము మాత్రము భక్తిరసమే యని రూపగోస్వామి యభిప్రాయము[4]. మధురరతియే భక్తిరస మని రూపగోస్వామి సిద్ధాంతం. తరువాత మధుసూదనసరస్వతి తన 'భగవద్భక్తి రసాయనం'లో సముచితంగా భక్తికి రసత్వాన్ని


డాక్టర్ యస్. గంగప్ప ఎం.ఎ.పి.హెచ్.డి.
కర్నూలు


స్థాపించెను. ఈ ఇద్దరి సిద్ధాంతం ప్రకారం "ఈ భక్తిరసమున కాలంబనవిభావము భగవంతుడు, తచ్చరిత్రలు విభావములు; భగవదాకారచిత్తవృత్తియే స్థాయిభావము. అదియే భగవద్రతి. అనుభావములు తత్కాలమునఁబుట్టిన నేత్రాదివికారములు. వ్యభిచారులు నిర్వేదశంకాహర్షాదులు. ఇది పరమానందస్వరూపమగు భక్తిరసముగా బరిణమించును[5]". మధురభక్తిని వివరించిన పింగళి లక్ష్మీకాంతంగారి మాట లిచట పేర్కొనటం ఉచితం. "ఈప్రేమ మిళితభక్తియే మధురాతిమధురముగా పరిణమించును. ఆ భక్తుడు తాను ప్రేయసిగా

---

1. "అంకోలం నిజబీజ సంతతిరయస్కాంతో పలం సూచికా
సాధ్వీనైజవిభుం లతాక్షితిరుహం సింధుస్సరిద్వల్లభమ్।
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవింద ద్వయం
చేతోవృత్తిరుపేత్య తిష్ఠతి సదాసా భక్తిరిత్యుచ్యతే॥"
(శివానందలహరీ. శ్లో 61)

2. మట్టిగోయిన రామసుబ్బయ్య-బ్రహ్మజిజ్ఞాస పు. 219

3. "శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనమ్।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనమ్॥"
(భాగవతము-సప్తమస్కంధము)

4. సాహిత్యవాఙ్మయము—పు. 453, 457

5. కావ్యాలంకార సంగ్రహము—పు. 301

భగవంతుడు తనకౌగిలిలో చేరినట్లు మానసిక సంయోగసుఖము ననుభవించు ఆ క్షణములో ఆతనికి సాయుజ్యసుఖము కలుగును. జీవన్ముక్తుడగును. అట్టి భక్తుడు చేసెడి చేష్టలు, పలికెడుమాటలు లోకమునకు విపరీత కృత్యములుగా తోచినను భగవంతునికిమాత్రం మురిపెంపుచెయ్యులే యగును .... సారాంశమేమనగా ఒక్కొక్క భక్తుని మనస్తత్వమునుబట్టి భక్తితో ప్రేమ కలిసియుండునని, అది ప్రణయంగా మారి శృంగారముగా పర్యవసించుననియు. రత్యాలింగతమైన ఈ భక్తినే వైష్ణవసాంప్రదాయములో 'మధురభక్తి' యందురు.[6] భారతీయేతరులు సైతం దేవతావిషయకమైన శృంగారం భక్తిఅని చెప్పారు. "సంవేదనమగు రసచర్వణశుద్ధము, అక్లిష్టము స్ఫుటమునగు విశ్వప్రేమయని, ఆ విశ్వప్రేమయే వైశద్యమునంది తీవ్రతతో నభివ్యక్తమై మానవుల విషయమున శృంగారమని, దేవతావిషయమున భక్తియని పిలువబడుచున్నదని" కోహెన్ పల్కుచున్నాడు.[7]

ఇలాంటి మధురభక్తిరస సముద్రంలో ఓలలాడినవాడు క్షేత్రయ్య. ఈ పదాల్లో మధురభక్తి పరకోటినందినది. భగవద్భక్తిని శృంగారముగా మార్చుకొన్నవారికి ఉపాస్యవస్తువు పురుషుడుగాను తాము స్త్రీలుగాను అనుభవమునకు వచ్చునందురు.

> 'సఏవ వాసుదేవోఽసౌ సాక్షాత్పురుషఉచ్యతే
> స్త్రీప్రాయమిత రతస్సర్వం జగద్బ్రహ్మ
> పురస్సరమ్।
> 'స్వామి త్వాత్మత్వశేషిత్వ పుంస్త్వాద్యాః
> స్వామినోగుణాః
> స్వేభ్యోదానత్వ దేహత్వ శేషత్వ స్త్రీత్వ
> దాయినః ॥

– అనుట వారి మతము. కనుక క్షేత్రయ్యకును గోపాలునియందలి మధురభక్తిచే తనయందు స్త్రీత్వానుసంధానముకలిగి దాని ఫలముగా అన్యాదృశ్యమగు స్త్రీస్వభావానుభవము కలిగియుండును. కాని క్షేత్రయ్యకును అట్టి (ఆకాలపు) భౌతికమగు స్త్రీ రూపలావణ్యములకంటె వేయిరెట్లుఎక్కువ అనుభవమునకు, భావనకు వచ్చినది ఆధ్యాత్మికమగు స్త్రీస్వభావము[8]" – అని చెప్పిన రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి మాట లక్షరాల సత్యం. ఇంతెందుకు? ఈ క్షేత్రయ్యకు పూర్వులు, సమకాలికులునైన ఇతర పదకర్తలుసైతం ఈ మధుర భక్తిమార్గానుయాయులే గదా! క్షేత్రయ్య నాటికీ సంప్రదాయం స్థిరపడింది. భాగవతంలో గోపికలభక్తి మధురం. జయదేవుడు గీతగోవిందంలో మధురభక్తినేవర్ణించారు. చైతన్యుడు, మీరాబాయి, చండీదాసు, విద్యాపతి మొదలైన వాగ్గేయకారులలోను ఈ మధుర భక్తి వెల్లివిరిసింది. "కృష్ణ సమ్బన్ధమైన భక్తిమార్గములందెల్ల నగ్రగణ్యము భాగవత భక్తిసంప్రదాయము. భాగవతమందలి మధుర రసాలంబనములైన గోపికాకృష్ణులాలంబనముగా వెలసినది వల్లభాచార్యుని పుష్టమార్గము. వల్లభసాంప్రదాయమందలి గోపికాకృష్ణుల దృష్టిలో నిడుకొని గోపికలకు శ్రీకృష్ణుని యెడగల మధురరసోజ్జ్వల పరిపుష్టమైన భక్తియందలి పరిస్థితిలోని తుట్టతుదిస్థాయియైన మహాభావము నాధారముగా జేసికొని రాధాకృష్ణపరముగా వెలసినది చైతన్యుని మధురభక్తి సంప్రదాయము.[9]" విద్యాపతి తనపదావళిలో ఆత్మపరమాత్మల పరంగా రాధాకృష్ణులశృంగారం వర్ణించాడు "He (Vidyapaty's) fame, however, rests on his sonnets in the Maithili Dialeet of Bihar In these he uses the strong Love which Radha bore to Krishna as an allegory to describe the relation of the soul to God"[10]

ఇంక మీరాబాయిది

> "పురుషుడెవ్వండిచట?
> పురుష డాతడొకండె పురుషోత్తముండు
> పురుషుడాత డొకండె
> పొలతులము మనమంత,
> దివ్యపురుషుని ప్రేమ
> తేజః ప్రదీప్తులము"[11]

– అనే మంజుల మధురభక్తి పారవశ్యం. ఏమైనా భక్తికి ప్రేమప్రధానమని పూర్వోక్తమైనట్లు నారద, శాండిల్యభక్తిసూత్రాల్లో స్పష్టం "Bhakti is defined by Sandilya in his "Bhakti Mimamsa" as extreme attachment or devotion to God The word attachment or devotion (అనురక్తి) is here used with the implication of selfless attachment to the Highest . . . Narada has defined Bhakti as supreme or exclusive love directed towards God."[12]

తెలుగులో పదకవితాపితామహుడని పేరుగాంచిన తాళ్ళపాక అన్నమయ్య మధురభక్తి ఈ కోవకు చెందినదే "భగవంతుడు వేంకటేశ్వరస్వామి నాయకుడు. భక్తుడు నాయిక. వేంకటేశ్వరుడు తానొక్కడు పురుషుడు. మానవకోటి స్త్రీ. ఈ స్త్రీ పురుషుల అనంత శృంగారలీలయే విశ్వము. ఇట్టి అలౌకిక మధురభావము అన్నమయ్య శృంగార సంకీర్తనములకు బీజమయినది. ఏతద్భావస్ఫూర్తితో అన్నమయ్య శ్రీవేంకటేశ్వరలీలలను అనంతముగా శృంగార సంకీర్తనలలో కీర్తించినారు. అతడు రచించిన యధ్యాత్మ సంకీర్తనల సంఖ్యకన్నా శృంగారసంకీర్తనల సంఖ్య యధికముగా నున్నది. ఇందుచే

(25వ పేజీలో చూడుడు)

---

6. సాహిత్యశిల్పసమీక్ష—పు. 164, 165
7. పోతుకూచి సుబ్రహ్మణ్యశర్మ—భారతి అక్టోబరు, 1954
8. ఆంధ్రపత్రిక (సంవత్సరాది సంచిక) 1942-43. పు. 12
9. సాహిత్యవాల్లభ్యము—పు. 452
10. విద్యాపతి పదావలీ-ఏక్-అధ్యయన్—పు. 6
11. అడవి బాపిరాజు-నారాయణరావు (నవల) పు. 229
12. N. Subrahmanya Sastry–Analysis of Bhakti—Journal of Sri Venkateswara Oriental Institute-Tirupati July-Dec. 1950



# అన్నమప్రభ

★

★

తాళ్ళపాక వంశం వారి సాహిత్యాన్ని వెలికిదీసి, ఆస్తిక ప్రపంచాని కందిం చేందుకు తిరుమల తిరుపతి దేవస్థానం చేస్తున్న ప్రయత్నాలు అందరికీ తెలిసినవే. సప్తగిరి పత్రికలో కూడా పలుశీర్షికలలో తాళ్ళపాక సాహిత్యాన్నిగూర్చి వ్యాసాలు ప్రచురిత మౌతున్నై. ఈ వ్యాసాలన్నీ ఒకేచోట చోటుచేసుకుంటే సముచితంగా ఉంటుందన్న అభిప్రాయంతో అన్నమ ప్రభ అనే అనుబంధం క్రింద ఈ వ్యాసాలు ప్రచురిస్తున్నాము.

॥ సం ॥

## విషయాలు

★



★

అన్నమాచార్యులు పాడిన పాటల్లో నృసింహస్వామికి సంబంధించినవి చాలా వున్నవి. ఇతడు తన జీవిత కాలంలో ఎన్నో నారసింహ క్షేత్రాలను దర్శించినాడు. ఆ అధిష్ఠాన దైవతాలమీద లెక్క లేనన్ని పాటలు రచించినాడు. ఈతడు అహోబల నృసింహుని గురించి పాడిన సంకీర్తనలే ఎక్కువ. ఇతడు తన గార్హస్థ్య జీవితాన్ని ఎక్కువగా ఆ క్షేత్రంలోనే గడిపినాడు. సుందరమైన నల్లమలలు అన్నముని రసహృదయమును దోచుకొన్నవి. భవనాశినీ నదీ తరంగాలు వాని మానస వీథిలో చిందులువేసినవి. భక్తుడైన ప్రహ్లాదుని మన్నించి, దుష్టుడైన కశిపుని శిక్షించి చెంచులక్ష్మితో చెట్టు చెట్టూ, పుట్ట పుట్టా తిరిగిన నరసింహుని, ప్రసన్నమైన వీరనాడు. నరసింహుడు ఏ ఊరిలో వున్నా ఏ గుడిలో నిలిచినా తిరుమలకు రాక తప్పదు; 'శ్రీ వేంకట' ముద్ర వేసుకోక తప్పదు. తిరుమల మందిరంలో యోగ నృసింహునికి ప్రత్యేకంగ ఒకగుడి వుంది. *

ఈ పాటలో సుగ్రీవ నారసింహుడు ప్రసక్తమైనాడు. సుగ్రీవునిచేత పూజలందినవాడో! ఏమో! దీనిని స్పష్టంగ తెలిపే చారిత్రక పౌరాణికమైన ఆధారాలు ఏవీ నా దృష్టి కింతవరకు అందలేదు. లేక 'సుగ్రీవ - అందమైన మెడగల' అని అర్థమో! చెప్పలేము. ఈపాటలో బొమ్మ ఇది.

భక్తసులభుడు నారసింహుడు కొలువు సప్తర్షులు పూజిస్తున్నారు. వాయుదేవుడు వీవన వీస్తున్నాడు. నారదుడు. తుంబురుడు మొదలైన దేవగాయకులు హరికథలు గానం చేస్తున్నారు. పరమయోగులు భావముద్రలలో వున్నారు.

సుగ్రీవ నారసింహుడు సాటిలేని అలంకారాలతో, కోటి మన్మథాకారుడై, సిరులకు నిలయమైన వేంకటగిరి శిఖరాలలో నిలిచి వున్నాడు.

ఇది అన్నముని భావనామయ విశ్వం.

పల్లవి

సుగ్రీవ నారసింహ [1] సులభుఁడ వందరికి
నగ్రేసరుఁడ నీ వవధారు [2] దేవా

చరణాలు

1. సనకాదు లొకవంక జయవెట్టుచున్నారు
ఎనసి సురలు చేతులెత్తి మొక్కేరు
మునులిరు మేలా [3] నుండి మునుకొని
నుతించేరు
అనుపమాలంకార అవధారు దేవా.

2. గంగాది నదులెల్లఁ గడిగీ నీ పాదములు
పొంగుచు సప్తరుషులు పూజించేరు
సంగతి వాయుదేవుండు సరినాలవట్ట మిడీ [4]
సంగజ కోటిరూప యవధారుదేవా

3. పరగ నారదాదులు పాడేరు నీ చరితలు
పరమ యోగీంద్రులు భావించేరు
సిరులు మించిన యట్టి శ్రీ వేంకటాద్రిమీఁద
నరుడుగ [5] నున్నాఁడవు అవధారు దేవా.

(అధ్యా రేకు. 380 XI—1—174)

# అన్నమాచార్య సారస్వత కళారాధనము

శ్రీ కామిశెట్టి శ్రీనివాసులుశెట్టి, తిరుపతి

శృంగారమూర్తిని భావించి భావించి ఆ మధుర భావనలను ఈ సంకీర్తనాచార్యుడు సంకీర్తన రంగభూమికలలో ఆవిష్కరించినాడు. నృసింహుని స్వహస్తాలనుండి సన్యాస్యాశ్రమాన్ని స్వయంగ స్వీకరించిన ఆదివణ్ శఠకోపయతుల వద్ద అన్నమయ్య వైష్ణవ దీక్షనువలంబించి వేదాంతవిద్య నభ్యసించి తీర్చినాడు. హరిభక్తుడు అన్నముడు పాట పాడు తున్నాడు. సనకసనందనాదులు జయ జయధ్వనులు చేస్తున్నారు. దేవతలు చేతులెత్తి మొక్కు తున్నారు. ఇరువైపులా నిలబడి మునులు నుతిస్తున్నారు. గంగ సింధు యమున కావేరి గోదావరి మొదలైన నదులు స్వామిపాదాలుకడుగుతున్నవి. ఉప్పొంగిన హృదయాలతో

వివరణ : 1. అందమైన మెడగలిగిన లేదా సుగ్రీవుని చేత పూజలందిన నరసింహుడు.

2. 'అవధరించు' ధాతువు ప్రార్థనార్థకరూపం మధ్యమ పురుష ఏకవచనంలో 'అవధారు' అయినది. ఆలకించుము. వినుము అనే అర్థాల్లో వాడుక.

3. ఇరుమేలానుండి : రెండు వైపులా నిలిచి. ఇరుమైల, ఇరుమైలన్ అనీ రూపాలు (చూడు-బ్రౌణ్యం)

4. ఆలవట్టము : పెద్దవిసనకర్ర A banner or large fan like a sun or like a fig leaf, borne in procession సూర్యపాను It is like a large fire screen (చూడు-బ్రౌణ్యము)వాయుదేవుడు పట్టింది సాధ్యమైనంత పెద్దదే కావలె.

5. అరుదుగ : అపురూపంగ, అమోఘంగ – అనే అర్థాలలో

* తిరుమల మందిరంలోని యోగ నృసింహుని గురించి కొన్ని వివరాలు

నృసింహస్వామి మందిరము వేంకటేశ్వరస్వామి వారి యాలయ ప్రాంగణమున ఈశాన్య దిశయందు విమాన ప్రదక్షిణ పథము లోతట్టునగలదు. తిరుప్పళ్ళియెళుచ్చి (ధనుర్మాస) సందర్భమున ముప్పది దినములు వరుసగా నిత్యమొక తిరుప్పావైకం, సమర్పితమగుచుండి నట్లును విశేషదివసములందు అతిరసప్పదులు నివేదితములగుచుండినట్లును శాసన సాక్ష్యములనుబట్టి తెలియుచున్నది. పంగుణి అమావాస్యా, వసంత పూర్ణిమా తిథులందు ఆ స్వామికి అభిషేకములు జరుగునట్లు కందాడై రామానుజయ్యంగారు వసతులు గల్పించియుండిరి. తాళ్ళపాకవారీ నృసింహస్వామిని గీర్తించిరి. .... తాళ్ళపాక కవుల పదకవితలు (ద్వితీయభాగము పు. 281) డా॥ వేటూరి ఆనంద మూర్తి 1976. వీరికి విషయసేకరణలో ఆధారమైనది. T. T. D. Epigraphical Report. P. 56 S Subrahmanya sastry. 1930.

# అన్నమ స్వరలహరి

నిర్వహణ : కుమారి శోభారాజు, ఆర్. జి.
సదస్ ఆర్టిస్ట్, టి. టి. డి.

## "సుగ్రీవ నారసింహ ........."

[ఈ పాటకు రాగిరేకులో రాగం 'తోండి' అని గుర్తింపబడింది. 'తోండి', 'తోడి' అని రెండు రూపాలూ ఈ రేకుల్లో కనిపిస్తున్నాయి, రేకులో పేర్కొన్న రాగంలోనే ఈ పాటకు స్వరాన్ని కల్పించినవారు సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు శ్రీ ఎస్. ఆర్. జానకిరామన్‌గారు. వీరు శ్రీ వేంకటేశ్వర సంగీత నృత్య కళాశాలలో మ్యూజికాలజీ శాఖాధ్యక్షులుగ పనిచేస్తున్నారు. ఈ స్వర రచనను అన్నమస్వరలహరిలో ప్రకటించడానికి అనుమతించిన శ్రీ జానకిరామన్ గారికి మాకృతజ్ఞతలు.

తోడిరాగం గురించి శ్రీ జానకిరామన్‌గారు ఇట్లా అంటారు— తోడి చాలా ప్రాచీనమైనరాగం. ఇది షడ్జగ్రామంయొక్క రిషభమూర్ఛన. సంగీతచరిత్రలో మధ్యయుగంనుండి ఈ 'తోడిరాగం' పేరు ప్రస్తావింపబడుతున్నది. అన్నమాచార్యుల కీర్తనల్లో ఈ రాగం అరుదుగ అగపడుతుంది. ఈ రాగం ఔత్తర రాగంగా కూడ పరిగణింపబడడంకద్దు. ఇది అంత సమర్థనీయంకాదు. ఈ కర్ణాటక తోడిరాగాన్ని పోలిన హిందూస్థానీ రాగంకూడ లేకపోలేదు. మొత్తంమీద ఊహకందని సూక్ష్మసౌందర్యాలు, సౌకుమార్యాలు ఉన్న ఒక పెద్దరాగం ఇది. దీనిలో నిక్షిప్తమైన అందాలను ఔజ్జ్వల్యంతో ఆవిష్కరించిన కీర్తి సంగీతత్రిమూర్తులదే.]

8వ మేళము

ఆరో: స రి గ మ ప ద ని స
అవ: స ని ద ప మ గ రి స

రాగము: తోడి — ఆది తాళం (ద్వికళ చౌకము)

—: పల్లవి :—

; , ప ద  ని ప దా పా  ద ప ప మ  గా  గ రి రీ |
సు .  గ్రీ . వ న  ర . . .  సిం  హ . . |

సా, ని గ రి సా | ని స రి గ  రి స ని ధ  నీ సా ||
–  సు ల భు డ | వం . . .  ద . . .  రి కి ||

; , స రి  గా మా  దా, ని ద దా మ  ద ని సా |
అ .  గ్రే స  రు . . డ . .  నీ . వు |

; ద ని  సా  రి నీ ద ప మ | గా ద ప ప మ  గా  గ రి రి స ||
అ .  వ  'ధా, రు . . | దే . . . .  వ  . . . ||
స రి గ మ ప మ
, . . . . .  (సుగ్రీవ)

చరణము

(అనుపల్లవి రీతిలో ధాతు అమర్చబడినది.)

; ని ద పా మా  ప గ మా  ద ప దా |
స న కా దు  లో . క  వం . క |

; ప ద ని  ద ని ద | ద ని  రి స ని ద  ద ని సా ||
జ య .  వె ట్టు . | చు .  . . . . న్నా . రు ||

; దనిసా , రి సాసా సారిగ రిసని ।
ఎనయ . సురలు చే . . , . . ।

ని నీనిరి సనిదా దమ । దానీ సరిసరి నిసా , ॥
తు లె . . . . . త్తి . । మ్రొ . క్కి . . . రు . . ॥

; దదగా గారీ రీమగ గరిరీ రీసా ।
మునులి రు , మే . , ల . . నుండి ।

; , నిగరిసా । నిరి సనిదా నీసా ॥
మునుకొని । ను . తిం . , చేరు

; దనిసరిగారీ సా నిసరిగ రిసనిద దని సరిగా ।
అ . ను . . వ మా లం . . , . . . . కా . ర , . ।

; గరీ రినీ నిదా దమా । గా గమదని సనిరిస నిదపమ ॥
అ . వ . ధా . . . । రు దే . . . , . . . . . . ॥

గరిసరిగమ
వ . . . . . (సుగ్రీవ)

## ముద్రచరణము

; మమ మామామా దదమగరిసరిగ మా ।
వర గా రి దా . . . . . దు . లు !

; గమా నిదా దపాపమా । గాపా , గా , రిసా ॥
పా . డే . రు . . . । నీ చ . రి . త లు ॥

; సస రిగగస సరిరిని నిసరిగ రిసనిధ సీపా ।
పర మ . . . యో . . . గీం . . . . . . . ద్రులు ।

; సా , రి , గా , మా , । పా దపపమ పదపద పా ॥
భా . . విం . . . । చే , . . . . . . . రు ॥

సిరులు మించినయట్టి శ్రీ వేంకటాద్రిమీద
యరుదుగ నున్నాడవు అవధారు దేవ ॥ సుగ్రీవ ॥

ఇందు మొదటిపంక్తిని, తొలిచరణముయొక్క మొదటిపంక్తిలాగను, రెండవపంక్తిని, తొలిచరణముయొక్క చివర పంక్తిలాగను పాడుకొనవలెను. ఈ కీర్తనలోని రెండవ చరణమును కూడ ఈ పద్ధతిలోనే పాడుకొన వలెను.)

3. గంగాదినదులెల్ల గడిగీ నీ పాదములు
పొంగుచు సప్తరుషులు పూజించేరు
సంగతి వాయుదేవుండు సరినాలవట్టమిడీ
అంగజకోటిరూప యవధారు దేవ

## శ్రీ అన్నమాచార్య సంకీర్తనామృతము

శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి

అవ;— తనకు కలలో ప్రత్యక్షమైన శ్రీ వేంకటేశ్వరుని స్వరూపమును వర్ణించుచున్నాడు —

53

భూపాలం

ఇప్పు డిటు కలగంటి - నెల్లలోకములకు
నప్పఁడగు తిరువేంక - టాద్రీశుఁ గంటి.
॥ పల్లవి ॥

1. అతిశయంబైన శే - షాద్రి శిఖరము గంటి
ప్రతిలేని గోపుర - ప్రభలు గంటి,
శతకోటి సూర్యతే - జములు వెలుఁగఁగఁ
గంటి,
చతురాస్యుఁ బొడగంటి-చయ్యన మేల్కాంటి,
॥ ఇప్పు ॥

2. కనకరత్న కవాట - కాంతు లిరుగడఁగంటి
ఘనమైవ దీప సం - ఘములు గంటి,
అనుపమ మణీమయ-మ్మగు కిరీటముగంటి
కనకాంబరము గంటి - గ్రక్కన మేల్కాంటి
॥ ఇప్పు ॥

3. అరుదైన శంఖ చ - క్రాదు లిరుగడఁగంటి
సరిలేని యభయహ - స్తము గంటిని
తిరువేంకటాచలా - ధిపుని జూడఁగఁగంటి
హరిఁగంటి గురుఁగంటి - నంతట
మేల్కాంటి * ॥ ఇప్పు ॥
(5–38)

ఇప్పుడు ఈ విధముగా నేనొక కల గంటిని. ఆ కలలో సమస్త లోకములకు తండ్రియైన శ్రీ వేంకటాచల ప్రభువును జూచితిని.

మహామహిమతో గూడిన శేష శైలముయొక్క శిఖరమును చూచితిని. సాటిలేని అచటి గోపురకాంతులు చూచితిని. నూరుకోట్ల సూర్యుల ప్రకాశము లొక్కుమ్మడి ప్రకాశించుచుండగా జూచితిని. చతుర్ముఖ బ్రహ్మను చూచితిని. వెంటనే నిద్రనుండి మేల్కాంటిని.

ఇరుప్రక్కల రత్నములు దాపిన బంగారు తలుపుల కాంతులు చూచితిని. గొప్పవైన అనేక దీపములు చూచితిని. సాటిలేని మణులతో నిర్మింపబడిన దేవుని కిరీటమును చూచితిని. ఆ దేవుడు దాల్చిన కాంచన వస్త్రమును చూచితిస. ఆ క్షణముననే మేల్కాంటిని.

ఆ దేవున కిరువైపుల అరుదైన శంఖ చక్రాదులను చూచితిని. తులలేని అభయ హస్తమును చూచితిని. శ్రీ వేంకటాచలాధీశ్వరుని జూచు భాగ్యమునకు నోచితిని. శ్రీహరిని గంటిని. ఆచార్యుని గను గొంటిని. వెనువెంటనే మేల్కాంటిని.

విశే:- అన్నమయ్యకు పదునారవ యేట స్వామి ప్రత్యక్షమయ్యెనని "తాళ్ళపాక అన్నమాచార్యులు అవతరించిన పదారు యేండ్లకు తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతేను" అను తొలి రాగి రేకు మీది వ్రాతనుబట్టి తెలియుచున్నది. అది మొదలు ఆయన భగవంతునిపై అంకితముగా సంకీర్తనములు పాడినట్లు గూడ ఆ రేకుమీదనే వ్రాయబడి యున్నది. తనకు స్వామి బాల్యమున దర్శన మిచ్చుటనే ప్రకృత సంకీర్తనములో ఆయనచెప్పుకొన్నాడని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు అన్నమాచార్య చరిత్ర పీఠికలో వ్రాసిరి.

శ్రీ వేంకటేశ్వర విగ్రహము చెంత మనకిపుడు చతుర్ముఖబ్రహ్మ కానరాడు. ఆ విగ్రహమునకు అభయముద్రా ముద్రితమైన హస్తము గూడ లేదు, ఐనను ఇది అన్నమయ్యకు కలలో దోచిన రూపు కనుక ఇట్టి విశేషము లాయనకు కనిపించుట వింతగాదు.

హరితో గూడ ఆయనకు కనిపించిన గురుడెవ్వడో మనకు తెలియదు. "తనకాచార్యుడై ముక్తి ననుభవించుచున్న శఠకోపయతి" యని శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు వివరించిరి. (తాళ్ళపాక పాటలు - II P. 29)

* * *

అవ:- శ్రుతి స్మృత్యాదులలో వర్ణింపబడిన పరమాత్ముడే శ్రీ వేంకటేశ్వరుడని చెప్పుచున్నాడు —

54

శ్రీరాగం

నిత్యాత్ముఁడై యుండి-నిత్యుఁడై వెలుఁగొందు
సత్యాత్ముఁడై యుండి - సత్యమై తానుండు,
ప్రత్యక్షమైయుండి-బ్రహ్మమైయుండు సం-
స్తుత్యుఁడీ తిరువేంక - టాద్రి విభుఁడు
॥ పల్లవి ॥

1. ఏ మూర్తి లోకంబు - లెల్ల నేలెడు నాతఁ
డే మూర్తి బ్రహ్మదు - లెల్ల వెదకెడు నాతఁ
డే మూర్తి నిజమోక్ష - మియ్యఁజాలెడునాతఁ
డేమూర్తి లోకైక - హితుఁడు;

(ప) అప్పఁడు = తండ్రి.

(1) ప్రతిలేని = సాటిలేని; చతురాస్యున్ = నాల్గు ముఖముల బ్రహ్మను.

* ఈ పాటలో "మేలుకంటి, మణీమయమగు" అను రేకులోని పాఠములు శాళవునడకకై పై రీతిగా శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారిచే సవరింప బడినవి. (చూడు - తా. పా. II. P. 28)

ఏ మూర్తి నిజమూర్తి - యేమూర్తియునం
గాఁడు
యే మూర్తి త్రైమూర్త[1] - లేకమైన యాతఁ,
డే మూర్తి సర్వాత్ముఁ-డేమూర్తి పరమాత్ముఁ
డామూర్తి తిరువేంక-టాద్రివిభుఁడు ॥నిత్యా॥

2. ఏ దేవు దేహమున - నిన్నియును జన్మించె
నే దేవు దేహమున-నిన్నియు నణంగెమరి,
యే దేవు విగ్రహం - బీ సకల మింతయును
యే దేవు నేత్రంబు - లిన చంద్రులు;
ఏ దేవుఁ డీ జీవు - లిన్నింటిలో నుండు
నే దేవు చైతన్య - మిన్నిటికి నాధార,
మే దేవుఁ డవ్యక్తుఁ - డే దేవుఁ డద్వంద్వుఁ
డా దేవుఁడీ వేంక - టాద్రి విభుఁడు ॥నిత్యా॥[2]

3. ఏ వేల్పు పాదయుగ - మిలయు నాకాశంబు
యే వేల్పు పాద కే - శాంతం బనంతంబు,
ఏ వేల్పు నిశ్వాస - మీ మహా మారుతము
యే వేల్పు నిజదాసు - లీ పుణ్యులు;
ఏ వేల్పు సర్వేశుఁ - డే వేల్పు పరమేశుఁ
డే వేల్పు భువనైక - హిత మనోభావకుఁడు[3]
ఏ వేల్పు కడు సూక్ష్మ - మే వేల్పు కడు
ఘనము
ఆ వేల్పు తిరువేంక - టాద్రి విభుఁడు
॥ నిత్యా ॥ [11-3-8]

శ్రీ వేంకటేశ్వరుడు నిత్యస్వరూపుడై యుండుట వలననే 'నిత్యుడు' అనబడి ప్రకాశించుచున్నాడు. సత్య స్వరూపుడగుట వలననే తాను 'సత్యుడు' అనబడుచున్నాడు. లోకములో ఎల్లవారికి ప్రత్యక్షమైయుండి పరబ్రహ్మముగా నున్నాడు గావుననే భక్తులచే స్తుతింప దగియున్నాడు.

ఏ దివ్యమూర్తి లోకములనెల్ల పాలించుచున్నాడో, ఎవనిని బ్రహ్మాది దేవత



లందరు అన్వేషింతురో, ఎవడు ప్రపన్నులకు తనదైన (నిక్కమైన) మోక్షము నొసంగ జాలియున్నాడో, ఎవడు లోకమునకు ముఖ్య హితము గూర్చువాడో, ఎవడు ఏ యాకారమును తన యాకారముగా గలిగియుండుట లేదో, (నిరాకారుడో). ఎవడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులన బడు త్రిమూర్తులు ఏకమైన మూర్తిగా నున్నాడో, ఎవడు సర్వాత్ముడో, ఎవడు పరమాత్ముడో, ఆ దివ్య మూర్తియే ఈ శ్రీ వేంకటగిరినాథుడు.

ఏ దేవుని శరీరమున ఈ సమస్త లోకములు పుట్టినవో, ఎవని శరీరమున ఇవన్నియు లయమగుచున్నవో, ఈ చరాచరమైన సృష్టియంతయు నెవ్వని శరీరమో, సూర్య చంద్రు లెవని నేత్రములో, ఎవడు ఈ సర్వజీవులలో అంతరాత్ముడై యున్నాడో, ఎవని చైతన్య మీచేతనములకెల్ల ఆధారమో, ఎవడు ప్రకాశము గానివాడో, ఎవడు అద్వితీయుడో (పుణ్యపాపాది ద్వంద్వములు లేనివాడో), ఆ దేవుడే ఈ వేంకటాచలనాథుడు.

భూమి, ఆకసము ఏ వేల్పు పాదయుగ్మమో, ఎవని పాదముల తుది, కేశముల తుదియు అంతము లేనివో, ఈ మహావాయు వెవ్వని నిట్టూర్పో, పరమ భాగవతులైన ఈ పుణ్యాత్ము లెవ్వనికి నిక్కమైన దాసులో, ఎవడు సర్వేశ్వరుడో, ఎవడు పరమేశ్వరుడో, ఎవడు ప్రపంచమునకు ముఖ్య హితమునే మనస్సున భావించువాడో, ఎవడు మిక్కిలి సూక్ష్మమైనవాడో. ఎవడు మిక్కిలి స్థూలమైనవాడో, ఆ దేవుడే శ్రీ వేంకటేశ్వరుడు.

వి:- చరాచరమైన ఈ విశాలవిశ్వము యొక్క సృష్టి స్థితి లయములకు హేతువైన పరబ్రహ్మమును శ్రుతులు, స్మృతులు పురాణములు మున్నగునవి అనేక విధముల వర్ణించుచున్నవి. ఆ పద్ధతిలో ఆ పరతత్త్వమును వర్ణించుచు నిత్య సత్య స్వరూపుడైన ఆ దేవుడే భక్తానుగ్రహకాంక్షతో శ్రీ వేంకటేశ్వరుడుగా రూపొందియున్నాడని సంకీర్తనాచార్యుడీ సంకీర్తనములో వర్ణించినాడు.

'నిత్యో నిత్యానాం'
(శ్వేతాశ్వతరం 6–13)

అని శ్రుతిమాత పరమాత్ముని నిత్యములలో నెల్ల నిత్యునిగావర్ణించినది. 'సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ' (తైత్తి-ఆనం) అని సత్య స్వరూపుగానిగూడ పేర్కొన్నది. మరియు కృష్ణుడు సత్యమున ప్రతిష్ఠితుడు, సత్యమతనిలో ప్రతిష్ఠితమై యున్నది. సదసత్తులు అతడే, కావున సజ్జను లతనిని సత్యుడు అని భావింతురని భారతము చెప్పుచున్నది.

సత్యే ప్రతిష్ఠితః కృష్ణః
సత్యమస్మిన్ ప్రతిష్ఠితమ్।
సత్తా సత్తేచ గోవింద
స్తస్మాత్సత్యః సతాం మతః॥
(భార-ఉద్యో-69-13)

అట్టి పరబ్రహ్మము సామాన్య నేత్రములకు గోచరము గాని దైనను వేంకటాద్రిపై అర్చామూర్తి రూపమున ప్రత్య

1. త్రైమూర్తులు = బ్రహ్మ విష్ణు మహేశ్వరులు.
2. విగ్రహంబు=శరీరము; ఇనచంద్రులు=సూర్య చంద్రులు; అవ్యక్తుఁడు = ప్రకాశము కానివాడు; అద్వంద్వుఁడు=సాటిలేనివాడు, ద్వంద్వములేని వాడు.
3. భువనైక హిత మనో భావకుఁడు = లోకమునకు ముఖ్య హితమునే మనస్సున భావించువాడు.

తుమై స్తుతింపదగియున్నదని పల్లవిలోని తాత్పర్యము.

"స ఏవ కాలే భువనస్య గోప్తా విశ్వాధిపః" (శ్వేతాశ్వతరం-4-15) అను శ్రుతి వచనము చెప్పిన లోకముల రక్షించు లోకపాలకు డతడే. "త్రీన్ లోకాన్ పాలయామ్యహమ్" అని వరాహ పురాణమున (గీతామాహాత్మ్యమున) తానే పేర్కొన్నాడు కదా!

"నహి పాలన సామర్థ్యం
ఋతే సర్వేశ్వరం హరిమ్॥
(విష్ణుపురాణం—1-22-21)

అని పరాశరుడుగూడ జగత్పరిపాలన సామర్థ్యము విష్ణుని కొక్కనికే కలదని నుడివెను.

బలగర్వితులైన రక్కసులచే బాధింపబడిన బ్రహ్మేంద్రాది దేవతలు దుష్టనిగ్రహమున నేర్పరియైన ఆ భగవంతునే అన్వేషించుచుందురు. జీవులకు మోక్షమిచ్చుటకతడే సమర్థుడు. అందువలననే ఆయన ముకుందుడు (ముకుం = మోక్షభూమిం దదాతీతి) అని కీర్తింపబడుచున్నాడు. "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" (గీత 4-8) అన్నట్లు ఎన్నో అవతారములెత్తి ధర్మమును స్థాపించుచున్నాడు గాన లోకమునకు హితము చేకూర్చువాడతడే.

నిర్గుణ తత్త్వ దృష్టితో చూడగా ఆ పరమాత్ముడు నిరాకారుడు. ఐనను బ్రహ్మ, విష్ణు, శివమూర్తులకు కూటస్థమైన మూర్తియు అతడే. కావుననే విష్ణు సహస్రనామమున (77) 'అమూర్తిమాన్' 'అనేక మూర్తిః' అని స్తుతింపబడినాడు, మరియు —

స బ్రహ్మ సశివస్సేన్ద్రః
సోఽక్షరః పరమః స్వరాట్।
స ఏవ విష్ణుః సప్రాణః
సకాలోఽగ్నిః స చంద్రమాః॥
(కైవల్యం—1—7)

అని కైవల్యోపనిషత్తు పేర్కొన్నట్లు సకలదేవతామూర్తియు అతడే

అన్నమయ్య మరొకచో —
త్రిమూర్తుల ఏకమూర్తిత్వమును ప్రకటించుటకే 'భవ కమలభవ మాధవరూప! (11-2-37) అని దేవుని సంబోధించినాడు. ఆ దేవుడు సర్వాత్ముడు. మరియు 'మత్తః పరతరం నాన్యత్కించి దస్తి' (గీత 7-7) అనుటచే ఆయనకంటె పరతరమైనది మరెద్దియు లేనందున ఆయన పరమాత్ము డనబడుచున్నాడు.

ఆ దేవుని దేహమునుండియే సమస్తము జన్మించినది. సృష్టిక్రమమును వర్ణించుచు తైత్తిరీయ శ్రుతి ఇట్లు చెప్పినది —

'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా—ఓషధయః, ఓషధీభ్యోఽన్నమ్, అన్నాత్పురుషః... (తైత్తి-ఆనం-1)

అనగా ఆత్మనుండి ఆకాశము, దాని నుండి వాయువు, దాని నుండి అగ్ని, దానినుండి జలము, దానినుండి పృథివి, దాని నుండి ఓషధులు, వాటి నుండి అన్నము, దాని నుండి పురుషుడు — జన్మించిరని యర్థము. కావున ఈ సకల సృష్టియు అతని శరీరమే. ఇదియంతయు కడకు లయమగునది కూడ ఆ దేవుని యందే. సృష్టి స్థితి లయములకు కారణమై ఆత్మభవుడైన పరమాత్మను భాగవత మిట్లు వర్ణించినది —

యస్మిన్నిదం యతశ్చేదం
యేనేదం య ఇదం స్వయమ్।
యోఽస్మాత్ పరస్మాచ్చ పరః
తం ప్రపద్యే స్వయంభువమ్॥
(భాగ-8—33)

మరియు "చక్షుషీ చంద్ర సూర్యౌ" (ముండకము 2-1-4) అని శ్రుతి సూర్య చంద్రులను ఆ పరమాత్ముని నేత్రములుగా వర్ణించినది.

"అంగుష్ఠ మాత్రః పురుషః
మధ్య ఆత్మని తిష్ఠతి"।
(కఠ 4—12)

'అంగుష్ఠ మాత్రుడైన పురుషుడు ఆత్మ మధ్యలో నున్నాడు' అను శ్రుతి ననుసరించియు,

"ఈశ్వర స్సర్వ భూతానాం
హృద్దేశేఽర్జున తిష్ఠతి।"
(గీత 18—61)

"సర్వభూతముల హృదయ దేశమున ఈశ్వరుడున్నాడు" అను స్మృతి ననుసరించియు జీవులందరిలో ఆ దేవు డంతర్యామిగా నున్నాడని తెలియుచున్నది 'చేతన శ్చేతనానామ్' (శ్వేతాశ్వ6-13) అని శ్రుతిపేర్కొన్నట్లు చేతనుల కాధారమైన చైతన్యమతడే.

"నాహం ప్రకాశస్సర్వస్య
యోగమాయా సమావృతః।"
(గీత-7-25)

'యోగమాయచే ఆవరింపబడిన నేను అందరికి ప్రకాశమైన వాడనుగాను' అను గీతా వచనము ననుసరించి భగవంతుని నిజరూపము జీవులకు వ్యక్తమగుట లేదు.

"ఏకమేవాద్వితీయం బ్రహ్మ" (ఛాందోగ్యం-6-2-1) అను శ్రుతి ననుసరించి ఆ పరబ్రహ్మ అద్వితీయమైనది, అనగా దానికి సాటియైనది మరొకటి లేదు. పుణ్యపాపాది ద్వంద్వములు దాని నంటవు.

"పద్భ్యాం పృథివీ" (ముండకం — 2-1-4) అని భూమినే పరమాత్ముని పాద

## తిరుమలలో వివిధములైన కాటేజిల దినసరి అద్దెలు

1–12–78 నుండి మార్పుటమైనది.

కనుక యాత్రికులు గమనింప గోరుతున్నాము.

| కాటేజి పేరు | రోజుకి అద్దె |
|---|---|
| 1. హెచ్. ఆర్ గవియప్ప కాటేజి. | రు. 100/- |
| 2. నారాయణగిరి కాటేజిలు 1 నుండి 4; 13 నుండి 20. | 40/- |
| 3. ట్రావెలర్స్ బంగళా ప్రాంతం లోపల వైపువి, 1 నుండి 8; ఎ నుండి జి 3-వ వరుస 1; సి. యం. సి. 16; వి. వి సి. 6; కె. వి. ఆర్. 4; వి. వి. సి. 1: వి. వి. సి. 8; టి. బి. సి. 10. | 30/- |
| 4. పై కాటేజిలలో ఎ. భాగం. | 18/- |
| బి. భాగం. | 12/- |
| 5. ట్రావెలర్స్ బంగళా బయట వైపువి. వి. వి. సి; యం. బి. సి; ఎ. టి. సి. | 25/- |
| 6. పై కాటేజిలలో ఎ. భాగం; | 15/- |
| బి. భాగం. | 10/- |
| 7. టి. బి. కాటేజిలు ( 3 వ వరుస ఒక్కటి గదిగలవి. ) | 10/- |
| 8. శ్రీ వేంకటేశ్వర అతిథి భవనం | |
| ఎ. పెద్దగదులు | 35/- |
| బి. మూలగదులు | 25/- |
| సి. మిగిలిన గదులు | 20/- |

కార్యనిర్వహణాధికారి.

ములుగా శ్రుతి పేర్కొనుచున్నది. ఇచట భూమ్యాకాశములు రెండును పాదయుగమనుటచే రెండు పాదములతో భూమ్యాకాశముల నాక్రమించిన వామనుని స్వరూపమును భావింపవలసియున్నది. అతడు సర్వవ్యాపి గాన పాదాంతము, కేశాంతము అంతము లేనివై యున్నవి.

"వాయుః ప్రాణః" (ముండకం - 2-1-4) అనుటచే ఆ పరమాత్ముని నిశ్వాసమే వాయువని తెలియుచున్నది. పుణ్యాత్ములైన భాగవతోత్తములు ఆయనకు దాస్యమొనర్తురు ... 'సర్వస్య ప్రభుమీశానం', 'తమీశ్వరాణాం పరమం మహేశ్వరం' (శ్వేతాశ్వతరం 6-7) అను శ్రుతి వచనముల ననుసరించి సర్వేశ్వరుడు, పరమేశ్వరుడును ఆ దేవుడే.

'అణో రణీయాన్ మహతో మహీయాన్'
(కఠం - 2-20)
'అణోరణీయా నహ మేవ తద్వత్ మహానహమ్' (కైవల్యం-20)
యస్మాన్నాణీయో న జ్యాయోఽస్తి కశ్చిత్'
(శ్వేతాశ్వతరం 3-9)

ఇత్యాది శ్రుతులు ఆ పరమాత్మను సూక్ష్మములనెల్ల సూక్ష్మమైన వానిని గాను, మహత్తులలో మహత్తైన వానిని గాను వర్ణించుచున్నవి.

అన్నమయ్య వేదార్థములను ఈ సంకీర్తనమందెట్లు పేర్కొనెనో పరిశీలించినచో —

'సకల వేదములు - సంకీర్తనములు చేసి
ప్రకటించి నినుఁబాడి - పావనుండైన
అకలంకుఁడు తాళ్ళపాకన్నమాచార్యులు'
(అధ్యా — సం-6-24)

అను మాట ఎంత యథార్థమో స్పష్టము కాగలదు.

( సశేషము )



(16వ పేజీ తరువాయి)

నీ యలౌకిక శృంగారభావము అన్నమయ్యలో ఎంత గూఢముగా వేఱూనుకొని చిలువలు పలువలు వేసినదో ఊహింపవచ్చును.... అన్నమయ్య శృంగారసంకీర్తనములు వేంకటశ్శైలవల్లభ రతిక్రీడారహస్యముల వెల్లడించుచున్నవి." [13]

ఇదేపద్ధతిలోనే క్షేత్రయ్య తనపదాల్లో మువ్వగోపాలనాయకుని శృంగారంవర్ణించి తరించాడు. తానే నాయిక; రసరాట్టయిన శృంగార రసాధిదేవత మువ్వగోపాలుడు నాయకుడు. క్షేత్రయ్య ఆత్మనివేదనైక భావనతో భగవంతునిపై బాళిగొని, పరమాత్మయందు లీనంకావడానికై పడిన తపన స్పష్టమవుతుంది. క్షేత్రయ్యపదాల్లో ప్రేయసీప్రియుల ఐక్యసంధానంకోసం జరిగిన ప్రయత్నం స్పష్టం. క్షేత్రయ్య నాయికఅయి పరమాత్ముడయిన నాయకునికై విరహం అనుభవిస్తుండగా శారీరకమైన స్తంభన, స్వేద, రోమాంచ, స్వరభంగ వైవర్ణ్య అశ్రుప్రలయాదులన్నియు కలిగినట్లు అనుభవించి వర్ణించితరించాడు; తాను స్వీయ, పరకీయ, సామాన్యగాను అయి పరమాత్మనికై ప్రతీక్షించి తన ఆత్మనివేదనను ప్రకటించుకొన్నాడు. ఇంతేగాదు లోకంలోని కన్య, బాలింతరాలునై తనప్రేమను వ్యక్తంచేసుకొన్నాడు. ఇది మహత్తర సాధనగా, భక్తిమార్గంగా వర్ణించబడింది. ఆర్ష సంప్రదాయంలోనే గాక క్రైస్తవమత సంప్రదాయములోను 'The Doctrine of the Divine Spouse' అనేపేరుతో ప్రచారంలో ఉంది. క్షేత్రయ్య నిండుమనసుతో, విశుద్ధప్రేమతో, తన దైవమగు మువ్వగోపాలుని అనేకరీతుల భావించి దివ్యములగు శృంగారపదచిత్రములగు వెలయించెను. మువ్వగోపాలుని నాయకునిగా, పరమపురుషునిగా క్షేత్రయ్య భావింపగలిగినాడు. తాను రాధగా మారిపోయినాడు. తన ప్రేమభావములను పదరూపమున బాడి ఆనందించినాడు ... పొంగిపొరలు భావములను వివిధరీతులలో అనేకపదములుగా క్షేత్రయ్యచిత్రించెను.... మధురభావసాధనలో ఉత్తమస్థాయి నందుకొన్నాడు క్షేత్రయ్య" [14]. ఈ వివిధరీతుల దర్శించిప్రదర్శించిన క్షేత్రయ్య మధురభక్తి సాధన ఎలాంటిదో పరిశీలిద్దాం. అనంతముఖాలైన క్షేత్రయ్య మధురభక్తిని పరిశీలించేముందు ఒకటి మనం గుర్తుంచుకోవడం చాల ముఖ్యం. "ఇక ప్రేయసీభావనలోగాని, ప్రియాతను భావనలో గాని, రాధికాగోపికాది భావనలోగాని, ఈశ్వరారాధనం జరిగినపుడు భక్తునికి ఆ యా భావాలకు అనుకూలమైన పరిస్థితి ఏర్పడటం సహజం. కావ్యాలలోగాని, పదాలలో గాని ఈపరిస్థితి అభివ్యక్తమైనపుడు భక్తుని మానవసహజమైన భావావేశం భక్తులందరిలోను స్పష్టంకావడం సహజమే.[15]". అదే విధంగా క్షేత్రయ్యలోను ఈలాంటి భావావేశం ఉండడంలో అసహజంలేదు. కనుక ఆయా సమయాల్లో కొన్నిపదాల్లో కేవలం లౌకికశృంగారంగా భాసించడం నైతం గోచరిస్తుంది. కాని పై అభిప్రాయాన్ని మనం గుర్తుంచుకొంటే సంపూర్ణమైన ఆత్మనివేదనైక భగవత్ప్రణయమే గోచరించి అలౌకికశృంగారం మనల్నిముగ్ధుల్ని చేస్తుంది. ఇది ఇందులో ఉన్న రహస్యం. ఈఅభిప్రాయం మనసులో గుర్తుంచుకొనే క్షేత్రయ్య మధురభక్తిని పరిశీలిస్తే మనం గూడ పరమానందభరితులం కాగలం. క్షేత్రయ్య పొందిన మధురానందానుభూతిని మనం పొందలేకపోవచ్చు, కాని అలాంటి భావనతో మనం నైతం ఆ మధురభావనను ఆస్వాదింప వీలుంది.

క్షేత్రయ్య నాయికగా, మువ్వగోపాలుడు పరమపురుషుడుగా అత్యంతమనోజ్ఞమైన భావవేగంతో మధురభక్తికిలోనైన సమయంలో ప్రప్రథమంగా ఆతని నోటి నుండి వెలువడిందీ క్రిందిపదం. ఈ విషయము ప్రథమప్రకరణంలో స్పష్టంచేయడము జరిగింది. క్షేత్రయ్య మధురభక్తి ప్రారంభదశకీపదం ఎంతో సహజమై ఒప్పారుతుంది.

"శ్రీపతి సుతుబారికినే-నోపలేక విను వేడితే-
కోపాలా? మువ్వగోపాలా! ॥శ్రీపతి॥

ఏప్రొద్దు దానింటిలోనే-కాపైయుండి నీ
సరసపల్లాపాలా? మువ్వగోపాలా! ॥శ్రీపతి॥

పైపూత మాటలనేర్పు-జూపుదానిరతిపై విం
తతీపేలా? మువ్వగోపాలా! ॥శ్రీపతి॥

చూపుల నవ్వులదేరి-చూడవినాతో క
లాపాలా? మువ్వగోపాలా! ॥శ్రీపతి॥

13. భారతి—సెప్టెంబరు 1952. పు. 281, 282

14. విస్సా అప్పారావు—సంగ్రహాంధ్రవిజ్ఞాన కోశము-సం. 3, పు. 157, 158

15. పి. గణపతిశాస్త్రి—సారస్వత వ్యాసములు-సం॥ పు. 328

## రచయితలకు చిత్రకారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రికకు మత ధార్మిక సంబంధమైన రచనలు, వ్యాసములు, గేయములు, చిత్రములు, ఛాయా (వర్ణ) చిత్రములు పత్రికలో ప్రచురణకు గాను కోర బడుచున్నవి. రచయితలు, చిత్రకారులు ఈ క్రింది విషయములు గమనించవలెను.

★

1. రచనలు చేయువారు 6 అరఠావు పేజీలకు మించకుండా, పేజీలకు ఒక వైపుననే వ్రాసి పంపవలెను. వాటికి సంబంధించిన ఛాయా చిత్రములను కూడ పంపగోరెదము.

★

2. చిత్రములు వేయువారు ఇండియన్ ఇంకుతో వేసి పంపవలెను.

★

3. ఛాయాచిత్రములుపంపువారు చిత్రములలోని వివరములు నిర్దుష్టంగా వ్రాసిపంపవలెను.

4. ప్రచురితమైన వాటికి ఎట్టిపారితోషికము ఈయబడదని గమనింప ప్రార్థన

— సంపాదకుడు,
సప్తగిరి

నాపొందెల్ల దాని కబ్బె యే పొందులేక
యుసురనుచే నాపాలా? మువ్వగోపాలా!"
॥శ్రీపతి॥

— ఇంతులో పరమాత్మయందు ఆత్మ తల్లీనం గావడానికై పడే ఆవేదన వ్యక్తమవుతుంది. క్షేత్రయ్య నాయికఅయి ఆ భగవంతుని పొందు అంటే ఐక్యతానుసంధానంకోసం అనుభవించే యాతన సుస్పష్టం.

క్షేత్రయ్య నాయికఅయి సర్వము తనకా పరమాత్ముడేనని స్పష్టంచేస్తున్నాడీ క్రింది పదంలో:

"ఇంతతెలిసియుండి-యీ గుణమేలరా
వంతమా? మువ్వగోపాల? నాసామిగ॥ఇంత
అలుకచేసి యింటికి రానైతివి నెనరైన
చెలికత్తెలున్నారా?-పలుకవచ్చేరా?
చెలికత్తెవైన నీవే-చెలువుడవైన నీవే
తలచిచూడు నాపాలి-దైవము నీవే ॥ఇంత॥
వింతదానివలెనన్ను-వేరుచేసిరావైతివి
అంతరంగులున్నారా? న-న్నాదరించేరా
అంతరంగమైన నీవే నన్నాదరించిన నీవే
చింతించిచూడ నా జీవస్వామివి నీవే॥ఇంత
శ్రీనిధిమువ్వగోపాల! చేపట్టి నన్నేలితివి
నా నేర్పులెవరైన నానందించేరా?
నా నేర్పులైన నీవే-నమ్మికలిచ్చినా నీవే
ఆవగాబల్కుడు నాయానందమైన నీవే
॥ఇంత॥

— ఇందులో క్షేత్రయ్య నాయిక అయి పరమాత్మానుసంధానం పొందినట్లు స్పష్టం. తాను నాయికగాను, భగవంతుని చెలికత్తెగాను, చెలువుడుగాను, తనపాలి దైవంగానుతలంచాడు. 'నా జీవస్వామివి నీవే' అనడంలో జీవాత్మపరమాత్మల ప్రసక్తి వాటి సమైక్యం సూచించడం జరిగింది. 'నా ఆనందమైన నీవే' - అనడంలో పరమానందం అంటే మధురభక్తివల్ల కల్గిన మహదానందం స్పష్టమౌతుంది.

ఇంక "ఇద్దరివలెనేకూడి ఎవరున్నారు? తెల్పరా!" అనే పదంలో పురాణపురుషులైన నలదమయంతులు, రుక్మిణీకృష్ణులు, సీతారాములు, రంగనాయకీ రంగేశులు, చంద్రమతీహరిశ్చంద్రులు, రతీమన్మథులు అను జంటలను తెల్పి వారి ప్రేమతత్వాన్ని స్పృశించి వారి ఏకత్వాన్నిసూచించి నాయిక అయిన క్షేత్రయ్య మువ్వగోపాలదేవుడన్న పరమనాయకునిలో ఏకత్వానుసంధానాన్ని సూచించడం జరిగింది. "ఎందుకువచ్చెనో కోడుమెవరేమన్నారు" పదంతో ప్రణయ మానంగల నాయకుని నాయిక అనునయించినట్లు స్పష్టం చేయబడింది, ఇందులో నాయిక నిర్మల అనురాగమూ, అరమరిక లేని, కల్లకపటంలేని అమాయకత్వముగా వ్యక్తమవుతున్నాయి. రకరకాలైన భావానుభూతులను పొందిన నాయిక మానసికస్థితి విదితమవుతుంది. నిర్మలమైన ప్రేమకు నిదర్శనం "అక్కరో! యోర్వని వారు సరసుడుగాడని - ఆతుకొంటే ఆడుకొనేరు" అనే పదం. పరమపవిత్రమైన ప్రేమపూర్ణ హృదయమయిన నాయిక అంటే నాయికాత్వం చెందిన క్షేత్రయ్య - పరమాత్ముని సుగుణసంపత్తిని స్మరించి తరించడం ఇందులోని విశిష్టత.

"రామ! వానిదలచినపుడే-రవిక
క్రిక్కిరిసి గుబ్బ
లేమో రొమ్మెల్లనిండునే-వాని మాటంటే
నామనసు పైపైనుండునే-వాని జూచితే
నవనిధులబ్బినట్లుంటునే........"

అని అనడంలో నవవిధభక్తులతో స్మరణ, కీర్తన, దర్శనం - అన్న త్రివిధాలైన భక్తులు స్పష్టం. అది పారలౌకిక భక్తి. ఆత్మపరమాత్మల పారవశ్యంలో కూడిన ఏకత్వం. తరువాతి చరణాలలో తన్ను కౌగిలిస్తే, తనపైని చేయివేస్తే పరమానందం కలుగుతుందని చెప్పటం జరిగింది. పరమాత్మానుసంధానం పొందిన ఆత్మ పొందే సంతృప్తి "ఎవతె కూడిననేమి చాలు నిది నాతో ననకురే" అనే పదంలో సువిదతమవుతుంది. వీటిలో పరిశుద్ధాత్మ, నిర్మలభక్తి మొదలైన విశిష్టగుణాలు వ్యక్తమవుతున్నాయి. "నేను మంచి దానను గనుక నీతప్పుగాచితిగాని"పదంలో
"అడ్డగిస్తే కొనిపోవు దిక్కుగలరా?
కట్టి వేసుకొంటే నిన్ను విడిపించు దిక్కు-
గలరా?
నిన్నుగూడి ప్రౌఢికెక్కితే దిక్కుగలరా"

— అని నాయిక నాయకునితో సవాలు చేస్తుంది. ఇందులో ఆత్మకు పరమాత్మ పైగల అధికారం మనకు అవగతమవుతుంది. నాయికాత్వం పొందిన క్షేత్రయ్య ప్రియుడైన భగవంతునితో చేసిన సవాలనీ తెలుస్తుంది.

గోపీకృష్ణుల శృంగారాన్ని తలపింపచేసే ఈ పదంలో క్షేత్రయ్య తనను తానే ప్రశ్నించుకుంటున్నాడు —

"చూడరే అదినడిచే హొయలు సుదతిచేయు
జాడలు
అడది కులకాంత అత్తింటికోడలు
అలగోపాలుని విడిదికి వెడలెను ॥చూడరే॥
కొండెంత కాపురమె రానుపోను కోమలి
కందలమె
దండునగెలిచే మగడు తక్కువేమే
తలవ్రాలెవరికి తప్పించవశమే ॥చూడరే॥
పైటకొంగుజారినను తెలియక-భయమించు
కయులేక
తోటివారు నవ్వుదురని యెంచక
దోచునటె అది గయ్యాళి బలేజాణ
॥చూడరే॥
అత్త, మామ, బావ, మరదులనుదిట్టి-
అవమానమునుగొట్టి
గుత్తగాను మువ్వగోపాలదేవుని
గూడునటె అది మనిషా మ్రాకా ॥చూడరే॥

— ఈ పదంలో భాగవతంలో సర్వం త్యజించి శ్రీకృష్ణుని వేణునాదలోలురై గోపికలు పరుగున పోయిన విధమూ, దారిని శ్రీకృష్ణుడు "ఇలువడి సున్నచేసి" అన్న పద్యంలో అత్తమామలను, భర్తలను, పిల్లలను వదలివచ్చారే అనిప్రశ్నించిన విధమూ, అందుకా గోపికలు

"పతిపుత్రాదికనామమూర్తి వగుచున్ భాసిల్లు
నీయందుఁ ద
త్పదిపుత్రాదికవాంఛలన్ సలిపి సంభా
వించుట న్యాయమే "[16]

— అని చెప్పిన సమాధానమూ - స్ఫురింపజేస్తూంది. అంటే సర్వమూ పరిత్యజించి భగవంతునియందే ఆత్మనివేదనము చేయడం మనం గమనించగలం. ఇదే భాగవత సంప్రదాయం. ఇదే గోపీకృష్ణుల - ఆత్మపరమాత్మల - ప్రణయం - అలౌకికశృంగారము. ఈ పద్ధతిలోనే క్షేత్రయ్య ఆత్మపరమైన సర్వమూ నివేదించిన నాయిక పై పదంలో వర్ణించాడు. ఆమె భగవంతునిపై గలప్రేమానురాగాలతో తదితరమైనవాటిని మరచిపోయి హొయలుగొల్కు నడకలతో వెడలిందట. ఈ పదంలో సారాలంకారముంది. ఉత్తరోత్తరం ఉత్కర్షను అధి వర్ణించడం సారాలంకారం.[17] అనుపల్లవిలో 'ఆడది' అన్నాడు మొదట. అంటే





ఆడదానికీలాంటి హొయలుకుల్కు నడక లంత మంచిదిగాదనీ అర్థం. తరువాత 'కులకాంత' అన్నాడు. కులకాంతకుతగిన విధంకాదని అర్థం. 'అత్తింటికోడలు' అన్నాడా వెనుక - మరి మగనాలైన అత్తింటికోడలు చేయవలసిన పనేనా? అని ఒత్తిచెప్పడం. అట్లే మొదటి చరణంలో కొండంతకాపురమనీ, రాను పోను అందలమనీ,దండునగెలిచే భర్తకలడనీచెప్పడంలో ఇది విశిష్టంగా స్ఫురిస్తుంది. ఈ సారాలంకారముతోపాటు 'తలవ్రాలెవరికి తప్పించవశమే' అని అర్థాంతరన్యాసాలంకారం వాడబడింది. ఇట్లే రెండవ చరణంలో 'అదిగయ్యాళి, బలేజాణ', అనీ 'అత్త, మామ బావమరదులను దిట్టి, అవమానమునుగొట్టి' మువ్వగోపాలుని కూడుతుందా అనీ, 'అది మనిషా మ్రాకా' అనీ చెప్పడంలో ఈ సారాలంకారం పరిపుష్టిని చెందింది. వీటివల్ల ఆ నాయిక మానావమానాలు వదలి అత్తమామలను, బావ మరదులను లెక్కచేయక మువ్వగోపాలు

16. పోతన-శ్రీమదాంధ్రభాగవతము—దశమస్కంథము. స. 976, 986

17. చంద్రాలోకనము పు. 8

నకు తన్ను తాను నివేదించుకొన్నది. ఇందులో క్షేత్రయ్య నాయికఅయి మధుర భావంలోని గాఢతను, సాంద్రతను స్పష్టం చేయడానికై చేసిన రచనాపద్ధతి ఏ పద కర్తకు కాదుగదా, ప్రౌఢకవులకు సైతం సాధ్యంకాదంటే అత్యుక్తికాదు. ఇందుకు సహృదయహృదయాలు సాక్ష్యము! కారణం ఈ మధురభక్తి ఈ మధురానుభూతి అనుభవైక వైద్యంగనుక. ఇదిక్షేత్రయ్య మధురభక్తికి పరాకాష్ఠ!

ఈ మధురకవితలో నాయిక దుర్భర విరహంఅనుభవించడం సర్వసామాన్యమే. క్షేత్రయ్య నాయికాత్వం వహించి మువ్వ గోపాలునిపై విరాళిగొని, దుస్సహవిరహ మనుభవించినట్లు అతని పదాల్లో అనేక సాక్షులు, అనేకరీతుల్లో మనంచూడవచ్చు. పైగా రాధాకృష్ణ ప్రేమతత్వంలోనే ఈ విరహం సర్వసాధారణమే. గీతగోవిందంలో కృష్ణునికై రాధ విరహమనుభవించినది. చైతన్యస్వామి రాధగా తాను తలంచి విరహంఅనుభవించడం జరిగింది. "In his (Chaitanya's) normal state, he faithfully mirrored the multifarious moods of Radha's soul ever thirsting for the vivid vision and intense enjoyment of the Lord."[18] ఇది చైతన్యుని లోని మధురానుభూతి. ఇట్లే ఉజ్జ్వలనీల మణిలో రాధకు గలిగిన విరహవేదనను ఎంతో చక్కగా అభివర్ణించాడు తత్కర్త రూపగోస్వామి.[19] విద్యాపతిగూడ తన పదాల్లో విరహవ్యధాభరిత అయిన నాయికను వర్ణించాడు. ఆళ్వారులలోను ఇలాంటి విరహవేదనాభరితమైన కవితఉంది. ఇంతెందుకు భాగవతంలోని గోపికలు అనుభవించిన కృష్ణపరమైన విరహం అనన్యసామాన్యమేగదా? ఇలాగే క్షేత్రయ్య నాయికాత్వంవహించి మువ్వగోపాలునిపై విరాళిగొని దుర్భరమై విరహంతదోదూయమానుడైనట్లు ఈ క్రింది పదంలోను విదితమవుతుంది.

" ఈ మేను జీవునకు-ఎంత ప్రియ మాయెన్
భామ! మా మువ్వగోపాలు కౌగిటలేని
॥ ఈ మేను ॥

వదతి నే నొకచోట-ప్రాణేశుడొక చోట
ఎడబాసి మరునిచే ఇడుములకులోనై
కదలేని విరహాగ్ని క్రాగియున్నదిచాల
పుడమిలో వేరెజన్మములేదె సుదతి
॥ ఈ మేను ॥

మోముజూడ మనసై-మోవియాన నోరూరి
యాముకొన్న ప్రేమచే నసురుసురనుచు
సోముకాకలజిక్కి సొమ్మసిల్లి యీవేళ
కామినిరో! ఎడతెగని కన్నీటనిటులున్న
॥ ఈ మేను ॥

కంతుకేళి మువ్వగోపాలు కలిసియున్నది
తలచి
వింతతోచి నామనసు వేవిధములాయెన్
ఇంతిరో! విభుసేమమీవరకు వినసైతి
ఎంత గ్రాతవ్రాసియున్నాడో ఇంతకు
తాళియున్న ॥ ఈ మేను ॥

— ఈ పదంలో క్షేత్రయ్య విప్రలబ్ధఅయి భగవంతుని యెడగల విరహవ్యధను వ్యంజింపజేశాడు. ఇట్లే "ఎవరిననగ పని యేమున్నదమ్మలారా" "ఏమిసేతురా! ప్రాణేశ! నేనెటువలెతాళుదురా!" "ఎంత లేదనియెంచకురా" ఈ మొదలైనపదాల్లో ఉత్కటమైన విరహవ్యధాభరిత మనస్క అయిన నాయికస్థితిని ఎంతో మనోజ్ఞంగా తనయందారోపించుకొన్నాడు. ఇందలి ప్రతిఫలాపేక్షలేని,ముక్తిపరమైన ప్రణయం వర్ణితం. జీవాత్మ పరమాత్మయందు పరవశించి పొందటానికై పడే తపన, ఇదే మధురభక్తి. ఇంకా "వట్టుపెట్టు సుమ్మీ! వలదు ఈ సరసాలు" పదంలో క్షేత్రయ్య ఈర్ష్యామానఖండిత అయిన నాయిక అయ్యాడు. ఇలాగ క్షేత్రయ్య స్వీయ, పరకీయ, సామాన్య అనే నాయికా రూపాన్నిపొంది అనేకరీతుల తన మధుర భక్తిని ప్రకటించాడని పై పరిశీలనవల్ల స్పష్టమవుతూంది.

క్షేత్రయ్య పదాల్లో 'ఆత్మీయాంశ' (Personal element) ఉందంటున్నారు.[20] కాని అతని పూర్వనామమయిన వరదయ్య అని గాక అతడు పొందిన మధురభక్తియందే నాయకుడైన భగవంతునికై నాయికారోపణ పొందిన విధమును మనం తలంచవలసి ఉంది. కాని ఇది కేవలం కొన్ని పదాలకు మాత్రమే పరిమితమనీ, అన్నిటినీ ఉత్తమమధురభక్తిగా తలంచడం ఉచితం కాదనీ అంటూ ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు తమ అభిప్రాయాన్ని బలపరిచే కట్టమంచి రామలింగారెడ్డిగారి "We try to defend this by the aid of allegory and uneasy theories that all these represent the love of Gopis symbolising individual souls, to Krishna, the symbol of Heavenly absolute It is doubtful whether we are spiritualising sex or sexualising spirit, whether we are sublimating earth to to heaven or bringing down the heaven our muddy levels and depths."[21] అనే మాట ఉల్లేఖించారు కాని ఇతఃపూర్వమే వివరించినట్లు క్షేత్రయ్యపదాలను స్వీకరిస్తే అవి తప్పక మధురభక్తిప్రపూరితాలైన పదాలనడంలో సందేహంలేదు. అంటే ఈ మధురభక్తి వ్యక్తీకరణలో మానవసహజమైన ఆవేశం ఈ పదాల్లో వ్యక్తంకావడం సహజమే కదా! క్షేత్రయ్య నాయికాత్వారోపణతో మువ్వగోపాల ప్రియునితో అద్వైతభావం పొంది తరించిన మధుర భక్తిపరుడు. ఈ సందర్భంలో జమ్మలమడక మాధవరాయశర్మగారి శ్లోకం ఉల్లేఖనీయం.

" సాహిత్య శ్రీసమన్వేష సంప్రాప్తాద్వైత
భావనః
క్షేత్రజ్ఞో జయతి శ్రీమాన్ మువ్వగోపాల
నాయకః[22]

※

18. Prof K.V. Ramaswami Ayyangar, commemoration vol. (1940) P 581
19. సాహిత్యవాల్లభ్యము—పు. 460-62
20. విస్సా అప్పారావుగారు, క్షేత్రయ్యపదములు—పీఠిక-పు. 25-31
21. శ్రీ దివాకర్ల వేంకటావధాని—సాహిత్యోపన్యాసములు-3 పుటలు 51, 52
22. శ్రీ జమ్మలమడక మాధవరాయశర్మ—విస్సావారి క్షేత్రయ్యపదములు-పీఠిక-పు, 81.

కపిలేశ్వరాలయం లోని పరిచారకుల పదవు లను 180-9-270-10-350 నుండి 240–10–420 కు పెంచ నిర్ణయించట మైనది.

తిరుపతిలో దేవస్థానం 2 వ సత్రంలో దొంగను పట్టుకొని పోలీసులకు అప్ప గించిన అటెండరు శ్రీ కె. రాజగోపాల రెడ్డికి రు. 25/- పారితోషికము, ప్రశంసా పత్రము ఈయ నిర్ణయించటమైనది.

తిరుమలలో మద్య నిషేధం అమలుకు గాను నియమింపబడిన ఎక్సైజు ఉద్యో గులు 10 మందికి, దేవస్థాన ఉద్యోగులకు వలెనే తక్కువ ఖరీదుకు భోజన సౌకర్యం, ఉచిత వసతి ఏర్పాటుచేయ అంగీకరించట మైనది.

నిర్మాణంలో ఉన్న దేవస్థాన ముఖ్య కార్యాలయంలో 100 ఫోన్లు గల స్విచ్ బోర్డు ఏర్పాటు చేసేందుకు అంగీకరిస్తూ దానికి కావలసిన 2 టెలిఫోన్ ఆపరేటర్ల పదవులను కల్పించటమైనది.

అన్నమాచార్య కీర్తనల ప్రచారానికి గాను రు. 50,000/- కేటాయిస్తూ, అందుకు గాను ఒక ప్రత్యేకాధికారితో అన్నమాచార్య కళామందిరం కేంద్ర స్థానంగా ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటు చేయటమైనది. (అన్నమాచార్య కీర్తనల ప్రచారాని కేర్పాటైన కళాకారులు ఈ శాఖ అధీనంలో పనిచేస్తారు) ఇందుకు గాను ఒక గుమస్తా—టైపిస్టు, ఒక అటెం డరును కూడా నియమించటమైనది.

## 18-1-79వ తేది తీర్మానాలు

శ్రీ వారివసంతోత్సవంలో 3 వ రోజున పాల్గొనే అదనపు వాహనం మోత కూలీ లకు లోగడ ఇచ్చే రు. 50/- బదులు 100/- ఈయ తీర్మానించటమైనది.

తిరుచానూరులోని శ్రీ పద్మావతీ అమ్మ వారి ప్లవో (తెప్ప) త్సవంలో పాల్గొనే బ్యాండ్ సెట్టుకిస్తున్న ధనం రు. 400నుండి రు. 600 లకు హెచ్చించటమైనది.

కల్యాణీ జలాశయం (డాం) నుండి తిరుమలకు గొట్టాలలో నీరు 'పంప్' చేసేందుకు, దానికి సంబంధించిన తదితర కార్యకలాపముల నిర్వహణకుగాను, అసి స్టెంటు ఇంజనీయర్—(1), జూనియర్ ఇంజనీర్లు లేదా సెక్షన్ ఆఫీసర్లు (4), అప్పర్ డివిజనల్ గుమస్తా'1లో. టైపిస్ట్ 1 అటెండర్లు 2, తో ఒక సబ్ డివిజన్, ప్రాథమికంగా ఒక ఏడాదిపాటు ఏర్పాటు చేయుటకు తీర్మానించటమైనది.

ఇదిగాక దేవస్థాన ఆస్థాన గాయక విద్వాంసులను ఒక్కొక్కరు 12 కీర్తనలకు తాము యోగ్యమనుకున్న రాగాలలో స్వరకల్పన చేయవలసిందిగాను, ఏడాది కొకసారి తిరుమలలో కచ్చేరిజరిపి దానిలో భాగంగా అన్నమాచార్య కీర్తనలను పాడవలసిందిగాను, తమ ఇతరకచ్చేరీలలో కూడా అన్నమాచార్య కీర్తనలను పాడి వాటికి యథాశక్తి ప్రచారం కల్గించవల సిందిగాను కోరుతూ తీర్మానించటమైనది. ఈ విద్వాంసుల కిచ్చే వార్షిక బహుమా నంతోపాటు రు. 3000/– నగదు గాని వస్తురూపంగాని వార సేవకు గుర్తింపుగా ఈయ తీర్మానించటమైనది.

ఈ క్రింది పుస్తకములకు దిగువ పేర్కొ నిన రీతి ధన సహాయము మంజూరు చేయ టమైనది.

1. ప్రార్థన భాగవతం (ర. కె. శివ రామయ్య) రు. 5000 మించకుండా.
2. హృదయారవిందం (శ్రీ చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మ) రు. 1,500

శ్రీ శిష్టా సుబ్బారావు వ్యాఖ్యతో దేవ స్థానంచే ప్రచురింపబడ్డ భగవద్గీతకు 75,000 ప్రతుల తృతీయ ముద్రణ సాగించాలని నిర్ణయించి రు. 1,66,100/– మంజూరు చేయటమైనది. ఆస్తికజనోపయోగార్థం ఈ పుస్తకాన్ని రు. 1/– విక్రయించాలని కూడా తీర్మానించటమైనది.

దేవస్థానం ఉద్యోగులకు గుర్తింపు పత్రాలకు (ఐడెంటిఫికేషన్ కార్డులు) ఏర్పాటు చేసేందుకుగాను రు. 30,000/- మంజూరు చేయటమైనది.

జనగాం తాలూకా లోని పాఖాల హరిజన కాలనీలో రామమందిర నిర్మా ణానికిగాను రు. 10,000 మంజూరు చేయ టమైనది.

ఇటీవల వరదలలో ఉత్తర కాశీలోని శ్రీ విశ్వనాథ సంస్కృత మహావిద్యాలయ భవనం కొట్టుకొని పోయినందువల్లనూత్న భవన నిర్మాణానికి గాను రు. 25,000 విరాళం మంజూరుచేయటమైనది.

---

### గమనిక :

తిరుమల తిరుపతి దేవస్థాన సమా చార కేంద్రం దేవస్థాన సిబ్బందితో బొంబాయినగరంలో ప్రారంభించబడింది.

ఇక్కడ శ్రీవారి చిత్రపటాలు ఇతర ధార్మిక గ్రంథాలు లభ్యమౌతవి.

ఈ క్రింది చిరునామాకు సంప్రదించండి ;

క్లర్కు - ఇన్‌చార్జి,
తిరుమల తిరుపతి దేవస్థానం సమాచారకేంద్రం,
జి. డి. సోమానీ మెమోరియల్ స్కూల్‌బిల్డింగ్,
కఫేపారడె,
బొంబాయి - 400005.

## చందాదారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రిక చందాదారులలో దిగువ పేర్కొన్న సంఖ్య వారి చందా 31-3-79 తేదీకి అంతమగును. చందాదారులు ఈ విషయమును గమనించి M. O. ద్వారా దిగువ పేర్కొనిన ప్రకారము మనియార్డరు కూపనునందు తమ చందా సంఖ్య పూర్తి విలాసమును పేర్కొని, త్వరలో చందా పంపనియెడల ఆ తేది దరిమిలా పత్రిక పంపబడదు.

4 25 44 45 89 145 146 165 169 231 249 250 316 335 385 386 391 400 423 424 429 430 431 433 554 717 727 728 737 1433 1437 1438 1443 1449 1504 2168 2169 2170 2172 2174 2179 2185 2189 2192 2203 2205 2213 2219 3195 3229 3232 3237 3241 3250 3251 3256 3259 3260 3261 3263 3267 3270 3277 3289 3291 3292 3293 4424 4437 4438 4441 4442 4443 4444 4446 to 4456 4458 4459 4462 4463 4464 4466 4468 4471 4472 4474 to 4480 4503 to 4507 4523 4548 4564 4571.

గమనిక :– (1) సప్తగిరి చందాలు 15 తేదిలోగా చేరునట్లు పంపవలెను. ఆ తరువాత చేరిన చందాలకు మరునెలనుండి మాత్రమే పత్రిక పంపబడును.

(2) క్రొత్త చందాదారులు కూపనులో 'క్రొత్తచందా' అని పేర్కొనవలెను. పాత వారు కూపనులో తమ చందా సంఖ్య నమోదు చేయవలెను.

(3) సప్తగిరి చందాలు ఈ క్రింది అడ్రసుకే తమ పిన్‌కోడ్ తెలియజేస్తూ పంపవలయును.

సప్తగిరి మాసపత్రిక సం॥ చందా రు 6/-

మార్కెటింగ్ ఆఫీసరు
పబ్లికేషన్ సెక్షన్
ప్రెస్ కాంపౌండ్, తిరుపతి 517501.

తిరుచానూరు లోని జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల ప్రాంగణంలో 40' × 100' ప్రార్థనా మందిరం నిర్మించ నిర్ణయించటమైనది.

తిరుపతిలో 1 వ సత్రంలో మరొక్క వైద్యాధికారి పదవిని మూడేండ్లపాటు కల్పించ నిర్ణయించటమైనది.

ఇళ్ళులేని దేవస్థాన ఉద్యోగుల సౌకర్యార్థం దేవస్థానమే ఇళ్ళు నిర్మించి వారికి రు. 8½% వడ్డీ, అసలు - వాయిదాలలో చెల్లింపు పద్ధతిన ఇచ్చే పథకాన్ని ప్రవేశ పెట్టాలని తీర్మానించటమైనది.

తమకు దొరికిన పర్సును రు. 190.77 పై సొమ్మును సొంతదారునకు అందజేయటంలో నిజాయితీతో తోడ్పడిన శ్రీవారి ఆలయంలో వాహనంఉద్యోగి శ్రీ యస్. రామచంద్రుడు, లోయర్ డివిజన్ గుమాస్తా శ్రీ ఇ.నరసింహారెడ్డిలకు ప్రోత్సాహక పారితోషికంగా చెరి రు. 25/- లు ఈయ తీర్మానించటమైనది.

తాళ్ళపాక అన్నమాచార్యులు తదితర తాళ్ళపాక కవుల వాఙ్మయాన్ని (కీర్తనలను) గ్రంథ రూపంలో వెలువరించేందుకు ఒక ప్రత్యేకాధికారి, కాపీ రైటర్, టెక్నీషియన్‌లతో ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటుచేసి దానికి శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మను ప్రత్యేకాధికారిగా నియమించట[illegible]నది.

దేవస్థాన గ్రంథ నిపుణుల మండలి చేసిన సూచనలను ఈ క్రింది విధంగా ఆమోదించటమైనది.

1. మండలిచే నిర్ణయింపబడిన గ్రంథాల ముద్రణ లేదా ధన సహాయం, లేదా దేవస్థాన పక్షాన ముద్రణ లేదా గ్రంథముల కొనుగోలుకు గాను దేవస్థాన బడ్జెటులో 5 లక్షలు కేటాయింపు.

2 ధార్మిక గ్రంథ ప్రచారానికిగాను ఈ క్రింది పద్ధతుల అనుసరణ:

1. సూచింపబడిన గ్రంథానికి సాహిత్య అకాడమీ నిధానాలలో, గ్రంథ ప్రతులు 50 ఇచ్చే నిబంధనమీద రు. 5000మించని ధన సహాయం.

లేదా

2. ముద్రిత గ్రంథం 50 ప్రతులు కొనుగోలు ద్వారా సహాయం.

3. దేవస్థానమే ముద్రించే పక్షంలో స్వీయరచనకు 1/8 డెమ్మి లేదా 1/8 క్రౌన్ సైజులో పేజీకి రు. 10/- అనువాదమైనచో రు. 7-50 ఇచ్చి హక్కుల కొనుగోలు. పేజీ; సైజు పెరిగినచో దానికి సమంగా చెల్లింపు.

4. దేవస్థానం ముద్రించే ప్రచార, ఇతర గ్రంథాలపై కేవలం ముద్రణ వ్యయం మాత్రమే ధరగా నిర్ణయించి అమ్మటం.

5. సప్తగిరి స్థాయిని పెంచేందుకుగాను రచనలకు రు. 100 మించకుండా స్వీయ రచనకు పేజీకి 15/- అనువాదానికి రు. 7-50 వంతున, ఫోటోలకు ఒక్కొక్కటికి రు. 15/- వంతున, గ్రంథ సమీక్షలకు ఒక్కొక్క దానికి రు. 25/- వంతున పారితోషికం, రచయితలకు 5 పుస్తక ప్రతులు 15 వ్యాస ప్రతులు బహుమానం.

6. ఈ క్రింది గ్రంథాలను ఒక్కొక్కటి 50 ప్రతులు కొన నిర్ణయించడమైనది.
1) సాధువేదన (ర. బి. నరసింహారెడ్డి) 2. స్వ. బలుసు అప్పన్న శాస్త్రి వాఖ్యగల భగవద్గీత (3) శ్రీ మద్భాగవతం (ప్రపంచ పుస్తక సంస్థ విశాఖ)

దేవస్థాన ముద్రణాలయానికి గాను డ్యూరోస్టిచ్ వైర్ స్టిచింగ్ యంత్రాన్ని (పుస్తకాలకు పిన్నులువేసే యంత్రం) కొనేందుకు రు. 11,000 మంజూరు చేయటమైనది.

భారీ గ్రంథముద్రణప్రణాళిక దృష్ట్యా దేవస్థాన ముద్రణాలయంలో ఆఫ్ సెట్ ముద్రణ యంత్రం ఏర్పాటుకు గాను రు. 7,00,000 మంజూరు చేయటమైనది.

కంటి శుక్లాలను తీసేందు కుపయోగించే క్రియో సర్జికల్ కొనుటకు నిర్ణయించి ఇందుకుగాను రు. 25,000 మంజూరు చేయటమయినది.

బొంబాయిలో. దేవస్థాన సిబ్బందితో సమాచార కేంద్రాన్ని నడిపే ప్రణాళికను ఆమోదిస్తూ నెలకు రు. 500 మించని ఖర్చుతో ధార్మిక ప్రబోధ కార్యక్రమాలు ఏడాదికి 12 ఏర్పాటు చేసేందుకు, నిర్ణయించటమైనది. కేంద్ర కార్యక్రమ నిర్వాహణాదులకు గాను రు. 1,000 మంజూరు చేయటమైనది.

ఆదోనిలోని శ్రీ వేంకటేశ్వర కళా కేంద్ర నిర్వహణ సంఘంలో దేవస్థాన పక్షాన శ్రీ వై. మహానందరెడ్డిని నియమించటమైనది.

హైదరాబాదులోని వేమనయోగ పరిశోధనా కేంద్రానికి తగినంత సహాయాన్ని అంగీకరిస్తూ, ఆ సంస్థ కొనదల్చుకొన్న, సికిందరాబాద్‌లోని శ్రీరామ కృష్ణ మిషన్ భవనాన్ని దేవస్థానమే కొని సభాభవనానికి ప్రక్కనున్న పఠనమందిరాన్ని చిన్న చిన్న ధార్మిక సభలకు సమాచార కేంద్రనిర్వహణకు కేటాయించి మిగిలిన భవనాన్ని రు. 1/- నామమాత్రపు అద్దెమీద పరిశోధనా కేంద్రంకుఅద్దెకీయాలని, భవనానికి గాను ప్రభుత్వం ఈయదలచుకున్న సహాయాన్ని పరిశోధనా కేంద్రం ఆ సంస్థ అభివృద్ధి కార్యక్రమాలకు వినియోగించు కొనవచ్చునని తీర్మానిస్తూ ఇదిగాక ఈ కేంద్ర ప్రారంభానికిగాను రు. 5/-లక్షల విరాళం మంజూరు చేయటమైనది.

లోగడ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం జిల్లాలలో, దేవస్థానం నిర్మించ సంకల్పి

## ప్రత్యేక సౌకర్యాలు.

### కాలిబాటవారికి ప్రత్యేకసౌకర్యం

తిరుపతి, తిరుమలల నడుమ మెట్ల దారినవెళ్ళే యాత్రికులసంఖ్య చాలా ఎక్కువగానే ఉంటుంది. వారిలో చాలామంది బరువైన సామానులు మోసుకొని, అధిక శ్రమతో పోతూ ఉండటం చూస్తుంటాం. అలాంటివారి సౌకర్యంకోసం దేవస్థానం చారిత్రాత్మకమైన, గణనార్హమైన ఏర్పాటు చేసింది.

తిరుపతిలో అలిపిరి టోల్‌గేట్‌వద్ద నుండి యాత్రికుల సామానులు దేవస్థాన వాహనాలలో తిరుమలలోని కేంద్రయాత్రిక వసతి కార్యాలయం (సెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్) దగ్గరకు చేర్చబడ్తవి. తిరుమల చేరిన వెంటనే యాత్రికులు తమ సామానులను తీసుకొని పోవచ్చు.

ఈ సౌకర్యం వినియోగించుకో దల్చుకున్న యాత్రికులు టోల్‌గేట్ సూపరింటెండెంట్, అలిపిరి, తిరుపతి, వారిని కల్సుకొని, లేదా సంప్రదించి మిగిలిన వివరాలు పొందవచ్చు

### అదనపు వైద్యసదుపాయం

ఈ విషయంలోకూడా దేవస్థానం గణనీయమైన శ్రద్ధచూపింది. ఇంతవరకు తిరుమలలో దేవస్థాన ఉద్యోగులకు, యాత్రికులకు ఒకే ఆస్పత్రిఉండి కొందరికి కొంత అసౌకర్యం ఏర్పడేది.

ఇప్పుడు దేవస్థానం, తిరుమలలో దేవస్థాన ఉద్యోగులకోసం ప్రత్యేక వైద్య సౌకర్యం ప్రారంభించింది.

ఇవిగాక ఏడవమైలులోకూడా అదనపు చికిత్సాశాలను ఏర్పాటుచేసింది. కాలిబాటన వస్తూ అస్వస్థులైనవారికి ఇది చాలా ఉపయోగిస్తుందనటంలో సందేహంలేదు.

చిన తుఫాన్ బాధిత రక్షక భవనాలను, సెంటేజి చార్జీలు వసూలు చేయని నిబంధన మీద, ఈ భవనాల రూపు రేఖలు దేవస్థాన కార్యనిర్వహణాధికారి సలహాతో నిర్ణయించే పద్ధతిన రహదారి భవనాల నిర్మాణ శాఖకు అప్పగించాలని నిశ్చయించటమైనది.

లోగడ నంద్యాలలో నిర్మించుటకు నిర్ణయించిన కల్యాణ మండపంతోపాటు ఆ ప్రాంగణంలో అతిథిభవనం - సమాచార కేంద్రంకూడా నిర్మించాలని తీర్మానించటమైనది.

బదరీనాథ్‌లోని బదరీ నారాయణ స్వామి ఆలయ జీర్ణోద్ధారణలో మొదటి దశగా జరిగే భవనం మండపం, తదితర నిర్మాణాల విషయంలో అయ్యే ఖర్చును భరించేందుకు, ఈ కార్యక్రమమును దేవాదాయశాఖ స్థపతి ద్వారా జరిపించి అయిన సొమ్మును ఆ శాఖకుచెల్లించేందుకు, ఆలయ పునర్నిర్మాణపు రెండవ దశలో కూడా ఇదేవిధంగా వస్తురూప సహాయం చేసేందుకు అంగీకరించటమైనది.

రిటైరైన ప్రభుత్వోద్యోగులకు పెన్షను బ్యాంకుల ద్వారా, పోస్టాఫీసుల ద్వారా చెల్లింపు జరగాలని ప్రభుత్వం ఇచ్చిన 422 ఆర్థిక ప్రణాళికా విభాగం (ఆర్థిక విభాగం పి. యస్. సి. IV) 3-12-77 తేది ఉత్తరువును దేవస్థానంలో కూడా అమలు జరుప నిర్ణయించటమైనది.

దేవస్థానంలో సూపరింటెండెంటుగా ఉన్న శ్రీ యస్. కృష్ణమూర్తిని ప్రమోట్ చేసి తిరుమలలో రెండవ రిసెప్షన్ ఆఫీసరుగా నియమించటమైనది. శ్రీ పి. వెంకటమునిని కార్యనిర్వహణాధికారి పర్సనల్ అసిస్టెంటు (జనరల్) గా తిరుపతిలో బదిలీ చేయటమైనది. శ్రీ జి. కృష్ణమూర్తిని ప్రమోట్‌చేసి తిరుపతిలో రిసెప్షన్ ఆఫీసరుగా నియమించటమైనది.

శ్రీ కె. సుబ్బారెడ్డిని తిరుమల నుండి అదనపు కోశాధికారిగ తిరుపతికి బదిలీ చేయటమైనది. శ్రీ పి. కనకభూషణంను ఇన్స్పెక్షన్ ఆఫీసరుగానూ, కుమారి ఓ. మునిరత్నమ్మను ఆభరణ శాఖాధికారి గానూ శ్రీ పి. వాసుదేవన్‌ను శ్రీవారి ఆలయంలో పేష్కారు గానూ బదిలీచేయటమైనది.

సూపరింటెండెంటుగా ఉన్న శ్రీ యస్. వెంకటరెడ్డిని ప్రమోట్‌చేసి తిరుమలలో 3 వ రిసెప్షన్ ఆఫీసరుగా నియమించటమైనది.

భాగవత ధర్మ ప్రచారానికి గాను హైదరాబాదు సికిందరాబాద్ నగర అడ్‌హాక్ సంఘం వారికి రు. 5,000/- మంజూరు చేయటమైనది.

కృష్ణాజిల్లా హంసలదీవిలో శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం ప్రక్కనున్న పుష్కరిణిని పునర్నిర్మించేందుకు అంగీకరించటమైనది.

శ్రీ యన్. వేంకటేశ్వరశర్మను దేవస్థానంలో శైవాగమ పండితులుగా ఒక సంవత్సరము పాటు నియమించటమైనది.

భక్తిగీతాలు స్తోత్రాల ప్రచారానికి గాను, గ్రామఫోను రికార్డింగ్ వగైరాల కయ్యే ఖర్చు దేవస్థానం భరించి, శ్రీమతి యం. యస్. సుబ్బులక్ష్మిచే అన్నమాచార్య కీర్తనలలో రెండు, స్తోత్రాదులపై నాలుగు పాడించి మొత్తం ఆరు లాంగ్ ప్లే రికార్డులను తయారు చేయించాలని. ఆరునెల్ల కాలంలో ఈ కార్యక్రమాన్ని పూర్తి చేయాలని తీర్మానించటమైనది.

విద్యార్థులలో హిందూ ధార్మిక, నైతిక విద్యాబోధన, తత్సంబంధ సాహిత్యాన్ని తక్కువధరలకు పిల్లలకు అందించే కార్యక్రమాలు, నిర్వహించేందుకు అభ్యుదయ ప్రాథమిక విద్యాసంస్థకు, ఇచ్చిన సొమ్ము పూర్తివినియోగ ధ్రువ పత్రం సంస్థ పంపే షరతుకు లోబడి, తడవకు రు. 5 లక్షల వంతున రు. 25 లక్షలు విరాళం ఈయ నిర్ణయించటమైనది.

19-1-79 ముఖ్యమంత్రి డా॥ చెన్నారెడ్డి శ్రీవారికి కల్యాణోత్సవాదులను జరిపించే సందర్భంలో, ఆయనకు ఆయురారోగ్య ప్రసాద సూచకంగా శ్రీవారి ప్రసాదంగా 10 గ్రాముల బంగారుపతకం బహూకరించ నిర్ణయించటమైనది.

ధర్మకర్తలమండలి అధ్యక్షులు డా॥ రమేశన్ యం; ఏ; పి. హెచ్. డి. ఐ. ఏ. ఎస్ చే రచింపబడిన 'తిరుమల ఆలయం' అన్న ఆంగ్ల గ్రంథాన్ని 2000 ప్రతులు ముద్రించాలని, తమిళం, తెలుగు, హిందీ, భాషలలోను కూడా అనువదింపజేసి అనువాదకులకు గ్రంథ నిపుణులమండలి నిర్ణయం మేరకు పారితోషికం చెల్లించాలని, ఈ భాషలలో ప్రతిభాషలోను 500 ప్రతులు డీలక్స్ ఎడిషన్‌గా ముద్రించాలని నిర్ణయించటమైనది. *

## నాగపూర్‌లో సమాచార కేంద్రం

నాగపూర్‌లో తిరుమల తిరుపతి దేవస్థాన సమాచారకేంద్రం ఇటీవల ప్రారంభింపబడినది. శ్రీ వేంకటేశ్వర, పద్మావతి చిత్ర పటాలు, ఇతర ధార్మిక సాహిత్యం ఇక్కడ లభిస్తుంది.

వివరాలకు: ఆంధ్రసంఘం,
169, నార్త్ అంబజరిరోడ్డు, నాగపూర్: 440010.

(8 వ పేజీ తరువాయి)

నారాయణశాస్త్రి గారు పట్టిన నొక ఛానిని క్రింది రీతినిచ్చియున్నారు.

1. నారదీయము 2. దేవీ పురాణము 3. ధర్మపురాణము 4. ఆది పురాణము 5. బృహన్నారదీయము 6. కాళికా పురాణము 7. శివధర్మపురాణము 8. సౌర పురాణము 9. నండీశ్వర పురాణము 10. చండికా పురాణము 11. బృహద్ధర్మ పురాణము 12. నాంద పురాణము 13. బృహన్నందీశ్వరము 14. వాసిష్ఠము 15. విష్ణుధర్మము 16. దౌర్వాసము 17. శివ పురాణము 18. మారీచము 19. విష్ణు ధర్మోత్తరము 20. కాపిలము 21. సాంబ పురాణము 22. వారుణము 23. నారసింహపురాణము 24. మానవ పురాణము 25. గణేశపురాణము 26. పారాశర్యము 27. భార్గవ పురాణము 28. ఔశనసము 29. లింగ పురాణము 30. వామనము 31. బ్రహ్మాండ పురాణము 32. భవిష్యోత్తరము 33. కల్కి పురాణము. 34. సనత్కుమారీయము.

ఇట్లు పురాణోపపురాణ భేదములచేత ననంతముగ పెరిగిపోయిన పురాణవాఙ్మయమునందలి పదునెనిమిది మహాపురాణములను సత్యవతీ తనయుడగు వ్యాస మహర్షి రచించెనని (వ్యాస శబ్దము బిరుదము మాత్రమే కానిపేరు కాదు. వ్యాసులు 28 మంది కలరు. ఋతుడను పేరు గల వాల్మీకి 24 వ వ్యాసుడు.) "అష్టాదశ పురాణానాం కర్తా సత్యవతీ సుతః—" అను భారత వాక్యము తెల్పుచున్నది. ఉపపురాణములు లెక్కకుమిక్కిలిగ నున్నను ప్రచారము నందవియును పదునెనిమిది యనియే. వీని కర్తలను కూర్మపురాణ మిట్లు పేర్కొనుచున్నది.

'ఆద్యం సనత్కుమారోక్తం, నారసింహం తతః పరమ్।
తృతీయం వాయవీయం చ, కుమారేణచ భాషితమ్॥
చతుర్థం శివధర్మాఖ్యం, సాక్షాన్నందీశ భాషితమ్।
దుర్వాససోక్త మాశ్చర్యం, నారదీయమతః పరమ్॥
నందికేశ్వర యుగ్మం చ, తథైవోశన పేరితమ్।
కాపిలం వారుణం సాంబం, కాళికాహ్వయ మేవచ॥
మాహేశ్వరం తథాకల్కి, దైవం సర్వార్థ సిద్ధిదమ్।
పరాశరోక్తమపరం, మారీచం భాస్కరాహ్వయమ్॥'

అష్టాదశ పురాణములు సాత్త్విక రాజస తామస పురాణములని మూడు విధములు. పద్మపురాణ మీ భేదముల నిట్లు వివరించినది.

'వైష్ణవం నారదీయంచ- తథా భాగవతం శుభమ్।
గారుడంచ తథాపాద్మం, వారాహం శుభదర్శనే॥
సాత్త్వికాని పురాణాని, విజ్ఞేయాని శుభానివై।
బ్రహ్మాండం బ్రహ్మ వైవర్తం మార్కండేయం తథైవచ॥
భవిష్యం వామనం బ్రాహ్మం, రాజసాని నిబోధత।
మాత్స్యం కౌర్మం తథా లైంగం శైవం స్కాందం తథైవచ॥
ఆగ్నేయంచ షడేతాని, తామసాని నిబోధమే॥"

విష్ణు నారద భాగవత గరుడ వారాహ పద్మపురాణములు సాత్త్వికములు. ఇవి విష్ణుదేవుని కీర్తించునవి.

బ్రహ్మ బ్రహ్మాండ బ్రహ్మవైవర్త మార్కండేయ భవిష్య వామన పురాణములు రాజసములు ఇవి అగ్నిని. సరస్వతీ బ్రహ్మలను స్తుతించునవి.

అగ్ని మత్స్య కూర్మలింగ శివస్కాంద ములు తామసములు. ఇవి శివలింగ, గణనాయక, కుమార స్వాములను, దుర్గను పొగడునవి. మత్స్యపురాణము సాత్త్విక రాజస తామస భేదములను పేర్కొనుటతోనాగక సంకీర్ణమని మరియొక భేదమును గూడ నిట్లు వివరించినది.

'సాత్త్వికేషు పురాణేషు మాహాత్మ్య మధికం హరేః।
రాజసేషుచ మాహాత్మ్య మధికం బ్రహ్మణోవిదుః॥
తద్వదగ్నేశ్చ మాహాత్మ్యం తామసేషు శివస్య చ।
సంకీర్ణేషు సరస్వత్యాః పితౄణాంచ నిగద్యతే॥'

(శ్రీ)హరిని కీర్తించునవి సాత్త్వికములు. బ్రహ్మనుపొగడునవి రాజసములు. అగ్నిని,

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం

నారాయణవనం.

★

### నిత్యకార్యక్రమ వివరాలు

| | | | |
|---|---|---|---|
| సుప్రభాతం ఉ॥ | 6-30 నుండి | | 7-00 |
| విశ్వరూపదర్శనం | 7-00 | ,, | 8-30 |
| తోమాలసేవ | 8-30 | ,, | 9-00 |
| కొలువు, అర్చన | 9-00 | ,, | 9-30 |
| శాత్తుమొర & గంట | 9-30 | ,, | 10-00 |
| సర్వదర్శనం | 10-00 | , | 11-30 |
| 2-గంట, అష్టోత్తరం (ఏకాంతం) | 11-30 | ,, | 12-00 |
| తీర్థానం | 12-00 | | |
| సర్వదర్శనం సా॥ | 4-00 | ,, | 6-00 |
| తోమాలసేవ, అర్చన (ఏకాంతం) | 6-00 | ,, | 6-30 |
| రాత్రి కైంకర్యం | | | |
| శాత్తుమొర | 6-30 | ,, | 7-00 |
| సర్వదర్శనం | 7-00 | ,, | 8-45 |
| ఏకాంతసేవ | 9-00 | | |

### ఆర్జితాదుల వివరాలు

| | | | |
|---|---|---|---|
| అర్చన, అష్టోత్తరం | .... | రు. | 3-00 |
| హారతి | .... | రు. | 1-00 |
| కొబ్బరికాయకు | .... | రు. | 0-50 |
| సహస్రనామార్చన | .... | రు. | 5-00 |
| పూలంగి (గురువారం మాత్రం) | .... | రు. | 1-00 |
| అభిషేకానంతర దర్శనం (శుక్రవారం) | | రు. | 1-00 |
| తిరుచ్చి వాహనోత్సవం (వాహకుల రుసుముకాక) | | రు. | 15-00 |
| సింగమొరై ఖర్చులు | .... | రు. | 2-50 |



కాలభైరవుడు. కాళహస్తి.
ఫోటో: శ్రీ యస్. వి. కె శ్రీనివాసన్, తిరుపతి.

శివుని ప్రస్తుతించునవి తామసములు. సరస్వతిని పితృదేవతలను పొగడునవి సంకీర్ణములు), తామస పురాణములు పతనానర్హములనియు, అవి దుర్గతినికలిగించుననియు పారాశర్యోపపురాణము వచించినది. అందుకు కారణము మృగ్యము. సత్త్వరజస్తమో విభాగము పురాణములకు మాత్రమే పరిమితముగాదు. యజుర్వేదము సాత్త్వికమని, ఋగ్వేదము రాజసమని, సామవేదము, గౌతమ శంఖలిఖితాదిస్మృతులు, న్యాయ సాంఖ్యాది శాస్త్రములు తామసములని యీ భేదము శ్రుతి స్మృత్యాదులకు సైతము విస్తరింపబడినది. సకల చరాచర జగత్సృష్టికి మూలకారణుడగు పరమాత్ముడే సత్త్వరజస్తమో గుణభేదములతో విష్ణు బ్రహ్మ ఈశ్వరులుగా పేర్కొనబడినాడు. సమస్త సృష్టియు సత్త్వరజస్తమోగుణ పూరితము. త్రిగుణాత్ములగు త్రిమూర్తులలో హెచ్చుతగ్గులు లేనట్లే సాత్త్విక రాజస తామస పురాణముల యందు కూడ హెచ్చు తగ్గులు లేవు. వీనికి నిర్గుణము నిరంజనము, నిత్యము శుద్ధమునగు చైతన్యమే మూలమని సకల పురాణ సారాంశము. ఈ రహస్యమును సమరస భావముతో గ్రహించినప్పుడే సమస్త పురాణములకు సమన్వయమును సాధింప శక్యమగును.

ఇక ఆధునిక విమర్శకులీ పురాణముల నెట్లు విభజించిరో తిలకింతము. బ్రాహ్మము పాద్మము బ్రహ్మదేవుని, బ్రహ్మవైవర్తము సూర్యుని, ఆగ్నేయము అగ్నిని, శివ స్కాంద లింగ కూర్మ వామన వరాహ భవిష్య మత్స్య మార్కండేయ బ్రహ్మాండ పురాణములు ఈశ్వరుని. నారదీయ భాగవత గరుడ విష్ణుపురాణములు విష్ణుదేవుని స్తుతించునవియని శ్రీ వి. రామచంద్ర దీక్షితర్ విభజించిరి. అమరసింహునిచేత చెప్పబడిన పురాణ పంచ లక్షణములకు సమీపముననున్నవి. ప్రక్షిప్తములు తక్కువగ చేరినవి, యగు పురాణములు ప్రాచీనము లనియు, పంచలక్షణములకు కట్టుబడక విషయ విస్తారముచేత నొప్పు పురాణము లర్వాచీనములనియు శ్రీ పుసాల్కర్ స్థూల విభజన మొనరించిరి. ఇతని యభిప్రాయమున వాయు, బ్రహ్మాండ, మత్స్య విష్ణుపురాణములు మిక్కిలి ప్రాచీనములు. శ్రీహరి ప్రసాదశాస్త్రి పురాణ వాఙ్మయమును నిశితముగ పరిశీలించి క్రిందిరీతి నారు భాగముల నొనర్చి ప్రశంసార్హులైరి. అవి —

1. విజ్ఞాన సర్వస్వము లనదగిన పురాణములు.
   1. గారుడము 2. ఆగ్నేయము
   3. నారదీయము.
2. తీర్థవ్రత మాహాత్మ్యాదుల నధికముగ వర్ణించు పురాణములు.
   1. పాద్మము 2. స్కాందము
   3. భవిష్యము.
3. ప్రక్షిప్తములుచేరి పెరిగినపురాణములు
   1. బ్రాహ్మము 2. భాగవతము.
   3 బ్రహ్మవైవర్తము.
4. చారిత్రకాంశములు మిక్కిలిగ గల పురాణములు.
   1. బ్రహ్మాండపురాణము 2. వాయు పురాణము
5. మత ప్రాధాన్యముగల పురాణములు
   1. లైంగము 2. వామనము
   3, మార్కండేయము.
6. విష్ణుని యవతార నామములు గల పురాణములు.
   1. మాత్స్యము 2. కౌర్మము
   3. వారాహము.

ఇట్లు ప్రాచీనార్వాచీనుల చేత విభజింపబడిన పురాణవాఙ్మయ మొక విజ్ఞాన సాగరము. ఇందొక్కటి లేదా కొన్ని యేదో నొక దేవత కాధిక్యమును చెప్పినను అన్య దేవతా నిరసనము నెంత మాత్రము చేసినవి కావు.

(ఎ) "ఏకం సత్ విప్రా బహుధావదంతి"
(ఒక సత్యమగు తత్త్వమునే జ్ఞానులు వివిధములుగ వర్ణించుచున్నారు.)

(బి) "ఏకోవశీ సర్వభూతాంత రాత్మా
ఏకంరూపం బహుధాయః కరోతి।
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాస్తే
షాం సుఖం శాశ్వతన్నేతరేషామ్॥

(సర్వ భూతములయొక్కయు అంతరాత్మగా నిలిచిన ఆ ఒక తత్త్వము ప్రియతమమైనది. అది ఒక రూపమునందుండిన ప్రపంచతత్త్వమును వివిధ రూపములయందు సృష్టించినది. ఆత్మయందుండు ఆ తత్త్వమును ఏ జ్ఞానులు దర్శింతురో వారికే శాశ్వత సుఖము లభించును. ఇతరులకు లభింపదు.)

సి) "ఏకోదేవః సర్వభూతేషుగూఢః సర్వ
వ్యాపీ సర్వభూతాంత రాత్మా।

కర్మాధ్యక్షః సర్వ భూతాధి వాసః
సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ ॥"

(ఒకే దైవము అన్ని ప్రాణుల యందును దాగియున్నది. అది ప్రతి పదార్థము నందును వ్యాపించి ప్రతి ప్రాణిని నియమించుచున్నది. కర్మలను నడిపించుచు సర్వభూతములకు నాధారమైయున్నది. సాక్షిభూతము గాను, చైతన్యరూపము గాను, అద్వితీయముగాను, గుణరహితము గాను. అది యున్నది.) అను ప్రమాణములు భారతీయసంస్కృతికి జీవనాడులు. పురాణములలో కొన్నింట శివోత్కర్షము కొన్నింట విష్ణు ప్రాశస్త్యము, మరి కొన్నింట నితర దేవతా ప్రాముఖ్యము వర్ణింపబడి యున్నను ఆయా మూర్తి విశేషముల వలన జనులకు భక్త్యతిశయము, చిత్తైకాగ్ర్యము అలవడుననెడి నమ్మకముచే నివి యొక్కొక్కటి యొక్కొక్క దేవత కాధిక్యమిచ్చునవే గాని వాని యందు భేదబుద్ధి పాటింపగాదు. అనేకత్వమున నేకత్వమును దర్శించిన సర్వసమన్వయ దృష్టి పూరితములీ పురాణములని ప్రస్తుతింపవచ్చును.

## కాలము

పురాణముల జన్మకాలము నిదమిత్థముగ నిర్ణయింప నసాధ్యము. ఋగ్వేదమునందు విశేషముగ వాడబడిన పురాణశబ్దము అధర్వవేద కాలము నాటికి విశేష్యముగ మారినది. తైత్తిరీయ ఛాందోగ్య శతపథ బ్రాహ్మణ బృహదారణ్యకోపనిషత్తులు పురాణముల నిట్లు పేర్కొన్నవి.

ఎ) "వేద ఇతిహాస పురాణగాథా" ...(తైత్తిరీయము)
బి) " ఇతిహాస పురాణం.........(బృహదారణ్యకము)
సి) " ఇతిహాసపురాణం పంచమం వేదానాం వేదమ్" (ఛాందోగ్యము)
డి) " ఇతిహాస పురాణ ఉపనిషత్సూత్ర "....... (శతపథబ్రాహ్మము)

క్రీస్తు పూర్వము 4, 5, శతాబ్దముల నాటి ఆపస్తంభ ధర్మసూత్రములు పురాణముల నుండి కొన్ని శ్లోకముల నుటంకించుటయే గాక భవిష్య పురాణమును పేర్కొనుటయుజరిగినది, ఇంచుమించుగ నీ కాలమునకు చెందినదైన గౌతమధర్మసూత్రములు రాజ్యపాలన విషయమున ప్రభువు పురాణముల నాదర్శముగ గ్రహింపవలెనని యుద్ఘాటించినది. కౌటిల్యుని అర్థశాస్త్రమున పురాణ ప్రశక్తి చూపట్టుచున్నది. మహాభారతము మత్స్య వాయు పురాణములను పేర్కొన్నది. అమరసింహుని కాలము నాటికే పురాణముపంచలక్షణమని నిర్ధారితమైనది. భాసకాళిదాస అశ్వఘోషులు పురాణముల నెరిగియున్నట్లు నిదర్శనములు గలవు. పాశ్చాత్య విమర్శకులగు వింటర్నిడ్జ్, విల్సన్ మొదలగువారు పురాణముల జన్మకాలము క్రీస్తుశకమునకు తరువాతనని యభిప్రాయ పడుచున్నారు. వీరి వాదములను సయుక్తికముగ ఖండించుచు క్రీ॥ పూ॥ 4, 5 శతాబ్దములకు పూర్వమే పురాణ రచనము జరిగినదని మేజర్ బసు సిద్ధాంత మొనర్చియున్నాడు. "అధర్వవేద, శతపథ బ్రాహ్మణముల యందును, ప్రాచీనోపనిషత్తుల యందును కనవచ్చు పురాణపదమును గూర్చి మన కేమియు తెలియదు, కాని వేదములవలెనీ పురాణములును ఇతిహాసములతో గలసి వేదకాలమునాటికే పవిత్రములుగ నెంచబడు చుండెన"ని కాణే పండితుని యభిప్రాయము. శైవ వైష్ణవాది మతములు పరస్పరము సంఘర్షించుకొన్న దినములలో (క్రీస్తుశకము 6, 7 శతాబ్దముల కాలము) పురాణముల పుట్టుక యని కొందరు తలంచుచుండగా నివి క్రీస్తు శకారంభమున కీవలివని చెప్పుట కవకాశము కనబడదనియు, కర్మభక్తి జ్ఞాన మార్గములను సులభముగ నుపదేశించుచు వడుమ నడుమ నాస్తికమతముల నణగద్రొక్కుచు శైవ వైష్ణవ మతములను విగ్రహారాధనమును విస్తరింపజేయుచు వచ్చిన యీ పురాణములు హరివంశమునకు క్రీస్తుశకారంభమునకు మధ్యకాలమున నుదయించి యుండుననియు, మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు భావించుచున్నారు. శైవ వైష్ణవాది మతములు పరస్పరము ప్రతిఘటించు కాలమున అనగా 6, 7, శతాబ్దములలో నుపపురాణము లావిర్భవించి యుండునని కూడ వీరభిప్రాయపడిరి. మొత్తముపై పురాణములన్నియు వేదవ్యాస విరచితములని ప్రచారము నందున్నను అవి యొక కాలమున, ఒక వ్యక్తిచేత రచింపబడినవని మాత్రము చెప్పుటకు వీలులేదు. క్రీస్తుపూర్వమునుండి క్రీస్తుశకము 10 వ శతాబ్దము వరకుకూడ నివి తామరతంపరగ ననేకులచేత నిర్మింపబడుచునే వచ్చినవి. ఏ పురాణము ఏ కాలమున నుద్భవించినదో నిర్ణయించుట దుస్తరము.

---

(6వ పేజీ తరువాయి)

### మనవి

1. ఈ అనువాదం చదివేటప్పుడు పఠితలు ఈ క్రింది విషయమును దృష్టిలో ఉంచుకొన మనవి.

1. ఈ అనువాదానికి ఆధారమైన సంస్కృతమూలప్రతి బొంబాయి శ్రీ వేంకటేశ్వర ప్రెస్సువారు ప్రచురించిన నాగరిలిపి పత్రాత్మిక ప్రతి.

2. ఈ అనువాదానికి సహాయాలుగా వ్యాఖ్యానాలు లేవు. సమగ్రానువాదాలూ లేవు. గోరఖపూర్ గీతాప్రెస్‌వారి కల్యాణ సంక్షిప్త వరాహాంక 51 వ సంపుటం హిందీ అనువాదం ఉన్నది. కాని దాని పేరే అది సంక్షిప్తం అని తెలియ జేస్తున్నది. పై మూల ప్రతినీ, ఇంకా మూలానికి వచ్చి ఉంటే వివిధసంస్కరణల ప్రతులనూ, తెలుగులోని నంది మల్లయ ఘంట

సింగన, హరిభట్టుల పద్యానువాదాలనూ, హిందీ ఆంగ్లభాషలలో వచ్చిన అనువాదాలనూ, సొంత ప్రతులను సంపాదించవలసి ఉన్నది. ఈ అనువక్త 18 మహాపురాణాలనూ యథామూలంగా అనువదించి ఇంతవరకూ హిందీ ఆంగ్ల సంస్కృత ఆంధ్రభాషలలో వెలువడి తనకు తెలిసిన విశేషాలతోసహా ప్రచురించదలచుకున్నాడు. కనుక, మహాపురాణాల కన్నింటికీ సంబంధించీ, ప్రత్యేకించి శ్రీ వరాహపురాణానికి సంబంధించీ ఏవైనా వ్యాఖ్యలూ అనువాదాలూ. విమర్శలూ, వేరు, సంస్కరణల ప్రతులూ తమవద్ద కలవారూ, కలచోట్ల వివరాలు తెలిసినవారూ అనువక్తకు తెలిపితేనూ, ఖరీదుకు గాని, కొన్నాళ్లు ఉపయోగించుకొనటానికి గాని, పూర్తి ఉచితంగా గాని, ఇస్తేనూ స్వీకరించి. ఆయా గ్రంథాలలో ఆ విషయం వారిపేర్లతో సహ ప్రకటించి కృతజ్ఞత తెలుపుకొనగలడు. ఈ కార్యభారాన్ని ఇందువల్ల కలుగబోయే లోకోపకారాన్నీ అర్థం చేసుకొని అవకాశం గలవారు సహకరిస్తారని విశ్వాసం.

3. ఈ అనువాదం కుదింపు పెంపు మళ్లింపులు లేక, మూలంలో ఉన్నదున్నట్టు ఉంటుంది.

4. ఎక్కడయినా మూలంలోని పదాలకు అధికంగా చేర్చవలసివస్తే, అలా చేరినపదాలు కుండలీకృతాలు ( ) కాగలవు. ఈ చేరికకు ప్రయోజనం ౧ వివరణమో, ౨ అతుకో, ౩ అధ్యాహారమో కావచ్చు.

5. ఎన్నవశ్లోకం అనువాదం ఎక్కడకు పూర్తిఅయితే, అక్కడ అందుకు గుర్తుగా ఆ శ్లోకసంఖ్య చిన్నఅంకెతో సూచకం కాగలదు. ఇందువల్ల ఇన్నవ అధ్యాయం, ఇన్నవశ్లోకంలో, ఈ విషయం ఇలా చెప్పబడినది, అని నిస్సంకోచంగా నిశ్చితంగా, సాధికారికంగా చెప్పదలచుకొన్న వారికీ, ఆ భాగాన్ని మూలంతోగాని. ఇతరఅనువాదాలతో గాని సరిపోల్చి చూచుకొనదలచుకొన్న వారికీ వీలు,

6. భావపూర్తి అయే వీలునుబట్టి తప్పనిసరి అయితే ఒక్కొక్కప్పుడు అనేక శ్లోకాలను కలిపి అనువదించవలసివస్తే ఆ శ్లోకాలలో తొలి-తుదివాటి అంకెలిచ్చి, వాటినడుమ చిన్న అడ్డుగీత ఇస్తాము. ఉదా: 4–8 అంటే, ఆ అంకెలకు పూర్వం ఉన్న రచనభాగం 4,5,6,6,7,8 వ శ్లోకాలకు అనువాదం అన్నమాట.

7. వేదవ్యాసభగవానుల సంస్కృత వరాహపురాణంలో ఏమి ఉన్నదో తనకు తెలిసినంతవరకూ తెలుగుచదువరులకు తనచేతనైనంత సులభవ్యావహారికవచన శైలిలో తెలియజేయటమే అనువక్తలక్ష్యం

8. ఎక్కడయినా విశేషం ఉంటే అధోజ్ఞాపికలో వివరణం ఉండగలదు.

9. అనువదించేటప్పుడు సంస్కృత పదానికి వీలయినంతవరకూ సులభమైన తెలుగుపదం రావాలన్నదే అనువక్త అభిలాష. అయితే, ఆ కారణంగా వాక్య సౌందర్యాన్ని గాని, సంస్కృతపదాలను గాని వదలిపెట్టాలనే పట్టుదలమాత్రం లేదు. తెలుగైనా సంస్కృతమైనా తెలుగు వారివాడుకకు సాధ్యమైనంత దగ్గరగా ఉండాలన్న చూపుమాత్రం ఉన్నది.

2. పై మనవి 2వ అంశంలో వివరించినట్లు ఈ అనువక్త 18 మహాపురాణాలనూ ఈ ధోరణిలో తెలుగుచేసి సామాన్యపఠితలందరిచేతా చదివించటం తనజీవిత ప్రధానలక్ష్యంగా పెట్టుకొని, ౧. 'ముముక్షువు' లో విష్ణుపురాణమూ. ౨. 'ఆరాధన' లో వామనపురాణమూ, ౩. 'శ్రీరామకృష్ణప్రభ'లో స్కాందపురాణ సూతసంహితా, ౪. 'నా వాణి'లో బ్రహ్మవైవర్తపురాణమూ, ౫. 'యథార్థభారతి'లో శ్రీభాగవతమూ, ౬. 'మాతృశ్రీ'లో మార్కండేయపురాణమూ, ౭. ఈ 'సప్తగిరి'లో ఈ వరాహపురాణమూ ప్రచురిస్తున్నాడు.

(ఏడుకొండలదేవుని సప్తగిరిలో ప్రచురింపబడే శ్రీవరాహపురాణానువాదం రచనా ప్రచురణక్రమంలో కూడా ఏడవదికావటం అనుకోనిదే అయినా ఒకవిశేషమే.)

ఇంకా పత్రికలవారు ముందుకు వస్తే వాటిలో తదితర పురాణాలూ ప్రచురించవచ్చు. ఇది సర్వతారకమైన జ్ఞానయజ్ఞమనే విశుద్ధభావంతో వినయంతో ఈపనికి పూనుకొన్నాడు. ఈ వరాహ పురాణంలో గాని, మిగిలిన అనువాదాలలోగాని ఎంత చిన్నదోషం కనిపించినా, ఇంతకంటే బాగుండునని ఎంత చిన్నసలహా తోచినా, ఉపేక్షించటం ఔదార్యమనుకొని పఠితలు, తెలియజేయటం దేవసేవ అనుకొని అనువక్తకువ్రాసి, తెలిపితే, వివరించుకొని తప్పు దిద్దుకొంటాడు. అలా దిద్దినవారికి గ్రంథంలో విధిగా, నిరహంకారంగా, తన కృతజ్ఞత వెల్లడించుకొంటాడు. కనుక లోపాలను అనువక్తకు చిరునామాకు వ్రాయండని అణకువతోవేడుకొంటున్నాడు. ఈ అనువాదాలు ఇలా ముందుగా పత్రికలో ప్రకటించుటలో అనువక్త ప్రధాన లక్ష్యమే ఇట్టి దిద్దుబాటు. అ॥

---

వచ్చేసంచికనుండే

వరాహ పురాణం

వ్యాఖ్యతో ప్రారంభం.

---

# మీరాశి ఫలం

(1-2-79 నుండి 28-2-79)

ఈ నెలలో మీ అదృష్టం.

### మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పా)

రాహువువలన ఆందోళన, శనివలన ధననష్టం లేదా వివాదాలు లేదా సంతానం నుండి ఎడబాటు. గురువువల్ల, బంధువుల మూలకంగా ఇబ్బందులు. శుక్రునివలన ధనం, నూతనవస్త్రాలు లేదా శృంగారం, ధర్మాచరణంలో పెంపు రవి, కుజుల వలన జయం, ధనం, మంచిఆరోగ్యం, శత్రువులపై జయం లేదా ఉన్నతపదవి. బుధునివలన శృంగారం లేదా వాహన, సంతానప్రాప్తి.

### వృషభం

(కృత్తిక 2,3,4,పా, రోహిణి, మృగశిర 1, 2, పా.)

రాహువువలన వివాదాలు. శనివలన ధననష్టం, అయినవారినుండి వేర్పాటు. గురువువలన నిరాశ. శుక్రునివలననూత్న వస్త్రాలు లేదా శృంగారం, నూతనగృహం. కుజునివలన 19వ తేది వరకు ధననష్టం, అవమానం. తరువాత ధనం, జయం. రవి వలన 15 వరకు అనారోగ్యం లేదా ధన నష్టం, ప్రయత్నాలలో వైఫల్యం, తరువాత కాలంలో జయం. బుధులవలన 11 వరకు ప్రయత్నాలకు అవరోధం తరువాత ధనం, జయం.

### మిథునం

( మృగశిర 3,4 పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పా. )

రాహువువలన ధనం. శనివలన ధన, వాహన, సేవకజన, ధృఢారోగ్య, గృహ సౌఖ్యప్రాప్తి. గురువువలన ధనం. శత్రువులపై జయం. శుక్రునివలన స్త్రీలమూలకంగా ఆందోళన. రవివలన అనారోగ్యం. ముఖ్యంగా నెల 2వ భాగంలో ధననష్టం, నిరాశ. కుజునివలన నెల 15వ తేదివరకు శారీరకహాని, ధననష్టం, అవమానం తరువాత రోజులలో కేవలం ధననష్టం లేదా అవమానం మాత్రమే. బుధునివలన 11వ తేదివరకు ధనం, జయం, నూతనవస్త్రాలు లేదా సంతానావకాశం, తరువాత కాలంలో ప్రయత్నాలలో వైఫల్యం.

### కర్కాటకం

(పునర్వసు 4పా, పుష్యమి, ఆశ్లేష.)

రాహువువలన ధననష్టం. శనివలన కూడా ధననష్టం, అసౌఖ్యం. గురువువలన వివాదాలు, ధననష్టం లేదా పదవీచ్యుతి. శుక్రునివలన అవమానం లేదా అనారోగ్యం. కుజునివలన భార్యతో తగాదాలు లేదా కంటిలో గాని కడుపులో గాని బాధ 19వ తేదివరకు. ఆ తర్వాత ధన, గౌరవ భంగం. రవివలన 15వ తేదివరకుప్రయాణము, ఉదరబాధ, ఆ తర్వాత కాలంలో అనారోగ్యం, భార్యకు అసంతుష్టి. బుధుని వలన 11వ తేదివరకు వివాదాలు తరువాత కాలంలో ధనం, జయం, నూతనవస్త్రాలు, లేదా సంతానావకాశం కూడా.

### సింహం

(మఖ, పూ. ఫ, ఉత్తర 1వ పా.)

రాహువువలన ఆందోళన. శనివలన శరీరానికి గాయాలు లేదా అయినవారినుండి వేర్పాటు లేదా ప్రయాణం, ప్రయాస లేదా ధననష్టం లేదా కుమారులతో వివాదం. గురువు వలన ప్రయాణం, ప్రయాస. శుక్రునివలన బంధువులరాక, పెద్దలనుండి ప్రశంస లేదా ధన, సన్మిత్రప్రాప్తి లేదా సంతానావకాశం. రవివలన ధృఢారోగ్యం శత్రువులపైజయం నెల మొదటిపక్షంలో ప్రయాణం, ఉదరబాధ రెండవపక్షంలోనూ. కుజునివలన 19 వరకుధనం, జయం తరువాత భార్యతోవివాదాలు, ఉదర లేదా నేత్ర బాధ. బుధునివలన 11తేదివరకు జయం, ఉన్నతపదవి తరువాత కాలంలో తీవ్ర వివాదాలు.

### కన్య

(ఉత్తర 2, 3. 4 పా. హస్త; చిత్ర 1, 2 పా.)

రాహువువలన ధననష్టం. శనివలన ఆందోళన. గురువువలన ధనం, ఉన్నత స్థితి. శుక్రునివలన సన్మిత్రప్రాప్తి. రవి వలన నెల మొదటిపక్షంలో అనారోగ్యం లేదా శత్రువులమూలంగా బాధలు. కుజుని వలన 19 వరకు సంతానంమూలకంగా గాని, అనారోగ్యంవలన గాని ఆందోళన, శత్రువులమూలంగా బాధలు, తరువాత కాలంలో ధనం, శత్రువులపై జయం. బుధునివలన 11 వరకు భార్యతో లేదా బిడ్డలతో వివాదాలు. తరువాతకాలంలో జయం, ఉన్నతపదవి.

### తుల

(చిత్త 3, 4 పా: స్వాతి, విశాఖ 1, 2, 3 పా:)

రాహువువలన సుఖం. శనివలన ధనం లేదా శృంగారం. గురువువలన ధన లేదా గౌరవభంగం. శుక్రునివలన ధనం, గౌరవము, నూతనవస్త్రాలు. రవివలన నెల మొదటి పక్షంలో అనారోగ్యం. రెండవ పక్షంలో శత్రువులమూలంగా లేదా అనారోగ్యకారణంగా ఆందోళన. కుజునివలన 19వరకు జ్వరం, ఉదరబాధ లేదా దుష్టుల వలన ఆందోళన, తరువాతకాలంలో అనారోగ్యం లేదా శత్రువులమూలంగా, సంతానం మూలంగా ఆందోళన. బుధునివలన 11వరకు గృహంలో సమృద్ధి, తరువాత కాలంలో భార్యా బిడ్డలతో తగాదాలు.

### వృశ్చికం

(విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

రాహువువలన వివాదాలు. శనివలన ధననష్టం, అగౌరవం. గురువువలన జయం ధనం, ఆహారధాన్యాలు లేదా సంతానప్రాప్తి. శుక్రుని వలన ధనం, ఆహారధాన్యాలు, గౌరవం, వస్తుసమృద్ధి లేదా సంతానప్రాప్తి. రవివలన ధనం, గౌరవం, శత్రువులపై జయం, నెల మొదటిపక్షంలోను అనారోగ్యం రెండవ పక్షంలోనూ. కుజునివలన

( 40వ పేజి చూడుడు )



అన్నమాచార్య కళామందిరంలో బహుళద్వాదశి ఆరాధనాజ్యోతిని వెలిగిస్తున్న కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్

# వార్తలు - విశేషాలు

### బహుళద్వాదశి ఆరాధన

అన్నమాచార్య సాహిత్యాన్ని వెలికి దీసి ఆస్తిక సమాజానికందించటంలో దేవస్థానం బహుముఖ ప్రయత్నాలు చేస్తున్నది. అన్నమాచార్య జన్మస్థలమైన తాళ్ళపాక గ్రామాభివృద్ధి అందులో ఒకటి.

శ్రీవేంకటేశ్వరస్వామి భక్తుడు. ఆస్వామిపై 32,000 ల ఆధ్యాత్మ శృంగార కీర్తనలు రచించి పదకవితా పితామహుడని పేరుగన్న తాళ్ళపాక అన్నమాచార్యుల బహుళద్వాదశీ ఆరాధనోత్సవంలో 25–1–79 న దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ ఈ విషయాన్ని వెల్లడించారు.

అన్నమాచార్య ప్రచార ప్రణాళిక ఆధ్వర్యంలో జరిగిన ఈ బహుళ ద్వాదశి ఆరాధనోత్సవంలో శ్రీ ప్రసాద్ ఆరాధనజ్యోతిని వెలిగించారు.

అన్నమాచార్యులు ఫాల్గుణ బహుళ ద్వాదశిన పరమపదమందారని, ఆమహనీయుని స్మృతికి చిహ్నంగా, ప్రతినెల బహుళద్వాదశి ఆరాధనం జరుగుతుందని, ఆరోజున గాయకులు అన్నమాచార్య కీర్తనల గానం చేస్తారనీ ఈ ప్రణాళిక ప్రత్యేకాధికారి శ్రీ కె. శ్రీనివాసులుశెట్టి అన్నారు.

ఈ కార్యక్రమాన్ని ప్రారంభించిన శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, దేవస్థానం తాళ్ళపాక వంశీయుల ముఖ్యంగా అన్నమాచార్య కీర్తనల ప్రచారం విషయంలో బహుముఖ కార్యక్రమం చేపట్టిందని అన్నారు.

తామ్రఫలకాలలో లిఖితమై అజ్ఞాతంగా ఉన్న కీర్తనలను పరిష్కరించి గ్రంథ రూపంలో వెలువరించేందుకు ప్రత్యేకాధికారి పర్యవేక్షణలో ఒక విభాగం ఏర్పాటు చేయబడిందని, అలాగే గ్రంథస్థమైన పాటలలో కొన్నిటిని ప్రత్యేకంగా వేరుపరచి వాటిని స్వరకల్పనతో ముద్రించటం, ఆ ముద్రించిన వాటిలో కొన్నిటిని ప్రచారం చేయించటం ఇంకొక భాగమని అన్నారు.

అన్నమాచార్య కీర్తనలను స్వరపరచి ప్రచారం జరిపేందుకు అన్నమాచార్య కళామందిరం కేంద్రంగా ప్రత్యేక విభాగం ఏర్పాటైందని, ఆర్ష సంస్కృతి సదస్సు క్రింద పనిచేసే సంగీత కళాకారులు ఈ కొత్త విభాగంక్రింద పనిచేసి, కచ్చేరీలు జరిపి, అన్నమాచార్య కీర్తనల గాన విధానం ప్రచారం చేస్తారని, ఇవిగాక ఈ కీర్తనల గానంలో విద్యార్థి వేతనాలపై శిక్షణపొందుతున్న యువగాయకులలో యోగ్యులైనవారిని శాయంగా నియమించి దేశంలోని వివిధ కేంద్రాలలోనూ, అన్ని దేశాలలోకూడా ప్రచారం చేయించటం జరుగుతుందని, ఈ కార్యక్రమంలో పాల్గొనేందుకు ఆహూతులైన కళాకారులకు ప్రత్యేక పారితోషికాలు ఇవ్వబడతవనీ అన్నారు.

ఆరాధనా కార్యక్రమంలో పాల్గొన్న శ్రీ డి. పశుపతి బృందం



దేవస్థానం, దేశంలోని పలువురు సంగీత విద్వాంసులద్వారా వారివారి కచ్చేరీలలో ప్రచారం చేయించటమేగాక, రికార్డింగ్ కయ్యే పూర్తి ఖర్చును దేవస్థానమే భరించి శ్రీమతి యం. యస్. సుబ్బులక్ష్మి ద్వారా అన్నమాచార్య కీర్తనలలో రెండు, ఇంకా ఇతర స్తోత్రాలపైన నాలుగు లాంగ్ ప్లే రికార్డులు, తయారు చేయిస్తున్నదనీ ఈ విషయములలో జరగవలసిన ముందు కార్యక్రమములు జరుగుతున్నవనీ అన్నారు.

అన్నిటికన్న ముఖ్యంగా అన్నమాచార్యుల జన్మస్థలాన్ని చిరస్మరణీయంగా రూపొందించేందుకుగాను, తాళ్ళపాక గ్రామాన్ని దేవస్థానం దత్తత తీసుకొని అక్కడ ఆధ్యాత్మిక చింతనను ఇతోధికంగా పెంపుచేయటమేగాక, ఆ గ్రామానికి కావలసిన కనీససౌకర్యాలు యేర్పరచి దానిని తీర్చిదిద్దే నిర్ణయం తీసుకున్నదని అన్నారు.



తాళ్ళపాక గ్రామం-అన్నమయ్య జన్మభూమి

ధర్మప్రతిష్ఠాన కార్యదర్శి డా. అర్కసోమయాజి శాస్త్రీయమైన గ్రంథాలు విద్యావంతులకుపయోగించునట్లు, సామాన్యులలో భక్తిభావ ప్రబోధానికి సంగీతంకన్న చక్కని సాధనం లేదని అన్నారు.

దేవస్థాన ప్రజాసంబంధాధికారి శ్రీ సూర్యనారాయణమూర్తికూడా ప్రసంగించారు.

తరువాత, సంగీత కళాశాల అధ్యాపకులు, అన్నమాచార్య కీర్తనల శిక్షణ పొందే విద్యార్థులు, సదస్సు కళాకారులు, అన్నమాచార్యునికీర్తనలను గానంచేశారు.

## వేదపండిత స్నాతకోత్సవం

వేదశాస్త్రాలలో పాండిత్యం గడించిన వారికిధ్రువపత్ర, పారితోషికప్రదానోత్సవం జనవరి మొదటివారంలో విజయవాడలో జరిగింది.

లబ్బీపేటలోని శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానంలో జరిగిన ఈ సదస్సులో 11 మంది విద్యార్థులు ధ్రువపత్రాలను, పారితోషికాలను పొందారు.

వేదరక్షణ నిధి ఆధ్వర్యంలో జరిగిన ఈ కార్యక్రమానికి దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ అధ్యక్షత వహించారు. ఈ పథకాన్ని వేద వాఙ్మయ రక్షణకుగాను శ్రీమతి యం. యస్. సుబ్బులక్ష్మి ఏర్పాటుచేసిన విరాళంతో తి. తి. దేవస్థానం నిర్వహిస్తున్నదని అన్నారు.

ఈ నాడు వేదపండితులుకూడా తమబిడ్డలను వేదవిద్యలో ఉంచే విషయం గురించి పునరాలోచన చేయవలసి వస్తున్నదంటే కారణం వేదవిజ్ఞానం అన్నం పెట్టదని అనిపించటమేననీ, ఈ దుస్థితి తప్పించి భావి తరాలవారికి వేదవిజ్ఞానం అందుబాటులో ఉండేందుకుగాను కంచి కామకోటి పీఠాధిపతులు జగద్గురు శ్రీ శ్రీ శ్రీ శంకరాచార్య స్వామివారి ఆశీస్సులతో ఇక్కడ వేదపాఠశాల ప్రారంభించామని ఈ పాఠశాలలో గాని, ఇతర దేవాలయాల సహాయంతో గాని చదివి ఉత్తీర్ణులైన వారిని దేవస్థానం అధ్యాపకులుగా నియమించవచ్చని అన్నారు.

మాజీ న్యాయమూర్తి శ్రీ గొల్లపూడి వేంకటరామశాస్త్రి తమ స్నాతకోపన్యాసంలో, వేదపండితులు తమబిడ్డలు ఇంగ్లీషు విద్యావ్యామోహంలో పడకుండా వేదవిద్యాభ్యాసానికున్న సదుపాయాలన్నిటిని ఉపయోగించుకోవాలని కోరారు. విద్యార్థులకు పారితోషికాలు, ధ్రువపత్రాలు పంచిపెట్టారు.

హిందూధర్మ ప్రతిష్ఠానం కార్యదర్శి (తిరుపతి) డా. అర్కసోమయాజి, సర్వశ్రీ మద్దులపల్లి మాణిక్యశాస్త్రి, ఉప్పాల లక్ష్మణావధాని, ప్రభృతులు ప్రసంగించారు.

వేదరక్షణనిధి కార్యదర్శి శ్రీ బి. విశ్వనాథరావు నివేదిక సమర్పించారు.

## వేదపారాయణ పథకం

వేదవిజ్ఞానాన్ని దాని పూర్వ వైభవంతోను పావిత్ర్యంతోను నిలబెట్టేందుకు వీలైనన్ని బృహత్పథకాలను దేవస్థానం చేపట్టింది. అందులో వేదపారాయణ పథకం ఒకటి.

ఈ విషయంగా దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ జనవరి 18 న పత్రికావిలేఖరులకు వివరిస్తూ పథకంక్రింద ఈ ఏడు రు. 5 లక్షలు వెచ్చించదలచినట్లు తెలిపారు.

ఈ పథకం ప్రకారం ఘనపాఠులను, క్రమపాఠులను రాష్ట్రంలోని వివిధ దేవాలయాలలో ప్రతిదినం మూడుగంటలపాటు వేదపారాయణం జరిపేందుకు నియమిస్తారు. అయితే 70 ఏళ్ళకు పైబడిన వృద్ధపండితులు తమగృహాలలోనే వేద పారాయణం చేయవచ్చు.

ఇంతవరకు 220 మంది పండితులు రాష్ట్రంలోని వివిధ దేవాలయాలలోను నియుక్తులయ్యారు. ఇక ఈ పండితులకు నెలసరి సంభావనగా రు. 300/, ఘనపాఠులకు, రు. 200/-, క్రమపాఠులకు రు.100/- వృద్ధపండితులకు ఇవ్వబడుతున్నది.

కనుక వేదపండితులందరూ ఈ అవకాశాన్ని వినియోగించుకోగలరన్న ఆశాభావాన్ని ప్రసాద్ వ్యక్తం చేశారు.

### క్రీడారంగం

విద్యార్థి లోకములో ముఖ్యంగా దేవస్థాన విద్యాసంస్థలలో క్రీడాభివృద్ధి ద్వారా పరస్పరావగాహన, సౌభ్రాతృత్వాలను పెంపుచేసేందుకు గతకొద్ది సంవత్సరాలుగా దేవస్థానం ప్రయత్నిస్తున్న విషయం అందరికి తెలిసినవే.

ఆ బహుళార్థ సాధక కార్యక్రమంలో భాగంగా దేవస్థానం ఇటీవల హాకీ, వాలీబాల్ పోటీలు నిర్వహించింది.

24-12-78 నుండి 27-12-78 వరకు నిర్వహింపబడిన హాకీ పోటీలను మొదటి రోజున దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ అధ్యక్షతన చంద్రగిరి సబ్‌కలెక్టరు శ్రీ ఎ. పి. వి. ఎన్. శర్మ ప్రారంభించారు. భారత్ హెవీ ఎలక్ట్రికల్ సంస్థ (హైదరాబాదు)కు ప్రథమ బహుమతి; కారోనేషన్ హాకీ క్లబ్ (సికిందరాబాదు) వారికి ద్వితీయ బహుమతి లభించాయి. తిరుపతిలోని ప్రముఖ పత్రికా రచయిత శ్రీ యన్. వరదాచారి బహుమతులను అందచేశారు. 13 సంస్థలు ఇందులో పాల్గొన్నవి.

### వాలీబాల్ పోటీలు

28-1-79 నుండి 30-1-79 వరకు తిరుపతిలో జరిగిన ఈ పోటీలను దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్ అధ్యక్షతన జరిగిన సభలో అఖిల భారత ఫుట్‌బాల్ సంస్థలసంఖ్య ఉపాధ్యక్షులు శ్రీ యన్ విఠల్ ప్రారంభిస్తూ క్రీడారంగానికి దేవస్థానం చేస్తున్న సేవను ప్రశంసించి, తమ సహాయ సహకారాలపట్ల సంసిద్ధత వ్యక్తం చేశారు.

ఈ పోటీలలో 11 సంస్థలు పాల్గొన్నవి. దక్షిణ మధ్య రైల్వే జట్టుకు (సికిందరాబాద్) కు ప్రథమ బహుమతి; ఆర్టిలరీ సెంటర్ హైదరాబాద్ వారికి రెండవ బహుమతి లభించాయి. శ్రీమతి గోపికా ప్రసాద్ బహుమతులను అందజేశారు.

*

---

(37వ పేజీ తరువాయి)

1వ తేది వరకు కుమారులమూలంగా గాని, అక్రమంగాగాని ధనం. తరువాత అనారోగ్యం లేదా దుష్టులమూలంగా ఆందోళన. బుధునివలన 11 వరకు ఉత్తమమిత్రులు, తన్రపవర్తన కారణంగా భయం. తర్వాత వస్తుసమృద్ధి.

### ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

రాహువువలన అధార్మికప్రవర్తన. శనివలన అనారోగ్యం లేదా అధార్మికప్రవర్తనవలన లేదా శత్రువులవలన ఆందోళన గురువువలన అనారోగ్యంవల్ల ఆందోళన లేదా ప్రయాణం, దానిమూలంగాప్రయాస. శుక్రునివల్ల శృంగారం. రవివల్ల నెల మొదటిపక్షంలో ధననష్టం, ఇతరులవలన మోసం, తరువాత ధనం లేదా గౌరవం. కుజునివల్ల శత్రువులమూలంగా లేదా అనారోగ్యంవల్ల లేదా దొంగభయంవల్ల లేదా ఉద్యోగరీత్యా ఆందోళన. తర్వాతకాలంలో ధనం. బుధునివల్ల 11 వరకు అవమానం తర్వాతకాలంలో ధనం, తన్రపవర్తన కారణంగా భయం.

### మకరం

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ఠ 1.2 పా)

రాహువువలన ఆందోళన. శనివలన అయినవారినుండి వేర్పాటు. గురువువలన ధనం, శృంగారం. శుక్రునివల్ల ధనం, నూతనవస్త్రాలు. రవివలన నెల మొదటి పక్షంలో ప్రయాణం, అనారోగ్యం లేదా ధననష్టం, ఉదరబాధ, తరువాత కాలంలో ధననష్టం, నేత్రబాధ లేదా ఇతరుల వలన మోసం. కుజునివల్ల ఉద్యోగరీత్యా లేదా దొంగలభయంవల్ల ఆందోళన. బుధునివల్ల నెల 11వ తేదీ వరకు చెడుసలహాలవల్ల గాని, వివాదాలమూలంగా గాని ధననష్టం. తర్వాతకాలంలో అవమానం.

### కుంభం

(ధనిష్ఠ 3,4 పా, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా)

రాహువువలన వివాదాలు. శనివలన ప్రయాణం. గురువువలనఅశాంతి. శుక్రునివలన ధనం, స్నేహితులు. రవివలన ధననష్టం లేదా అనారోగ్యం. కుజునివలన ధననష్టం, నేత్రబాధ లేదా భార్యకు అసంతుష్టి, బుధునివలన శత్రువులమూలంగా ఆందోళన, అనారోగ్యం, అవమానం.

### మీనం

(పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి.)

రాహువువలన ధనం. శనివలన దృఢారోగ్యం, జయం. గురువువలన ధనం, వాహనాలు లేదా నూతనవస్త్రాలు లేదా నూతనగృహం లేదా శృంగారం లేదా సంతానం సంభవం. శుక్రునివలన వివాదాలు, అవమానం. రవివలన గౌరవం, ధనం, జయం, దృఢారోగ్యం నెలమొదటి పక్షంలోనూ, ప్రయత్నాలలో వైఫల్యం రెండవపక్షంలోనూ. కుజునివల్ల 19వరకు జయం తరువాతధనాభావం, భార్యకు అసంతుష్టి, ఉదర లేదా నేత్రబాధ. నెల 11 వరకు బుధునివలన ధనం, స్నేహితులు, వాహనాలు లేదా శృంగారం లేదా సంతానంకూడా సంభవం, తర్వాత కాలంలో శత్రువులమూలంగా గాని, అవమానకారణంగా గాని ఆందోళన. *

---

*Edited and Published on behalf of T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T. T. D. Press by M. Vijayakumar Reddy, Manager T. T. D. Press Tirupati-517501*

# చిత్తూరుజిల్లాలో

★

# ముఖ్యమంత్రి



ముఖ్యమంత్రి నారాయణవనం దర్శించినప్పటి దృశ్యం. వారిలో రెవిన్యూ మంత్రి శ్రీ జనార్దనరెడ్డి, ధర్మకర్తలమండలి అధ్యక్షులు డా. రమేశన్, కార్య నిర్వహణాధికారి శ్రీ ప్రసాద్ ఉన్నారు.

★

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా. మర్రి చెన్నారెడ్డి ఇటీవల వివిధ దేవాలయాలను దర్శించి అర్చించారు. 18-1-79 న ముఖ్యమంత్రి నారాయణవనంలో కల్యాణ వేంకటేశ్వరస్వామిని దర్శించారు.

తరువాత తిరుమలను సందర్శించి 19-1-79 న శుక్రవారాభిషేకోత్సవంలో పాల్గొని శ్రీ వారి ఆశీస్సులను పొందారు. శ్రీ వేంకటేశ్వరస్వామివారికి కళ్యాణోత్సవం జరిపారు.

★



శుక్రవారాభిషేకపాత్రతో డా. చెన్నారెడ్డి.

★



తిరుమలలో శ్రీవారి ఆలయంలో కార్యనిర్వహణాధికారి, ధర్మకర్తలమండలి అధ్యక్షులతో ముఖ్యమంత్రి, ఆయన సతీమణి.

ధించినదే ఆయన వర్ధంతి పురస్సరంగా సంస్మరణ
అనుభవించి, ఆ అనుభూతిని, శ్రీరాగ శృంగార

మార్చి 1979



Regd. No. H/TRP/13

# నూతన అతిథిభవనం



తిరుపతిలో దేవస్థానం రు. 7 లక్షల వ్యయంతో నిర్మించిన నూతన అతిథిభవనానికి 15-2-79న దేవస్థాన ధర్మకర్తల మండలి అధ్యక్షులు డా. రమేశన్, ఎం.ఏ. పిహెచ్.డి., ఐ.ఏ ఎస్ ప్రారంభోత్సవము జరిపారు. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, తదితర దేవస్థాన అధికారులు ఈకార్యక్రమానికి హాజరయ్యారు.



# ముఖచిత్రం

ఈ నెలపాటకూడా అన్నమాచార్య సాహిత్యానికి సంబంధించినదే ఆయన వర్థంతి పురస్సరంగా సంస్మరణ సమర్పణం. నిజ జీవితంలో కూడా రక్తి విరక్తులను సమపాళంగా అనుభవించి, ఆ అనుభూతిని, శ్రీరాగ శృంగార వథుని కాళ్ళపారాణిగా దిద్ది, ఆంతరంగిక మిత్రుడై ఆ వేంకట శైలవల్లభుని రతిక్రీడారహస్యముల గుత్తకుగొన్న అనంత పారదర్శక ప్రతిభాశాలి అన్నమయ్య



అలరులు గురియఁగ నాడెనదే
అలకలఁగులుకుల నలమేలుమంగ.

అరవిర సొబగుల నతివలు మెచ్చఁగ
అరతెరమరుగున నాడెనదే
వరుసగపూర్వదువాళపు తిరుపుల
హరిఁ గరగింపుచు నలమేలుమంగ.

మట్టపు మలపుల మట్టెల కెలపుల
తట్టెడి నడపుల దాటెనదే
పెట్టిన వజ్రపు పెండెపుదళుకులు
అట్టిటు చిమ్ముచు నలమేలుమంగ.

చిందుల పాటల శిరిపొలయాటల
అందెలమ్రోతల నాడెనదే
కందువ తిరువేంకటపతి మెచ్చఁగ
అందపు తిరుపుల నలమేలుమంగ

— (X 11 - 24)

అలమేలుమంగ ఎటులాడినదో అన్నమయ్య వివరించగా అందిపుచ్చుకొని రూపు దిద్దిన చరితార్థజీవి శ్రీ 'బాపు' అన్నమాచార్య జయంతి సందర్భంగా అంతో ఇంతో అనుకుంటూ ఎంతో కైంకర్యం జరిపిన శ్రీ 'బాపు' పై శ్రీనివాసుని కరుణ వర్షించాలని కోరుతూ, అలమేలుమంగ ఆడగా రాలిన విరులనేరి తలదాల్చి తరించుడని కోరుతున్న సప్తగిరి సమర్పణం ఇది.

# శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము తిరుమల

1-3-79 నుండి

## నిత్యపూజ, దర్శనాదికముల కార్యక్రమము

### శని, ఆది, సోమ మరియు మంగళవారములు

ఉదయము 3-00 నుండి 3-30 వరకు సుప్రభాతము
,, 3-30 నుండి 3-45 వరకు శుద్ధి
,, 3-45 నుండి 4-30 వరకు తోమాలసేవ
, 4-30 నుండి 4-45 వరకు బంగారు వాకిలివద్ద కొలువు: పంచాంగ శ్రవణం,
,, 4-45 నుండి 5-30 వరకు మొదటి అర్చన
,, 5-30 నుండి 6-00 వరకు మొదటిఘంట బలి మరియు శాత్తుమొర
, 6-00 నుండి మ 12-00 వరకు సర్వదర్శనము
మధ్యాహ్నం 12-00 నుండి 1-00 వరకు రెండవఅర్చన,(ఏకాంతం)
,, 1-00 నుండి 8-00 వరకు సర్వదర్శనం
రాత్రి 8-00 నుండి 9-00 వరకు శుద్ధి, రాత్రికైంకర్యము
,, 9-00 నుండి 12-00 వరకు సర్వదర్శనం
,, 12-00 నుండి 12-30 శుద్ధి
12-30 ఏకాంతసేవ

### గురువారము

### తిరుప్పావడ

ఉదయము 3-00 నుండి 3-30 వరకు సుప్రభాతం
,, 3-30 నుండి 3-45 వరకు శుద్ధి
,, 3-45 నుండి 4-30 వరకు తోమాలసేవ.
,, 4-30 నుండి 4-45 వరకు బంగారువాకిలివద్ద కొలువు మరియు పంచాంగ శ్రవణము
,, 4-45 నుండి 5-30 వరకు మొదటి అర్చన,
,, 5-30 నుండి 6-00 వరకు మొదటిఘంట, బలి శాత్తుమొర
,, 6-00 నుండి 8-00 వరకు సళ్లింపు, 2 వ అర్చన (ఏకాంతం), తిరుప్పావడ, అలంకరణం, ఘంట ఇత్యాది
,, 8-00 నుండి రాత్రి 8-00 వరకు సర్వదర్శనం
సాయంకాలం 8-00 నుండి 10-00 { వరకు శుద్ధి ఇత్యాది / పూలంగి సమర్పణ / రాత్రి కైంకర్యము, ఘంట }
రాత్రి 10-00 నుండి 12-30 వరకు పూలంగిసేవ
,, 12-30 నుండి 12-30 వరకు శుద్ధి
, 12-45 ఏకాంతసేవ

### బుధవారము

### సహస్రకలశాభిషేకం

ఉదయం 3-00 నుండి 3-30 వరకు సుప్రభాతము
,, 3-30 నుండి 3-45 వరకు శుద్ధి
,, 3-45 నుండి 4-30 వరకు తోమాలసేవ
,, 4-30 నుండి 4-45 వరకు బంగారువాకిలివద్ద కొలువు పంచాంగశ్రవణం
,, 4-45 నుండి 5-30 మొదటి అర్చన
,, 5-30 నుండి 6-00 మొదటిఘంట, బలి, శాత్తుమొర
,, 6-00 నుండి 8-00 సహస్ర కలశాభిషేకము
,, 8-00 రాత్రి 8-00 వరకు సర్వదర్శనం
రాత్రి 8-00 నుండి 9-00 వరకు శుద్ధి ఇత్యాది
,, 9-00 నుండి 12-00 వరకు సర్వదర్శనం
,, 12-00 నుండి 12-30 వరకు శుద్ధి
రాత్రి 12-30 ఏకాంతసేవ

### శుక్రవారము

### అభిషేకము

ఉ॥ 3-00 నుండి 3-30 వరకు సుప్రభాతము
,, 3-30 నుండి 5-00 వరకు సళ్లింపు మరియు నిత్యకట్ల కైంకర్యములు (ఏకాంతము)
,, 5-00 నుండి 7-00 వరకు అభిషేకము
,, 7-00 నుండి 8-30 వరకు సమర్పణము
,, 8-30 నుండి 9-30 వరకు తోమాలసేవ మరియు అర్చన (ప్రత్యేకం) ఘంట, బలి, మరియుశాత్తుమొర
,, 9-30 నుండి 10-00 వరకు రెండవ గంట, బలి, శాత్తుమొర
10-00 నుండి రాత్రి 8-00 వరకు సర్వదర్శనం
రాత్రి 8-00 నుండి 9-00 వరకు శుద్ధి రాత్రి కైంకర్యము
రాత్రి 9-00 నుండి 12-00 సర్వదర్శనం
,, 12-00 నుండి 12-30 వరకు శుద్ధి
12-30 ఏకాంతసేవ

గమనిక ;– 1) పైకార్య క్రమములో సమయానుకూలముగాను ప్రత్యేక కార్యక్రమముల వలనను మార్పులు చేయబడవచ్చును. 2) సుప్రభాత దర్శనమునకు రు. 25/– టిక్కెట్టువారు మాత్రమే అనుమతింపబడుదురు. 3) రు. 25/– టిక్కెట్లు తిరుమలలోనూ దేశంలో ఆంధ్రాబ్యాంకువారి వివిధ కేంద్రములలోనూ లభించును. 4) సేవానంతరపు టిక్కెట్లు రద్దుచేయటమైనది. 5) ప్రత్యేక దర్శనం టిక్కెట్లు గలవారు లోగడవలె ధ్వజస్తంభమువద్దగాక మహాద్వారము క్యూలో చేర్చబడుదురు. 6) రు. 200/– ఆమంత్రణోత్సవం టిక్కెట్టుపై ఇద్దరు మాత్రమే అనుమతింపబడుదురు. 7) అర్చన, తోమాలసేవ, ఏకాంతసేవలో దర్శనాంతరపు టిక్కెట్లుగాని రు. 25/ టిక్కెట్లుగాని అమ్మబడవు.

పేష్కార్ ; శ్రీవారి ఆలయం, తిరుమల

TIRUMALA TIRUPATI · DEVASTHANAMS ·

# సప్తగిరి

మార్చి 79

సంపుటి 9 సంచిక 1[illegible]

విడిప్రతి 0-50 పైసలు

సం॥ చందా రు. 6-00

గౌరవసంపాదకులు :

**శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్**

ఐ. ఏ. ఎస్,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2322

ప్రచురణకర్త - సంపాదకుడు :

**కొ్రటపాటి సుబ్బారావు**

ఎమ్. ఏ.,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

ముద్రాపకుడు,

**ఎమ్. విజయకుమార్ రెడ్డి,**

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2340

## విషయసూచిక



## అన్నమప్రభ

అనుబంధం



* సప్తగిరిలో ప్రచురణలకు పారితోషికములేదని గమనింప గోర్తాము. సం॥

* కొన్ని అనివార్య కారణములవలన 'అన్నమాచార్య సారస్వత కళారాధనము అన్నమస్వరలహరి' ప్రకటింపబడలేదు. ॥ సం ॥

# సంపాదకీయము

దేవాలయం అనేది దేవుని అస్తిత్వానికి, మానవుని ఆస్తిక్యభావానికి ప్రతీక. సర్వాంతర్యామి, అనంతజ్యోతిస్వరూపుడు, వాచమగోచరుడైన ఆ పరమాత్మని, మృచ్ఛిలాదారురూపాలలో చెక్కిన మూర్తులలో మంత్రయుక్తంగా ఆవహింపజేసి, అందుబాటులోలేని ఆ అనంతజ్యోతిని ఈ రూపంలో అందుబాటులోని తెచ్చుకొని ఇహపరసాధనకు సామూహిక ప్రయత్నరూపంగా మానవులేర్పరచుకొన్నవే మన దేవాలయాలు. ఇంటింటా ఇష్టదైవాలెందరోవున్నా, అనుష్ఠానం మానవులందరికీ సాధ్యంకాదు గనుక, ఆగమోక్తంగా ఆలయంలో ప్రతిష్ఠితుడైన అర్చామూర్తిని దర్శించి తరించండని, వారు పాల్గొనేందుకు వీలుగా నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాదులను ఏర్పరచి ఆగమశాస్త్రాలు శాసించినవి. ఈ తాత్వికపరమార్థం బలీయమయ్యేకొద్దీ భక్తులరాక, రాబడి పెరగటం, తద్వారా నిర్వాహకసంస్థలు ఈ వేలాదిభక్తుల సౌకర్యాలుచూచే బాధ్యత వహించటం అనివార్య పరిణామాలు.

కనుకనే, కలియుగ ప్రత్యక్షదైవం శ్రీ వేంకటేశ్వరుని ఆలయనిర్వాహకసంస్థ కూడా యాత్రికుల సమస్యలను పరిష్కరించేందుకు ఎన్నోవిధాలుగా ప్రయత్నిస్తున్నదనేది అది అందరికీ తెలిసిన విషయం. ఏ సమస్యకైనా ఏదోవిధమైన పరిష్కారమున్నా దర్శనవిషయంలో మాత్రం ఆలయస్వరూపంలో మార్పులుతీసుకురాకుండా శీఘ్రదర్శనం ఎలా సంభవమన్న విషయం జటిలంగానే మిగిలిపోయింది. రోజుకు 14 గం. దర్శనాని కేర్పాటుచేసినా, నిరాశులైనవారు వేలాదిభక్తులు.

ఈ విషయంలో తీవ్రజిజ్ఞాసగల, ఇటీవల చైతన్యవంతమైన యాజమాన్యం ఈ సమస్యకు కూడా గమనార్హమైన పరిష్కారమార్గం కనుగొన్నది.

ముఖ్యంగా, ప్రత్యేకదర్శనపు టిక్కెట్లను, ఆంధ్రాబ్యాంక్ సహయోగంతో వారి వివిధకేంద్రాలలో అమ్మటంవల్ల, దూరప్రాంతాలవారు, తిరుమలలో పడిగాపులుకాయవలసిన అవసరంలేకుండా, సరాసరి వచ్చి శ్రీవారిదర్శనం చేసుకొని తిరిగిపోయేందుకు వీలున్నది. బారైన భక్తులవరుసలలో నిలువలేనివారికి, నిలువకలిగి నిలువరానివారికి, ఇది వరంలాంటిది. సుప్రభాత దర్శనం దీనికి ప్రత్యేకించడంవల్ల, త్వరగా దర్శనమై తిరిగివెళ్ళే అవకాశం కలగటమేగాక, మిగిలిన సాధారణభక్తులకు ఆవాసాది సౌకర్యాల విషయంలో కొరతను కొంత తగ్గిస్తుంది.

లోగడ సేవానంతర దర్శనాలవల్ల, పరిమితవ్యవధివల్ల, చాలమందికి, డబ్బుచెల్లించినా దర్శనానికి అనుమతించలేని పరిస్థితి ఏర్పడుతుండేది. పైగా సేవానంతరదర్శనం తర్వాత ప్రతిపర్యాయం, శాస్త్రీయ కార్యక్రమాలకుగాను, శుద్ధికార్యక్రమం జరపటం, తద్వారా ఇతర కార్యక్రమాలు పొడిగించవలసిరావటం, చివరకు ఏకాంతసేవఐన అరగంటకే సుప్రభాతం ప్రారంభించవలసి వస్తుందా అన్నస్థితి ఏర్పడటంకూడా కద్దు. సేవానంతర దర్శనాలరద్దువల్ల దైనందినపూజాదికాలు నిర్విరోధంగా సాగిపోవటమేగాక, సర్వదర్శనంలో ఉదయం 6 నుండి అర్ధరాత్రి 12 వరకు ఒక నివేదనాదినాల సందర్భంలోతప్ప, నిరాటంకంగా వేలాదిభక్తులు శ్రీవారిదర్శనం చేసుకోవచ్చు. శ్రీవారిదర్శనంకోరే భక్తులకు లోగడకన్న అంటే సుమారు 4 గం. కాలం ఎక్కువగా లభిస్తున్నది. బహుశః ఇప్పుడున్న వ్యవహారపరిధులలో ఇంతకన్న ఎక్కువసమయం కేటాయింపు, అసాధ్యమనే చెప్పవచ్చు.

ఇతర సౌకర్యాల విషయంలో క్యూవరుసలలోనూ, తిరుమలకు నడిచివచ్చేదారిలో వైద్యసదుపాయం నిజంగా గణనీయమైనది. క్యూలైన్లలో గంటలతరబడికాని వేసారి, అస్వస్థులైనవారికి, నడచిఎక్కలేక ఆర్తిచెందినవారికి ఇది అమూల్యవరం 'అసలే నడవలేకుంటే ఆపై నొకమూటా' అని దిగులుపడేవారి సామాగ్రిని, భద్రంగా తిరుమలలో అందించే ఏర్పాటుతో నిజంగా వారి తలబరువు తీరినట్లే. అధికారులకు యుక్తులకు కాలంతోడై ఈ 'కాలయుక్తుల'వల్ల, భక్తులు సిద్ధార్థులయ్యేందుకన్వర్థంగా తోడ్పడినవి.

కాని, జరిగింది ఇంత. జరుగవల్సింది ఎంతో. కోనేటిరాయుని దయవల్ల సిద్ధార్థ నిజంగా సర్వజనులకు 'సిద్ధార్థ' అవుతుందని ఆశిద్దాం.

# ద్వాదశాదిత్యులు

భారతీయ సంప్రదాయంలో సంఖ్యా శాస్త్రానికి సమున్నత స్థానం ఉంది. వైదిక వాఙ్మయం వీలు చిక్కినప్పుడల్లా సాంఖ్యాన్ని ఉటంకించి కీర్తిస్తునేఉంది.

"దేవా దేషు శ్రయధ్వం ప్రథమా ద్వితేయేషు శ్రయధ్వం" అంటూ,

"దేవా స్త్రీరేకాదశాస్త్రి స్త్రయ స్త్రిగ్ం శాః
ఉతరే భవత" వరకు వర్ణించింది. ఇది శత రుద్రీయంలో ఓ భాగము.

దృగ్గోచర ఖగోళాని కంతకు కనిపిస్తున్న సూర్యుడే జీవనాధారము. అందుకే మనది సౌరకుటుంబమని పిలువబడుతూంది.

"ఆరోగ్యమే మహా భాగ్యము" గ గ్ర్తించిన ఆర్యులు "ఆరోగ్యమ్ భాస్కరా దిచ్ఛేత్" అని ఆదిత్యునిదే ఆరోగ్యాధిపత్య మన్నారు.

కాల ప్రవాహములో శరీర ఆరోగ్యం స్థిరముగ ఉండదు. ఆహార విహారములలో కాలానుగుణ్యముగ కొన్ని నియమ నిబంధనలను ఏర్పరచుట జరిగింది. అనారోగ్యకరమైన ఆషాఢ మాసములో దంపతులను ఆమడ దూరంలో ఉంచమంటే, అజీర్ణానికిఆటపట్టు అయిన కార్తీక మాసములో "నక్తం" పేరుతో పగలంతా నిరాహారంగా గడపి నక్షత్ర దర్శనాంతరమే భోజనం చేయవలయుననే నిబంధనలున్నాయి. ఇవి సాంఘిక వ్రతముల రూపములో ప్రవేశపెట్టబడినాయి. ఇటువంటివిసామాన్యకుటుంబీకులకుచెప్పి, సన్యాసులకు యోగులకు చాతుర్మాస్యాది వేద వ్రతములు నియమించడంలో "శారీరమాద్యం ఖలు ధర్మ సాధనం" అనేది ఎంత నగ్న సత్యం! శరీరాన్ని రోగాలనుండి రక్షించుకోవడమే ఒక వ్రతము. అయితే అందుకు ఔషధసేవే పరమావధిగ ఆధునిక విద్యాలోకం భావించడం జాతికి పట్టిన దౌర్భాగ్యము.

ప్రాచీన సంప్రదాయం మనసా; వాచా; కర్మణా శరీరమును శ్రమింపజేస్తూ నియమిత ఆహార విహారాదులకు తోడు తగు విశ్రాంతిని శరీరముతోబాటు మనస్సుకు; ఆలోచించే మెదడుకు అవసరమని హెచ్చరిస్తూం దీ సంప్రదాయము.

వాడుక భాష సంప్రదాయక భాషల మధ్య వ్యత్యాసము; సంప్రదాయక కార్య క్రమములో కార్యకర్తల (పౌరోహిత్య వర్గం) అలసత్వముతోడై సంప్రదాయం నుండి పొందవలసినంత మేలును పొందలేక పోతున్నది ఆస్తిక సమాజము.

భౌతిక వాదులలో మానవ జీవిత ధ్యేయం ఏలా గుర్తించబడు చున్నను పర్యావర్తమౌతున్న పృధ్వీవాసులకు అంతిమం. అశాంతము. ఇది తప్పదు. అశాంతమును జయించిన వారిలో

"అశ్వత్థామా బలిర్వ్యాసో హనూమాంశ్చ
విభీషణః కృపః పరశురామశ్చైతే చిరంజీవినః"

వీరే కన్పిస్తున్నారు. మహా తపః స్సంపన్నుడై మృకండ మహర్షి సంతానం మార్కండేయుడు, పంచవర్ష ప్రాయములోనే పక్షపాతానికి గురై పరాత్పరుని దర్శించి శాశ్వత స్థానాన్ని పొంది భూః నభోంతరాళములకు మార్గదర్శకుడుగ



నియమితుడైన ధ్రువుడు.

"అత్రి భారద్వాజ విశ్వామిత్ర గౌతమ జమదగ్ని వశిష్ఠ అగస్త్యాదులు" ఏ కొందరో! వీరందరకు అట్టి శాశ్వత స్థానమును ప్రసాదించి పెట్టినది "స్వయంభువు-పైయిన ఆదిత్యుడే.

కాల గమన నిర్ణయములో సర్వులూ అంగీకరించి ఆచరిస్తున్న ప్రమాణకాలము "సంవత్సరము". దానిని తెలుసుకొనేందుకు దైవమే నిర్మించిన ఉపకరణములు నెలలు. నెలలను గుర్తించుటకు ఏర్పరచబడినవే అమావాస్య, పూర్ణిమ. అనే పూర్ణ తిధులు. 12 అమావాస్యలు లేక పూర్ణిమలు ఓ సంవత్సరము. సంక్రాంతులు కంటికి కనుపించవు. ఆయనము అంటే ఆరుమాసములు. వీటిని సామాన్యులు గుర్తించేసరికి మోక్షకాలం కాస్తా లుప్తమౌతుంది.

శ్రీ చల్లాసూర్యనారాయణశర్మ,
జగదల్‌పూర్

పదిరెండు మాసములను ప్రాచీన సంస్కృతి గుర్తించి వాటికి నామములను రెండు విధములా ఎంపిక చేసి వాడుకలో పెట్టించింది. ఈనామావళి అనుదినం కీర్తించ బడుచునేఉంది. ఇవి వైదిక నామాలు వాడుకలోగల నామాలకు భిన్నమైనవి. శిశువు జన్మాంతము నామకరణ మహోత్సవములో నామానికి ముందుగ వైదిక నామం ముత్యాలరాశిలో వ్రాయించి తరువాతనే వ్యవహారిక నామం వ్రాసి, వ్రాయించిన ముత్యాలతో శిశువును ఆశీర్వదించుట సాంప్రదాయం.

ఇది నామకరణమే అయినా ఈ వైదిక మాసములలో మనం శ్రీనివాసున్ని శ్రీలక్ష్మి సహితంగ దర్శించగలము పౌష్యలక్ష్మితోప్రారంభించి రుక్మిణీ-ధాత్రి

(35 పేజీలో చూడుడు

# శ్రీ వరాహ పురాణం



ఇది శ్వేతవరాహకల్పంలోని వైవస్వత మన్వంతరం. మనమున్నది జంబూద్వీపములోని భరతఖండంలో, మన స్వామి వెలసింది ఆది వరాహ పుణ్యక్షేత్రంలో. ఈ క్షేత్రానికి ఎన్ని పేర్లున్నా సంకల్పంలో ముందు చెప్పుకోవాల్సింది ఆదివరాహ క్షేత్ర మనే. శ్రీవారి ఆలయాన్ని దర్శించాలన్నా ఆదిగా వరాహమూర్తి దర్శనమే ముఖ్యం. సమస్తవైదిక వాఙ్మయాన్ని సామాన్యుల కందించాలనే తపన గల దేవస్థాన ప్రయత్నాలలో – ఇది ఉడుత భక్తిగా సప్తగిరి సమర్పణం. ॥ సం ॥

## మొదటి అధ్యాయము

### అనుక్రమణిక

శ్రీ గణేశాయనమః ఓం నమో భగవతే
మహా వరాహాయ

శ్లో॥ నారాయణం నమస్కృత్య
నరం చైవ నరోత్తమమ్।
దేవీం సరస్వతీం వ్యాసం
తతో జయ ముదీరయేత్॥

అంతర్యామి నారాయణ స్వరూపుడైన వరాహ భగవానునికీ, నరోత్తముడైన నరుడనే మునికీ, (భగవల్లీలలను ప్రకటించే) సరస్వతీదేవికీ, (వాటిని రచించిన) శ్రీ వ్యాసమహర్షికీ నమస్కరించి (ఆసుర సంపత్తిని నశింపజేసి) విజయం లభింపజేసే వరాహపురాణం పఠించాలి.

శ్లో॥ నమస్తస్మై వరాహాయ
లీలయోద్ధరతే మహీమ్।
ఖురమధ్యగతో యస్య
మేరుః ఖణ ఖణాయతే॥

శ్రీ వరాహస్వామి లీలగా భూమి నుద్ధరించినవేళ, మేరుపర్వతం ఆయన డెక్కల నడుమ చిక్కుకొని ఖణ ఖణ మన్నది. అట్టి వరాహస్వామికి నమస్కారం।

శ్లో॥ దంష్ట్రాగ్రేణోద్ధృతా గౌ
రుదధి పరివృతా పర్వతైర్నిమ్నగాభిః
సాకం మృత్పిండవత్ప్రాగ్
బృహదురు వపుషాఽనంత రూపేణ యేన।
సోఽయం కంసాసురారిర్
మురనరకదశాస్యాంతకృత్సర్వసంస్థః
కృష్ణో విష్ణుః సురేశో
నుదతు మమ రిపూనాదిదేవో వరాహః॥

పూర్వం, కంసాసురవైరి, మురాసురునీ, నరకునీ పదితలల రావణాసురునీ, సంహరించిన కృష్ణుడు, ఎల్లెడలా ఉండే విష్ణుమూర్తి, సురేశ్వరుడు, ఆదిదేవుడు, వరాహస్వామి అయి మహావిశాల - అనంతాకార దేహంతో కోరకొనతో చుట్టూ కడలిఉన్న భూమిని పర్వతాలతో నదులతో సహా మట్టి బెడ్డనులా లేవనెత్తాడు. అట్టివాడు నా (కామ క్రోధ లోభమోహాది) శత్రువులను నశింప జేయుగాక ? 2

### శ్రీ వరాహస్వామిని భూదేవి ప్రశ్నించిన విధం

సూతుడు చెప్పాడు:

మునుపు పరమేశ్వరుడు విభుడు శక్తితో తనను ఉద్ధరించిన సమయంలో ధరణి ఆయనను ప్రశ్నించింది? 3.

"ప్రభూ, ప్రతి సంకల్పంలోనూ నీవు నన్నిలా ఉద్ధరిస్తున్నావు. ఆది సృష్టిలో కూడా నేను నీ రూపం తెలుసుకోలేక పోయాను కేశవా! 4

అనువక్త:
శ్రీ ఏలూరుపాటి
అనంతరామయ్య
అధ్యక్షులు:
శ్రీ కె వి.కె. సంస్కృత కళాశాల,
గుంటూరు

"వేదాలు పోయినపుడు మత్స్యానివయి (సముద్రంలో) ప్రవేశించి రసాతలంనుంచి వాటిని లాగుకొని (తెచ్చి), బ్రహ్మకు ఇచ్చావు. 5

"మధుసూదనా,

సురాసురులు కలిసి కడలి త్రచ్చినపుడు మరొకరూపం కూర్మరూపంతో మందర పర్వతాన్ని మోశావు 6.

"జగన్నాథా, మళ్ళీ వరాహ భగవానుడవయి, మునిగిపోతున్న భూమిని (నన్ను) మహాసముద్రంలోనుంచి రసాతలం దగ్గర నుంచి ఒంటికోరతో ఉద్ధరించావు ? 7

"మరొకటి, హిరణ్యాకశిపుడు వరదానంతో పొగరెక్కి పృథివిని బాధిస్తుంటే వాడిని నీపు పడగొట్టావు 8.

"తిరిగి, ప్రభూ, పూర్వం నీ వొకపుడు జమదగ్ని పుత్రుడు పరశురాముడవై క్షత్రియులు లేకుండా చేశావు. దేవా 9.

"మళ్లీ, క్షాత్ర తేజంతో రావణాసురుని సంహరించావు.

భగవానుడా, వామనరూపంతో బలి చక్రవర్తిని బంధించావు నీవు 10.

"నీ చేష్టలు నాకు కొంచెమూ తెలియవు దేవా. నన్ను ఉద్ధరించాక సృష్టి ఏలా చేస్తావు? ఏందుకు చేస్తావు? 11 సృష్టికి సంహారకు డెవరు? కర్త ఎవరు? పాలకుడెవరు? విభూ, నీ వెప్పుడూ సులభుడవు కావటానికి మార్గమేమిటి? 12

సృష్టి ఎలా ప్రారంభమవుతుంది? ఎలా అంతమవుతుంది? యుగానికి లెక్కింపు ఎలా? నాలుగుయుగాల క్రమమేమిటి? 13 యుగాలలో విశేష మేమిటి? మహేశ్వరా, అందులో కోరిక యేమిటి? ఏ యజ్వలు ఏ రాజులు ఉత్తమసిద్ధి పొందారు? 14. ఇదంతా సమగ్రంగా చెప్ప నాకట్ల ప్రసన్నుడవు కా"

అని ప్రశ్నించేసరికి పరమేశ్వరుడు వరాహరూపంలో నవ్వాడు. 15.

### శ్రీ వరాహస్వామి విశ్వరూప ప్రదర్శనం:

ఆయన నవ్వుతుంటే జగద్ధాత్రి భూమి ఆయన బొజ్జలో రుద్రులను, దేవతలను వసువులను, సిద్ధసంఘాలను. మహర్షులను చూచింది16. ఇంకా, లోపలఉండిస్వధర్మం నెరవేరుస్తున్న చంద్రునీ, సూర్యునీ, గ్రహాలనూ, సప్తలోకాలనూ దర్శించింది. ఇట్టిదంతా చూచేసరికి భూమి శరీరం అంతా వణకసాగింది. 17

ఆ మహాత్ముడు నోరు మూసుకొన్నాడు.

అది చూచేసరికి ధరణి శరీరకంపం పోయింది.

అంతలో చతుర్భుజ స్వరూపంతో మహాసాగరంలో నిద్రిస్తూ కనిపించాడు, ఆయన నాభికమలంలో ఉన్న చతుర్ముఖుని బ్రహ్మను చూచింది.

### భూదేవి చేసిన శ్రీ వరాహస్తుతి

ధాత్రీదేవి అంజలి పుటంచేసి (విష్ణుమూర్తిని) స్తుతించింది. 19



మధురై అధీనంస్వామి; కాంచిపీఠాధిపతులు; పెజావర్ పీఠాధిపతులు; శ్రీ వైష్ణవపీఠాధిపతులు

# హిందూధర్మ ప్రతిష్ఠానం

ధర్మప్రతిష్ఠానం పాలకమండలి సమావేశం 14-2-79 న తిరుపతిలో జరిగింది. మండలిసదస్యులు మధురై అధీనం అధిపతి శ్రీశ్రీశ్రీ సోమసుందరమహాస్వామి, కంచి కామకోటి పీఠాధిపతి శంకరాచార్యులు జగద్గురు శ్రీశ్రీశ్రీ జయేంద్రసరస్వతిస్వామి, పెజావర్ పీఠాధిపతులు స్వామి శ్రీశ్రీశ్రీ విశ్వేశ్వరతీర్థులు, వైష్ణవ పీఠాధిపతి శ్రీశ్రీశ్రీమన్నారాయణరామానుజజియ్యర్, సర్వశ్రీ యం. చంద్రమౌళిరెడ్డి (దేవాదాయ కమీషనర్), డా. రమేశన్ (ధర్మకర్తలమండలి అధ్యక్షులు), పి.వి.ఆర్.కె. ప్రసాద్ (దేవస్థాన కార్యనిర్వహణాధికారి), డా. అర్కసోమయాజి (ధర్మప్రతిష్ఠాన కార్యదర్శి) పాల్గొన్నారు.

# పాలకమండలి సమావేశము



"కమలదళ నయనా, నమస్కారం, పీతాంబరధారీ, నీకు నమస్సు, దేవవిరోధి విధ్వంసకుడైన పరమాత్మకు అంజలి. 20 శేషశయ్యపై వక్షః స్థలంపై లక్ష్మిని నిలుపుకొన్న సర్వదేవేశా, నీకు మ్రొక్కు! మోక్షకర్తకు నీకు వందనం21. శార్ఙ్గమూ ఖడ్గమూ, చక్రమూ, కలవాడా, చావూ పుట్టుకా లేనివాడా, నీకుదండం బొడ్డున పుట్టిన మహాకమలంలో బ్రహ్మను కన్నవానికి జేజే 22. పగడంలా ఎర్రనైన క్రింది పెదవితోనూ చిగురుటాకు లాంటి చేతులతోనూ శోభిల్లే వానికి జోహారు. నిన్ను శరణం వేడుకొంటున్నాను. పాపరహితురాలను వనితను. కాపాడు 23.

"జనార్దనా, నీ నిండు నీలపు కాటుక రంగు వరాహా కారమూ ఇంకా నీ దేహంలో కనిపించిన జగత్తూ చూచి భయపడిపోయాను. నాథా, ఇప్పుడు నామీద దయ చూపించు 24. కాపాడు మహాప్రభూ 24.

"కేశవుడు నా రెండు పాదాలనూ కాపాడుగాక. నారాయణుడు నా రెండు పిక్కలనూ రక్షించుగాక. మాధవుడు నా కటి స్థలాన్ని కాపాడుగాక. గోవిందుడు నావరాంగమును కాపాడుగాక 25. నా నాభిని విష్ణువు రక్షించుగాక. నా ఉదరాన్ని మధుసూదనుడు కాపాడుగాక నా వక్షః స్థలాన్ని త్రివిక్రముడు రక్షించుగాక హృదయాన్ని వామనుడు పాలించుగాక26. శ్రీధరుడు నా కంఠాన్ని కాపాడుగాక, హృషీకేశుడు నాముఖాన్ని రక్షించుగాక పద్మనాభుడు నా కన్నులను పాలించుగాక, దామోదరుడు నా శిరస్సును కాపాడుగాక 27. అంటూ జగతి శ్రీహరి నామాలను తన అవయవాలపై న్యాసంచేసి (ఉంచి)" భగవానుడా, విష్ణూ, నీకు నమస్కారం" అని విరమించినది 28.

ఇది శ్రీ వరాహపురాణంలో అనుక్రమణికలో మొదటి అధ్యాయం. [సశేషము]

# శ్రీనివాస ప్రబంధము

(జనవరి సంచిక తరువాయి)

కం॥ అత్తరి బ్రహ్మాదులు లో-
కోత్తరుఁడగు వాసుదేవు నూనినభక్తిన్
చిత్తమ్ములు పొంగార వి-
యత్తలముననుండి పలికి రభినుతిపరులై. ౨౭౫

ఆ॥ నీకు మంగళమ్ము నిఖిలైకసాధన!
నీకు నేటికోళ్లు నిత్యకీర్తి!
నీపదాంబుజముల నిలుచుగావుత మాదు-
మదియుఁ జూపు వజ్ర మదికినట్లు. ౨౭౬

కం॥ సత్యవ్రతుని త్రిసత్యుని
సత్యపరుని సత్యయోని సత్యనిహితు ని
న్నత్యంతము సేవింతుము
సత్యమునకు సత్యమైనచతురాత్మకు నిన్. ౨౭౭

కం॥ ఋతమునకు సత్యమునకును
గతి నీవ; అనాదినిధన; కాపురుషుల కు-
న్నతిదూరగుఁడవు; భక్తి-
వ్రతులకుఁ జుట్టమవు వేదవిద్యాతిగతీ! ౨౭౮

సీ॥ కార్యరూపంబైనకలజగంబునకు జ
న్మస్థానసన్నిధానములు నీవ;
సదనుగ్రహము నీవ; సంవృతంబైన నీ
మాయచే మోహితాత్మకులు బ్రహ్మ-
విష్ణుశివాదులు వేర్వేరటందు; రం
తర్యామి నీకు భిన్నంబు లేదు;
ఎఱుక నేర్చినవార లేకచిత్తమ్ముతో
నిఖిలరూపమ్ములు నీవ యనుచు

గీ॥ నీయనుగ్రహమునఁ జేసి త్రోయరాని- —
మాయఁ బోఁద్రోసి సంసారమమతఁ దలఁగి
యందుకొందురు శాశ్వతానందపదవి
శివకరచరిత్ర। మోక్షలక్ష్మీకళత్ర! ౨౭౯

శ్రీమాన్ సరస్వతీపుత్ర
పుట్టపర్తి నారాయణాచార్యులు,
కడప,

ఉ॥ స్థావరజంగమాత్మకవిధాపురులోకళమమ్ము గోరి యి-
చ్ఛావిధి నీవ దాల్చెదవు సత్త్వగుణమ్మునఁ జేసి భక్తసౌ-
ఖ్యావహముల్ ఖలవ్రజభయావహదారుణ రూపముల్; జగ-
జ్జీవులభంగి నిన్ను దరిజేరునె? దుస్తర జన్మకర్మముల్ ౨౮౦

ఉ॥ అంబుజనాభ లోకముల కన్నిటికిన్ తొలిదైన నీస్వరూ-
పంబు సమాధినిష్ఠమగు భావబలంబునఁగట్టి నీ పదా-
బ్జంబను పోతసాహ్యమునఁబట్టి తరింత్రు వివేకశాలు; ల-
ల్పంబగుపూన్కి సంసరణవార్ధిని కామము గోష్పదంబుగన్ ౨౮౧

సీ॥ నీవారలైనట్టిని యతేంద్రియులు భవ
త్పదనావ సంసారవార్ధి దాఁటి
భూతసంతతియందుఁ బూర్ణసౌహృదులౌట
పెరవారు దరియించుతెరువు దలఁచి
దరికి బంధించి పోదురు; తత్సరణి నూని
యన్యులు సంసార మధిగమింత్రు;
కొఱమాలు నెఱుకలై గొందఱు నీపేరు
దలఁపఁగ నొల్లరు దెలిసియైన;

గీ॥ నీవు సదనుగ్రహుండవు నిత్యజాగ-
రూకుఁడవు భక్తరక్షణశ్రీకమతివి
పొగులు జీవుఁ డహంకారనిగడితుండు
శాశ్వతానందవితరణశ్రద్ధధాన! ౨౮౨

చ॥ మనసులఁ దాము ముక్తులని మల్లరమై నినుగీటు వుచ్చుదా-
నన నవిశుద్ధబుద్ధులయి నమ్మిక లేనియవస్థితిన్ పరా

(31 వ పుటలో చూడుడు)

# శేషశైలమహిమ

శ్రీ నడిపినేని సూర్యనారాయణ యం ఏ,
కందుకూరు.

ఆంధ్ర సాహిత్యాకాశమున తెనాలి రామలింగకవి యను చంద్రుడు ప్రకాశించుచు సాహిత్యపిపాసుల హృదయముల నెడి కలువలను వికసింపఁజేయును. భక్తిభావ పరిపూర్ణహృదయుడైన కవి పాండురంగ మాహాత్మ్యమును, ఘటికాచల మాహాత్మ్యమును దివ్య ప్రబంధములుగా నిర్మించెను. వినిలో కవి తీర్థ క్షేత్ర దైవతముల మహిమలను రమ్యముగా వర్ణించెను. ఘటికాచల మాహాత్మ్యములో రంగధామము, తంజాపురి, కుంభకోణము, నాగపట్టణము, తిరునగరి, మన్నారుకోవెల, దక్షిణమధుర, శ్రీవిల్లిపుత్తూరు, తిరువత్తూరు, అయోధ్య, ద్వారక, తిరుమల - మున్నగు క్షేత్రములందున్న దైవతముల మహిమను, ఆయా క్షేత్రములందున్న వేంకటేశ్వర స్వామి భక్తరక్షణ పరాయణతను వివరించెను. తిరువిణ్ణహర్పుర దివ్యధామమున, నాగపట్టణమున, తిరుణరయ్యూరను, నలహత్తిరుమలలోను, తిరునిన్రయూర్పురమున శ్రీ వేంకటేశ్వరస్వామి వెలసి, భక్తుల యభీష్టముల నొసంగుచున్నాడు. భక్తవశంకరుడైన ఈ స్వామి తిరుమలలో శేషశైలమున మహా మహిమతో వెలసి యున్నాడు.

బాల్యమున శైవుడయిన తెనాలి రామలింగడు శ్రీ వైష్ణవమును స్వీకరించి రామకృష్ణుడయ్యెను. అందుచే శేషశైలవాసుడనిన పరమ భక్తి విశ్వాసములు గలిగినవి. ఆ స్వామి మందిరమున, రాయిగానో, వాకిలి గడపగానో పడియుండి స్వామివారి నిరంతర సందర్శన భాగ్యమును పొందవలెనని కవి ఆకాంక్ష. పశుపక్ష్యాదులు, అచేతనములు సహితము స్వామి దర్శనముచే ముక్తిని పొందును. అన్యక్షేత్రములను వర్ణించినను సంతృప్తి చెందక కవి ఘటికాచల మాహాత్మ్యమున శేషశైలమహిమను వివరించెను. వశిష్ఠాదులైన మహర్షులు తీర్థయాత్రలు సేయుచు దక్షిణ దేశమునకు వత్తురు. శేషశైలవాసుని దర్శించి, పిమ్మట ఘటికాచలమునకు పోవుదురు. కవికి సందర్భములభించుటచే శేషశైలమును అందలి తీర్థ దైవతములను భక్తి భావముతో తనివి దీర వర్ణించెను. కవి వర్ణించిన రీతిలో శేషశైలవాసుని మహిమను వివరించుటయే యందలి పరమార్థము.

భక్తుల మహిమ:- హరి భక్తులకెట్టి ఆపదలును గలుగవు. హరిభక్తి యను నావ సంసార సాగరమును తరించుటకు దివ్యసాధనము. విష్ణువు దివ్యక్షేత్ర మను ధనువుతో తీర్థము లను బాణములను దొడిగి, హరి భక్తుల పాపములను లక్ష్యములను నిరంతరము భేదించుచుండును. హరికథలు వినగనొల్లని దురితాత్ముడు ఘోర నిరయ నీరధిని గ్రుంకును. పరమ భక్తుడైన నారద మహర్షి నోటినుండి కవి భక్తి ప్రాధాన్యమును వెల్లడిచేసెను. హరి నామములు జపించువారు, హరికథలు వినువారు, హరి దివ్యమంగళ విగ్రహమును దర్శించి పూజించువారు, హరిభక్తులను పూజించువారు, హరి చిహ్నములైన శంఖ చక్రములను, తిరుమణిని దాల్చువారు ముక్తులు. వారి చెంతకు యమభటులు చేరరు.

అట్లు చేయని వారి జన్మ వ్యర్థము. మానవుడుగా జన్మించినందుకు ఫలము హరి క్షేత్రమునకు పోవుటయే. అచ్చట నున్న దివ్యతీర్థమున మునుగవలెను. దివ్య మంగళ విగ్రహమును దర్శించి, స్తుతించిన మానవుల జన్మములు ధన్యమును. ఈ మహత్తరాశయముతోనే సప్తర్షులు తీర్థయాత్రలుచేసిరి. కవి క్రింది పద్యములలో భక్తి మహిమను భక్తులకు గల్గు సద్గతిని వివరించెను.

సీ॥ ఆరామనామ జపామోదమేదుర,
హృదయారవిందులై పొదలువారి
శౌరి కథా సుధాసారంబు తోరంబు
గావీను దోయిళ్ళఁ ద్రావువారి
పద్మారమణ పాద పద్మార్చనాశస్త
హస్తారవిందులై యలరువారి
తీర్థపాద పదాబ్జతీర్థ సంసేవన
మున పావనాంగులై తనరువారి

తే॥ వారిజోదర చిహ్నముల్ వరలువారి
ధీరమతులై ముకుందు గీర్తించువారి
దూరమున జూచి పరువెత్తు దురితమతుల
గెడపు కాసరవాహను కింకరాళి (1-80)

సీ॥ శౌరి గేహమునకుఁ జనగ జాలనికాలు
కాలుగాదది మరకాలుగాని
పురుషోత్తముని దివ్యమూర్తిఁ జూడని యక్షి
యక్షిగాదల్ల గవాక్షిగాని
అచ్యుతచరితంబులాలకింపని చెవి
చెవిగాదు రాట్నంపు చెవియ కాని
సరసకుఁగీర్తింపఁ జొరలేని నాలుక
నాల్కకాదది కొండనాల్కగాని

తే॥ దానవారాతి పూజకురాని కరము
కరముగాదది ఘోరాఘ కరముగాని
హరి పదోదకమునఁ దోగనట్టి రూపు
రూపుగాదది చిత్రంపురూపుగాని (1-82)

పాదములు, అక్షులు, చెవులు, నాలుక, కరములు - అను ఈ అవయవములన్ని హరిపూజకే అంకితము గావలెనని కవి భావము. తీర్థమున మునుగనివాని రూపము చిత్రంపు రూపమని కవి నమ్మకము. భక్తియే ముక్తికి మార్గమని కవి విశ్వాసము. భక్తి భావ ప్రేరితుడగు వసిష్ఠుడు తన ధర్మపత్నియగు అరుంధతితోను, తక్కిన మహర్షులతోను కదలి దక్షిణ దేశమునకు వచ్చెను. దారిలో శ్రీకాకుళాంధ్ర మహా విష్ణువును వారు

సేవించిరి. కృష్ణవేణీనదిలో కృతావగాహులై, మహా ప్రబోధరస పారగులైరి. ఆయా వాహినులలో గ్రుంకుచు, దైవతములను దర్శించుచు, పిమ్మట వెన్నునికి దివాణమగు వేంకట శైలమును, శేష శైలమును దర్శించిరి. ఇచ్చట రామకృష్ణ కవి శేషశైల మహిమను వర్ణించెను. అచ్చటగల సప్తగిరులను, వాని మహిమలను కవి దెల్పెను. అందు వృషభాద్రి, గరుడాద్రి శేషగిరి, శ్రీ వేంకటగిరి, అంజనాద్రి — మున్నగు పవిత్ర గిరులుండి భక్తుల నాకర్షించు చున్నవి. మహర్షులు చూసిన శేషశైల మహిమను కవివర్ణించిన తీరు యిది.

### శేషశైల మహిమ :-

చం॥ చని చని కాంచి రాదివిజ సంయములందఱు
మఁ౦దఱన్ గన
త్కనకమణి ప్రభాజనక ధాతుగుహాతట
శృంగ పాలమున్
జన జని బంధ సేంధన ధనంజయ దంచిత
తీర్థ జాలమున్
సనకసనందనాది ముని సంస్తుత శీలము
శేషశైలమున్ (2-172)

ఆ శేషశైలము సనక సనందనాది మునులచే స్తుతింపబడునది. జనులయొక్క పుట్టుకలనెడి కట్టెలకు అగ్నివలె నగుచు నొప్పుచున్న తీర్థములు గలది. అది సలలితో ద్యాన వన విశాలమై యొప్పినది. మునులా పర్వతము నారోహించి, అమందానంద కందళిత హృదయారవిందులైరి. వివిధవృక్ష లతావితానములతో నది మనోహరమైయున్నది. శేషశైలముయొక్క శృంగములు ఆకాశమును దాకుచు శేషుని సహస్ర ఫణములవలె నొప్పియున్నవి. ఆ శిఖరములందలి ధాతురాగముతో కూడిన తారకలు ఆ ఫణాగ్రము లందున్న మణులవలె తోచుచున్నవి. అందుచే నీ పర్వతమునకు శేషసంజ్ఞ అన్వర్థమైయున్నది అచ్చట జేగురు శిఖరములు ఆకాశ హార్మ్యమునకు మణిమయ స్తంభములు వోలె నొప్పియున్నవి.

తే॥ ఇన్నగము మిన్ను మోచిన శృంగములు ఫ
ణాసహస్రము కరణి గన్పట్ట ధాతు
రాగయుత తారకలు తదగ్రమణు లౌచుఁ
దనరఁదన శేషసంజ్ఞ సార్థకముగఁ దెలుపు
(2-190)

రామకృష్ణకవి శేషశైల మహిమ నిట్లు దెల్పెను.

తే॥ అచలమిది ముక్తి సతిచేతి యలరుఁజంతి
పాపకదళుల నిలగూల్చు భద్రదంతి

తిరుమలలో శేషశైలేశుని ఆలయం, ప్రత్యేకోత్సవ దీపాలంకరణ దృశ్యం.





ఇటీవల తిరుపతిలో దేవస్థానంచే నిర్వహింపబడిన వాలీబాల్ పోటీల ప్రారంభోత్సవ దృశ్యం. అఖిల భారత పుట్‌బాల్ సమాఖ్య ఉపాధ్యక్షులు యస్. విరల్ ప్రారంభించారు. ప్రక్కనున్నవారు దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్.

# వాలీబాల్

## 27-1-79 నుండి 30-1-79

చివరరోజున బహుమతి ప్రదాన సభలో ప్రసంగిస్తున్న చిత్తూరుజిల్లా కలెక్టరు శ్రీ రామకృష్ణయ్యను ఉప కార్యనిర్వహణాధికారి శ్రీ నరసింహరావు, బహుమతులు పంచిన శ్రీమతి గోపికా ప్రసాద్‌లను ఇందులో చూడవచ్చు.



యీప్సితార్థ రసమ్ముల నీను సురభి
సంయమీంద్రకులావనీ జాతసురభి (2-192)

ఎన్నో నోములు నోచినవారు, తపములు చేసినవారు, ఎంతో సుకృతము చేసినవారు, ఆ శేషశైలమును, అందున్న కామిత దాన పాటవము గల్గిన తండ్రిని వేంకటాచలస్వామిని దర్శింప గల్గుదురు. వారి యఘమ్ములుదొలగి, వారికి శుభమ్ము లొనగూడును.

తీర్థ మహిమ :- శేషశైలము మీద స్వామి పుష్కరిణి గలదు. సప్తర్షులా పవిత్ర తీర్థోదకముల కృతావగాహు లయిరి. కాంచనశైలమేమో యను భ్రమను గల్గించు తత్ప్రాకారమును జేరి, యిందిరాజాని కాంచన మందిరమును దర్శించిరి. సప్తర్షులు స్వామివారి దర్శనానంతరము అప్పర్వతమును దిగిపోవుచు ఆళువారి తీర్థమును జేరి అందు స్నానము చేసిరి.

సీ॥ తద్దక్షిణమున విధాత కమండలు
నాళంబు వెడలు స్వర్ణది తెఱంగు
భూరి తటోద్గతిఁ బొలుపొంది యఘహర
వారి యాళ్వారు వారి తీర్థ
మటఁ గాంచి స్నానములాడి కౌశికదిక్త
టాంచల వసదన లాక్షిఁ గొలిచి
భక్తి గోవింద రాజుల ప్రణుతిఁ దేల్చి, —

ఆయాళువారి తీర్థము నందలి జలము పాపములను హరించును. అది ఆకాశ గంగను పోలియున్నది. అందు కృతావగాహులైన వారు పుణ్యాత్ములు. ఈ రెండు తీర్థములు పుణ్యప్రదములు. ఇచట కవి - 'అన లాక్షుఁ గొలిచి' అని శివుని గూర్చి తెల్పెను. కవికి శివుడనిన ద్వేషము లేదు. అందుచే కపిలేశ్వరుని, గోవింద రాజులను పేర్కొనెను.

దైవత మహిమ :— సప్తర్షులు దర్శించిన కాంచన మందిరమున భేరీ మృదంగములు సముద్రము ఘోషించునట్లు మ్రోగుచుండెను. అవిరళ ధూప ధూమము వ్యాపించి యుండెను. ప్రాకారము

(29 పేజీలో చూడుడు)

# హిందూమత మహిత


శ్రీ పండిత పరాంకుశ
సత్యనారాయణ భట్టాచార్య
కొల్లిమర్ల


హిందూదేశము సాక్షాత్తు భగవంతుణ్ణి ఊయల ఊపిన భూమి. ఆయనకు కేశీరంగమైన ఖండమిది. ఆయనచే పరిపాలింపబడిన దేశమిది. చీకట్లలో తారాడుతున్న విదేశాలకు శాన్తిక్రాంతులు వెదజిమ్మి క్రాంతులలోకి తెచ్చిన వేదభూమియిది.

"యాం రక్షంత్యస్వప్నా విశ్వదానీం
దేవా భూమిం పృథివీ మప్రమాదమ్"

విశ్వదాత్రియగు నీ భూమిని దేవతలు యప్రమత్తులై రక్షించుచున్నారని పృథ్వీసూక్తసూక్తి. నిఖిల విజ్ఞానవిలసితమైన వేద విజ్ఞాన రహస్యములను పరిశీలించి భిన్నత్వంగా కనిపించే ఏకత్వాన్ని అవలోకించి శోధించి నిర్ణయించి మానవుని ధార్మికకట్టుబాటులో నడిపించు ఆర్ష దృష్టి గలది హిందూమతం. హైందవ మతానికి మూలం వేదము. ఈ మతాన్ని వేదమతమనుట జెల్లును. సనాతనమతము, హిందూమతము, భారతీయమతము, వైదిక మతమనునవి ఏకార్థములే. ఏది హిందూమతమో అయ్యదియే భారతీయ మతము. ఏది భారతీయమతమో అదియే సనాతనమతము. సదా భవతీతి సనాతనః. ఎల్లప్పుడు నుండుదానిని సనాతనమందురు. 'సనాతనస్త్వం పురుషో మతో మే' విశ్వరూపసందర్శన యోగమందు అర్జునునిచే అనాది పురుషుడవని నా యభిప్రాయమని గీతలో నచ్చటచ్చట భగవాను నుద్దేశించి చెప్పబడినది. ఇట్లే రామాయణ మందు మందోదరి విలపించుచు పరమాత్మా - సనాతనః మానుషం రూపమాస్థాయ విష్ణుః" అని పేర్కొనినది. స్మృతి రత్నమందు "భగవన్ దేవదేవేశ పురుషోఽపి సనాతనః" అనియు, భవిష్యపురాణ మందు 'వేదమూల సనాతనః' అనియు అనంత పరిపూర్ణుడగు పరమాత్మను గూర్చి సనాతన శబ్దము పలుకబడినది. అనగా సర్వేశ్వని గురించి తదర్పణబుద్ధితో జేయు దైవసంబంధ వేద మత ధర్మ మని యర్థమగును. అన్ని మతాలకు సంబంధించిన సామాన్య లక్షణం దేవుని యందు విశ్వాసం. ఒక్క నాస్తికమతానికితప్ప. మతము లేదని వాదించుట కూడ ఒక మతమే యగును మతినుండియే పుట్టినది మతమని సాధారణ భావన. భౌతికమాయ వలన నుత్పన్నమగుపాపమును పరిహరించి వేద పథమున మానవజీవితమును ఆత్మచైతన్యముకలదిగా చేసి ఆధ్యాత్మికవిలువలను కాపాడునదియే సజీవమతము. భారతాగమ సారస్వతప్రణేతలలో నొకరగు భగవన్మరీచిమహర్షి "సిద్ధాంతం చ మతం శాస్త్ర మేతే పర్యాయవాచికాః". సిద్ధాన్తం, మతం శాస్త్రమునను నీ పదములు పర్యాయవాచకములని ఆనందసంహిత ప్రథమభాగమున విశదీకరించిరి.

భారతీయులు సింధునదీతీరాన ఉండుట వల్ల విదేశీయులు సింధువులని పిలిచిరి సింధుఅనేది అపభ్రంశలో స-హగా మారి హిందూ అయిందని ఆ భావనగల వారికి ఉన్నది. అది సరికాదు. హిందూపరమార్థము గ్రహించుటకు సంస్కృతభాషయే సిద్ధాంజనము. ఆభాషామార్గమున పూర్వులు పయనించి భారతభావగతుల గనిపెట్టిరి. వివిధలక్షణోపేతమగునీ హిందూదేశమున సంస్కృతభాష లక్ష్యలక్షణ సమన్వయమొనరించి సంఘైక్యము ప్రతిష్ఠించి దేశభక్తిని దైవభక్తికి సమముగా జేసివైచినది. మన మనుకొనుటయేగాక రాయల్ఏషియాటిక్ సొసైటీ జరనల్ లో డెయిలర్ పండిట్ 'సంస్కృతభాష'యను శీర్షికక్రింద గ్రీకు లాటిన్ మొదలగుభాషలన్నియు భిన్నభిన్నకాలములందు వేద సంస్కృతి నుండియే ఉద్భవించినవనియు ప్రాచీనయూరపీయ భాషలన్నింటికి తల్లి హిందూదేశభాషయే, దేశములో ఎన్నిమార్పులువచ్చినను ఆ సంస్కృతభాషను హిందూదేశము నిలబెట్టుకొనగల్గినదని మనమాశ్చర్యముతో కనుగొంటిమన్నారు. అట్టి భాషలో భారతీయ సభ్యత ననుసరించి వేదమునిత్యము.

వాస్తవమున కిది గోసేవా సూచకము. ఎటులన భగవద్హృదయ నీతికి బరమాధారములైన వేదములలో ఋగ్వేదమున — "వచోవిదం వాచముదీరయన్తీం విశ్వాభిర్ధీభిరుపతిష్ఠమానాం దేవీందేవేభ్యః పర్యేయుషీం గామామావృత్త మర్త్యోదభ్యచేతాః" మీ పాలను పానముజేసిన మాకు మాటలు వృద్ధియగును. సమస్త వాఙ్మయశక్తిగల మీరు దేవతలకొరకు మమ్ములననుసరించి మా ఇళ్ళలోనుండి అల్పబుద్ధిగల మామానవత్వమును తొలగించి శుభములు కలుగజేతురుగాక యని ఇట్లు గోసేవవలన దైవత్వము, పుష్టి, బుద్ధివికాసము మొదలగునవి చేకూరగలవని ఉన్నది.

వేరొక ఖిలశృతియు —

"ధేనుర్వహాణామదితిస్సురాణాం బ్రహ్మాఋభూణాం విఖనోమునీనాం" చతుష్పాత్తులలో గోవు, దేవతలలో నదితియు, సృష్టికర్తలలో బ్రహ్మయును, మహర్షులలో విఖనసుడును ఆదిభూతులై యుత్కృష్టులని యున్నందునను, "ఇళాశుద్ధి కరాభవన్తు" సర్వదేవస్వరూపిణియగు గోమాత భూమిని శుద్ధిచేయునని గోసూక్తము గానించినందువల్ల "గావశ్శరణ్యాః భూతా



శంఖు స్థాపన ఫలకాని కిరుప్రక్కల దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్, మంత్రి శ్రీ బ్రిజ్‌లాల్‌వర్మలను చూడవచ్చు.

*

కేంద్ర కమ్యూనికేషన్ల మంత్రి శ్రీ బ్రిజ్‌లాల్‌వర్మ ఇటీవల తిరుమలలో నూతన టెలిఫోన్ భవన నిర్మాణానికి శంఖుస్థాపన జరిపినప్పటి దృశ్యాలు.

*

క్రింది చిత్రంలో సర్వశ్రీ ప్రసాద్, మంత్రి వర్మ, టి. హెచ్. చౌదరి, యన్. పి. చెంగ ల్రాయనాయుడు, గైండ్, పాల్‌రాజన్ ఉన్నారు



నామ్" సమస్తప్రాణులకు గోవులు శరణ్యములని భారతమందున్నది. ఋగ్వేదమే —

"హిం కృణ్వతీవసుపత్నీ వసూనాం వత్సమిచ్ఛన్తీ మనసాభ్యాగాత్ — దుహామశ్విభ్యాం పయోఘ్న్యేయమ్ సా వర్ధతాం మహతే సౌభగాయ" అనినది అనగా వసువులకు వసుపత్నియైన ఆ పిలువబడినగోవు దూడను గోరుచు హిం అని అరచుచు వచ్చెను. ఆ గోవుపాలు అశ్వినీదేవతలకై బితికితిని. ఈగోవు మహత్సౌభాగ్యమునకై వృద్ధినొందుగాక! యని మంత్రార్థము. ఈ మంత్రములోని మొదటి "హిం" రెండో వాక్యములోని "దు" చేర్చిన "రాక్షసాః మరణం యాంతియే నసః" అనునట్లు రాక్షసశబ్దంలోని మొదటి "రా" తీసుకొని మరణశబ్దంనుండి "మ" తీసుకొన్న రామ శబ్ద మేర్పడునటుల, హిందూశబ్దము గోచిహ్నముగా వైదికశబ్దముగా గ్రహించినట్లు వేదమువలన తెలియబడు చున్నది. ఇంకను మహాకవి కాళిదాసు రఘు వంశమందు "మార్గం మనుష్యేశ్వర ధర్మపత్నీ శ్రుతేరివార్థం స్మృతిరన్వ గచ్ఛత్' దిలీప మహారాజుభార్యయైన సుదక్షిణాదేవినందినీ ధేనువును వేదార్థమునుస్మృతి యనుసరించినట్లనుసరించెనని వ్రాక్రుచ్చిరి. వేదములందు నిగూఢముగా నున్న విషయములను స్మృతులు ఉపదేశించును. "హింసా యాదూయాతే యస్మాత్ హిందురిత్యభి ధీయతే" హింసాత్మకమైన కర్మను గర్హించువాడు హిందువని మనువచనము. హిడి — గతౌ అని వాచస్పత్యమందు వ్యుత్పత్తి. అంటే దుష్టుడు, అనార్యుడు, ద్వేషపూరితుడుకాక సద్ధర్మపాలకుడు, విద్వాంసుడు శ్రుతిస్మృతులలో ప్రబోధించబడిన ధర్మముననుసరించి పోవువాడుహిందువు. మేరుతంత్రమందును "హీనంచదూష యత్యేష హిందురిత్యభిధీయతే" హీనుడైనవానిని దూషించువాడు హిందువని సదాశివుడు దేవిపార్వతికి చెప్పినట్లు చూడగలం.

(25 వ పేజీలో చూడుడు)

# వేదాంత దేశికులు

(గతసంచిక తరువాయి)

భక్తియోగమునకు యోగ్యత చేకూరవలెననిన కర్మయోగ జ్ఞాన యోగములు మార్గములు. యోగమనగా ఉపాయమార్గము. యాగము, దానము, హోమము, ఆరాధన, తీర్థయాత్ర వేదాధ్యయనము, వేదాంత పాఠ ప్రవచనము, తత్త్వవిచారము, ప్రాణాయామము, వ్రతోపవాసము మొదలైన కర్మములందు ఇష్టమైన దానిని ముఖ్యముగా పెట్టుకొని దానికి అనుకూలముగా యథాశక్తి నిత్యనైమిత్తికకర్మను, ఫలసంగత్యాగ పూర్వకముగా భగవత్ప్రీతిగా, కర్తవ్యతా భావముతో ప్రీతిపూర్వకముగా చేయుచుండుటే కర్మయోగము. ఇట్లు చేయుచుండుటచే భగవదనుగ్రహమున చిత్తశుద్ధియై జీవాత్మ చింతనమును జ్ఞానయోగమునకు యోగ్యమై, బహుకాల జ్ఞానయోగానుష్ఠానముచే జీవాత్మ ధ్యాన యోగమునకు యోగ్యుడగును.

యాగాది కర్మలకు, దానిని చేయదగిన మనుష్యునకు ఉన్న సంబంధము మూడు విధములు అని కర్మనిష్ఠులైన మీమాంసకుల సిద్ధాంతమై యున్నది. వేదార్థము తెలియు కాలమందు ఇట్టికర్మములు తనకు చేరియుండును. అది తన కర్తవ్యముననదే సంగము. ఇట్టికర్మములచే ఉత్పన్నమగు ప్రయోజనమందు అపేక్షయున్నచో అధికారి యనిపించుకొనును. ఇది ఫలమునకు సంబంధించిన బంధము. అనంతరము కర్మచేయును ఇదొక కర్తృత్వ సంబంధం. ఇట్టి సంగ ఫలకర్తృత్వాంశములను భగవంతుని యందు సమర్పించి, తనకు చెందదను భావముతో కర్మచేయుట ఫలసంగ కర్తృత్వ త్యాగపూర్వక కర్మానుష్ఠాన మగును.

ఈ ప్రకారము కర్మయోగము, జ్ఞాన యోగముల నుండి, జీవాత్ముడు ధ్యాన యోగ్యత కలుగగా కాలవిశేషమున ధ్యానముచే జీవాత్మ సాక్షాత్కారమను ఆత్మావలోకనము సిద్ధించును. ఇదే సర్వాత్మ సామ్య దర్శనము, పరమాత్మ సామ్యదర్శనము, జీవన్ముక్తావస్థ యనబడును. ఇట్టి పరిస్థితిలో జగత్తుయొక్క సుఖ దుఃఖములు తనయొక్క సుఖ దుఃఖములగును. తన వ్యాపారములన్నియు పరమాత్మని వ్యాపారములే యగును. అన్నియు ప్రపంచ హిత కరములగును. అట్టి స్థితియందు జీవాత్ముడు దయామయుడై సర్వభూతములకు హితుడై, ఉదార హృదయుడై లోకోద్ధారమే ఆత్మోద్ధారమను భావనచే పరమాత్మ సామ్యమును ఇక్కడనే అనుభవించును. ఇట్టి ఉదార చిత్తవృత్తిని భగవద్రామానుజులు పొందియున్నారు. దానినేవేదాంత దేశికులు అనుష్ఠించి, పరిష్కరించి ఉపదేశించి యున్నారు.

ఇటువంటి స్థితిలో పరమాత్మప్రీతి యనెడుభక్తి సహజముగా నుదయించునని సంప్రదాయము చెప్పుచున్నది. దీనిని ఒక లౌకిక దృష్టాంతముతో ఆచార్యులవారు చక్కగా ఉదాహరించి యున్నారు. ఒక మహారాజు నాలుగైదు సంవత్సరములు గల తన కుమారునితో వేటకై అడవికి వెళ్లెను. అరణ్యమందు ప్రమాద వశమున బాలకుడు తప్పించుకొని శబర చోరులచే అపహరింపబడెను. అక్కడనే పెరిగి యుండుటచే ఆతనికి తాను శబరజాతీయునను భ్రమ ఆతనికుండెను. అతడు ఇరువది ఐదు సంవత్సరముల వాడాయెను. ఇట్లుండగా, అడవిలో నున్న మహాత్ములైన మహర్షులు, ఇతని లక్షణములను గమనించిరి. వారితనిని క్షత్రియునిగా నిశ్చయించిరి. వెనుక రాజునుండి తప్పించుకొనిన రాజకుమారుడై యుండవచ్చునని నిర్ధరించి, అతనికి ఉపదేశించిరి. మహారాజు నొద్దకు ఉపాయాంతరముతో పిలుచుకొని వచ్చిరి. రాజకుమారుడు మహారాజును సావధానముగా పరికించెను. తన అంగ ప్రత్యంగ సౌష్ఠవాది సర్వాంశములందును రాజు తోటి సామ్యమును చూచి మిగుల ఆనందించి, తాను మహారాజ కుమారుడను జీవత్పితరుడను, సర్వసంపత్సమృద్ధమైన అఖండ భూమండల యౌవరాజ్యమునకు అర్హుడను అని నిశ్చయించి, మహారాజును విశేషముగా ప్రీతించి, అతని పాదారవిందములను స్పృశించెను. అదే విధముగా, జీవాత్ముడు సంసారమందు భ్రమించుచున్న కాలముతో ఆచార్యానుగ్రహముతో ప్రీతి పూర్వకముగా భగవంతుని ఆశ్రయించును. భగవంతుడు కూడ తప్పిపోయిన కుమారునికైన చింతయందు మగ్నుడైన మహారాజును బోలి, జీవాత్ముని ఉద్ధారమునకై ఎల్లప్పుడు చింతించువాడై నిరతిశయానందముపొందును. దీనిని భక్తిసామ్రాజ్యమని ఆచార్యులు చాల చక్కగా తెలియునట్లు వివరించియున్నారు.

ప్రపత్తి:- వ్యాసులు, పరాశరులు, వాల్మీకి—ఇత్యాది మహర్షులు వెనుక వివ

(28వ పేజీలో చూడుడు)

శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి,
ఆలీఘర్

మీ సమస్యకు ఉత్తమ పరిష్కారం

# సామూహిక వివాహ పథకం

* * *

మీ బ్రతుకు బంగారుబాట కావాలా! అందుకు వివాహం ఒక సమస్యా? కావచ్చు. తరతరాలుగా ఎదుగూబొదుగూ తెలియని మన ఆర్థికవ్యవస్థలో, తమకో తమ వారికో వివాహం అనగానే అదొక సమస్యగా పరిణమించడం సహజం. లక్షాధికారులనుకూడా భిక్షాధికారులను చేయగల నిగూఢ సమస్య (మనకు తెలిసినవే) లెన్నో ఇందులో ఉన్నాయి. మరి రెక్కాడినా డొక్కాడని వారి స్థితి! మనదేశంలో ఇలాంటి వారే ఎక్కువ. వీరి వివాహ సమస్యకు తిరుమల తిరుపతి దేవస్థానపు "ఉచిత సామూహిక వివాహపథకం" కల్పతరువులాంటిది.

**తరతమ భేదాలు లేకుండా అమలు జరిగే ఈ పథకం ముఖ్యాంశాలివి:**

* హిందువులైన వారందరికీ ప్రాంతీయ, కుల, భాషాభేదాలు లేకుండా అందుబాటులో ఉంది.

* వివాహం హోమం - హోమంలేకుండా రెండు విధాలుగా జరుగుతుంది. వారి వారి సంప్రదాయాన్ననుసరించి జరుపుకోవచ్చు.

* తిరుమలకు రావటం అనేది తప్ప వధూవరులకు ఖర్చేమీ ఉండదు. ముఖ్యమైన సరంజామా అంటే మంటపాలంకరణ, మంగళవాద్యాలు, మట్టెలు, మంగళసూత్రాలు అన్నీ దేవస్థానమే ఏర్పాటుచేస్తుంది.

* వధూవరులకు దేవస్థానమే రు. 175/- విలువ వస్త్రబహుమానం కూడా చేస్తుంది.

* ఈ వివాహం జరిగినట్లు ధ్రువపత్రం కూడా ఇస్తుంది

**మీరు గమనించాల్సింది:**

* దేవస్థానం శుభముహూర్తాల పట్టిక పత్రికలలో ప్రకటించిన నెలలోపుగా వధూవరులు, వారి తల్లిదండ్రులు లేదా సంరక్షకులు తమకు వివాహం జరుపుకోగల లేక జరుపగల ఆర్థికస్థితి లేదనే ధ్రువపత్రంతోపాటు దేవస్థానం పత్రాలమీద దరఖాస్తులు పంపుకోవాలి. 18 ఏళ్ళకు పైబడినవారే అర్హులు.

* దేవస్థానం నిర్ణయించిన శుభముహూర్తానికి, దేవస్థానం నిర్ణయించిన రోజుకు ముందుగా తిరుమలచేరాలి.

* నిర్ణయించిన శుభముహూర్తానికి రాలేనివారు ఆ విషయం కనీసం **ఒక్కరోజు** ముందుగా దేవస్థానానికి తెల్పాలి.

* పొరపాటుగానైనా ముందుతెల్పటం మరచిపోతే, ఇక ఈ పథకంలో పాల్గొనే అవకాశం శాశ్వతంగా పోగొట్టుకుంటారు.

* ఇంకా మిగిలిన వివరాలకు ఈ క్రిందివారితో సంప్రదించండి:

రిసెప్షన్ ఆఫీసర్-II

**తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుమల.**

# అన్నమ ప్రభ

## విషయాలు

★



★

# అన్నమాచార్యుల



# పదకవితలు

'పదం' అంటే 'పాట' అని సామాన్యార్థం. అది కేవలం స్వరరహితమూ కావచ్చు లేదా రాగతాళాలతోను ఉండవచ్చు. "మహనీయంబగుసంకీర్తన నామక పదసంప్రదాయం బెట్టిదనిన" అనుటచే పదం, సంకీర్తనా ఒకదానికొకటి పర్యాయ పదాలని తేటపడుతోంది. అన్నమయ్య తన రచనల్ని శృంగారపదాలు, వైరాగ్య పదాలు అని పేర్కొన్నాడు వాటికే శృంగారసంకీర్తనలు, వైరాగ్యసంకీర్తనలుఅని కూడా వ్యవహారంఉంది. అన్నమయ్యకాలం నాటి పురంధరదాసాదుల కీర్తనలకు పదగళు, పదాలు అనే వాడుక ఇప్పటికీ ఉంది. పాడదగిన కావ్యం పదం. అందులో సుందరశబ్దరచనతోపాటు మధురమైన పాటా కలిసి ఉంటుంది. అన్నమయ్య కాలానికి ప్రతిపాటా పదమే. అతనిరచనల ముఖ్యోద్దేశం భగవద్గుణాను గానం కనుక అన్నమయ్య వాటికి సంకీర్తనలు అని పేరుపెట్టినాడు. తెలుగులో ఇప్పటికి మనకు తెలిసినంతవరకు అన్నమయ్యే పదరచనకు ప్రారంభకుడు. పదకవితాపితామహుడు సంకీర్తనాచార్యుడు, హరికీర్తనాచార్యుడు పంచమాగమ సార్వభౌముడు అయిన అన్నమయ్య ముప్పది రెండువేల పదాలను రచించి వాటన్నిటినీ ఏడుకొండల స్వామికి అంకితంచేసి తరించినాడు. వాటిలో 12000 సుమారు మాత్రమే లభ్యమౌతున్నాయి. అతడు 'ఆడినమాటెల్లా అమృతకావ్యమై, పాడిన పాటెల్లా పరమగానమైంది'.

ఏ భాషాసాహిత్యమందైనా పద గేయ రూపమైన దేశికవిత ప్రాచీనమైన రచన. పద్యములన్నీ పదాలపరిణామాలే అని పలువురు విమర్శకులఅభిప్రాయం. వాస్తవానికి వేదసూక్తాలే మొట్టమొదటి పదాలని చెబుతారు. తమిళంలో నాయన్మారుల్లో ముఖ్యుడైన మాణిక్యవాచకరు దేశికవితాశాఖకు చెందిన అచ్చన గాయల పాటలు, గొబ్బి పాటలు, జోలపాటలవంటి వానిలోమధుర కవిత వెలయించాడు. తమిళంలో వైష్ణవ భక్తులగు పన్నిద్దరాళ్వారుల భక్తిగీతాలు నాలుగువేలదాకా ఉన్నాయి. జయదేవుని గీతగోవిందం అష్టపదుల్లో రచితమయింది. లీలాశుకుని కృష్ణకర్ణామృతంలోని భక్తి శ్లోకాలకు భజనకూటాల్లో, సంగీతసభల్లో ఈనాటికీ ప్రచారం ఉంది. ఇలాగే ఇతర భాషల్లోవలె తెలుగులోకూడ ప్రాచీనకాలమందే పద గేయరూపమైన దేశికవిత ప్రజలనోళ్లలో వెలసియే యుండునని ఊహించుట కాధారములున్నాయి.

నన్నెచోడుడు (1130) కుమారసంభవంలో 'ఊయలపాట'లను, 'గౌడుగీతము'లను. 'అంకమాలిక'లనే రాగయుక్త గేయాలను, అభినయంతోకూడిన 'ఆలతు'లను పేర్కొన్నాడు. ఇవి దేశిశాఖకు చెందిన గేయఫణితులే. "ఆతతబసవపురాతన భక్తగీతార్థసమితియే మాతృకగాఁగ" బసవపురాణాన్ని రచించియున్నట్లు పాల్కురికి సోమనాథుడు (1160-1240) చెప్పినాడు. సోమన తన కాలంనాటి తుమ్మెద పదాలు, ప్రభాతపదాలు వెన్నెలపదాలు, వాలేశుపదాలు, నివాళిపదాలు మొదలైన పదాలను, 'చారుగీతము'లను, కోలాట పాటలు, చాంగుభళాలు మొదలైన వాటిని పేర్కొనుటేకాక ఆయా పాటల్లోని రాగాలు, శ్రుతులు, రాయనములు, తాళగతులు మొదలైన సాంకేతికాంశాలనుకూడ తెల్పినాడు. పాడుటకనువైన గద్యలు, రగడలు మొదలైన వాటినికూడ సోమన రచియించినాడు, కాని అవి వీరశైవమత ప్రచారసాధనాలే కాని రసప్రధాన రచనలు కావు. నాచన సోముని (14 శతాబ్దం) వసంతవిలాసం లోనిదని ఒక 'జాజరపాట'ను వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అన్నమాచార్య చరిత్ర

పీఠికలో ఉదహరించినారు. పోతన(15శతాబ్దం) గోవిందుమీది పాటలను 'బాలునంకించి పాడెడుపాట' లను పేర్కొన్నాడు. శ్రీనాథుడు 'యక్షగానసరణి' ని పేర్కొన్నాడు. ఇలా అన్నమయ్యకు పూర్వము వెలువడిన తెలుగుకావ్యాల్లో పదాలప్రసక్తి ఉన్నా కాలగర్భంలో అవి మరుగునపడిపోవడంవల్ల వాటి స్వరూపం తెలుసుకోడానికి వీలులేకుండాపోయింది. లక్ష్యలక్షణాలులేని వట్టిపేర్ల పట్టికలుగా మాత్రమే వాటిని తలపోయుచున్నాము. కృష్ణమాచార్యుని సింహగిరినరహరి వచనాలుకూడా అన్నమయ్యముందు వెలసిన గేయరచనలే. అంగాంగివిభాగంలేక అఖండగద్యధారగా ఉన్న ఆ వచనాల్లోని గానగంధం మనదాకారాక ఎప్పుడో అంతరించిందని అనంతకృష్ణశర్మగారు అభిప్రాయపడిరి. జానపదుల వాగ్వ్యవహారంలో ఉండడంవల్ల అన్నమయ్యకు ముందు వ్యాప్తిలోఉన్న పదాలకు లక్షణశుద్ధి కలుగలేదు. వైష్ణవమతప్రచారానికి వేంకటేశ్వరస్వామి కైంకర్యానికి సంకీర్తన పదరచనాప్రక్రియను ఉదాత్తంగా భావించి ఆ ప్రక్రియలో అన్నమయ్య వేలకొలది సంకీర్తనాలను రచించి లక్ష్యప్రపంచాన్ని సృజించినాడు. పాటలకు సాహిత్యగౌరవం ఇవ్వడానికి అన్నమయ్య సంస్కృతంలో 'సంకీర్తనలక్షణం' ఆనే లక్షణగ్రంథాన్ని వ్రాసినాడు. కాని ఇది నేడు అలభ్యం. దానికి అన్నమయ్య కుమారుడు పెదతిరుమలయ్య చేసిన వ్యాఖ్యానం కూడా ఈనాడు దుర్లభమైనది. అన్నమయ్య మనుమడైన చిన్నన్న తెలుగులో పద్యాత్మకంగావివరించిన 'సంకీర్తన లక్షణం' పుణ్యమా అని సంకీర్తన విశేషాలను గ్రహించగలుగుతున్నాం. అన్నమయ్య పదరచనలకు స్వయంగా లక్ష్యలక్షణాలను రచించుటద్వారా పదకవితా మార్గదర్శి అయినాడు. అతని రచనల్లో అంతకుముందు జనసామాన్యంలో వాడుకలోఉన్న పదరచనలన్నీ ఉన్నాయి. అతడు గొప్ప వాగ్గేయకారుడే కాక లక్షణకారుడు కూడ. మనకు లభించినంతవరకు తెలుగులో ప్రాచీనములైన రసవద్గేయాలు అన్నమయ్యవే సాహితీపరులైన దేశిగేయకారులలో అతడు ఆదికవి. కనుకనే పదకవితాపితామహుడు, సంకీర్తనాచార్యుడు అనే బిరుదులు అతనిపట్ల సార్థకమవుతున్నాయి

అన్నమయ్య పదరచనల్లో రెండుపంక్తులున్న పల్లవి, నాల్గుపాదాలుండే మూడు చరణాలు ఉన్నాయి. పదంలో ముఖ్యమై కేంద్రీభూతమైన అర్థం పల్లవిలో ఉంది. దాని వివరణమే చరణంలో నిబంధింపబడినది. పల్లవి భావం, ఒకవాక్యంలో ముగియకపోతే రెండవవాక్యాన్ని అనుపల్లవిగా చేర్చి రచించడం కూడ కలదు. పల్లవిలోని భావాన్నే అనుపల్లవి కొంచెంగా విశేషిస్తుంది. చరణాలన్నిటికీ ఏకవాక్యత కలిగించటానికి పదం చివర్లో పల్లవి పునరావృత్తం అవుతుంటుంది. పదంలో చరణాలెన్నివున్నా పల్లవిలోని భావాన్నే ఘోషించి పల్లవితోనే ముగుస్తుంటుంది.

"పదముల యర్థము పల్లవి
వదలక యన్నింటికి నేకవాక్యతసేయన్
గుదిగ్రుచ్చినట్లు తగులై
పదము తుదిన్ మరియు మరియుఁబల్లవి యలరున్"

అని సంకీర్తనలక్షణంలో కవితకు సంబంధించిన పదస్వరూపం నిర్ణయింపబడింది. ఈ పదరచనలో భిన్నసందర్భాలకు చెందిన అర్థభావాలుకాని భిన్నరాగతాళలయలుకాని ఉండవు. అన్నమయ్య పదాలు ముక్తకాలలాంటివి; భావగీతికలు, రసజ్ఞమనోజ్ఞమైనవి. అన్నమయ్యది లక్షణశుద్ధిగల పద

డా॥ జి. నాగయ్య
రీడర్: ఆంధ్రశాఖ; శ్రీ వేంకటేశ్వర
విశ్వవిద్యాలయం, తిరుపతి.

కవిత. అన్నమాచార్యుని పదరచనను పెదతిరుమలాచార్యుడు ఇలా స్తుతించాడు.

"సురలకు నరులకు సొరిది విన విన
నరుదు తాళ్లపాక అన్నమయ్య పదములు
॥పల్లవి॥

చక్కనైచవిచూపి జాలైతావిచల్లీ
నక్కజపుమాతు వజ్రాలై మెఱసీని
నిక్కటద్దములై మా నిలువుసీడలుచూపీ
నక్కర తాళ్లపాక అన్నమయ్యపదములు
॥సుర

పన్నీరై పై(బూసీ( గ(ప్రంబై చలువరే(చీ
మిన్నగల ముత్యములై మెయి నిండీని
వెన్నుబలములై మావెంటవెంట( దిరిగిని
అన్నిట తాళ్లపాక అన్నమయ్య పదములు
॥ సుర ॥

నెట్టిన వేదాంతములై నిత్యములై
పొడసూపీ
పుట్టుతోనే గురువులై బోధించీని
గట్టి వరాలిచ్చే శ్రీవేంకటనాథుని
మెప్పించీ
నట్టె తాళ్లపాక అన్నమయ్యపదములు"
॥ సుర ॥
(శేషాచార్యులవారి వ్రాతప్రతి)

సంకీర్తనలక్షణం' లో అన్నమాచార్యుల పదకవితను గూర్చిన ప్రశంస ఇలా వుంది.

* "శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞాన
సారంబులై
యతిలోకాగమవీథులై విపుల మంత్రార్థం
బులై నీతులై
కృతులై వేంకటశైల వల్లభ రతిక్రీడా
రహస్యంబులై
నుతులై తాళలపాక అన్నయవచోనూత్న
క్రియల్ చెన్నగున్"

అన్నమయ్య పదకవితలో సంగీత సాహిత్యాలు రెండూ సమనిష్పత్తిలో ప్రస్ఫుటమౌతుంటాయి. పరమాత్మయొక్క సర్వవ్యాప్తిని అతడెంత మనోజ్ఞంగా సంకీర్తనం చేశాడో చూడండి.

"ఏత దఖిలంబునకు నీశ్వరుండై సకల
భూతములలోన దా బొదలు వాడితడు"

ఈ చరణాలు విన్నప్పుడు "ఇందుగల దందులేడని సందేహమువలదు చక్రి సర్వోపగతుండెందెందు వెదకిజూచిన నందందే గలడు" అన్న పోతన ప్రహ్లాదుని పలుకులు స్ఫురణకు వస్తాయి. వివిధములైన భక్తిభావాలను నిరూపించడంలో అన్నమయ్య పోతనకేమాత్రం తీసిపోడు.

"జలధి కన్యాపాంగ లలితేక్షణములలో
కలసి వెలుగుచున్న కజ్జలం బితడు"

అనే చరణాల్లోని రూపకాలంకారం రస మెరిగిన సాహితీవేత్తలకు రమణీయంగా భాసిస్తుంది.

వేంకటేశ్వరస్వామికి ఉయ్యాలసేవ చేసేసమయంలో భక్తగాయకుడైన అన్నమయ్య గొంతెత్తి మధురమంజులంగా ఇలా ఆలపించినాడు.

"ఉదయాస్త శైలంబు
లొనర గంబములైన
ఉడుమండలము మోచె
నుయ్యాలా!
అరయ నాకాశపద
మడ్డదూలంబైన
అఖిలంబు నిండె నీ
.... ... .... ఉయ్యాలా
కమలకును భూసతికి
కదులు కదులుకు మిమ్ము
కౌగిలింపగజేసె
నుయ్యాలా!

ఉదయాస్తశైలాలే ప్రక్కస్తంభాలుగా గలిగి నక్షత్రమండలాన్ని అంటే ఆ ఉయ్యాల్లో వేంకటేశ్వరుడు పవళించగా ఆ సమయంలో ఉయ్యాల కదిలినప్పుడెల్లా లక్ష్మీదేవికి భూదేవికి తన ఆలింగనభాగ్యాన్ని కలుగజేస్తున్నాడని అన్నమయ్య ఈ పదంలో చాలనాజూగ్గా చమత్కరించినాడు.

అన్నమయ్య తాను భావించి అనుభవించిన భక్తిశృంగార వైరాగ్య నీతిధర్మాది తత్త్వాలను సామాన్య ప్రజాహృదయాల్లో ఉద్బోధింపచేయాలనే ఆరాటపడినట్లు అతని సంకీర్తనలను పరిశీలిస్తే తేటపడుతుంది. రాగతాళవిన్యాసాదులన్నీ భాషాభావాలకు ఉపస్కారాలుగా, అలంకారాలుగా మాత్రమే అతని పదరచనల్లో ఉన్నాయి.

వేంకటేశ్వరస్వామి కేంద్రరత్నంగా వివిధంగా అన్నమయ్య సాగించిన అసాధారణపదరచనల్లో శృంగారమే ప్రబలంగా ప్రతిఫలించినది. అన్నమయ్య పదాలను వర్ణ్యవిషయాన్ని బట్టి శృంగారపదాలని, వైరాగ్యపదాలని రెండువిధాలుగా విభజింపవచ్చు. శృంగారపదాల్లో పాత్రోచితభాష ప్రయుక్తమయింది. వాటిలో గ్రామ్యములు కూడా పొంకమెరిగి పలుకాలి. వైరాగ్యపదాలు లేదా అధ్యాత్మపదాలు అగ్రామ్యరమ్యవిష్ణుచరితోదారములై ఉండాలట. అన్నమయ్య శృంగారసంకీర్తనాల సంపుటం కాయజోపనిషత్తు, మన్మథవేదం, వాటిలో అన్నమయ్య వెలిబుచ్చినభావాలు.

శ్రీవారి ఊయలసేవ



* ఈ భాగాలు డా॥ వేటూరి ఆనందమూర్తిగారి 'తాళ్లపాక కవుల పదకవితలు - భాషాప్రయోగ విశేషాలు' నుండి ఉద్ధరించినవి. (చూ, పుట. 75)

చేసిన కల్పనలూ, గుప్పించిన చమత్కారాలూ, వినిపించిన పలుకుబళ్ల కోకొల్లలు. అన్నీ స్వతంత్రాలే.

అన్నమయ్య ద్రావిడవేదంతో, తమిళ సాహిత్యంలో ప్రత్యక్షసంబంధమున్న విశిష్టాద్వైతాన్ని స్వీకరించి ఆభాషలోని మధుర భక్తినంతా అనుభవించి తత్తుల్యమైన పదాలను వ్రాసినాడు. అన్నమయ్య అధ్యాత్మిక సంకీర్తనలు వైష్ణవమతసూత్రాలు, మోక్షమార్గానికి భక్తి ముఖ్యసాధనమని వైష్ణవ మతం నమ్మకం. శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధురభావాలనే పంచవిధభక్తి రూపాలున్నాయి. ఈ అయిదు రూపాల భక్తితో అన్నమయ్య తన దైవాన్ని ఆరాధించినాడు. ద్రావిడ దివ్యప్రబంధమార్గంలో ఆలపించిన అన్నమయ్యపదాలు కూడా ద్రావిడవేదతుల్యములు.

అన్నమయ్య మూర్తీభవించిన తెలుగుతనం. అతనిరచన అంతా దేశీయమే. అతని పదాల్లో అడుగడుగునా సామెతలే. ప్రతి చరణంలోనూ నానుడులే. అన్నమయ్యకు తెలుగు సాహిత్యంలోనూ, సంగీతంలోనూ ఎంత పటుత్వముందో సంస్కృతంలోనూ అంతే పటిమఉందని ఈ క్రింది చరణాలను గమనిస్తే తెలుస్తుంది.

"ఫాలనేత్రానల ప్రబల విద్యుల్లతా
కేళీవిహార లక్ష్మీ నారసింహా!
దారుణోజ్జ్వల ధగద్ధగిత దంష్ట్రాగ్నిలవి
కారస్ఫులింగ సంగక్రీడయా
వైరిదానవ ఘోరవంశ భస్మీకరణ
కారణప్రకట వేంకటనారసింహా!"

భజనపద్ధతిలో సాగిన అన్నమయ్య సంకీర్తనరచన చూడండి.

"శరణు శరణు సురేంద్ర సన్నుతశరణు
శ్రీసతివల్లభ
శరణు రాక్షస గర్వసంహార శరణు వేంకట
నాయకా"

ఈ సంకీర్తనను చూచియే పురంధరదాసు ఈ క్రింది సంకీర్తనపంక్తులను రచించినాడని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అన్న



మాచార్యచరిత్ర పీఠిక (పుట 67) తెలిపినారు.

"శరణు శరణు సురేంద్ర వందితశరణు
శ్రీపతిసేవిత
శరణు పార్వతితనయ మారుతి శరణు
సిద్ధివినాయక"

సంకీర్తనాచార్యుడగు అన్నమయ్య పదరచనల్లోని భక్తిశృంగార గానాంశాలే క్రమంగా రామదాసాదులను చేరి భజన సంప్రదాయంగానూ, క్షేత్రజ్ఞాదుల నాశ్రయించి నాట్యాభినయ సంప్రదాయంగానూ, త్యాగరాజాదులను పొంది సంగీతసంప్రదాయంగానూ విస్తృతినందినట్లు డా॥ వేటూరి ఆనందమూర్తిగారు వివరించినారు.

త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్రాదిగతులన్నిటియందును అన్నమయ్య సంకీర్తనలున్నాయి. వాటిలో ఆ వృత్తముల సంఖ్య హెచ్చించీ, తగ్గించీ గతుల్లో మార్పును తెచ్చీ అన్నమయ్య వైవిధ్యాన్ని సాధించినాడు.

అన్నమయ్యపదాల్లోని రచనానిర్మితి, పదప్రయోగసరళి అసమానం. అతడు శృంగారకీర్తనలు, ఆధ్యాత్మికకీర్తనలేకాక 'శృంగారమంజరి' అనే లఘుకృతి కూడ విరచించినాడు. అది భక్తిసూనృతంగా, భావప్రధానంగా సాగినరచన. విరహిణుల వివిధమన్మథావస్థలు, వసంతోత్సవం, జలక్రీడ, మిసిమిజవ్వనుల ఛలోక్తులు ఎన్నో ప్రబంధధోరణిలో శృంగారమంజరిలో విస్పష్టంగా గోచరిస్తాయి. ఇలా మంజరి, రగడ, విషమజాతిసీసం మొదలైనవి మనోజ్ఞంగా రచించి అన్నమయ్య దేశిఛందస్సుకు మెరుగుపెట్టినాడు. ఏల, జోల, లాలి, తుమ్మెదపదం, మంగళహారతివంటి గేయభేదాలు అన్నమయ్య సృష్టించిన పదసాహిత్యంలో మనకు కన్పిస్తాయి. యతిప్రాస నియమాలను పాటించడంలోకూడ అన్నమయ్య నిష్ణాతుడు.

వాగ్గేయకారుడూ, లాక్షణికుడూఅయిన సంకీర్తనాచార్యుడగు అన్నమయ్య ఆధ్యాత్మికవిజ్ఞానంలోకూడ అపారమైనప్రతిభను ప్రదర్శించి పదసాహిత్యానికి నవ్యచైతన్యాన్ని చేకూర్చినాడు. డా॥ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారన్నట్లు అన్నమయ్య పదకవితలోని అసాధారణ భావనాశక్తి, భాషయందలి స్వతంత్రమధురధార భావములందు కానవచ్చు అసందిగ్ధమైన యార్జవం, విషయవైవిధ్యమూ అనుభవాలలోతు ఇంకేపదకవిరచనలోనూ కానరావు.*


ఉపయుక్త గ్రంథసూచి :

1. ప్రభాకరశాస్త్రి, వేటూరి—అన్నమాచార్యచరిత్ర పీఠిక.
2. అనంతకృష్ణశర్మ, రాళ్లపల్లి-అన్నమాచార్యుని కవిత, అన్నమాచార్యుల సంకీర్తనములు (1978) (కూర్పు: కామిశెట్టి శ్రీనివాసులు శెట్టి) లో ఉదాహరించిన వ్యాసం.
3. ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ—'క్షేత్రయ్య పదసాహిత్యము'—సాహిత్యోపన్యాసములు 3.
4. గంగప్ప, ఎస్. — క్షేత్రయ్య పదసాహిత్యం.
5. ఆనందమూర్తి, వేటూరి — తాళ్ళపాక కవుల కృతులు-వివిధసాహితీప్రక్రియలు (1974).
6. క్రొవ్విడి రామం—'తాళ్లపాకవారి రచనల విశిష్టత-సాహిత్యసౌరభము'లోని వ్యాసం.
7. ఆరుద్ర — సమగ్ర ఆంధ్రసాహిత్యం - 6వ సంపుటము.
8. శ్రీనివాసులుశెట్టి, కె.—'తెలుగులో పదకవిత' (తెలుగు-జూలై, సెప్టెంబర్ 1978).
9. చిన్నన్న, తాళ్లపాక—సంకీర్తన లక్షణం.
10. అన్నమాచార్యులు, తాళ్లపాక — సంకీర్తన సంపుటాలు.

# శ్రీ అన్నమాచార్య సంకీర్తనామృతము

శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి

అవ: చావు పుట్టుకలతో గూడిన సంసార చక్రములో పరిభ్రమించు జీవుని స్వభావమును వర్ణించుచున్నాడు —

55

నాట

ఎవ్వరెవ్వరివాఁడొ - యీ జీవుఁడు - చూడ
నెవ్వరికి నేమౌనొ — యీ జీవుఁడు ॥పల్లవి॥

1. ఎందరికిఁ గొడుకు గాఁ - డీ జీవుఁడు - వెనక
కెందరికిఁ దోఁ బుట్ట - డీ జీవుఁడు,
ఎందరిని భ్రమయించఁ - జీవుఁడు - దుఃఖ
మెందరికిఁ గావింపఁ-డీ జీవుఁడు. ॥ఎవ్వ॥

2. ఎక్కడెక్కడఁ దిరుగఁ - డీ జీవుడు- వెనక
కెక్కడో తన జన్మ - మీ జీవుఁడు,
ఎక్కడి చుట్టము తనకు - నీ జీవుఁడు-యెప్పు
డెక్కడికి నేఁగునో-యీ జీవుఁడు. ॥ ఎవ్వ ॥

3. ఎన్నఁడును జేటులే - నీ జీవుఁడు - వెనక
కెన్ని తనువులు మోవఁ - డీ జీవుఁడు,
ఎన్నఁగల తిరువేంక - టేశు మాయలఁదగిలి
యెన్ని పదవులఁ బొందఁ - డీ జీవుఁడు.
॥ఎవ్వ॥ (11-3-31)

ఈ జీవుడు ఎన్నో జన్మములలో ఎందరికో జన్మించుచున్నాడు. జననమరణాత్మకమైన సంసార చక్రములో పరిభ్రమించుచున్నాడు. ఇట్టి జీవుడు ఏయే జన్మలలో ఎవ్వరెవ్వరికి ఏయే వావి వరుసలతో సంబంధపడి యున్నాడో నిర్ణయించుట కెవరితరము? విచారింపగా జీవులలో ఒకరితో నొకరికెట్టి సంబంధమును లేదు.

ఈ జీవుడెన్నో జన్మలలో ఎందరికో కొడుకై జన్మించినాడు. పూర్వము తానెందరికో తోబుట్టువుగా బుట్టినాడు. ఎందరినో ఎన్నో విధముల పుత్ర మిత్ర కళత్రాది సంబంధములతో భ్రమింప జేసినాడు. ఎందరినో ఎన్నో రీతుల దుఃఖముల పాలు చేసినాడు.

ఈ జీవుడు తిరుగనిచోటే లేదు. ముందటి జన్మలలో ఎన్నో చోట్ల పలురూపములతో జన్మించి తిరిగియున్నాడు. రాబోవు జన్మలలో ఇత డెక్కడ పుట్టనున్నాడో? ఈ జన్మలో మాత్రము తనకీ జీవు డేవిధముగా అనుగు చుట్టము కాగలడు? ఇత డెపు డెక్కడికి పోవునో తెలియదుగదా!

ఇన్ని జన్మలు దాల్చుచున్నను, ఇన్నిసార్లు మరణించుచున్నను నిజముగా ఈ జీవునకు మాత్రము ఎట్టి చేటును లేదు. పూర్వమిత డెన్నో తనువులు దాల్చినాడు. తాను దాల్చిన శరీరములే చేటొందుచున్నవి. కాని సనాతనుడైన జీవాత్మునకే మాత్రము చేటులేదు. శ్రీ వేంకటేశ్వరుని మహామాయా ప్రభావమునకు లోబడి యీ జీవు డెన్నో పదవులు పొందుచున్నాడు.

విశే: "ఎక్కడి చుట్టము తనకు నీ జీవుడు" అనుటకు శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు తమ లఘుటీకలో ఇచ్చిన వివరణ యిది — "తాను ఈ జీవునికంటె వేఱుగాడు. కాని యీ జీవిత దశలో తన్ను ఇదివరకున్న ఇక ముందు రాబోవు జీవావస్థలకంటె ఎక్కువ ప్రీతితో చూచుట ప్రాణి స్వభావము కనుక భూత భవిష్యత్తులలో లేని క్రొత్త యనురాగము తనయందు తానిప్పు డేల చూపవలయును? అని తాత్పర్యము (తాళ్ళపాక పాటలు - II — P. 18)

సంసార భ్రాంతికి లోనై వెతజెందు జీవుల స్థితి ఈ సంకీర్తనములో వర్ణింపబడినది. జీవులు అనాదిగా కర్మకు వశులై సంసారప్రవాహములో దిరుగుచున్నారు. వర్తమాన జన్మమునే వారు నిక్కముగా దలంతురు గాని అతీతములు, అనాగతములు అయిన జన్మలను గూర్చి భావింపలేరు. ఇది మాయా ప్రభావము.

జీవునకు వేలకొలది తల్లిదండ్రులు, వందలకొలది భార్యలు బిడ్డలు గతించినారు. ఇందులో ఎవరితో ఎవరికి సంబంధము నేమని నిర్ణయింపగలము? సంసారమున మనకు లభించిన, మనలను విడిపోయిన బంధువు లెందరున్నారో, అన్ని యిసుక రేణువులు గంగలో గూడలేవని పెద్దలసూక్తి —

మాతా పితృ సహస్రాణి పుత్రదారశతాని చ ।
తవానన్తాని యాతాని కస్య తే కస్య వా భవాన్? ॥
(సుభాషితావళి-3288)

లబ్ధాస్త్యక్తాశ్చ సంసారే యావన్తో బాంధవాస్త్వయా ।
న సన్తి ఖలు తావన్తో గంగాయామపి వాలుకాః ॥
(శార్ఙ్గధరపద్ధతి-4133)

పూర్వాపరజన్మలను గూర్చిన భావన గల తత్త్వవేత్తలు మాత్రము సామాన్య జీవులవలె శోకమోహములకు లొంగరు. ఇట్టి విజ్ఞానమును మనకు గలుగజేయుటకే అన్నమయ్య ఈ సంకీర్తనములో జీవుని పరిస్థితి నిట్లు వర్ణించినాడు.

శ్రీకృష్ణుడు గీతలో జన్మములను గూర్చి వివరించుచు తనకును, అర్జునునికిని ఎన్నో జన్మలు గడచినవనియు, ఆ జన్మలన్నియు తనకు తెలియునుగాని అర్జునునకు తెలియవనియు చెప్పినాడు —

బహూని మే వ్యతీతాని
జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి
న త్వం వేత్థ పరంతప ॥ (గీ — 4-5)

ఇందుచే మాయ కధీనులైన జీవుల జ్ఞానశక్తి మరుగుపడి యుండుట వలన వారు తమ జన్మ వృత్తాంతముల నెరుంగ జాలకున్నారని స్పష్టమగుచున్నది.

శరీరము నశించిన పిమ్మట జీవుడున్నాడా! లేడా? అను విషయము

మిక్కిలి ముఖ్యమైనది. కఠోపనిషత్తులో ఈ విషయమును గూర్చి నచికేతుడు ప్రశ్నింపగా యమధర్మరాజు దేవతలు గూడ ఈ విషయమున సంశయాత్ములై యున్నారనియు, అది మిగుల సూక్ష్మ విషయము గాన తెలిపికొనుట కష్టమనియు వచించెను —

దేవైరత్రాపి విచికిత్సితం పురా
నహిసుజ్ఞేయ మణురేష ధర్మః।(కఠ-1-21)

ఉపనిషత్తులు మున్నగు బ్రహ్మవిద్యా ప్రబోధకములైన గ్రంథము లన్నియు ముఖ్యముగా ఈ ఆత్మ తత్త్వమును వివరించుటకే వెలువడినవి.

గీతలో ద్వితీయాధ్యాయమున జనన మరణములు ఆత్మకులేవు. అది ఎల్లకాలములలో పుట్టుకలేనిదై, నిత్యమై, శాశ్వతమై యున్నది. శరీరము హతమైనను. అది హతముగాదు — ఇత్యాదిగా ఆత్మ స్వరూపము విపులముగా నిరూపింపబడినది —

న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయంభూత్వా భవితా వా నభూయః।
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥ (గీ-2-20)

కఠోపనిషత్తులో గూడ ఈ విషయమే ఇట్లు చెప్పబడియున్నది —

న జాయతే మ్రియతే వా విపశ్చి
న్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్।
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥
(కఠ — 2–18)

కాబట్టి జీవుడు తన నిత్యత్వమును గుర్తించినప్పుడే సుఖ దుఃఖముల కతీతమైన స్థితి నొందగలడు.

సకల వేదార్థములను సంకీర్తనములుగా పాడదలచినవాడు గాన అన్నమయ్య ఎడనెడ ఇట్టి ఆత్మతత్త్వ ప్రబోధకములైన విషయములను లలిత లలితములైన పదములుగా వెలయించినాడు.

* * *

అవ:— దోషభూయిష్ఠమైన ఆటోపపు జీవితము కంటె నిర్దుష్టమైన సామాన్య జీవితమే మేలనుచున్నాడు:-

56

గుజ్జరి

అప్పులేని సంసార - మైన పాటే చాలు
తప్పులేవి జీతమొక్క - తారమైన(జాలు.
॥ పల్లవి ॥

1. కంతలేని గుడిసొక్క-గంపంతయిన(జాలు
చింతలేని యంబలొక్క - చేరెఁడే చాలు;
జంత గాని తరుణి యే - జాతైన నదె చాలు
వింతలేని సంపదొక్క - వీసమే చాలు
॥ అప్పు ॥

2. తిట్టులేని బ్రదుకొక్క - దినమైన నదె చాలు
ముట్టులేని కూడొక్క - ముద్దెఁడె చాలు
గుట్టుచెడిమనుకంటె-కొంచెపుమేలైన జాలు
వట్టి జాలిఁ బడుకంటె - వచ్చినంతే చాలు
॥ అప్పు ॥

3. లంపటపడని మేలు - లవలేశమే చాలు
రొంపి కంబమౌకంటె - రోయుటే చాలు
రంపపుఁ గోరికకంటె - రతి వేంకటపతి
పంపున నాతనిఁ జేరే - భవమే చాలు.
॥ అప్పు ॥ (11-3-48)

అప్పుజేసి అటోపముగా సంసారము జరుపుటకంటె అప్పులేని కాపురము జరిగినంత వరకే చాలును. అదే సుఖప్రదము. అల్లే తప్పుత్రోవలో ఆర్జింపబడిన అధిక ధనము కంటె తప్పులేని జీతము నాలుగు కాసులైనను చాలును.

(వ) తారము = నాలుగు కాసుల నాణెము.
(1) జంత = ధూర్తురాలు. వీసము = ఒకట పదునారవ భాగము;
(3) రొంపి కంబము = బురదలోని స్తంభము; రంపపుఁగోరిక = రంపపుకోతవలె బాధపెట్టు ఆశ

ఎండ వానల వలని బాధ తప్పని పెద్ద గృహముకంటె చక్కగాకప్పబడిన యిల్లు చిన్నదైనను మేలు. నానా చింతలకు లోనై తిను పంచ భక్ష్య పరమాన్నముల కంటె చీకు చింతలేని యంబలిచేరెడైనను సుఖకరమే. ధూర్తురాలైన కుల స్త్రీ కంటె గుణవతియైన వనిత తక్కువ జాతిదైనను మేలే. ("స్త్రీ రత్నం దుష్కులాదపి" అని పెద్దల వచనము) అన్యాయముగా ఋణములో ఆర్జింపబడి పదిమందికి వింతగొల్పు పెద్ద సంపదకంటె న్యాయార్జితమైన విత్తము మిక్కిలి కొద్దిదైనను చాలును.

ఇతరుల దూషణకు లోనై శత సంవత్సరములు జీవించుటకంటె ఎట్టి దూషణ లేక ఒక్కదినము జీవించినను మేలే. అపరిశుద్ధమైన అన్నము కడుపునిండ దినుటకంటె పరిశుద్ధమైన అన్నము ఒక్క కబళమైనను సుఖావహము. పెద్ద పెద్ద ఆశలతో ప్రాకులాడి పదిమందిలో గుట్టుచెడి బ్రదుకుట కంటె ఏ కొంచెపుమేలు గల్గినను దానితో తృప్తిపడుట మేలు. లేనిపోని ప్రయాసలకు గురియై జాలిపడుట కంటె వచ్చిన దానితో తృప్తినొందుట మేలు.

పలుతగులములకు గురియై బాధపడుటకంటె ఏ లంపటములేక వచ్చుమేలు కొద్దిపాటిదైనను చాలును. బురదలోని స్తంభమువలె నిలకడలేని జీవితముకంటె ఐహిక సుఖములపై రోతపడి నిశ్చలముగా నుండుట మేలు. రంపమువలె బాధావహమైన కోరికలకు లోనగుటకంటె 'మామేకం శరణం వ్రజ' (గీత-18-66) అను భగవదాదేశము ననుసరించి ఆ దేవుని సన్నిధి చేరుటకు ప్రయత్నించు మానవుని పుట్టుకే శ్రేష్ఠమైనది.

(సశేషము)

# శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, తిరుమల
## వివిధ ఆర్జిత ఉత్సవముల ధరల వివరములు.

### దర్శనములు

1. స్పెషల్ దర్శనము రు. 25

ఈ టికెట్టు తిరుమలలోనూ, దేశంలో ఆంధ్రాబ్యాంకువారి వివిధశాఖలలోను లభించును. ఈ టిక్కెట్టు వారిని సుప్రభాత సమయంలోనూ, సర్వదర్శన సమయంలోను అనుమతించటం జరుగుతుంది. ఈ టిక్కెట్టువారిని సర్వదర్శన సమయంలో ధ్వజస్తంభమువద్ద గాక మహా ద్వారంవద్ద క్యూలో చేర్చటం జరుగుతుంది.

### సేవలు

| | | |
|---|---|---|
| 1. | ఆమంత్రణోత్సవము | రు. 200 |
| 2. | పూలంగిసేవ | రు. 60 |
| 3. | అభిషేకము (పులికాపుసేవ) | రు. 450 |
| 4. | గంబురగిన్నె | రు. 250 |
| 5. | పునుగుగిన్నె | రు. 100 |
| 6. | జాఫ్రాగిన్నె | రు. 100 |
| 7. | కస్తూరిగిన్నె | రు. 100 |
| 8. | సహస్రకలశాభిషేకము | రు. 2500 |
| 9. | తిరుప్పావడ | రు. 5000 |
| 10. | కోవిల్ ఆళ్వారు తిరుమంజనం | రు. 1745 |
| 11. | ఐనా మహల్లో డోలోత్సవం | రు. 1000 |

### ఉత్సవములు

| | | |
|---|---|---|
| 1. | వసంతోత్సవము | రు. 2500 |
| 2. | కల్యాణోత్సవము | రు. 1000 |
| 3. | బ్రహ్మోత్సవము | రు. 750 |

### వాహనములు

1. సర్వభూపాలవాహనములో వజ్రకవచసేవ 72+1 (హారతి) రు. 73
2. బంగారుగరుడ, కల్పవృక్ష, పెద్దశేష, సర్వభూపాల, సూర్యప్రభ ఒక్కొక్కదానికి 62+1 (హారతి) రు. 63
3. వెండిగరుడ, చిన్నశేష, చంద్రప్రభ, ఏనుగు, గుఱ్ఱం, హంస, హనుమంత వాహన సేవ ఒక్కొక్కదానికి 32+1 (హారతి) రు. 33

### అన్నప్రసాదములు (కాలుసోల)

| | | |
|---|---|---|
| 1 | దధ్యోదనము | 40 |
| 2. | పులిహోర | రు. 50 |
| 3. | పొంగలి | రు. 55 |
| 4. | చక్కెరపొంగలి | రు. 65 |
| 5. | సాకరబాత్ | రు. 95 |
| 6. | కేసరిబాత్ | రు. 85 |
| 7. | పాయసము | రు. 85 |
| 8. | సీరా | రు. 155 |

### పడుల ప్రసాదములు

| | | |
|---|---|---|
| 1. | అప్పము | రు. 230 |
| 2. | లడ్డు | రు. 450 |
| 3. | వడ | రు. 250 |
| 4. | పోళీ | రు. 225 |
| 5. | దోసె | రు. 100 |
| 6. | తేనెతొళ | రు. 200 |
| 7. | సుఖియం | రు. 200 |
| 8. | జిలేబి | రు. 450 |

### నిత్యసేవలు

| | | |
|---|---|---|
| 1. | నిత్యకర్పూర హారతి | రు. 21 |
| 2. | నిత్యనవనీత హారతి | రు. 42 |
| 3. | నిత్య అర్చన | రు. 42 |

షరా :- సహస్ర కలశాభిషేకము ప్రతి బుధవారమునను, తిరుప్పావడ ప్రతి గురువారమునను జరుగును. మిగిలిన వివరములకు ఈక్రింది చిరునామాకు వ్రాయవచ్చును.

1. ఆమంత్రణోత్సవమునకు 5 గురికి మారుగా ఇద్దరికి మాత్రమే అనుమతి,
2. ప్రతిదినం మధ్యాహ్నం 1-00 గం॥ నుండి 8-00 గం॥ లోపల సర్కారు లేదా ఆర్జిత కళ్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, వాహన సేవలు, సర్కార్ డోలోత్సవం (ఉయ్యాల) (సర్కారు లేక ఆర్జిత ప్లవోత్సవం, మంగళవారంనాడు) జరుగుతవి.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,
తిరుమల తిరుపతి దేవస్థానం
తిరుపతి 517501

(15 వ పేజీ తరువాయి)

హీనుడెవరు ?

ఈ తంత్రమందే కామికాగమమున "తనోతి విపులానర్థాన్ తత్త్వ మంత్ర సమాశ్రితాన్ త్రాణం చ కురుతే యస్మాత్తంత్రమిత్యభిధీయతే" రక్షించునట్టి మంత్రమును, తత్త్వజ్ఞానమును వివరణగ ప్రచారము చేయునదని తంత్రార్థము జూతము. "హర్యర్చనాహీన మహీహీనం వ్యాసోవదత్యఖిలధర్మవిశేషవిజ్ఞః" నిక్షిప్తములగునసర్వ రహస్యము నెన్నింటి నో వెలికిదెచ్చిన సర్వధర్మమర్మవిశేషవిజ్ఞుడగు వ్యాసమహర్షి భగవదారాధనజేయని వాడే హీనుడని సముదాత్తభావ పరమ చరమసందేశమిచ్చిరని శార్ఙ్గధర నిరూపణ. భారతీయశబ్దం ఎంత అనాదియైనదో అట్లే హిందూశబ్దము సనాతనమైనదే. హిందూమతం మతవాచకమేగాక దేశ ప్రజావాచకమూను.

భారతదేశమున జన్మించి ఈశ్వరీయమైన వేదధర్మములను అనుష్ఠించు మానవాళికి భారతీయులనేపేరు వేదాదులను బట్టి తేలుతున్నది భాయాంరతాః భారతాః భాజు దీప్తౌ - ఆధ్యాత్మజ్ఞానరీతులు తెలిసినవారు భారతీయులు. ఇది సర్వులకు వర్తించును.

"భారతః నరే" ఋగ్వేదం 'ప్రాణో భరతః' ఐతరేయ బ్రాహ్మణమ్ 'శ్రీర్వై రాష్ట్రస్యభారతః' శతపథబ్రాహ్మణమ్"- భారతజనులలనియు, ప్రాణమునకు భరత అనేపేరు ఉన్నదనియు మనభారతజాతి శ్రీ జ్ఞాన సంపన్నమైనందున భారతమని పిలువబడినది. "తం దేవనిర్మితం దేశమ్" దేవతలచే ఏర్పాటుచేయబడిన దేశమని మనుస్మృతి. "తదేతద్భారతం వర్షం సర్వబీజం ద్విజోత్తమ బ్రహ్మత్వమమరేశత్వం దేవత్వమపి దుర్లభమ్" సర్వజీవులు ఉత్పత్తిబొందినదీ భారతదేశమందు. ఇచ్చటపుట్టి వేదకర్మలు జేయనివారికి బ్రహ్మత్వము లేక ఇంద్రాదిదేవత్వముగాని లభించుట దుర్లభమని మార్కణ్డేయపురాణ హెచ్చరిక. భారతమున దుష్యంతుని పుత్రుడు భరతుని పాలనవలన, భాగవతమున ఋషభుని కుమారుడు భరత పరిపాలనవలనను, స్వాయంభువమనువు ప్రజలనుత్పత్తిజేసి పోషించినందున అనగా భరించి నందువల్ల భరతుడనే పేరు పొంది పరిపాలింప బడినందునను ఈ ఖండము భరతవర్షమైనదని వాయుపురాణాది నిర్వాణకము. భోగభూములందు గాక భారతభూమియందు పుట్టినవారు ధన్యులనియు దేవతలెవ్వేళగీతములుపాడుచుండు దురట. వారి దేవత్వము తీరినవెనుక ఇక్కడ పుట్టవలయుననియు స్వర్గాపవర్గముల కాస్పదముమార్గభూతమగు హిందూ భూమియందుపుట్టుటే దేవతలకన్నా నెక్కువగు మోక్షమునే బడయుటకు సాధ్యమని ప్రజాబాహుళ్యమునకు ధర్మమునదోవ్పడు విష్ణుపురాణపు ఉగ్గడింపు. హిందూదేశాను రాగం కేవలం భావోద్రేకమనరాదు. ధర్మార్థకామమోక్షముల కత్యంతహితమైయాశ్రయమైన ప్రజామతం. హిందూతత్త్వమందు నవీనభావాలుకలిసినా మహావేదవాహినినుండివిడదీయబడదు. హిందూమతంలేనిదే హిందూదేశం శవంతోసమానమని హిందూజాతిని మేలుకొలిపినది- హిందూధర్మోన్నత్యము నెఱిగి నాత్మవికాసమునొందిన మహాసాధ్వి అనిబిసెంట్.

ప్రపంచములో ఇతరమతములు పుట్టకముందే వేదమతమైన హిందూమతము విరాజిల్లు చున్నది. వ్యక్తిస్థాపితములగు మతములందు వైషమ్యరాగద్వేషాలు ప్రతిఫలించుట స్వాభావికము. ప్రాచుర్యము కలిగిన మహమ్మదీయ క్రైస్తవ మున్నగు మతములు ఆ యా ప్రవక్తల కాలమునుండియే ఆవిర్భవించినవను విషయము జగద్విదితమే. హిందూమతావిర్భావకాలము ఎవరు నిర్ణయించలేదు.

# రచయితలకు చిత్రకారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రికకు మత ధార్మిక సంబంధమైన రచనలు, వ్యాసములు, గేయములు, చిత్రములు, ఛాయా (వర్ణ) చిత్రములు పత్రికలో ప్రచురణకుగాను కోర బడుచున్నవి. రచయితలు, చిత్రకారులు ఈ క్రింది విషయములు గమనించవలెను.

*

1. రచనలు చేయువారు 6 అరతావు పేజీలకు మించకుండా, పేజీలకు ఒక వైపుననే వ్రాసి పంపవలెను. వాటికి సంబంధించిన ఛాయా చిత్రములను కూడ పంపగోరెదము.

*

2. చిత్రములు వేయువారు ఇండియన్ ఇంకుతో వేసి పంపవలెను.

*

3. ఛాయాచిత్రములుపంపువారు చిత్రములలోని వివరములు నిర్దుష్టంగా వ్రాసిపంపవలెను.

4. ప్రచురితమైన వాటికి ఎట్టిపారితోషికము ఈయబడదని గమనింప ప్రార్థన

— సంపాదకుడు,

సప్తగిరి

యుగములు మారినా, కల్పములు మారినా అపరిణామశీలమై ఏది స్థిరమై నిలచియున్నదో అదియే వేదమతము. ఇతర మతములలో కంటే విశిష్టమైనది. ఎందువల్లననగా వేదమపౌరుషేయం. ఎలాగన బృహదారణ్యకోపనిషత్తు 'తేనాత్మనేదగ్ం సర్వమసృజతయదిదగ్ం కిం చర్చోయజూగ్ంషిసామాని" భగవంతునివలన వేదములు బయలువెడలినట్లు పేర్కొనినది. "నైవవేదాః ప్రలీయన్తే మహాప్రళయేఽపి' మహాప్రళయమందును వేదములు నశింపవనియు పరమాత్మయందు వేదరాశి సూక్ష్మరూపముతో నిలిచియుండునని మేధాతిథి పలికెను. కానసృష్టికి పూర్వమే స్వయముగా పరమాత్మనుండి బ్రహ్మతో వేదోదయమగుచున్నది. ఆ కారణమున వేదమపౌరుషేయము. ఈ విధముగా

"నకశ్చిద్వేదకర్తా చ వేదం స్మృత్వా చతుర్ముఖః తథైవధర్మాన్ స్మరతిమనుః కల్పాంతరే" వేదమును రచయించిన కర్త యెవ్వడునులేడు. పరమేశ్వరుడు మహాకల్పాదియందు బ్రహ్మదేవునకు వేదమునొసంగెను. ఆయన తనకిచ్చిన వేదములను స్మరించి తన సృష్టివిధులను నిర్వర్తించునని తన స్మృతియందు పరాశర మహర్షి సెలవిచ్చిరి. మత్స్య పురాణమందును "అస్యధర్మస్య సర్వజ్ఞఃకల్పాదౌ పరమేశ్వరః వ్యంజకః కేవలం విప్రానైవ కర్తాన సంశయః" సర్వధర్మమూలకుడైన పరమాత్మ సృష్ట్యాదియందు వేదమునకు వ్యక్తకుడేగాని కర్తగాడు. నిస్సంశయమని గలదు. శ్రుతిస్మృతిపురాణ ప్రతిపాదనల వలన జగత్సృష్టికి కారణభూతుడైన భగవానుడు బ్రహ్మనుసృజించి తన నిశ్వాసభూతములగు నిత్యజ్ఞానానువిద్ధములగు వేదరాశిని వానికొసంగినాడనియు సృష్టికి పూర్వమే దైవదత్తమైన వేదరూప సంస్కృతభాషయున్నదని తేలుచున్నది.

వ్యాకరణభాష్యకారులగు శ్రీ పతంజలి మహర్షి "నైకానాప్యక్షరేణాఽనర్థకేన భవితవ్యమ్" వేదమందలి ఒకయక్షరముకూడ అనర్థముగాక సార్థకమైయున్నదన్నారు. పాశ్చాత్యులు క్రీస్తుకుపూర్వం రెండువేల యేండ్లక్రిందట వేదములు బయలుదేరినవనియు, జాకోబిపండితులు ఎనిమిదివేల నాటిదనియు అనిరి. ఇది వారి యభిప్రాయము. ఇట్లేయుండవచ్చును. ఒకరిసిద్ధాన్తము ఒకరికి సరిపోక బహువిధములు చెప్పి అంతుచిక్కక భూలోకములో వేదములకన్నా ప్రాచీనగ్రంథములులేవన్నారు. దేశీయులగు శ్రీతిలక్‌గారు ఏడువేలసంవత్సరములపైన వేదములు రచించబడినవనుచు సనాతనవాదమునకు అవకాశమిచ్చినారు. అన్నివాదములు నిరసింపదగినవి. "దేశకాల స్వరూపావిచ్ఛిన్నవ్యాప్తిరితి పరమాత్మనిరుక్తిః" దేశకాలములతోనిమిత్తంలేక ఎడతెగక ఎల్లప్పుడు ఉండువాడు ఈశ్వరుడు కావునతనినిశ్వాసలైన వేదములుకూడ సనాతనములె. వేదములకృత్రిమమని రూఢమగు చున్నది. నిశ్వాసమెట్లుగ మానవజీవితదశను సూచించునో యట్లే వేదములు పరమేశ్వరసత్తాని సూచించును. జీవులు జీవించియున్నంత వరకు వారి శ్వాసలు నడచుచున్నట్లు పరమేశ్వరుడున్నంతవరకు వేదములుండును. గనుక వేదములు మానవరచనలు కావు. వేదములు విశ్వప్రభుసమ్మితములు. ప్రభుసమ్మితములన్నీ దేవునితో సమానములని భావము. ప్రభుత్వాజ్ఞ యెట్లనుల్లంఘనీయమో వేదసూక్తులట్లనుల్లంఘనీయములు.

పరమేశ్వరుడు దయాళువై ఋషుల ద్వారా వేదములను వినిపించారు. రేడియోను ట్యూన్‌చేసి మనము మాటలను విన్నట్లు యోగమార్గమున మహర్షులు మనస్సులను నడిపించే వేదములను వారు విని గ్రహించిరి. ఆ కారణముచేతనే వేదములకు శ్రుతులని పేరువచ్చినది. ఈ నిగూఢతత్త్వము ననుసంధానముజేయు గౌరవము హిందూ వైదికకాలీన దివ్యచక్షుస్సంపన్నులగు మన మహర్షులకే దక్కినది. వేదములందు సారముస్వీకరించి తత్ప్రచారార్థమై స్మృతీతిహాసపురాణాదులను మానవధర్మముల నుద్దీప్తమొనర్చుటకు మహర్షులు నుడివిరి.

కపిలేశ్వరాలయంలో ఇటీవల జరిగిన కుంభాభిషేక దృశ్యం. ఇందులో ఉపకార్యనిర్వహణాధికారి శ్రీ యన్. నరసింహారావు, కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్‌లను చూడవచ్చు.



హిందూసిద్ధాన్తమున ఇహలోక పర లోకములుగాక పరమపదమనునది వేరొకటి కలదు. అట్టి పరమపదమార్గము నందుకొనుటకు కర్మ, భక్తిమార్గములు ప్రథమసాధనలు. అందు ఉత్తీర్ణులైనవారు జ్ఞానమునజేరి ముక్తులయ్యెదరు. ముక్తికి హిందూశాస్త్రమందు జప ప్రార్థనలే గాక మరికొన్ని విశ్వాసములు గలవు. వాటిలో ముఖ్యమైనవి కర్మ, పునర్జన్మ, ఆగమిక విగ్రహారాధన ఇవి హిందూమతాధిక్యత గలవి.

ఇస్లాం క్రైస్తవమతములు దుఃఖహేతువులైన పాపానికి కార్యకారణసంబంధాన్ని వివరించవు. మానవులందరు పాపులేయనియు శరీరమునుండి వేరుపడిన జీవుడు పాపపుణ్యములను బట్టి ఆయా లోకములకు బోక ఆకాశమున సంచరించుననియు ప్రపంచము నీళ్ళలో మునిగిన తర్వాత మృతినొందిన వారందరికి దేవుడు తీర్పు దినమున పుణ్య పాపవిచారణ జేయుననియు ప్రస్తుతము మానవజన్మ ఒక్కటే ఇవ్వబడిందని పూర్వజన్మలు లేవన్నవి క్రీస్తు లేదా మహమ్మదు ప్రవక్తలయందు విశ్వాసముంచిన స్వర్గానికిమాత్రమే మార్గమంటున్నాయి. హిందూమతమట్లుగాక —

"శరీరజైః కర్మదోషైర్యాతి – ఇతి కఠోపనిషత్" శరీరముచే జేయబడిన కర్మ దోషములచేత మానవునకు జన్మపరంపర ఉన్నదనియు, పూర్వజన్మలో చేసుకున్న కర్మలే పుణ్యాపాపములకు కారణాలని చెప్పింది.

(సశేషము)

( 15వ పేజీ తరువాయి )
రించిన భక్తి యోగమునకు అర్హత యున్నవారు. ఇతరులు అర్హులగునది బహుకష్టము. దీనికి ప్రతిగా వేదాంత శాస్త్రము సులభమైన ఇంకొక్క మోక్ష సాధనమును సూచించుచున్నది. దీనిని న్యాసవిద్య, శరణాగతి, అథవా ప్రపత్తి యని చెప్పుదురు. ఈ విధానమును పాంచరాత్ర శాస్త్రమని భగవచ్ఛాస్త్రమందు భగవంతుడే ఉపదేశించి యున్నాడు. ప్రపత్తియు బ్రహ్మవిద్యయైనను, దీనిని సామాన్య మనుష్యుడు, సాధారణకోటికి చెందిన ఏ ప్రాణియైనను గ్రహింప వీలగుచున్నది. అట్టి అధికారము ప్రతిప్రాణికిని గలదు. భక్తిమార్గమనుష్ఠించుటకు, శక్తి కావలెను, జ్ఞానము కావలెను. వేదాధికారముండవలెను. చాల కాలము చేయవలసి యుండును. చాల ప్రమాదకరమైనది. చాల నియమములతో కూడినది. కష్ట సాధ్యమైనదియు. భక్తికి ప్రతిబంధముగా నిలబడి బాధకములైన అనేక జన్మార్జిత పాపములకు పరిహారించుటకై ప్రపత్తి కావలెను. ఇంతయయ్యును ప్రపత్తి సహాయము లేని భక్తిలేదు. భక్తి కష్టము ప్రపత్తిసులభము అని తెలియువారెల్లరు ప్రపత్తి కర్హులు.

ప్రపత్తికి సులభమైన సర్వాధికారకమైన విద్యా సంప్రదాయమని పరాంకుశుళ, పరకాల, నాథముని, యామునముని, రామానుజముని, వేదాంతదేశికులు మొదలుగా అందఱిచేతను ప్రచారమై ప్రసిద్ధికెక్కినది. దీనికి జాతి, కులము, గోత్రము, విద్య, వృత్తి, కాలము, దేశము ఇత్యాదిపనియమముల అవసరమును లేదు. మనుష్యులు పశువులు, పక్షులు మొదలైన జంతునియమము కూడ లేదు. ప్రాణి సామాన్య మేదైనను ప్రపత్తి మార్గముచే ఆ యా జన్మములందే మోక్షము పడయ వచ్చును. అయితే దీనికి ఐదు పరికరములు వలయును.

పరికరములు:- ప్రపత్తికి పరికరములు ఐదు ప్రకారములు. వీనిని అంగములని చెప్పుదురు. అవి ఏవి అనగా ఆనుకూల్య సంకల్పము, ప్రాతికూల్య వర్జనము, కార్పణ్యము, మహావిశ్వాసము, రక్షకత్వ ప్రార్థనము.

ఆనుకూల్య సంకల్పమనగా జగత్తులోని సమస్త చరాచర వస్తువులు పరమాత్మునికి శరీరమై యుండుటచే యథాశక్తి విహితానుష్ఠానముచే ఉపకారముచేయు నిశ్చయము. సకల వస్తువులలో పరమాత్ముడు అంతర్యామియై యుండుటచే నిషిద్ధ నివృత్తి మూలకమైన అపకారము చేయునదిలేదు అను దృఢ నిశ్చయమే ప్రాతికూల్య వర్జనము. కార్పణ్యమనగా భక్తులయందు సామర్థ్యము లేమి; మోక్షముకంటె వేరే ప్రయోజనమును అపేక్షింపకుండుట, పరమాత్మను విడచి, వేరురక్షకులను అపేక్షింపకుండుట, ఆశ్రితులైన తమ్ము సర్వేశ్వరుడు రక్షించునను ధృఢ విశ్వాసమే మహావిశ్వాసమనబడును. రక్షకత్వ ప్రార్థన లేక గోప్తృత్వ వరణమనగా తన మనోరథమును తెలియజేయుట. మొదటి రెండు పరికరములు అపాయ పరిహారములు. మూడవదానిచే రక్షకుని కారుణ్యోత్తేజనము, నాల్గవదానిచే ఏ విధమైన సందేహమును లేక ప్రపత్తియొక్క అవశ్య కర్తవ్యము. నిర్భరత్వమును సూచితములగును. ఐదవ దానిచేభగవంతుని ఫలప్రదానసంకల్పము, ప్రయోజనము వ్యక్తములగును. ప్రపత్తియొక్క అనుష్ఠాన కాలమందు ఈ అంగములు అత్యంతము ఆవశ్యకములై యున్నవి.

( సశేషము )

(12 వ పేజీ తరువాయి)

లందున్న మణులు మిక్కిలి ప్రకాశించుచుండెను. నటీమణులు నాట్యమాడుచుండిరి. బలికాంతులచే హంస లచ్చటకు చేరియుండెను. కవియీ సందర్భమున స్వామి దివ్యమంగళ రూపమును తనివిదీర వర్ణించెను. శిరమున కిరీటము ముఖమున తిరుమణి కర్ణములందు కుండలములు, అధరములందు హాసముగల్గి స్వామి భక్తుల నాకర్షించుచుండెను. సుందరమగు శంఖ తుల్యమగు గ్రీవము, కరములందు శంఖ చక్రములు గలవు. ఈ స్వామి వేడిని చలినిసృష్టించుచు సూర్యుడు చంద్రుడునై యుండెను. స్వామికన్నుల మహత్త్వమును దెలుపునదీ పద్యము.

తే॥ కలువ తామర కొలముల వలనఁ జేయు
చూపులను చలి వేడియుఁ జూపువాని
విమల లావణ్య జలనిధి వేలఁ బొదము
పగడమన నొప్పువాతెర సొగసువాని (2-176)

వేంకటేశ్వరుని కేలుదోయి ఆ కల్పఫలమిచ్చు కల్పశాఖలను బోలియున్నది. ఉరస్థలమున అలమేల్మంగ (లక్ష్మీదేవి) వసించియున్నది. నాలుగు ముఖములు గల బ్రహ్మనుగన్న తామర బొడ్డునగలదు. కటియందు పట్టుదుప్పటి, పాదములందు వేదమంజీరములు గలవు. వివిధ భూషణములను ధరించిన చామన చాయ మేనివాడు కరుణానిధీశుడు, శ్రీ వేంకటేశ్వరుడు సర్వగీర్వాణ సముదయ సార్వభౌముడు, శుభగుణాలవాలుడునిర్జరస్తుతి విశాలుడుఁ అతివిఖ్యాతి వెలయువాడీ స్వామి. అంత్యాను ప్రాసము యమకములతో కూడి భావసౌందర్యముతో నొప్పు ఈ పద్యము స్వామి మహిమలను వెల్లడించును.

సీ॥ మొల కటారపుఁ డెక్కుగలవాని గలవాని
నెనరువాని బొగడఁ దనరువాని
దయతోడ కూడిచేతన వాని తనవాని
తనయంతవాని గానునుచు వాని
పదములు బొదలు నాపగవాని పగవాని
పగవాని బురశను బిరుదువాని
నెమ్మోము నగవు వెన్నెలవాని నెలవాని
చెన కన్నుదోయిగాఁ జెలగువాని

తే॥ నంబుదపుడంబు మీఱు గాత్రంబు వాని
కొండనని కోర్కి కొండను కొండవాని
విలుపుగల పైడి చెలవుల వలువవాని
మేలు సమకూర్పునలమేలు మేలువాని (2-179)

స్వామి లక్ష్మిగలవాడు, నెనరు గలవాడు, పదములయందు ఆపగ (గంగా నది) కలవాడు; వేంకటేశ్వరస్వామిభక్తుల పాపములను తొలగించి, వారిని రక్షించును. భక్తుల కోర్కెలను కొండలను తీర్చును. మేలు సమకూర్చు అలమేలు మంగతో కూడియున్నవాడీ స్వామి. ఈ సందర్భమున రామకృష్ణకవి అయిదుపద్యములలో — 'వాని, వాని' యనుచు స్వామి మహిమలను భక్తి భావ స్ఫోరకముగ వర్ణించెను కవి స్వయముగా తిరుమల స్వామిని దర్శించి వర్ణించినట్లు గోచరించుచున్నది. దేవాలయమున జరుగు ఉత్సవములను, వ్రతములను, స్వామి సేవలను కవియిందు వర్ణించెను. పరిశీలింపుడు:

సీ॥ తలనిట్ల గట్టు వ్రతంబుల రాయని
తోమనిపళ్యాల నేమగాని
చేరుడు బియ్యాల యోరెముల్ దినువాని
కోణంగి సేవల నాణెగాని
కానుకలకు వడ్డికాసులు గొనువాని
ముక్కోటి తీర్థపు టెక్కులాని
అడుగడ్డునకు మ్రొక్కులందుకొనెడు వాని
కూకటి మాదల గుత్తవాని

తే॥ శుక్రవారపు సేవల సొగసువాని
మానినుల గోరి స్నపించు మాయలాని
తిండి మెండయ గారిని దిగళగురుని
కాంచి సేవించి సంతోష కలితులగుచు (2-180)

సప్తర్షుల స్తుతి స్వామి మహిమలను వెల్లడించుచున్నది.

"మోడ్పుఁ గేలు త్రిమూర్తుల మొదలి దొరకు"-
భువనముల్ పుట్టింప పోషింప నణగింప యైప
కర్తప్రధానమూర్తి వీవ"

నీ మహా మహిమను నెరిగిన వారలు ధన్యులై వర్తింత్రు ధరణియందు.

"కంజాసనాదులు గనలేని వేదమంజీరుని నిన్ను
వీక్షింప గలిగె"—

శేషశైలవాసుడైన వేంకటేశుడు త్రిమూర్తులకు మొదలిదొర. వేల్పులరాజు. బోధనిధి-పరమాత్మ. బ్రహ్మ విష్ణు మహేశ్వరులను నామ రూపములను దాల్చి సృష్టి స్థితి లయములను గావించును.

## చందాదారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రిక చందాదారులలో దిగువ పేర్కొన్నసంఖ్యవారిచందా 30-4-79 తేదీకి అంతమగును. చందాదారులు ఈవిషయమును గమనించి M. O. ద్వారా దిగువ పేర్కొనిన ప్రకారము మనియార్డరు కూపనునందు తమ చందా సంఖ్య పూర్తి విలాసమును పేర్కొని, త్వరలో చందా పంపని యెడల ఆ తేదీ దరిమిలా పత్రిక పంపబడదు.

16 26 48 52 64 76 90 110 147 148 149 152 161 168 174 205 206 210 212 213 217 225 228 247 255 288 306 326 437 444 514 795 801 1467 1487 2209 2214 2243 2265 3303 3314 3317 3323 3333 3334 3339 4483 4484 4486 4487 4488 4489 4490 4491 నుండి 4502 4508 నుండి 4522 4524 నుండి 4547 4549 4550 4566 4567 4572.

గమనిక;- (1) సప్తగిరి చందాలు 15 తేదిలోగా చేరునట్లు పంపవలెను. ఆ తరువాత చేరిన చందాలకు మరునెలనుండి మాత్రమే పత్రిక పంపబడును.

(2) క్రొత్తచందాదారులు కూపనులో 'క్రొత్తచందా' అని పేర్కొనవలెను. పాతవారు కూపనులో తమ చందాసంఖ్య నమోదుచేయవలెను.

(3) సప్తగిరి చందాలు ఈ క్రింది అడ్రసుకే తమ పిన్‌కోడ్ తెలియజేస్తూ పంపవలయును.

సప్తగిరి మాసపత్రిక సం॥ చందా రు. 6/-

మార్కెటింగ్ ఆఫీసరు
పబ్లికేషన్ సెక్షన్
ప్రెస్‌కాంపౌండ్, 517501, తిరుపతి

## తిరుమలలో వివిధములైన కాటేజిల దినసరి అద్దెలు

1–12–78 నుండి మార్పుటమైనది.

కనుక యాత్రికులు గమనింప గోరుతున్నాము.

| కాటేజిపేరు | రోజుకి అద్దె |
|---|---|
| 1. హెచ్. ఆర్ గవియప్ప కాటేజి. | రు. 100/- |
| 2. నారాయణగిరి కాటేజిలు<br>1 నుండి 4; 13 నుండి 20. | 40/- |
| 3. ట్రావెలర్స్ బంగళా ప్రాంతం లోపల వైపువి, 1 నుండి 8; ఎ నుండి జి 3-వ వరుస 1; సి. యం. సి. 16; వి. వి సి. 6; కె. వి. ఆర్. 4: వి. వి. సి. 1: వి. వి. సి. 8; టి. బి. సి. 10. | 30/- |
| 4. పై కాటేజిలలో ఎ. భాగం. | 18/- |
| బి. భాగం. | 12/- |
| 5. ట్రావెలర్స్ బంగళా బయట వైపువి.<br>వి. వి. సి; యం. బి. సి; ఎ. టి. సి. | 25/- |
| 6. పై కాటేజిలలో ఎ. భాగం; | 15/- |
| బి. భాగం. | 10/- |
| 7. టి. బి. కాటేజిలు ( 3 వ వరుస ఒక్క గది గలవి. ) | 10/- |
| 8. శ్రీ వేంకటేశ్వర అతిథి భవనం | |
| ఎ. పెద్దగదులు | 35/- |
| బి. మూలగదులు | 25/- |
| సి. మిగిలిన గదులు | 20/- |

కార్యనిర్వహణాధికారి.

కం॥ విబుధులకు విబుధ భూజము
విబుధారి సమూహములకు విషభూజమునై
యబలులకెల్లను బలమై
ప్రబలు మహా మహుండవీవ పంకజనాభా! (2-185)

స్వామీ! నీవు జ్ఞానులకు కల్పవృక్షము వలె వరముల నొసంగుదువు. రాక్షసులకు విషవృక్షము అయి, వారి నాశనము గావింతువు.

బలహీనులకు బలమైవారి రక్షింతువు. నీవు మహామహుడవు, రక్షకుడవు, నిన్ను పూజించువారలకు ఇహపరములు చేకూరును. కొలుచువారల కోర్కెలు దీర్చువాడవు. మమ్మేలు స్వామివి. అని సప్తర్షులు స్వామిని పరి పరి విధముల ప్రార్థించిరి. స్వామి దర్శనముచే తన్మయులై భవవార్ధి దాట గల్గిరి. మహర్షులచ్చటనుండి క్రిందకుదిగివచ్చి, అనలాక్షుని గోవిందరాజులను దర్శించి, పాపవిముక్తులయిరి.

కవి యిందు – 'తీర్థ తీర్థ మహా తీర్థ పాద' యను పాదమున తీర్థశబ్దమునందు శ్లేషనుసాధించి శ్రీ గురువుల మహిమను దైవత మహాత్త్వమును, తీర్థమహిమను వెల్లడించెను. ఇంతగా ఈ క్షేత్ర మాహాత్మ్యమును వర్ణించిన కవి దీని మహిమను వర్ణించుట శక్యమాయను ప్రశ్నతో నీ వర్ణనను ముగించెను.

కం॥ ఈ శైల వైభవంబీ
దేశిక సౌభాగ్యమీ సుతీర్థ మహాత్త్వం
బీ శౌరి కరుణ గురువా
గీశ ఫణీశులకు నైన నెన్నందరమే (2-193)

శేషశైల మహిమను, దేశికుల సౌభాగ్యమును, సుతీర్థమాహాత్త్వమును, శౌరి కరుణను వర్ణించుటకు బృహస్పతి గాని, బ్రహ్మకాని, శేషుడుగాని శక్తులుగారన్నచో నేనువర్ణించ గలనా యని రాను కృష్ణకవి తన్ను తాను ప్రశ్నించుకొని, వినయమును ప్రదర్శించెను. ఈ శేషశైల మహిమ అనంతము, అపూర్వము కనుక భక్తులెల్లరు అచ్చటకు పోయి శేషగిరి నిలయుడౌ వేంకటేశుని ప్రార్థించి, స్వామి కృపకు పాత్రులు కాగలరని కవి ఆకాంక్ష. *

9వ పేజీ తరువాయి)

కున బహుయత్న సంచితను గోల్పడి జ్ఞానసుఖమ్ము
క్రమ్మఱిం -
చినగతి వెండి సంసృతినిశీథినిఁ జొత్తురు
గొంద రల్పులై ౨౮౩

కం॥ తావకపదచింతనమున
నీవారై నెగడునట్టినిపుణులు భవదీ -
యావార్య కరుణ విఘ్న
చ్యావితభయులగుచు నభయ మందెదరీశా! ౨౮౪

వ॥ అనన్య శరణ్యా! అవిబోధ్య భావ! చిదానంద! గోవింద! సృష్టంబైన లోకంబు, స్థితికాలంబున శుద్ధసత్వమయంబును విశుద్ధంబును నగు; గాత్రంబు గృపసేసి శ్రేయస్కరంబు కర్మఫలంబుప్రసాదింతువు; అట్టినీ జగన్మోహనంబగుశరీరం బెఱుకగలవారు వేదక్రియా యాగ తపస్సమాధులచేతఁ బూజింతురు. అన్యులు స్వాంతర్గత హేమప్రకాశకమణికరండికను బోలి త్రిగుణాత్మక ప్రకృతి విలక్షణశుద్ధద్రవ్యంబగుట, నాత్మస్వరూపాఽతిరోధాయకంబును, దేవమనుష్యాది భేదాఽభిమాన - నివర్తకంబునగు నీమూర్తి దరిశించియు నితరసజాతీయంబని భావింతురు. వీటిడులుగాక, నీదివ్యమంగళ విగ్రహంబు శుద్ధసత్వంబు గాదేని యజ్ఞానభేదాప - మార్జనంబగునే? గుణావచ్ఛిన్నంబులగుప్రకాశంబుల నీ వూహింపఁబడుదువు. దేన, దేని, యన్యోయను - మానంబుల గుణప్రకారంబుల నిన్నభ్యూహింతురు. తావకంబులగుగుణజన్మకర్మనామరూపంబు లితర - సజాతీయంబులుగ ననిరూపణీయంబులు. వేదక్రియల యందు గర్మనిష్ఠులుప్రస్తుతాగ్నీంద్రాదినామరూప - సజాతీయంబుగ "నంగాన్యన్యాదేవతాః" యను శ్రుతి - వచనంబున నిన్ను వాసించినను నది యర్థవాదమాత్రంబ కాక పరమార్థంబగునే! దేవా! నీకు సదాతనంబు నమస్కారంబని యిట్లనిరి - ౨౮౫

సీ॥ శ్రవణచిత్తగ్రాహిసర్వతఃపీయూష
కళికలై నట్టినీకతలు వినుచు,
వ్యర్థాభిమానజల్పాకుండుగాక పా
డుచు నిన్ను సద్భక్తినిచుళితముగ,
విషయాంతరమ్ముల వీడుచు చిత్తమ్ము
ధ్యానించుచును నిగమాధ్వరీతి;
తనతోడివారలఁ దత్పరత్వమ్మున
ముంచుచు హరికథా మోదజలధి.

గీ॥ సకలకర్మలందు సర్వేశ్వరుని నిన్ను
తలచి తలచి మేనుమఱచువాఁడు
నిన్ను దప్పఁ నన్య మెన్న నిజీవుండు
భవము దఁగి మేలుపడెడువాఁడు. ౨౮౬

మ॥ నరనారాయణు లప్డు వారల నమందప్రీతి
మన్నించి భా -
గ్యరమావిష్కృతియంచుఁ దాఁ బ్రతి పదన్యాసంబు
నందుర్వరా -
సరసీజాక్షి గగుర్ప ధీరమునిసంసచ్చారు
జూటావళీ -
పరితస్తోరణమాలికావిలసితప్రాంతమ్ములన్
బోవుచున్ ౨౮౭

మ॥ కనకప్రస్తరప్రస్రవఝ్ఝరమృదంగధ్వాన
నృత్యన్మయూ -
రనికాయంబులదాని, ధాతుబహువర్ణవ్రాత
సంఛాదిశా -
భ్రనభోవర్త్మముదాని; సర్వఋతుసేవ్యప్రస్థమౌ
గంధమా -
దనమున్ జేరిరి సత్తపంబున జగద్భద్రంబుఁ
బండింపగన్ ౨౮౮

కం॥ సతి యనహంకారంబునఁ
బతులకుఁ దా సతులకెల్ల భాగ్యంబనుచున్
నుతపడఁ బరిచర్యావిధి
పతితశరణ్యుండు భూతపతి లోఁగొనియెన్ ౨౮౯

ఆ॥ పెద్దకాలంబు గడచె నావిర్భవింప
లేదొకనిసుంగు సతికిని లేదు శాంతి
యింపుగా సుతుని మొగము వీక్షింపలేని -
పొలఁతి మనుగడ సకలంబు పొల్లకాదె! ౨౯౦

(సశేషము)

# సప్తగిరి

## తిరుమల తిరుపతి దేవస్థానముల మాసపత్రిక.

* * *

సప్తగిరి మాసపత్రికలో వ్యాపార ప్రకటనలు ఈ దిగువ కన్పరచిన రేట్ల ప్రకారము ప్రచురించబడును.

### ఒక్కొక్క ప్రకటనకు

| | | | | |
|---|---|---|---|---|
| లోపల పేజీలో: | పూర్తి పేజీ | .... | .... | రు. 80/- |
| | అర్థ పేజీ | .... | .... | రు. 50/- |
| | పావు పేజీ | .... | .... | రు. 30/- |
| కవరు పేజీలు: నాల్గవ పేజీ | 1 రంగులో | .... | .... | రు. 200/- |
| | 2 రంగుల్లో | .... | .... | రు. 250/- |
| | 3 రంగుల్లో | .... | .... | రు. 300/- |
| లోపల 2 వ పేజీ 3 వ పేజీ | 1 రంగులో | .... | ... | రు. 150/- |
| | 2 రంగుల్లో | .... | .... | రు 200/- |
| | 3 రంగుల్లో | .... | .... | రు. 250/- |
| ప్రత్యేకస్థలము లోపల పేజీలో | 1 మొట్ట మొదటి పేజీ | .... | .... | రు. 150/- |
| | 2 చివరి పేజీ | .... | .... | రు. 110/- |
| | 3 వార్తల పేజీకి ఎదురు పేజీ | | 1 పేజీ | రు. 100/- |
| | | | ½ పేజీ | రు. 60/- |

### సాంకేతిక సమాచారము

| | | | |
|---|---|---|---|
| స్క్రీన్: | కవరు పేజీలు | .... | 80 నుండి 100 |
| | లోపల పేజీలు | .... | 65 నుండి 80 |
| పేజీపరిమాణము (బ్లాకులకు) | పూర్తి పేజీ | .... | 24 సెం. మీ × 19 సెం. మీ |
| | అర పేజీ | .... | 12 సెం. మీ × 19 సెం. మీ |
| | పావు పేజీ | .... | 6 సెం. మీ × 19 సెం. మీ |

ప్రకటనకు సంబంధించిన విషయములు, బ్లాకులు, సంస్థలవారే సరఫరా చేయవలయును.

గమనిక: 1. 4వ కవరు పేజీ తప్ప మిగిలిన పేజీలలో 6 నెలసరి సంచికలకు ముందుగా డబ్బు చెల్లించి స్థల నిర్ణయము చేసుకొనువారికి ప్రకటన రేట్లపై 10% ను 12 సంచికలకు స్థల నిర్ణయము చేసుకొనువారికి 15% శాతమును ముదరా ఈయబడును.

2. ఈ వ్యాపార ప్రకటనల విషయము ముందు తెలుపక, కారణములు తెలుపకయే ఏ ప్రకటన నైనను నిరాకరించు హక్కు సంపాదకునకు కలదు.

కార్యనిర్వాహక అధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానం.

# పురాణములు - వాని విభజనము

(గత సంచిక తరువాయి)

## భాగవతరచనా కారణము

పురాణములన్నియు కలిసి శతకోటి ప్రవిస్తరమని అగ్నిపురాణము తెల్పుచుండ ప్రళయానంతరము పరమేశ్వరుడీ పురాణములను గ్రహించి మత్స్యావతారమునెత్తి యేకార్ణవమునుండి బ్రహ్మకుపదేశింపగా నతడు వానిని ఋషులకు వివరించినట్లు మత్స్యపురాణము వాకొనుచున్నది. లోకమింతటి బృహద్గ్రంథమును గ్రహింప జాలదని తలచి నారాయణుడే వ్యాసుడై పురాణములను నాల్గులక్షల శ్లోకములుగ సంగ్రహించి 18 భాగములుగ నొనర్చెనని నారదీయపుమాట. ఇట్లనంతముఖముల విస్తరిల్లిన యీ పురాణవాఙ్మయమునందు భాగవతపురాణమునకొక ప్రత్యేకప్రతిపత్తి కలదు. 18 వేల శ్లోక పరిమితమైన (కొందరు 22 వేల శ్లోకములున్నవందురు) యీ గ్రంథమునకు కర్త వేదవ్యాసమహర్షి, వక్త శుకయోగీంద్రుడు. శ్రోత పరమభాగవతాగ్రేసరుడగు పరీక్షిన్నరేంద్రుడు. వ్యాసరచితమైన దీనిని పౌరాణికుడగు సూతుడు నైమిశారణ్యమున శౌనకాదిమహర్షులకు వినిపించుటయు జరిగినది. భాగవతమును వ్యాసుడు రచించుటకు కారణమా గ్రంథమునందే యిట్లున్నది.

1. "దీనవత్సలుడైన వ్యాసుడు - స్త్రీ శూద్రులకును, త్రైవర్ణికాధములకును వేదంబులు విన నర్హంబులుగావు. కావున మూఢులకెల్ల మేలగునవి భారతాఖ్యానంబు చేసియు, నమ్మునిభూతహితంబునందు తన హృదయంబు సంతసింపకున్న సరస్వతీతటంబునందు నొంటియుండి హేతువు వితర్కించుచు తనలోనిట్లనియె.

2. సీ॥ వ్రతధారినై వేదవహ్నిగురుశ్రేణి
మన్నింతు, విహితకర్మముల కొరత
వడకుండ నడపుదు, భారతమిషమున
పలికితి వేదార్థభావమెల్ల,
మునుకొని స్త్రీశూద్రముఖ్యధర్మము
లందు తెలిపితినే చెల్లదీనజేసి
ఆత్మసంతసమంద దాత్మలోనీశుండు
సంతసింపకయున్న జాడదోచె

హరికి యోగివరుల కభిలషితంబైన
భాగవతవిధంబు పలుకనైతి
మోసమయ్యె తెలివిమొనయదు మరచితి
ననుచు వగచుచున్న యవసరమున"—

3. "నారదు డతనికడకరుదెంచి యా ముని మానసికవ్యథ నెరింగి —

4. ఉ॥ అంచితమైన ధర్మచయమంతయు
జెప్పితి వందులోన నిం
చించుకగాని విష్ణుకథలేర్పడచెప్పవు
ధర్మముల్ ప్రపం
చించినమెచ్చునే గుణవిశేషము లెన్నిన
గాక! నీకు నీ
కొంచెమువచ్చునెల్ల హరిగోరి నుతిం
పమి నార్యపూజితా!"—

శ్రీ డి. నాగసిద్దారెడ్డి,
తిరుపతి.

5. మ॥ హరినామస్తుతి సేయుకావ్యము
సువర్ణాంభోజ హంసావళీ
సురుచిభ్రాజితమైన మానససరస్స్ఫూర్తిన్
వెలుంగొందు శ్రీ
హరినామస్తుతిలేని కావ్యము విచిత్రార్థా
న్వితంబయ్యు శ్రీ
కరమైయుండ దయోగ్యదుర్మలినవత్కా
కోలగర్తాకృతిన్"—

6. మ॥ అపశబ్దంబులకూడియున్ హరి
చరిత్రాలాపముల్ సర్వపా
ప పరిత్యాగముసేయు, కావున హరిన్
భావించుచుం పాడుచున్
జపముల్ చేయుచు వీనులన్ వినుచు
నశ్రాంతంబు కీర్తింపుచున్
తపసుల్ సాధులు ధన్యులౌదురుకదా!
తత్త్వజ్ఞ! చింతింపుమా!"—
(పోతనభాగవతము 1-83, 93, 94, 95)

అని పలికి నీవింతదనుక శ్రీహరిచరిత్ర ప్రధానముగాగల గ్రంథమును వ్రాసినవాడవుకావు. నీవు రచించిన పురాణములలో హరి అచ్చటచ్చట ప్రశంసితుడైనను అతనినిగూర్చి వర్ణింపవలసిన దింకను చాల కలదు. కావున విష్ణుని యుదంతములు ప్రధానముగగల యొకపురాణమును రచింపుము"—అని ప్రబోధించెను. నారదుని మాటప్రకారము పారాశర్యుడు భాగవతపురాణమును రచించి యాత్మశాంతి నందెనట. భాగవతరచనమునుగూర్చి పద్మపురాణమిట్లు తెల్పుచున్నది.

"తత్ర పద్మపురాణం తు ప్రథమం చ
ప్రణీతవాన్।
తతోఽన్యాని పురాణాని కృత్వా షోడశతు
క్రమాత్॥
అష్టాదశం భాగవతం సారమాకృష్య
సర్వతః।
కృతవాన్ భగవాన్ వ్యాసః శుకమధ్యాప
యత్ స్వయమ్॥

వ్యాసభగవానుడు మొదట పద్మపురాణమును రచించి, తదుపరి పదునారు పురాణములను లిఖించెను. పిదప నా పదునేడు పురాణములలోని సారమునాకర్షించి పదునెనిమిదవ పురాణముగా భాగవతమును కూర్చి తనకుమారుడగు శుకునకు నేర్పెనని దీని భావము.

## భాగవత కర్తయెవ్వరు?

భాగవతకారుడు వ్యాసభగవానుడా? లేక 13వ శతాబ్దమువాడగు బోపదేవుడా? అని ప్రశ్న. క్రీ. శ. 1271 నుండి 1309 వఱకు దేవగిరిని పరిపాలించిన రామరాజునకు సచివోత్తముడైన హేమాద్రిపండితునకు బోపదేవుడు మిత్రుడు. రెండు ముహూర్తముల కాలమున భాగవతాధ్యాయ సంగ్రహార్థమును గ్రంథరూపమున వచింపగల సమర్థులెవ్వరని యొకనాటి కొలువున హేమాద్రిపండితుడు సభ్యులను ప్రశ్నింప బోపదేవుడందులకు తాను సిద్ధమని నుడివి భాగవతసారమనెడి గ్రంథమును రచించి హేమాద్రికొసంగి అతనిచే సత్కృతుడయ్యెననియు, ఆ గ్రంథమునందలి మొదటిశ్లోకము.

"శ్రీమద్భాగవతాధ్యాయ సారోహ్యత్ర
నిరూప్యతే ।
విదుషాబోపదేవేన మంత్రి హేమాద్రి
తుష్టయే॥"

అనునది యనియు, నొకకథ ప్రచారము నందున్నది. భాగవతశైలి యితర పురాణములయందలి శైలికంటె భిన్నముగ నుండుటయు నీకథకు పోద్బలకమైనది. దయానందసరస్వతి(ఆర్యసమాజ మతస్థాపకుడు)నైతము భాగవతమునుగూర్చి విమర్శించుచు గీతగోవిందమును రచించిన జయదేవుని సోదరుడగు బోపదేవుడు దీనిని రచించెనని, అతడు తన 'హిమాద్రి' గ్రంథమున శ్రీమద్భాగవతపురాణమును తాను రచించినట్లు రెండు శ్లోకములు చెప్పికొనెనని –

1) "హిమాద్రేః సచివస్యార్థే సూచనాక్రియతేఽ
ధునా ।
స్కంధాధ్యాయకథానాంచ యత్ప్రమాణం
సమాసతః ॥"

2) "శ్రీమద్భాగవతం నామ పురాణంచ
మయేరితమ్ ।
విదుషా బోపదేవేన శ్రీకృష్ణస్య యశోన్వి
తమ్"॥

అనునవి యా శ్లోకములనినుడివి భాగవతము వ్యాసరచితముకాదని సహేతుకముగ నిరూపించెను. శ్రీసుప్రసిద్ధవిమర్శకులగు శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు భాగవతము బోపదేవ కర్తృకమనెడి వాదమసంగతమని తన సంస్కృతవాఙ్మయ చరిత్రమున (2వభాగము) సయుక్తికముగ ఖండించిరి. వారి వాదసారాంశమిది. "బోపదేవుడు భాగవతమునందలి అన్ని స్కంధములలోని విష్ణులక్షణ, విష్ణుభక్తి, విష్ణుతత్త్వ ప్రతిపాదకములైన పద్యములను హేమాద్రి పండితుని మాటప్రకారముద్ధరించి 'ముక్తాఫల' మను పద్యాత్మకగ్రంథమును మాత్రమే రచించెను. ఈ రచనచే సంతసమందిన హేమాద్రి తన్ను సముచితరీతిని గౌరవింపగా, అందులకు కృతజ్ఞతాపూర్వకముగ తానే తన ముక్తాఫల గ్రంథమునకు హేమాద్రిపేర కైవల్య దీపిక' యనెడి వ్యాఖ్యానమునుగూడ రచించెను. భాగవతరచనతో బోపదేవున కింతకన్న నెక్కువ సంబంధములేదు. భాగవత కర్తృత్వమునుండి వ్యాసభగవానుని తోయజూచుట శాక్తేయుల పన్నాగము. భాగవత పురాణ మహత్త్వము బహువిధముల గరుడ మత్స్య స్కంధపురాణములు ప్రశంసించియున్నమాట యటుండ క్రీ. శ. 8వ శతాబ్దికడపటనున్న శంకరభగవత్పాదులు భాగవతమునకు వ్యాఖ్యరచించియున్నారని విజయధ్వజాచార్యులు చెప్పుచున్నాడు. అందుచేత 13వ శతాబ్దమువాడగు బోపదేవుడు భాగవతమును రచించెననుట అసంగతము." – మల్లాదివారి యీ వాద

దీపాల వెలుతురులో వాలీబాల్ క్రీడారంగం



మును అధికసంఖ్యాక పండితులు బలపఱచిరి. అంతేగాక శంకరభగవత్పాదుల గురువగు గౌడపాదులవారు (7వ శతాబ్దం) తాను రచించిన ఉత్తరగీతా వ్యాఖ్యయందు 'తదుక్తం భాగవతే' అని క్రిందిశ్లోకము నుదాహరించియున్నారు.

"శ్రేయస్స్రుతిం భక్తిముదస్య తే విభో।
క్లిశ్యంతి యే కేవల బోధ లబ్ధయే।
తేషామసౌక్లేశల ఏవశిష్యతే।
నాన్యద్యథా స్థూల తుషావ ఘాతినామ్॥"
(భాగ 10-14-4)

మరియు నా వ్యాఖ్యయందే 'జగృహే పౌరుషం రూపం'-అనెడి మరియొక భాగవతశ్లోకము గూడ పేర్కొనబడినది. దీనినిబట్టియు భాగవతము బోపదేవకర్తృకముగాదని చెప్పవచ్చును.

## వ్యాఖ్యలు

భారతీయుల కత్యంత ప్రీతిపాత్రములగు భారత, భాగవత, రామాయణములలో కర్మప్రవృత్తిని కల్గించు భారత రామాయణములను పగలును, భక్తి జ్ఞాన వైరాగ్యముల నొడగూర్చు భాగవతమును రాత్రులయందును పారాయణము చేయుచున్నచో ఉత్తమప్రయోజనములు సిద్ధించునని పెద్దల మాట. అద్వైతవిశిష్టాద్వైత ద్వైత మతస్థులు ముప్వురకును అవలంబనమై జీవేశ్వర తత్త్వము నావిష్కరించు నీ భాగవతమునకు దశాధికముగ వ్యాఖ్యలు వెలసియుండుట దీని యౌన్నత్యమునకు నిదర్శనము. భాగవతమున కింతవఱకు లభించుచున్న వ్యాఖ్యానములివి:

1. అద్వైతమతానుసారిణిగ శ్రీధరస్వామిచేత రచింపబడిన భావదీపిక లేక భావప్రదీపము.

2. విశిష్టాద్వైత మత పక్షమున సుదర్శనసూరిచే రచింపబడిన శుక పక్షీయము

3. వీరరాఘవాచార్యులవారి భాగవత చంద్రచంద్రిక.

4. మాధ్వమతపక్షమున విజయధ్వజాచార్యులవారు వ్రాసిన విజయపద రత్నావళి

5. నింబార్కమతానుకూలముగ శుదీదేవాచార్యులవారు వ్రాసిన సిద్ధాంతప్రకపము.

6. వల్లభమతానుసారియగు వల్లభాచార్యులవారి సుబోధిని.

7. గిరిధరాచార్యులవారి ఆధ్యాత్మికటీక.

8. చైతన్యమతానుసారిణియగు శ్రీ సనాతనులవారి వైష్ణవతోషిణి

9. జీవగోస్వాములవారి క్రమసందర్భము.

10. విశ్వనాథచక్రవర్తిగారి సారార్థదర్శిని.

11 శ్రీహరి విరచితమైన హరిభక్తి రసాయనము.

12. చదలవాడ జయరామశాస్త్రి గారి తత్త్వదర్శినీ వ్యాఖ్య.

13. మధుసూదన సరస్వతిచే వ్రాయబడిన గూఢార్థదీపిక మున్నగునవి. ఇక అజ్ఞాతముగ నెన్నికలవో! వీని మూలకమున భాగవతసర్వాతిశాయిత్వము వెల్లడియగుచున్నది. (సశేషము)

---

(5వ పేజీ తరువాయి)

రమా-మోహినీ-పద్మాక్షీ-కమలా - కాంతిమతి-అపరాజిత-పద్మావతి-రాధా విశాలాక్షిలు స్త్రీవర్గులోను, కేశవ-నారాయణ మాధవ-విష్ణు - మధుసూదన-త్రివిక్రమ - వామన- శ్రీధర - హృషీకేశ - పద్మనాభ-దామోదర, అవి ఉంటుంది పుల్లింగములోను ఈ నామాలు పౌష్యాదిగ కలికాలములో గుర్తించుట గమనించ దగినది.

ఖగోళ పరిభ్రమణంలో భూగోళం తన కక్ష్యాంతర్గత గమనంలో ధనురాకృతిగల నక్షత్రమండలాకృతికి అభిముఖముగ సంచరించు కాలమునే ధనుర్మాసంగ పిలుస్తున్నాము. ఇది సాధారణముగ డిసెంబరు-జనవరి హూణమాసాలమధ్యంలో పడుతుంది.

మానవుల మాతృగర్భస్థకాలము పది మాసములు; కాబట్టే జనన-మరణములలో శౌచము దశరాత్రులు నిర్ణయించేరు పౌర్యులు. చైత్ర వైశాఖ మాసములు వసంతరుతువు. చైత్రములో ప్రకృతి పుష్పులలో కలుగు ప్రకోపం వ్యాప్తి చెంది ఫలించిన పదియవ మాసములో ఫలము అందుతుంది. చైత్రమునుండి పౌష్యమి పదియవ మాసము. హేమంత ఋతువు. పౌష్యమిలో పుట్టిన "స్త్రీ"ని "లక్ష్మి"గను, పురుషుణ్ని "నారాయణ" అనిగ వైదికం పిలుస్తుంది. అంటే "లక్ష్మీనారాయణ" స్వరూపమే. ప్రకృతి!

ప్రకృతిలోగల గుణ గణ ములన్నీ సూర్యుని ఆధీనము. ఆయన కరుణ కటాక్షముల మీదనే ప్రకృతి బ్రతుకంతా ఆధారపడి ఉంది. అట్టిసూర్యున్ని సవిత అని పిలుస్తుంది సంస్కృతి. ద్వాదశ మాసాలకు సవితృనామాలు, మిత్ర-రవి-సూర్య-భాను-ఖగ-పూష-హిరణ్యగర్భ- మరీచ-ఆదిత్య సవిత-అర్క-భాస్కర-అనేవి. వీరే ద్వాదశాదిత్యులు. అయితే వేదరహస్యార్థములో ఇవే త్రిప్పి చెప్పబడినవి.

ప్రాచీన సాంప్రదాయంలో ఒక్కొక్క మెట్టే ఎక్కుతూంటే 'ఏడుకొండలవాడు', సప్తసంఖ్యాక గిరినాథుడని కీర్తించుటలో పరమార్థం గ్రహించ గలము,
చూడుడు!—

"స్వామి పుష్కరిణీత్రయ వహిత శేషాచల సగరు గుల్మల ద్వయ సహిత శ్రీశైలాది పుణ్యతీర్థ పుణ్యాచలాధిష్ఠితే" అని కీర్తిస్తుంది మహాసంకల్పము.

సప్తాశ్వరథమారూఢం అని "భూ" పరిధిలోగల సప్తపర్ణి అధిపతిగ వర్ణిస్తుంది సాంప్రదాయం. అష్టశక్తులు నవగ్రహాలు. ఏకాదశ రుద్రులు. తరువాత

"రుద్రో రుద్రశ్చ దవ్తిశ్చ నన్ది షణ్ముఖ ఏ వచ గరుడోబ్రహ్మా విష్ణుశ్చ

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం

### నారాయణవనం.

★

### నిత్యకార్యక్రమ వివరాలు

| | | | |
|---|---|---|---|
| సుప్రభాతం ఉ॥ | 6-30 | నుండి | 7-00 |
| విశ్వరూపదర్శనం | 7-00 | ,, | 8-30 |
| తోమాలసేవ | 8-30 | ,, | 9-00 |
| కొలువు, అర్చన | 9-00 | ,, | 9-30 |
| శాత్తుమొర & గంట | 9-30 | ,, | 10-00 |
| సర్వదర్శనం | 10-00 | ,, | 11-30 |
| 2-గంట, అష్టోత్తరం (ఏకాంతం) | 11-30 | ,, | 12-00 |
| తీర్మానం | 12-00 | | |
| సర్వదర్శనం సా॥ | 4-00 | ,, | 6-00 |
| తోమాలసేవ, అర్చన (ఏకాంతం) | 6-00 | ,, | 6-30 |
| రాత్రి కైంకర్యం | | | |
| శాత్తుమొర | 6-30 | ,, | 7-00 |
| సర్వదర్శనం | 7-00 | ,, | 8-45 |
| ఏకాంతసేవ | 9-00 | | |

### ఆర్జితాదుల వివరాలు

| | | |
|---|---|---|
| అర్చన, అష్టోత్తరం .... | రు. | 3-00 |
| హారతి ... | రు. | 1-00 |
| కొబ్బరికాయకు .... | రు. | 0-50 |
| సహస్రనామార్చన .. | రు. | 5-00 |
| పూలంగి (గురువారం మాత్రం) .... | రు. | 1-00 |
| అభిషేకానంతర దర్శనం (శుక్రవారం) | రు. | 1-00 |
| తిరుచ్చి వాహనోత్సవం (వాహకుల రుసుముకాక) | రు. | 15-00 |
| సింగమొరై ఖర్చులు .... | రు. | 2-50 |

నారసిగ్ం హస్తధైవచ ఆదిత్యాఽగ్నిశ్చ దుర్గిశ్చ క్రమేణ ద్వాదశాంభసి" అని యజుర్వేద తైతరీయ శాఖలో నారాయణీయములో దర్శనమిస్తుందీ ద్వాదశాదిత్య శబ్దం.

౧. నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి తన్నో విష్ణుః ప్రచోదయాత్.
(పౌష్యారంభము,)

౨. వజ్రనఖాయ విద్మహే తీక్ష్ణ దగ్‌స్ట్రాయ ధీమహి తన్నా నారసిగ్ంహః ప్రచోదయాత్.
(మాఘం.)

౩. భాస్కరాయ విద్మహే మహద్ద్యుతి కరాయధీమహి తన్నో ఆదిత్యః ప్రచోదయాత్.
(ఫాల్గుణం)

౪. వైశ్వానరాయ విద్మహే లాలీలాయ ధీమహి తన్నో అగ్నిః ప్రచోదయాత్.
(చైత్రము)

౫. కాత్యాయనాయ విద్మహే కన్యకుమారి ధీమహి తన్నోదుర్గిః ప్రచోదయాత్.
(వైశాఖము)

౬. పురుషస్య విద్మహే సహస్రాక్షస్య మహాదేవస్య ధీమహి తన్నో రుద్రః ప్రచోదయాత్.
(జ్యేష్ఠము)

౭. తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి తన్నో రుద్రః ప్రచోదయాత్.
(ఆషాఢము)

౮. తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి తన్నోదన్తిః ప్రచోదయాత్.
(శ్రావణము)

౯. తత్పురుషాయ విద్మహే చక్రతుండాయ ధీమహి తన్నోనన్దిః ప్రచోదయాత్.
(భాద్రపదము)

౧౦. తత్పురుషాయ విద్మహే మహాసేనాయ ధీమహి తన్నషణ్ముఖః ప్రచోదయాత్.
(ఆశ్వయుజము)

౧౧. తత్పురుషాయ విద్మహే సువర్ణపక్షాయ ధీమహి తన్నో గరుడః ప్రచోదయాత్.
(కార్తీకము)

౧౨. వేదాత్మనాయ విద్మహే హిరణ్యగర్భాయ ధీమహి తన్నో బ్రహ్మ ప్రచోదయాత్.
(మార్గశిరము)

వీటిని కొందరు గాయత్రులని నుడికారం చేసేరు. గాయత్రి అయిన వేదమాతయే ద్వాదశాదిత్య రూపములో ద్వాదశ మాసములలోను గుణాత్మకముగ విన్యాసం చేస్తుందని, స్పష్టమౌతూంది. కాలస్వరూపమే మంత్రమా? ఇది కేవలం భాషార్థమే. ఇది మనలను చకితులను చేస్తూంటే వేదనాయుతమైన అవేదనార్థమైన వేదార్థం అందుకున్న వారి అదృష్టం, ఆనందము ఎంతటిదో?? కొబట్టే మన ఋషిసంతతి సదా చిద్విలాసమైన అనందాన్ని అనుభవించ గలుగుచున్నది.

మనకున్న ఋషిగణం ప్రధానంగ సప్త సంఖ్యాయుతమని ముందే చెప్పుకొన్నాము,

ఈ సప్తఋషి గణముల అధిపతి అయి యుగ యుగాలుగ కీర్తినందుకొంటున్న సప్తగిరినాథుని సాక్షాత్తు నారాయణ ప్రతిరూపంగ గుర్తించిందీ ప్రాచీన సంస్కృతి. కీర్తిస్తుందీ-విధంగ.

"మూర్తిబ్రహ్మణ్య దేవస్య బ్రహ్మణ్యం తేజ ఉత్తమం సూర్యకోటి ప్రతీకాశమృషిరూపం విచింతయేత్. శేషశైల పతిశ్శేషి శ్శేషశ్శేష విభూషణః శేషశాయీ కుమారశ్చ సుబ్రహ్మణ్యః పరాయణం వేంకటాచలనాథశ్చ వేంకటః కలితారకః శివక్షేత్ర ప్రసన్నశ్చ శ్రీమాన్ పుష్కరిణీ పతి లోకేశ్వరో ధనపతిర్విష్ణుః సర్వేశ్వరశ్వరః కళ్యాణ గుణ పూర్ణశ్చ కాంక్షితార్థ ప్రదాయకః లవలీ దేవసేనాఖ్య శ్రీభూసహచరో హరిః శ్రీ వేంకటేశ్వరశ్చైవ నహి ప్రత్యక్షదైవతం.

తమసోమా జ్యోతిర్గమయ

# ఈ మాసం మీ అదృష్టం!

## మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పా)

రాహువువలన ఆందోళన. శనివలన వివాదాలు, ధననష్టం, సంతానంమూలంగా ఆందోళన. గురువువలన బంధువులమూలంగాఆందోళన. కుజునివలన ప్రయత్నాలలో జయం. బుధుని వలన శత్రువుల మూలంగా ఆందోళన లేదా అవమానం లేదా అనారోగ్యం. శుక్రుని వలన 23వ తేదీ వరకు ధనం, స్నేహితులు, నూతనవస్త్రాలు, కాని చివరివారంలో నష్టం.

## వృషభం

(కృత్తిక 2,3,4,పా, రోహిణి, మృగశిర 1, 2, పా.)

రాహువువలన వివాదాలు, ధన-మిత్ర నష్టం, లేదా ఆయినవారినుండి వేర్పాటు లేదా వారితో వివాదం. గురువువలన నిరాశ. రవి బలీయుడు కావటం వలన జయం, గౌరవం, ధనం, దృఢారోగ్యం. కుజుని వలన అధిక ధనం. బుధుని వలన ధన వాహన లేదా శృంగార లేదా మిత్ర ప్రాప్తి, పుత్రప్రాప్తికూడా సంభవం. శుక్రుని వలన నూతనవస్త్రాలు, ధనం, శృంగారం, ధార్మికప్రవృత్తి.

## మిథునం

( మృగశిర 3,4 పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పా. )

రాహువువలన ధనం. శనివలన ఆరోగ్యం ధనం, సేవకజనం లేదా వాహనప్రాప్తి. అన్ని విధాలా గృహసౌఖ్యం. గురువు వలన అధిక ధనం, జయం. శుక్రునివలన ధనం, నూతన వస్త్రాలు, శృంగారం, నూతన గృహప్రాప్తికి కూడా అవకాశం. కుజుని వలన అవమానం, ధననష్టం. నెల మొదటిపక్షంలో రవి వలన అనారోగ్యం లేదా ధననష్టం, రెండవపక్షంలో అన్నిరంగాలలో జయం. బుధుని వలన శత్రువులపై జయం. ధనం, శృంగారం.

## కర్కాటకం

(పునర్వసు 4పా, పుష్యమి, ఆశ్లేష.)

రాహువు వలన ఆందోళన. శనివలన ధనవ్యయం. పూర్ణధనాభావం. గురువు వలన మనశ్శాంతికి లోపం, వివాదాలు, ధననష్టం. కుజునివలన శరీరానికి గాయాలు లేదా ధననష్టం లేదా గౌరవభంగం. బుధుని వలన ప్రయత్నాలకు ఆటంకం. శుక్రుని వలన స్త్రీ మూలంగా కీడు. నెల మొదటి పక్షంలో రవి వలన అనారోగ్యం లేదా భార్యకు అసంతుష్టి. రెండవపక్షంలో ధననష్టం లేదా ప్రయత్నాలలో ఆటంకం లేదా అనారోగ్యం.

## సింహం

(మఖ, పూ. ఫ, ఉత్తర 1వ పా.)

రాహువువలన ఆందోళన. శనివలన ఆయిన వారినుండి వేర్పాటుమూలంగా ఆందోళన లేదా బంధుపీడ లేదా ప్రయాణాల మూలంగా ఆందోళన, అనవసర ప్రదేశాలకు ప్రయాణం, ధననష్టం, కుమారుని వైముఖ్యం, గురువు వలన ప్రయాణం, ప్రయాస కుజుని వలన భార్యతో వివాదం, ఉదరబాధ, బుధునివలన జయం, నూత్నవస్త్రాలు, ధనం, పుత్ర లేదా పుత్రికా ప్రాప్తికి అవకాశం శుక్రుని వలన అవమానం, అనారోగ్యం రవివలన నెల మొదటి పక్షంలో ప్రయాణం, ఉదరబాధ, రెండవ పక్షంలో అనారోగ్యం, భార్యకు అసంతుష్టి.

## కన్య

(ఉత్తర 2, 3. 4 పా. హస్త; చిత్ర 1, 2 పా.)

రాహు శనులవలన ఆందోళన. గురువు వలన బహుళ ధన, వస్తుప్రాప్తి. బుధుని వలన వివాదాలు. శుక్రునివలన ధనం, పెద్దలప్రశంస, బంధువులరాక, సన్మిత్రప్రాప్తి, సంతానం. రవి వలన నెల మొదటి పక్షంలో దృఢారోగ్యం, కీడుగోరేవారిపై జయం, సుఖం. రెండవపక్షములో ప్రయాణం, ఉదరబాధ.

## తుల

(చిత్ర; 3, 4 పా: స్వాతి, విశాఖ 1, 2, 3 పా;)

రాహువు వలన సుఖం, శని వలన బలం, ధనం, శృంగారం, గురువు వలన ధననష్టం, గౌరవభంగం, కుజుని వలన సంతానం మూలంగా గాని అనారోగ్యం వల్లగాని శత్రువుల మూలంగా గాని ఆందోళన. బుధునివలన జయం, గౌరవం, శుక్రుని వలన మంచి స్నేహాలు, నెల మొదటి పక్షంలో రవివలన అనారోగ్యం, శత్రువులమూలంగా చిక్కులు. 2వ పక్షంలో దృఢారోగ్యం, శత్రువులపై జయం, సుఖం.

## వృశ్చికం

(విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

రాహువు వలన వివాదాలు. శని వలన ధననష్టం లేదా గౌరవభంగం. గురువువలన ధనం జయం, ఆహారధాన్యాలు, సేవకజనం, సంతానావకాశం. కుజునివలన జ్వరం లేదా ఉదరబాధ లేదా రక్తదోషాలవలన అనారోగ్యం, చెడు మిత్రుల దుష్టసలహాలవలన ఆందోళన. బుధుని వలన భార్యతో లేదా కుమారులతో తగాదాలు. శుక్రునివలన ధనం, గౌరవం, నూతనవస్త్రాలు జయం, అధికారం. రవివలన నెల మొదటి పక్షంలో అనారోగ్యం, రెండవపక్షంలో అనారోగ్యంవలన గాని, శత్రువులమూలంగా గాని ఆందోళన.

---


డా. అర్కా సోమయాజి,

తిరుపతి.


---

## ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

రాహువువలన అధార్మికప్రవర్తన. శనివలన వివాదాలులేదా అనారోగ్యం, అధార్మికప్రవర్తన గురువు వలన అనారోగ్యం, ప్రయాణంలో ఆందోళన, కుజునివలన కుమారులమూలంగా గాని అక్రమంగాగాని ధనం. శుక్రునివలనధనం లేదా ఆహారధాన్యాలు, గౌరవం, గృహంలో సంపద, సంతానావకాశం. రవి వలన నెల మొదటిపక్షంలో ధనం, శత్రువులపై జయం, తరువాత అనారోగ్యం.

## మకరం

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ఠ 1.2 పా)

రాహువువలన ఆందోళన. శనివలన భార్య లేదా బిడ్డలనుండిఎడబాటు. గురువువలన శృంగారం, సుఖం. కుజునివలన ఉద్యోగసంబంధమైన ఆందోళన లేదా వివాదాలు. అనారోగ్యం లేదా ఇంటిలో దొంగతనం. శుక్రునివలన అధిక విలాసప్రవృత్తి. బుధుని వలన స్నేహితులు,


(40 వ పేజి చూడుడు)



## తిరుపతిలో స్వామి చిన్మయానంద

తిరుపతి ప్రజలకు 9—2—79 నుండి 18—2—79 వరకు మహాయజ్ఞ పర్వ దినాలు. తిరుపతిలో ప్రతిసంవత్సరము చిన్మయామిషన్ ఆధ్వర్యంలో గీతాయజ్ఞం జరుగుతున్నా, స్వామి చిన్మయానంద ఈ గీతాయజ్ఞంలో తిరుపతిలో పాల్గొనడం ఇదే మొదటిసారికావడం విశేషం.

9–2–79న సాయంకాలం శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు డా శాంతప్ప అధ్యక్షతన ప్రారంభసమావేశం జరిగింది. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ ధర్మప్రబోధ కార్యక్రమంలో దేవస్థానం కృషిని వివరించారు. ఈ సందర్భంగా ప్రత్యేకంగా ముద్రింపబడిన సంచికకు ఆవిష్కరణ జరిగింది.

భగవద్గీత అనేది ఒకదేశానికి లేదా మతానికి సంబంధించిన బోధకాదని, నిత్య సంశయాత్ముడైన సార్వకాలిక మానవునకు మహోన్నతుని బోధ అని స్వామి చిన్మయానంద తమప్రసంగంలో వివరించారు.

తరువాత 18 వరకు జరిగిన ఉపన్యాసాలలో శ్రీస్వామి చిన్మయానంద కర్మయోగాన్ని బోధించే 2వ అధ్యాయంలోని ప్రతిశ్లోకాన్ని సోదాహరణంగా వివరించటం జరిగింది.

తమ ఉపన్యాసాలలో స్వామిజీ అనంత చైతన్యంనుండి వేరుపడి ఆత్మ, వాసనానుభవానికిగాను ఏ విధంగా భౌతికశరీరాన్ని, మనోబుద్ధులను స్వీకరించి రూపొందేది, ప్రాకృతికమైన వాంఛలకుచిక్కి, ఇంద్రియ నిగ్రహాన్ని కోల్పోయి మానవుడు ఎలా పతనమయ్యేది, ప్రపంచములో ప్రతివస్తువునూ తాత్కాలిక ప్రయోజనంకోసం పరమాత్మ తనకిచ్చిన ఆటవస్తువులుగాభావించి నిర్మమ నిరహంకారములతో ప్రాపంచిక విషయపరిధి నధిగమించి, ఆత్మనిత్యత్వం దేహపుఅనిత్యత్వం గ్రహించి, విషయ వాసనలను దూరంచేసి అనంతచైతన్యంలో శాశ్వతపునరావృత్తిరహిత స్థితిలో లీనం కావాల్సిన అవసరాన్నిగురించి భగవానుడు నిత్యసంశయాత్ముడైన అర్జునరూపనరునకు ఏ విధంగా బోధించిందీ వివరించారు.

గీతాయజ్ఞ పరిసమాప్తి దినాన, స్వామి చిన్మయానంద గీతలోని 2వ అధ్యాయం, మిగిలిన అధ్యాయాల సారం అని అందువల్ల దీని నిత్యమననం అవసరమని, దానివలన మానవులు తమస్థాయిని, ఒక మెట్టునుండి మరొక పైమెట్టుకు పెంచుకోవచ్చునని అన్నారు. విశ్వప్రేమను గూర్చి స్వామిజీ పిల్లలకోసం (తత్తుల్యులకోసం) వ్రాసిన పుస్తకప్రతులను పంచటంజరిగింది.

ఈ గీతాయజ్ఞనిర్వహణకు దేవస్థానం సహాయాన్ని, ఏర్పాట్లకు స్వామిజీ సంతృప్తి వెల్లడించారు.

* *

స్వామి చిన్మయానంద, శ్రీ వేంకటేశ్వర కళాశాల విద్యార్థులు, అధ్యాపకుల సమావేశంలో ప్రసంగించారు.

ఈనాటి విశ్వవిద్యాలయాలు శిక్షణాలయాలుగాను, అధ్యాపకులు శిక్షకులుగాను మారటం జరిగిందని, అధ్యాపకవృత్తి వెనుకబడిందనీ ఈనాటి సమాజంలో అధ్యాపకులంటే విలువతగ్గడానికిదే ముఖ్య కారణమనీ అన్నారు.

## వార్తాలహరి

పెరుగుతున్న విజ్ఞానానికనుగుణంగా తమ బుద్ధిని అధ్యాపకులు పెంచుకునేప్రయత్నం చేయటంలేదని, ఉత్తమ అధ్యాపకులు తమ జ్ఞానాన్ని నిత్యనూతనంగా అభివృద్ధిచేసుకోవడంతోపాటు, విద్యార్థి కవగతం చేయగల్గిన బోధనా, వాక్శక్తులను అలవరచుకోవడమేగాక, విద్యార్థినుండి ఎదురయ్యే ఆకస్మిక ప్రశ్నలకుకూడా సమాధానాలు చెప్పగల సద్యఃస్ఫూర్తి ఉండాలని సలహా ఇచ్చారు.



ప్రత్యేకసంచిక ముద్రాపక సిబ్బందికి సన్మానం.

విద్యార్థులలో పెరుగుచున్న అలజడిని గూర్చి ప్రసంగిస్తూ విద్యార్థిమనస్తత్త్వాన్ని సక్రమదృష్టితో అర్థంచేసుకొనేందుకు సంయమనబుద్ధి చాలా అవసరమని, సమాజంలో ఉన్నతవర్గాల విద్యార్థులలోకన్పించే క్రమశిక్షణాదికాలు, తరతరాలుగా తాము మునిగివున్న దారిద్ర్య అజ్ఞానాంధకారావరణాలను ఛేదించి, తమబిడ్డల భవిష్యత్తుకుగాను శ్రమిస్తున్న వర్గంవారి విద్యార్థులలో కన్పడాలంటే ఇంకా కొంతకాలంపట్టుందనీ ఈనాటి విద్యార్థులలోని అలజడిమనస్తత్వం ఎవరిమీదా కోపంతోకాదని, ఈనాటి విద్యావిధానంలో గూడుకట్టుకున్న అనేక సమస్యల కారణంగా ఏర్పడే నిరాశ, నిస్పృహలతోపాటు నాగరిక జీవితానికి, తాము నివసించే మురికివాడలకు మధ్యగల



కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్, శ్రీ నారాయణస్వామి మొదలియార్, శ్రీ జె.వి సోమయాజులు.



స్వామిచిన్మయానంద

ఆర్థికవ్యత్యాసంపట్ల జుగుప్సకారణమని, విద్యావిధానంలో మార్పువచ్చేదాకా, ఈ దయనీయస్థితిపట్ల సానుభూతివహించి, అధ్యాపకవర్గం తామెట్టి క్లిష్టపరిస్థితులలో ఉన్నా, చిరునవ్వుతో వారి సమస్యలను చక్కచేయ ప్రయత్నిస్తే కొంతకాలానికి జాతిఅంతటా, సక్రమమైనమార్గం ఏర్పడుతుందని, కనుక ఈనాటి సమాజంలో అధ్యాపకునిపాత్ర అతిక్లిష్టము, గురుతరమైనదని, దానికి తగినవిధంగా అధ్యాపకులు తమ ప్రజ్ఞాపాటవాలను సరిదిద్దుకొని సంసిద్ధులుకావాలని బోధించారు.

## సమాచారకేంద్రం వార్షికోత్సవం

మద్రాసులోని తిరుమల తిరుపతి దేవస్థానం సమాచారకేంద్రవు వార్షికోత్సవం. శ్రీవేంకటేశ్వర సుప్రభాతపోటీలో గెలుపొందినవారికి బహుమతిప్రదానం జరిగాయి

సభకు తమిళనాడు న్యాయశాఖామంత్రి శ్రీ నారాయణస్వామి మొదలియార్ ముఖ్యాతిథిగా పాల్గొన్నారు. సమాచారకేంద్రం స్థానిక సలహాసంఘం అధ్యక్షులు శ్రీ జె వి. సోమయాజులు పాల్గొన్నారు.

దేవస్థానపు పూర్వపేష్కారు శ్రీ టి. దేవరాజులు వార్షికనివేదిక సమర్పించారు.

దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ. ఏ. యస్, సభలో ప్రసంగిస్తూ, ధర్మాభివృద్ధిపట్ల దేవస్థాన కార్యక్రమాలను వివరించారు.

సుప్రభాతపోటీలో గెలుపొందినవారికి శ్రీ నారాయణస్వామి బహుమతులు పంచిపెట్టారు. భక్తిరసకార్యక్రమాలు జరిగాయి





### సంగీతోత్సవాలు

శ్రీ వేంకటేశ్వర అన్నమాచార్య త్యాగరాజ సంగీతోత్సవాలు తిరుపతి అన్నమాచార్య కళామందిరంలో 25–3–79 నుండి 1–4–79 వరకు జరుగనున్నవి.

ఇందులో మొదట మూడు రోజులు 25–3–79 నుండి 27–3–79 వరకు అన్నమాచార్యవర్థంతి 31–వ ఉత్సవకార్యక్రమాలు జరుగుతవి. మిగిలిన పంచాహ్నిక కార్యక్రమంలో త్యాగరాజసంగీతోత్సవాలు జరుగుతవి.

దేవస్థాన ఆస్థానవిద్వాంసులుగాక ఇంకా పలువురు సంగీతవేత్తలు ఈ కార్యక్రమాలలో పాల్గొంటారు.

ప్రతిసంవత్సరం మాదిరిగానే ఈసంవత్సరంకూడా ఆస్థానవిద్వాంసులకు రు.1116/- చెల్లిస్తారు. వీరుగాక ప్రత్యేకంగా ఆహ్వానితులైన సంగీతవిద్వాంసుల ప్రక్కవాద్యాలతోసహా ఒక్కొక్క బృందానికి రు.1,000/- మృదంగం, ఘటం, కంజీరావగైరా ప్రక్కవాద్యాలకుగాను ప్రత్యేకంగా ఆహూతులైన విద్వాంసులకు ఒక్కొక్కరికి రు. 500/- బహుమానం ఇవ్వటం జరుగుతుంది.

ఇవిగాక ఒక్కొక్క బృందంలో 5 గురు మించకుండా, ఆస్థానవిద్వాంసబృందాలకు ఉచిత ఆవాస, భోజనసౌకర్యాలు ఏర్పాటు చేయబడ్డవి.

ఇవిగాక స్థానిక కళాకారులు, సదస్సు కళాకారులచే ప్రతిదినం సా. 3-00 నుండి 5-00 గం. వరకు సంగీత కార్యక్రమాలు. ఈ కచ్చేరీలో పాల్గొన్న ప్రతికళాకారునికి రు. 116/- మించని వస్త్రబహుమానం ఈ యేటి ప్రత్యేకవిశేషం. పాల్గొన్న ఆస్థాన విద్వాంసులకు రజితపతక బహుమానం కూడా ఈ యేటి విశేషం.

### వేదనారాయణస్వామి సూర్యపూజ

పూర్వం శ్రీమన్నారాయణుడు సోమకాసురుని సంహరించి వేదములను బ్రహ్మకిచ్చినస్థలము వేదారణ్యము. కనుక నారాయణుడు వేదనారాయణుడైనాడు.

సర్వసాక్షి సూర్యనారాయణుడు మీన మాసంలో 11, 12, 13 తేదీలలో అనగా 25–3–79 నుండి 27–3–79 వరకు మొదటిరోజున శ్రీ వేదనారాయణస్వామి పాదకమలాలను, రెండవదినాన నాభిప్రదేశాన్ని, మూడవరోజున ముఖమండలాన్ని స్పృశించి సంభావిస్తారు.

ఈ మూడురోజులలో స్వామివారికి దేవేరులకు ప్లవోత్సవం జరుగుతుంది.

మేనెలలో జరిగే బ్రహ్మోత్సవాల తర్వాత ఈ ఆలయంలో జరిగే పెద్ద ఉత్సవము ఇదే. వేలాదిప్రజలు ఈ సమయంలో ఇక్కడ చేర్తారు.

★

*Statement about ownership and other particulars about*

## SAPTHAGIRI
## (MONTHLY)

FORM IV
(*See Rule* 8)

| | | | |
|---|---|---|---|
| 1 | Place of publication | | TIRUPATI |
| 2 | Periodicity of its publication | ... | Monthly |
| 3 | Honorary Editor | ... | Sri P. V. R K. PRASAD, I.A.S. Executive officer, T.T.D |
| 4 | Printer's Name | . | Sri M. Vijayakumar Reddy |
| | (Whether citizen of India ) | .. | Yes |
| | Address | .. | Manager, T.T.D. Printing Press, Tirupati. |
| 5 | Editor & Publisher's Name | . | K Subba Rao, M.A , |
| | (Whether citizen of India ) | ... | Yes |
| | Address | | Editor, T.T.D. Sapthagiri Journal, Tirupati. |
| 6 | Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | ... ... | Tirumala Tirupati Devasthanams represented by its Executive Officer T.T D. Tirupati. |

*I, K. Subba Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief*

(*Sd.*) **K. SUBBA RAO,**
EDITOR & PUBLISHER,
*Tirumala Tirupati Devasthanams, Tirupati.*

TIRUPATI,
*Date* : 28-2-1979.

తనప్రవర్తన మూలంగా ఉద్యోగంలో భయం. రవివలన నెల మొదటిపక్షంలో ధననష్టం, నేత్రబాధ, వంచన. రెండవపక్షంలో ధనం. శత్రువులపై జయంమూలంగా గౌరవం.

#### కుంభం

(ధనిష్ఠ 3,4 పా, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా)

రాహువువలన తగాదాలు. శనివలనప్రయాణం. గురువు వలన మనశ్శాంతికి భంగం. కుజుని వలన శరీరానికి గాయం లేదా అనారోగ్యం. శుక్రుడు స్తబ్ధుడు. బుధునివలన అవమానం ఉన్నా ధనప్రాప్తి. నెల మొదటిపక్షంలో రవివలన అనారోగ్యం లేదా ఉదరబాధ. లేదా ధననష్టం లేదా ప్రయాణం, ప్రయాస. రెండవ పక్షంలో ధనవ్యయం లేదా నేత్రబాధ, ఇతరులచే వంచన.

#### మీనం

(పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి )

రాహువు వలన దృఢారోగ్యం, జయం. గురువువలన అధికధనం, నూతనవస్త్రాలు లేదా నూతనగృహం, సేవకజనం, వాహనాలు లేదా సంతానావకాశం. కుజునివలన ధనవ్యయం. ఆందోళన, భార్యకు అసంతుష్టి, నేత్రబాధ. చెడుసలహాలవలనగాని తగాదాలమూలంగాగాని ధననష్టం. శుక్రునివలన ధనం, వస్త్రాలు, స్నేహితులు. నెల మొదటిపక్షంలో రవిస్తబ్ధుడు రెండవపక్షంలో ధననష్టం లేదా ఉదరబాధ, ప్రయాణం, ప్రయాస.

*

*Edited and Published on behalf of T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T. T. D. Press by M. Vijayakumar Reddy, Manager T. T. D. Press Tirupati-517501*



తిరుమల తిరుపతి దేవస్థానం క్రీడా సంఘం ఆధ్వర్యంలో ఇటీవల 'ఫుట్‌బాల్' పోటీలు జరిగినవి. దేవస్థాన ఉపకార్య నిర్వహణాధికారి శ్రీ యన్ నరసింహారావు అధ్యక్షతన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ రిజిస్ట్రారు శ్రీ ఎం. జె. కేశవమూర్తి ప్రారంభించారు.

## ఫుట్‌బాల్ పోటీలు ★ క్రీడారంగం ★



చివరిరోజున బహుమతిప్రదానం జరిగింది. హైదరాబాద్‌కు చెందిన ఆర్టిలరీ సెంటర్‌కు ప్రథమబహుమతి, తిరుపతికి చెందిన డైనమోస్‌క్లబ్బుకు రెండవబహుమతి లభించాయి దేవస్థాన ప్రజాసంబంధాధికారి అధ్యక్షతన జరిగిన సభలో తిరుపతిలోని ప్రముఖ పత్రికా రచయిత శ్రీ యన్. వరదాచారి బహుమతులను పంచిపెట్టారు.



# శ్రీ వేంకటేశ్వర అన్నమాచార్య త్యాగరాజ సంగీతోత్సవం



**25-3-79** నుండి **1-4-79** వరకు

తిరుపతి

అన్నమాచార్య

కళామందిరంలో

జరుపబడును.

దేవస్థాన ఆస్థాన విద్వాంసులే కాక క్రింది గాన కళాకోవిదులు కూడా పాల్గొంటారు



శ్రీ ఓలేటి వేంకటేశ్వర్లు, శ్రీ యం. జగన్నాథరావు, శ్రీ యన్. సి. హెచ్ సత్యనారాయణ, శ్రీ యం. యస్. బాలసుబ్రమణ్యశర్మ, శ్రీ కె. మల్లికార్జునరావు

కుమారికలు: వింజమూరిలక్ష్మి, ఏ. పి. కోమల, జయలక్ష్మి సంతానం

---

ఇందులో మొదటి మూడురోజులు అన్నమాచార్య వర్ధంతి కార్యక్రమాలు, తరువాత 1-4-79 వరకు సంగీతోత్సవాలు జరుగుతవి.

తిరుపతిలోని కళాభిమానులకు చక్కని అవకాశం.

# శ్రద్ధాంజలి

★

జాతీయ కళావిశ్వంనుండి ఒక ధ్రువతార రాలింది. తెలుగు జాతి ఒక జాతి రత్నాన్ని కోల్పోయింది. కళాతపస్వి, బహుభాషా కోవిదుడు, సంగీత కళానిధి శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ 11—3—79 రాత్రి అనంతునిలో కలవటంతో జగమేజడమై పోయింది.

23—1—1893 లో జన్మించిన శ్రీమాన్ అనంతకృష్ణ శర్మ బహుముఖ ప్రతిభాశాలి. సుమారు 30 సంవత్సరముల కాలం మైసూరు మహారాజావారి కళాశాలలో పనిచేసిన శ్రీ అనంతకృష్ణశర్మ కేవలం సంస్కృతాంధ్ర ద్రావిడ కర్ణాటకాది బహుభాషాకోవిదుడే గాక ప్రసిద్ధ సంగీత విద్వాంసుడన్న విషయం యువతరంవారికి తెలియక పోవచ్చు, కాని వెనుకటి తరం వారికి ఆయనకుగల సంగీత పాటవం విదితమే.

వాస్తవానికి డా. శర్మ శతాధిక గ్రంథకర్త కాదు. కాని ఆయన 'తిక్కనతీర్చిన సీతమ్మ, 'నిగమశర్మ అక్క', 'రాయలనాటి రసికత', రంగనాథరామాయణం కర్తృత్వం, 'నాటకోపన్యాసాలు' 'శాలివాహనసప్తశతి,' వేమన, ఆర్యాద్విశతి, వృత్తరత్నాకరం ఆయనకుగల విషయ పరిజ్ఞానాన్ని నిశిత పరిశీలనాదృష్టిని వ్యక్తం చేస్తాయి.

శ్రీ వేంకటేశ్వరస్వామికి, తిరుమల తిరుపతి దేవస్థానానికి, ఆయనచేసిన సేవచిరస్మరణీయం. శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం పండితులుగా, స్వర్గీయ శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి వేసిన బాటలో, అన్నమాచార్య, తదితర తాళ్ళపాక కవుల వాఙ్మయ సాగరాన్ని మథించి అనేక రత్నసంపుటాలను, వెలువరచి, శ్రీనివాస చరణమంజీర సంఘటితములుగా



సమర్పించిన చరితార్థజీవి శ్రీ అనంతకృష్ణశర్మ. అన్నమయ్య పేర్కొన్న రాగములలో 108 రాగములలో కీర్తనలను రెండుసంపుటములలో వెలువరించిన స్వరద్రష్ట

అందుకే దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ రామకృష్ణప్రసాద్ చే దేవస్థాన ఆస్థాన విద్వాంసులుగా బిరుదమందిన కొద్దిగంటలలోనే శ్రీ అనంతకృష్ణ శర్మ, యశశ్శరీరి కావటం ఆయనసేవకు మెచ్చిన శేషశైలేశుడే భాగవత సామ్రాజ్య ప్రధానాచార్యపదవికి అగ్రతాంబూలంగా ఇచ్చి రప్పించుకున్నాడా అనిపిస్తుంది. మనిషి మరణిస్తాడు, మనీషి మరణించినా జీవిస్తాడు అదీ తేడా.

జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః<br>
నాస్తియేషాం యశఃకాయే జరామరణజం భయం.

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

# సప్తగిరి

ఏప్రిల్ 79

సంపుటి 9 సంచిక 11

విడిప్రతి 0-50 పైసలు

సం॥ చందా రు. 6-00

## విషయసూచిక



## అన్నమప్రభ




గౌరవసంపాదకులు:

శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్

ఐ. ఏ. ఎస్,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2322

ప్రచురణకర్త – సంపాదకుడు:

కొట్రపాటి సుబ్బారావు

ఎమ్. ఏ.,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

ముద్రాపకుడు,

ఎమ్. విజయకుమార్ రెడ్డి,

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2340


* సప్తగిరిలో ప్రచురణలకు పారితోషికములేదని గమనింప గోర్తాము. సం॥

* కొన్ని అనివార్య కారణములవలన 'అన్నమాచార్య సారస్వత కళారాధనము, అన్నమస్వరలహరి' ప్రకటింపబడలేదు. ॥ సం॥

ముఖచిత్రం: నాగులాపురం శ్రీ వేదనారాయణస్వామి బ్రహ్మోత్సవం (ఊంజలసేవ)

# సంపాదకీయము

తాళ్ళపాకగ్రామాన్ని దేవస్థానం దత్తత తీసుకుంటున్నది. అసలు దత్తతఅంటే ఏమిటి ? ఒక గృహస్థు తన వంశాన్ని ఆస్తులను పెంపుచేసే వారసుడులేనపుడు ఆ కార్యక్రమానికిగాను తనకభిమానపాత్రుడైన వేరొకఇంటి వ్యక్తిని తనకు వారసునిగ స్వీకరించి తన భౌతిక, పారలౌకిక కార్యక్రమవిస్తరణకు సాధనంగా ఏర్పాటుచేసుకోవటం. మరి ఇక్కడ గృహస్థు స్థానంలో వేంకటేశ్వరుడు, ఆయన వ్యవస్థ, దత్తతకు యోగ్యమైనస్థితిలో తాళ్ళపాకగ్రామం నిలవటం జరిగింది. ఇది ఎంత వరకు సమంజసం అని ముక్కుమీద వేలేసుకునేవారు లేకపోలేదు గాని కొంచెం లోతుకు దిగితే ఇంతకన్న మంచిదిలేదు అనేవారు చాలామంది వుండకపోరు.

మనలోమాటగా అనుకోవాలంటే శ్రీవేంకటేశ్వరునికి అన్నమాచార్యుడు, దేవస్థానానికి తాళ్ళపాకకు మించి దత్తతకు అర్హమైనవస్తువు లేదేమో ! స్వామి నందకాంశచేత జనించి, పదహారవయేట ఆతనిని ప్రత్యక్షము గావించుకొని శ్రీనివాసుని కీర్తించి, ఆంధ్రవాఙ్మయలక్ష్మిని శృంగార ఆధ్యాత్మికరాగాల రంగరింపులో సింగారించి నావలనే నీవు కీర్తిబొందేవు అని కవిసహజమైన ఆత్మవిశ్వాసంతో పంతగించి నిలుస్తూనే, ఆ వేంకటేశ్వరునిగూర్చి శృంగారపరముగా నాయికాభావంలో, వాత్సల్య రూపంలో యశోదగా, సర్వాత్మనా తపించిన ఉదాత్తభావుకుడు, స్వామికిదత్తులేక ఔరసపుత్రుడన్నా ఆశ్చర్యంలేదు. కారణం స్వామిదీ ఆయనదీ భారద్వాజగోత్రమే. ప్రతిదేవునికి ఆ కోవకుచెందిన భక్తులుండటం పరిపాటైనా, శ్రీవేంకటేశ్వరుని లీలా వినోదానికిగాను,తన భావనాపటిమతో ఒక సరససాహిత్యప్రపంచాన్నే తనుపెంచిన ఆస్తిగా అందించిన అన్నమయ్య ఆ తండ్రికితగ్గ కొడుకంటే తప్పేముంది !

మనిషి పుట్టుకకు ఒకచోటుండాలి. అన్నమయ్యకు అది తాళ్ళపాక. స్వామికి సేవచేసి తరించిన ఆ వంశీయుల జన్మస్థలాన్ని దేవస్థానం దత్తతతీసుకోవటం, ఈ రూపంగా కృతజ్ఞత చెల్లించుకోవటం మాత్రమే. ఆ గ్రామానికి సకల సదుపాయములు ఏర్పరచి ఒక పవిత్రఆధ్యాత్మిక కేంద్రంగా ఆ మహనీయుని స్మృతిచిహ్నంగా ఈ మరుభూమిలో మరొక్క తిరువాయూరును తీర్చిదిద్దటమే దేవస్థాన ఆశయం.

అసలు దత్తత అన్నమాట ఈనాటి అర్థంలో ఎవరుపెట్టారోగాని దానికి ఇప్పుడు చాలా పరమార్థం చేకూరుతోంది. అజ్ఞానం దారిద్ర్యం జిగిబిగా అల్లుకొన్న ఈ దేశంలో ఒకగ్రామం బాగుపడ్డా అది ఎంతో సంతోషించదగ్గ విషయం. నిజానికి మనజాతి మరచిపోవటానికి ప్రయత్నిస్తున్న మహనీయులు ఎందరో ఉన్నారు. వాల్మీకి వ్యాసుడు ఎక్కడున్నారో మనకు అర్థం కాకపోయినా, రాళ్ళుకరగించే రసమయసంగీతంతో అనంతజ్యోతినారాధించిన సూరదాస్, తాన్‌సేన్, మీరా, తులసీదాస్, పురందరదాస్, రామదాస్, శ్యామశాస్త్రి, ముత్తుస్వామిదీక్షితులు యిలా ఏడాదికొకసారి మనం అనుకుండే వారి జన్మస్థలవివరాలు సేకరించి ఆ యా రాష్ట్రప్రభుత్వాలుకాని, జనహితైషిసంస్థలుకాని, ఆయా ప్రదేశాలను బాగుపరచగలిగితే ఆ గ్రామాలు, ఆధ్యాత్మికచైతన్యంతో నూత్నజ్ఞానప్రబోధకాలై జాతీయజీవనస్రవంతిలో కొన్ని విశిష్టద్వీపాలుగ మనగలుగుతాయి. మరికొందరు మహనీయుల ఆవిర్భావానికి తావౌతవి. ఇది జరగనినాడు వారిపేరుతో ఏడాదికొకటే మిగులుతుంది.

# నవవిధభక్తి - భరతుడు

శ్రీ మద్భాగవతము నందలి సప్తమ స్కంధములో నవవిధ భక్తిమార్గములు సూచింపబడియున్నవి. అవి శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము ఆత్మనివేదనము అనుపేర్లతో ప్రసిద్ధములు.

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్
ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తి శ్చేన్నవ లక్షణా
క్రియతే భగవత్యద్ధ్యాత్మనన్యేధీత ముత్తమమ్"

పై నవవిధ భక్తిలక్షణములు శ్రీరామచంద్రుని పరమప్రియసోదరుడు, భక్తుడు అయిన భరతునిలో సంపూర్ణముగా కనుపించును. భరతుడు సదాచారసంపన్నుడు, మహాజ్ఞాని, త్యాగమూర్తి, విరక్తుడు, నిష్కామప్రేమస్వరూపుడు, భగవంతునికి అనన్యభక్తుడు. రామాయణ రచనాకారులు భరతుని భక్తిప్రపత్తులను చక్కగా చిత్రించిరి. నవవిధభక్తియొక్క పైలక్షణములు భరతుని జీవితచరిత్రలో ఏ విధముగా ఘటించబడినవో ఆయా అంశములు మహాభారతము, వాల్మీకిరామాయణము, ఆధ్యాత్మరామాయణము మున్నగు సంస్కృత గ్రంథములలో ఆద్యోపాంతము చక్కగా నిరూపింపబడినవి. హిందీభాషలోని రామచరిత్‌మానస్ (తులసీరామాయణము) లో భరతుని భక్తిప్రపత్తులు, నవవిధ భక్తి మార్గములు ఎట్లు కొనియాడబడినవో ప్రస్తుత వ్యాసములో పొందుపరపబడుచున్నది.

## శ్రవణభక్తి

భగవంతుని నామము, యశము, మహిమ, గుణము, లీలలు అనువానిని శ్రద్ధగా వినుట లేక విన్పించుట అను క్రియయే శ్రవణభక్తి.

ఈలక్షణము భరతునిలో ప్రత్యక్షముగా కనుపించును. శ్రీరాముని విజయసందేశమును వినిపించుటకు హనుమంతుడు నందిగ్రామమునకు వచ్చును. హనుమంతునిద్వారా ఆ శుభసమాచారము విని భరతుడు అతిశయానందభరితుడవును. ఆ సందర్భమును తులసీదాసు ఇట్లు వర్ణించెను.



"సునత బచన బిసరే సబదూఖా ।
తృషావంత జిమిపాయి పియూషా ॥
(ఉత్తరకాండ. దోహ 1 చౌ 7)

పిపాసువునకు అమృతము లభించినట్లు హనుమంతుని సందేశము వినగానే భరతుని సమస్తదుఃఖములు తొలగిపోయినవి.

శ్రీరాముని పట్టాభిషేకము అయినది. అయోధ్యప్రజలు ఆనందసాగరంలో మునిగితేలుతున్నారు. భరతశత్రుఘ్నులు హనుమంతునితోబాటు విహారమునకై ఉపవనమునకు వెళ్ళెదరు. అక్కడ భరతుడు హనుమంతుని శ్రీరాముని గుణగాథలను వినిపింపుమని అడుగగా —

"నాహిన్ తాత్ వురిన మై తాహి ।
అబ ప్రభుచరిత సునావహు మోహి ॥
(ఉత్తరకాండ దోహ 2 చౌ 7)

అప్పుడు హనుమంతుడు భరతునిపాదములకు ప్రణమిల్లి రఘుపతిగుణగాథలను ఇట్లు వినిపించును.

"తబ హనుమంతనాయి పదమాథా ।
కహే సకల రఘుపతిగాథా ॥"

ఈ విధముగా హనుమంతునిద్వారా భగవంతుని గుణగాథలను వినుటవలన భరతునకు తన ప్రభువుఎడల అపారఅనురాగము అతిశయఆనందము కలుగును. భరతుని ఈ ఆనందాన్ని తులసీదాసు ఈ విధముగా వర్ణించెను.

సునత బిమలగున అతిసుఖపావహి ।
బహురి బహురి కరి బినయ కహావహి ॥
(ఉత్తరకాండ దోహ 25 చౌ 3)

శ్రీరామచంద్రుని నిర్మలగుణములను విని అన్నదమ్ములు ఇద్దరు అత్యంతసుఖమును పొందెదరు. మరల మరల చెప్పుమని అడిగెదరు.

## కీర్తనభక్తి

భగవంతుని నామములను, రూపములను గుణములను, మాహాత్మ్యములను, లీలలనువర్ణించుట, గానముచేయుట కీర్తన భక్తి అని చెప్పబడును.

ఈలక్షణముగూడ భరతునిలో కనిపించును. శ్రీరాముని అడవులనుండి తీసుకుని వచ్చుటకై భరతుడు చిత్రకూటపర్వతమునకు బయలుదేరును. అతడు మార్గమధ్యమున రామనామస్మరణముచేయుచు పయనము చేసెను.

శ్రీమతి యన్. సి. సీతామ్మాళ్
తిరుపతి.

## తిరుమలలో వివిధములైన కాటేజిల దినసరి అద్దెలు

1–12–78 నుండి మార్చబడమైనది.

కనుక యాత్రికులు గమనింప గోరుతున్నాము.

| కాటేజిపేరు | రోజుకి అద్దె |
|---|---|
| 1. హెచ్. ఆర్ గవియప్ప కాటేజి. | రు. 100/- |
| 2. నారాయణగిరి కాటేజిలు 1 నుండి 4; 13 నుండి 20. | 40/- |
| 3. ట్రావెలర్స్ బంగళా ప్రాంతం లోపల వైపువి, 1 నుండి 8; ఎ నుండి జి 3-వ వరుస 1; సి. యం. సి. 16; వి. వి సి. 6; కె. వి. ఆర్. 4; వి. వి. సి. 1: వి. వి సి. 8; టి. బి. సి. 10. | 30/- |
| 4. పై కాటేజిలలో ఎ. భాగం. | 18/- |
| బి. భాగం. | 12/- |
| 5. ట్రావెలర్స్ బంగళా బయట వైపువి. వి. వి. సి; యం. బి. సి; ఎ. టి. సి. | 25/- |
| 6. పై కాటేజీలలో ఎ. భాగం; | 15/- |
| బి. భాగం. | 10/- |
| 7. టి బి. కాటేజిలు ( 3 వ వరుస ఒక్క గది గలవి.) | 10/- |
| 8. శ్రీ వేంకటేశ్వర అతిథి భవనం | |
| ఎ. పెద్దగదులు | 35/- |
| బి. మూలగదులు | 25/- |
| సి. మిగిలిన గదులు | 20/- |

కార్యనిర్వహణాధికారి.

"భరత తీసరే పహర కహఁకీన్హ ప్రవేసు ప్రయాగ,
కహత రామసియ రామసియ ఉమగి అనురాగ॥
(అయోధ్యకాండ–దోహ203)

శ్రీరామునియందు ప్రేమానురాగము పడుతుండగా "సీతారామ! సీతారామ!" అంటూ మూడవరూమున ప్రయాగకు చేరుకొనెను.

విరక్తుడయి నందిగ్రామములో నివసించుచు శ్రీరాముని ఎడబాటును సహించలేకుండిన భరతుని తులసీదాసు యిట్లు వర్ణించును –

"పులకగాత్ హియసియ రఘువీర, జీహ నాముజప లోచననీర"
(ఉత్తరకాండ దోహ 1)

అనగా శరీరముపులకించుచున్నది. హృదయమునందు సీతారాములు అంకితమై యున్నారు. జిహ్వ రామనామముజపించుచున్నది. నేత్రములనుండి ప్రేమజలము ప్రవహించుచున్నది.

భరతునిలోని కీర్తనభక్తిని కవి యింకా యిలా వర్ణించును.

"జాసు బిరహు సోచహు దినరాతి।
రటహు నిరంతర గునపాంతి॥

– శ్రీరాముని విరహతాపమువలన రాత్రింబవళ్లు కృశించుచున్నాడు. ఆతని గుణగణములను స్మరించుచున్నాడు.

### స్మరణభక్తి

భగవంతుని నామములను, గుణములను, మాహాత్మ్యములను, లీలలను, సర్వవ్యాపకత్వమును సర్వదా స్మరించుటయే స్మరణభక్తి అని చెప్పబడును.

శ్రీరాముని నిరంతరము స్మరించుటయే భరతుని స్వభావము. రాముని దర్శించిన తరువాత చిత్రకూటపర్వతమునుండి అయో

( 33వ పేజీలో చూడుడు)

# శ్రీనివాస ప్రబంధము



శ్రీమాన్ సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులు, కడప,

(గత సంచిక తరువాయి)

మ॥ జననీ స్తన్యములాను వేడుక రసస్యందంబుగా నవ్వు నూ-
తనజాతప్రియదంశనంబులగుద్వి త్రస్పష్టదంతమ్ములన్
స్తనముల్ నొక్క, నభీష్టమైనవెత సీత్కారంబు
గావించు న -
వ్వనజాతాక్షికి లోకమెల్ల ప్రణయప్రస్థాణుమాత్రం
బగున్ ౨౯౧

ఆ॥ చెప్పలేదు సతియ శివునకుఁ దనకోర్కె
తెలిసికొనఁడు భవుఁడు ధీలసితుఁడు
గడచె కాలమిట్లుగా దక్షపుత్రికా -
చిత్తగూఢవేదనాత్తభరము ౨౯౨

సీ॥ అంతఁ జతుర్ముఖుఁ డమరలోకమునందు
సత్రయాగము పూని సలుపుచున్న
సకలామరులు దిదృక్షామతు ల్వెంచేసి
రఖిలమౌనులు హృదాయత్తమతులు
సకలప్రజాపతుల్ సవలోపజాగరూ
కేక్షణు ల్వారితో నిద్ధతేజుఁ
డైనదక్షుఁడు వచ్చె నతని సమాజంబు
లేచి ప్రత్యుత్థాన మాచరించె

గీ॥ లేవనట్టివా రిర్వురే యావిధాత
తనయవీక్షాసహస్రపత్రాయితాక్షుఁ, -
డష్టతనువుల లోకమ్ము లావరించి
యఖిలశర్మంబు లొడఁగూర్చునట్టిహరుఁడు. ౨౯౩

కం॥ చనుదెంచినయాదక్షుఁడు
జనకునిపాదములు దాఁకి సకలామరపూ -
జనములు గ్రహించి లేవని -
వనజారివతంసుఁ గోపవక్రిమఁ జూచెన్ ౨౯౪

గీ॥ కర్మజటిలాటవీనిత్యగాహమాన -
బుద్ధియై భేదదృష్టిచేఁ బొనుగుపడెడు -
దక్షునకు నర్థమగునె? వేదప్రణీత -
పనితఫణితివిదూరవై భవుఁడు శివుఁడు ౨౯౫

చ॥ ముహురధరప్రకంపనత మోమయమూర్తి ప్రజాపతి
త్వదు -
స్సహదురహంకృతిగ్రసితసారవివేకుఁడు దక్షు డంత ని-
గ్రహము దొఱంగి హాలహాలకల్పము శాప మొసంగె
మౌనిహృ -
ద్గృహునకు చంద్రశేఖరునకు న్నవిభావితచిత్తవృత్తికిన్
౨౯౬

ఆ॥ భస్మకంకాలములఁ బితృవణములందు
వీఁగువెఱ్ఱికి మఖహావిర్భాగమటవె
ప్రమథపతికింక యాగౌరవమ్ము లేదు
పలికి తీయాన సేకొనవలయు మీరు ౨౯౭

కం॥ దక్షుం డిట్లని సభన -
ధ్యక్షించినతండ్రివంక నైనన్ జూడన్
గాంక్షింపక క్రోధైకస -
హాక్షేమంకరుడుగా గృహమ్ములఁ జేరెన్ ౨౯౮

సీ॥ అతని పోయినతోన నాసభ నున్నదే
వర్షులు దేవతావంద్యుఁడైన
హరునకు గలుషితుండై దక్షుచేసిన
చెయిదమ్ము కడివుచ్చుచెట్ట యనిరి;
నందీశ్వరుఁడు దక్షునకుఁ బ్రతిశాపంబు
నిచ్చె నాశాపమ్ముచిచ్చులంటి
భృగుఁడు క్రోధావేశనిగడితుండై భవ
వ్రతధారులకును శాపమ్ము వెట్టె;

(36 వ పుటలో చూడుడు)

# శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానము, తిరుమల

## వివిధ ఆర్జిత ఉత్సవముల ధరల వివరములు.

### దర్శనములు

1. స్పెషల్ దర్శనము రు. 25

ఈ టికెట్టు తిరుమలలోనూ. దేశంలో ఆంధ్రాబ్యాంకువారి వివిధశాఖలలోను లభించును. ఈ టిక్కెట్టు వారిని సుప్రభాత సమయంలోనూ, సర్వదర్శన సమయంలోను అనుమతించటం జరుగుతుంది. ఈ టిక్కెట్టు వారిని సర్వదర్శన సమయంలో ధ్వజస్తంభమువద్ద గాక మహా ద్వారంవద్ద క్యూలో చేర్చటం జరుగుతుంది.

### సేవలు

| | | |
|---|---|---|
| 1. | ఆమంత్రణోత్సవము | రు. 200 |
| 2. | పూలంగిసేవ | రు. 60 |
| 3 | అభిషేకము (పులికాపుసేవ) | రు. 450 |
| 4. | గంబురగిన్నె | రు. 250 |
| 5 | పునుగుగిన్నె | రు. 100 |
| 6. | జాఫ్రాగిన్నె | రు. 100 |
| 7. | కస్తూరిగిన్నె | రు. 100 |
| 8. | సహస్రకలశాభిషేకము | రు. 2500 |
| 9. | తిరుప్పావడ | రు. 5000 |
| 10 | కోవిల్ ఆళ్వారు తిరుమంజనం | రు. 1745 |
| 11. | ఐనా మహల్లో డోలోత్సవం | రు. 1000 |

### ఉత్సవములు

| | | |
|---|---|---|
| 1. | వసంతోత్సవము | రు. 2500 |
| 2. | కల్యాణోత్సవము | రు. 1000 |
| 3. | బ్రహ్మోత్సవము | రు. 750 |

### వాహనములు

1. సర్వభూపాలవాహనములో వజ్రకవచసేవ 72 + 1 (హారతి) రు, 73
2. బంగారుగరుడ, కల్పవృక్ష, పెద్దశేష, సర్వభూపాల, సూర్యప్రభ ఒక్కొక్కదానికి 62 + 1 (హారతి) రు. 63
3. వెండిగరుడ, చిన్నశేష, చంద్రప్రభ, ఏనుగు, గుఱ్ఱం, హంస, హనుమంత వాహన సేవ ఒక్కొక్కదానికి 32 + 1 (హారతి) రు. 33

### అన్నప్రసాదములు (కాలుసోల)

| | | |
|---|---|---|
| 1 | దధ్యోదనము | 40 |
| 2. | పులిహోర | రు. 50 |
| 3. | పొంగలి | రు. 55 |
| 4. | చక్కెరపొంగలి | రు. 65 |
| 5. | సాకరబాత్ | రు. 95 |
| 6. | కేసరిబాత్ | రు. 85 |
| 7. | పాయసము | రు. 85 |
| 8. | సీరా | రు. 155 |

### పడుల ప్రసాదములు

| | | |
|---|---|---|
| 1. | అప్పము | రు. 230 |
| 2. | లడ్డు | రు. 450 |
| 3. | వడ | రు. 250 |
| 4. | పోళి | రు. 225 |
| 5. | దోసె | రు. 100 |
| 6. | తేనెతొళ | రు. 200 |
| 7. | సుఖియం | రు. 200 |
| 8. | జిలేబి | రు. 450 |

### నిత్య సేవలు

| | | |
|---|---|---|
| 1. | నిత్యకర్పూర హారతి | రు. 21 |
| 2. | నిత్యనవనీత హారతి | రు. 42 |
| 3. | నిత్య అర్చన | రు. 42 |

షరా :- సహస్ర కలశాభిషేకము ప్రతి బుధవారమునను, తిరుప్పావడ ప్రతి గురువారమునను జరుగును. మిగిలిన వివరములకు ఈక్రింది చిరునామాకు వ్రాయవచ్చును.

1. ఆమంత్రణోత్సవమునకు 5 గురికి మారుగా ఇద్దరికి మాత్రమే అనుమతి,
2. ప్రతిదినం మధ్యాహ్నం 1-00 గం॥ నుండి 8-00 గం॥ లోపల సర్కారు లేదా ఆర్జిత కళ్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, వాహన సేవలు, సర్కార్ డోలోత్సవం (ఉయ్యాల) (సర్కారు లేక ఆర్జిత ప్లవోత్సవం, మంగళవారంనాడు) జరుగుతవి.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,
తిరుమల తిరుపతి దేవస్థానం
తిరుపతి 517501

# హనుమద్విజయం అందలి విశేషములు

ముక్తిసౌధము నెక్కుటకు బూనిన ముముక్షువునకు శ్రీమద్రామాయణము లోని ఒక్కొక్క కాండము ఒక్కొక్క సోపానముగా వర్తించుచుండును. అట్టి సోపానములలో శ్రేష్ఠతమము సుందరము అయినది సుందరకాండ సోపానము.

ఈ సుందర కాండమునకే హనుమద్విజయమని నామాంతరము.

"సమస్తమంత్రరాజోఽయం ప్రబలో నాత్ర
సంశయః
బీజకాండ మితిప్రోక్తం సర్వం
రామాయణేష్వపి"

అని బ్రహ్మాండ పురాణములో ఈ కాండముయొక్క మహిమ చెప్పబడినది.

కొందరు ఈ సుందరకాండమునకు సీత యధిష్ఠాన దేవత యని చెప్పుదురు. ఈ కాండ ప్రతిసర్గమున మొదటియక్షరము సకారమో తకారమోయుండును. లేదా యాశ్లోకమున సీతయను శబ్దముగాని తత్పర్యాయపదముగాని యుండును. అది తప్పినను రెండవశ్లోకమున తప్పని సరి యుండును. ఈ సకార తకారములు సీతా నామమును సూచించును. అందుచే సుందర కాండమునకు అధిష్ఠాన దేవత సీతయని చెప్పవచ్చును.

శ్రీ మద్రామాయణమును గాయత్రీ మంత్ర ప్రతిపాదకముగా తలచినపుడు ఈ కాండము దివ్యమంగళ స్వరూప లక్షణ వర్ణనముచే దేవ శబ్దార్థము కలదైనది. గాయత్రీమంత్రము "తత్సవితుః" అనితకారముతో ప్రారంభమై "ప్రచోదయాత్" అనితకారముతో అంతమైనట్లే ఈ కాండము కూడా 'తతోరావణః సీతాయాః' అనుశ్లోకముతో ప్రారంభమై "తవాభిశోకేన సదాభిపీడితా" అని తకారముతో అంతమైనది. తకారము సర్వార్థసిద్ధిప్రదమని మంత్రశాస్త్రము చెప్పుచున్నది. కావున తకారాద్యంతములతో గూడి గాయత్రీమంత్ర సామ్యమును పొందిన సుందరకాండము సర్వార్థసిద్ధి ప్రదాయి అనుటలో సందేహములేదు.

కిష్కింధాకాండ చివరివరకు 11 వేల శ్లోకములు ముగిసినవి. 12వ వేయిలో మొదటిశ్లోకము ప్రారంభముకావలెను. గాయత్రీమంత్రములో 12వ అక్షరము "వ" అట్టియక్షరమును "తతోరావణ సీతాయాః" అను ప్రథమ శ్లోకములోని నాలుగవ అక్షరము సూచించుచున్నది.

కిష్కింధాకాండమున "మిత్రరక్షణం కర్తవ్యం" అను ధర్మమును తెల్పి సుందర కాండమున "దూతయా పతివ్రతయాచ ఏవం వర్తితవ్యం" అను విధముగా దూత



శ్రీకళకుంట్ల కోదండరామాచార్యులు,
ఖమ్మం.

## దేవుని పై — దండయాత్ర

ఈ జీవిత రంగం
ఓ నాటక రంగం!
సూత్రధారునికి పాత్రధారులకు
పొత్తేకుదరని రణరంగం;
ఈ జీవిత రంగం
ఓ చదరంగం.

గులాబి బ్రతుకును ఎడారిబ్రతుకుగా
మార్చేస్తాడు నిమిషంలో;
ఎడారి బ్రతుకున ఒయాసిస్సునే
సృష్టిస్తాడు మరునిమిషంలో;
సాని బ్రతుకునే - రాణిబ్రతుకుగా,
రాణి బ్రతుకునే - సానిబ్రతుకుగా,
ఆడిస్తాడు - చూపిస్తాడు
ఈ ఆటకు అంతే లేదంటాడు. ॥ ఈజీవిత ॥

కన్నీరే ఎఱుగని పన్నీటి బ్రతుకున
కన్నీరే కురిపిస్తాడు,
పన్నీరే ఎఱుగని కన్నీటి బ్రతుకున
పన్నీరే చిలికిస్తాడు
చీకటి వెలుగులే - కష్టసుఖాలని,
కష్టసుఖాలే - చీకటి వెలుగని.
చూపిస్తాడు - నవ్వేస్తాడు
నా ఆటకు అంతే లేదంటాడు ॥ ఈజీవిత ॥

మట్టిబొమ్మలుగ మార్చేస్తాడు,
ఆట బొమ్మలుగ ఆడిస్తాడు,
తోలుబొమ్మలుగ ఎగరేస్తాడు.
గాజు బొమ్మలుగ పగలేస్తాడు.

తకదిమి తాదిం తాదిం తకదిం,
వాని నాట్యమే!
మోహనరాగం - శివరంజనియే
వాని రూపకం!
ఎవరికి వారే
వానికి తాళం!
వాని ఆటలకు అంతులేదులే!
మన తలవ్రాతకు తిరుగులేదులే!
ఈ జీవితరంగం
ఓ చదరంగం!

శ్రీ బి. బాలచంద్రుడు.
కదిరి.

పతివ్రతల యొక్క ధర్మములను వాల్మీకి మహర్షి తెల్పియున్నాడు.

రామాయణము ద్వయార్థ ప్రతిపాదక మన్నచో ఈ కాండము "శరణ" శబ్దార్థమును తెల్పును.

ఈ కాండము మొత్తము ఆచార్య శిష్య సంబంధమును, ఆచార్యుల కర్తవ్యమును చేతనోద్ధరణమునకై ఆచార్యుడు పడుపాట్లు మున్నగు విషయములను తెల్పుచున్నవి. అట్టివానిని ఆయాఘట్టములలో చూపించుటయే ప్రస్తుతాంశము.

సుందరకాండ సోపానముపై మనము మొట్ట మొదట అడుగు పెట్టగానే కనుపించునది. "రావణపాలితాపురీ లంకా". అదియే ప్రకృతి. ప్రకృతి సత్త్వరజస్తమో గుణాత్మక మైనట్లే సత్త్వరజస్తమోగుణ ప్రధానులైన విభీషణ కుంభకర్ణ రావణాది త్రిమూర్త్యాత్మకము లంక. అట్టి ప్రకృతిలో పడిన వాడే చేతనుడు. ఆ చేతనుడే సీతాదేవి. అట్లుకాక లంకా నగరమును ఒక శరీరముగా భావించినపుడు రావణ కుంభకర్ణులనే అహంకార మమకారములు, ఇన్ద్రజిదాదులనే కామక్రోధాదులు, విభీషణుడనే వివేకము, సీతయనే ఆత్మ మనకు గోచరించును.

శరీరమున లేదా ప్రకృతియందున్న భ్రమను ధ్వంసముచేసి ఆత్మకు లేదా చేతనునకు భగవత్ జ్ఞానమును కలిగించి ఉద్ధరించినవాడు హనుమంతుడనే ఆచార్యుడు. ఆ ఆచార్యుడు చేతనోద్ధరణకై పడినపాట్లను పరిశీలింతము.

సింహిక, సురస, లంకిణి మున్నగు వానిని మారుతి జయించి లంకనుచేరుట, అచటి, స్త్రీలను చూచి మనసు చలించనీయకుండుట, అనువానిని గమనించ ఆచార్యులు ప్రకృతి సంబంధమైన గుణములను జయించి, చేతనుని దరిచేరి తాము రాకుపై నీటిబొట్టురీతి సంచరించవలెనను విషయము తెలియుచున్నది.

సీతను వెదకుటకును, గుర్తించుటకును ఆంజనేయుడు కష్టపడిన తీరుచూడ, ఆచార్యుడు సంసార విముఖుడైన చేతనుని వెదకుటయును, గుర్తించుటయును చాలా శ్రమయని అందుకు దీక్ష యవసరమని బోధపడుచున్నది.

జానకిని గుర్తించి స్వామిరి "రాజాదశరథో నామ" అనికీర్తించి ఆత్మహత్యావిముఖత్వమును, సత్కథాశ్రవణ సుముఖత్వమును జానకికి కల్గించిన తెన్నుగమనించ ఆచార్యుడు హరినామ సంకీర్తనాదులచే, చేతనునకు ఇంద్రియ వ్యాపారముచేనైన సుఖానుభవ విరక్తిని, భగవత్సేవానురక్తిని కల్గించు ననియు అందుకు కావలసిన చతురవచోనిధిత్వమును ఆచార్యుడు కల్గియుండవలెననియు అవగతమగుచున్నది.

రాముడు సముద్రముయొక్క మధ్యనున్న వైదేహికి హనుమంతునిచే ముద్రికను పంపుటచూడ భగవానుడు సంసారార్ణవ మగ్నుడైన చేతనునకు ఆచార్యముఖముగా మంత్రమును ఉపదేశించుటయను విషయము తేటతెల్లమయినది.

వాయుపుత్రుడు మైథిలిని నమ్మించుటకై రామనామాంగుళీయకమునెలా చూపించినాడో అట్లే ఆచార్యుడు కూడా చేతనుని నమ్మికకై స్వస్వరూప, పరస్వరూపాది అర్థపంచక జ్ఞానమును, తిరుమంత్రమును బోధించి, వానివలన లాభము పొందిన పూర్వాచార్యుల చరిత్రలను తెల్పునను. విషయము బోధితము.

( 32వ పేజీలో చూడుడు)

# వేదాంత దేశికులు

శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి, ఆలిపుర్

(గతసంచిక తరువాయి)

ప్రపత్తిని అనుసంధానము చేయుటకు కూడ ఒక క్రమముకలదు. దాని నిట్లుగా పరిష్కరించి చెప్పవచ్చును ఓ పరమాత్ముడా! వాత్సల్యైక జలధీ! సుశీల! సులభ! సర్వజ్ఞ! స్థిర! సర్వశక్త! పరమ కారుణిక! పరిపూర్ణ! పరమోదార! కృతజ్ఞ, శ్రియఃపతీ! అత్యంత కృపణుడైన నేను ఇకముందు తమకు అనుకూల్యమునే చేయుదును; ప్రాతికూల్యము చేయునదిలేదు; తామే భక్తిస్థానమందు నిలిచి అవసాన సమయమందు తమ పాదారవిందముల యొద్దకు చేర్తురని నమ్మియున్నాను. తమ పాదారవింద ప్రాప్తిని తామేకరుణింపవలెను. దేహము ఇంద్రియము, ప్రాణము - మొదలైన వస్తువులకంటె వేరైన నేను నాది అను అభిమాన విషయమునకు చేరిన సకల వస్తువులును, సర్వస్వామియైన తమకు శేషీభూతములై యున్నవి. కాపాడునట్టి భారమును దీనినుండి కలుగు లాభమును తమకే చేరును

శంఖచక్రగదా పాణేద్వారకానిలయ గోవింద పుండరీకాక్ష రక్ష మాం శరణాగత మచ్యుత॥

శంఖచక్రాది దివ్యాయుధధారీ! హే ద్వారకావాసీ! పుండరీకాక్షా! గోవింద! శరణాగతుడనైన నన్ను రక్షింపుము.

ముక్తి:- మోక్షాధికారియైన జీవాత్ముడు భక్తి లేక ప్రపత్తిచేత ప్రసన్నుడైన పరమాత్ముని అనుగ్రహము ద్వారా దేహావసాన కాలమందు సకల విధములైన శ్రమములను పరిహరించుకొనును. సుషుమ్నానాడి మార్గముగా సుఖ ప్రయాణము చేసి అర్చిరాది మార్గమందు అగ్నిలోకము మొదలు బ్రహ్మలోక పర్యంతము ముక్తులకు ఉపచారము చేయుటకై భగవంతునిచే నియుక్తులైన నిత్యసూరులచే గౌరవ పూర్వకమైన సత్కారమును పొందును. ఆ మానవుడును నిత్యసూరి యొక్క హస్త లాఘవముచే విరజానది కుత్తర తటమున కేగును. గమన సాధనముగా కూడ వచ్చియున్న ప్రాకృత సూక్ష్మభూతములు సంబంధమును పరిత్యాగముచేయును. అప్రాకృతమైన దివ్య దేహము ధరించును. యువరాజ పట్టాభిషేకమునకు పోవు రాజకుమారునకు జరుగు ఉపచారమువలె ఇతని కుపచారము చేయుటకై నిత్యసూరులు ఇతనికి ఎదురు గావత్తురు. వారినుండి సకల విధాలంకారములను ఇతడు గ్రహించును. అనంతరము అనంత సహస్రరత్న స్తంభ సమాలంకృతమైన ఆనందమయ దివ్య మంటపమందు, భూషణాయుధ పరిజన పరికర వైభవములతో నిండు కొలువున వేంచేసి యుండి. కోటిసూర్య సమానుడై ప్రకాశించుచు, గాంభీర్యౌదార్య సౌందర్య సౌలభ్య కరుణాపరిపూర్ణుడై శోభించు పర వాసుదేవుని సమీపమునకు పోవును. చాల కాలము, తప్పించుకొని పోయి తిరిగి వచ్చిన కుమారుని చూచి సంతోషపడు మహారాజువలె, పరమాత్ముడు సంతోషపడి, తన తొడమీద అతనిని కూర్చుండ బెట్టి కౌగిలించుకొనును. ఆ క్షణములో "అపహతపాప్మా,విరజః, విమృత్యుః విశోకః విజిఘత్సః అపిపాసః సత్యకామః సత్య సంకల్పః అని" శ్రుతియందు చెప్పబడిన స్వాభావికములైన ఎనిమిది గుణములు కలుగును. ఈ విధముగా జీవాత్ముడు సర్వజ్ఞుడై నిత్యసూరుల తోడసముడై యావత్కాలమును, ఉభయ విభూతి, ఉభయలింగ విశిష్టమైన పరమాత్మను భవమును ఆనందమును అనుభవించుచుండును.

సంసార దశలో కర్మాధీనమై వచ్చి అనుకూలము, ప్రతికూలము ఉదాసీనముకైన కనబడిన సకల వస్తువులు కుమారునికి దొరికిన తండ్రి ఐశ్వర్యము వలె ముక్తునికి పరమాత్ముని ఐశ్వర్యము ప్రత్యక్షమగును.

ఇట్టి ముక్తాత్ముని ఐశ్వర్యము, సదేహము, విదేహము, అనంత దేహములతో కూడి సర్వలోక సంచారరూప మందున్నది. పరమాత్ముని అవతారము లట్లే సహాయమయ్యెను. స్వతంత్రమయ్యె, శాస్త్ర సంప్రదాయోపదేశము లట్లు, సకలజగదుద్ధరణ కార్యమును పరమాత్ముని కైంకర్యరూపమయ్యెను ఉన్నది. ఇట్టి ముక్తునికి ప్రకృతిమండల ప్రవేశకము, కర్మమూలకము గాక సంకల్ప మూలకమై యుండుటచే పునరావృత్తి దోషము లేదు. ఇట్లు మోక్షమును సాయుజ్యము సాలోక్యము, సామీప్యము, సారూప్యము అని విభజించి శతే పంచాశత్ న్యాయముచే సమన్వయింపనైనది.

ఇంత సొగసుగా, ఆకర్షణీయముగ మోక్షమును ఇంకే సిద్ధాంతమందును వర్ణించి యుండలేదు. సామాన్య మానవు

(31 వ పేజీలో చూడుడు)

# సప్తగిరి

## తిరుమల తిరుపతి దేవస్థానముల మాసపత్రిక.

★

సప్తగిరి మాసపత్రికలో వ్యాపార ప్రకటనలు ఈ దిగువ కన్పరచిన రేట్ల ప్రకారముప్రచురించబడును.

### ఒక్కొక్క ప్రకటనకు

| | | | | | |
|---|---|---|---|---|---|
| లోపల పేజీలో: | పూర్తిపేజి | .... | .... | రు. | 80/– |
| | అర్థపేజి | .... | .... | రు. | 50/– |
| | పావుపేజి | .... | .... | రు. | 30/– |
| కవరుపేజీలు: నాల్గవపేజి | 1 రంగులో | .... | .... | రు. | 200/– |
| | 2 రంగుల్లో | .... | .... | రు. | 250/– |
| | 3 రంగుల్లో | .... | .... | రు. | 300/– |
| లోపల 2 వ పేజి 3 వ పేజి | 1 రంగులో | .... | ... | రు. | 150/– |
| | 2 రంగుల్లో | ... | .... | రు | 200/– |
| | 3 రంగుల్లో | .... | .... | రు. | 250/– |
| ప్రత్యేకస్థలము లోపల పేజీలో | 1 మొట్టమొదటిపేజి | .... | .... | రు. | 150/– |
| | 2 చివరిపేజి | .... | .... | రు. | 110/– |
| | 3 వార్తలపేజికి ఎదురుపేజి | | 1 పేజి | రు. | 100/– |
| | | | ½ పేజి | రు. | 60/– |

### సాంకేతిక సమాచారము

| | | | |
|---|---|---|---|
| స్క్రీన్ : | కవరుపేజీలు | .... | 80 నుండి 100 |
| | లోపలపేజీలు | .... | 65 నుండి 80 |
| పేజిపరిమాణము (బ్లాకులకు) | పూర్తిపేజి | .... | 24 సెం. మీ × 19 సెం. మీ |
| | అరపేజి | .... | 12 సెం. × 19 సెం. మీ |
| | పావుపేజి | .... | 6 మీ × 19 సెం. మీ |

ప్రకటనకు సంబంధించిన విషయములు, బ్లాకులు, సంస్థలవారే సరఫరా చేయవలయును.

గమనిక : 1, 4 వ కవరు పేజి తప్ప మిగిలిన పేజీలలో 6 నెలసరి సంచికలకు ముందుగా డబ్బు చెల్లించి స్థల నిర్ణయము చేసుకొనువారికి ప్రకటన రేట్లపై 10% ను 12 సంచికలకు స్థల నిర్ణయము చేసుకొనువారికి 15% శాతమును ముదరా ఈయబడును.

2. ఈ వ్యాపార ప్రకటనల విషయము ముందు తెలుపక, కారణములు తెలుపకయే ఏ ప్రకటననైనను నిరాకరించు హక్కు సంపాదకునకు కలదు.

కార్యనిర్వాహక అధికారి,

**తిరుమల తిరుపతి దేవస్థానం.**

# ద్వితీయ ప్రపంచ హిందూ సమ్మేళనం

ఈ మధ్య ద్వితీయ ప్రపంచహిందూ సమ్మేళనాన్ని దర్శించే భాగ్యం కల్గింది. తీర్థరాజమగు ప్రయాగలో విశ్వహిందూ పరిషత్ నిర్వహించింది. ఎందరో ధర్మాచార్యులు, సమాజసేవకులు - మొత్తం 60 వేలమంది ప్రతినిధులు వచ్చారు. 20 దేశాల ప్రతినిధులందున్నారు. 24వ తేదీన జరిగిన ప్రపంచసంస్కృతి సమ్మేళనాన్ని కలుపుకుంటే మొత్తం నాల్గురోజులపాటు బాహ్యవాతావరణంతో నిమిత్తంలేని ధార్మికవాతావరణంలో గడిచిపోయింది. "ధర్మగంగ" పేరిట ధర్మావతరణంనుండి నేటి ఆధునిక వైజ్ఞానవిశేషాల వరకు జరిగిన వికాసాన్ని సచిత్రంగా వివరించే ప్రదర్శనం ఒకటి జరిగింది నిజంగా ఆ నాల్గు రోజులు "ధర్మగంగ"లో జలకములాడినట్లే గడిచిందనాలి.

మామూలుగా ధర్మంఅనేదాన్ని దైవం ఆధ్యాత్మికచింతనం, వ్యక్తిగత సాధనల పరంగా వివరించడం మనకు ఎక్కువగా ఉన్న పరిపాటి. ఈ సమ్మేళనం విస్తృత భావపరిధిలో విరాజిల్లింది.

సమాజనిష్ఠ, సాంఘికస్పృహ, సేవాతత్పరత, వసుధైకభావన, మానవతాతత్త్వము ఇత్యాదులు వక్కాణింపబడిన విశేషసమ్మేళనమిది. బదరి జ్యోతిర్లింగాధిపతి శంకరాచార్య శ్రీశాంతానంద మొదలు ఆసేతుశీతనగము వ్యాపించియున్న ధర్మాచార్యులు, సాధుసంతులు ధర్మప్రబోధాన్ని సమాజనిష్ఠంగా అందీయడం మనసమాజ చరిత్రలో చెప్పుకోదగిన పెద్దవిశేషం.

పూజ్యశ్రీ దలైలామా సమ్మేళనాన్ని జ్యోతిజ్వలనంతో ఆరంభించారు. బుద్ధుని ప్రసాదించిన ఈ ధార్మిక సమాజంఎడ కృతజ్ఞతో, భక్తిభావములు ఆయనమాటల్లో తొణికిసలాడాయి. ఈ సమాజం ఇక ముందు కూడా ప్రపంచానికి ఆధ్యాత్మిక మార్గదర్శకం చేయాలని, హైందవవ్యవస్థలన్ని సమైక్యంగానిలవాలని ఆయన ఆకాంక్షించారు. ఆయన ప్రయాగరాగానే కాశీ పండితులు వేద పఠనంతో ఆయనకు స్వాగతం చెప్పారు. ఆయన నిండుసభలో పండితులకు సంప్రదాయికంగా సన్మానం చేశారు. బౌద్ధులు వేదవిద్వాంసులమధ్య ఇట్టి సమాగమం తెలిసినంతవరకు అపూర్వము.

ఆ మూడురోజులలో - సాధు, సంతుల సమ్మేళనం, విదేశస్థహిందువులసమ్మేళనం జరిగాయి.

ఈ సమాజంలో ధర్మనిష్ఠను పెంపొందించడానికి ఇంటింటా మహిళల కర్తవ్యాన్ని గురించి, మహిళలకు గౌరవప్రదమైన సామాజిక వాతావరణాన్ని నెలకొల్పడానికి సంబంధించిన చర్చలు, తీర్మానాలు జరిగాయి. చలనచిత్రాలు, పత్రికలు, ప్రకటనలు మున్నగువానిలో మహిళాలోకాన్ని కించపరచే, అగౌరవపరచే నగ్న, అర్ధనగ్న చిత్రాదులను నిరోధించి మహిళలకు గౌరవప్రదమయిన వాతావరణాన్ని నెలకొల్పడంలో సమాజకర్తవ్యాన్ని అందు ఉద్బోధించారు.

స్వీయధర్మభూమికి దూరంగాజీవిస్తున్న విదేశస్థహిందువులు తమ హిందూత్వజీవన ధారను నిలుపుకొనడానికి పండితులు పడుతున్న తాపత్రయాన్ని వెల్లడించారు. పండితులు, పురోహితులు, ప్రబోధకులను పంపవలసిందిగాను, తమకు తమబిడ్డలకు సాంస్కృతిక, ధార్మికవికాసాన్నికల్గించే సాహిత్యాన్ని అందజేసి సాయపడవలసిందిగాను వారు అర్థించారు.

సాధుసంతుల సమ్మేళనంలో - హిందువులందరికి ధర్మం అందనిస్థితియెడ తీవ్ర ఆవేదనవ్యక్తంచేస్తూ ప్రతిహిందువు కనీసం పాటించదగిన ఆరుసూత్రాల ఆచారసంహితను ప్రతిపాదించారు 1. ప్రత్యక్షదైవమగు సూర్యభగవానునికి నిత్యము నమస్కరించడం. 2. ప్రతిహిందువు పరంబ్రహ్మస్వరూపమగు ప్రణవచిహ్నాన్ని గళమున ధరించడం, నిత్యవృత్తి విద్యాకర్మలను ఓంకారలేఖనతో ఆరంభించడం. 3. ప్రతి ఇంటా గీతాగ్రంథ పూజనపఠనములు. 4. ఇంటింటా తులసిపెంపకము, పూజనము. 5 ప్రతివ్యక్తి నిత్యమూ ఇష్టదేవతాప్రార్థనము. 6 సామూహిక ప్రార్థనాదులలో పాల్గొనడము. వారు ప్రతిపాదించిన ఆరు కనీస విధులు ఇవి.

ధర్మాచార్యుల ఆశీఃప్రసంగాలలోను, సాధు సంతసమ్మేళనంలోను వ్యక్తమయిన అతిముఖ్య విషయం - ఉపేక్షితవర్గములనదగు హరిజన, గిరిజనాదుల విషయంలో సాధుసంతుల కర్తవ్యము వక్కాణింపబడడం.

'లక్ష్మీనారాయణ,'
విజయవాడ.

---

సాధుసంతులు మఠ ఆశ్రమాలనుండి వెలికివచ్చి గ్రామాలలోను, ఉపేక్షితమండలములోను నియమంగా పర్యటించి ధర్మప్రబోధము చేయడమేగాక-విద్యావైద్యాది లౌకిక సేవావ్యవస్థలనుకూడా చేపట్టాలని అభిలషించారు. సాధుసంతులు యావత్తు సమాజంఎడ తమకు గల ధార్మికకర్తవ్యాన్ని గుర్తించి, ఈసమాజికులు మతాంతరులుఅయే దుస్థితిని సాధుసంతులుతమకు లజ్జాకరమైన విషయంగా పరిగణించాలని స్పష్టంచేయబడింది. సెక్యూలరిజమంటే మతవిరహితత్వము, నాస్తికత్వము, భౌతికవాదముకాక సర్వమత సమ్మానభావమనే అవగాహనను విస్తృత ప్రజానీకంలో కల్గించే కర్తవ్యంకూడా ఉన్నదని పెక్కుమంది ధర్మాచార్యులు స్పష్టంచేశారు. మత మందిరవ్యవస్థలు స్వార్థపరుల అధిపత్యము లందుగాని, ప్రభుత్వయాజమాన్యములందు

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం

నారాయణవనం.

★

### నిత్యకార్యక్రమ వివరాలు

| సేవ | సమయం | | |
|---|---|---|---|
| సుప్రభాతం ఉ॥ | 6-30 నుండి | | 7-00 |
| విశ్వరూపదర్శనం | 7-00 | ,, | 8-30 |
| తోమాలసేవ | 8-30 | ,, | 9-00 |
| కొలువు, అర్చన | 9-00 | ,, | 9-30 |
| శాత్తుమొర & గంట | 9-30 | ,, | 10-00 |
| సర్వదర్శనం | 10-00 | ,, | 11-30 |
| 2-గంట, అష్టోత్తరం (ఏకాంతం) | 11-30 | ,, | 12-00 |
| తీర్మానం | 12-00 | | |
| సర్వదర్శనం సా॥ | 4-00 | ,, | 6-00 |
| తోమాలసేవ, అర్చన (ఏకాంతం) | 6-00 | ,, | 6-30 |
| రాత్రి కైంకర్యం | | | |
| శాత్తుమొర | 6-30 | ,, | 7-00 |
| సర్వదర్శనం | 7-00 | ,, | 8-45 |
| ఏకాంతసేవ | 9-00 | | |

### ఆర్జితాదుల వివరాలు

| సేవ | | | రుసుము |
|---|---|---|---|
| అర్చన, అష్టోత్తరం | ... | రు. | 3-00 |
| హారతి | .... | రు. | 1-00 |
| కొబ్బరికాయకు | .... | రు. | 0-50 |
| సహస్రనామార్చన | | రు. | 5-00 |
| పూలంగి (గురువారం మాత్రం) | ... | రు. | 1-00 |
| అభిషేకానంతర దర్శనం (శుక్రవారం) | | రు. | 1-00 |
| తిరుచ్చి వాహనోత్సవం (వాహకుల రుసుముకాక) | | రు. | 15-00 |
| సింగమొరై ఖర్చులు | .... | రు. | 2-50 |

గాని ఉండడంగాక, ధార్మికంగా స్వాయత్తములై, సమాజమున ధర్మప్రచారమునకు, ధార్మికవ్యవస్థల విస్తరణకు కేంద్రములుగా రూపొందాలనికూడా స్పష్టంచేయబడింది. ఈ అన్ని అంశములు-కార్యాచరణ రూపకము, సమాజనిష్ఠాత్మకమునైన ధార్మికవ్యాసంగ సమగ్ర స్వరూపముగా ప్రతిపాదింపబడడం హిందూసమాజజీవనమున గణనీయమైన పెద్దమలుపు.

సాధుసంతులు ధర్మరక్షణలో సామాజికుల కర్తవ్యాన్ని కూడా నిర్ద్వందంగా స్పష్టంచేశారు. స్వామి చిన్మయానంద మాట్లాడుతూ - దేశంలోని ధనికులు, వ్యాపారులు తదన్యులందరూ భగవద్ప్రసాదితమైన తమసంపదలో కొంతభాగాన్ని నియమంగా ధర్మవ్యవస్థలకు కేటాయిస్తే ఈ దేశంలో ధర్మవ్యవస్థకు నిధులకొరతఎందుకుంటుంది? అన్నారు. "మీకున్న ధనం వల్ల మీకు గౌరవము, సార్థక్యము రాదు దానిని ధర్మానికి, సమాజానికి ఆధికారికంగా వినియోగించడంవల్లనే మీకు గౌరవము, మీ జీవనవ్యాపారాలకు సార్థక్యము ఉంటుందని" ఆయన నిర్మొహమాటంగా చెప్పారు.

ఈ మహాసమ్మేళనంలో జరిగిన చారిత్రకవిశేషం - ధర్మాచార్యులు అస్పృశ్యతను అసందిగ్ధంగా నిరాకరించడం. "హిందూ సమాజమున అస్పృశ్యజాతి అనేది లేదు" అని తీర్మానబద్ధంగా ప్రకటించబడింది. రాజకీయంగాను, సాంఘికంగాను, రాజ్యాంగపరంగాను దేశంలో అస్పృశ్యత నిరాకరించబడింది. కాని ధర్మపరంగా నిరాకరింపబడడం ఇంతకుముందు జరుగలేదు. రాజకీయాలు ఎంత ప్రబలంగా ఉన్నా నేటికీ మనలను పాలిస్తున్నది ధర్మప్రబోధకులు. అస్పృశ్యత ఏనాడు ఎందుకువచ్చినప్పటికి, అదిసమాజ బహిష్కరణకు మరొక రూపంగా నిలిచి ఉంది. సమస్తహిందూసంప్రదాయములకు చెందిన సాధుసంతులు, దేశదేశాలహిందూ ప్రతినిధులు, హైందవ సామాజిక ప్రముఖులు, కార్యకర్తలు ఏకత్రితమయిన ఈ సమ్మేళనం-యావత్తు హిందూసమాజానికి ప్రతినిధులుగా నిల్చి "నా సమాజమున అస్పృశ్యతలేద"ని ప్రకటించడం - ఈ సమాజ బహిష్కరణను రద్దుచేయడం యుగవిశేషం

జగద్గురు స్వామివిశ్వేశతీర్థులంటారు: "జగత్తులో హరిజనులు అంతర్భాగం కాదా? వారిని మినహాయిస్తే ఇది జగత్తు ఎలా అవుతుంది? మేము జగద్గురువులమెలా అవుతాము? తమ జగద్గురుత్వాన్ని నిలుపుకొనేందుకైనా జగద్గురువులు జగత్తులోని అందరిని సమభావంతోచూచి ధర్మాన్ని అందివ్వాలి" వారి ఘనగంభీరప్రకటన సభికులను కదలించివేయడంలో ఆశ్చర్యం లేదు.

మొత్తముమీద ఈమహాసమ్మేళనంలో సమగ్రసమాజమును గురించి, విస్తృత మానవాళిని గురించి దృష్టిని సారించడం కనిపిస్తుంది

విస్తృతమానవాళినిగురించి సద్భావన వ్యక్తంచేయడం ఈ ధర్మంలో కొత్త విషయం కాదు:

సర్వేచ సుఖినస్సంతు
సర్వేసంతు నిరామయాః
సర్వేభద్రాణి పశ్యంతు
.... .... .... ....

లోకమందెల్లరూ సుఖులైయుందురుగాక. ఎల్లరు ఆరోగ్యవంతులుగా ఉందురుగాక. ఎల్లరు శుభములనే అనుభవింతురుగాక అనే ఆకాంక్ష ఈ ధర్మమున స్వభావసిద్ధవిషయమే,

ఎటొచ్చీ సమాజజీవనంలో విస్మృతి పొందినది నాల్గవపాదం:

"మా కశ్చిద్దుఃఖభాగ్భవేత్"

ఏ ఒక్కరు దుఃఖము నొందకుందురుగాక యను అంశమే కొంతమన స్మృతిపథమును తప్పింది. ఈ మహాసమ్మేళనమునందు ఆ అంశము వక్కాణింపబడుటయేగాక, అందుకు తగిన కార్యాచరణాత్మకమగు ప్రతిపాదనలు కూడా వ్యక్తంకావడం అత్యంత హర్షదాయకమైనవిషయం. *

# హిందూమత మహిత

(గత సంచిక తరువాయి)

"ఫలభోక్తృత్వ సమానాధికరణఃయః కర్తాస ఏవ అధికారీ" ఈ నాడు ఏకర్మ చేయనట్టివాడే మరుజన్మమందు ఆ కర్మానుభవానికి వాడే కర్తయగునని మీమాంసా దృఢమై ఖరి,

"ఏహవా అనృణోయః అనిష్ట్వాచైవ యజ్ఞైశ్చ మోక్షమిచ్ఛన్ ప్రజత్యధః" వేదశాస్త్రములు చదివి ఋషిరుణము, హోమ భగవదారాధనలు జేసి దేవఋణము, శ్రాద్ధములు పెట్టి పిత్రుఋణము, మాతృ పితృ బంధువులను, ఆకలిగొన్న వారిని పోషించుచు మనుష్యఋణము, గోపశ్వాదులనుపోషించుచు భూతఋణము మున్నగు పంచ మహాయజ్ఞ ఋణములు తీర్చక మోక్షము కోరకూడదని తైత్తిరీయ మనుస్మృతులు ఉద్ఘాటించినవి. పంచమ వేదమనబడు మహాభారతము "యేషాం యే యాని కర్మాణి ప్రాక్సృష్ట్యాం ప్రతిపేదిరే తాన్యేవ ప్రతిపాద్యన్తే సృజమానాః పునః పునః". ప్రతినరుడు పూర్వజన్మయందు యేయే కర్మలను జేయునో అవియన్నియు మరల ఆ నరునకు వెనుకటి సృష్టివలె ప్రాప్తించునట. జీవుని ఏస్థితి లేక జన్మఎత్తవలెనో వానికర్మయే నిర్ణయించునని హిందూశాస్త్రము - నచదైవే ప్రభుత్వమ్.

ఆత్మశరీరాణ్యనిష్ఠో విహితక్రియాజనోఽతిశయవిశేషః సంస్కారః ఇతి సంస్కారప్రకాశే- దోషమైన దానిని పరిశుద్ధిగావించుపని సంస్కారము. సమ్ + కార సుడాగమమురాగా సంస్కార శబ్దమేర్పడును. సమ్ఇత్యేకీభావే అని నిరుక్తి అనగా ఆత్మ శరీరములకు లేక వస్తువుకు గాని విషమత్వమైన చెడును పారద్రోలి సమత్వమును కలుగజేసి అమృతసిద్ధికి హేతువుకాగలదని నిర్వచనము. హిందూ మతమందు జీవులు పుట్టినదిమొదలు గిట్టు అనంతరము శుభాఽశుభములందు వేద సంస్కారముల నాచరించువిధి ఉన్నది.

"అమృతస్య పుత్రా అభూయ కృణ్వంతో విశ్వమార్యమ్" మర్త్యమిషచే అమృతమునే జాతురు. పాపమునుండి వచ్చిన వారు కారు వీరపుత్రులు. అనార్యులను ఆర్యులుగా జేయుట ఆర్యుల కర్తవ్యమనియు, "ప్రజఇమే లోకాయేషాం లోకానామాప్యై" మనము చేసేటువంటి కర్మ ధర్మానుష్ఠానఫలం వ్యక్తికి ఈ భూలోకానికే గాక మూడులోకముల కంతటికి ఫలము చేకూరుతుందని వేదమే వ్యక్తపరచినది. స్వర్గలోకానికి ఆయా దేవతలకు కావలసిన హవిస్సునిచ్చే యోగ్యతగలది హిందూమతము. ఇదే కర్మరహస్యం.

హిందూ సంస్కృతి ఏనాడో విశ్వవ్యాప్తమై నాడు నేడు సంఘము జాతి విశ్వము భగవత్పరిణామసాధనాలే అన్నది దీనికుదాహరణగ ప్రాచీన హిందూమను ధర్మశాస్త్రం ఆధరంగా థాయ్‌లాండ్ రాజ ధర్మసూత్రాలు రూపొందించినట్లు విజయవాడ ఆగమశిల్పసదస్సుకు విచ్చేసిన థాయ్ రాజగురువు మాననీయ శ్రీ వామదేవముని ప్రకటించిరి.

పునర్జన్మనుగురించి 20-11-68 తేదీన ఆంధ్రప్రభవీక్లీలో ప్రకాశింపబడి జయపూరు కాలేజీలెక్చరర్ శ్రీ బెనర్జీగారిచే థాయ్‌దేశ పర్యటనవలన తెలుసుకొనునది. ఉల్లేఖింపబడినదిచూడుడు. థాయ్‌లాండ్‌లో ఒకతను నఖాన్‌సవాన్‌పల్లె పొలిమేరలావలనున్న ఒక వరండామూల చూపించాడు. మెల్లగా మామూలుధోరణిలో ఆయన 49 సంవత్సరాలక్రితం తన మరణానంతరం తన మృతకళేబరం చుట్టూమూగి విలపిస్తున్నవారిని చూచినట్లు, తన అంత్యక్రియ లేవిధంగా జరిగాయో వర్ణించి తన చెల్లెలి గర్భాన తాను పునర్జన్మించినట్లు చెప్పనారంభించాడు. ఆయనపేరు ప్రారాజసూతజిర్ణ ఆయన థాయ్‌లాండ్ బౌద్ధసంఘంలో గౌరవనీయుడు. ఆదేశం వాళ్ళకు ఆయన పూర్వజన్మగాథ బాగా తెలుసు. ఆయన పూర్వజన్మలోని బంధువులు ఈ వృత్తాంతమంతా నిజమని తీర్పుచెప్పారు. మాటలు పలకటం నేర్చుకోగానే ఆయన ప్రస్తుత


శ్రీ పండిత పరాంకుశ
సత్యనారాయణ భట్టాచార్య
కొల్లిమర్ల


మాతృమూర్తిని చెల్లీయని పిలువనారంభించడమే కాకుండా ఇతర బంధువులందర్నీ పేర్లతో పిలిచాడు. ప్రస్తుతజన్మలో తెలుసుకోవడానికి వీలుపడని పూర్వజన్మసంఘటన గురించి ఆయన ఎన్నోవివరాలు తెలుసుకున్నాడు. ఇలాంటి నిదర్శనలు దేశవిదేశాలలో ఎన్నో కనుగొన్నారు శ్రీబెనర్జీ. గనుకనే జీవించియున్నప్పు డాచరించు కర్మలతోబాటు మరణానంతరం వైదిక కర్మలను సూచిస్తుంది హిందూమతం.

పక్షీహభూత్వాఽతిదివస్సమేతి ఇతి అధర్వణవేదే—అపరకర్మలవలన ప్రేతత్వము వీడి పక్షిలాంటి సూక్ష్మరూపము బొంది జీవులు ఆయా లోకములు పొందెదరట. పాశ్చాత్యసైంటిస్టు శ్రీ ఆలీవర్ మృతులకు మనకుగల సంబంధము మరణముతో పోదు అనుభవ పూర్వకముగా తెలుపుతున్నామనిరి. భౌతికవిలాస భోగభూముల్లోగాక ఈ కర్మభూమియైన భారత

# హిందూమత మహిత

(గత సంచిక తరువాయి)

"ఫలభోక్తృత్వ సమానాధికరణః యః కర్తాస ఏవ ఆధికారీ" ఈ నాడు ఏకర్మ చేయనట్టివాడే మరుజన్మమందు ఆ కర్మానుభవానికి వాడే కర్తయగునని మీమాంసా దృఢపైఖరి.

"ఏహవా అనృణోయః అనిష్ట్వాచైవ యజ్ఞైశ్చ మోక్షమిచ్ఛన్ వ్రజత్యధః" వేద శాస్త్రములు చదివి ఋషిఋణము, హోమ భగవదారాధనలు జేసి దేవఋణము, శ్రాద్ధములు పెట్టి పితృఋణము, మాతృ పితృ బంధువులను, ఆకలిగొన్న వారిని పోషించుచు మనుష్యఋణము, గోపశ్వాదులనుపోషించుచు భూతఋణము మున్నగు పంచ మహాయజ్ఞ ఋణములు తీర్చక మోక్షము కోరకూడదని తైత్తిరీయ మనుస్మృతులు ఉద్ఘాటించినవి. పంచమ వేదమనబడు మహాభారతము "యేషాం యే యాని కర్మాణి ప్రాక్సృష్ట్యాం ప్రతిపేదిరే తాన్యేవ ప్రతిపాద్యన్తే సృజమానాః పునః పునః". ప్రతినరుడు పూర్వజన్మ యందు యేయే కర్మలను జేయునో అవి యన్నియు మరల ఆ నరునకు వెనుకటి సృష్టివలె ప్రాప్తించునట. జీవుని ఏస్థితి లేక జన్మఎత్తవలెనో వానికర్మయే నిర్ణయించునని హిందూశాస్త్రము - నచదైవే ప్రభుత్వమ్.

ఆత్మశరీరాణ్యనిష్ఠో విహితక్రియా జనోఽతిశయవిశేషః సంస్కారః ఇతి సంస్కారప్రకాశే - దోషమైన దానిని పరిశుద్ధిగావించునది సంస్కారము. సమ్ + కార సుడాగమమురాగా సంస్కార శబ్ద మేర్పడును. సమ్ఇత్యేకీభావే అని నిరుక్తి అనగా ఆత్మ శరీరములకు లేక వస్తువుకు గాని విషమత్వమైన చెడును పారద్రోలి సమత్వమును కలుగజేసి అమృతసిద్ధికి హేతువుకాగలదని నిర్వచనము. హిందూ మతమందు జీవులు పుట్టినదిమొదలు గిట్టు అనంతరము శుభాఽశుభములందు వేద సంస్కారముల నాచరించువిధి ఉన్నది

"అమృతస్య పుత్రా అభూయ కృణ్వంతో విశ్వమార్యమ్" మర్త్యమిషచే అమృతమునే జూతురు. పాపమునుండి వచ్చిన వారు కారు వీరపుత్రులు. అనార్యులను ఆర్యులుగా జేయుట ఆర్యుల కర్తవ్యమనియు, "ప్రజఇమే లోకాయేషాం లోకానామాప్యై" మనము చేసేటువంటి కర్మ ధర్మానుష్ఠానఫలం వ్యక్తికి ఈ భూలోకానికే గాక మూడులోకముల కంతటికి ఫలము చేకూరుతుందని వేదమే వ్యక్తపరచినది. స్వర్గలోకాని ఆయా దేవతలకు కావలసిన హవిస్సునిచ్చే యోగ్యతగలది హిందూమతము. ఇదే కర్మరహస్యం.

హిందూ సంస్కృతి ఏనాడో విశ్వవ్యాప్తమైనాడు నేడు సంఘము జాతి విశ్వము భగవత్పరిణామసాధనాలే అన్నది దీనికుదాహరణగ ప్రాచీన హిందూమను ధర్మశాస్త్రం ఆధారంగా థాయిలాండ్ రాజ ధర్మసూత్రాలు రూపొందించినట్లు విజయవాడ ఆగమశిల్పసదస్సుకు విచ్చేసిన థాయ్ రాజగురువు మాననీయ శ్రీ వామదేవముని ప్రకటించిరి.

పునర్జన్మనుగురించి 20—11—68 తేదీన ఆంధ్రప్రభవీక్లీలో ప్రకాశింపబడి జయపూరు కాలేజిలెక్చరర్ శ్రీ బెనర్జీగారిచే థాయ్దేశ పర్యటనవలన తెలుసుకొనునది. ఉల్లేఖింపబడినదిచూడుడు. థాయ్లాండ్లో ఒకతను నఖాన్సవాన్పల్లె పొలిమేరలావలనున్న ఒక వరండామూల చూపించాడు. మెల్లగా మామూలుధోరణిలో ఆయన 49 సంవత్సరాలక్రితం తన మరణానంతరం తన మృతకళేబరం చుట్టూమూగి విలపిస్తున్నవారిని చూచినట్లు, తన అంత్యక్రియ లేవిధంగా జరిగాయో వర్ణించి తన చెల్లెలి గర్భాన తాను పునర్జన్మించినట్లు చెప్పనారంభించాడు. ఆయనపేరు ఫ్రారాజసూతజిర్ణ ఆయన థాయ్లాండ్ బౌద్ధసంఘంలో గౌరవనీయుడు. ఆదేశం వాళ్ళకు ఆయన పూర్వజన్మగాథ బాగా తెలుసు. ఆయన పూర్వజన్మలోని బంధువులు ఈ వృత్తాంత మంతా నిజమని తీర్పుచెప్పారు. మాటలు పలకటం నేర్చుకోగానే ఆయన ప్రస్తుత

శ్రీ పండిత పరాంకుశ
సత్యనారాయణ భట్టాచార్య
కొల్లిమర్ల

మాతృమూర్తిని చెల్లీయని పిలువనారంభించడమే కాకుండా ఇతర బంధువులందర్నీ పేర్లతో పిలిచాడు. ప్రస్తుతజన్మలో తెలుసుకోవడానికి వీలుపడని పూర్వజన్మసంఘటన గురించి ఆయన ఎన్నోవివరాలు తెలుసుకున్నాడు. ఇలాంటి నిదర్శనలు దేశవిదేశాలలో ఎన్నో కనుగొన్నారు శ్రీబెనర్జీ. గనుకనే జీవించియున్నప్పు డాచరించు కర్మలతోబాటు మరణానంతరం వైదిక కర్మలను సూచిస్తుంది హిందూమతం.

పక్షీహభూత్వాఽతిదివస్సమేతి ఇతి అధర్వణవేదే—అపరకర్మలవలన ప్రేతత్వము వీడి పక్షిలాంటి సూక్ష్మరూపము బొంది జీవులు ఆయా లోకములు పొందెదరట. పాశ్చాత్యసైంటిస్టు శ్రీ ఆలీవర్ మృతులకు మనకుగల సంబంధము మరణముతో పోదు అనుభవ పూర్వకముగా తెలుపుతున్నామనిరి. భౌతికవిలాస భోగ భూముల్లోగాక ఈ కర్మభూమియైన భారత

దేశంలో పుట్టినందుకు వేదవిజ్ఞానాన్ని అందుకొని కర్మాచరణవలన సంసారతరణాన్ని పరమపదాన్ని అందుకునేమార్గాన్ని అనుసరించడమే శరణ్యం. కర్మ జ్ఞాన భక్తియోగములు భిన్నభిన్న స్వతంత్రసరణులుగాక భగవదారాధన మార్గములోని విభిన్నమజిలీలు. ఆత్మశ్రేయము నెవ్వడు గోరునో అతడు భగవత్పాదసేవనము గావించవలెను. మరల పుట్టుకలేకుండుటకు విగ్రహారాధనము పరమఉపాసనా సాధనము. గమనించుడు మహానారాయణోపనిషత్ :

ఉపాసయాయే ముక్తింగతాస్తేషాగ్ం సాకారోముక్తసాకారః తస్యాఽఖండజ్ఞానేనావిర్భవతి – యెవరు ఉపాసనచే ముక్తి పొందగోరుదురో వారికి భగవద్విగ్రహరూప ఆరాధన చెప్పబడినది. అందువలన చేతనునికి అఖండజ్ఞాన మావిర్భవించునని అనుచున్నది. పారమాత్మికోపనిషత్తు యును-"పాతః పాదాయపాదితే" ఇక్కడ చరణగ్రహముతో భగవద్దివ్యమంగళవిగ్రహోపలక్షణమగుచున్నది. పురుషార్థసాధనకు భగవచ్చరణవరణమే తగియున్నదని తేలుచున్నది. 'పర్యుపాసతే' ఉపాసించుచున్నారు అను గీతావాణికి భగవచ్ఛంకర భాష్యమందు ఇట్లు కటాక్షింపబడినది.

"ఉపాసనంనామ యథాశాస్త్రముపాస్యస్యార్థస్య విషయీకరణేన సామీప్యముపగమ్య తైలధారావత్సమాన ప్రత్యయప్రవాహేణ దీర్ఘకాలం యదాసనం తదుపాసనమాచక్షతే" ఏమనగా నుపాస్యవస్తువును శాస్త్రోక్తవిధితో బుద్ధికి విషయమునుగా గావించి దాని దగ్గరకు జేరి ఎడతెగక సమాన వృత్తిప్రవాహముచే దీర్ఘకాలము వరకు దాని యందుండుటను ఉపాసన యందురు.

(28వ పేజీలో చూడుడు)

# అన్నమాచార్యులు - నాట్యము

వన్దే బృన్దావనచరం - వల్లవీజనవల్లభమ్।
జయన్తీసమ్భవం ధామ వైజయన్తీ విభూషణమ్॥

శ్రీమంతంబగు భారతదేశమున నాట్య శాస్త్రమనునది, యిహపరసాధనకై బ్రహ్మదేవునిచే దైవసాన్నిధ్యము చేరుట కొక మార్గముగాఁ జేయబడి మానవునకొసంగిన విద్యగా పరిగణింపబడుచున్నది. దీనినే

శ్లో॥ న తద్ జ్ఞానం నతచ్ఛిల్పం నసావిద్యా నసాకలా।
నతద్యోగో నతత్కర్మ నాట్యేఽస్మిన్యన్న దృశ్యతే॥

మానవులు- రాక్షసులు-ఋషులు మొదలగు వారలందరు నాట్యశాస్త్రములను వ్రాసినారు.

శంభురీత స్తథా బ్రహ్మ మాధవో నందికేశ్వరః।



# అన్నమ ప్రభ

ఈ సంచికలో ........ పుట 1



దత్తిలో కోహళశ్చైవ యాజ్ఞవల్క్యశ్చ నారదః॥
హనూమాన్విష్ణురాజశ్చ షణ్ముఖోఽథ బృహస్పతిః।
అర్జునో రావణశ్చైవ కన్యాబాణసుతా తథా॥
ఏతే భరతకర్తారో భువనేషు ప్రకీర్తితాః॥

వీరందరు రచించిన నాట్యశాస్త్రములలో నాట్యమనగా నృత్యనాటకమని (ఇతివృత్తప్రధానమై నృత్యసంగీతముతో, ప్రయోగింపబడునది) భావించి దాని కనుగుణముగా లక్షణగ్రంథములను రచించినారు. వీనియన్నిటియందు రసము ప్రధానము. భావాశ్రయము రసము. ఈ భావములు మానసవికారమువలన కలుగుచున్నవి. "వికారో మానసోభావః" అనిగదా వచించినారు. భావమును బాగుగా వ్యక్తపరచునది అభినయము. అభినయ శబ్దోత్పత్తిని గురించి పెద్దలీ విధముగా నిర్వచించిరి.

"అభి పూర్వకస్య 'ణీఞ్'ధాతోరాఖ్యానార్థ స్యనిర్ణయః
యస్మాత్పదార్థాన్నయతి తస్మాదభినయ స్స్మృతః॥"

మనసులోకలిగిన భావములయర్థము వ్యాఖ్యానించునది. ఆ వ్యాఖ్యానార్థములను విశదముగా తెలియచేయునది "అభినయ" మనబడును. అందుచే నాట్యము నందభినయమునకు ప్రాముఖ్యము మెండు. మానవ నైజమునేగాక మానసిక పరిణామములను సామాజికులకు తెలియజేయునది కవిత. ఆ కవితలను మనోరంజకములుగను శ్రవణానందకరములుగా చేయునది గానము. అందలి గానములను సువ్యక్తములుగాఁ జేయుచూ కనులవిందును గూర్చునది యభినయము ఈ మూడింటి సమ్మేళనమే నాట్యము.

అభినయముచేయుట, రససిద్ధి సామాజికునకు కలిగించుట యొక యోగము. అందులచే కళాకారుడు తానాయాయవస్థలయందు లీనమై సామాజికుని లీనమగు

'పంచమవేదముగా' భరతుడు మొదలుగాగల నాట్యశాస్త్రకర్తలు వచించినారు.

దేవానామసురాణాం చ రాజ్ఞామథ కుటుంబినామ్।
బ్రహ్మర్షీణాం చ విజ్ఞేయం నాట్యం వృత్తాన్తదర్శకమ్॥
యోఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖ సమన్వితః।
సోఽంగాద్యభినయోపేతో నాట్యమిత్యభిధీయతే॥

అంతియేగాక

నాట్యమందుపయోగపడని జ్ఞానము జ్ఞానము గానేరదు. శిల్పము శిల్పత్వము నొందదు, విద్యయు విద్యగా రాణించదు. కళ కళత్వమునొందదు, అట్లే యోగము కర్మయును తమ సహజత్వముల నొందలేవు అని వచించినారు.


శ్రీమతి యం. కొంచనమాల
తిరుపతి.

నట్లు చేయుచున్నాడు. అందులచే శ్రవ్య కావ్యములకన్న దృశ్యకావ్యములు (నాట్యములు) ప్రసిద్ధిచెందినవి. ఇవి పండిత పామరజనామోదకములు. "శిశుర్వేత్తి; పశుర్వేత్తి వేత్తిగానరసం ఫణిః" యని నుడివినట్లు గానవిద్య ప్రసిద్ధికాగా, ఇహ పరసాధకమైనది 'నాట్యవిద్య' యగుచున్నది. ఇది బ్రహ్మానందకరము. మోక్ష ప్రాప్తికి రాచబాట అందులకే పలువురు వాగ్గేయకారులీ మార్గము ననుసరించినారు. వీరిలో ముఖ్యులు జయదేవుడు, నారాయణతీర్థులు, త్యాగరాజస్వామి, సిద్ధేంద్ర యోగి, క్షేత్రజ్ఞుడు, అన్నమాచార్యులవారు మొదలగువారు. వీరందరు మధురభక్తిని ఆధారముగా జేకొని శ్రీరామ, శ్రీకృష్ణావ తారకథలనుఆడిపాడి తరుణోపాయమును కనుగొని మనకందరకు ఆ మార్గమును చూపినారు.

> "చాలెడ నిదియే సత్యము సుండో
> చేటులేదితని సేవించినను"

అని అన్నమాచార్యులు వేంకటపతి పాద ధ్యానమే మనకు సత్యమార్గమని నొక్కి చెప్పినాడు.

శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యులు 15వ శతాబ్దమునకు చెందిన పదకవితా పితామహుడు. ఈ మహానుభావు డించుమించు 32,000 సంకీర్తనలు వ్రాసినాడు. ఇందులో



సుమారు 20,000 కీర్తనలు శృంగార పదములు. అన్నమాచార్యులు ద్వంద్వముల యందు పరమాత్మస్వరూపమును చూసిన ధన్యజీవి. కష్టసుఖములలో శ్రీ వేంకటేశునిజూచిన మహామనీషి. శరీరవాఙ్మనములను శ్రీహరిసంకీర్తనల కర్పించి దేహ ప్రాణములను నిమిత్తమాత్రముగా నమ్మి తనజన్మ భగవద్విలాసమని నమ్మినవాడు అందుచే ప్రపంచమునందలి పామరజనులలో బహుళ ప్రచారమందున్న సభ్యత, మర్యాదలతనినంటలేదు. దేనినిచూచినను విశ్వరూపుడైన వేంకటేశ్వరరూపముగనే భావించుటచే యుక్తాయుక్తములు సభ్యాఽసభ్యములు అతనికొకటిగానే కనబడినవి. అందులకే అన్నియు వేంకటేశార్పణముగా జేయుటయేగాక; పరమాత్మని యత్త, కోడలు, చెంచిత, రాజు, దేవుడుగా యిది యదియననేల పిపీలికాది పరబ్రహ్మముగాఁ జూడగల్గినాడు. చాలపదముల యందు విప్రలంభ శృంగారమును వర్ణించుచూ, చివరి చరణమునందు సంభోగింప జేసినాడు. ఈతడు బహుస్వతంత్రుడు. అందుచే భావములను సర్వస్వతంత్రముగా తీర్చిదిదినాడు. ఈతని పదములందలి భావోద్వేగములు, రచనారీతులు, భాషాప్రయోగములు మొదలగునవన్నియునూ ఈతని స్వాతంత్ర్యమును చాటిచెప్పుచున్నవి. దేనిని చూచిననూ, దేనిని చెప్పిననూ, మరియేదానిని తలచిననూ తన యంతరంగమందు భగవంతుని మరువని భక్తుడీ మహనీయుడు. తనసంకీర్తనములను పాడునపుడు సంతోషపారవశ్యమున గజ్జెకట్టి చిందువేసెనేమో! కాని ఈ సంకీర్తనలను నట్టువకత్తెలు నాట్యముచేయ నుద్దేశించి నట్లు కానరాదు.

అన్నమాచార్యుల కాలముననే కాదు; పెదతిరుమలయ్య చినతిరుమలయ్య కాలములోనునివిసంకీర్తనములుగా పాడినట్లగుపించునేగాని, నాటి నాట్యాచార్యులీ సంకీర్తనలను విశదపరచి యభినయనృత్తముల నుపయోగించినట్లగపడుటలేదు. ఏమన

చినతిరుమలయ్య తన సంకీర్తనలక్షణమున అన్నమాచార్యుల సంకీర్తనలప్రాముఖ్యము నభివర్ణించుచూ -

> పావనములు హరిభక్తి వి
> భావనములు సర్వమంత్రపరమరహస్యో
> ద్భావనములు గాయకనిక
> రావనములు తాళ్ళపాకయన్న యపదముల్॥

మరియునూ,

> రంజనములు, దుర్గుణగణ
> భంజనములు విమలకమలభవజనకగుణా
> సంజనములు సుజ్ఞాన ధ
> నాంజనములు తాళ్లపాకయన్నయపదముల్॥
> సారంబులు హరికరుణా
> సారంబులు విబుధనికరసంపూర్ణసుధా
> హారంబులు బహుదేశ వి
> హారంబులు తాళ్ళపాకయన్నయపదముల్॥

అంతియేగాదు;

> వేదంబులు పౌరాణిక
> వాదంబులు వరకవిత్వవాణీపీఠా
> నాదంబులు కృతసుజనా
> హ్లాదంబులు తాళ్ళపాకయన్నయపదముల్॥

అనుచు పలురకముల వర్ణనలందుకూడ నెచ్చటను నర్తనకనుపైనవని వర్ణించలేదు. అంతియేగాక, ఈ పదములువిన్నంతనే, పాపసంఘము లణగిపోవుననియు, అట్టి పదబంధకవితారత్నుండై, యీశ్వరాగ్వి రతుండయ్యె. వేంకటశైలనాథుడని వాని ప్రాశస్త్యమును గూర్చిగాని, చెప్పునపుడు గూడా నాట్యమునుగూర్చిగాని, నృత్యమును గురించిగాని నుడువలేదు.

ఈ కీర్తనలు "శ్రుతులై, శాస్త్రములై, పురాణకథలై, సుజ్ఞానసారంబులై, యతి లోకాగమవీథులై, వివిధమంత్రార్థంబులై నీతులై, కృతులై, వేంకటవల్లభరతిక్రీడా రహస్యంబులై, నుతులై తాళ్ళపాకయన్న వచోనూత్నక్రియల్ చెన్నగున్" యని వ్రాసినాడు. ఇందు "శాస్త్రములై" యను ప్రయోగమువలన మనము, నాట్యశాస్త్రము కూడా నొక శాస్త్రమైనందున దూరాన్వయము చేయవచ్చునేమోగాని ఇదమిత్థ

ముగా నీ కీర్తనలను అభినయములకు నిర్దేశించినవని చెప్పవీలుగాకున్నది.

ఇంకను తాళ్ళపాక చినతిరుమలాచార్యులు భరతాదుల గ్రంథములయందలి లక్షణములకు లక్ష్యముల పదకవితాపితామహుడు యేర్పరచెననియు వ్రాసినాడు. ఈ పదముల సంప్రదాయము రమణీయ సంగీతరత్నాకరప్రబంధాధ్యాయమునందు సముచితసంగీతచంద్రికాదేశైకమందు, సంగీతచూడామణి, సంగీతసుధాకరగ్రంథములయందు చెప్పబడినదని, ఆ పదమే యన్నింటికి మూలమై భరతశాస్త్రమందు పదిహేనవ (15) అధ్యాయమున విమల వృత్తచూర్ణనిబంధక వివిధనామభవ్యలక్షణములకునాస్పదమై యొప్పుచున్నదనిచెప్పుటచే భరతశాస్త్రమును కూలంకషముగా చదివినవాడన్నమాచార్యుడని; వానిని చదివి క్రొత్తమార్గముల నవలంబించి సంకీర్తనలక్షణముల వ్రాసినాడని తెలియుచున్నది.

నాట్యశాస్త్రమును చదివినవాడైయుండియు యభినయానురక్తుడుగా కాలేదనననుమానము రాకమానదు. ఈ సంకీర్తనల చదువునప్పుడు. కాని అన్నమయ్య శృంగారమంజరి రచనలలో 'కురవంజి' నాటకములు స్ఫురించురీతిని రచన కావించినాడు. అంతేకాక ఈ శృంగార మంజరి దృశ్యకావ్యముగా మలచుట కనువుగా నున్నదని నాట్యవిద్యయందేపాటి జ్ఞానమున్నవారికైననూ దోపకమానదు. అందుచేత నీ సంకీర్తనల మాత్రమన్నమాచార్యులు నాట్యప్రయోగమున కుద్దేశింపలేదని నా యల్పదృష్టికి తోచుచున్నది. అంతియేగాక నీ కీర్తనములు భజనసంప్రదాయములలో పాడు వాడుక నేటికియున్నదని, అటుల పాడు భజనకారులవద్ద ఆ సంప్రదాయములో మెట్టుపరచి వంశాను క్రమముగా పుదుక్కోట భాగవతారులచే క్రమముగా పాడబడు పాటలను ఇరువదియైదింటిని శ్రీకామిశెట్టి శ్రీనివాసులుశెట్టిగారు సేకరించినారు. శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు కూడా తమ తల్లిగారు అన్నమాచార్యులపాటలు పాడుతుండెడివారని, ఆమెవద్ద తాము నొకటిరెండు కీర్తనలు నేర్చుకొంటిమని, మైసూరులో భజనలు చేయువారలుకూడా అన్నమాచార్యుల కీర్తనలను భజనలో పాడు సంప్రదాయమున్నట్లగుపడుచున్నదని సెలవిచ్చెడివారు. అందుచే అన్నమాచార్యుల సంకీర్తనములకు నాట్యమాడు సంప్రదాయమున్నట్లు యే ఆధారములు దొరకుటలేదు, అంతియేగాక సంకీర్తనలక్షణముల దెలుపుచూ నేకధాతు పదలక్షణము నందు

తగనేకధాతు పదమీ
జగమున నేలేదు నాట్యశాలలదేశిన్
మొగవరియని పాడుదురది
యుగముంబల్లవియుం గూడియుండుజవియై

అనినాడు. అనగా ఆకాలపు నాట్యపద్ధతులు బాగుగా తెలిసినవాడు చిన్నన్నయైననూ నృత్యము గురించి అన్నమాచార్య కృతి వైభవములలో ప్రస్తావించకయుండుట ఆశ్చర్యకరమేగాక ఆ నృత్యమునకు ఈ సంకీర్తన వినియోగమిష్టములేదేమోయను శంకయంకురించకమానదు. కాని ఆకాలమునందలి నృత్యనాటకముల నృత్యరీతుల ప్రభావము అన్నమాచార్యులకవిత్వముపై లేకపోలేదు. పదాభినయమేగాక జక్కుల పాటలు, హరిదాసుల ప్రభావము గొబ్బి కోలాటముల ప్రభావమీయనపై బడినట్లు సంకీర్తనలలో తెలియుచున్నది. ఉదా: కొండనిదోపరికి గొబ్బిళ్ళో అనునది గొబ్బి పాట. చక్కనితల్లికి చాంగుభళా కోలాటపు పాట. ఇంకను శ్రీకృష్ణలీలలను గూర్చిన గోపికలమేలులు, యశోదసమాధానములు చెంచిత నరసింహ సంవాదములు, భూదేవి

(22 పేజీలో చూడుడు)

# చందాదారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రిక చందాదారులలో దిగువ పేర్కొన్నసంఖ్యవారిచందా 31-5-79 తేదీకి అంతమగును. చందాదారులు ఈవిషయమును గమనించి M. O. ద్వారా దిగువ పేర్కొనిన ప్రకారము మనియార్డరు కూపనునందు తమ చందా సంఖ్య పూర్తి విలాసమును పేర్కొని, త్వరలో చందా పంపని యెడల ఆ తేదీ దరిమిలా పత్రిక పంపబడదు.

65 69 81 92 93 94 140 166 170 176 179 186 121 122 123 127 236 275 276 332 336 339 350 351 392 395 396 502 510 739 826 1508 1514 1519 1527 1531 2271 2272 2280 2283 2284 2285 2287 2300 2302 2314 2316 3351 3353 3359 3371 3384 3390 3449 3496 4551 నుండి 4562 4565 4568 4569 4570 4573 4574 4575 నుండి 4584 4587 4589 నుండి 4619 4621 నుండి 4623 4625 నుండి 4630 4635 4647 నుండి 4649 4655 4656 4704

గమనిక:- (1) సప్తగిరి చందాలు 15 తేదిలోగా చేరునట్లు పంపవలెను. ఆ తరువాత చేరిన చందాలకు మరునెలనుండి మాత్రమే పత్రిక పంపబడును.

(2) క్రొత్తచందాదారులు కూపనులో 'క్రొత్తచందా' అని పేర్కొనవలెను. పాతవారు కూపనులో తమ చందాసంఖ్య నమోదుచేయవలెను.

(3) సప్తగిరి చందాలు ఈ క్రింది అడ్రసుకే తమ పిన్‌కోడ్ తెలియజేస్తూ పంపవలయును.

సప్తగిరి మాసపత్రిక సం॥ చందా రు. 6/-

మార్కెటింగ్ ఆఫీసరు
పబ్లికేషన్ సెక్షన్
ప్రెస్‌కాంపౌండ్, 517501 తిరుపతి

# శ్రీ అన్నమాచార్య సంకీర్తనామృతము

శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి

అవ:- భగవంతుని మాయా విలాసమును వర్ణించుచున్నాడు —

57

కేదారగౌళ

పరమాత్ముని నోరఁ - బాడుచును ఇరు
దరులు గూడఁగ దోసి - దంచీ మాయ.
॥పల్లవి॥

1. కొలఁది బ్రహ్మాండపుఁ - గుందెనలోన
కులికి జీవు లను - కొలుచు నించి,
కలికి దుర్మోహపు రో - కలి వేసి
తలఁచి తనువులను - దంచీ మాయ. ॥పర॥

2 తొంగలి రెప్పల రా - త్రులుఁ బగలును
సంగడి కన్నులుగా - సరిఁద్రిప్పుచు,
చెంగలించి దిక్కు-లనే - చేతు లూచుచు
దంగుడు బియ్యాలుగా - దంచీ మాయ
॥పర॥

3. అనయముఁ దిరు వేంక - టాధీశ్వరుని
పనుపడి తనలోఁ - బాడుచును,
వొనరి విన్నాణి జీ - వులనెడి బియ్యము
తనర నాతని కియ్య - దంచీ మాయ *
॥పర॥ (5-72)

మాయ యనునది ఒక ఇల్లాలు. ఆమె పరమాత్ముడు విషయముగాగల దంపుళ్ల పాటను నోరార పాడుచు జీవులు అను ధాన్యమును రోటవేసి దంచుచున్నది. సుఖ దుఃఖములు, పుణ్యాపాపములు అను ద్వంద్వములే ఆ రోటిమీది ధాన్యమునకు ఇరుదరులుగా నున్నవి. వాటిని కూడ ద్రోసికొనుచు మాయ తన దంపుడు పని కొనసాగించుచున్నది.

మాయ స్వల్పమైన బ్రహ్మాండము అను కుందెనలో జీవులు అను ధాన్యమును అల్లాడించి నింపుచున్నది. ఆపైన జీవులు లోంగదీయుటలో నేర్పరియైన వ్యామోహము అను రోకలి వేసి బుద్ధిపూర్వకముగా వారి శరీరము లనెడు పొట్టు ఊడిపోవునట్లు దంచుచున్నది.

వాలు రెప్పలుగల (రెప్పల బోలు రెండు సంధ్యలు గల) రేయింబవళ్ళు అను జంట కన్నులను సరిగా ద్రిప్పుచు విజృంభించి దిక్కులనెడు చేతులు ఇటు నటు ఊపుచు మాయ జీవులను మెదుగుడు బియ్య మగునట్లుగా దంచుచున్నది.

ఎల్లప్పుడు శ్రీ వేంకటేశ్వరుని తనలో తాను అలవాటు చొప్పున పాడుకొనుచు జ్ఞాన స్వరూపులైన జీవులనెడు బియ్యమును ఆ దేవున కర్పించుటకై మాయ పై విధముగా దంచుచున్నది.

విశే: ధాన్యము దంచువారు దంపుళ్ల పాట పాడుచుందురు. కుందెన కిరువైపుల బడు ధాన్యమును కాళ్ళతో కూడ ద్రోయుచుందురు. చేతులు విసరుచు రోకలి వేయుచుందురు. పొట్టూడునట్లు దంచి బాగుగా మెదిగిన బియ్యమును యజమానికి అప్పగింతురు. ఈ లోక వృత్తముతో మాయావిలాస మిట పోల్చబడినది. అవిద్యకు లోబడి ద్వంద్వములకు చిక్కి వ్యామోహమునకు వశమై నలిగిపోయిన జీవులు తుదకు విద్యాప్రభావముచే విజ్ఞులై భగవంతుని జేరుచున్నారనుట ఇందలి పరమార్థము.

'మాయాం తు ప్రకృతిం విద్ధి
మాయినం తు మహేశ్వరమ్'
(శ్వేతాశ్వ-4-10)

అని శ్రుతివచనము. మాయయే ప్రకృతి. దానిని ప్రవర్తింపజేయువాడు పరమాత్ముడే. తన వినోదమునకై ఆయన ప్రకృతినట్లు వినియోగించినాడు.

అనంతకోటి బ్రహ్మాండములతో నిండిన ఈ విశాల విశ్వములో మనము నివసించు బ్రహ్మాండము మిక్కిలి స్వల్పమైనది. అందుచేతనే ఇక్కడ అది చిన్న కుందెనగా రూపింపబడినది. సుఖ దుఃఖములు, పుణ్యపాపములు మొదలైన ద్వంద్వముల మధ్య జీవు లిటునటు కొట్టుమిట్టాడుచున్నారు. కాంతాకనకాదులపై వారికి గల వ్యామోహమే వారిన్ని బాధలకు లోనై జన్మ జరా మరణాత్మకమైన సంసార చక్రములో బడి నలిగిపోవుటకు కారణమగు చున్నది. దుర్మోహ మిట రోకలిగా పేర్కొనబడుటకు హేతువిదే.

మాయా పరిమోహితుడైన జీవుడు శరీరము దాల్చి స్త్రీలు, అన్న పానములు మున్నగు విచిత్ర భోగము లనుభవించుచున్నాడని కైవల్యోపనిషత్తు చెప్పుచున్నది —

స ఏవ మాయా పరిమోహితాత్మా
శరీర మాస్థాయ కరోతి సర్వమ్।
స్త్రియన్నపానాది విచిత్ర భోగైః
స ఏవ జాగ్రత్పరితృప్తి మేతి॥
(కైవల్యం-1-12)

ప్రకృతిచే ఇట్లు బహుకాలము నానా బాధలకు గురికావింపబడిన జీవులు చివరికి

(వ) ఇరుదరులు = రెండు ప్రక్కలు, సుఖ దుఃఖాది ద్వంద్వములు.
1. కులికి = అల్లాడించి, కొలుచు = ధాన్యము; కలికి దుర్మోహపు = నేర్పరియైన దుష్ట మోహమనెడు.
2. తొంగలి రెప్పల = వాలు రెప్పల; సంగడి కన్నులు = జతగూడిన కన్నులు; చెంగలించి=విజృంభించి, దంగుడు=మెదుగుడు.
3. పనుపడి = అలవాటుపడి; విన్నాణి = విజ్ఞాని.

* సా. రే. ని. రే. లలో ఈ పాటకు పెక్కు పాఠ భేదము లున్నవి. శ్రీ రాళ్ళపల్లి వారి సవరణ ఇచట అనుసరింపబడినది.
(చూ. శా. పా: II-P. 114)

తను అజ్ఞానమును గుర్తించి పశ్చాత్తాపము నొందుచున్నారు. భగవంతుని జేరుటకై పరితపించుచున్నారు. భగవత్ప్రాప్తి కవసరమైన విజ్ఞానమును పొందుచున్నారు. అట్లు విజ్ఞాన స్వరూపులైన వారిని ప్రకృతియే తుదకు పరమాత్ముని సన్నిధికి జేర్చుచున్నది. "ఆతని కియ్య దంచీ" అనుటలోని సారార్థమిదే.

భగవత్పరమైన అనన్య భక్తితోనే ఈ మాయ దాటవలసియున్నది. ఎవరు తన యెడల ప్రపన్నులగుదురో వారే త్రిగుణాత్మకమై దాట శక్యముగాని దైవ మాయను దాటి పోగలరని శ్రీకృష్ణుడు నుడివెను –

> దైవీ హ్యేషా గుణమయీ
> మమ మాయా దురత్యయా।
> మామేవ యే ప్రపద్యన్తే
> మాయా మేతాం తరన్తి తే॥
> (గీత – 7–14)

* *

ఆవ: అధ్యాత్మ శృంగార భావములను మేళవించుచు జగత్ప్రభువును వర్ణించుచున్నాడు ––

58

శ్రీరాగం

ఏతదఖిలంబునకు - నీశ్వరుండై సకల
భూతలములోనఁదాఁ - బొదలువాఁడితఁడు.
॥పల్లవి॥

1. గోపాంగనల మెఱుఁగు-గుబ్బ చన్నులమీద
చూపట్టు కమ్మ క - స్తురి పూఁత యితఁడు,
తాపసోత్తముల చిం - తా సౌధములలోన
దీపించు సుజ్ఞాన - దీప మితఁడు ॥ఏత॥

2. జలధి కన్యాపాంగ - లలితేక్షణములలో
కలసి వెలుఁగుచు నున్న - కజ్జలంబితఁడు,
జలజాసనుని వదన - జలధి మధ్యమునందు
అలర వెలువడిన పర - మామృతం బితఁడు
॥ఏత॥

3. పరివోని సురత సం - పదల నింపులచేత
వరవధూతతికి పర - వశమైన దితఁడు,
తిరువేంకటాచలా - ధిపుఁడు తానై యుండి
పరిపాలనము సేయ-భారకుండితఁడు॥ఏత॥
(5-112)

ఈ సమస్త విశ్వమునకు ప్రభువై సర్వ ప్రాణికోట్ల అంతరంగములలో వర్ధిల్లువాడీ పరమాత్ముడు.

ఇతడు మెఱుంగు లీను గోపికల గుండ్రని చన్నులపై కనిపించు పరిమళము గల కస్తూరిపూత. ఇతడు మునిశ్రేష్ఠుల ధ్యానములను మేడలలో ప్రకాశించు సుజ్ఞాన మనెడు దీపము.

ఇతడు సముద్రుని బిడ్డయైన లక్ష్మీదేవి యొక్క కడగంటి విలాసపు చూపులలో కలిసి వెలుగుచున్న కాటుక. ఇతడు చతుర్ముఖుని ముఖములనెడు సముద్ర మధ్యమునుండి పైకి దేలిన పరమామృతము. అనగా బ్రహ్మవదనముల నుండి పుట్టిన వేదములలోని సారము పరమాత్ముడనుట.

ఇతడు కొఱతలేని సురత సంపదల సమృద్ధులతో కాంతా రత్నముల కధీనమైనవాడు. మరియు నితడు తాను శ్రీ వేంకటాచల ప్రభువై యుండి సమస్త లోకపరిపాలన భారము వహించినవాడు.

వి: భగవంతుని అన్నమయ్య అధ్యాత్మయోగ సాధ్యునిగానే కాక పరమ శృంగారమూర్తిగా గూడ భావించి భావించి వేలకొలది సంకీర్తనలను రచించి



శ్రీ వేంకటాచలాధిపుడు

నాడు. ప్రకృత సంకీర్తనములో పై రెండు భావములను మేళవించినాడు. పాటలోని మూడు చరణములలోను పూర్వార్ధములు శృంగారపరముగను, తక్కిన భాగము లధ్యాత్మపరముగను సాగినవి. కామముతో గోపికలు, ధ్యానముచే పరమర్షులు ఆ పరమాత్ముని జేరిరను తత్త్వమును ఈ పాట ప్రకటన మొనర్చుచున్నది.

సమస్త ప్రపంచమునకు కర్తయై భరించువాడు పాలించువాడు, ఆ పరమాత్ముడే. 'భువనస్య గోప్తా విశ్వాధిపః' (శ్వేతాశ్వతరం-4-15) ఇత్యాది శ్రుతులిట ప్రమాణములు. మరియు జగత్పరిపాలన సామర్థ్యము శ్రీహరికి దప్ప మరియెవ్వరికిని లేదని విష్ణు పురాణము ప్రకటించుచున్నది.

> న హి పాలన సామర్థ్యం
> ఋతే సర్వేశ్వరం హరిమ్।
> స్థితం స్థితౌ మహాప్రాజ్ఞః
> భవ త్యన్యస్య కస్యచిత్॥
> (విష్ణుపురాణం 1-22-21)

---

ప్ర ఏతదఖిలంబునకు = ఈ సమస్తమునకు.
1. చింతాసౌధములలోన = ధ్యానమను భవనముల యందు,
2. జలధి కన్యాపాంగ లలితేక్షణములలో = సముద్రుని పుత్రికయైన లక్ష్మీదేవియొక్క కడగంటి విలాసపు చూపులలో; కజ్జలంబు = కాటుక;
జలజాసనుని వదన జలధి మధ్యమునందు = బ్రహ్మ ముఖములనెడు సముద్రము యొక్క మధ్యలో.
3. పరివోని=కొఱతవడని, భారకుండు = బరువు మోయువాడు.

మఱియు

"ఏకో దేవః సర్వ భూతేషు గూఢః
సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా"
(శ్వేతాశ్వతరం-6-11)

ఇత్యాది శ్రుతులు,

"ఈశ్వరః సర్వభూతానాం
హృద్దేశేఽర్జున తిష్ఠతి"
(గీత -18-61)

ఇత్యాది స్మృతులు భగవంతుడు సమస్త భూతములలో పొదలుచున్నాడని ఘోషించుచున్నవి.

కృష్ణుడు నల్లనివాడు గాన గోపికల యెదలనంటిన కస్తూరి పూతగా, లక్ష్మి కడగంటి చూపులలోని కాటుకగా వర్ణింప బడినాడు. ఇందుచే గోపికలకు కృష్ణు డొసంగు సతతాలింగన సౌఖ్యము, లక్ష్మి కతనిపై గల యఖిలాపాతిశయము వ్యక్తమగుచున్నవి.

ఆ దేవుడే అధ్యాత్మ దృష్టితో పర మర్షుల ధ్యాన మను సౌధములోని దీప ముగా, బ్రహ్మనోట వెలువడిన పరమా మృతముగా రూపింపబడినాడు. దీపము వలె తేజోమూర్తి యగుటయు, అమృతము వలె మృత్యురహిత స్థితి నొసంగువాడ నియు దీనిచే గ్రహింపవలెను

ఋషులు ధ్యాన యోగముచే పర మాత్మని దర్శింతురు ఈ విషయమునే కృష్ణుడు —

ధ్యానే నాత్మని పశ్యన్తి
కేచిదాత్మాన మాత్మనా। (గీత-13-25)

అని చెప్పెను. మరియు చతుర్ముఖుని వదనములనుండి వెలువడిన వేదములలోని సారము పరమాత్ముడనుటకు 'వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః' (గీత-15-15) అను భగవద్వచనమే ప్రమాణము

※ ※

(19వ పేజీ తరువాయి)

వరాహుల సంవాదములు, అత్తాకోడండ్ర-బావమరదళ్ళ, వివిధరక నాయికానాయ కుల సంవాదములు, మేలుకొలుపులు, చందమామపాటలు, దశావతారగీతములు, ఉగ్గుపాటలు, ఉయ్యాలపాటలు, ఆధ్యాత్మిక ములు, వర్ణనలు ఇందును కొండలవర్ణనలు తేరు, అభిషేక, ఊంజలసేవ, తెప్పలు, వాహనములు, తుమ్మెదపాటలు సర్వతో ముఖమైన శృంగారపదవర్ణనలు కోకొల్ల లుగా గలవు.

ఈ అధ్యాత్మ శృంగారసంకీర్తనముల సంగీతరచనావిధాన మేవిధముగ తెలియ రాకున్నదో అటులనే అన్నమాచార్యుల కాలమునాటి నాట్యరీతులును తెలియుట లేదు. అంతియేగాక నీతని సంకీర్తనము లలో ఏ కొద్ది సంకీర్తనలో నాట్యమునకై రచించెనా యను సంశయము చొల్లుకట్టుతో కూడిన రచనల జూచునపుడు కలుగును, కాని అందలి చొల్లుకట్టుకూడా తుదిమొదలు వ్యత్యాసముతో గూడినవిగా నగుపడుట లేదు.

ఉదా — తత్తాతిగుడుదిం దితకధింధిం
తిత్తి తిత్తితి తితితి తితితి
(Vol. IV. Page 22)

అనునది గైకొనినచో నేటి తిల్లానాలకిది ప్రాచీనరూపమని యనిపించును. కాని తిల్లానాయందలి ముక్తాయింపు (ముగింపు) విందు గానరాదు. అంతియేగాక అన్నమా చార్యుల శృంగార సంకీర్తనలన్నియూ నాయికానాయకుల లక్షణములకు లక్ష్యము లుగా కనిపించవు. ఒకేపదమున ననేక నాయికల లక్షణముల గుప్పించుటయేగాక విప్రలంభముతో నారంభమగు పదము సంభోగముతో ముగియును. అందుచే యభినయమున కనువగుపదముల నెన్ను కొనుట కొంచెము కష్టము.

(సశేషము)

(13—2—79)

దేవస్థానంలో పాంచరాత్రాగమఆస్థాన విద్వాన్ పదవిని పత్రికాప్రకటన మూలకముగా భర్తీచేయుటకు నిర్ణయించటమైనది

దేవస్థానం ఉత్సవసలహాసంఘం క్రింది వారితో పునర్నిర్మించడమైనది. సర్వశ్రీ కార్యనిర్వహణాధికారి, ముగ్గురు ఉపకార్య నిర్వహణాధికారులు, శ్రీవారి ఆలయము, తిరుపతి స్థానిక ఆలయముల పేష్కార్, దేవస్థాన న్యాయశాఖాధికారి, ఆస్థానపండితుడు, పెద్ద లేక చిన్నజియ్యంగారు, ఆలయాల ఆయా వంతు మిరాశి దార్లు, పోటుమిరాశిదారు.

శ్రీవేంకటేశ్వర మూకబధిరాంధపాఠశాలలో "చీఫ్‌థెరఫిస్ట్" పదవిని కల్పించడమైనది.

నారాయణవరం గ్రామంలో కన్నెమ్మ

| | |
|---|---|
| యు. డి. క్లర్కులు షరాఫ్‌లు | 25 |
| అటెండర్లు | 15 |

దేవస్థానంలో అక్కౌంట్స్ ఆఫీసరుగా ప్రభుత్వలోకల్‌ఫండు విభాగమునుండి శ్రీ యం. జె. రాధాకృష్ణయ్యశెట్టిని 30-1-79 నుండి నియమించటమైనది.

తనకు దొరికిన ధనమును నిజాయితీతో సొంతదారునకు చేర్చుటకు ప్రయత్నించిన దేవస్థానం క్యూఇన్‌స్పెక్టరు శ్రీ ఎం. త్యాగరాజులుకు రు. 25/- ప్రోత్సాహక బహుమతిగా ఈయ నిర్ణయించటమైనది.

దేవస్థానం ఉద్యానవిభాగాధికారి పదవికి 700-1200 నుండి 900-1450కి పెంచుతూ పదవిని అగ్రికల్చర్‌విభాగపు డెప్యూటి డైరెక్టరుస్థాయికి హెచ్చిస్తూ తీర్మానించటమైనది.

నడుపబడు శిల్పకళాశాలను దేవస్థానము స్వాధీనముచేసుకుని నిర్వహించుటకు తీర్మానించటమైనది.

శ్రీవేంకటేశ్వర బాలమందిర్ ప్రత్యేకాధికారిగా శ్రీ డి.ఆర్. నాయుడుగారి పదవి కాలమును మరొక్కసంవత్సరము పొడిగించటమైనది.

శ్రీకాకుళంజిల్లా, పాతపట్నంతాలూకా ముఖలింగంలో దేవస్థానసత్రమును నిర్మించేందుకు తీర్మానించటమైనది.

గుంటూరు రామనామక్షేత్రములోని శ్రీకోదండరామస్వామి ఆలయానికి ప్రార్థనామందిరంనిర్మాణమునకు గాను రు. 50 వేలు మంజూరుచేయటమైనది.

బాపట్ల తాలూకాలోని శ్రీగోవిందరాజ

# ధర్మకర్తలమండలి తీర్మానములు

ధర్మసంస్థకు చెందిన స్థలంలో కల్యాణ మండపం నిర్మించి, "తిరుమల తిరుపతి దేవస్థానం కన్నెమ్మ కల్యాణమండపం" అనుపేరు ఉంచుటకు నిర్ణయించటమైనది.

తిరుమలలో పరకామణి (హుండీనాణెములను లెక్కవేయు కార్యక్రమం) షిఫ్టు పద్ధతిన పనిచేయుటకుగాను పేష్కార్ కేడర్‌లో పరకామణిఅధికారి 1. డెప్యూటి షరాఫ్‌లు 23,అటెండర్లు12, హెడ్‌షరాఫ్ 1 పదవులను అదనంగా కల్పిస్తూ, పరకామణిలోపనిచేసే ఈ క్రిందిస్థాయి ఉద్యోగులకు ఎదురుగా పేర్కొన్నవిధంగాప్రత్యేక భత్యం ఈయ నిర్ణయించటమైనది

| గ్రేడు | ప్రత్యేకభత్యం నెలకి |
|---|---|
| సూపరింటెండెంటు, | |
| హెడ్‌షరాప్ | రు. 30 |

దేవస్థానంలోగల వివిధ భవన నిర్మాణాలదృష్ట్యా తిరుపతిలో 4 జూనియర్ ఇంజనీర్లు, 1 అటెండరు పదవులతో డిజైన్‌ల శాఖను ఒకఏడాదిపాటు కల్పించటమైనది.

తిరుమల అతిథిభవనములోని గదుల అద్దెలు రోజుకు రు. 12/- నుండి 16/-కు పెంచటమైనది.

దేవస్థానంలో ముద్రణకుగాను మోనోటైపు ఆల్ఫా కం ఫోటో టైప్‌సెట్టింగ్ యంత్రమునుకొనుటకు రు. 2 లక్షలు మంజూరుచేయటమైనది.

హైదరాబాద్‌లోని ఆగమశాస్త్రమహావిద్యాలయమును దేవస్థానం స్వాధీనంచేసుకుని నడుపుటకు నిర్ణయించటమైనది.

హైదరాబాదులోని దేవాదాయశాఖచే యానాదికాలని ఆలయ నిర్మాణాదులకు గాను రామకృష్ణసమితికి రు. 13 వేలు మంజూరుచేయటమైనది.

తిరుమలలో వివిధపర్వాదులు, ముఖ్యాతిథుల రాకపోకలు, మహాద్వారం వద్ద యాత్రికుల రద్దీని క్రమబద్ధం చేసేందుకు 1పేష్కార్, 4సూపరింటెండెంట్లు, 4అప్పర్ డివిజను గుమాస్తాలు, 4 లోయర్‌డివిజన్ గుమాస్తాలు, 14అటెండర్లుతో ఒకవిభాగం, శ్రీవారి దర్శనమునకువచ్చు యాత్రికులు కూర్చొను పి.పి.సి. షెడ్లలో యాత్రికులకు అవసరములు గమనించుటకు ఒకపేష్కార్, 4 సూపరింటెండెంట్లు, 12 లోయర్‌డివిజన్ గుమాస్తాలు, 12 అటెండర్లు, 8జమేదార్లు, 32 రక్షకసిబ్బందితో మరొక విభాగమును కల్పించ నిర్ణయించటమైనది.

దేవస్థానంలో శ్రీవేంకటేశ్వర పూర్ హోమ్, బాలమందిర్, మూకబధిరాంధ పాఠశాలలలో ఆశ్రయం పొందుతున్నవారికి ఎంప్లాయ్‌మెంటు ఎక్చేంజ్‌తో సంప్రతింపు లేకుండా దేవస్థానము ఉద్యోగము నిచ్చుటలో ప్రాధాన్యత చూపవలసిందిగా తీర్మానించటమైనది.

ప్రభుత్వ ఇంజనీరింగ్ విభాగములో వర్క్‌చార్జ్‌సిబ్బంది వేతనాలు, సెలవులు గురించి ఇచ్చిన ఉత్తర్వు జి.ఓ.నెం. ఎం.ఎస్. 1940 తే. 20-10-70, జి.ఓ. నెం. 407 తే 27-3-72 లను దేవస్థానంలోని వర్క్‌చార్జ్ సిబ్బందికికూడ వర్తింపచేయ నిర్ణయించటమైనది.

విజయవాడ సిద్ధార్థకళాశాల ప్రాంగణములో ప్రార్థనామందిరం నిర్మాణమునకు నిర్ణయింపబడిన నిబంధనల మేరకు గుడివాడలోని ఏ. ఎన్. ఆర్ కళాశాల ప్రాంగణములో ప్రార్థనా మందిర నిర్మాణమునకు అంగీకరించటమైనది.

తూర్పుగోదావరిజిల్లా రాజమండ్రివద్ద దేవస్థానంపేర స్నానఘట్టమును నిర్మించుటకు నిర్ణయించటమైనది.

దేవస్థాన సౌకర్యార్థం తిరుపతి రుయా హాస్పిటల్ నుండి గైనకాలజీ, సాధారణ వైద్యములలో నిపుణులను రప్పించి వారమునకు 2 పర్యాయములు, అక్కారాంపల్లెలోని ఎస్. వి. పూర్‌హోమ్‌లో చర్మరోగ నిపుణులచే వారమునకు ఒక పర్యాయము వైద్యపరిశీలన జరిపించి వైద్యులకు ఒక్కొక్కరికి నెలకు రు. 100 లు ప్రత్యేక భత్యము రు. 50 లు ప్రయాణపుఖర్చు ఇచ్చేందుకు అంగీకరించటమైనది.

శ్రీ వి. యన్. కృష్ణమూర్తిని అక్కారాంపల్లెలోని శ్రీవేంకటేశ్వర పూర్‌హోం వైద్యాధికారిగా నియమించడమైనది.

న్యూఢిల్లీలోని శ్రీవేంకటేశ్వర కళాశాల పాలకమండలిలో ఇప్పుడున్న సభ్యులతోపాటు దేవాదాయకమీషనర్, రెవిన్యూ శాఖకార్యదర్శినికూడ నియమించడమైనది.

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు రచించిన వాల్మీకిరామాయణ గ్రంథమునకు రు. 5 వేలు ఆర్థికసహాయం మంజూరుచేయటమైనది.

దేవస్థానకార్యాలయం క్రొత్తభవనంలోనికి మారుతున్నదృష్ట్యా ఇప్పటి కార్యాలయ భవనాన్ని చంద్రగిరి సబ్‌కలెక్టరు, తహసిల్‌దారు, సబ్‌ట్రెజరీ కార్యాలయములు నెలకొల్పుటకు ఇవ్వ నిర్ణయిస్తూ, లోగడ ధర్మకర్తలమండలి అధ్యక్షుని నివాసభవనాన్ని సబ్‌కలెక్టరు నివాసభవనముగా ఇచ్చుటకు నిర్ణయించటమైనది.

దేవస్థానం ముద్రణాలయంలో రెండవ షిప్టుఏర్పాటుచేస్తూ, ఇతరసిబ్బందితోపాటు ఒక్కొక్క షిప్టునకు అసిస్టెంటు మేనేజరు పదవిని 430-20-650-25-800 వేతనంపై కల్పించుటకు నిర్ణయించడమైనది.

లోగడ అతిథిభవనంగా ఉండి దరిమిలా ప్రస్తుతము ఉడ్‌లాండ్స్ హోటల్ స్వాధీనములోనున్న భవనమును తిరిగి అతిథిభవనముగా మారుస్తూ, పరిసరములు అతిసుందరంగా తీర్చిదిద్దుతూ, అదనంగా మరొక 2 గదులు నిర్మించాలని నిర్ణయించడమైనది. ఉడ్‌లాండ్స్‌వారికి వేరొకచోట స్థలము చూపించుటకు కూడ నిర్ణయించడమైనది.

తాళ్ళపాకగ్రామంలో అన్నమాచార్య ప్రచారపథకంక్రింద జరిగే అభివృద్ధికార్యక్రమాలకు శ్రీ జి. చంద్రశేఖరంనాయుడు సహాయోగమును కూర్చుకొనుటకు నిర్ణయించటమైనది.

శ్రీవారి ఆలయం సందర్శించు పీఠాధిపతులకు, ఇతరస్వాములకు ఉచితవసతి, రవాణా, శీఘ్రదర్శన సౌకర్యాలు ఏర్పాటు చేసేవిషయంలో అట్టివారిపట్టికలో క్రొత్తవారిని సందర్భానుసారముగా చేర్చుటకు కార్యనిర్వహణాధికారికి అధికారమివ్వడమైనది.*

---

## శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం తిరుచానూరు

ధర్మప్రతిష్ఠాన ఆధ్వర్యంలో పద్మావతీ అమ్మవారి ఆలయంలో జరిగే ప్రత్యేక సాంస్కృతిక కార్యక్రమాలు

సమయం: 6 గం॥ నుండి 8 వరకు

| | | |
|---|---|---|
| 15-4-79 | సంగీతం | — శ్రీ సి. యం. లక్ష్మీ నారాయణ విజయవాడ-3 |
| 22-4-79 | హరికథ | — కుమారి కె సుగుణరాణి బాలభాగవతారిణి అనంతపురం. |
| 29-4-79 | గాత్రసంగీతం | — శ్రీ కొండపల్లి సీతారామయ్య విజయవాడ. |

ప్రతిదినం సా 4-00 గం॥ నుండి 6-00 గం॥ వరకు అమ్మవారి ఆలయ ప్రాంగణంలో పురాణ కాలక్షేపం జరుగుతుంది.

# సీతమ్మ గొప్పతనము

రామాయణంలో రామునికంటె సీతమ్మపాత్ర చాలాముఖ్యమైనది. ఆ కావ్యంలో సీతాపహరణం లేకపోతే రామరావణ యుద్ధం జరిగేదికాదు. రామాయణమే ఉండేదికాదు. అంతటి స్థానం సీతమ్మది. అందుకే వాల్మీకికూడ "సీతాయాచరితం మహత్" అంటాడు. ఆమెఅయోనిజ మహాశక్తిసంపన్నురాలు తనశక్తి తెలిసివుండికూడ యేమిచేతకాని దానివలె రావణుని చెరలో ఉంటుంది. ఎందుకు? ఈ ప్రశ్నకు అన్నమయ్య యీ క్రింది కీర్తనలో జవాబు చెప్తాడు:

సాళంగనాట

పల్లవి

తమసత్వ మెఱింగియు దాచిరిగాక।
తమనేలె రాము స్వతంత్రము చూపవలసి॥

చరణము

హనుమంతుని తోక నసురలందరుఁగూడి।
మును లంకలో నగ్ని ముట్టించె వేళను।
అనలము శీతోభవ యన నేర్చిన సీత।
పనివి రావణ హతో భవ యన నేరదా॥

అంకెల జలధిదాటి యటరాముని ముద్రిక।
సంకెలేక చేతంబట్టి సాహసమున।
లంకాధిదేవతయైన లంకిణిం గొట్టినవాడు।
వుంకించి రావణుం జంపనోపండా
వాయుజుండు॥

శ్రీ వేంకటేశుండైన శ్రీ రాఘవుని పంపున।
వావిరి నంగద ముఖ్యవానరులెల్ల।
ఆవేళ హోమపాత్ర నగ్నిలో వేశినవారు।
రావణు నందులో వేశ రానోపరా॥

(అధ్యా. సం. 2 — 183)

లంకలో నసురు లందరు గూడి హనుమంతుని తోకకు నిప్పంటిస్తారు. అశోకవనంలో సీతమ్మకు విషయం తెలుస్తుంది. 'అనల శీతోభవ' యని అంటుంది. అగ్ని యాహనుమంతుని బాధించక చల్లగా వుంటుంది. అంతటి ప్రభావం గలిగిన సీత "రావణ హతోభవ" యని యనివుంటే రావణుడెప్పుడో హతమయ్యేవాడు. కాని యామె అట్లా చేయలేదు పతివ్రతా లలామ గనుక, భర్తశక్తిని న్యూన పరచి


శ్రీమతి జి మైథిలి, MA
తిరుపతి.


తాను కీర్తిని గడించాలని యనుకోలేదు. తనయేలికయైన రాముడు సర్వశక్తి సంపన్నుడు. అతడే రావణ సంహారం చేసి తన్ను రక్షిస్తాడని వూరుకుంటుంది. పురుషోత్తమావతారమైన రాముడొక్కడే స్వతంత్రుడని యామెభావం.

అన్నమయ్య,యీకీర్తనలో సీతమ్మకు మాత్రమే గొప్పతనాన్నాపాదించక, హనుమంతుడు అంగదాది వానరప్రముఖులను గూడ మహాసత్వసంపన్నులని కీర్తిస్తాడు. హనుమంతుడు అంకెలజలధి దాటినాడట. రామునిముద్రికను తీసికొని లంక జొచ్చి లంకాధి దేవతయైన లంకిణిని సంహరిస్తాడు. ఇన్నిసాహస కృత్యాలను చేసిన వాయుసూనుడు రావణునిచంపి యుండ లేడా యన్న యనుమానము కలుగవచ్చు. దానికి సమాధానం పల్లవిలో యిస్తాడు అన్నమయ్య. తన యజమానియైన రాముడు తనధైర్య సాహసాలను ప్రదర్శించి రావణుని చంపాలి. తనకా స్వాతంత్ర్యంలేదు. అందుకే "తమసత్వ మెఱింగియు దాచిరిగాక" యంటాడన్నమయ్య. ఈహనుమంతునిలో విశ్వాసపాత్రుడైన బంటు కనిపిస్తాడు. యజమాని శక్తిసామర్థ్యాలకు మచ్చ తెచ్చే పనికి వాయుజుడు పూనుకోడు.

ఇక మూడవ చరణంలో అంగదాది వానర ప్రముఖుల సాహసాన్ని వర్ణిస్తాడు అన్నమయ్య. సుగ్రీవుని యనుజ్ఞతో రాముడు పంపగా నంగదుడు మొదలగు వానరులు లంకకు వస్తారు రావణుడు నిర్విఘ్నంగా కొనసాగిస్తున్న పాతాళ హోమమనే యజ్ఞాన్ని ధ్వంసంచేసి హోమపాత్ర నగ్నిలోవేసివస్తారు. అంత పనిచేసిన యా వానరులు రావణునికూడా నాంగ్నిలో వేసి రానోపరా యన్న సంశయము కలుగవచ్చు ఆపని చేసి వుంటే రామసుగ్రీవుల మైత్రిచెడిపోతుంది రాముని శక్తి నవమాన పరచి నట్లవుతుంది. వాళ్ళంతటి స్వతంత్రులు కారని "తమసత్వ....." అని యంటాడన్నమయ్య. ఇందులో మిత్రధర్మం కనబడుతుంది.

పైకీర్తన మొదటి చరణంలోని భావాన్ని విస్తరించి సీతమ్మ పతిభక్తిని యతిశయం గావించి పల్కుతాడు త్యాగయ్య. ఈ క్రింది కీర్తనను చూడండి.

కాంభోజి — ఆదితాళం

పల్లవి

మా జానకిని చెట్ట బట్టగ మహరాజవైతివి ॥మా॥

అ. పల్లవి

రాజ రాజ వరరాజీవాక్ష విను
రావణారి యనిరాజిల్లు కీర్తియు ॥మా॥

చరణం

కానకేగి యాజ్ఞమీఱక మాయా
కార మునిచి శిఖిచెంతనే యుండి
దానవుని వెంటనె జని యశోక తరు
మూలనుండి

మీ సమస్యకు ఉత్తమ పరిష్కారం

# సామూహిక వివాహ పథకం

* * *

మీ బ్రతుకు బంగారుబాట కావాలా! అందుకు వివాహం ఒక సమస్యా? కావచ్చు. తరతరాలుగా ఎదుగూబొదుగూ తెలియని మన ఆర్థికవ్యవస్థలో, తమకో తమ వారికో వివాహం అనగానే అదొక సమస్యగా పరిణమించడం సహజం. లక్షాధికారులనుకూడా భిక్షాధికారులను చేయగల నిగూఢ సమస్య (మనకు తెలిసినవే) ఎన్నో ఇందులో ఉన్నాయి. మరి రెక్కాడినా డొక్కాడని వారి స్థితి! మనదేశంలో ఇలాంటి వారే ఎక్కువ. వీరి వివాహ సమస్యకు తిరుమల తిరుపతి దేవస్థానపు "ఉచిత సామూహిక వివాహపథకం" కల్పతరువులాంటిది.

## తరతమ భేదాలు లేకుండా అమలు జరిగే ఈ పథకం ముఖ్యాంశాలివి:

* హిందువులైన వారందరికీ ప్రాంతీయ, కుల, భాషాభేదాలు లేకుండా అందుబాటులో ఉంది.

* వివాహం హోమం - హోమంలేకుండా రెండు విధాలుగా జరుగుతుంది. వారి వారి సంప్రదాయాన్ననుసరించి జరుపుకోవచ్చు.

* తిరుమలకు రావటం అనేది తప్ప వధూవరులకు ఖర్చేమీ ఉండదు. ముఖ్యమైన సరంజామా అంటే మంటపాలంకరణ, మంగళవాద్యాలు, మట్టెలు, మంగళసూత్రాలు అన్ని దేవస్థానమే ఏర్పాటుచేస్తుంది.

* వధూవరులకు దేవస్థానమె రు. 175/– విలువ వస్త్రబహుమానం కూడా చేస్తుంది.

* ఈ వివాహం జరిగినట్లు ధ్రువపత్రం కూడా ఇస్తుంది.

## మీరు గమనించాల్సింది:

* దేవస్థానం శుభముహూర్తాల పట్టిక పత్రికలలో ప్రకటించిన నెలలోపుగా వధూవరులు, వారి తండ్రులు లేదా సంరక్షకులు తమకు వివాహం జరుపుకోగల లేక జరుపగల ఆర్థికస్థితి లేదనే ధ్రువపత్రంతోపాటు దేవస్థానం పత్రాలమీద దరఖాస్తులు పంపుకోవాలి. 18 ఏళ్ళకు పై బడినవారే అర్హులు.

* దేవస్థానం నిర్ణయించిన శుభముహూర్తానికి, దేవస్థానం నిర్ణయించిన రోజుకు ముందుగా తిరుమలచేరాలి.

* నిర్ణయించిన శుభముహూర్తానికి రాలేనివారు ఆ విషయం కనీసం **ఒక్క రోజు** ముందుగా దేవస్థానానికి తెల్పాలి.

* పొరపాటుగానైనా ముందుతెల్పటం మరచిపోతే, ఇక ఈ పథకంలో పాల్గొనే అవకాశం శాశ్వతంగా పోగొట్టుకుంటారు.

* ఇంకా మిగిలిన వివరాలకు ఈ క్రిందివారితో సంప్రదించండి:

రిసెప్షన్ ఆఫీసర్-II

**తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుమల.**

వాని మాటలకు కోపగించి కంట
వధించకనే యుండి
శ్రీనాయక యశము నీకే కల్గ
జేయలేదా త్యాగరాజ పరిపాల ॥ మా ॥

పల్లవిలోనే సీతమ్మను ఆకాశాని కెత్తుతాడు త్యాగయ్య. ఆమెను పెండ్లాడి నందువల్లే రాముడు మహారాజై నాడట. ఎలాఐనాడన్న విషయాన్ని అనుపల్లవి లోను, చరణంలోను చమత్కారంగా చెప్తాడు. "రావణారి" యన్న కీర్తిని రామునికి కల్గజేసింది సీతమ్మేనట. నిజమే కదా! రావణసంహారానికి కారణభూతు రాలు సీత. సీతాపహారణం లేకపోతే రామరావణ యుద్ధమెందుకు? అందుకే సీతమ్మ గొప్పదంటాడు త్యాగయ్య. పైగా నామె పతిభక్తిని చరణంలో మరీ విశదం చేస్తాడు.

సమస్తసుఖాలను త్యాగంచేసి సీత భర్తతో అడవికేగుతుంది. రావణుడు తన్నపహరించ వచ్చిన వేళలో తన స్వస్వ రూపాన్ని యగ్నిలోదాచి మాయా రూపంతో నతనితో వెళ్తుంది. * (ఈ విషయం వాల్మీకి రామాయణంలో లేదు) రావణుని దుర్భాషల నెంతో వోర్పుతో సహిస్తుంది. ఆమె మహాపతివ్రత. తాను తలచి వుంటే తన తీక్షణ దృక్కులతో రావణుని భస్మంచేసి యుండేది. కాని చేయలేదు. "రావణ సంహారి" యన్న బిరుదు రామునికే కలిగించాలని, యా పరమాత్ముని కంటే తానెక్కువకాదని మిన్నకుంటుంది. అటువంటి పుణ్యచరిత యైన సీతవలననే రాముడు గొప్ప వాడై నాడని చమత్కరిస్తాడు త్యాగయ్య. మీదు మిక్కిలి "మాజానకి" యని యా తల్లియందు తనకు గల చనువును వ్యక్తం చేస్తాడు.

త్యాగయ్య రామభక్త శిఖామణి. ఆ భగవంతుడు తన్నుద్ధరించుటకు దాసీనం వహిస్తే భక్తుని హృదయం బాధపడి "నీవు వినకపోతే మాయమ్మకు చెప్పు కుంటానులే" యని చిన్నపిల్లలు చెప్పి నట్లుంది. రాముని కంటే సీతమ్మను గొప్ప దని చెబితే కోపంతోనైనా రాముడు తన యెదుట పడతాడేమో యని యాభక్తుని యాశ. చతుర్విధ వుపాయాల్లో భేదాన్ని యీ విధంగా రామునిపై ప్రయోగిస్తాడు యీ కీర్తనలో త్యాగయ్య.

అన్నమయ్య త్యాగయ్య లిద్దఱును పరమ భాగవతోత్తములు. ఆ భగవంతుని గుణవిశేషముల నెన్ని విధముల కీర్తించినా వారియాశ తీరనిది. పైరెండు కీర్తనలలో అన్నమయ్య సీతాదుల శక్తిని, తమ యేలికయందు వారికున్న భక్తి విశ్వాసాలను వర్ణిస్తాడు; అందరినీ వదిలేసి వొక్క సీతమ్మే గొప్పదని వర్ణిస్తాడు త్యాగయ్య. భావవ్యక్తీకరణంలో వేరు వేరు మార్గాన పయనించినా వారి గమ్యమొక్కటే. అది యాదేవదేవుని సాన్నిధ్యాన్ని చేరు కోవడం.

*

"త్యాగరాజ కీర్తనలు" శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రి; సం. పా. విస్సా అప్పారావు ఆంధ్రగాన కళాపరిషత్తు, రాజమహేంద్రవరము, 1948. పుట 468–469.

(16వ పేజీ తరువాయి)

భగవద్రామానుజ శ్రీభాష్యమందును— "తదిదం స్వాభావిక మేవరూప ముపాసకానుగ్రహేణ తత్ప్రతిపత్త్యనుగుణాకారం దేవమనుష్యాదిసంస్థానం కరోతి స్వేచ్ఛయైవ పరమకారుణికో భగవాన్" పరమ దయాళువగు భగవానుడు స్వాభావికమగు రూపమును భక్తుల ననుగ్రహింప వారి వారి యుపాసనానుగుణముగ దేవమానవాద్యాకారములను తన యిచ్ఛనుబట్టి కలుగజేయుచున్నాడు.

సామవేదంలో అగ్నివేశ్యశాఖయందు భగవన్మధ్వభాష్యమున 'ఉపాస్యతాం శ్రియమవ్యక్తసంజ్ఞాంమర్త్యోముచ్యతేసర్వబన్ధైః' మనుజుడు భక్తిచే అవ్యక్తమను పేరుగల యా శ్రీదేవిని ఉపాసించిన సర్వబంధములనుండి విముక్తుడగుచున్నాడు.

ఉపాసనయన్నప్పుడే చేయువారు, చేయించుకొనువారు నుండవలెను. సూపదేశముగ నా పరతత్త్వము నుద్ఘోషించు ఆగమములును,

"తస్మాద్విద్వానుపాసీత బుద్ధ్యాసాకారమేవతమ్ ఇతిశ్రీ వైఖానసాగమే"

"యుష్మాకం ప్రీతయేఽహం వై బింబరూపం
సమాస్థితః ఇతిశ్రీ పాంచరాత్రాగమే"

"మమ లింగం భవేదిదం తదిదమ్
నిత్య మభ్యర్చ్యమ్ ఇతిశ్రీశైవ
స్మార్తాగమయోః"

వీటి తాత్పర్యం లోపల బైట అంతటా నిండియున్న విగ్రహముద్వారా నుపాసించవలెననియు, భక్తజనావళి ప్రీతికొరకు బింబమందు వేంచేయుదుననియు, నా శివలింగము మీకు నిత్య పూజాయోగ్యమని ఆగమములు అనుగ్రహించినవి.

ఇట్లున్నను ఇతరమతస్థులు దేశస్థులలో కొందరు దేవుని ధ్యానిస్తే చాలునంటారు. గీతార్థసంగ్రహరక్షయందు "స్నేహపూర్వమనుధ్యానం భక్తిరిత్యభిధీయతే" భగవత్స్నేహపూర్వకప్రీతి అంటే భక్తిస్వరూపం ధ్యానశబ్దముతో చెప్పబడినది. "భక్తియోగే అర్చనం ప్రధానమ్" భక్తియోగములందు విగ్రహారాధన ప్రధానమని ఉత్తమబ్రహ్మవిద్యాసారమందు దెలియబడుచున్నది. కేవలం వేదాన్తవాక్యార్థ జ్ఞానమేగాక ధ్యానరూపోపాసనమగు జ్ఞానవిశేషముచే గూడిన భగవదారాధనయే అస్థిరమగు స్వర్గాదులందుగాక జీవులు నిత్య నిరతిశయశాశ్వతపరమపదము నొందుటకు ఉపాయమనుట సాహసముకాదు.

వ్యాసర్షికృత బ్రహ్మసూత్రము "తదోకో గ్రజ్వలనం తత్ప్రకాశితద్వారా విద్యాసామర్థ్యాత, చ్ఛేషగత్యనుస్మృతియోగాచ్ఛ హార్దానుగ్రహీత శ్శతాధికతయా" ఈ సూత్రమునకు లక్ష్మీవిశిష్టాద్వైతమైన వేదాన్తదేశిక శ్రీ శ్రీనివాసదీక్షిత భాష్యమందు ఇట్లు వ్యాఖ్యానింపబడినది. "తదారాధనశేముష్యా తదంగస్మరణేన చ ప్రీతేన వేంకటేశేన జీవోనుగ్రహవాంస్తయా తత్ప్రకాశిత తద్ద్వారా నాడ్యా తమధిగచ్ఛతి. భగవదారాధనరూపవిద్యాసామర్థ్యాత్ విద్యాంగభూతతయాత్మనో గత్యనుస్మరణాచ్చ ప్రీతేన కృపాపయోనిధినావినత జనవిహిత సౌహార్దేన కమలాకర కమలాలాలితపదనళినేన- శ్రీవేంకటేశేనానుగ్రహీతో విద్వాక జీవోథభగవత్ప్రసాద ప్రకాశితతద్ద్వారా మూర్ధన్య సంజ్ఞానాం నాడీః విజ్ఞాయ తయా పరమప్రాప్యం తమేవ ప్రాప్నోతీతి సూత్రార్థస్తు విద్యాసామర్థ్యాత్ తచ్ఛేషభూతగత్యనుస్మృత్యా చ ప్రసన్నేనహార్దేనానుగృహీతః హృదయస్థితేన పరమాత్మనా స్వానుగ్రహపాత్రీకృతః తత్ప్రకాశితద్వారః పరమపురుష ప్రసాదప్రకాశితద్వారః జీవః శతాధికతయా మూర్ధన్యయా నాడ్యాగచ్ఛతి తదేకోగ్రజ్వలనంతస్య జీవస్యోకఃస్థానమ్. అగ్రజ్వలనం తత్ప్రసాదాదేవాగ్రే ప్రకాశవద్భవతీతి"

యెక్కువ మూలమే వ్రాయబడినది. దీని తాత్పర్యము సంక్షిప్తముగ మోక్షార్హుడగు జీవుడు ఉపసంహరింపబడిన వాగాది యింద్రియములు గలవాడగును. జీవునివాసస్థానముగల సుషుమ్నానాడీ మార్గమున భావిదేహస్ఫురము కల్గును. హృదయభగవానునిచేత నిష్క్రమణద్వారము ప్రకాశితమగును. ఉపాసకుడు తనచే నుపాసింపబడిన సాకారపరమాత్మచేత అనుగ్రహింపబడి ఆ పరమాత్మ ఆరాధనాప్రభావము వలన దేవయానమార్గమున నూటికంటే తరువాతిదియైన బ్రహ్మనాడీద్వారమున మూర్ధస్థానమునుండి శరీరమువీడి అప్రాకృతదివ్యదేహముతో పరమపురుషుడైన శ్రీమన్నారాయణునితో పరమసామ్యము నొందును. 'తద్భిన్నత్వేసతి తద్గతభూయోధర్మవత్వం సామ్యం' వేరువేరుగనుండి ననే సామ్యము సంభవించును. చేతనుడు పరమచేతనుడు అను రెండు విధముల అంగీకరించినవే. "సామ్యముపైతి"యను శృతి సంగతంబగును. మతాంతరులు పాషాణకల్పతైవముక్తిః యనియు ఆత్యన్తిక దుఃఖధ్వంసమే మోక్షమనియు కొందరివాదనలు. "నిత్యకైంకర్యముగావించుటయే మోక్షసామ్యమని మరికొందరు. పరమపదమను విషయమున అనేకవిషయములందు భిన్నాభిప్రాయములు గలవు.

(సశేషము)

# పురాణములు-వాని విభజనము

(గతసంచిక తరువాయి)

### ప్రాశస్త్యము

బ్రహ్మసూత్ర ఉపనిషద్భగవద్గీత లని యెడి ప్రస్థానత్రయముతోపాటు ప్రస్థాన చతుష్టయమని ప్రశంసింపబడిన భాగవత పురాణప్రాశస్త్యమును -

" యత్రాధికృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మ
విస్తరః,
వృత్రాసురవధశ్చాపి తత్తద్భాగవతం విదుః"

( గాయత్రి నధికరించి, ధర్మవిస్తరము వృత్రాసురవధయు నెందుచెప్పబడునో అది భాగవతము) అని మత్స్యపురాణము పొగడగా, ముముక్షువగు పరీక్షిత్తునకు వ్యాస మహర్షి తనయుడగు శుకయోగీంద్రునిచే బోధింపబడిన దనియు, సర్వపురాణముల యందు నుత్కృష్టమైనదనియు, సమస్త ఉపనిషత్తుల్యమైనదనియు దీని మాహాత్మ్యము స్కాంద పద్మ కూర్మపురాణాదుల చేత ప్రస్తుతింపబడినది. వేదాంతశ్రవణ, భగవద్గీతాపారాయణములచేత గూడ లభింపని భక్తిజ్ఞాన వైరాగ్యములు భాగవత శ్రవణమువలన లభించునని పెద్దలిట్లను చున్నారు.

" నిగమములు వేయుచదివిన
సుగమంబులుగావు ముక్తిసుభగత్వంబున్
సుగమంబు భాగవతమను
నిగమంబు పఠింప ముక్తి నివసనము బుధా"
(1-139)

భాగవతపఠనముచేత పునర్జన్మము సిద్ధింపదనెడి నారదమహర్షి మాట నరయుడు. ''నిర్గతకర్మంబై నిరుపాధికంబైన జ్ఞానంబు హరిభక్తిలేకున్న శోభితంబుగాదు. ఫలంబుగోరక కర్మంబీశ్వరునకు సమర్పణము సేయకున్న నది ప్రశస్తంబై యుండదు. భక్తిహీనంబులైన జ్ఞాన వాచాకర్మ కౌశలంబులు నిరర్థకంబులు గావున......నిఖిలబంధమోక్షంబుకొఱకు వాసుదేవుని లీలావిశేషంబులు భక్తితోడ నభివర్ణింపుము." - ఈ వాక్యమును బట్టి చూడ భాగవతము భక్తియోగమహిమను వెల్లడించి తన్మూలమున ఈశ్వరసాక్షాత్కార సాధనత్వమును నిరూపింప జన్మించినదని తెలియుచున్నది.

భాగవత తత్త్వమును భాగవతము గావించుకొనుట భక్తులకు మాత్రమే సాధ్యము. 'భాగవతము' అనెడి పంచాక్షర ములకు భ = భక్తి, గ = జ్ఞానము, వ = వైరాగ్యము, త = తత్త్వము, ము = ముక్తి అను సంకేతము కలదని తెలుగునాట ప్రచారము నందున్నది. భాగవతము కోరిన కోర్కెల నీడేర్చు కల్పవృక్షము వంటిదని పోతనాచార్యు డిట్లు ప్రశంసించినాడు.

" లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభి రామంబు, మంజులతా శోభితమున్, సువర్ణ సుమన స్సుజ్ఞేయమున్, సుందరోజ్జ్వల వృత్తంబు, మహాఫలంబు, విమల వ్యాసాల వాలంబునై వెలయున్



భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్ద్విజ శ్రేయమై "-(1-20) వాఙ్మయమున 'భగవత్' శబ్దముతో కూడిన గ్రంథములు రెండు మాత్రమే గలవు. 1. భగవద్గీత 2. భాగవతము. భగవద్గీత భగవంతునిచే చెప్పబడినది. భాగవతము భగవంతుని గూర్చి చెప్పునది కాగా, భగవద్గీత లక్షణము. భాగవతము లక్ష్యమునవి పెద్దల మాట.

భాగవతము పరమార్థము ఆత్మ తత్త్వ నిరూపణమే. పరమేశ్వరుడు నిత్య పరిపూర్ణుడు, నిరాకారుడు, సచ్చిదానందస్వరూపుడు, స్వపరభేద విరహితుడు. ఈ చరాచర ప్రపంచమంతయు ఆతనియందే పుట్టి పెరిగి లీనమగు చున్నది. జగన్నాటక సూత్రధారియగు భగవానుడు ఈ జగత్తుతో క్రీడించుచున్నాడు. ఇది యాతని లీల. సర్వాప్త కాముడగు పరమాత్ముడు నిరంతర మీ సృష్టి వ్యాపారమున నిమగ్నుడగుట యెందులకనియు, అతని కీ సృష్టి వలన ప్రయోజన మేమనియు, అనుమానము కలుగవచ్చును. కాని భగవంతుని కిది యంతయు వినోదము. ఈ సమస్త ప్రపంచము అతనికి ఆనందమగు నొక వేడుకయై యుండనోపును. సుఖ దుఃఖలకు నిలయమైన యీ ప్రపంచము జీవున కొక నాటకరంగము. భగవానుడు సూత్రధారుడు. అతడు మనల నాడించుచు వినోదించుచున్నాడు. జీవుడు యథార్థమగు పరమేశ్వరా భిన్నుడయ్యు మాయామోహితుడై అనాత్మ పదార్థమగు దేహాదికము నందు ఆత్మ భ్రాంతి నొంది సంసారసాగరమున మునిగి జనన మరణచక్రమున తగుల్కొని దుఃఖభాజను డగుచున్నాడు.

శ్రీ డి. నాగసిద్దారెడ్డి,
తిరుపతి.

## రచయితలకు
## చిత్రకారులకు
## విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రికకు మత ధార్మిక సంబంధమైన రచనలు, వ్యాసములు, గేయములు, చిత్రములు, ఛాయా (వర్ణ) చిత్రములు పత్రికలో ప్రచురణకు గాను కోర బడుచున్నవి. రచయితలు, చిత్రకారులు ఈ క్రింది విషయములు గమనించవలెను.

*

1. రచనలు చేయువారు 6 అరఠావు పేజీలకు మించకుండా, పేజీలకు ఒక వైపుననే వ్రాసి పంపవలెను. వాటికి సంబంధించిన ఛాయా చిత్రములను కూడ పంపగోరెదము.

*

2. చిత్రములు వేయువారు ఇండియన్ ఇంకుతో వేసి పంపవలెను.

*

3. ఛాయాచిత్రములుపంపువారు చిత్రములలోని వివరములు నిర్దుష్టంగా వ్రాసిపంపవలెను.

4 ప్రచురితమైన వాటికి ఎట్టిపారితోషికము ఈయబడదని గమనింప ప్రార్థన

— సంపాదకుడు,
సప్తగిరి

ఆత్మతత్త్వము ఈశ్వర తత్త్వముతో నభిన్నమని అతడెప్పుడు గ్రహించునో అప్పుడే ముక్తుడగును. ఇట్టి పరమార్థ జ్ఞానము ముక్తిహేతువని భాగవతము నిరూపించుచున్నది. జీవుడు తాను దేహమని భావించుటయే బంధము. తాను పరమాత్మ స్వరూపమని తెలియుటయే ముక్తి జ్ఞానము ముక్తి కారణమనియు, బంధమసత్యమనియు. భాగవతమునందలి విదుర మైత్రేయ సంవాదము వలన స్పష్టముగ నెఱుగ నగును. జీవుడు - ఈశ్వరుడు బ్రహ్మ స్వరూపులేయైనను జీవుడు అనాత్మయం దాత్మ భావనవలన సంసారియైనాడు. ఈశ్వరున కట్టి భావము లేదు. కావున సంసారాది బంధముల కతడతీతుడు. లేనిది యున్నట్లు భాసించుట మాయ. ఆ మాయ ఈశ్వరాధీనము. జీవుడు మాయకులోబడిన వాడు. కావున జీవుడు ఈశ్వరానుగ్రహము నందుటకు భాగవతము నాశ్రయింపవలెను. దానిచే ఆత్మజ్ఞాన మోక్షము లతనికి సిద్ధించును.

ఇట్టి భాగవతము అఖండ నిర్గుణ పరబ్రహ్మమును శ్రీకృష్ణ పరమాత్మ స్వరూపమున సగుణముగ వర్ణించి మానవులకు భక్తిజ్ఞాన వైరాగ్యములు కల్గుటకు కారణమగుచున్నది.

"ఏ కథల యందు పుణ్య
శ్లోకుడు హరి చెప్పబడును సూరిజనులచే
ఆ కథలు పుణ్య కథలని" —

పెద్ద లా కర్ణింతురో
అట్టి —

"అతి రహస్యమైన హరిజన్మ కథనంబు
మనుజు డెవ్వడేని మాపు రేపు
చాల భక్తితోడ చదువుత సంసార
దుఃఖరాశి బాసి తొలగిపోవు" — ననియు

ఇందు హరిచరిత్రములే వర్ణితములైనను ఇందలి విజ్ఞానమంతయు వేద వేదాంతముల లోనిదే కావున —

"వేద కల్పవృక్ష విగళితమయి శుక
ముఖ సుధా ద్రవమున మొనసియున్న
భాగవత పురాణ ఫల రసాస్వాదన
పదవి గనుడు రసిక భావ విదులు" —

అనియు, భాగవత ముపదేశించు చున్నది.

భాగవతమునకు 'హయగ్రీవ బ్రహ్మ విద్య' అను ప్రశస్తి కలదు. పరమేశ్వరుడు ఆత్మ తత్త్వమును హయగ్రీవుడై బ్రహ్మదేవున కిట్లు నాల్గుశ్లోకములలో నుపదేశించెనట.

ఎ) "అహమేవాసమేకోఽగ్రే నాన్యద్యత్సదసత్పరం।
పశ్చాదహం యదేతచ్చయోఽవశిష్యేత సోఽస్మ్యహమ్॥

బి) ఋతేఽర్థం యత్ప్రతీయేత నప్రతీయేత చాత్మని।
తద్విద్యా దాత్మనోమాయాం యథాభాసో యథాతమః॥

సి) యథామహాంతి భూతాని భూతేషూచ్చావచేష్వను।
ప్రవిష్టాన్య ప్రవిష్టానితథాతేషు నతేష్వహమ్॥

డి) ఏతావదేవ జిజ్ఞాస్యం తత్త్వజిజ్ఞాసునాఽఽత్మనః।
అన్వయ వ్యతిరేకాభ్యాం యత్స్యాత్సర్వత్ర సర్వదా॥" —
(భాగ—2—93—36)

(సృష్టికి పూర్వము నేనొక్కడనే యుంటిని. స్థూల సూక్ష్మ ప్రపంచములు గాని, వానికి కారణమగు ప్రకృతి గాని, వేరొకటి నా కంటె భిన్నమైన దీషన్మాత్రమును లేదు. సృష్టి యనంతర మీ విశ్వమంతయునేనే. ప్రళయానంతరము మిగులునది కూడ నేనే. ద్విచంద్రాదికమువలె లేని యర్థము భాసించుటకు, గ్రహమండల గతుడైన రాహువువలె ఉన్న యర్థము తోచక పోవుటకు, కారణము నా మాయ

యని తెలియుము. మహాభూతములు భౌతిక పదార్థములయందు ప్రవిష్టములైనను ప్రవిష్టములై తోచుచున్నట్లు భూత భౌతిక పదార్థముల యందు నేనుంటిని. తత్త్వ జిజ్ఞాసువగువాడు అన్వయ వ్యతిరేకముల చేత నెల్ల చోటుల నెల్ల కాలముల నేది యుండునో అదియే ఆత్మ స్వరూపమని తెలియవలయును. అన్వయమనగా కార్యముల యందు కారణరూపమున ననువర్తనము. వ్యతిరేక మనగా కారణావస్థ యందు వానికంటె వ్యతిరేకముగనుండుట. ఇట్లే జాగ్రదాద్యవస్థాత్రయము నందు సాక్షిరూపమున ననువర్తనము. సమాధ్యాదుల యందు జాగ్రదాదులకంటె వ్యతిరేకముగ నుండుట వ్యతిరేకము) చతుశ్శ్లోక పరిమితమైన యీ సంగ్రహ భాగవతమును బ్రహ్మ నారదునకు. అతడు వ్యాసునకు నుపదేశించిరట. ఈ శ్లోకములను బట్టి చూడ భాగవత మద్వైత సిద్ధాంతమును ప్రబోధించు చున్నదని చెప్పవచ్చును. అద్వైత తత్త్వము సత్యము. అదియే యేకమై అద్వితీయమైన పరమార్థమగును. ఆ పరమార్థమును జ్ఞానులు బ్రహ్మమనియు యోగులు పరమాత్మయనియు, భక్తులు భగవంతుడనియు నామకరణ మొనర్చి పిలుచుచున్నారు. ఆ బ్రహ్మము సత్త్వగుణస్వరూపియై అవచ్ఛిన్నుడై నపుడు సగుణుడని వ్యవహరింపబడును. అతడే భగవంతుడు. ఆ నిర్గుణ పరబ్రహ్మమే బ్రహ్మ విష్ణు. రుద్ర, భేదములతో రూపధారణ మొనర్చి సృష్టి స్థితి లయములకు కారణభూతమగు చున్నది. జగద్వ్యాపారాదులకై యీ పరబ్రహ్మము భిన్న భిన్న అవతారముల నెత్తుచున్నది. అందు మొదటి అవతారము పురుషుడు. ఇతని నుండి పురుష, కౌమార, వరాహ, నారద, నర నారాయణ, కపిల, దత్తాత్రేయ. సుయజ్ఞ, ఋషభ, పృథు, మత్స్య, కూర్మ, ధన్వంతరి మోహిని, నారసింహ, వామన, పరశురామ శ్రీరామ, వ్యాస, బలరామ, శ్రీకృష్ణ, బుద్ధ, కల్కి, హంస, హయగ్రీవ, నారాయణ అను అవతారము లుదయించినవి. భాగవత మీ యవతారము లన్నిటిని ప్రశంసించి నను ప్రధానముగ శ్రీకృష్ణ, పరమాత్మకే ప్రత్యేక స్థానము నొసగి ప్రస్తుతించినది.

భాగవతమునకు సాత్త్వత సంహిత, మోక్షశాస్త్రము ననియు పేర్లు గలవు.

'అనర్థోపశమం సాక్షాత్ భక్తియోగమధోక్షజే।
లోకస్యా జానతో విద్వాం శ్చక్రే సాత్త్వత సంహితామ్ ॥' —

(అనర్థ నివారణోపాయమగు భగవంతుని యందలి భక్తియోగమును సాత్త్వత సంహితారూపమున విద్వాంసుడు అజ్ఞానియగు లోకము కొఱకు నిర్మించెను.) అని భాగవత వాక్యము.

"తస్మాదేకేన మనసా భగవాన్ సాత్త్వతాం పతిః।
శ్రోతవ్యః కీర్తిత వ్యశ్చ ధ్యేయః పూజ్యశ్చ నిత్యశః ॥" —

అని భగవంతుడు భాగవతమున సాత్త్వత పతిగ పేర్కొనబడినాడు. సత్ శబ్దమునకు సత్వమూర్తియగు భగవాను డనియు. ఆయన నుపాసించువారు సత్త్వంతులు లేక భక్తులు అనియు, సత్త్వంతుల నుద్ధరించువాడగుటచేత సాత్త్వతపతి యనియు దీనికి శ్రీధరపండితులిట్లు వ్యాఖ్యానమొనర్చి యున్నాడు.

"సచ్ఛబ్దేన సత్త్వమూర్తి ర్భగవానభిధీయతే సఉపాస్యతయా విద్యతేయేషామితి. సత్త్వంతో భక్తాః తతః స్వార్థేఽణ్. రాక్షస వాయసాదివత్. తస్యచా శ్రవణ మార్షం, తదేవం సాత్త్వత ఇతి భవతి. తేషాం పతిః పాలకః" — భాగవతమున సాత్త్వత శబ్దముకన్న భాగవత శబ్దమే అధిక ప్రచారము నందియున్న దనుటయు నిర్వివాదము —

(సశేషము)

---

(11వ పుట తరువాయి)

లకు కూడ బహుముఖమై తెలియు అర్థ వివరణమిది పండిత పామర రంజకమైనది. దీనిని విన్న తక్షణమే ఎల్లరికి, మోక్ష మందాశ పుట్టును. ఆశయుండిన, తానే ప్రవృత్తిసాధన, ప్రయత్నములంతయును. ఈ విధముగా మోక్షము సుఖ స్వరూపమై, నిత్యమై సర్వదా లభించు పరమ పురుషుని సాన్నిధ్యమని తెలియదగును.

ఇతరములైన దర్శనములకు వేరైన విశిష్టాద్వైత సిద్ధాంతమందలి ముఖ్య లక్షణములేవి యనగా:- శరీర శరీరి భావము శేష శేషి భావము, ఆధారాధేయ భావము, కార్యకారణ భావము, ఈశ్వర ఈశితవ్య భావము స్వామి దాస్యభావము, అనునవి. ఈ భావము లన్నింటిని వేదాంత దేశికులు చాల చక్కగా అర్థవంతమగు శైలిలో పరిష్కరించి నిరూపించియున్నారు. ఈ భావములను బహు సూక్ష్మముగా ఇక్కడ సంగ్రహింప ప్రయత్నింతును.

శరీర — శరీరి భావము:— పరబ్రహ్మయు, జగత్తును పరస్పరావలంబమున వ్యవస్థిత దేహము వలెనే మొత్తము మీద ఒక్కటిగా చేరి పనిచేయుట యనునది సత్యమైన విషయము. జగత్తులోని సకల చిదచిద్రూపాది వస్తువులు స్వామియొక్క శరీరము. పరమాత్ముడు శరీరి. ఆత్మయు దీనియందే చేరును. ఇది వేరైయుండుట సాధ్యము కాదు. "యస్యపృథివీ శరీరం యస్యావశ్శరీరం, యస్యసర్వాణి భూతాని శరీరం" మొదలైన శ్రుతి ప్రమాణములతో సమస్త చేతనా చేతనములు స్వామికి శరీరము. "ఐతదాత్మ్య మిదం సర్వం" అనురీతిగా ఈశ్వరుడు శరీరియై వీని అంతటికి ఆత్మయై యుండువాడు. భగవంతుడు సర్వశబ్దవాచ్యుడని వెనుకనే చెప్పితిమి. సర్వశబ్ద వాచ్యుడనగా సర్వశబ్దములును స్వామిని బోధించునని భావనము. ఘటపట దేవపశువృక్షాది శబ్దములన్నియు స్వామియొక్క శరీరమై అతనికి విశేషములై యున్నవి. విశేషణార్థములన్నియు విశేషమందు అన్వయమగుచుండుటచే శరీర వాచక శబ్దములన్నియు శరీరియైన స్వామి యందు అన్వయించుచున్నవి. (సశేషము)

(10వ పేజీ తరువాయి)

తరువాతి ఘట్టము. ఆంజనేయ ముఖముగా భూపుత్రి తన శిరోరత్నమును శ్రీరామునకు సమర్పించుట. దీనివలన ఆచార్యముఖముగా చేతనుడు తన ఆత్మను భగవంతునకు సమర్పించవలెనను విషయము గమనార్హము.

"రామచంద్రస్వామి రాగలడు రక్షించగలడు" అను విశ్వాసముగల సీత అధ్యవసాయముచే 'కృతకృత్యాః ప్రతీక్ష్యన్తే మృత్యుం ప్రియమివాతిథిమ్' అను రీతి శరీరావసాన కాలమువరకును భగవత్కటాక్షము కొరకై చేతనుడు నిరీక్షించవలెనని తేలినది.

అనంతరము గణించ తగినది అంజనీ సూనుడు అశోకవనమును నిర్మూలించుట. దీనివలన

"అనాత్మ న్యాత్మబుద్ధిర్యా అస్వేస్వమితి యామతిః
అవిద్యాతరు సంభూతిర్బీజమేతద్ద్విధాస్థితమ్"

అనురీతి అహంకార మమకారములనే ద్విదళములతో గూడిన బీజమే మూలముగా గల అవిద్యాతరువును నిర్మూలించువాడు ఆచార్యుడే అనునది తేటతెల్లము.

దుష్టుడైన రావణునిచూచి తన వృత్తాంతమును చెప్పెడి తలంపుతో. వినిన యెడల బాగుపరచవలెనను అభిప్రాయముతో, మారుతి బ్రహ్మాస్త్రముచే కట్టుబడినట్లు ఇంద్రజిదాదులకు భ్రాంతి కల్గించినాడు. అట్లే ఆచార్యుడుకూడ చేతనోద్ధరణకై తాను సంసారబంధముచే కట్టుబడినట్లు నటించును.

పావని రావణున కాశ్రయమైన లంకను గాల్చుట. లంకయనగా శరీరము లేదా ప్రకృతియని చెప్పికొంటిమి గదా శరీరము లేదా ప్రకృతియందలి భ్రమను నశింపజేయుట. ఇంకొక తీరున ఆలోచించ ఆచార్యుడు విరోధి స్వరూపమగు అన్యశేషత్వమును దహించి వేయుట యని తెలియుచున్నది.

చివరి ఘట్టము అంజనీపుత్రుడు సీత అధ్యవసాయము (రాముని చేరవలెనను కోరిక)ను శ్రీరామునకు నివేదించుట ఈ ఘట్టము వలన ముముక్షువునకు భగవత్ప్రాప్తియందుగల త్వరను ఆచార్యుడు భగవంతునకు విన్నవించునని విశదమైనది.

విశిష్టాద్వైతపరముగా ఆచార్య కర్తవ్యము, చేతనోద్ధరణము మున్నగువాని తెల్పు ఈ సుందర కాండను సప్తసర్గగా, శ్లోక సంపుటీకరణగా నిత్యము పారాయణముచేసి లాభములు పొందినవారెందరో కలరు. అట్లే ముందు ముందును పఠించి వాంఛితార్థముల పొందగలరని తలంచుచున్నాను.

*



తిరుచానూరులో, ప్లవోత్సవమునందు దేవేరులతో సుందరరాజస్వామివారు.

( 6వ పేజీ తరువాయి )
ధ్యకు తిరిగివచ్చు భరతుని కవి ఈ విధముగా చిత్రించెను.

"ముని మహిసుర గురు భరతభుఆలు।
రామవిరహం సబసాజుబిహాలు ॥
ప్రభుగున గ్రామగనత మనమాహి।
సబచుపచాప చలే మగజాహి ॥"
(అయోధ్యకాండ దోహ 321 చౌ 1)

—మునులు, బ్రాహ్మణులు, వశిష్ఠుడు, భరతుడు, జనకమహారాజు మొదలగు వారందరు శ్రీరామచంద్రుని ఎడబాటుచే విహ్వలులగుచున్నారు. ప్రభువుయొక్క గుణసమూహమును మనస్సులో స్మరించుచు అందరు మౌనముగా నడచుచున్నారు. భరతుడు చిత్రకూటపర్వతమునకు వెళ్ళునప్పుడును తులసీదాసు ఈవిధముగావర్ణించును.

"నిజగున సహిత రామ గునగాథా।
సునతజాహి సుమిరత రఘునాథా॥"

— తన గుణములతోబాటు శ్రీరామునిగుణగాథలనువినుచూ శ్రీరఘునందనుని స్మరించుచూ భరతుడు వెడలుచుండెను.

ఈ విధముగా శ్రీరామచంద్రుని ఎడబాటులో భరతుడు ఏ విధముగా తనప్రభువుయొక్క గుణస్వభావాదులను స్మరించుచు సమయమును గడిపెడువాడో అనుదానికి ఎన్నియో ఉదాహరణలు మనకు తులసీ రామాయణములో కనుపించును:

## పాదసేవనభక్తి

భగవంతుని దివ్యచరణారవిందములను గాని, చరణరజమునుగాని, చరణపాదుకలనుగాని శ్రద్ధాపూర్వకముగా సేవించుట లేక మనస్సుని లగ్నముచేయుటయే పాదసేవనభక్తి అనబడును.

పాదసేవనభక్తికి భరతునకు భరతుడే సాటి. సాధారణముగా భక్తుడు తనఅనన్యభక్తితో స్వామి చరణకమలములను పూజించుచు, సేవించుచుప్రణమిల్లును. కాని భరతుడు తన స్వామి చరణపాదుకలనే ప్రభుచరణములుగానెంచి వాటిని సింహాసనమున అధిష్టింపచేసి, భక్తిశ్రద్ధలనుచూపుచు, వాటినే సేవించుచు శ్రీరామునిరాకకై ఎదురుచూచు చుండును.

అయోధ్యనుండి చిత్రకూటపర్వతమునకు వచ్చు మార్గములో ఎక్కడెక్కడ రాముని చరణచిహ్నములు కనుపించునో ఆ పాదధూళిని తన శిరస్సునధరించి శ్రీరఘునాథుని పొందినట్లే భరతుడు తన్మయుడగును. ఆ ఘట్టమును తులసీదాసు ఈ విధముగా వర్ణించెను. "చరనరజ ఆంఖిన్‌హ లాయి, బనయి న కహత్ ప్రీతి అధికాయి" శ్రీరాముడు విశ్రమించిన అశోకవృక్షముదగ్గరకు భరతుడువెడలును ఆదరపూర్వకముగా ఆ ప్రదేశమునకు నమస్కరించును. రాముని చరణచిహ్నధూళిని కళ్ళకు అద్దుకొనును —

"హరషహి రామపద అంకా।
మానహుపారసు పాయవు అంకా॥
రజశిర ధరహియ నయనన్ హిలావహి।
రఘువరమిలన సరిస సుఖపావహి॥

— శ్రీరామచంద్రుని చరణచిహ్నములను చూచి భరతశత్రుఘ్ను లిద్దరు దరిద్రునకు మహాపెన్నిధి లభించినట్లుగా అమితానందము నొందిరి, అచ్చటి రజమును హృదయమునకు, కళ్ళకు అద్దుకొని శిరస్సున ధరించిరి. శ్రీరాముని కలుసుకొనినట్లే సంతోషించిరి.

భరతుడు ఎంత నచ్చచెప్పినను శ్రీరాముడు అయోధ్యకు తిరిగివచ్చుటకు అంగీకరించడు. భరతునికోరికమీద శ్రీరాముడు తన పాదుకలను యిచ్చును. ఆ పాదుకలను తన శిరస్సునందుంచుకుని అయోధ్యకు పయనమగును.

"ప్రభు కరికృపా పావరి దీన్‌హ, సాదర భరతసీస ధిరిలీన్‌హ"
(అయోధ్యకాండ దోహ 315 చౌ 2)

— భరతునియొక్క ప్రేమకు వశీభూతుడయి శ్రీరాముడు కృపతో తన పాదుకలను యిచ్చెను. భరతుడు ఆదరపూర్వకముగా వాటిని తనశిరస్సున ధరించెను. ఈ విధముగా ప్రభుచరణపాదుకలను ప్రభుచరణములుగా తలచి సేవించునట్టి భక్తుని గాథ మరి ఏ ఇతర పురాణేతిహాసము లందు కానరాదు.

## అర్చనభక్తి

భగవంతుని అర్చాస్వరూపమును భక్తుడు భక్తిప్రపత్తులతో నిత్యము పూజించును. ఇదే అర్చనభక్తి అనబడును. మానసికమైన అర్చనలో బాహ్యములైన ఉపచారములు ఆవశ్యకములు కావు కాని స్థూలరూపమైన పూజలో అనేక ఉపచారములు అవసరములై ఉండును. అర్ఘ్యము, పాద్యము, ఆచమనీయము, స్నానము



కోణార్క రథచక్రము

ఫొటో: డి. కె. కె. చౌదరి, సి. పూర్ణచంద్, తిరుపతి.

వస్త్రములు, ఊర్ధ్వపుండ్రములు, చందనము, పుష్పములు, ధూపము-దీపము, నైవేద్యము, తాంబూలాది షోడశోపచారములతో అర్చనభక్తి నిర్వచింపబడినది.

భరతుడు నందిగ్రామమునకు వచ్చిన తరువాత రాముని పాదుకలను సింహాసనమున అధిష్ఠింపచేసి నిత్యము వాటినిపూజించెడివాడు.

"నితపూజత ప్రభుపావరీ ప్రీతిన హృదయ సమాతి।
మాగిమాగి ఆయసు కరత రాజకాజ బహు భాంతి॥"
(అయోధ్యకాండ దోహ 325)

— భరతుడు నిత్యము ప్రభుపాదుకలను పూజించెడివాడు హృదయము ప్రేమతో నిండెడిది. పాదుకలఆజ్ఞను మరల మరల అడిగి రాజ్యకార్యములను చక్కపెట్టెడివాడు.

## వందనభక్తి

భగవంతుని మహిమలను మనస్సులో ధారణచేసి ఆ పరమాత్మను స్తుతించుచు, వినయుడై ఆతనికి ప్రణామము గావించుటయే వందనభక్తి.

అనన్యభక్తుడయిన భరతునిలో వందన భక్తి అపారముగా కనిపించును. చిత్రకూటపర్వతమునందు వల్కలధారియై జడలుధరించి ధనుర్బాణములను ధరించియున్న శ్రీరామచంద్రుని దర్శనమాత్రముచే భరతుడు హర్షాతిశయముతో తన్ను తాను మరచి "హే నాథా! హే స్వామి! రక్షించు" అనుచు శ్రీరాముని కాళ్ళపై పడును.

"కహత సప్రేమనాయి మహి మాథా భరతకరత ప్రనామ రఘునాథా" అన్నకు నమస్కరించిన తరువాత భరతుడు తన వదినపాదాలకు కూడ అతిభక్తితో నమస్కరించును. సీతాదేవి అతనిని ఆశీర్వదించి లేవదీయును.

పదునాలుగు సంవత్సరముల వనవాసము పూర్తిఅయిన తరువాత శ్రీరాముడు సీతాలక్ష్మణులతో అయోధ్యకు తిరిగి వచ్చును. హనుమంతునిద్వారా ఆ సమాచారము వినినంతనే భరతుడు అమితానందమునుపొంది, పరివారముతోను, గురువులతోను, పురజనులతోను పుష్పకవిమానం దగ్గరకు వచ్చును. విమానందిగి శ్రీరాముడు సీతాలక్ష్మణులతోసహా గురువులకు, పెద్దలకు ప్రణమిల్లును. అప్పుడు భరతుడు శ్రీరాముని చరణములకు ప్రణమిల్లును.

"గహే భరతపుని ప్రభుపదపంకజ।
నమత జిన్‌హహి సురముని॥"

— ఏ ప్రభు చరణములను దేవతలు, మునులు, శంకరుడు, బ్రహ్మ నమస్కరించెదరో ఆ చరణకమలములపైబడి భరతుడు వాటిని వదలకుండెను. అంత శ్రీరాముడు బలవంతముగా తమ్ముని పైకి లేవదీసి హృదయమునకు హత్తుకునెను.

"పరే భూమి నహి వుఠత వురాయే।
బరకరి కృపాసింధు దరులాయే॥"
(ఉత్తరకాండ దోహ 4)

## దాస్యభక్తి

భగవంతుని గుణములను, రహస్యములను, మహిమలనుపరిపూర్ణముగాగ్రహించి ఆయనను తనప్రభువుగా తననుతాను సేవకునిగా తలచుచు భక్తిశ్రద్ధలతో ఆయనను సేవించుచు ఆయనఆజ్ఞను శిరసావహించుటయే దాస్యభక్తి. ఆత్మదోషప్రకటన, వినయము, యాచన, దీనత, ఆత్మసమర్పణము, భగవదనుభూతి మున్నగు భావములు దాస్యభక్తికి అంగములుగా పేర్కొనబడినవి.

భరతుడు దాస్యభక్తికి సాటిలేని మేటి. భరతుడు ఎప్పుడూ తనను శ్రీరామునకు



తిరుమలలో వసంతోత్సవమునందు సీతా లక్ష్మణ సమేత శ్రీరామచంద్రమూర్తి.

దాసుడననే అనుకొనును. శ్రీరాముని సందేశమును చెప్పవచ్చిన హనుమంతునితో ఈ విధముగా అడుగును.

"కహు కపి కబహుంకృపాల గొసాయి।
సుమిరహి మోహిదాస కీనాయి॥
నిజదాసజ్యోం రఘువంశభూషన।
కబహు మమ సుమిరనకర్యో॥

—తనదాసుడుగా అయిన నన్ను రఘునందనుడు తలచుకొనునా? — భరతునిపాత్రలో మనకు అడుగడుగున దాస్యభక్తి కనిపించుచుండును. భరతుడు తన తాతగారింటి నుండి అయోధ్యకు తిరిగివచ్చును. తండ్రి మరణము, రాముని వనవాస విషయము తెలుసుకొని పరితపించును. గురువయిన వశిష్ఠమహర్షి, మంత్రులు భరతునకుపట్టాభిషేక విషయమును తెలియచేయుదురు. అప్పుడు భరతుడు ఈ విధముగాపలుకును

"హిత హమార సియపతి సేవకాయి।
సాహరిలీన్‌హమాతు కుటిలాయి॥"

— శ్రీరామునికి సేవచేయుటయే నాకు మేలు. అట్టి సౌభాగ్యమును నాతల్లి కుటిల స్వభావం నాకుకాకుండా చేసినది—ఈవిధముగా భరతుడు అడుగడుగునా తనదాస్యభావాన్ని వ్యక్తపరచును. రాముని తీసుకొనివచ్చుటకై అయోధ్యనుండి చిత్రకూట పర్వతమునకు వెడలును. అచట రాముని దర్శించుట, ఆయనను సేవించుటలో దాస్యభక్తి వ్యక్తమగును రాముని అయోధ్యకు తిరిగి రమ్మనమని తనను రక్షించుమని వేడుకుంటాడు. ఆఖరుకు రామునిఆజ్ఞను శిరసావహించి ఆయన పాదుకలను తీసుకుని అయోధ్యకు తిరిగివచ్చును. పాదుకలను అధిష్ఠింపచేసి వాటికి సేవచేస్తూ రాజ్యపాలన చేస్తాడు. పదునాలుగు సంవత్సరాలు తనుగూడ విరాగిఅయి రాముని ఎడబాటును సహించుచు శ్రీరాముడు అడవులనుండి తిరిగివచ్చిన తరువాత అతని



తిరుమల వసంతోత్సవములో భూదేవి. శ్రీదేవితో శ్రీవేంకటేశ్వరస్వామివారు.

రాజ్యం ఆయనకు ఒప్పగించి జీవితపర్యంతం ఆయనసేవచేస్తూ వుంటాడు. భరతుని సేవాభావము. ఆజ్ఞాపాలనము, ప్రేమ భావముతో శ్రీరాముడు ముగ్ధుడగును. శ్రీరాముడు స్వయంగా ఇలా అనును — "భరత భక్తిబస భయి మతిమోరి".

### సఖ్యభక్తి

భక్తుడు భగవంతునియందు మైత్రిని జూపుటయే సఖ్యభక్తియని చెప్పబడును. సఖ్యభావముగల భక్తులు భగవంతునిసన్నిధిలో తమ తమ మనస్సునందుగల అభిప్రాయములను వెలువరించు సందర్భమున సంకోచముగాని భయముగాని ఏమాత్రము పొందకుండుటయేగాక చిన్న-పెద్ద అను తారతమ్యమునుగూడ పరిగణించరు ఏలయన ఇరువురికినడుమగల సంబంధములో సమానభావము సంపూర్ణముగ నుండును. నారదభక్తి సూత్రములలో ప్రేమాసక్తి పదకొండు విధములుగా నుండునని చెప్పబడినది. వానిలో సఖ్యాసక్తియును ఒకటి. భాతృత్వములో మైత్రిభావం మిళితమైయుండును. తన సఖ్యభావమును భరతుడు క్రిందివిధముగా వ్యక్తపరచును.

"ప్రభు పితు మాతు సుహృద గురుస్వామి।
పూజ్య పరమహిత అంతరయామి॥"

ప్రభువు, పిత, మాత, గురువు, స్వామి, పూజ్యుడు, హితుడు, అంతర్యామి సమస్తము శ్రీరామచంద్రుడే. ప్రభువు, పిత, మాత, గురువు అన్నపదములతో బాటు 'సుహృద' అన్న పదము ప్రయోగించబడినది. ఇక్కడ 'సుహృద' పదము సఖభావాన్ని వ్యక్తంచేయుచున్నది భరతుడు శ్రీరామునకు నమస్కరించునప్పుడల్లా రాముడు అతనిని హృదయానికి హత్తుకుంటాడు. ఇలా హత్తుకొనుటలో సఖభావం వ్యక్తం అగుచున్నది.

### ఆత్మనివేదనభక్తి

భగవంతుని గుణములు, తత్వము, ప్రభావము, మహిమలను తెలుసుకొని భక్తుడు మమతాహంకార రహితుడయి సమస్తము భగవంతుడే అని విశ్వసించి

శరీరము, మనస్సు, ధనము, పరివారముతో బాటు తనను తాను సమస్తకార్యకలాపము లను శ్రద్ధాభక్తులతో భగవంతునకు నివే దించుటయే ఆత్మనివేదనభక్తి అనబడును.

భరతుడు తన తండ్రి మరణమునకు విలపించుచు ఈ విధముగా పలుకును,

"చలత న దేఖి న పాయవుతోహి।
తాత్ న రామ హిసాంప హి మోహి॥"
(అయోధ్యకాండ దోహ 159)

హే తండ్రీ! ఆఖరు సమయములో మిమ్ములను చూడలేకపోయితిని. మీరు నన్ను శ్రీరామచంద్రునకు అప్పగించనయి నను లేదే! "భరతుని పశ్చాత్తాపములో తనను తాను శ్రీరామునకు నివేదించు కొనెనను భావము స్ఫురించుచున్నది. "ఈ రాజ్యం రామునిదే. నేను కేవలము ఆయన సేవకుడను" - అని భరతుడు అనుటలో కూడ భరతుని ఆత్మనివేదనభావం స్పష్ట ముగా తెలియుచున్నది. శ్రీరామునిపాదు కలకు, సమస్తరాజ్యమును, తనను తాను సమర్పించుకొనును. భగవంతుడే (శ్రీరా ముడు) తన సర్వస్వము అనుకొని అదే లక్ష్యంతో జీవితమును గడుపును.

తండ్రిఆజ్ఞను శిరసావహించి శ్రీ రాముడు అడవులకు బయలుదేరును. ఈ సమాచారమును వినగనే - లక్ష్మణుడు రామునిసన్నిధికి పరుగెత్తుకుని వచ్చును. రామునకు పదునాలుగు సంవత్సరముల వనవాసజీవితము లభించినదే యను బాధ కన్న అన్నను వీడి తాను ండలేనని, తనను అన్న తీసుకునివెళ్ళునో లేదో అని లక్ష్మణుడు వ్యాకులత నొందుచూ నోట మాటలేక స్తంభించిపోయి రామునివద్ద ఖిన్నుడై నిలబడును. సర్వసంగపరిత్యాగిలా నిలబడిన లక్ష్మణుని మనోభావమును రాముడు గ్రహించి అతనిని చేరదీసుకుని అయోధ్యలోనేవుండి తండ్రికి సేవచేయు మని ఎంతగానో ఉపదేశించును. కాని లక్ష్మణుడు శ్రీరాముని కాళ్ళపైవ్రాలి ఈ విధముగా పలుకును -

"నాథదాసు మైస్వామి తుమ్హ తజహుత
కాహు బసాయి।
గురుపితు మాతు న జానహు కాహు
కహవు సుభావు నాథ పతిఆహు॥"

- హే నాథ! నేను దాసుడను, మీరు స్వామి. మీరు ఈవిధముగా నన్నువారిం చిన నాకు ఎవరు దిక్కు? నామాట విశ్వ సింపుడు. నాకు తల్లి, తండ్రి, గురువు, దైవం వేరు ఎవరులేరు. సమస్తము మీరే.

లక్ష్మణుని ప్రేమస్వభావానికి రాముడు తన్మయుడై లక్ష్మణుడు తనతో అడవులకు వచ్చుటకు అంగీకరించును. సీతారామ లక్ష్మణులు అడవులకు వెడలిపోవుదురు. దశరథుడు మరణించును వశిష్ఠుడు భర తునకు కబురుపంపి అయోధ్యకు పిలిపిం చును. తండ్రి మరణవార్తకన్న అన్నగారి వనగమనవార్త విని భరతుడు అమితంగా విలపించును. అన్నతోబాటు తనకును అడవులకు వెళ్ళగలుగు అవకాశముకలుగ లేదని వాపోవును. ఆ సందర్భమున లక్ష్మ ణుని అదృష్టమును ఎంతగానో ఈ విధ ముగా మెచ్చుకొనును.

"జీవనలాహు లఖన భలపావా।
సబు తజి రామ చరన మనులావా॥"

- జీవితముయొక్క శ్రేష్ఠమైన లాభమును లక్ష్మణుడు పొందినాడు. అతను సమ స్తము త్యజించి శ్రీరామపాదములకే తన మనస్సును అంకితం చేసుకొనెను. అట్టి సౌభాగ్యము నాకు కలుగలేదే - అని తన దురదృష్టమునకు నిందించుకొనెను,

ఈ విధముగా లక్ష్మణుడు శ్రీరామ చంద్రుని పాదములకు మనస్సు నంకితము చేసుకొనగా నాతనికన్న పరమభక్తుడు భరతుడు శారీరకముగా రామునకు దూరు డైనను, అతని పాదుకలనే పద్మములుగా తన ధ్యానస్మరణాదులనే స్వరూపసందర్శ నముగ భావించిన ధన్యతముడు. లక్ష్మ ణుడు అన్ని రామాయణములందును శ్రీరా ముని వదలక సేవలు చేసినట్లు వర్ణింప బడెను. భరతుడు శ్రీరాముని సేవించినట్లె చ్చటను వాచ్యముగ చెప్పకపోయినను తనకు సంక్రమించిన రాజ్యాధికారమును వదలి సోదర ముఖసందర్శనము గూడలేక జటాధారియై, సర్వముత్యజించి రామునికై పరితపించుచు రాముడే తనదైవమనిఎంచి నవవిధ భక్తిమార్గముతో రాముని సేవిం చెను. కావుననే సేవాపరాయణుడుగా లక్ష్మ ణుడు, భక్తిపరాయణుడుగా భరతుడు రామాయణచరిత్రలో ప్రసిద్ధికెక్కిరి. *

---

(7వ పేజీ తరువాయి)

గీ॥ సత్రయాగమ్ము క్రోధరసాయితమ్ము
గా, శివుఁడు విమనస్కుడై కదలిపోయె
యాగవిధియేమొ సాగె సహస్రవర్ష -
ములు హుతద్రవ్యశోభనానలయుతమ్ము ౨౯౯

కం॥ అల్లునిపై మచ్చరమున
మల్లడిగొనుదక్షుఁ డభవు మన్నింపక గ -
ర్వోల్లసితుఁ డుద్రుదకముగఁ
గల్లరి యాగమ్ము సేయఁగాఁ దలపోసెన్ ౩౦౦

ఆ॥ అభవు గర్హించి వాజపేయమ్ము సలిపి
యలబృహస్పతిసవనంబు సలుప వేఁడి
సురల మౌనుల రావించె సూడుదలఁచి
విమలశశధరజూటు రావింపలేదు ౩౦౧

చ॥ అతులతపః ప్రభావముననందరికంటెను దొడ్డయైన స-
ద్వ్రతతి సమాదరించెడువివేకమునన్ గడుచిన్నవాఁడు సం-
హృతమతి నోరిక్రొవ్వునను నెవ్వరి నేగతిఁ దిట్టునోయటం-
చతిభయమంది చేరిరి దివౌకసులున్మునిలోకసత్తముల్ ౩౦౨

(సశేషము)

# ఈ మాసం మీ అదృష్టం!

## మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పా)

రాహువువలన ఆందోళన. శనివలన ధననష్టం, వివాదాలు. కుమారులు, కుమార్తెలగూర్చి ఆందోళన. గురువువల్ల బంధువులమూలంగా ఆందోళన. కుజుని వలన ఆందోళన, ధననష్టం, లేదా నేత్ర బాధ. లేదా భార్యకు అసంతుష్టి. బుధునివలన అనారోగ్యం, అవమానం లేదా వివాదాలు. 17 వరకు శుక్రుడు శుభుడు. ధనం, నూత్న వస్త్రాలకుతోడు ఇతరగ్రహాల దుష్ఫలిత నివారణ. రవి వలన ఉదరబాధ, లేదా ధననష్టం, లేదా ప్రయాణం, శ్రమ. 14వరకు దైవారాధన శుభకరం.

## వృషభం

(కృత్తిక 2,3,4,పా, రోహిణి, మృగశిర 1, 2, పా.)

రాహువువల్ల ఆందోళన. శనివలన ధననష్టం, మిత్రులనుండి లేదా అయిన వారినుండి వేర్పాటు. గురువువలననిరాశ. కుజునివలన ధనం, జయం. బుధునివలన ధనం, స్నేహితులు, శృంగారం లేదా వాహన లేదా తత్తుల్య వస్తువులప్రాప్తి. రవి 14 వరకు అనుకూలుడు. ప్రయత్నాలలో జయం. తరువాత కాలంలో స్తబ్దుడు. శుక్రునివలన 17 వరకు వివాదాలు, అగౌరవం, తరువాత కాలంలో ధనం, స్నేహితులు.

## మిథునం

( మృగశిర 3,4 పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పా. )

రాహువువలన ధనం. శనివలనకూడా ధనం, నూత్నవస్త్రాలు, సేవకజనం, ఇంటిలో వస్తుసమృద్ధి, వాహనములు. గురువువలన ధనం. కుజునివలన ధనం, శుక్రునివలన 15 వరకు శృంగారం, నూత్న వస్త్రాలు, ధార్మిక కార్యక్రమం, తరువాత కాలంలో వివాదాలు, అగౌరవం, బుధునివలన జయం, ధనం, శృంగారం. రవివలన దృఢారోగ్యం, గౌరవం, జయం.

## కర్కాటకం

(పునర్వసు 4పా, పుష్యమి, ఆశ్లేష.)

రాహువువలన ధనం దుబారా, శని వలన ధనాభావం. గురువువలన వివాదాలు, దుబారా, అవమానం. కుజుని వలన ధననష్టం. అవమానం. బుధునివలన ప్రయత్నాలలో అవరోధం. శుక్రునివలన ధనం, నూత్నవస్త్రాలు, శృంగారం, గృహసౌఖ్యంగలిగి ఇతరగ్రహాల దుష్ప్రభావానికి పరిహారం. రవివలన నెల మొదటి పక్షంలో అనారోగ్యం లేదా ప్రయత్నాలలో ఆటంకం, లేదా ధననష్టం, అనంతరకాలంలో అన్నివిధాలా జయం.

## సింహం

(మఖ, పూ. ఫ, ఉత్తర 1వ పా.)

రాహువువలన ఆందోళన. శనివలన శరీరానికిదెబ్బ, లేదా తనవలన తనవారికి అపకారం లేదా తనకు సంకటం కలిగే చోటుకి ప్రయాణం, లేదా కుమారులు కుమార్తెలనుండి విరోధం, లేదా ధననష్టం. గురువువలన ప్రయాణం. ప్రయాస. కుజునివలన ధననష్టం, అగౌరవం. బుధుని వలన ధనం, నూత్నవస్త్రాలు, లేదా సంతానప్రాప్తికి అవకాశం. శుక్రునివలన 17 వరకు స్త్రీమూలంగా ఆందోళన, తరువాతకాలంలో నూత్నవస్త్రాలు, లేదా శృంగారం, కారాగృహప్రాప్తి. రవివలన మొదటిపక్షంలో అనారోగ్యం లేదా భార్యకు అసంతుష్టి. తరువాత కాలంలో ధననష్టం, నిరాశ,

## కన్య

(ఉత్తర 2, 3. 4 పా. హస్త; చిత్ర 1, 2 పా.)

రాహు శనులవలన ఆందోళన. గురువువలన అధికధనం. కుజునివలన భార్యతో తగాదాలు లేదా ఉదర లేదా నేత్రబాధ. బుధునివలన వివాదాలు. శుక్రునివలన మొదట 17 రోజులలో అనారోగ్యం, అవమానం, తరువాత కాలంలో స్త్రీమూలంగా ఆందోళన శనివలన ఉదర బాధ లేదా భార్యకు అసంతుష్టి.

## తుల

(చిత్త; 3, 4 పా: స్వాతి, విశాఖ 1, 2, 3 పా;)

రాహువువలన సౌఖ్యం. శనివలన ధనం, శృంగారం. గురువువలవ ధననష్టం, లేదా అగౌరవం. కుజునివలనజయం. అధిక ధనం బుధునివలన జయం, ఉన్నతపదవి. శుక్రునివలన మొదట 17 రోజులలో బంధువులరాక, పెద్దల ప్రశంసలు. ధనం, స్నేహితులు, లేదా వంశాభివృద్ధి. తరువాత కాలంలో అనారోగ్యం అగౌరవం. రవివలన నెలమొదటిపక్షంలో దృఢారోగ్యం, జయం. తరువాత ప్రయాణం, లేదా ఉదరబాధ.

## వృశ్చికం

(విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

రాహువువలన వివాదాలు, శనివలన ధననష్టం, అగౌరవం. గురువువలన ధనం, జయం, ఆహారధాన్యాలు, లేదా సేవక జనం లేదా సంతానంకూడా సంభవం. కుజునివలన అనారోగ్యం, లేదా వివాదాలు లేదా, కుమార్తెలు కుమారుల మూలకమైన ఆందోళన. శుక్రునివలన ధనం, స్నేహితులు, బంధువులరాక, పెద్దల ప్రశంస, లేదా సంతానావకాశం. రవి వలన నెల మొదటిపక్షంలో అనారోగ్యం, శత్రువులమూలకంగా ఆందోళన, తరువాత కాలంలో దృఢారోగ్యం జయం.

( 40వ పేజి చూడుడు )

# వార్తాలహరి

## అన్నమాచార్య త్యాగరాజ సంగీతోత్సవాలు

పదకవితా పితామహుడు తాళ్ళపాక అన్నమాచార్య వర్ధంతి, గాయక భక్తుడు శ్రీత్యాగరాజస్వామి ఆరాధన సంగీతోత్సవాలు 25–3–79 నుండి 1–4–79 వరకు అన్నమాచార్య కళామందిరంలో ఏర్పాటైనాయి. ఇందులో 25 నుండి 28 వరకు అన్నమాచార్య వర్ధంతి కార్యక్రమాలకు, తరువాతి రోజులు సంగీతోత్సవాలకు ఏర్పాటైనాయి. అన్నిరోజులు సాయంత్రంపూట ఉపన్యాసాలు జరగటం ఈ యేటి విశేషం.

25–3–79న ఉదయం అన్నమాచార్య చిత్రాన్ని ఊరేగింపుగా దేవస్థాన కార్యాలయంనుండి అన్నమాచార్య మందిరానికి తీసుకురావటంతో కార్యక్రమం ప్రారంభమైంది. ఆ రోజు సాయంత్రం జరిగిన సభకు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ యం. శాంతప్ప అధ్యక్షత వహించి, అన్నమాచార్య కీర్తనల 26 వ సంపుటాన్ని ఆవిష్కరించారు. అన్నమాచార్య వాఙ్మయంపై విశ్వవిద్యాలయంలో ఒక పీఠం ఏర్పాటు చేయాలని ఆయనకోరారు.

దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ మాట్లాడుతూ అన్నమాచార్య వాఙ్మయ ప్రచురణ, ప్రచారాలకు వేర్వేరు విభాగాలు రెండు ఏర్పాటు చేసి ప్రత్యేకాధికారులను నియమించామని, ఔత్సాహికులకు శిక్షణ ఇప్పించి వారిచే పాడించే ఏర్పాట్లు, గ్రామఫోన్ రికార్డుల ద్వారా ప్రచారం ఏర్పాటౌతున్నవని, తాళ్లపాక గ్రామాన్ని దేవస్థానం దత్తత తీసుకుంటున్నదని అన్నారు. ఈ వాఙ్మయ ప్రచారానికి దేవస్థానం చేయగల్గినదంతా చేస్తుందనీ అన్నారు.

సభలో ముఖ్యాతిథిగా పాల్గొన్న ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖాధ్యక్షులు డా॥ బి. రామరాజు మాట్లాడుతూ జానపద సాహిత్య ప్రపంచంలో ఉన్న సంప్రదాయాలన్నీ అన్నమాచార్య కీర్తనలలో కన్పిస్తాయని, రామాయణం, భారతం, భాగవతం అన్నమాచార్య వాఙ్మయం చదివితే తెలుగులో ఇంక చదవవలసినదేదీ ఉండదని, అంతటి సాహిత్యాన్ని సృష్టించిన ఆ మహనీయుని జన్మస్థలం, తిరువారూర్ మాదిరి పవిత్ర యాత్రా స్థలంగా రూపొందాలని, అన్నారు.

అన్నమాచార్యసంతతివారిని, అన్నమాచార్య కీర్తనల పరిష్కరించి. ప్రచారాదులలో కృషిసల్పిన వారిని ధర్మకర్తల మండలిసభ్యుడు శ్రీచంద్రశేఖరనాయుడు సన్మానించారు.

సభాప్రారంభంలో అన్నమాచార్య ప్రాజెక్ట్ ప్రత్యేకాధికారి, శ్రీకామిశెట్టి శ్రీనివాసులుశెట్టి, సంగీత నృత్యకళాశాల అధ్యక్షులు శ్రీడి. పశుపతి వార్షిక నివేదికలు సమర్పించారు.

తరువాత సంగీత కచ్చేరీలు జరిగాయి.

---

అన్నమాచార్య, త్యాగరాజ
సంగీతోత్సవ
ప్రత్యేక వివరణలు.
వచ్చేసంచికలో....

---

## రాళ్ళపల్లికి శ్రద్ధాంజలి

★

బహుముఖ ప్రజ్ఞాశాలి, శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ 11–3–79 న దివంగతులైన సందర్భంగా తిరుపతిప్రజ, తి. తి. దేవస్థానం, 20–3–79 న సానుతాప నీరాజనం అర్పించాయి.

అన్నమాచార్య కళామందిరంలో జరిగిన ఒక సభలో మాట్లాడుతూ దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, శ్రీమాన్ అనంతకృష్ణశర్మ సౌమ్యతానుహృద్భావాలను కొనియాడారు.

దేవస్థానానికి ఆయనచేసిన సేవను పురస్కరించుకొని 'దేవస్థానఆస్థాన విద్వాంసులుగ' సత్కరించాలన్న ప్రతిపాదనను ధర్మకర్తలమండలి ఆమోదం తరువాతనే అమలు జరపవలసివున్నా, శ్రీ అనంతకృష్ణశర్మ ఆరోగ్య పరిస్థితి దృష్ట్యా ముందుగానే జరపాలని తీర్మానించి సత్కరించటం జరిగిందని, ఆస్థాన విద్వాంసులను వారి యింటికి వెళ్లి సత్కరించటం అనే అపూర్వ సంఘటనలో తాము పాల్గొనే అవకాశం కలగటం ఒక సంతృప్తినికలిగించిందని, సన్మానమందిన కొద్దిగంటలలోనే శ్రీ శర్మ పరమపదించటం చూస్తే యీ సన్మానంలో కార్యనిర్వహణాధికారిగ తమ పాత్ర నిమిత్తమాత్రమని, సర్వం ఆ వేంకటేశ్వరునిలీల అని అనిపిస్తున్నదని అన్నారు.

సర్వశ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ ఎన్. సి. నరసింహాచార్యులు, ఎస్. ఆర్. జానకిరామన్, మొదలగువారు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ ప్రతిభా విశేషాలను కొనియాడారు.

అంతకుముందు, అన్నమాచార్య ప్రణాళిక ప్రత్యేకాధికారి శ్రీ కామిశెట్టి శ్రీనివాసులుశెట్టి సభకు స్వాగతంచెప్పి అనంత కృష్ణశర్మగారిని గురించి ప్రసంగించారు.



దేవేరులతో శ్రీ గోవిందరాజస్వామి.

గోవిందరాజస్వామి బ్రహ్మోత్సవము

తిరుపతి తిరుచానూరులలో నెలకొనియున్న ఆలయాలలో గోవిందరాజస్వామి ఆలయ రాజగోపురము భక్తులను తమ భౌతిక. ఆధ్యాత్మికోన్నతికిగాను శ్రీవారి ఆశీస్సులను పొందడానికి ఆహ్వానిస్తున్నట్లు నిలబడి వుంటుది. ఈ స్వామిని సందర్శించకుండా వెళ్ళేవారు ఏ కొద్దిమందో ఉంటారు.

ప్రతిసంవత్సరము జరుగు స్వామివారి బ్రహ్మోత్సవములు. ఆగమములలో చెప్పబడిన శాస్త్ర విధులతో వైభవముగా 31–5–79 నుండి 9–6–79 వరకు నిర్వహింపబడుతాయి. అశేషప్రజానికాన్ని ఆకర్షించే రథోత్సవము జూన్ 8 వ తేది జరుపబడుతుంది. బ్రహ్మోత్సవములలో చివరి అంశమైన అవభృథోత్సవము 9–6–79 జరుపబడుతుంది. గోవిందరాజస్వామి సాక్షాత్ శ్రీమన్నారాయణుడే శయనముద్రలోఉన్న స్వామివారి నాభి నుండి ఉద్భవించిన కమలములో బ్రహ్మ పాదములవద్ద మధుకైటభులు ఉన్నారు. బ్రహ్మోత్సవము సమయంలో స్వామి వారి దర్శనం శుభదాయకం.

## తిరుమలలో
## నూతన తంతి తపాలా భవనము

తి. తి. దేవస్థానముచే నిర్మింపబడబోయే తంతితపాలా భవనానికి 25–3–79 శ్రీ జె. ఎ దవే I.A.S. (కేంద్ర తంతి తపాలా కార్యదర్శి) శంకుస్థాపన చేశారు.

దేవస్థాన కార్య నిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ తదితరులు యీ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ సందర్భంలో శ్రీ జె, ఎ దవే మాట్లాడుతూ తిరుమలలో ఏప్రిల్ 2 నుండి రాత్రిపూట పనిచేసే తపాలా కార్యలయాలు ఏర్పాటు చెయ్యాలని నిర్ణయం జరిగిందని అన్నారు. సభకు అధ్యక్షత వహించిన శ్రీ పి. వి. ఆర్. కె, ప్రసాద్, I. A. S. గారు ఈ భవనాన్ని దేవస్థానమే నిర్మిస్తున్నదని, దీనిని ఏడాదిలోగా పూర్తిచేసిన తరువాత యీ భవనాన్ని తపాలాశాఖకు అద్దెకివ్వటం జరుగుతుందని అన్నారు. శ్రీ పాల్‌రాజన్, (పోస్టుమాష్టరు జనరల్) దేవస్థాన ఉప కార్య నిర్వహణాధికారి శ్రీ మునుస్వామి నాయుడు, శ్రీ నరసింహారామ్ టెలికమ్యూనికేషన్స్ జనరల్ మేనేజర్ శ్రీ హనుమాన్‌చౌదరి మున్నగు వారుమాట్లాడారు.



దేవస్థానంవారు యిటీవల నిర్వహించిన బాల్‌బ్యాడ్‌మింటన్ టోర్నమెంటులో గెలుపొందిన టీముకు శ్రీమతి గోపికాప్రసాద్, ట్రోఫీని బహూకరిస్తున్నదృశ్యం.



రాజమన్నారుగుడిలోని రాజగోపాలస్వామివారి ఆలయం.

26–3–79న తిరుపతిలో టెలక్స్ భవనానికి తంతి తపాలా శాఖ కార్యదర్శి శ్రీ జె ఎ. దవే I. A S. శంకుస్థాపన చేసి తిరుపతిలో టెలక్స్ సౌకర్యానికి ప్రారంభోత్సవం చేశారు. సభాధ్యక్షత వహించిన శ్రీ పి. వి. ఆర్. కె ప్రసాద్ ప్రసంగిస్తూ తంతితపాలాలో అభివృద్ధివల్ల దేవస్థానం యితోధికంగా భక్తులసేవ చేయటానికిగల అవకాశాలు పెరుగుతున్నవని (దేవస్థానం) వివిధ అవసరాలుగల యాత్రికులకు దేవస్థాన సహాయం కాలహరణ లేకుండా అందేవిధంగా ఒక సమాచార ప్రసార ప్రణాళికను తంతి తపాలా విభాగంవారు రూపొందిస్తే చాలా వీలుగా వుంటుందని తిరుపతిలో విధంగానే యీ టెలక్స్ సౌకర్యాన్ని తిరుమలకి కూడా ఏర్పాటుచేస్తే బావుంటుందని అన్నారు.

తిరుమలలో క్యూ షెడ్లలో, కార్డులు, కవర్లు అమ్మే ప్రతిపాదన తపాలా విభాగం ఆమోదించటం నిజంగా హర్షదాయకమని, దీనిమూలంగా స్వామివారి దర్శనం కోసం క్యూ షెడ్లలో కాచుకున్న వేలాది యాత్రికులు యీ విరామ సమయాన్ని తమవారికి ఉత్తరాలు వ్రాసుకొనేందుకు ఉపయోగించుకోవటానికి వీలవుతుందని, అటు యాత్రికులు, యిటు తపాలా విభాగానికికూడా లాభదాయకమైనదని తమ హర్షమును వ్యక్తం చేశారు.

శ్రీ జె. ఎ. దవే I. A. S ప్రసంగిస్తూ ప్రజాసేవే ప్రాతిపదికగా తంతితపాలా శాఖను విస్తరింపజేస్తామని తెల్పి వచ్చేఏటి లోపల యీ టెలక్స్ భవనం పూర్తి కాగలదని ఆశాభావాన్ని వ్యక్తం చేశారు.



**(37వ పేజీ తరువాయి)**

### ధనుస్సు

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

రాహువువల్ల పాపాచరణ. శనివలన అనారోగ్యం లేదా వివాదాలు, ఆధ్యాత్మిక ప్రవర్తన. గురువువలన అనారోగ్యం, ప్రయాణం, శ్రమ. కుజునివలన చెడు సహవాసంవల్ల హాని, లేదా అనారోగ్యం లేదా జ్వరం. బుధునివలన గృహసౌఖ్యం, శుక్రునివలన ధనం లేదా నూత్న వస్త్రాలు, లేదా గౌరవం, జయం. రవివలన అనారోగ్యం, శత్రువుల మూలంగా ఆందోళన.

### మకరం

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ఠ 1.2 పా)**

రాహువువలన ఆందోళన, శనివలన అయినవారినుండి వేర్పాటు. గురువువలన ధనం, శృంగారం, కుజునివలన కుమారుల మూలంగా లేదా అక్రమ ధనప్రాప్తి బుధునివలన మిత్రప్రాప్తి, తనప్రవర్తన కారణంగా ఉద్యోగంలో ఆందోళన. లేదా శత్రువులమూలంగా ఆందోళన. శుక్రుడు ఈ నెలంతా అనుకూలుడే. ధనం జయం, ఆహారధాన్యాలు లేదా గౌరవం. జయం, నూత్నవస్త్రాలు లేదా సంతానావకాశంకూడా. రవివలన నెలమొదటి పక్షంలో ధనం జయం లేదా ఉన్నతపదవి, రెండవ పక్షంలో అనారోగ్యం.

### కుంభం

**(ధనిష్ఠ 3,4 పా, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా)**

రాహువువలన వివాదాలు. శనివలన ప్రయాణం. గురువువలన మనశ్శాంతి లోపం. కుజునివలన ఉద్యోగంలో లేదా వివాదాలవల్ల లేదా శత్రువుల మూలంగా అనారోగ్య కారణంగా లేదా ఇంటిలో దొంగతనంవల్ల భయం. బుధునివలన అవమానం. శుక్రునివలన శృంగారం లేదా ధనం గౌరవం లేదా ఆహారధాన్యాలు లేదా సంతానావకాశం. రవివలన నెల మొదటిపక్షంలో ధననష్టం నేత్రబాధ లేదా మోసం తరువాత పక్షంలో ధనం, ఉన్నతపదవి.

### మీనం

**(పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి.)**

రాహువువల్ల ధనం శనివలన ఆరోగ్యం జయం. గురువువలన ధనం, నూత్న వస్త్రాలు లేదా వస్తువాహనప్రాప్తి లేదా సంతానావకాశం లేదా గృహప్రాప్తి బుధునివలన చెడుసలహాల మూలంగా లేదా శత్రువుల ప్రయత్నాలవల్ల ధననష్టం. శుక్రుడు నెల 17 రోజుల వరకు స్తబ్ధుడు. అనంతరం శృంగారం, సంతోషం. నెల మొదటిపక్షంలో రవివలన ధననష్టం లేదా ఉదరబాధ లేక ప్రయాణంరెండవపక్షంలో ధననష్టం, మోసం, లేదా నేత్రబాధ.


*Edited and Published on behalf of T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T. T. D. Press by M. Vijayakumar Reddy, Manager T. T. D. Press Tirupati-517501*

ఇటీవల తిరుపతిలో మూడవ బాస్కెట్ బాల్ టోర్నమెంట్ నాలుగురోజులపాటు జరిగింది.



ఈ పోటీలో గెలుపొందిన ఆర్టిలరీ సెంటర్ హైదరాబాదువారికి దేవస్థాన ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు శ్రీ ఆర్. రంగరాజు బహుమతి అందజేశారు.

దీపాలవెలుగులో బాస్కెట్ బాల్ క్రీడారంగ దృశ్యం.



నాగలాపురం దర్శించండి !



# నాగలాపుర శ్రీవేదవల్లీసమేత శ్రీవేదనారాయణస్వామివారి బ్రహ్మోత్సవ క్రమము

| తేది | వారం | పగలు ఉత్సవము | రాత్రి ఉత్సవము |
|---|---|---|---|
| 11–4–79 | బుధ | —— | సేనాధిపతి ఉత్సవము, అంకురార్పణము |
| 12–4–79 | గురు | తిరుచ్చి ఉత్సవము, ధ్వజారోహణము | పెద్దశేషవాహనము |
| 13–4–79 | శుక్ర | చిన్నశేషవాహనము | హంసవాహనము |
| 14–4–79 | శని | సింహవాహనము | ముత్యపుపందిలివాహనము |
| 15–4–79 | ఆది | కల్పవృక్షవాహనము | సర్వభూపాలవాహనము |
| 16–4–79 | సోమ | మోహినీ అవతారోత్సవము | గరుడవాహనము |
| 17–4–79 | మంగళ | హనుమద్వాహనము<br>సాయంకాలం వసంతోత్సవము | గజవాహనము |
| 18–4–79 | బుధ | సూర్యప్రభవాహనము | చంద్రప్రభవాహనము |
| 19–4–79 | గురు | రథోత్సవము | అశ్వవాహనము |
| 20–4–79 | శుక్ర | పల్లకీ ఉత్సవము, తీర్థవారి అవభృథోత్సవము, చక్రస్నానము | ధ్వజావరోహణోత్సవము |

# శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము తిరుమల

## 1–3–79 నుండి

## నిత్యపూజ, దర్శనాదికముల కార్యక్రమము

### శని, ఆది, సోమ మరియు మంగళవారములు

ఉదయము 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతము
,, 3–30 నుండి 3–45 వరకు శుద్ధి
,, 3–45 నుండి 4–30 వరకు తోమాలసేవ
,, 4–30 నుండి 4–45 వరకు బంగారు వాకిలివద్ద కొలువు; పంచాంగ శ్రవణం,
,, 4–45 నుండి 5–30 వరకు మొదటి అర్చన
,, 5–30 నుండి 6–00 వరకు మొదటిఘంట బలి మరియు శాత్తుమొర
, 6–00 నుండి మ 12–00 వరకు సర్వదర్శనము
మధ్యాహ్నం 12–00 నుండి 1–00 వరకు రెండవఅర్చన,(ఏకాంతం)
,, 1–00 నుండి 8–00 వరకు సర్వదర్శనం
రాత్రి 8–00 నుండి 9–00 వరకు శుద్ధి, రాత్రికైంకర్యము
,, 9–00 నుండి 12–00 వరకు సర్వదర్శనం
,, 12–00 నుండి 12–30 శుద్ధి

12–30 ఏకాంతసేవ

### గురువారము

### తిరుప్పావడ

ఉదయము 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతం
,, 3–30 నుండి 3–45 వరకు శుద్ధి
,, 3–45 నుండి 4–30 వరకు తోమాలసేవ.
,, 4–30 నుండి 4–45 వరకు బంగారువాకిలివద్ద కొలువు మరియు పంచాంగ శ్రవణము
,, 4–45 నుండి 5–30 వరకు మొదటి అర్చన,
,, 5–30 నుండి 6–00 వరకు మొదటిఘంట, బలి శాత్తుమొర
,, 6–00 నుండి 8–00 వరకు సళ్ళింపు, 2 వ అర్చన (ఏకాంతం), తిరుప్పావడ, అలంకరణం, ఘంట ఇత్యాది
,, 8–00 నుండి రాత్రి 8–00 వరకు సర్వదర్శనం

సాయంకాలం 8–00 నుండి 10–00 { వరకు శుద్ధి ఇత్యాది / పూలంగి సమర్పణ / రాత్రి కైంకర్యము, ఘంట
రాత్రి 10–00 నుండి 12–00 వరకు పూలంగిసేవ
,, 12–00 నుండి 12–30 వరకు శుద్ధి
,, 12–45 ఏకాంతసేవ

### బుధవారము

### సహస్రకలశాభిషేకం

ఉదయం 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతము
,, 3–30 నుండి 3–45 వరకు శుద్ధి
,, 3–45 నుండి 4–30 వరకు తోమాలసేవ
,, 4–30 నుండి 4–45 వరకు బంగారువాకిలివద్ద కొలువు పంచాంగశ్రవణం
,, 4–45 నుండి 5–30 మొదటి అర్చన
,, 5–30 నుండి 6–00 మొదటిఘంట, బలి, శాత్తుమొర
,, 6–00 నుండి 8–00 సహస్ర కలశాభిషేకము
,, 8–00 రాత్రి 8–00 వరకు సర్వదర్శనం
రాత్రి 8–00 నుండి 9–00 వరకు శుద్ధి ఇత్యాది
,, 9–00 నుండి 12–00 వరకు సర్వదర్శనం
,, 12–00 నుండి 12–30 వరకు శుద్ధి
రాత్రి 12–30 ఏకాంతసేవ

### శుక్రవారము

### అభిషేకము

ఉ॥ 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతము
,, 3–30 నుండి 5–00 వరకు సళ్లింపు మరియు నిత్యకట్ల కైంకర్యములు (ఏకాంతము)
,, 5–00 నుండి 7–00 వరకు అభిషేకము
,, 7–00 నుండి 8–30 వరకు సమర్పణము
,, 8–30 నుండి 9–30 వరకు తోమాలసేవ మరియు అర్చన (ప్రత్యేకం) ఘంట, బలి, మరియుశాత్తుమొర
,, 9–30 నుండి 10–00 వరకు రెండవ గంట, బలి, శాత్తుమొర
10–00 నుండి రాత్రి 8–00 వరకు సర్వదర్శనం
రాత్రి 8–00 నుండి 9–00 వరకు శుద్ధి రాత్రి కైంకర్యము
రాత్రి 9–00 నుండి 12–00 సర్వదర్శనం
,, 12–00 నుండి 12–30 వరకు శుద్ధి
12–30 ఏకాంతసేవ

గమనిక :– 1) పైకార్య క్రమములో సమయాను కూలముగాను ప్రత్యేక కార్యక్రమముల వలనను మార్పులు చేయబడవచ్చును. 2) సుప్రభాత దర్శనమునకు రు. 25/– టిక్కెట్టువారు మాత్రమే అనుమతింపబడుదురు. 3) రు 25/– టిక్కెట్లు తిరుమలలోనూ దేశంలో ఆంధ్రాబ్యాంకువారి వివిధ కేంద్రములలోనూ లభించును 4) సేవానంతరపు టిక్కెట్లు రద్దుచేయటమైనది. 5) ప్రత్యేక దర్శనం టిక్కెట్లు గలవారు లోగడవలె ధ్వజ స్తంభమువద్దగాక మహాద్వారము క్యూలో చేర్చబడుదురు. 6) రు. 200/– ఆమంత్రణోత్సవం టిక్కెటు పై ఇద్దరు మాత్రమే అనుమతింపబడుదురు. 7) అర్చన, తోమాలసేవ, ఏకాంతసేవలో దర్శనాంతరపు టిక్కెట్లుగాని రు. 25/ టిక్కెట్లుగాని అమ్మబడవు.

పేష్కార్ ; శ్రీవారి ఆలయం, తిరుమల

# ముఖచిత్రం

ఈ నెలపాటకూడా అన్నమాచార్య సాహిత్యానికి సంబంధించినదే. ఆయన జయంతి పురస్సరంగా సంస్మరణ సమర్పణం. నిజ జీవితంలో కూడా రక్తి విరక్తులను సమపాళంగా అనుభవించి, ఆ అనుభూతిని, శ్రీరాగ శృంగార వక్షుని కాళ్ళపారాణిగా దిద్ది, ఆంతరంగిక మిత్రుడై ఆ వేంకట శైలవల్లభుని రతిక్రీడారహస్యముల గుత్తకుగొన్న అనంత పారదర్శక ప్రతిభాశాలి అన్నమయ్య.



మలసీఁ జూడరో మగసింహము
అలవి మీరిన మాయలసింహము.

అదివో చూడరో ఆదిమ పురుషుని
పెదయౌబలముమీఁది పెను సింహము
వెదకి బ్రహ్మాదులు వేదాంతతతులు
కదిసి కానఁగలేని ఘనసింహము.

మెచ్చి మెచ్చి చూడరో మితిమీరిన యట్టి
చిచ్చఱ కంటితోడి జిగిసింహము
తచ్చినవారిధిలోని తరుణిఁ గౌఁగిటఁ జేర్చి
నచ్చినగోళ్ల శ్రీనరసింహము.

బింకమునఁ జూడరో పిరితీయక నేడు
అంకపు దనుజ సంహార సింహము
వెంకట నగముపై వేదాచలముపై
కింక లేక వడిఁ బెరిగిన సింహము.

— (X 11 - 13)

అన్నమయ్య భావనా విశ్వంలో వెలసిన దానికి రూపు రేఖలు తీర్చిన చరితార్థ జీవి శ్రీ 'బాపు' అన్నమాచార్య జయంతి సందర్భంగా అంతో ఇంతో అనుకుంటూ ఎంతో కైంకర్యం జరిపిన శ్రీ 'బాపు' పై శ్రీనివాసుని కరుణ వర్షించాలని కోరుతూ, సప్తగిరి సమర్పణం ఇది.

# తిరుమల యాత్రికులకు సదుపాయములు

* * *

* అన్ని వర్గాలవారికి అందుబాటులో ఉండేటట్లు, ఉచిత పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలతో ఆవాససౌకర్యం.
* శ్రీవారిని దర్శించు యాత్రికులషెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు.
* క్యూషెడ్లలోనే కాఫీబోర్డువారి అల్పాహార సదుపాయం.
* సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
* యాత్రికులు వెలుపలకు రానక్కరలేకుండా క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం
* ఆంధ్రప్రదేశ్ పాలసరఫరాసంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
* యాత్రికులు చదువుకునేందుకు దేవస్థానంముద్రిత గ్రంథాలు. స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
* క్యూలోని యాత్రికులకు విసుగులేకుండేందుకు టెలివిజన్ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం.
* క్యూలైన్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7వమైలువద్ద వైద్యసదుపాయం.
* సామానులు, పాదరక్షలు భద్రపరచుకొనేందుకు ప్రత్యేక సౌకర్యం.
* తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటోసౌకర్యం,
* తిరుమలకు నడచివెళ్ళేవారి సామానులను క్షేమంగా తిరుమలకుచేర్చే రవాణాసౌకర్యం.
* దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు పేష్కార్ స్థాయి అధికారి ముఖద్వారంలో నియమింపబడ్డారు.
* క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి సిబ్బంది.

దేవస్థాన ప్రయత్నాలలో ఇవి కొన్ని మాత్రమే!

గమనిక : తిరుమలలో 2–4–79 నుండి తపాలాకార్యాలయము రాత్రి 8–30 గం॥ వరకు పనిచేస్తున్నది. ఇది గాక ప్రధాన తపాలాకార్యాలయము రాత్రి 10–30 నుండి 1–00 గం॥ వరకు పనిచేస్తుంది. శ్రీ వేంకటేశ్వరస్వామివారి భక్తుడు అన్నమాచార్యుల తపాలాముద్రను కోరినవారు తమ కార్డులు, కవర్లపై ముద్రించుకోవచ్చును.

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

# సప్తగిరి

మే 79

సంపుటి 9 సంచిక 12

విడిప్రతి 0-50 పైసలు

సం॥ చందా రు. 6-00

## విషయసూచిక



## అన్నమప్రభ



* కొన్ని అనివార్య కారణములవలన 'అన్నమాచార్య సారస్వత కళారాధనము, అన్నమస్వరలహరి' ప్రకటింపబడలేదు. ॥ సం॥

గౌరవసంపాదకులు;

శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్

ఐ. ఏ. ఎస్,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2322

ప్రచురణకర్త—సంపాదకుడు:

కొత్రపాటి సుబ్బారావు

ఎమ్. ఏ.,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

ముద్రాపకుడు,

ఎమ్. విజయకుమార్ రెడ్డి,

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2340

ముఖచిత్రం: నరసింహస్వామి

# సంపాదకీయము

కాలం చాలా చిత్రమైంది. చక్రగమనం గలది. ఈ భ్రమణంలో ఋతువులు ఒకదానివెంట మరొకటి క్రిందు మీదుగా తిరుగుతూనేవున్నై, సంవత్సరాలు మారుతున్నై. రోజూ తింటున్నదే తింటున్నా, చూస్తున్నదే చూస్తున్నా ప్రతి మార్పులోను ఒక క్రొత్తదనానికి ఎదురుచూడటం, క్రొత్తలోని పాతలను అనుభవంగా పదిలపరచుకొని, క్రొత్తను వెదుకుతూ ముందుకు సాగిపోవటం ఈ కాలచక్ర ధర్మంగా మారిపోయింది.

ఈ సంచికతో తొమ్మిదివర్షప్రాయం పూర్తిచేసుకుని, మరొక్కమలుపుతిరిగే సప్తగిరిప్రగతిలోకూడా ఈ కాలచక్రపు క్రిందుమీదులు కన్పించినై. అజ్ఞాతమా అన్నంత మూలగావున్న ధార్మికగ్రంథాలను జనసామాన్యాని కందించే ఉద్దేశ్యంతో నవంబరు 72 లో ఈ విభాగాన్ని సప్తగిరికి అనుసంధించటం జరిగింది. కాలక్రమాన సప్తగిరి రూపురేఖలుమారి, కొత్తబాధ్యత తేర్పడటంతో సంపాదక – విక్రయబాధ్యతలను వేరువేరు చేసి ప్రత్యేకవిభాగాలుగా 1976 సెప్టెంబరులో ఏర్పాటుచేయటం జరిగింది. ఈ రెండుమార్పులు ఒకదానికన్న మరొకటి మేలనిపించాయి. కాని క్రయవిక్రయాల మూలమనస్తత్వంలోని వ్యత్యాసం ఈ రెంటికి పొందిక కుదరదని, ముఖ్యంగా ధార్మికగ్రంథవిభాగం, సమానదృక్పథంగల విభాగంతోనే ఉంటేనే, మేలు మెరుగౌతుందన్న కొత్తఅనుభవాన్ని చూపించింది.

అందువల్లనే గ్రంధవిక్రయ విభాగాన్ని మళ్ళీ సప్తగిరిపరం చేయటం జరిగింది. ఇకముందు ఈ విభాగాన్ని సప్తగిరి నిర్వహిస్తుందన్నమాట. పథకం పాతదేయైనా రుచులుమాత్రం కొత్తవి.

దేవస్థానం నుండి గ్రంథముద్రణకు సహాయం అనేది కలగా అన్పించేది. అలాంటిది ఇప్పుడు రు. 5,000/– వరకు చేవగల రచయితలందరికీ ఆర్థికసహాయం లభిస్తున్నది. అచ్చొత్తించుకోగలిగిన రచయితల పుస్తకాలను 50 ప్రతులు కొనటం జరుగుతున్నది. దేవస్థానం ప్రచురించే పుస్తకాల రచయితలకు పారితోషికం ఇవ్వటం జరుగుతున్నది.

అలాగే లోగడ ధార్మికత ధనసహాయం కోరదన్నదృష్టితో సప్తగిరి వ్యాసకర్తలకు ఇస్తున్న పారితోషికం నిలపటం జరిగింది. ఇప్పుడు లోగడకన్న కొత్తమెరుగులతో పారితోషికాలు లభించబోతున్నవి. పైగా వారివారి వ్యాసాలప్రతులతోపాటు నాలుగైదుప్రతులు ఉచితంగా లభిస్తవంటే అది కొత్తరుచిగాదూ !

బహుముఖ విరాళప్రవాహం, సప్తగిరి మరొక్కమజిలీకి ముందడుగువేస్తున్న శుభతరుణంలో ప్రారంభంకావటం, దానికీ సప్తగిరివిభాగం వాహకంకావటం, అందరికీ తెలిసిన సామర్థ్యంకన్న పత్రికపై యాజమాన్యానికి, గల శ్రద్ధకు, ఈ రూపంగా పత్రిక ఆస్తికలోకానికి మరింత దగ్గరకావాలన్న ఆరాటానికి నిదర్శనం. ఐనా, మనం నడిచేవాళ్ళంమాత్రమే! నడిపించేవాడువాడే.

ఆనో భద్రాణియాంతు ఋతవో విశ్వతః.

# అహోబిలంలో నవనారసింహులు

ప్రఖ్యాతివహించిన నారసింహక్షేత్రము లలో తలమానికమైనది అహోబిలక్షేత్రం. హిరణ్యకశిపుని సంహరించిన తరువాత బ్రహ్మాది సురమునిగణాలు, ఆయన బలాన్ని 'అహో-బల' శబ్దపూర్వకంగా ప్రశంసించారట. కాబట్టే ఈ క్షేత్రానికి అహోబలమన్న పేరు ప్రసిద్ధివహించు నట్లుగా శ్రీమన్నారసింహస్వామివారే చెప్పి నట్లు నృసింహపురాణములో నున్నది.

మరైతే 'అహోబిల' మంటారే దాని కేమర్థం? అనే ఆలోచనరావచ్చు, వస్తుంది గూడా. 'అహోబిల' మన్న పదం నృసింహ పురాణంలో లేదు గాని జనులవాడుకలో అహోబలం అహోబిలంగా మారిందన వచ్చు. దానికితగ్గ వాతావరణం ఈ క్షేత్ర ములో నెలకొనియుండటం మూలాన ఈ పేరుగూడ సార్థకమే. అహస్ + బిలం= అహోబిలంఅంటే పగటిపూటనే (ఎగువ) అహోబిలం చూడటానికి ఓ పెద్దబిలం లాగా అగపడుతుంది. చుట్టూ కొండలతో నిండి మధ్య లోయప్రదేశం నిజంగా గంభీరంగానే వుంటుంది. అందుకే అన్నారు :

"అహోవీర్య మహాశౌర్య, మహోబాహు
పరాక్రమః।
నారసింహ పరం దైవం, అహోబిల
మహాబిలం॥" — అని.

ఈ దివ్యక్షేత్రాన్ని ఆధారంగా చేసికొనే తెలుగులో తొలిప్రబంధమైన నృసింహ పురాణం వెలువరించారు ఎఱ్ఱనామాత్యులు. అందలి పంచమాశ్వాసంలో ఈ క్షేత్ర స్వరూపం ప్రస్ఫుటంగా వ్యక్తమౌతుంది.

ఈ అహోబలక్షేత్రం కర్నూలుజిల్లాలో ఉన్నది. అతిదీర్ఘంగా వ్యాపించిన పర్వత శ్రేణిలో అతిగహనమైన అడవిమధ్య, ప్రకృతిసౌందర్య పరిపూర్ణమైనచోట నెల కొనివుంది. ఈ పర్వతశ్రేణికి శిరోభాగాన శ్రీవేంకటేశ్వరుడు (తిరుమల), మధ్యన అహోబిలనారసింహేశ్వరుడు, కొసభాగాన శ్రీమల్లికార్జునుడు (శ్రీశైలం) ఉన్నారు. ఇంతటి దైవసంపదగల్గిన ఆంధ్రదేశం నిజంగానే పునీతమైనది.

ప్రయాణవసతి

కడప రైల్వేస్టేషనులో దిగి, ఆళ్ళగడ్డ మార్గంగా వెళ్ళవచ్చు. ప్రతిసంవత్సరం బ్రహ్మోత్సవాలకు కర్నూలు, జమ్మల మడుగు, ప్రొద్దుటూరు, మైదుకూరు మొద లైన ప్రాంతాలనుండి విరివిగా బస్సు సౌకర్యాలుంటాయి.

విశేషాలు

ఈ క్షేత్రం దిగువ అహోబిలమని, ఎగువ అహోబిలమని రెండుచోట్ల ప్రసిద్ధి వహించింది. కొండక్రిందిభాగం దిగువ అహోబిలం, పైభాగం ఎగువఅహోబిలం. పై రెండుచోట్ల నృసింహస్వామి తొమ్మిది రూపాలతో దర్శనమిస్తున్నాడు. అవి-

జ్వాలాహోబిలమాలోల, క్రోడ కారంజ
భార్గవ।
యోగానందఛత్రవట, పావనా
నవమూర్తయే॥— అనబడేవి.

ఈ నవనారసింహ మూర్తులుండటం చేతనే ఈ స్థలానికి 'నవనారసింహక్షేత్ర' మన్న పేరుగూడా వుంటున్నది.

దిగువ అహోబిలంలోని మూర్తులు —

శ్రీ పణతుల రామేశ్వరశర్మ
ఉత్తరబ్రాహ్మణపల్లె



లక్ష్మీ నృసింహులు

భార్గవనారసింహమూర్తి

దిగువఅహోబిలానికి 3కి.మీ.దూరంలో భార్గవతీర్థం వుంది. ఈ ప్రాంతానికి భార్గవ క్షేత్రం అని పేరు. ఇచటనొక పర్వతముంది. ఈపర్వతంపైనున్న దేవాలయంలో భార్గవ నారసింహస్వామి మనకు దర్శనమిస్తాడు. ఇచటి ప్రకృతి మనోజ్ఞము.

యోగానందమూర్తి

దిగువఅహోబిలానికి 2కి.మీ. దూరంలో ఈ మూర్తి వుంది. ప్రహ్లాదునికి యోగ విద్యనేర్పినమూర్తి కాన ఈయన కీపేరు వచ్చినదట. ఇట భగవానుడు యోగ పట్టంతో మనకు దర్శనమిస్తాడు.

ఛత్రవటనారసింహమూర్తి

దిగువ అహోబిలంలోని పెద్దమఱ్ఱిచెట్టు క్రిందనున్న నృసింహమూర్తి మనకెంతో ఆహ్లాదాన్ని కల్గిస్తుంది. వటవృక్షాన్ని ఛత్రంగా గల్గినవాడు కాబట్టి ఈపేరు సార్థకమైనది.

ఇక ఎగువ అహోబిలంలోని మూర్తులు

### కారంజ నరసింహస్వామి

దిగువఅహోబిలంనుండి ఎగువఅహోబిలానికి వెళ్ళేదారిలో ఈ సన్నిధి వుంది. భవనాశినీ పుణ్యతీర్థతీరంలో నెలకొని వుందిది.

ఈ స్వామి 'శార్ఙ్గ' ధనస్సుతోను, చక్రంతోనూ కూర్చొనివున్న దృశ్యం కన్నులపండువుచేస్తుంది. కరంజ(కానుగ) వృక్షంక్రిందనున్న స్వామికాబట్టి 'కారంజ నరసింహస్వామి'యైనాడు. ఇచ్చట భవనాశినితీర్థం జలపాతంగా ప్రవహిస్తోంది. ఈ తీర్థానికి 'భైరవకుండ' మని గూడా పేరున్నది. దుర్వాసశ్శాపహతుడైన గోభిలమహర్షి జ్ఞానహీనుడైనందు వలన ఈస్థలానికివచ్చి నృసింహునిభజించి తిరిగి 'జ్ఞాని' అయ్యాడు. కాబట్టి ఈ దేవుణ్ణి ప్రార్థిస్తే సర్వతోముఖజ్ఞానం వస్తుందట.

### అహోబల నారసింహస్వామి

ఈ స్వామి అర్చామూర్తిగా వెలసిన చోటే ఎగువ అహోబిలం. ఇచటనే భవనాశినీ కుండరూపంలో వున్నది. ఇదే గజతీర్థం. ఇచటగలగుహలో చక్రాకారముగా కొండయందలి నీటిధార అడుగుభాగమున నున్న ఒక అరుగుమీద దశభుజాలతో హిరణ్యకశిపుని సంహారించెడు 'సంహారమూర్తి' గా స్వామి దర్శనమిస్తున్నారు. నవమూర్తులలో నిది సుప్రసిద్ధమూర్తి; పురాణప్రసిద్ధి వహించినట్టిది. పలువురు శైవ, వైష్ణవపండితులు, ఆళ్వారులు ఈ మూర్తినిదర్శించి ప్రస్తుతించారు. శ్రీచైతన్య దేవుడనే గౌరాంగస్వామి ఈ నృసింహమూర్తిని క్రీ. వె. 1513 సంవత్సరమున దర్శించినట్లు ఆ సంప్రదాయజ్ఞులు చెప్పుచున్నారు.



ప్రహ్లాదసమేత నరసింహమూర్తి – కాంచి, ఫోటో: యస్. వి. కె. యస్. శ్రీనివాసన్ తిరుపతి.

ఈ సన్నిధికి కొద్దిదూరంలో ఒక చిన్న దేవాలయంలో ఉగ్రనరసింహమూర్తి దర్శనమిస్తాడు. ఇచటనే పరమశివలింగం గూడా వుంది. శ్రీ రుద్రమూర్తికి నృసింహమూర్తి వరప్రదానం చేసిన చోటిదియట. ఈ దేవాలయం ఆకారంలో పెద్దదిగాను అనేక మండపాలతోనూ వుంది. ఈ దేవాలయాన్నంటియున్న వంటశాలకు భవనాశినీ తీర్థంనుండి నీరుపారటంకోసం పూర్వీకులు రాళ్ళను కొళాయిలుగా వుపయోగించివుండటం ఆశ్చర్యచకితుల్ని చెయ్యకతప్పదు. భవనాశినీ తీర్థపు టొడ్డున నున్న నూఱుకాళ్ళ మండపం చక్కని రాళ్ళతో అతిసున్నితంగా నిర్మింపబడి వుంది. ఈ రాళ్ళు ఈ కొండలోనివికానట్లు తెలుస్తున్నది.

### క్రోడాకార నృసింహమూర్తి

ఎగువ అహోబిలములో శ్రీనృసింహస్వామి దేవస్థానమునకు వెళ్ళెడి దారిలో, భవనాశినీతీర్థపుటొడ్డున ఈ సన్నిధిగలదు. ఇచట స్వామి వరాహరూపిగా, శ్రీ లక్ష్మీనృసింహస్వామితో పాటు దర్శనమిచ్చుచుండుటచే శ్రీవరాహనారసింహస్వామిగా పిలువబడుచున్నాడు. ("క్రోడ" మనగా వరాహము.)

### మాలోల నరసింహస్వామి

శ్రీవరాహస్వామి సన్నిధినుండి ఎగు

(35 పేజీలో చూడుడు)

# శ్రీనివాస ప్రబంధము



శ్రీమాన్ సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులు, కడప,

(గతసంచిక తరువాయి)

ఆ॥ హరుడు దక్కఁ దక్కినల్లుండ్రు జన్నంబుఁ
జూడవచ్చి రతులశోభలొప్ప
వారిసతుల మేనిపసిఁడిసొమ్ములు యజ్ఞ
వాటమునకుఁ గ్రొత్తవన్నెఁ గూర్చె ౩౦౩

ఉ॥ అందరిలోనఁ బ్రాయమునయందుఁ గనిష్ఠయె గాని సద్గుణా -
శిందమవంగడంబిది ఫలించినపుణ్యము శంభుపత్ని రా-
నందుకుఁ బొక్కిపొక్కి పతియాజ్ఞకు మార్పలుకంగలేక యా -
నందముడింది యెంచు నిజనందన దక్షపురంధ్రి సారెకున్ ౩౦౪

తరువోజ॥
పతిసవిధంబునఁ బరిచర్యలందుఁ
బనుపడ మున్గినభవుసతీదేవి
వితతంబుగా యజ్ఞవిధి సల్పుచున్న -
పిత దనుఁబిల్వఁబంపినఁ బోనొ నేను
మతి నింత దొలఁగెనే మాలిమియనుచు
మనసెల్ల దుఃఖధూమ్రంబుగా నాత్మ
పతిముఖమ్మునయంద పరపినదృష్టి
వసివాళ్ళు వాడుచు వర్తించుచుండె. ౩౦౫

ఉ॥ అంత నభోంగణంబు సవనార్థమువోయెడునభ్రచారిదు -
ర్దాంతవిమానయానబహుధానినదంబుల యజ్ఞవర్ణనా-
త్యంతవిసారిఘోషముల నాసతిదేవిమనంబు పెంపు వి -
భ్రాంతము సేసె; దైవగతిపట్టున మానుష మెత్తు వచ్చునే ౩౦౬

కం॥ తలనెత్తి చూచె సతి ది -
క్కుల తూలంకషముగాఁ గొమరారు దివి -
షులవనితలతొడవుల వగు -
మలయుచునున్నట్టిమణులమంజిడివన్నెల్. ౩౦౭

ఆ॥ వానిఁ జూచినంత వనజాక్షికిని తాల్మి
సిలువలేదు మగనివలను సూచి
నేను వోదునని యె నివ్వెరింపఁడు సర్వ -
మెఱిఁగియైన చంద్రధరుఁడు శివుఁడు. ౩౦౮

కం॥ వచ్చినసతితో దక్షుఁడు
ముచ్చటలాడినది లేదు; మొగమటు వెట్టెన్;
వచ్చినది దోషమని తా
ముచ్చిరి సతిదేవి లోన మునుకుచునుండెన్ ౩౦౯

సీ॥ అంత నరుద్రకమైనజన్నంబు న
నాహ్వానరూపమైనట్టిరీథ
హృదయంబుఁ గాల్చిన నెసఁగుకోపంబు వ
హ్నిగ రేఁగి కాయంబు నెగడి కాల్ప
మరుజన్మకైనను హరుఁడ ధవుండంచు
సతిదేవి భస్మసాత్కృతిగనయ్యె
వార్త చేరినయంత వచ్చినప్రమథగ
ణంబులు నడచుజన్నంబు సెఱచి

గీ॥ మౌనులను దోలి ధాత యీశానుఁ దెలచి
మేషముఖుఁ జేసె దక్షు నామృడునికరుణ
దక్షుఁ డజ్ఞానవికటబంధంబు దలఁగి
పరమశివపాదసేవనాపరతఁ గనియె. ౩౧౦

మ॥ సతి యాత్మీయశరీరము న్దొఱఁగి యీశానార్పిత ప్రేమపూ -
రితచిత్తంబయి, వేఱుజన్మమున తండ్రిన్గాఁగ భావించె ప -
ర్వతమూర్ధన్యుని దేవతాత్మ భవశశ్వత్పాదపద్మార్పణా -
ప్రథితప్రాభవు, శీతశైలము మునీంద్రవ్యూహసంసేవ్యమున్. ౩౧౧

మ॥ పరమాత్మీయ సతీవియోగభవవిధ్వస్తాత్ముఁడై శాంతిదె -
ప్పరమై శంభుఁడు హైమశైలశిఖరప్రాంతాటవీ తుంగగ -

(34 వ పుటలో చూడుడు)

# హిందూమత మహిత

(గతసంచిక తరువాయి)

హిందువుల్లో శైవస్మార్తశాక్తవైష్ణవాది యెన్ని భేదములున్నా వాటికన్నిటికీ వేదమే ప్రమాణం. హిందూమతమనే గంగానదీ ప్రవాహంలో భిన్నసంప్రదాయాలు స్నాన ఘట్టాల్లాంటివి.

క్రైస్తవులలో క్యాథలిక్కులు, ప్రొటెస్టెంట్లు, ప్యూరిటన్లు. ఇస్లాంలోను సున్నీలు షియా దులు మున్నగునవి ఎన్నియో ఉన్నట్లు అంతశ్శాఖలు సహజమైనవి.

"స్వజాత్యుక్తం యథాశక్తి కర్మయః కురుతే పుమాన్ ముక్తిస్తస్యైవ సంసారాదితి వేదానుశాసనమ్" యే దేశములో బుట్టిన ఆ దేశ విహితధర్మానుష్ఠానము వలననే సంసారమునుండి మోక్షసామ్రాజ్యము అధిగమించగలరని వేదశాసనమ్. మాక్సుముల్లర్ పండితుడు మళ్ళీ నాకు జన్మఉంటే భారతదేశంలో పుట్టేభాగ్యము కల్గించమని భగవంతుని కోరుకున్నాడట.

హిందూమతము దేశపురోభివృద్ధికి ఆటంకమని ఆ మతసంస్కృతిని అనుభవించక మతనిజరూపమును తెలియజాలక భ్రష్టులను చేయుచున్నదనువారు లేకపో లేదు. అది మిథ్యాభాషణయే. ఈదేశంలో జాతీయోద్యమము ఆరంభమై వికసించటానికి హిందూమతపునరుద్ధారకులగు శ్రీయుతులు స్వామివివేకానంద, ఛత్రపతిశివాజీ, బాలగంగాధరతిలక్, అరవిందఘోష్, గాంధీజీ, మొదలగు వారి కృషియే ప్రధానకారణమని విజ్ఞుల్లెల్లరకు తెలుసు. హిందూమతము జాతీయ ఉద్యమములకు పునాదియై నిలచినది. మతము పేరుతో కొన్ని అన్యాయములు, అక్రమ అనాచారములు జరుగవచ్చును. కానీ మతము మానవునకు మాధవునకుగల సంబంధమును దెలియజేయును. మానవుడు మనస్సును జయించవలెను. సర్వ మానవసౌభ్రాతృత్వము కలిగియుండాలి. వారి ప్రవర్తనపై భవితవ్యం నిలబడుతుంది. తమ ప్రవర్తనలోని లోటుపాట్లకు ఇటు ప్రజానీకమునకు అటు భగవంతునికీ కూడా సంజాయిషీ చెప్పుకోవలసి ఉంటుందని జాగృతిని ఇస్తుందీ హిందూమతము.

భారతీయమానవు లాదర్శమతమహిత జీవులగుటకు వేదవాసన గుబాళింపులు కనుడు.

---

శ్రీ పండిత పరాంకుశ
సత్యనారాయణ భట్టాచార్య
కొల్లిమర్ల

---

"వేదమనూచ్యాచార్యోఽన్తేవాసిన మనుశాస్తి. సత్యం వద. ధర్మం చర. స్వాధ్యాయాన్మాప్రమదః. ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతుం మావ్యచ్ఛేత్సీః. సత్యాన్నప్రమదితవ్యమ్. ధర్మాన్నప్రమదితవ్యమ్. కుశలాన్నప్రమదితవ్యమ్. భూత్యైనప్రమదితవ్యమ్. స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్. మాతృదేవోభవ; పితృదేవోభవ; ఆచార్యదేవోభవ; అతిథిదేవోభవ. యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని. నోఇతరాణి యేకేచాస్మచ్ఛ్రేయాగ్ం సో బ్రాహ్మణాస్సమ్మరినః యుక్తా అయుక్తాః. అలూక్షా ధర్మకామాస్స్యుః. యథాతే తత్ర వర్తేరన్ తథా తత్ర వర్తేథాః అథాభ్యాఖ్యాతేషు యే తత్ర బ్రాహ్మణాస్సమ్మర్శినః యుక్తా అయుక్తాః అలూక్షా ధర్మకామాస్స్యుః. యథాతే తేషు వర్తేరన్ తథా తేషు వర్తేథాః. ఏష ఆదేశః. ఏష ఉపదేశః. ఏషా వేదోపనిషత్ ఏతదనుశాసనమ్. ఏవ ముపాసితవ్యమ్. ఏవముచైవతదుపాస్యమ్. ఇతి యజుర్వేదీయతైత్తిరీయోపనిషత్"

విద్యావంతుడైన శిష్యునకు స్నాతకోత్సవమున ఆచార్యుడు ఇలా బోధించవలెనట. సత్యమును పలుకుము. ధర్మము ననుష్ఠింపుము. పఠ్యమాన వేదాది సర్వవిద్యలను ప్రమాదముచేగాని సోమరితనముచేగాని పరిత్యజించకుము. నీకు విద్యనేర్పిన గురువునకు దక్షిణారూపమైన అతనికిష్టమైనధనమునిచ్చి ఆయన అనుజ్ఞతోగృహస్థాశ్రమమున బ్రవేశించి ధర్మపత్నివలన సత్సంతానము బడయుము. ఎప్పుడును సత్యమును విడువరాదు. ధర్మపరిపాలనమందు ప్రమాదము నొందరాదు. అట్లే లౌకికాఽలౌకిక శుభకర్మలను కర్తవ్యకార్యములను ప్రమాదవశమున త్యజించరాదు. లౌకికసంపత్తివర్ధకములు, ఉన్నతి సాధనభూతములైన పనులయందు ఔదాసీన్యముగా నుండక నేర్పుతో చేయుము. నేర్చిన విద్యలను ఒకరికి చెప్పుటయందు ఆలస్యవశమున విడువరాదు. ఇట్లే అగ్నిహోత్రదైవారాధనల యందు శ్రాద్ధతర్పణాది పితృకార్యములందున ఆయా కాలములందు ప్రమాదము నొందక ఆచరించుచుండవలెను. తల్లిని తండ్రిని, గురువును అతిథిని దైవముగా భావించి సేవింపుము. లోకములో నెవ్వి నిర్దోషకర్మలో వాటిని ఆచరించుచు భిన్నములైన నిషిద్ధకార్యములను ఆచరింపకుము. ఆచారవ్యవహారములందు శిష్టజనామోదితమైన దేదిగలదో దానిని గ్రహించి ఆచరింపుము. ఆచరణలయం దేదేని దోషములున్నచో సందేహాస్పదమగుచో దాని నాచరింపకుము. గ్రహింపకుము. ఇంకను ఎవరేని మాకంటె విద్యయందు తపస్సు

( 33వ పేజీలో చూడుడు)

# భక్తి హేతువాద జన్యంకాదా?

సాహిత్యశిరోమణి, "భాషాప్రవీణ"
సూరం శ్రీనివాసులు, యమ్. ఏ.
పొన్నూరు.

ఆధునికసమాజంలో దైవదూషణ ఒక ఫేషనయింది. చాలామంది తాము ఆస్తికత్వాన్ని విశ్వసిస్తున్నట్లు చెప్పుకోవాలంటే సిగ్గుపడటంకూడ మనం గమనిస్తూనేవున్నాం. దానికి కారణం - హేతువాదమని చెప్పుకునే నాస్తిక సిద్ధాంతానికి సరియైన సమాధానం చెప్పలేక తమలోని విశ్వాసాన్ని చంపుకోలేక అనిశ్చిత స్థితిలో నుండటమే. నిజానికి ఆలోచిస్తే భక్తి తత్త్వం కాని - దైవస్థాపనం కాని హేతువాదంవలన పుట్టినవే. అది నిర్హేతుకమను భావంతో దైవనాస్తిక్యాన్ని చెప్పదలచిన వాళ్ళు తమ భావాలకు హేతువాదమని పేరు పెట్టుకుంటున్నారు. కాని ఆస్తికతయే సరియైన హేతువాద సిద్ధాంతంమీద ఆధారపడినది. ఎట్లో చూద్దాం.

మాతృభక్తి, పితృభక్తి, గురుభక్తి, దేశభక్తి, దైవభక్తి ఇలా రకరకాలుగా భక్తిపదం విన్పిస్తోంది. ఈ పదాలను విన్నప్పుడల్లా మనకు స్ఫురించేభావం - మనమనస్సు సంలీనం కావాలనుకునే వలయం ఆత్మార్పణము, త్యాగము. అందుకు కారణం ఆ పదాలు - తత్పదార్థబోధితవ్యక్తులు మనలో కలిగించెడి ఆశ్చర్యవిశేషమే. కన్నతల్లి నవమాసాలు మోసి కని జన్మనిచ్చినందుకు కలిగే ఒక విస్మయభావమూలంబనంగా మాతృభక్తి ఏర్పడుతుంది, జంతుజాలములలో అనేకములు కన్నపిల్లలను గాలికి వదిలేస్తుంటే అట్లుగాక చిన్ననాటినుండి పిల్లలను బాధ్యతగా పెంచుతున్నందుకు తండ్రివలన కలిగే విస్మయమే పితృభక్తిగా రూపాన్ని ధరిస్తుంది. అట్లే అజ్ఞానదశలో తనవద్దకు వచ్చినబాలుని ఓర్పుతో నేర్పుతో విజ్ఞానిని సంస్కారిని చేసిపంపెడి గురువుగారి వరన వలన ఏర్పడిన విస్మయమే భక్తిగా పరిణమిస్తుంది. అట్లే మృదాత్మకమైన భూమిని మాతృమూర్తిగా భావించటంలో దానికిగల గురుత్వాకర్షణశక్తి - సర్వాహార ప్రదత్వం మొదలగునవి ఆశ్చర్యాన్నికల్గించి దేశభక్తివి రూపొందిస్తాయి. అట్లే దైవభక్తి కూడా పైనచెప్పినట్లు భక్తిభావం కల్పించే పలుతావులందును ముందు విస్మయం గుండెలనుపిండగా ఆ సారం భక్తిగా పరిణమిస్తోంది. విస్మయావహములయిన ఆ మెఱుపులనుండి అనుభూతులను బ్రతుకులలో నోచుకోలేని వ్యక్తులకు మాతృభక్తి పితృభక్తి వంటివికూడా తెలియవంటే తప్పుకాదు. వీటన్నింటిని మించినది దైవభక్తి - ఆ దైవభక్తికికూడా మూలం మొదట విస్మయం. తర్వాత భయం, ఎలాగో చూద్దాం —

మానవునిలో ఇతరప్రాణులకన్న అత్యుత్తమమైనగుణం మేధ అని అందరూ అంగీకరించినదే. ఆ మేధ అనాదిమానవునిలోని ఆలోచనలను తట్టిలేపింది. ఈ సృష్టి - అందులోని వైచిత్ర్యాలనుగూర్చి ఆనాటి మనిషి బాగా తర్కించాడు. క్రమంతప్పక ప్రొద్దుటే ఉదయించే సూర్యుడు - రేయి పొడసూపే చంద్రుడు, ఎండ-గాలి-వాన-రమణీయ ప్రకృతి. సస్యశ్యామలములైన కేదారాలు ఇవన్ని మానవుని ఆశ్చర్యచకితుణ్ణిచేశాయి. అంతేకాదు ప్రకృతిని ప్రకృతిగా చూచినకాలంనాటి మానవునికంటె దానిని తనకు అనుకూలంగా మార్చుకోవాలని ప్రయత్నించిననాటి మానవుడు మరీ ఎక్కువవిస్మయానికిలోనయ్యాడు. కారణం ఆ ప్రకృతిలోని అనేకశక్తులు తనకులొంగక పోవటమేగాక అందుబాటులోనికి రాక పోవటం- ఈ రీతిగా ప్రకృతిని దానిస్వేచ్ఛాతత్త్వాన్ని పరిశీలించిన తర్వాత మానవుని మస్తిష్కంలో విశేషాలోచనలు ప్రారంభమయ్యాయి. మానవుడెంత ప్రయత్నించినా నాటికి నేటికి లొంగని ప్రకృతిశక్తులను మనం చూస్తూనేవున్నాం - ఆ శక్తులే మానవుని మొదటిసారిగా విస్మయావహుని చేసి హేతువాదానికి పురిగొల్పాయి.

మానవశరీరం పనిచేసే విధానాన్ని సైతం మనిషి ఆలోచించాడు. ఎంతో వేగాన్ని - ఎంతో యాంత్రికశక్తిని గుప్పెట్లో పెట్టుకున్నట్టుగా కనిపించే ఈ శరీరతత్త్వం ఎంతో ఆశ్చర్యాన్ని కల్గించినది. కత్తికికండగా కోసిచూచినా చీము నెత్తురు మాంసం కనిపించే ఈ శరీరంలో మానవునిలోని ఇంతవిస్తృతమైన తీక్షణమైన భావనాశక్తిని లేక విశిష్టతత్త్వాన్ని ప్రకటింపజేసే శక్తి ఏది? అన్న ఆలోచన మానవునకు కల్గింది. సర్వేంద్రియజ్ఞానము క్షణాలమీదనే జరుగుతోంది. నిద్దుర అనే నిశ్చైతన్యస్థితికి వెళ్తున్నాడు. మరల ఎవరి ఆపేక్షలేకుండా తానే చైతన్యంలోకి చేరుకుంటున్నాడు. కానీ చావు అనే నిశ్చలస్థితికి వెళితేమాత్రం మరల చైతన్యంలోకి రాలేకపోతున్నాడు. ఆసమయంలో ఏశక్తి అతనిలో ఎటువంటితత్త్వాన్ని కల్గిస్తోంది. ప్రాణాలు పోయినాయని మనం చిన్న పదంతో కొట్టేస్తున్నాము. కాని అవి ఎక్కడికిపోయాయి. ఎలాపోయాయి. ఇంతకు ముందు ఎక్కడవున్నాయి అని ఆలోచిస్తే సరియైన సమాధానం దొరకని ప్రశ్న.

# సప్తగిరి

## తిరుమల తిరుపతి దేవస్థానముల మాసపత్రిక.

*

సప్తగిరి మాసపత్రికలో వ్యాపార ప్రకటనలు ఈ దిగువ కన్పరచిన రేట్ల ప్రకారముప్రచురించబడును.

### ఒక్కొక్క ప్రకటనకు

| | | | | | |
|---|---|---|---|---|---|
| లోపల పేజీలో: | పూర్తిపేజి | .... | .... | రు. | 80/- |
| | అర్ధపేజి | .... | .... | రు. | 50/- |
| | పావుపేజి | .... | .... | రు. | 30/- |
| కవరుపేజీలు: నాల్గవపేజి | 1 రంగులో | .... | .... | రు. | 200/- |
| | 2 రంగుల్లో | .... | .... | రు. | 250/- |
| | 3 రంగుల్లో | .... | .... | రు. | 300/- |
| లోపల 2వ పేజి 3వ పేజి | 1 రంగులో | .... | ... | రు. | 150/- |
| | 2 రంగుల్లో | .... | .... | రు. | 200/- |
| | 3 రంగుల్లో | .... | .. . | రు. | 250/- |
| ప్రత్యేకస్థలము లోపల పేజీలో | 1 మొట్టమొదటిపేజి | .... | .... | రు. | 150/- |
| | 2 చివరిపేజి | .... | .... | రు. | 110/- |
| | 3 వార్తలపేజికి ఎదురుపేజి | | 1 పేజి | రు. | 100/- |
| | | | ½ పేజి | రు. | 60/- |

### సాంకేతిక సమాచారము

| | | | |
|---|---|---|---|
| స్క్రీన్: | కవరుపేజీలు | .... | 80 నుండి 100 |
| | లోపలపేజీలు | .... | 65 నుండి 80 |
| పేజిపరిమాణము (బ్లాకులకు) | పూర్తిపేజి | .... | 24 సెం. మీ × 19 సెం. మీ |
| | అరపేజి | .... | 12 సెం. × 19 సెం. మీ |
| | పావుపేజి | .... | 6 మీ × 19 సెం. మీ |

ప్రకటనకు సంబంధించిన విషయములు, బ్లాకులు, సంస్థలవారే సరఫరా చేయవలయును.

గమనిక: 1, 4వ కవరు పేజి తప్ప మిగిలిన పేజీలలో 6 నెలసరి సంచికలకు ముందుగా డబ్బు చెల్లించి స్థల నిర్ణయము చేసుకొనువారికి ప్రకటన రేట్లపై 10% ను 12 సంచికలకు స్థల నిర్ణయము చేసుకొనువారికి 15% శాతమును ముదరా ఈయబడును.

2. ఈ వ్యాపార ప్రకటనల విషయము ముందు తెలుపక, కారణములు తెలుపకయే ఏ ప్రకటననైనను నిరాకరించు హక్కు సంపాదకునకు కలదు.

కార్యనిర్వాహక అధికారి,

**తిరుమల తిరుపతి దేవస్థానం.**

శరీరంలోని చీము, నెత్తురు, మాంసం ఆ పనిచేస్తాయంటే వాటిని విడిగా తీస్తే అస హ్యాన్ని కల్గిస్తాయేగాని ఆ శక్తులు కన్పిం చవుగదా? అయితే ఆ శక్తి ఎక్కడుంది. ఆ పదార్థములన్నింటి సమన్వయంలో వుందని సమాధానం. ఆ సమన్వయకర్త ఎవరు? ఇది మానవునిలో ఆనాడు కలి గిన జిజ్ఞాస అయివుండవచ్చు. ఈ నాడూ కలుగుతోంది. ఇదికూడా మానవునిలోని హేతువాదాన్నే పెంచింది.

అటు బాహ్యతత్త్వాలైన ప్రకృతిశక్తులు ఇటు అంతస్తత్త్వమైన రెండును ఒకటి దృశ్యం అజేయం, రెండవది అదృశ్యం అజయ్యంకావటంతో మానవునిమేధ మరీ ముందుకు పయనించవలసిన అవసరమేర్ప డినది. ఈ రెండుతత్త్వాలకు మూలమై కర్తృత్వాన్ని వహించగల వ్యక్తి ఎవరు? అన్న ఆలోచన ఆనాటి మానవునిలో కలి గింది. ఆనాడే ఇలా సిద్ధాంతీకరించవలసి వచ్చినది.

కార్యమేదయినా ఎవరోయొక కర్త లేనిదే జరుగుట కవకాశం కన్పించటం లేదు. కుండచేయాలంటే కుమ్మరి కర్త. నగలుచేయాలంటే కంసాలికర్త. ఇలా ఏ పని జరుగుతున్నా ఎవరోయొకరి కర్తృ త్వం తప్పకుండా కన్పిస్తోంది. కాబట్టి భూమ్యాకాశాదులకు, సూర్యచంద్రాదులకు కూడా కర్తఎవరో వుండితీరాలి? ఆ కర్త ఎవరు? అన్నది ప్రాథమికమైన హేతు వాదం. ఆలోచనలో ప్రధానాంశం —

ఈ ఆలోచన ప్రారంభదశలోనున్న కాలంలో మానవుడు భావాలకు దైవత్వ కల్పనాన్ని ప్రారంభించాడు. కోపాన్ని మన్యుదేవత అన్నాడు, అరుణోదయం లోని కాంతులకు ఉషోదేవత అని పేరు పెట్టాడు. సూర్యుడు - చంద్రుడు - గాలి ఏవేవి అయితే తనశక్తికతీతాలో వాటి కన్నింటికి దైవత్వస్వరూపాన్ని కల్పిం చాడు. ఈ రీతిగా భారతీయసంస్కృతి ప్రారంభదశలో అనంతశక్తులకు అనంత దేవతామూర్తికల్పన జరిగింది. ఆ శక్తుల సంప్రీతికోసం ప్రయత్నాలు ప్రారంభిం చాడు. అది భక్తిభావంయొక్క ప్రారంభ దశ.

ఆ తర్వాత ఆ అనంతశక్తుల (విపరీత విరోధశక్తులకు నైతం) మూలం ఎవరు? అని మరికొంత ముందుకువెళ్ళి ఆలోచిం చినకాలంలో హేతువాదదృక్పథం విజృం భించింది. "ఈశావాస్యమిదం సర్వం" అని మంత్రద్రష్టలైన ఋషులు తమ హృదయాలలో ఏర్పడిన మెఱుపుతీగల వంటి భావాలకు రూపకల్పనచేశారు. ఒక విశిష్టపురుషుడు-అనంతశక్తిసంపన్నుడు- విశ్వరూపుడు ఈ సృష్టికి కారణమని ఆ పురుషునివలననే ఈ ప్రపంచంఅంతా నడు స్తోందని భావించారు. ఆ పురుషుని త్యాగ ఫలమే సమస్తసృష్టికి మూలమని నిశ్చ యించారు. ఆ సారాన్ని పురుషసూక్తంలో పొందుపరిచారు.

సహస్రశీర్షాపురుషః. సహస్రాక్షస్సహ స్రపాత్. స భూమిం విశ్వతో వృత్వాఽత్య తిష్ఠద్దశాంగులం. పురుష ఏవ వేదగ్ం సర్వం యద్భూతం యచ్చభవ్యం — అని భూతభవిష్యత్తులన్నీ ఆ పురుషస్వరూపమే అన్నారు. అతని త్యాగమే అన్నింటికి మూలం—

యత్పురుషేణ హవిషా దేవాయజ్ఞమ తన్వత వసన్తోఽస్యాసీదాజ్యం గ్రీష్మ ఇద్ధ్మ శ్శరద్ధవిః ... దేవా యద్యజ్ఞం తన్వానా అబధ్నన్ పురుషం పశుం .... తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ పురుషం జాతమగ్రతః —

ఆ పురుషుని హవిస్సుగాచేసి పశువును గాజేసి దేవతలు యాగంచేశారు. దాని

(32 పేజీలో చూడుడు)

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం

నారాయణవనం.

★

### నిత్యకార్యక్రమ వివరాలు

| | | | |
|---|---|---|---|
| సుప్రభాతం ఉ॥ | 6-30 నుండి | | 7-00 |
| విశ్వరూపదర్శనం | 7-00 | ,, | 8-30 |
| తోమాలసేవ | 8-30 | ,, | 9-00 |
| కొలువు, అర్చన | 9-00 | ,, | 9-30 |
| శాత్తుమొర & గంట | 9-30 | ,, | 10-00 |
| సర్వదర్శనం | 10-00 | ,, | 11-30 |
| 2-గంట, అష్టోత్తరం (ఏకాంతం) | 11-30 | ,, | 12-00 |
| తీర్థానం | 12-00 | | |
| సర్వదర్శనం సా॥ | 4-00 | ,, | 6-00 |
| తోమాలసేవ, అర్చన (ఏకాంతం) | 6-00 | ,, | 6-30 |
| రాత్రి కైంకర్యం | | | |
| శాత్తుమొర | 6-30 | ,, | 7-00 |
| సర్వదర్శనం | 7-00 | ,, | 8-45 |
| ఏకాంతసేవ | 9-00 | | |

### ఆర్జితాదుల వివరాలు

| | | |
|---|---|---|
| అర్చన, అష్టోత్తరం .... | రు. | 3-00 |
| హారతి .... | రు. | 1-00 |
| కొబ్బరికాయకు .... | రు. | 0-50 |
| సహస్రనామార్చన .... | రు. | 5-00 |
| పూలంగి (గురువారం మాత్రం) .... | రు. | 1-00 |
| అభిషేకానంతర దర్శనం (శుక్రవారం) | రు. | 1-00 |
| తిరుచ్చి వాహనోత్సవం (వాహకుల రుసుముకాక) | రు. | 15-00 |
| సింగమొరై ఖర్చులు .... | రు. | 2-50 |

# శ్రీ వరాహ పురాణం

అనువక్త: శ్రీ ఏలూరుపాటి అనంతరామయ్య,
అధ్యక్షులు:
డా॥ కె.వి.కె. సంస్కృత కళాశాల,
గుంటూరు

## రెండవ అధ్యాయం

### సృష్టిస్థితియుగమాహాత్మ్యము

సూతుడు చెప్పాడు:

అనంతరం హరి ధరణీభక్తికి సంతోషించి, తనశరీరంలో ఉండి, మాయను వెల్లడించి, ఆ వరాహరూపంతోనే ఉన్నాడు.[1] అన్నాడు: సొగసరిపిరుదుల దానా, నీ ప్రశ్నగురించి నీకేమి చెప్పను? పురాణవిషయం సర్వశాస్త్రాలవల్లనూ లభింపరానిది.[2] ధరణీ, పురాణాలన్నింటిగురించీ సమానంగా వర్తించే ఈశ్లోకాన్ని నిర్ణయించి చెపుతారు. కనుక, సంపూర్ణంగా విను:[3]

సర్గశ్చ ప్రతిసర్గశ్చ
వంశో మన్వంతరాణి చ।
వంశానుచరితం చేతి
పురాణం పంచలక్షణమ్॥

సృష్టి, ప్రతిసృష్టి (ప్రళయం), వంశం, మన్వంతరాలు, వంశానుచరితం – అన్న ఐదు లక్షణాలుగలది పురాణం[4].

వరాననా, నీకు ఆదిసృష్టిగురించి చెపుతాను. దానితో మొదలై దేవతలచరిత్రా, రాజులచరిత్రా,[5] నాలుగు విభాగాలయిన సనాతన పరమాత్మగురించీ నీకు తెలుస్తుంది.[6]

### సృష్టి

ఆదికాలంలో (పరమాత్మనుంచి) అహంకారమూ, ఆకాశం మొదలయిన పంచమహాభూతాలూ ప్రభవించాయి. అనంతరం మహత్తత్త్వమూ అణురూపప్రకృతీ, తరువాత సమష్టిబుద్ధీ అవిర్భవించాయి. ఆ బుద్ధి. సత్త్వగుణం, రజోగుణం, తమోగుణం – వీటితో కలిసి వేరువేరుగా మూడు విధాలైనది.[7] ఆ మూడింటిలో తమోగుణసంయోగంవల్ల మహాబ్రహ్మ వ్యక్తమైనది. దానిని తత్త్వజ్ఞులందరూ ప్రధానం (ప్రకృతి) అంటారు. దానికంటె ప్రభావం ఎక్కువ క్షేత్రజ్ఞునికి. ఆయన నుంచి సత్త్వాదిగుణాలూ, వాటినుంచి ఆకాశాది తన్మాత్రలూ, ఇంద్రియాలూ కలిగాయి. జగత్సృష్టి ఇలా ఏర్పాటైనది కళ్యాణీ, నేనే పంచభూతాలతోనూ స్థూలశరీరనిర్మాణం చేశాను.[9] మొదట శూన్యమే ఉన్నది. అందునుంచి శబ్దమూ, శబ్దంనుంచి ఆకాశమూ, దానినుంచి వాయువూ, దానినుంచి తేజస్సూ, దానినుంచి జలమూ, దానినుంచి ప్రాణులను ధరించేటందుకని నిన్ను నేను సృష్టించాను.[10]

పృథీవీజలసంయోగంతో బుడగలాంటి కలలం ఏర్పడింది. అదే గ్రుడ్డుగా పెరిగేసరికి నేను జలరూపంతో ఉన్నాను. నా ఈ రూపాన్ని నేనే నిర్మించుకొన్నాను తొలుత.[11] అలా నారములను–నీళ్లను–సృష్టించి వాటిలో నివసించాను నేను. అందుకనే నారాయణుడన్న పేరు వచ్చింది ప్రతికల్పంలోనూ ఆ నీటిపై శయనిస్తాను. ఇప్పటిలాగనే నిదురిస్తున్న నా నాభినుంచి కమలం జన్మిస్తుంది.[12]

ఇలా ఉన్న నా నాభికమలంనుంచి చతుర్ముఖబ్రహ్మ వెలువడ్డాడు. అతనితో నేను "మహామతీ, ప్రజలను సృజించు" అని[13] చెప్పి నేను అంతర్ధానం చెందాను.

11. కలలం = మావి; జరాయువు.

### రుద్రసృష్టి

అతడూ సృష్టిగురించి ఆలోచిస్తూ ఉన్నాడు. కానీ, జగద్ధాత్రీ, అతనికేమీ తోచలేదు.[14] అపుడా అవ్యక్తజన్ముడైన బ్రహ్మకు మహారోషం వచ్చింది. ఆ రోషంవల్ల రోషస్వరూపుడు ఒకబాలుడు పుట్టుకొచ్చాడు.[15]

వాడు ఏడుస్తుంటే అవ్యక్తమూర్తి బ్రహ్మ ఏడవవద్దు అన్నాడు.

వాడు "నాకు పేరుపెట్టు" అన్నాడు.

బ్రహ్మ అతనికి "రుద్రుడు" అని పేరు పెట్టాడు.[16]

అతనితో "లోకాలను సృష్టించు" అని చెప్పాడు కళ్యాణీ

అపుడాబాలుడు అశక్తుడనని నీళ్లలో మునిగి తపస్సుకు పూనుకొన్నాడు.[17]

అతడు నీళ్లలో మునిగిపోయేసరికి, బ్రహ్మ, ప్రాణిసృష్టికోసం తనకుడిబొటనవ్రేలినుంచి, మరొక గొప్ప ప్రజాపతిని సృష్టించాడు.[18]

ఎడమబొటనవ్రేలినుంచి అతనిపత్నిని సృష్టించాడు తరువాత.[19]

అతనివల్ల ఆమెకు ప్రభువు, స్వాయంభువమనువు జన్మించాడు.

అతనిద్వారా పూర్వం బ్రహ్మ ప్రజావృద్ధి చేశాడు.[20]

(అని చెప్పగా విని) పృథివి "సురేశ్వరా, ఆదిసృష్టిగురించి సవిస్తరంగా చెప్పు ఈ నారాయణుడు కల్పాదిని బ్రహ్మ ఎలా అయాడు?" అని ప్రశ్నించింది.[21]

(29 వ పేజీలో చూడుడు)

18. కుడిబొటనవ్రేలు = దక్షిణాంగుష్ఠం. అందునుంచి పుట్టినవాడు కనుక అతడు దక్షుడు.

# బుద్ధదర్శనము

గౌతమబుద్ధుని చరిత్ర సుప్రసిద్ధము. పవిత్ర భారతావనిలో కాశీక్షేత్రమునకు ఉత్తరభాగమునగల కోసలరాజ్యములో 'కపిలవస్తు' అనే నగరాన్ని రాజధానిగా చేసుకొని పాలించిన శాక్యనరపాలుడు శుద్ధోదనునికి, అతని పట్టమహిషి మాయాదేవికిని ఉత్తమసంతానమై వైశాఖపూర్ణిమ నాడు జన్మించినవాడు బుద్ధుడు. మాయాదేవి స్వప్నఫలితమే గౌతమబుద్ధుని అవతారం. బుద్ధుడంటే ప్రబోధం పొందినవాడు; ప్రపంచంయొక్క బంధనాలనుండి సంసారచక్రంనుండి విముక్తుడై నిర్వాణం పొందినవాడు. తన తల్లితండ్రులను, రాజభోగములను. చివరకు భార్య యశోధరను పసికందైన పుత్రుడు రాహులుని, అందరిని అన్నిటిని పరిత్యజించి మహాభినిష్క్రమణ మొనరించి స్వకీయప్రజ్ఞాప్రభావమున నాలుగార్యసత్యముల ననుభవమునదర్శించి తన జన్మదినమైన వైశాఖపూర్ణిమనాడే బుద్ధత్వము పొందినాడు. బుద్ధుడు రాగ ద్వేష మోహాదులు, నిర్విశేషంగా జయించినవాడు; సుస్థిర జయశాలి; లోకం సామాన్యబుద్ధికి అగోచరుడు.

బుద్ధుడు తన యెనుబదిసంవత్సరముల వయసులో తన జన్మదినము, బుద్ధత్వము పొందినరోజు అయిన వైశాఖపూర్ణిమ నాడే నిర్వాణము చెందినాడు. నిర్వాణము బొందిననాటినుండి బుద్ధుడు, తథాగతుడు-అర్హతుడు-భగవంతుడు - మహాపురుషుడు సత్యనాముడు - అన్న పేర్లతో జగతిలో ప్రసిద్ధిగాంచెను. దీక్షారహితమైన జీవితాన్ని పారద్రోలి, శాంతి సమాధానమును, ప్రజ్ఞను అనుగ్రహించి విశ్వదుఃఖము నుపశమింపజేయుటకే బుద్ధభగవానుని ఆగమనం జరిగింది. శ్రీమన్నారాయణుని దశావతారములో బుద్ధావతారంకూడా ఒకటిగా మనం యీనాడు యెంచడం జరుగుతోంది. జ్ఞానోదయంకల్గిన పిదప బుద్ధభగవానుడు లోకానికి, మూఢప్రజావళికి సందేశమిచ్చింది ఏమంటే —

"యితి దుఃఖమేతదియ మస్య సముదయ<br>
లతా ప్రవర్తికా।<br>
శాంతి రియ మయ ముపాయ ఇతి భాగశః<br>
పరమ మిదం చతుష్టయః॥

అని బుద్ధభగవానుడు అనాత్మలక్షణసూత్రములను బోధించి దుఃఖరూపములు అనిత్యములని, లోకులు భావించు సంకుచితాత్మ భావాలను వారినుండి తొలగించాడు. దుఃఖమును, శీలమును, కామానుభవ సంక్లేశములను గురించి బుద్ధుడు అనేకుల కుపదేశించాడు. రాగ ద్వేష మోహములే విషజ్వాలామయమైన యగ్నులని, వీనివలన ఆనంద దుఃఖములను జ్వాలలు సెగలుచిమ్ముతూ రేగుననియు బుద్ధభగవానుడు విప్పిచెప్పెను. ఈ రాగమోహములే జన్మ జరామరణములను కలిగించి సకలదుఃఖములకు, మనోక్లేశములకు కారణభూతమగుచున్నది

"కామతోజాయతే సోకో కామతోజాయతే<br>
భయం<br>
కామతో విప్పముత్తస్స నత్థి సో కోకుతో<br>
భయం"

అనియు,

"అక్రోధేవ జినేక్రోధం అసాధుం సాధు<br>
నా జినే<br>
జినేకతీరయం దానేవ సచ్చేన అలికవా<br>
దినం"

అని బుద్ధుడు లోకానికి దివ్యసందేశాన్ని ప్రసాదించాడు. అక్రోధముచే క్రోధాన్ని, సాధుత్వముచే అసాధుత్వాన్ని. దానముచే లోభాన్ని, సత్యముచే అసత్యవాదినిజయింపవలయునని, జయింపగలమని ప్రజల హృదయాలకు తనవుపదేశం చేశాడు. ఈ రీతిగా ప్రజలమనస్సును, మూఢహృదయములను శ్రద్ధాభక్తిపూర్ణముగావించి ధర్మోపదేశమున చతుస్సత్యములను, ప్రాపంచిక క్షణిక స్వభావములను విమర్శించి విడమరచి వివరించి, సంకుచితాత్మభావమే జననమరణాలకు, నిరాశాదుఃఖాలకుకారణమని ప్రబోధించాడు బుద్ధుడు.

ప్రపంచంలో యథార్థమైన హేతువాది ఉంటూ ఎవరైనావుంటే, ఆయన బుద్ధభగవానుడేతప్ప మరొకరులేరు. పరోక్షప్రమాణాన్ని పురస్కరించి ఏదీ నమ్మరాదని ఆయనవాదం. అందుకే "పరీక్షాం వీక్ష్య గ్రాహ్యం మద్వచో నతు గౌరవాత్" అన్నారు ఆయన. ప్రతివ్యక్తిలోనూ అంతర్నిహితమైవున్న బుద్ధి, అంతఃకరణలే

శ్రీ జి. వాసుదేవన్
హైదరాబాద్

సత్యాసత్యనిర్ణయానికి సమర్థమైన సాధనాలు. అలాగే దీక్షారహితమైన జీవితము, జీవనము తంత్రీవిహీనమైన వీణతో సమానము. దీక్షయే మానవజీవితమును అర్థవంతము, ఫలప్రద మొనరించు చున్నది. అందుకే కాబోలు దీక్షాయుతమైన బుద్ధినే భగవానుడు ప్రమాణముగా స్వీకరించారు.

తొలిసారి రోగిని, వృద్ధుని, చివరకు మృతుణ్ణి చూచినప్పుడు ఆయనలో "యీ జరామరణ వ్యాధులనుండి మానవులు బయటపడి, తరించేమార్గం లేదా? చివరికి యివేనా మానవజాతికి గమ్యస్థానాలు? పునరపి జననం - పునరపి మరణం - యింతేనా జీవితసత్యం? మానవతకు, మానవ జీవితానికి పరమార్థమేమిటి? యీ జన్మ మృత్యువులను అతిక్రమించిన వున్నతపథం

తిరుచానూరు శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయంలో...



# ఆర్జితడోలోత్సవం

ప్రతి శుక్రవారంనాడు సాయంత్రం అద్దాల మంటపంలో దేవస్థానంచే డోలోత్సవం (ఊంజల్ = ఊయలసేవ) నిర్వహించబడుతుంది. కాని ఈ సేవ దేవస్థానానికేపరిమితం కాదు. రు. 150 చెల్లించి గృహస్థులు ఈ సేవలో పాల్గొనవచ్చు. గృహస్థు ఆయనకు సంబంధించినవారు మొత్తం 4 వ్యక్తులు అద్దాలమంటపంలో కూర్చుని సేవ తిలకింపవచ్చు. సేవ తరువాత గృహస్థుకు వెండిపతకం బహూకరించబడుతుంది. అదనంగా పాల్గొనే ప్రతి భక్తుడు రు. 25/- చెల్లించవలసి ఉంటుంది. భక్తులీ సదవకాశాన్ని వినియోగించుకొని తరింపవచ్చు.

★

**తి. తి. దేవస్థానం, తిరుపతి.**

మరేదైనా కలదా?" అన్న ప్రశ్నలపరంపర ఆక్రోశమై వెలువడ్డది. కాని అచిర కాలంలోనే మహాభినిష్క్రమణ మొనరించి. ఒకనాడు తనలో ఏర్పడిన ప్రశ్నల ఆక్రోశానికి సమాధానం తెలుసుకొన్నారు. ఈ ప్రపంచ జీవనమంతయు (1) దుఃఖపూర్ణము (2) దుఃఖసముదాయము (3) దుఃఖనిరోధము (4) దుఃఖనిరోధోపాయం అన్న నాలుగార్య సత్యముల నుపదేశించినాడు

బుద్ధ భగవానుడు నిర్దేశించిన బౌద్ధ మతంలో మూఢంగా విశ్వసించవలసిన సూత్రాలుగాని, సిద్ధాంతాలుగాని ఏవీలేవు. ధర్మానుసరణమే జీవితసార్థక్యం. కాబట్టి సహేతుకమైన దృక్పథం అవలంబించి, వ్యక్తిగతానుభవం ద్వారా పరమార్థాన్ని సాధించాలని బుద్ధునిమతం. పరిణామశీలమైన ఈ జగత్తుయొక్క అంతరాంతరాలలో మార్పులేని ఒక పరమసత్యం యిమిడి వుందని ఆయన కనుగొన్నాడు. ప్రపంచంలో ధర్మంఅనేది ఒకటివుంది. ఈధర్మపథాన్ని అవలంబించడంవల్లనే మానవుని చైతన్యం ప్రబుద్ధమౌతుంది. దయా, దమ దానాలను మానవులు అవలంబించడానికి పదేపదే జ్ఞాపకంచేస్తూ వురుములు 'దదద' అనే ధ్వనులతో వురుముతాయని ఉపనిత్తులలో చెప్పబడివుంది.

ఈ భారతభూమి కర్మభూమి ఇందు ఎందరో మహానుభావులు అవతరించారు. అలాగే అవతరించిన ప్రతిమహానుభావుడు ఏదో ఒక నగ్నసత్యాన్ని, మహత్తర త్యాగాన్ని చాటిచెప్పాడు. భగవంతుని దశావతారాలు ఎలా చిరస్మరణీయమో అలాగే దశావతారంలో ఒక అవతారమైన బుద్ధుడు చిరస్మరణీయుడే కాదు - అతని

(27వ పేజీలో చూడుడు)

# వేదాంత దేశికులు

(గత సంచిక తరువాయి)

మనుష్యత్వము ఆత్మ యొక్క శరీరమును బోధించు చున్నది. అయినను, మనుష్యుడని చెప్పుటచే మనుష్య శరీరకమైన ఆత్మ అని ఎట్లు గ్రహింపబడు చున్నదో, అట్లే అని ఆచార్యులవారు నిరూపించి యున్నారు.

ఈ చేతన ద్రవ్యము ఎంతవరకు ఉండుట సాధ్యమో, అంతవరకును ఈశ్వరునిచేత ధరింపబడుటచే, మనము స్వామికి శరీరముగా చెలగుచున్నాము. అట్లే ఇది ఎంతవరకు ఉండుట సాధ్యమో, అంతవరకును ఈతడు ఈశ్వరునికి భోగ్యమై శేషుడై యుండుటచే ఈతడు ఈశ్వరునికి శరీరము. చేతనుడు నిత్యమై యుండుటచే ఈతడు సదా స్వామికి శరీరము. ఈ శరీర భాగమునకు విధేయత్వము, నియామత్వము, శేషత్వము, ఈ మూడును అంగములై యుండవలెనని రామానుజులు అభిప్రాయపడి యున్నారు. అయినను, వేదాంత దేశికులు వీనిలో ఒక్కొక్క విషయమే శరీర భావమునకు చాలునని సూచించి యున్నారు. జీవులేమో ఈశ్వరునికి శరీరము. ఈ జీవుల శరీరమును స్వామికి శరీరము. ఎట్లనగా, జీవులు ధరించు శరీరములకు వాని మూలకముగా స్వామియు ఆధారమని చెప్పకైనది. జీవుల మూలకమైన వారి శరీరములకు స్వరూపముచే స్వామియే ఆధారమని కొందరు ఆచార్యులు చెప్పుదురు. జీవుడు ధరించు శరీరము విషయమై అభిప్రాయ మేమనగా, ఎప్పుడు, జీవుడే శరీరమో, కైముత్యన్యాయముచే జీవుని శరీరము కూడ పరమాత్ముని శరీరమే సరి అని వేదాంత దేశికులు నిరూపించి యున్నారు. పృథివ్యప్తేజోవాయురాకాశాది సర్వమును స్వామికి శరీరమై యుండుటచే, అదియును సాక్షాత్తుగా అతనికి శరీరమనునది ఆచార్యులవారి అభిప్రాయము. సమస్త వస్తువుల సత్త (ఉనికి) ఈశ్వరాధీనము. వీనియందు నిత్యము, అనిత్యమునని రెండు విధములు. నిత్య సంకల్పమనగా వ్యత్యస్తముగాక, ఎల్లప్పుడును నిత్యమై యే ఉండనిమ్ము అనిసంకల్పించుట. అట్టివి ఏవిఅనగా, స్వామియొక్క స్వరూపక నిరూపక ధర్మములు మఱియు కల్యాణగుణ సమూహము. నిత్య విభూతి యందున్న శుద్ధసత్త్వము స్వామియొక్క భోగోపకరణములైన, ఛత్ర చామరాది దివ్యభూషణములు, దివ్యమహిమ, స్వామియొక్క దివ్యమంగళ విగ్రహము, ద్వారపాలకులు మొదలైనవారు ముక్తాత్ములు, నిత్యమైన వానిలో, స్వామి యొక్క సంకల్పము ఎన్నటికిని, వ్యతిరేక భావము పొందదు అనిత్యములు స్వామియొక్క సంకల్పముచే ఉత్పన్నములగుటయే గాక, సంకల్పేచ్ఛా పరిణామము పొందును. వానియొక్క ఇప్పుడున్న స్వభావమునకు విరోధముగా సంకల్పించినచో, వ్యతిరేక భావము పొందుచున్నవి. దీనికి ఒక నిదర్శనమును ఆచార్యులవారు నిరూపించి యున్నారు.

ఒకసారి దేవాసుర యుద్ధములో స్వామియొక్క సంకల్పానుసారముగా దేవతలకు జయము కలిగెను. అయితే దేవతలకు తామే జయించితిమి. అను అహంకారము పుట్టెను. వారికి గర్వభంగము చేయవలెనని, స్వామి ఒక యక్షుని రూపములో దేవతల ఎదుట సాక్షాత్కరించెను. ఎదుటికి వచ్చిన అగ్నిని గూర్చి, అతని శక్తి ఎట్టిది అని ప్రశ్నించెను. తనకు అన్నింటిని దహించు శక్తి గలదని అతడు సమాధానమిచ్చెను. అప్పుడు ఒక్క తృణమును దహింపుమని స్వామి దానిని అతని ముందుంచెను. అయితే, అగ్నికి ఆ శక్తిలేకనే పోయెను. అనంతరము అక్కడనేఉన్న వాయువును చూచి నీ శక్తి ఎట్టిది అని ప్రశ్నించెను. అన్నింటిని ఎగురగొట్టి పోవుశక్తి నాకు గలదు. అని వాయువు చెప్పగా ఆ తృణమును అల్లాడింప వలసినదని స్వామి అతనికి చెప్పెను. వాయువు అట్లు చేయలేక పోయెను. వారిద్దఱు సిగ్గుతో తలవంచుకొని స్వామిముందునిలుచుండిరి. అప్పుడు స్వామి తన సంకల్పము లేకున్నచో ఏ వస్తువునకును సత్తాస్థితి లేదని చెప్పి అతడట్లే అహంకారము పొందియుండుట మంచిదికాదని వారిని సమాధాన పఱచెను. ఈ విధముగా 'తేన వినా తృణమపి న చలతి' అనునది సత్యమయ్యెను.

ఇదే అభిప్రాయమును, పూజ్యులైన కూరత్తాళ్వార్ అను మహాత్ములు వారు రచించియున్న శ్రీ వైకుంఠ స్తవమందు వ్యక్తపఱచి యున్నారని వేదాంత దేశికులు నిరూపించిరి.

ఇచ్ఛాత ఏవ తవ విశ్వ పదార్థ సత్తా
నిత్యం ప్రియా స్తవతు కేచన తేహి నిత్యాః।
నిత్యం త్వదేక పరతంత్ర నిజస్వరూపా
భావత్కా మంగళ గుణాహి నిదర్శనం నః॥

జగత్తులోని సకల పదార్థములకు స్వరూపలాభము నీ సంకల్పమున చేసియే వానియందేవి నీకు ఎల్లప్పుడును ప్రియమో అవి యన్నియు నిత్యములు. మఱియు నీకు ఒక్కనికే అధీనమైన స్వకీయ స్వరూపము గలవి. వాని విషయమందు నీ సంకల్పము ఎప్పటికిని వ్యత్యస్తముకాదు.

శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి.
ఆలిఫర్

# తిరుమలలో వివిధములైన కాటేజిల దినసరి అద్దెలు

కనుక యాత్రికులు గమనింప గోరుతున్నాము.

| కాటేజీపేరు | రోజుకి అద్దె |
|---|---|
| 1. హెచ్. ఆర్ గవియప్ప కాటేజి. | రు. 100/- |
| 2. నారాయణగిరి కాటేజిలు<br>1 నుండి 4; 13 నుండి 20. | 40/- |
| 3. ట్రావెలర్స్ బంగళా ప్రాంతం లోపల వైపువి, 1 నుండి 8; ఎ నుండి జి 3-వ వరుస 1; సి. యం. సి. 16; వి. వి. సి. 6; కె. వి. ఆర్. 4; వి. వి. సి. 1: వి. వి. సి. 8; టి. బి. సి. 10. | 30/- |
| 4. పై కాటేజిలలో ఎ. భాగం. | 18/- |
| బి. భాగం. | 16/- |
| 5. ట్రావెలర్స్ బంగళా బయట వైపువి.<br>వి. వి. సి; యం. బి. సి; ఎ. టి. సి. | 25/- |
| 6. పై కాటేజీలలో ఎ. భాగం; | 15/- |
| బి. భాగం. | 10/- |
| 7. టి. బి. కాటేజిలు ( 3 వ వరుస ఒక్క గది గలవి.) | 10/- |
| 8. శ్రీ వేంకటేశ్వర అతిథి భవనం | |
| ఎ. పెద్దగదులు | 35/- |
| బి. మూలగదులు | 25/- |
| సి. మిగిలిన గదులు | 20/- |

కార్యనిర్వహణాధికారి.

దీనికి నిదర్శన మేమనగా సదా నిత్యములై సర్వోత్కృష్టములైన నీ కల్యాణ గుణములు. ఎప్పుడుసర్వ వస్తుస్వరూపము ఈశ్వరేచ్ఛకు ఆధీన మాయెనో అప్పుడు సర్వవస్తువులను అనుసరించుచున్న స్థితి కూడ ఈశ్వరేచ్ఛకు ఆధీనము. అనగా సర్వమును ఈశ్వర సంకల్పమును ఆశ్రయించియుండునని చెప్పినట్లైనది కదా?

**శేష—శేషి భావము :—** పరమాత్ముడు సమస్తమునకు శేషి. సకల చేతనా చేతనములు శేషము. ఈశ్వర కోటిలో చేరిన మహాలక్ష్మికి సహితము, పరమాత్ముడు శేషి యని వ్యవహృతుడగుటచే అతడు ఉభయ విభూతికిని శేషి. ఈ భావమును వేదాంత దేశికులు శ్రీ పరాశర భట్టుల శ్రీ నాగిరాజ స్తవము నందలి ఒక శ్లోకముచే చాల చక్కగా ఉదాహరించి యున్నారు.

ఉపాధత్తే సత్తా స్థితి నియమనాద్యైశ్చిదచితౌ
స్వముద్దిశ్య శ్రీమానితి వదతి వాగౌపనిషదీ
ఉపాయోపే యత్వే తదిహ తవ తత్త్వం
నతు గుణా
వతస్త్వాం శ్రీరంగే శయ శరణమవ్యాజమభజం॥

ఉపనిషత్తులు చెప్పున దేమనగా ఈ చిదచిత్తు లన్నియునీవి. ప్రళయమందు సూక్ష్మావస్థయందుండి తన్ను సృష్టి కాలమందు స్థూలావస్థకు తెచ్చి వానికి నామ రూపములను పొందు అవస్థను కలుగజేసి వానిని శరీరముగా జేసికొని, వాని యందును ప్రవేశముచేసి వానికాత్మయై యుండి - ఈ విధముగా లీలాప్రవర్తకుడై యున్నందున వాని సత్తా స్థితి నియమనాదులన్నియు నీ అధీనమైయుండును. ఇంతేగాక, చేతనులకు భోక్తల భావమును గలుగజేసి, అచేతనమునకు భోగ్య భావమును కలుగజేయు చున్నావు.

(సశేషము)

# అన్నమ ప్రభ

ఈ సంచికలో... ....... పుట





# అన్నమాచార్యులు - నాట్యము

(గతసంచిక తరువాయి)

అంతియేగాక సంభోగ శృంగార వర్ణనలు బహుళముగా నుండుటచే వీనినభినయించుట నేటి సమాజమున కష్టము. అన్నమాచార్యుని సామాజిక దృష్టి నలవరచుకొనుటయూ కష్టమే. అందులచే అభినయముల కనువగు భాష-భావములు [అనగా సభాగౌరవములను కాపాడునవి.] అన్నమాచార్యులస్థితి (సర్వము శ్రీవేంకటేశ్వర మయముగా అనుభవించు విధము.) మనబోటివారలకు అసాధ్యమగుటచే మనసమాజ నియమముల ననుసరించి సభ్యాసభ్యములను ప్రదర్శనా ప్రదర్శనముల నిర్ణయముచేసి పదముల నెన్నుకొనవలయును. ఇట్టి నిర్ణయము గైకొనిన పిదప యాపదముల నేరీతి ప్రదర్శింపవలయునను ప్రశ్న కలుగును. నాటి నాట్యరీతులయందలి కొన్ని భంగిమలు శిల్పములయందు, లక్షణ గ్రంథములయందు పొందుబరచబడిననూ నేటి కాలమున వాటిరీతులు ప్రదర్శనమున గానరావు.

అందుచే నన్నమాచార్య సాహిత్య జగత్తునుండి మనము ప్రస్తుతమాచరించు నృత్యరీతుల కనువగు సాహిత్యముల తీసుకొని నృత్యములను మలచవచ్చును, ఇట్లు మలచుట కనువగు రూపములు, స్వరపల్లవి, స్వరజతి, వర్ణము, తిల్లాన, పదములు, జావళి; కోలాటము, గొబ్బి మొదలగు పది [10] రకముల అభినయ క్రమములను ప్రయోగ పూర్వకముగా ప్రయోగింప ప్రయత్నించవచ్చును.

ఉదాహరణగా పదాభినయ క్రమమును వివరించుదును.

రాగము - భైరవి

తాళము - ఖండచాపు

స్వరపరచినవారు;

శ్రీ నేదునూరి కృష్ణమూర్తిగారు

పల్లవి:

అలమేలుమంగ నీ - వభినవరూపము
జలజాక్షుకన్నులకు - చవులిచ్చేవమ్మా ॥ అల ॥

చరణములు

1. గరుడాచలాధీశు - ఘనవక్షముననుండి
పరమానంద సంభరితమై
నెరతనములు చూపి - నిరంతరము నాథుని
హరుషించఁగఁ జేసితిగదమ్మా

2. శశికిరణములకు - చలువల చూపులు
విశదముగామీఁద - వెదచల్లుచు
రసికత పెంపునఁ - గరఁగించి యెప్పుడు నీ
వశము చేసుకొంటి - వల్లభునోయమ్మా

3. రట్టడి శ్రీవేంకట - రాయనికి నీవు
పట్టపు రాణివై - పరఁగుచు
వట్టిమాఁకులిగిరించు - వలపుమాటల విభు
జట్టిగొనివురమున - నతమైతివమ్మా

[XII-159]

ఇందు స్వీయనాయిక వర్ణితము.

లక్షణము — సంపత్కాలే విపత్కాలే
యానముంచతి వల్లభమ్
శీలార్జవగుణోపేతా
సా స్వీయా పరికీర్తితా ॥

అన, వల్లభుని కలిమియందును, లేమియందును విడువక శీలార్జవ గుణములు కలిగిన నాయిక స్వీయయని పిలువబడును. ఈ పైచెప్పిన గుణములన్ని, అలమేలుమంగ కలిగియుండినది. అదేగాక యీమెయింకా శ్రేష్ఠానాయిక లక్షణములు కలిగియున్నది.

ప్రియాధిక ప్రేమపాత్రం శ్రేష్ఠాసాతు నిగద్యతే ॥ ప్రియుని ప్రేమాధిక్యమును యే నాయిక పొందుచున్నదో ఆమె శ్రేష్ఠ యని పిలువబడుచున్నది. పై పదమునందలి యలమేలుమంగ తనరూప యౌవన సౌశీల్య జాణతనములచే, నాయకుని కత్యధిక ప్రేమపాత్రయై, ఆయన చే మెప్పువడసి హృదయ వాసిని యైనది గావున యీ నాయికను శ్రేష్ఠ నాయిక యనవచ్చును.

ఇంకను యీ మెయందు స్వాధీన భర్తృక లక్షణములున్నవి.

"ప్రియోఽపలాలితా నిత్యం స్వాధీన పతికా" ప్రియునిచే ఎల్లవేళల లాలింపబడునది స్వాధీనపతికా యని పిలువబడును. పై పదమునందలి మేలుమంగ యొక్క సౌందర్య - సౌశీల్యాదులచే ప్రీతుడైన నాయకుడామెను తన యురమునందు ధరించెను. ఈచర్య ప్రేమాతిశయముచే నొప్పువారలకు గరిష్ఠబహుమతి. అందుచే నీమే స్వాధీనపతికకూడనైనది.

ఈ పదమందలి యలమేలుమంగ సంపూర్ణ యౌవనవతి. జాణయౌ స్వీయా శ్రేష్ఠా స్వాధీన పతిక నాయిక. నాయకుడు పతి. ధీరలలితుడు. సంభోగ శృంగారము రసము.

ఈ పదమును పాడునది నాయికా నాయకులు కాక అలమేలుమంగా విలాస విభవములకు విభ్రమము చెందిన చేటి కూపి భక్తుడగు అన్నమాచార్యులు. ఈ చేటి అలమేలు మంగ రూపయౌవన అభిజాత్యముల జూచి, ఆశ్చర్యమొంది సకల గుణోపేత గావుననే భగవంతుడగు శ్రీనివాసుడు ఆమెను పట్టమహిషిగా జేకొనుటయేగాక యురమున ధరించెనని నిశ్చయమునకువచ్చి ఆమెను, ఆమెరూప సౌందర్యాదులను జలజాక్షుడైన శ్రీనివాసునికన్నులతో జూచి యచ్చెరు వొందినది. అందుచే నీ పదముల నభినయించునప్పుడు అలమేలుమంగ - శ్రీనివాసుల మనోగత భావములేగాక చేటి భావము లనుకూడ చూపవచ్చును.

అలమేలుమంగ - నీ అభినవ రూపమనుచో నయోనిజయగు పద్మజయొక్క

శ్రీమతి యం. కాంచనమాల
తిరుపతి

అభిజాత్యమును. సౌందర్యరాశియగు యామె రూపలావణ్యాదులను కావ్యములందు వర్ణితములైనవానిని పట్టి చూపవచ్చును. అనగా ప్రబంధమునందలి స్త్రీ వర్ణనల మొత్తము రసికజనామోదకరముగా పట్టబీలున్నది.

ఉదా :— పరిహసిత రాకాసుధాకర సుందరవదనారవింద. కాలమేఘ సమాన కేశసంపద కలిగినది, తుమ్మెదరెక్కలు బోలు ముంగురులు - కోడెత్రాచుబోలు వేణి, మెఱపుతీగనుబోలు నుదురు, మన్మథుని వింటినిజాటు కనుబొమలు, గండుమీనులబోలు నేత్రయుగము, సంపెంగ మొగ్గనుబోలు నాసిక, అద్దములవంటి చెక్కులు, దొండపండువంటి అధరము, దానిమ్మగింజలబోలు పలువరుస, చూత ఫలములుబోలు చుబుకము, కంబుకంఠి మొదలగుగాగల సకలావయవములను వర్ణింపవచ్చును. అంతియేగాదు పలు రకముల హొయలుమీరునడలు మనమలరించు కదలికలు, చూపులు, చేష్టలును గూడా పట్టిజూపవచ్చును.

జలజాతు కన్నులకు చవులిచ్చునమ్మా అనుచో జలజాతుడగు శ్రీ వేంకటేశ్వరుని యందచందములను లీలలను వర్ణింపవచ్చును. సప్తగిరివాసి కలియుగదైవము నీలమేఘశ్యాముడు, పీతాంబరధారి, వనమాల ధరించువాడు 'శిఖిపించధారి' జలజాతుడు, మురళీధరుడు. కౌస్తుభధారి శంఖ చక్రాద్యాయుధముల ధరించువాడుగా చూపవచ్చును. ఇట్లు శ్రీ వేంకటాచలాధిపుని శ్రీకృష్ణునిగా పురాణములు తెలుపు చున్నవి. అటులనే అన్నమాచార్యులు కూడా వర్ణించుటచే శ్రీకృష్ణ లీలల యందలి శృంగార ఘట్టములు (రాసక్రీడలు) అభినయింప వచ్చును. మరియును ఆయన గొప్పతనమును యర్చావతారములను వర్ణించు క్రీడలు అనగా గోవర్ధన పర్వతమెత్తుట, పూతన-శకటాసుర - బకాసురాది దైత్య సంహారమును వర్ణించుటచే శ్రీ వేంకటేశ్వరుడు సామాన్యుడు గాడని సాక్షాచ్ఛ్రీమన్నారాయణుడని, అట్టి పురుషోత్తమునికి చవులిచ్చుట సామాన్యుల కసాధ్యమైనదని అన్నమయ్య చెప్పుచున్నాడో యన్నట్లు స్వామికి చవులిచ్చు రూపము ప్రకృతి స్వరూపిణియగు నాదిలక్ష్మికే కలుగుట, ఆమెయే అలమేలుమంగ యగుటను తాను చూచి ఆ లీలల తలచి పరవశించి పాడియాడినాడు. అందుచే నా లీలలన్నియునూ వర్ణింపవచ్చును. సర్వవ్యాపి యగు శ్రీవేంకటేశ్వరుని రూపసౌందర్యాదుల వర్ణించి చూపి, అలమేలుమంగ శ్రీనివాసుల సంబంధము నాది యని; నారాయణుడు భూమి యందవతరించిన సమయములో తన స్వామిని వీడియుండజాలని లక్ష్మి ఆయనతో పాటు భూమి యందవతరించు చున్నదని చెప్పుటకై ఇచట-పద్మావతీ-శ్రీనివాసుల కల్యాణమును చూపవచ్చును. పద్మావతి రూపమును చూచిన శ్రీనివాసు డామెపై మరులు కొనినాడు. ఆమెను పరిణయమునకై వకుళమాలికాదేవిని రాయబారమంపుటయేగాక తానుకూడా ఎఱుకలసానియై పడరాని పాటులు పడినాడు. భక్తుడగు అన్నమాచార్యులు శ్రీనివాసుని మోహమును పద్మావతిని గౌరవించుట తనకే గౌరవముగా భావించుచున్నాడు. ఆయన యా లీలల తలంచి తన తల్లిరూపు జూచి ముగ్ధుడై వారిరువురి లీలలు తలచి పులకించి తన విపంచి స్వరములతో మన కందించుచున్నాడు.

మొదటి చరణమున అభినయ ప్రస్థారమున కనువగుచోటు —

(23వ పేజీలో చూడుడు)



## శ్రీ అన్నమాచార్య సంకీర్తనామృతము

శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి

అవ:— సంపదలపై మోహము నొందక చలము, కోపము, పరనింద మున్నగు దుర్గుణములువీడి భగవత్సేవలో జీవనము గడుపవలెనని ప్రబోధించుచున్నాడు

59

ధన్యాసి

**ఎంత విభవము గలిగె**
**నంతయును నాపదని**
**చింతించినది గదా - చెడని జీవనము**
**॥ పల్లవి ॥**

1. చలముఁ గోపంబుఁదనుఁ-జంపేటిపగతులని
**తెలిసినది యదిగదా - తెలివి,**
**తలకొన్న పరనింద - తనపాలి మృత్యువని**
**తొలగినది యదిగదా - తుదగన్న ఫలము ***
**॥ ఎంత ॥**

2. **మెఱయు విషయములె తన - మెడనున్న యురులుగా**
**ఎఱిఁగినది యదిగదా - యెఱుక,**
**పఱివోని యాస తనుఁ-బట్టుకొనుభూతమని**
**వెఱచినది యదిగదా - విజ్ఞాన మహిమ**
**॥ ఎంత ॥**

3. **ఎనలేని తిరువేంక - టేశుఁడే దైవమని**
**వినఁగలిగినదిగదా - వినికి,**
**అనయంబు నతని సే - వానందపరులయి**
**మనఁగలిగినది గదా - మనుజులకు మనికి**
**॥ ఎంత ॥ (5-123)**

(ప) విభవము = సంపద.

1. చలము = మాత్సర్యము; పగతులు = శత్రువులు; తలకొన్న = కలిగిన; తుదగన్న ఫలము = పరమావధి నొందిన ఫలము. 'బలము' అనుపాఠమున్నచో సర్వోత్కృష్టమైన బలము అని యర్థము.
2. విషయములు = శబ్ద స్పర్శరూపాదులు, పఱివోని = చీలిపోని, తగ్గని,
3. ఎనలేని = సాటిలేని, అనయంబు=అత్యంతము–సతతము. (కవిత్రయమువారి ప్రయోగములలో ఈ పదమునకు అత్యంతము అను నర్థము తప్ప మరొక యర్థము లేదనియు, సతతము అను అర్థము ఆధునిక గ్రంథములలోనే కనబడుచున్నదనియు శబ్దరత్నాకరకారుడు.)

* 'బలము' నిడురేకు (80) సారము.

ఎంత సంపద గలిగినను అదియంతయు ఆపదయేగాని సంపద కాదని భావించి గర్వగ్రస్తుడు కాని వాని బ్రదుకే చెడని బ్రదుకు.

మచ్చరము, కోపము అను తన దుర్గుణములే తన్ను జంపు శత్రువులని తెలిసి వాటిని దరికి రానీయకుండుటే నిజమైన తెలివి. పరదూషణము తనపాలి మృత్యువు అని తలచి దానిని విడుచుటే శ్రేష్ఠాతి శ్రేష్ఠమైన ఫలము.

శబ్ద స్పర్శ రూపాదులైన విషయములే తన మెడకు దగులుకొన్న ఉరులుగా గ్రహించి వాటికి దూరమగుటే నిజమైన విజ్ఞత. బలవత్తరమైన ఆశయే తన్ను బట్టుకొన్న దయ్యమని యెంచి దానికి వెఱచి తొలగుటయే విశిష్టమైన తెలివి.

సాటిలేని శ్రీ వేంకటేశ్వరుడొక్కడే దైవమని పెద్దలవలన విన్నదియే నిజమైన వినికి. ఎల్లప్పుడు ఆ దేవుని సేవించుచు ఆనందముతో బ్రదుకువారిదే నిజమైన బ్రదుకు.

వి: సంపదలున్నవని గర్వము నొందరాదు. మాత్సర్య కోపాది దుర్గుణముల విడనాడవలెను. విషయములకు, ఆశకు లోబడరాదు. సదా శ్రీ వేంకటేశ్వరుడే దైవమని నమ్మి ఆ పరమాత్ముని సేవించుచు జీవితము గడపవలెనని భావము.

తత్త్వజ్ఞుల దృష్టికి సంపదలు ఆపదలుగానే గోచరించును. సంపదల నార్జించుట యందును, రక్షించుటయందును వాటి ఆయవ్యయముల యందును, దుఃఖమే లోకములో అనుభవమున నున్నది. కాన అవి విపత్తులు గానే భావింపబడవలసియున్నవి. అందువలననే పెద్దలిట్లనిరి. —

> అర్థానామార్జనే దుఃఖ
> మార్జితానాం చ రక్షణే।
> ఆయే దుఃఖం వ్యయే దుఃఖం
> ధిగర్థాః కష్ట సంశ్రయాః॥
> (సుభాషితరత్న భాండాగారము P. 64)

మఱియు పూర్వపుణ్యములకు ఫలములైన సంపదలు పూర్వపుణ్యమును నశింపజేసి పొడముచున్నవి గాన విపత్తులుగానే పరిగణింప దగియున్నవి —

> "పూర్వ పుణ్య విభవ వ్యయలబ్ధాః
> సంపదో విపద ఏవ విమృష్టాః॥"
> అని శ్రీ హర్షుని వచనము (నైషధము)

మాత్సర్య కోపాదులు తనకే హాని జేయును గాన తన పాలిటి శత్రువులగుచున్నవి. 'తనకోపమె తన శత్రువు' అని సుమతీ శతకకర్త. అందుచేతనే కామ క్రోధాదులు అరిషడ్వర్గములుగా పేర్కొనబడినవి.

పరుల యశస్సు నోర్వజాలని వారే పరనింద కొడిగట్టుదురు. వారి కీర్తికి హేతువులైన సద్గుణములను అలవరుచుకొను శక్తి వీరికి లేదు. కాన పరనిందకులు తమనైచ్యమును తామే ప్రకటించుకొనుచున్నారని యీ క్రింది శ్లోకముచే తెలియనగుచున్నది —

> దహ్యమానా స్సుతీవ్రేణ
> నీచాః పరయశోఽగ్నినా।

అశక్తా స్తత్పదం గన్తుం
తతో నిందాం ప్రకుర్వతే ॥
(సుభాషితావళి–347)

విషయ త్యాగము మిక్కిలి శ్రమ సాధ్యము. ముముక్షువైన వానికి విషయ సుఖము లత్యంత మపాయకరములు. అందుచే ప్రయత్న పూర్వకముగానైనను విషయములను విషమువలె పరిత్యజింప వలెను. "ముక్తి మిచ్ఛసి చే త్తాత। విషయాన్ విషవ త్త్యజ" అని అష్టావక్ర మునీంద్రుడు జనకున కుపదేశించెను. మనస్సు యొక్క నిర్విషయ స్థితియే మోక్షముగాన ముముక్షువైన వాడు సదా మనస్సును విషయ రహిత మొనర్ప వలెనని అమృత బిందూపనిషత్తు బోధించు చున్నది —

యతో నిర్విషయస్యాస్య
మనసో ముక్తిరిష్యతే।
తస్మాన్నిర్విషయం నిత్యం
మనః కార్యం ముముక్షుణా ॥
(అమృత—3)

ఆశకు వశులైన మానవులు అనర్థ పరంపరలు అనుభవించుచున్నారు.

ఆశైవ రాక్షసీ పుంసా మాశైవ విషమంజరీ।
ఆశైవ జీర్ణమదిరా ధిగాశా సర్వదోషభూః ॥
(సుభాషితరత్న భాండాగారము P. 76)

అని ఆశ సర్వదోషములకు నెలవైన రక్కసిగా, విషమంజరిగా, పులిసినకల్లుగా వర్ణించబడినది.

ఆశను వీడుటచే గల్గు సుఖములో పదునారవ కళకు గూడ కామసుఖము, స్వర్గసుఖము సరిపోలవని మహాభారతము.

యచ్చ కామసుఖం లోకే
యచ్చ దివ్యం మహత్సుఖమ్।
తృష్ణాక్షయసుఖస్యైతే
నార్హతః షోడశీం కలామ్ ॥
(భార–12–6503)

★

అవ: వ్యర్థమగుచున్న కాలమును భగవచ్చింతనతో సార్థకము జేసికొనవలెనని ప్రబోధించు చున్నాడు —

60

కన్నడగౌళ

పోయఁ గాలం బడవిఁ —
గాయు వెన్నెల కరణిని
శ్రీయుతుఁ దలఁచుఁడీ నరులు —
మాయఁబడి చెడక ॥ పల్లవి ॥

1. చిత్తము చేకూరుచుకొని - చిత్తైకాగ్రతను,
చిత్తజగురునిఁ దలఁచుడీ-చిత్తజుఁజొరనీక
॥ పోయ ॥

2. బూరుగు మ్రాఁకునఁజెందిన —
కీరము చందమున
ఆరయ నిష్ఫలమగు మరి —
యన్యులఁ జేరినను ॥ పోయ ॥

3. కూరిమి మా తిరువేంకటగిరి —
గురు శ్రీ పాదములు
చేరిన వారికి భవములు —
చెందవెపుడు నటుగాన ॥ పోయ ॥
(11-3-65)

నరులారా! అమూల్యమగు కాలము అడవిగాసిన వెన్నెలవలె వ్యర్థముగా పోవుచున్నది. కాన మాయకు వశమై చెడిపోక శ్రీనాథుని చింతింపుడు.

చంచలమైన చిత్తమును నిగ్రహించుకొని నిశ్చలభావమును పొందుడు. మనసులోనికి మన్మథుని (కామ ప్రవృత్తిని) ప్రవేశింపనీయక మాధవునే భావింపుడు.

మాధవునికాక ఇతరుల నాశ్రయించినచో బూరుగుచెట్టు నాశ్రయించిన చిలుకవలె మీ జన్మము నిష్ఫలమగును.

ప్రేమతో మా వేంకటాచలాధీశ్వరుని శ్రీపాదముల భజించువారిని ఎన్నటికిని భవబంధము లంటజాలవు. కావున శ్రీ వేంకటేశ్వరుని దలంచి ధన్యులు కండు.

1. చిత్తైకాగ్రతను = మనసు నొక్కటిగ నిలుపుటతో
చిత్తజగురుని = మన్మథుని తండ్రి యగు మాధవుని; చిత్తజున్ = మన్మథుని
2. కీరము = చిలుక.
3. భవములు = జన్మములు, సంసారములు.

విశే: చిత్తము కోతివలె చంచలమైనది. కామాది దుర్గుణములకు వశము కాకుండ దానిని నిగ్రహించుట మిక్కిలి కష్టము. అయినను అభ్యాస వైరాగ్యములతో నిగ్రహింప వచ్చును. "అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః" (1-12) అని పతంజలి యోగసూత్రము. చంచలమైన చిత్తము నెట్లు నిగ్రహింప వలెనో చెప్పుమని అర్జును డడుగగా —

"అభ్యాసేన చ కౌన్తేయ! వైరాగ్యేణ చ గృహ్యతే" (గీత-6-35) అని భగవద్గీతలో శ్రీకృష్ణుడు నుడివెను.

బూరుగు చెట్టు పూలు చూచుటకు రమ్యముగా నుండును. అవి చూచి ఒక చిలుక "ఈ చెట్టు పూలే ఇంతఅందముగా నున్నవే. ఇక దీని పండ్లెంత మధురముగా నుండగలవో" అని ఆశించి ఆ పూలు పిందెలై, ముదిరి పండ్లగునంత వరకు కాచుకొని యుండెను. కాని కడకు దాని ఆశ వమ్మైనది. అది చూచుచుండగనే ఆ బూరుగుపండ్లు పగిలి అందలి దూదిగూడ గాలికి కొట్టుకొని పోయినది. ఈ విషయమునే భల్లటు డిట్లు వర్ణించెను —

" విశాలం శాల్మల్యా నయన సుభగం
వీక్ష్య కుసుమం
శుకస్యాసీద్బుద్ధిః ఫలమపి భవే
దస్య సదృశమ్।
ఇతి ధ్యాత్వోపా స్తం ఫలమపి చ
దైవాత్పరిణతం
విపాకే తూలోఽన్త స్సపది మరుత
సోఽప్యపహృతః ॥ "
(భల్లటశతకము)

కావున చిల్లరదేవతల నాశ్రయించిన వారు బూరుగు చెట్టును చేరిన చిలుకవలె విఫల మనోరథులగుదురు. శ్రీ కాంతునిపై చిత్తము చేర్చినవారు భవబంధము వీడి ముక్తులగుదురని తాత్పర్యము.

✳ ✳

# ధర్మకర్తలమండలి తీర్మానములు

మత, ధార్మికకార్యక్రమాలను నడుపుకునేందుకు అధికారం దేవస్థానానికుండే విధంగా, 2. దేవస్థాన ఉద్యోగులకు. ధర్మకర్తలమండలి సభ్యులకు వారు వచ్చినప్పుడు ఉచితవసతి ఏర్పాటులు 3. ధర్మసత్రాల బాగోగులు, మరమ్మత్తులు, వివిధమైన ఇతరఖర్చులు తి. తి. దేవస్థానానికి ఉండకుండా, 4. దేవస్థాన ధర్మకర్తల పేర్లుగల ఫలకాలను ప్రతి రెండు సంవత్సరాలకు తిరిగి వ్రాయిస్తూ, 4 సంవత్సరాల కొకసారి కొత్తఫలకాలు ఏర్పాటు చేయటం, లోగడ ఒప్పందానికిమించి భవనం పడగొట్టడం లేదా వేరేకార్యక్రమాలకు ఉపయోగించవలసివస్తే దేవస్థానం అనుమతి; 5. తిరుమల తిరుపతి దేవస్థానం సమాచారకేంద్రం ఏర్పాటుచేసే పక్షంలో దానికి, సిబ్బందికి ఉచిత శాశ్వతవసతి — ఈ నిబంధనలమీద తిరుమల తిరుపతి దేవస్థాన సత్రాలను ఇతరదేవస్థానాలకు అద్దెకిచ్చేందుకు నిర్ణయించటమైనది.

ఇప్పుడు దేవస్థానంలోఉన్న బంగారాన్ని వేలంద్వారా విక్రయించే బదులు, శ్రీ వేంకటేశ్వరస్వామి ముద్రగల 5 గ్రా. 10 గ్రా. బంగారు పతకాలు తయారు చేయించి ప్రతినెల మొదటిరోజున ప్రముఖ దినపత్రికలో ప్రకటితమైన మద్రాసులోని బంగారు మార్కెట్ధరపై రు. 5% కలిపి విక్రయించటానికి నిర్ణయించటమైనది.

దేవస్థానములో పనిచేసే సెక్యూరిటీ గార్డులకు రు. 165-5-190-6-250, జమేదారులకు రు. 175-7-275 వేతనాలను వారు తీసుకుంటున్న పెన్షన్తో సంబంధం లేకుండా ఈయ నిర్ణయించటమైనది.

శ్రీధూళిపాళ రామచంద్రశాస్త్రిని, తిరుమలలోని శ్రీవేంకటేశ్వర వేదశాస్త్రాగమ విద్యాకేంద్ర అధ్యక్షులుగా రు. 700-25-850-40-970-30-1080 వేతనంమీద నియమించటమైనది.

ప్రభుత్వానికి బదిలీయైన శ్రీ పి. సుబ్బారావుస్థానే శ్రీ వై. కృష్ణమూర్తిని తిరుమలలో ఆరోగ్యశాఖాధికారిగా నియమించటమైనది.

శ్రీ త్యాగరాజ ధర్మసంస్థ ఆధ్వర్యంలో జరిగే త్యాగరాజ ఉత్సవాలకు ప్రతి ఏడు జరిగే ఇతర ఏర్పాట్లతోపాటు రు. 25వేలు విరాళం మంజూరుచేయటమైనది.

21-3-79 తీర్మానములు

మంగాపురంలోని శ్రీకల్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయ అర్చకులుగా దేవస్థానం ఈఆలయాన్ని స్వాధీనం చేసుకొనక ముందునుండి నిస్స్వార్థకైంకర్యం జరుపుతూవచ్చి 1-2-79 న పరమపదించిన శ్రీ ఏ. సి. ఆర్. సుందరరాజస్వామికుటుంబానికి కుటుంబ సహాయపథకం క్రింద రు. 10 వేలు చెల్లించ నిర్ణయించటమైనది.

శ్రీ వేంకటేశ్వర జూనియర్ కళాశాలలోని అంధవిద్యార్థులకు పాఠాలుచదివేవారి రీడర్చార్జీలను నెలసరి రు. 30/- నుండి రు. 60/- పెంచుతూ, ఒక్కొక్క విద్యార్థికి 1978-79 విద్యాసంవత్సరం నుండి ఈయ నిర్ణయించటమైనది.

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలలో 1200 మంది కూర్చొనగల సభాభవనాన్ని నిర్మించేందుకు నిర్ణయించటమైనది.

ఆర్షసంస్కృతి కార్యక్రమాలకు గాను 1979-80 ఆర్థికసంవత్సరంలో రు.2లక్షలు కేటాయించటమైనది.

నిర్మాణంలో ఉన్న పాపవినాశన జలాశయం పని పర్యవేక్షణకుగాను దేవస్థానం సూపరింటెండింగు ఇంజనీరు కార్యదర్శిగా సర్వశ్రీ కె. వి. శ్రీనివాసరావు, ఎ. పి. రంగనాథస్వామి, పి. టి. మల్లారెడ్డి, హెచ్. ఆర్. సయాజీరావు (పదవీ విరమణపొందిన చీఫ్ ఇంజనీర్లు), శ్రీరాజారావులతో ఒక సంఘాన్ని నియమించతీర్మానించడమైనది.

శ్రీకాకుళంలోని కామాక్షమ్మ, ఏకాంబరేశ్వరస్వామి వారి ఆలయం ప్రహరీగోడ నిర్మాణానికి గాను రు. 15 వేలు విరాళమివ్వటమైనది.

దేశంలో వివిధ టెలిప్రింటర్ సర్వీసులను కలుపుతూ తిరుపతిలో యునైటెడ్ న్యూస్ ఆఫ్ ఇండియావారి టెలిప్రింటర్ ఏర్పాటుకు 5-ఏ, కపిలేశ్వరనగర్లో వసతికల్పిస్తూ దానికయ్యే ఖర్చు నెలకు రు. 2,000/- దేవస్థానమే భరించ నిర్ణయించటమైనది.

హిందూధర్మప్రతిష్ఠానం వ్యయానికి గాను 1979-80 సంవత్సరానికి రు. 8లక్షల 50 వేలు మంజూరుచేయటమైనది.

శ్రీ రామానుజ జీయర్ పథకం ప్రకారం హరిజనవాడలలో దేవస్థానమే 30 రామమందిర నిర్మాణాలు చేయ సంకల్పించటమైనది.

తూర్పుగోదావరిజిల్లా పిఠాపురంలోని కుక్కుటేశ్వరస్వామి ఆలయంవద్ద 8 గదుల సత్రనిర్మాణంకుగాను రు. 1 లక్షమంజూరు చేయటమైనది:

కాంచీపురంలోని శ్రీఏకాంబరనాథ స్వామి ఆలయప్రాంగణంలో తిరుమల తిరుపతి దేవస్థానం సమాచారకేంద్రాన్ని ప్రారంభించి అప్పర్డివిజన్ గుమాస్తా, వగైరా సిబ్బందిని నియమించేందుకు, 10 గదుల ఉచిత ధర్మశాలను నిర్మించేందుకు నిర్ణయించటమైనది.

తిరుచానూరు తోలప్పగార్డెన్‌లోని భవనాలకు ఎదురుగా నిర్మింపబడిన కల్యాణ మంటపం అద్దెను రోజుకు రు. 50/-నుండి రు. 100/- కు పెంచటమైనది.

తిరుపతిలో క్రొత్తగా నిర్మించబడిన పద్మావతీ అతిథిగృహ గదులను అద్దెకిచ్చుటకు నిర్ణయింపబడినది.

ఎయిర్‌కండిషన్‌రూమ్ రోజుకు రు. 40/-
మామూలు డబుల్‌రూము ,, రు. 30/-
సింగల్‌రూము ,, రు. 20/-

తిరుపతి శ్రీ వేంకటేశ్వర రుయాహాస్పిటల్‌లో హృద్రోగవ్యాధి నివారణకేంద్రం నిర్మాణం, యంత్రపరికరాల కొనుగోలుకు అయ్యేఖర్చులో ప్రభుత్వము సగం భరించే పక్షంలో మిగిలిన సగం దేవస్థానం భరించేందుకు తీర్మానించటమైనది.

శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మను దేవస్థానం ఆస్థాన సంగీత సాహిత్య విద్వాన్‌గా 11-3-79 న కార్యనిర్వహణాధికారి చేసిన సన్మానమును ఆమోదిస్తూ శ్రీ అనంతకృష్ణశర్మ ఆకస్మిక మరణం పట్ల తమ ప్రగాఢ సంతాపాన్ని వెల్లడిస్తూ తీర్మానించారు.

శ్రీ బి. రజనీకాంతరావుని దేవస్థానం కళాక్షేత్ర ప్రత్యేకాధికారిగా నియమించటమైనది.

దేవస్థానం ధర్మకర్తమండలి సభ్యులొక్కొక్కరికి వారివారి పేరు, హోదా, వారి ఖర్చుతో చెక్కించి బంగారు పతకమును బహూకరించుటకు తీర్మానించటమైనది.

మద్రాసు సమాచారకేంద్రం స్థానిక సలహాసంఘసభ్యుడుగా శ్రీ పి. పుల్లయ్యను చేర్చుకోవడమైనది. (37 వ పుటలో)

---

(19వ పేజి తరువాయి)

"నెఱతనము జూపి నిరంతరము నాథుని" ఇచట ప్రౌఢయగు యలమేలు మంగ యొక్క వైభవము హొయలు తళుకు బెళుకులు నభినయింప వచ్చును.

ఉదా — కళలతల్లి సరస్వతి; సంపన్న లక్ష్మి శక్తిస్వరూపిణి; వివిధగతుల నడలను మొదలగు వానిని జూపవచ్చును.

రెండవచరణమున

"రసికత పెంపునకరగించి యెపుడు నీ" సంభోగ శృంగార వర్ణన జేయవచ్చును. ఆలింగన చుంబనాది భేదంబులు వివిధ బంధములు దృగ్భేదములు మొదలైనవి వర్ణింపనగును.

మూడవ చరణమున

"రట్టడి శ్రీ వేంకటరాయనికి నీవు."

ఇందు శ్రీ వేంకటేశ్వరుని శ్రీకృష్ణుని గానూహించి యా స్వామి చిలిపిచేష్టలను పదునారువేల గోపికల చిత్త చోరుడైన వాని చిలిపిచేష్టల కట్టించి వానిచే కోరంబడి ఆతనిచే తన పొందుకై ఎఱుకలసాని వేషమును నాడింపజేసి సకలదేవ సమూహముల నెదుట పాణిగ్రాహితయై యాతని పట్టపురాణియై అంతటితో తనివొందక జగన్నాటక సూత్రధారి యగు శ్రీనివాసుని తన మాటలతో ఆకట్టుకొని యాతని యురమందు స్థిరమగు స్థానము నాక్రమించుకొన్నది. అనగా మరియొక భామినికి ఆతని హృదయమున స్థానము లేకుండ [మన ఆలోచనలకు; భావములకు పుట్టుక స్థానమైన హృదయమున నిండియుండుటచే మరియొకరికి నచట తావులేదనుట.] నిండి స్థిరమైనది.

ఈ విధముగా యూహించి యూహించి పరవశించి తనలో జననమొందిన యానంద ఝురులతో తన మనము నిండి పొరలి పొంగగా ఆ బంగారు ప్రవాహమును తన సంకీర్తనముల ద్వారా శ్రీ అన్నమాచార్యులు మన కందించుచున్నాడు. ఈ కీర్తనల భావ మూహించిన కొలది బావిలోని యూట మాదిరి యూరుచునే యుండును. మన శక్తి కొలది పాత్రలను గైకొని యా యూటల నుండి నింపుకొను ప్రయత్నములోనిది మొదటిది. భావుకులు దీనియందలి యథార్థమును గ్రహింతురు గాక!

*

---

# శ్రీ వేంకటేశ్వర వైభవం

గ్రంథకర్త:
న్యాయరత్నాకరాద్యనేక బిరుదభూషితులు
తర్క-వేదాన్త మహావిద్వాన్
శ్రీ పణ్డిత వేదాన్తం జగన్నాథాచార్యులవారు
(తి. తి. దేవస్థానముల ఆస్థాన పణ్డితులు)

తిరుమల ఆలయ సంప్రదాయములు, శ్రీనివాసుని సేవలు, పుణ్యక్షేత్ర తీర్థాదులను గూర్చి వివరముగా తెలియజెప్పే గ్రంథం.

ప్రతులకు:
ఎడిటర్,
టి. టి. దేవస్థానం, తిరుపతి.

## తిరుమల తిరుపతి దేవస్థానములోని వివిధ దేవాలయముల

# ఆర్జిత సేవలు ఇతర నియమములు

## ఈక్రింది విధముగ సవరించబడినవి.

★

## శ్రీ పద్మావతీ ఆలయము, తిరుచానూరు

| | |
|---|---|
| అర్చన టిక్కెట్టు | రు. 1/- |
| హారతి టిక్కెట్టు | 0-50 పైసలు. |

★

## శ్రీ గోవిందరాజస్వామి ఆలయము, తిరుపతి

| | | |
|---|---|---|
| తోమాలసేవ | రు. 4/- | (1 టిక్కెట్టు) |
| అర్చన | రు. 4/- | ,, |
| ఏకాంతసేవ | రు. 4/- | ,, |
| ప్రత్యేక దర్శనము | రు. 2/- | ,, |

★

## శ్రీవారి ఆలయము, తిరుమల

ఇప్పటి వరకు రు. 10/- లకు అమ్మబడుచున్న లడ్డును ఇకనుండి క్యూలో పంపిణి చేయుటకు తీర్మానించడమైనది.

ఆమంత్రణోత్సవమునకు రు. 200/- చెల్లించి ఆమంత్రణోత్సవము టికెట్టు మీద, ఏకాంతసేవ, తోమాలసేవ, అర్చనలకు అనుమతించబడే భక్తులసంఖ్య 6 నుండి 5 కు తగ్గించ బడినది.

**తి. తి. దేవస్థానం, తిరుపతి.**

(గత సంచిక తరువాయి)

### భాగవతమననేమి

భాగవత శబ్దమును పెద్దలిట్లు నిర్వచించు చున్నారు. "భగవతః ఇమే భాగవతాః భక్తాః" (భగవంతునికి సంబంధించినవారు భాగవతులు. వారిని గూర్చి చెప్పునది భాగవతము.) "భగవాన్ యేషాం దేవతా తే భాగవతాః" (భగవంతుడు ఎవరికి దేవతయో వారు భాగవతులు అనగా భక్తులు. వారికి సంబంధించిన కథలను తెల్పునది భాగవతము) "భగవతః ఇదం భాగవతః" భగవంతుని గుణగణములను నిరూపించుటకై జన్మించినది భాగవతము) వీనిని బట్టి చూడ భగవంతుని, అతని భక్తులను గూర్చి తెలుపునది భాగవతమని తేలుచున్నది.

### భగవత్ శబ్ద నిర్వచనము

అయిన భగవంతు డనగానేమి? అని ప్రశ్న. దీనికి అథర్వ శిరోపనిషత్తు "అథ కస్మాదుచ్యతే భగవాన్, య స్సర్వాన్ భావానీక్ష, త్యాత్మ జ్ఞానం నిరీక్షయతి, యోగం గమయతి తస్మాదుచ్యతే స భగవాన్" (భగవంతుడని చెప్పుటదేనికి? ఎవడు సమస్త పదార్థములను చూచుచుండెనో మావంటి వారికి 'అహం బ్రహ్మాస్మి' అనెడి ఆత్మ సాక్షాత్కారమును కలుగజేయు చుండెనో, మరియు ఆత్మ పరమాత్మలకు తాదాత్మ్య సంబంధ భావమునందు భేదబుద్ధి కలుగకుండునట్లు చేయుచుండెనో అట్టివాడు భగవంతుడని చెప్పబడుచున్నాడు) అని చక్కని సమాధానము నిచ్చుచున్నది. భగవంతుడను శబ్దమునందలి 'భగ' శబ్దమునకు విష్ణు పురాణమిట్లు అర్థముచెప్పి అది కలవాడు భగవంతుడని పేర్కొనుచున్నది.

'ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః।
జ్ఞాన వైరాగ్య యోశ్చైవ షణ్ణాం భగ ఇతీ
రణా॥" —

# పురాణములు-వాని విభజనము

(సమగ్రమైన ఐశ్వర్యము, వీర్యము, యశము, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము, అను నారు గుణములకు భగమని పేరు. ఇవి కలవాడు భగవంతుడు) మరియు నందే

"ఉత్పత్తిం ప్రళయంచైవ భూతానామా
గతిం గతిమ్।
వేత్తి విద్యామవిద్యాంచ సవాచ్యో భగ
వానితి॥" —

(భూతముల యొక్క ఉత్పత్తి వినాశములను, గమనా గమనములను, విద్యావిద్యలను ఎవ్వడెరుగునో వాడు భగవానుడు) అనియు వివరింపబడినది.

శ్రీ డి. నాగసిద్దారెడ్డి,
తిరుపతి.

ఇట్టి పవిత్ర గుణములకు నిలయమైన వాడు శ్రీకృష్ణ పరమాత్మ. భాగవత పురాణముచే ప్రతిపాదింపబడిన యతడు సమస్తవేదమయుడు. ఆయనను వాస్తవముగ నెరిగినచో సర్వము నెఱింగినట్లే యని మహాభారత మీ విధముగ వాకొనుచున్నది.

"సర్వే వేదాః సర్వవేద్యాశ్చ కృష్ణః,
సర్వే యజ్ఞాః సర్వ ఇజ్యాశ్చ కృష్ణః,
విదుః కృష్ణం బ్రాహ్మణా స్తత్త్వతో యే,
తేషాం రాజన్ సర్వయజ్ఞా స్సమాప్తా" —

(ఓ రాజా! సమస్త వేదములు, వానిచే తెలిసికొన దగిన సమస్తమును కృష్ణుడే. సమస్త యజ్ఞములు, యజింప దగిన సమస్తమును కృష్ణుడే. ఏ బ్రహ్మనిష్ఠులు తత్త్వతః కృష్ణు నెఱుంగుదురో వారొనర్చు సర్వయజ్ఞములును సమాప్తములే.)

కృష్ణ భగవానుని జీవిత మహోత్కృష్టదులను సమగ్రముగ అనితర తుల్యముగ విస్పష్టము చేయునది భాగవతము. ఈ పురాణస్వరూపమును భక్తిచేత మాత్రమే అవగత మొనరించుకొనగలము. భక్త్యా భాగవతం జ్ఞేయం నవ్యుత్పత్త్యా న టీకయా"-అని విజ్ఞుల వాక్యము. ఇచట భక్తి యనగా నేమో యించుక తెలిసికొందము.

### భక్తి యనగా నేమి?

ఆది మానవుడు తన యూహ కందని ప్రకృతి రహస్యములనుజూచి యీ సచరాచర ప్రపంచమున కెవ్వడో కర్తయుండవలెనని యేనాడు భావింప మొదలిడెనో దీప్తినొసగు సూర్యునకు, చలువలవెదజల్లు చంద్రునకు, ఉప్పొంగు సముద్రమునకు, గర్జించు మేఘమునకు, ఏదియో యొక మహాశక్తి కారణమై యుండునని అతడేనాడు తలంచి దానికి ప్రాంజలి ఘటించెనో ఆనాడే అతని యందు భక్తి భావ ముద్భవించినది.

"లోకంబులు లోకేశులు
లోకస్థులు తెగిన తుది నలోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వడు
ఏకాకృతి వెలుగు" — నట్టి ఆ మహి

మాన్వితుని సేవించు తలంపు మానవునకు కలిగిననాడే అనేక విధములగు ఆరాధనా విధానములు సైతము బయలు దేరినవి. దేశకాల పాత్రముల ననుసరించి ఆరాధనా విధానమున భేదములున్నను దానికంతకు మూలకారణము భక్తి భావమేనని చెప్ప వచ్చును.

ఈ భక్తి తత్త్వమును గూర్చి —

ఎ) "యా ప్రీతిరస్తి విషయే ష్వవివేకభాజాం।
సైవాఒచ్యుతే భవతి భక్తి పదాభిధేయా॥"-

(వివేక హీనులకు శబ్దాది విషయముల యందెట్టి ప్రీతి కలుగుచుండునో అది భగవంతునిపై కలిగెనేని భక్తి యనబడును) అని ద్రవిడోపనిషత్సార సంగ్రహము,

బి) "అన్యాభిలషితై శ్శూన్యం జ్ఞాన కర్మాద్య నా వృతమ్।
ఆనుకూల్యేన కృష్ణాను శీలనం భక్తి రుత్తమా॥"—

(ఇతర వాంఛలు లేనిది, జ్ఞాన కర్మాదులచేత కప్పబడనిది యగు ఆనుకూల్యముతో కూడిన కృష్ణానుశీలనమే ఉత్తమ భక్తి యనబడును.)

అని భక్తిసారామృత సింధువు, చక్కగ నిర్వచించినవి. 'భజసేవాయాం' -అను ధాత్వర్థమునుబట్టి భక్తుడు మనసా వాచా కర్మణాపరిశుద్ధుడై పరమేశ్వరుని సేవించుటయే భక్తి యని యార్యులమాట.

సి) "అనన్య మమతా విష్ణౌ మమతా
ప్రేమ సంగతా, భక్తిః"

(ఇతర మమతలు లేక విష్ణుని యందు ప్రేమతో కూడిన ఏకాగ్రమమత్వమే భక్తి యనబడును.)

అని భీష్మ ప్రహ్లాద ఉద్ధవ నారదులు,

డి) "స్వస్వరూపాను సంధానం భక్తిరిత్య భిధీయతే" —

(ఆత్మ స్వరూపములతో ఐక్యము చెందుటయే భక్తి) అని వివేక చూడామణియందు శంకర భగవత్పాదులు,

ఇ) "తత్ర భక్తిర్నామ నిరవధికానంత అనవద్య కల్యాణ గుణత్వ జ్ఞాన పూర్వకః స్వస్వాత్మాత్మీయ సమస్త వస్తుభ్యః అనేక గుణాధికః అంతరాయ సహస్రేణా ప్య) ప్రతి బద్ధః నిరంతర ప్రేమ ప్రవాహః" —

(అవధిలేని అనంతమైన దోషరహితమైన కల్యాణగుణజ్ఞాన పూర్వకమైనది, తనకంటె తనకు సంబంధించిన సమస్త వస్తువులకంటె, పెక్కు రెట్లధికమైనది, వేలకొలది విఘ్నములు సంభవించినను నిరోధింప బడనిది, అగు అనంతప్రేమ ప్రవాహమే భక్తి.)

అని శ్రీ భాష్యమున శ్రీ మద్రామానుజాచార్యులు,

ఎఫ్) "మాహాత్మ్య జ్ఞాన పూర్వస్తు సుదృఢ స్సర్వతోఽధికః।
స్నేహో భక్తిరితి ప్రోక్తః తయా ముక్తి ర్నచాన్యథా॥" -

(మాహాత్మ్య జ్ఞాన పూర్వకమైనది, మిక్కిలి దృఢమైనది, అన్నిటికంటె నధికమైనది అగు స్నేహమే భక్తియనబడును అట్టి భక్తిచేతనే కాని ఇతర విధములచే ముక్తి లభింపదు.)

అని మహాభారత తాత్పర్య నిర్ణయమున మధ్వాచార్యులు,

జి) 'ద్రుతస్య భగవద్ధర్మాద్ధారావాహికతాం గతా।
సర్వేశే మనసోవృత్తిః భక్తిరిత్యభిధీయతే॥'

(సర్వేశ్వరుని స్మరించుట వలన ద్రవించిన మనస్సులో ఏకధారగ బయలు వెడలిన ఏకాకార వృత్తియే భక్తి) — అని భక్తి రసాయన గ్రంథమున మధుసూదన సరస్వతి.)

హెచ్) (తమ సమస్త కర్మలను ఈశ్వరార్పణ మొనరించి ఆ దేవుడు మరుగు పడినంతనే భరింప నశక్యమగు బాధ నను భవించుట పరమభక్తి. ఇది జ్ఞాన కర్మ యోగముల కన్న మిన్నయైనది.) అని నారదభక్తిసూత్రములయందునారదుడు.

ఐ) "అంకోలం నిజబీజసంతతి రయస్కాంతోపలం సూచికా సాధ్వీనైజ విభుం లతా క్షితిరుహం సింధుస్సరిద్వల్లభమ్, ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవింద ద్వయమ్ చేతోవృత్తి రుపేత్యతిష్ఠతి సదాసా భక్తి రిత్యుచ్యతే"

(ఊడుగ చెట్టును దాని బీజములు, ఆయస్కాంతమును సూది, తన భర్తను పతివ్రత, చెట్టును తీగ, సముద్రమును నది, ఎట్లు చేరునో అట్లే మనోవృత్తి పరమేశ్వరుని పాదారవింద ద్వయమునుచేరి ఏకాగమై యుండుటయే భక్తి యని చెప్పబడును.)

అని శివానందలహరి యందు ఆదిశంకరులు, మరియు నెందరో మహానుభావులు భక్తిని నిర్వచించి ప్రశంసించి యున్నారు. మొత్తము మీద భక్తి స్వరూపమును మనీషు లెందరెన్ని విధముల నిర్వచించినను 'భగవద్వియోగమును సహింప లేక పోవుటయే భక్తి' — అని మాత్రమే సారాంశము.



గజలక్ష్మి — కాంచి
ఫోటో: యన్. వి. కె యన్. శ్రీనివాసన్, తిరుపతి.

## ప్రాశస్త్యము

ఈ భక్తిమార్గముయొక్క ప్రాశస్త్యము శుకమహర్షి పరీక్షిత్తుతోననెడి మాటలవలన

తెలియనగును. చూడుడు.

1. "అఖిల భూతములందునాత్మ రూపంబున
నీకుండు హరియుండునెల్ల ప్రొద్దు
బుద్ధ్యాది లక్షణంబుల కానబడును మహా
సేవనీయు డహర్నిశంబు
వందనీయుడు భక్తవాత్సల్య సంతత
నియతుడై సతతంబు నియతబుద్ధి
నాత్మరూపకుడగు హరికథామృతములు
కర్ణపుటంబుల కాంక్షదీర
గ్రోలుచుండెడి ధన్యులు, కుటిల బహుళ
విషయ మలినీ కృతాంగముల్ వేగవిడిచి
విష్ణుదేవుని చరణారవింద యుగము
కదతు జనుదురు సిద్ధంబు కౌరవేంద్ర"—
(భాగ-2-38)

2. "కామింపకయును సర్వము
కామించియునైన ముక్తిఁ గామించి తగన్
లోమించి పరమ పురుషుని
నేమించి భజించు తత్త్వనిపుణుండధిపా!"
(భాగ-2-39)

3. 'అమరేంద్రాదుల గొల్చు భంగి జనుడా
యజ్ఞాక్షు సేవింపగా
విమల జ్ఞానవిరక్తి ముక్తులొదవున్ వేయేల
భూనాథ! త
త్కమలాధీశ కథా సుధారస నదీ కల్లోల
మాలా పరి
భ్రమ మెవ్వారికినైన కర్ణయుగళీ పర్వంబు
గాకుండునే'— (భాగ-2-40)

"మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" — అని శంకర భగవత్పాదులు సైతము భక్తి ప్రాశస్త్యమును పొగడి యున్నారు. పరమావధిని పొందుటకు అత్యంత సులభము, సహజమునైనది భక్తి మార్గము. భక్తి పూరితుడగు మానవుడు భగవానున కత్యంత సన్నిహితుడని భగవద్గీత యిట్లనుచున్నది. (సశేషము)

---

(14వ పుట తరువాయి)
మహోత్కృష్ట సందేశాలు సుస్థిర, శిరోధార్యాలు. బుద్ధభగవానుని సందేశాత్మకసత్యాలను భారతీయులందరు శిరోధార్యంగాస్వీకరించి, ఆచరించాలి. అప్పుడే మానవ జీవితానికి, భారతఖ్యాతికి పేరు, ప్రతిష్ఠ. మానవజాతి చరిత్రయందు భేదరహితంగా దుఃఖనివృత్తిని, పరమప్రశాంతిని, జ్ఞానము పొందుట ప్రతిమానవుని 'జన్మహక్కు' గా ప్రబోధించిన మహనీయులలో బుద్ధుడే మొట్టమొదటివాడు. మానవజాతిపై ఆయన ప్రేమకారుణ్యాలు అనుపమానాలు. బుద్ధుని ప్రేమ, కరుణాప్రవాహం ఒకమానవజాతి మీదేకాదు. సర్వజీవరాశిపై ప్రవహించి విశ్వమునే పునీతమొనరించింది. దీనిని బట్టి యీ విశ్వమంతా కేవలం అయోమయమై అర్థరహితమైన కాకతాళీయసృష్టి కాదనీ, అంతా విశృంఖలత, అంతాస్వైర విహారమూ కాదనీ, యీ ప్రపంచాన్ని పర్యవేక్షిస్తూ విశిష్టమార్గానడిపించే అతీతమైన శక్తి ఏదోవుందనీ స్పష్టమౌతుంది.

నిష్కామకర్మకు నిదర్శనమైన బుద్ధుని జీవితము మధురమంజులము. 'నిజమైన కర్మయోగి అంటే బుద్ధుడు' - అని వివేకానందుడు బుద్ధుని కీర్తించుచూ —

He is the the ideal Karmayogi, acting without motive, and the history of humanity shows him to have been the greatest man ever born, beyond compare, the greatest combination of heart and brain ever existed, the greatest soul power that has been manifested" — అని తన అభిప్రాయాన్ని, భక్తివిశ్వాసాలను తెలియజేశారు. అలాగే గాంధీ మహాత్ముడు బుద్ధుని స్మరిస్తూ — "Gouthama was saturated with the best that was in Hinduism and gave life to some of the teachings that were hurried in the ideals and which were over grown with weeds" అంటూ బుద్ధభగవానుని ఆగమసారాన్ని తెలియజేశారు.

బుద్ధభగవానునిగూర్చి, ఆతని మనోజ్ఞమైన సందేశాన్ని గూర్చి యెంతవ్రాసినను అదితక్కువే! భారతదేశమున బుద్ధుని జీవితోపదేశముచలనే జాతి, భేదదుర్వాదములు మూఢవిశ్వాసములు తొలగి సమసి భారతజాతీయత మంగళమై నిలచింది ఒకనాడు. కాని రానురాను ఎన్నో ఇతరమతాల సిద్ధాంతాల విషయంలో జరిగినట్లే యీ మహనీయ బౌద్ధమతం విషయంలోకూడ అభిప్రాయభేదాలు, పూర్వోత్తరపక్షాలు బయలుదేరి విద్వేషం, వైమనస్యం వ్యాప్తి చెందాయి. బౌద్ధమతం భ్రష్టమై, బుద్ధభగవానుని ప్రతిభావంతమైన వుపదేశాలు వివాదాల పాలయ్యాయి. మహత్తర సందేశాలు మరుగునపడ్డాయి.

ఏది ఏమైనా బుద్ధుని సందేశములు తలమానికములు. పరమసత్యమైన ఆయన సందేశాలను ఎవరూ కాదనలేరు. బుద్ధుడు కేవల సిద్ధాంతప్రచారకుడు కాడు; మార్గనిర్దేశకుడు మాత్రమే. మానవులు ధర్మచ్యుతిలేకుండా నిరంత నైతిక మార్గావలంబులై నిర్వాణాన్ని సాధించాలని ఆయన మతం. కాని ఆ నిర్వాణం ఎట్టిదో మాత్రం ఆయన వెల్లడించడానికి నిరాకరించాడు. అయితే ఈ మహాయాత్రను ఎవరికి వారే సాగించి, కష్టపడి గమ్యస్థానం చేరుకోవాలి. ఈ అంతిమసత్యం యొక్క అనుభూతి వ్యక్తిగతమైన సాధనద్వారానే లభిస్తుంది. అందుకే అశ్వఘోషుడు ఈ విధముగా ఉద్బోధించాడు.

"ప్రసారయ ధర్మధ్వజం; ప్రతూర్య ధర్మ
శంఖం ప్రతోదయ
ధర్మదుందుభిం; ధర్మంకురు, ధర్మంకురు
ధర్మంకురు

— అంటే "ధర్మదుందుభిని మ్రోగించు, ధర్మధ్వజాన్ని ఎగురవేయి, ధర్మశంఖాన్ని పూరించు, ధర్మాన్ని ఆచరించు" అని అర్థం.

ఓం
అసతో మా సద్గమయ।
తమసో మా జ్యోతిర్గమయ।
మృత్యోర్మాఽమృతం గమయ॥
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

★

# శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, తిరుమల

## వివిధ ఆర్జిత ఉత్సవముల ధరల వివరములు.

### దర్శనములు

| | | |
|---|---|---|
| 1. స్పెషల్ దర్శనము | రు. | 25 |

ఈ టికెట్టు తిరుమలలోనూ దేశంలో ఆంధ్రాబ్యాంకువారి వివిధశాఖలలోను లభించును. ఈ టిక్కెట్టు వారిని సుప్రభాత సమయంలోనూ, సర్వదర్శన సమయంలోను అనుమతించటం జరుగుతుంది. ఈ టిక్కెట్టు వారిని సర్వదర్శన సమయంలో ధ్వజస్తంభమువద్ద గాక మహా ద్వారంవద్ద క్యూలో చేర్చటం జరుగుతుంది.

### సేవలు

| | | |
|---|---|---|
| 1. ఆమంత్రణోత్సవము | రు. | 200 |
| 2. పూలంగి సేవ | రు. | 60 |
| 3. అభిషేకము (పులికాపు సేవ) | రు. | 450 |
| 4. గంబురగిన్నె | రు. | 250 |
| 5 పునుగుగిన్నె | రు. | 100 |
| 6. జాఫ్రాగిన్నె | రు. | 100 |
| 7. కస్తూరిగిన్నె | రు. | 100 |
| 8. సహస్రకలశాభిషేకము | రు. | 2500 |
| 9. తిరుప్పావడ | రు. | 5000 |
| 10. కోవిల్ ఆళ్వారు తిరుమంజనం | రు. | 1745 |
| 11. ఐనా మహల్లో డోలోత్సవం | రు. | 1000 |

### ఉత్సవములు

| | | |
|---|---|---|
| 1. వసంతోత్సవము | రు. | 2500 |
| 2. కల్యాణోత్సవము | రు. | 1000 |
| 3. బ్రహ్మోత్సవము | రు. | 750 |

### వాహనములు

1 సర్వభూపాలవాహనములో వజ్రకవచసేవ 72 + 1 (హారతి) రు. 73

2. బంగారుగరుడ, కల్పవృక్ష, పెద్దశేష, సర్వభూపాల, సూర్యప్రభ ఒక్కొక్కదానికి 62 + 1 (హారతి) రు. 63

3. వెండిగరుడ, చిన్నశేష, చంద్రప్రభ, ఏనుగు, గుఱ్ఱం, హంస, హనుమంత వాహన సేవ ఒక్కొక్కదానికి 32 + 1 (హారతి) రు. 33

### అన్నప్రసాదములు (కాలుసోల)

| | | |
|---|---|---|
| 1. దధ్యోదనము | | 40 |
| 2. పులిహోర | రు. | 50 |
| 3. పొంగలి | రు. | 55 |
| 4. చక్కెరపొంగలి | రు. | 65 |
| 5. సాకరబాత్ | రు. | 95 |
| 6. కేసరిబాత్ | రు. | 85 |
| 7. పాయసము | రు | 85 |
| 8. సీరా | రు. | 155 |

### పడుల ప్రసాదములు

| | | |
|---|---|---|
| 1. అప్పము | రు. | 230 |
| 2. లడ్డు | రు. | 450 |
| 3. వడ | రు. | 250 |
| 4. పోళీ | రు. | 225 |
| 5. దోసె | రు. | 100 |
| 6. తేనెతొళ | రు. | 200 |
| 7. సుఖియం | రు. | 200 |
| 8. జిలేబి | రు. | 450 |

### నిత్య సేవలు

| | | |
|---|---|---|
| 1. నిత్యకర్పూర హారతి | రు. | 21 |
| 2. నిత్యనవనీత హారతి | రు. | 42 |
| 3. నిత్య అర్చన | రు. | 42 |

ఎరా.- సహస్ర కలశాభిషేకము ప్రతి బుధవారమునను, తిరుప్పావడ ప్రతి గురువారమునను జరుగును. మిగిలిన వివరములకు ఈక్రింది చిరునామాకు వ్రాయవచ్చును.

1. ఆమంత్రణోత్సవమునకు 5 గురికి మారుగా ఇద్దరికి మాత్రమే అనుమతి.
2. ప్రతిదినం మధ్యాహ్నం 1-00 గం॥ నుండి 8-00 గం॥ లోపల సర్కారు లేదా ఆర్జిత కళ్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, వాహన సేవలు, సర్కార్ డోలోత్సవం (ఉయ్యాల) (సర్కారు లేక ఆర్జిత ప్లవోత్సవం, మంగళ వారంనాడు) జరుగుతవి.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,
తిరుమల తిరుపతి దేవస్థానం
తిరుపతి 517501

(12 వ పేజీ తరువాయి)

శ్రీభగవానుడు చెప్పాడు

దేవీ, క్షితీ, నారాయణస్వరూపుడు సర్వ ప్రాణులనూ సృష్టించినదెలాగో చెపుతాను. అదంతా విను [22]. కడచిన కల్పంచివర రాత్రి బ్రహ్మ నిద్రించాడు కళ్యాణీ. ఆయన సత్త్వోద్రిక్తుడై (మేలుకొని) శూన్యంగా ఉన్న లోకం చూచాడు. [23] నారాయణుడు గొప్పవాడు. అచింత్యుడు. ముందుపుట్టిన వారికంటె ముందుపుట్టినవాడు. బ్రహ్మ స్వరూపుడు, భగవానుడు, అనాది, సర్వ సృష్టికర్త, [24] జగత్కారణుడు, అవ్యయుడు అయిన బ్రహ్మస్వరూపి నారాయణ దేవునిగురించి ఈసందర్భంలో ఈశ్లోకాన్ని ఉదాహరిస్తూ ఉంటారు: [25]

శ్లో॥ ఆపో నారా ఇతి ప్రోక్తా
ఆపో వై నరసూనవః।
అయనం తస్య తాః పూర్వం
తేన నారాయణః స్మృతః॥

పురుషోత్తముడైన నరునినుంచి జన్మించినది కనుక నీళ్లు నారములంటారు. నారములు పూర్వం ఆయనకు నివాసం. కనుక ఆయన నారాయణుడు అంటారు. [26]

పూర్వకల్పాదులలోవిధంగానే సృష్టిని గురించి ఆలోచిస్తున్నాడు ఆయన. అప్పుడాయనకు బుద్ధిపూర్వకం కాని తమోమయసృష్టి కలిగింది. [27] తమము, మోహము, తామిస్రము, అంధతామిస్రము అని ఐదుకణువుల ఈ అవిద్య ఆ మహాత్మునికి ఆవిర్భవించింది. [28]

ఇంకా ఆలోచిస్తుండగా ఆయనకు చేతనారహితమైన (బుద్ధిరహితమైన వృక్ష గుల్మ, లతా, తృణ, పర్వతరూపమైన) పంచవిధసృష్టి ఏర్పడింది. సృష్టివేత్తలయిన విచక్షణులు దానిని ముఖ్యసర్గమని తెలుసుకొన్నారు. [29]

ఇంకా ఆలోచిస్తుండగా ఆయనకు అంతకంటె ఉత్తమమైన మరొక సృష్టి సంభవించింది. అది అడ్డంగా నడిచేది కనుక, దానికి తిర్యక్స్రోతస్సృష్టి అని పేరు వచ్చింది. [30] ఇందులోని ప్రాణులు పశువులు మొదలయినవి ప్రసిద్ధమైనాయి. స్వేచ్ఛాచారులుగా చేయబడ్డాయి. చతుర్ముఖుడు తిర్యక్స్రోతంకూడా సాధనం కాదనుకొన్నాడు. [31]

మూడవది ఊర్ధ్వస్రోతస్సృష్టి చేశాడు. ఇది సాత్త్వికమైనది. ఇందులోనివారు ధర్మవర్తనులు. ఊర్ధ్వచారులు, దేవతలు, అందరూ గర్భసంజాతులు. [32] మరొక సృష్టి చేసి ఆలోచించాడు ప్రజాపతి. ఈ ముఖ్యాదిసృష్టులలో జన్మించినప్రాణులు (పురుషార్థ) సాధకాలు కావని భావించాడు. [33]

అపుడు ఆ ప్రభువు అర్వాక్స్రోతః సృష్టినిగురించి ఆలోచించాడు. అర్వాక్స్రోతః (క్రింధికి పోయే ఆహారం వల్ల పెరిగే) సృష్టిలో పుట్టినమానవులు సాధకులని ఇష్టులయ్యారు. [34] వీరిలో (సత్త్వ గుణసహితులు) ప్రకాశయుతులు, రజస్తమోగుణాలు అధికంగా కలవారు దుఃఖభూయిష్ఠులూ, చేసినదే చేసేవారూను. [35]

కళ్యాణీ, ఈవిధంగానే నీకు ఆరుసృష్టులనుగూర్చి చెప్పాను. మొదటిది మహత్సృష్టి. రెండవది తన్మాత్రసృష్టి. [36] మూడవది వైకారికసృష్టి. దీనినే ఇంద్రియ సృష్టి అంటారు. ఇంతవరకూ ఇది ప్రాకృత సృష్టి. బుద్ధిపూర్వకంగా ఏర్పడినది. [37]

నాలుగవది ముఖ్యసృష్టి. స్థావరాలకు ముఖ్యాలని పేరు. (కనుక స్థావరసృష్టిని ముఖ్యసృష్టి అంటారు.) అడ్డంగా నడిచే వాటిసృష్టి తైర్యక్సృష్టి అంటారు. [38] శ్రేష్ఠమైనది ఊర్ధ్వస్రోతస్సృష్టి. ఏడవది

## రచయితలకు చిత్రకారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రికకు మత ధార్మిక సంబంధమైన రచనలు, వ్యాసములు, గేయములు, చిత్రములు, ఛాయా (వర్ణ) చిత్రములు పత్రికలో ప్రచురణకు గాను కోర బడుచున్నవి. రచయితలు, చిత్రకారులు ఈ క్రింది విషయములు గమనించవలెను.

*

1. రచనలు చేయువారు 6 అరతావు పేజీలకు మించకుండా, పేజీలకు ఒక వైపుననే వ్రాసి పంపవలెను. వాటికి సంబంధించిన ఛాయా చిత్రములను కూడ పంపగోరెదము.

*

2. చిత్రములు వేయువారు ఇండియన్ ఇంకుతో వేసి పంపవలెను.

*

3. ఛాయాచిత్రములుపంపువారు చిత్రములలోని వివరములు నిర్దుష్టంగా వ్రాసిపంపవలెను.

— సంపాదకుడు,
సప్తగిరి

మానవసృష్టి. ఎనిమిదవది అనుగ్రహ సృష్టి. ఇది సాత్త్వికమూ రాజసమూ కూడాను. [39] ఈ (చివరి) ఐదూ వైకృత సృష్టులు.

(వీటిముందటి) మూడు సృష్టులూ ప్రాకృతసృష్టులంటారు.

తొమ్మిదవది కౌమారసృష్టి. ఇది ప్రాకృతమూ వైకృతిమూకూడా [40].

ఈవిధంగా నీకు ప్రజాపతి నవవిధ సృష్టులనుగురించీ చెప్పాను. ప్రాకృత వైకృతసృష్టులు జగత్తుకు మూలహేతువులు. ఇలా నీకు సృష్టులనుగురించి చెప్పాను. ఇంకేమి వినగోరుతున్నావు? [41]

## స్థితి

(అని అడిగేసరికి) ధరణీదేవి "అవ్యక్త సంభవుడయిన బ్రహ్మవల్ల నవవిధసృష్టి ఉద్భవించింది. దేవా, అది ఎలా పెరిగింది? ఇది నాకు చెప్పు అచ్యుతా" అని కోరింది. [42]

వరాహుడు చెప్పాడు ;

మొదట బ్రహ్మ, రుద్రాదు (లయిన దేవత)లనూ, తరువాత సనకాదు (లయిన కుమారు) లనూ, అనంతరం మరీచ్యాదు (లయిన ఋషు) లనూ సృష్టించాడు. [43] మరీచి, అత్రి, అంగిరసుడు, పులహుడు, క్రతువు, పులస్త్యుడు, మహాతేజస్వి, ప్రచేతసుడు, భృగుడు, నారదుడు, మహాతపస్వి, వశిష్ఠుడు (వీరు ఋషులు) [44]. సనకాదులను నివృత్తిధర్మంలోనూ, ఒక్కనారద ముని మినహా మిగిలినవారిని ప్రవృత్తి ధర్మంలోనూ ఆయన నియమించాడు. [45]

బ్రహ్మదక్షిణాంగుష్ఠంనుంచి తొలుత పుట్టిన మొదటిప్రజాపతి ఉన్నాడే, మొదట ఆతనివంశంలోనిదే ఈచరాచరజగత్తు. [46] దేవతలు, దానవులు, గంధర్వులు, ఉరగులు, పక్షులు - పరమధార్మికులందరూ దక్షుని కన్యలకు ఉద్భవించారు. [47]

## ఏకాదశరుద్రసృష్టి

బొమముడులతో వక్రమయిన పరమేష్ఠిలలాటంనుంచి అతనిక్రోధంవల్ల జన్మించిన పుత్రుడున్నాడే, రుద్రుడని ప్రసిద్ధుడు, [49] అర్ధనారీనరాకారుడు, ప్రచండుడు, అతిభయంకరుడు, అతనితో బ్రహ్మ "నిన్ను విభజించుకో" అని పలికి, మళ్లీ అంతర్ధానమయ్యాడు. [40]

అలా అనేసరికి. అతడు తనను స్త్రీగా పురుషుడుగా రెండుగా విభజించుకొన్నాడు. పురుషత్వాన్ని అతడు పదకొండు విభాగాలు చేసుకొన్నాడు. [50] అటుపిమ్మట ఆ బ్రహ్మసంభవులు ఏకాదశరుద్రులని విఖ్యాతులయ్యారు [51]

అనఘురాలా, ఈ రుద్రసృష్టిగురించి నీకు చెప్పాలని చెప్పాను నేను.

## యుగమాహాత్మ్యం

ఇప్పుడు యుగమాహాత్మ్యం సంపూర్ణంగా చెపుతాను. [52]

కృత త్రేతా ద్వాపర కలియుగాలు చతుర్యుగం. ఇందులో మహాసత్త్వాలు, బహుదక్షిణలిచ్చే రాజులూ, దేవాసురులూ ఆచరించిన ధర్మకర్మలనుగురించి విను: [53]

పూర్వం ప్రథమకల్పంలో స్వాయంభువమనువు ఉండేవాడు. ఆయనకు ఇద్దరు కొడుకులు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అని. వారు ధర్మవత్సలులు. వారిచర్యలు మానవాతీతాలు.

వారిలో ప్రియవ్రతభూపతి మహాయజ్వ తపోబలుడు [55], [56] ఆయన భూరిదక్షిణలిచ్చి మహాయజ్ఞాలు చేశాడు. సప్తద్వీపాలలోనూ, తనకుమారులను భరతాదులను నిలిపాడు. తాను వరప్రదాయిని విశాలకు వెళ్లి మహాతపస్సు చేశాడు. [57]

ఆ రాజు, చక్రవర్తి ధర్మాచరణంతో తపస్సుచేస్తుంటే చూడాలని వచ్చాడు నారదుడు. [58].

ఆ రాజేంద్రుడు ఆకాశంలో భాస్కర తేజస్సుతో ప్రకాశిస్తున్న నారదుని చూచి సంతోషించి, గౌరవపూర్వకంగాలేచి ఎల్చున్నాడు. [59] ఆయనకు ఆసనం, పాద్యం, నైవేద్యం చక్కగా సమర్పించాడు ఒకరితో ఒకరు స్వాగతాదివాక్యాలు మాట్లాడుకొన్నారు. [60]

57. విశాల = బదరికాశ్రమం.

వెల్లూరుకోటలోని విచిత్రశిల్పం: ఏనుగు, ఎద్దు ఒకే శిల్పములో మలచబడినవి.



అవి అయాక ప్రియవ్రతుడు బ్రహ్మ వాది అయిన నారదునితో, [61] భగవానుడా నారదా, ఈ కృతయుగంలో విన్నది కన్నది ఏదైనా వింతగురించి చెప్పు" అని అడిగాడు. [62].

### వింత కథ

నారదుడు చెప్పాడు :

ప్రియవ్రతా, ఒకఆశ్చర్యం చూశాను. అది చెపుతాను విను.

రాజేంద్రా. నిన్నటిరోజున నేను శ్వేత ద్వీపానికి వెళ్లాను. అందులో ఒకసరస్సు కనిపించింది. దానిలో పద్మాలు చాలుగా వికసించి ఉన్నాయి. దానిఒడ్డున పెద్ద కన్నులకన్య కనిపించింది.

ఆసోగకన్నుల చిన్నదానిని చూచేసరికి ఆశ్చర్యం వేసింది నాకు. రాజేంద్రా అపుడా మధురభాషిణిని [65] "కళ్యాణీ, ఎవరవు నీవు? ఎలా ఉన్నావు? ఇక్కడ నీకేమిపని? ఏమిచెయ్యాలి చారుసర్వాంగీ అది నాకు చెప్పు కళ్యాణీ" అని అడిగాను. [66]

నేనిలా అనేసరికి ఆవిడ నావైపు రెప్ప వేయకుండా చూచి, జ్ఞాపకానికి తెచ్చుకొని మాట్లాడకుండా నిలబడింది. ఇంతలో నా ఉత్తమజ్ఞానం మరచిపోయాను. [67] సర్వ వేదాలూ, సర్వశాస్త్రాలూ, యోగశాస్త్రాలూ, వేదశాస్త్రాలూ, స్మృతులూ, [68] - సర్వమూ ఆవిడను చూచి వెంటనే ఆవిడ క్షణంలో అపహరించింది. రాజా అపుడు నేను ఆశ్చర్యపోయాను. విచారమూ, శోకమూ ముంచుకు వచ్చాయి. [69]

ఆవిడనే శరణుపొంది చూచేసరికి, రాజా, ఒకదివ్యపురుషుడు ఆవిడశరీరంలో కనిపించాడు [70] అతనిహృదయంలోనూ మరొకడూ, అతనివక్షఃస్థలంలోనూ వేరొకడూ కనిపించారు. ఇతడు ఎర్రనికన్నులతో ద్వాదశాదిత్యసమానతేజస్వి అయి ఉన్నాడు. [71]

ఇలా కన్యాశరీరంలో ఇక్కడ ముగ్గురు పురుషులు కనిపించారు. క్షణంలో అక్కడ కన్య ఒక్కతే ఉన్నది. వారు కనిపించ లేదు సువ్రతా. [72]

అనంతరం ఆ దేవిని, కుమారిని "కళ్యాణీ, నావేదాలెలాపోయాయి? అలా పోవటానికేమిటి కారణం? నాకు చెప్పు" అని అడిగాను. [73]

కన్య "నేను సర్వవేదమాతను. నా పేరు సావిత్రి. నీవు నన్నెరుగవు. కనుక, నీవేదాలు పోయాయి" అని చెప్పింది. [74]

రాజతపోధనా, ఆవిడ ఇలాచెప్పేసరికి ఆశ్చర్యపోయి, ''కళ్యాణీ, ఆ పురుషులెవరు? ఇది చెప్పు'' అని అడిగాను. [75]

కన్య చెప్పింది: నాశరీరంలో సర్వావయవాలూ అందంగా తళతళలాడేవాడున్నాడే, అతడు ఋగ్వేదం. వేదంస్వయంగా నారాయణస్వరూపం. అగ్నిమయుడు, ఉచ్చరించిన వెంటనే పాపాలను దహిస్తాడు. [76]

అతనిహృదయంలో నీవు మరొకరిని చూచావే, అతడతనికొడుకు యజుర్వేదరూపి, మహాబలుడు, బ్రహ్మ. [77]

అతని వక్షఃస్థలంలో ప్రవేశించిఉన్న పవిత్రుడు ధగధగలాడుతున్నవాడు సామవేదుడు, రుద్రరూపి. [78] ఇతనిని స్మరిస్తే ఆదిత్యునిలా పాపాలను వెంటనే నశింపజేస్తాడు [79]

బ్రాహ్మణుడా, వీరు ముగ్గురూ మహా వేదాలు. ఇక్కడ యజ్ఞాలు అకారాది వర్ణాలు ద్విజా. [80] ఇదంతా నీకు సమగ్రంగా చెప్పాను ద్విజోత్తమా.

నారదా, వేదాలనూ, శాస్త్రాలనూ సర్వజ్ఞత్వాన్నీ స్వీకరించు [81]. మహాద్విజా, ఈవేదసరస్సులో స్నానంఆచరించు, సజ్జనోత్తమా, స్నానంచేసేసరికి ఇతరజన్మజ్ఞానం జ్ఞాపకానికి వస్తుంది. [82]

రాజా, ఇలా చెప్పి కన్య అంతర్ధానం చెందింది. నేనాసరస్సులో స్నానంచేసి నిన్ను చూడాలని ఇక్కడకు వచ్చాను. 83

ఇది వరాహపురాణంలో
ఆదిభూతసృష్టిస్థితి
యుగమాహాత్మ్య వర్ణనం అను
రెండవ అధ్యాయం:

( సశేషము )



పద్మావతి అమ్మవారి ఆలయ పుష్కరిణి దృశ్యం.

## అంజలి

★

సంయమమున లలిత సరస్వతికి గద్య
పద్య సౌధమ్ములను గట్టి భావరాగ
తాళ పుష్పపూజలు చేసి ధన్యుడైన
మా అనంత కృష్ణుడు శ్రీశు మనసు జేరె.

విశ్వసంగీత సాహిత్య వీధులందు
వెలయ తాళ్ళపాక కృతులు వెలికి దీసె
సమధికోత్సాహి నిర్మలజ్ఞానమూర్తి
పండితాగ్రసరుడు రాళ్ళపల్లి శర్మ.

శూన్యహృదయాల చిత్తశల్ చిగురులెత్త
సరస సంగీత రీతుల సంతరింప
అఖిల దిక్తటములబ్రాకె నతనికీర్తి:
మహితగుణశాలి వాణి ప్రమాణమవని

శ్రీనివాసుని మంగళాశీస్సులనగ
గారవము గాంచి రంతిమ గడియలందు
ఎంత ధన్యాత్ములో! పూజలేమి చేసి
నారొ! మృతులయ్యు అమృతులైనారు
నేడు

పాలమీగడవంటి స్వభావమలర
పెక్కుభంగుల ఎన్నికకెక్కెనతడు;
తీరుతీయముల్ బాసకు దిద్దినట్టి
అమరబుధున కనంతున కంజలింతు.

(తిరుపతిలోని శ్రీ అన్నమాచార్య కళామంది రంలో ఇటీవల జరిగిన శ్రీరాళ్లపల్లి అనంత కృష్ణశర్మ సంస్మరణ సభలో చదివిన పద్యాలు.)

శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి
తిరుపతి.

(11వ పేజీ తరువాయి)

నుండి ఋక్కులు-యజుస్సులు-సామములు గోవులు- మొదలుగాగల సమస్తపదార్థము లుద్భవించినవి. చంద్రుడు మనస్సునుండి, సూర్యుడు కన్నులనుండి పుట్టారు. ముఖం నుండి ఇంద్రాగ్నులుపుట్టారు. ప్రాణాల నుండి వాయువు, నాభినుండి ఆకాశముద్భ వించాయి. పాదములనుండి భువి, శ్రోత్ర ములనుండి దిక్కులు కలిగాయి. ఈ రీతి లోకనిర్మాణం జరిగింది

పంచభూతాలు, సర్వపదార్థాలు ఆ పురు షునివలన ఉద్భవించుచున్నవని అతడు అనంతశక్తి సంపన్నుడగుటచేత అతనికవి సాధ్యములై మనకజయ్యములని మానవుడు తన మొదటిసంశయానికి సమాధానంచెప్పు కున్నాడు. ఆ తర్వాత అతని రెండవ సందేహాన్నిగూర్చి ఆలోచించాడు. అదే అంతస్తత్త్వమయిన ఆత్మతత్త్వం.

శరీరం పనిచేసే తీరు, దానికై అతను కనుగొన్న సమాధానమిది. "పద్మకోశ ప్రతీకాశం హృదయం చాప్యదోముఖమ్.... తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవ స్థిత .... స బ్రహ్మ స శివస్సహరిస్సేంద్ర స్సోఽక్షరః పరమః స్వరాట్" .... మొదల గునవి, శరీరంలోని సుషుమ్నానాడిపై ఒక పెద్దనిప్పు-దానిమధ్య ఒకజ్వాల-ఆ జ్వాలమీద పరమాత్మస్థితి-అదే బ్రహ్మ అదే శివుడు మొదలయినవారు. ఈరీతిగా రెండు సమాధానాలు లభించాయి. ఏరెండు విషయాలను విస్మయదృష్టితో చూచారో ఆ రెండింటికి సమాధానం దొరికింది. అది భక్తియొక్క ద్వితీయస్థితి.

అయితే అది భక్తిగా ఎందుకు పరిణ మించింది. ఆ భక్తితో తాను సాధించింది కాని సాధించ వలసినదిగాని ఏమిటి "ఎవ్వనిచే జనించు .... ఈశ్వరునే శర ణంబు వేడెదన్" అని శరణువేడవలసిన అవసరమేమిటి?

ఇంటినుండి మనం ఎక్కడికైనా బయలుదేరామనుకొండి. ఎన్నిళ్ళు తిరిగినా ఎన్ని బజార్లు తిరిగినా మరల ఇంటికే చేరు కుంటాం. చిన్నతనంలో ఇల్లువిడిచి పారి పోయినవారునైతం సంవత్సరాల తర్వాత మరల ఇంటికెందుకు వస్తున్నట్లు? ఒక ఊరినుండి బయలుదేంతే మరల ఆ ఊరే ఎందుకు చేరుతున్నట్లు? ఇక్కడ సూక్ష్మ పరిశీలనఅవసరం. అంటే మానవుడు తనకు తెలిసిన ఒక చోటనుండి బయలుదేరితే మరల అక్కడికే రావాలని ఆరాటపడతాడు. క్రొత్తచోటునిద్రపట్టదు అన్నం సహించదు. ఆరీతిలో మానవుడు ఆలోచించాడు.

మనం వచ్చింది మరెక్కడనుండి. ఏ పురుషునినుండి. ఏ పురుషుని త్యాగఫలంగా అతనినుండి విడివడి వచ్చాము. అంటే మనం బయలుదేరిన తావు ఆ పురుషుడు అయినపుడు తిరిగి అతన్ని మనం చేరు కోవాలనుకోవటం-దానికై ప్రయత్నించ డం చాలా సహజమైన విషయం. కనుక ఏ పురుషుని త్యాగఫలంగా మనంపుట్టామో ఆ పురుషునే చేరాలి. అదే జీవిత ప్రధాన ధ్యేయం కావాలి. ఎవని కారణంగా జనిం చినదీ తెలియుటకు ఇంత కష్టమైనపుడు అక్కడ చేరటమింకా కష్టం కదా!

ఆ లక్ష్యసాధనకు మానవుడు స్వీకరిం చిన ప్రధానసిద్ధాంతమే భక్తి. ఆ విషయమై శ్రీశంకరాచార్యులుగారి శ్లోకాన్నిచూడండి.

అంకోలం నిజబీజసంతతిరయస్కాంతో
పలం సూచికా
సాధ్వీనైజవిభుం లతాక్షితిరుహం సింధుస్సరి
ద్వల్లభమ్।
ప్రాప్నోతీహ యథా తథా పశుపతే
పాదారవిందద్వయం
చేతోవృత్తిరుపేత్య తిష్ఠతి సదా సా భక్తి
రిత్యుచ్యతే॥

ఇలా అనుమాన ప్రమాణసిద్ధం హేతు వాదంకాని ప్రత్యక్షప్రమాణానికి ప్రాధాన్య మిస్తే దానిని హేతువాదమనే అనరాదు గదా!

✻

(8వ పేజీ తరువాయి)
నందు జ్ఞానమునందు శ్రేష్ఠులున్నచో గృహమున కేతెంచుచో నట్టివారిని తగు విధులచే సత్కరింపవలెను. వారికి ఏది ఇచ్చినను శ్రద్ధతోనిమ్ము. అశ్రద్ధతోనియ్య కుము. నీకున్న ఐశ్వర్యము ననుసరించి యిమ్ము, అభిమానమునువదలి నీవిచ్చు నది చాలాస్వల్పమను భావముతో సంకోచ హృదయముతో లజ్జతోనిమ్ము. దేశపాత్ర లను గమనించి దానముయొక్క పరిణా మమును గుర్తెరిగి యిమ్ము. ఒకవేళనీకు కర్తవ్యకర్మయందు గాని సదాచరణవిష యమునగాని సందేహముకలిగెనేని అపుడు ఆ దేశమున యెవరు ఉత్తమవిచక్షణ జ్ఞానముగలవారో, సలహాఇచ్చుటలో నేర్ప రులో, దయార్ద్రి విద్వజ్జనహృదయులో ధర్మాభిలాషులో అట్టి బ్రహ్మవేత్తలగు మహాత్ములు కర్మలయందుగాని సదాచార మునగాని యెట్లు ప్రవర్తించెదరో నీవును అట్లే అనుష్ఠింపుము. మరియు దోష దూషితులగునెవరివిషయమునైనను నీకు సందేహము కలిగెనేని చెప్పబడిన మహనీ యులు వారియెడల నెట్లు ప్రవర్తించు చున్నారో నీవు అట్లే ప్రవర్తించుము. అట్టి ధర్మాచరణతత్పరులగు తత్త్వవేత్తల ఆచ రణయే నీకు ప్రమాణము. ఇది శాస్త్రాజ్ఞ. తల్లిదండ్రులు గురువులు తమ శిష్యసంతా నములకు ఉపదేశించు ఉపదేశము ఇది లేదా వేదాన్తములయొక్క సారాంశము రహస్యము. ఇంతియేగాదు భగవదాజ్ఞ కాన నీవు ఈవిధముగా కర్తవ్యనిష్ఠుడవు కమ్ము.

ఈ వైదిక హిందూధర్మ మాచరించి మనపూర్వులు లోకోద్ధారకులైరి. ధర్మం భౌతికానికి ఆధ్యాత్మికానికి చెందుతుంది. పుట్టినందుకు పూర్ణులం కావాలి. మన హిందూమతానికి ఆచరణం చాలాఅవసరం

# చందాదారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రిక చందాదారులలో దిగువ పేర్కొన్న సంఖ్య వారి చందా 30-6-79 తేదీకి అంతమగును. చందాదారులు ఈ విషయమును గమనించి M. O. ద్వారా దిగువ పేర్కొనిన ప్రకారము మనియార్డరు కూపనునందు తమ చందా సంఖ్య పూర్తి విలా సమును పేర్కొని, త్వరలో చందా పంపనియెడల ఆ తేది దరిమిలా పత్రిక పంపబడదు.

చందాదారుల నంబర్లు మార్చబడినవి. కొత్తనంబర్లు దిగువ పేర్కొనబడినవి. తమకు పంపిన పత్రిక అడ్రసు పేపరుమీద నున్న నంబరును క్రొత్త నంబరుగా గమనింప ప్రార్థన.

4 19 43 52 53 109 154 163 212 218 235 248 253 257 281 289 322 349 358 360 363 379 442 449 501 502 504 505 507 508 509 511 525 571 584 622 702 704 705 706 707 708 709 710 712 713 714 715 716 717 718 719 720 722 723 746 806 866 1203 1204 1205 1208 to 1218 1223 1224 2226 1229 1230 to 1241 1243 1244 1245 1247 to 1262 1264 1266 1268 to 1272 1274 1275 1276 1278 to 1286 1289 1294 1314 to 1330 1332 to 1347.

గమనిక :- (1) సప్తగిరి చందాలు 15 తేదిలోగా చేరునట్లు పంపవలెను. ఆ తరువాత చేరిన చందాలకు మరునెలనుండి మాత్రమే పత్రిక పంపబడును.

(2) కొత్త చందాదారులు కూపనులో 'కొత్తచందా' అని పేర్కొనవలెను. పాత వారు కూపనులో తమ చందా సంఖ్య నమోదు చేయవలెను.

(3) సప్తగిరి చందాలు ఈ క్రింది అడ్రసుకే తమ పిన్‌కోడ్ తెలియజేస్తూ పంప వలయును.

సప్తగిరి మాసపత్రిక సం॥ చందా రు. 6/-

ఎడిటరు
పబ్లికేషన్ సెక్షన్
ప్రెస్ కాంపౌండ్, తిరుపతి 517501.

అదే ఎక్కువ ప్రచారమవుతుంది. చెట్లు పుష్పించే సమయానికి తుమ్మెదలు తామే ఆకర్షింపబడునట్లు వేదభారతీలావణ్య ఆర్ష విజ్ఞానమైన హిందూమతంవైపు యెల్ల మానవజాతి ఆకర్షింపబడుననుటలో సందేహములేదు. హిందూమతమే ఎందుకు మహితగలదని మరికొందరి సంకల్పము. ఇతరమతకర్తలచే జెప్పబడిన ధర్మములు 'కం సర్వమిదం విజ్ఞానం భవతి' యని వేదగానమన్నట్లు మానవులలోని పాశవికత్వము తొలగించి నవనవోన్మేషము నందించి ధన్యులనుగావించు సమస్తధర్మములు కనిపించుచున్నవి. మానవ సర్వశ్రేయఃప్రాప్తికి వేదధర్మమొక్కటేయని తెలియబడును.

ఇతరమతస్థులు వారిమతములు బలపరచుకొనుటకు హిందూభూమియందు వేచియున్నారు. నేటికే యెన్నియో కోట్ల హిందువులు ఇతరమతములలోనికి పరివర్తనముజెంది పోయిరి. రంధ్రముగల కుండనుండి నీరు ఒకటి రెండు చుక్కలు పోవునప్పుడు తగ్గుదల కనిపించదు. అలాగే కొన్నిగంటలు పోయిన తర్వాత త్వరగా భాండము ఖాళీఅగును. హిందూ సంఘముయొక్క గతియు ఇదేరీతిగ నుండగలదు. హృదయవంతుడైన మానవు డెవ్వడును మాతృదేశానురాగమును ఘనీభూత మూఢవిశ్వాసమనుకొనడు. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" తన మాతృభూమి నివేదమాత నాదరించుటను. స్వర్గమున కంటె మిన్నగా ప్రేమించవలయునని ప్రాజ్ఞుల నిశ్చయము. ఈదేశ పౌరులక్కడక్కడ భారతీయ భాషలమీద ఆ యాచారాలమీద ద్వేషం, యితరభాషల మీద, ఆ యలవాట్లమీద ఆసక్తి, హిందూమత గొప్పధర్మములయందు విరక్తి, పరమత విశ్వాసాలమీద అనురక్తియుండుట కడు ఆవేదనాపూరిత దురదృష్టకరం, విచారకరంకూడాను. మానవుడు స్వీయదేశ మతధర్మానురాగ గౌరవముకల్గి పరదేశ మతధర్మములను జగదేక కుటుంబమనే నుదారభావముతో అర్థముచేసికొనదగును. 'అద్రోహస్సర్వభూతేషు' సర్వమానవుల యందు శాన్తిముద్రగలది హిందూమతం.

హైందవమహర్షులలో పట్టుగొమ్మయైన శ్రీభృగుమహర్షి "సర్వేపి వైదికాచారాస్సర్వేయజ్ఞాస్తపాంసి చ విష్ణుపూజావిధేర్భేదా స్తత్కర్మ ఫలదోహరిః" వేదమతజపయజ్ఞారాధన ధ్యానవ్రతోత్సవధర్మకర్మలన్నియు శ్రీమన్నారాయణుని సేవావిధులందుగల భేదమేఅనియు, సర్వఫలప్రదాత శ్రీస్వామియేయని ఖిలాధికారమందు శెలవిచ్చిరి.

పై శ్లోకమందు సర్వశబ్దముండుటచే మతకార్యములేగాక సమాజమందు నిర్వహింపబడు ప్రభుత్వపాలన, వ్యాపారము, వ్యవసాయము, వైద్యము, లలితకళలు, బట్టలుతుకుట, క్షౌరముచేయుట, వీధులూడ్చుట, దేశమానవసేవలు మున్నగునవి అన్నియు ఉత్కృష్టమైన భగవత్కైంకర్యముగా సమన్వయించుకొనిజేయవలయునని సర్వమానవ సమానప్రతిపత్తిభావనలు పలుకుచున్నది ఆర్షభారతి. ఈభావన అసాధారణమైన మహిమగలది. స్థాలీపులాకన్యాయముగా వివరింపబడినది. ఇయ్యదియే –

హిందూమతమహిత ఇతిశమ్.

※

---

(7వ పేజీ తరువాయి)

వ్వారముల్ మార్వలుకంగ 'యోసి, యెటవే,
వామాక్షి' నీ నాథునిన్
మొఱఁగన్బోలునెయంచు వావిడుచున్ మోహాంబు
నిర్వేలమై ౩౦౨

సీ॥ రమణీయపారిభద్రకపల్లవమ్ములు
వనజాక్షిచరణమ్ములనుచుఁ బట్టు
చిరిబిల్వపుష్పమంజరులు సీమంతినీ
కుచయుగంబని కొనగోట నంటు
శ్యామలతాపరిస్పందమ్ము గని వచ్చి
నావచే యని యమందమ్ము వాలు
అలుక పెంపున వాగువై నావచేయంచు
బరువంబు బాలునిర్ఝరుల నిలుచు

ఆ॥ పూలపొదల నిలుచుఁ బోలించికొని సతీ –
దేవి తిన్ననై నతీగెనవ్వు; –
లెంతచెనఁటి దతుఁ డీదంపతుల విడఁ –
దీసెననుచు మౌను లీసడింప. ౩౦౩

కం॥ వచ్చె వసంతము తరువుల
హెచ్చెం జిగి యప్సరోగృహీతవిపంచీ –
ముచ్చంచలతంత్రీవద –
నోచ్చయహిందోళరాగ మొలికెన్ వనులన్. ౩౦౪

లయగ్రాహి ॥
కమ్మనిసుమమ్ములను బమ్మినపరాగములు
గ్రమ్మికొని తావులను దమ్ముకొని మాకం –
దమ్ముల వినూత్నకిసలమ్ములను పమ్మినపి –
కమ్ములకుహూరవము ముమ్మరము లోనై,
చెమ్మగలవాగులజలమ్ములను లోఁగొనుచు
నెమ్మిపురు లిమ్ముల పథమ్ములకు నడ్డై
యమ్మునులకైన హృదయమ్ములు గగుర్పొడువ
సొమ్మసిలఁజేయుపవనమ్ము తెఁపిచెన్ ౩౦౫

(సశేషము)

(6వ పేజీ తరువాయి)

వగా సుమారు కిలోమీటరు దూరములో ఈ దేవస్థానమున్నది. 'వేదాద్రి' అనే ఈ పర్వతక్షేత్రానికి 'లక్ష్మీక్షేత్ర' మనే మరో పేరుగూడా వుంది. ఇచటి స్వామి మహాలక్ష్మితో దర్శన మిస్తున్నందున (మా= లక్ష్మికి, లోలుడు = ప్రియుడు) మాలోల నరసింహుడు, లక్ష్మీనరసింహుడు అనే దివ్యనామాలతో పిలువబడుచున్నాడు.

### జ్వాలానరసింహస్వామి

ఎగువ అహోబిలంనుండి ఉన్నతప్రదేశంలో 3 మైళ్ళదూరాన ఈ సన్నిధివుంది. గరుడాచలము, వేదాచలము - అను రెండు కొండలమధ్య 'అచల ఛాయమేరు' అను కొండ మధ్యప్రదేశంలో ఈస్వామి ఉన్నాడట. అసలీ క్షేత్రానికి వెళ్ళడం మహాకష్టమనీ, ఒకవేళ వెళ్ళినా జ్వాలారూపియై కోటిసూర్యప్రకాశములతో నిండియున్న ఈ జ్వాలా నరసింహ స్వామిని దర్శించటమింకనూ కష్టమని, దర్శించినా ఆ పిదప తిరిగిరావడం అంతకన్నా కష్టమనీ ఎఱిగిన వారు చెప్తుంటారు. మొత్తానికి ఆప్రదేశం మాత్రం భయంకరమైనదే.

### పావన నరసింహస్వామి

ఈ సన్నిధి ఎగువ అహోబిలానికి 4 మైళ్ళదూరంలో గరుడాచలానికి దక్షిణాన పావనమనేనదీతీరాన నెలకొనివుంది. భక్తులపాపాలను హరించి, వారికోర్కెలు తీర్చే దివ్యమూర్తి ఈయన. అందుకే యిప్పటికీ ఇచటికివెళ్ళి భక్తులు మ్రొక్కుబడులు చెల్లిస్తుంటారు.

ఇవి అహోబలక్షేత్రంలోని నవనారసింహమూర్తులు. ఇన్నిరూపాలను మనం ఒక్కచోట చూడటం మరే క్షేత్రంలోనూ తటస్థించదు అందుకే శ్రీనృసింహస్వామి వారే ఒకచోట

"ఇతరములు ... ... సుజనసంస్తవములు నొప్పుఁగాని, నాకహోబలతీర్థంబు పగిదినధిక వల్లభములుగావు" అంటాడు.

మనమీ నవనారసింహమూర్తులనేగాకుండా అహోబిలమఠంలోని శ్రీమాలోల నరసింహస్వామి, దిగువ అహోబలంలో ప్రహ్లాద వరదుడైన నృసింహస్వామిని చూడవచ్చు.

### ఇతర విశేషాలు-ఉగ్ర స్తంభం

ఎగువ అహోబిలానికి 5 మైళ్ళ దూరమున ఒకకొండ రెండుగా చీలినట్లుంది.

ఈ చీలికమధ్య నరసింహావతార సన్నివేశంతో భగవంతుడు దర్శనమిస్తున్నాడు. దీనినే ఉగ్రస్తంభమనీ, హిరణ్యకశిపుని గృహస్తంభమనీ అంటారు. చాలాఎత్తైన పర్వతాలమధ్యన ఈ ప్రదేశం ఉన్నందువలన ప్రదక్షిణచేయటం అతికష్టం. ఇచట శంఖచక్రములు, నామములు - బండమీద ఎంతోచక్కగా చెక్కబడివుండడం ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది.

### ప్రహ్లాదమెట్టు

ఎగువ అహోబిలంలో నృసింహస్వామి సన్నిధికీ, ఉగ్రస్తంభానికీ మధ్య ప్రహ్లాదనరసింహస్వామి సన్నిధి వున్నది. ఇచట ఒకచిన్నగుహలో ప్రహ్లాదుని విగ్రహము వుంది. ఈ సన్నిధికి ముందుభాగములో ఒకశిలాశాసనంవుంది. అందులోని విషయం సరిగా అర్థంగావటం లేదు.

### పర్వతశ్రేణులు – గరుడాచలము

పూర్వం గరుత్మంతుడు శ్రీమహావిష్ణువు నుద్దేశించి, ఈ పర్వతంపైతపస్సు చేసి, దేవుణ్ణి ప్రత్యక్షముచేసికొని, రెండు వరాలను కోరాడట. అందు మొదటిది తన్నువాహనంగా స్వీకరించటం, రెండోది తాను తపస్సు చేసిన ఈ పర్వతం తన పేరుతో ప్రసిద్ధికెక్కడం. భగవంతుడు 'అలాగే'నని అనుగ్రహించాడట. కాబట్టే ఈ పర్వతానికి "గరుడాచల" మన్న పేరు సార్థకమైంది.

### వేదాచలము

పూర్వం సోమకుడనే రక్కసుడు వేదాల్ని అపహరింపగా, బ్రహ్మదేవుడు ఈ ప్రదేశానికివచ్చి శ్రీలక్ష్మీనరసింహస్వామిని గూర్చి తపస్సుచేశాడట. అపుడు స్వామి ప్రత్యక్షమై బ్రహ్మకోరినట్లే సోమ



ముక్తేశ్వరాలయం (భువనేశ్వర్)

ఫోటో: డి. కె. కె. చౌదరి, తిరుపతి

కుణ్ణి సంహరించి, వేదాలను బ్రహ్మకు అప్పజెప్పి, ఈ కొండకు వేదాచలమనే పేరుగూడా ప్రసాదించాడట. (వేదాపహరణ మత్స్యావతార సందర్భంలో గదా! నృసింహావతారంలో ఎందుకొచ్చిందో మరి?)

ఈక్షేత్రంలో అనేక పుణ్యతీర్థాలున్నవి. శ్రీనృసింహమూర్తి హిరణ్యకశిపునిసంహరించిన తరువాత 'శ్రీకమనీయమూర్తి పదాంబుజ సేవఁగోరి, మందాకిని ధాత్రి మీఁది కవతారమొనర్చినదట'. అదే ప్రస్తుతం 'భవనాశిని'గా విరాజిల్లుతోంది. ఇంకను శంఖ, చక్ర, వరాహ, సుదర్శనాది తీర్థాలున్నవి; ఇవన్నీ భవనాశినిలోనే కలుస్తాయి.

దిగువదేవాలయ దక్షిణభాగంలో శ్రీనివాస పద్మావతీ వివాహమండపం 64 స్తంభాలతో అతిరమణీయంగా వున్నది. ఇచట శ్రీనివాసమూర్తి వేంచేసియున్నాడు.

జయ స్తంభం

దిగువ దేవాలయమునకు వెలుపల మనకొక జయస్తంభం కనిపిస్తుంది. క్రీ. వె. 1577 లో దేవస్థానం మహమ్మదీయుల బాధలకు గురియైనదట. ఆలయ సంపదలన్నీ అపహృతమైనవి. అయినా భక్తులు తమసహాయంతో నిత్యపూజలకెట్టి లోటూరాకుండా చూచేవారట. తురకల అన్యాయాన్ని సహించని అప్పటి అహోబలమఠాధిపతి (11వ) శ్రీవణ్ శఠగోప శ్రీనివాస యతీంద్ర మహాదేశికజియ్యరువారు తదేకచింతతో పరమాత్మని తలంచుచుండిరట. భగవంతుడాయనకు కలలో కనబడి పెనుగొండరాజధానిగా పాలిస్తున్న విజయనగరరాజైన రంగరాయ సేనాపతులను (తిరుమలరాజు, వెంకటరాజు) తెప్పింపుమని ఆజ్ఞ యిచ్చినాడు. స్వప్నానంతరము జియ్యరువారు పెనుగొండకు దూతనంపగా, ఆ సేనాపతులువచ్చి, తురకలనోడించి దేవాలయమును జియ్యరువారికి తిరిగి అప్పగించిరట. అట్టి ఘన విజయమునుదెల్పు శిలాశాసనమే యిది. దీని స్థాపకులు ఆ జియ్యరుగారే.

ఈ క్షేత్ర మాహాత్మ్యము పురాణములలో విస్తృతముగా వర్ణింపబడియున్నది. భూతలమున భగవంతు డర్చారూపములో నిత్యనివాసము చేయుచున్న పదునేడుక్షేత్రములలో నిదిగూడా ఒకటి.

ఇది "దేవుడుతప్ప మరెవ్వరునూ ప్రవేశింపలేని నరసింహక్షేత్ర"మని తిరుమంగై ఆళ్వారులు నుతించియున్నారు. శ్రీవేంకటేశ్వరునకు గూడా ఈ స్వామి ఆరాధ్య దైవమట.

ప్రభుత్వహస్తగతమైన తరువాత ఈ దేవస్థానమున నెంతో అభివృద్ధి కానవచ్చుచున్నది. ఇట్లే భవిష్యత్తునుగూడ ఊహించుకోవలసివున్నది. ఓషధీ ప్రస్థానకేంద్రముగా నీ ప్రాంతము ప్రముఖప్రసిద్ధివహించినది. ఇట్టిక్షేత్రాన్ని ప్రతిఒక్కరూ చూచి తరించాలి.

"శ్రీకి నిరంతరంబు కడుఁజెన్నెసలారెడు రాగలీల ను
త్సేకముఁబొందియొప్పు తనచిత్తము జూపెడు మాడ్కినిత్య ర
మ్యాకృతియైన కౌస్తుభము నక్కువయింబ చరించు నుత్తమ
శ్లోకుఁడహోబలేశుఁడతి లోకుఁడు లోకముఁగాచుఁ గావుతన్."

(— ఎఱ్ఱన నృసింహపురాణము)

*

(23వ పేజీ తరువాయి)

సంగీతవిద్వాంసుడు శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావును దేవస్థాన సంగీతవిద్వాంసులుగను, శ్రీ బాపును దేవస్థాన ఆస్థాన చిత్రకారులుగను నిర్ణయిస్తూ తీర్మానించటమైనది.

8–4–79 తీర్మానములు

తిరుమల తిరుపతి దేవస్థానమునకు చెందిన స్థలాలను భవననిర్మాణాది కార్యక్రమాలకు ఇతరసంస్థలకు ఇకనుండి ఇవ్వరాదని సూత్రప్రాయంగా నిర్ణయిస్తూ, ఇకముందు సంస్థలు భవనాలునిర్మించి వాటిపై హక్కులను దేవస్థానానికి స్వాధీనంచేసేందుకు అంగీకరించే షరతుపై అర్హతలను బట్టి పరిశీలించి, అట్టి సంస్థలకు వసతి కల్పించే విషయంలో ప్రాధాన్యం కల్పించేందుకు నిశ్చయించటమైనది.

ఇప్పుడు దేవస్థానంలోవున్న స్వచ్ఛమైన బంగారాన్ని, బంగారుపతకాలుగాచేసి భక్తులకు విక్రయించాలని, మిగిలిన బంగారాన్ని అమ్మరాదని తీర్మానించటమైనది.

తిరుమలలో 3,153 నివాసగృహాలను నిర్మించాలని, అందులో 20% విధిగా దేవస్థాన ఉద్యోగులకు కేటాయించాలని తీర్మానించటమైనది.

తిరుమలలో రెండుఘాట్ రోడ్డులుకలిసే చోట నెలకొల్పేందుకు గాను ఒక రాతి రథాన్ని తయారుచేసేందుకు తీర్మానించటమైనది

తిరుమలలో నారాయణగిరి లేదా ఘంటామంటపం లేదా యోగ్యమైన ఇతర ప్రదేశంలో 60అడుగుల శ్రీమన్నారాయణ విగ్రహాన్ని నెలకొల్పాలని నిర్ణయించటమైనది.

దేవస్థాన ఉద్యోగుల పిల్లల విద్యాభ్యాసానికిగాను పూర్తిరుసుం మినహాయింపు బదులుగా విద్యాసంస్థలలో విద్యనభ్యసించే పిల్లలుగల ఉద్యోగులకు విద్యాభృతిలాంటి సౌకర్యాలుకల్గించాలని నిర్ణయించటమైనది.

తిరుమలలో వ్యాపార చలనచిత్రాల షూటింగ్ అనుమతిని రద్దుచేయటమైనది.

తిరుమలకుపోయే దారిలో ఏడు పర్వతాలపైన ఒక్కొక్క పర్వతాన్ని ప్రతిబింబించే దేవతావిగ్రహాలను అపూర్వ శిల్పకళాఖండాలుగా తయారుచేయించి నెలకొల్పాలని తీర్మానించటమైనది.

మద్రాసులోని వి.వి.ఆర్. ధర్మశాలను దేవస్థానానికి దత్తంచేసిన సందర్భాన్ని పురస్కరించుకొని, ఆ సంస్థ కార్యదర్శి శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డి గారి నిస్స్వార్థ సేవాపరిగణనకు సూచనగా బంగారుపతకాన్ని ఇవ్వాలని తీర్మానించటమైనది.

శ్రీ టి. వరదరాజులురెడ్డిని పేష్కారుగా ప్రమోట్ చేసి, తిరుమల పాతపుష్కరిణి షెడ్ల క్యూనిర్వహణకు, శ్రీ ఆర్. రాఘవేంద్రరావునుప్రమోట్ చేసి 2వ పరకామణి అధికారిగానూ, శ్రీఇ. పీరయ్యనుప్రమోట్ చేసి తిరుపతిలో రిసెప్షన్ ఆఫీసరుగాను, శ్రీ జి. కృష్ణమూర్తిని శ్రీ యస్. వెంకటరెడ్డిస్థానే తిరుపతిలో 3వ పేష్కారుగా బదలీచేస్తూ, శ్రీ కె. హరిరావును దేవస్థాన రవాణాడిపో మేనేజర్ ఇన్‌చార్జిగా ప్రమోట్ చేస్తూ, శ్రీ వి. కృష్ణస్వామిని తిరుమలలో ఫిర్యాదుల పరిశీలకవిభాగం పేష్కారుగా నియమించటమైనది.

శ్రీనివాసకల్యాణంలోని ముఖ్యఘట్టాలుగల బొమ్మలను కొనేందుకు రు. 25,500 మంజూరుచేయటమైనది,

ఉద్యోగధర్మంలో నిజాయితీ చూపించిన అటెండరు శ్రీ పి. వెంకటరత్నంకు రు. 25/-, ప్రాణాపాయపరిస్థితులలోకూడా ధర్మంనిర్వహిస్తూ, దొంగలను పట్టుకొనేందుకు తోడ్పడిన రికార్డుఅసిస్టెంటు శ్రీ టి. కోదండశెట్టికి రు 50/- ప్రోత్సాహకపారితోషికం ఈయ నిర్ణయించటమైనది.

పద్మావతీఅమ్మవారి ఆలయంలో శుక్రవారాభిషేకం ఉదయం 7 గం. ప్రాంతంలో జరిపేందుకు నిర్ణయించటమైనది.

శ్రీవారి ఆలయంలో ఆర్జిత రథోత్సవానికిగాను స్వర్ణరథం తయారుచేయించేందుకు, అంతవరకు ప్రతిరోజు కల్యాణోత్సవము తరువాత వీధి ఉత్సవాలు కొనసాగించేందుకు నిర్ణయించటమైనది.

వేమన యోగపరిశోధన కేంద్రానికి, గాంధీవైద్యాలయం ద్వారా యంత్రసామగ్రిని కొనుగోలుచేసి ఇప్పించేందుకు, ఆ యంత్రాలను పరిశోధనాకేంద్రంలో దేవస్థాన దానంక్రింద పేర్కొనాలనీ, ఏ కారణాలచే, అవసరంలేకపోతే ఆ పరికరాలు దేవస్థానానికి చెందాలని తీర్మానిస్తూ, ఈ విషయంలో లోగడ తీర్మానాలను రద్దు చేయటమైనది.

హైదరాబాద్‌లోని సురభారతీసమితికి ధార్మికగ్రంథప్రచురణకుగాను రు. 50వేలు వచ్చిన వడ్డీలతో సంస్కృతతరగతులు నిర్వహించేందుకు మూలధనంగా 50 వేల రూపాయలు విరాళము మంజూరుచేయటమైనది.

అతిరుద్రోత్సవ నిర్వహణకుగాను నాగపూర్‌లోని అతిరుద్రసంఘానికి రు. 5 వేలు మంజూరుచేయటమైనది.

హైదరాబాద్‌లోని రామకృష్ణమిషన్ వారి ధార్మిక, సాంస్కృతిక, మానవీయతా ప్రచారికలకుగాను రు. 12 లక్షలు విరాళమీయటమైనది.

చిత్తూరుజిల్లా, తొండవాడలోని శ్రీఅగస్త్యేశ్వరస్వామివారి దేవాలయ జీర్ణోద్ధారణకుగాను రు. 64,600/- మంజూరుచేయటమైనది,

హైదరాబాద్‌లోనిశ్యామనగర్ సంక్షేమ సంస్థవారి కళ్యాణమంటపనిర్మాణంపూర్తికిగాను రు. 1 లక్ష మంజూరుచేయటమైనది.

మద్రాస్‌లో ఇటీవల దేవస్థానమునకు అప్పగించబడిన వి. వి. ఆర్. ధర్మశాల ప్రాంగణంలో కల్యాణమంటపం,10గదుల నిర్మాణానికి అంగీకరిస్తూ, ఆ వ్యవస్థ అభివృద్ధికిగాను బృహత్ప్రణాళికను చేపట్టాలని నిర్ణయించటమైనది.

న్యూఢిల్లీలోని ఆంధ్రవిద్యాసంస్థ సుసంఘటిత అభివృద్ధిసంస్థనిధి సంఘంలో దేవ

(40వ పేజీలో)

దత్తత స్వీకారం

శ్రీ వేంకటేశ్వరస్వామికి 32,000 ల కీర్తనలను రచించి నైవేద్యముగా సమర్పించుకొన్న భక్తశిఖామణి తాళ్ళపాక అన్నమాచార్యులు జన్మించిన తాళ్లపాక గ్రామాన్ని (రాజంపేట తాలూకా కడప జిల్లా) తి. తి. దేవస్థానం ఏప్రిల్ 4 న దత్తతకు తీసుకొంది. ఈ సందర్భంగా ఏర్పాటైన సమావేశానికి తి. తి. దేవస్థానం ట్రస్టు బోర్డు మెంబరు శ్రీ చంద్రశేఖరం అధ్యక్షత వహించారు.

తి. తి. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, I A S ప్రసం

## వార్తలు - విశేషాలు

గిస్తూ 1408-1508 కాలంమధ్య జీవించిన తాళ్ళపాక అన్నమాచార్యులు జన్మించిన తాళ్ళపాక గ్రామాన్ని దత్తత తీసుకోటానికి దేవస్థానం బోర్డు ఏకగ్రీవంగా ఆమోదించిందని తెలిపారు. తిరుపతి శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీలో తాళ్ళపాక అన్నమయ్య పీఠం స్థాపించనున్నట్లు కూడా ఆయన పేర్కొన్నారు.

శ్రీ కామిశెట్టి శ్రీనివాసులుశెట్టి తాళ్ళపాక అన్నమయ్య జీవితాన్ని, సారస్వత కృషిని సమీక్షిస్తూ ప్రసంగించారు.

అనంతరం తి. తి. దే. సంగీత నృత్య కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ డి. పశుపతి పాట కచ్చేరీ సుభద్రాకల్యాణం నృత్య నాటక ప్రదర్శన జరిగాయి.

శ్రీకాళహస్తిలో కళ్యాణమంటపం

(21-4-79)

శ్రీకాళహస్తిలో రు. 5.13 లక్షల వ్యయంతో నిర్మించబడ్డ కల్యాణమంటపానికి దేవాదాయశాఖ మంత్రి శ్రీ వి. వెంకట నారాయణ ప్రారంభోత్సవం చేశారు. ఈ కార్యక్రమానికి తి. తి. దేవస్థాన కార్య నిర్వహణాధికారి శ్రీ. పి. వి. ఆర్. కె. ప్రసాద్ I. A S. అధ్యక్షత వహించారు. తి. తి. దే. ధర్మకర్తలమండలి సభ్యులు శ్రీ మాధవరావు స్వాగతం పలికారు కల్యాణమంటపాన్ని నిర్మించిన తి. తి. దేవస్థానాన్ని అభినందించారు. స్థానిక M L A. శ్రీ వి. సుబ్రమణ్యంనాయుడు మాట్లాడుతూ తి. తి. దే. వారు కల్యాణమండపాల్ని అన్ని జిల్లాల్లోనూ నిర్మించినట్లయితే ప్రజలకు చాలా మేలు జరుగుతుందని అన్నారు.

నూతన కార్యాలయ భవనం

తి. తి. దేవస్థాన నూతన కార్యాలయ భవనానికి ఏప్రిల్ 20న ఆం. ప్ర. ప్రణాళికల, దేవాదాయశాఖమంత్రి శ్రీ వీరమాచనేని వెంకటనారాయణ ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా, దేవస్థాన ఆస్థాన విద్వాంసులుగా నియుక్తులయిన శ్రీ నేదునూరికృష్ణమూర్తి, శ్రీలాల్గుడి జయరామన్ లకు సన్మానంచేశారు. ఈ కార్యక్రమంలో భాగంగా నూతన టెలిఫోన్ ఎక్స్చేంజికి కూడా మంత్రిగారు ప్రారంభోత్సవం చేశారు. దేవస్థానం ఉద్యోగులు, దైవభక్తి సేవాతత్పరత అలవరచుకోవాలని అన్నారు.

తమస్వాగతోపన్యాసంలో శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ I. A. S. (తి. తి. దే. కార్యనిర్వహణాధికారి) నూతనకార్యాలయభవనం నిర్మాణానికి దాదాపు 62 లక్షలు వ్యయమైందనీ, దానివలన దేవస్థానానికి కలిగే ప్రయోజనాల్ని వివరించారు. కాలయాపనను వారించటానికి, యాత్రికులకు మరింత వసతుల్ని కల్పించటానికి యిది ఎంతో సహాయకారిగా వుండగలదని ఆయన పేర్కొన్నారు.

అధ్యక్షత వహించిన తి. తి. దేవస్థాన ట్రస్టుబోర్డు ఛేర్మెన్ డా॥ రమేశన్ I A. S ప్రసంగిస్తూ,సన్మానితులయిన ఆస్థానవిద్వాంసుల కళానైపుణ్యాన్ని ప్రశంసించారు. నూతనకార్యాలయభవనంలో పనిచేసేవారం దరూ స్వామివారిసేవకుఅర్పితులుకావాలనీ యాత్రికుల సౌకర్యార్థం తమసేవలను వినియోగించాలనీకోరారు. అన్నమాచార్య సంకీర్తనల సంపుటాలు త్వరత్వరగా వెలువడగలవనే ఆశాభావాన్ని వ్యక్తపరిచారు.

తి. తి. దేవస్థాన ఉపకార్యనిర్వహణాధికారి శ్రీ ఎన్. నరసింహారావు వందన సమర్పణ చేశారు.

నంద్యాలలో తి. తి. దేవస్థాన కల్యాణమంటపం.

ఏప్రిల్ 2 న నంద్యాలలో రూ. 10 లక్షల వ్యయంతో నిర్మించనున్న కల్యాణమంటపానికి రాష్ట్రవిధానమండలి సభ్యులు తి. తి. దేవస్థానం బోర్డుమెంబరు అయిన శ్రీ మహానందరెడ్డి శంఖుస్థాపన గావించారు.

రూ. 5 లక్షల వ్యయంతో నిర్మించనున్న తి. తి. దేవస్థాన సమాచారకేంద్రానికి తి. తి. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ I A S శంకుస్థాపన చేశారు.

ఈ కార్యక్రమాలకు కర్నూలు జిల్లా కలెక్టరు శ్రీ ఎన్. ఎస్. హరిహరన్ అధ్యక్షత వహించారు.

స్టేట్ బ్యాంక్ శాఖ ప్రారంభం

ఏప్రిల్ 17 న తి. తి. దేవస్థాన నూతన కార్యాలయ భవన ప్రాంగణంలో స్టేట్ బ్యాంక్ శాఖకు తి. తి. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ ఐ. ఏ. యస్. ప్రారంభోత్సవం చేశారు. *

# ఈ మాసం మీ అదృష్టం!

### మేషం
(అశ్విని, భరణి, కృత్తిక 1వ పా)

రాహువు వలన ఆందోళన, శని వలన వివాదాలు, ధననష్టం, లేదా కుమారులు కుమార్తెల వలన ఆందోళన; గురువువలన బంధువుల వలన లేదా ఇతరత్రా వలన ఆందోళన, కుజుని వలన ధననష్టం, శుక్రుని వలన నెల 12 వరకు స్తబ్ధుడు. తరువాత కాలంలో శృంగార మనస్తత్వం. రవి వలన నెల మొదటి పక్షంలో ధననష్టం, ప్రయాణం, ఉదరబాధ తరువాత ధననష్టం లేదా వంచన, ఉదరబాధ. బుధుని వలన వివాదాలు లేదా ధననష్టం, లేదా గౌరవ భంగం.

### వృషభం
(కృత్తిక 2,3,4,పా, రోహిణి, మృగశిర 1, 2, పా.)

రాహువు వలన వివాదాలు, శనివలన ధననష్టం, హాని, మిత్రభేదం, అయిన వారి నుండి వేర్పాటు. గురువు వలన నిరాశ, కుజుని వలన నెల 7 వ తేది వరకు జయం, తరువాత అధిక ధనవ్యయం, రవి వలన 15 వరకు స్తబ్ధుడు, 2 భాగంలో ధననష్టం లేదా ప్రయాణం, ఉదరబాధ. బుధుని వలన ధనలాభం, 7 వ తేది వరకు సంతోషం, అనంతర కాలంలో అనారోగ్యం, శత్రువుల మూలంగా అగౌరవం, 23 వ తేది వరకు ప్రత్యర్థుల వలన దుష్ట సలహాల వలన వివాదాల మూలంగా ధననష్టం, శుక్రుని వలన ధనలాభం. 12 వ తేది వరకు నూత్న మిత్ర ప్రాప్తి, అనంతర కాలంలో స్తబ్ధుడు.

### మిథునం
(మృగశిర 3,4 పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పా.)

రాహువు వలన ధనలాభం. శనివలన దృఢారోగ్యం, వస్తుసమృద్ధి, గృహసౌఖ్యం గురువువలన ధనలాభం, రవివలన మొదటి 15 రోజులలో ధనం, జయం, గౌరవవృద్ధి అనంతర కాలంలో స్తబ్ధుడు. శుక్రునివలన వివాదాలు, 12వ తేది వరకు గౌరవభంగం ఉన్నా తరువాత కాలంలో ధనం, నూత్న స్నేహితులు. బుధుని వలన 23 వ తేది వరకు ధనలాభం, శృంగార ప్రవృత్తి, తరువాత కాలంలో ప్రత్యర్థుల వలన లేదా అనారోగ్యకారణంగా ఆందోళన. కుజుని వలన ధనం జయం.

### కర్కాటకం
(పునర్వసు 4పా, పుష్యమి, ఆశ్లేష.)

రాహు శనుల వలన ధననష్టం, గురువు వలన వివాదాలు లేదా గౌరవభంగం, లేదా ధననష్టం, రవివలన దుష్టగ్రహాల వలన కలిగే పీడా నివారణ. శుక్రునివలన 12 వ తేది వరకు సంతోషం. పుణ్యకార్యక్రమాలలో భాగం, ధనలాభం. క్రొత్త వస్త్రాలు తరువాత కాలంలో వివాదాలు గౌరవభంగం. కుజుని వలన 7 వ తేది వరకు వంచన ధననష్టం, గౌరవభంగం, బుధుని వలన 7 వ తేది వరకు నిరాశ తరువాత ధనం, స్నేహితులు శృంగార ప్రవృత్తి సుఖం. అనంతర కాలంలో ధనలాభం.

### సింహం
(మఖ, పూ. ఫ, ఉత్తర 1వ పా.)

రాహు శనుల వలన ఆందోళనలు, లేదా అయిన వారి నుండి వేర్పాటు. లేదా ప్రయాణం, ప్రయాస. గురువువలన కూడ ప్రయాణం ప్రయాస, రవి వలన మొదటిపక్షంలోఅనారోగ్యం, ఆటంకాలు ధననష్టం, తరువాత కాలంలో ఘన విజయం, కుజుని వలన నెల అంతా ధననష్టం, గౌరవభంగం, శుక్రుని వలన 12 వ తేది వరకు ప్రయాణం, అనారోగ్యం ప్రయాస తరువాత కాలంలో జయం, ఆహారధాన్య ప్రాప్తి. ధనలాభం, లేదా సంతానావకాశం, బుధుని వలన 7 వ తేది వరకు ధనలాభం, నూతన వస్త్రాభరణాలు లేదా సంతానానికి అభివృద్ధి. తరువాత 23 తేది వరకు నిరాశ తరువాత కాలంలో ధనలాభం శృంగారం ప్రత్యర్థులపై జయం.

### కన్య
(ఉత్తర 2, 3, 4 పా. హస్త; చిత్ర 1, 2 పా.)

రాహు శనులవలన ఆందోళన గురువు వలన ధనలాభం, ఉద్యోగంలో అభివృద్ధి, కుజుని వలన 7 వ తేది వరకు వివాదం, ఉదరబాధ లేదా నేత్రబాధ, తరువాత కాలంలో ధననష్టం గౌరవభంగం. రవి వలన నెల మొదటి పక్షంలో అనారోగ్యం భార్యకు అసంతుష్టి, తరువాత కాలంలో ధననష్టం, నిరాశ అనారోగ్యం. శుక్రుని వలన 12 వ తేది వరకు స్త్రీ మూలకమైన ఆందోళన. తరువాత కాలంలో శృంగారం నూతన వస్త్రాదులు లేదా గృహప్రాప్తికి అవకాశం. బుధుని వలన 7 వ తేది వరకు వివాదాలు తరువాత 23 వ తేది వరకు జయం, నూతన వస్త్ర ప్రాప్తి లేదా ధనలాభం సంతానానికి యోగకాలం, తరువాత కాలంలో నిరాశ.

### తుల
(చిత్ర; 3, 4 పా: స్వాతి, విశాఖ 1, 2, 3 పా;)

రాహువు వలన సంతోషం, శని వలన ధనం, శృంగారం, గురువువలన ధననష్టం, లేదా పదవికి భంగం. శుక్రుని వలన అవమానం, అథవా 12 వ తేది వరకు అనారోగ్యం, అనంతర కాలంలో స్త్రీమూలకమైన ఆందోళన. రవివలన నెల మొదటి పక్షంలో ప్రయాణం, లేదా ఉదరబాధ, అనంతరకాలంలో భార్యకు అసంతుష్టి, లేదా అనారోగ్యం. కుజుని వలన 7 వతేది వరకు ధనలాభం, జయం, దృఢారోగ్యం కాని అనంతర కాలంలో భార్యతో వివాదం, లేదా ఉదరబాధ లేదా నేత్రబాధ, బుధుని వలన 7 తేది వరకు ధనలాభం. హోదా, తరువాత 23 వ తేది వరకు వివాదాలు తరువాత కాలంలో ధనం,

నూత్న వస్త్రాదులు లేదా సంతానానికి యోగం.

### వృశ్చికం

(విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

రాహువు వలన వివాదాలు, శనివలన ధననష్టం, లేదా గౌరవ భంగం. గురువు వలన ధనలాభం జయం లేదా ఆహార ధాన్యప్రాప్తి లేదా సంతానానికి యోగ కాలం. శుక్రునివలన 12 వ తేది వరకు ధన లాభం, లేదా సంతానానికి యోగకాలం లేదా బంధువుల రాక, పెద్దల ప్రశంస, తరువాత కాలంలో అనారోగ్యం లేదా గౌరవభంగం, రవి వలన నెల మొదటి పక్షంలో దృఢారోగ్యప్రాప్తి. జయం, తరువాత కాలంలో ప్రయాణం లేదా ఉదరబాధ. కుజుని వలన 7 వ తేది వరకు అనారోగ్యం లేదా కుమారుల మూలంగా లేదా కుమార్తెల మూలంగా ఆందోళన లేదా శత్రుభయం తరువాత కాలంలో ధనం, జయం. బుధుని వలన 7 వ తేది వరకు భార్యబిడ్డలతో వివాదాలు, తరువాత 23 వ తేది వరకు ధనలాభం లేదా హోదా మిగిలిన రోజులలో జయం లేదా ధనలాభం లేదా నూతనవస్త్రాదులు లేదా సంతానం.

### ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

రాహువువలన పాపాచరణం, శనివలన శత్రువులు అధార్మికప్రవర్తన. గురువువలన ప్రయాణం,ప్రయాస, అనారోగ్యం కుజుని. వలన 7 వ తేది వరకు జ్వరం. ఉదరబాధ లేదా శత్రువుల మూలంగా ఆందోళన. అనంతర కాలంలో కుమార్తెలు కుమారుల మూలంగా ఆందోళన లేదా అనారోగ్యం. రవి వలన నెల మొదటి పక్షంలో శత్రువుల మూలంగా ఆందోళన లేదా అనారోగ్యం తరువాత కాలంలో మంచి ఆరోగ్యం, శత్రువులపై జయం, బుధుని వలన 7 వ తేది వరకు గృహంలో వస్తు సమృద్ధి, తరువాత 23 వ తేది వరకు భార్య బిడ్డలతో వివాదాలు, తరువాత కాలంలో జయం, ధనం, లేదా హోదా, శుక్రుని వలన 12 వ తేది వరకు క్రొత్తస్నేహితులు ప్రోత్సాహం, జయం. తరువాత కాలంలో బంధువులరాక. ధనం, సంతానం, పెద్దల నుండి ప్రశంస.

### మకరం

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ఠ 1.2 పా)

రాహువు వలన ఆందోళన. శని వలన భార్య బిడ్డల నుండి వేర్పాటు, గురువు వలన ధనం, శృంగారం. సంతోషం, రవి వలన అనారోగ్యం, లేదా శత్రుభయం శుక్రుని వలన నెలంతా ధనం, హోదా, లేదా మంచిమిత్రులు, నూత్న వస్త్రాలు, కుజునివలని 7వ తేదివరకు అక్రమమార్గాల మూలంగా లేదా కుమారుల మూలంగా ధనం, అనంతరం జ్వరం, దుష్టమిత్రుల మూలంగా ఆందోళన లేదా ఉదరబాధ, బుధునివలన కొత్తస్నేహాలున్నా 7వ తేది వరకు దుష్ప్రవర్తన కారణంగా ఉద్యోగంలో ఆందోళన, తరువాత 23 వ తేది వరకు గృహంలో వస్తుసమృద్ధి, మిగిలిన దినాలలో భార్య బిడ్డలనుండి వేర్పాటు.

### కుంభం

(ధనిష్ఠ 3,4 పా, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా)

రాహువు వలన వివాదాలు. శనివలన ప్రయాణం, గురువు వలన మనశ్శాంతికి భంగం, రవివలన మొదటిపక్షంలో ఉన్నత పదవి, లేదా ధనం. తరువాత కాలంలో అనారోగ్యం, కుజుని వలన ఉద్యోగ సంబంధమైన ఆందోళన, లేదా శత్రువుల మూలంగా లేదా అనారోగ్య కారణంగా లేదా దొంగతనం కారణంగా ఆందోళన, మిగిలిన కాలంలో అక్రమ మార్గాలవల్ల లేదా కుమారుల మూలంగా ధనం, శుక్రునివలన ధనం, లేదా ధాన్యం, లేదా అధికారుల ప్రశంస లేదా సంతానం లేదా నూతన వస్త్ర ప్రాప్తి. బుధుని వలన 7 వ తేది వరకు అవమానమున్నా ధనలాభం, 23 వ తేది వరకు శత్రువుల మూలంగా తన చెడు ప్రవర్తన కారణంగా భయం, మిగిలిన రోజులలో గృహంలో వస్తు సమృద్ధి.

### మీనం

(పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి )

రాహువు వలన ధనం, శని వలన జయం, దృఢారోగ్యం, గురువువలన ధనం నూతన వస్త్రప్రాప్తి శృంగారం, లేదా వాహన ప్రాప్తి, గృహప్రాప్తి, లేదా సంతానానికి యోగకాలం, రవి వలన మొదటి 15 రోజులలో ధననష్టం, తరువాత రోజులలో ధనలాభం లేదా ఉన్నత పదవి కుజునివలన వివాదం లేదా ఉద్యోగ సంబంధమైన ఆందోళన. లేదా దొంగ తనం మూలంగా ధననష్టం. శుక్రుని వలన 12 వ తేది వరకు శృంగారం. సంతోషం, తరువాత ధనలాభం, లేదా ఆహారధాన్య ప్రాప్తి. లేదా పెద్దల నుండి ప్రశంస, లేదా సంతానానికి యోగకాలం. బుధుని వలన 7 వ తేది వరకు చెడుసలహాల వలన ధన నష్టం, 23 వ తేది వరకు ధనలాభం ఉన్నా అవమానం. మిగిలిన రోజులలో క్రొత్త స్నేహప్రాప్తి ఉన్నా చెడు ప్రవర్తన కారణంగా భయం. *

---

(37వ పేజి తరువాయి)
స్థాన ధర్మకర్తలమండలినుండి శ్రీ యం. అంకినీడును నియమించటమైనది.

హైందవశిలా తదితర కళావిగ్రహాల ప్రదర్శనశాలను ఏర్పాటుచేసేందుకు నిర్ణయించటమైనది.

హిందూ ధార్మిక గ్రంథాలయాన్ని స్థాపించ నిర్ణయించటమైనది.

తిరుపతిలో యాత్రికుల, దేవస్థాన ఉద్యోగుల సౌకర్యార్థం అన్ని ఆధునిక వసతులుగల ఒకఆస్పత్రిని ఏర్పాటుచేయాలని నిర్ణయిస్తూ అందుకు తగిన ప్రణాళికను రూపొందించవలసిందిగా కార్యనిర్వహణాధికారిని కోరటమైనది.

*Edited and Published on behalf of T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T. T. D. Press by M· Vijayakumar Reddy, Manager T. T. D. Press Tirupati-517501*

# ప్రత్యేక దర్శనం టిక్కెట్లు

**శ్రీవారి దర్శనపు రూ. 25/- ప్రత్యేక దర్శనపు టిక్కెట్లు ఆంధ్రాబ్యాంకువారి ఈ క్రింది శాఖలలో లభిస్తవి.**

— ఆంధ్రప్రదేశ్ —

అనంతపురంజిల్లా
- అనంతపూర్

కడపజిల్లా
- కడప
- ప్రొద్దుటూరు

పశ్చిమ గోదావరిజిల్లా
- ఏలూరు
- భీమవరం
- తణుకు

తూర్పుగోదావరిజిల్లా
- రాజమండ్రి
- కాకినాడ (మెయిన్)
- రామారావుపేట (కాకినాడ)

నెల్లూరుజిల్లా
- నెల్లూరు

ప్రకాశంజిల్లా
- ఒంగోలు
- చీరాల

చిత్తూరుజిల్లా
- చిత్తూరు
- తిరుపతి (మెయిన్)
- బాలాజీనగర్ (తిరుపతి)
- హుజూర్ ఆఫీసు అనుబంధ
- కాళహస్తి కౌంటరు (తిరుపతి)

విశాఖపట్నంజిల్లా
- విశాఖపట్నం (మెయిన్)
- మహారాణీపేట (విశాఖపట్టణం)
- విజయనగరం

కరీంనగర్ జిల్లా
- కరీంనగర్

కర్నూల్ జిల్లా
- కర్నూలు

ఖమ్మంజిల్లా
- భద్రాచలం
- ఖమ్మం

క్రిష్ణాజిల్లా
- విజయవాడ (మెయిన్)
- గాంధీనగర్ (విజయవాడ)
- గవర్నర్ పేట (విజయవాడ)
- మచిలీపట్నం

గుంటూరుజిల్లా
- గుంటూరు (మెయిన్)
- బ్రాడీపేట (గుంటూరు)
- తెనాలి

హైదరాబాదుజిల్లా
- హైదరాబాదు (మెయిన్)
- హిమయత్ నగర్
- చిక్కడపల్లి
- ఖైరతాబాదు
- విజయనగర్ కాలని
- సికింద్రాబాదు
- మారేడ్ పల్లి

వరంగల్ జిల్లా
- వరంగల్

మెదక్ జిల్లా
- సిద్దిపేట

మహబూబ్ నగర్ జిల్లా
- మహబూబ్ నగర్

నల్గొండజిల్లా
- నల్గొండ

నిజామాబాద్ జిల్లా
- నిజామాబాద్

అదిలాబాద్ జిల్లా
- అదిలాబాద్

— రాష్ట్రేతర ఆంధ్రాబ్యాంకు శాఖలు. —

పాట్నా
టాటానగర్
అహ్మదాబాద్
బరోడా
సూరత్
బెంగుళూర్ (ఎస్.ఆర్. రోడ్)
రామ్‌రాజ్ పేట (బెంగళూర్)
బళ్ళారి
గంగావతి
రాయచూరు
హోసపేట
త్రివేండ్రం
ఎర్నాకులం (కొచ్చిన్)
భోపాల్
జైపూర్
జబల్ పూర్
బొంబాయి (మెయిన్)
చెంబూరు (బొంబాయి)
మాతుంగ (బొంబాయి)
నాగపూర్
భువనేశ్వర్
బర్హంపూర్
రాయగడ
పూరి
రూర్కేలా
మద్రాసు (మెయిన్)
మైలాపూర్
టి నగర్
షెనాయ్‌నగర్
కోయంబత్తూర్
మధురై
సేలం
తిరుపూర్
కలకత్తా
బ్యాలిగంజ్ (కలకత్తా)
ఖరగ్ పూర్
దుర్గాపూర్
చండీఘర్
కర్నాట్ సర్కస్ (న్యూఢిల్లీ)
కరోల్ బాగ్ (న్యూఢిల్లీ)
రామకృష్ణాపురం (న్యూఢిల్లీ)
లక్నో
అలహాబాద్
వారణాశి
లూధియానా

Regd. No. H/TRP/13 

# తిరుపతి సందర్శించండి!



## తిరుపతి శ్రీ గోవిందరాజస్వామివారి బ్రహ్మోత్సవ క్రమము

| తేది | వారం | పగలు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
|---|---|---|---|
| 31-5-79 | గురు | — | సేనాధిపతి ఉత్సవము, అంకురార్పణము |
| 1-6-79 | శుక్ర | తిరుచ్చిఉత్సవం ధ్వజారోహణము | పెద్ద శేష వాహనము |
| 2-6-79 | శని | చిన్న శేష వాహనము | హంసవాహనము |
| 3-6-79 | ఆది | సింహవాహనము | ముత్యపుపందిలి |
| 4-6-79 | సోమ | కల్పవృక్ష వాహనము | సర్వభూపాల వాహనము |
| 5-6-79 | మంగళ | మోహిని అవతారోత్సవం | గరుడోత్సవము |
| 6-6-79 | బుధ | హనుమద్వాహనము<br>సాయంకాలము వసంతోత్సవము | గజ వాహనోత్సవము |
| 7-6-79 | గురు | సూర్యప్రభ వాహనము | చంద్రప్రభ వాహనము |
| 8-6-79 | శుక్ర | రథోత్సవము | అశ్వ(గుఱ్ఱం) వాహనము |
| 9-6-79 | శని | పల్లకీ ఉత్సవము, తీర్థవారి అవభృథోత్సవము (చక్రస్నానం) | ధ్వజావరోహణోత్సవము |





ప్రఖ్యాత వయోలిన్ విద్వాంసులు శ్రీ లాల్‌గుడి జయరామన్‌కు దేవస్థాన ఆస్థాన విద్వాన్‌గా సన్మానం.

↑
దేవస్థాన నూతనకార్యాలయ భవనానికి దేవాదాయమంత్రి శ్రీ వి. వెంకటనారాయణచే 20-4-79 న ప్రారంభోత్సవం జరిగింది.
↓



దేవస్థాన టెలిఫోన్ ఎక్స్చేంజికి ప్రారంభోత్సవం.



ఆనాడు పాటకచ్చేరి చేసిన ప్రఖ్యాత గాయకులు శ్రీ నేదునూరి కృష్ణమూర్తికి దేవస్థాన ఆస్థానవిద్వాన్‌గా సన్మానం.







సప్తగిరి పాఠకులకు సాదరాభివందనలు. ఈ సంచికతో సప్తగిరిపత్రిక 10వ సంవత్సరంలో అడుగుపెడ్తున్నది. ఇన్ని సంవత్సరాలుగా సప్తగిరికి బాసటగానిల్చిన పాఠకులకు, ఏజంట్లకు, దేవస్థాన పుస్తక విక్రయశాలాధికారులకు, దేవస్థాన యాజమాన్యానికి సప్తగిరి తన కృతజ్ఞతలు చెల్లించుకుంటున్నది. సప్తగిరి ఈనాడు 19,000 ప్రతులవరకు ముద్రణపొందుతున్నదంటే, భౌతికవిజయప్రపంచంలో, ఆధ్యాత్మికశాసక్తి ఎంతోబలీయంగాఉండి, పైవారందరి తోడ్పాటు లభించటమే ముఖ్యకారణం.

అయితే సప్తగిరి కర్తవ్యం ఇంతటితో ఆగిపోలేదు. ధార్మికసందేశం నలుమూలలకు ప్రచారం కావాలనేది, అందుకుగాను సప్తగిరి అన్నిభాషలలోను ఈ వర్షం కనీసం 50,000 ప్రతులదాకా అమ్ముడు కావాలనేది యాజమాన్య ఆశయం. ఈపరిమితి చేరటానికి దేవస్థానం పలురకాలుగా ప్రయత్నిస్తున్నది.

ఈ సంచికనుండే నూతనవర్ష కానుకగా, సప్తగిరి రచయితలకు, ఛాయాచిత్రగ్రాహకులకు, చిత్రకారులకు పారితోషికం ఇవ్వటం ప్రారంభమౌతున్నది. పత్రికకు, తమకు, పేరుతేగల విధంగా ప్రచురణకు పంపగలరని ఆశ.

ఇన్ని సంవత్సరాలుగా సప్తగిరి విక్రేతలు, నామమాత్రప్రతిఫలం (కమీషన్) తో, నిస్స్వార్థంగా చేస్తున్న సేవను యాజమాన్యం గుర్తించింది.

అందుకు చిహ్నంగా, వారికి ప్రోత్సాహకంగా ఇప్పటినుండి సంవత్సరంలోపున ప్రతిభాషలోనూ, నెలకు 500 ప్రతులకుమించి, అత్యధికసంఖ్యలో ప్రతులుఅమ్మిన ఏజంటుకు, సేవాచిహ్నంగా ఒక్కొక్క రజతపతకం బహూకరించాలని సంకల్పించింది. సప్తగిరి ఏజంట్లు ఉభయతారకంగా పనిచేసి ఈసంవత్సరము 50,000 ప్రతులు ముద్రణ కావాలన్న పత్రిక యాజమాన్య సేవాకార్యక్రమానికి చేయూత నిస్తారని నమ్ముతున్నాం.

గ్రంథసమీక్షలుకూడా ప్రారంభం కానున్నవి. ఇందుకుగాను రచయితలు తమగ్రంథం ప్రతులు రెండు పంపవలసివుంటుంది,

అన్నిటికన్న ముఖ్యంగా ముఖ్యమైనది. సప్తగిరి కేవలం తి. తి. దేవస్థాన ప్రచారానికే ఏర్పడ్డలేదు. దేశంలో వివిధ దేవాలయాల కార్యకలాపాలకు అనుసంధానకర్తగాకూడా పనిచేస్తుంది. అందుకే ప్రాదేశికవార్తలకుగాను ఆయా భాషల సప్తగిరిలో ఒకపేజీ కేటాయించటం జరుగుతుంది.

ఇన్ని సంవత్సరాలకన్న అధిక సహకారాన్ని కోరుతూ సప్తగిరి అందరికి మరొక్కసారి సాదరశుభాకాంక్షలు సమర్పిస్తున్నది.

# అభినందనలు

సంపాదకుడు

హిందూమత

ప్రచార ప్రభావవ

భారతదేశము సర్వమతములకు

...ములకు నిలయమైన పుణ్యభూమి.

...మియందు తమకు నచ్చిన మతవ...

సంపుటి 10 సంచిక 1

విడిప్రతి 0-50 పైసలు

సం॥ చందా రు. 6-00

# సప్తగిరి

గౌరవసంపాదకులు:

శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్

ఐ. ఏ. ఎస్,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2322

ప్రచురణకర్త — సంపాదకుడు:

కొత్రపాటి సుబ్బారావు

ఎమ్. ఏ.,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

ముద్రాపకుడు,

ఎమ్. విజయకుమార్ రెడ్డి,

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2340

## విషయసూచిక



### అన్నమప్రభ



* కొన్ని అనివార్య కారణములవలన 'అన్నమాచార్య సారస్వత కళారాధనము, అన్నమస్వరలహరి' వరాహపురాణం, అన్నమాచార్య సంకీర్తనామృతము' ప్రకటింపబడలేదు. ॥ సం॥

ముఖచిత్రం: తిరుపతి శ్రీ గోవిందరాజస్వామి వారి గరుడోత్సవము

# సంపాదకీయము

మనస్సు మరొక్కసారి మూగబోయింది. అనుకోని అవా[illegible] తడపా వచ్చిపడితే మనిషి మూనుగాక చేసేదేముంది? జలప్రళయం ఎక్క 10వ సంవత్సరంలో దాటకముందే, కలిగిన ఆపదకన్నీరు కాస్త తుడుచుకోకముందే, మళ్ళీ ముసురుపట్టి గాలి వానై ఇప్పటికి 500 పైగా జననష్టం, అపారంగా ఆస్తినష్టం జరిగింది. గుళ్ళో పెళ్ళికి బయల్దేరి గోదాములలో పెళ్ళిజరుపుకున్నవారు కొందరైతే, గోదాములు, గుడిసెలు కొట్టుకుపోయి గుండెలవిసేలా విలపిస్తున్నవారు ఎందరో. ఇళ్ళు, బళ్ళు పడిపోగా ఎందరికో గుళ్ళు దిక్కైనై. గుడులే పదిలమనుకున్న మరికొందరి కవే సమాధులయ్యాయి. ఇంకా అంచనాల్లోనే ఉన్న నష్టం, అంతా తేలేటప్పటికి ఎంతౌతుందో! మనిషి వట్టి మరబొమ్మని, మన చేతులలో ఏమీలేదని మరొక్కసారి ఋజువైంది.

నిన్నటివరకు అంతో ఇంతో మిన్నగా ఉండి, కాలవశాన కట్టుబట్టలతో మిగిలిన, సోదరుల బాధలు పంచుకుని ఉదారసహాయం చేయగల సమాజహితైషిణీసంస్థలు ముందుకు రావాలి. అందుకు ముందడుగుగా తిరుమల తిరుపతి దేవస్థానం యథాశక్తి సహాయ పునరావాస కార్యక్రమాలకు సహాయకార్యక్రమాలు, రవాణా సదుపాయాలులేక దేవస్థాన సత్రాలలో దిగబడిన యాత్రికులకు యథోచితసౌకర్యాలు కల్గించింది.

ఎవరెన్ని చేసినా, ఎంత ఊరట కల్గించినా ఈ కనపడని మంట ఆరేదికాదు. కాలమే దానికి మందు. మనిషిగా పుట్టినందుకు మన కర్తవ్యం మనం నిర్వహించాలి అంతే.

ఎవరెవరు తమవారినెందర్ని పోగొట్టుకున్నారన్నది ఇంకా అంచనాలలోనేవుంది. మరణించినవారి ఆత్మలకు శాంతిని, శోకతప్తులకు మనస్థైర్యాన్ని ప్రసాదించమని వేంకటేశుని వేడుకుంటూ, 'మంది సొమ్ము మనకూ కొంత' అనే నికృష్టమనస్తత్వానికి చోటులేకుండా, సాదరంగా సానుభూతితో సహాయపడవలసిందని మనసున్న వారందరికి సప్తగిరి మరొక్కసారి విజ్ఞప్తి చేస్తున్నది.

# హిందూమత ప్రచార ప్రభావము

భారతదేశము సర్వమతములకు సర్వ ధర్మములకు నిలయమైన పుణ్యభూమి. ఈ భూమియందు తమకు నచ్చిన మతమును వ్యాప్తికిఁదెచ్చుకొనుట కనేకావకాశములు కల్పించిరి. రెండువేల సంవత్సరముల నాఁడు జరిగిన కురుక్షేత్ర సంగ్రామగాథ తిలకించిన నది ధర్మము, దానము, భక్తి, దయ, శౌచాదిగుణములతోఁ గూడినదై యుండినది. భరతుడు పాలించుటచేత భారతదేశమని వాసికెక్కినది.

జైన, బౌద్ధమతములు వ్యాపించి లోకమున తాండవించువేళ కొందఱు మత ప్రీతులు తమ మతప్రచార గ్రంథములు వ్రాసికొనిరి. నాడుజైన బౌద్ధమతవ్యాప్తితో నల్లకల్లోలముగ నుండు సమయాన తిక్కన కవీశ్వరుడు హరిహరాంకితమైన మత గ్రంథము రచించెను. దానితో లోకమున నలజడి కొంత తగ్గెను.

శంకరాచార్యులు, రామానుజాచార్యులు మధ్వాచార్యులు మొదలగువారు వెలసి యొక్కొక్కరొక్కొక్క మతమునకు ప్రచారకులైరి. శంకరాచార్యులద్వైత మతప్రచారకులు. రామానుజాచార్యులు విశిష్టాద్వైత మతప్రచారకులు, మధ్వాచార్యులు ద్వైతమత ప్రచారకులుగా వాసి కెక్కిరి. శంకరాచార్యులు తమ స్వల్ప జీవితకాలములోనే హిందూమతమును కన్యాకుమారినుండి హిమాచలపర్యంతము తిరిగి తిరిగి వ్యాపింపఁజేసిరి.

హిందూధర్మప్రచారము భారతదేశము నందు నలుమూలల వ్యాప్తిజెందుటకు పలు రకములైన వ్యక్తులు కృషిచేసిరి. కొందఱు పీఠాధిపతులు స్వలాభాపేక్షరహితులై హిందూధర్మ ప్రచారమునకై కృషిచేసిరి. హిందూమతాభివృద్ధికై కృషిచేసిన వారు శంకరాచార్యులు. శంకరాచార్యులు కేవలం మతప్రచారమేగాక ఆధ్యాత్మిక రూపమైన శ్లోకములు భాష్యములకు వ్యాఖ్యానములు రచించిరి. వారిజీవితకాలము స్వల్పమైనను వారు మతవ్యాప్తికై పాటుపడినది యనంతము.

భారతము రాజకీయ విషయములకు పుట్టినిల్లు. భాగవతము భక్తికి నిలయము. రామాయణము రాగద్వేషములకు రస మంజరి. రామాయణమున యుద్ధకాండ మందు రాముడు లక్ష్మణునిగూర్చి పలికిన పలుకులాలకింపుడు.

"దేశేదేశే కళత్రాణి దేశేదేశేచ బాంధవాః
తంతుదేశం న పశ్యామి యత్ర భ్రాతృ
సహోదరాః"

---

శ్రీ కె. కుమారస్వామి
ప్రొద్దుటూరు

---

పై శ్లోక మొక్కటియే చాలును సోదర ప్రేమ రామాయణమున యెట్లు తొణికిస లాడుచున్నదో తెలియజేయుచున్నది.

హిందూమతాచార ప్రచారములను వ్యాప్తికిఁ దెచ్చుటకు కేవలము హిందువులే కాక యితర మతములవారు కూడ కృషిచేసిరి. ఛత్రపతిశివాజీకి హిందూమత ప్రచారముపై భక్తి కడుమెండు. రాజైన శివాజి తనకునచ్చిన హిందూమతాచారము లను తానాచరణలో పెట్టుటయేగాక తన సైనికులనుకూడ నాచరించునట్లు చేసెను. శివాజీకి హిందూమతముమీఁదను స్త్రీజాతి మీదను పవిత్రభావము గలదు. తన పాల నలో నాతడు సర్వమతములవారికి సమాన హక్కులుండునట్లు శ్రద్ధవహించెను. దీనిని నిరూపించుటకు 'శివభారతము'లోని యీ పద్యము సాక్షిగానున్నది.

"కులమతాచార సంకులతఁ బాపి
వసతు లెసంగి ప్రజల సౌఖ్య పఱపవలయు
నన్నిపనులనుఁ దీర్ప సమర్థులైన
యంచితోద్యోగులను నియమింపవలయు"

శివాజీ తన ప్రథమ దండయాత్రకు బోవు సందర్భమున తన సైన్యమునకు తన సిద్ధాంతములను తెలియఁజేసెను. వాని నందఱు పాటింప వలయునని యాజ్ఞాపించెను, ఆ సిద్ధాంతములివి.

1. పంటలకు, గోసంపదకు, పేద సాద లకు, బ్రాహ్మణోత్తములకు కీడు సల్పరాదు.

2. అట్టి కీడును నితరులు చేయుచున్నను సహింపరాదు.

ఈ సిద్ధాంతములనే క్రింది పద్యము నిరూపించు చున్నది.

"మఱియొకమాట మీరహితమర్దనులై చను దెప్పచ్చటఁ
ద్వరపడి పేదసాదలకుఁ దారలకుఁ బతి దేవతాజనో
త్కరమున కాలమందలకు దైవత భూసుర కోటి కెట్టిదు
శ్చరితము సల్పరాఁ దొరులు సల్పిన సైపగ రాదు చూచుచున్"

శివాజీ నిర్ణయించిన సిద్ధాంతములను మరచి యతని సైన్యాధిపతి కళ్యాణి పట్టణముపై దండయాత్రచేసిన సమయమున నా నగరపు సర్దారును వాని భార్యను బంధించి శివాజీచెంతకుఁదెచ్చెను. అప్పుడు శివాజీ యుగ్రుఁడై యాసేనాపతిని బంధింపుఁడని యితర సేనాపతులకు నాజ్ఞాపించెను తన తప్పునకు సేనాపతి పశ్చాత్తాపపడి క్షమార్పణఁజేసిన తరువాతనే శివాజీయాత నికి విముక్తి కలిగించెను. పిమ్మట దుర్గాధిపతి పత్ని కడకువెళ్ళి "వనితా రత్నంబులీ భవ్యహైందవ పథోజంగమ పుణ్యదేవతలు" "మాతా తప్పు సైరింపుఁడ"ని

( 33వ పేజీలో చూడుడు)




# శ్రీ వేంకటేశ్వర మూక బధిరాంధ పాఠశాల

22—4—79

★

1974 లో తిరుమల తిరుపతి దేవస్థానము స్థాపించిన మూక బధిరాంధ పాఠశాల వార్షికోత్సవము 22-4-79న జరిగింది. దేవస్థాన ఉపకార్య నిర్వహణాధికారి శ్రీ యన్. నరసింహారావు అధ్యక్షత వహించగా శ్రీ రావుల సూర్యనారాయణ ముఖ్యాతిథిగా పాల్గొన్నారు. ప్రిన్సిపాల్ తల్పకాయిని ఎడమ చివర చూడవచ్చు.

*

ఈ పాఠశాలలో 50 మంది విద్యార్థులున్నారు.

*



వినోదకార్యక్రమం



దేవస్థాన విద్యాశాఖాధికారి శ్రీ బి. రంగయ్య బహుమతులు పంచారు.

# శ్రీనివాస ప్రబంధము



శ్రీమాన్ సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులు, కడప.

(గతసంచిక తరువాయి)

కం॥ చిలుపనివసంతరాగం-
బెలసినదే దిశల విరహిహృదయమ్ముల న-
గ్గలమై చీకటనేత్రాం-
చలములఁ గన్నీటిసోన జలజల రాలెన్ ౩౦౬

ఆ॥ ఆవసంతమందు నతివేల విరహాసం-
తప్తుఁడై నశివుఁడు తాల్మివట్టి -
యల్లాడుమనసు నాకట్టి చిరసమా-
ధిస్థుఁడయ్యె విరతి తీడిరించి ౩౦౭

ఆ॥ అఱచియఱచి యడవు లన్నిటఁ జుట్టె ని-
న్నట విరాళి యెడద నగ్గలించి;
నేఁడు చలనమేది నిడుతపంబును వట్టె
విభులమనసు దెలియవెరవులేవి? ౩౦౮

ఉ॥ అప్పుడు తారకాసురుఁ డహర్పతితేజుఁడు బ్రహ్మ గూర్చి పెన్-
దెప్పలుగాఁగనై తప ముదీర్ణవరంబులు నొంది రక్కసుల్
తొప్పలు దోరలై కొలువ త్రుళ్ళుచు నాకమునడ్డ, శౌర్యముల్
పిప్పిగనైనయింద్రునకు భీకపుఁబొత్తము వల్లవారినన్ ౩౦౯

గీ॥ ఇంక నెట్లమ్మ! యనుచు దేవేల్యుఁడైన-
నాంగిరసుఁ బిల్వఁబంచి మంత్రాంగమాడ;
'బ్రహ్మవర మింతసేసె' తారకునిఁగూల్చు-
వన్నుగడ నాతఁడే వన్నవలయుననియె. ౩౧౦

సీ॥ అపుడు తారకుతోడ ననునయ సామవా
దములాడి సపది యుద్ధమ్ము నిలిపి
సాంగిరసమ్ముగా శతధృతి దరిసించి
తారకువిక్రమదావవహ్ని-
తెఱఁ గెఱిఁగించి నిర్జరసేన కలనికి
నడపించి గెలుచు సేనాని వలయు,-
నీశానుఁ డేమో సమిద్ధవ్రతారంభ
దేవదారుద్రుమాధీనుఁడయ్యె

గీ॥ యింక మాకేదుగడ యెవ్వ రింతలేసి-
వరము లొసఁగితి వేమిగావలయు ననెడి-
నాకనాయకునేత్రసహస్ర మపుడు
శాఢదుఃఖాగ్నితప్తబాష్పములు కురిసె ౩౧౧

కం॥ పరమేష్ఠి పలికె హిమభూ-
ధరమునకున్ బుత్రియగుచు ధవళాక్షీ పురం-
దర! సతి బెరుగుచున్నది
పురహరగార్హస్థ్యధర్మపూర్తికిఁ గాగన్ ౩౧౨

కం॥ వారిర్వురకు జనించుకు-
మారుఁడు తారకునిఁ జంపు మతి మసలక నీ-
హారకరచూడగిరిజా
ప్రారజ్యప్రణయభరము పండింపవలెన్. ౩౧౩

ఆ॥ నారదుండు వోయి నగనాథుతోఁ దెల్పి
నూలుకొల్పవలయు మేలిబిడ్డ
తొంటిమేనితెఱఁగు తోడ్తోడ వినిపించి
పొలఁతి హరునిఁ గూర్పఁ దలఁపుమనుచు. ౩౧౪

కం॥ మారుని రావించుచు స-
త్కారము గావించి శంభుకడిఁదితపంబున్
దొరగిలఁజేసి మదిశృం-
గారము వెలయింప నీవు ఘటియింపవలెన్ ౩౧౫

గీ॥ ఇదియె మార్గంబునూ రాతసేంద్రుఁ డంప-
ననినఁ బనివినె నముచిసూదనుఁడు ప్రీతి-
నబ్జభవునానఁ బూని దేవర్షివరుఁడు
హిమమహీధరతుంగశృంగములఁ జేరె ౩౧౬

(33 వ పుటలో చూడుడు)

# ముఖ్య ప్రకటన

శ్రీ వేంకటేశ్వరస్వామి వారిని సందర్శించ వచ్చే యాత్రికుల సౌకర్యార్థం దేవస్థానం సత్రాలు, కాటేజీలు ఇంకా తదితర సౌకర్యాలు ఏర్పాటు చేసిన విషయం అందరికీ తెలిసిందే. అయితే భోజనాదిక సదుపాయాల విషయంలో యాత్రికులకు సరైన వివరాలు తెలియక అసౌకర్యానికి లోనౌతున్నారని తెలియ వస్తున్నందువలన తిరుపతిలో దేవస్థానం సంబంధించినవి, తిరుమలలో ఇతర ముఖ్యమైన హోటళ్ళను గూర్చిన వివరాలు స్థూలంగా పొందుపరుస్తున్నాం.

## దేవస్థానం క్యాంటీన్, తిరుపతి

1—వ సత్రం

పనిచేయువేళలు: ఉ॥ 5 గం॥ నుండి
రాత్రి॥ 9 గం॥ వరకు.

కాఫీ, టిఫిన్, బిస్కెట్లు, చల్లనిపానీయాలు లభించును.

2—వ సత్రం

పనిచేయువేళలు:

టిఫిన్ ఉదయం 5 గం॥ నుండి 9-30 వరకు
సా. 2-30 నుండి 6 గం॥ వరకు

భోజనం: ఉ. 10-30 నుండి 2 గం॥ వరకు
సా. 6-30 నుండి 9 గం॥ వరకు

భోజనం (ప్లేట్) 1-50
అదనంగా అన్నపు ప్లేట్ 1-00
పెరుగు (కప్పు) 0-40

(టిఫిన్, కాఫి, టీ, బిస్కట్, చల్లని పానీయములు లభించును.)

## తిరుమల

దేవస్థానం అతిథి భవనం క్యాంటీన్.

పనివేళలు: టిఫిన్ ఉ. 6 నుండి 9 వరకు
సా. 3 నుండి 6 వరకు
భోజనం ఉ. 11 నుండి 2 వరకు
సా. 7 నుండి 9 వరకు

పూర్తి భోజనం రు. 3/-
కావలసినవారు 3 గంటల ముందు ఆర్డరివ్వాలి.

### కాఫీబోర్డు
(పి.పి. షెడ్స్‌వద్ద)

పనివేళలు: ఉ. 5 నుండి రాత్రి 10 వరకు

పెరుగన్నం (పొట్లం) 0-60
పులిహోర (పొట్లం) 0-60 పై

చల్లనిపానీయములుకూడా లభించును.

### కాఫీబోర్డు
(కల్యాణ కట్టవద్ద)

పనివేళలు: ఉ. 5 నుండి సా. 10 వరకు

మామూలుగా దొరికే అల్పాహారం ఇక్కడ లభించును.

### టీ బోర్డ్
(ఎ. టి. సి. వద్ద)

పనివేళలు: ఉ. 6 నుండి 11 వరకు
సా. 2 నుండి 6 వరకు

టీ, ఆంబ్రో గ్లూకోస్ బిస్కట్లు లభించును.

### హోటల్ అన్నపూర్ణ
(శంఖమిట్టవద్ద)

పనివేళలు: టిఫిన్ ఉ. 5 నుండి రా. 10 వ.
భోజనం ఉ. 9 నుండి సా. 3 వరకు
సా. 6 నుండి 10 వరకు

భోజనం (పూర్తి) రు. 3-00
,, (ప్లేట్) రు. 1-75
అదనంగా అన్నం (ప్లేట్) రు. 0-60

### ఉడ్‌లాండ్స్
(దేవస్థాన అతిథి భవనం ప్రాంతం)

పనివేళలు: టిఫిన్ ఉ. 6 నుండి రా. 10 వ
భోజనం ఉ. 11 నుండి 2-30 వరకు
సా. 7 నుండి 10-00 వరకు

మద్రాసు భోజనం: రు. 4-00
ఉత్తరభారత భోజనం రు. 6-00
భోజనం (ప్లేట్) రు.1-75

**తి. తి. దేవస్థానం.**

# ఆంధ్రశతకవాఙ్మయ వికాసము

ఆంధ్ర వాఙ్మయమున నాటకము, శతకము నవల, కథానిక, ఖండకావ్యము మహాకావ్యము మొదలగు వివిధ ప్రక్రియలు మనకు దృగ్గోచరమగును. పై అన్నిసాహిత్య ప్రక్రియలలోను ప్రజాదరణము ప్రజాసాన్నిహిత్యము సందినది శతక వాఙ్మయము మనకు తప్పదు. ఒక ప్రక్రియావికాసమును తెల్పుటకు తులనాత్మక పరిశీలనము సాహాయ్యపడును. ప్రాకృతము సంస్కృతము - తమిళము - కన్నడము హిందీ మొదలగు భారతీయ భాషలలోని శతక ప్రక్రియావికాసమును పరిశీలించిన యెడల సందగ్రస్థానము ఆంధ్రశతకములకే లభించును. తమిళ - కన్నడ - హిందీభాషలందలి శతకముల లెక్కించిన కొన్నివందలకు మించి యుండవు సంస్కృతమునకూడనంతియే. కాని తెలుగునందలి శతకముల సంఖ్య యైదారు వేలకు మించియుండును. ఏ భాషలో కూడ, తెలుగు శతకము వలె, భక్తి, నీతి, శృంగార, వైరాగ్య అధిక్షేప, కథాత్మకాది వర్గీకరణమున, వస్తువైలక్షణ్యమున ప్రాశస్త్యమునొంది వికాసమునందలేదు. అది ఒక్క తెలుగు శతక వాఙ్మయమునకే దక్కుట ఆంధ్రావళి మోదమొంద వలసిన విషయము. ఈ ప్రాశస్త్యమును గుర్తించి కేంద్ర సాహిత్య అకాడమీవారు కీ॥ శే॥ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి మధ్యాక్కరలియే అఖిల భారతస్థాయిలో పట్టముగట్టి ఆంధ్రశతక వైశిష్ట్యమును లోకమునకెల్ల చాటినారు. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు ఆంధ్రశతక వాఙ్మయ సరస్వతికి మణికిరీటమై భాసిల్లును,

సాహిత్యము సమాజదర్పణము. సంఘములో నొకవ్యక్తి. తన కాలమునాటి రాజకీయ సాంఘిక, మత పరిస్థితులందు గల దురాచారముల కుద్రిక్తుడై కవి కవితావేశమున శతకరూపము నందించును. ఏ ఒక్క శతకములోకూడా నేదో యొక రాజకీయ లేక మతసాంఘిక దోషము తెల్పువిషయము లేకుండ నుండదు. నిజమున కన్ని శతకముల ప్రోవుచేసి పరిశీలనకు ప్రారకభించిన యాంధ్రుల చరిత్ర పరిపూర్ణముగ తెలియుననుట అతిశయోక్తికాదు.

ఇతర కావ్యరచనలతో పోల్చిచూచిన శతకరచన కొక విశిష్టస్థానముద్యోతకమగును. కవియొక రాజునో లేక మంత్రినో నాశ్రయించి కావ్యములు మహాకావ్యములు రచించినట్లు చరిత్ర స్పష్టపరచును. కాని ఏయొక కర్తకూడ పేరుప్రతిష్ఠలకు గాని, లేక రాజాశ్రయమునకు గాని శతకమును రచించి నటుల గన్పడదు. తాను పొందిన యనుభూతిని కవితారూపము నందించుటయే శతక కారుని ధ్యేయము అది భక్తిరూపమున గాని లేక నీతి లేక వ్యాజోక్తి లేక అధిక్షేప రూపమునగాని, యాతని యభిరుచిని బట్టి బహిర్గతమగును.

శతకమొక యల్పకావ్యమని కొందఱి భ్రమ. శతక కర్తలుకూడ మహాకవులుగ ప్రసిద్ధులయినారనుటకు కవిచోడప్ప, వేమన, బద్దెభూపతి అన్నమాచార్యుడు తార్కాణము. అన్నమాచార్య సర్వేశ్వరశతకము, వేమన "విశ్వదాభిరామ వినుర వేమ" అను మకుట పద్యములు, బద్దెన 'సుమతీశతకము' అఖిలాంధ్రులకు సుపరిచితములు. అక్షరాభ్యాసమునుండి బాలుడు చదువునది సుమతీ - వేమన శతకములేకదా!

శతక కవుల యాదర్శములుకూడ నొక ప్రత్యేక వైశిష్ట్యమునే చాటును. సంఖ్యా నియతియందు తప్ప స్తోత్రమునకు - శతకమునకు భేదమించుకయులేదు. వాఙ్మయారంభ దశలోనే రెండును భక్తి ప్రధానముగ వెల్వడినవి. భక్తి శతక కర్తలకు, కవితను పరమేశ్వరున కంకిత మొనర్చుటయే ధ్యేయమైనది.

పోషకప్రభువుల చిత్తవృత్తి వారి యావేశము వారి కనవసరము. వారు రాజ రాజసభా గౌరములాసించినపుడు కదా వారికట్టి తాపత్రయముండవలసినది? రాజసభాగౌరవములకుగాని, పండితుల ప్రశంసలకుగాని తొలిదశలో శతకములు వెల్వడలేదు. జనన మరణ పరంపరలు లేని ముక్తికాంత నందుటయే వాని ధ్యేయము. ఆదర్శము కూడ. అంతియె కాదు, శతక కవులు అగ్రహారములను గాని - బిరుద సత్కారములగాని వాంఛించలేదు. వాఙ్మయమునగల యేప్రక్రియకు కూడ నట్టి పవిత్రస్థానము గాని ప్రత్యేకస్థానము గాని లభించలేదు. "నీకుంగాని కవిత్వ మెవ్వరికి నేనీనంచుమీదెత్తితిన్" అని ధూర్జటి ప్రతిజ్ఞ. భక్తి నీతి వైరాగ్యశతక కర్తలధ్యేయము చతుర్విధపురుషార్థ సాధనము. ఇట్టిశతక వికాసము ఆంధ్ర వాఙ్మయమున నెట్లు జరిగినదో పరిశీలింతము,

శ్రీమతి టి. మంగమ్మ,
తెనాలి.

## శతక వాఙ్మయము

ఆంధ్రసాహిత్య చరిత్రను పరిశీలించినచో శతకప్రక్రియ నాటినుండి నేటివఱకు

# సప్తగిరి

## తిరుమల తిరుపతి దేవస్థానముల మాసపత్రిక.

*

సప్తగిరి మాసపత్రికలో వ్యాపార ప్రకటనలు ఈ దిగువ కనపరచిన రేట్ల ప్రకారము ప్రచురించబడును.

### ఒక్కొక్క ప్రకటనకు

| | | | | |
|---|---|---|---|---|
| లోపల పేజీలో: | పూర్తి పేజీ | .... | .... | రు. 80/- |
| | అర్థ పేజీ | .... | .... | రు. 50/- |
| | పావు పేజీ | .... | .... | రు. 30/- |
| కవరు పేజీలు: నాల్గవ పేజీ | 1 రంగులో | .... | ... | రు. 200/- |
| | 2 రంగుల్లో | .... | ... | రు. 250/- |
| | 3 రంగుల్లో | .... | .... | రు. 300/- |
| లోపల 2 వ పేజీ 3 వ పేజీ | 1 రంగులో | .... | ... | రు. 150/- |
| | 2 రంగుల్లో | . . | .... | రు. 200/- |
| | 3 రంగుల్లో | .... | ... | రు. 250/- |
| ప్రత్యేకస్థలము లోపల పేజీలో | 1 మొట్టమొదటి పేజీ | .... | .... | రు. 150/- |
| | 2 చివరి పేజీ | .... | .... | రు. 110/- |
| | 3 వార్తల పేజీకి ఎదురు పేజీ | | 1 పేజీ | రు. 100/- |
| | | | ½ పేజీ | రు. 60/- |

### సాంకేతిక సమాచారము

| | | | |
|---|---|---|---|
| స్క్రీన్ : | కవరు పేజీలు | .... | 80 నుండి 100 |
| | లోపల పేజీలు | .... | 65 నుండి 80 |
| పేజీపరిమాణము (బ్లాకులకు) | పూర్తి పేజీ | .... | 24 సెం. మీ × 19 సెం. మీ |
| | అర పేజీ | .... | 12 సెం. × 19 సెం. మీ |
| | పావు పేజీ | .... | 6 మీ × 19 సెం. మీ |

ప్రకటనకు సంబంధించిన విషయములు, బ్లాకులు, సంస్థలవారే సరఫరా చేయవలయును.

గమనిక: 1, 4 వ కవరు పేజీ తప్ప మిగిలిన పేజీలలో 6 నెలసరి సంచికలకు ముందుగా డబ్బు చెల్లించి స్థల నిర్ణయము చేసుకొనువారికి ప్రకటన రేట్లపై 10% ను 12 సంచికలకు స్థల నిర్ణయము చేసుకొనువారికి 15% శాతమును ముదరా ఈయబడును.

2. ఈ వ్యాపార ప్రకటనల విషయము ముందు తెలుపక, కారణములు తెలుపకయే ఏ ప్రకటననైనను విరాకరించు హక్కు సంపాదకునకు కలదు.

కార్యనిర్వాహక అధికారి,

**తిరుమల తిరుపతి దేవస్థానం.**

(అనగా వాఙ్మయారంభ దశనుండి) సజీవ స్రవంతివలె సాగుచున్నదని తెలుస్తున్నది. సాహిత్య ప్రక్రియలు సమకాలీన పరిస్థితుల ననుసరించి, కవులయభిరుచి ననుసరించి కొన్ని యుగములలో మాత్రము అధిక ముగా నాదరింపబడినట్లు కూడ ఆంధ్ర భాషా చరిత్ర తెల్పుతుంది. కాని శతక వాఙ్మయ మట్లుగాదు. అది ఆదినుండి జీవనస్రవంతియై విలసిల్లువచ్చుచున్నది.

ప్రాచీన సంస్కృతా లంకారికులు శతక లక్షణములను సమగ్రముగ వివ రించలేదనవచ్చును. క్రీ. శ. ఆరవ శతాబ్ది నాటి భామహుని దృష్టిలో సర్గబంధము లేని కావ్యము అని బద్ధకావ్యము. ఏడవ శతాబ్దపు దండి మతమున ఒక శ్లోకము ముక్తకము. అట్టి ముక్తకముల సముదా యము కులకము. తొమ్మిదవ శతాబ్దము నాటి అగ్నిపురాణము - అనేక శ్లోకముల సముదాయము కులకము అనియు, ఒక శ్లోకము ముక్తకమనియు స్పష్టపరచెను ఆనందవర్ధనుడు కూడ నట్టి యభిమత మునే నీవిషయమున వెల్లడించెను పదు నాల్గవశతాబ్దినాటి విద్యానాథుడు కావ్య భేదములలో నుపకావ్యముల బేర్కొని, యది అసర్గ బంధమని నుడివెను ప్రతాప రుద్రీయ వ్యాఖ్యాత అసర్గబంధ కావ్యము లకు లక్ష్యముగా సూర్య శత కాదుల నిచ్చెను. అనగా విద్యానాథుని దృష్టిలో అసర్గబంధములు - ఉపకావ్యములు ఒకటే. శతకమందుచేరును. కానిశతకము నెవ రును నొక ప్రత్యేక వాఙ్మయ ప్రక్రియగా పేర్కొనలేదు పదునూడవశతాబ్దిచెందిన అమృతానందయోగి మొట్టమొదటగా శ్లోక సంఖ్యల ననుసరించి కావ్యములను వర్గీకరించి అందు శతకమును చేర్చెను. ఈతని అలంకారసార సంగ్రహమున "శతేనశతకంప్రోక్తమ్" అని శతక మను స్పష్టముగ నిరూపించెను.

పదునేనవ శతాబ్దికి చెందిన విన్నకోట పెద్దన "శతకమున నొప్పు పద్యశతము గూడ" అని కావ్యాలంకారచూడామణి యందు శతకప్రక్రియా విధానమును పేర్కొనెను. అనంతామాత్యుడు శత కము - అష్టోత్తరశతకము అను వానిని తన లక్షణ గ్రంథమున నుదాహరించెను. కాని అప్పకవి కావ్యములు ప్రబంధ ములు - చాటు ప్రబంధములని వర్గీకరణ మొనర్చి యందు చాటు ప్రబంధములను ద్వివిధముగ వర్గీకరించి "అసాంఖ్య బద్ధ ములు - సంఖ్యాబద్ధములు" అని చెప్పెనే గాని యందు శతకమును చేర్చలేదు. అప్పకవి పదునేడవ శతాబ్దివాడు. అప్ప టికి తెలుగుశతక ప్రక్రియ వికాసము నొందినది. అయినను అప్పకవి శతకము నొక ప్రక్రియగా పేర్కొనక పోవుట వింత యనిపించును. కాని యాతడు వజ్రపంజర, మరున్నందన శతకములనుండి యుదాహరణముల మాత్రమిచ్చెను. ప్రాచీన సంస్కృత ప్రాకృతస్తోత్రము లందును, శతకములందును గల సంఖ్యా నియమమును పాటించి యాంధ్రశతక కర్తలును సంఖ్యానియతితో శతకముల రచించిరి శతసంఖ్యకుగల ప్రాధాన్యత గుర్తించి నూరుశ్లోకములతో శతకము సంస్కృతమున రచింపబడినది. వేదము లలో ఆయుష్యసూక్తముల శతసంవత్స రములు జీవన ప్రమాణముగ చూచించు చున్నవి శతసంఖ్య కీర్తిగా ప్రాధాన్య మీయబడినట్లే 108, 110, 116, 120 మున్నగు సంఖ్యానియతిగల దానము లొనర్చబడినట్లు ప్రాచీన దానశాసనముల వల్ల స్పష్టమగును. జపమాలలో నూట ఎనిమిది పూసలుండవలెను. ఉపనిషత్తులు- పురాణములు మున్నగువాటిననుసరించి అష్టోత్తర శతసంఖ్యకు ప్రాధాన్యత యేర్పడియుండనగును.

మకుటనియమము సంస్కృతస్తోత్రము లందును, శతకములందును కలదు. తెలు గులో మకుటాత్మక స్తోత్రరచనచేసిన మొదటివారు నన్నయ - నన్నెచోడులు. భారతమున, నన్నయ ఉదంకోపాఖ్యాన

(29 వ పేజి చూడుడు)

## కీర్తనలు

ప = పల్లవి  అ = అనుపల్లవి  చ = చరణము

### 1. శాకుంతలరాగము — ఆదితాళము

ప॥ నిను వినయే గతినే గాన —
నిర్మలాత్మ నా మన విని విన  ॥ నిను ॥

అ॥ మును భక్తులను గనిబ్రోవ లేద
మోహనరామ మరచితి వేమొ  ॥ నిను ॥

చ॥ ధరలో అనేక దైవముల నమ్మి —
కోరగాని సుఖములు కోరక
నిరతము నిన్నె నెరనమ్మినార —
తిరుపతి వరద వేంకటేశ  ॥ నిను ॥

శ్రీ విద్యల నారాయణస్వామి,
తిరుపతి

# పురాణములు - వాని విభజనము

(గతసంచిక తరువాయి)

"మయ్యావేశ్య మనో యేమాం నిత్య
యుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్త
తమా మతాః॥"
(12-2)

(ఎవరు నాయందు మనస్సు నిలిపి, నిరంతర సమాహిత చిత్తులును, మిక్కిలి శ్రద్ధతో కూడినవారునై నన్ను ఉపాసించుచున్నారో అట్టివారు యోగులలో శ్రేష్ఠులు. వారు నాకుసమ్మతులు) సంసార సాగరమున మునిగి దరిగానక కొట్టు మిట్టాడు మానవులకు విష్ణుని గుణ వర్ణనము తెప్పవంటిదనియు, పాప పుంజమనెడి దావాగ్ని నార్పుటకు గోవిందనామ స్మరణమను వర్షధారలే సమర్థము లనియు విబుధు లిట్లను చున్నారు.

ఎ) 'వినుమీ సంసారంబను
వన నిధిలో మునిగి కర్మవాంఛలచే వే
దన బొందెడు వానికి వి
ష్ణుని గుణవర్ణనము తెప్పసుమ్ముమునీంద్రా!'
(భాగ-1-130)

బి) 'వర గోవింద కథా సుధారస మహావర్షో
రుధారా పరం
పరలంగాక బుధేంద్ర చంద్ర! యితరో
పాయాను రక్తిం ప్రవి
స్తర దుర్దాంత దురంత దుస్సహజను
స్సంభావితా నేక దు
స్తర గంభీర కఠోర కల్మష కనద్దా
వానలం బారునే!'
(భాగ 1-47)

నిర్మలమగు భక్తిచే భగవంతుడు ప్రసన్నుడు కాగలడని భాగవతమున ప్రహ్లాదు డిట్లనుచున్నాడు.

"ప్రీణనాయ ముకుందస్య నవృత్తం న బహు
శజ్ఞతా
నదానం నతపో నే జ్యా నశౌచం నవ్రతానిచ
ప్రీయతేఽను గయా భక్త్యాహరిరన్య ద్విడంబ
నమ్"—

(విష్ణుని సంతోష పెట్టుటకు నడవడి, పాండిత్యము, దానము, తపస్సు, యాగము, శౌచము, వ్రతములు, ఉపయోగ పడవు, ఎడతెగని భక్తి చేతనే హరి సంత సించును. తక్కిన దంతయు హాస్యాస్ప దమే.)

తన్ను పొందుటకు ఏకైక యుపాయము భక్తియే యనెడి భగవంతుని వాక్యమును తిలకింపుడు.

శ్రీ డి. నాగసిద్దారెడ్డి,
తిరుపతి.

"నసాధయతిమాం యోగో నసాంఖ్యం ధర్మ
ఉద్ధవ।
నస్వాధ్యా యస్తపస్త్యాగో యథాభక్తిర్మ
మోర్జితా॥" (భాగ 11-1420)

(ఓ ఉద్ధవా! ఉజ్వలమైన భక్తి వలె యోగము, సాంఖ్యము, ధర్మము, వేద పాఠము, తపస్సు, త్యాగము నన్ను స్వాధీనము చేసికొనజాలవు.)

మోక్షప్రాప్తికి సాధనములుగ మన పూర్వులు జ్ఞాన కర్మ భక్తి మార్గములను నిర్దేశించిరి అందాజాల వృద్ధమునకు ననుసరణ యోగ్యమైనది భక్తి మార్గము. భాగవతమున వర్ణింపబడిన భక్తుల చరిత్రము లన్నింట నీ భక్తి ప్రాశస్త్యము చక్కగ వెల్లడింపబడినది. "సంసార ప్రవిష్టుడైన వానికి తపోయోగాదులైన మోక్షమార్గంబులు పెక్కులు గలవు. అందు భక్తి మార్గంబుకంటె సులభంబు లేదు"— అను శుక యోగీంద్రుని మాటలు, మనుజుం డొగి మత్ప్రతి మార్చనా విడంబనమున మూఢుడై యుచితభక్తిని నన్ను భజింపడేని యమ్మనుజుడు భస్మకుండమున మానక వేల్చిన యట్టివాడగున్"— అనెడి భగవానుని బోధలు ఇందులకు ప్రమాణములు. విష్ణు భక్తిలేని విబుధుండు విబుధుడే పాద యుగముతోడి పశువుగాక'— అనుటయే భాగవత పరమార్థమునై యున్నది.

## భక్తిరసమగునా!

శృంగార వీర కరుణాది రసములలో భక్తికి స్థానము కలదా? అది రసమగునా? లేక భావమా? అది ప్రాచీనాలంకారికులు విశేషముగ చర్చించిరి భగవత్సంబంధమైన రతి వ్యభిచారీ భావములోనే చేరుననియు, అది స్థాయీభావము నందు కొనలేక పోవుట వలన దానికి రసత్వము సిద్ధింపదనియు దశరూపకమున ధనంజయుడు వివరించెను. మమ్మటుడు కావ్యప్రకాశమున—

"రతిర్దేవాది విషయా వ్యభిచారీ తదాంచితః।
భావః ప్రోక్తః"—

(దేవతాది విషయకమైన రతి భావమని చెప్పబడును.)

అని భక్తిని భావముగ మాత్రమే నిర్దేశించినాడు. ఇట్లే హేమచంద్ర, జగన్నాథ పండితరాయ, విశ్వనాథకవిరాజాది ఆలంకారికులు పలువురు భక్తికి రసత్వము నంగీకరింపరైరి. వీరి వాదములను ఖండించుచు భక్తికి రసత్వసిద్ధిని ప్రతిపాదించిన వారిలో ఉజ్జ్వల నీలమణికర్త రూపగోస్వామి, భక్తిరసాయనకర్త మధుసూధన సరస్వతీ ప్రముఖులు ఇంతకును రసమనగానేమి? విభావానుభావసాత్త్విక వ్యభిచారీ భావములచేత పుష్టినంది స్వాదుత్వమును గాంచిన స్థాయీ భావమే రసమని ఆలంకారికుల నిర్వచనము. దీని

(31వ పేజీలో చూడుడు)

# భావాతీతధ్యానం

సృష్టి యొక అద్భుతమైన ప్రక్రియ. విశ్వసృష్టి మరీ అద్భుతమైనది. దృష్టి సారించి నెమ్మదిగా ఈ సర్వచరాచర జగత్తును పరిశీలించినయెడల సృష్టినడకలోని గొప్ప క్రమశిక్షణ మనకాశ్చర్యము గలిగించును. అందువలన అట్టి సృష్టికి కారణభూతమైన శక్తి తప్పక అదృశ్యమైనదిగా యుండవలయును. అది సర్వవ్యాప్తము. అట్లుకాకున్న సృష్టి యింత క్రమముగా నడచుటకు ఆస్కారము లేదు. అట్లైన యెడల అట్టి శక్తి మానవునిలోనూ నిగూఢంగానుండి వుండవలయును. అట్టి అలౌకిక శక్తిని దర్శించినవారు మహర్షులు. అట్టి మహాత్ములు ఈ మానవకోటియందు అక్కడక్కడ కలరు. వారు పరాశక్తి యొక్క ఎరుకకలిగి పరిపూర్ణజీవితమును గడుపుచున్నారు.

విజ్ఞానం వెల్లివిరిసిన ఈ ఆధునిక యుగంలో తగు పరిశోధనలేనిదే జనులు దేనినీ నమ్మలేకున్నారు. అందువలననే వారు తమ తమ గ్రంథములలో నున్న అఖండజ్ఞానసంపదను సరకుగొనక విస్మరించియున్నారు.

ఇట్టి సమయమున మహర్షీ యూరోపియన్ రిసెర్చియూనివర్శిటీ ప్రాచీనజ్ఞానమును వెలుగులోనికి తెచ్చుటకై కంకణం కట్టుకొన్నది. నిష్పాక్షికదృష్టికి గలిగిన శాస్త్రజ్ఞులచ్చట అహర్నిశలు మహర్షి మహేష్‌యోగివారి ఆజ్ఞమేరకు పరిశోధన చేయుచున్నారు. అచట భావాతీతధ్యానము వారి ముఖ్య పరిశోధనావస్తువు.

ప్రపంచములో అనేక ధ్యానపద్ధతులున్నవి. కాని, మహర్షి మహేష్‌యోగిగారి భావాతీతధ్యానం సర్వజనులకు అందుబాటులోనున్న అపూర్వ, అపురూప సృష్టి. ఇది చాలసులభమైన పద్ధతి. మనస్సును నిర్మలముచేసి దేహములోని రుగ్మతను తొలగించి శారీరక ఆరోగ్యమును పెంపొందించును.

ప్రతిరోజు ఉభయ సంధ్యలయందు ఎన్నో లక్షలమంది ఈ ధ్యానపద్ధతిని అవలంభించుచున్నారు. ధ్యానమైన పిమ్మట ఉల్లాసముగా, చురుకుగా తమతమ కార్యక్రమముల కరుగుచున్నారు. వీరిలో విద్యార్థులు, వైద్యులు, వ్యాపారస్తులు, క్రీడాకారులు - యువకులు, ముసలివారు - ధనవంతులు, బీదవారు - వేయేల అన్ని తరగతులవారు అన్నివర్గాలవారును వున్నారు.

వారి అనుభవములను పరిశీలించిన యెడల-జ్ఞాపకశక్తి, సునిశితమేధాసంపత్తి సదవగాహనము, సమయస్ఫూర్తి, సృజనాశక్తి మొదలగు మానసికశక్తులు పెరుగుట నరముల బలహీనత, గుండెజబ్బులు, రక్తపోటు, ఉబ్బసము, నిద్రలేమి మొదలగు రుగ్మతలుదూరమై శారీరక ఆరోగ్యము పెరుగుట మొదలగు విషయములు అవగాహనకు వచ్చును.

పరస్పరసహకారము, స్నేహము,దయ ఓర్పు, క్షమ మొదలగు సంఘజీవనాభివృద్ధిని కలిగించు గుణములు సహజముగ పెరుగుటనుగూర్చి తెలిసికొనగలము.

మహర్షి మహేష్‌యోగిగారు 1959 వ సంవత్సరమునుండి భావాతీతధ్యానపద్ధతిని ప్రచారము చేయుచూ ప్రపంచమంతయు పర్యటించినారు. ప్రస్తుతము పెక్కువిశ్వవిద్యాలయములయందు, కాలేజీలయందు, పాఠశాలలయందు వారి భావాతీతధ్యానము బోధింపబడుచున్నది. ఈజ్ఞానాన్ని ఇంకా సులభముగా సర్వజనుల కందించుటకు వారు దూరదర్శిని కేంద్రాలనునిర్మించుటకు కూడ పథకము తయారుచేసియున్నారు. ప్రపంచమున ధ్యానసాధకులు ఎక్కువగు కొలదియు ఆందోళనలు, యుద్ధములు, బీదరికము, నిరుద్యోగము, కక్షలు, కార్పణ్యాలు, అల్లర్లు, జాతులమధ్య విబేధాలు, కన్నీళ్ళు, ఆర్థికసమస్యలు అన్నియు తొలగి ప్రపంచము శాంతిమయమగునని మహర్షిగారి దృఢనమ్మకము. వారు తమ భావాతీతధ్యాన ప్రచారసంస్థలను రాజకీయాలకు, మతాలకు ఎట్టిసంబంధము లేనిసంస్థగా రూపొందించియున్నారు,

భావాతీతధ్యాన విధానమును గూర్చి ప్రపంచంలోని ఎందరో రాజకీయవాదులు, ఉద్యోగులు, ఆచార్యులు, క్రీడాకారులు బలపరుస్తూ వ్రాస్తున్న లేఖలసంఖ్య రోజు రోజుకూ పెరిగిపోతూ వున్నది.

ఇటీవల అందిన తాజావార్తప్రకారము ప్రపంచంలో 17,000 మంది ధ్యానశిక్షకులు ప్రతినెల 20,000 మందికి తక్షువలేకుండా భావాతీతధ్యానమును నేర్పుచున్నారు. ఇప్పటికి రికార్డుఅయిన ధ్యానసాధకుల సంఖ్య 2½ కోట్లు.

శ్రీ యస్. యం. షరీఫ్
తిరుపతి.

---

మనదేశంలో (Trancendental meditation అనబడే) భావాతీత జ్ఞానాన్ని గూర్చి అంతగా ప్రచారంలోకి రాలేదని అనిపించినా, దాని ప్రపంచంమీద ఆ మార్గ సాధకులసంఖ్య హెచ్చే. ఈ సాధన వల్ల కలిగే ప్రయోజనాలు స్థూలంగా పేర్కొనబడ్డాయి.

॥ సం ॥

# శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, తిరుమల

## వివిధ ఆర్జిత ఉత్సవముల ధరల వివరములు.

### దర్శనములు

1. స్పెషల్ దర్శనము రు. 25

ఈ టికెట్లు తిరుమలలోనూ, దేశంలో ఆంధ్రాబ్యాంకువారి వివిధశాఖలలోను లభించును. ఈ టిక్కెట్టు వారిని సుప్రభాత సమయంలోనూ, సర్వదర్శన సమయంలోను అనుమతించటం జరుగుతుంది. ఈ టిక్కెట్టు వారిని సర్వదర్శన సమయంలో ధ్వజస్తంభమువద్ద గాక మహా ద్వారంవద్ద క్యూలో చేర్చటం జరుగుతుంది.

### సేవలు

| | | |
|---|---|---|
| 1. | ఆమంత్రణోత్సవము | రు. 200 |
| 2. | పూలంగిసేవ | రు. 60 |
| 3. | అభిషేకము (పులికాపుసేవ) | రు. 450 |
| 4. | గంబురగిన్నె | రు. 250 |
| 5 | పునుగుగిన్నె | రు. 100 |
| 6. | జాప్రాగిన్నె | రు. 100 |
| 7. | కస్తూరిగిన్నె | రు. 100 |
| 8. | సహస్రకలశాభిషేకము | రు. 2500 |
| 9. | తిరుప్పావడ | రు. 5000 |
| 10. | కోవిల్ ఆళ్వారు తిరుమంజనం | రు. 1745 |
| 11. | ఐనా మహల్లో డోలోత్సవం | రు. 1000 |

### ఉత్సవములు

| | | |
|---|---|---|
| 1. | వసంతోత్సవము | రు. 2500 |
| 2. | కల్యాణోత్సవము | రు. 1000 |
| 3. | బ్రహ్మోత్సవము | రు 750 |

### వాహనములు

1. సర్వభూపాలవాహనములో వజ్రకవచసేవ 72 + 1 (హారతి) రు. 73
2. బంగారుగరుడ, కల్పవృక్ష, పెద్దశేష, సర్వభూపాల, సూర్యప్రభ ఒక్కొక్కదానికి 62 + 1 (హారతి) రు. 63
3. వెండిగరుడ, చిన్నశేష, చంద్రప్రభ, ఏనుగు, గుఱ్ఱం, హంస, హనుమంత వాహన సేవ ఒక్కొక్కదానికి 32 + 1 (హారతి) రు. 33

### అన్నప్రసాదములు (కొలుసోల)

| | | |
|---|---|---|
| 1 | దధ్యోదనము | 40 |
| 2. | పులిహోర | రు. 50 |
| 3. | పొంగలి | రు. 55 |
| 4. | చక్కెరపొంగలి | రు. 65 |
| 5. | సాకరబాత్ | రు. 95 |
| 6. | కేసరిబాత్ | రు. 85 |
| 7. | పాయసము | రు. 85 |
| 8. | సీరా | రు. 155 |

### పడుల ప్రసాదములు

| | | |
|---|---|---|
| 1. | అప్పము | రు. 230 |
| 2. | లడ్డు | రు. 450 |
| 3. | వడ | రు. 250 |
| 4. | పోళీ | రు. 225 |
| 5. | దోసె | రు. 100 |
| 6. | తేనెతొళ | రు. 200 |
| 7. | సుఖియం | రు. 200 |
| 8. | జిలేబి | రు. 450 |

### నిత్యసేవలు

| | | |
|---|---|---|
| 1. | నిత్యకర్పూర హారతి | రు. 21 |
| 2. | నిత్యనవనీత హారతి | రు. 42 |
| 3. | నిత్య అర్చన | రు. 42 |

సూ :— సహస్ర కలశాభిషేకము ప్రతి బుధవారమునను, తిరుప్పావడ ప్రతి గురువారమునను జరుగును. మిగిలిన వివరములకు ఈక్రింది చిరునామాకు వ్రాయవచ్చును.

1. ఆమంత్రణోత్సవమునకు 5 గురికి మారుగా ఇద్దరికి మాత్రమే అనుమతి,
2. ప్రతిదినం మధ్యాహ్నం 1-00 గం॥ నుండి 3-00 గం॥ లోపల సర్కారు లేదా ఆర్జిత కళ్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, వాహన సేవలు, సర్కార్ డోలోత్సవం (ఉయ్యాల) (సర్కారు లేక ఆర్జిత ప్లవోత్సవం, మంగళవారంనాడు) జరుగుతవి.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,
తిరుమల తిరుపతి దేవస్థానం
తిరుపతి 517501

శ్రీమహర్షి ప్రపంచములోని సమస్యలను, అశాంతిని గమనించి మానవాళికి దుఃఖము నుండి విముక్తి కలిగించుటకు భావాతీతధ్యానమును ఈ ఆధునిక యుగమున కనుగుణముగ మలిచి ప్రచారము చేయుచున్నారు. ఇందు ఆహార, విహార నియమములు ఏమియులేవు. ఇది ఏకాగ్రతలో చేయు ధ్యానపద్ధతి వంటిది కాదు. ప్రతి ఒక్కరికి సరిపోవు పద్ధతి.

ఇప్పుడు మనముంటున్నది యంత్రయుగము. ఈ యుగములో మానవజీవితము యాంత్రికముగా సాగుచున్నది. మనిషికి సరియైన విశ్రాంతిలేదు. అయినా ప్రతిమనిషిలో యంత్రం అరిగిపోతూ వున్నా లెక్కచేయక పరుగెత్తించే పనివాడి పోరాటం కనిపిస్తుంది. జీవితం-పూర్తిగా అరిగిపోయేటంత వరకు కనీసం మరమ్మత్తైనా చేయబడని యంత్రంలాంటిదని పిస్తుంది.

ప్రతిరోజు ఉదయంమొదలుకొని రాత్రి నిద్ర కుపక్రమించునంతవరకు మనిషికి – తనేం చేస్తున్నాడు? ఏం చేయాల్సివుంది? తను ఎటువైపు వెళుతున్నాడు? ఎందుకు వెళుతున్నాడు? ఏది మంచి? ఏది చెడు? ఏది నిజంగా లాభాల్నిస్తుంది? అన్న విషయాల పట్టింపులేదు. అసలు ఆలోచించటానికే వ్యవధిలేదు.

మహాత్ముల అభిప్రాయానుసారము, మనిషి సరియైన జీవితవిధానము లేక యుక్తాయుక్త విచక్షణా జ్ఞానమును కోల్పోయిప్రవర్తించుటవలన తనప్రతిభను సంపూర్ణముగా నుపయోగించు అవకాశము కోల్పోయి అనేకములైన బాధలకు గురియై దుఃఖభాజనుడగును.

మనిషి ఎక్కువ సుఖములను, ఆనందమును కోరుకొనవచ్చును. దానికొరకు ప్రయత్నించవచ్చును. వాంఛలు కలిగియుండుటేమియును తప్పుకాదు. కాని, తనకోరికలను సాధించుటకొరకు. సఫలం చేసికొనుటకొరకు, కొంతశక్తి అవసరము. కొంత సృజనాత్మకత అవసరము, కొంత సమయస్ఫూర్తి అవసరము. వీటన్నింటికి మించి సంపూర్ణమైనప్రతిభ వికసించుటకు మంచిఆరోగ్యము చాల అవసరము.

మనిషికి కలుగు అపరిమితమైన చింత ఓటమి, బాధ్యత, దుఃఖము మొదలగు వాటి ప్రభావమువలన మానసికసంక్షోభము కలిగి నాడీమండలముపై ఒత్తిడి ఎక్కువై పెక్కు శారీరకరోగము లుద్భవించుటకు అవకాశము కలుగును.

ప్రతివ్యక్తికి జీవితములో ఆశలు, ఆశయాలు కలిగియుండుట సహజము. మనిషిలో అణగియున్న కోరికలుసఫలముగుట ప్రారంభించినపుడే అతనిమనస్సుయొక్క తీవ్రతసడలి స్థిరత్వము పెరిగి మానసిక, శారీరకవ్యాధులకు బలియగుట తగ్గును.

మనము శారీరక మానసికసంబంధము దృఢము చేయుటవలన మనస్థిమితమును (Mental Stability) సాధించవచ్చును. స్థిరమైన మనస్సు సాధించలేనిది ఏదియును లేదు.

కాని, మనిషి చిత్తమును సాధారణముగా అతి చంచలమైన వానరముతో పోల్చుట పరిపాటి. అట్టైన దాని వాంచల్యమునాపుట ఎట్లు? దానికి గొప్ప నిగ్రహము, కఠినములైన నియమములు అవసరమా? అని ప్రశ్నించినయెడల తక్షణమే శ్రీమహర్షి "అవసరములేదు, మనస్సు ఒక సింహాసనము కోల్పోయిన రాజాధిరాజువంటిది. అది తనకు సరిపడు సింహాసనముకొరకై వెదకుచూ పరితాపమొందుతున్నది. కాని, తను కోరుకొన్న సింహా

(25 పేజీలో చూడుడు)

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం

నారాయణవనం.

★

నిత్యకార్యక్రమ వివరాలు

| | | | |
|---|---|---|---|
| సుప్రభాతం ఉ॥ | 6-30 నుండి | | 7-00 |
| విశ్వరూపదర్శనం | 7-00 | ,, | 8-30 |
| తోమాలసేవ | 8-30 | ,, | 9-00 |
| కొలువు, అర్చన | 9-00 | ,, | 9-30 |
| శాత్తుమొర & గంట | 9-30 | ,, | 10-00 |
| సర్వదర్శనం | 10-00 | ,, | 11-30 |
| 2-గంట, అష్టోత్తరం (ఏకాంతం) | 11-30 | ,, | 12-00 |
| తీర్మానం | 12-00 | | |
| సర్వదర్శనం సా॥ | 4-00 | ,, | 6-00 |
| తోమాలసేవ, అర్చన (ఏకాంతం) | 6-00 | ,, | 6-30 |
| రాత్రి కైంకర్యం | | | |
| శాత్తుమొర | 6-30 | ,, | 7-00 |
| సర్వదర్శనం | 7-00 | ,, | 8-45 |
| ఏకాంతసేవ | 9-00 | | |

ఆర్జితాదుల వివరాలు

| | | | |
|---|---|---|---|
| అర్చన, అష్టోత్తరం | .... | రు. | 3-00 |
| హారతి | .... | రు. | 1-00 |
| కొబ్బరికాయకు | .... | రు. | 0-50 |
| సహస్రనామార్చన | .... | రు. | 5-00 |
| పూలంగి (గురువారం మాత్రం) | .... | రు. | 1-00 |
| అభిషేకానంతర దర్శనం (శుక్రవారం) | | రు. | 1-00 |
| తిరుచ్చి వాహనోత్సవం (వాహకుల రుసుముకాక) | | రు. | 15-00 |
| సింగమొరై ఖర్చులు | .... | రు. | 2-50 |

# శ్రీ త్యాగరాజ సుప్రభాతమ్



ఈ సుప్రభాతం శ్రీ ముళ్ళంద్రం యం. వి రామనాథ ఘనపాఠి గారిచే రచియింపబడి సంగీత విద్వాన్ శ్రీ యం. బాలమురళీకృష్ణగారిచే (H. M. V) రికార్డు చేయబడి ప్రచురింపబడినది. దానిని అందరి ఉపయోగము కొరకు సప్తగిరి పత్రికలో ప్రచురిస్తున్నాము

## శ్రీ త్యాగరాజ సుప్రభాతమ్

శ్రీమత్ పంచనద క్షేత్రే స్థిరవాసిన్ మహాగురో ।
నాదబ్రహ్మ స్వరూపేణ పరేబ్రహ్మణి లీయసే ॥

తద్రహస్యప్రబోద్ధాత్వం ఉత్తిష్ఠగురుశేఖర ।
సంగీత గాన రసికాన్ త్వముద్ధర్తు మిహార్హసి ॥

నిత్యం త్వయాకృతమతీవ సుశోభనం యత్
శ్రీరామనామ భజనం సకలార్థదంహి ।
సంకీర్తనేన సకలానపి తోషయ త్వమ్
శ్రీ త్యాగరాజ సుగురో తవ సుప్రభాతమ్ ॥

త్వద్రాగ తాళలయ పూరిత కీర్తనాని
భక్తి ప్రపత్తిమిళితాని సుగాయకానామ్ ।
ఇష్టార్థ సిద్ధి వరదాని మనోహరాణి
శ్రీ త్యాగరాజ సుగురో తవ సుప్రభాతమ్ ॥

శ్రీ భారతీ జన మనోరథ గానలక్ష్య
సత్సంప్రదాయ పరిరక్షణ లక్షణజ్ఞ ।
సత్కీర్తనం సులభమార్గ కృతిం ప్రణేతః
శ్రీ త్యాగరాజ సుగురో తవ సుప్రభాతమ్ ॥

త్వత్ కీర్తనే శివమనోః ప్రథమం మకారమ్
నారాయణస్య మనురేఫ ముదీరితం హి ।
తస్మాన్మరా మమరితి ప్రథితస్త్వ యాపి
శ్రీ త్యాగరాజ సుగురోతవ సుప్రభాతమ్ ॥

వాల్మీకినా కృతమితి ప్రథితం చరిత్రం
రామాయణం కలియుగే భవతాకృతం హి ।
శ్రీ రామ భక్తియుత కీర్తన గాన దక్ష
శ్రీ త్యాగరాజ సుగురో తవ సుప్రభాతమ్ ॥

వాల్మీకిరేవ లయగాన విలోలుపోఽద్య
శ్రీత్యాగరాజ గురురిత్యవతార వాంస్త్వమ్ ।
తస్మాత్ భవానపర ఆదికవిర్విభాసి
శ్రీ త్యాగరాజ సుగురో తవ సుప్రభాతమ్ ॥

తాళం కరే భజన సాధన తంబురాదీన్
ధృత్వా ప్రభాతసమయే స్మృతిబోధకస్త్వమ్ ॥
త్వత్కీర్తనామృతరసాత్ సకలాః ప్రబుద్ధాః
శ్రీ త్యాగరాజ సుగురోతవ సుప్రభాతమ్ ॥

రామం సదా హరి హరాత్మక మైక్య బుద్ధ్యా
స్తోత్రం కరోషి తవ కీర్తన లక్ష్య సిద్ధ్యై ।
అద్వైత భావముపదిశ్య గురుర్విభాసి
శ్రీ త్యాగరాజ సుగురో తవ సుప్రభాతమ్ ॥

శ్రీమత్ బుధేంద్ర గిరిరాజ సుతస్య రామ
బ్రహ్మాఖ్య పుణ్యచరితస్య సుపుత్రరాజ ।
శ్రీ రామనామ గుణవైభవ గానలోల
శ్రీ త్యాగరాజ సుగురోతవ సుప్రభాతమ్ ॥

సంగీతగాన రసికాగ్ర శిఖామణిః సన్
తన్నాద కీర్తన ముఖాత్ సకలార్థ భాక్త్వమ్ ।
త్వామేవ నిత్యమనుశంసతి గాన లోకః
శ్రీ త్యాగరాజ సుగురో తవ సుప్రభాతమ్ ॥

శ్రీరామచంద్ర మనుసృత్య జలే నివిష్టం
సంప్రార్థయన్ మమగృహం ప్రవిశేతి భక్త్యా ।
త్వద్భక్తి భావమనుసృత్య గృహాగతో హి
శ్రీ త్యాగరాజ సుగురో తవ సుప్రభాతమ్ ॥

సంగీత శాస్త్ర పరిరక్షణ లక్ష్య దృష్ట్యా
భక్తి ప్రపత్తి కలనాత్ తవ కార్యసిద్ధ్యై
సంగీత గానకృతి కీర్తన కావ్యకర్తా
శ్రీ త్యాగరాజ సుగురో తవసుప్రభాతమ్ ॥

త్వత్ కీర్తనామృతమహో పరమార్థ తత్వం
ఆస్వాదయంశ్చ మనుజాన్ సకలార్థ సిద్ధ్యై
తస్మాత్ యశస్తనుభృతాం గణనేఽగ్రగణ్య
శ్రీ త్యాగరాజ సుగురో తవ సుప్రభాతమ్ ॥

శ్రీ రామచంద్ర భజనామృత గానవృత్తే
శ్రీ జానకీ మృదు పదాంబుజ చిత్తవృత్తే ।
శ్రీ మద్ధనూమదను పాలిత భక్తిచిత్త
శ్రీ త్యాగరాజ సుగురోతవ సుప్రభాతమ్ ॥

శ్రీ వేంకటేశ్వర కవిత్వవరప్రసాదమ్
శ్రీ రామనాథ వరభక్త కవిప్రణీతమ్ ।
శ్రీ త్యాగరాజ సుగురోరిహ సుప్రభాతమ్
నిత్యం పఠంతు మనుజాస్సకలార్థ సిద్ధ్యై ॥

(28 వ పేజీలో చూడుడు)



# ప్రత్యేక సచిత్రానుబంధం

---

శ్రీ వేంకటేశ్వరస్వామిని గూర్చి 32,000 కీర్తనలు వ్రాసి, పదకవితాపితామహ ప్రశస్తి నందిన చరితార్థజీవి శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుల కీర్తన ప్రచార ప్రణాళికలో కొన్ని ముఖ్యకార్యక్రమచిత్రాలు.



## శ్రీ వేంకటేశ్వర అన్నమాచార్య త్యాగరాజ ఉత్సవాలు

★

25-3-79 నుండి 1-4-79 వరకు

★



శ్రీ వేంకటేశ్వర అన్నమాచార్య త్యాగరాజ ఉత్సవాల సందర్భంగా 25-3-79 న శ్రీ వేంకటేశ్వర అన్నమాచార్య తిరుమలాచార్యుల చిత్రఫలకాలను ఊరేగింపుగా అన్నమాచార్య కళామందిరానికి తీసుకు వస్తున్న దృశ్యం.



సర్వశ్రీ కె. శ్రీనివాసులుశెట్టి. డా. రామరాజు, శ్రీప్రసాద్, శాంతప్ప చంద్రశేఖరంనాయుడు, బి. రంగయ్య.

ఎనిమిదిరోజులపాటు జరిగిన ఈ వర్ధంతి, సంగీతోత్సవాల ప్రారంభ సభకు కార్య నిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె ప్రసాద్ స్వాగతం చెప్పారు.

బి. రామరాజు ముఖ్యాతిథిగా పాల్గొన్నారు.

ఈ సభకు అధ్యక్షత వహించిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు డా. యం శాంతప్ప అన్నమాచార్య కీర్తనల 26 వ సంపుటాన్ని ఆవిష్కరించారు.



(శ్రీ ప్రసాద్; శ్రీ శాంతప్ప; ప్రణాళిక ప్రత్యేకాధికారి శ్రీ శ్రీనివాసులుశెట్టి, ధర్మకర్తల మండలి సభ్యులు శ్రీ చంద్రశేఖరంనాయుడు)



ఆనాటిరాత్రి శ్రీ వోలేటి వేంకటేశ్వర్లు గాత్ర కచ్చేరి జరిగింది. తరువాత శ్రీ డి. పశుపతి పాటకచ్చేరి జరిగింది.



26-3-79 నాటి సభకు శ్రీ కె. యం కృష్ణమూర్తి అధ్యక్షత వహించారు. అన్నమాచార్యకీర్తనల పరిష్కరణ విభాగ ప్రత్యేకాధికారి శ్రీ జి. రామసుబ్బశర్మ ప్రసంగించారు.



నాటిసాయంత్రం శ్రీ కె. మల్లిక్, ఆయన బృందం సంగీతకచ్చేరి.



శ్రీ మంచాల జగన్నాథరావు వీణకచ్చేరి జరిగింది.



27-3-79న హిందూధర్మప్రతిష్ఠానం కార్యదర్శి శ్రీ అర్క సోమయాజి అధ్యక్షతన జరిగిన సాహిత్యసదస్సులో శ్రీ యల్లంరాజు శ్రీనివాసరావు ప్రసంగించారు. అన్నమాచార్యకీర్తనల ప్రసారకార్యక్రమ ప్రత్యేకాధికారి శ్రీ కె శ్రీనివాసులు శెట్టినికూడ చూడవచ్చు (ఎడమచివర) ఆ సాయంకాలం శ్రీ యస్. ఆర్. జానకిరామన్, శ్రీ నూకల చినసత్యనారాయణ గార్ల గాత్రకచ్చేరీలు జరిగాయి.



28-3-79 న శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధిపతి డా. జి. యన్. రెడ్డి (కుడిచివర) అధ్యక్షతవహించినసభలో సరస్వతీపుత్ర శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్య ప్రసంగించారు.



తిరుమల తిరుపతి దేవస్థాన ఆస్థాన విద్వాన్ శ్రీ టి. యన్. కృష్ణన్, కుమారి విజి కృష్ణన్‌ల జంట వాయులీన కచ్చేరి.

దేవస్థాన ఆస్థాన నాగస్వర విద్వాంసులు శ్రీనామగిరిపేట్టై కృష్ణన్ బృందం నాగస్వర కచ్చేరి.



29-3-79 న

శ్రీ జి. శివశంకరరావు, అధ్యక్షతన జరిగిన సాహిత్య సభలో శ్రీ వి.యస్. వెంకట నారాయణ ప్రసంగించారు. కుడిచివర సంగీతకళాశాలాధ్యక్షులు శ్రీ డి. పశుపతి.



దేవస్థాన ఆస్థాన విద్వాన్ శ్రీమతి యం. యస్. సుబ్బులక్ష్మి బృందం పాట కచ్చేరి. ఆ తరువాత గాయకశిఖామణి శ్రీ యం. యస్. బాలసుబ్రహ్మణ్యం గాత్రకచ్చేరి జరిగాయి.



30-3-79 న

కేంద్రీయ సంస్కృతవిద్యాపీఠం అధ్యక్షులు శ్రీ యం. డి. బాలసుబ్రహ్మణ్యంఅధ్యక్షతన జరిగిన సాహిత్యసభలో శ్రీ యస్. సచ్చిదానందం ప్రసంగించారు.





గానకళాప్రపూర్ణ డా. యస్. పినాకపాణి గాత్ర సంగీతం. ఆ తరువాత మహా మహోపాధ్యాయ ఈమని శంకరశాస్త్రి వీణకచ్చేరి జరిగాయి.



31-3-79 న డా. శంకరనారాయణన్ అధ్యక్షతన డా. సుబ్బారెడ్డి ప్రసంగించారు (పేజి నెం. 34)

దేవస్థాన ఆస్థాన విద్వాంసురాలు శ్రీమతి యం. యల్. వసంతకుమారి పాటకచ్చేరి.



సంగీత శిరోమణి శ్రీమతి మణికృష్ణస్వామి కచ్చేరి.



1-4-79 న శ్రీ యం. బలరామరెడ్డి అధ్యక్షతన డా. యన్. సర్వోత్తమన్ ప్రసంగించారు. మధురగాయని కుమారి శ్రీరంగం గోపాలరత్నం గాత్రసంగీతం. ఆ తరువాత ఎం డి. రామనాధన్ గాత్ర కచ్చేరిలతో కార్యక్రమాలు జయప్రదంగా గడిచాయి.

## తాళ్ళపాకగ్రామ దత్తుస్వీకారం
**4-5-79**

పదకవితాపితామహుడు అన్నమాచార్యులు జనించిన తాళ్ళపాకగ్రామాన్ని దత్తతతీసుకున్నది. దాన్ని ఆంధ్రతిరువారూరుగా చేయాలని దేవస్థాన సంకల్పం.





ఆ గ్రామంలోని శ్రీ కేశవస్వామి ఆలయం వద్ద దేవస్థాన కార్యనిర్వహణాధికారి, శ్రీ ప్రసాద్ దంపతులు, ధర్మకర్తల మండలి సభ్యులు శ్రీ చంద్రశేఖరం నాయుడు ప్రభృతులు.



ఆనాడు సాయంకాలం జరిగిన సభా కార్యక్రమంలో దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్ దత్తుస్వీకారం ఆశయం వివరించారు.



దేవస్థాన ధర్మకర్తలమండలి సభ్యులు. శ్రీ జి. చంద్రశేఖరంనాయుడు ప్రసంగించారు.

కార్యక్రమం చివరగా దేవస్థాన శ్రీ వేంకటేశ్వర సంగీతనృత్యకళాశాల అధ్యక్షులు శ్రీ డి. పశుపతి గాత్రకచ్చేరి జరిగింది.





సుభద్రాపరిణయం అనే నృత్యనాటకం కూడా ప్రదర్శింపబడింది.

(15 వ పేజీ తరువాయి)
సనము లభించిన వెంటనే తన పరుగులు మాని తృప్తిగా కూర్చుండును" అని అంటారు. ఇదియే భావాతీత ధ్యానములో సాధకునకు అనుభవంలోవచ్చు విషయం.

భావాతీతధ్యానంతో ఏమి జరుగును?

సాధకుడు ధ్యానములో కూర్చునప్పుడు గొప్ప నిశ్చలస్థితిని అనుభవించును. ఆ స్థితిలో శారీరక మానసిక తీవ్రతలు సడలి ప్రశాంతత కలుగును. మనస్సు సూక్ష్మమగుకొలది ఉచ్ఛ్వాస నిశ్వాసములు నెమ్మదియగును. ఇందులో ప్రయత్నమావంతయునులేదు. ఇది చాల సహజ ణామము. గుండె, ఊపిరితిత్తులకు పని తగ్గి విశ్రాంతిని పొందును. శరీరములో ఎన్నో రసాయనిక మార్పులుకూడ జరుగును. ముఖ్యముగా ఆమ్లప్రమాణముతగ్గి క్షారప్రమాణము వృద్ధియగును. క్షారప్రమాణము ఎక్కువగనుండుట శరీరమునకు ఆరోగ్యకరమని శాస్త్రజ్ఞుల అభిప్రాయము. ధ్యానము పూర్తియైన పిమ్మట సాధకునకు అధికమైన ఉత్సాహము, ఆనందము అనుభవములోనికి వచ్చును. తన కార్యకలాపములు చురుకుగా చేసుకొనగల శక్తి లభించును.

భావాతీతధ్యానమును క్రమముగా సాధన చేయువారికి వయస్సుమీరినను వృద్ధాప్యపు లక్షణములు కన్పించవు. ఎల్లప్పుడు నిత్యయవ్వనమును అనుభవించవచ్చును. ఆనందముగ జీవింపవచ్చును.

మహర్షిగారు చెప్పినట్లు వాస్తవమునకు మనిషి బాధలననుభవింపవలసిన పనిలేదు. నిండుగానీరువున్న తటాకములోని చేప దప్పిగొనవలసిన పనిఏమి? తాను చేయవలసినదంతయు నోరుతెరచి త్రాగుటయే కదా! అదే విధముగ మనిషి తన శక్తులను తాను తెలుసుకుని ఉపయోగించటమే చేయవలసినది.

భావాతీతధ్యానము వలన ముఖ్యముగ మానసిక స్థిరత్వమెక్కువగును. మనస్సు స్థిరమగుట వలన ఆలోచనలు క్రమమైన రీతిలో సాగును. ఎంతటికలత కలిగించు స్థితిలోనైనను మనిషి సరియైన స్థితిలో నడవగలడు. ఎంతో ఎక్కువ శ్రమతో చేయవలసిన పనిని చాలసులభముగ చేయగలుగు సామర్థ్యము లభించును.

శాస్త్రపరిశోధనలు-ప్రయోజనములు :

మహర్షి యూరోపియన్ రిసెర్చి యూనివర్శిటి ఇప్పటికి 30 పరిశోధనలను జరిపినది, అచ్చట ఇంకనూ అనేక పరిశోధనలు జరుగుచున్నవి. ప్రస్తుతము రెండు ముఖ్యపరిశోధనాపత్రములను సంగ్రహములను సంగ్రహరూపములో పరిశీలింతము.

1. సంపూర్ణ విశ్రాంతిస్థితితో మెలకువ:

మనిషి సాధారణముగ మూడు స్థితులను అనుభవించుచుండును. అవి 1. జాగ్రదవస్థ, 2. నిద్రావస్థ, 3. సుషుప్త్యవస్థ. కాని, భావాతీతధ్యానమునందు నాల్గవదైన తురీయావస్థను అనుభవింపవచ్చును. ఈ యవస్థయందు మనిషి భావాలకతీతంగా వెళ్ళును. శరీరము గొప్ప విశ్రాంతిస్థితిని అనుభవించును. శుద్ధచేతనం మాత్రం సంపూర్ణంగా మెలకువ గలిగియుండును.

2. స్థిరత్వపు పెరుగుదల

ధ్యానమువలన నాడీమండలము స్థిరపడుటవలన విద్యుత్క్రియకు తక్కువ చర్మప్రతిస్పందనలు కలిగినవి. ధ్యానము పూర్తిఅయిన పిమ్మటకూడ ఈ స్థిరత నిలచివుండినది. తక్కువ ప్రతిస్పందన ఎక్కువ స్థిరత్వమును సూచించును. పరిస్థితులవొత్తిడి. మానసికవ్యాధులు మరియు శరీరపునడకలో అస్థిరతతగ్గి పనిలో సమర్థత ఎక్కువగుట మొదలగునవి ఈరీతిగా నాడీమండలము పనిచేయుటవలన సాధ్యమగును.

జై గురుదేవ్.

★



వసంతోత్సవంలో శ్రీవారికి దేవేరులకు అభిషేకోత్సవం

# ప్రత్యేక దర్శనం టిక్కెట్లు

శ్రీవారి దర్శనపు రూ. **25/-** ప్రత్యేక దర్శనపు టిక్కెట్లు ఆంధ్రాబ్యాంకువారి ఈ క్రింది శాఖలలో లభిస్తవి.

## — ఆంధ్రప్రదేశ్ —

**అనంతపురంజిల్లా**
- అనంతపూర్

**కడపజిల్లా**
- కడప
- ప్రొద్దుటూరు

**పశ్చిమ గోదావరిజిల్లా**
- ఏలూరు
- భీమవరం
- తణుకు

**తూర్పుగోదావరిజిల్లా**
- రాజమండ్రి
- కాకినాడ (మెయిన్)
- రామారావుపేట (కాకినాడ)

**నెల్లూరుజిల్లా**
- నెల్లూరు

**ప్రకాశంజిల్లా**
- ఒంగోలు
- చీరాల

**చిత్తూరుజిల్లా**
- చిత్తూరు
- తిరుపతి (మెయిన్)
- బాలాజీనగర్ (తిరుపతి)
- హుజూర్ ఆఫీసు అనుబంధ కౌంటరు (తిరుపతి)
- కాళహస్తి

**విశాఖపట్నంజిల్లా**
- విశాఖపట్నం (మెయిన్)
- మహారాణిపేట (విశాఖపట్టణం)
- విజయనగరం

**కరీంనగర్ జిల్లా**
- కరీంనగర్

**కర్నూల్ జిల్లా**
- కర్నూలు

**ఖమ్మంజిల్లా**
- భద్రాచలం
- ఖమ్మం

**క్రిష్ణాజిల్లా**
- విజయవాడ (మెయిన్)
- గాంధీనగర్ (విజయవాడ)
- గవర్నర్ పేట (విజయవాడ)
- మచిలీపట్నం

**గుంటూరుజిల్లా**
- గుంటూరు (మెయిన్)
- బ్రాడీపేట (గుంటూరు)
- తెనాలి

**హైదరాబాదుజిల్లా**
- హైదరాబాదు (మెయిన్)
- హిమయత్ నగర్
- చిక్కడపల్లి
- ఖైరతాబాదు
- విజయనగర్ కాలని
- సికింద్రాబాదు
- మారేడ్ పల్లి

**వరంగల్ జిల్లా**
- వరంగల్

**మెదక్ జిల్లా**
- సిద్దిపేట

**మహబూబ్ నగర్ జిల్లా**
- మహబూబ్ నగర్

**నల్గొండజిల్లా**
- నల్గొండ

**నిజామాబాద్ జిల్లా**
- నిజామాబాద్

**అదిలాబాద్ జిల్లా**
- అదిలాబాద్

## — రాష్ట్రేతర ఆంధ్రాబ్యాంకు శాఖలు. —

- పాట్నా
- టాటానగర్
- అహ్మదాబాద్
- బరోడా
- సూరత్
- బెంగుళూర్ (ఎస్.ఆర్. రోడ్)
- రామ్ రాజ్ పేట (బెంగళూర్)
- బళ్ళారి
- గంగావతి
- రాయచూరు
- హోసపేట
- త్రివేండ్రం
- ఎర్నాకులం (కొచ్చిన్)
- భోపాల్
- జైపూర్
- జబల్ పూర్
- బొంబాయి (మెయిన్)
- చెంబూరు (బొంబాయి)
- మాతుంగ (బొంబాయి)
- నాగపూర్
- భువనేశ్వర్
- బర్హంపూర్
- రాయగడ
- పూరి
- రూర్కేలా
- మద్రాసు (మెయిన్)
- మైలాపూర్
- టి. నగర్
- షెనాయ్ నగర్
- కోయంబత్తూర్
- మధురై
- సేలం
- తిరుపూర్
- కలకత్తా
- బాలిగంజ్ (కలకత్తా)
- ఖరగ్ పూర్
- దుర్గాపూర్
- చండీఘర్
- కన్నాట్ సర్కస్ (న్యూఢిల్లీ)
- కరోల్ బాగ్ (న్యూఢిల్లీ)
- రామకృష్ణాపురం (న్యూఢిల్లీ)
- లక్నో
- అలహాబాద్
- వారణాశి
- లూధియానా

# వేదాంత దేశికులు

(గత సంచిక తరువాయి)

ఈ విధముగా ఇది యంతయు చేయుచుండుట ఈ ప్రయోజనమునకేగాని వేరు కాదు. ఇదే అభిప్రాయమును స్వముద్దిశ్య లోకవత్తు లీలా కైవల్యం' అను బ్రహ్మసూత్రమును "మోదతే భగవాన్ భూతైః బాలః క్రీడనకైరివ" అను వాక్యమును సమర్థించుచున్నవి - అని వేదాంతదేశికులు నిరూపించియున్నారు.

పరమాత్ముడు, తన ప్రయోజనమునకై ప్రయోజనమే ముఖ్యమైయున్నట్లే, తనచే ఏర్పాటు చేయబడిన చిదచిత్తులను స్వీకరించి, దానిచే తాను అతిశయానందము పొందుచే శేషి అను దానికి అభిప్రాయము. సర్వేశ్వరుడు శేషి తాను శేషుడు అను భావముతో, ఈ చేతనుడు తన విషయమందున్న అభిప్రాయానుగుణముగా తాను వాంఛించు పురుషార్థముల వ్యవస్థయందు తన స్వరూపమునకనురూపమైన ఫలప్రాప్తిలో అభిరుచి కలిగియుండును. శేష శేషి జ్ఞానము ఎప్పుడు ఉత్పన్నమగునో అప్పుడు సర్వేశ్వరుని కైంకర్యములో జీవునికి స్వతః అభిరుచి పుట్టుచున్నది. దీని జతకు స్వామి శేషి తాను శేషుడు అను భావముతో, స్వామి నియామకుడు, తాను నియామ్యుడు (నియమింపబడును)అను భావముతో, తన స్వరూపమునకు యోగ్యమైన పురుషార్థమును పొందుటలో స్వామియే నిర్హేతుకమైన సిద్ధోపాయము అను విశేష తత్త్వజ్ఞానము ఫలంచుచున్నది

జగత్తుయొక్క ప్రవర్తన నుంతయు లోకదంపతులైన శ్రీలక్ష్మీ నారాయణుల ప్రయోజనమున కని ఎప్పుడు తెలియునో, అప్పటి సర్వ జీవాత్ములయొక్క ఐహిక భోగమునకును, ఆముష్మిక ఫలప్రాప్తి కనివారే ఉపాయభూతులై యుండుటగాక ఉపేయ భూతులు కూడ నగుచున్నారు. ఇట్లేర్పడ ఉపాయోపేయత్వములు రెండును స్వరూపతా స్వాభావికమై యుండుచేగాని, ఔపాధికములు గాని లేక అతిశయమును కలుగజేయు గుణములుగాని కావు. కాని జీవుడు కర్మవాసనాదికముచే పాపమునే చేయునప్పుడు, అట్టి వానికిని ఉపాయోపేయమెట్లు? అనగా

ఉపకారిషు యస్సాధుః సాధుత్వే తస్యకో గుణః
అపకారిషు యస్సాధుః ససాధురితి కథ్యతే॥

ఉపకారియెడ ఎవడు సాధువో అతని సాధుత్వమందు విశేషము గానరాదు. అపకారు లందు ఎవడు సాధువై యుండునో అతడే సరియైన సాధువు. ఇట్లు పరమాత్ముడు, పాపి అపకారయైన జీవునికి ఏదో ఒక వ్యాజమున అట్టి వానికిని,ఉపాయోపేయుడై యుండును. అనగా, పరమాత్ముడు సర్వమును శరీరముగాధరించి అంతకును ఆత్మయై, ముక్తులచే పరిచర్యను గ్రహించి, ఎల్లరికిని ముక్తినిచ్చును. జీవాత్ములందరికిని, పరతత్త్వము.

గుణాః ప్రధానం పురుషః పరం పదం
పరత్వం బ్రహ్మచ తే విభూతయః॥

(విభూతయః = నియంతవ్యాః శేష భూతశ్చ)మఱియు, పితాత్వం మాతాత్వం దయిత తనయ స్త్వం ప్రియ సుహృత్

త్వమేవ త్వం మిత్రం గురురసి గతిశ్చాసి జగతాం
త్వదీయ స్త్వద్భృత్య స్తవపరిజన స్త్వద్గతిరహం
ప్రపన్నా శ్చైవం సత్యహమపి తవైవాస్మిహి భరః॥

గుణములు, ప్రకృతి, పురుషుడు, పరమపదము, ముక్తాత్మ స్వరూపము ఇవి అన్నియు నీ నియంత్రణమునకు చేరినవి. తండ్రియునీవే, తల్లియునీవే. ప్రియుడైన పుత్రుడుప్రియస్నేహితుడునీవే.సామాన్యమిత్రుడు, జగద్గురువు నీవేఅయి ఉన్నావు. నీవాడనైన నేనును. నీ భృత్యుడను, పరిజనమును నీవే గతియైయున్న వాడును అగుదునుగదా! అందుచే ప్రపన్నుడనైయున్న నా ఆత్మను కూడ నీయందే సమర్పించుచున్నాను.

ఈ మొదలైన యామున మునుల శ్లోకములు శేష శేషి భావమునుచక్కగా వ్యక్తపఱచు చున్నవి. సర్వేశ్వరుడు తనకు శేషి తాను శేషుడు అను జీవుడు తెలియుట చేతనే, సర్వేశ్వరుడు తనకు స్వామి తాను వానికి దాసుడు అను భావన పుట్టుచున్నది. శేషుడు అనునది చేతనా చేతనములు రెంటికిని సామాన్యధర్మము. తాను శేషుడు అనునది ఎప్పుడు తెలియునో అప్పుడు ఆ ధర్మమే దాసత్వమను విశేషధర్మము అగుచున్నది. ఇట్లు సామాన్యభావమైన శేష శేషి భావమును విశేష భావమైన స్వామిత్వ దాసత్వ భావమును నారాయణ శబ్దము నందు కానవచ్చును.

చరాజ్జాతాని తత్వాని నారాయణేతి తతోవిదుః
తాన్యేవచాయనంతస్య తేననారాయణఃస్మృతః॥
ఆపో నారా ఇతి ప్రోక్తాః ఆపోవై నరసూనవః
ఆయనం తస్య తాః పూర్వం తేవ నారాయణః స్మృతఃమనుస్మృతి

శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి,
అలిఘర్

నరునినుండి పుట్టిన తత్త్వములన్నియు నారములని చెప్పబడు చున్నవి. వానినే స్థానముగా ఎవడు పొంది యున్నాడో ఆతడే నారాయణుడని చెప్పబడును. (ఇది బహువ్రీహి సమాసముచే ఉత్పన్నమైన శబ్దముయొక్క వ్యుత్పత్తి) నరుని నుండి జనించినజలములకు నారా అని పేరు. అవియే మొదట అతనికి స్థానమే యుండుచేతనుకూడ నారాయణుడగు చున్నాడు. (ఇక్కడ కూడ మొదట వలెనే శబ్ద వ్యుత్పత్తి) నారశబ్ద సూత్రమందు మాత్రము వ్యత్యాసము.

చేతనా చేతనము లన్నియు నరశబ్ద వాచ్యమైనటువంటియు, లేనట్టియు భగవంతునికి సంబంధించినవై వానికి ఆధారుడను వానినే అంతర్యామిత్వముచే ఆశ్రయించి స్వాధీనము చేసికొని యుండుటచే శేష శేషి భావము శబ్దము చేతను, స్వామిత్వ దాసత్వ భావములు అర్థము చేతను, తోతెంచు చున్నవి అని ఆచార్యులవారు నిరూపించి యున్నారు.

ఈ స్వామిత్వ దాసత్వములు ఇరువురికిని, మూడుపురుషార్థ రూపమైన ప్రయోజనములను కలుగజేయు చున్నవి అని వేదాంతదేశికుల పరిష్కారము. సామాన్య శేష భావముతో చేతనుడు చేయునట్టి కర్తవ్యరూపమైన అల్ప స్వల్ప కార్యములు దాసత్వమై యున్న విశేష భావముచే స్వామికి చేయు కైంకర్య రూపమైన పురుషార్థ మగుచున్నవి. అట్లే శేషుడైన చేతనుని కించత్కార్యముచే శేషియైన సర్వేశ్వరుడు తాను ఆ దాసుడైన చేతనునికి స్వామి అను భావముతో సర్వేశ్వరునికిని పురుషార్థమై పరిణమించు చున్నది. ఈ విధముగా శేష శేషి భావము ఎప్పుడు ఇరువురి చేతను తెలియబడు చున్నదో, అప్పుడు జ్ఞాయమాన శేషత్వము దాసత్వమును జ్ఞాయమాన శేషిత్వమును, స్వామిత్వమును అయినది. జీవునికి తన కైంకర్యము పరమ లాభకరమైయుండి యున్నట్లే పరమ పురుషునికి కూడ స్వామియై తాను కైంకర్యమును స్వీకరించుటచే పుట్టిన అతిశయమే పరమ ప్రయోజనమగును.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వమదర్పణం ॥

అను గీతా వాక్యముచే ఈ అర్థమే వ్యక్తమగుచున్నది.

ఓ అర్జునా! నీవు ఏ పనిని చేయుదువో దేనిని భుజింప అపేక్షింతువో, హోమ దానాదులను చేయుదువో తపస్సు చేయుదువో అది యంతయు నాకే అగును. అని తెలిసి నా యందు సమర్పించి కృతకృత్యుడవు కమ్ము. (సశేషము)

(16వ పేజీ తరువాయి)

## స్తోత్రం

కమలాలయ జన్మ పునీత తనో
కలి కల్మష నాశన భక్తియుత ।
కవి కర్మణి కీర్తన గానకర
భువి సర్వజనస్యహిత ప్రబల ॥
లయతాళ దురూహ రహస్య విద
భజనామృత సార విలీనమతే ।
భవతాప విమోచక గాన గురో
రఘురామ పదాంచిత కావ్యకర ॥
సకలాగమ సార కృతిప్రచుర
స్వరరాగ నవీన వితాన ధుర ।
సరళం తవ కావ్య మమోఘఫలం
దిశతీతి సమస్త బుధైర్విదితమ్ ॥
అవతార విశేష ఇతి ప్రథితం
కవితా జనమానస తత్వవిభుమ్ ।
అనఘం విమలం సుజనం సుగుణం
సతతం సుగురుం తమహం శరణమ్ ॥
జనకాది మహామతి నిశ్చలధీః
పరతత్వ విచారవతాంవ-సుధీః ।
స్వర రాగ మహార్ణవ లబ్ధ ధనీ
కరతాళ సుతంబురువాద్య ధునీ ॥
విదితః స్వర సప్తసనాదగురో
కవిమానసహంస సురాజగురో ।
తవరామ సనాథ కవిప్రియహే
ముదితః స్తుతి మాదృతవాన్ భవమే ॥
(సశేషము)

(11వ పుట తరువాయి)
మున నాగులస్తుతించు సందర్భమున "....
..... మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్"
అనుమకుటము లు వాడెను.

కుమార సంభవమున, నన్నెచోడుడు, దారిద్ర్యవిద్రావణ స్తోత్ర సందర్భమున "దారిద్ర్యవిద్రావణా" యను మకుటమును వాడెను. ఇది నవకముకంటె తొమ్మిది పద్యముల స్తోత్రం నన్నయ, నన్నెచోడుల కావ్యము లందుగల పై రెండు స్తోత్రములు తెలుఁగు శతకములకు బీజప్రాయము లనక తప్పదు.

ప్రథమాంధ్ర శతక కర్తమల్లిఖార్జున పండితుఁడు ఇతఁడు క్రీ. శ. 1160-70 ప్రాంతమువాడని కొందరి భావన. మల్లికార్జున పండితుఁడు, అన్నమయ్య, పాల్కురికి సోమనలు తెలుగున శతక ప్రక్రియను సర్వాంగ శోభిత మొనర్చిరి. వృషాధిపశతకము, సర్వేశ్వర శతకము సంపూర్ణలక్షణ శోభితములగు శతకములు వీరు ముగ్గురు తెలుఁగు శతక కవిత్రయముగ పేరొందిరి. మల్లిఖార్జునుని శివతత్త్వసారము, సోమనవృషాధిపశతకము అన్నమయ్య సర్వేశ్వర శతకము భక్తి రసాత్మకములు. శ్రీనాథుని యుగమున వెన్నెలకంటి జిన్నముడు పోతన, శరభాంకుఁడు, త్రిపురాంతకుఁడు, అన్నమాచార్యుఁడు, సదానందుఁడు పేర్కొనదగిన శతకకర్తలు. ఈ యుగమున వైష్ణవభక్తి శతకములు నాటి మత పరిస్థితుల కనుగుణముగ వెలువడినది. వెన్నెల కంటి జిన్నమకృత దేవకీనందన శతకము కృష్ణభక్తి ప్రపుల్లితము. పోతన నారాయణ శతకము హరిభక్తిని వెల్లడించును. అన్నమాచార్యుల వేంకటేశ్వర శతకము భక్తి శృంగారాత్మకము. క్షేత్రదేవుని మాహాత్మ్య మిందుగ్గడింపబడినది. అయ్యలరాజు త్రిపురాంతకుని "ఒంటిమిట్ట రఘువీర శతకము" వీరవైష్ణవాభిమానమును వ్యక్తపఱుచును. సదానందయోగి శతకము తత్త్వప్రధానము. ఆంధ్రభాషలో శతకములు పదునొండవ శతాబ్దినుండి నేటివఱకు (అనగా దరిదాపు ఎనిమిది శతాబ్దుల కాలమున) పరిపూర్ణ వికాసముతో పుంఖానుపుంఖములుగ వెలువడుచున్న ననుటలో నతిశయోక్తిలేదు. ఇందు భక్తి, నీతి శృంగార, వైరాగ్య, అధిక్షేప, తత్త్వ, చారిత్రక, కథాత్మక, శాస్త్ర సంకలిత ప్రహేళిక, వస్తుక, అనువాద, మొదలగు విధములఁ శతకములు వెలువడినవి ఇందు అనేక ఉపశాఖలు కూడ కననగును. భక్తి శతకములందు సగుణ, నిర్గుణ, శైవ, వైష్ణవభక్తి శతకములు కలవు. కొన్ని క్షేత్ర మాహాత్మ్యము నగ్గడించునవి కూడ కలవు. ఈ రీతిగా భక్తిశతకములుయనేకయుపశాఖలై కవికి చిత్తసంస్కారమును వెలువరచుచున్నవి.

భగవంతుని గూర్చి హృదయమున నేర్పడిన ప్రేమరూపవిశిష్టభావమే భక్తి యననగును. పలుక నేర్చిన మానవునివలె కవికూడ భక్తిపారవశ్యమున స్తుతిసంకీర్తనముల నాశ్రయించెను. అటుల బహిర్గతమైన కవితయే శతక వాఙ్మయము. పారమార్థిక దృష్టితో చూచిన భక్తియొక్క రూపమే. అయినను లౌకిక వ్యవహారము నందలి పదునొకండు విధములని పరిగ్రిహీతమైనది - గుణమాహాత్మ్యాసక్తి - రూపాసక్తి - పూజాసక్తి - ఆత్మనివేదనాసక్తి స్మరణాసక్తి - దాస్యాసక్తి - సఖ్యాసక్తి - వాత్సల్యాసక్తి - కాంతాసక్తి - తన్మయతాసక్తి - పరమవిరహాసక్తి - యిత్యాది ఏకాదశవిధ భక్తి రూపకములు. అందు కాయిక - వాచిక - మానసికములను నవి భక్తి దశలు. తెలుగున హరిహర స్తుతి పూర్వక మైనశతకములసంఖ్య బహుళము. నలువ పూజార్హుఁడుకాడని కొన్ని పురాణగాథలుకలవు. అందును ఆఁయ విగ్రహ పూజలు బహ్మకులేవని చెప్పుదురు. కాని కవులు కావ్యములందు సృష్టికర్తయగు బ్రహ్మను సందరోచితమున వర్ణించిరి. బొన్నలగడ్డ శారదాంబ గారి 'శారదా పతిశతకము' బ్రహ్మను గూర్చి వెల్వడిన యొకేయొక శతకమనకతప్పదు.

మల్లిఖార్జున పండితుని శివతత్త్వ సారము, అన్నమయ్య సర్వేశ్వరశతకము పాల్కురికి సోమన వృషాధిప శతకము మొదలగునవి శివభక్తి ప్రధానమగు శతకములు. శివకవులు దేశకాల పరిస్థితుల కనుగుణముగ శివభక్తి ప్రబోధితమగు గ్రంథములను వెలువరించిరి. శతక కవిత్రయము నాదర్శముగ గ్రహించి అనంతర కవులు పెక్కు శతకముల రచించిరి. అవియే కాళహస్తీశ్వర, రాజశేఖర, ముక్తీశ్వర, మల్లిఖార్జున వీరభద్ర, సిద్ధేశ్వర, మృత్యుంజయ, భీమేశ్వర మొదలగు శతకములు. (సశేషం)

షోలింగర్ — కొండ జలపాతం — ఫోటో: వి. యస్. శ్రీనివాసన్



# శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము తిరుమల

1-3-79 నుండి

నిత్యపూజ, దర్శనాదికముల కార్యక్రమము

### శని, ఆది, సోమ మరియు మంగళవారములు

ఉదయము 3-00 నుండి 3-30 వరకు సుప్రభాతము
,, 3-30 నుండి 3-45 వరకు శుద్ధి
,, 3-45 నుండి 4-30 వరకు తోమాలసేవ
, 4-30 నుండి 4-45 వరకు బంగారు వాకిలివద్ద కొలువు; పంచాంగ శ్రవణం,
,, 4-45 నుండి 5-30 వరకు మొదటి అర్చన
,, 5-30 నుండి 6-00 వరకు మొదటిఘంట బలి మరియు శాత్తుమొర
, 6-00 నుండి మ 12-00 వరకు సర్వదర్శనము
మధ్యాహ్నం 12-00 నుండి 1-00 వరకు రెండవఅర్చన,(ఏకాంతం)
,, 1-00 నుండి 8-00 వరకు సర్వదర్శనం
రాత్రి 8-00 నుండి 9-00 వరకు శుద్ధి, రాత్రికైంకర్యము
,, 9-00 నుండి 12-00 వరకు సర్వదర్శనం
,, 12-00 నుండి 12-30 శుద్ధి

12-30 ఏకాంతసేవ

### గురువారము

### తిరుప్పావడ

ఉదయము 3-00 నుండి 3-30 వరకు సుప్రభాతం
,, 3-30 నుండి 3-45 వరకు శుద్ధి
,, 3-45 నుండి 4-30 వరకు తోమాలసేవ.
,, 4-30 నుండి 4-45 వరకు బంగారువాకిలివద్ద కొలువు మరియు పంచాంగ శ్రవణము
,, 4-45 నుండి 5-30 వరకు మొదటి అర్చన,
,, 5-30 నుండి 6-00 వరకు మొదటిఘంట, బలి శాత్తుమొర
,, 6-00 నుండి 8-00 వరకు సళ్ళింపు, 2 వ అర్చన (ఏకాంతం), తిరుప్పావడ, అలంకరణం, ఘంట ఇత్యాది
,, 8-00 నుండి రాత్రి 8-00 వరకు సర్వదర్శనం
సాయంకాలం 8-00 నుండి 10-00 { వరకు శుద్ధి ఇత్యాది / పూలంగి సమర్పణ / రాత్రి కైంకర్యము, ఘంట }
రాత్రి 10-00 నుండి 12-00 వరకు పూలంగిసేవ
,, 12-00 నుండి 12-30 వరకు శుద్ధి
,, 12-45 ఏకాంతసేవ

### బుధవారము

### సహస్రకలశాభిషేకం

ఉదయం 3-00 నుండి 3-30 వరకు సుప్రభాతము
,, 3-30 నుండి 3-45 వరకు శుద్ధి
,, 3-45 నుండి 4-30 వరకు తోమాలసేవ
,, 4-30 నుండి 4-45 వరకు బంగారువాకిలివద్ద కొలువు పంచాంగశ్రవణం
,, 4-45 నుండి 5-30 మొదటి అర్చన
,, 5-30 నుండి 6-00 మొదటిఘంట, బలి, శాత్తుమొర
,, 6-00 నుండి 8-00 సహస్ర కలశాభిషేకము
,, 8-00 రాత్రి 8-00 వరకు సర్వదర్శనం
రాత్రి 8-00 నుండి 9-00 వరకు శుద్ధి ఇత్యాది
,, 9-00 నుండి 12-00 వరకు సర్వదర్శనం
,, 12-00 నుండి 12-30 వరకు శుద్ధి
రాత్రి 12-30 ఏకాంతసేవ

### శుక్రవారము

### అభిషేకము

ఉద॥ 3-00 నుండి 3-30 వరకు సుప్రభాతము
,, 3-30 నుండి 5-00 వరకు సళ్లింపు మరియు నిత్యకట్ల కైంకర్యములు (ఏకాంతము)
,, 5-00 నుండి 7-00 వరకు అభిషేకము
,, 7-00 నుండి 8-30 వరకు సమర్పణము
,, 8-30 నుండి 9-30 వరకు తోమాలసేవ మరియు అర్చన (ప్రత్యేకం) ఘంట, బలి, మరియుశాత్తుమొర
,, 9-30 నుండి 10-00 వరకు రెండవ గంట, బలి, శాత్తుమొర
10-00 నుండి రాత్రి 8-00 వరకు సర్వదర్శనం
రాత్రి 8-00 నుండి 9-00 వరకు శుద్ధి రాత్రి కైంకర్యము
రాత్రి 9-00 నుండి 12-00 సర్వదర్శనం
,, 12-00 నుండి 12-30 వరకు శుద్ధి
12-30 ఏకాంతసేవ

గమనిక ;– 1) పైకార్య క్రమములో సమయాను కూలముగాను ప్రత్యేక కార్యక్రమముల వలనను మార్పులు చేయబడవచ్చును. 2) సుప్రభాత దర్శనమునకు రు. 25/– టిక్కెట్టువారు మాత్రమే అనుమతింపబడుదురు. 3) రు 25/– టిక్కెట్లు తిరుమలలోనూ దేశంలో ఆంధ్రాబ్యాంకువారి వివిధ కేంద్రములలోనూ లభించును. 4) సేవానంతరపు టిక్కెట్లు రద్దుచేయటమైనది. 5) ప్రత్యేక దర్శనం టిక్కెట్లు గలవారు లోగడవలె ధ్వజస్తంభమువద్దగాక మహాద్వారము క్యూలో చేర్చబడుదురు. 6) రు. 200/– ఆమంత్రణోత్సవం టిక్కెటు పై ఇద్దరు మాత్రమే సుమతింపబడుదురు. 7) అర్చన, తోమాలసేవ, ఏకాంతసేవలలో దర్శనాంతరపు టిక్కెట్లుగాని రు. 25/ టిక్కెట్లుగాని అమ్మబడవు. పేష్కార్ ; శ్రీవారి ఆలయం, తిరుమల

(12వ పేజీ తరువాయి)
చూడగా భక్తి రసమునకు భగవంతు డాలంబన విభావము. తులసీ చందనాదులు, పరమేశ్వరుని అద్భుత చరిత్రములు ఉద్దీపనములు ఆ సందర్భమున నుద్భవించు నయనఆశ్రుభావి శేషేపాదులు అను భావములు. నిర్వేదశంకాదులు వ్యభిచారీ భావములు ఈ విభావానుభావ వ్యభిచారీ భావముల చేత స్థాయిత్వము నొందిన భక్తుని యే కాగ్ర చిత్తవృత్తియే స్థాయీ భావము ఆనంద స్వరూపమగు రసమపుడే జన్మించును అని భక్తికి రసత్వమును కల్పించిన మధుసూదన సరస్వతీ మున్నగు వారి వాదమే సమంజసమని యొప్పుకొనక తప్పదు ఇది భాగవతమున ప్రహ్లాదుని యందు పరిపుష్టమైనట్లు కాంచగలము.

## భక్తి భేదములు

తామస రాజస సాత్త్విక భేదములచే భక్తి మూడు విధములని భాగవతము నందలి కపిల దేవహూతీ సంవాదము లక్షణయుక్తముగ నిట్లు వివరించుచున్నది.

తామసభక్తి యెట్టిదనగా —

ఎ) "సతత హింసాతిదంభ మాత్సర్యరూప
తమములను జేయుచును భేదదర్శియగుచు
పరగ నా యందు కావించు భక్తి తలప
తామసంబనదగు వాడు తామసుండు.
(భాగ–3–944)

రాజస భక్తి లక్షణమిది —

బి) "ఘన విషయ ప్రావీణ్యము
లను సుమహైశ్వర్య యశములకుపూజాద్య
ర్చన నెనసి వరించుట
చను రాజసయోగమనగ సౌజన్యనిధీ" –
(భాగ–3–945)

సాత్త్విక భక్తి స్వరూప మిట్లున్నది—

సి) "అనుపమ పాపకర్మ పరిహారముకై భజనీయుడైన శో
భన చరితుం డితండనుచు భావమునం దలపోసి భక్తిచే
ననితర యోగ్యతన్ భగవదర్పణ బుద్ధి నొనర్చి కర్మముల్
జనహితకారియై నెగడ సాత్త్విక యోగ మనంగ నొప్పడున్"
(భాగ–3–946)

వీని య దుత్తరోత్తరము శ్రేష్ఠములని యార్యులమాట.

భాగవతమున నీ విధముగ మూడు భేదములని పేర్కొనబడిన భక్తి తిరిగి తొమ్మిదివిధములుగ నిట్లు విభజింపబడినది

"తను హృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనమున్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనముల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబు దైత్యోత్తమా" —
(భాగ–7–167)

ఈ నవవిధ భక్తికి చారిత్రకముగ విద్యారత్న శ్రీ నిడుదవోలు వెంకట రావుగారిట్లూహ జేసిరి." 'నవ' అనగా నూతనమని యర్థమున్నది. చారిత్రకముగ ఈ నవభక్తి విధానము నూతనమే. ఏలననగా భక్తిని ఈ విధముగ తొమ్మిది భేదములుగ విభజించిన మొదటి గ్రంథము భాగవతమే. అందువల్లనే భాగవతము భక్తి సిద్ధాంతమునకు పరమ ప్రమాణ గ్రంథమైనది" — ఈ యూహయెంతయు నుక్తి యుక్తముగ నున్నది.

నవవిధ భక్తి మార్గములలో "శ్రవణము వలన పరీక్షిత్తు, కీర్తనముచే శుక మహర్షి, స్మరణముచేత ప్రహ్లాదుడు పాద భజనమున లక్ష్మి, పూజనముచేత పృథు చక్రవర్తి, అభివందనముచేత అక్రూరుడు, దాస్యము వలన ఆంజనేయుడు, సఖ్యము చేత అర్జునుడు, ఆత్మనివేదనముచేత బలి దానవుడు ప్రకాశించిరి. వీరికి మోక్షమే గతి" - అను నీ భావమును తెల్పు క్రింది శ్లోకము బహుళ ప్రచారము నందున్నది

"విష్ణోః శ్రవణే పరీక్షిదభవ, ద్వైయాసకిః కీర్తనే।
ప్రహ్లాదః స్మరణే, తదంఘ్రి భజనే లక్ష్మీః పృథుః పూజనే।
అక్రూర స్త్వభినందనే. కపిపతిర్దాస్యేచ, సఖ్యేఽర్జునః।
సర్వస్వాత్మ నివేదనే బలిరభూత్ కైవల్య మేషాంగతిః।" —

---

# రచయితలకు చిత్రకారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రికకు మత ధార్మిక సంబంధమైన రచనలు, వ్యాసములు, గేయములు, చిత్రములు, ఛాయా (వర్ణ) చిత్రములు పత్రికలో ప్రచురణకు గాను కోర బడుచున్నవి. రచయితలు, చిత్రకారులు ఈ క్రింది విషయములు గమనించవలెను.

*

1. రచనలు చేయువారు 6 అరఠావు పేజీలకు మించకుండా, పేజీలకు ఒక వైపుననే వ్రాసి పంపవలెను. వాటికి సంబంధించిన ఛాయా చిత్రములను కూడ పంపగోరెదము.

*

2. చిత్రములు వేయువారు ఇండియన్ ఇంకుతో వేసి పంపవలెను.

*

3. ఛాయాచిత్రములుపంపువారు చిత్రములలోని వివరములు నిర్దుష్టంగా వ్రాసిపంపవలెను.

*

4. ప్రచురితమైనవాటికి ఉచితరీతిన పారితోషిక మీయబడును.

— సంపాదకుడు,
సప్తగిరి



తిరుమలలో 25-3-79 న నూతన తంతితపాలా భవనానికి శంఖుస్థాపన జరిగింది.

*

తిరుపతిలో 26-3-79 న తంతితపాలా విభాగంవారి టెలెక్స్‌కు ప్రారంభోత్సవం, సంచార భవన్ శంఖుస్థాపన జరిగింది. ఈ సందర్భంలో పాల్గొన్న దేవస్థానకార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, కేంద్రతంతితపాలా కార్యదర్శిశ్రీ దవె, పోస్ట్‌మాస్టర్ జనరల్ శ్రీపాల్‌రాజన్ లను చూడవచ్చు.



భక్తియోగమునను సాధించుటకు నిరహంకారము, ఋజుత్వము ఆధ్యాత్మిక విషయశ్రవణము ధైర్యము, వైరాగ్యము, శమము, నియమము, నామ సంకీర్తనము, బుధసేవ, సత్కామము అహింస, సమస్త ప్రాణుల యందీశ్వర భావము, మనోనిగ్రహము. మున్నగు సద్గుణములు ప్రధానములు వీనిచేత మనసు నిష్కళంకమై పరమేశ్వరాభిముఖ మగును. ప్రహ్లాద నారద పుండరీకాది పరమ భాగవతోత్తము లందఱిట్టి యుత్కృష్టగుణములకు నిలయులై పరమేశ్వర సాన్నిధ్యము నందిరి.

భాగవతమున శక్తివంతమైన భాగము శ్రీకృష్ణుని చరిత్రము. తత్త్వవేత్తలెందరో యీ భాగమునకు వ్యాఖ్యానములు రచించిరి. "కృష్ణ జీవితమును సంశరించుటలో భాగవతము ఉత్తమ మానవుని దివ్యునిగా చేయటమేగాదు. దివ్యుని మానవునిగా సమకూర్చినది అత్యుత్తమ స్థాయిలో శైశవ బాల్య కౌమార యౌవనాద్యవస్థలు, కుమారునిగా, క్రీడాసక్తునిగా, ప్రియునిగా, వీరునిగా, దుష్టశిక్షకునిగా వైదిక దేవతల యందు సౌమ్యునిగా రాజతంత్రజ్ఞునిగా, సాంఘిక మత ప్రవర్తకునిగా ఇత్యాది వృత్తములను శ్రీకృష్ణ చరిత్రము ప్రదర్శించినది" (ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్రము I) అని భాగవతమును గూర్చి A. K. బెనర్జీగారన్న యీ మాట లెంతయు నిజము. ఇందు శ్రీకృష్ణుని జీవితము ప్రధాన స్థాన మాక్రమించినను పరీక్షిత్తు, ధ్రువుడు, భీష్ముడు, కుంతి, కుచేలుడు, అర్జునుడు, ఉద్ధవుడు, అక్రూరుడు, అంబరీషుడు, రంతిదేవుడు, ప్రహ్లాదుడు, గజేంద్రుడు, గోపికలు, మున్నగు పరమ భాగవతుల గాథలు కూడ ప్రకృష్టముగ ప్రశంసింపబడినవి. వీరందరును భక్తి భావమున పరమేశ్వరు నారాధించి తరించిన వారే. వీరి భక్తి విశేషములను, తన్మూలమున తెలియనగు సందేశమును దిఙ్మాత్రముగ తిలకింతము. —

(సశేషము)

(7వ పేజీ తరువాయి)

ఉ॥ వచ్చెడుమౌనిఁ జూచి హిమవంతుఁడు దా నెదురేఁగి స్వాగతం-
బిచ్చి కృతాఽర్ఘ్యపాద్యముల నెద్ద నిగుర్వఁగఁజేసి ప్రశ్రయం-
బచ్చుపడంగ దివ్యవనితాభరణంబగు మేనతోడ న-
త్యుచ్చశిరంబు వంచి నిగమోదితరీతి నమస్కరించినన్; ౩౨౭

ఆ॥ వారివెన్క నిలిచి మారుకోదండమ్ము-
వంటిమేను వంచి పర్వతేంద్ర-
తనయ పుచ్చడీకతన మొక్కయందమై
ముద్దువుట్టుభంగి మ్రొక్కుటయును. ౩౨౮

ఆ॥ మాఱుమ్రొక్కి కనులఁ దోరమై యానంద-
జలములొలుక మేనఁ బులకలొదవ-
ననియె దేవమౌని యభ్యర్థితుం డతి-
మేలు వచ్చెనుమ్మ శైలరాజ। ౩౨౯

సీ॥ ఎవరనుకొంటి వీయింద్రనీలచ్ఛవి
కరువుఁగఁబోసినకమలనయన
దక్షయజ్ఞమ్ములోఁ దనువుదొఱంగిన
పరమపతివ్రతాప్రథమగణ్య
దాక్షాయణీదేవి తరుణేందుధరుకొమ్మ
న్యాసంబుగానున్న యట్టిదుహిత
మృదున కొప్పింపఁగ తడసేయవచ్చునే
వేగిరంపడుమని విప్పిచెప్పి

ఆ॥ నారదుండు వోయె నారాయణామృత-
స్రావిమహతిగీతఝురులఁ దడిసి
శైలకటకశుష్కసాలంబు లెల్లెడ
వింతలొలుకఁ బల్లవించి పూచి, ౩౩౦

(సశేషము)

---

(5వ పేజీ తరువాయి)

ప్రార్థించెను. ఈ సంఘటన శివాజీకి స్త్రీలపైఁగల భక్తి గౌరవములను వెల్లడించుచున్నది.

ఆ సందర్భమున శివాజీనోట వెలువడిన భారత స్త్రీజాతి మాహాత్మ్య ప్రశంసను గమనింపుడు.

హరిహరబ్రహ్మలఁ బురిటిబిడ్డలఁ జేసి
జోలఁబాడిన పురంధ్రీలలామ
యమధర్మరాజు పాశముఁద్రుంచి యదలించి
పతిభిక్షగొన్న పావన చరిత్ర
ధగ ధగద్దహన మధ్యను పూలరాసిగా
విహరించియున్న సాధ్వీమతల్లి
పతిమిత్రము సూర్యభగవాను నుదయంబు
నరికట్టి నిలుపు పుణ్యములపంట

అట్టి యెందరో భారతాంబ యాడుబిడ్డ
ల మలపతి దేవతాత్వ భాగ్యములలోసి
పుట్టినిలు మెట్టినిలుఁ జెందు పుణ్యసతులు
గలరు భారతావని భాగ్య కల్పలతలు

హిందూదేశమున హిందువులని జెప్పు కొనుచు జీవించు వారిలో నెంతమంది హిందూమతాచారములను యాచరణలో నిడి నడచువారు? కేవల బ్రాహ్మణులకే గాక సార్వత్రిక హిందూజనమునకు మత ప్రవక్తలు బోధించిన యాచారము లివి.

1, ఉదయమున దైవస్తుతిలో మేల్కొని గోవునకు నమస్కరించుట.

2. బ్రాహ్మణుడైనవాడు ప్రాతఃకాలోచిత కార్యములనుదీర్చి సంధ్యనాచరించి యనంతరము కర్మసాక్షికి (సూర్యునకు) "ఓం నమో సూర్యనారాయణాయ నమః" అని యుదకమును తులసితోటయందు వదలట.

3. హిందువైనవాడు నొసటకుంకుమ బొట్టు విభూతి దాల్చుట.

4. హిందూజాతి యందు జన్మించిన వనిత నొసట పెద్దకుంకుమ బొట్టు, చేతి నిండుగ గాజులుదాల్చి, గోసేవ, తులసీ వనమున దీపారాధనచేయుట.

హిందూమతప్రచారము బాగుగా వృద్ధి లోనికి రావలెనన్న బాలురు ముఖ్యులు కారు. వారినికన్న తల్లిదండ్రులు, వారికి నుదయము నుండి సాయంత్రము వరకు విద్యను బోధించు నుపాధ్యాయుల కర్తవ్య మిది. నేడు ఏ విద్యార్థిని జూచినను నేటి ప్రజలలో మతమనేనేమో, జాతి యన నేమో వానిని గూర్చి శ్రద్ధవహించి తెలుసుకొనుట సన్నగిల్లినది. వాని కర్థములే మరచిపోయిరి. హిందూ జన సందోహమిట్లు వక్రమార్గము పట్టుచుండ దీనికి (హిందూమతము) వ్యతిరిక్తముగా క్రైస్తవమతము మనదేశమున నీవిధముగా వ్యాప్తిచెందుటకు ప్రబలతార్ణాణము. దాని జన్మస్థానమునుండి మనదేశమునకు వలన వచ్చి దానిని మనదేశమున వ్యాప్తిలోనికి దేవలయునని యా మతస్థులహోరాత్రులు కృషిజేయుటయే. నేఁడు కొందఱు హిందూమతమునుండి క్రైస్తవమతమున బ్రవేశించుచుండ, క్రైస్తవమతమువారు మన మతమునఁజేరుట చూడగా మన మతోత్కృష్టత వెల్లడి యగుచున్నది. ఎవరెన్ని పాట్లు పడినను యే మతమెంత విజృంభించినను హిందూమత వట వృక్షమునుకూలదోయఁబోరు. ఎవరెన్నిజాతులు

సృష్టించిన, ఎవరెన్ని నవ్యమార్గములోఁ దమ మతవ్యాప్తిఁ జేయవలెనని జూచినను నవియన్నియు నిష్ఫలములే. 'దుష్టశిక్షణ, శిష్టరక్షణ' యన్న నార్యోక్తి ప్రకారముగా నా జగదధిపతి యే సమయమున యే కృత్యము దగునో దానినే జేయును. త్రేతాయుగమున నున్న శ్రీరాముడు, ద్వాపరమందున్న గోపాలుడు, నీ యుగమునయున్న శ్రీనివాసుడు, క్రీస్తుమతము నెలకొల్పిన యేసు, మహమ్మదీయ మత దైవమైన అల్లా వీరందఱు లోకమున తెలియజేయు నీతిమార్గమొక్కటే. అల్లా, ఏసు, రాముఁడు, వీరిలో నెవ్వరు 'శిష్టరక్షణ' యని గాని, 'దుష్టశిక్షణ' యని గాని నుడువలేదు. సర్వదేవతలు, సర్వ మతంబులు బోధించు నీతిమార్గమొక్కటే. చిన్నయేర్లెన్నైన వానినుండి ప్రవహించు నీరు కడకు జేరుస్థానము సముద్రమే. దేవతలెందరైన కేశవుఁడొకడే. ఇదియే మంత్రములుగూడ బోధించుచున్నవి.

"ఆకాశాత్పతితం తోయం యథాగచ్ఛతి
సాగరమ్
సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి"

పూర్వకాలమున వృద్ధాంగనలు తమ తమ మతములపై వ్రాసినపాటలు తమలో తాము పోటీకి పాడుచుండిరి. నేడు స్త్రీలకు పాటయనిన కేవలము సినిమా పాటయే. మనవారలకు శుభాశుభ కార్యములకు నదియే నిలయమైనది.

అన్యథాశరణం నాస్తి త్వమేవ శరణం మమ' యన్నట్లు మనవారికి ప్రాణము, కవచము శరణము మున్నగునవన్నియు సినిమా పాటయే యిచ్చుచున్నది. ఇది వారి ప్రత్యేకత, ఇది మనహిందూస్త్రీలలో నున్న మతాభిమానము, మతాభివృద్ధి. వారమున కొకసారి క్రీస్తుమతస్తులు వారి దేవాలయమునకు వెళ్ళి దైవప్రార్థన జేసికొందురు. ముఖ్యమైన పండుగ రోజులలో ముస్లిములు వారి మసీదులకువెళ్ళి యచట 'నమాజ్' చేసికొందురు, వారం గాదు గదా! నెలకాదుగదా! ముఖ్యమైన పండుగ రోజులలోనైతము గాదుగదా! జన్మించిన నాటినుండి గిట్టువరకు దేవాంగణములలో నడుగిడని ప్రబుద్ధులు మనమతమున జన్మించి యున్నారు. వారు మత ప్రచారము చేయరు. సరిగదా ఇతరులు మత ప్రచారముచేయుచున్న నవహేళనము చేయుట వారిప్రత్యేకక్రీడ. "అమ్మపెట్టదు అడుగుకోనీయదు" అను సామెత వారియందు నిజమనుట తథ్యము. ఎవరేమన్న నేమి? మనహిందూజాతి యొక మందార పుష్పము లాంటిది. సర్వోత్కృష్టమైనది. ప్రతి మానవుఁడు తుమ్మెదయై యా జాతి పుష్ప మకరందమును గ్రోలవలెననుట సహజము. భారతమాత సర్వమంగళప్రదాయిని. సర్వకళాస్వరూపిణి. ఆ మాతదీవెనతో హిందూజాతి యింకను మూడుపూవు లారుకాయలు కాయునని పెద్దల నమ్మకము.

ఇటీవల అన్నమాచార్య వర్ధంతి కార్యక్రమాలలో 31–3–79న సాహిత్య సదస్సుకు అధ్యక్షత వహించి ప్రసంగిస్తున్న డా॥ శంకరనారాయణ, నాటివక్త డా॥ సుబ్బారెడ్డి.



ఆచారములు :— 'ఆచారము ననాచారము నంతయు నొక్కటే. ఇదియంతయు మనము కల్పించుకొనిన బూటకమని కొందఱున్నారు. మరి చిన్నవారు కాదు. వారగ్రజాతివారే. హైందవజాతియందు జనించిన వ్యక్తులు, స్త్రీలు యాచరించవలసిన యాచారములు వదలివేసిన నింకెక్కడి యాచారములు? ఆచారవంతుల మతస్థులమని చెప్పుకొనుచు ననాచారులతో తిరుగుట వారితోటి వారి యభిమాన తినుబండారవస్తువులు (మాంసాదులు) తినుట నాగరికతపేరుతో వారితో కలిసి త్రాగుట, స్త్రీలోలత్వము మొదలగునవి నేటి యభివృద్ధి నాగరికతలు. ఇది తప్పని చేయెత్తి చూపువారికి శ్రీకృష్ణజన్మస్థాన ఫలప్రాప్తియే నేటి యత్యంతాభివృద్ధి నాగరికత లక్షణము.

హిందూమత ప్రచారములో మిక్కిలి యెన్నఁదగినవారు స్వామి వివేకానంద. ఆయన ఇతరదేశములకు వెళ్ళి యచట నొకసభలో ఉపన్యసించుటకు యైదు నిమిషములు గడువు సాధించెనట. పిమ్మట యైదునిమిషము లైదుగంటలుగా మారిపోయినది. మొదట భారతీయుఁడు అనాగరికుడని, చదువురానివాడని యనుకొను

నాంగ్లేయులకు మన హిందూధర్మయాచార లక్ష్యములనుగూర్చి అనర్గళముగ నుపన్యసించి వారిని ముగ్ధులుగాఁ జేసినవాడు స్వామి వివేకానంద. అతని యుపన్యాసము నాలకించిన తదనంతరమే వారికి మన మతముపై నభిమానము కలిగి యెందరో ఇతరదేశీయులు మనమతాచారము అవలంబించిరి.

అనిబిసెంటు జన్మించిన దితరదేశమైనను మనదేశముపై నభిమానము మనయాచారములపై మిక్కిలి భక్తిచూపి యీ దేశమునకువచ్చి యామె హిందూ మతప్రచారకురాలుగా నిలిచి యిచటనే దేశాభివృద్ధికికావలసిన ముఖ్యదోహదకారులైన విద్యాలయములు స్థాపించి వానియందు భగవద్గీతపఠనము జేయునటుల ప్రతివిద్యార్థిని శాసించి యశస్సుగడించిన పుణ్యాత్మురాలు. కొందరు పెద్దలు భాషాధికారులు మన మతగ్రంథములుగా వాసికెక్కిన భారత భాగవత రామాయణములను నాంగ్లమున ననువదింప వానిని వారిదేశములకు దగురీతి చేసికొని చదివి ముగ్ధులై మన హిందూమతాభిమానముతో లోకమున హిందూమతవ్యాప్తికై పాటుపడిన వారున్నారు. హిందూమతాచారములను మన వారు పాటింపకున్నను వారు తు.చ. తప్పకుండ పాటించుచు వారికిష్టమైన దేవతల యాలయములు (కృష్ణ, శ్రీవేంకటేశ్వర) వారి దేశములందు నిర్మించుకొనిరి. ఇది ఇతరదేశస్థులకు మనమతముపై మనజాతి పైనున్న యభిమానమునకు తార్కాణము.

హిందూమతమువారు ఆచారమునకెట్టి యభిమానము జూపినారో భక్తికి అంతకంటే ప్రాధాన్యతనిచ్చిరి. భక్తిలోమునిగి కొందరు జీవితములే మరచిరి. మరి కొందరు సంసారములే వీడిరి. మఱి కొందరు భర్తలనేవీడిన స్త్రీలును కలరు. భక్తిలో పూర్తిగామునిగి భర్తలను వీడిన గోపికలు ముఖ్యులు. పిమ్మట మీరా యెన్నఁదగినది. ఆమె శ్రీకృష్ణుఁడే తన సర్వస్వమని నమ్మి చిన్ననాటి నుండి యతనితో మాటలాడి పాటలు పాడి యతనిలో చివరకు కలసిమెలసి జీవించిన పుణ్యాత్మురాలు. ఆమె యొకసారి బృందావనమునకు వెళ్ళినదట. అట్టి సమయములో మీరాకంటే ముందు శ్రీరూప గోపస్వామి యను మునీశ్వరుఁడు బృందావనమునకు జేరి తానచట నున్నంతకాలము స్త్రీలనచటఁ బ్రవేశింప జేయకుఁడని తన శిష్యులకు నాజ్ఞాపించెనట. అంత నా శిష్యులు నావిధముగ నాచరించుచుండ మీరా యచటజేరి బృందావనమున ప్రవేశించుచుండ నిలునిలుమని యాటంకపరచినారట. అప్పుడు యామె యెందులకని ప్రశ్నింప నాతని శిష్యులు నామెతో "తల్లీ నీవు స్త్రీవి. బృందావనములో ప్రవేశింప వలనుపడదని మా గురువుగారి యాజ్ఞ యనిరి". ఆమె వారితో మీ గురువెవరని ప్రశ్నింప 'హిమాలయములలో తపస్సు చేసి మహత్వములు సంపాదించిన మహాఋషి శ్రీశ్రీ రూపగోపస్వామి' మా గురువు యనిబదులిచ్చిరట. అప్పుడామె 'అటులనా అయినచో నీపాట వినిపింపుడని' యీపాట పాడినది:

పురుషుదెవ్వండిచట
పురుషుడాతనికంటె పురుషోత్తముండు
పురుషుడాతడొకండె
పొలతులము మనమంత
దివ్యపురుషుని ప్రేమ
తేజః ప్రదీప్తులము
పురుషుదెవ్వండిచట

నాథు పాదాలపై
నాబ్రతుకు పువునంతు
పూజ గైకోవేర
పొలతులను బ్రోవరా!
పురుషుదెవ్వండిచట.

మీర పైపాట పాడగా దానిని వారు వారి గురువునకు వినిపింప నాతఁడు విర్విణ్ణుడై యర్థముగ్రహించి 'యేది నాతల్లి' యని పరువునవచ్చి యామెను శరణువేడి తల్లీ! సత్యసూత్రము నా కనుగ్రహించి నా గురువైనావు. మూర్ఖుడను. క్షమింపుము. స్త్రీలు మోక్షభంగము చేయువారు. ప్రకృతి స్వరూపిణులు యనుకొని వీరిని చూచిన పురుషుని హృదయము మోసపడిపోయి దగ్ధమగునని తప్పుదారిని పడితినని.

పైమీరారూపగోస్వాములగాథ విన్నచో మీరా తనభక్తిచే నితరుల నెంతసూక్ష్మముగా మార్చగలిగినదో మనకు వ్యక్తమగుచున్నది.

నేడు విశ్వహిందూపరిషత్‌లో వారు మతము, ఆచారము, భక్తి యను మూడింటికిని ప్రాధాన్యత నిచ్చుచున్నారు. ఆ పరిషత్తువారు పెద్దలచేత వారి పరిషత్తున్న ప్రదేశములందు నుపన్యాసము లిప్పించుచున్నారు. నేడు మతవ్యాప్తికై వారు భక్త్యాచారములను నిశ్చలమైన మనసుతోడ నెవడైనను జేయవచ్చును. దానికి తరతమ భేదములు లేవు యనుచు మాలవాడలయందు రామాలయములు, భజన మందిరములు పెక్కుస్థలములందు నెలకొల్పనిశ్చయించి యొకప్రణాళిక తయారు జేయుచున్నారు. కొంతధనమును చందాల ద్వారా, దేవస్థానములు కొంతయిచ్చుట ద్వారా వారీ ప్రణాళికఁ జేపట్టుచున్నారు. ఆ ప్రణాళికా కార్యక్రమములుగూడ త్వరితముగా కార్యరూపముఁ దాల్చగలవు.

భక్తికి ప్రాధాన్యతనిచ్చిన సంఘములు పెక్కులు గలవు. భక్తులు కొందఱు తమ భక్తికి నిలయమైన స్థానము నొకటి నెలకొల్పవలసిన దనుకొనుచు నాగ్రామసమీపమున దయాళుబాగ్‌నందు భక్తిసమాజము

నేర్పరచుకొని యచట వారి నమ్మికప్రకారముగా నొకదేవాలయము నిర్మించుకొనిరి దయాళబాగు సత్సంగులకు మక్కా. ఇచట వారి సద్గురుమహారాజు నివసించుచుందురు. వారైదవ గురువైన 'సామెజ్జీ' మహారాజువారు నాల్గవగురువుగారి కాలములో నీ భక్త్యాశ్రమము నెలకొల్పబడి ప్రారంభింపఁబడినది. నేడు సర్వతోముఖాభివృద్ధినంది విజృంభించుచున్నది. సత్సంగమతము ముఖ్యముగా మూడువిషయములు బోధించుచున్నది. మతము, సంఘము, పారిశ్రామిక విషయములు పరమాత్మశబ్దస్వరూపమై యున్నదని వారి యాశయము. ఆ శబ్దస్వరూపమే 'రాధాస్వామి'. అ శబ్దమైనను మనముచ్చరింపజాలని, మనము వినజాలని, అతీంద్రియ శక్తికే గోచరించునట. రాధాస్వామి దయాళునకు రూపములేదు. ఆయన శబ్దమంతయు మూఁడు భాగములుగా నీ విశ్వమంతయు విభజింపఁబడినది. అవి పిండాండము. బ్రహ్మాండము, శుద్ధచైతన్యము. పిండాండము భౌతికసంబంధమైనది. బ్రహ్మాండము మనస్సంబంధమైనది. ఈ మూడు విభాగములందరకు తెలియును. బ్రహ్మాండము ప్రథమమున జ్ఞానచక్ర భ్రూమధ్యమున నుండును. అందుండి యాత్మ ధారాసహానము, జ్యోతిన్నారాయణము, సున్న, మహాసున్నవంశనాళాలకు బోవునట. ఆపై శుద్ధచైతన్యం. అందు ప్రథమము, భ్రమరగుహ. దానిపై సత్యలోకము, అగమ అలక లోకము లన్నిటికన్న పై రాధాస్వామి దయాళని కృపవలన సులభముగ పిండాండము, బ్రహ్మాండము దాటి శుద్ధచైతన్యము జేరు యోగమార్గము సద్గురువు దెలిపెనట. మనము రాధాస్వామి పాదముల నమ్మియుండి శబ్దములు పాడుచు యోగమాచరించుచు సంతులతో సత్సంగమాచరించుచు విశుద్ధజీవనము చేయుచుండినచో వివిధోపలోకములను దాటుచుబోయి అంతి సద్గురువారి ధామము చేరుదుము. ఇది దయాళబాగు సద్గురుమహారాజు బోధించు ఆధ్యాత్మిక తత్త్వము.

ఇంక వారి రెండవసంస్కరణం ఏమతం వారైన సత్సంగులు కావచ్చును వారికి జాతి మత వర్ణవివక్షతలుండరాదు. భోజన ప్రతిభోజనములకు వర్ణములడ్డురావు. యువవివాహములు చేయవలెను. బాల్యవివాహములు పనికిరావు. అర్థములేని యీనాటి యాచారములన్నియు త్రోసివేసి శుభ్రతయే యీ జాతులకు ముఖ్యమని వారి ముఖ్యసూత్రముగా బరిగణింపవలయును.

ఎప్పుడు జాతిమతవర్ణవివక్షతలుండవో కలిమిలేములుండవు. సంఘమంతయు సంఘముకొరకు బాటుపడవలయును. ఆస్థియంతయు సంఘముది. సంపాదనంతయు సంఘముదే. కావున సంఘమే వ్యక్తుల కుటుంబములు పోషించును. ఈసూత్రము నాచరించుటకై దయాళబాగులో వస్త్రములు, ఊటకలములు, కత్తులు, గ్రామఫోనులు, రంగులు, సీసాలు, గరిటెలు, గడియారములు, పెన్న, దోళ్లు, పెట్టెలు మొదలగునన్నిరకముల పాశ్చాత్యదేశములతో సమానముగా తయారుచేయుచున్నారు. ఏదేశమునకు కావలసిన వస్తువులాదేశమే చేసికొనవలెనను ధర్మమును దయాళబాగువారు మనకట్టెదుటకనబరచుచున్నారు. ఈ విధముగా భక్తులుకొందఱు తమకు నచ్చినవిధముగా సంఘములు స్థాపించుకొనుట, వారి రాగద్వేషాలకు విముక్తిమార్గమని వారియాశయము. ఎవరే మార్గము ననుసరించినను కడకు స్థానమొక్కటే. ఆ స్థానముచేరుటకు కొందఱు భక్తి యను మార్గముద్వారా త్వరలో భగవంతునిలో చేరుకొందురు. మఱి కొందఱు రక్తిలోపడి రాగములకు నిలయులై ప్రకృతి రూపవిశేషములను కనక చెడిపోవుదురు. ఏ సంఘమెంత లక్ష్యములతో నిల్చినను ఆ సంఘమందు నున్న మొట్టమొదటి లక్ష్యములతో నిల్చినను ఆ సంఘమందునున్న మొట్టమొదటి లక్ష్యము భక్తియే. భక్తి ముక్తికి సోపానమని పెద్దల నానుడిగదా!

※



సర్వమంగళ
చిత్రం : సి. కె. గోవిందరావు, తిరుపతి.

# ఈ మాసం మీ అదృష్టం!

## మేషం
(అశ్విని, భరణి, కృత్తిక 1వ పా)

రాహువువలన ఆందోళన. శనివలన వివాదాలు, ధననష్టం లేదా కుమారులు, కుమార్తెలనుండి వేర్పాటు. గురువువలన బంధువులమూలంగా బాధలు. కుజునివలన 17వ తేదీ వరకు ఆందోళన తరువాత ఉద్యోగ సంబంధమైన లేదా వివాదాల మూలంగా లేదా అనారోగ్య కారణంగా లేదా ఇంటిలో దొంగతనానికి సంబంధించిన ఆందోళన. శుక్రుని వలన 6వ తేదీ వరకు విలాసమనస్తత్వం, తర్వాత ధనం గౌరవం లేదా ఆహారధాన్యాలు లేదా సంతానావకాశం. రవివలన నెల మొదటి పక్షంలో ధననష్టం, ఇతరులవలన మోసం, లేదా నేత్రబాధ తర్వాత ధనం, గౌరవం, పై పదవి. బుధునివలన 6వ తేదీవరకు ధనం, అవమానం, తరువాత 22 వరకు తన దుష్ప్రవర్తన కారణంగా భయం. తర్వాత వస్తుసమృద్ధి.

## వృషభం
(కృత్తిక 2,3,4,పా, రోహిణి, మృగశిర 1, 2, పా.)

రాహువు వలన వివాదాలు. శని వలన ధన—మిత్రనష్టం లేదా అయినవారి నుండి వేర్పాటు. గురువువలన నిరాశ. కుజుని వలన ధననష్టం, భార్యకు అసంతుష్టి, నేత్ర బాధ. రవివలన నెల మొదటిపక్షంలో ధన నష్టం లేదా ప్రయాణం లేదా ఉదరబాధ. తరువాతకాలంలో ఇతరులవలన మోసం, లేదా నేత్రబాధ లేదా ధననష్టం. శుక్రుడు 6వ తేదీవరకు స్తబ్ధుడు. తర్వాత విలాస మనస్తత్వం. బుధునివలన 6 వరకు వివాదాలమూలంగా లేదా చెడుసలహాల వలన ధననష్టం, తరువాత 22 వరకు ధనం అవమానం లేదా మిత్రప్రాప్తి, తన దుష్ప్రవర్తన కారణంగా భయం.

## మిథునం
(మృగశిర 3,4 పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పా.)

రాహువువలన ధనం. శనివలన వస్తు సమృద్ధి, దృఢారోగ్యం లేదా నూతన వస్త్రాలు లేదా వాహనప్రాప్తి. గురువువల్ల ధనం, జయం. కుజునివలన 17వ తేదీ వరకు అన్ని విధాలజయం, తర్వాతకాలంలో ధననష్టం లేదా భార్యకు అసంతుష్టి లేదా నేత్రబాధ కారణంగా ఆందోళన. రవి నెల మొదటిపక్షంలో స్తబ్ధుడు తర్వాతకాలంలో ధననష్టం, ప్రయాణం, ఉదరబాధ: శుక్రుని వలన 6వ తేదీవరకు శత్రువులమూలంగా అవమానం లేదా అనారోగ్య కారణంగా ఆందోళన. తరువాత 22 వరకు వివాదాల మూలంగా లేదా చెడుసలహాల మూలంగా ధననష్టం, తరువాత కాలంలో ధనం, అగౌరవం.

## కర్కాటకం
(పునర్వసు 4పా, పుష్యమి, ఆశ్లేష.)

రాహువు వలన ధననష్టం. శని వలన ధనాభావం. గురువువలన ధననష్టం లేదా వివాదాలు లేదా అగౌరవం. కుజునివలన మిగిలినగ్రహాల దుష్ప్రభావంనుండి పరిహారం, ధనం, జయం. రవివలన నెల మొదటిపక్షంలో దృఢారోగ్యం, జయం తరువాత కాలంలో స్తబ్ధుడు. శుక్రునివలన 6వ తేదీవరకు వివాదాలు, అగౌరవం, తరువాత కాలంలో మంచిమిత్రులు, ధనప్రాప్తి. బుధునివలన 6వ తేది వరకు ధనం మంచి మిత్రులు లేదా శృంగారం లేదా వాహన ప్రాప్తి 22వరకు శత్రువృద్ధి, అగౌరవం. తరువాత కాలంలో వివాదాల మూలంగా లేదా చెడు సలహాలమూలంగా ధననష్టం.

## సింహం
(మఖ, పూ. ఫ, ఉత్తర 1వ పా.)

రాహువువలన ఆందోళన. శనివలన ధననష్టం లేదా కుమారులతో వివాదము లేదా అయినవారి నుండి వేర్పాటు లేదా బంధు హాని. గురువు వలన ప్రయాణం ప్రయాస. కుజునివలన 17వ తేదీ వరకు అవమానం, ధననష్టం. తరువాత వస్తు సమృద్ధి. రవివలన జయం, గౌరవం, ధనం దృఢారోగ్యం. శుక్రునివలన 6వతేదీ వరకు సుఖం, ధనం, నూతనవస్త్రాలు లేదా పుణ్య కార్యం తర్వాతకాలంలో వివాదాలు గౌరవ భంగం. బుధునివలన 22వ తేదీ వరకు జయం, శృంగారం, మంచి మిత్రులు, వాహనములు లేదా సంతానావకాశంతర్వాత కాలంలో శత్రువులు, అనారోగ్యం, అగౌరవం.

## కన్య
(ఉత్తర 2, 3. 4 పా. హస్త; చిత్ర 1, 2 పా.)

రాహువు, శనుల వలన ఆందోళన, గురుని వలన అధికధనం. కుజుని వలన ధననష్టం, అగౌరవం. రవివలన మొదటి పక్షంలో ధనవషం, నిరాశ లేదా అనారోగ్యం. తర్వాత కాలంలో గౌరవం, అన్ని విధాల జయం. శుక్రుని వలన 6వ తేదీ వరకు నూతనవస్త్రాలు లేదా ధార్మికప్రవర్తన. బుధునివలన 6వ తేదీవరకునిరాశ. తర్వాత 22 వరకు ధనం, జయం, శృంగారం తర్వాత ధనం లేదా సంతానం లేదా మంచిమిత్రులు లేదా వాహనప్రాప్తి.

## తుల
(చిత్త; 3, 4 పా: స్వాతి, విశాఖ 1,2,3 పా:)

రాహువువలన సుఖం. శనివలన శృంగారం లేదా ధనం. గురువువలన ధననష్టం అవమానం. కుజునివలన 17వ తేదీవరకు భార్యతో తగాదాలు లేదా ఉదరబాధ, నేత్ర

(40వ పేజీలో)

# వార్తాలహరి

## హిందూధర్మ వేసవి శిక్షణ కేంద్రాలు

ఉపాధ్యాయులద్వారా ధార్మిక ప్రబోధ కార్యక్రమంక్రింద తిరుమల తిరుపతి దేవస్థానం తి. వేసవిశిక్షణా పథకాలను ప్రారంభించింది.

ఇందులో, తిరుమలలో ప్రతి ఏడు జరుగుతూవచ్చి రెండేళ్ళగా నిలిచిపోయిన 28 వ శిక్షణశాలను ఈ సంవత్సరం మళ్ళీ ప్రారంభించటం జరిగింది. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ 4-5-79 న ప్రారంభం చేశారు.

కేంద్రీయ సంస్కృతవిద్యాపీఠం అధ్యక్షులు శ్రీ యం. డి. బాలసుబ్రహ్మణ్యం అధ్యక్షతవహించారు.

4-5-79 నుండి 31-5-79 వరకు ఏర్పాటైన ఈ శిబిరంలో 50 విద్యార్థులు పాల్గొన్నారు. విద్యార్థులకు తగ్గింపు రేట్లలో భోజనసౌకర్యము, ఉచిత ఆవాసములతోపాటు రు 100/- విద్యార్థి వేతనం ఇవ్వటం జరిగింది.

ఈ ప్రారంభసమావేశానికి ధర్మకర్తల మండల సభ్యుడు సర్వశ్రీ జి. చంద్రశేఖరంనాయుడు, ఉపకార్యనిర్వహణాధికారి శ్రీ మునుస్వామినాయుడు, హిందూధర్మప్రతిష్ఠానం కార్యదర్శి శ్రీ అర్కసోమయాజి ప్రభృతులు పాల్గొన్నారు.

### తిరుపతిలో

తిరుమల తిరుపతి హిందూ ధర్మ ప్రతిష్ఠానం ఆధ్వర్యంలో తిరుపతిలో 16-5-79 ప్రారంభించిన హిందూధర్మ వేసవి శిక్షణ శిబిరానికి శ్రీ యం. బలరామిరెడ్డి అధ్యక్షతన, దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె ప్రసాద్ ప్రారంభించారు.

శిబిర నిర్వాహకులు, ధర్మ ప్రతిష్ఠాన కార్యదర్శి డా॥ అర్కసోమయాజులు 28 ఏళ్ళ క్రితం ప్రాథమిక, ఉన్నత పాఠశాల అధ్యాపకులకు హిందూధర్మ ప్రాథమిక సూత్రాలను గూర్చి శిక్షణ ఇచ్చేందుకు ప్రారంభింపబడిందని, విద్యార్థులలో ఆధ్యాత్మికశిక్షణలభావం, మనస్సుకుకాక మెదడుకు మాత్రమే మేత వేసే విద్యావిధానం ప్రతిరోజు విద్యార్థి లోకంలో అలజడి తేవడానికి కారణమయ్యాయని అందువల్ల ఆసక్తిలేని చెవిపై శంఖమూదినట్లు గాక విద్యార్థులను సక్రమ పద్ధతుల పైనడపే బాధ్యత ఉపాధ్యాయుల పై ఉందని అన్నారు.

సభాధ్యక్షులు శ్రీ యం. బలరామిరెడ్డి, సర్వమత సహనమన్నది అన్ని మతాలలోని సారమని, మతాన్ని మర్చిపోయే ఈ రోజులలో ఇలాంటి ప్రయత్నాలు జరగటం చాలా విశేషమని, ఉపాధ్యాయులు ఈ శిబిరకాలంలో తాము పొందిన ప్రయోజనాన్ని విద్యార్థులకు పంచిపెట్టాలని అన్నారు.

శ్రీ ప్రసాద్ తమ ప్రసంగంలో ఈ కార్యక్రమం ముఖ్యోద్దేశం, ధర్మాన్ని గూర్చిన పునర్జాగరణ కార్యక్రమాలు, దేవస్థానం ధర్మాభివృద్ధికిగాను ఏర్పాటు చేసుకొనే కార్యక్రమాలలో ఈ ఉపాధ్యాయ విద్యార్థులను, ఎలా ప్రతినిధులుగా ఎంతవరకు సహయోగించవచ్చో పరిశీలించి తదనుగుణంగా ధర్మ ప్రబోధన కార్యక్రమాలు ఏర్పాటు చేసుకోవటం ముఖ్యోద్దేశమనీ అన్నారు. భక్తి ప్రచార విషయంలో కేవలం సుప్రభాతం పోటీలతో ఆగక ఇంకా వివిధ స్థాయిలో పోటీలు జరిపి, తదితరములగు పారితోషికాదులు ఏర్పాటు చేయాలనీ అన్నారు.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ రిజిస్ట్రారు శ్రీ యం. జె. కేశవమూర్తి విద్యార్థులకు హిందూమతాన్ని గూర్చిన సంగ్రహ పుస్తకాన్ని పంచిపెట్టారు.

ఇటీవల కాళహస్తిలో తిరుమల తిరుపతి దేవస్థాన కల్యాణ మంటప ప్రారంభోత్సవ సభలో ప్రసంగిస్తున్న ధర్మకర్తలమండలి సభ్యులు శ్రీ పి. ఆర్. మాధవరావు.



## కేరళలో దేవస్థాన సమాచార కేంద్రం

కేరళలోని ప్రసిద్ధ కృష్ణక్షేత్రం గురువాయూరులో తిరుమల తిరుపతి దేవస్థానం సమాచార కేంద్రాన్ని కల్యాణ మండపాన్ని నిర్మించాలని నిర్ణయించుకొన్న విషయం అందరికీ తెలిసిందే.

ఇందుకు ప్రాతిపదికగా, కేరళ రాష్ట్ర గవర్నరు శ్రీమతి జ్యోతి వెంకటాచలం, కల్యాణ మండపానికి 2–5–79 న శంఖు స్థాపన జరిపారు. దేవస్థానం సంకల్పించిన వివిధ కార్యక్రమాలు, స్థానిక శిరు వేంకటాచలపతి క్షేత్ర సమితి సహయోగంతో జరుగుతవి.

గవర్నరు తమ ప్రసంగంలో సమాజంలో భౌతిక విజ్ఞానం విపరీతంగా పెరిగిపోయిందని, మతం సమాజం వేరు వేరుగాగాక సహయోగంలో మనగల్గినప్పుడే ఆత్మానందం సిద్ధిస్తుందని, కేవలం భౌతికవిజ్ఞానమే అన్నిటిని సాధించలేదని అన్నారు.

రాష్ట్ర మాజీదేవదాయ మంత్రి శ్రీ బాలకృష్ణన్ అధ్యక్షతవహించారు. దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్ ఆలయాభివృద్ధి కార్యక్రమాలకు, ధార్మిక గ్రంథప్రచురణలకు దేవస్థానం ధనం వ్యయిస్తున్న విషయం వివరించారు.

## ఉచిత బస్సు సౌకర్యం

తిరుమలలో, బస్సు దిగిన యాత్రికులు వివిధ కాటేజి ప్రదేశాలు చేరాలంటే చాలా అవస్థలు పడ్తున్న విషయం అందరికీ తెలిసిందే. పిల్లలు, సామానులతో ఇబ్బందిపడే వారి కోసం దేవస్థానం ప్రత్యేక సదుపాయం ఏర్పాటు చేసింది.

5–5–79 న తిరుమలలో దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్ రోడ్డు రవాణాసంస్థ సహకారంతో దేవస్థానంచే నడుపబడే ఉచిత టౌన్ సర్వీస్‌కు ప్రారంభోత్సవం జరిపారు. కేంద్ర రిసెప్షన్ ఆఫీస్ ప్రాంతంలో బయల్దేరి మళ్ళా అక్కడకు చేరే ఈ బస్సు దారిలో వివిధ ప్రాంతాలలో ఆగుతుంది. యాత్రికులు ఈ సౌకర్యాన్ని వినియోగించుకొవచ్చు.




ఏరియా మేనేజర్ శ్రీ రాఘవేంద్రరావు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## చందాదారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రిక చందాదారులలో దిగువ పేర్కొన్న సంఖ్య వారి చందా 31–7–79 తేదీకి అంతమగును. చందాదారులు ఈ విషయమును గమనించి M. O. ద్వారా దిగువ పేర్కొనిన ప్రకారము మనియార్డరు కూపనునందు తమ చందా సంఖ్య పూర్తి విలాసమును పేర్కొని, త్వరలో చందా పంపనియెడల ఆ తేది దరిమిలా పత్రిక పంపబడదు.

చందాదారుల నంబర్లు మార్చబడినవి. కొత్తనంబర్లు దిగువ పేర్కొనబడినవి. తమకు పంపిన పత్రిక అడ్రసు పేపరుమీద నున్న నంబరును క్రొత్త నంబరుగా గమనింప ప్రార్థన.

23 120 125 142 156 165 167 188 471 473 530 514 516 517 519 520 521 522 523 524 725 726 727 729 730 731 732 733 734 736 737 738 739 741 743 744 745 746 747 748 750 753 754 755 756 757 758 759 763 785 787 1277 1287 1288 1290 1292 1293 1295 1296 1298 to 1313 1348 to 1364 1365 1367 to 1371 1373 1374 1382 1384 1385 1386 1387 1389 to 1397 1399 to 1415 1418 to 1433 1435 1436 1468.

గమనిక :– (1) సప్తగిరి చందాలు 15 తేదిలోగా చేరునట్లు పంపవలెను. ఆతరువాత చేరిన చందాలకు మరునెలనుండి మాత్రమే పత్రిక పంపబడును.

(2) కొత్త చందాదారులు కూపనులో 'కొత్తచందా' అని పేర్కొనవలెను. పాత వారు కూపనులో తమ చందా సంఖ్య నమోదు చేయవలెను.

(3) సప్తగిరి చందాలు ఈ క్రింది అడ్రసుకే తమ పిన్‌కోడ్ తెలియజేస్తూ పంపవలయును.

సప్తగిరి మాసపత్రిక సం॥ చందా రు. 6/–

ఎడిటరు
పబ్లికేషన్ సెక్షన్
ప్రెస్ కాంపౌండ్, తిరుపతి 517501.

(37 వ పేజీ తరువాయి)

బాధ. తర్వాత కాలంతో ధననష్టం లేదా అగౌరవం. రవివలన నెల మొదటిపక్షంలో భార్యకు అసంతుష్టి లేదా అనారోగ్యం తర్వాత కాలంలో ధననష్టం లేదా నిరాశ లేదా అనారోగ్యం. శుక్రునివలన 6వ తేదీ వరకు స్త్రీలవలన తగాదాలు, తరువాత కాలంలో ధనప్రాప్తి, నూతనవస్త్రాలు, శృంగారం లేదా గృహం. బుధుని వలన 6వ తేదీ వరకు ధనం, జయం, నూతన వస్త్రాలు లేదా సంతానప్రాప్తి. కాని 22 వరకు ఆటంకములు. తర్వాత కాలంలో లాభప్రదం, ధనప్రాప్తి, జయం.

## వృశ్చికం

(విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

రాహువు వలన తగాదాలు. శని వలన ధననష్టం లేదా అగౌరవం, గురువు వలన లాభప్రదం, ధనం, జయం, ఆహారధాన్య, లేదా సంతానప్రాప్తి. కుజునివలన 17వ తేదీ వరకు ధనం, జయం, తర్వాత కాలములో భార్యతో తగాదాలు, ఉదరబాధ లేదా నేత్రబాధ. రవివలన నెల మొదటి పక్షంలో ప్రయాణం లేదా ఉదరబాధ తర్వాత కాలంలో అనారోగ్యం, లేదా స్త్రీ అసంతుష్టి. శుక్రుని వలన 6వ తేదీవరకు అనారోగ్యం లేదా అగౌరవం. తరువాత కాలంలో స్త్రీ మూలకంగా ఆందోళన. బుధునివలన 7వ తేదీవరకు జయం, వృద్ధి తర్వాత 22 వరకు తగాదాలు, తరువాత కాలంలో లాభప్రదము, జయము, నూతన వస్త్రములు లేదా ధనం సంతానప్రాప్తి.

---

అన్నమాచార్య జయంతి
కార్యక్రమ విశేషాలు
వచ్చే సంచికలో!

---

## ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

రాహువువలన పాపకార్యము. శనివల్ల అనారోగ్యము లేదా తగాదాలు లేదా అధార్మికప్రవర్తన. గురువువలన అనారోగ్యం లేదా ప్రయాణం ప్రయాస, ఉద్యోగసంబంధమైన చిక్కులు. కుజునివలన 17వరకు అనారోగ్యం, శత్రువుల వలన భయము, సంతానము వలన ఆందోళన. తరువాత కాలములో దృఢారోగ్యము, ధనము, జయం. శుక్రునివలన 6తేదీవరకు బంధువులరాక, పెద్దలప్రశంస, ధనం, స్నేహితులు, సంతానప్రాప్తి తర్వాత కాలంలో అనారోగ్యము, అగౌరవము. రవివలన నెల మొదటిపక్షంలో దృఢారోగ్యం,జయం కాని తరువాత కాలంలో ప్రయాణం లేదా ఉదరబాధ. బుధునివలన 6వ తేదీ వరకు జయం, ఉద్యోగాభివృద్ధి, 22 వరకు తగాదాలు తరువాతకాలంలో లాభప్రదం, ధనం జయం, నూతనవస్త్రప్రాప్తి లేదా సంతాన ప్రాప్తి.

## మకరం

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ఠ 1.2 పా)

రాహువువలన ఆందోళన. శనివలన భార్య, పుత్రులనుండి వేర్పాటు. గురువు వలన శృంగారం, సుఖం. కుజునివలన 17వతేదీ వరకు జ్వరం లేదా ఉదరబాధ లేదా చెడుస్నేహాలవలన దుఃఖం, తర్వాత కాలంలో అనారోగ్యం లేదా శత్రుభయం లేదా పుత్రులవలన ఆందోళన. రవివలన నెల మొదటిపక్షంలో అనారోగ్యం లేదా శత్రువులవలన ఆందోళన తర్వాతకాలంలో దృఢారోగ్యం, శత్రువులపై విజయము. శుక్రునివలన 6వతేదీ వరకు మంచిస్నేహితులు, బంధువుల ఆగమనం లేదా పెద్దల ప్రశంస, ధనం లేదా సంతాన ప్రాప్తి. బుధునివలన 6వతేదీవరకు సంతానంమూలకంగా తగాదాలు తర్వాత కాలంలో లాభప్రదం, జయం, వృద్ధి తర్వాత తగాదాలు.

## కుంభం

(ధనిష్ఠ 3,4 పా, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా)

రాహువువలన తగాదాలు. శనివలన ప్రయాణం. గురువు వలన మానసికంగా అశాంతి. కుజుని వలన 17 వరకు చెడు కార్యముల వలన లేదా కుమారుల వలన ధనం. తర్వాతకాలంలో జ్వరంలేదా ఉదరబాధ లేదా చెడుస్నేహాలవలన ఆందోళన. రవివలన అనారోగ్యం లేదా శత్రువులు. శుక్రునివలన 6వతేదీ వరకు గౌరవము, ధనం; నూతనవస్త్రాలు లేదా శత్రువులపై జయం తర్వాత కాలంలో మంచి స్నేహితులు. బుధునివలన 6వతేదీ వరకు గృహంలో సంతోషం, 22 వరకు భార్యా పుత్రులతో తగాదాలు తర్వాత కాలంలో ధనం, జయం.

## మీనం

(పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి.)

రాహువువలన ధనం. శనివలన ఆరోగ్యం, శత్రువులపై జయం. గురువువలన ధనం, వాహనం లేదా సంతానప్రాప్తి లేదా నూతనవస్త్రప్రాప్తి. కుజునివలన 17 తేదీ వరకు ఉద్యోగంలో ఆందోళన, శత్రు భయం లేదా తగాదాలు, అనారోగ్యం లేదా గృహంలో దొంగతనం తర్వాత కాలంలో చెడుమార్గాలద్వారా ధనప్రాప్తి లేదా కుమారులవలన ధనప్రాప్తి. రవి వలన నెల మొదటిపక్షంలో ధనం, ఉద్యోగాభివృద్ధి శత్రువులపై విజయం, తర్వాత కాలంలో అనారోగ్యం. శుక్రునివలన ధనం, జయం గౌరవం, ఆహారధాన్యాలు లేదా సంతాన ప్రాప్తి. బుధునివలన 6 వరకు స్నేహితులు తర్వాత చెడుప్రవర్తనవలన భయం 22వరకు గృహసౌఖ్యం తర్వాత కాలంలో భార్య, పుత్రులతో తగాదాలు. *

---

*Edited and Published on behalf of T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T. T. D. Press by M. Vijayakumar Reddy, Manager T. T. D. Press Tirupati-517501*

# ధర్మశాలదత్తత

దేవస్థానం మద్రాసులో తమ ఆర్ష ధర్మభక్తి ప్రసార కార్యక్రమాలను విస్తృతంచేసేందుకు మరొక్కస్థావరాన్ని సంపాదించింది. ఏప్రియల్ 19 వ తేదీన, సుమారు 10 లక్షల విలువగల ఆస్తితో కూడిన పి. వి. ఆర్. ధర్మశాలను ఆ సంస్థ కార్యదర్శి శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డి లాంఛన ప్రాయంగా దేవస్థానానికి అప్పగించారు.



ఉత్తరప్రదేశ్ మాజీ గవర్నర్ శ్రీ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షత వహించారు. తమిళనాడు ప్రధాన న్యాయమూర్తి శ్రీ టి. రామప్రసాదరావు ముఖ్యాతిథిగా పాల్గొన్నారు.



దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఆ ధర్మశాలను దేవస్థానం స్వీకరించటంలోగల ముఖ్యోద్దేశాన్ని వివరించారు.

ధర్మశాల కార్యదర్శిగా శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డి అకుంఠిత సేవను పురస్కరించుకొని, డా॥ గోపాలరెడ్డి ద్వారా స్వర్ణపతకాన్ని దేవస్థానం బహుకరించింది. అదే విధంగా ఒప్పంద పత్రం భద్రపరచబడిన సందుకాన్ని డా॥ గోపాలరెడ్డి దేవస్థాన ధర్మకర్తల మండలి అధ్యక్షుడు డా॥ రమేశానికి అప్పగించారు.

ఈ కార్యక్రమమందు, దేవస్థాన ధర్మకర్తలమండలి అధ్యక్షులు డా॥ రమేశన్, తదితర దేవస్థానముఖ్యాధికారులు పాల్గొన్నారు.



ధర్మశాలదృశ్యం

# తిరుమల యాత్రికులకు సదుపాయములు

* * *

* అన్ని వర్గాల వారికి అందుబాటులో ఉండేటట్లు ఉచిత పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలతో ఆవాస సౌకర్యం
* శ్రీవారిని దర్శించు యాత్రికుల షెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు.
* క్యూ షెడ్లలోనే కాఫీబోర్డు వారి అల్పాహార సదుపాయం.
* సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
* యాత్రికులు వెలుపలకు రానక్కరలేకుండా క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం.
  ఆంధ్రప్రదేశ్ పాలసరఫరా సంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
* యాత్రికులు చదువుకునేందుకు దేవస్థాన ముద్రిత గ్రంథాలు స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
* క్యూలోని యాత్రికులకు విసుగులేకుండా ఉండేందుకు టెలివిజన్ ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం.
* క్యూలైన్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7 వ మైలువద్ద వైద్యసదుపాయం.
* సామానులు, పాదరక్షలు భద్రపరచుకునేందుకు ప్రత్యేక సౌకర్యం
* తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటో సౌకర్యం.

## ఉచిత బస్సుసదుపాయం

* దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు ముఖద్వారంలో పేష్కారుస్థాయి అధికారి సిబ్బంది.
* క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి, సిబ్బంది.
* యాత్రికుల సామానులను భద్రంగా తిరుమలకుచేర్చే సౌకర్యం ఏర్పాటైంది. తిరుపతిలో ఏ సత్రములో నైనాగాని, టోల్ గేట్ వద్దగాని తమసామగ్రి అప్పగించి రసీదుపొంది ఆరసీదు తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్ దగ్గర కౌంటర్ లో ఇచ్చి సామగ్రి పొందవచ్చును.
* దుండగులనుండి యాత్రికులను కాపాడేందుకు, తిరుమలకు వెళ్ళేదోవపొడుగునా రాత్రింబవళ్ళూ పోలీసు గస్తీ ఏర్పాటుచేయబడింది.
* దారిపొడుగునా మంచినీటి సదుపాయం ఉన్నది.
* రాత్రిపూటగాని, తెల్లవారుఝామునగాని కొండకు వెళ్ళదల్చుకొన్న వారికి వీలుగా మంచికాంతి శక్తిగల దీపాలు ఏర్పాటైనవి.
* వివిధప్రాంతాలనుండి వచ్చేయాత్రికులకు బోధపడేందుకుగాను తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో, దేశంలోని ముఖ్యభాషలలో విచారణ కార్యాలయాలు.
* ప్రత్యేక కాటేజీలలోని అదనపు సౌకర్యాలు అంజనాద్రినగర్, శేషాద్రి, గరుడాద్రి, శంకుమిట్ట కాటేజీలలో కూడ ఏర్పాటైనవి.

దేవస్థాన ప్రయత్నాలలో ఇవి కొన్నిమాత్రమే!

గమనిక: తిరుమలలో 2-4-79 నుండి తపాలాకార్యాలయము రాత్రి 8-30 గం॥ వరకు పనిచేస్తున్నది. ఇది గాక ప్రధాన తపాలాకార్యాలయము రాత్రి 10-30 నుండి 1-00 గం॥ వరకు పనిచేస్తుంది. శ్రీ వేంకటేశ్వరస్వామి వారి భక్తుడు అన్నమాచార్యుల తపాలాముద్రను, కోరినవారు తమ కార్డులు, కవర్లపై ముద్రించుకోవచ్చును.



## తిరుమలలో భారత రాష్ట్రపతి
## 3–6–79, 4–6–79

భారతరాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి గారు 3–6–79 తేదీన సాయంత్రం తిరుమలకు విచ్చేశారు. తిరుపతిలో దేవాదాయ శాఖమంత్రి శ్రీ పి. వి. చౌదరి, తదితర అధికార అనధికార ప్రముఖులు స్వాగతం చెప్పారు. తిరుమలలో రాష్ట్రపతికి దేవస్థాన కార్యనిర్వాహకమండలి అధ్యక్షులు డా॥ రమేశన్, దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ స్వాగతం చెప్పారు.



రాష్ట్రపతిపేరిట దేవస్థానం ఉద్యాన విభాగంవారిచే క్రొత్తక్రోటన్ మొక్కలకు "క్రోటన్‌నీలం" అని పేరుంచటం జరిగింది. ఈ కార్యక్రమములో రాష్ట్రపతి పాల్గొన్నారు.




(3 వ కవరు పేజీలో)



జ్ఞానము నెఱఁగము అజ్ఞానము నెఱఁగము
శ్రీనాయకుఁడ నీసేవకుఁడ నేను,

అరుతఁ గట్టిన తాళి యవె వనమాలికలు
సరుస మోఁచిన డాగు శంఖచక్రములు
వరుస నొసల గురి వ్రాసినది తిరుమణి
యిరవెరిఁగితి మిఁక నెప్పుడైనఁ గావుము.

పళ్ళెము ప్రసాద మింతే పసగా నా రుచులివె
పి(పె?)ల్లునేఁ బొగడేవి నీ బిరుదులు
యెల్లపుడుఁ బూజించేది యిది నీయాపుపతిమ
కల్లలేదిందుల నీవు గన్నదింతే కానుపు.

నిక్కము నేఁ జొచ్చినది నీ లెంకతనము
చక్క నా జీవనము నీ శరణాగతి
యెక్కువ శ్రీవెంకటేశ యెదలో నున్నాఁడ విదె
చిక్కినదేమియు లేదు చిత్తమింతే యిఁకను

అన్నమాచార్య సం. 10—113

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

# సప్తగిరి

జూలై 79

సంపుటి 10 సంచిక 2

విడిప్రతి 0-50 పైసలు

సం॥ చందా రు. 6-00

## విషయసూచిక



### అన్నమప్రభ



గౌరవసంపాదకులు:

శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్

ఐ. ఏ. ఎస్,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2322

ప్రచురణకర్త-సంపాదకుడు:

కాట్రపాటి సుబ్బారావు

ఎమ్. ఏ.,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

ముద్రాపకుడు,

ఎమ్. విజయకుమార్ రెడ్డి,

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2340

ముఖచిత్రం: తిరుమల శ్రీవారి ఆనివార ఆస్థానం

# సంపాదకీయము

బండి బయల్దేరింది. పొగలు కక్కుతూ సెగలు చిమ్ముతూ స్టేషనులో వచ్చి ఆగింది. అంతే! ఇక ముందుకు సాగలేదు. అది ఆగదగ్గ చోటు కాదు, సాగేందుకు వీలులేదు. ఎవరి అవస్థ వారిది. సలహా చెప్పాలన్నా అక్కడుండేవారికి కొంత అధికారమే. చివరకు పై స్టేషన్‌నుంచి ఆదేశంవచ్చింది-ఆదోవ బాగాలేదు. వేరే దోవకు మళ్ళించండని. చివరి కెలాగో గమ్యం చేరింది. అన్నీ వడిలిన ముఖాలు, కుళ్ళిన పళ్ళు.

ఆ మాట కొస్తే వ్యవస్థలు కూడా ఒక రకంగా అంతే! ఫైళ్ళ పెట్టెలలో, వేలాది ప్రజల ఆశల — అవసరాల కాగితాలు నింపుకొని, అధికారపు అంతరాల మజిలీలను దాటుతూ గమ్యంచేరి కలల, పంటలను పంచే రైలుబండి. దాని మాదిరే దీనిక్కూడా, ఏ స్థాయిలో అవరోధం ఏర్పడ్డా, లేదా చుట్టు దారిలో తిరిగినా అసలు కొసరుకొచ్చి, అనుకున్నది కాక, ఆశించేది రాక, గమ్యం చేరే సరికి కుళ్ళిన పళ్ళలా తయారౌతుంది. ఎటు చూచినా నిరాశా, నిస్పృహలు ఎదురౌతాయి. అనుకున్నవి శీఘ్రంగా సఫలం చేసుకోవాలంటే అన్ని స్థాయిలలోనూ మారుతున్న అవసరాల దృష్ట్యా ఐక్యభావం అవసరం.

నిజానికి తిరుమల తిరుపతి దేవస్థానం ఏదీ పెరగని రోజుల్లో ఏర్పడ్డ నియమాల పట్టాలపైన, పెరుగుతున్న అవసరాలను పేర్చుకుంటూ మోయలేక, వేరే మార్గం లేక సతమతమౌతున్న సంస్థ. ఈ సంస్థ స్వరూప స్వభావాలు పెరిగినంత త్వరగా, ఏ సంస్థగానూ పెరగలేదు. అన్నిదేవాలయాలకన్న విభిన్న రూపురేఖలు ప్రత్యేక ప్రాచుర్యంగల ఈ సంస్థ అవసరాలు తీర్చేందుకు ఏనాడో స్వయం ప్రతిపత్తిగల వ్యవస్థ ఏర్పడిఉండాల్సింది. అలాఏర్పడటం, సంస్థ ఈనాటిప్రయోజనాలదృష్ట్యాఅవసరంకూడా.

సంస్థలోని ఇటీవల పరిణామాలు చాల వరకు ఆ కొరతను తీర్చాయనే చెప్పాలి. కొత్తగా ఏర్పాటైన నిర్ణాయక, నిర్వాహక మండలులలో దేవస్థాన కార్యనిర్వహణాధికారి, దేవాదాయ కమీషనర్, ప్రస్తుతం ప్రభుత్వ ఆర్థిక కార్యదర్శికి ప్రత్యక్ష సంబంధం ఉన్నందువల్ల, పొరపాటున నైనా వెనుకబడగల ఏకపక్ష నిర్ణయం బదులు ఏకగ్రీవ నిర్ణయం, తద్వారా వివిధ జటిల సమస్యలకు సత్వర పరిష్కారం సాధ్యమౌతుంది.

సాముదాయక సహాయనిధి పటిష్ఠం చేయటంవల్ల ఈదేవస్థానానికి, జీర్ణోద్ధారణ, సత్రాలు, కల్యాణమంటపాలు, రామమందిరాల నిర్మాణాదుల భారం తప్పింది. నిధికి కొంత సొమ్ము విరాళంగా ఇచ్చి ఇకముందు దేవస్థానం తన ఆలయాలు, సత్రాలు-యాత్రికుల వివిధ సమస్యల పరిష్కారానికి తన దృష్టిని కేంద్రీకరించేందుకు అవకాశం ఏర్పడుతుంది.

సామాన్యుల అందుబాటులో ధార్మిక ప్రచారంకోసం, పుస్తక ప్రచురణలకుగాను ప్రత్యేక నిధి కేటాయించటం కూడా జరిగింది.

ఇంకొకమార్పు, వేంకటేశ్వర శిష్టాచార విద్యాసంస్థ ఏర్పాటు. ఆ పేరుతో ఈ పేరుతో పలుచోట్ల జరుగుతున్న వేదోద్ధరణ, ధర్మాభివృద్ధి కార్యక్రమాలకుబదులు ఒకే వ్యవస్థ క్రింద ఒకే ఆశయంగల కార్యక్రమాలన్నిటిని ఏకీకరించేందుకు వీలౌతుంది.

వింత పరిధులలో, కొత్త పుంతలు త్రొక్కే ఈ దేవస్థాన ప్రగతిపైనే ఇప్పుడందరి కళ్ళు. ఇందరి ఆశలను నిరాశ పరచకుండా పొందాగా నిర్వహించగల ధైర్య స్థైర్యాలు తన సేవకులైన దేవస్థాన ఉద్యోగులకు ప్రసాదించాలని వేంకటేశ్వరుని వేడుకొందాం.

# ప్రత్యేక దర్శనం టిక్కెట్లు

**శ్రీవారి దర్శనపు రూ. 25/- ప్రత్యేక దర్శనపు టిక్కెట్లు ఆంధ్రాబ్యాంకువారి ఈ క్రింది శాఖలలో లభిస్తవి.**

## ఆంధ్రప్రదేశ్

అనంతపురంజిల్లా
- అనంతపూర్

కడపజిల్లా
- కడప
- ప్రొద్దుటూరు

పశ్చిమ గోదావరిజిల్లా
- ఏలూరు
- భీమవరం
- తణుకు

తూర్పు గోదావరిజిల్లా
- రాజమండ్రి
- కాకినాడ (మెయిన్)
- రామారావుపేట (కాకినాడ)

నెల్లూరుజిల్లా
- నెల్లూరు

ప్రకాశంజిల్లా
- ఒంగోలు
- చీరాల

చిత్తూరుజిల్లా
- చిత్తూరు
- తిరుపతి (మెయిన్)
- బాలాజీనగర్ (తిరుపతి)
- హజూర్ ఆఫీసు అనుబంధ కౌంటరు (తిరుపతి)
- కాళహస్తి

విశాఖపట్నంజిల్లా
- విశాఖపట్నం (మెయిన్)
- మహారాణీపేట (విశాఖపట్టణం)
- విజయనగరం

కరీంనగర్ జిల్లా
- కరీంనగర్

కర్నూల్ జిల్లా
- కర్నూలు

ఖమ్మంజిల్లా
- భద్రాచలం
- ఖమ్మం

క్రిష్ణాజిల్లా
- విజయవాడ (మెయిన్)
- గాంధీనగర్ (విజయవాడ)
- గవర్నర్ పేట (విజయవాడ)
- మచిలీపట్నం

గుంటూరుజిల్లా
- గుంటూరు (మెయిన్)
- బ్రాడీపేట (గుంటూరు)
- తెనాలి

హైదరాబాదుజిల్లా
- హైదరాబాదు (మెయిన్)
- హిమయత్ నగర్
- చిక్కడపల్లి
- ఖైరతాబాదు
- విజయనగర్ కాలని
- సికింద్రాబాదు
- మారేడ్ పల్లి

వరంగల్ జిల్లా
- వరంగల్

మెదక్ జిల్లా
- సిద్దిపేట

మహబూబ్ నగర్ జిల్లా
- మహబూబ్ నగర్

నల్గొండజిల్లా
- నల్గొండ

నిజామాబాద్ జిల్లా
- నిజామాబాద్

అదిలాబాద్ జిల్లా
- అదిలాబాద్

## రాష్ట్రేతర ఆంధ్రాబ్యాంకు శాఖలు.

పాట్నా
టాటానగర్
అహ్మదాబాద్
బరోడా
సూరత్
బెంగుళూర్ (ఎస్.ఆర్. రోడ్)
రామ్‌రాజ్ పేట (బెంగళూర్)
బళ్ళారి
గంగావతి
రాయచూరు
హోసపేట
త్రివేండ్రం
ఎర్నాకులం (కొచ్చిన్)
భోపాల్
జైపూర్
జబల్ పూర్
బొంబాయి (మెయిన్)
చెంబూరు (బొంబాయి)
మాతుంగ (బొంబాయి)
నాగపూర్
భువనేశ్వర్
బర్హంపూర్
రాయగడ
పూరి
రూర్కేలా
మద్రాసు (మెయిన్)
మైలాపూర్
టి. నగర్
షెనాయ్‌నగర్
కోయంబత్తూర్
మధురై
సేలం
తిరుపూర్
కలకత్తా
బాలిగంజ్ (కలకత్తా)
ఖరగ్ పూర్
దుర్గాపూర్
చండీఘర్
కన్నాట్ సర్కస్ (న్యూఢిల్లీ)
కరోల్ బాగ్ (న్యూఢిల్లీ)
రామకృష్ణాపురం (న్యూఢిల్లీ)
లక్నో
అలహాబాద్
వారణాశి
లూధియానా

# పుష్పగిరి క్షేత్రం

రాయలసీమలో పవిత్ర పెన్నానదీ తీరంలో కడప పట్టణానికి పదిమైళ్ళ దూరంలో పుష్పగిరి క్షేత్రం వెలసి ఉంది. ఈ క్షేత్రం శైవ, వైష్ణవులకు దర్శనీయం. శివ, చెన్నకేశవ ఆలయాలు ఒకే ప్రాంతంలో నిర్మింపబడటం ఈ క్షేత్రం విశిష్టత. వీటిని పుష్పగిరి ఆలయాలని పిలుస్తారు. ఈ రెండు ముఖ్యమైన ఆలయాలు కాక, కాశీ విశ్వనాథస్వామి, త్రికోటీశ్వరస్వామి, రాఘవస్వామి, సంభవేశ్వరస్వామి, ఇంద్ర నాగేశ్వరస్వామి, వైద్యనాథస్వామి, భీమేశ్వరస్వామి అనే ఏడు దేవాలయాలున్నాయి.

ఆలయ చరిత్రకు సంబంధించిన శాసనాలు అనేకం ఇక్కడ లభ్యమౌతున్నాయి. ఇవి విజయనగర రాజులకు సంబంధించినవి. కాని తొలిశాసనం క్రీ. శ. 1298 నాటిది. చెన్నకేశవ ఆలయానికి మరమ్మత్తులను కంపయ్యా నిర్వహించినట్లు తెలిపే శాసనం క్రీ. శ. 1436 నాటిది. ఈ ఆలయ శిఖరాన్ని అఘోరశివాచార్యులు ప్రతిష్ఠించినట్లు తెలిపే శాసనం క్రీ. శ. 1501 నాటిది. కృష్ణరాయలు ఒక గ్రామాన్ని దానం చేసినట్లు తెలిపే శాసనం క్రీ. శ. 1514 నాటిది.

పుష్పగిరి ప్రకృతి రామణీయకతకు పుట్టినిల్లు. పురాణాలలో వర్ణించిన రీతిగా, శ్రీశైలక్షేత్రానికి పుష్పగిరి నైఋతి ద్వారం. స్కందపురాణంలో, శ్రీశైల ఖండంలో, నిత్యనాథుని రసరత్నాకరంలో, పుష్పగిరి క్షేత్రమహిమను గురించి వివరాలున్నాయి. ఈ ఆలయానికి మూడు వారాలు ప్రదక్షిణంచేసి, గిరి శిఖరాన్ని ఎక్కితే మోక్షం లభిస్తుందట!

పుష్పగిరి క్షేత్రాన్ని గురించి, అనేక గాథలున్నాయి. ఒకానొకప్పుడు బ్రాహ్మణుడొకడు తన తండ్రి అస్తికలను గంగానదిలో కలుపుటకు ప్రయాణంచేస్తూ ఈ స్థలం చేరుకుని అస్తికల పాత్రను పెన్నానది గట్టునఉంచి, స్నానం చేయుటకు నదిలో మునిగాడట. స్నానానంతరం గట్టుమీదఅస్తికలకుబదులు పుష్పాలున్నాయట. తండ్రి ఆత్మస్వర్గం చేరిందని భావించి, ఈ పుష్పాలను పెన్నానదిలో వదిలాడట. కొండప్రాంతంలో ఈ అద్భుతం జరిగినందున, ఈ క్షేత్రానికి 'పుష్పగిరి' అనే పేరు వచ్చింది. పురాణాల్లో ఈ క్షేత్ర ప్రసక్తి ఉంది. గరుత్మంతుడు తల్లిని దాస్య విముక్తురాలిని చేయడానికి, దేవతలను ఓడించి, అమృత భాండాన్ని తెస్తుండగా, ఇంద్రుడు వజ్రాయుధాన్ని ప్రయోగించినాడట. ఆ ఆయుధాన్ని అవమాన పరచుటకు ఇష్టపడక, గరుత్మంతుడు తన ఈకను ఒకదాన్ని వదిలిపెట్టాడట. ఇతని శక్తికి, వినయానికి ఇంద్రుడు ఆశ్చర్యపోయి, గరుత్మంతునితో స్నేహంచేసి, అమృతభాండాన్ని సర్పముల బారినుండి రక్షింపుమని ఇంద్రుడు కోరినాడట. తన తల్లి దాస్య విమోచనానికి తప్పక అమృత భాండాన్ని ఉరగులకివ్వవలెనని, వీలయితే దాన్ని వారు సేవించకుండా చూడమని గరుడుడు జవాబు చెప్పినాడట. వినతాపుత్రుడు అమృత భాండాన్ని ఉరగలకు చూపి, దర్భలపొదలో ఉంచి, తల్లిని దాస్య విముక్తురాలిని చేయుటకు వెళ్ళినాడట. సర్పాలు స్నానానంతరం అమృతపానం చేయాలనే ఉద్దేశ్యంతో, స్నానానికి వెళ్లగా, దేవేంద్రుడు ఆ భాండాన్ని సంగ్రహించాడు. సర్పాలు తిరిగివచ్చి చూడగా ఆ పాత్ర కనిపించలేదు. కాని ఆ పాత్ర ఉన్నచోట అమృతపుబిందువులు రాలిఉండవచ్చునన్న ఆశతో అవి దర్భలనునాకినాయి. అందువల్ల వాటి నాలుకలు రెండుగా చీలిపోయినవి.

ఇంద్రుడు గరుత్మంతుడు పోరాడినప్పుడు అమృత భాండంనుండి, బిందువు ఒకటి పుష్పగిరి సరస్సులో పడి సరస్సు అమృతమయంగా మారింది. అది సహించలేక దేవతలు త్రిమూర్తులను ఆశ్రయించినారు. వారు పుష్పగిరి సరస్సును పూడ్చడానికి ప్రయత్నించారు. వాయుదేవుడు పెద్ద కొండను సరస్సులో వేయగా అది పుష్పంవలె తేలింది. దాన్ని విష్ణుదేవుడు ఒకపాదంతోను, ఈశ్వరుడొక పాదంతోను తొక్కిపట్టినారట అందుకు నిదర్శనంగా పుష్పగిరిలో శివకేశవ ఆలయాలున్నాయి.

---

**శ్రీమతి కె. అన్నపూర్ణ**
**తిరుపతి**

---

చెన్నకేశవ ఆలయంచుట్టు ఎత్తైన ప్రాకారముంది. నదిలోకి పడమటివైపు గోపురంద్వారా మెట్లున్నాయి. ఆలయంలో నిలువెత్తు విష్ణుమూర్తి విగ్రహం దివ్యమంగళంగా ఉంది. ఆలయ ప్రాంగణంలో శివాలయం, లక్ష్మీదేవి ఆలయం వున్నాయి. ఆలయపు గోడపైన గజాసుర, కార్తికేయ, వినాయక, శివుని భిక్షాటన, గీతోపదేశ, కిరాతార్జునీయ శిల్పాలు అతి మనోహరంగా ఉన్నాయి. వాస్తుశిల్ప శాస్త్ర ప్రకారం, ఈ ఆలయం విజయనగర పద్ధతిలో నిర్మింపబడింది. శాపవిముక్తి కోసం, చోళరాజొకరు ఈ ఆలయాన్ని నిర్మించాడని ప్రతీతి.

ప్రతి సంవత్సరం, ఏప్రిల్, మే నెలలలో తిరునాల అతివైభవంగా జరుగుతుంది. ఈ క్షేత్రంలో ఆదిశంకరులచే స్థాపింపబడ్డ శ్రీచక్రముంది.

*

# శ్రీనివాస ప్రబంధము



శ్రీమాన్ సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులు, కడప,

(గతసంచిక తరువాయి)

కం॥ దేవఋషి వోవ గిరిజా -
దేవినిఁ దోడ్కొంచుఁబోయె ధృతియొకపాడవై
వావిరి తపమ్మువట్టెనో
నా వెలసెడుశంభుకడకు నగపతి గడఁకన్. ౩౩౦

ఉ॥ ఆసమయంబునంద నియమాజగవంబది యెక్కుడించి య-
భ్యాసతుషారశైలవిపినాంతరపాదపపల్లవప్రసూ -
నాసమరామణీయకము లాదృతిఁజూచుచున్న శాంతి
మ -
ద్దాసము పేతు నీశుఁ గని ప్రాల్చినకన్నుల నంజ
లించినన్. ౩౩౨

గీ॥ కరుణపొడసూపుచూపులఁ గాంచె శివుఁడు
గాంచుటయె శుభశకునంబుగాఁ దలంచి
యాత్మపుత్రిక సేవకై యనుమతించి
పాలనను సేయవలెననె శైలరాజు. ౩౩౩

మ॥ భ్రుకుటీచాలనమాత్రసమ్మతముగాఁ బొంగారు
కారుణ్యమై
సకలాధారుఁ డనుగ్రహించినముహుస్సమ్మోద
రోమాంచిత -
ప్రకటశ్రీకుఁడు పుత్రికావదనతృప్తన్యస్తదృక్చంద్ర
గో -
శికలన్ భూధరుఁ డామెచిత్త మివతాళించెన్ మనో
జ్ఞంబుగన్. ౩౩౪

సీ॥ ఎలదేఁటిగము లెంగిలింపకమున్న కా
నలనుండి బలిపుష్పములను దెచ్చి
కామధేనుశ్యామగోమయాలంక్రియ
వేదాత్మకుండుండు వేది యలికి,
దివిజగంగాబ్జగంధిలజలమ్ములు పాగి
డపు ఘల్లులల నేమ మపుడు దెచ్చి,
సహజారుణములైన శయపుటమ్ముల ఖేద
మనక దర్భలు గిల్లి యలవరించి

గీ॥ తచ్ఛిరశ్చంద్రపాదశైతల్యములనె
అప్పుడప్పుడు చెమటల నార్చికొనుచు
పర్వతేంద్రునిపుత్రి యీశ్వరునిమదికి -
నెక్క నుపచారముల నెలయించుచుండె. ౩౩౫

తరువోజ॥
కనుదమ్ములను మోడ్చె కాలకాలుండు
ఘనతపస్యాసమాకర్షితబుద్ధి
యనుపమమృదులాంగియద్రిజసేవ -
లను వచియించుచునుండె లగ్న చిత్తుండు
వనములలో సుమాభరణముల్నింపు
వాసంతమధురిమ ల్వచ్చిపోయినవి
మనము సంశ్లేషసమ్మర్దమ్ము గోరు -
మలికారులెన్నియో మరలిపోయినవి. ౩౩౬

శా॥ నాకాధీశుఁడు పిల్వనంపె జగతీనాట్యక్రియాపోషకా-
స్తోక ప్రాభవు నిర్నిబంధనధనుస్సూనాస్త్రు సౌందర్యసీ-
మాకల్పున్ యువతీపదద్వయసమర్చాసక్తమౌనీంద్ర
జూ -
టీకోటీరు మనోజ్ఞరక్తిమసమాటీకత్వదున్ మన్మ
థున్. ౩౩౭

సీ॥ ప్రసవచాపమ్ముతోఁ బ్రతివచ్చుబోసులతో
నంసమ్ముపై రతి యత్తమిల్ల
మాకందపల్లవప్రమదిమమ్ముఁబోలి పి
కమ్ములు మృదుపంచమమ్ము వలుక
మీనకేతనసమున్మేషమ్ము మించు క
న్నులడాలు గాణిక్యములు గమింప
మృదుగంధవాహసన్నిధికి నింపులు నింపు -
వాసంతవికచపుష్పములు గ్రాల

(33 వ పుటలో చూడుడు)

# వేదాంత దేశికులు

(గత సంచిక తరువాయి)

సర్వేశ్వరుడు నిరుపాధిక శేషియు నిరుపాధిక నియంతయునై యుండునట్లే చేతనుడు నిరుపాధిక శేషుడును, నిరుపాధిక నియామ్యుడు నగుచున్నాడు. ఇట్లుండుట రక్షక రక్ష్య సంబంధమునకు కారణమగు చున్నది. స్వామిని విడిచి పుచ్చినచో, చేతనునికి వేరు శేషి లేడు. వేరేనియామకుడును లేడు. చేతనుడు పూర్ణుడై అశక్తుడై యుండుటచే అతనిని విడిచి స్వామికి వేరే శేషుడులేడు. నియామ్యుడైన చేతనుడు లేడు. అందుచే వేరే రక్ష్య వస్తువేలేదు. ఇదే అభిప్రాయమును యామునమునులు, ఒక శ్లోకముతో చాల చక్కగా వ్యక్తపఱచి యున్నారు.

> త్వదహం త్వదృతేన నాథవాన్
> మదృతే త్వం దయనీయవాన్ నచ
> విధి నిర్మిత మేతదన్వయం
> భగవన్ పాలయ మాస్మ జీహహః
> (స్తోత్రరత్నము)

"నాకు నీవు తప్ప రక్షింపదగిన స్వామి లేడు. నేను తప్ప దయకు పాత్రుడైన రక్షితవ్యుడు లేడు. ఈ విధముగా నున్న మన పరస్పర సంబంధమును షాడ్గుణ్య పరిపూర్ణుడైన భగవంతుడా! కాపాడుము, త్యజింపవలదు."

పై అభిప్రాయమునే వేదాంత దేశికుల వారు తమ సంకల్ప సూర్యోదయమందు ఒక శ్లోకముతో పుష్టీకరించి నిరూపించి యున్నారు. ఇంద్రియములతో కూడిన దేహము ఆత్మముచే కూడియున్నది. ఇది భ్రమయనెడు మొసలిచే గ్రహింపబడి యున్నది. ఇట్టి చేతనుని విడిపింపవలెననెడు ప్రయత్నము చేయు శ్రీమన్నారాయణుని సంకల్పము గొప్పమహిమతో కూడినది. ఒక నెపము మూలముగా అతనిని రక్షించు లే స్వామి యొక్క కృపాకార్యము. ఇట్టి జయము, సహేతుకమై పరను పురుష ప్రాప్తికి ఉపాయమై యుండును- అని ఆచార్యుల వారు చాల చక్కగా వివరించి యున్నారు.

ఈశ్వరునికిని, జీవునికినిఉన్న ఆధారాధేయ భావము, శేష శేషి భావము ఇత్యాదులను చక్కగా తెలియుటచే, చేతనునికి మూడు విధములైన ప్రయోజనము లుండును అని వేదాంతదేశికులు సూచించి యున్నారు.

1. తనకు శ్రియఃపతి ఆధారమైనవాడు అని తెలియుటచే తాను సర్వేశ్వరుని కంటె ఏనాటికిని ఎక్కువకాని స్వరూపము కలవాడనను ఎఱుక కలిగి ఉండును.

2. తానుండునది సర్వేశ్వరుని ప్రయోజనమునకే అను శేష భావము ఎప్పుడు కలుగుచున్నదో, అప్పుడు మోక్ష దశయందు అతనికినిరంతరమును కైంకర్యము చేయుచుండులే తనకు స్వరూపమను జ్ఞానము కలిగి, దానిని పడయవలెననెడు ఆశ జనించిన వాడగును.

3 స్వామి శేషియు, నియామకుడునునై యుండుటచే మోక్ష కైంకర్య ప్రాప్తికి అతడేసిద్ధోపాయుడై యుండును అను జ్ఞానము కూడ సిద్ధించునున్నది.

ఇట్టి జ్ఞానము చేతనునికి పుట్టినప్పుడు జీవుడు అనన్యాధారుడనియు, అనన్య ప్రయోజను డనియు, అనన్యశరణు డనియు చెప్పినట్లైనది. అనన్యాధారుడనగా సర్వేశ్వరుడు వినా తనకు వేరెవరును ఆధారమైన వారులేరు అని అర్థము. అనన్య ప్రయోజనుడనగా సర్వేశ్వరునికి తాను ప్రయోజనమై యుండుట తప్ప మరెవ్వరికిని ఉండునది లేదు అని అర్థము. అనన్యశరణుడనగా సర్వేశ్వరుడు గాక ఇంకెవ్వరిని ఉపాయముగా వరించని వాడు అని అర్థము. ఇట్లు శ్రీమన్నారాయణుడే తనకు ఆధారము, అతనికి తానే ప్రయోజనము, అతడే తనకు గతిగాక వేరెవ్వరు లేరు అన్న మాట. అచేతనమైనచో అనన్యాధారమునులేదు, అనన్య ప్రయోజనమునులేదు, ఎందుకనగా చేతనుడు దానికి ఆధారము, చేతనునికి అది ప్రయోజనమునై యుండును.

ఈ జీవుడు శ్రీమహాలక్ష్మికి ఆధేయుడు. ప్రయోజనము, ఉపాయమును కాదో! స్వామికే అనన్యాధారుడు, అనన్య ప్రయోజకుడు అనన్య శరణుడని చెప్పుట ఎట్లు? అని యన్నచో నారాయణుడు శ్రీ మహాలక్ష్మి విశిష్టుడుగనే యుండుటచే, ఈ అనన్యాధారత్వము, అనన్య శరణత్వము అంతయు లక్ష్మి విశిష్టుడైన నారాయణుని గురించియే చెప్పినదిగా వేదాంతదేశికుల వారు పరిష్కరించి యున్నారు.

చేతనుడు ఈశ్వర సంకల్పానుసారముగనే సృష్టియై యున్నను, ఆతడు ఎల్లప్పుడును ఈశ్వరుని అభిప్రాయము ననుసరించియే వర్తించును అని చెప్పుటకులేదు. ఎందుకనగా చేతనుని వర్తనమునకు అతని క్రిందటి కర్మము, ఇంద్రియములు, జీవితములోని సన్నివేశములు కారణములై యుండును. ఇట్టి సన్నివేశములతో సుఖ

(33వ పేజీలో)

# ప్రపత్తి



## ప్రపత్తి

వేదాంతసార విశదీకృత గానలోలం
ఓంకారనాద సరసీరుహ భృంగరాజమ్।
భక్తాగ్ర గణ్యమతులం మహనీయమూర్తిం
శ్రీ త్యాగరాజ సుగుణం శరణం ప్రపద్యే॥

ఆసేతు శీతనగసంస్తుత వైభవాఢ్యం
ఆంధ్రప్రదేశ విబుధాఖిల కల్పవృక్షమ్।
ఆద్రావిడం హి సుమహ త్తిలకాయమానం
శ్రీ త్యాగరాజ సుగుణం శరణం ప్రపద్యే॥

భక్తానను ప్రతిదినం స్వయమేవగత్వా
సంసార తారక మహామనుమేవ జప్త్వా।
కారుణ్య బుద్ధిభరితం చ మహానుభావం
శ్రీ త్యాగరాజ సుగుణం శరణం ప్రపద్యే॥

సంసార సాగర సముత్తరణైక నావం
భక్తి ప్రపత్తి ముపదేశవతాం ప్రసిద్ధమ్।
నాదేన సర్వఉపయాంత్వితి బోధయంతం
శ్రీ త్యాగరాజ సుగుణం శరణం ప్రపద్యే॥

లోకోప కారక మహామతి పుణ్యశీలమ్
శాంతం చ సత్యమమలం హ్యుపకారశీలమ్।
భూమండలేఽఖిల యశస్తనునాప్రసన్నం
శ్రీ త్యాగరాజ సుగుణం శరణం ప్రపద్యే॥

రాజాంగ దాన కనకాది తిరస్కృతం తం
రాజాధి రాజమనుమేవ పురస్కృతం హి।
తన్మంత్ర షణ్ణవతి కోటిజపప్రభావం
శ్రీ త్యాగరాజ సుగుణం శరణం ప్రపద్యే॥

ప్రహ్లాద నారద పురందర రామదాస
భక్తాగ్ర గణ్య సుజనాన్ పరికీర్తయంతమ్।
బుద్ధం చ శుద్ధ మనఘం హ్యరిషడ్విముక్తం
శ్రీ త్యాగరాజ సుగుణం శరణం ప్రపద్యే॥

శ్రీ వేంకటాచలపతి ప్రియదర్శనార్థం
బుద్ధోఽపి తత్సమయఏవ తిరస్కరిన్యా।
త్వద్భక్తి కీర్తన ముఖాత్ స్వయమావిరాసీత్
శ్రీ త్యాగరాజ సుగుణం శరణం ప్రపద్యే॥

శ్రీ వేంకటేశ కరుణాలహరీ ప్రభావం
శ్రీ రామనాథ కవిమానస భక్తిభావమ్।
శ్రీ త్యాగరాజ సుగుణార్ణవ సుప్రపత్తిం
భక్త్యా పఠన్త్యనుదినం స్వమనోరథాప్త్యై॥

# మంగళమ్

## మంగళమ్

కాకర్ల వంశ సంభూత రామబ్రహ్మసుతాయ తే।
శాంతాంబా గర్భ సంభూత త్యాగరాజాయ
మంగళమ్॥

కావేరీతీరవాసాయ కలికల్మష నాశినే।
గానశాస్త్ర ప్రవీణాయ త్యాగరాజాయమంగళమ్॥

శ్రీమత్ పంచనదక్షేత్రే నిత్యవాసాయయోగినే।
సాకేతాధిప భక్తాయ త్యాగరాజాయ మంగళమ్॥

సంగీత శాస్త్రమాలోడ్య కృతి కీర్తనకారిణే।
కలౌ వాల్మీకిరూపాయ త్యాగరాజాయ
మంగళమ్॥

త్వన్నామ ముద్రణేనైవ క్రియతే కీర్తనానిహి
నిష్కామ కర్మశీలాయ త్యాగరాజాయ
మంగళమ్॥

శివవిష్ణ్వైక్య బోధాయ నాదబ్రహ్మస్వరూపిణే।
స్వాంతస్సుఖాయ శాంతాయ త్యాగరాజాయ
మంగళమ్॥

అపూర్వ రాగ సంధాత్రే తల్లక్షణ నిరూపిణే।
సప్త స్వర స్వరూపాయ త్యాగరాజాయ
మంగళమ్॥

చతుర్వింశతి సాహస్ర కృతి కర్త్రే మహాత్మనే।
నారదాచార్యశిష్యాయ త్యాగరాజాయ మంగళమ్॥

అష్ట పంచాశరీసార నామోద్ధారక మూర్తయే।
అష్ట దిక్ ఖ్యాతి విఖ్యాత త్యాగరాజాయ
మంగళమ్॥

సంగీత విద్వత్బృందస్య భుక్తిముక్తి
ప్రదాయినే।
నాదోపాసన రక్తాయ త్యాగరాజాయ
మంగళమ్॥

రామనామ ప్రచారాయ గాన లోక హితాయతే।
గాన నాద విలోలాయ త్యాగరాజాయ మంగళమ్॥

రామనామ జపోత్సాహ నషణ్ణవతి కోటిభిః।
జప సంసిద్ధి సంప్రాప్త త్యాగరాజాయ
మంగళమ్॥

సులభోపాయ మార్గేణ మోక్షసామ్రాజ్యదాయినే।
భక్తి ప్రపత్తి సిద్ధాయ త్యాగరాజాయ
మంగళమ్॥

రామనాథ కవేర్వాచా సుప్రభాతానుమోదక।
స్తోత్రేణానేన తృప్తాయ త్యాగరాజాయ
మంగళమ్॥

---

రచన :

శ్రీ యం. వి. రామనాథ ఘనపాఠి
తిరుపతి.

---

## అన్నమ ప్రభ

# తాళ్ళపాక చిన్నన్న

"తాళ్లపాక కవుల వాఙ్మయము ఒక విశాలవిశ్వము వంటిది. అది ఒక సారస్వత క్షీరసముద్రము."* అందు ప్రభవించినవన్నీ జాతిరత్నాలే. ముప్పదిరెండు వేల సంకీర్తన కమలాలతో కమలాక్షునర్చించి తరించిన అన్నమాచార్యుడు తన వంశంవారందరికీ తరగని చెదరని నిధిని- అలమేలుమంగా వల్లభుడనే పెన్నిధిని పారంపర్యముగా సంక్రమింపజేసినాడు.

"నాస్తిపైతామహం కించిత్
నమయా కించిదార్జితమ్
అస్తి మే హస్తిశైలాగ్రే
వస్తు పైతామహం ధనమ్"

అనే మహదాశయముతో, ఆశతో ఆనిధిని అనుభవించి తరించినారు—అతని కుమారుడు పెదతిరుమలాచార్యుడు, మనుమలు- చినతిరుమలాచార్యుడు, చిన్నన్న మొదలగువారు. వీరందరూ సముజ్జ్వల సారస్వతమూర్తులు; భాగవతశిరోమణులు; దేశికోత్తములు; అలమేలుమంగావల్లభ వాల్లభ్య ధన్యచరితులు.

'పరమవిద్యాసింధుపారంగతు'డై పదకవితాపితామహుడుగా, సంకీర్తనాచార్యుడుగా, పంచమాగమ సార్వభౌముడుగా కీర్తనీయచరితుడైన మహామనీషి అన్నమాచార్యుడు. 'వేదాంతవిద్యాప్రవీణుడై, సంగీతసాహిత్య సార్వజ్ఞకత్వమంగళ సామ్రాజ్యమహితుడై నుతికెక్కిన మహనీయమూర్తి పెదతిరుమలాచార్యుడు. ఆ మహామనీషి మనుమడు, ఈ మహనీయ మూర్తి కొడుకు-చినతిరువెంగళనాథుడని 'నిండుపేరుగల' చిన్నన్న.

ఈ చిన్నన్నకు చిన్నతిరువేంగళుడు, చినతిరువేంగళనాథుడు, తిరువేణాదయ్యర్, తిరువెంగళనాథుడు, తిరువెంగళనాథయ్యంగారు, తిరువేంకటనాథర్, వేంగళరాయుడు అనే పేర్లు వ్యవహారంలో ఉండినట్లు శాసనాధారాలవల్ల తెలుస్తూన్నది.

చిన్నన్న అలమేలుమంగా వేంకటరమణుల చరణాలకు తనుధనమనములను అంకితము చేసిన మహాభక్తుడు. తాను విజయనగరప్రభువైన సదాశివరాయలు నుండి దానముగా గ్రహించిన గ్రామాలను స్వామికి సమర్పించి, వాని ఆదాయముతో వైవాహికోత్సవాది విశేషఉత్సవాలనూ, నైవేద్యాలనూ నిర్వహించునట్లు నియమించినాడు. తాతతండ్రుల జన్మనక్షత్ర కైంకర్యోత్సవములను, పెదతండ్రి, అన్న అమ్మల నిర్యాణదిన కైంకర్యాలను జరిపించినాడు.

సరససంగీత సాహిత్యవిశారదుడు, వేదాంతాచార్యుడు, రామానుజసిద్ధాంతప్రవర్తకుడునైన ఈ చిన్నన్న సాలెవారికి ఆచార్యపురుషుడుగా నుండెను. ఒకసారి పద్మసాలీలు, జాంద్రవారు లక్ష్మీదేవి పుట్టినింటివారెవరని వివాదపడినారట. నిర్ణయించి తీర్పుచెప్పుడని చిన్నన్నను ప్రార్థించినారట. ఆయన అలమేలుమంగను ప్రార్థించగా ఆ తల్లి తన పుట్టినింటివారు పద్మసాలెలని పలికినదట. ఆ సంతోషముతో వాళ్లు చిన్నన్నకు ఇరవైవేల వరహాలు కానుకగా ఇచ్చిరట. చిన్నన్న వంశపారంపర్యముగా, తమ వంశపారం

అన్నమాచార్య కీర్తనల నభినయిస్తున్న డా. యామినీకృష్ణమూర్తి.



శ్రీ సి. శేషాద్రి, యం. ఏ.
ఆంధ్రభాషోపన్యాసకుడు, శ్రీవేంకటేశ్వర కళాశాల
తిరుపతి.



అన్నమాచార్య జయంతి సందర్భంగా గాత్ర
కచ్చేరి చేసిన నేపథ్యగాయకుడు
శ్రీ పి. బి. శ్రీనివాస్.

పర్యముగా గురుశిష్యసంబంధము సాగు నట్లుకోరి అందుకు ధర్మశాసనం వ్రాయించి యిచ్చినారు.

చిన్నన్న స్వామి కైంకర్యతత్పరుడే కాక సంగీత విద్వాంసుడుగను, గాయక శిరోమణిగను కీర్తింపబడి ఉన్నాడు. అతడురచించిన సంకీర్తనలేవియు మనకు లభించుట లేదు. చిన్నన్న మేనమరిది రేవణూరి వేంకటార్యుడు తన 'శ్రీపాద రేణుప్రభావము' అనే కావ్యములో "మా తాళులపాక చిన్నన పదంబులు పాడిన నాడె సర్వరాప్త్యైలవిభుండు" అని(1-52) సగర్వముగా చాటుకొన్నాడు. 'అల తాళ్లపాక చిన్నన్న రోమములైన తంబుర దండెకు దంతులౌనె', 'తాళ్లపాకచిన్నన్న దండెమీఁటులు గావు' అనే అర్వాచీన వాక్యాలూ చిన్నన్నను సంకీర్తనకర్తగా ప్రశంసిస్తున్నవి. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు "చిన్నన్న గాయకుఁడనుట కిక్కడి రాగిరేకులలోఁగాని, గ్రంథములలోఁగాని యాధారములు గానరావు" అని వెను వెంటనే 'కాకయాతడును గాయకుఁడేమో' అని తమ ఊహను కొంత సడలించు కొన్నారు. శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు "చిన్నన్న సంగీతరచన చేసినాఁడని నేను భావించుటకు అతనివని గాయక సంప్రదాయమున నిలిచి నేఁటికి లభించు రెండు కృతులాధారము" అని సూచిస్తూ, అవి యీ శతాబ్దములో సుబ్బ రామదీక్షితులు రచించిన 'సంగీతసంప్ర దాయ ప్రదర్శిని' యందున్నీతములైనవని ఉదహరించిరి. ఆ కీర్తనలు —

1. కీర్తనము – శంకరాభరణము –
అటతాళము – తాళ్ళపాకం చిన్నయ్య

పల్లవి:
శ్రీహరిపాదతీర్థమే - చెడనిమందు

అనుపల్లవి:
మోహపాశమునుగోసి - మోక్షమిచ్చేమందు

చరణములు;
గౌరమై కాయనిమందు - కడుచల్లజేసేమందు
కారమై కంటగించనిమందు-కమ్మనిమందు
నూరనిపూయనిమందు - నునుపుకవినమందు
వేరులెల్లంకులులేని – వెలలేనిమందు
॥ శ్రీహరి ॥

గురుతైన రోగముల - గుణముజేసేమందు
దురితమ్ములెడబాపే - దొడ్డమందు
నిరతముబ్రహ్మాదులు - నిలిచిసేవించేమందు
నరకముచొరనీయని – నయమైనమందు
॥ శ్రీహరి ॥

పొంకముతో గుణముల - పొందజేసేమందు
మంకుబుద్ధిని నెడబాపి - మన్నించేమందు
పంకజాక్షప్రసన్న - వెంకటరాయనిమందు
శంకలెల్లపోగొట్టి - సంరక్షించేమందు
॥ శ్రీహరి ॥

(ప్రథమాఖ్యాన పుస్తకము పు. 101)

2. కీర్తనము – కాంభోజిరాగము
ఝంపెతాళము–తాళ్ళపాకం చిన్నయ్య

పల్లవి:
నామొరాలింపవే - అయ్యవెంకటరమణా -
నామీద దయలేదా

అనుపల్లవి:
ప్రేమతో నేటికిని - శరణాగతత్రాణ-
బిరుదు పోనాడతగునా వోస్వామీ

చరణములు:
కరిమకరిచేజిక్కి - గాసిబడిమొరలిడగ -
గాచి రక్షించలేదా
నరమృగాకృతిబూని-ప్రహ్లాదుకొరకు దా -
నవనాథుచీరలేదా
పరగద్రౌపదిమాన - భంగంబుగాకనే -
పలువలువలొసగలేదా
మరచితివో ఆనాటి – శౌర్యప్రభావంబు -
మరియున్నచందమేమి-వోస్వామి ॥నా॥

...న్ను రక్కసబాధచే - భయార్తులైన -
మునులకభయములియ్యవా
పన్నుగా లాక్షాగృహాగ్నిచే బడకుండ -
పాండవుల వెడలింపవా
మొన్న నీ శరణుజొచ్చిన విభీషణులంక -
కెన్నరాజుగజేయవా
ఖిన్నుడని భాగ్యోపహీనుడని నన్ను
దలచి-క్రీగంటజూడరావా వోస్వామి ॥నా॥

గోపకుల మేరకు పరాకుసేయకనాడు -
కొండ వేలెత్తలేదా
ఆపత్ప్రసన్నుడని జనులుపలికినపలుకు-
లకటదబ్బరలాయెనా
నా పుణ్యమో లేకనిత్యోత్సవానంద -
మహిమచే మరచినావో
యీపట్ల అలమేలుమంగవేంకటరమణ -
యెవరు నన్నాదరించేరు వోస్వామీ ॥నా॥

(సం. ప్రదర్శిని: భా 2. అనుబంధము 13, పు. 52)

చిన్నన్నను గురించి 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని' లో ఇట్లు చెప్పబడియున్నది —

"తాళపాకము చిన్నయ: ఇతడు తెలుగు బ్రాహ్మణుడు. వెంకటాచలపతి భక్తుడు. తిరుపతిలోనుండినవాడు. వెంకట రమణ విషయమై భాగవతసంప్రదాయంగా వాడుకలోగల ఉత్సవపద్ధతి నేర్పరచిన

(30వ పేజీలో చూడుడు)

# శ్రీ అన్నమాచార్య సంకీర్తనామృతము

**శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి**

(గత సంచిక తరువాయి)

అవ:- కర్మఫలము భగవంతునికిగూడ అనుభవింపక తీరదని ఆయనతోనే పరియాచక మాడుచున్నాడు —.

61

ధన్యాసి

సామాన్యమా పూర్వ-సంగ్రహంబగుఫలము
నేమమునఁ బెనగొనియె-నేఁడు నీ వనక ॥పల్లవి॥

1. జగతిఁ బ్రాణులకెల్ల-సంసారబంధంబు
తగుల బంధించు దరి-తంపుఁగర్మమున:
మగుడ మారుకు మారు-మగువ నీయుర ముపై
తెగికట్టి రెవ్వరో-దేవుండ వనక ॥సామా॥

2. పనిలేక జీవులను-భవసాగరంబులో
మునుఁగ లేవఁగఁ జేయు-మోహదోషమున
పనిపూని జలధిలోఁ-బండబెట్టిరి నిన్ను
వెనకెవ్వరో మొదలి-వేలువనక ॥సామా॥

3. ఉండనీయక జీవ-నోపాయమున మమ్ము
కొండలను గొబల తతి-గొని త్రిప్పుఫలము
కొండలను నెలకొన్న-కోనేటి పతి వనఁగ
నుండవలసెను నీకు-నోపలేనవక ॥సామా॥
(11-3-71)

దేవా! తొల్లి తాను చేసిన కర్మమునకు కలుగు ఫలము సామాన్యమైనది కాదుసుమా! దానిని తప్పించుకొనుట కెవ్వరికిని శక్యముగాదు. అది నియమము తప్పక దేవాధిదేవుడవైన నిన్నుగూడ లెక్కగొనక పట్టి పీడించుచున్నది.

నీవు లోకములోని ప్రాణులకందరికి సంసారము అను బంధమును తగులగట్టితివి. ఆ పాపకర్మము నిన్ను వదలలేదు. దానికి ఫలముగా నీవు దేవుడవన్న భావముతోనైన నిన్ను వదలిపెట్టక ఎవ్వరో సాహసించి నీ యెదపై సంసార కారణమైన ఒక కాంతను (అలమేలు మంగను) తగులగట్టిరి.

నీవు మరొక ప్రయోజనవంతమైనపని యేమియులేక భవసముద్రములో ఊరక జీవులను ముంచుట, తేల్చుటయే పనిగా పెట్టుకున్నావు. ఆ మోహాదోషము నిన్ను వీడిపోలేదు.. దానికి ఫలముగా పూర్వమెవరో అందుకని పూని ఆదిదేవుడవని యైన తలంపక నిన్ను సముద్రములో పండబెట్టినారు.

మరియు నీవు మమ్మొకచోట కుదురుగా ఉండనీయక జీవనోపాయమునకై కొండలలో, గుహలలో అదేపనిగా తిరుగులాడునట్లు చేసితివి. దాని ఫలము నిన్ను వెన్నంటినది. అందువలననే నాచేతగాదని తప్పించుకొని పారిపోవుటకు వీలులేనట్లుగా కోనేటిపతి వన్న పేరుతో కొండలలోనే (తిరుమలలోనే) నీవు నెలకొనియుండక తప్పలేదు.

వి:- "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్" అన్నట్లు చేసిన కర్మకు ఫలము జీవులందరు అనుభవించి తీరవలసినదే. దేవునికి గూడ ఈ కర్మఫలమనుభవింపక తీరుటలేదని అన్నమయ్య పరిహాసధోరణిలో ఈ పాట పాడినాడు.

భక్తుడు తన్ను భగవంతునికి దాసునిగా సమర్పించుకొన్నట్లే భక్తి తీవ్రతచేత ఆ పరమాత్ముని సామాన్యునిగా నెంచి ఎకసక్కె మాడుటయుగలదు ఇందు మొదటిది ప్రత్యక్షదైన్యమునకు నిదర్శనము కాగా, రెండవది పరోక్షదైన్యమునకు నిదర్శన మగుచున్నది. తన పరిహాసమునకు పాత్రుడైన ఒక మిత్రునిగా భగవంతుని భావింప గలుగుటచే అన్నమయ్య పరమాత్మునితో ఎంతగా ఆత్మీయతను పెంచుకొన్నాడో దీనివలన స్పష్టమగుచున్నది.

ఈ ధోరణిలో రచింపబడిన పాటలింకను కొన్ని కానవచ్చుచున్నవి—

సామంతం

ఎన్నఁగలుగు భూతకోటి-నెల్లఁజేసినట్టిచేత
నిన్నుఁ జేసుకొనుటగాక-నీకుఁ దొలఁగ వచ్చునా? ॥పల్లవి॥

గుట్టుచెఱిచి లోకమెల్ల-ఘోరసంసారమందు
కట్టివేసినట్టి పాప-కర్మ మేల తీరును?
పట్టితెచ్చి నిన్ను రోలఁ-గట్టివేసి లోకమెఱుఁగ
రట్టుసేసుఁగాక నిన్ను-రాజనన్న విడుచునా? ॥ఎన్న॥

మిట్టుపల్లములకుఁదెచ్చి-మెఱసి భూతజాలముఁ లకు
దొట్టుపెసలు గొలిచినట్టి-దోస మేల పాయును?
అట్టుసాఁచి గోపసతుల-నలమి వెంటవెంటఁ దిరుగ
వెట్టిఁజేయుఁగాక నీవు-విభుఁడనన్న విడుచునా? ॥ఎన్న॥

పరులయింటికేఁగి పరుల-పరుల వేఁడఁజేసినట్టి
యెఱుకమాలినట్టి చేఁత-లేల నిన్ను విడుచును?
వెరవు మిగిలి వేంకటాద్రి-విభుఁడ వనుచు జనులచేత
నరుల గొనఁగఁజేయుఁగాక-ఆస నిన్ను విడుచునా ॥ఎన్న॥
(5-113)

సాళంగనాట

ఎట్టి వారికి నెల్ల-విట్టికర్మములు మా
యట్టి వారికి నింక-నేది త్రోవయ్యా! ॥పల్లవి॥

(29పేజీలో చూడుడు)

(ప) పూర్వసంగ్రహంబు = మున్నుచేసిన కర్మచే సమకూర్చుకొన్నది; నేమమునన్ = నియమముతో.

1. మగుడ = మరల; మగువన్ = స్త్రీని, అలమేలు మంగను; తెగి = సాహసించి.

2. గొబలన్ = గుహలందు; తతిగొని = అదను చూచి.

# శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానము, తిరుమల

## వివిధ ఆర్జిత ఉత్సవముల ధరల వివరములు.

### దర్శనములు

1. స్పెషల్ దర్శనము రు. 25

ఈ టికెట్టు తిరుమలలోనూ, దేశంలో ఆంధ్రాబ్యాంకువారి వివిధశాఖలలోను లభించును. ఈ టిక్కెట్టు వారిని సుప్రభాత సమయంలోనూ, సర్వదర్శన సమయంలోను అనుమతించటం జరుగుతుంది. ఈ టిక్కెట్టు వారిని సర్వదర్శన సమయంలో ధ్వజ స్తంభమువద్ద గాక మహా ద్వారంవద్ద క్యూలో చేర్చటం జరుగుతుంది.

### సేవలు

| | | |
|---|---|---|
| 1. | ఆమంత్రణోత్సవము | రు. 200 |
| 2. | పూలంగి సేవ | రు. 60 |
| 3. | అభిషేకము (పులికాపు సేవ) | రు. 450 |
| 4. | గంబురగిన్నె | రు. 250 |
| 5. | పునుగుగిన్నె | రు. 100 |
| 6. | జాఫ్రాగిన్నె | రు. 100 |
| 7. | కస్తూరిగిన్నె | రు. 100 |
| 8. | సహస్రకలశాభిషేకము | రు. 2500 |
| 9. | తిరుప్పావడ | రు. 5000 |
| 10. | కోవిల్ ఆళ్వారు తిరుమంజనం | రు. 1745 |
| 11. | ఐనా మహల్లో డోలోత్సవం | రు. 1000 |

### ఉత్సవములు

| | | |
|---|---|---|
| 1. | వసంతోత్సవము | రు. 2500 |
| 2. | కల్యాణోత్సవము | రు. 1000 |
| 3. | బ్రహ్మోత్సవము | రు. 750 |

### వాహనములు

1. సర్వభూపాలవాహనములో వజ్రకవచ సేవ 72 + 1 (హారతి) రు. 73
2. బంగారుగరుడ, కల్పవృక్ష, పెద్దశేష, సర్వభూపాల, సూర్యప్రభ ఒక్కొక్కదానికి 62 + 1 (హారతి) రు. 63
3. వెండిగరుడ, చిన్న శేష, చంద్రప్రభ, ఏనుగు, గుఱ్ఱం, హంస, హనుమంత వాహన సేవ ఒక్కొక్కదానికి 32 + 1 (హారతి) రు. 33

### అన్నప్రసాదములు (కాలుసోల)

| | | |
|---|---|---|
| 1. | దధ్యోదనము | రు. 40 |
| 2. | పులిహోర | రు. 50 |
| 3. | పొంగలి | రు. 55 |
| 4. | చక్కెరపొంగలి | రు. 65 |
| 5. | సాకరబాత్ | రు. 85 |
| 6. | కేసరిభాత్ | రు. 90 |
| 7. | పాయసము | రు. 85 |
| 8. | సీరా | రు. 155 |

### పడుల ప్రసాదములు

| | | |
|---|---|---|
| 1. | అప్పము | రు. 230 |
| 2. | లడ్డు | రు. 450 |
| 3. | వడ | రు. 250 |
| 4. | పోళీ | రు. 225 |
| 5. | దోసె | రు. 100 |
| 6. | తేనెతొళ | రు. 200 |
| 7. | సుఖియం | రు. 200 |
| 8. | జిలేబి | రు. 450 |

### నిత్య సేవలు

| | | |
|---|---|---|
| 1. | నిత్యకర్పూర హారతి | రు. 21 |
| 2. | నిత్యనవనీత హారతి | రు. 42 |
| 3. | నిత్య అర్చన | రు. 42 |

షరా :— సహస్ర కలశాభిషేకము ప్రతి బుధవారమునను, తిరుప్పావడ ప్రతి గురువారమునను జరుగును. మిగిలిన వివరములకు ఈక్రింది చిరునామాకు వ్రాయవచ్చును.

1. ఆమంత్రణోత్సవమునకు 5 గురికి మారుగా ఇద్దరికి మాత్రమే అనుమతి 3, 4 సేవలకు ఇద్దరికి, 5, 6, 7 సేవలకు ఒక్కొక్కరికి మాత్రమే అనుమతి.
2. ప్రతిదినం మధ్యాహ్నం 1-00 గం॥ 8-00 గం॥ లోపల సర్కారు లేదా ఆర్జిత కళ్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, వాహనసేవలు, సర్కారు డోలోత్సవం (ఉయ్యాల) (సర్కారు లేక ఆర్జిత ప్లవోత్సవం, మంగళవారంనాడు) జరుగుతవి.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,
తిరుమల తిరుపతి దేవస్థానం
తిరుపతి 517501

# శ్రీ వరాహ పురాణం

అనువక్త: శ్రీ ఏలూరుపాటి అనంతరామయ్య,
అధ్యక్షులు:
డా॥ కె వి.కె. సంస్కృత కళాశాల,
గుంటూరు

(మే సంచిక తరువాయి)

మూడవ అధ్యాయం

నారద పూర్వజన్మవృత్తాంతం

"భగవానుడా, దేవర్షీ, మరొకజన్మలో నీవేమి ఆచరించావో అదంతా చెప్పు, నాకు చాలా కుతూహలంగా ఉన్నది" అని ప్రియవ్రతుడు ప్రశ్నించాడు.[1]

నారదుడు చెప్పాడు:

రాజేంద్రా, సావిత్రిమాట విని ఆ వేద సరస్సులో స్నానం చేసేసరికి తక్షణమే వేయిజన్మల వృత్తాంతం నాకు జ్ఞప్తికి వచ్చింది.

నా మరొక జన్మవృత్తాంతం విను:[2]

రాజా, అవంతిఅని ఒకనగరం ఉన్నది. ఆ నగరంలో నేను పూర్వం ఒక ఉత్తమ ద్విజుడనై పుట్టాను. పేరు సారస్వతుడు. వేదవేదాంగాలఅంతు చూచాను.[3] పార్థివా! భృత్యులూ, పరివారమూ చాలామంది ఉండేవారు. ధాన్యమూ బాగా ఉండేది.

అది మరొక కృతయుగం. నాకు ఉత్తమబుద్ధి ఉండేది.[4] అందువల్ల నేను ఏకాంతంలో ఆలోచించాను. 'ఈ (సుఖ దుఃఖాది) ద్వంద్వ (భూయిష్ఠమైన సంసారంతో) నాకేమి పని? ఇదంతా నా కొడుకులకు అప్పగించి, సంకల్పం వహించి వేగంగా సారస్వతసరస్సుకు తపస్సుచేసుకోవటానికి వెడతాను' అని.[5]

ఇలా ఆలోచించి (ఉచిత) కర్మకాండల ద్వారా కేశవునివద్దనూ, శ్రాద్ధాదులద్వారా పితరులవద్దనూ, యజ్ఞాలద్వారా దేవతలవద్దనూ, ఇతర జనులవద్దనూ సెలవుతీసుకొన్నాను.[6]

అనంతరం రాజా, తపస్సుచేయటానికి సంకల్పం వహించి బయలుదేరి సారస్వత సరస్సువద్దకు వెళ్లాను. ఆ సారస్వతసరస్సే ఇపుడు పుష్కరసరస్సనబడుతున్నది.[7]

అక్కడకు వెళ్లి, నేను పురాణపురుషుడు, మంగళకరుడు అయిన విష్ణుమూర్తిని భక్తితో నారాయణమంత్రజపం చేసి, ఉత్తమమైన బ్రహ్మసారస్తోత్రంపఠిస్తూనూ ఆరాధించాను.

అందువల్ల భగవానుడు నాపట్ల సంతోషించి ప్రత్యక్షమైనాడు.[9]

(అని నారదమహర్షి చెప్పగా విని) ప్రియవ్రతుడు "సత్తమా, దేవర్షీ, బ్రహ్మ సారస్తోత్రం ఎలా ఉంటుందో వినాలనుకొంటున్నాను సుప్రసన్నబుద్ధితో అనుగ్రహంతో వినిపించు" అని అడిగాడు.[10]

బ్రహ్మసారస్తోత్రం:

నారదుడు చెప్పాడు:

పరాత్పరుడు, అమృతస్వరూపుడు, సనాతనుడు, (పరత్వానికి) అవధిఅయిన పరుడు, అనంతశక్తిశాలి, నిత్యుడు, పురాణపురుషుడు, (సర్వ)పరమాశ్రయుడు అయిన విష్ణునికి నమస్కారం.[11] పురాతనుడు, సాటిలేనివాడు, పెద్దవాడు, శ్రేష్ఠులకంటెకూడా శ్రేష్ఠుడు, పారంముట్టినవాడు ఉగ్రతేజస్వి, బహుగంభీర బుద్ధిశాలురలో ప్రధానుడు, శాసకుడు అయిన శ్రీహరి దేవునికి వందనం.[12] గొప్పవారికంటె గొప్పవాడు, తనకంటె గొప్పవాడు లేనివాడు, ప్రధానుడు, ఇతరులకు ఆశ్రయమైన వాడు, పరిశుద్ధమైన విశాలమైన స్థానం కలవాడు, గొప్పవారికంటె గొప్పవారికీ శాసకుడు, పురాణపురుషుడు అయిన నారాయణుని విశుద్ధమైన మనస్సుతో స్తుతిస్తున్నాను.[13] ఈ శూన్యమైన విశ్వశరీరాన్ని ప్రకృతిని సృష్టించి తానందులో ఉన్నాడు కనుక జనులలో 'పురుషుడు' అని ప్రసిద్ధుడైనాడు. అట్టి పురాణపురుషుడు నిర్మలుడు నారాయణుడు నాకు రక్షకుడగుగాక.[14] ఆయన పరాత్పరుడు. ఆయన రూపానికి అవధిలేదు. ఆయన పురాతనుడు, నీతిమంతులలో ముఖ్యుడు. క్షమాశాంతిధారి, ధరణీకాంతుడు, శుభస్వరూపుడు. అట్టి మహానుభావుని సదా స్తుతిస్తున్నాను.[15] ఆయన అనంతపాదుడు, అనంతబాహుడు సూర్యచంద్రులు ఆయననేత్రాలు. ఆయన నాశరహితుడు, క్షీరసాగరశయనుడు, అమృతస్వరూపుడు, పరమేశ్వరుడు. అట్టి నారాయణుని స్తుతిస్తున్నాను.[16] ఆయన (ఋగ్యజుస్సామనామక) త్రివేదవేద్యుడు, ద్వాదశ (ఆదిత్య) రూపాలతోనూ ఒక (పరబ్రహ్మ) రూపంలోనూ విరాజిల్లుతూ ఉంటాడు. (హరిహరహిరణ్యగర్భ) మూర్తిత్రయంలో ఉంటాడు. (దక్షిణాగ్ని గార్హపత్యాగ్ని, ఆహవనీయాగ్ని, అన్న) మూడగ్నులుగానూ విభక్తమై ఉంటాడు! (స్థూలసూక్ష్మకారణములనే)మూడుతత్త్వాలలోనూ కానవస్తాడు. (భూతభవిష్యద్వర్తమాన) కాలత్రయ స్వరూపుడు. (సూర్యచంద్రాగ్నిరూప) త్రినేత్రుడు. అట్టి అప్రమేయ స్వరూపుడైన నారాయణునికి నమస్సు.[17] కృతయుగంలో తెల్లనితనువుతోనూ, త్రేతాయుగంలో ఎర్రనిదేహంతోనూ, ద్వాపరయుగంలో పచ్చని శరీరంతోనూ, కలియుగంలో నల్లనిఒడలితోనూ

(25వ పేజీలో చూడుడు)

# సప్తగిరి

## తిరుమల తిరుపతి దేవస్థానముల మాసపత్రిక.

★

సప్తగిరి మాసపత్రికలో వ్యాపార ప్రకటనలు ఈ దిగువ కన్పరచిన రేట్ల ప్రకారముప్రచురించబడును.

### ఒక్కొక్క ప్రకటనకు

| | | | | |
|---|---|---|---|---|
| లోపల పేజీలో: | పూర్తిపేజీ | .... | .... | రు. 80/– |
| | అర్థపేజీ | .... | .... | రు. 50/– |
| | పావుపేజీ | .... | .... | రు. 30/– |
| కవరుపేజీలు: నాల్గవపేజీ | 1 రంగులో | .... | .... | రు. 200/– |
| | 2 రంగుల్లో | .... | .... | రు. 250/– |
| | 3 రంగుల్లో | .... | .... | రు. 300/– |
| లోపల 2 వ పేజీ 3 వ పేజీ | 1 రంగులో | .... | .... | రు. 150/– |
| | 2 రంగుల్లో | .... | .... | రు. 200/– |
| | 3 రంగుల్లో | .... | .... | రు. 250/– |
| ప్రత్యేకస్థలము లోపల పేజీలో | 1 మొట్టమొదటిపేజీ | .... | .... | రు. 150/– |
| | 2 చివరిపేజీ | .... | .... | రు. 110/– |
| | 3 వార్తలపేజీకి ఎదురుపేజీ | | 1 పేజీ | రు. 100/– |
| | | | ½ పేజీ | రు. 60/– |

### సాంకేతిక సమాచారము

| | | | |
|---|---|---|---|
| స్క్రీన్: | కవరుపేజీలు | .... | 80 నుండి 100 |
| | లోపలపేజీలు | .... | 80 |
| పేజీపరిమాణము (బ్లాకులకు) | పూర్తిపేజీ | .... | 24 సెం. మీ × 19 సెం. మీ |
| | అరపేజీ | .... | 12 సెం. × 19 సెం. మీ |
| | పావుపేజీ | .... | 6 మీ × 19 సెం. మీ |

ప్రకటనకు సంబంధించిన విషయములు, బ్లాకులు, సంస్థలవారే సరఫరా చేయవలయును.

గమనిక: 1, 4 వ కవరు పేజీ తప్ప మిగిలిన పేజీలలో 6 నెలసరి సంచికలకు ముందుగా డబ్బు చెల్లించి స్థల నిర్ణయము చేసుకొనువారికి ప్రకటన రేట్లపై 10% ను, 12 సంచికలకు స్థల నిర్ణయము చేసుకొనువారికి 15% శాతమును ముదరా ఈయబడును.

2. ఈ వ్యాపార ప్రకటనల విషయము ముందు తెలుపక, కారణములు తెలుపకయే ఏ ప్రకటన నైనను విరాకరించు హక్కు సంపాదకునకు కలదు.

కార్యనిర్వాహక అధికారి,
**తిరుమల తిరుపతి దేవస్థానం.**

# ఆచార్యత్రయం వారిసిద్ధాంతాలు.

ఎందరో మహానుభావులు అందరికీ వందనములు అన్నాడు ప్రముఖ వాగ్గేయ కారుడు త్యాగబ్రహ్మ. మన పవిత్ర భారతావనిలో ఎందరో మహనీయులు జన్మించేరు. ధర్మచ్యుతి కలిగినపుడల్లా ప్రజలను సన్మార్గవర్తనులుగాచేసి ధర్మస్థాపన చెయ్యడానికి మహానుభావులు జన్మిస్తూ వుంటారని మన నమ్మకం. ఇటువంటి నమ్మకం మనవైదిక మతానికొక ప్రత్యేకత. ఇతరమతాల్లో అయామతప్రవక్తలు వారివారి సిద్ధాంతాలను బోధించి పోయిన తర్వాత మళ్లా అంతటి మహనీయుడు జన్మించి సడలిపోతున్న ధర్మ బీజాల్ని గట్టిపరచి మతాన్ని పటిష్టంచేసే ప్రయత్నం ఎక్కడాకాన్పించదు. ఆ కారణంచేతే కాబోలు సడలిపోతున్న ధర్మాలు సడలి పోతునేవున్నాయి! ఎవ్వరూ పట్టించుకున్నట్టులేదు. డాక్టరు రాధాకృష్ణ పండితులు (1967 లో రాష్ట్రపతి పదవీవిరమణ చేస్తున్నప్పటి రేడియో ప్రసంగంలో) చెప్పినట్టు కుడిచెంపకొడితే ఎడమచెంపచూపించమన్న మహనీయుని అనుయాయులు ఆ బోధలు విస్మరించి కుడిచెంప ఎవ్వరూ కొట్టకుండానే - ముందు ముందు కొడతారేమోనన్న భయంతో - భయంకరమయిన అణ్వాయుధాలను పెంచి ప్రజానాశనానికి సిద్ధపడుతున్నారూ అంటే చాలా శోచనీయమయిన విషయం. మనసనాతన ధర్మాన్ని ఏ మహనీయులు స్థాపించారో ఎన్నివేల సంవత్సరాల కిందట స్థాపించారో తెలియదుగాని ప్రజలలో ధర్మాసక్తి నశించినపుడల్లా, నిరీశ్వరవాదులు ప్రబలినపుడల్లా, పాషండ మతాలు తలఎత్తినపుడల్లా ఎవరో ఒక మహనీయుడు జన్మించి ప్రజలను సన్మార్గవర్తనులుగా చేసేప్రయత్నం అనాదినుండీ జరుగుతూనేవుంది. వైష్ణవులలో ఆళ్వార్లు, శైవులలో నాయనార్లు, మాధ్వులలో హరిదాసులు ఇందుకు దృష్టాంతంగా చెప్పుకోవచ్చు. భూలోకంలోని జనులు అజ్ఞానులై పరతత్త్వసారాన్ని తెలుసుకోలేక పాషండ మతాన్ని అవలంబించి ధర్మమార్గానికి దూరమయిపోతున్నప్పుడల్లా పరమపదములోని శ్రీమన్నారాయణుడు తన దేవీ భూషణాయుధ పరిజనముల అంశలతో సన్నిద్ధరాళ్వార్లనవతరింపజేసి ప్రజలనుజ్జీవింపచేసేడని వైష్ణవగ్రంథాల్లో వుంది.




ఇటువంటి పురాతన, పురాణ విషయాలు ఈ ఆధునికకాలంలో ఎవ్వరు నమ్మినా నమ్మకపోయినా ఇతిహాసంలో వర్ణింపబడ్డ ఆచార్యత్రయాన్ని మాత్రం ఎవ్వరూ విస్మరింపలేరు. వేదాంతశాస్త్ర వివరణలో మన దేశం అనేకమంది సిద్ధాంతప్రవక్తలను రూపొందించినా శంకర, రామానుజ మధ్వాచార్యులన్న ఈ ఆచార్యత్రయం మాత్రం ఈనాటికీ పూజనీయులగనే పరిగణింపబడుతున్నారు. వారవతరించి శతాబ్దాలు శతాబ్దాలు గడచిపోయినా ఇప్పటికీవారు ప్రజల హృదయాలలో చెరగనిముద్ర వేసుకొని నిలిచేవున్నారూ అంటేవారి ప్రజ్ఞ ఎంత ఉన్నతమయినదో, ఎంతగంభీరమయినదో ఎంతపటిష్టమయినదో మనం ఊహించుకోవచ్చు. ముగ్గురూ వైదికమతావలంబులే. ముగ్గురూ వేదప్రమాణాన్ని అంగీకరించిన వారే. ముగ్గురూ ఉపనిషత్తులను ఆదరించినవారే. అయినాముగ్గురూ మూడుత్రోవలు త్రొక్కేరు. అలా త్రొక్కడానికి కారణం అప్పటి దేశకాల పరిస్థితులయివుండవచ్చు.

ఒకరు జ్ఞానవాదాన్ని ఉద్బోధిస్తే మరొకరు కర్మ జ్ఞానాలు ఉపాంగంగాగల భక్తిమార్గాన్ని సూచించేరు. మూడవవారు కేవలం విష్ణుభక్తికే ప్రాధాన్యమిచ్చేరు. దృశ్య ప్రపంచంలోని మూలతత్త్వం అంతా ఒక్కటేఅని ఒకరు ప్రవచిస్తే, ఏకత్వంలోకించిత్ భిన్నత్వాన్ని ప్రతిపాదించేరు వేరొకరు. ఏకత్వంప్రశ్నేలేదు, అంతా భిన్నత్వమే అని సిద్ధాంతీకరించేరు మరొకరు. ఈ క్రింద వారివారి సిద్ధాంతాలలోని ప్రభేదాలను కొంచం పరిశీలిద్దాం.

ఆచార్యత్రయంలో మొదటివారయిన శంకరాచార్యులు క్రీస్తుశకం ఏడవ శతాబ్దానికి చెందినవారు. వీరు చాలా పిన్నవయస్సులోనే సమస్తశాస్త్రాలు అభ్యసించి ఏకదండి సన్యాసాన్ని స్వీకరించి ప్రస్థానత్రయమనబడే భగవద్గీత, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలకు విపుల వ్యాఖ్యానాలు వ్రాసి బౌద్ధమతంవల్ల మతానికి వాటిల్లేముప్పు గ్రహించి బౌద్ధాన్ని దేశం పొలిమేర్లలో లేకుండా తరిమేస్తానని కంకణం కట్టుకొని

శ్రీ గాదె రంగారావు,
బెరహమ్‌పూర్.



నాటక ప్రదర్శన ప్రారంభ సభలో ప్రసంగిస్తున్న శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ తెలుగుశాఖాధీదరు డా. యం. సుబ్బారెడ్డి, అధ్యక్షత వహించిన శ్రీ ప్రసాద్. దేవస్థాన ఉపకార్య నిర్వహణాధికారి శ్రీ యన్. నరసింహరావు ఎడమ చివరను చూడవచ్చు

★

## శ్రీనివాస కళ్యాణం నాటక ప్రదర్శనం

★

దేవస్థానం చేపట్టిన కళాభివర్ధక కార్యక్రమాలలో, శ్రీ శేషశైలేశుని కళ్యాణ గాథను వివరించే శ్రీనివాసకళ్యాణ నాటక ప్రదర్శన ఒకటి. ఈ నాటకాన్ని తేది 11–5–79 దేవస్థాన ఉద్యోగులు తిరుపతిలో ప్రదర్శించారు.

★

నాటకంలో పాల్గొన్న కళాకారులతో కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్.



వైదికుల బహుదేవతారాధనను నిరసించే బౌద్ధుల వాదన నెదుర్కొనేనిమిత్తం వేదాల్లో ఏకేశ్వరాధనమే చెప్పబడ్డదనీ 'ఏకంసద్విప్రాబహుధావదంతి' అని (అంటే వున్న సత్‌పదార్థం ఒక్కటే గాని విదులు ఆ దేవునికి అనేక నామరూపాలు కల్పించి చెపుతూంటారు) అద్వైతసిద్ధాంత ప్రతిపాదనకు పూనుకున్నారు.

వీరి సిద్ధాంతరీత్యా ఈ జగత్తు అంతా ఒక్క బ్రహ్మపదార్థంతోనే నిండివుంది. భగవంతునికంటె వేరుగానూ స్వతంత్రమును సత్యమును అయిన రెండవ తత్త్వమేదియులేదు. ఉన్నదంతా ఒక్క బ్రహ్మపదార్థమే గనుక జీవేశ్వరులకు భేదంలేదన్నారు. నీలోవున్న ఆ జీవాత్మ నాలోవున్న జీవాత్మ రెండూ ఆ బ్రహ్మ పదార్థమే అనిచెప్పడానికి 'సోఽహం' అనీ 'తత్త్వమసి,' 'అహంబ్రహ్మాస్మి,' 'ఏక మేవాఽ ద్వితీయంబ్రహ్మ' అని కొన్ని మహావాక్యాలు ప్రసాదించేరు.

జగత్తులో నానాత్వం భాసమానమవ డానికి కారణం ఈ దృగ్గోచరమవుతున్న దంతా స్వాప్నికజగత్తులా మాయాజనితం అని 'బ్రహ్మసత్యం జగత్‌మిథ్య' అని ప్రతిపాదించేరు. మిథ్య అంటే ఈ కన్పిస్తున్న స్వరూపం దాని అసలు స్వరూపం కాదనీ, దాని అసలు స్వరూపం ఈ చర్మ చక్షువులకి దృగ్గోచరం కాదనీ వారి భావం. దీనికి దృష్టాంతంగా ఛాందోగ్యంలోని 'తదేవసోమ్యేదమగ్ర ఆసీత్' అన్న శ్రుతి వాక్యాన్నుదహరించేరు. అంటే ఈ సమస్త ప్రపంచము ముత్యపుచిప్పలోని వెండివలె జనులను భ్రమింపచేస్తున్నది అని అర్థం.

పరమాత్మ తత్త్వాన్ని వివరిస్తూ శంకరులు పరమాత్మ గుణరహితుడు, రూప రహితుడు, అవ్యక్తుడు, మాయకతీతుడు

(26 పేజీలో చూడుడు)

# ఆంధ్రశతకవాఙ్మయ వికాసము

(గత సంచిక తరువాయి)

హరిభక్తి శతకములలో రామ, కృష్ణ, నృసింహావతారములగూర్చి వెలువడిన శతకము లధికముగ గలవు నారాయణుని దివ్యలీలా విశేషములను, విశ్వరూపమును కీర్తించిన శతకములలో పోతన కృత నారాయణశతకము మేలుబంతి ఆంధ్ర దేశమున ప్రబలిన వైష్ణవమత ప్రాబల్యత ననుసరించి విష్ణుపారమ్యమగు శతకము లనేకములు వెల్వడినవి తెలుగునాట గల ప్రతిక్షేత్రమునుగూర్చియు రఘువీర, రామచంద్ర, సీతాపతి, జానకీశ్వర, రాఘవ యను శతకములు రచింపబడినవి తిక్కన నాచన సోమనాదులు హరిహరాభేదతత్వ మును తమదృష్టిలో విడికొని రచన లొన ర్చిరి అట్టిదృష్టితో వెల్వడినవే భక్త చింతామణి, భక్తలోల, భక్తరక్షామణి మొదలగునవి ఇవి కవుల విశాలదృష్టికి తార్కాణములనక తప్పదు. త్రిదేవులగు లక్ష్మి సరస్వతి పార్వతులనుకూడా కవులు స్తోత్రముచేయుట జరిగినది

ఆంధ్రవాఙ్మయమున భక్తిశతకముల తరువాత నీతిశతకములు చోటుచేసి కొన్నంత వఱి యే యితర శతకములు చోటుచేసికొనలేదనుటలో నెట్టియత్యుక్తి లేదు చతుర్విధ పురుషార్థములలోధర్మము మొట్టమొదటిది అంతియేకాదు శ్రేష్ఠ తమముకూడ దేశసంస్కృతి మానవుని ధార్మికనైతిక జీవితముపై నాధారపడి యుండునుకదా! అనాదికాలమునుండియు నీతిశాస్త్రవేత్తలు ధర్మశాస్త్రవేత్తలు, తమకుగల యపార లౌకికజ్ఞానమును పుర స్కరించుకొని వేదసమ్మితముగను, పురాణసమ్మితముగను, కాంతాసమ్మితము గను, అన్యాపదేశముగను నీత్యుపదేశము నొనర్చిరి కాని వేదము ప్రభుసమ్మితము. పురాణము మిత్రసమ్మితము కావ్యము కాంతాసమ్మితము సామాన్యుల కందు బాటులో నుండునట్లు ఆ ధర్మమును-ధర్మ రహస్యములను సంగ్రహరూపమున వెలు వరించినవారు నీతిశతకకర్తలు రాజనీతి-లౌకికనీతియని ద్వివిధముగ నీతిశతకముల వర్గీకరింపనగును రాజనీతి శతకములలో బద్దెన నీతిశాస్త్రముక్తావళి మొట్టమొదటిది బద్దెన నీతిశాస్త్రముక్తావళియేగాక సామాన్యజనుల కందుబాటగునట్లు సుమతి శతకమును కూడ రచించెను తెలుగున నిదియే ప్రప్రథమ నీతిశతకము ప్రశస్తి నొందినదికూడా దీనిలో నొక్కపద్య మైన కంఠస్థముగారాని యాంధ్రుడుండ డనుటలో నతిశయోక్తిలేదు దృష్టాంతనీతి ప్రధానములగు శతకములలో భాస్కర శతకమగ్రగణ్యము

తెలుగులోని నీతిశతకములన్నియునొక యెత్తు వేమనపద్యము లొకయెత్తు ఆంధ్ర శతకకర్తలలో వేమన మకుటములేని మహారాజు కొనయూపిరితో నున్నంత వఱకు ఆశువుగా వేలకొలది ఆటవెలదుల నల్లిన మహాకవి యోగివరేణ్యుడు భక్తి, నీతి, శృంగార, వైరాగ్య, తత్త్వ, అధిక్షేప, యిత్యాదివస్తువు ననుసరించి ఈతని పద్దెముల వర్గీకరింప వచ్చును భావము హృదయమున సూటిగా హత్తు కొనునట్లు పద్దెమల్లుట వేమనయోగి సొత్తు ఒక్కపద్దెమైనను సుపరిచితముగాని యాంధ్రుడుండడు ఈకవి పద్యములు వేమన వేదముఁని ఖ్యాతి వహించినవి. నెలయేటి ధారవలె తెలుగు నుడికారపు సొంపులలో, నాటవెలది మధురాతి మధురమై, ముత్యాల మూటయై పండిత పామరుల నొక్కుమ్మడి ఉఱ్ఱూత లూగిం చెను.

సామమార్గమున నెఱవేఱని కార్యము దండముచే కదాసాధ్యమగునది! మంచి మాటలు చెవికెక్కనపుడు మందలింపు-బెదరింపు హెచ్చరిక-అవహేళన-దూషణ శిక్ష యిత్యాది శరణ్యము మార్గాంతరమును కూడ నవితుకదా! వ్యక్తివిగాని, లేక సంఘమును గాని ఘోరాతి ఘోరమైన రోగము పట్టి పీడించునపుడు కీలెరిగివాత వాత పెట్టక తప్పదు ఏలయన విషమ పరిస్థితులలో విషమే యమృతమై, చవి పోవువానిని బ్రతికించును అదియే అనగా నా విషమే రోగిపాలిట దివ్యౌషధమగును సామాన్యనీతులు ప్రభుసమ్మితములవంటివి


శ్రీమతి టి మంగమ్మ,

తెనాలి


వాని వలన ప్రయోజనము శూన్యమగు నపుడు అధిక్షేప నీతియే మార్గాంతము కవులు దానికి మార్గదర్శకులు ఆలంకారి కుల మత ప్రకారము కావ్య ముపదేశాత్మ కమై యుండవలెను ఇట్టి సమయమున సంఘమును వ్యక్తులను నీతి పదము నడి పించుటకు చేసిన ప్రయత్నఫలముగనే అధి క్షేపశతకము లయార్పావమైనది విజయ నగరసామ్రాజ్య పతనానంతరము దేశ మునననేక విధముల యశాంతి వ్యాపించి నది అట్టి ఆర్థిక, రాజకీయ, సాంఘిక మతమునందలి యశాంతిని కవులు అధిక్షేప శతకములందు చక్కగా చిత్రించిరి. అధిక్షేప శతక కర్తలలో ప్రముఖులు కవిచౌడప్ప. వేమన, కూచిమంచి సోదరులు, అడిదము సూరకవి కావ్యవస్తువు, ధ్యేయము అందఱిది ఒక్కటే కాని లక్ష్యసాధన కనున

రించిన విధానములు వేరు. కవిచౌడప్ప కందములు తిక్కన తదుపరి పేర్కొన తగినవి. ఇవి ఒరులు మాటకాదు. కవి చౌడప్ప స్వోత్కర్షగా ఆత్మ ప్రత్యయముతో వచించినమాట. ద్రాక్షాపాక మీతని రచనా విశేషము. ప్రజల యభిరుచి నెఱిగిన పరేంగితజ్ఞాని. కాని ఈకవి రచన బూతులు కేవలమశ్లీలోక్తులుకావు. వ్యంగ్య చమత్కృతులతో అధిక్షేపాత్మకమగు నీతి కవితలోగర్భితమైయుండును.

కూచిమంచి సోదరకవులు భక్తి శతకములలో ఆత్మ నివేదన మొనర్చుకొనిరి. భర్గ, కుక్కుటేశ్వర శతకములు ఇష్టదైవముల నుద్దేశించి రచింపబడినవి. ఆత్మ నివేదనతోపాటు లోకపరిస్థితినిగూడ కవి సమీక్షా రూపమున వ్యక్తపఱచెను. తిమ్మకవి శైలిప్రౌఢము. అడిదము సూరకవి వేములవాడ భీమకవివలె శాపానుగ్రహ సమర్థుడు రామలింగేశ్వర శతకము, వేణుగోపాల శతకము ఈ కోవకు చెందినవే. ఆధునిక యుగమున అధిక్షేప శతకములలోని నూతనపోకడ బయలుదేఱినది కొందఱు ప్రభుత్వమును, మఱికొందఱు ప్రభుత్వ విధానమును దుయ్యబట్టుటకు అధిక్షేప శతకముల నూతగా గొనిరి. కాని సుకుమారమైన వ్యంగ్య చమత్కృతి యిందలి రచనా విశేషము. హాస్యము ఎంత చిరాకు మనస్సునకు కూడ ఏదో యొక మానసికానందము నిచ్చి మనస్సు నిట్టే తేలిక పఱచును. నవరసములలో వెంటనే ఆహ్లాదాకారి అని చెప్పదగినది హాస్యమే మనస్సుకు మంచి విశ్రాంతి నిచ్చి శ్రమనిట్టే పోగొట్టు శక్తిగలది కూడ. ప్రాచీనాంధ్ర సాహిత్యమున హాస్య ప్రధాన కావ్యములు లేవనియే చెప్పనగును. శతక పద్యముల రూపమున సుకుమారమైన హాస్యము నందించిన మొదటికవి వేమన. హాస్యమున చమత్కృతి, చమత్కృతిలో హాస్యము గర్భితమైయుండును. అందువలన రెంటిని విశ్లేషించి వివరించుట క్లిష్టాతి క్లిష్టమైన కార్యము. సామినేని వేంకటాద్రి చీపురుపల్లి శతకము. హరి బ్రహ్మేశ్వరకవుల విసనకర్ర శతకములీ కోవలోనివి.

అమరుకము, భర్తృహరి శృంగార శతకము మొదలగునవి సంస్కృతమున ప్రసిద్ధినొందిన శృంగార శతకములు. తెలుఁగున శృంగార కావ్యములు బహుళము. గోపికా కృష్ణుల ప్రణయము, అలమేలు మంగా వేంకటేశ్వరుల ప్రణయము నాధారముగ తెనుగున శృంగార శతకములు వెలసినవి. కృష్ణలీలా తరంగిణి, కృష్ణకర్ణామృతము, భాగవతము నందలి గోపికా క్రీడల ఛాయలీశతకము లందు కన్పట్టును, మధురభక్తి యిందలి ప్రధానమైనవస్తువు. సోమరాజు కృతనందనందన శతకము నిట్టిదే, మఱియు మదనగోపాల శతకము. కీరవాణిశతకములు కూడ నీ కోవకుచెందినవియే. పదునాల్గవ శతాబ్దము నుండి అర్వాచీనము వఱకు వెల్వడిన శృంగార శతకములలో అత్యంత విశిష్టమైనది పేర్కొనదగినది మల్లాది శివరామకవికృత శృంగారశతకము. దాంపత్య ప్రణయములోని స్వచ్ఛమైన యనురాగమే పవిత్రమైన శృంగారమని కవి భావించి యత్యంత మనోహరముగ చిత్రించెను.

(వశేషము)

దేవస్థాన నూతన నిర్వాహక మండలి, యాత్రికులపట్ల అత్యధిక సహన సుహృద్భావాలతో నడుచుకోవలసిందిగా దేవస్థాన ఉద్యోగులందరిని కోరుతూ తీర్మానించింది.

మండలి తిరుమలలో నెలకొకసారిగా మొదటి లేదా మూడవ శుక్రవారం నాడు, అవసరాన్నిబట్టి మిగిలిన సమయాలలో ఇతర ప్రదేశాలలో కూడా సమావేశం జరుపుకునేందుకు నిర్ణయించటమైనది.

దేవాదాయసహాయనిధికి (ఎండోమెంట్ ఫండ్) 1979-80 సంవత్సరంలో రు 25 లక్షలు కేటాయించాలనీ నిర్ణయిస్తూ ఈ విరాళాన్ని స్థపతులు మొదలైన నిర్మాణ విభాగపు ఉద్యోగుల నియామకం మొదలైన వాటికి మాత్రమే ఉపయోగించాలనీ కోరుతూ తీర్మానించటమైనది.

తిరుమల తిరుపతి దేవాలయ పరిధికి చేరని దేవాలయ జీర్ణోద్ధరణ, కల్యాణ మండప, సత్ర, రామమందిర నిర్మాణాదులికముందు దేవాలయ సాముదాయక సహాయకనిధి ద్వారానే జరిగేందుకు గాను ఆ నిధికి ప్రతి సంవత్సరం రు. 60 లక్షల విరాళమిచ్చేస్థితిలో దేవస్థానం ఉన్నందున ఈ విషయంగా దేవస్థానికి వచ్చే అభ్యర్థనలన్నిటిని ఈ ప్రణాళికకు బదలాయిస్తూ నిర్ణయించటమైనది.

ఇదివరకే దేవస్థాన విరాళాదులతో ఒప్పంద పురస్సరంగా జరుగుతున్న నిర్మాణాదుల విషయంలో మాత్రం ఒకదశ ముగింపు వరకు సహాయం చేయాలని, తర్వాత ఎట్టి జోక్యం దేవస్థానికి ఉండరాదని, తీర్మానించటమైనది.

ఇకముందు దేవస్థానం స్వయంపాలక ప్రతిపత్తిగల సంస్థగా రూపొందుతున్నందువల్ల దేవస్థానానికి ప్రత్యేకమైన ఆర్థిక పాలక విధానాల రూపొందించాలని తీర్మానించటమైనది.

షరాఫ్, రికార్డ్ అసిస్టెంట్ పదవులను ఒకేస్థాయి చెందినవిగా, పరస్పరం బదిలీకి అవకాశమున్నవిగా నిర్ణయిస్తూ ఇప్పుడున్న రికార్డ్ అసిస్టెంటు వేతనాలను షరాఫ్‌ల వేతనాలతో సమంగా సవరించేందుకు తీర్మానించటమైనది.

దేవాలయ సంప్రదాయ, శాస్త్ర విధుల ప్రకారం నియమించవలసిన ఉద్యోగాల విషయంలో ఉపాధిదర్శక కేంద్రాల (ఎంప్లాయిమెంట్ ఎక్స్‌ఛేంజి) ద్వారా లేదా ప్రభుత్వ నిబంధనల మేరకుగాక, ఆయా సంప్రదాయాలలో యోగ్యులైన వారిని నియమించటం యుక్తమని భావిస్తూ తీర్మానించటమైనది.

లడ్డు పరిమాణంలో మార్పులేకుండా, లడ్డు ధరను రు 2-50 నుండి 2-00 తగ్గిస్తూ తీర్మానించటమైనది.

దేవస్థానం నూతనకార్యాలయంలో, వచ్చినవారు కూర్చునేందుకు ప్రత్యేక సౌకర్యాలకుగాను రు 49,000 మంజూరు చేయటమైనది,

ఋషీకేష్‌లో ఆంధ్రాశ్రమంలోని శ్రీ వేంకటేశ్వర శ్రీ చంద్రమౌళీశ్వరస్వామి వారి దేవస్థానాలకు క్రొత్త ధ్వజస్తంభాల నేర్పాటుచేసేందుకు రు 10,000 మంజూరు చేయటమైనది,

మంగాపురంలోని వేంకటేశ్వరస్వామి ఆలయంలో మూలమూర్తికిజరిగే శుక్రవారాభిషేకంను సర్కార్-ఆర్జితఅభిషేకంగా మారుస్తూ, దానిని ఆర్జిత సేవ రుసుము రు100-00గా ఇద్దరువ్యక్తులను అనుమతిస్తూ తీర్మానించటమైనది. ఇదే విధంగా ఈ ఆలయ ఉత్సవమూర్తులకు కూడా

## నిర్వాహక మండలి నిర్ణయాలు

కపిలతీర్థంరోడ్డులో, కపిలేశ్వరనగర్ ఎదురుగా, పాలిటెక్నిక్ ప్రక్కగా గాలిగోపురం మఠానికి చెందిన 35 ఎ.కి పైబడిన స్థలాన్ని దేవస్థాన విస్తరణ, వసతిగృహనిర్మాణాది కార్యక్రమాలకుగాను తీసికొన నిర్ణయించటమైనది.

కల్యాణీజలాశయం నుండి తిరుమలకు నీరు పంప్‌చేసే ప్రతిపాదనను పునఃపరిశీలించి, దేవస్థానం పాపవినాశనం జలాశయం నిర్మిస్తున్నందువల్ల, కల్యాణీ జలాశయ ప్రణాళికక్రింద గొట్టాలువేయటం, పంప్ హవున్‌నిర్మాణం దేవస్థానం చేపట్టనవసరంలేదని నిర్ణయించటమైనది

అసలుధరలో సగం చెల్లింపు పద్ధతిన ఆంధ్రప్రదేశ్‌లోని ఇతరదేవస్థానాలకు ఇచ్చేందుకుగాను 100 గొడుగులను కొనేందుకు తీర్మానించటమైనది.

సేవలు ఏర్పాటుచేసే విషయం పరిశీలించవలసిందిగా కార్యనిర్వహణాధికారిని కోరటమైనది.

కళ్యాణకట్టలో తనకు దొరికిన 'లేడీ రిస్ట్‌వాచ్' పై అధికారులకు అప్పగించిన శ్రీ డి. భాస్కరరావు అనే కల్యాణకట్ట ఉద్యోగికి రు 25-00 ప్రోత్సాహక బహుమతిగా ఈయటమైనది.

పద్మావతీ మహిళాకళాశాలలో అధ్యాపకురాలు శ్రీమతి యన్. ఆర్. వై. రాజ్యలక్ష్మికి తిరుపతి యోగపరిశోధనాకేంద్రం, ప్రిన్సిపాల్‌గా నియుక్తులయ్యేందుకు గాను 2 సం. సెలవు మంజూరు చేయటమైనది.

ఉత్తమస్థాయి క్రీడాకారులకు ఉద్యోగావకాశాలు కల్పిస్తూవచ్చిన ప్రభుత్వపు యం. యస్. నం. 115/21-2-77 తేది ఉత్తరువును దేవస్థానానికికూడా వర్తింపచేయ నిర్ణయించటమైనది.

(22వ పేజీలో)



మహాకవి శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ (చిత్రంలో ఎడమవైపు) ముఖ్యాతిథిగా 12-5-79 సాయంకాలం ప్రారంభమైన సభలో ప్రసంగిస్తున్న దేవస్థాన కార్య నిర్వహణాధికారి శ్రీ ప్రసాద్.

# తాళ్ళపాక అ

# 571వ

## వార్తా



సభాధ్యక్షత వహించిన, కళాక్షేత్ర ప్రత్యేకాధికారి శ్రీ బాలాంత్రపురజనీకాంతరావును సన్మానిస్తున్న దేవస్థాన కార్య నిర్వహణాధికారి.

*

14-5-79 న ఆస్థా

పొందుతున్న ప్రఖా

చిత్రదర్శకుడు శ్రీ

రెండవరోజున శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావు కచ్చేరి. ↓
తరువాత శ్రీ పి. బి. శ్రీనివాస్ కచ్చేరికూడా జరిగింది.







# ఆస్థాన విద్వాన్‌లకు సన్మానం.

*

ఆస్థాన విద్వాంసులుగా గాయకులు శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావుకు సన్మానం.





# అన్నమాచార్య జయంతి.

★

## చిత్రాలు

ఆస్థాన నాట్యకళావిదుషి (విద్వాన్) గా డా. యామినీ కృష్ణమూర్తికి, ఆస్థాన మృదంగ విద్వాంసుడుగా శ్రీ ఎల్లా వెంకటేశ్వరరావుకు సన్మానం. ↓

స్థాన విద్వాన్ గౌరవం
ఖ్యాత రేఖాచిత్రకారుడు
శ్రీ బాపు.





# కీర్తనలు

**2. నాటకురంజిరాగము — రూపకతాళము.**

ప॥ పరా కేల సరస్వతి — మురారిసుత సతిమతి ॥ ప ॥

అ॥ బిరాననా — బిరాననా —
వరాలొసగు పరాత్పరీ దయాకరీ ॥ ప ॥

చ॥ 1. సురాసురుల మనంబునను - స్థిరంబుగను మతి వెలయు
పురాణియా - అంబ పురాణియా —
తరించుటకు స్మరించెద సరోజముఖ ॥ ప ॥

2. పరాశరాదులకైనను ప్రణుతింప తరముగాని
తిరుపతి - తిరుపతి -
పురవాసుడౌ దేవదేవుని దలచునాపై ॥ ప ॥

శ్రీ విద్యల నారాయణస్వామి,

# చందాదారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రిక చందాదారులలో దిగువ పేర్కొన్న సంఖ్య వారి చందా 31-8-79 తేదీకి అంతమగును. చందాదారులు ఈ విషయమును గమనించి M. O. ద్వారా దిగువ పేర్కొనిన ప్రకారము మనియార్డరు కూపనునందు తమ చందా సంఖ్య పూర్తి విలాసమును పేర్కొని, త్వరలో చందా పంపనియెడల ఆ తేది దరిమిలా పత్రిక పంపబడదు

చందాదారుల నంబర్లు మార్చబడినవి. క్రొత్తనంబర్లు దిగువ పేర్చొనబడినవి. తమకు పంపిన పత్రిక అడ్రసు పేపరుమీద నున్న నంబరును క్రొత్త నంబరుగా గమనింప ప్రార్థన.

7 14 221 222 225 226 251 255 256 258 311 312 315 317 319 371 374 375 432 451 526 527 529 530 532 535 536 537 541 542 543 545 760 761 762 764 765 766 767 769 771 1388 1438 1440 to 1453 1455 to 1461 1463 1464 1465 1574.

గమనిక :— (1) సప్తగిరి చందాలు 15 తేదిలోగా చేరునట్లు పంపవలెను. ఆ తరువాత చేరిన చందాలకు మరునెలనుండి మాత్రమే పత్రిక పంపబడును.

(2) క్రొత్త చందాదారులు కూపనులో 'క్రొత్తచందా' అని పేర్కొనవలెను. పాత వారు కూపనులో తమ చందా సంఖ్య నమోదు చేయవలెను.

(3) సప్తగిరి చందాలు ఈ క్రింది అడ్రసుకే తమ పిన్‌కోడ్ తెలియజేస్తూ పంపవలయును.

సప్తగిరి మాసపత్రిక సం॥ చందా రు. 6/-

ఎడిటరు
పబ్లికేషన్ సెక్షన్
ప్రెస్ కాంపౌండ్, తిరుపతి 517501.

(19వ పేజీ తరువాయి)

బెంగళూరుకు చెందిన శ్రీ యస్. యస్ యస్ అయ్యంగార్‌ను రు 1000 వేతనంతో క్యాంటీన్ ఆఫీసరుగా నియమించటమైనది.

శ్రీవేంకటేశ్వర నాటకకళాపరిషత్ రజతోత్సవసందర్భంగా రు. 20,000 విరాళమీయటమైనది.

గురువాయ్యూరులో కల్యాణమండప నిర్మాణ విషయం తి. తి దేవస్థానం, చేశంఖుస్థాపనాదులు జరిపించబడి, ఆసక్తి బాగా ఉన్నందున ఆకల్యాణమండప నిర్మాణాన్ని ఆమోదిస్తూ ఆ నిర్మాణకార్యక్రమం, కేరళ కన్‌స్ట్రక్షన్ కార్పొరేషన్‌కు ఇచ్చేందుకు నిర్ణయించటమైనది.

హైదరాబాదులోని శిల్పవిద్యాలయము తీసుకొని నిర్వహించేందుకు లోగడ జరిగిన నిర్ణయానికి బదులుగా, దేవాదాయశాఖ వారే ఆవిద్యాలయాన్ని నిర్వహించేందుకు గాను రు 50,000 ల రికరింగ్ గ్రాంటు మంజూరు చేయటమైనది.

కడప పట్టణములో నెలకొల్పుటకు అన్నమాచార్యులవారి, కంచువిగ్రహాన్ని, ప్రొద్దుటూరు పురపాలక ఉన్నతపాఠశాలలో నెలకొల్పేందుకు ఆయన శిలా విగ్రహాన్ని తయారుచేయించి విరాళంగా ఇచ్చేందుకు నిర్ణయించటమైనది.

పిఠాపురంలోని సంస్కృత పాఠశాలకు రు. 10,000 మంజూరుచేయటమైనది.

ఏర్పేడు వ్యాసాశ్రమంలోని శ్రీ వేంకటేశ్వర బాలశరణాలయం విద్యార్థులకు విద్యార్థి వేతనానికిగాను 1977-78 సం. 78-79 సంవత్సరాలకు సాలీనా రు. 6,000 మంజూరు చేయటమైనది.

బయటప్రాంతాలలోఉన్న తిరుమల తిరుపతి దేవస్థావ సత్రాలకు సుమారు 8 నెలలలోగా ఆయా స్థళీయదేవాలయాలకు దీర్ఘకాలం అద్దెకుగాని, ఉచితంగా గాని ఇచ్చేందుకు, ఒకవేళ ఎవరు స్వీకరించేందుకు ముందు రాని పక్షంలో యోగ్యమైన నిర్ణయం తీసుకొనేందుకు కార్యనిర్వహణాధికారిని అధికారమీయటమైనది. *

# భాగవతము నందలి భక్తులు

(గతసంచిక తరువాయి)

## 1. పరీక్షిత్తు

భారతవంశజుడు, హయమేధరాజిరా చారపరుడు, మహానయవిశారదుడు, రాజకులైకభూషణుడు, అభిమన్యుపుత్రుడు, అర్జున పౌత్రుడు నగు పరీక్షిన్మహారాజు పరమభాగవతాగ్రేసరుడు. మాతృగర్భాంతరాళమునందున్నపుడే యితడు,

"రాడా చూడ? సమస్తభూతములలో రాజిల్లి వాడిచ్చుటన్
లేడా? పాఱుని చిచ్చుఱమ్ము తొలగన్ లీలాగతిం ద్రోవ నా
కీడా? నేడభయప్రదానమతడూహింపన్ నతత్రాతమున్
కాడా? యెంతరికావదీయెడలసత్కర్మంబు కానెట్టిదో" (1-281)

అని పరమేశ్వరుని ప్రార్థించిన భక్తుడు. సర్పదష్టుడై మరణించునట్లు శృంగిమహర్షిచే కర్మవశమున శాపమునొంది భూలోకస్వర్గభోగంబులు హేయంబులని తలచి రాజ్యంబు విసర్జించి -

"చిత్తము గోవింద పదా
యత్తము గావించి మౌనియై తనలోనే
తత్తరము లేక భూవర
సత్తముడు" -

ముక్తసంగత్వమున వసించి ప్రాయోపవిష్టుడయ్యెను. అట్టి సమయమున నతని కడకు అవధూతోత్తముడైన వ్యాసనందనుడు శుకయోగీంద్రుడరుగుదెంచి భాగవతపురాణము వినిపించెను. భాగవత శ్రవణమువలన పరీక్షిత్తు, కీర్తనము వలన శుకుడు, విష్ణుసాయుజ్యమునందిరి. శృంగి శాపమే లేకున్నచో పరీక్షిత్తు భాగవతుల పట్టికయందు చేరుట సంశయము. 'నియతి బలవతి' అని కదా పెద్దల వాక్యము. వైరాగ్యమిళితమైన యితని భక్తి ప్రశంసార్హము. అకారణముగ నన్యుల నవమానింపతగదనియు, సప్తవ్యసనములలో దేనికి లోబడినను ప్రమాదమేననియు, కర్మఫలము నెట్టివారైన ననుభవించితీర వలసినదేననియు నీ రాజోత్తముని కథ వలన తెలియనగును.

## 2. ధ్రువుడు

భగవత్సాక్షాత్కారమునందుటకు వయస్సుతో నిమిత్తములేదని ధ్రువుని కథయందలి తాత్పర్యము. భాగవతము చతుర్థస్కంధము నందీతని వృత్తాంతము వివరింపబడియున్నది. స్వాయంభువ మనువు కుమారుడైన ఉత్తానపాదునకిర్వురు భార్యలు. పెద్దభార్య సునీతి. చిన్నభార్య సురుచి. రాజుకు సురుచియందు ప్రేమ యెక్కువ. ఒకనాడు సునీతి తనయుడగు ధ్రువుడు తండ్రి యంకభాగము నధివసింప నుత్సుకుడుకాగా అతనిని సురుచి వారించి

ఏ) "తండ్రితొడనెక్క వేడుకతగిలెనేని
పూని నాగర్భమున నాదు పుట్ట కవ్య
గర్భమున పుట్టకోరిన కలదె నేడు
జనకుతొడనెక్కు భాగ్యంబు సవతి
కొడుక" - (4-219)

బి) అదిగాన నీ వధోక్షజు
పదపద్మము లాశ్రయింపు పాయక
హరి నా
యుదరమున పుట్టువిచ్చును
వదలక యత్నైన మువముదవ నెద
వనఘా" - (4-220)

అని యీసడించినది. విష్ణుని ధ్యానింపుమనెడు సద్బోధయు విందిమిడియుండుట విశేషము. సురుచి మాటలు ధ్రువునిమనస్సును గాయపఱచినవి. ఆమె నిష్ఠురోక్తులకు తల్లి హితోపదేశము తోడుకాగా హరిప్రసాదమునందుట కతడారాటపడినాడు. నారదునిప్రబోధము కర్తవ్యనిష్ఠకు దోహదమొసగినది. సుఖదుఃఖములకతీతమగు నిష్కామభక్తి ధ్రువునియందు కన్పట్టదు. అది సకామమేయైనను ఏకాగ్రతకు నిలయము. పట్టుదల, స్థిరచిత్తము కలిగియున్నచో భగవంతునినైతము సాక్షాత్కరింపజేసి కొనవచ్చుననుటకు ధ్రువునిగాథ యుదాహరణము "విష్ణుపదమత్యున్నతము. తీవ్రయోగసమాధినిష్ఠులైన తపస్సులకుకూడ సులభప్రాప్యముగాదు. నీవీ పూనిక విడుచుటమేలు చిన్నవాడవు"

శ్రీ డి. నాగసిద్దారెడ్డి,
తిరుపతి.

అని నారదుడు కొంత అధైర్యపరచినను ధ్రువుడు చలింపలేదు. ఆ ప్రత్యేకత అతని పేరునందేయున్నది. "ప్రజ్ఞానిధులగు ధీరులు విఘ్నవిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై ప్రారబ్ధార్థము లుజ్జగింపరనియు, వయోవర్ణలింగభేదము ఈశ్వరసాక్షాత్కారమున కడ్డురాదనియు నీ గాథమూలమున నెఱుగవచ్చును.

## 3. భీష్ముడు

ఇతడు జ్ఞానభక్తుడు. "ఆదిజుడైన బ్రహ్మయుదయంబున కాస్పదమైనవాడు, వేదాది సమస్తవాఙ్మయములందు ప్రశంసితుడైనవాడు, లోకాదిత్రిలోకపూజ్యుడు" అయిన కృష్ణుడు మాయాంగీకృతదేహుండై మనుజుడైనాడని యితని భావము, సమస్తకర్మలు భగవదధీనములనియు, మనుష్యుడు కేవల నిమిత్తమాత్రుడేననియు, ఎవరికి ఎపుడేమి జరుగునో తెలియనసాధ్యమనియు, నారాయణుడు యాదవులయందు గూఢుండై తనమాయ

చేత లోకంబుల మోహంబు నొందించు చున్నాడనియు, కృష్ణభగవానుని సామాన్య బంధుభావమునజూచుట అజ్ఞానమనియు భీష్ముడెరుగును. "కర్మణ్యేవాఽధికార స్తే మా ఫలేషు కదాచన" అను గీతావాక్యము నకు గాంగేయుని జీవితమంతయు నిదర్శ నమే. ధర్మము పాండవులవైపున్నదని, జయము వారినే వరించుననని, తెలిసియు కేవల కర్తవ్యబద్ధుడై యితడు కౌరవుల పక్షమున యుద్ధమొనర్చి కర్మయోగియై నాడు. యుద్ధరంగమున తన విశిఖవృష్టిచే నొచ్చి చక్రహస్తుడై తనమీదకి లంఘించు కృష్ణుని రూపమును సదా దర్శించుటయే యితనికి ప్రియము. చూడుడు –

"కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి
గగన భాగంబెల్ల కప్పికొనగ,
ఉఱికిన నోర్వక యుదరంబులోనున్న జగ
ములవ్రేగున జగతి కదల,
చక్రంబు చేపట్టి చనుదెంచు రయమున పై
నున్న పచ్చని పటము జార,
నమ్మితి నాలావు నగుబాటు చేయకు మన్నిం
పుమని క్రీడి మఱల దిగువ,

కరికి లంఘించు సింహంబు కరణి మెరసి
నేడు భీష్ముని జంపుదు నిన్ను గాతు
విడువు మర్జున! యనుచు మద్విశిఖవృష్టి
తెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు" –
(1-221)

ఈ మనోహరాకారమునే మనమున నిలిపికొని నిరుపాధికమైన వాసుదేవ బ్రహ్మము నందీ మహానుభావుడు కలిసి పోయినాడు. "మానవుడు కర్మబద్ధుడు. అస్వతంత్రుడు. భగవానుడెటు నడిపించిన నటు నడవక తప్పదు. నేను స్వతంత్రుడ నని భావించుట అజ్ఞానమునకు నిదర్శ నము" – అనుటకు భీష్ముని వృత్తాంతము చక్కని దృష్టాంతము.

(సశేషము)



తిరుమలలో ఆదివరాహమూర్తి

(13 వ పేజీ తరువాయి)

ఉండే శ్రీహరికి అంజలిస్తున్నాను.[18] తన ముఖంనుంచి విప్రులనూ, బాహువులనుంచి క్షత్రియులనూ, ఊరువులనుంచి వైశ్యులనూ, పాదాగ్రాలనుంచి శూద్రులనుసృష్టించిన విశ్వదేహునికి పురాణపురుషునికి దోయిలిస్తున్నాను.[19] ఆయన పరాత్పరుడు. (సర్వశాస్త్ర) పారంగతుడు. తెలిసికొనదగినవాడు, యోధశ్రేష్ఠుడు, (శిష్టరక్షణరూప) కార్యంకోసమే శ్రీకృష్ణుడైనవాడు; గదా, కత్తీ, డాలూ, అమృత (మయమైన కమల)మూ, చేతులదాల్చినవాడు; అప్రమేయుడు. అట్టి శ్రీమన్నారాయణునికి నమస్కరిస్తున్నాను.[20]

ఇలా చేసిన స్తోత్రానికి దేవోత్తముడు సంతోషించి నాతో మేఘసమానధ్వనితో "వరం కోరుకో" అని అనేకపర్యాయాలు పలికాడు.

అపుడు నేను ఆయనదేహంలో లీనం కావాలని కోరుకొన్నాను.[21]

అది విని సనాతనుడు దేవదేవుడు "విప్రుడా, దేహధారణ చెయ్యి. దీనివల్ల ప్రయోజనం ఉన్నది.[22] 'నారం' అంటే నీరు. అది నీవు పితరులకు ఇచ్చావు అప్పటినుంచీ నీకు నారదుడని పేరు వస్తుంది"[23] అని చెప్పాడు. వెంటనే ఆ ఉత్తమదేవుడు అంతర్థానమైనాడు.

నేను కొంతకాలం తరువాత శరీరం విడిచి తపస్సువల్ల బ్రహ్మలోకం వెళ్ళి పునః జన్మించాను పార్థివా![24]

అవ్యక్తజన్ముడు బ్రహ్మదేవుడు. ఆయన తొలిరోజున ఆయనపదిమంది (మానస)పుత్రులతోపాటు సృష్టింపబడ్డాను నేను.[25] దేవాది సర్వప్రాణుల సృష్టికీ అదే ప్రారంభం. ప్రభుధర్మాన్ననుసరించి, ఇందులో సంశయములేదు.[26]

పార్థివా, ఇది నా ప్రాకృతజన్మ. నీవు అడిగావు గనుక (చెప్పాను.) నేను నారాయణుని ధ్యానించి (జగద్) గురుత్వం పొందాను. కనుక, నీవూ విష్ణుపరాయణుడవు కా రాజేంద్రా.[28]

ఇది శ్రీ వరాహపురాణంలో ఆదిభూత వృత్తాంతంలో నారదపూర్వ జన్మవృత్తాంత నిరూపణం అను మూడవ అధ్యాయం.

బ్రహ్మసారశ్లోకం మూలశ్లోకాలు:

నారద ఉవాచ:

11. పరం పరాణామమృతం పురాణం
పారం పరం విష్ణుమనంతవీర్యమ్ ।
నమామి నిత్యం పురుషం పురాణం
పరాయణం పారగతం పరాణామ్ ॥

12. పురాతనం త్వప్రతిమం పురాణం
పరాపరం పారగముగ్రతేజసమ్ ।
గంభీరగంభీరధియాం ప్రధానం
నతోఽస్మి దేవం హరిమీశితారమ్ ॥

13. పరాత్పరం చాపరమం ప్రధానం
పరాస్పదం శుద్ధపదం విశాలమ్ ।
పరాత్పరేశం పురుషం పురాణం
నారాయణం స్తౌమి విశుద్ధభావః ॥

14. పురా పురం శూన్యమిదం ససర్జ
తదాస్థితశ్వాత్పురుషః ప్రధానమ్ ।
జనే ప్రసిద్ధః శరణం మమాస్తు
నారాయణో వీతమలః పురాణః ॥

15. పారం పరం విష్ణుమపారరూపం
పురాతనం నీతిమతాం ప్రధానమ్ ।
ధృతక్షమం శాంతిధరం క్షితీశం
శుభం సదా స్తౌమి మహానుభావమ్ ॥

16. సహస్రమూర్ధానమనంతపాద
మనంతబాహుం శశిసూర్యనేత్రమ్ ।
తమక్షరం క్షీరసముద్రనిద్రం
నారాయణం స్తౌమ్యమృతం పరేశమ్ ॥

17. త్రివేదగమ్యం త్రినవైకమూర్తిం
త్రిశుక్లసంస్థం త్రిహుతాశభేదమ్ ।
త్రితత్త్వలక్ష్యం త్రియుగం త్రినేత్రం
నమామి నారాయణమప్రమేయమ్ ॥

18. కృతే సితం రక్తతనుం తథా చ
త్రేతాయుగే పీతతనుం పురాణమ్ ।
తథా హరిం ద్వాపరతః కలౌ చ
కృష్ణీకృతాత్మానమథో నమామి ॥

19. ససర్జ యో వక్త్రత ఏవ విప్రాన్
భుజాంతరే క్షత్రమథోరుయుగ్మే ।
విశః పదాగ్రేషు తథైవ శూద్రాన్
నమామి తం విశ్వతనుం పురాణమ్ ॥

20. పరాత్పరం పారగతం ప్రమేయం
యుధాంపతిం కార్యత ఏవ కృష్ణమ్ ।
గదాసిచర్మణ్యభృతోత్థపాణిం
నమామి నారాయణమప్రమేయం ॥

23. ఇందులో 'నారద' శబ్దానికి నిర్వచనం చెప్పబడింది. దీని మూలశ్లోకం ఇది:

శ్లో॥ నారం పానీయమిత్యుక్తం
పితౄణ్యస్తద్దదౌ భవాన్ ।
తదాప్రభృతి తే నామ
నారదేతి భవిష్యతి ॥

దీనికి శబ్దకల్పద్రుమం గ్రహించిన పాఠం స్వరసతరం ఇలా ఉన్నది:

శ్లో॥ నారం పానీయమిత్యుక్తం
తత్ పితృభ్యస్సదా భవాన్ ।
దదాతి తేన తే నామ
నారదేతి భవిష్యతి ॥

— నారం పరమాత్మవిషయకం జ్ఞానం దదాతీతి నారదః. నారం అంటే పరమాత్మకు సంబంధించిన జ్ఞానం. దానినిచ్చేవాడని మరొక నిర్వచనం.

— నారం నరసమూహం దాతి ఖండయతి కలహేనేతి నారదః, నారం అంటే నర సమూహం, దానిని కలహంపెట్టి ఖండిస్తాడు కనుక నారదుడు అని వేరొక నిర్వచనం.

(సశేషము)

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం

నారాయణవనం.

★

### నిత్యకార్యక్రమ వివరాలు

| | | | |
|---|---|---|---|
| సుప్రభాతం ఉ॥ | 6-30 నుండి | | 7-00 |
| విశ్వరూపదర్శనం | 7-00 | ,, | 8-30 |
| తోమాలసేవ | 8-30 | ,, | 9-00 |
| కొలువు, అర్చన | 9-00 | ,, | 9-30 |
| శాత్తుమొర & గంట | 9-30 | ,, | 10-00 |
| సర్వదర్శనం | 10-00 | ,, | 11-30 |
| 2-గంట, అష్టోత్తరం (ఏకాంతం) | 11-30 | ,, | 12-00 |
| తీర్మానం | 12-00 | | |
| సర్వదర్శనం సా॥ | 4-00 | ,, | 6-00 |
| తోమాలసేవ, అర్చన (ఏకాంతం) | 6-00 | ,, | 6-30 |
| రాత్రి కైంకర్యం | | | |
| శాత్తుమొర | 6-30 | ,, | 7-00 |
| సర్వదర్శనం | 7-00 | ,, | 8-45 |
| ఏకాంతసేవ | 9-00 | | |

### ఆర్జితాదుల వివరాలు

| | | |
|---|---|---|
| అర్చన, అష్టోత్తరం .... | రు. | 3-00 |
| హారతి .... | రు. | 1-00 |
| కొబ్బరికాయకు .... | రు. | 0-50 |
| సహస్రనామార్చన .... | రు. | 5-00 |
| పూలంగి (గురువారం మాత్రం) .... | రు. | 1-00 |
| అభిషేకానంతర దర్శనం (శుక్రవారం) | రు. | 1-00 |
| తిరుచ్చి వాహనోత్సవం (వాహకుల రుసుముకాక) | రు. | 15-00 |
| సింగమొరై ఖర్చులు .... | రు. | 2-50 |

(16వ పేజీ తరువాయి)

అన్నారు. మాయకులోబడిన జీవుడు ఈ మాయ అన్న అవిద్యను ఛేదించుకొని జీవాత్మ పరమాత్మల ఏకత్వాన్ని తెలుసు కున్ననాడే సంపూర్ణజ్ఞాని అవుతాడనీ ఆ జ్ఞానం కలిగితేనేగాని మోక్షం సిద్ధించదనీ వీరి సిద్ధాంతం. మోక్షాన్ని ఇలా నిర్వ చించేరువీరు. జీవాత్మలు జన్మపరంపరల వల్ల వచ్చిన కర్మబంధాలనుండి విముక్తి చెంది పరమాత్మతో సాయుజ్యం పొంది బ్రహ్మానందాన్ని అనుభవించడమే మోక్షం అన్నారు. మోక్షసాధనకి సాధనచతుష్టయం అన్ననాలుగు ఉపాయాలు సూచించేరు. అవి 1) నిత్యాఽనిత్యవస్తు వివేకం; 2) ఇహాముత్రఫల భోగవిరాగం, 3) శమ దమాదిషట్కసంపద; 4)ముముక్షత్వము.

ఈ రకంగా చాలా చిన్నవయసులోనే అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించి తమ అసాధారణమేధాశక్తిచేత అటు బౌద్ధుల శూన్యవాదాన్ని ఖండించడమేకాక ఇటు వైదికఛాందసులయిన కర్మవాదుల్నికూడా శాస్త్రవాదనలో జయించి తన జ్ఞానవాదాన్ని ప్రతిష్ఠించి శిష్యప్రశిష్యులు వెంటరా కాలి నడకను దేశం నలుమూలలా పర్యటించి దేశం నాలుగుమూలల్లో నాలుగు శంకర పీఠాలు స్థాపించి తన 32 వ యేటనే తనువు చాలించేరు. వీరు వివేకచూడామణి, ఆత్మ బోధ, తత్త్వబోధవంటి అద్వైతప్రతిపాద కాలయిన ప్రకరణ గ్రంథాలు వ్రాయడమే కాకుండా శివానందలహరి, సౌందర్యల హరి, భజగోవిందస్తోత్రం, లక్ష్మీనరసింహ స్తోత్రం, విష్ణుమీడేస్తోత్రం, దేవీఅపరా ధక్షమాస్తోత్రం, దక్షిణామూర్తిస్తోత్రం మొ॥ అనేకస్తోత్రాలు రచించి భక్తికికూడా ప్రాధాన్యమిచ్చేరు.

శంకరుల అద్వైతవాదం సామాన్య మానవుడికి అర్థంకాక ఆచరణయోగ్యం కాని ఆదర్శంగావుండిపోయింది. శంకరుల అనుయాయులైన అద్వైతులు వారినిత్య జీవితంలో నువ్వూనేను అన్నభేదభావం లేకుండా మెలుగుతున్నారా అంటే లేదనే చెప్పవలసివస్తుంది. అంతా భావాఽద్వై తాన్నే కొలుస్తూవచ్చేరు కాని క్రియాఽ ద్వైతం ఆచరణసాధ్యంకాలేదు. సామాన్య ప్రజ 'అహంబ్రహ్మాస్మి' 'సోఽహం' అన్న మహావాక్యాలలోని వేదాంత సత్యాన్ని సరిగా ఆకళింపు చేసుకోలేక నేనే దేవుణ్ణి అన్నఅహంభావంతో దైవభక్తికి దూర మయే ప్రమాదం ఏర్పడడంవల్ల పరిస్థితులు చక్కబెట్టడానికి మరొక మహనీయుడు అవతరింపవలసి వచ్చింది. సామాన్యుడి కందుబాటులోలేని అద్వైతాన్ని ఆచరణ యోగ్యంగా వుండేటట్టు కాస్త విశిష్టత ఏర్పరచి మానవహృదయాల్లో భక్తిబీజాలు పటిష్టంగా నాటడానికి శేషాంశతో అవత రించేరు శ్రీమద్రామానుజులు. (కృత యుగంలోని శేషుడు త్రేతలో లక్ష్మణుడి గానూ, ద్వాపరంలో బలరాముడిగానూ, కలియుగంలో రామానుజులుగాను భువి నవతరించేరని మననమ్మిక.)

ఆచార్యత్రయంలో రెండవవారయిన వీరు శ్రీపెరుంబూదూరులో క్రీ. శ. 1017కి సరిఅయిన పింగళినామసం॥ చైత్రశుద్ధ పంచమీ శుక్రవారంనాడు ఆర్ద్రానక్షత్రంలో కేశవసోమయాజికి జన్మించేరు. వీరు శంకరుల అద్వైతసిద్ధాంతాన్ని కొద్దిగా వ్యతిరేకించి, దానికి కొంత విశిష్టత ఆపా దించి తమ విశిష్టాఽద్వైతసిద్ధాంతాన్ని ప్రతిపాదించేరు. 'సోఽహం' అన్న అహం భావం తగదనీ దాసోఽహం అని అనన్య భక్తితోదైవం ముందుప్రణమిల్లడం శ్రేయ స్కరమని వీరు ఉద్బోధించేరు.

వీరి సిద్ధాంతంలోని సారం ఏమిటంటే మాయామిథ్యాత్వ మూలకమయిన

అద్వైతవాదం పూర్తిగా సత్యంకాదనీ, జీవుడు, జగత్తు, ఈశ్వరుడు అన్న మూడూ మూడు విభిన్నతత్త్వాలనీ, ఆ మూడూ ఆద్యంతరహితాలనీ వీరివాదం. అంటే జీవేశ్వరుల ఏకత్వాన్ని వీరు వ్యతిరేకించా రన్నమాట. జీవుడు చిత్‌స్వరూపుడనీ, జగత్తు అంతా చైతన్యవిహీనమయిన జడ ప్రకృతి స్వరూపం అవడంవల్ల అచిత్ అనీ, ఈ రెండూ ఈశ్వరతత్త్వానికి శరీరాలుగా శోభిల్లడంవల్ల శరీరశరీరి భావంతో ఈశ్వరుడు చిదచిద్విశిష్టుడై ఒప్పుతున్నాడని వీరి సిద్ధాంతం. చెంకాయలో పీచు, పెంకు, గుజ్జు అన్నమూడు విభిన్నతత్త్వాలతో ఒకటిగా కన్పించినట్టే ప్రకృతి, జీవుడు, ఈశ్వరుడు ఒకదానికొకటి అంటిపెట్టుకొని ఏకత్వాన్ని తోపిస్తున్నాయని వీరి విశిష్టాద్వైత సిద్ధాంతమూలం.

బ్రహ్మ నిర్గుణుడని వీరు ఒప్పుకోలేదు. బ్రహ్మ సగుణుడనీ సాకారుడనీ అనంత కోటి కళ్యాణ గుణాభిరాముడయిన భగవంతుని గుణరహితుడనడం అపచారమనీ వీరి వాదన. శంకరుల మాయామిథ్యాత్వవాదాన్ని వీరు ఖండిస్తూ మాయలోమునిగి వుంటే తాము మాయలోవున్నామన్న జ్ఞానం జీవులకురావడం సాధ్యమా అన్నారు వీరు. జగత్తుమిథ్య అనడం పొసగదన్నారు. భగవంతుని శరీరాలయిన ఈ చేతనాచేతన ప్రపంచం భగవంతునివలె సత్యములు నిత్యములు అయివుండగా వాటిని మిథ్య అనడం భగవంతుడికే మిథ్యాత్వం ఆపాదించినట్టవుతుందని వీరు పూర్వపక్షంచేసేరు.

మోక్ష విషయంలోకూడా వీరు సాయుజ్యాన్ని తద్వారా వస్తుందన్నీ బ్రహ్మానందాన్ని విమర్శించేరు. సంసారబంధాల్ని తెంచుకున్న జీవులు మోక్షావస్థలో పరమాత్మతో సాయుజ్యంలో ప్రత్యేక వ్యక్తిత్వం నశించినపుడు బ్రహ్మానందం అనుభవించేదెవరు అని వీరి ప్రశ్న. (ఇదే ప్రశ్న పూర్వం యాజ్ఞవల్క్యుడి భార్య అయిన మైత్రేయి అడిగి భర్తని చాలా తికమకపెట్టేసింది!). బెల్లంకన్న భిన్నమయిన చీమ బెల్లం మాధుర్యాన్ని గ్రోలుతుందంటే సరిపోతుందిగాని చిన్న బెల్లంముక్క పెద్దబెల్లంముక్కతో కలిసి ఆనందం అనుభవించడం ఎలా సాధ్యం అన్నారు వీరు.

ఇలా శంకరుల వాదాన్ని ఖండించి తమ విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ చిద చిద్విశిష్టుడయిన శ్రీమన్నారాయణుడే పరతత్త్వమని, ఆ శ్రియఃపతి చరణారవిందములే ప్రపన్నులకు శరణ్యములనీ, సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వ, సర్వేశ్వరత్వ సత్యకామత్వ సత్యసంకల్పత్వాది సర్వ కళ్యాణ గుణాభిరాముడగు ఆ పరమాత్మ కైంకర్యమే పరమ పురుషార్థమని, కర్మ జ్ఞానాంగమయిన భక్తిచేతనే జన్మరాహిత్యమగు మోక్షం సిద్ధిస్తుందని సమస్త శ్రుతి సూత్ర, ఆగమపురాణేతిహాస శిష్టాచార సమ్మతమయిన సిద్ధాంతాన్ని ప్రతిపాదించి వైష్ణవమతస్థాపనకెంతో కృషిచేసి, శిఖా యజ్ఞోపవీతాలతో త్రిదండి సన్యాసాన్ని స్వీకరించి ప్రస్థానత్రయానికి భాష్యాలు వ్రాసి శిష్యులతో దేశంఅంతా పర్యటించి యజ్ఞమూర్తి, యాదవప్రకాశులవంటి అద్వైతులను తనపక్కకు తిప్పుకొని, శ్రీభాష్యం, గీతాభాష్యం. వేదాంతసారం, వేదాంతదీపిక, వేదాంతసంగ్రహం, శ్రీరంగగద్య, వైకుంఠగద్య, శరణాగతి గద్యవంటి అనేక దివ్యప్రబంధాలు రచించి, యతిరాజులనీ, భాష్యంకారులనీ, ఉదయవరులనీ, ఇళైయాళ్వారులనీ ఎంబెరుమానారులనీ అనేక బిరుదునామాలతో వర్ధిల్లి ప్రతివాదభయంకరులై, పరహితకాంక్షపరులై, సత్వగుణప్రధానులై సాధుశీలులై ఈ లీలావిభూతియందు 120 సం॥లు గడిపి నిత్యవిభూతి చేరుకున్నారు.

ఆచార్యత్రయంలో మూడవవారు శ్రీ మదానంద తీర్థులను పేరుగల మధ్వాచార్యులు. వీరు క్రీ.శ. 1197 వ సం॥లో దక్షిణకానరాజిల్లాలోని ఉడిపి అన్న గ్రామంలో జన్మించేరు. తండ్రి మధ్యగేహభట్టు. మధ్వాచార్యులు అచ్యుతప్రేక్షకుడన్న గురువువద్ద వేదాదివిద్యలన్నీ అభ్యసించి ప్రస్థానత్రయానికి భాష్యాలువ్రాసి శంకరుల అద్వైతాన్నీ రామానుజుల విశిష్టాద్వైతాన్నీకూడా ఖండించి జీవేశ్వర భేదాన్ని చాటుతూ తమ ద్వైతసిద్ధాంతాన్ని ప్రచారంచేసి తమ పుష్కల వాక్చాతుర్యంతో అనేకమంది శిష్యప్రశిష్యుల్నికూడా గట్టుకున్న సహవిద్వాంసులు వీరు.

వీరు ఏకత్వాన్ని సుతరామూ ఒప్పుకోలేదు. సృష్టిలో అంతా భిన్నత్వమే కన్పిస్తుంటే ఏకత్వం అని సమర్థింపచూడడం వట్టిమాటలగారడీ అన్నారు. వీరి ప్రకారం పరమాత్మ జీవాత్మవేర్వేరుతత్త్వాలు. పరమాత్మ ప్రకృతి కూడావేరే. జీవాత్మలూ ప్రకృతీకూడావేరే. జీవాత్మకు జీవాత్మకు భేదం ప్రకృతిలోని వస్తువులన్నిటికీ భేదం. ఈ పంచభేదప్రాతిపదికతో తమ ద్వైతాన్ని స్థాపించేరు వీరు. అహంబ్రహ్మాస్మి అన్న వాక్యంలో అర్థంలేదన్నారు. అల్పజ్ఞుడైన జీవుడెక్కడ సర్వజ్ఞుడయిన భగవంతుడెక్కడ అన్నారు. నిర్గుణోపాసనను విరసించి శంకరుల మాయామిథ్యాత్వవాదాలని ఖండించేరు. పరతత్త్వ నిర్ణయంలో వీరు రామానుజులతో ఏకీభవించి విష్ణువే ఆరాధ్యదైవం అనీ భగవంతుని కటాక్షానికి భక్తిమార్గంతప్ప వేరేమార్గం లేదన్నారు. వీరుకూడా చాలాప్రకరణ గ్రంథాలువ్రాసి 80 సం॥లు జీవించి పరమపదం చేరు

కున్నారు. వీరి జన్మస్థానమయిన ఉడిపిని మహాపవిత్ర క్షేత్రంగా భావిస్తారు మాధ్వులు.

ఇలా ముగ్గురు ఆచార్యులు మూడు మార్గాలు తొక్కేరు. ఉన్నదంతా ఒక్కటే గాని రెండోదన్నదిలేదని ఒకరంటే ఒక్కటేగాని అందులో మూడు విభిన్న తత్త్వాలు మిశితమైయున్నాయన్నారు మరొకరు. ఒకటి ఎప్పటికీకాదు అంతా భిన్నమే అని ఇంకొకరు నిర్ధారించేరు. ఈ భేదాఽభేదవాదనలతో ఈ ఆచార్యుల అనూయాయులు నేటివరకు త్వంశుంఠః అంటే త్వశుంఠః అనుకుంటూసిగపట్ల గోత్రంలోకి దిగుతునేవున్నారు. ఇందులో ఏదిసత్యం ఏదసత్యం అంటే మనబోటివారం చెప్పగలిగిన ప్రశ్నా అది?

ఈ వస్తుతత్త్వ నిర్ణయంలో పాశ్చాత్య శాస్త్రజ్ఞులేమన్నారో చూదాం. ఈ దృశ్య ప్రపంచంలో మేటర్ అనబడే ద్రవ్యాంశం అంతా 92 విభిన్న పరమాణువుల కలయికచే ఏర్పడ్డదనీ పాశ్చాత్త్యులుముందు అనుకున్నారు. (ఈ 92 ఇప్పుడు 104 దాకా పెరిగేయి.) ఈ పరమాణువులను ఏటమ్ లన్నారు. (ఈ అణుసిద్ధాంతమని కణాద మహర్షి తనవైశేషిక దర్శనంలో ఏనాడో ఉల్లేఖించాడు.) ఈ ఏటమ్ లను 'నైనం ఛిందంతిశస్త్రాణి' అన్నట్టు విభాగమొనర్పవీలులేనివని నిన్న మొన్నటిదాకా అనుకున్నారు. ద్వితీయ ప్రపంచసంగ్రామంలో ఆ అభిప్రాయం తల్లక్రిందులయింది. ఏటమ్‌ను ఛేదించడమూ జరిగింది. అందులోనుంచి ఆవిర్భవించిన ప్రచండశక్తి చుట్టూవున్న జీవరాసిని ధ్వసం చెయ్యడమూ జరిగింది.

ఈ అణువులోవున్న విశేషమేమిటా అని శాస్త్రజ్ఞులు పరీక్షించగా అందులో ప్రొటాన్లు, ఎలక్ట్రానులు, న్యూట్రానులు అన్నమూడు విభిన్న అల్పాతిఅల్పమయిన తేజఃకణాలు కన్పించేయట. ప్రతిద్రవ్యాంశ పరమాణువులోనూ వున్నవి ఈ మూడే నట-సంఖ్యాభేదంతో. ఇనాళ్లూ మేటర్ అన్న ద్రవ్యాంశాన్ని కొలుస్తున్న శాస్త్రజ్ఞులు ఈ మేటర్ అంతా ఈ మూడు శక్తి కణాల సముదాయమేగాని వేరు కాదు అని తెలుసుకొని దిగ్భ్రమ చెందేరు. (ఇలా మేటర్ మీద శక్తి సాధించిన గెలుపుని భౌతికవాదం మీద అధ్యాత్మవాదం సాధించిన గెలుపుగా అధ్యాత్మికవాదులు భావించడం తప్పుకాదేమో!) శాస్త్రజ్ఞులు ఇంకా కనుగొన్న విషయ మేమిటంటే ప్రోటాను ధనవిద్యుత్ స్వరూపమనీ, అది పరమాణువు కేంద్రంలో స్థాపితమనీ ఋణవిద్యుత్ స్వరూపాలయిన ఎలక్ట్రానులు (ఇవి ప్రోటానులో సహస్రాంశాల కన్నా చిన్నవి) కేంద్రస్థప్రోటాను చుట్టూ (సూర్యునిచుట్టూ గ్రహాలు తిరుగుతున్నట్టు) నిర్ణీతకక్ష్యలలో పరిభ్రమిస్తూ వుంటాయనీ (ప్రోటాన్‌తో ఎప్పుడూ సాయుజ్యం మాత్రం చెందవనీ) న్యూట్రాను అన్న మూడవకణం విద్యుత్‌విహీనమయి చలనం లేక జడంగావుంటుందనీ తెలుసుకున్నారు. ఈనవీన పాశ్చాత్యశాస్త్రసిద్ధాంతం మన రామానుజుల సిద్ధాంతానికి ఎంత చేరువలో వుందో గమనించండి. ధనవిద్యుత్ స్వరూపాలయిన కేంద్రస్థప్రోటాను పరమాత్మ స్వరూపానికి ప్రతీకగానూ; ఋణవిద్యుత్ స్వరూపాలయి, ప్రోటానుకన్న కించిత్ భిన్నస్వరూపాన్నీ అత్యంత అల్పత్వాన్నీ కలిగి ప్రోటానుచుట్టూ పరిభ్రమిస్తున్న ఎలక్ట్రానులు సామీప్యసేవానందం అనుభవిస్తున్న ముక్త జీవాత్మలకు ప్రతీకలుగానూ; విద్యుత్‌విహీనమయిన న్యూట్రాను చైతన్య రహితమైన జడప్రకృతికి ప్రతీకగానూ సామ్యం ఎంత చక్కగా సరిపోతుందో చూడండి. (అచిత్ స్వరూపమయిన ప్రకృతిశక్తులు ఒక్కొక్కప్పుడు విజృంభించి నానాభీభత్సం కల్గిస్తున్నట్టే ఈ విద్యుత్ విహీనమయి చలనం లేకుండాపడివున్న న్యూట్రాను పరస్పరచలనం ఫలితంగా అణువునుండి విడివడి బ్రహ్మాండమయిన శక్తిస్వరూపంతో ఎంతో ప్రాణనష్టం చేస్తుంది.)

ఎన్నో అధునాతన శాస్త్రపరికరాల సహాయంతో ఈనాడు కనుగొన్న శాస్త్రసత్యాన్ని వేయిసం॥ల క్రితం కేవలం తన మేథాశక్తిచేత కనుగొన్న మన రామానుజుల ప్రతిభ అనుపమానంగదా!

యోనిత్యమచ్యుత పదాంబుజయుగ్మరుక్మ
వ్యామోహిత స్తదితరాణి తృణాయమేనే
అస్మద్గురోర్భగవతైస్యదయైకసింధోః
రామానుజస్య చరణౌశరణంప్రపద్యేః
అని వారికి అంజలిఘటిద్దాం

కీ. శే. గాదె. శ్రీ జగన్నాథస్వామి (సరసకవి, కవిశేఖర బిరుదాంకితులు)గారి భాగవత ధర్మప్రకాశికలోని కొన్ని పద్యాలనుదహరించి ముగిద్దాం.

ఉ॥ వేదము బ్రహ్మసూత్రముల విశ్రుతగీతల
విశ్వసించి వ్యా
సాదిమహర్షి సన్నిభులయామున ముఖ్యులు
సన్నుతించి దు
ర్వాదవితీర్ణులౌచు యతిరాజు పదాబ్జములా
శ్రయించిల
క్ష్మీదయితున్ భజింపగలశేముషిధుర్యు
లెధన్యులిద్ధరన్,

కం॥ ద్రావిడపూర్వాచార్యుల
సేవించుట చెల్లు వారి శ్రీసూక్తులు సం
భావించు టొప్పు చూడగ
దైవత వాఙ్మయము విడువదగునే
మనకున్

తే॥ మెట్టవేదాంతమతముల మెలగకుండ.
దుస్సమాజమతంబుల దూరకుండ
భావదాస్యంబువర్ణించి భవ్యమతులు
వ్యాసమత ధర్మసంపత్తి బ్రబలుటొప్పు.
మంగళాశాసనపరైః మదాచార్యపురోగమైః
సర్వైశ్చపూర్వైరాచార్యైః సత్కృతా
యాస్తుమంగళం,

హరిః ఓం తత్ సత్.

※

(11వ పేజీ తరువాయి)
పాముఁ జంపినయట్టి-పాతకమునఁబెద్ద
పాము మీఁద నీకుఁ-బవళించ వలసె,
కోమలిఁ జంపిన-కొఱఁతవల్ల నొక్క-
కోమలి నెదఁబెట్టు-కొని యుండవలసె ॥ఎట్టి॥

బండి విఱిచినట్టి-పాతకమునఁ బెద్ద
బండి బోయఁడవై-పనిసేయవలసె,
కొండవెఱికినట్టి-గుణమునఁ దిరుమల
కొండమీఁద నీకుఁ-గూచుండవలసె ॥ఎట్టి॥
(5-180)

అవ:—భూతదయ, నిష్కామకర్మాచరణ, మున్నగు ముఖ్యధర్మము లనుష్ఠింప దగినవనుచున్నాడు—

62

సామంతం

సకలభూతదయ-చాలఁ గఁగలుగుట
ప్రకటించి దేహసం-భవమైన ఫలము ॥పల్లవి॥

1. తలకొన్న ఫలవాంఛ-దగులకుండఁగఁజిత్త
మలవరించుట కర్మి-యైన ఫలము,
పలుకర్మములలోన-బ్రహ్మార్పణపు బుద్ధి
గలుగుట హరికృప-గలిగిన ఫలము ॥సకల॥

2. ఎప్పుడుఁ దిరువేంక-టేశుసేవకుఁడౌట
తప్పక జీవుఁడు-దానైనఫలము:
కప్పిన సౌఖ్యదుః-కర్మము (ఖమ్ము?) లు
సమముగా
నొప్పుట విజ్ఞాన-మొదవిన ఫలము. ॥సకల॥
(11-3-94)

శరీరము దాల్చినందుకు ముఖ్య ప్రయోజనము సమస్త ప్రాణులయందు మిక్కిలి దయగలిగి ప్రవర్తించుటయే.

కర్మయోగము నాశ్రయించి పలుకర్మలొనర్చుటకు ముఖ్యప్రయోజనము ఆ కర్మ ఫలములపై ఆశపడకుండ మనస్సును స్వాధీనపరచుకొనుటయే. కర్మయోగిపై శ్రీహరికృప ప్రసరించినందుకు ఫలము, వివిధములైన కర్మముల ఫలములను పరబ్రహ్మార్పణ మొనర్చు బుద్ధి యతనికి కల్గుటయే.

తాను జీవుడైనందుకు ఫలము ఎల్లప్పుడు తప్పకుండ శ్రీ వేంకటేశ్వరునకు సేవకుడగుటయే. తనకు విజ్ఞానము గల్గినందుకు ఫలము సుఖదుఃఖములయెడ సమభావమల వడుటయే.

విశే:- ఎల్లప్రాణులయెడ దయగల్గి యుండుట, ఫలాసక్తివీడి కర్మలొనర్చుట, సదా భగవంతుని సేవించుట, సుఖదుఃఖాది ద్వంద్వములపట్ల సమభావము గల్గి యుండుట జిజ్ఞాసువైనవారికి అవశ్యమాచరింపదగిన ధర్మములని ఈ పాట ప్రకటించుచున్నది.

గుణములలోనెల్ల భూతదయ అగ్రగణ్యమైనది. దయతో సాటియైన పుణ్యము, హింసతో సమమైన పాపము లేదని పెద్దలసూక్తి-

దయాసమం నాస్తిపుణ్యం
పాపం హింసాసమం నహి॥

కావుననే 'అహింసాపరమోధర్మః' అని దయాశ్రయుక్తమైన అహింస పరమ ధర్మముగా పేర్కొనబడినది.

కర్మములు సహజముగా ప్రాణిని బంధించునవి. కాని ఫలాసక్తివీడి కర్మలొనర్చువాని నవి బంధింపవు. ఫలాసక్తి వీడి నిత్యతృప్తుడైనవాడు కర్మలుచేసియు చేయనివాడేయగునని గీత బోధించుచున్నది-

త్యక్త్వా కర్మఫలాసంగం
నిత్యతృప్తో నిరాశ్రయః।
కర్మణ్యభి ప్రవృత్తోఽపి
నైవకించిత్కరోతి సః॥
(గీత-4-20)

ఫలమును బ్రహ్మార్పణము గావించి కర్మలు చేయవలెను. తత్త్వజ్ఞానము కల్గిన పిమ్మట కర్మము తనకుతానుగా శమించునని కృష్ణుడు ప్రబోధించెను.

ఫలములయెడ బ్రహ్మార్పణ
కలన వరుండగుచు కార్యకర్మమువదవన్
వలయున్; తత్త్వజ్ఞానము
దలకొనినన్ కర్మశమము దానై కలుగున్.
(భార-భీష్మ-1-202)

శ్రీహరి దయకు పాత్రుడైనవానికే, ఫలముల నట్లు బ్రహ్మార్పణమొనర్చు బుద్ధి గలుగునని అన్నమయ్య ఇట స్పష్టము గావించినాడు.

కర్మఫలమునువీడి తద్ద్వారా కర్మసన్యాసమొనర్చి ద్వంద్వాతీతుడగువాడే మాయను తరించునని నారదుడు పేర్కొనెను.

"యఃకర్మఫలం త్యజతి కర్మాణి
సన్న్యస్యతి తతో
నిర్ద్వంద్వోభవతి" (నా. భ. సూ, 48)

ఇక భక్తిమార్గము ననుసరించిన జీవునికి భగవత్సేవ సదా కర్తవ్యమే.

'సర్వదా సర్వభావేన నిశ్చింతితై
ర్భగవానేవ భజనీయః'
(నా. భ. సూ. 79)

శీతోష్ణములు, సుఖదుఃఖములు మున్నగునవి ద్వంద్వములనబడును. అజ్ఞాని వీటియెడల రాగద్వేషములు వహించును. విజ్ఞానిదృష్టి కవి సమముగనే కన్పట్టును. స్థితప్రజ్ఞుడు దుఃఖములో ఉద్వేగము, సుఖములో స్పృహను పొందడనియు, రాగ భయక్రోధములు త్యజించుననియు గీత చెప్పుచున్నది—

దుఃఖేష్వను ద్విగ్నమనాః
సుఖేషు విగతస్పృహః।
వీతరాగ భయక్రోధః
స్థితధీర్మని రుచ్యతే॥ (గీ-2-56.)

(సశేషము)

(వ) దేహసంభవమైన=శరీరము కలుగుటవలన కలిగిన.
కర్మి=కర్మచేయువాడు.

(10వ పేజీ తరువాయి)

పుణ్యపురుషుడు. దానిలో – తోడయమంగళము, మంగళము, శరణు, హెచ్చరిక కీర్తనము, ధూపదీపాలంకారనైవేద్యాద్యుపచారముల కీర్తనములు, పవ్వళింపు, దివ్యనామ సంకీర్తనము, వసంతోత్సవ కీర్తనములు, స్వామిని మేలుకొలుపుటకై కీర్తనములు మొదలైనవియు నణిగియున్నవి. ఇదిగాక విడికీర్తనములును గలవు. ఇతని భక్త్యతిశయమువలన మాటిమాటికి వెంకటరమణుడు ఇతనికి సాక్షాద్దర్శనమిచ్చి మాట్లాడినట్లు పెద్దలు జెప్పుచున్నారు. భజనపదతి కితడే మూలపురుషుడు" –

(సంగీతసంప్రదాయప్రదర్శిని - వాగ్గేయకారులచరిత్ర 8వ పుట)

"పై సుబ్బరామ దీక్షితుల మాటలు గాయక ప్రపంచమున చిన్నన్నకుగల సాంప్రదాయికస్థాన గౌరవమును స్పష్టపరచుచున్నవి" (రా. అ. కృ. శర్మ).

మహాభక్తుడు, సంగీతజ్ఞుడు, స్వామిసేవాతత్పరుడునగు చిన్నన్న అష్టమహిషీకల్యాణము, పరమయోగివిలాసము, ఉషాపరిణయము, అన్నమాచార్య చరిత్రము అనే నాలుగు ద్విపదకృతులను రచించినాడు. తాళ్ళపాక కవులలో ప్రతియొక్కరును ఒక ద్విపదకావ్యమును రచించినట్లు తోస్తున్నది. (అన్నమయ్య: ద్విపదరామాయణము, శృంగారమంజరి. పెదతిరుమలాచార్యుడు: ద్విపదహరివంశము, చక్రవాళమంజరి, తాళ్ళపాక తిమ్మక్క: సుభద్రా కల్యాణము.)

కాని చిన్నన్న ద్విపదరచనలో కృతహస్తుడనే ప్రశంస "చిన్నన్న ద్విపద కెఱఁగును" అనే తెనాలి రామకృష్ణకవి పద్యములో కన్పిస్తుంది. గణవరపువెంకటకవి ప్రబంధరాజమున చిన్నన్నను ఇట్లు సన్నుతించెను –

"ఎన్నఁదెనుగునకు రాజను
గ్రన్ననయతిరాజునకును రమణయికునునేఁ
జిన్నను ద్విపదనొనర్చను
జన్నన్నను బిరుదుగద్యచెప్పిన ఘనుఁడన్"

చిన్నన్నే 'అష్టమహిషీకల్యాణము' లో తాను 'దినములోనే వేయిద్విపదలింపొంద వినుతివర్ణనలతోడ విరచించు' వాడనని చెప్పి ద్విపదలక్షణములమ నిర్దుష్టముగా నిర్వచించినాడు.

"వాసవుల్మువ్వురు వనజాప్తుఁడొకడు
భాసిల్లునది యొక్కపదము శ్రీకాంత
క్రమమున నీనాల్గుపదములునడచుఁ
గ్రమదూరముగఁ బ్రయోగముసేయరాదు
అపాదమునకు మూఁడవగణంబంది
దీపించు యతి యంబుధిప్రియతనయ
యుపమింపనవి ప్రాసయుతములై రెండు
ద్విపదనా విలసిల్లి వికజాబ్జపాణి
ద్విపదకు ద్విపదకుఁదెగఁజెప్పవలయు
నెపుడు సంస్కృతమున నితరభాషలను
యతులలోపలఁ బ్రాసయతిదక్క సకల
యతులుచెల్లును బ్రయోగానుసారమున
ద్విపదతో ద్విపదసంధిల నేక శబ్ద
మపుడు రెంటనుగూర్పనదియ యుక్తంబు
మఱియు సంస్కృత సమాసరూపమున
నెరయనెన్నిటినైన నిర్మింపఁదగును
తెనుగునఁగూర్చిన ద్విపద యంత్యమున
నొనరఁ గ్రియాంతసముచ్చయాంతముల
దనరునకార ముత్యముగూడెనేని
వినుతింపనుత్తర ద్విపదాదియందు
గొనకొన్నస్వరముతోఁగూడఁ గాదనుచు
నొనరింప సుకవీంద్రులుద్దండమంద్రు
అరసున్నదొనఁగూర్ప ననువైనహల్లు
గరిమనీద్విపదాదిఁ గనుపట్టెనేని
తొలివిభక్తికిఁదక్కఁ దుదివిభక్త్యంత
ములు నకారములును ముకురబింబాస్య
యానకారముచెల్లు నరసున్నలగుచు
నానీలకచభృంగ యలమేలుమంగ
యనులక్షంబుల ననువొంద సుకవి
జనసుప్రయోగైకశరణమై నిఖిల
జగదేకనుత విరాట్ఛందోవతీర్ణ
యగుచునే ద్విపదవిఖ్యాతిచెలంగ
వితత తల్లక్షణ ద్విపదమార్గమున
.... .... .... .... .... ....
కృతియొనర్చెద .... .... ...."

ఇట్లు మూడుకృతులనొనర్చి, కవిశిరః

హిందూధర్మ ప్రతిష్ఠానం ఆధ్వర్యంలో జరిగిన ఆర్షధర్మ వేసవిపాఠ శిక్షణా శిబిరంలో ప్రసంగిస్తున్న దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, శిబిరనిర్వాహకులు డా. అర్కసోమయాజులు సభాధ్యక్షులు శ్రీ బలరామరెడ్డిలతో కూడా చూడవచ్చు.



కంపయోగ్య ప్రతిద్విపదనవ బిరుదాంకు డైనాడు.

'అష్టమహిషీకల్యాణము' 3682 ద్విపదలతో ఒప్పు నైదాశ్వాసాల కావ్యము. ఈ మనసిజజనకాష్ట మహిషీవివాహకావ్యము ను చిన్నన్న శ్రీవేంకటేశురాణియు తనుగన్న తల్లియునగు అలమేలుమంగకు అంకితముగా చెప్పినాడు —

"అలమేలుమంగ మోహనకాంచనాంగ
నెలమిమత్కృతికి నధీశ్వరిఁజేసి
.... .... .... .... .... ....
భువనరక్షణకును బుణ్యలక్షణకు
నంకితంబుగను గావ్యంబుగావింతు."

ప్రతి ఆశ్వాస ఆరంభములోను 'అవధరింపుముదేవి' అనే వాక్యము అలమేలుమంగను ఉద్దేశించి చెప్పబడి ఉంటుంది. చిన్నన్న ఈ తొలికావ్యనిర్మాణానికి అన్నమాచార్యుల వేంకటేశ్వర శతకములోని—

ఉ॥ శ్రీసతినీల జాంబవతి శ్రీయమునాసతి
సత్యభామ ధా
త్రీసతి రుక్మిణీరమణి దేవియిలాసతి
వీరలందఱున్
జేసినసేవచేసెదను జేకొను శ్రీయలమేలు
మంగ నీ
మూసినముత్యమైయురము ముంగిటఁ
జెంగటవేంకటేశ్వరా!

అనే పద్యముప్రేరకమై ఉండవచ్చునేమో!

'అష్టమహిషీకల్యాణ'మనే నామకరణము చేసినను చిన్నన్న చతుర్థాశ్వాసాంతపర్యంతము కృష్ణగాథనే వర్ణించి తక్కిన భాగమున కల్యాణ పరంపరను వర్ణించినాడు.

"ఈ కృష్ణచరితంబు నెవ్వరు విన్న
హ్రాశ్రుచ్చితలఁచిన వారికెల్లపుడు
చిరతరాయువులను జింతితార్థములు
సిరియుఁగృష్ణుని కృపజెందుదురనఘ"

ఆనే ఫలశ్రుతిలో తన కావ్యము కృష్ణచరితమే అని సూచించినాడు.

చిన్నన్న రెండవకృతి అనదగినది "ఉషాపరిణయము". దీనికి 'ఉషాకల్యాణము' అనే నామాంతరము కూడఉన్నది. ఇది 990 ద్విపదలతో రెండు భాగములుగా విభజింపబడి ఉన్న ప్రబంధము. ఈ కావ్యమునకును 'అతులిత హేమాంగనలమేలు మంగనింపు సొంపారనధీశ్వరిఁజేసి, జలజకంధరకు సజ్జనధురంధరకు పొలుపొంద నంకితంబుగ, హరివంశ మార్గోక్తమగు నుషాకన్య కరమొప్పఁబరిణయక్రమము' ను చెప్పినాడు చిన్నన్న. ఉషానిరుద్ధుల వివాహకథ తెలుగులో ఎఱ్ఱన హరివంశమునందును, నాచన సోముని ఉత్తరహరివంశములోను, పోతన ఆంధ్ర మహాభాగవతములోను రసోచితముగా వర్ణింపబడి ఉన్నది. కాని అవి గద్య పద్యాత్మకములైన కావ్యాలు. చిన్నన్న కృతి కేవల ద్విపదరచన. కథాకథనము, వర్ణనాచమత్కృతి, పాత్రచిత్రణము, ఆలంకారిక శైలి, సన్నివేశ సంవిధానము, కల్పనా సరసత, రస పోషణము మున్నగు అంశములలో ఈ కావ్యములందలి ఉషాపరిణయగాథను తులనాత్మకముగా పరిశీలించుట ఆసక్తిదాయకమైన పరిశోధనే అవుతుంది.

"నిజమనః కంజాతసంజాతపుష్కల మాధ్వీకఝురిలో మురారి సొగియునట్లు గాచొక్కి ధన్యాత్ములైన" ద్వాదశసూరిఁ (పన్నిద్దరాళ్వారుల) దివ్యచరితమే' పరమయోగి విలాసము! 6377 ద్విపదలుగల ఎనిమిదాశ్వాసాల ఈ కావ్యము చిన్నన్న రచనలలో ఘనతరమైనది. తన ఇతర కృతులలో లేని కృత్యాద్యవస్థను కవి ఈ గ్రంథములో వర్ణించినాడు. తాను కావ్యమొకటి చేయ దలపోస్తూ ఉన్న సమయమున కరుణించి శ్రీ వేంకటేశుడు కలలో వైష్ణవాకారము దాల్చివచ్చినాడట. తానారగించిన ప్రసాదాన్ని చిన్నన్నకిచ్చి పరమ యోగి విలాసమనే పేరుతో కాసార యోగీంద్రాదికథలు 'సిరికిని సపరివారుండైన' తనకు అంకితముగా ద్రావిడ ప్రబంధము చూచి, తెలుగులో ద్విపద రూపములో రచింపుమని ఆనతిచ్చినాడట. ఇతివృత్తము–మూలము, భాష–ఛందస్సు,

# రచయితలకు చిత్రకారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రికకు మత ధార్మిక సంబంధమైన రచనలు, వ్యాసములు, గేయములు, చిత్రములు, ఛాయా (వర్ణ) చిత్రములు పత్రికలో ప్రచురణకు గాను కోర బడుచున్నవి. రచయితలు, చిత్రకారులు ఈ క్రింది విషయములు గమనించవలెను.

*

1. రచనలు చేయువారు 6 అరఠావు పేజీలకు మించకుండా, పేజీలకు ఒక వైపుననే వ్రాసి పంపవలెను. వాటికి సంబంధించిన ఛాయా చిత్రములను కూడ పంపగోరెదము.

*

2. చిత్రములు వేయువారు ఇండియన్ ఇంకుతో వేసి పంపవలెను.

*

3. ఛాయాచిత్రములుపంపువారు చిత్రములలోని వివరములు నిర్దుష్టంగా వ్రాసిపంపవలెను.

*

4. ప్రచురితమైనవాటికి ఉచితరీతిన పారితోషిక మీయబడును.

— సంపాదకుడు,
సప్తగిరి

అన్నీ శ్రీ వేంకటేశుని ఆదేశాలే. ఆ శ్రీ వేంకటాధీశు వాక్యసరణిలో-వేదాలనెల్ల ద్రావిడముగాచేసి వేదాంతవిదులు కోవిదు లైనట్టి గురుతరులగు పరాంకుశ ముఖ్య యోగివరుల వైభవాన్ని కావ్యముగా గానము చేసినాడు చిన్నన్న. సకల వైష్ణవపాదసంసేవకాబ్జసదనావధూలబ్ధ సరసకవిత్వ విదిత మానసుడైన చిన్నన్న ఈ భాగవత దివ్యప్రబంధాన్ని —

" అలమేలుమంగకు నమలాంతరంగ
కలిసీలవేణికి నబ్జపాణికిని
అతిలోకమతికి శేషాచలరాజ
పతికిసరోముఖ్యభక్తసంతతికి
గనకచేలునకు శృంగారలోలునకు
వినమితేశునకు శ్రీవేంకటేశునకు "

అంకితముగా చెప్పి చరితారుడైనాడు. చిన్నన్న కావించిన భాగవత కైంకర్యాల లో 'పరమయోగి విలాస కృతి' కంటె ఉదాత్తము, ఉత్తమోత్తమము, పవిత్రము ఐన కైంకర్యము వేరొకటిలేదు. శ్రీ వైష్ణవ సిద్ధాంతమత ప్రవక్తలైన దివ్య సూరుల ఆర్ష చరితములను కీర్తించి పుణ్యఫలమునకేకాక, తెలుగునాటి వైష్ణవ మత వ్యాప్తి గావించిన కీర్తికిపాత్రుడై నాడు చిన్నన.

చిన్నన్న ద్విపద కృతులలో కడప టిది, సంకీర్తనాచార్యుని దివ్య జీవితమును కావ్యశైలిలో వర్ణించుచున్నది. 'అన్నమా చార్య చరిత్రము: తాళ్ళపాక అన్నమాచా ర్యుల మనుమడగు చిన్నన్నయే దీనిని రచించుటచే ఇది పరమప్రామాణికము, నిర్దుష్టము నగుచున్నది. తెలుగులో ప్రాచీనకవుల చరిత్రలు-అందును ప్రాచీను లైన సమకాలికులు రచించినవి తక్కువ అనిచెప్పవచ్చును. బసవపురాణము, పండి తారాధ్య చరిత్రము, కేతన దశకుమార చరిత్రములోని తిక్కన చరిత్రము, కృష్ణ రాయ చరిత్రములవంటివి కొన్నిమాత్రమే ఆంధ్రసాహిత్యలోకమున తోచుచున్నవి. అట్టివానిలో ఈ 'అన్నమాచార్యచరిత్రము' పేరెన్నికగన్నది.

" నందనుసద్వ్రతము తండ్రిప్రియము
నొందఁగీర్తించుట యుచితంబుగనుక
అరలేకయీయన్నమాచార్యచరిత
వెలవక నీకునేవిన్నవించెదను
మన్నించి యలమేలుమంగతోనీవు
నిన్నుఁబాయనిభక్తనికరంబుతోడ
నవధాను శ్రీవేంకటాచలాధీశ
అవధరింపుఁడు గురుహరిభక్తులార "

అని ఆ దివ్యదంపతులతోబాటు మనకూ ఆ మహనీయుని పవిత్రజీవిత చరిత్రమును చిన్నన్న వినిపించినాడు. ఈగ్రంథములో పొత్తపినాటిని, అన్నమాచార్యుల జన్మ స్థలమైన తాళ్ళపాకగ్రామాన్ని మనోహర ముగా వర్ణించినాడు. అన్నమాచార్యుల వంశ్యులను గురించి బాల్యము, విద్యాభ్యా సము, తిరుమలయాత్ర, అలమేలుమంగా సాక్షాత్కారము, దివ్యస్థలదర్శనము, స్వామి దర్శనము. శతకరచన, మహిమ, వైష్ణవ యతికృతపంచసంస్కారములు, వివాహ బంధము, సాళ్వనరసింగరాయల చెలిమి, సంకీర్తనగానము, రాజసత్కారము, శృం ఖలాబంధవిమోచనములు. పురందరదాసు మైత్రి, అన్నమాచార్యరచనలు — అనే విష యాలను చిన్నన్న విపులముగా వర్ణించి నాడు.

చిన్నన్న పరమయోగిధ్యేయ, బ్రహ్మాది గేయమైన అలమేలుమంగాదేవికి మహా భక్తుడు: నాళీకసదనవాసినీ వేంకటేశ్వర పాదపద్మవాసనాలోలుపస్వాంతషట్పదుడు. కావ్యాన్నిచెప్పి యెనలేని శ్రీవేంకటేశుని మెప్పించి అసాధారణాంక మకరకుండల ములనుగొన్న వినుతశీలుడేగాక వినయ శీలుడును. గురుతరులగు యోగివరుల వైభవము కావ్యము చేసినట్టి అలఘు పూర్వాచార్యులగు వారి యెదుట తాను కావ్యము చెప్పుట — శ్రీరాముడు సేతువు కట్టించునప్పుడు తాఁగట్టనుంకించు ఉడుత చందమున, భువనములో నభోమణియొప్ప దివి కీడమణియుదెలివొందు కరణిసామజ బృందము చనుదెంచుత్రోవఁ జీమలపంక్తి వచ్చిన విధంబున నున్నదని, తాను తత్పా దకముల సేవకుడని వినయవినమితుడై నాడు.

ఆ 'జలజాతవాసిని చనుబాలముట్టి' చిన్నన్న పలికిన కవిత 'అలఘుశబ్దార్థసా రసరీతి రసప్రభావముగా కులికి, కస్తురి వీణకోసినట్లుగా, తెలికప్పురపుక్రోవి తెరచి నట్లు, విరవాదిపొట్లము విడిచినట్లు' గా నాటికీనేటికీ పరిమళిస్తూనే ఉన్నది.

---


ఉపయుక్త గ్రంథాలు :—

T. T. D. Epigraphical Reports by Sri Sadhu Subrahmanya Sastry

అష్టమహిషీకల్యాణము (1936)

పరమయోగివిలాసము (1938)

ఉషాపరిణయము

అన్నమాచార్య చరిత్రపీఠిక (వేటూరి ప్రభాకరశాస్త్రి)—Published by T T D

Tallapaka Works vol XIX: Sringara Sankeertanalu Edited by Rallapalli Ananthakrishna Sarma & Gowripeddi Rama Subba Sarma (1965)

తాళ్ళపాక కవుల కృతులు: వివిధ సాహితీ ప్రక్రియలు (1974)


డా. వేటూరి ఆనందమూర్తి.

*

(6వ పేజీ తరువాయి)

గీ॥ తాను జొచ్చినకతన వృత్రహునినగరి
యందములు క్రొత్తతెరతీసినట్లు దోప
దర్పకుఁడు సర్వసృష్టి చైతన్యమూర్తి
నాకవిభుముంగిట వాసాదటంచు నిలిచె. ౩౩౮

కం॥ మదనునిఁ గని వేగన్నులు
ముదమై రమ్మంచుఁ జీరి ముక్తాఫలభా -
స్వదనూనవిష్టరంబున
సదయతఁ గూర్చుండబెట్టి శతమఖుఁ డంతన్. ౩౩౯

గీ॥ అచ్చరలచెక్కుటద్దంబు లవఘళించు -
నాగపర్ణమ్ములను నందనద్రుపూగ -
ములను ప్రాసాదమృగమదమ్మున సుగంధి
తమ్ము తాంబూలమిచ్చి చేతమ్ము నాచి. ౩౪౦

గీ॥ కరతలము హస్తతలమునఁ గదియఁజేర్చి
నయనసాహస్రమును మనోన్మథనుఁడైన -
మదనుపైనుంచి యనురాగ మదుకఁజూచి
యనియె చల్లఁగా దేవవేశ్యాభికుండు. ౩౪౧

సీ॥ ఓయీ! సురాసురాప్యాయివిక్రమ! శీత
లాస్త్ర నిగూఢవిశ్వాతిశాయి!
చిత్రవైశ్వానర! సేయంగఁగలవారు
విలుకాండ్రు రెందరో గలరు జగతి
తారెల్ల వస్తుద్విధాకరణకుముల్
రెంటి నొక్కటిసేయురీతి లేదు,
ద్వైతమ్మునకును నద్వైతమ్ము నీది యి
ఘుధనుస్సు చేయందికొన్నయంత

గీ॥ తారకునిఁ గూల్చు తరుణచంద్రకలమస్త -
భరణు పార్వతితోడ గూర్పంగవలయు
వారిపుట్టిననిసుగు దేవతలయందు
వీతభయసమ్మదమ్ములుఁ విత్తుగాని ౩౪౨

ఉ॥ పొమ్మన కాలదష్టుఁడయి మోమున గర్వము చెంగలింప హ-
స్తమ్ములు మోడ్చి మన్మథుఁడు చారుపికీశుకముఖ్యమూలసై -
న్యమ్ములు గొల్వఁ జేరె తుహినాచలభూములు వెంటనంటి ప్రే -
మమ్మున రా రతీసతి సుమాళపుఁజూపుల నందగింపుచున్. ౩౪౩

(సశేషము)

---

(7వ పేజీ తరువాయి)

దుఃఖములు పుట్టును. జగత్తులో పుట్టు సుఖరూపమైన మంచితనమునకు, పరమాత్మునికృపయు దుఃఖరూపమైన చెడ్డకు చేతనుని స్వతంత్రేచ్ఛయును కారణమని చెప్పుట పాడుక. ఇట్లు సుఖదుఃఖ మిశ్రితమైన జగత్తునందు మంచికి అనేక వేళల నపజయము, చెడ్డకు చాల సార్లు జయమును కలుగుచున్నది. దీనికి కారణమేమి మొత్తము ప్రపంచము నంతటిని ఆవరించియున్న సర్వేశ్వరుడుండగా ఇట్లు జరుగుట ఉచితమా? అతడు తన సంకల్పశక్తిచే దీనిని మాన్పలేడా? అనేక చెడుగుల మధ్య ఏదో యొక మంచి జరుగుట న్యాయమా? జగత్తునే శరీరముగా పొందియున్న పరమాత్ముని సంకల్పము ఇదియేనా? ఇట్టి ప్రశ్నలు సహజముగనే పుట్టుచున్నవి. పరమాత్ముడు జగత్తును సృష్టించుచున్నాడు. అయితే జగత్తు స్వేచ్ఛా ప్రవర్తనమైయుండుట సాధ్యము కాదు. ఎందుకనగా పరమాత్ముడు ప్రభువైయున్నట్లే, విమోచకుడు కూడ. పరమాత్ముని లీల బాలక్రీడ వంటిదికాదు. నిరంకుశ ప్రవర్తనమును కాదు. అది ఇంద్రియాతీతము, అనుభవాతీతమునైన విషయము. పరమాత్మునికి స్వభావముగా నుండినది సంకల్పలీల. ఈ లీల ఎల్లప్పుడును దయతోకూడి యుండునది. ఇట్టి దయాస్వరూపము ఈశ్వర తత్త్వమునకు పరమావధియై యుండును,

పరమాత్ముని స్వరూపము ఎట్టిదనగా అది సృష్టి స్వరూపమును గను అవకాశమియ్యదు. జగత్తున గలుగు కష్టనష్టములకు సుఖ దుఃఖములకు స్వార్థ స్వాభిమానములే కారణము. ఆత్మకు కష్టమనునదే లేదు. ఇదే పరమాత్ముడు కరుణించిన సమాధానము. సువర్ణమును శుద్ధిచేయుటకు అగ్ని చాల అవసరము. అట్లే, ఆత్మను శుద్ధిపఱచుటకు ఈవి అగత్యము. తన క్రియాఫలమును ఆత్మ అనుభవించుచుండుటచే పరమాత్మ స్వరూపములో మార్పు ఉండదు. న్యూనతలేని పరిపూర్ణ జగత్తును పరమాత్ముడు సృష్టించవలసియుండెను అనునది అర్థములేని మాట. అట్లైనచో, సృష్టి యొక్క అవసరమే యుండియుండదు. సత్యము సత్యమే! ఈశ్వర ఈశితవ్య సమన్వయమందు సృష్టి దివ్య పవిత్ర సత్యము ఎన్నటికిని సత్యముగనే ఉండును.

ఈశితవ్యమైన జగత్తు ఈశ్వరాధీనము. భగవద్గీతయందు కాన్పించు విశ్వరూపదర్శనము విశిష్టాద్వైత దర్శనమందలి ముఖ్యలక్షణమైన ఈశ్వర-ఈశితవ్య భావనకు సర్వోత్తమమైన ఉదాహరణము. ఇట్టి దివ్యము, పవిత్రమునైన సామరస్యమును వేదాంతదేశికులు తమ యాదవాభ్యుదయ కావ్యములో నిరూపించియున్నారు. (సశేషము)

# శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము తిరుమల

1-3-79 నుండి

## నిత్యపూజ, దర్శనాదికముల కార్యక్రమము

### శని, ఆది, సోమ మరియు మంగళవారములు

ఉదయము 3-00 నుండి 3-30 వరకు సుప్రభాతము
,, 3-30 నుండి 3-45 వరకు శుద్ధి
,, 3-45 నుండి 4-30 వరకు తోమాలసేవ
, 4-30 నుండి 4-45 వరకు బంగారు వాకిలివద్ద కొలువు; పంచాంగ శ్రవణం,
,, 4-45 నుండి 5-30 వరకు మొదటి అర్చన
,, 5-30 నుండి 6-00 వరకు మొదటిఘంట బలి మరియు శాత్తుమొర
,, 6-00 నుండి మ 12-00 వరకు సర్వదర్శనము
మధ్యాహ్నం 12-00 నుండి 1-00 వరకు రెండవఅర్చన,(ఏకాంతం)
,, 1-00 నుండి 8-00 వరకు సర్వదర్శనం
రాత్రి 8-00 నుండి 9-00 వరకు శుద్ధి, రాత్రికైంకర్యము
,, 9-00 నుండి 12-00 వరకు సర్వదర్శనం
,, 12-00 నుండి 12-30 శుద్ధి

12-30 ఏకాంతసేవ

### గురువారము

### తిరుప్పావడ

ఉదయము 3-00 నుండి 3-30 వరకు సుప్రభాతం
,, 3-30 నుండి 3-45 వరకు శుద్ధి
,, 3-45 నుండి 4-30 వరకు తోమాలసేవ.
,, 4-30 నుండి 4-45 వరకు బంగారువాకిలివద్ద కొలువు మరియు పంచాంగ శ్రవణము
,, 4-45 నుండి 5-30 వరకు మొదటి అర్చన,
,, 5-30 నుండి 6-00 వరకు మొదటిఘంట, బలి శాత్తుమొర
,, 6-00 నుండి 8-00 వరకు నళ్ళింపు, 2 వ అర్చన (ఏకాంతం), తిరుప్పావడ, అలంకరణం, ఘంట ఇత్యాది
,, 8-00 నుండి రాత్రి 8-00 వరకు సర్వదర్శనం

సాయంకాలం 8-00 నుండి 10-00 { వరకు శుద్ధి ఇత్యాది / పూలంగి సమర్పణ / రాత్రి కైంకర్యము, ఘంట }

రాత్రి 10-00 నుండి 12-00 వరకు పూలంగిసేవ
,, 12-00 నుండి 12-30 వరకు శుద్ధి
,, 12-45 ఏకాంతసేవ

### బుధవారము

### సహస్రకలశాభిషేకం

ఉదయం 3-00 నుండి 3-30 వరకు సుప్రభాతము
,, 3-30 నుండి 3-45 వరకు శుద్ధి
,, 3-45 నుండి 4-30 వరకు తోమాలసేవ
,, 4-30 నుండి 4-45 వరకు బంగారువాకిలివద్ద కొలువు పంచాంగశ్రవణం
,, 4-45 నుండి 5-30 మొదటి అర్చన
,, 5-30 నుండి 6-00 మొదటిఘంట, బలి, శాత్తుమొర
,, 6-00 నుండి 8-00 సహస్ర కలశాభిషేకము
,, 8-00 రాత్రి 8-00 వరకు సర్వదర్శనం
రాత్రి 8-00 నుండి 9-00 వరకు శుద్ధి ఇత్యాది
,, 9-00 నుండి 12-00 వరకు సర్వదర్శనం
,, 12-00 నుండి 12-30 వరకు శుద్ధి
రాత్రి 12-30 ఏకాంతసేవ

### శుక్రవారము

### అభిషేకము

ఉద॥ 3-00 నుండి 3-30 వరకు సుప్రభాతము
,, 3-30 నుండి 5-00 వరకు నళ్ళింపు మరియు నిత్యకట్ల కైంకర్యములు (ఏకాంతము)
,, 5-00 నుండి 7-00 వరకు అభిషేకము (రు. 450/- రు. 250; రు. 100/- వారికి మాత్రమే ప్రవేశం)
,, 7-00 నుండి 8-30 వరకు సమర్పణము
,, 8-30 నుండి 9-30 వరకు తోమాలసేవ మరియు అర్చన (ప్రత్యేకం) ఘంట, బలి, మరియుశాత్తుమొర
,, 9-30 నుండి 10-00 వరకు రెండవ గంట, బలి, శాత్తుమొర
10-00 నుండి రాత్రి 8-00 వరకు సర్వదర్శనం
రాత్రి 8-00 నుండి 9-00 వరకు శుద్ధి రాత్రి కైంకర్యము
రాత్రి 9-00 నుండి 12-00 సర్వదర్శనం
,, 12-00 నుండి 12-30 వరకు శుద్ధి
12-30 ఏకాంతసేవ

గమనిక ;— 1) పైకార్య క్రమములో సమయాను కూలముగాను ప్రత్యేక కార్యక్రమముల వలనను మార్పులు చేయబడవచ్చును. 2) సుప్రభాత దర్శనమునకు రు. 25/- టిక్కెట్టువారు మాత్రమే అనుమతింపబడుదురు. 3) రు. 25/- టిక్కెట్లు తిరుమలలోను దేశంలో ఆంధ్రాబ్యాంకువారి వివిధ కేంద్రములలోను లభించును. 4) ప్రత్యేక దర్శనం టిక్కెట్లు గలవారు లోగడవలె ధ్వజస్తంభంవద్దగాక మహాద్వారము క్యూలో చేర్చబడుదురు. 5) రు. 200/-ల ఆమంత్ర ణోత్సవం టిక్కెట్టుపై తోమాలసేవ, అర్చన ఏకాంతసేవలకు మాత్రమే అనుమతి. ఇద్దరు మాత్రమే అనుమతింపబడుదురు. 6) అర్చన, తోమాలసేవ, ఏకాంతసేవలో దర్శనాంతరపు టిక్కెట్లుగావి రు. 25/ టిక్కెట్లుగావి అమ్మబడవు.

పేష్కార్ ; శ్రీవారి ఆలయం, తిరుమల

## గ్రంథ సమీక్ష

# మహర్షి-సద్గురు శ్రీ మలయాళస్వామి జీవితచరిత్ర

(రచయిత సాహిత్యశిరోమణి సముద్రాల లక్ష్మణయ్య, ఎం ఏ, క్రౌ డెమ్మీసైజు, 424 పుటలు వెల రూ 6 తొలికూర్పు 1976 ప్రతులకు మేనేజరు, శ్రీవ్యాసాశ్రమము, శ్రీ వ్యాసాశ్రమము పోస్టు ఏర్పేడు మార్గం, చిత్తూరుజిల్లా, ఆం ప్ర )

భారతదేశంయొక్క విశిష్టతకు మూల కారణం అనాదిగా అందు విలసిల్లుతున్న ఆధ్యాత్మికసంపద ఆ సంపదను తమ తాత్త్వికచింతనలచే పెంపొందిస్తూ, నిరంతరం మానవాళి మానసికవికాసోన్నతికి మార్గదర్శకులై మనుగడసాధించిన మహనీయులు మహర్షులు కావుననే వారి జీవితాలు అనంతమైన ఆధ్యాత్మికవాఙ్మయానికి సోదాహరణవ్యాఖ్యలుగా అలరారుతూ వుంటాయి అందువల్ల అట్టి మహాత్ముల చరిత్రలు బ్రతుకుబాటలో పయనించే ప్రతి వ్యక్తికీ పాథేయాలుగా ఉపాదేయాలు

అసలు 'జీవితచరిత్ర' అనేది ఒక ప్రత్యేక రచనాప్రక్రియగా తెలుగులో గుర్తింపు పొందడం పాశ్చాత్య వాఙ్మయంతో పరిచయం ఏర్పడిన తర్వాతనే జరిగింది ఐనా అచిరకాలంలోనే అది చెప్పదగినంతగా పెంపొంది సాహితీగౌరవాన్ని చూఱగొన్నది ఆ వాఙ్మయానికి ఇటీవలే సమకూరిన మహోకృతి "శ్రీమలయాళస్వామి జీవితచరిత్ర"

క్రి శ 1885 లో కేరళదేశమందలి తిరుచూరు మండలానికి చెందిన ఎన్గండ్యూరుగ్రామంలో నొట్టియమ్మ, కరియప్ప అనే పుణ్యదంపతుల నోముఫలంగా జన్మించిన వేలప్ప అనే బాలుడు గురుకులవాసానంతరం ఇల్లువదలి పాదచారియై ఆసేతుహిమాచలం పర్యటించాడు తరుపరి తిరుమల పుణ్యక్షేత్రంలో గల గోగర్భం, తుంబురు తీర్థంవంటి పవిత్ర ప్రదేశాలలో దాదాపు పదమూడువత్సరాలు తీవ్రంగా తపస్సాధన గావించి, తపస్సిద్ధుడై 'మలయాళస్వామి'గా పేరొంది శ్రీవ్యాసాశ్రమ సంస్థాపకు డయ్యాడు ఆంధ్రావనిలో సంస్కృతభాషావ్యాప్తికి, అధ్యాత్మవిద్యాప్రచారానికి, సంఘసంస్కరణకు, గురుకులపద్ధతి విద్యలయాలను నెలకొల్పడం ద్వారాను, ఉపదేశప్రవచనాలమూలంగాను, అసంఖ్యాకరచనలద్వారానూ ఇంచుమించు అర్ధశతాబ్దికాలం ఆ 'చరాచరసుఖాభిలాషి' కావించినసేవ అనర్ఘమై. అక్షరమై విరాజిల్లుతూ వుంది.

ఎన్గండ్యూరు నుండి ఏర్పేడు వరకు సాగిన ఆ అసంగానంద యోగిపుంగవుల డెబ్బదియేడు నిండుసంవత్సరాల జీవితయాత్ర ఈ గ్రంథంలో ఏడుఘట్టాలుగా వింగడింపబడి, ఆ ఒక్కొక్క ఘట్టం ఒక్కొక్క ప్రత్యేకప్రకరణంగా రూపొందింపబడినది ఆ ఏడుఘట్టాల పేర్లిలా వున్నాయి 1, బాల్యం 2 గురుకులవాసం 3 తీర్థయాత్ర 4 తపస్సు 5 ఆశ్రమస్థాపన 6 బ్రహ్మవిద్యాప్రచారం 7 మహాసమాధి ఇందులో తొలి నాలుగుఘట్టాలు శ్రీవారిజీవితంలోని మొదటి నలువదేండ్ల ఉదంతాన్ని, అలాగే చివరి మూడుఘట్టాలు తర్వాతి ముప్పదేడువత్సరాల పైచిలుకు జీవితంలో నడచిన వృత్తాంతాలను ప్రతిబింబిస్తున్నాయి ఆమేరకు ఈ గ్రంథాన్ని రెండు ప్రధానభాగాలుగా పరిగణింపవచ్చు అలా పరిగణించిచూస్తే పుటలపరిమితిలో మొదటిభాగంకన్న రెండవభాగం రెట్టింపునకు మించిఉన్నట్లు బోధపడుతుంది పరిశీలిస్తే ప్రతిమహాత్ముని జీవితమూ ఇలాగే 'సాధన'దశలో తత్కాలానికి ఇంచుక అజ్ఞాతంగానూ, ఆటుపిమ్మట లోకసంగ్రహకార్య'సిద్ధి' దశలో మఱింత విశదంగానూ వెలుగొందుతూ వుంటుంది ఆ విధంగా, మొదటిభాగంలో స్వాములవారు సాధించిన ఆధ్యాత్మికశక్తిసాధనాలు రెండవభాగంలో చాతుర్మాస్యాది బహుముఖ కార్యకలాపాలుగా సఫలత నొందాయని చెప్పవచ్చు. శ్రీవారు అఖండదీక్షతో తపస్సుగావించిన గోగర్భక్షేత్రంలోనే ఈ 'జీవితచరిత్ర' కు రచయిత శ్రీకారం చుట్టడం ముదావహం

ఇక ఉత్తమ జీవితచరిత్రకారుడికి ఉండవలసిన ముఖ్యలక్షణాలుగా విమర్శకులు పేర్కొనేవి ఇవి

1 కథాపురుషుని జీవితంతో ప్రకృష్ట పరిచయం. 2 ఆరాధనతత్పరతతోపాటు ఆవేశరహితంగా సత్యాన్ని చిత్రించే దీక్ష 3 కథానాయకుని పుట్టుపూర్వోత్తరాలతో పాటు, రచనలో ఆయన ఆత్మీయతను వ్యక్తీకరింపజేసే నైపుణ్యం శ్రీసముద్రాల లక్ష్మణయ్యగారు పై మూడు లక్షణాలను పుణికిపుచ్చుకున్నా రనటానికి ప్రకృతరచనయే దృష్టాంతం.

ఈ పుస్తకంలోని భాషాశైలి శ్రీవారి ఆధ్యాత్మిక మూర్తిమత్త్వానికి అనుగుణమైన సరళసుందరగ్రాంథికఫణితిలో నిమ్మళంగా సాగిపోయింది ఆయా సందర్భాల్లో ఇందు కుదుర్చుకొనివున్న చిన్న, పెద్ద ఉల్లేఖాలు (Quotations) ఈ గ్రంథప్రామాణికతను ఇనుమడింపచేస్తున్నాయి. ప్రతిప్రకరణంచివర తత్సారాన్ని సంగ్రహంగా అందించే పద్యం కూర్చబడి ఉండడం ఇందులోని ఇంకోవిశేషం ఈపుస్తకంలో దాదాపు ప్రతిప్రకరణంలోనూ అనువైన చోట్ల కొన్ని చిత్రాలు చేర్చబడివున్నాయి కాని, పంచమప్రకరణం (ఆశ్రమస్థాపన ఘట్టం) లో కనీసం ఒక్కచిత్రమైనా చోటు చేసుకోకపోవడం విచార్యం శ్రీవారు స్థాపించిన వ్యాసాశ్రమ దృశ్యచిత్రాన్ని, నందిపర్వతం, కాశీబుగ్గ, తామరకొలను, సంస్కృతపాఠశాల—మున్నగువాటి చిత్రాలను ఇందులో చేర్చివుంటే ఇంకా బాగుండేది ఇంతటి గొప్పగ్రంథానికి ప్రసిద్ధపద సూచిక (Index) లేకపోవడం — ఈనాటి పరిశోధనదృక్పథంతో చూచినప్పుడు ఆలోచనీయమే అవుతుంది

# ఉపనిషత్కథలు
# పంచకోశాలు

**యల్లంరాజు సుబ్బారావు**
విశారద విద్యాభాస్కర (ఢిల్లీ)
ఒంగోలు

యా కృష్ణయా మంత్ర కృతో మనీషిణః
అన్వైచ్ఛన్ దేవా స్తపసా శ్రమేణ
తాందేవీం వాచ్ దాహవిషాయజామహే
సానోదధాతు సుకృతస్య లోకే।
— తైత్తిరీయ బ్రాహ్మణ II–8–8

భృగు మహాఋషి వరుణుని కుమారుడు. ఆయనొకసారి తండ్రిదగ్గరకు వెళ్ళి ఇలా అర్థించాడు — "తండ్రీ! నీలోని బ్రహ్మజ్ఞానాన్ని నాకు ప్రసాదించు"

తండ్రి యిలా సమాధాన మిచ్చాడు — 'పంచభూతాలను, వాయువును, నేత్రాలను, కర్ణాలను, మనస్సును, వాక్కును, నీవు రోజూ గమనిస్తూనే వున్నావు. ఇవన్నీ వేటి నుండి ఉద్భవించి నిలుస్తున్నాయో, వేటి వైపు మొగ్గుతున్నాయో, చివరకు వేటిలో లీనమవుతాయో ఆ సత్యాన్నే నీవు తెలుసుకోవలసింది. అదే బ్రహ్మ పదార్థం. ఆ బ్రహ్మను నీవు తపస్సు (ఏకాగ్ర చిత్తత) లేదా మననం ద్వారా తెలుసుకోవచ్చు.

భృగుతండ్రి మాట ప్రకారం ధ్యానంలోనిమగ్నుడై పోయాడు. ధ్యానానంతరం అతనికి అన్నమే బ్రహ్మగా గోచరించింది. తండ్రి దగ్గరకు వెళ్ళి భృగు అన్నమే బ్రహ్మంగా పేర్కొన్నాడు వరుణుడు కుమారుని తపస్సుకు తృప్తిపడక తిరిగి సాధన చేయమని చెప్పి పంపాడు. మననమే నీకు సరి అయిన సమాధానం బోధించగలదని తండ్రి పుత్రుడు ఆదేశించాడు.

భృగువెళ్ళి తిరిగి తపస్సు ప్రారంభించాడు. ప్రాణం తోటే అందరూ జన్మిస్తారు. దానిలోనే అందరూ లీనమై పోతుంటారు. ప్రాణమే జీవితానికి మనుగడ. ఈసారి అతనికి ప్రాణం బ్రహ్మగా గోచరించింది.

కాని ఇదికూడా తండ్రికి సరిఅయిన సమాధానంగా కనబడలేదు. తిరిగి తపస్సు కొనసాగించమని వరుణుడు భృగువు నాదేశించాడు. ఈసారితపస్సులో భృగువుకు మనస్సు బ్రహ్మగా గోచరించింది. సృష్టి అంతా దీనినుండి ఉద్భవించి యిందులోనే లీనమవుతుంటుంది. ఇది అన్నాని కన్న ప్రాణానికన్న సూక్ష్మమయిందిగా భృగుకు గోచరించింది.

భృగు తన భావనను తండ్రికి తెలియ జేశాడు. కాని వరుణుడు మామూలు ధోరణిలోనే తిరిగి పంపివేశాడు.

ఈసారి భృగువుకు మననంలోవిజ్ఞానం బ్రహ్మగా స్ఫురించింది. దీనినుండే సృష్టి అంతా వెలువడి, విలీనమవుతుంటుంది. తండ్రికి ఈ సమాధానం కూడా నచ్చక తిరిగి తపస్సుకు ప్రబోధించాడు.

తిరిగి భృగు కఠోర తపశ్చర్యలో మునిగి పోయాడు. ఈసారి ఆయనకు ఆనందం బ్రహ్మగా సాక్షాత్కరించింది. ఇదే సృష్టికంతా మూలం, ధ్యేయమని ఆయనగ్రహించాడు. జీవులంతా ఆనందంలోనే జన్మిస్తారు. ఆనందంవల్లనే జీవిస్తారు. ఆనందం కోసమే పరితపిస్తారు. చివరకు ఆనందంలోనే విలీనమవుతారు.

భృగు తన తపః ఫలితాన్ని తండ్రికి నివేదించగానే, తండ్రి పరమానందంతో ఇలా అన్నాడు — "ప్రియమైన పుత్రా! ఇదే అన్నిటిలో శ్రేష్ఠమయింది. అయిదు కోశాలు ప్రతిప్రాణిలోను ఉన్నాయి. వాస్తవంలో ఒకదానికంటె మరియొకటి గూఢమై రహస్యంగా ఉన్నాయి. కాని అందులో ఆనందమే ఉత్తమం. శాశ్వతం, సూక్ష్మమయం ఒకదానినుండి మరియొకటి వేరుగాక, అన్నీ ఒక దానిలో నొకటి కలసి మెలసే వుంటాయి. కాని వాటి కాధారమంతా ఆనందమే. అదే బ్రహ్మానందం. నిర్మలమయిన ఆధ్యాత్మిక సుఖం. ఈ సత్యాన్ని, తెలుసుకున్న వాడే దుఃఖాలను మృత్యువును అధిగమించ గలడు. దీన్నే "భార్గవీవారుణీవిద్య" అని ఉపనిషత్తులు ఉద్ఘాటిస్తున్నాయి."

---

తప్పొప్పులపట్టికకు తావులేకపోవడం ఈ కృతి సంతరించుకొన్న ఒక సుకృత విశేషం. పద్మాసనాసీనుడైన శ్రీస్వాముల త్రివర్ణచిత్రంలో కూడిన జాకెట్ కవర్ ముస్తాబుతో, ముచ్చటగా ముద్రితమైన ఈ కృతియొక్క ఆకృతి (get-up) ఆకర్షణీయమై ఒప్పుతూవుంది. ఈ గ్రంథానికి సరసమైన వెలను నిర్ణయించిన ప్రకాశకుల సదాశయం అభినందించదగినుంది. ఆచార్య శ్రీ జి. యన్. రెడ్డిగారు ఆశించినట్లు ఈ రచన ఆంగ్లంలోకీ, ఇతర భారతీయభాషల్లోకీ అనువదింపబడితే శ్రీవారి జీవితవిశేషాలు ఆంధ్రేతరులకు సైతం అందుబాటులోకి వస్తాయి.

- జె. కె. కృష్ణమూర్తి

---

**విజ్ఞప్తి**

గ్రంథ సమీక్షకు పుస్తకాలు పంపేవారు రెండు ప్రతులు పంపుతూ, సమీక్షార్థం అని వ్రాసి పంపాలి.

సం॥

# ఈ మాసం మీ అదృష్టం!

### మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పా)

రాహువు వలన ఆందోళన. శనివలన ధననష్టం లేదా వివాదాలు లేదా సంతానం నుండి ఎడబాటు గురువువలన ధనం, శృంగారం లేదా నూత్నవస్త్రాలు గృహవాహన అథవా సంతానప్రాప్తి. కుజుని వలన వివాదాలు లేదా ఉద్యోగ సంబంధమైన ఆందోళన లేదా అనారోగ్యంవల్ల అథవా దొంగతనంవల్ల ఆందోళన. రవి వలన మొదటి పక్షంలో ధనం, హోదా, రెండవ పక్షంలో అనారోగ్యం. బుధుని వలన ఇంటిలో వస్తుసమృద్ధి శుక్రుని వలన ధనం, జయం, నూత్నవస్త్రాలు లేదా నూత్నమిత్రులు.

### వృషభం

(కృత్తిక 2,3,4,పా, రోహిణి, మృగశిర 1, 2, పా.)

రాహువు వలన వివాదాలు. శనివలన అయినవారినుండి వేర్పాటు లేదా ధననష్టం, మిత్రవిరోధం. గురువువలన నిరాశ కుజునివలన ఆందోళన. బుధుని వలన నూత్న స్నేహితులు, తన ప్రవర్తన కారణంగా భయం రవివలన మొదటి పక్షంలో ధననష్టం, నేత్రబాధ, మోసం. తరువాత కాలంలో ధనం, అధికారం. శుక్రునివలన ధనం ఆహారధాన్యాలు లేదా గౌరవం లేదా నూతన వస్త్రాలు. వ్యవహారాలలో జయం, సంతానప్రాప్తి.

### మిథునం

( మృగశిర 3,4 పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పా )

రాహువువలన ధనం, లేదా నూతన వస్త్రాలు, దృఢారోగ్యం, గృహంలో వస్తుసమృద్ధి, సేవక వాహనాదిప్రాప్తి. గురువు వలన ధనం. కుజుని వలన ధనాభావం లేక ఇతరమైన ఆందోళన. బుధుని వలన ధనం, వివాదాలు. రవి వలన ఉదరబాధ, ధననష్టం, ప్రయాణం ప్రయాస. శుక్రుని వలన 25 తేదీ వరకు శృంగారం తరువాత ధన ', గౌరవం లేదా నూత్నవస్త్రములు, ఆహారధాన్యప్రాప్తి; వస్తుసమృద్ధి, సంతానప్రాప్తి

### కర్కాటకం

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

రాహువువలన ధననష్టము, శనివలన ధనాభావం, గురువువలన ధననష్టం, వివాదాలు లేదా అగౌరవం లేదా మనశ్శాంతిభంగం. కుజునివలనఅన్ని విధాలజయం. బుధునివలన వివాదాలమూలంగా లేదా దుష్టసలహాలమూలంగా ధననష్టం. రవి వలన నెలమొదటిపక్షంలో ధననష్టం తరువాత ప్రయాణం, ప్రయాస లేదా ఉదర బాధ, ధననష్టం. శుక్రుడు 25 వరకు స్తబ్ధుడు తరువాత విలాసతత్త్వం.

### సింహం

(మఖ, పూ. ఫ, ఉత్తర 1వ పా.)

రాహువువలన ఆందోళన. శనివలన అయినవారి నుండి వేర్పాటు లేదా ప్రయాణం — ప్రయాస లేదా ధననష్టం, కుమారులతో విరోధం, బంధువులకు హాని ప్రయత్నం లేదా తనహానికే ప్రయత్నం. గురువువలన ప్రయాణంమూలంగా ఆందోళన కుజునివలన ధనసమృద్ధి, బుధుని వలన శత్రువులమూలంగా, అనారోగ్య కారణంగా లేదా అగౌరవంవల్ల ఆందోళన. రవివలన నెలమొదటి పక్షంలో ధనం రెండవపక్షంలో స్తబ్ధుడు. శుక్రునివలన మంచి మిత్రులు, నూత్నవస్త్రములు.

### కన్య

(ఉత్తర 2, 3, 4 పా. హస్త; చిత్ర 1, 2 పా.)

రాహువువలనధనం, శనివలన ఆందోళన. గురువువలన అధికధనం, కుజునివలన అగౌరవం, ధననష్టం. బుధునివలన ధనం లేదా శృంగారం లేదా మంచి మిత్రులు లేదా వాహన లేదా సంతానావకాశం. రవివలన దృఢారోగ్యము, జయం, గౌరవం, ధనం. శుక్రునివలన నెల 25 వరకు వివాదాలు, అగౌరవం. తరువాత మంచి మిత్రులు లేదా నూత్నవస్త్రాలు.

### తుల

(చిత్ర 3, 4 పా: స్వాతి, విశాఖ 1,2,3 పా;)

రాహువువలన సుఖం, శనివలన ధనం లేదా శృంగారం. గురువువలన ధననష్టం లేదా అగౌరవం, కుజునివలన ధననష్టం వివాదాలు లేదా శరీరానికి గాయం. బుధునివలన ధనం, శత్రువులపై జయం, లేదా శృంగారం లేదా నూత్నగృహం. రవివలన నెలమొదటిపక్షంలో అనారోగ్యం లేదా అశాంతి లేదా ధననష్టం తరువాతకాలంలో జయం. శుక్రునివలన 25వరకు పుణ్యకార్యం, లేదా ధనం లేదా నూత్నవస్త్రములు లేదా భార్యకు సుఖం తరువాత వివాదాలు, అగౌరవం.

### వృశ్చికం

(విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

రాహువువలన వివాదాలు, శనివలన ధననష్టం, లేదా అగౌరవం, ముసలి తల్లిదండ్రి లేదా ఇతర వ్యక్తికి పారలౌకిక క్రియాచరణం. గురువువలన ధనం, జయం ఆహారధాన్యాలు. సంతానావకాశం. కుజునివలన భార్యతో తగాదా, ఉదర లేదా నేత్రబాధ అనారోగ్యం. బుధుని వలన ప్రయత్నాలలో ఆశాభంగం. రవి వలన నెలమొదటి పక్షంలో భార్యకు

(40వ పేజీలో చూడుడు)

## ఆనివర ఆస్థానం

తిరుమలలో శ్రీస్వామివారికి జరిగే ముఖ్య ఆస్థానసేవలలో ఆనివరఆస్థానం సేవ ఒకటి. కర్కాటకసంక్రమణ మహా పుణ్యదినాన అనగా జూలై 17వ తేదీన ఈ ఉత్సవం జరుగుతుంది. ఆనాటిఉదయం విశ్వరూప, తోమాలసేవల అనంతరము ఉత్సవమూర్తులైన శ్రీ మలయప్పస్వామి వారికి, శ్రీదేవి, భూదేవులకు, విష్వక్సేనులకు అభిషేకం జరుగుతుంది. అనంతరం శ్రీస్వామివారిని, భూదేవులను బంగారు వాకిలికి ఎదురుగా ఆస్థానమంటపములో బంగారు సర్వభూపాలవాహనం మీదకు వేంచేయిస్తారు. శ్రీవారికి, సేనాధిపతివారికి ఆభరణములు, అలంకారములు జరుపబడుతవి తరువాత శ్రీవారికి, దేవేరులకు పుష్పమాలాకైంకర్యము జరుగుతుంది, రెండవఅర్చన అనంతరం దేవస్థానం అధికారులు, ఆచార్యపురుషులు, మఠాధిపతులు ఛత్రచామరాదులు వెంటరాగా స్వామివారి నివేదనలను విమానప్రదక్షిణంగా ఆలయం లోనికి తీసుకొనివచ్చి నివేదన సమర్పిస్తారు. తరువాత మఠాధిపతి శ్రీ జియ్యంగారు స్వామివారికి నూతనవస్త్రాలు సమర్పిస్తారు. ఆస్థానమండపంలో ఒకవస్త్రం శ్రీమలయప్పస్వామికి, మరోకటి సేనాధిపతికి సమర్పిస్తారు తరువాత శ్రీవారు ఆదేశించిన కర్తవ్య పునర్నిర్వహణము



తిరుమలలో శ్రీవారి ఆనివరఆస్థాన దృశ్యం.

## వార్తలు - విశేషాలు

నకు సూచనగా లోగడ పాదాలవద్ద ఉంచబడిన అధికారముద్ర, ఇతర బీగములు జియ్యంగార్లకు ఇచ్చి మర్యాదలు జరుపుతారు. ఇదేవిధంగా దేవస్థాన కార్యనిర్వహణాధికారికి సర్కారు మొహరును ఇచ్చి మర్యాదలు జరుపుతారు. తరువాత నీరాజనము వగైరా కార్యక్రమములు, ప్రసాదవినియోగం జరుగుతవి. ఇది కేవలము దేవాలయపు ఆంతరంగిక ఉత్సవమే అయినా, అధికార సమర్పణం, స్వామివారి కృపాకటాక్షమువలన పునఃఅధికార స్వీకారం అనే ముఖ్యకార్యక్రమాలు లక్ష్యముగా కలిగి అతివైభవోపేతముగా నిర్వహింపబడుతవి.

### సాక్షాత్కారవైభవం

తిరుపతి పట్టణానికి వాయువ్యముగా 6 కిలోమీటర్ల దూరంలో మంగాపురం గ్రామంలోవెలసిన శ్రీవేంకటేశ్వరస్వామి వారికి ఆషాఢ శుద్ధసప్తమికి అనగా 1–7–79 వతేదీన సాక్షాత్కారవైభవము జరుగుతుంది. పవిత్ర కల్యాణీనదీతీరాన ఉన్న ఈ ఆలయంలో జరిగే ఈ మహోత్సవమును సందర్శించేందుకు ప్రజలు చుట్టుప్రక్కల గ్రామాలనుండిరావడం పరిపాటి

(37వ పేజీ తరువాయి)

అసంతుష్టి, అనారోగ్యం తరువాత ధన నష్టం, నిరాశలేదా అనారోగ్యం. శుక్రుని వలన నూత్నవస్త్రములు శృంగారం, గృహం, ధర్మాచరణం, ధనం, భార్యకు సుఖం.

### ధనుస్సు

(మూలం, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

రాహువువలన అధార్మిక ప్రవర్తన. శనివలన అనారోగ్యం లేదా వివాదాలు లేదా అధార్మిక ప్రవర్తన. గురునివలన అనారోగ్య కారణంగా, ప్రయాణాలలో ప్రయాసలు కారణంగా ఆందోళన. కుజుని వలన శత్రులపై జయం, అధికధనం దృఢా రోగ్యం, సుఖప్రవృత్తి. బుధునివలన జయం ధనం నూతనవస్త్రాలు, లేదా సంతానావ కాశం. రవివలన నెలమొదటిపక్షంలో ప్రయాణం, ఉదరబాధ రెండవపక్షంలో భార్యకు అసంతుష్టి అనారోగ్యం శుక్రునివలన 25 వరకు స్త్రీలమూలంగా ఆందోళన తరువాత నూతన వస్త్రములు శృంగారం, నూతనగృహం

### మకరం

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ఠ 1.2 పా)

రాహువువలన ఆందోళన, శనివలన భార్య లేదా బిడ్డలనుండి ఎడబాటు. గురువువలన శృంగారం లేదా ఇతర సంతోష ప్రవృత్తి. కుజునివలన శత్రువుల మూలంగా లేదా అనారోగ్యకారణంగా లేదా కుమారుల, కుమార్తెల కారణంగా ఆందోళన. బుధునివలన వివాదాలు. రవి వలన నెలమొదటిపక్షంలో దృఢారోగ్యం జయం. రెండవ పక్షంలో ప్రయాణం, ఉదరబాధ శుక్రునివలన అగౌరవం, అనారోగ్యం, లేదా స్త్రీలమూలంగా ఇబ్బందులు.

### కుంభం

(ధనిష్ఠ 3,4 పా, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా)

రాహువువలన వివాదాలు. శనివలన ప్రయాణం. గురువువలన మనశ్శాంతికి భంగం. కుజునివలన ఉదరబాధ, రక్త రోగము. బుధునివలన జయం, అధికారం. రవివలన నెలమొదటి పక్షంలో శత్రువుల మూలంగా లేదా అనారోగ్యకారణంగా ఆందోళన తరువాత కాలములో దృఢారోగ్యం, శత్రువులపైజయం, శుక్రుని వలన మొదటి 25 రోజులు పెద్దల ఆశీస్సులు, బంధువులరాక, ధనం, స్నేహితులు, సంతానవకాశం, తరువాత కాలంలో అనారోగ్యం లేదా గౌరవ భంగం కారణంగా ఆందోళన

### మీనం

(పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి.)

రాహువువల్ల ధనం. శనివలన దృఢారోగ్యం శత్రువులపై జయం, భార్యకు సంతోషం గురునివలన అధికధనం, నూత్నవస్త్రములు లేదా శృంగారం లేదా సేవకజన, గృహవాహన, సంతానాది ప్రాప్తి. కుజునివలవ అక్రమ మార్గాలద్వారా లేదా కుమారుల మూలంగా ధనప్రాప్తి. బుధునివలన భార్యా బిడ్డలతో వివాదాలు. రవివలన అనారోగ్యం లేదా శత్రువులమూలంగా ఆందోళన. శుక్రునివలన మంచిస్నేహితులు, బంధువులరాక, పెద్దల ప్రశంస, ధనం. సంతానం.

— డా॥ అక్కిసోమయాజి

---



---


***Edited and Published on behalf of T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T. T. D. Press by M. Vijayakumar Reddy, Manager T. T. D. Press Tirupati-517501***

మరునాటి ఉదయం రాష్ట్రపతి డా॥ నీలం సంజీవరెడ్డి సుప్రభాతసేవలో పాల్గొని శ్రీస్వామివారిని దర్శించి వారి ఆశీస్సులను పొందారు



## ఆలయంవద్ద అభివందన

దేవస్థానం కార్యనిర్వహణాధికారిచే ఆయన సందర్శన ఛాయా చిత్రాలుగల ఆల్బము బహూకరించబడింది. →



తరువాత తిరుపతి విమానాశ్రయంవద్ద అధికార, అనధికార ప్రముఖులు వీడ్కోలు చెప్పారు.



రాష్ట్రపతితో, చిత్తూరుజిల్లా కలెక్టర్ శ్రీ రామకృష్ణయ్య, దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్, దేవస్థానం అధ్యక్షులు డా. రమేశన్, దేవాదాయ కమీషనర్ శ్రీ యం. చంద్రమౌళిరెడ్డి, దేవస్థాన ఉపకార్యనిర్వహణాధికారి (తిరుమల) శ్రీ యన్. మునస్వామినాయుడు.

# తిరుమల యాత్రికులకు సదుపాయములు

* * *

- అన్ని వర్గాల వారికి అందుబాటులో ఉండేటట్లు ఉచిత పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలతో ఆవాససౌకర్యం
- శ్రీ వారిని దర్శించు యాత్రికులక్యూషెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు.
- క్యూషెడ్లలోనే కాఫీబోర్డువారి అల్పాహార సదుపాయం
- సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
- యాత్రికులు వెలుపలకు రావలసిన అవసరం లేకుండా క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం
- ఆంధ్రప్రదేశ్ పాలసరఫరాసంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
- యాత్రికులు చదువుకునేందుకు దేవస్థానం ముద్రిత గ్రంథాలు, స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
- క్యూలోని యాత్రికులకు విసుగులేకుండా ఉండేందుకు టెలివిజన్‌ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం
- క్యూలైన్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7వమైలువద్ద వైద్యసదుపాయం
- సామానులు, పాదరక్షలు భద్రపరచుకొనేందుకు ప్రత్యేకసౌకర్యం.
- తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటోసౌకర్యం,

## ఉచిత బస్సుసదుపాయం

- దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు ముఖద్వారంలో పేష్కార్ స్థాయి అధికారి, సిబ్బంది
- క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన, సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి, సిబ్బంది.
- యాత్రికుల సామానులను భద్రంగా తిరుమలచేర్చే సౌకర్యం ఏర్పాటైంది తిరుపతిలో ఏ సత్రంలోనైనా గాని, టోల్ గేట్ వద్దగాని తమ సామాగ్రి అప్పగించి రసీదు పొంది ఆ రసీదు తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్ దగ్గర కౌంటర్‌లో ఇచ్చి సామగ్రి పొందవచ్చు.
- దుండగులనుండి యాత్రికులను కాపాడేందుకు, తిరుమలకు వెళ్ళేదోవపొడుగునా రాత్రింబవళ్ళూ పోలీసు గస్తీ ఏర్పాటు చేయబడింది.
- దారిపొడుగునా మంచినీటి సదుపాయం ఉన్నది.
- రాత్రిపూటగాని, తెల్లవారుఝామునగాని కొండకు వెళ్ళదల్చుకొన్న వారికి వీలుగా మంచికాంతి శక్తిగల దీపాలు ఏర్పాటైనవి.
- వివిధప్రాంతాలనుండి వచ్చేయాత్రికులకు బోధపడేందుకు గాను తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో, దేశంలోని ముఖ్యభాషలలో విచారణ కార్యాలయాలు.
- ప్రత్యేక కాటేజీలలోని అదనపు సౌకర్యాలు అంజనాద్రినగర్, శేషాద్రి, గరుడాద్రి, శంకుమిట్ట కాటేజీలలో కూడ ఏర్పాటైనవి.

**దేవస్థాన ప్రయత్నాలలో ఇవి కొన్ని మాత్రమే!**

గమనిక: తిరుమలలో 2-4-79 నుండి తపాలాకార్యాలయము రాత్రి 8-30 గం॥ వరకు పనిచేస్తున్నది. ఇది గాక ప్రధాన తపాలాకార్యాలయము రాత్రి 10-30 నుండి 1-00 గం॥ వరకు పనిచేస్తుంది. శ్రీ వేంకటేశ్వరస్వామి వారి భక్తుడు అన్నమాచార్యుల తపాలాముద్రను కోరినవారు, తమ కార్డులు, కవర్లపై ముద్రించుకోవచ్చును.



తెప్పగా మఱ్ఱాకు మీఁద — తేలాడువాఁడు
ఎప్పుడు లోకములనెల్ల — వేలేటివాఁడు — (అన్నమాచార్య.)



అని బ్రహ్మాదులెంచేరు హరిబాలలీలలు
వెనక శుకాదులచే వింటిమి నేమిదివో

పొత్తులలోఁ బవ్వళించె పురుషోత్తముఁడు దొల్లి
హొత్తి మఱ్ఱాకుపైఁ బడినటువలెనె
వొత్తగిలి బోరగిలివుండఁ జొచ్చెఁ గృష్ణుఁడు
తత్తరానఁ గూర్మావతారమైన గతిని

తప్పటడుగులు వెట్టె తగఁ ద్రివిక్రముఁడై
గొప్పపాదాలను భూమిగొలిచినట్టు
అప్పుడే కొదలుమాఁటలాఁడఁ జొచ్చెఁ గృష్ణుఁడు
తప్ప నసురసతులఁ దగఁ బోధించినట్లు

అచ్చపు రేపల్లెలోన నాడఁ జొచ్చెఁ గృష్ణుడు
మెచ్చుల వైకుంఠాన మెరసినట్లు
నిచ్చలు శ్రీవేంకటాద్రినిలయుఁడై యున్నవాఁడు
అచ్చుగ జీవులలోన నాతుమైనయట్లు

అన్నమాచార్య సం. 10—262

# సప్తగిరి


TIRUMALA TIRUPATI DEVASTHANAMS

ఆగష్టు 79

సంపుటి 10 సంచిక 3

విడిప్రతి 0–50 పైసలు

సం॥ చందా రు. 6–00



గౌరవసంపాదకులు :

శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్

ఐ. ఏ. ఎస్,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2322

ప్రచురణకర్త – సంపాదకుడు:

కొత్రపాటి సుబ్బారావు

ఎమ్. ఏ.,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2254

ముద్రాపకుడు,

ఎమ్. విజయకుమార్ రెడ్డి,

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2340


## విషయసూచిక



* కొన్ని అనివార్య కారణముల వలన 'శ్రీనివాస ప్రబంధము' ప్రకటింపబడలేదు.

రెండవకవరు చిత్రం ఫోటో : శ్రీ యస్. కె. వి. యస్. శ్రీనివాసన్

ముఖచిత్రం : తిరుమలలో ఇటీవల కనుగొనబడ్డ అపూర్వ శిలాతోరణం.

# సంపాదకీయము

'చెప్పింది చెయ్యి. అనుమానంవస్తే అడుగు'—ఇది తండ్రి కుమారునికీ, గురువు శిష్యునికీ, అధికారి క్రింది వ్యక్తికీ సాధారణంగా చెప్పేమాట. ఇది క్రిందివారి క్రమశిక్షణకు, పైవారి విచక్షణకు గీటురాయిలాంటిది. ఇది మనం వింటూనేవున్నా, ఆదిమ సమాజంనుండి ఈనాటి వరకు సమాజప్రగతి ఈ ధర్మసూత్రంపైనే నడుస్తున్నదనీ, ఈ అనాది సూత్రాన్ని, ధర్మప్రగతి గతి తప్పినప్పుడెల్లా, అవతారపురుషులు ఆవిర్భవించి ప్రబోధిస్తుంటారన్న సత్యం, ఎంతో తరిచి చూస్తేనేగాని బోధపడవు. మనకున్న అవతారాలలో మనకు దగ్గరి అవతారమైన రామావతారంలో రాముడు పురుషోత్తముడుగా ఆచరణలో చూపిస్తే, ద్వాపరంలో కృష్ణావతారంలో, తాను సూక్ష్మతమ ధర్మాన్ని, నిత్యశంకితుడైన సార్వకాలిక నరునకు బోధించట మేగాక, తనచర్యలవల్ల, జీవితగమనంవల్ల తానే ఆదర్శనిష్కామ కర్మయోగికి నిదర్శనంగా భగవంతుడు నిల్చాడంటే మొదటిది, ఒప్పుకో బుద్ధివేసినా, రెండవది అవునా అన్న అనుమానం వేసినా ఆశ్చర్యంలేదు. నిజానికి కృష్ణుని మించిన కర్మయోగి వేరే లేడనిపిస్తుంది భారత భాగవతాలను చూస్తే

అన్ని అవతారాలలోకన్న కృష్ణావతారంలో ఒకప్రత్యేకత వుంది. ఇక్కడ శ్రీకృష్ణుడుగా ఆవిర్భవించిన పరమాత్మ దివ్యాతిమానుషతత్త్వం అడుగడుగునా ప్రస్ఫుటమౌతుంది. దేవకీవసుదేవులకు, అక్రూరునకు, రాసలీలలో గోపికలకు, రాయబారంలో భీష్మద్రోణవిదురాది మహామహులకు, భారతయుద్ధంలో అర్జుననికీ, ఆయా సందర్భాలననుసరించి తన విరాట్స్వరూపాన్ని, లీలలను ప్రకటించి తాను మానవాతీతశక్తిసమన్వితుడని నిరూపించుకున్నాడు.

కాని తనజీవితాన్ని తాను మలచుకొన్న తీరుమాత్రం వేరు. 'మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః' అన్నట్లు తాను నిష్కామకర్మయోగిగా అనుష్ఠించి కర్మయోగులకు మార్గదర్శకుడయాడు. దేవకికి జన్మించినా, నంద యశోదలకు అందరిమాదిరి చిలిపికృష్ణుడుగానే పెరిగాడు. ద్రౌపదికి కౌరవసభలో జరుగనున్న పరాభవం సర్వతశ్చక్షువైన స్వామికి తెలిసినా అనూహ్యకార్యాచరణానికి వచ్చినప్పుడుతప్ప రక్షింపలేదు. రాయబారం విఫలమౌతుందనికూడా తెలుసును. ఐనా కౌరవసభలో యథాశక్తి సంధికి ప్రయత్నించాడు. క్షత్రియోచిత కార్యోన్ముఖుణ్ణి చేయటానికి అర్జునికి గీతాబోధన చేసి తన అనంతశక్తిస్వరూపాన్ని ప్రదర్శించినా, ఆతర్వాత మేనల్లుడన్న మమకారంతోగాని, సవ్యసాచి సంతానమన్న దయతోగాని, 'అడ్డుపడకుండా' అభిమన్యువిషయంలో నిర్లిప్తుడుగా, సామాన్యుడిలా వ్యవహరించాడు. అపాండవంచేస్తానన్న అశ్వత్థామ ఆగడానికి ఉపపాండవులు బలైతే, అందరిలాగే తాను అరాటపడ్డాడేకాని, తప్పించేప్రయత్నం చేయనేలేదు. యాదవ కులంలో ముసలంపుట్టి సర్వనాశనమౌతున్నా, నిర్లిప్తుడుగా, సామాన్యధర్మాన్నే పాలించాడు, కాని తన దివ్యతేజస్సును శక్తిని ఉపయోగించలేదు. అవతారసమాప్తి విషయంలోకూడా రామాయణ మహాభారతాల నాయకులవిషయంలో చాలా వ్యత్యాసం కన్పిస్తుంది. శ్రీరామచంద్రులవారు అయోధ్యావాసులందర్నీ వైకుంఠానికి తీసుకువెళ్తే శ్రీకృష్ణుడు ఏకాకిగా, నిర్జన ప్రదేశంలో జీవిత చరమదశా రూపమైన జర నావహింపజేసుకొని, వేటగాని బాణానికి గురై తనువు చాలించాడు. రుక్మిణికి సహగమనం, సత్యభామకు వనాభిగమనం, పదారువేల శుద్ధాంత స్త్రీలకు పరాభిగమనం వారి వారి పూర్వకర్మవిపాకాన్ని అనుసరించి తప్పలేదు. ఇదంతా చూస్తే శ్రేష్ఠుడైన వ్యక్తి ఆచరించిన దానినే ఆచరించటం సమాజ మార్గమనీ కనుక అట్టి వ్యక్తి తన దివ్యశక్తులతో సమాజాన్ని సంక్షుభితం చేయక దానిని సక్రమమార్గాన నడిపించేందుకు తలలోని నాల్కలా ఆచరిస్తూ తలమానికం కావాలనే విశిష్ట నాయకత్వ గుణాన్ని, నిర్లిప్తత, నిరహంకారములతో ఆచరించాలన్నది శ్రీకృష్ణుని జీవితాదర్శం, ఆ భగవంతుడు సమాజాని కిచ్చిన సందేశం. అందుకే గీత సార్వకాలిక సమస్యా పరిష్కారక వేదమైంది. ఈ కృష్ణాష్టమి శుభ సందర్భాన ఆ మహాత్ముని వాక్యాలను మననం చేసుకొని మనని మనం దిద్దుకుందాం.

కర్మణ్యే వాధికారస్తే, మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతుర్భూః. మా తేసంగోఽస్త్వ కర్మణి.

# ఈమాసం మీఅదృష్టం!

### మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పా)

రాహువు వలన ఆందోళన. శని వలన కుమారులు లేదా కుమార్తెల నుండి ఎడబాటు లేదా ధననష్టం లేదా వివాదాలు గురువువలన బంధువుల మూలంగా ఆందోళన. బుధునివలనధనము గృహంలో వస్తు సమృద్ధి. కుజునివలన కుమారులమూలంగా అక్రమ మార్గాల ద్వారా ధనము. రవి వలన అనారోగ్యము లేదా గిట్టని వారి వలన ఆందోళన. శుక్రుని వలన మంచి స్నేహితులు, పెద్దలనుండి ప్రశంస, బంధువుల రాక, ధనం, సంతానము.

### వృషభం

(కృత్తిక 2,3,4,పా, రోహిణి, మృగశిర 1, 2, పా.)

రాహువు వలన వివాదాలు. శనివలన ధననష్టము లేదా అయినవారి నుండి వేర్పాటు. గురువు వలన నిరాశ. బుధుని వలన స్నేహితులు. తన దుష్ప్రవర్తన కారణంగా ఆందోళన. కుజునివలన ఉద్యోగరీత్యాగాని వివాదాలమూలంగా గాని, దొంగతనము వలన గాని అనారోగ్యము వలనగాని ఆందోళన. రవి వలన 17 వ తేదీ వరకు ధనం, లేదా గౌరవము, తరువాత అనారోగ్యం. శుక్రునివలన నూత్న వస్త్రాలు, ధనం లేదా జయం లేదా అధిక గౌరవము, మంచి స్నేహితులు.

### మిథునం

(మృగశిర 3,4 పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పా.)

రాహువువలన ధనము. శనివలన ధనం లేదా సేవకజనం, లేదా నూత్నవస్త్రాలు దృఢారోగ్యము, వాహనప్రాప్తి. గురువు వలన ధనము. బుధుని వలన ధనము, అవమానము. కుజుని వలన అపకారము, రవి వలన 17 వ తేదీ వరకు ధననష్టము ఇతరుల చేతిలోవంచన లేదా నేత్రబాధ, తరువాత ధనం. గౌరవము. శుక్రునివలన ఆహార ధాన్యాలు. ధనము గౌరవవృద్ధి, సంతానము నూత్న వస్త్రాలు, అన్ని విధాల జయం.

### కర్కాటకం

(పునర్వసు 4పా, పుష్యమి, ఆశ్లేష.)

రాహువు వలన ధనవ్యయం శనివలన ధననష్టం. అశాంతి. గురుని వలన తగాదాలు లేదా ధననష్టం లేదా గౌరవ భంగం లేదా అశాంతి. బుధునివలన చెడు సలహాల మూలంగా లేదా వివాదాల మూలంగా ధననష్టం. కుజుని వలన ధనాభావం, మనస్సుకు అశాంతి. రవి వలన ప్రయాణం, ప్రయాస లేదా ఉదరబాధ, లేదా ధననష్టం. 17 వ తారీఖు వరకు ఆ తరువాత ధననష్టం, ఇతరులచేతిలో వంచన నేత్రబాధ. శుక్రునివలన 18 వరకు శృంగారము, సుఖము తరువాత ధనము ఆహార ధాన్యాలు. గౌరవంలో పెంపు, సంతాన యోగం.

### సింహం

(మఖ, పూ. ఫ, ఉత్తర 1వ పా.)

రాహువు వలన ఆందోళన. శని వలన ప్రయాణం, ప్రయాస లేదా ధననష్టం కుమారులతో వివాదం, తనకు లేక ఇతరులకు అపాయం, గురువు వలన ప్రయాణం, ప్రయాస, బుధుని వలన అవమానం, అనారోగ్యం, శత్రువృద్ధి, కుజుని వలన జయం, రవి 18 వరకు స్తబ్ధుడు. తరువాత శృంగారం, సుఖము. ధనం

### కన్య

(ఉత్తర 2, 3, 4 పా. హస్త; చిత్ర 1, 2 పా.)

రాహు శనుల వలన ఆందోళన, గురువు వలన అధిక ధనము, బుధుని వలన ధనము, స్నేహితులు లేదా శృంగారము లేదా సంతానయోగం, కుజుని వలన 17 వరకు గౌరవము, జయము. దృఢారోగ్యం. తరువాత కాలములో స్వల్పధననష్టం, శుక్రుని వలన ధనము లేదా నూతన వస్త్రాలు.

### తుల

(చిత్త; 3, 4 పా: స్వాతి, విశాఖ 1,2,3 పా;)

రాహువు వలన సుఖము, శని వలన ఇతరులకు ధనం, లేదా శృంగారము, గురువు వలన ధననష్టం, కుజుని వలన అవమానం లేదా ధననష్టం, పదవీ భంగము. బుధుని వలన ధనం, జయం లేదా శృంగారము, రవి వలన మాసాంతము వరకు జయము, అధిక గౌరవము, దృఢారోగ్యం, ధనం, శుక్రుని వలన 18 వరకు వివాదాలు, అవమానం, తరువాత ధనం స్నేహితులు.

### వృశ్చికం

(విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

రాహువు వలన వివాదాలు, శని వలన ధననష్టం లేదా గౌరవ భంగము, గురుని వలన ధనం జయం లేదా ఆహార ధాన్యాలు, లేదా సంతాన యోగం. బుధుని వలన ఆటంకాలు. కుజుని వలన ధననష్టం, గౌరవ భంగము. శరీరానికి గాయాలు. రవివలన 17 వ తారీఖు వరకు ధననష్టం లేదా అనారోగ్యం లేదా నిరాశ తర్వాత కాలమున జయము. శుక్రుని వలన 18 వరకు ధనము లేదా నూత్న వస్త్రాలు లేదా శృంగారం లేదా పుణ్యకార్యాలు. తర్వాత కాలమున వివాదాలు, అగౌరవము.

(40 వ పేజీలో చూడుడు)

# శ్రీకృష్ణ బాలమాధురి!

శ్లో॥ శూన్యేచోరయతః స్వయం నిజ గృహే
హైయంగవీనం మణి స్తం
భే స్వ ప్రతిబింబమీక్షితవత స్తేనైవ
సార్ధం భయా।
భ్రాతర్మ వదమాతరం మమ సమో భాగ స్త
వాపీ హితో
భుంగ క్ష్వేత్యాలపతో హరేః కలవచో
మాత్రా రహః శ్రూయతే॥

ఒకరోజు బాలకృష్ణుడు నిజ గృహం లోనే ఒంటరిగా వెన్న దొంగలిస్తున్నాడు. ఆయన దృష్టి మణి స్తంభంలో ప్రతిఫలించే తన ప్రతిబింబంపై పడింది. ఇది చూచి కృష్ణుడు భయపడిపోయాడు. తన ప్రతి బింబంతో ఇలా అన్నాడు – "తమ్ముడూ! మా తల్లితో చెప్పకు. నీకు కూడా నాతో సమానంగా భాగమిస్తా ఇదిగో. వచ్చి నీ వాటా తీసుకొని వెళ్లు" తల్లి యశోద బాలకృష్ణుని చిలుక పలుకులు విని మురిసిపోయింది. ఆమెకు చాలా ఆశ్చర్యం కలిగియింట్లోకి ప్రవేశించింది తల్లిని చూడగానే కృష్ణుడు తన ప్రతిబింబాన్ని చూపించి తనుచేసే దొంగతనాన్ని కప్పిపుచ్చుతూ ఇలా అన్నాడు.

శ్లో॥ మాతః కపిష నవనీత మిదం త్వదీయం
లోభేన చోరయన్ మధ్య గృహం ప్రవిష్టః।
మద్వారణం నమనుతే మయిరోష భాజి
రోషం నోతి నహిమే నవనీత లోభః॥

తల్లీ! ఇతడెవ్వడు! మోహవశంతో మన యింట్లో వెన్నను దొంగిలించుకొని వెళ్లుటకు ఇలా ప్రవేశించాడు. నేను వారించినా ఇతడు వినడంలేదు. నేను కోపం చేస్తే, ఇతడు కూడా కోపగిస్తున్నాడు. తల్లీ నీ వేమనుకోవద్దు. నాకు మాత్రం వెన్నంటే యిష్టమేలేదు.

తన పాలబుగ్గల పసిడి పాప యీ ప్రతిభకు వాత్సల్యంతో తల్లి యశోద తన్మయురాలై ఆనందాబ్ధిలో మునిగిపోయింది.

* * *

ఒకరోజు యశోద బయటికి వెళ్ళడం చూచి కృష్ణుడు యింట్లో వెన్నదొంగిలిస్తున్నాడు. ఇంతలో దైవవశాత్తు తల్లిరానే వచ్చింది. పిల్లవాడు కనపడకపోయే సరికి ఆమె కేకలు పెట్టడం మొదలు పెట్టింది.

శ్లో॥ కృష్ణ! క్వాసి కరోషికిం పిత రితి శ్రుత్వైవ
మాతుర్వచః సాశంకం నవనీతచౌర్య
విరతో విశ్రభ్యతామబ్రవీత్।



మాతః కంకణ పద్మరాగ మహసా
పాణిర్మమా తప్య తే తేనార్థం నవనీత
భాండ వివరే విన్యస్య నిర్వాపితః॥

'కృష్ణా! కృష్ణా! ఓ నా చిట్టి తండ్రీ! ఎక్కడున్నావు! ఏం చేస్తున్నావు? అని తల్లికేకలు వినగానే వెన్నదొంగ కృష్ణుడు భయపడిపోయాడు. కొంచెం సేపు మౌనం వహించి తల్లితో యిలా అన్నాడు— 'తల్లీ! నీవు నా చేతులకు తొడిగిన యీ కంకణాల చుట్టూ పద్మరాగాలు ప్రకాశిస్తున్నాయి. వీటి వల్ల వేడికి తట్టుకోలేక నా చేతులు మండిపోతున్నాయి. అందువల్ల బాధతట్టుకోలేక చల్లార్చు కుందామని నేను వెన్న కుండలో చేతులు పెట్టాను.

తల్లి పుత్రుని యీ సమయోచిత ప్రసంగానికి ఆశ్చర్యపడి పిల్లవానిని దగ్గరకు తీసుకొని ముద్దాడింది.

* * *

శ్లో॥ ఊణ్ణాభ్యాం కరకుట్మలేన విగల
ద్బాష్పాంబు
దృగ్భ్యాం రుదన్ హుంహుం హుంమతి రుద్ధ
కంఠకుహరాద స్పష్ట వాగ్విభ్రమః।
మాత్రానే నవనీత చౌర్య కుతుకే ప్రాగ్బ
త్రితః
స్వాం చలేనా మృజ్యావ్య ముఖంత వైద
ఖిలం పత్నేపి కంఠే కృతః॥

తెలుగుసేత: శ్రీ యల్లంరాజు సుబ్బారావు
ఒంగోలు

ఒకరోజు యశోద వెన్న దొంగిలించి నందువల్ల కృష్ణుణ్ణి మందలించింది. వెంటనే కృష్ణుడు బిగ్గరగా యేడవడం ప్రారంభించాడు. కండ్లనుండిధారగా అశ్రుకణాలు రాలసాగాయి. కరకమలాలతో కండ్లు తుడుచుకోవడం మొదలుపెట్టాడు. ఊఁ, ఊఁ అంటూ యేడవసాగాడు. గొంతు యెండిపోయింది. నోటినుండి మాటకూడా రాకుండా పోయింది. ఇంకేముంది? తల్లి యశోద కలవరపడింది. తన చీరకొంగుతో కృష్ణుని ముఖం తుడిచింది. ప్రేమతో దగ్గరికి తీసుకొని కౌగలించుకొని యిలా అంది — పుత్రకా ఈవెన్నంతా నీదే! నీది అసలు దొంగతనమే కాదు.





# అపూర్వ శిలాతోరణం

సప్తశైలాధినాథుడైన శ్రీ వేంకటేశ్వర స్వామివారి ఆలయం, సర్పాకృతిలో తిరుమల అనే గిరిసముదాయంలోని ఏడుపర్వత శిఖరాలలో శేషాచలశిఖరాన విరాజిల్లుతోంది 13°, 14°, ఉత్తర అక్షాంశాల మధ్య, ఎత్తున తూర్పురేఖాంశంలో 79° లవద్ద దక్షిణభారత దేశంలోని ఒకవిశిష్టప్రాంతంగా వర్ధిల్లుతున్నది

మనరాష్ట్రానికి ఉత్తరపుకొసన ప్రారంభమైన తూర్పుకనుమలు సముద్రతీరానికతి దగ్గరగాపోయి, కృష్ణానదినిదాటిన అనంతరం లోపలికి చొచ్చుకొనిపోయి, తర్వాత అనేక పర్వత-పంక్తులుగా విడిపోయినై. కృష్ణానదినుండి లోతట్టు కర్నూలుదగ్గర వరకు వ్యాపించివున్న ఈ పర్వతపంక్తి చాలా అడ్డదిడ్డంగా అనేక చిన్నచిన్న కొండగుంపులుగా ఏర్పడ్డది. అలాఏర్పడ్డ ఒక గుంపుకు చెందిందే ఈ శేషాచల సమూహం-

ఈ పర్వతశ్రేణి దక్షిణతీరప్రాంతానికి, వడకునాడుకు (ఆనాడు కన్నడ, తెలుగు భాషలు మాట్లాడే ప్రాంతాలపేర్లు) నడుమ సరిహద్దుగా క్రీ॥శ॥ ప్రారంభంలో ఉండేది. వాస్తవానికి, శ్రీవేంకటేశ్వరస్వామి వారి ఆలయం ఉన్న ప్రాంతం, ఎత్తైన కొండల నడుమ, పల్లంలోఉండి ఆలయం లోయలో ఉన్నదన్న అనుమానాన్ని కల్గిస్తుంది! ఆలయం ఉన్న కొండ సముద్ర మట్టానికి 3426 అడుగుల ఎత్తున ఉంది.

భూగర్భశాస్త్రరీత్యా, ఈ ప్రాంతమంతా నడుమ నడుమ మురికి పదార్థంతో చేరివుండే, దుర్బలమైన స్ఫటికశిలలతోఏర్పడివుంది. భూవిజ్ఞానప్రకారం, పౌరలసిద్ధాంతంప్రకారం దీనికి నగరి స్ఫటికశిలలనే పేరువచ్చింది. ఈ స్ఫటికశిలలు తిరుమల పర్వతపంక్తుల దిగువభాగాలుగా ఏర్పడిన నల్లరాయి, పౌరల రాళ్ళమీద నిటారుగా నిలిచివుంటై. ఈ నగరి స్ఫటికశిలలు, పడమరన ద్రోణాచలంవరకు, ఉత్తరాన శ్రీశైలాన్ని దాటి, ఈశాన్య దిక్కున జగ్గయ్యపేట వరకు, తూర్పుహద్దుగా వెలికొండ, వినుకొండ, ఉదయగిరి, వెంకటగిరి పర్వతపంక్తుల వరకు అర్ధవృత్తాకారంలో వ్యాపించిఉన్న కడపబయలు అనే విస్తృతభౌగోళికమైన బయలులో భాగంగా ఏర్పడినవి.

తిరుమలకు వెళ్ళే ప్రతి యాత్రికుని మనస్సు పరవశింపజేసే ప్రకృతిరామణీయకతలో విశేషం ఈ స్ఫటికశిలలు రాక్షసాకృతివలె పెద్ద పెద్ద భిత్తిసమూహంగా ఏర్పడటమే. ఈ స్ఫటికశిలలు సాధారణంగా చాలా పెద్దపెద్దవి, దళసరితనంలో అతిపల్చగా అర్ధపారదర్శకత్వము కలిగి, సాధారణంగా రేకులురేకులుగా దుర్బలంగా ఉంటై. ఇవి లేతబూడిద లేదా లేతపసుపు లేదా లేత నారింజరంగుల్లో కన్పడతై. ఈ శిలా కుడ్యాలముఖాలు దక్షిణ ముఖంగానే ఉన్నవి. అక్కడక్కడ పెద్ద పెద్ద గోడల వలె నిటారుగా నిలబడివుండటం కూడా మనకు కన్పిస్తుంది.

## అపూర్వ నైసర్గిక శిలాతోరణం

నైసర్గిక భౌగోళికశక్తుల వల్ల, ఏర్పడినది మొదలు సుమారు 100 కోట్ల సంవత్సరాలకు పైబడిన కాలంలో నైసర్గిక వినాశకశక్తుల ప్రభావాన్ని నిలదొక్కుకొని నిల్చిన అపూర్వశిలాతోరణం ఇటీవల తిరుమలలో కనుగొనబడింది. తిరుమలలో శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ఆలయానికి ఉత్తరంగా 1 కిలోమీటరు దూరాన 60° పడమటగా ఉన్న ఈశిలాతోరణం దగ్గరకు

డా॥ ఎన్. రమేశన్, ఐ. ఏ. ఎస్.
ఆం. ప్ర. రెవిన్యూ కార్యదర్శి
పురావస్తుశాఖ డైరెక్టర్
ఛైర్మెన్, తి. తి. దేవస్థానము

తిరుమల 'మైక్రోవేవ్ స్టేషన్'కు వెళ్ళే రోడ్డుద్వారా చేరవచ్చు. ఈ తోరణం ధనురాకారంలో 25' పొడవు, 10' ఎత్తుగా తిరుమలప్రాంతం ఏర్పడిన 'విస్తృతకడప శిలావలయం' తో చేరిన నగరి స్ఫటికశిల లలో మలచబడి (ఏర్పడి) ఉంది.

ప్రపంచంలో ఇలాంటి నైసర్గిక శిలా సేతువులు ఇంకా రెండే వున్నై. అమెరికా సంయుక్తరాష్ట్రాలలోని 'ఉటాహ్' లోని ఇంద్రధనుష్తోరణ సేతువు (రెయిన్‌బో ఆర్చ్‌బ్రిడ్జ్) ఒకటి. యునైటెడ్ కింగ్‌డంలో డార్రిడియన్‌స్ఫటిక శిలాసము దాయాన్ని మధ్యకుకోస్తూ ఏర్పడినతోరణం రెండవది. సాధారణంగా నైసర్గిక శిలా సేతువుల విషయంలో ఈ రెంటినే పేర్కొనటం జరుగుతుంది. ప్రపంచానికి తెలిసినవికూడా ఇవే. ఇప్పుడు కనుగొనబడ్డ ఈ శిలాసేతువు ప్రపంచములో 3వది, ఐరోపా, ఆసియా భూప్రదేశాలను కలిపి చూస్తే మొట్టమొదటిది.

శిలాతోరణాలు ఎలా ఏర్పడతవి?

ఈ శిలాతోరణాలు, ప్రకృతిమాత మృదుహస్త సంచలనంవల్ల స్ఫటికశిల లలో రూపొందాయని సిద్ధాంతం. తిరుమలలో ఏర్పడిన నైసర్గిక శిలాసేతువు, సముద్రం పొంగిరాగా అలల రాపిడివల్ల ఏర్పడినదని, కొందరు శాస్త్రవేత్తలభావన. కాని, స్థలీయమైన సాక్ష్యాధారాలవల్ల, ఈ శిలాసేతువు, ముఖ్యంగా శిథిలత్వం, నీటి కోతలప్రభావం, కలిసివున్న స్ఫటికశిలలపై పడటంవల్ల, ఇలా సేతువు ఏర్పడిందని చెప్పవచ్చు.

**ఈ తోరణసేతువు, తిరుమలలో ఒక** భౌగోళిక అసహజతను గూర్చిన తీవ్రపరి శోధనలో బయటపడింది. సాంకేతికంగా 'ఎపార్చియన్‌అసహజత' అనే అసాధారణ



భౌగోళిక సహజత. తిరుమల పర్వత పంక్తిలో ఒక ప్రాంతములో కనుగొనబడి నది. తిరుమలలో, నల్లరాతిపొర, ఈ దోష ప్రాంతంలో కన్పించింది, విస్తృత కడప స్ఫటికశిలా సమూహానికి చెందిన నగరి స్ఫటిక శిలాసముదాయముతో, నడుమ నడుమ, గులకరాళ్ల గుంపుతో, భౌగోళిక శాస్త్రరీత్యాచెప్పే ఒకఅడుగు ఎత్తుతోఉంది. దీనికాలము సుమారు 80 కోట్ల సంవత్సరాలు. ఇది ఈ దేశములోని అతి అపూర్వమైన, భౌగోళిక అసాధారణత (దోషం). ఈ పల్లానికి భూమిగా ఏర్పడ్డ నల్లరాయి, మెతకరాయి పొరలు, నడుమ నడుమ 'డోలరైట్' మొ॥ వాటితోసహా 250 కోట్ల సంవత్సరాల కాలపువికాగా, అందులో అతి పురాతనమైన కడప లోయ సుమారు 170 కోట్ల సంవత్సరాలది, దానిలో చిన్నవైన నగరి స్ఫటికశిలలు

(33వ పేజీలో)



# శ్రీవరాహ పురాణం

(గత సంచిక తరువాయి)

## నాలుగవ అధ్యాయము

### నారాయణ వ్యాపకత్వం

ధరణి "పరమాత్మ, సనాతనుడు, భగవానుడు అయిన ఈ నారాయణదేవుడు సర్వాత్మకుడో కాడో చెప్పు నాకు" అని ప్రశ్నించింది.

### వరాహుడు చెప్పాడు

మత్స్య కూర్మ వరాహా నరసింహ వామన రామ కృష్ణ బుద్ధ కల్కి అన్నవి పది.[2] కళ్యాణీ, భూతధారిణీ, ఇవి నారాయణుని మూర్తులనీ, ఆయన దర్శనం పొందగోరే వారికి సోపానాలనీ చెప్పబడినవి[3] ఆయన పరమ రూపాన్ని దేవతలూ చూడలేరు. నా వంటిరూపాన్ని చూచి తమ కోరిక తీర్చుకొంటారు.[4] బ్రహ్మ ఆభగవానుని రజస్తమోమూర్తి. ఈ రూపాలతో ఆయన విశ్వసృష్టి స్థితులు నడుపుతూ ఉంటాడు.[5] ధరా, నీవు ఆ దేవుని మొదటిమూర్తివి. రెండవమూర్తి నీరు. మూడవమూర్తి అగ్ని.[6] నాలుగవమూర్తి వాయువు. ఆకాశం అన్నది ఐదవమూర్తి. ఇవి ఆయన మూర్తులు. క్షేత్రజ్ఞుడు, బుద్ధి, అహంకారం- ఈ మూర్తిత్రయమూ ఆయనదే. ఇవి ఆయన అష్టమూర్తులు.[7] ఈ జగత్తంతా నారాయణుడు వ్యాపించినదని చెప్పాను. దేవీ, ఇంకేమి వినగోరుతున్నావు?[8]

(అని ప్రశ్నించేసరికి) ధరణి. "పరమేశ్వరా, నారదుడు అలా చెప్పిన తరువాత రాజు ప్రియవ్రతుడు ఏమి చేశాడో అది నాకు దయతోచెప్పు" అని అడిగింది.[9]

### అశ్వశిరునికథ

### వరాహుడు చెప్పాడు:

ఆ రాజు ప్రియవ్రతుడు నారదుడు చెప్పినది విని ఆశ్చర్యపోయి, నిన్ను (భూమిని=రాజ్యాన్ని) ఏడు భాగాలుగా విభజించి కొడుకులకిచ్చి[10] నారాయణ రూపమైన పరబ్రహ్మాన్ని జపిస్తూ తపస్సు చేశాడు. అనంతరం మనస్సు ఆయనయందే లగ్నంచేసి పరమముక్తి పొందాడు.[11]

వరారోహా, పరమేష్ఠి ఆరాధనకు సంబంధించి పూర్వం జరిగిన మరొక రాజు కథ విను.[12]

అశ్వశిరుడని ఒక రాజుండేవాడు. ఆయన అశ్వమేధయాగం చేసి, అనేక దక్షిణలిచ్చాడు.[13] అనంతరం ఆ రాజర్షి అవభృథస్నానం చేసి చుట్టూ బ్రాహ్మణులుండగా కూర్చొని ఉన్నాడు. అంతలో యోగివరుడు కపిలముని, యోగిరాజు శ్రీమజ్జైగీషవ్యుడూ వచ్చారు.[14]

అపుడారాజు త్వరగా లేచి పరమ సంతోషంతో స్వాగతసత్కారం చేశాడు. ఆ మహాబలశాలి రాజసత్తముడు పూజలందుకొని, ఆసనాలపై కూర్చొని ఉన్న ఆ యోగవేత్తలను, ప్రకాశమాన బుద్ధిశాలులను, తమంత వచ్చినవారిని చూచి, "పురుషోత్తములయిన విప్రులను మిమ్మల్ని సందేహం అడుగుతున్నాను పరదైవమయిన శ్రీహరిని నారాయణుని ఎలా ఆరాధించాలి?" అని అడిగాడు.[15-17]

ఆ విప్రులిద్దరూ "రాజా, ఎవరయ్యా, నీవు పూజ్యుడని చెప్పే ఈ నారాయణుడు? నృపా, నీకు ప్రత్యక్షమై ఉన్న మేమిద్దరమే నారాయణులము" అన్నారు.[18]

అశ్వశిరుడు "మీరిద్దరూ బ్రాహ్మణులు. సిద్ధులు తపస్సువల్ల పాపం దగ్ధం చేసుకొన్నవారు. 'మేమే నారాయణులము' అన్నమాట ఎలా అన్నారు?[19] జనార్దనుడు శంఖచక్రగదాపాణి, పీతాంబరుడు, గరుడవాహనుడు, ఆ మహాదేవునికి భువిలో సమానుడెవరు?" అన్నాడు.[20]

ఆ రాజుమాట విని వ్రతదీక్షితులైన ఆ విప్రులిద్దరూ నవ్వి, "రాజా, విష్ణువును చూడు" అన్నారు.[21]

శ్రీ ఏలూరుపాటి అనంతరామయ్య,
అధ్యక్షులు:
డా॥ కె.వి.కె. సంస్కృత కళాశాల,
గుంటూరు

ఇలా పలికి ఆ కపిలుడు స్వయంగా విష్ణువయ్యాడు. తక్షణమే జైగీషవ్యుడు గరుడుడయ్యాడు.[22]

అనంతరం రాజసమూహం గరుత్మంతునిపై ఉన్న సనాతననారాయణదేవుని చూచినతక్షణమే హాహాకారంచేశారు.[23]

మహాయశస్వి రాజు అంజలిపుటం చేసి "విప్రులారా, శాంతించండి. ఈయన విష్ణువు కాడు. ఇట్టివాడు.[24]

ఆయననాభిపద్మంనుంచి జన్మించాడు బ్రహ్మ. ఆబ్రహ్మవల్ల ప్రసిద్ధుడైనవాడు పరమేశ్వరుడు విష్ణువు" అన్నాడు.[25]

ఇలా అనిన రాజుమాట విని ఆముని పుంగవులు పరమమాయను, విశేషించి యోగమాయను కల్పించేరు.[26]

కపిలుడు పద్మనాభుడయ్యాడు. జైగీ

(33వ పేజీలో చూడుడు)

# దేవకీ వసుదేవులు కనిన విశ్వరూపం

శ్లో॥ యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం
పరిత్రాణాయ సాధూనాం। వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయు గే.
( భ, గీ. )

లోకములో ధర్మగ్లాని గలిగి సాధు జనులకు విలువ నీడలేని సమయములందు దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించుకొఱకు యేదియో యొకరూపమున లోకములో భగవంతుడు అవతారములు దాల్చుచుండు నవియు తిరిగి ధర్మసంస్థాపనము చేయు చుండుననియు భగవానుడు చెప్పియున్నాడు. అట్టి యవతారములలో ఒకే ప్రయోజనము నెఱవేర్చుటకొఱకు వచ్చినవి ఆవేశావతారములు. ధర్మస్వరూపుడయి, ఆదర్శ మానవుడుగా జీవితమునడిపి, "ఆత్మానం మానుషంమన్యే", అని తన తత్త్వమును ప్రకటించినవాడు శ్రీరాముడు. ఈరెండు విధములునుగాకుండా పరిపూర్ణ అవతార మూర్తియై తన స్వరూప తత్త్వములను తానెఱిగి, అడుగడుగునను అతిమానుష చర్యలు నడిపి, లోకమునకు తన దివ్య తత్త్వమును, ఆత్మతత్త్వమును. వ్యక్త పరచినవాడు శ్రీకృష్ణుడు సాధు జనులను రక్షించుటయేగాక, తుదివఱకు శత్రుత్వమునేవహించిన వారలకుగూడ దేహాంతమున సాయుజ్యమును ప్రాప్తింప జేసిన వాడు శ్రీకృష్ణుడు. అవతారమునకదియే అర్థము.

28వ మహాయుగములో ద్వాపరాంతమున కలియుగ ప్రవేశమునకు కొలది పూర్వముననే భారతదేశమందు ధర్మగ్లాని సంభవించినది. దుష్టులవలన సాధువులకు హాని యెల్లడలను జరుగుచుండెను. వానిని తొలగించి భూమికి భారమైన వారలను అంతమొందించి శిష్టజనులను రక్షించినవాడు, దుష్టుల దుర్నిరీక్ష్యుడు; ప్రళయాంతకుడు సాధుజనులకింతటి ప్రేమాస్పదుడే లేడు. అనేకావసరము లందు ఈతడు తన విశ్వరూపములను ప్రదర్శించినాడు. దివ్యతేజముతో అపరిమిత శక్తి ప్రదర్శనమునుగావించినాడు. సాధులకు భక్తివి కలిగించి వారలను తరింపజేసినాడు. శత్రు, మిత్ర, భక్తులకు ఆయా సమయములకనుగుణముగా నుండునట్లు వివిధ భేదములతో ఆ దివ్య రూపములను జూపినాడు దేవకీ వసుదేవులు. యశోదా గో గోప, గోపికా సమూహము, బ్రహ్మ, అక్రూరుడు, దుర్యోధనుడు, ధృతరాష్ట్రుడు, భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, విదురుడు, సంజయుడు నారదుడు, అర్జునుడు ఆయా విశ్వరూపములను దర్శించినవారు. రాసక్రీడయొక విశ్వరూపము. వామనుడొక విశ్వరూపమును జూపినాడు. ఆ విశ్వరూపములు ఒకదానినొకటి పోలియుండలేదు. ఆయాప్రయోజనముల ననుసరించి విశ్వరూపము మారుచుండినవి. యదార్థమునకు అవి జగత్తుయొక్కయు విశ్వమయుని యొక్కయు వివిధ కళాస్వరూపములే.



దేవకీ వసుదేవులకు కనబరచిన విశ్వరూపం

శ్లో॥ వసుదేవసుతం వీరం। కంసచాణూర మర్దనం।
దేవకీ పరమానందం। కృష్ణంవందే జగద్గురుం ॥
శ్రీవత్సాంకం మహోరస్కం। వనమాలా విరాజితం ॥
శంఖ చక్రధరందేవం। కృష్ణం వందే జగద్గురుం ॥

శ్రీ గరిమెళ్ళ వీరరాఘవులు
కాకినాడ.

దేవకీ వసుదేవులు పూర్వజన్మమున సుతపప్రజాపతియు, అతని భార్యయగు పృశ్నియున్నైయుండిరి. వారు గొప్ప తపస్సు చేయగా విష్ణువు ప్రత్యక్షమై వరము కోరుకొండనెను. వారు విష్ణునివంటి బిడ్డ తమకు కావలెననిరి. విష్ణుడా వరము వారి మరుసటి జన్మలో తీరునట్లు సెలవిచ్చి తానే వారి పుత్రుడుగా జన్మింతుననెను. దాని ననుసరించి ఆ దంపతులు భూలోకమున దేవకీ వసుదేవులుగా జన్మించిరి. జగదీశ్వరుడగు విష్ణువు తన దివ్యరూపముతోనే దేవకీ వసుదేవులకు జన్మించెను.

దేవకీ వసుదేవులు తమ పెండ్లినాటి నుండియు దేవకికి యెనిమిదవ గర్భమున

# తిరుమల తిరుపతి దేవస్థానము, తిరుపతి.

## యాత్రిక నివాస వసతి వివరములు.

| ప్రదేశం | దొరికే గదుల లేదా కాటేజీల సంఖ్య | ఒక్కొక్క దివసమునకు రుసుము. |
|---|---|---|
| **తిరుమల:** | | |
| 1. శ్రీ వేంకటేశ్వర అతిథిభవనం | 30 | రు. 16/- 2 పడకలుగల భాగానికి హీటరుతో కూడా. |
| 2. శ్రీనివాస కాటేజీలు | 20 | రు. 20/- 3 పడకలు, హీటరుగల ఒక్కొక్క కాటేజికి |
| ,, | 30 | రు. 16/- ,, |
| ,, | | రు. 9/- హీటరు ఉన్న అర్ధ కాటేజికి |
| ,, | | రు. 7/- హీటరు లేకుండా అర్ధ కాటేజికి |
| 3. వేంకటాచల కాటేజీలు | 16 | రు. 7/- హీటరు లేకుండా అర్ధ కాటేజికి |
| 4. ఆళ్వారునగర్ కాటేజీలు | 40 | రు. 7/- ,, |
| 5. వేలీ వ్యూ కాటేజీలు | 9 | రు. 16/- 3 పడకలు, హీటరుగల కాటేజికి |
| 6. నారాయణగిరి కాటేజీలు | 12 | రు. 16/- 3 పడకలు, హీటరుగల కాటేజికి |
| 7. శంఖుమిట్ట | 81 | రు. 10/- 2 మంచాలుగల కాటేజికి |
| | | రు. 5/- అర్ధ కాటేజికి |
| 8. శేషాద్రినగర్ | 68 | రు. 12/- హీటరున్న పూర్తి కాటేజికి |
| 9. అంజనాద్రినగర్ | 78 | రు. 7/- హీటరు లేకుండా 'A' భాగం |
| 10. గరుడాద్రినగర్ | 78 | రు. 5/- హీటరు లేకుండా 'B' భాగం |
| **తిరుపతి:** | | |
| 1. దేవస్థాన అతిథిగృహం | 18 | రు. 12/- 2 పడకలుగల గదికి |
| 2. శ్రీనివాస ధర్మశాల A | 30 | రు. 10/- 2 పడకలుగల భాగం |
| B క్రిందిభాగం | 40 | రు. 15/- 4 పడకలుగల భాగం. |

అన్ని స్థలాలలోను పడకలు వగైరా ఏర్పాటులు లేని వసతి ఉచితమని గ్రహించ గోరుచున్నాము.

కార్యనిర్వహణాధికారి.

శ్రీకృష్ణుడుదయించి పెరుగువఱకు కంసుని చెఱలోనుండిరి. దేవకియొక్క యెనిమిదవ పుత్రుడు తన్ను సంహరించునని ఆకాశవాణి పలుకగా విని, భీతుడై, దానిని తప్పించుకొనుటకు అనేక దుశ్చర్యలు చేసెను. మొదట దేవకినే చంపబోయెను. "మా బిడ్డ వలననే కాని, నీకు మృత్యువు తమ వలన కాదుగదా! మాకు పుట్టిన బిడ్డలనందరిని నీకిచ్చెదము. వారిని నీ యిష్టము వచ్చినట్లు చేయుము. అనియు దేవకిని నిష్కారణముగా చంపవలదని యు" వసుదేవుడు ప్రార్థించగా దేవకికి మూలచ్ఛేదముగాకుండా, ఆ గండము గడిచినది. తనకు తెలియకుండ దేవకి బిడ్డను కని యెచ్చటనైనను దాచునేమోయని శంకించుచు, బిడ్డ పుట్టగానే తన వశమగుటకు, దేవకీ వసుదేవులను కంసుడు చెఱలోనుంచెను. వారికి పుట్టిన యేడుగురు బిడ్డలను పుట్టగానే, వారికండ్ల యెదుటనే నరకివేసెను. మానవుల కింతకన్న కష్టముండునా? ఆకాశవాణి పలుకులు దేవకీ వసుదేవులుకూడ వినియుండుటచేత, తమకెప్పుడు యెనిమిదవ బిడ్డ పుట్టునా! ఎప్పుడు తమ బాధలు తొలగునా! యని సతత భగవద్ధ్యానము చేయుచు వేచియుండిరి ఆర్తితో వేగిపోవుచుండిరి.

ఇట్టి స్థితిలో దేవకి యెనిమిదవసారి గర్భము దాల్చినది. ఈ మారుకూడ, బహు బలవంతుడును క్రూరుడును అయిన కంసుడు – పుట్టబోవు బిడ్డనేమిచేయునో, పసిబిడ్డ అట్టి కంసునెట్లు నిర్జించగలడను భీతితో, నిముసమొకయుగముగా గడపుచుండిరి. ఎన్నడైనను అట్టి యుద్ధారకుడు పుట్టి తమయార్తి పోదరుమగలడా యని అనుమానించుచుండిరి, ఇంతలో పురిటి సమయము సమీపించినది.

(29 పేజీలో చూడుడు)

# శ్రీ అన్నమాచార్య సంకీర్తనామృతము

శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి

(గత సంచిక తరువాయి)

అవ.- భగవంతుని నీలవర్ణమును పెక్కు తెరగుల నుత్ప్రేక్షించి సమర్థించుచున్నాడు—

63

ముఖారి

సిరి దొలంకెడి పగలు-చీకటా యితఁడేమి
యిరవు దెలిసియుఁ దెలియ-
నియ్యఁడటుగాన ॥పల్లవి॥

1. తలపోయ హరినీల-దర్పణంబో యితఁడు
వెలుఁగుచున్నాఁడు బహు-విభవములతోడ;
కలగుణం బటువలెనె-కాఁబోలు లోకంబు
గలదెల్ల వెలిలోనఁ-గనిపించుఁగాన ॥సిరి॥

2. మేరమీఱిన నీల-మేఘమో యితఁడేమి
భూరి సంపదలతోఁ-బొలయుచున్నాఁడు;
కారుణ్యనిధి యట్ల-కాఁబోలు ప్రాణులకు
కోరికలు దలఁపులోఁ-గురియు నటుగాన. ॥సిరి॥

3. తనివోని ఆకాశ-తత్వమో యితఁడేమి
అనఘుఁ డీ తిరువెంక-టాద్రి వల్లభుఁడు;
ఘనమూర్తి అటువలెనె-కాఁబోలు సకలంబు
తనయందె యణఁగి యు-ద్భవమందుఁగాన. ॥సిరి॥

(5-131)

సిరులు దొనకుచున్న ఇతడు పగటి పూటనే ఉండు చీకటియా ఏమి? ఎందుకనగా తానున్న స్థానము, లేదా తన స్వరూపము స్పష్టముగానున్నను చూచువారికి తెలియనీయక మరుగుపఱచుచున్నాడు. పగటిచీకటి వెలుగులోగూడ కన్నులు కానరాకుండ జేయును. అట్లే ఈ దేవుడు సర్వత్ర బాహాటముగా వ్యాపించియుండియు చూచువారికి కనిపించకయే యున్నాడు.

ఇతడింద్ర నీలమణితో చేసిన అద్దమా? ఆలోచించుకొలది అనేక వైభవములతో వెలిగిపోవుచున్నాడే! ఇతనిలోనున్న గుణమట్టిదే కాబోలు! అద్దము ప్రపంచమును తనయందును, వెలుపలను చూపునట్లు ఇతడును విశ్వమును తన లోపలను వెలుపలను ప్రదర్శించుచున్నాడు గదా!

ఇతడు హద్దుమీరి అంతట క్రమ్ముకొన్న నీలమేఘమాయేమి? అనేక సంపదలతో జగమునంతట వ్యాపించి విలసిల్లుచున్నాడే! దయానిధియైన ఈతడు నీలమేఘమే కాబోలు! ఎందుకనగా ప్రాణులు తలపునకోరిన కోరికలనెల్ల కురియుచున్నాడుగదా!

పాపహితుడైన ఈ శ్రీ వేంకటగిరినాథుడు ఎంతగా చూచినను తృప్తి చేకూర్చని ఆకాశతత్త్వమా ఏమి? ఈ మహామూర్తి అట్టివాడే కాబోలు! సకల చరాచరాత్మకమైన ఈ విశ్వమంతయు ఆకాశమునందే లయించి మరల అందే జనించునట్లు, ఈ పరబ్రహ్మమునందేలీనమై తిరిగి ఇతనియందే పుట్టుచున్నదిగదా!

విశే:— భగవంతుడు నీలవర్ణుడుకాన ఇట చీకటిగా, ఇంద్రనీలపు టద్దముగా, నీలమేఘముగా, ఆకాశస్వరూపుడుగా కవిచే ఉత్ప్రేక్షింపబడినాడు. ఒక్క రూపసామ్యమేకాక ఈ ఉత్ప్రేక్షకు సమర్థకములైన ఇతరాంశములుగూడ ఈ కీర్తనలో నిర్దేశింపబడినవి.

పగటి చీకటిలో వస్తుస్వరూపము తెలిసియు తెలియకుండుట సహజము. అట్లే విశ్వవ్యాపుడైన పరమాత్మని 'పశ్యన్నపి చ న పశ్యతి మూఢః' అనునట్లు అజ్ఞులు చూచియు చూడలేకున్నారు. ఆ పరతత్త్వము కంటికి కనిపించదని శ్రుతి చెప్పుచున్నది.

"న చక్షుషా గృహ్యతే" (ముండకం 3-1-8)

మరియు సర్వభూతములలోను గూఢమైయున్న పరమాత్మ సూక్ష్మదర్శనులైన యోగులయొక్క సూక్ష్మాతిసూక్ష్మమైన బుద్ధికిదప్ప తదితరులకు కనిపించదని శ్రుతి ఘోషించుచున్నది—

ఏష సర్వేషు భూతేషు
గూఢోఽఽత్మా న ప్రకాశతే।
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా
సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥ (కఠ-3-12)

ప్రజ్ఞానఘనమైన పరబ్రహ్మము నామరూపక్రియాత్మకమైన సమస్త జగత్తుయొక్క లోపల, వెలుపల కలదని శ్రుతి చాటుచున్నది—

తదంతరస్య సర్వస్య
తదు సర్వస్యాస్య బాహ్యతః
(ఈశావాస్యం-5)

ఈ శ్రుత్యర్థమునే జగమంతయు భగవంతుని లోపలను, వెలుపలను అద్దమునందువలె ప్రకాశించుచున్నదని అన్నమయ్య మరొకరీతిగా చెప్పినాడు.

భగవంతునికి గల జ్ఞానబలైశ్వర్యాదులగు వివిధ గుణములలో దయాగుణమే మిక్కిలి గొప్పది. అందుచేతనే ఆయన కారుణ్యనిధియై భక్తుల కోరికలను కురియుచున్నాడని చెప్పబడినది.

విశ్వమంతయు గగనమునందువలె పరమాత్మునియందే జనించి తుదకందే లీనమగుచున్నది.

'ఎవ్వనిచే జనించు జగ
మెవ్వని లోపలనుండు లీనమై
యెవ్వనియందు డిందు' (భాగ-8-73)

అన్న భాగవతోక్తి ఇట స్మరణీయము.

(సశేషము)

---

(ప) ఇరవు=స్థానము, స్వస్వరూపము.
1. హరినీల దర్పణంబో=ఇంద్రనీలపుటద్దమో.
2. పొలయుచున్నాఁడు=వ్యాపించుచున్నాడు, ప్రకాశించుచున్నాడు.
3. తనివోని=తృప్తి చేకూర్చని

# సప్తగిరి

## తిరుమల తిరుపతి దేవస్థానముల మాసపత్రిక.

★

సప్తగిరి మాసపత్రికలో వ్యాపార ప్రకటనలు ఈ దిగువ కన్పరచిన రేట్ల ప్రకారముప్రచురించబడును.

### ఒక్కొక్క ప్రకటనకు

| | | |
|---|---|---|
| లోపల పేజీలో: | పూర్తిపేజీ .... .... | రు. 80/– |
| | అర్ధపేజీ .... .... | రు. 50/– |
| | పావుపేజీ .... .... | రు. 30/– |
| కవరుపేజీలు: నాల్గవపేజీ | 1 రంగులో .... .... | రు. 200/– |
| | 2 రంగుల్లో ... .... | రు. 250/– |
| | 3 రంగుల్లో .... .... | రు. 300/– |
| లోపల 2 వ పేజీ 3 వ పేజీ | 1 రంగులో .. ... | రు. 150/– |
| | 2 రంగుల్లో .... .... | రు. 200/– |
| | 3 రంగుల్లో .... .... | రు. 250/– |
| ప్రత్యేకస్థలము లోపల పేజీలో | 1 మొట్టమొదటిపేజీ .... .... | రు. 150/– |
| | 2 చివరిపేజీ .... .... | రు. 110/– |
| | 3 వార్తలపేజీకి ఎదురుపేజీ | 1 పేజీ రు. 100/– |
| | | ½ పేజీ రు. 60/– |

### సాంకేతిక సమాచారము

| | | |
|---|---|---|
| స్క్రీన్: | కవరుపేజీలు .... | 80 నుండి 100 |
| | లోపలపేజీలు .... | 80 |
| పేజీపరిమాణము (బ్లాకులకు) | పూర్తిపేజీ .... | 24 సెం. మీ × 19 సెం. మీ |
| | అరపేజీ .... | 12 సెం. × 19 సెం. మీ |
| | పావుపేజీ .... | 6 మీ × 19 సెం. మీ |

ప్రకటనకు సంబంధించిన విషయములు, బ్లాకులు, సంస్థలవారే సరఫరా చేయవలయును.

గమనిక: 1. 4వ కవరు పేజీ తప్ప మిగిలిన పేజీలలో 6 నెలసరి సంచికలకు ముందుగా డబ్బు చెల్లించి స్థల నిర్ణయము చేసుకొనువారికి ప్రకటన రేట్లపై 10% ను, 12 సంచికలకు స్థల నిర్ణయము చేసుకొనువారికి 15% శాతమును ముదరా ఈయబడును.

2. ఈ వ్యాపార ప్రకటనల విషయము ముందు తెలుపక, కారణములు తెలుపకయే ఏ ప్రకటననైనను నిరాకరించు హక్కు సంపాదకునకు కలదు.

కార్యనిర్వాహక అధికారి,

**తిరుమల తిరుపతి దేవస్థానం.**

శ్లో॥ నాహం వేదైర్న తపసా నదానేన
నచేజ్యయా।
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం
యథా॥
భక్త్యాత్వనన్యయా శక్య అహ మేవం
విధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ
పరంతప॥

—భగవద్గీత—11-53, 54

భగవత్సాన్నిధ్యమునుచేరుట కెన్నియో మార్గములు. వేదాధ్యయన తపోదానాదులు, యజ్ఞయాగాదిక్రతువులు, శ్రీవిద్యాది ఉపాసనలు, యోగము, భక్తి మొదలయి నవీమార్గములు. వేదాధ్యయనాదులు విద్యావంతులకే పరిమితము. తపస్సు సర్వసంగ పరిత్యాగులకేసాధ్యము. దానమన్నచో లక్ష్మీకటాక్ష వీక్షణాలక్షితులకే తగినది. యజ్ఞయాగాదిక్రతువులు సామాన్యుల కందరానిపండ్లు. సామాన్యుల కందుబాటులోనున్న ఫలము భక్తియే. పైగీతా వాక్యములు దీనినే ప్రతిపాదించుచున్నవి. భగవంతునకు భక్తిమార్గగాములన్న అత్యంతప్రీతి. ఇది మనస్సంబంధి. దీని కర్హతానర్హతల ప్రసక్తిలేదు.

అన్యనభక్తితో స్వామిని సేవించవలెనని గీతావాక్యము. అనన్య-అనగా యితర దైవతములనమ్మక ఒక్క-పరమాత్ముడగు వాసుదేవునే నమ్మి సేవించవలెను. అదియే భవతారకమని శ్రీమచ్ఛంకర భగవత్పాదులు తమ గీతాభాష్యమున వ్యాఖ్యానించుచు శ్రీమన్నారాయణుడే పరతత్వమని సిద్ధాంతీకరించినారు; చూడుడు.

'అనన్యయా-అపృథగ్భూతయా భగవతః అన్యత్ర పృథక్ నకదాచిద్ అపియా భవతి సాతు అనన్యాభక్తిః సర్వైః అపి కరణైః వాసుదేవాద్ అన్యద్ న ఉపలభ్యతే యయా సా అనన్యాభక్తిః తయా భక్త్యా'-శంకరభాష్యము.

శ్రీమన్నారాయణ భక్తి పునరావృత్తి రహితమోక్షమునకు సులభమైన మార్గమని భగవత్పాదుల నమ్మకము. అందుకే 'సాక్షాత్కర్తుం తత్త్వే - తత్త్వతః ప్రవేష్టుంచ - మోక్షంచ గన్తుం' -అని కృపజేసినారు. అంతేగాదు యతులకు నారాయణ స్మరణమును విధిగా నిర్ణయించి శాసించినారు. శ్రీవిష్ణు సహస్రనామమునందలి నారాయణ శబ్దమును వ్యాఖ్యానించుచు భగవత్పాదులు వెలిబుచ్చిన భావము సకల జనులకు శిరోధార్యము.

'నారాయణాయనమ ఇత్యయమేవ సత్య స్సంసార ఘోరవిషసంహరణాయ



మర్త్యః శృణ్వన్తు భవ్యమతయో ముదితాయోఽ స్తరాగా ఉచ్చైస్తరా ముపరిశ్యామహ మూర్ధ్వబాహుః'

—శ్రీమచ్ఛంకరభాష్యము.

భగవంతునకనేక నామములుండగా శ్రీమన్నారాయణ మంత్రమునే యతులు చేతులెత్తి ఉచ్చైస్స్వరముతో జపించుటకు గల కారణమును శంకరులు చక్కగా వివరించినారు.

ప్రహ్లాద నారద పరాశర పుండరీక


**శ్రీ సింగనమల్ల రాధాకృష్ణయ్య**
సిమెంటునగర్.


# భక్తివినా సన్మార్గము గలదే?

వ్యాసాంబరీష శుకశౌనకదాల్భ్యాదులు పరమభాగవతులు. ప్రాతఃస్మరణీయులు. వారు విష్ణుభక్తిపరాయణులు. విష్ణుభక్తి అనువదొక అమృతధార. దానినాస్వాదించి తరించిన పుణ్యాత్ములనేకులు. విష్ణుభక్తులన నెట్టివారో, భక్తియెన్ని విధములో పరిశీలించుటయే యీ వ్యాసోద్దేశ్యము. తొలుత విష్ణుభక్తులను, వారి లక్షణములను పరిశీలింతము. అదియును భగవానుడే వివరించినాడు గమనింపుడు—

శ్లో॥ మత్కర్మ కృన్మత్పరమో మద్భక్త
స్సంగ వర్జితః।
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి
పాండవ॥

—భగవద్గీత-11-55

భగవత్ప్రీతికరమైన కర్మలుచేయుచు సదాతత్పరాయణుడై సర్వసంగ వర్జితుడై యుండువాడే విష్ణుభక్తుడు. అతనికీ సర్వభూతములు సమానులే. సకలభూతములందును వైరరహితుడైయుండువాడే నిజమైన భక్తుడు. సంగవర్జితుడనగా సన్యాసియని గ్రహింపరాదు. నిమిత్తమాత్రుడై సంసారవ్యామోహమునజిక్కక సదా నారాయణ పదధ్యాన మగ్నుడగు భాగవతోత్తముడని గ్రహింపవలెను.

సకల జగత్తు వాసుదేవమయమని నమ్మి సర్వసమభావమును, ప్రేమభావమును కలిగియుండవలెను.

'సా తస్మిన్ పరమప్రేమరూపా' అని నారదభక్తిసూత్రము. భగవంతుడు సర్వాంతర్యామి. అతడు అన్నిటియందున్నట్లే

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం

నారాయణవనం.

★

నిత్యకార్యక్రమ వివరాలు

| | | | |
|---|---|---|---|
| సుప్రభాతం ఉ॥ | 6-00 | నుండి | 6-30 |
| విశ్వరూపదర్శనం | 6-30 | ,, | 8-30 |
| తోమాలసేవ | 8-30 | ,, | 9-00 |
| కొలువు, అర్చన | 9-00 | ,, | 9-30 |
| శాత్తుమొర & గంట | 9-30 | ,, | 10-00 |
| సర్వదర్శనం | 10-00 | ,, | 11-30 |
| 2-గంట, అష్టోత్తరం (ఏకాంతం) | 11-30 | ,, | 12-00 |
| తీర్మానం | 12-00 | | |
| సర్వదర్శనం సా॥ | 4-00 | ,, | 6-00 |
| తోమాలసేవ, అర్చన (ఏకాంతం) | 6-00 | ,, | 7-00 |
| రాత్రి కైంకర్యం | | | |
| శాత్తుమొర | | ,, | 7-00 |
| సర్వదర్శనం | 7-00 | ,, | 8-45 |
| ఏకాంతసేవ | 8-45 | ,, | 9-00 |

ఆర్జితాదుల వివరాలు

| | | |
|---|---|---|
| అర్చన, అష్టోత్తరం .... | రు. | 3-00 |
| హారతి ... | రు. | 1-00 |
| కొబ్బరికాయకు ... | రు. | 0-50 |
| సహస్రనామార్చన .. | రు. | 5-00 |
| పూలంగి (గురువారం మాత్రం) .... | రు. | 1-00 |
| అభిషేకానంతర దర్శనం (శుక్రవారం) | రు. | 1-00 |

అన్నియు నతనియందున్నవి. అన్నిటి యందును సమదర్శియైనవాడే నిజమైన భక్తుడు.

'విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని।
శునిచైవ శ్వపాకేచ పండితాః సమదర్శనః॥

అని భగవద్వాక్యము. విష్ణుభక్తుడు కల్మష రహితుడై అమృతరూపియై యుండవలెను. 'అమృత స్వరూపాచ' అని నారద భక్తిసూత్రము.

భక్తిభావ పరిపూర్ణుడైనవారు సకల సిద్ధుల నుపొందిన పూర్ణపురుషుడు. అమృతమయుడు. అమృత తృప్తుడు

'యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధోభవతి, అమృతోభవతి, తృప్తోభవతి' అని నారదోక్తి.

భక్తిఫలము నందుకున్న మానవుని అష్టసిద్ధులు వరించునట. అమృతత్త్వము ఆవహించునట. అతనిమించిన తృప్తుడింకొకరుండడట.

అష్టసిద్ధుల మాటెట్లున్నను, తృప్తుడగుట నిశ్చయము. తృప్తిపొందినవానికేమిలేకున్నను సిద్ధులున్నట్లేగద. అన్నిటిని మించిన నారాయణ పదసన్నిధి పెన్నిధియైనవానికిక వేరుసిద్ధులతో పని యేమి? అమృతత్వము లభించునన్న దైవత్వము సిద్ధించుననిగాదు. మరణమన్న భయములేనివాని కమృతత్వము గాకమరేమి? ఆత్మతత్వము నెరిగిన భక్తుడు శరీరమును విసర్జించుటను పాతదుస్తులదీసివేసినంత సులభముగా భావించును. అట్టివాడమృతమయుడే.

విష్ణుభక్తి సామ్రాజ్యమున పౌరుడైనవాడు దేనిని కోరడు. దేనిని గూర్చియు చింతించడు, దేనిని ద్వేషించడు, దేనియందునుత్సాహము చూపించడు.

'యత్ప్రాప్య న కించిద్వాంఛతి న శోచతి
నద్వేష్టి నరమతే నోత్సాహీ భవతి'

—నారదభక్తిసూత్రము

యత్ప్రాప్య-అతనిని పొందినవాడు. వానికింకేమి కావలెను? సకలచరాచర జగత్తునకు కారణభూతుడైన పరమాత్ముడు వాని కన్నులముందు కదలుచుండగా నింకేమి కోరగలడు? అన్యమునుగూర్చి యెట్లు చింతించగలడు? అంతయుదానయై విశ్వరూపము గోచరించుచుండగా నిక దేనిని ద్వేషించగలడు? ఆ పురుషోత్తముడు నిరంతరము తనతో సంగమించుచుండగా నీ జీవుడు దేనితో క్రీడించగలడు? ఆనంద స్వరూపుడగు పరబ్రహ్మమూర్తిని దర్శించుటయందుత్సాహము గలవానికి తర ప్రపంచముపై నుత్సాహమెట్లుండును? అందుకే త్యాగరాజు—

'రామభక్తి సామ్రాజ్యము
యేమానవుల కబ్బెనో మనసా
ఆ మానవుల సందర్శన
మత్యంత బ్రహ్మానందమె'

అని కీర్తించినాడు

శ్లో॥ యో నహృష్యతి నద్వేష్టి నశోచతి న కాంక్షతి।
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్సమే ప్రియః॥

భగవద్గీత-12-17.

అని గీతావాక్యము విష్ణుభక్తునికి శుభాశుభ ప్రసక్తిలేదు, అంతయు నొకటే. విష్ణుభక్తి యనునదొక అమృతధార, దానినాస్వాదించిన వాడొక మత్తుడు. భౌతిక ప్రపంచము నందతడొక స్తబ్ధుడు. కాని ఆధ్యాత్మిక వీథిలో నతడాత్మారాముడు.

'యజ్ఞాత్వా మత్తోభవతి స్తబ్ధోభవతి ఆత్మారామో భవతి'

నారద భక్తిసూత్రము

(25 పేజీలో చూడుడు)

# ఆంధ్రశతకవాఙ్మయ వికాసము

(గత సంచిక తరువాయి)

భారతీయులదృష్టిలో తత్త్వముబహు ప్రాధాన్యత వహించినది. వారితత్త్వము గాఢమైనది సముద్రమువలె గంభీరమైనది కూడా. ప్రాచీనకాలము నుండియు హైందవుల తత్త్వజిజ్ఞాస మహోదాత్తమైనది. ప్రపంచమునకంతకు శిరోధార్యము. ద్రష్టలు - తత్త్వవేత్తలు వేద వేదాంగ పురాణేతిహాసములద్వారా తత్త్వశాస్త్రములోని యనేకాంశములను భక్తి, జ్ఞాన, కర్మ సిద్ధాంతరూపమున మనకందించిరి. బాహ్యమునకెంత లౌకికముగ గన్పింతురో అంతరమున భారతీయులంతటి యాధ్యాత్మిక తత్త్వసంపన్నులు. మన నిత్యజీవితమున ప్రతిరంగము నందునుఆధ్యాత్మికదృష్టిఅంతర్వాహినిగా నొప్పుచుండును. కనుక తత్త్వదృష్టిలేని కావ్యముగాని సాహిత్యముగాని మృగ్యము. "నానృషిఃకురుతేకావ్యమ్" "ఋషికానివాడు కవికాజాలడు. తత్త్వములేని కవియు కవిలేని తత్త్వము లేదని యార్యోక్తి. ఇట్టితత్త్వమును సంస్కృతకవులు శతకరూపమున వర్ణించిరి. భర్తృహరి వైరాగ్యశతకమాదిగ ననేక శతకములు వీనికి మార్గదర్శకము లయినవి, తత్త్వశతకములలో వైరాగ్య శతకములొక ప్రధానవర్గము. తెల్గున పదునాఱవ శతాబ్దినుండి తత్త్వశతక రచనలు బహుళముగా నభివృద్ధిచెందినవి. ఇందు మొదటిది సదానంద యోగి శతకము.

యోగరహస్యములను సామాన్యప్రజలకందుబాటులోనికితెచ్చిన కవి వేమన. అందుచేత నేయాతఁడు ప్రజాకవియైనాడు. యోగము పేర ప్రజలను మోసగించుయోగులగూర్చి వేమన చేసిన హెచ్చరిక బహుప్రశంసాపాత్రమైనది. ఆధ్యాత్మిక జీవనమున కమృతప్రాయమగు పరమ పవిత్రమగు యోగమును ప్రాపంచిక ప్రయోజనములపేర దుర్వినియోగమొనర్చుటను వేమన చక్కగా నాటవెలదులలో చిత్రించి తనకాలము నాటి యోగులకుకూడా గట్టిహెచ్చరిక చేసెననక తప్పదు. దేశచరిత్రకు సంబంధించినవిగానిలేక కొన్ని చారిత్రకసంఘటనలుగాని ఆధారముగాఁ జేసికొని వర్ణితములయిన శతకములు కలవు. వానిని చారిత్రక శతకములనఁజెల్లును. వీనిని కొందఱు రచననుబట్టి వ్యాజోక్తి ప్రధానములనిరి. కానివస్తువునుబట్టి యివి చారిత్రకశతకములే, పదునేడవ శతాబ్ది ఉత్తరార్థమున, ఔరంగజేబు కాశీక్షేత్రముపై దండయాత్రసలిపి యందలి విశ్వేశ్వరాలయమును ధ్వంసమొనర్చెను. ఈ సంఘటనకుద్రిక్తుడై వేల్పూరివిస్సన్న కవి విశ్వేశ్వరశతకమును విరచించెను. అసంపూర్ణమగునీశతకము నీ కవి మనుమడగు సాంబశివకవి పూర్తిగావించెను. కాసుల పురుషోత్తమకవి ఉత్సవపూజాదులులేని శ్రీకాకుళాలయదుస్థితిని జూచి ఉద్విగ్నమనస్కుడై శ్రీహరి అశక్తతను వ్యాజోక్తులలో విమర్శించెను ఈ కవి ఆంధ్రనాయక శతకమునే తరుపరికవులు ఆధారముగా తీసికొని సింహాద్రినారసింహ, భద్రగిరి శతకముల విరచించిరి।

తెలుఁగుశతకవాఙ్మయ వికాసములో భాషావ్యాకరణ నిఘంటు, ప్రహేళిక మొదలగునవి విశిష్టస్థానము నలంకరించినవి. అంతియేకాదు ఒక విశిష్టశాఖకూడ ననవచ్చును. ఛందోబద్ధమగువాణి అవినాశిహైవరలును. కంఠస్థము చేయుట సులువు. వచనమునకు పద్యమునకు గల భేదమిదియేకదా! ఈసందర్భమునవేదము నుదాహరించుట ప్రస్తుతము కాదేమో! ఉదాత్తానుదాత్తస్వరిత ప్రచ్యుయోచ్చారణముతో వరలుటచేతనేవేదవాణి యవినాశియైవరలు చున్నది. ఇంకొక విశేషమేమన ఆసేతుశీతనగ పర్యంతము ఎవరు వేదపఠనము చేసినను (అటుదాక్షిణాత్యులుగా యిటు ఉత్తరాది వారుగాని) వినుటకు ఒకేరీతిగ నుండును. కారణము దాని ఛందఃప్రక్రియా విశేష మనక తప్పదు. ఇట్టిబిగువే లేకున్న లేఖనసౌకర్యములేని యానాటి నుండి నేటివఱకు (నేడు లేఖనవిధానమువచ్చి గ్రంథస్థమైనది కొంత) అవినాశియై ఒకేరూపుతో నుండుటకు కారణము దాని నిర్మాణము నందలి కట్టుబాటనక తప్పదు. సాధారణముగా వ్యాకరణము గుర్తుంచుకొనుట కష్టము. దీనిని సులువుచేయుటకై ఛందోబద్ధముగాకవిచేసిన ప్రయత్న ఫలితమే ఇది. అటులనే భాషలో పదజాలము సేకరించి తన వాఙ్మయము నభివృద్ధి పరచుకొనుట కూడ విద్యార్థికి కాని లేక భాషాభిమానులకుగానిముఖ్యాతిముఖ్యమగు విషయము. సంస్కృత అమరకోశమిట్టిది. "అమరము లేనివానికి నేనమర"నని వాణియన్నటుల నార్యోక్తి కూడ ప్రచారములో కలదు. ఎన్ని పుస్తకములను చదివినను పదజాలమును సేకరించలేము. అదియేఅమరమును చదివి కంఠస్థముచేసిన కావ్యములు యిట్టే సుఃభతరమగునని గుర్తించియే ప్రాచీన కాలమున సంస్కృత విద్యార్థులకు ప్రథమములో అమరమును వేదమువలే కంఠస్థము చేయించినారు. ఈ కిటుకెరిగిన

(26 వ పేజీలో)

శ్రీమతి టి. మంగమ్మ,
తెనాలి.

# శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము తిరుమల

## 1–3–79 నుండి

## నిత్యపూజ, దర్శనాదికముల కార్యక్రమము

### శని, ఆది, సోమ మరియు మంగళవారములు

ఉదయము 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతము
,, 3–30 నుండి 3–45 వరకు శుద్ధి
,, 3–45 నుండి 4–30 వరకు తోమాలసేవ
,, 4–30 నుండి 4–45 వరకు బంగారు వాకిలివద్ద కొలువు; పంచాంగ శ్రవణం,
,, 4–45 నుండి 5–30 వరకు మొదటి అర్చన
,, 5–30 నుండి 6–00 వరకు మొదటిఘంట బలి మరియు శాత్తుమొర
,, 6–00 నుండి మ 12–00 వరకు సర్వదర్శనము
మధ్యాహ్నం 12–00 నుండి 1–00 వరకు రెండవఅర్చన,(ఏకాంతం)
,, 1–00 నుండి 8–00 వరకు సర్వదర్శనం
రాత్రి 8–00 నుండి 9–00 వరకు శుద్ధి, రాత్రికైంకర్యము
,, 9–00 నుండి 12–00 వరకు సర్వదర్శనం
,, 12–00 నుండి 12–30 శుద్ధి

12–30 ఏకాంతసేవ

### బుధవారము

### సహస్రకలశాభిషేకం

ఉదయం 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతము
,, 3–30 నుండి 3–45 వరకు శుద్ధి
,, 3–45 నుండి 4–30 వరకు తోమాలసేవ
,, 4–30 నుండి 4–45 వరకు బంగారువాకిలివద్ద కొలువు పంచాంగశ్రవణం
,, 4–45 నుండి 5–30 మొదటి అర్చన
,, 5–30 నుండి 6–00 మొదటిఘంట, బలి, శాత్తుమొర
,, 6–00 నుండి 8–00 సహస్ర కలశాభిషేకము
,, 8–00 రాత్రి 8–00 వరకు సర్వదర్శనం
రాత్రి 8–00 నుండి 9–00 వరకు శుద్ధి ఇత్యాది
,, 9–00 నుండి 12–00 వరకు సర్వదర్శనం
,, 12–00 నుండి 12–30 వరకు శుద్ధి
రాత్రి 12–30 ఏకాంతసేవ

### గురువారము

### తిరుప్పావడ

ఉదయము 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతం
,, 3–30 నుండి 3–45 వరకు శుద్ధి
,, 3–45 నుండి 4–30 వరకు తోమాలసేవ.
,, 4–30 నుండి 4–45 వరకు బంగారువాకిలివద్ద కొలువు మరియు పంచాంగ శ్రవణము
,, 4–45 నుండి 5–30 వరకు మొదటి అర్చన,
,, 5–30 నుండి 6–00 వరకు మొదటిఘంట, బలి శాత్తుమొర
,, 6–00 నుండి 8–00 వరకు శుద్ధి, 2 వ అర్చన (ఏకాంతం), తిరుప్పావడ, అలంకరణం, ఘంట ఇత్యాది
,, 8–00 నుండి రాత్రి 8–00 వరకు సర్వదర్శనం
సాయంకాలం 8–00 నుండి 10–00 { వరకు శుద్ధి ఇత్యాది / పూలంగి సమర్పణ / రాత్రి కైంకర్యము, ఘంట }
రాత్రి 10–00 నుండి 12–00 వరకు పూలంగిసేవ
,, 12–00 నుండి 12–30 వరకు శుద్ధి
,, 12–30 ఏకాంతసేవ

### శుక్రవారము

### అభిషేకము

ఉద॥ 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతము
,, 3–30 నుండి 5–00 వరకు శుద్ధి మరియు నిత్యకట్ల కైంకర్యములు (ఏకాంతము)
,, 5–00 నుండి 7-00 వరకు అభిషేకము (రు. 450/- రు.250; రు. 100/– వారికి మాత్రమే ప్రవేశం)
,, 7–00 నుండి 8–30 వరకు సమర్పణము
,, 8–30 నుండి 9–30 వరకు తోమాలసేవ మరియు అర్చన (ప్రత్యేకం) ఘంట, బలి, మరియుశాత్తుమొర
,, 9–30 నుండి 10–00 వరకు రెండవ గంట, బలి, శాత్తుమొర
10–00 నుండి రాత్రి 8–00 వరకు సర్వదర్శనం
రాత్రి 8–00 నుండి 9–00 వరకు శుద్ధి రాత్రి కైంకర్యము
రాత్రి 9–00 నుండి 12–00 సర్వదర్శనం
,, 12–00 నుండి 12–30 వరకు శుద్ధి
12–30 ఏకాంతసేవ

గమనిక :– 1) పైకార్య క్రమములో సమయానుకూలముగాను ప్రత్యేక కార్యక్రమముల వలనను మార్పులు చేయబడవచ్చును. 2) సుప్రభాత దర్శనమునకు రు. 25/– టిక్కెట్టువారు మాత్రమే అనుమతింపబడుదురు. 3) రు. 25/– టిక్కెట్లు తిరుమలలోనూ దేశంలో ఆంధ్రాబ్యాంకువారి వివిధ కేంద్రములలోనూ లభించును. 4) ప్రత్యేక దర్శనం టిక్కెట్లు గలవారు లోగడవలె ధ్వజస్తంభంవద్దగాక మహాద్వారము క్యూలో చేర్చబడుదురు. 5) రు. 200/–ల ఆమంత్రణోత్సవం టిక్కెట్టుపై తోమాలసేవ, అర్చన ఏకాంత సేవలకు మాత్రమే అనుమతి. ఇద్దరు మాత్రమే అనుమతింపబడుదురు. 6) అర్చన, తోమాలసేవ, ఏకాంతసేవలో దర్శనానంతరపు టిక్కెట్లుగాని రు. 25/ టిక్కెట్లుగాని అమ్మబడవు.

పేష్కార్ ; శ్రీవారి ఆలయం, తిరుమల

# భాగవతము నందలి భక్తులు

(గతపంచిక తరువాయి)

## 4. కుంతి

ఈమెకు కృష్ణుడు మేనల్లుడు. జనునుబంధు దృష్టితో నీయమ కృష్ణుని సామాన్యుడని తలంపలేదు. అతని అతిమానుష కార్యముల నవలోకించి ధర్మసంరక్షణార్థ ముదయించినపరమాత్ముడుగ విశ్వసించి అతనియెడ భక్తిపూరితహృదయయైనది. భక్తధనుడు, నివృత్త ధర్మార్థకామ విషయుడు, ఆత్మారాముడు, రాగాది రహితుడు, కైవల్యదాన సమర్థుడు, కాలరూపకుడు, నియామకుడు, ఆద్యంతశూన్యుడు, విభుడు, సర్వసముడు, సకలభూతనిగ్రహానుగ్రహకరుడునని కృష్ణునిపట్ల నీమె విశ్వాసము. అందుచేతనే —

ఎ) " యాదవులందు పాండుసుతు లందు
నధీశ్వర ! నాకు మోహ వి
చ్ఛేదము సేయుమయ్య ! ఘనసింధువు
జేరెడిగంగభంగి నీ
పాదసరోజచింతనముపై ననిశంబు
మదీయబుద్ధి న
త్యాదరవృత్తితోఁ గదియునట్లుగఁ జేయఁ
గదయ్య యీశ్వరా ! " —
(1-198)

అని ప్రార్థించినది. ఐహిక బంధ విమోచనము, సదా కృష్ణభక్తి మాత్రమే కుంతికోర్కెలు. ఈమె మాటలలో స్వార్థ రహితమగు వైరాగ్య పూరిత నిష్కల్మష భక్తి ప్రస్ఫుట మగుచున్నది. భక్తకోటి యందీమె కొక విశిష్ట స్థానము కలదు.

## 5 అర్జునుడు

శ్రీ కృష్ణపరమాత్మతో సఖ్యము పాటించి భక్తి భావమును ప్రకటించిన అర్జునుడు సఖ్య భక్తికి సాక్ష్యము. అర్జునునియెడల కృష్ణునకు గల ప్రేమ యనన్యము. గోవిందునిశుద్ధాంతస్త్రీలను బోయలబారినుండి తప్పింపలేక ఆ సంఘటనమును ధర్మజునకు నివేదించుచు కృష్ణుడు తనవిషయమున పాటించెడి అవితరతుల్యమగు సఖ్యమును గూర్చి యాడినమాటలు గమనింపుడు.

ఎ) " చెలికాడ ! రమ్మని చీరు నన్నొకవేళ
మన్నించు నొకవేళ మఱది ! యనుచు
బంధు భావంబును పాటించు నొకవేళ
దాతయై యొకవేళ ధనము లిచ్చు
మంత్రియై యొకవేళ మంత్ర మాదేశించు
బోద్ధయై యొకవేళ బుద్ధిసెప్పు
సారథ్య మొనరించి చనవిచ్చు నొకవేళ
క్రీడించు నొకవేళ గేలిసేయు

నొక్కశయ్యాసనమున నుండు, కన్న
తండ్రికైవడి చేసినతప్పు గాచు
హస్తములు పట్టి పొత్తున నారగించు
మనుజవల్లభ ! మాధవు మఱవరాదు " —
(1-367)

బి) " వారిజగంధులు తమతో
వారింపగరానిప్రేమ వాదము సేయన్
వారిజనేత్రుడు నమఁ దగ
వారింట్లకు పనుపు వలుకవారింప నృపా !
(1-369)

సి) " నిచ్చలు లోపలికాంతలు
మచ్చిక తనతోడనాడుమాటలు నాకున్
ముచ్చటలు సెప్పు మెల్లన
విచ్చలవిడి తొడలపెద విచ్చేసి నృపా ! "
(1-370)

కృష్ణార్జునుల అన్యోన్య మైత్రి యెంత ప్రగాఢమైనదో యీ మాటల వలన వ్యక్తమగుచున్నది. కృష్ణుడు తనయంతః పురరహస్యములను గూడ అర్జునునకు చెప్పువాడనుటలో భగవంతుడు భక్తుల విషయమున భేదబుద్ధి పాటింపక అద్వైత స్థితిని వరించునను నంతరార్థమిందు కలదు.

మరియు ఫాలాక్షుని మెప్పించి పాశుపతమును గోనుట, దేవేంద్రునర్ధసింహాసనము నధిష్ఠించుట, కాలకేయనివాతకవచాది రాక్షసులను సంహరించుట, కురుకులాంబుధి నీదుట, మున్నగు నసామాన్యకార్యములన్నియు, నారాయణుడగు కృష్ణునిసాహాయ్యమువల్లనే నెరవేర్పగల్గితినని అర్జునుని యభిప్రాయము. కృష్ణ సాహాయ్యములేనినా డతడు నిర్వీర్యుడు. ధర్మజునితో నర్జునుడాడు మాటలను తిలకింపుడు—


శ్రీ డి. నాగసిద్దారెడ్డి,
తిరుపతి.


" కాంతారంబున నొంటి తోడుకొని రాగా
చూచి, గోవింద శు
ద్ధాంతస్త్రీల పదాఱువేల మదరాగా యత్తులై
తాఁకి, నా
చెంతన్ బోయలు మూగి పట్టుకొన, నా
సీమంతినీ సంఘమున్
భ్రాంతిన్ భామిని భంగి నుంటి విడిపింపన్
లేక ధాత్రీశ్వరా ! "
(1-372)

తనశక్తిసామర్థ్యములన్నిటికి భగవత్ప్రసాదమే కారణమనెడు భావము గల అర్జునునిచరిత్రము వలన "మానవుడు దైవసహాయముచేతనే శక్తియుతుడు కాగలడు. అదిలేని యాతడెందుకు కొఱగాడు" — అనెడి సత్యము వెల్లడియగుచున్నది.

## 6. ఉద్ధవుడు

అర్జునునివలె సఖ్యభక్తికి ఉద్ధవుడు నైతముదాహరణము. తనవిరహమును సహింపజాలని గోపవనితల నోదార్చుటకై

(24వ పేజీలో చూడుడు)

# శ్రీ రామానుజ కీర్తికౌముది (మొదటి భాగము)

సంపాదకులు :

శ్రీ ధనకుధరం వరదాచార్యులు,
లక్ష్మీనారాయణపురము, గుంటూరు-4

ప్రకాశకులు :

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి
పేజీలు : 32 + 324

మూల్యము : పదిరూపాయలు.

ఇపుడు సమీక్షించబడుతున్న పుస్తకం శ్రీవైష్ణవసిద్ధాంతాలను, వాఙ్మయాన్ని, సంప్రదాయాలను పరామర్శించే చక్కని వ్యాససంకలనం. దీనిపేరు శ్రీరామానుజకీర్తికౌముది. ఎంతోఅనురూపమైనది. ఈ కార్యక్రమాన్ని చేపట్టినవారు శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారు. వీరు ఎన్నో మత-సాంస్కృతిక గ్రంథాలను రచించి ఆంధ్రదేశంలో రచయితలుగ ప్రసిద్ధినందినవారు. వీరి ఉద్యమం ఆంధ్రులచే అభినందింపదగినది. ఇది మొదటిభాగం. దీనిని పరిశీలిస్తే ఇందలి వ్యాసాలను సంపాదించడంలో శ్రీఆచార్యులవారు ఎంతో శ్రమపడినారని చెప్పక తప్పదు. వ్యాసకర్తలందరు తమతమ పరిధులకు తగినట్లు వ్యాసాలను తయారుచేశారు. కాని పేరుకు తగినట్లు విశిష్టాద్వైతవేదాంతపరంగా, శ్రీవైష్ణవమతపరంగా. సంప్రదాయపరంగా ప్రణాళికాబద్ధంగా వ్యాసశీర్షికలను నిర్ణయించి, ఆయా రంగాలలో నిష్ణాతులైనవారిచే చక్కగ తయారుచేయించి, సంపాదిస్తే అది మన వేదాంతాలకు సంస్కృతికీ, ధర్మానికీ, మతానికీ ఎత్తిన అదర్శమై, పరిశోధకులకు, పండితులకు పామరులకు కూడ ఉపయోగపడుతుంది. చరిత్రలో శాశ్వతంగా నిలబడుతుంది ముందు ముందు ఈ భావనతో శ్రీఆచార్యులవారింకా ఎన్నో భాగాలను రూపొందించి ఆంధ్రుల ప్రశంసలకు పాత్రులౌతారని ఆశిస్తున్నాను. తిరుమల తిరుపతి దేవస్థానాలవారు ఇటువంటి ప్రచురణలను ప్రోత్సహించడం ప్రశంసనీయం. ఏదో ఘుణాక్షరన్యాయంగా వెక్కిరించినట్లు కాక హిందూధర్మ-మత-సంప్రదాయాలపై ఇటువంటి సంకలనాత్మక సంపుటాలను సమర్థులైన సంపాదకుల ద్వారా సామాన్యుడికర్థమయే తేటతెనుగులో

## గ్రంథ సమీక్ష

తి. తి. దేవస్థానాలవారు అందించాలని తెలుగు ప్రజ దశాబ్దాలుగా ఎదురు చూస్తోంది. వారి ఉత్కంఠ ఫలిస్తుందని, ఆశిద్దాం.

### 1. శ్రీనివాసోదాహరణము :
శ్రీ 'కరుణశ్రీ'

కమ్మని కవితకు మారుపేరు కరుణశ్రీ. శ్రీనివాసుని వైభవానికి, కరుణశ్రీ కవితామాధుర్యానికి ఈ శ్రీనివాసోదాహరణం ఒక చక్కని ఉదాహరణం. వారు గుండెలో ముంచి అర్పించిన ఈ కానుక, వారిగుండెలోని మంచికి మంచినిదర్శనం.

### 2. హిందూసనాతనవేదమతవైభవము :
శ్రీమాన్ గొట్టుముక్కల రమాకాంతాచార్యులు

సనాతనధర్మాన్ని. ఆయాకాలాలలో దానిలో వచ్చిన మార్పులను చక్కగ ఆకళించుకొన్నవారిలో శ్రీ ఆచార్యులవారు అగ్రగణ్యులు. ప్రపత్తివైభవాన్ని పాంచరాత్ర సిద్ధాంతవైశిష్ట్యాన్ని గ్రహింపగోరువారికీ వ్యాసం కరదీపికవలె సహాయపడుతుంది.

### 3. భువనసుందరమూర్తి :
శ్రీమాన్ మేదేపల్లి వరాహనరసింహస్వామి

'పరబ్రహ్మ భువనసుందరమూర్తి. ఆయన సౌందర్యమే సృష్టికి బీజం' అని నిరూపించే ఈ వ్యాసంలో సౌందర్యస్వరూపం విపులీకరించబడింది. శ్రీ విశిష్టాద్వైతసిద్ధాంతపరంగా ఇట్లు నిరూపణం సాగించిన శ్రీస్వామివారు అభినందనీయులు.

### 4. శ్రీవైష్ణవమతము-తద్వైశిష్ట్యము :
శ్రీమాన్ వేదాన్తం జగన్నాథాచార్యులు

శ్రీ వైష్ణవమతస్వరూపాన్ని అనేక కోణములనుండి సమీక్షించి, యోగమార్గముల విశ్లేషించి, అష్టాంగయోగముల పంగడించి, భక్తిప్రపత్తులే ముక్తిసాధనములను శ్రీరామానుజాచార్య సిద్ధాంతమును ఈ వ్యాసమున నిరూపించిన శ్రీ ఆచార్యులవారు మనకు శ్లాఘనీయులు.

### 5. శ్రీ పాంచరాత్రమతవైభవము :
శ్రీమాన్ పొడిచేటి శ్రీరంగాచార్యులు

పొడిచేటివారు పాంచరాత్రంలో మేటివిద్వాంసులు. భద్రాచలంకేంద్రంగా శ్రీ పొడిచేటి సీతారామాచార్యులవారు పాంచరాత్ర సంహితలను కొన్నింటిని ప్రచురించి ఎంతో సేవచేశారు. వారి సోదరులే ప్రకృతవ్యాసకర్త. శ్రీ రంగాచార్యులవారు శ్రీ పాంచరాత్ర శాస్త్రోదయాన్ని, దాని స్వరూపాన్ని, ప్రామాణ్యాన్ని, ప్రయోజనాన్ని ఈ వ్యాసంలో చక్కగ నిరూపించినారు. దేవాలయాలు ధార్మికదుర్గాలెలా అయినాయో హృద్యంగా వీరు ప్రతిపాదించారు. ఇందలి విషయసేకరణ క్రమతోకూడినది. పాంచరాత్రికులు వీరికెంతో ఋణపడిఉన్నారు.

6. భక్తియోగప్రభావము :

శ్రీమాన్ గుదిమెళ్ల రామానుజాచార్యులు

'కవిగారు' అనే అన్వర్థనామంతో ఆంధ్రదేశంలోను ఇతర రాష్ట్రాలలోను ప్రసిద్ధులైన ఈ మహామనీషి హాయగ్రీవ ప్రసాదపాత్రులు. భక్తియోగప్రభావాన్ని హృద్యాలైన పద్యాలలో శ్రుతి, స్మృతిశాస్త్ర భాగవత సూక్తులతో చక్కగ విశదపరచినారు శ్రీ ఆచార్యుల వారు. ఇంతకంటె సరళమైన తెలుగు కవితను మనమింకొకచోట చూడలేము.

7. భక్తితత్త్వము-వాఙ్మయము :

ప్రొఫెసర్ యస్వీ జోగారావు

జగమెఱిగిన యశస్వి ఆచార్య యస్వీ జోగారావుగారు. ఈ వ్యాసంలో వారు భగవద్గీత, భాగవతం మొ॥ గ్రంథాలలో భక్తితత్త్వం ఎలా ప్రతిపాదింపబడిందో నిరూపిస్తూ, భక్తిరసమే అని సమర్థిస్తూ భారతదేశంలోని భక్తి వాఙ్మయాన్ని భవ్యంగా సమీక్షిస్తూ, సాహిత్యప్రక్రియలైన పల్లకీసేవా ప్రబంధములను, హరికథలను గురించి చక్కగ వివరించారు. వీరి నిరూపణం ప్రశంసనీయం.

8. భాగవతము-భక్తితత్త్వము :

శ్రీ రావూరి ప్రసన్నసత్యనారాయణ

శ్రీమద్భాగవతమెలా భక్తిని నిరూపిస్తున్నదో ఈ వ్యాసంలో విపులీకరింపబడినది. భాగవతసాంగత్య ప్రభావాన్ని, భక్తికి సాధనాలను, అధికారులను, అనధికారులను, భక్తునిలక్షణాలను, నవవిధ భక్తులను ఎంతో చక్కగ నిర్వచించారు. వీరి ప్రతిపాదనం ప్రశంసాపాత్రం.

9. నారదుడు-భక్తిప్రచారము :

శ్రీకేశవభట్ల సుదర్శనవేణుగోపాలమూర్తి

భక్తిసూత్రవాఙ్మయంలో నారదభక్తి సూత్రాలెంతో విశిష్టమైనవి. ఈ వ్యాసంలో నారదప్రశస్తి, ఆయన ప్రతిపాదించిన భక్తిస్వరూపం, ఆయన ప్రభావం ప్రశంసనీయమైన పద్ధతిలో వివరింపబడినవి.

10. భగవన్నామసంకీర్తనప్రభావము :

శ్రీ కల్లూరి చంద్రమౌళి

ఆర్ష వాఙ్మయానికెంతో సేవచేసి ఆర్ష విద్యాలంకారులైనవారు శ్రీ చంద్రమౌళిగారు. వారి వ్యాసంలో భగవన్నామ వైభవాన్ని ప్రభావాన్ని నిరూపిస్తూ, అష్టాంగయోగాన్ని, శరీరవిజ్ఞానాన్ని, పరబ్రహ్మస్వరూపాన్నీ అందఱికీ సులభంగా అర్థమయ్యేలా ఎంతో సరళంగా విశదపరచారు. వారు అభినందనార్హులు.

11. ప్రపత్తిప్రాశస్త్యము :

డాక్టర్ కందాడ రంగాచార్యులు

భగవద్గీత, బ్రహ్మసూత్రములు, శ్రీమద్రామాయణం మొ॥ గ్రంథాల నుంచి ప్రపత్తిస్వరూపాన్ని చక్కగ ప్రతిపాదిస్తూ శ్రీ ఆచార్యులవారు ఎన్నో ముఖ్యమైన విషయాలను తెలియజేశారు. సంప్రదాయాభిజ్ఞులైన వీరి రచన ఎంతో చక్కగ సాగింది.

12. తమిళసంఘసాహిత్యము-వైష్ణవధర్మదర్శనము :

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

ఉభయవేదాంతాలలో బాగా కృషి చేసి ఈ గ్రంథసంపాదనకు పూనుకొన్నవారు శ్రీ వరదాచార్యులవారు ఈ వ్యాసంలో వీరు తమిళభాష పుట్టుక, పెఱుగుదల, సంఘకాలము, అప్పటి ప్రకృతిపూజ, తమిళదేశంలో వైష్ణవధర్మ వ్యాప్తి, వైష్ణవధర్మప్రాచీనత ఆళ్వారుల భక్తిప్రచారాలను గురించి సమగ్రంగా చర్చించారు. ఎన్నో నూతనాంశాలీ వ్యాసంలో ఆవిష్కరింపబడ్డాయి.

13. ఆళ్వారులు-భక్తివాఙ్మయము :

శ్రీమాన్ రొంపిచెర్ల పార్థసారధి భట్టాచార్యులు

శ్రీ పార్థసారథి భట్టాచార్యుల వారు మూడుదశాబ్దాలపైన శ్రీనివాసుని ఆస్థానంలో ఉండి ఆయనను సేవించే భాగ్యం పొందినవారు. వీరు తమ వ్యాసంలో నాలాయిర దివ్యప్రబంధాన్ని గురించి దాని వ్యాఖ్యానాలను గురించి, విపులంగా వివరించారు ఆళ్వారుల అవతార, జీవిత, రచనా విశేషాలను విడివిడిగ తెలియజేసి చివఱ శ్రీ ఆండాల్ సూక్తినిగూర్చి విస్తరంగా ప్రతిపాదించారు. వీరి విషయసేకరణ ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

14. తిరుప్పావు :

శ్రీ దామెర రాజగోపాలరావు

శ్రీ దామెర రాజగోపాలరావుగారు ఆండాళ్ తమిళంలో రచించిన తిరుప్పావుకు సరళవిశదమైన తెలుగు అనువాదాన్ని చక్కగ సంతరించారు. శ్రీవైష్ణవులకు తిరుప్పావు చాల ముఖ్యమైనది. దానిని తేటతెలుగులో ఆంధ్రులకందించిన వారిలో శ్రీ రాజగోపాలరావుగారు అభినందనీయులు.

15. గోదాస్తుతి :

శ్రీమాన్ నల్లాన్‌చక్రవర్తుల కృష్ణమాచార్యులు

సర్వతంత్రస్వతంత్రులు శ్రీ వేదాంత దేశికులు. వారు రచించిన గోదాస్తుతిని సంగీత సాహిత్యపాథోనిధి పారదృశ్వలగు శ్రీ కృష్ణమాచార్యులవారు హృద్యాలైన పద్యాలలో తెలుగులోకి అనువదించారు. ఎన్నో కవితాఖండాలను వెలయించి లబ్ధప్రతిష్ఠులైన కవిశిరోమణులు వీరు. సహజమధురం. వీరి కవిత. వీరి ప్రయత్నం ఎంతో ప్రశంసాయోగ్యం.

16. శ్రీ వేంకటేశ్వర తారావళి :

శ్రీమాన్ కొమాండూరి రామానుజాచార్యులు

ఇరువదియేడు పద్యాలలో శ్రీ వేంకటేశ్వరుని వైభవాన్ని కొనియాడినవారు శ్రీ రామానుజాచార్యులవారు. ప్రతి పద్యము ఆర్తితో పాఠక హృదయాలను కదిలింప జాలినది. వీరికి అభినందనలు. ★

---

డా॥ యన్. బి. రఘునాథాచార్య, తిరుపతి.

# గోపికలు - శ్రీకృష్ణుడు

కలియుగంబున భక్తియు, నామ పారాయణము ప్రధానములు. ఈ భక్తి సంస్కారము, సదాచారము, శుచివలన కలుగుచున్నది. వీటికి ఆధారము ధర్మము. భగవంతుని చేరుటగాని, ఇష్టార్థములను పొందుటగాని, ఇహపరంబులలో ఉత్తమగతి, ధర్మమువలన కలుగుచున్నది. కవికుల తిలకంబగు భోజభూపాలుడు

శ్లో॥ ఉచ్చైర్గతిర్జగతి సిద్ధ్యతి ధర్మ తశ్చేత్....'' అని నుడివి యున్నాడు. శ్రీభాగవత వచనమునుబట్టి "శ్లో॥ వేద ప్రణిహితో ధర్మో హ్యధర్మ స్తద్విపర్యయః'' 'వేదచోదితమగునదియే ధర్మము. ఇతరములన్నియు అధర్మము లని నిర్ణయించియున్నారు ఋషి తుల్యులు. ఈ కలికాలమునకు మరియు సులభమైన మార్గము కూడ చెప్పి యున్నారు.

శ్లో॥ జిహ్వాం లబ్ధ్వాపి యః కృష్ణం కీర్తనీయం
న కీర్తయేత్
లబ్ధ్వాపి మోక్షనిశ్రేణిం స నారోహతి
దుర్మతిః''

అనగా నాలుక ఉన్నను కీర్తనీయుం డగు శ్రీకృష్ణుని దుర్బుద్ధిచే గీర్తింపక, మోక్షమునకు నిచ్చెన దొరికియు, నెక్కక యుండు, వారిని గురించి మనము ఏమియు చెప్పవలసినదిలేదు. అది వారి దుష్కర్మ.

వేద విహితములే ధర్మములని, అవి ఆచరించు సాధుజనులలో

"శ్లో॥ సవై పుంసాం పరోధర్మోయతో భక్తి
రధోక్షజే।
అహైతుక్య ప్రతిహతా యయాఽత్మా
సుప్రసీదతి। ''

అని చెప్పబడియుండుటవలన, అహైతుకము న ప్రతిహతమునైన భగవంతుని భక్తి కలిగించునట్టిది పురుషుల కుత్తమ ధర్మంబనియు, ఆ భక్తివలన మానసము సుప్రసన్నంబగు ననియు, నిశ్చయించి యున్నారు.

"శ్లో॥ ధర్మస్స్వనుష్ఠితః పుంసాం విష్వక్సేన
కథాసు యః।
నోత్పాదయేద్యది రతిం శ్రమ ఏవహి
కేవలం।''

అనగా మనము అనుష్ఠించు ధర్మములు విష్ణుని కథారతి కల్పింపని వగునేని, కేవలము శ్రమయగును. అదియే ఉత్తమ ధర్మమునకు శ్రీహరి కథల యందు రతి కలిగించుటకు ప్రయోజనమని యేర్పడుటచేసి కృష్ణ కథలు అవశ్యము వినదగినవై యున్నవి.

శ్రీకృష్ణ కథలు శ్రీ భాగవతమున పూర్తిగాలేవు. శ్రీకృష్ణ కథలు పూర్తిగా గలిగిన గ్రంథములు :

(1) శ్రీబ్రహ్మావైవర్త మహాపురాణము.

(2) శ్రీమద్గర్గ సంహిత.

మనము ఎవ్వరిని తప్పు పట్టరాదు.



నిజములైన విషయములనే తెలుసుకొనవలెను. మన పూర్వకవులు కొందరు

॥ప॥ బోటులందుఁ దలమిన్న వందుని కన్న
చిన్న।
వారిధరవేణి రాధికా కీరవాణి।
ప్రభలను జెలంగు హరిప్రాణ పద
మవంగ॥

అనియు

॥ప॥ మేనత్తయను మేర మీటి రాధిక తోడ నెనయడే నీయనుగుబావ।'' అని వచించి యున్నారు. యథార్థగతి విచారింప రాధ శ్రీహరికి మేనత్త గాదు. రాధ గోలోకవాసి. పరాశక్తి. శ్రీకృష్ణుని శరీరము నుండి ఉద్భవించినది. ఆమె శాపవశంబున బృందావనమున పుట్టి పెరిగెను. స్వయముగా బ్రహ్మ బృందావనమున కరుదెంచి రాధాకృష్ణులకు వివాహంబుగావించెను.

---

శ్రీ సత్రం వెంకటరమణయ్య,
కడప

---

శ్రీకృష్ణకథలకు ప్రమాణ భూతము లగు గ్రంథంబులో అతి విపులముగా తత్కథా విస్తారంబు తెలుపునది శ్రీకృష్ణ పురోహితుడగు గర్గముని రచించిన గర్గసంహితయొకటి. అందు శ్రీరాధాగోపికలచరిత్రము విస్తారముగా గలదు. గోపికలను గురించి తెలుసుకొనుటకు ముందు, శ్రీకృష్ణుని గురించి కొన్ని విషయములు తెలుసుకొనవలెను. ఆయన అవతారములు, నివాసస్థానములు లెక్కింపనలవి గాదు. శ్రీభాగవతములో

" శ్లో॥ షష్ఠస్తు చక్షుషః పుత్రః చాక్షుషోనామ
వైమనుః।
తత్రాపి దేవస్సంభూత్యాం వైరాజస్యాభ
వత్సుతః।
అజితోనామ భగవానంశేన జగతః పతిః।



పయోధిం యేవ నిర్మథ్యసురాణాం సాధి
తా సురా।"

అనగా శ్రీయజ్ఞ వరాహకల్పమున ఆఱవదియగు చాక్షుష మన్వంతరమందు, వైరాజునికి సంభూతియందు, భగవంతుడు అజితుండు అను నామముతో అవతరించె ననియు, అతడే సముద్ర మథనంబునం దోడ్పడి, సురలకమృతము సాధించె ననియుకలదు అట్లనే ఆయన వసించు లోకములు అనేకములు. అనంతములు. వాటిలో కొన్ని, రమావైకుంఠము, ఊర్ధ్వవైకుంఠము, అథోవైకుంఠము, శ్రీలోకము, గోలోకము.

రమావైకుంఠము :-

శ్లో॥ పంచమో రైవతోనామ। మనుస్తామ
ససోదరః
పత్నీ వికుంఠా శుభ్రస్య। వైకుంఠైస్సు
రసత్తమైః,
తయో, స్వకళయా జజ్ఞే వైకుంఠో,
భగవాన్స్వయం,
వైకుంఠకల్పితో, యేన లోకో లోక
నమస్కృతః,
రమయా, ప్రార్థ్యమానేన, దేవ్యాతత్ప్రి
య కామ్యయా॥

అనగా ఐదవ రైవత మన్వంతరమందు శుభ్రుని భార్యయగు వికుంఠయను నామె

యందు, భగవంతుడు వైకుంఠుడన పేర బుట్టి, మహాలక్ష్మీయగు రమాదేవిం పెండ్లాడి, ఆదేవి ప్రార్ధనమున నాక లోకంబు కల్పించెను, అది రమాదేవి కొరకు కల్పింపబడినది గాన రమా వైకుంఠంబను నామమున బరగుచున్నది.

**ఊర్ధ్వవైకుంఠము :-** మహాలక్ష్మీ, సరస్వతి, గంగా, తులసీ సహితుడై శ్రీమన్నారాయణుండు వసించునది ఊర్ధ్వ వైకుంఠము. ఇది బ్రహ్మాండమునకు వెలుపలనుండును.

**అధోవైకుంఠము :-** భాగవతములో చెప్పినట్లు,

**"తద్విశ్వగుర్వధికృతం, భువనైకవంద్యం,**
దివ్యం విచిత్రవిబుధాగ్ర్యవిమానరోచిః
ఆపుః పరాం ముదమపూర్వ ము పేత్య యోగ
**మాయాబలేన మునయ స్తతతో వికుంఠః।"**

సనకాదుల వలన జయ విజయులకు శాపంబు సంభవించిన లోకము అధో వైకుంఠమని అందురు.

**శ్రీలోకము :** ఇది సముద్రరాజకన్యకయై యవతరించి లక్ష్మీదేవియను నామముతో, స్వనామాంకితమగు లోకమును కల్పించుకొనెనని, పురాణముల చెప్పుచున్నవి.

**గోలోకము :** శ్రీరాధాకృష్ణులు విహరించులోకము.

శ్రీకృష్ణుండనవెవ్వడు? శ్రీకృష్ణుడు వేదములచే నుతింపబడిన పరబ్రహ్మ. యోగి పుంగవులకుకూడా అందనివాడు. అతనికి స్త్రీ పురుష భేదములులేవు. ప్రపంచములోని చరాచరభూతరూపుడు. తానే పురుషుడు, తానే స్త్రీ, సర్వభూతములు అతనిలో లీనమగుచున్నవి. స్త్రీ నపుంసక పురుషమూర్తియనుగాక, తిర్యగమర నరాదిమూర్తియనుగాక, కర్మగుణ భేదసదసత్ప్రకాశి గాక, అన్నియును తానేయగు, విశ్వమయుడు, విభుడు, విష్ణుండు, జిష్ణుండు.

ఇంక గోపికలను గురించి కొంచెము విచారింతము. ఆంధ్ర భాగవతములో నారద ధర్మరాజు సంవాదమున, నారదుండు ధర్మరాజుతో భగవంతుని, ఎట్లైనను, ఏ పద్ధతితోనైనను పొందవచ్చునని, పోతన, ఈ క్రింది విధముగా వర్ణించి యున్నాడు.



శా॥ కామోత్కంఠత గోపికల్, భయమునం గంసుండు వైరక్రియా
సామాగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్, సంబంధులై వృష్ణులుం
బ్రేమన్ మీరలు, భక్తినేమునిదె చక్రిం గంటి మెట్లైన, ను
ద్దామ ధ్యాన గరిష్ఠుడైన హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా

"కామోత్కంఠతగోపికల్" అనుదానిలో, ఈగోపికలు ఎవ్వరు. వారిని గురించి కొంచెము తెలుసుకొన్న మనకుపూర్తిగా కృష్ణతత్వముతెలియును. గోపికలు అనేక యూధములుగా జన్మించి ఉన్నారు, శ్రీకృష్ణావతారకాలములో.

బ్రహ్మవైవర్త మహాపురాణ వచన ప్రకారము,

శ్లో॥ రేమిరే తాశ్చ తత్రైవ సార్థం కృష్ణేన పార్వతి।
షట్త్రింశల్లక్ష కోట్యశ్చ గోప్యో గోపాశ్చ తత్సమాః।
గోలోకం ప్రయయుర్ముక్తాః సార్థం కృష్ణేన రాధయా"

శ్రీకృష్ణునితో భూమియందు క్రీడించిన వారి సంఖ్య ముప్పది ఆరు లక్షల కోట్లు గలదని తెలిసి కొనవలెను ఈ గోపికల యూధంబులు నూఱని "గోపీనాం మధ్యవ్రజే రమ్యే శతయూధో భవిష్యతి।" అని భగవంతుడే చెప్పియున్నాడు. ఈ గోపికలందరును మహారాస క్రీడాకాలమున వచ్చి భగవంతునితో చేరిరి

యూధ మనగా పదికోట్ల అర్బుదముల గోపికలు కలదియొకటి. పది అర్బుదములతో నొప్పునదియొకటి, అనిచెప్పబడును. ఇందుకు ప్రమాణము

"శ్లో॥ అర్బుదం దశకోటీనాం మునిభిః కథితం విధే
దశార్బుదం యత్ర భవేత్సోఽపి యూథః ప్రకథ్యతే॥"

ఈ గోపికలలో అనేక రకములవారున్నారు, వాటిలో కొన్నిటిని మాత్రమే ఈక్రిందమనవి చేయుచున్నాను.

1. శ్రుతినికరంబులు శ్రీహరి వరంబున, మందయందు గోపసుందరీ తిలకంబులై, వెలసి, జారధర్మంబున, నందనందనుని బొందిరి.

2. త్రేతాయుగంబున దండ కాటవి నుండు మహర్షులు పెక్కండ్రు శ్రీరాముం గాంచి, కామించినవారు, గోపికాతరుణులై, జనియించి, నందునింట జేరి, శ్రీకృష్ణునకు కైంకర్యంబుసల్పిరి.

3. మిథిలానగరకాంతలు రాముని

యందను రాగంబునం, గాంచినవారలు, ఆ దాశరథి వరంబున ఆభీరవారి జాన నలై అవతరించి, కాత్యాయనీ వ్రతంబు నెఱపి, తమకట్టు పుట్టంబులు దొంగిలించిన యశోద పట్టి వలన మానభంగంబుబడసి, కృష్ణుని అభిమానమునకు పాత్రులైరి.

4. కోసలదేశ వాసినులు, జానకీనాథు నింగని, మన్మథ వేదనాశరీరులై, అతని అనుగ్రహంబున గోపికా జనంబుగా, మందయందు జనియించి, జారిణీధర్మంబున నారాయణునియందు పరమభక్తి విశేషంబులం గల్గి ఆ మానినీమదను డొనరించిన శైశవకర్మకార్యములనా మోదించిరి.

5. అయోధ్యాపుర కామినులు, రాముం గామించినవారు, విమలుండను భూవరునకు జనియించి, గోపికా రూపంబుల శ్రీపతిం జెట్టవట్టిరి.

6. రాముడు భూ పుత్రికంబాసి అశ్వమేధంబులు అనేకములు గావించినప్పుడు, జానకికిం ప్రతిరూపములుగా నా మహీపతి వరియించిన స్వర్ణసీతలు, అతని అనుగ్రహంబున, ఉశీనర దేశసమాగతులై, యమున దగ్గరనివసించు, ఆ భీరనాయకులకు కుమార్తెలై, రాధికానుగ్రహంబున మాధవునిం బొందిరి.

7. గోదావరి తీరంబున, పంచవటి యందుండి, లక్ష్మణాగ్రజు పై, అతీణ ప్రేమభరంబు బడసిన శబరీయువతీమణులు వింధ్యాది పరిసర స్థలంబుల నెలకొని, కంసనమానీతులై, కిరాత పతుల కుబుట్టి, భగవచ్చరణ రేణు సమాశ్రయణంబున, గోపికాకాంతుని గలసిరి.

8. రమావైకుంఠ వాసిన్యాదులు, వృషభాను గోపకులకు, గూతులై నియతి సలుప, కపట యతి వేషము దాల్చి, మురారి ఆ సరోజాననల నిష్టదాన సంతుష్టలం గావించెను.

9. దివ్యస్త్రీ ప్రముఖులు కాంతాదులు, ఆ భీరరాజులకు ప్రభవించి, రాధికానుచరులై, యాదేవితో హోళికోత్సవంబులందు, కృష్ణునితో క్రీడించిరి.

10. దేవకన్యకలు, నందుండను, మాళవాభీరునకుం, జనియించి గోపికలై అసమాన గాన కళా చాతుర్యంబున హరి కృపా పాత్రతంబడసిరి.

11. జాలంధర కాంతలు, రంగోజియను నాభీరధరా రమణునికిం, బుత్రికలగుచు, వ్రజరాజుల పరిణీయంబయి, జారిణీ ధర్మంబున, సారసనేత్రునిం బొందిరి.

12. సముద్ర కన్యకాదులగు కామినులు శోణపురాధీశునకు జనియించి, గోపికలై, డోలాగీతంబులబాడి, రాధికను మెప్పించి, ఆమె వరంబున, సరసిజాతుని సంగమ సుఖంబులుబడసిరి.

వీరు గోపికలు. సామాన్యస్త్రీలుగారు. ఈ గోపికలభక్తి అగగణ్యము. అసమానము. అనన్యము. పరాకాష్ఠను చెందిన భక్తి. (Complete Surrender in God.) సర్వమును శ్రీకృష్ణుడే అని భావించి తరించినవారు యోగతపోనిష్ఠాగరిష్ఠులైన ఋషిపుంగవులకు కూడా అందని శ్రీకృష్ణభగవానునితో అనుదినము, అనుక్షణము, చరించి, ఆనందించి, క్రీడించి, ముక్తినిబడసినవారు. వారికి వారే సాటి.

ఈ కలియుగంబున నేటి మానవులు కొందరు అల్పజ్ఞులు, విశ్వమయుడగు, శ్రీకృష్ణునకు, పరమభక్తాగ్రేసరులగు గోపికలకు, మానవ నీచజారత్వమును, అంటగట్టి వారి మూర్ఖత్వంబును వెల్లడించుకొనుటయేగాక, పాపమును మూట కట్టుకొని, రౌరవాదినరకములో, తమంతటతామే బడుచున్నారు.

ఈ క్రింద కనుబరచిన ఆంధ్ర భాగవతము లోని పరీక్షిత్తుని ప్రశ్నయు, శుకమహర్షి యొక్క ప్రత్యుత్తరమును, చూచిన. ఆ కృష్ణతత్వము చక్కగా బోధపడును.

పరీక్షితుని ప్రశ్న :

"మత్తకోకిలము: ధర్మకర్తయు, ధర్మభర్తయు, ధర్మమూర్తియునైన సత్కర్మ్మ డీకుడు, ధర్మశిక్షయు, ధర్మరక్షయు జేయగా నర్మిలిన్ ధరమీద బుట్టి, పరాంగనాజన సంగ మే ధర్మమంచు దలంచి చేసెనుదాత్త మానసచెప్పుమా"

అనిన శుకుండిట్లనియె :

ఆ॥ సర్వభక్షకుం డగ్నిసర్వంబు భక్షించి,
దోషిగాని వగిది, దోషమైన
జేసి, దోషపదము జెందరు, తేజస్వులగుట
జంద్ర వానవాదులధిప।

క॥ ఈశ్వరుండుగానివాడు, పరేశ్వర, పరకాంత
దలచి యెట్లుబ్రదుకు, గౌ
రీశ్వరుండు దక్క నన్యుడు, విశ్వభయద
విషముమ్రింగి వెలయంగలడే.

క॥ సత్యము ప్రభువుల వచనము, నిత్యము
దద్వచనవీధి విలుతురు పెద్దల్
సత్యాసత్యముగావున సత్యమనుచు జనరువారి
చరితమున నృపా।

మ॥ ఘనులై యెవ్వనిపాదపంకజపరాగ ధ్యాన
సంప్రాప్తయో
గ నిరూఢత్వము మునీంద్రులు మహాకర్మంబు
లంబాసి బం
ధ ని రోధంబులులేక విచ్చలవిడిం దర్పింతురా
దివ్యశో
భను డెట్లుండిన నుండెగాక కలవే బంధంబు
లుర్వీశ్వరా.

ఆ॥ గోపజనంబులందు, గోపికలందును, సకల
జంతువులందు సంచరించు
నా మహాత్మునకు బరాంగనలెవ్వరు, సర్వమ
యుండు లీలనలిపెగాక।

ఇదే భాగవతములో, నరకాసురునిచే చెఱపట్టబడిన పదారువేల రాజకన్యలు శ్రీకృష్ణుని వరించిరి.. శ్రీకృష్ణుడు వారందరికి పదారువేల శ్రీకృష్ణులై, పదారువేల భవనములలో, వారల కోర్కె దీర్చుటకు నొక్క ముహూర్తము వివాహమాడెను. ఇంతకంటే శ్రీకృష్ణ తత్వము తెలియుటకు, వేరొక్కటియేల. ఆ భాగవతములోని పద్యము చూడుడు. ఎంత చక్కగా కన్నులకు కట్టినట్లు పోతన వర్ణించినో.

చ॥ అమిత విహారుడీశ్వరుండనంతుడు
దానొకనాడు మంచిల
గ్నమునబదాఱువేల భవనంబులలోనంబదాఱు
వేలరూ-
పములంబదాఱువేల వృపబాలల ప్రీతిం బదాఱు
వేల చం-
దముల విభూతినొందుచు యథావిధితో
వరియించె భూవరా.

—: సర్వం శ్రీకృష్ణార్పణమస్తు :—

(17వ పేజీ తరువాయి)

వ్రేపల్లెకీతనిని పంపుటవల్లను, కుబ్జాగృహమున కరుగుచునితనిని తనవెంటనిడుకొని యేగుటచేతను. కృష్ణునకితని యెడగల యనురాగము తెల్లమగు చున్నది. బలరామకృష్ణులు మర్త్యులు కారనియు, వసుమతీ భారమువారింప శ్రీహరి మానవాకారముల తాల్చెననియు నితని విశ్వాసము. జీవితచరమార్గమున నీ భక్తుడు కృష్ణునిచే పరమార్థోపదేశమునంది, అతని పాదారవిందములు హృదయంబునజేర్చి బదరికాశ్రమమున కరిగెను. స్నేహభావమును ప్రదర్శించియు పరమాత్మని చేరవచ్చునను టకు ఉద్ధవుడు అర్జునుడు దృష్టాంతమగు చున్నారు.

## 7. గజేంద్రుడు.

ఆంధ్రదేశమున విశేష ప్రచారము నందున్న భాగవత గాథలలో గజేంద్ర మోక్షణకథ యొకటి. ఇంద్రద్యుమ్నుడను రాజు అగస్త్యముని నవమానించి శాపతప్తుడై గజేంద్రుడుగ జన్మమెత్తెను. ఒకనాడతడు కరిణీ సహితుడై యొక సరస్సున జలక్రీడలాడుచు నందున్న మొసలిచే పట్టుబడెను. నీరాట వనాటములకు పోరాటము సంప్రాప్తమై సహస్రవర్షములు గడించినవి. పృథుశక్తిన్ గజమా జలగ్రహముతో పెక్కేండ్లు పోరాడి, తనలావు శిథిలమగుటచేత దీనిగెల్వ సరిపోరంరాదని తలంచి, జన్మాంతరీకమైన పుణ్యవిశేషము వలన పూర్వస్మృతి లబ్ధముకాగా—

"ఏ రూపంబున దీనిగెల్తు, నిటమీదే వేల్పు
చింతింతు, నె
వ్వారిం జీరుదు, నెవ్వ రడ్డ మిక, నివ్వారి
ప్రచారోత్తమున్
వారింపందగు వారలెవ్వ, రఖిల వ్యాపార
పారాయణుల్
లేరే, మ్రొక్కెద దిక్కుమాలినమొఱా
లింపం బ్రపుణ్యాత్మకుల్" —
(8–71)

అని చింతించి, చివరకు విష్ణుని. శరణుజొచ్చుటయే మార్గమనెడి నిశ్చయమునకు వచ్చినది. తిర్యగ్యోని యగుట వలన కాబోలు అపుడును భగవంతుని యునికి నిట్లనుమానించినది.

"కలడందురు దీనులయెడ
కలడందురు పరమయోగి గణములపాలన్
కలడందు రన్నిదిశలను
కలడు కలండనెడువాడు కలడో లేడో" —
(8–86)

ఇట్టి సందేహము, తనశక్తిపై తనకు ప్రత్యయము, ఉన్నంతవరకు పరమాత్ముడతనిని గూర్చి పట్టించుకొనలేదు. తన సమస్త శక్తులు నశించిపోగా గత్యంతరము గానక —

"నీవే తప్ప నితః పరం బెరుగ మన్నింపం
దగున్ దీనునిన్
రావే యీశ్వర, కావవే వరద సంరక్షించు
భద్రాత్మకా!"

అని సర్వము భగవదధీనము జేసిననాడే —

"అల వైకుంఠ పురంబులో నగరిలో నామూల
సౌధంబుదా
పల మందారవనాంతరామృతసరఃప్రాంతేం
దుకాంతోపలో
త్పల పర్యంకరమా వినోది యగు" —(8–95)

నా పరమేశ్వరుడు

"సిరికిఁ జెప్పక, శంఖ చక్ర యుగముం
జేదోయి సంధింప కే
పరివారంబును జీరక భ్రగపతిం బన్నిం
పకాకర్ణి
కాంతరధమ్మిల్లము చక్కనొత్తక, వివాద
ప్రోత్థిత
శ్రీ కుచోపరిచేలాంచలమైనవీడక" — (8–95)

పరుగు పరుగున నేతెంచి గజరాజును కటాక్షించినాడు. ఈకథ వలన మనము గ్రహింపవలసిన సత్యమిది. జీవుడస్వతంత్రుడు. అతడు దేనికిని కర్తగాడు. భగవత్కటాక్షము నందవలె నన్న సర్వము భగవదర్పిత మొనర్పవలెను. అంతేగాక గజేంద్రుని కథయందు విషయ మాయావాగు రలజిక్కి యుక్కిరి బిక్కిరి యగుచున్న జీవుని వేదన ధ్వనించుచున్నది సంసార తాపత్రయమునకు మొసలి పట్టు ప్రతీకకాగా జీవుడందు తగుల్కొని బయటపడలేక తన్నుద్ధరింపుమని చేసెడి యాక్రందనమే గజేంద్రుని యార్తనాదమునకు ప్రతిసిధి. సర్వమున్నతని దివ్య కళామయమే ననియు, తాను స్వతంత్రుడనని తనశక్తినే నమ్ముకొని ప్రవర్తించుటవలస ఈశ్వర సాక్షాత్కారము లభింప దనియు సమస్తము భగవదర్పిత మొనర్చినవాడే సంసార విషయ విముక్తుడగు నను సత్యమునకు గజేంద్ర మోక్షణ మొక యుదాహరణము. ఇటి గాథ మానవాళికి మహోన్నత సందేశము నందించుచున్నది.

(సశేషము)



(14వ పేజీ తరువాయి)
ఉద్వేగములేని పరమ భాగవతుని లోకము మత్తుడని స్తబ్ధుడని పిలుచును. అతనిలో హర్షామర్ష భయోద్వేగాదులు శూన్యము. నిందాస్తుతులను పట్టించు కొనడు. అంతరంగపతియై వర్తించు శ్రీరంగపతి ధ్యానమగ్నుడతడు. అతడు శ్రియఃపతి పరధ్యానమత్తుడు. అన్యవిష యాసక్తుడు గాని స్తబ్ధుడు.

'అన్యాశ్రయాణాం త్యాగోఽనన్యతా'
— నారద భక్తిసూత్రము

నారాయణ పదారవిందముల నమ్ము కొన్న భక్తుని కన్యాశ్రయమేల? అతనికా పురుషోత్తముడు దక్క మరేమికానరాదు. అతనికంతా రామమయం. ఈ జగమంతా రామమయమే, వ్రజవాసినులగు గోపిక లకు బృందావనమున చెట్టుచేమ లగుపించ లేదు. అంతా కృష్ణరూపమై గోచరించినది, వారు సిద్ధులు. వారికి సర్వం విష్ణుమయం జగత్.

భక్తియొక్క విధము లనేకములని నారద వచనము (తల్లక్షణాని వాచ్యంతే నానామత భేదాత్): భక్తి నవవిధములని ప్రహ్లాదుని సిద్ధాంతము.

శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనం।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనం॥
శ్రీమద్భాగవతము —7–5–23

భక్తి యనునది మనస్సంబంధి. ఏకా గ్రత, మనసును భగవంతుని యందు లీనముచేయుట భగవంతునే సర్వకాల సర్వావస్థలయందును నమ్మికొనియుండుట ప్రధాన లక్షణములు. పైన పేర్కొనిన శ్రవణాది నవవిధ భక్తులును నీ ప్రధాన లక్షణములపై యాధారపడినట్టివే.

## శ్రవణం

'కథాదిష్వితిగర్గః' — నారదభక్తి సూత్రము

గర్గమహర్షి సిద్ధాంతము ప్రకారము హరికథా శ్రవణము భక్తుల యందొక విధము. స్వయముగా నధ్యయనము చేయ లేని యల్పులు భగవత్కథా శ్రవణము వలన అధ్యయన ఫలితమును పొందుదురు శ్రవణముచేయుచున్నప్పుడు మనస్సు హరి కథా శ్రవణానందమున నిండియుండును. ఆ స్థితియందు ఐహిక వ్యాపారదూరుడై జీవుడుండును. అనగా అదియొక సమాధి స్థితివంటిది. శ్రవణాతురుడైన భక్తుని యంతరంగము తన్నామోచ్చారణయందు లీనమై యుండును, భగవల్లీలలను విను నప్పుడు శరీరము పులకలెత్త కన్నుల నుండి ఆనందబాష్పములు రాలుచుండును

శ్రవణము సులభతరమైన భక్తి విధా నము. అది అన్ని ధర్మములకంటెను శ్రేష్ఠమైనది. భగవంతుని గుణ శ్రవణ ముచే వైకుంఠ స్థితుడగు శ్రీమన్నారా యణుని పొందగలరు.

శ్లో॥ శ్రవణం సర్వధర్మేభ్యో పరం మన్యే తపోధనః।
వైకుంఠస్థో యతః కృష్ణః శ్రవణాద్యస్య లభ్యతే॥
శ్రీమద్భాగవత మాహాత్మ్యము–6–77

పరమాత్మ తత్వమును గురుశుశ్రూష చేసి సద్గురు ముఖమునందు ఏదేశ రూప మున తెలుసుకొనవలెనేగాని అన్యమార్గము వలన గాదని గీతనుడువుచున్నది, అనగా శ్రవణమువలననే పరతత్వమునుగ్రహింప వచ్చునని గీతాచార్యుని భావము.

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః॥
— భగవద్గీత —4–34

శ్రవణాతురుడైన భక్తుడు చేరవలసిన గురువు జ్ఞానియును, తత్త్వదర్శియునై యుండవలెను. సద్గురువు ద్వారా లభించిన విద్య జీవుని తరింపజేయగలదు. వేదము శ్రవణము వల్లనే నేర్వవలసిన విద్యగదా! వేదమును సాక్షాత్కరింప జేసికొనిన మహ ర్షులు దానిని గానము చేయుచుండగా శిష్యులు విని నేర్చుకొనిరి. అందుకే దానిని శ్రుతియందురు. వేద ప్రతి పాద్య మైన భగవతత్త్వమును వివరించు పురా ణాదుల శ్రవణము వల్లను జీవుడు తరింప గలడని శాస్త్రము. శ్రీమద్భాగవత కథా శ్రవణమువలన ముక్తి పొందిన పరీక్షిత్తు కథ సర్వులెఱింగినదే. నైమిశారణ్యమున గల మహర్షులు హరికథా శ్రవణమువలన మోక్షము నందిరి.

శ్రవణము సత్సంగము వల్లనే లభిం చును. సత్సంగము లభించుట కష్టము. దాని కెంతయో పూర్వజన్మ కృత సుకృత ముండవలెను. ఎంతో పుణ్యము చేసుకొన బట్టియే పరీక్షిత్తునకు శుకమహర్షి సాంగ త్యములభించినది. ఎంతో మహోత్కృష్ట మైన పుణ్య విశేషము వల్లగదా శౌనకాదు లకు సూత సంపర్కము లభించినది! అందుకే 'నారదమహర్షి మహత్సంగస్తు దుర్లభోఽగమ్యోఽమోఘశ్చ అని సూత్రీ కరించినాడు.

## కీర్తనం

'తస్యాః సాధనాని గాయన్త్యాచార్యాః' అని నారద భక్తి సూత్రము. ప్రాచీన ఋషులు గానముచే భగవంతుని పొంద గలిగిరి. రాగతాళాత్మకమైన సంగీతము ద్వారా మనసు భగవంతునియందు లీన

మగును. సంగీతామృత రసాస్వాదనా మత్తుడైన జీవుడు పరమాత్మ సాక్షాత్కారమున పరమానందమును పొందును. కఠినమైన సాధనముచే యోగులు సాధించెడి మహత్ఫలితమును సంగీతము వలన సులభముగా సాధించవచ్చును.

స్వరరాగ సుధారస పానముజేసి భృంగి నటేశ సమీరజ ఘటజ మతంగ నారదాదులు ధన్యులైనారు. అందుకే త్యాగబ్రహ్మము –

'సంగీత జ్ఞానము భక్తివినా సన్మార్గము గలదే మనసా?' అని యుద్బోధించినాడు.

'ధర ఋక్సామాదులలో, గాయత్రి హృదయమున, నాభీ హృత్కంఠ రసన నాసాదులయందు శోభిల్లు సప్తస్వరసుందరుల భజింపవే మనసా' యని గానము చేసిన త్యాగరాజు గానమూర్తిని ఆరాధించి సంగీతము మోక్షదాయకమగు మార్గములలో శ్రేష్ఠమైనదని నిరూపించినాడు.

నాదోపాసనలో జీవుడు తన్మయుడై బ్రహ్మానందము ననుభవించును. 'ఆనందో బ్రహ్మ' మ్మని గద్యాశ్రుతి.

'లోకోఽపి భగవద్గుణ శ్రవణ కీర్తనాత్' – అని నారదభక్తిసూత్రము. శ్రవణ కీర్తనములవల్ల భగవంతుని చేరవచ్చును.

భక్తుడు భగవత్కీర్తనమువల్ల భగవదనుభూతి పొందుచున్నాడు. భగవంతుని తెలుసుకొన గల్గుచున్నాడు. సంకీర్తనము జీవుని మేలుకొల్పును. శీఘ్రముగా భగవత్తత్త్వమును సాక్షాత్కరింపజేయును.

'సకీర్త్యమానః శీఘ్రమేవావిర్భవతి అనుభవయతి చ భక్తాన్।'
నారదభక్తి సూత్రము

'అనుభవయతి' యను పదమునకద్వైతులు ఆత్మసాక్షాత్కారమని అర్థము చెప్పుదురు. 'శీఘ్రమే వావిర్భవతి' యను పదమునకు అనుభవయతి అను ప్రయోగమునకు గల సంబంధమును మనము విస్మరింపరాదు. సంకీర్తనము వలన చిత్తము ఆనందమయమైపోయి ఆ సమాధి స్థితియం దావిర్భవించిన పరమాత్ముని యనుభవము వల్ల తెలుసుకొనగలడు. అనుభవించువాడు భక్తుడు–అనగా జీవుడు. అనుభవించబడునది **పరతత్త్వము**.

కలియుగమునందలి మానవుడు యజ్ఞయాగాదులను, తపోధ్యానాదులను చేయగల శక్తిమంతుడుగాడు. అనగా ఆధ్యాత్మిక శక్తిసంపన్నుడుగాడు. అందుకే 'కలౌ సంకీర్త్య కేశవమ్' అని ఋషులు నిర్ణయించినారు. (సశేషం)

---

(15వ పేజీ తరువాయి)

యాంధ్రకవులీ వ్యాకరణములను, నిఘంటువులను శతకరూపమున మనకందజేసి ప్రశంసార్హులైరనక తప్పదు. క్రీ.శ. 1670 న నుండిన గణపవరపు వేంకటకవి "వేంకటేశాంధ్రము" అను అచ్చతెల్గు నిఘంటువులను విరచించెను. మకుట సంఖ్యానియతిగల రచనమిది. అమరకోశమునను సరించి దైవత, మానవ, తిర్యగ్వర్గాదులతో కూర్చబడినది. పదునెనిమిదవ శతాబ్దికి చెందిన సాంబమూర్తి కృతసాంబనిఘంటువు కూడ శతకమే.

భాషావ్యాకరణాంశములకు సంబంధించిన శతకములలో తాళ్లపాకతిరుమలాచార్యకృత "రేఫఱకారము" పేర్కొనదగినది. దానికి శతకలక్షణము లన్నియు గలవు, అంతియెగాదు, మకుటాత్మకమైన 108 పద్యములిందు గలవు. పూర్వార్థమున రేఫయుక్తపదములు, ఉత్తరార్థమున ఱకారయుక్తపదములు ఉదాహృతములైనవి. రేఫఱకారముల గూర్చి నేటికిని పండితులలో భేదాభిప్రాయములు కలవు. తిరుమలాచార్యకవి లక్షణకారుల మతప్రకారము రేఫఱకార యుక్తపదముల వర్గీకరించి, సూత్రబద్ధమొనర్చి, పదస్వరూప నిర్ణయ జటిలతను తగ్గించి, యా సమస్యను సుకరమొనర్చిననుట కెట్టి సందియమును లేదు.

సంస్కృతమున ప్రహేళికలనునవి కలవు. ఇవి తెన్గున కట్టుపద్యములవంటివి. కట్టుపద్యములు కాలక్షేపమునకును, వినోదవిజ్ఞానమునకును తోడ్పడును. అంతియేకాదు. ఊహాశక్తిని పెంపు చేయుటలో నివి తోడ్పడును. "తిరుమలేశ," "గానలోల" శతకములీకోవకు చెందును. వికటకవి వేంకటదాసు రచించిన అమాత్రార్ధశతకము ఊహాశక్తిని పెంచును. చావలిపూర్ణయదాసు కృత కట్టుపద్యశతకము ముక్తపదగ్రస్త నియమమున రచింపబడినది. ఈ నియమానుసారమొకరొకపద్యమును చదివినచో మఱియొకరింకొకపద్యమును ఆరంభించవలెను. మధ్యలో వరుసతప్పినవారు ఓడినవారుగ పరిగణింపబడుదురు. కట్టుపద్యనియమమును కవి స్వయముగ శతకాదియందు వివరించెను. "దీనిభావమేమి తిరుమలేశ" అను మకుటముతోనున్న పద్యములు మెదడుకు మేతనొసగునట్టివి. నాగభూషణకవి రచించిన "గానలోల" శతకముకూడ నీకోవలోనిదే.

తెలుగున యనేకవస్తుశతకములు కూడ వెలసినవి. వస్తుశతకములలో రామ

లక్ష్మణ ప్రశ్నోత్తరశతకమత్యంత విశిష్ట మైనది.

శతకపద్యములు ముక్తకసముచ్చయము. స్వయంపూర్ణ భావాత్మకము ముక్తకము. అనగా పైపద్యములతో గాని క్రిందిపద్యములతోగాని నెట్టి సంబంధము యుండదు. అన్వయసంబంధ మేమియునుండదు. కాని నేడు కొంత మార్పునొంది శతకము ముక్తకలక్షణము నుండి కథాత్మక శతకములలో ముక్తమైనది. కాలక్రమమున కావ్యవస్తువువలె శతకవస్తువుకూడ విస్మృతమైనది. రామాయణము కథావస్తువుగా గ్రహించి యనేక కవులీ రచన సాగించిరి. కవులు రామ కథను 100 లేక 108 పద్దెములలో నిమిడ్చిరి. భువనగిరి లక్ష్మీకాంతమ్మగారు భారతకథలో శ్రీకృష్ణుఁడు నిర్వహించిన పాత్రను ప్రధానముగ చిత్రించెను తుర్లపాటి పురుషోత్తమకవి భాగవతమునందలి ప్రథమస్కంధమునుగూర్చి యొకశతకమును, దశమస్కంధమునుగూర్చి యొక శతకమును విరచించెను.

వివిధ భాషాసాహచర్యముచే నాంధ్ర కవులు అనువాదశతకములనుకూడ సమర్పించుట జరిగినది. ఇతర భాషలనుండి తెనుగునకును, తెనుగుశతకముల నితర భాషలలోనికికూడ ననువదించి ప్రశంసార్హులైనారు. వివిధభాషలనుండి శతకముల నాంధ్రీకరించినవారిలో శ్రీనాథ మహాకవి ప్రథమగణ్యుఁడు. ప్రాకృతమున హాలశాతవాహన చక్రవర్తిచే విరచింపబడిన గాథాసప్తశతి నీతడాంధ్రీకరించినట్లు స్వయముగ స్పష్టపరిచెను. అది నేడలభ్యము. తిరువేంగళనాథుఁడు సంస్కృత శతకములను సంపూర్ణముగ ననువదించెను. పందొమ్మిదవ శతాబ్దివిచటివఱకు భర్తృహరి సుభాషితత్రిశతి, సూర్య శతకములకు మాత్రమే తెల్గునవెల్వడినవి. అనువాదములు అధునికయుగము నందిట్టి యనువాదశతకములు అధికముగ విరచితమగుట కననగును. శ్రీనాథుని యనంతరము గాథాసప్తశతి సంపూర్ణముగను, విలక్షణమును నాంధ్రీకరించిన గౌరవము గట్టి నృసింహశాస్త్రిగారికిని, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారికిని దక్కినది. మయూరుని సూర్యశతకమును వడ్డాది సుబ్బారాయుఁడు గారాంధ్రీకరించిరి. మయూరుని పదగుంభనాత్మక శైలిని అనువాదమున దర్శింపజేసిన మహనీయులు ఆకుండి వ్యాసమూర్తిగారు. శివానందలహరి, సౌందర్యలహరి సంస్కృతమున శ్రీశంకరభగవత్పాదుల విరచితములు. శ్లోకభావములగొని కవులు తెనుంగున శతకరూపమున నాంధ్రీకరించినారు.

శతకమవిచ్ఛిన్నముగ నాదరపాత్రమైన ప్రక్రియ. తెలుఁగువారు దీనిపై చూపిన మక్కువయపారము. ఆంధ్ర కవుల యాదరాభిమానముల నపారముగ జూరగొన్నదీ శతకము మకుటము కారణముగ దేశిప్రక్రియయను భ్రాంతిని కల్గించినది. సంస్కృత ప్రాకృతముల ననుసరించిన ప్రక్రియయైనను తెనుఁగుకవుల ఒడిలోపెరిగి పెంపుడు బిడ్డయై కన్నబిడ్డ కంటె కడుగారాలపట్టియై మహోన్నత స్థాన మందుకున్నది.

శతకము కొందఱుకవులకు కవితా సాధనా ప్రక్రియగా నుపకరించినది. కవులుగా ప్రసిద్ధికెక్కిన యనంతరము కొందరుకవులు ప్రౌఢనిర్భరవయః పరిపాకమున శతకరచన చేసిరి. మఱికొందరు జీవితావసాన సమయమున భక్తితన్మయత్వమున భగవంతుని శతకరూపమున స్తోత్రము చేసిరి. శతకమన్ని వయోధర్మములకు ఉపకరించు వాఙ్మయ ప్ర

# రచయితలకు చిత్రకారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రికకు మత ధార్మిక సంబంధమైన రచనలు, వ్యాసములు, గేయములు, చిత్రములు, ఛాయా (వర్ణ) చిత్రములు పత్రికలో ప్రచురణకు గాను కోర బడుచున్నవి. రచయితలు, చిత్రకారులు ఈ క్రింది విషయములు గమనించవలెను.

*

1. రచనలు చేయువారు 6 అరఠావు పేజీలకు మించకుండా, పేజీలకు ఒక వైపుననే వ్రాసి పంపవలెను. వాటికి సంబంధించిన ఛాయా చిత్రములను కూడ పంపగోరెదము.

*

2. చిత్రములు వేయువారు ఇండియన్ ఇంకుతో వేసి పంపవలెను.

*

3. ఛాయాచిత్రములుపంపువారు చిత్రములలోని వివరములు నిర్దుష్టంగా వ్రాసిపంపవలెను.

*

4. ప్రచురితమైనవాటికి ఉచితరీతిన పారితోషిక మీయబడును.

— సంపాదకుడు,
సప్తగిరి

క్రియా విశేషము. ఈ కారణముననే తెలుఁగున తప్పుఁతడకలగు శతకమునుండి మహాకావ్యశ్రేణి నధిగమించి నగ్రస్థాన మలంకరించిన శతకరాజములును వెలువడినవి.

శతకయొక యల్ప కావ్యమనియు దానిని మహాకావ్యశ్రేణిలో చేర్చరాదని కొందఱి భ్రమ. కాని శతకము కూడ మహాకావ్యస్థాయి నందినది. అంతియే కాదు. మహాకావ్యము చదివినవారికి మాత్రమే సన్నిహితము. కాని శతకము చదువురాని వారికి కూడ సన్నిహితమే. సుపరిచితము, సులభగ్రాహ్యము. వేమన-సుమతీ పద్యము లాబాలగోపాలమునకు కంఠస్థములే. ఇందలి నీతులు యుక్తులు వ్యాజోక్తులు భక్తిపారమ్యత, ధర్మసూక్ష్మములు మొదలగునవి మానవుని నిత్యజీవిత సన్నిహితములు. అవి పఠించునపుడు స్వయముగా నట్టియనుభూతి నంది పఠించును. దీనికి దోహదకారిమైనది శతకమందలి యాత్మాశ్రయ కవిత్వము కూడ. ఆత్మాశ్రయ కవిత్వములో కవియే కాదు. పఠితయెవరైనను తాదాత్మ్యత నందుట కవకాశము కలదు. కృష్ణశతకము దాశరథిశతకము చదువుటకు తల్లినత నందుటకు చదువుసంధ్యలేమి యక్కర లేదు. ధారణతో పద్దెములనేర్చి పఠించువారు నిత్యమును మనకు దృగ్గోచర మగుదురు. ఇంకొక విశేషముకూడ శతకమున కలదు. కావ్యములు కొండవీటి చేంతాడుల వంటివి. అవి పూర్వాపర విమర్శపూర్వకముగ నాస్వాదించినపుడే రసానుభూతి కల్గును-కాని శతకమున నట్లుకాదే! ఏ పద్దెమునకా పద్దెమేచాలు కవ్వించి గిలిగింతలు పెట్టుటకుగాని, లేక భక్తిపరమ్యమున ముంచుటకు గాని. భక్తి శతకముల పారాయణ చేయువారనేకులు గలరు. గీతాపారాయణ కొందఱికేమోగాని భక్తిశతకముల నిత్యపారాయణ చేయువారధిక సంఖ్యాకులుగ కనపట్టుదురు. ఈ పారాయణకు చదువు సంధ్యలతో నిమిత్తములేదు. కేవలధారణ యొక్కటియే చాలు. నిజమునకు శతక వాఙ్మయము ప్రజా వాఙ్మయమనుటే సముచితముగ నుండును. వేదములు ఏ విధమున ప్రభుసమ్మతములై కేవలధారణ మాత్రముగ, అవినాశియై విరాజిల్లు చున్నవో యటులనే శతకములు కూడ తెలుఁగునాట ప్రజావేదములై బరగుచున్నవనుట తిశయోక్తి కాదు. వేదములనుగాని పురాణములనుగాని కావ్యములనుగాని యర్థముచేసికొనలేని సామాన్య మానవునికిది నిజముగ జ్ఞాననిధి యనక తప్పదు. ఆబాలగోపాలమును అవస్థా భేదములేక శతకమలరించును. మనస్సునకు ఆహ్లాదము, ఎడదకు ఓదార్పునిచ్చి యలరించునది శతకవాఙ్మయమే కాని వేరుకాదు. సంక్షిప్తత, సులభశైలి కూడ వీటి సొమ్ములగుటచే ప్రజాదరణ శీఘ్రముగ చూరగొన్నవి. సుమతికారుని రాజనీతి-వేమన సజ్జన దుర్జన ప్రవృత్తి పద్యములు తెలుఁగువారి హృదయముల నొక ప్రత్యేక ముద్రవేసినవి. ఆంధ్రదేశ మందు కలచుకాగడావేసి గాలించినను ఒక్కపద్దెమైనను రాని తెలుఁగువాడుండడనుటలో నత్యుక్తిలేదు. ఈ పద్యముల కంఠస్థమునకు చదువుసంధ్యల ప్రమేయమే లేదు. కావుననే శతకము ప్రజావేదమై ఆనాటి నుండి ఈనాటి వఱకు పుంఖాను పుంఖములుగ తన కిరణముల నలుదెసలకు వ్యాప్తిచేయుచు ఆంధ్రవాఙ్మయాకాశ ధృవతారయై వర్ధిల్లు చుండుననుట కెట్టి సందియమును లేదు. *

(10వ పేజీ తరువాయి)

బహుళార్తి జెందినవారికి అభయప్రదానము ముందు అవసరము. కనుక తన జన్మదివసమునకు పూర్వదినముననే బ్రహ్మాదులను దేవకీ వసుదేవులకడకు బంపి, ఆ మరునాడు వారికడుపున విష్ణువు పుట్టనైయున్నాడు భయపడకుడని చెప్పించెను. వారు విష్ణుభక్తులు. ఇట్టి స్థితిలో సామాన్య మానవునిగా తాను జన్మించినచో కంసుని రాక్షస హస్తమునుండి పసికూన తప్పించు కొనగలడాయని సందేహము మిగిలిపోవచ్చును. కాబట్టి సర్వశక్తివంతుడును, జగన్నియంతయు నగు విష్ణువు తన నిజరూపముతో జన్మించెను. వసుదేవుడారూపమును :—

సీ॥ జలధరదేహు నాజాను చతుర్బాహు
  సరసీరుహాక్షు విశాలవక్షు
జారుగదా శంఖ, చక్ర, పద్మవిలాసు
  గంఠకౌస్తుభమణికాంతి భాసు
కమనీయ కటిసూత్ర కంకణ కేయూరు
  శ్రీవత్సలాంఛనాంచిత విహారు
నురుకుండల ప్రభాయుతకుంతలలలాటు
  వైఢూర్యమణిగణ వరకిరీటు

బాలు పూర్ణేందు రుచిజాలుభక్తలోక
పాలు; సుగుణాలవాలు గృపావిశాలు
జూచి, తిలకించి, పులకించి, చోద్యమంది
యుబ్బి, చెలరేగి, వసుదేవుడుత్సహించె
(భా. 10 పూ. 12)

ఇంతటి యానందమును, న్నమ్మకయు ఆ స్వరూపదర్శనమువలన, నేటికి. ప్రాప్తించినవి. దేవకియు అతని దివ్యత్వము నెఱిగి యిట్లు స్తుతించెను.

మ.కో॥

ఒంటినిల్చి పురాణ యోగులు
యోగమార్గ విరూఢులై కంటి
ముందురు, కాని, నిక్కము గానరీ
భవదాకృతిన్, కంటిభద్రముగంటి.
మాధవ! కన్నులన్ గన
బోలదు తొంటి రూపు తొలంగబెట్టుము
తోయజేక్షణ!మ్రొక్కెదన్,

మ.కో॥ నలినలోచన! నీవు నిక్కము
  నాకు బుట్టెదవంచు నీ,
ఖలుడు, కంసుడు, బెద్దకాలము
కారయింట నడంచెదుర్మలిన చిత్తుని
నాజ్ఞసేయుము, మమ్ముగావుము
భీతులన్, నలుసు లేక ఫలించె
నోచిన నోములన్నియు నీవయై
ఇంత యేల? పుట్టగానే

కంసుని జంపరాదా? ఈకాలహరణమేల? అనిశంక కలుగవచ్చును. ఆకాశవాణిని విన్న కంసుడు తన ప్రాణరక్షణార్థమును, శత్రుహరణార్థమును, అనేకమంది రాక్షసులను తనయొద్దజేర్చుకొనెను. కంసుని చంపినను ఆ రాక్షసులెందోదాగియుండి ప్రజలను బాధింపవచ్చును. వారిని కూడ చంపుటకు ఇంకను వారి నేరము బయల్పడ లేదు. మధురలోని ప్రజలెట్టి స్థితిలోనుండిరో ఈ క్రింది పద్యము తెల్పుచున్నది :—

క॥ మధుసూదన సత్కరుణా
మధురాలోకన విముక్త మానసభయులై
మధుర వచనముల దారును
మధురానగరంపు ప్రజలు మనిరి నరేంద్రా

ప్రజలందరును అదివరకు భీతులైయున్నారు. అందుచే కంసుని బారి బడకుండ దూరమున, సామాన్య బాలుని వేషముతో నుండి, కంసుడు తన్నుజంప బంపు రాక్షసపరివారమునంతను క్రమక్రమముగా జంపుచు తుదను కంసుని జంపవలెను. తాను స్థలాంతరమునకు క్షేమముగా జేర్చబడవలెను. ఆ విధానమును వసుదేవునకు ముందే యెఱింగించి తాను ప్రాకృత వేషధారియయ్యెను. ఇంకను దేవకీ వసుదేవులకు తన శక్తి సామర్థ్యములు తేటపడుట కొఱకును నమ్మకము కల్గి ధైర్యముగా నుండుటకును వరదలతో నా ప్రాంతమునువింపి, ఎవ్వరును ఇంటినుండి బయటికి రాలేనిస్థితి కల్పించెను. తనను వ్రేపల్లెలో దింపి, యశోదకు పుట్టిన యోగమాయను తెచ్చి దేవకికిచ్చుటగాను యమునా నది దారి యిచ్చెను. చెఱసాల తాళములు తమంత తాము విడిపోయి చెఱసాల తలుపులు విడిపోవునట్లును, తన కార్యానంతరము ఎప్పటికి యట్లనుండునట్లును చేసెను. యశోద తనకు మగ శిశువు జన్మించెనో లేక, ఆడబిడ్డపుట్టెనో యెఱుక లేకుండా చేసెను, సర్వ ప్రజలను నిద్రలో ముంచెను. దేవకికి అదివరకు పుట్టిన, కంసునిచే చంపబడిన ఏడుగురు బిడ్డలను ఆ లోకమునుండి తెచ్చి దేవకికి చూపించెను, ఇట్టి మహిమాన్విత క్రియలచే దేవకీ వసుదేవులకూరటగల్గి, కంసవధనిశ్చయమనిపించెను. అంతవఱకు వేచియుండగల ధైర్యము చిక్కెను. తన రహస్యము వెల్లడికాలేదు.

ఇట్టి ప్రయోజనములతో ఇచ్చట దేవకీ వసుదేవులు కొల్చు విష్ణుని కారుణ్యమూర్తియే. విష్ణుని సహజ రూపముతో ఆవిర్భవించెను. విష్ణుని తత్త్వమయమూర్తికాని, భయంకర విశ్వరూపముకాని సర్వ దేవతాత్మకమూర్తికాని అవసరము లేదు. *

## ప్రత్యేక దర్శనం టిక్కెట్లు

**శ్రీవారి దర్శనపు రూ. 25/- ప్రత్యేక దర్శనపు టిక్కెట్లు ఆంధ్రాబ్యాంకువారి ఈ క్రింది శాఖలలో లభిస్తవి.**

— ఆంధ్రప్రదేశ్ —

- అనంతపురంజిల్లా
  - అనంతపూర్
- కడపజిల్లా
  - కడప
  - ప్రొద్దుటూరు
- పశ్చిమ గోదావరిజిల్లా
  - ఏలూరు
  - భీమవరం
  - తణుకు
- తూర్పుగోదావరిజిల్లా
  - రాజమండ్రి
  - కాకినాడ (మెయిన్)
  - రామారావుపేట (కాకినాడ)
- నెల్లూరుజిల్లా
  - నెల్లూరు
- ప్రకాశంజిల్లా
  - ఒంగోలు
  - చీరాల
- చిత్తూరుజిల్లా
  - చిత్తూరు
  - తిరుపతి (మెయిన్)
  - బాలాజీనగర్ (తిరుపతి)
  - హుజూర్ ఆఫీసు అనుబంధ కౌంటరు (తిరుపతి)
  - కాళహస్తి
- విశాఖపట్నంజిల్లా
  - విశాఖపట్నం (మెయిన్)
  - మహారాణీపేట (విశాఖపట్టణం)
  - విజయనగరం
- కరీంనగర్ జిల్లా
  - కరీంనగర్
- కర్నూల్ జిల్లా
  - కర్నూలు
- ఖమ్మంజిల్లా
  - భద్రాచలం
  - ఖమ్మం
- క్రిష్ణాజిల్లా
  - విజయవాడ (మెయిన్)
  - గాంధీనగర్ (విజయవాడ)
  - గవర్నర్ పేట (విజయవాడ)
  - మచిలీపట్నం
- గుంటూరుజిల్లా
  - గుంటూరు (మెయిన్)
  - బ్రాడీపేట (గుంటూరు)
  - తెనాలి
- హైదరాబాదుజిల్లా
  - హైదరాబాదు (మెయిన్)
  - హిమయత్ నగర్
  - చిక్కడపల్లి
  - ఖైరతాబాదు
  - విజయనగర్ కాలని
  - సికింద్రాబాదు
  - మారేడ్ పల్లి
- వరంగల్ జిల్లా
  - వరంగల్
- మెదక్ జిల్లా
  - సిద్ధిపేట
- మహబూబ్ నగర్ జిల్లా
  - మహబూబ్ నగర్
- నల్గొండజిల్లా
  - నల్గొండ
- నిజామాబాద్ జిల్లా
  - నిజామాబాద్
- అదిలాబాద్ జిల్లా
  - అదిలాబాద్

— రాష్ట్రేతర ఆంధ్రాబ్యాంకు శాఖలు. —

- పాట్నా
- టాటానగర్
- అహ్మదాబాద్
- బరోడా
- సూరత్
- బెంగుళూర్ (ఎస్.ఆర్. రోడ్)
- రామ్ రాజ్ పేట (బెంగళూర్)
- బళ్ళారి
- గంగావతి
- రాయచూరు
- హోసపేట
- త్రివేండ్రం
- ఎర్నాకులం (కొచ్చిన్)
- భోపాల్
- జైపూర్
- జబల్ పూర్
- బొంబాయి (మెయిన్)
- చెంబూరు (బొంబాయి)
- మాతుంగ (బొంబాయి)
- నాగపూర్
- భువనేశ్వర్
- బర్హాంపూర్
- రాయగడ
- పూరీ
- రూర్కెలా
- మద్రాసు (మెయిన్)
- మైలాపూర్
- టి. నగర్
- షెనాయ్ నగర్
- కోయంబత్తూర్
- మధురై
- సేలం
- తిరుపూర్
- కలకత్తా
- బాలిగంజ్ (కలకత్తా)
- ఖరగ్ పూర్
- దుర్గాపూర్
- చండీఘర్
- కన్నాట్ సర్కస్ (న్యూఢిల్లీ)
- కరోల్ బాగ్ (న్యూఢిల్లీ)
- రామకృష్ణాపురం (న్యూఢిల్లీ)
- లక్నో
- అలహాబాద్
- వారణాశి
- లూధియానా

# వేదాంత దేశికులు

(గత సంచిక తరువాయి)

ఐశ్వర్యము-సృష్టి రెండును ఎప్పటికిని ఒక్కటిగాయుండును. వానికి విచ్ఛేదనమే లేదు అని ఆచార్యులు వ్యక్తపఱచియున్నారు. ఇదే మఱొక్కరీతిగా శేష-శేషి భావమగుచున్నది. ఇట్టి శేష-శేషి సమీకరణమందు స్వామిభృత్యభావము, గురుశిష్యభావము, పతిపత్నిభావము, పితాపుత్రభావములన్నియు లోబడియున్నవి. అని ఆచార్యులవారు చాలాచక్కగా వివరించియున్నారు.

## ధర్మనిరూపణము

శ్రీవైష్ణవధర్మము శ్రీవైష్ణవమతమని ప్రసిద్ధిగాంచినది. విశిష్టాద్వైత దర్శనము ఆచార్యపరంపరచే నిశ్చయింపబడి, చేతనుల ఉజ్జీవింపజేయుటకై శాస్త్రోపదేశము చేతనూ, స్వానుష్ఠానముచేతను నిర్ధరింపబడినది. ఈ దర్శనము ప్రకారము జీవాత్మలెల్లరు అన్నివిధముల మోక్షమును ప్రాప్తింపవచ్చునను పరమౌదార్యమును ఆచార్యులవారు వ్యక్తపఱచియున్నారు. ఇట్టి ఉదారభావమును స్థాపించుటకు ఆచార్యపరంపరలోనివారు వేదవేదాంగ పురాణేతిహాసములను ఆధారముగా చేసికొని ప్రబంధముల నుండి ఉదాహరణములను చూపి, వానికి హెచ్చుప్రాశస్త్యము నిచ్చి తత్త్వము నిరూపించి, సిద్ధాంతీకరించు చుందురు. ఆళ్వారులు ప్రబంధములకు హెచ్చు ప్రామాణ్యమిచ్చి ధర్మము నిరూపించిరి. మొత్తముమీద ఆళ్వారులు, ఆచార్యపురుషులు ఇరువురును శ్రీవైష్ణవధర్మమును నిరూపించినవారే, ఒకరినివిడిచి వేఱొకరిని చెప్పదగదు. రథములోని చక్రములవలె, పక్షికిగలరెక్కలవలె, ఈ పరంపరల రెంటికిచెందిన మహాత్ములిరువురును శ్రీవైష్ణవధర్మమునను మహోపకారము చేసియున్నారు. వీరిప్రయత్నఫలమై శ్రీవైష్ణవధర్మము ఉభయవేదాంతప్రవర్తమై ప్రసిద్ధికెక్కినది. ఈ విధముగా ఆళ్వారుల యొక్కయు, ఆచార్యపురుషులయొక్కయు ఉపకారమును స్మరించి వేదాంతదేశికులు ఉభయవేదాంత ప్రవర్తకులను యశస్సును గడించియున్నారు. ఆచార్యపరంపరచే సిద్ధాంతమునకైన ఉపకారమును వేదాంతదేశికులు ఎట్లుపరిష్కరించిరో పైపుటలలో విశదీకరించితిమి. ఆళ్వారు పరంపరనుండి లబ్ధమైన న్యాయమును వారెట్లు నిరూపించియున్నారో, అదియును క్రిందిపంక్తులలో వివరింపబడినది.

ఆళ్వారు అనుశబ్దమునకు మునిగినవారు అని అర్థము. అనగా భగవంతుని అనుభవమునందు మునిగినవారు. ఈ అనుభవానందముయొక్క గొప్పదనమును, భగవత్సంబంధమున్నవారి మహిమను, తెలిసి జనులను సద్గతికి తీసికొనిరా, పరమాత్ముని ఆజ్ఞబడి, పరమపదమునకు చెందిన నిత్యసూరులు, తమిళనాడులో హరిదాసులై భాగవత శిఖామణులై అవతరించిరి. భగవద్భక్తియను సముద్రములో మగ్నులైనవారు ఆళ్వారులు. వీరియందు వర్ణభేదములేదు.

వేదశాస్త్రములు సంస్కృతమందుండుటచే సామాన్యజనులు దీని సారాంశము తెలియుటకష్టము. శ్రుతిస్మృతి పురాణేతిహాసముల సారమును తెలిపి ఎల్లరు ఉజ్జీవింతురు గాతయను మహదాశయముతో ఆళ్వారులు తమప్రాంతమునకు చెందిన తమిళభాషయందు దివ్యమధుర గీతములను గానముచేసిరి. వీనినే దివ్యప్రబంధములందురు. వీనికి వేదములతో సమానమైన గౌరవము గలదు. ఇవి. ద్రావిడ వేదములనియు, ద్రమిడోపనిషత్తులనియు ప్రసిద్ధికెక్కినవి. చారిత్రకదృష్టితోచూచిన ఆళ్వారులకాలము ఆచార్యులకంటే ప్రాచీనము. క్రీ. శ. ఏడవ శతాబ్దమునుండి తొమ్మిదవ శతాబ్దమువరకు వీరు వర్ధిల్లిరి. వీరిది పాంచరాత్రమతము. ఈ మతము అతి ప్రాచీనమైనది

పాంచరాత్రమతమునకు చెందిన ఈశ్వర సంహితయందు ద్రావిడవేదమును గుఱించిన సూచనకలదు. యామునమునులు మొదలైన ఆచార్యులు ఆళ్వారుల దివ్య ప్రబంధములను సంకలించుటయేగాక భగవంతుని ఆరాధించువేళల వేదోపనిషత్తులతను ద్రావిడప్రబంధములను నిత్యానుసంధానము చేయవలెనని కట్టుబాటుచేసిరి. ఈ ఏర్పాటు ఇప్పటికిని నడచుచున్నది. వేదాంతదేశికులు ఆచార్యపరంపరకు చేరినవారయ్యును, ఆళ్వారుల దివ్యసూత్రములను అనుష్ఠానమందుతెచ్చి, దానిని చక్కగా ప్రచారముచేసి, వానిసారమును గ్రంథరూపముగా రచించియున్నారు. సిద్ధాంత పరిష్కరణకు. శ్రీవైష్ణవధర్మనిరూపణమునకు వేదవేదాంగ సకలశాస్త్రాధారములతోబాటు దివ్యప్రబంధములను విశేషముగా ఉపయోగించియున్నారు. మొత్తముమీద దివ్యప్రబంధములలో నాల్గువేల పాశురములు లేక పద్యములున్నవి. వీని సారార్థములను వేదాంత

శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి.

ఆలిఘర్




దేశికులు దేశికప్రబంధమను తమిళగ్రంథ మున సంగ్రహించియున్నారు. దీనిలో ప్రబంధసారమనునది ఒక పద్యమాల.

ఆచార్యులు ఆళ్వారుల దివ్యప్రబంధ ముల సారార్థమును, వారివారి పాశురము లందు చిన్న విశేషణమూలకముగా వారు అవతరించిన దివ్యదేశము, మాసము, నక్షత్రము వారిమహిమ, వచించిన ప్రబంధ వివరణము, పాశురములసంఖ్య అన్నింటిని నిరూపించియున్నారు. ఇట్లా ప్రబంధ ముల జీవనాడివలెనున్న సారాంశమును సూక్ష్మముగా స్పష్టపఱచి, తమఅనుసంధానమునకై అనుగ్రహింపవలసినదిగా ఆళ్వారులను ప్రార్థించియున్నారు. ఈ పద్యమాలయొక్క చివరిరెండుపాశురములందు ఆచార్యులందఱును ఈ ప్రబంధసారమును అనుసంధానముచేయుట మూలముగా భగవత్కృపకు పాత్రులుకావలెనని ఆశించిరి.

శ్రీమన్నిగమాంత మహాదేశికులచే విరచితమై దేశికప్రబంధమని ప్రసిద్ధికెక్కిన ఆచార్యుల దివ్యసూక్తులకు విద్వాన్ హ. గోపాలాచార్యులు కన్నడ ప్రతిపదార్థము, తాత్పర్యము, తమిళ పాశురమునకు సంస్కృత శ్లోకములయందు భావానువాదము గూర్చి రచించియున్నారు. తమిళ కావ్యప్రబంధ రసానుభవము కన్నడ జనులకు కలుగవలెననెడు నుదాత్తభావముతో ఈగ్రంథరచనముసాగినది. ఇందుచే ఆచార్యులవారి కృతిరత్నముల రహస్యార్థము తెలిసికొను నదవకాశము ఏర్పడినది. సదాచార్యులు, దయావలంబులునైనగోపాలాచార్యులవారు తమిళసాహిత్య వైభవమును, కన్నడులకు తెలియచేసి ఉపకరించుటేగాక వారి కృతజ్ఞతకు ఎంతయు పాత్రులైయున్నారు.

(సశేషము)

(7 వ పేజీ తరువాయి)

సుమారు 150 కోట్ల సంవత్సరాలకు చెందినవి. భూమట్టానికి పై పెళుసు రాళ్ళపొరల ఆవిర్భావానికి కల కాలవ్యత్యాసం ఎపార్చియన్ అసహజతను, 'నిరూపిస్తుంది. ఇది రెండవ ఘాట్ రోడ్డులో (కొండకు పోయే మార్గం) 18 వ కి మీ వద్ద, రోడ్డు మెట్ట ప్రదేశాన్ని చేరేచోట ఉంది.

ఈ శిలాతోరణాన్ని జాతీయ భౌగోళిక స్మారక చిహ్నంగా ఏర్పాటుచేసే నిర్ణయం జరిగింది. దేశంలో, ఇలాంటి స్మారక విశేషాలు ఇంతవరకు 13 మాత్రమేవున్నై. యురేసియా మొత్తంమీద 250 కోట్ల సంవత్సరాలచరిత్రగల్గిన ఈఏకైక శిలాతోరణం స్మారక విశేషాలలో 14 వది కాగలదు.

ఈ జాతీయ స్మారక విశేషాన్ని నిర్వహించేందుకుగాను తిరుమల తిరుపతి దేవస్థానం ఈక్రింది చర్యలు తీసుకుంటున్నది.

1 ఈ శిలాతోరణానికి చుట్టు 400 × 400 మీటర్ల ప్రాంతాన్ని ముళ్ళతీగె లేదా యోగ్యమైన ఇతర విధానాల ద్వారా వేరు చేసి, ఉద్యానవనాన్ని నెలకొల్పటం.

2. ఈ తోరణం సరిగా నిలిచే విధంగా స్తంభాలు, వ్రగెరాల ద్వారా ఆధారం కల్పించటం.

3. మైక్రోవేవ్ స్టేషనుకు పోయే బాట నుండి, ఈ ప్రాంతానికి రోడ్డు నిర్మాణం పూర్తి చేయించటం.

(4) తిరుమల శ్రీవారి ఆలయం వద్ద తదితర యోగ్యప్రదేశాలలో ఆలయాని కతి సమీపంలో ఉన్న ఈ సహజ శిలా సేతువు ఉనికినిగూర్చి సమాచార ఫలకాలు ఏర్పాటు చేయటం.

(5) ఈ జాతీయ స్మారక విశేషాన్ని నిర్వహించటం.

## యాత్రికాకర్షణం

ఈ అపూర్వ భౌగోళిక విశేషాన్ని భక్తులు, యాత్రికులు గుంపులు గుంపులుగా సందర్శిస్తున్నారు. మానవోద్ధరణకుగాను శ్రీ వేంకటేశ్వర స్వామివారు తిరుమలపై స్వయంభువుగా అవతరించారనేది ప్రజలప్రగాఢవిశ్వాసం. ఆలయంలో శ్రీవారి ధ్రువమూర్తి (మూలవిరాట్) ఉన్నంత ఎత్తుగానే ఈ శిలాతోరణం కూడా ఉండటం ఒక వింత. బహుశా అందువల్లనేనేమో సర్వజగన్నాథుడు తిరుమలపై విశిష్టాలౌకిక శక్తియుక్తుడుగా వెలసి, ఈ శిలాతోరణం ద్వారా ప్రత్యక్షమై తన దైవీశక్తి సంపదను క్రమంగా విగ్రహించు కొని భౌగోళిక అసహజతా మార్గంద్వారా ఈనాడు సర్వశోభాయమాన ఆకృతిగా స్వామివారున్న ప్రదేశంలో నెల వేర్పరచుకొన్నారన్న విశ్వాసానికి లోనౌతున్నారు. ఒకానొక బలవత్తర ప్రాకృతిక శక్తి ఈ శిలాసేతువుకు, భౌగోళిక అసహజతకు కారణమన్న విషయంలో సందేహంలేదు. శ్రీ వేంకటేశ్వరస్వామి స్వయంభువుగా దివి నుండి భువికి దిగిన విషయం దృష్ట్యా పరిశీలించినప్పుడు ఇటువంటి అపురూప శిలాతోరణం, అసాధారణ భౌగోళిక అసహజత తిరుమలలో ఉండటం ప్రత్యేక ప్రాముఖ్యాన్ని కల్గిస్తుంది.

తెలుగుసేత — "నాగరాజ్"

---

(8 వ పేజీ తరువాయి)

షవ్యుడు బ్రహ్మ అయాడు. బ్రహ్మ కమలంలోఉండి ప్రకాశిస్తున్నాడు. ఆయన నుంచి ప్రభానిలయుడు రుద్రుడు వెలువడ్డాడు.

రాజు ఆరక్తనేత్రునీ, కాలానలసమానకాంతిగలవానినీ చూచి "విశ్వేశ్వరుడు కనబడడు. ఇది సదా యోగులమాయ.[28] శ్రీమంతుడు హరి సర్వవ్యాపి" అన్నాడు.

ఆఅనటం పూర్తి అయేసరికి రాజసభలో,[29] నల్లులూ, దోమలూ, పేలూ, తుమ్మెదలూ పక్షులూ, పాములూ,[30] గుర్రాలూ, ఆవులూ, ఏనుగులూ, సింహాలూ, పెద్దపులులూ, నక్కలూ, లేళ్లూ అడివిలో ఊళ్లలో ఉండే ఇతరపశువులూ, కీటకాలూ, రాజభవనంలో అంతటా కోట్లకొలదీ కనిపించాయి భూతధారిణీ,[31] ఆప్రాణిజాలాన్ని చూచి రాజు మనస్సులో విస్మయపడి 'ఏమిటిది' అనుకొనే టంతలో ధీశాలులైన కపిలశైగీషవ్యుల మాహాత్మ్యమని తెలుసుకొన్నాడు.[32] అంజలిపుటం చేసి రాజు అశ్వశిరుడు భక్తితో ఆఋషులనిద్దరినీ ద్విజసత్తములారా? 'ఏమిటిది' అని అడిగాడు,[33]

ద్విజులిద్దరూ చెప్పారు :

రాజా, మమ్మల్నిద్దరినీ అడిగావు, ఇహంలో విష్ణువును ఆరాధించటం ఎలా? ఆయన ఎలా లభిస్తాడు? అని. అందువల్ల మహారాజా, ఇది నీకు చూపించాము,[34] రాజా : నీకు చూపించినవివి సర్వజ్ఞుని గుణాలు, ఆనారాయణదేవుడు సర్వజ్ఞుడు కామరూపి [35] సౌమ్యుడు ఎక్కడైనా సరే ఉండి మనుజులకు లభిస్తాడుట. ఆయనఆరాధనం పరమార్థం అవుతుంది.[36] అయితే, ఆపరమాత్మ, జగత్పతి సర్వశరీరాలలోనూ ఉంటాడు. స్వదేహంలోనూ భక్తివల్ల కనిపిస్తాడు. ఒక్కచోటనే ఉండేవాడు కాడు.[37] ఇందుకే పరమాత్మదేవునిరూపం మాకూ నీకూ తెలియటానికి చూపబడింది రాజేంద్ర.[38] ఈ విధంగా జనేశ్వరా, విష్ణువు నీదేహంలోనూ, మంత్రుల శరీరంలోనూ, భృత్యసంఘంబడళ్లలోనూ, అంతటా ఉన్నాడు, చూపించిన దేవాదులూ,[39] పశువులూ, కీటసంఘాలూ,— ఆవీ విష్ణురూపాలే నృపా భావనను దృఢంచేసుకోవాలి, శ్రీహరి సర్వమయుడు, కనుక [40] ఆయన సాటిఅయిన భూతం లేదనే భావంతో సేవించాలి, రాజా, ఇది నీజ్ఞానసద్భావం. నీకు చెప్పాము.[41] పూజనీయుడైన నారాయణుని పరిపూర్ణ భావంతో, స్మరించు, పూజోపహారాలతో, ధూపాలతో, బ్రాహ్మణులకు తృప్తి కలిగించటముతో, బాగా కుదిరినధ్యానంతో, తత్క్షణమే బాగా లభిస్తాడు పరమేశ్వరుడు.[42]

**ఇది శ్రీవరాహపురాణంలో ఆదికృతవృత్తాంతంలో 'నారాయణవ్యాపకత్వవర్ణనం' అను నాల్గవఅధ్యాయం**

# హరివాసరవ్రతమాహాత్మ్యము

దీని మాహాత్మ్యము బ్రహ్మాండపురాణమునందుఁ జెప్పఁబడినది. యుధిష్ఠిరుడు ప్రార్థింపగాఁ బూర్వము నారదునకు బ్రహ్మ చెప్పిన విషయమును శ్రీకృష్ణపరమాత్మ ఆతనికిఁజెప్పియుండెను. హరివాసరముకంటెఁ బవిత్రమయిన దీ లోకమునందేదియునులేదు. సమస్తపాపములు క్షీణించుటకు సర్వప్రయత్నముల నేకాదశీవ్రతమాచరింప వలయును. ఈ వ్రతము సర్వకామములను దీర్చునదియుఁ బాపములఁ ద్రుంచునదియునై మహాపుణ్యవ్రతమైయున్నది ఈ యుత్తమవ్రతము నారాయణుని ప్రీతికి నవశ్యముగాఁ జేయఁ దగినది.

వైవశ్వతవంశ సంభవుఁడైన మాంధాతయను నామముగల రాజర్షియగు చక్రవర్తి సత్యసంధుఁడును. పరాక్రమవంతుఁడునై ప్రజలను తనయౌరస పుత్రుల వలెనే పరిపాలించుచుండెను. అతని రాజ్యమునందు దుర్భిక్షముగాని, వ్యాధులుగానిలేక ప్రజలందఱును ధనధాన్య సంయుక్తులై యుండిరి. ఆ నృపాలునియొక్క కోశాగారము అన్యాయోపార్జితమైన ధనముచేఁ గాఁక, న్యాయార్జితమైనట్టియు, ప్రజాపీడన రహితమయినట్టియు నైన ధనముచే నింపఁబడుచుండెను.

ఈప్రకారము ధర్మపరిపాలనము చేయుచుండగా ననేకవత్సరములు గతిఁచెను. అంతనొకానొక సమయమున పాపకర్మయొక్క పరిపాకమున మూఁడు సంవత్సరములు అనావృష్టిచే సస్యరహితమై దుర్భిక్షము ప్రబలి ప్రజలు క్షుధార్తులై స్వాహాస్వధావషట్కార వేదాధ్యయన వివర్జితులై నృపాలుని సన్నిధికివచ్చి— ఓరాజా!

ఆపోనారా ఇతిప్రోక్తాః పురాణేషు మనీషిభిః।
అయనం తా భగవతస్తేన నారాయణః స్మృతః॥

అని వినుచున్నాము. విష్ణుభగవానుఁడు పర్జన్యరూపుఁడు. అంతటను వ్యాపించియున్నవాఁడు. ఆతనిచే వర్షము కలుగును. దానిచేనన్నమును, అన్నమువలనఁ బ్రజలునుగల్గుచున్నారు. కాఁబట్టి వర్షములేనియెడలఁబ్రజలుక్షయమును బొందెదరు. కనుకయోగక్షేమము లెటులఁగల్గునో నాప్రకారముగాఁజేయవలెను" అని ప్రార్థించిరి.

అంతట నా మాంధాత "మీరుచెప్పినది వాస్తవం అన్నం. పరబ్రహ్మ స్వరూపము 'అన్నైనేవా సర్వేప్రాణా మహీయన్తే' అన్నట్లుగా నన్నము వలననే సమస్తమును ప్రతిష్ఠింపఁబడినది. అన్నమువలననే సమస్తభూతములును పుట్టుచున్నవి. అన్నముచేతనే జగత్తంతయును వర్తింపఁబడుచున్నది. ఈ ప్రకారమేశ్రుతి, స్మృతి. పురాణాదులుచాటుచున్నవి. 'నృపాణామపచారేణ ప్రజానాంపీడనం భవేత్' అనినట్టు రాజుయొక్క అపరాధముచేతఁబ్రజలకుఁగష్టములు సంభవించును. బుద్ధిచే నాలోచింపగా నాయొక్క స్వయం కృతాపరాధమేదియుఁ గానరాదు. ఐనను ప్రజాహితము కొఱకుఁ బ్రయత్నింతును" అని ప్రజలతోఁబల్కి దృఢమనస్కుఁడై భగవానుని స్మరించుచు అరణ్యమునకుఁబోయి యటఁ గల మున్యాశ్రమములను దిలకించుచు బ్రహ్మతేజముతోఁ బ్రకాశించుచున్న బ్రహ్మసుతుఁడైన అంగిరోమహర్షినిజూచి సాష్టాంగ నమస్కారముజేసెను.

అంతటనామహర్షి కుశల ప్రశ్నానంతరము, అరణ్యమునకు రాజాగమన కారణమునడుగగా, ధర్మవిధానముగా భూమిని పరిపాలించుచున్నపుడు యే కారణముచేతనోయనావృష్టిఁగలిగినదనియు. నాకు ఈ సంశయమును నివృత్తిఁజేయుమనియుఁ బ్రజలకు యోగక్షేమము గలుగునటుల నీ దుర్భిక్షమునుండి విముక్తిజేయుఁడనియు రాజు అంగిరోమహర్షిని ప్రార్థింపగా నామహర్షి, యుగములలోఁగృతయుగము శ్రేష్ఠమయినదనియు. ధర్మము నాలుగు పాదములపై నడచుననియు, బ్రాహ్మణేతరులు తపోయుక్తులుగ నున్నవారనియు, నతని రాజ్యమందు శూద్రుడు తపస్సు చేయుచున్నవాఁడుగాన అకార్యకరణముచే మేఘములు వర్షించుట లేదనియు నావృషలుని వధించినచో దోషము శాంతించుననియుఁజెప్పెను.

ఈ విధముగా మహర్షిపల్కఁగా. రాజు "తపముచేయుచున్న వానిని నేను వధింపఁజాలను. ఈ యుపద్రవనాశమునకు మఱియొక ధర్మమార్గము నుపదేశింపుడు" అని ప్రార్థించెను. మహర్షి, యీ యాషాఢమాస శుక్లపక్షమునందు వచ్చు "పద్మ" యనెడి యేకాదశీ వ్రతమాచరించిన ధ్రువముగా వర్షించును. ఇయ్యది సకలసిద్ధిఫలప్రదాయకము. ఉపద్రవమును నాశనమొనరించును. కావుననీవు ప్రజాసహితముగ నీయేకాదశీవ్రతమాచరింపుమని మునిపుంగవుఁడుపదేశింపగా రాజు సంతసించి. తననగరికివచ్చి యీ యేకాదశీదినమునందు తాను ప్రజలతోఁజాతుర్వర్ణ్యములతోఁగలసి వ్రతమాచరించెను. ఆ ప్రభావముచే సువృష్టిఁగలిగి సస్యములు ఫలించి ప్రజలందఱును సౌఖ్యమునొందిరి.

ఈ "పద్మావ్రతము" భుక్తిముక్తిప్రదము, లోకమునకు సుఖదాయకమునై యున్నది పఠనశ్రవణములచే సర్వపాపములును నశించును. ఇదియే "శయనైకాదశి" యనికూడప్రసిద్ధి పొందినది.

## చాతుర్మాస్య వ్రతము

శ్రీమన్నారాయణుఁడు ఈ యేకాదశి నుండి శయనించును. కార్తీక శుద్ధైకాదశికి లేచును. ఈ నాలుగు మాసములు 'శయన వ్రతము' "చాతుర్మాస్యవ్రతము" అను పేర్ల ప్రఖ్యాతినొందినవి. ఈ వ్రతమాహా

శ్రీ కంఠం మాధవరావు,
అల్లీపురం, నెల్లూరు.

త్మ్యము భవిష్యత్పురాణ మునందు చెప్ప బడియున్నది. విష్ణుప్రసాదసిద్ధ్యర్థము విష్ణు శయనవ్రతము మోక్షమునందు కోర్కెఁ గలవారలవశ్యము చేయఁదగినది ఆషాఢశుద్ధదశమి నాఁడేకభుక్తమును, ఏకాదశీదినమున నుపవాసమునుచేసి శంఖ చక్ర గదాధరుఁడును, పీతాంబరుడు నైన శ్రీమహావిష్ణువు యొక్క ప్రతిమను స్థాపించి, పర్యంకమందు శయనింపఁజేసి, యితిహాసపురాణజ్ఞులు వేదపారగులునైన బ్రాహ్మణులచే దధిక్షీరఘృతక్షౌద్రజలము లచే స్నాపనము గావించి, గంధముచే లేపనముజేసి, ధూపదీపముల నమర్పించి మంత్రములచేఁ బుష్పములతోఁబూజించి—

" సుప్తేత్వయి జగన్నాథే జగత్సుప్తం చరాచరమ్ ।
విబుద్ధేత్వయి బుద్ధ్యేత జగత్సర్వం చరాచరమ్ " ॥

అని యీప్రకారముగా విష్ణుప్రతిమను పూజించి, కృతాంజలిపుటుఁడై

" చతురో వార్షికాన్మాసాన్దేవస్యోత్థాపనావధి ।
గ్రహిష్యేనియమాఞ్శుద్ధా న్నిర్విఘ్నాన్కురు మేప్రభో " ॥

అనిప్రార్థించి సంశుద్ధమానసుఁడై స్త్రీగాని, పురుషుఁడుగాని విష్ణుభక్తుఁడైనవాఁడు ధృతవ్రతుఁడై నియమముతోఁ గార్తీకశుద్ధ ద్వాదశీ దినమునకు వ్రతసమాప్తి చేయవలెను. ఈ వ్రతమొక్క పర్యాయము సల్పినను సమస్త పాతకములనుండి విముక్తుఁడగును. ప్రతి సంవత్సరము నీ వ్రత మాచరించువాఁడు దేహాంతమున సూర్య తేజముతో సమానమయిన విమానమునెక్కి, విష్ణులోకమున ఆనందముతో సంచరించుచుండును. దేవాలయమున ప్రతి నిత్యమును మార్జన జలసేచన గోమయ ప్రలేపనములతో రంగవల్ల్యాదు లుంచుట యెవరీ నాల్గు మాసములు చేయుదురో వారు ఏడుజన్మముల వఱకు విప్రేంద్రులై సత్య ధర్మపరులు గాఁగలరు. దధిక్షీర ఆజ్య మధుశర్కరలచే నెవడు విధి విధానముగా దైవమును స్నాపనము చేయునో వాఁడు విష్ణు సారూప్యము నొంది అక్షయ సుఖము నొందును. దేవ బ్రాహ్మణులను గంధ పుష్పాక్షతాదులచేఁ బూజించి నైవేద్యం బిడిన వారక్షయమయిన సుఖమనుభవించి యంత్యమున విష్ణు లోకమును పొందుదురు.

ఈ నాల్గు మాసములను హరిని తులసిచే నర్చించి కాంచనముచేఁ దులసి దళమును జేయించి బ్రాహ్మణునకు దానమొసగిన బంగారు విమానమునెక్కి విష్ణు లోకమునకుఁ బోవును. దైవమునకు ధూప దీపముల నిచ్చి వ్రతానంతరము వానిని బ్రాహ్మణునకు దాన మొసఁగిన శ్రీమంతుఁడై సౌభాగ్యమయిన జన్మమబొందును. దైవ బ్రాహ్మణుల ఇంటిముందట సంధ్యా దీపమును బెట్టి సమాప్త్యనంతర మద్దానిని వస్త్ర కాంచనములతో నెవరు దానము జేయుదురో వారిహ లోకమున దేజస్వంతులై వైకుంఠము నొందుదురు. శ్రద్ధా సమన్వితులై యెవ్వరు విష్ణు పాదోదకమును త్రావుదురో వారు విష్ణులోకము నొంది తిరిగి నరజన్మము నొందరు. ఈ చాతుర్మాస పర్యంతము ఎవఁడు ప్రతినిత్యమును పురాణములనుగాని, ధర్మశాస్త్రములనుగాని వినుచు ఆపుస్తకమును వస్త్ర సహితముగ దానము చేయునో వాఁడు పుణ్య, ధనవంతుడై, భోగియై సత్యశౌచ పరాయణుడై జ్ఞానవంతుడై లోకమునందు విఖ్యాతి నొందును.

చాతుర్మాస్యమునందు ప్రతి దినమును వ్యాహృతులతో గాయత్రి మంత్రముచే తిలాహోమమును అష్టోత్తరశతముగాని ఇరువది యెనిమిది పర్యాయములుగాని చేయుచు, సమాప్తిదినమందు తిలపాత్రమును విప్రునకు దానముచేసిన మనోవాక్కాయములచేఁజేసిన పాపము, సంచిత పాపము నశియించి రోగరహితుఁడై సత్సంతానము బొందును. అన్నహోమముజేసి సమాప్తిదినమున ఘృతకుంభమును వస్త్ర కాంచనములతోదానముజేసిన ఆరోగ్యము, దివ్య కాంతియు, సౌభాగ్య సంపదలను బొంది శత్రుక్షయమునుబొంది బ్రహ్మతో సమానుఁడగును. శ్రీమహావిష్ణువునకుఁ బ్రియకరమయినట్టియు, శుభప్రదమైనట్టి యుఁదులసిని యెవరుధరియింతురో వారు సమస్త పాతకములనుండి విముక్తులై విష్ణులోకము నొందుదురు. శాకమూల ఫలములతోఁ జాతుర్మాస్య వ్రతము సలిపి, సమాప్తి దినమున గోదానము జేసినవారు తప్పక విష్ణుమందిరమునకుఁ బోవుదురు. పయోవ్రతముచేయువాఁడు సనాతనమైన బ్రహ్మలోకమును పొందును. ఈ చాతుర్మాస్య వ్రతవిషయమై యింకను విశేషముగా ఫలము చెప్పఁబడి యున్నది. శ్రీభగవానుఁడు శయనించిన యీనాల్గు మాసములు నియమముగా వ్రతము జేయుటచేఁ బొందగలుగు ఫలితమింత యని చెప్పనలవికాదు. ఈవ్రతముచే విష్ణుప్రీతిని తృప్తిని బొందును.

శ్లో॥ దుగ్ధాబ్ధివీచి శయనే భగవా ననంతో
యస్మిన్దినేస్వపితిచాథ విబుధ్యతే చ ।
తస్మిన్న నన్యమనసా ముపవాస భాజాం
పుంసాం దదాతిచ గతిం గరుడా సనో ఽసౌ ॥

ఇద్దానిని బ్రహ్మ నారదునికి ఉపదేశింపఁగా నావృత్తాంతమును శ్రీకృష్ణభగవానుఁడు యుధిష్ఠిరునకుఁ జెప్పెను.

హరిః ఓం తత్ సత్

✳



# శ్రీగోవిందరాజస్వామి ఆలయం

## తిరుపతి

### దర్శనాదిక కార్యక్రమాల వివరాలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదయం. | 5—00 | నుండి | 5—30 | వరకు | సుప్రభాతం |
| | 5—30 | ,, | 7—00 | ,, | సర్వదర్శనం |
| | 7—00 | ,, | 7—30 | ,, | శుద్ధి |
| | 7—30 | ,, | 8—00 | ,, | తోమాలసేవ |
| | 8—00 | ,, | 8—30 | ,, | అర్చన |
| | 8—30 | ,, | 9—00 | ,, | 1 వ గంట శాత్తుమొర |
| | 9—00 | ,, మ. | 12—30 | ,, | సర్వదర్శనం |
| | 12—30 | ,, | 1—00 | ,, | 2 వ గంట |
| మ. | 1—00 | ,, సా. | 6—00 | ,, | సర్వదర్శనం |
| | 6—00 | ,, | 7—00 | ,, | రాత్రి కైంకర్యాలు, గంట శాత్తుమొర |
| | 7—00 | ,, | 8—45 | ,, | సర్వదర్శనం |
| రాత్రి | 9—00 | | | | ఏకాంతసేవ |

### ఆర్జితసేవల వివరాలు:

తోమాల, అర్చన ఏకాంతసేవలకు: ఒక్కొక్కరికి ఒక్కొక్కదానికి రు. 4-00,
ప్రత్యేకదర్శనం: రు. 2/– (ఒక్కొక్కరికి) హారతి: రు. 1/-

### సర్వదర్శన సమయంలో క్రింది అనుబంధ దేవాలయాలలో ఆర్జితసేవల వివరాలు.

1) పార్థసారథిస్వామి ఆలయం; 2) శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం; 3) ఆండాళ్ళు ఆలయం;
4) పుండరీకవల్లి ఆలయం; 5) శ్రీ ఆంజనేయస్వామి ఆలయం (బయట బుగ్గవద్ద)
6) సంజీవరాయస్వామి ఆలయం (హాత్తిరాంజీమఠం ఎదురు)

} అర్చన: 0-75
హారతి: 0-25

### ఆర్జిత వాహనాలు

| | | | |
|---|---|---|---|
| తిరుచ్చి ఉత్సవం<br>పెద్దశేషవాహనం | రు. 63/- | చిన్నశేషవాహనం<br>గరుడ, హనుమంత,<br>హంసవాహనములు. | రు. 33/- |

### ఆర్జితం: అన్నప్రసాదాలు (చెలుపులు)

శీరా = రు. 155-00, పులిహోర = రు. 50-00 దధ్యోదనం = రు. 40-00, పొంగలి = రు. 55-00,
చక్కెరపొంగలి = రు. 65-00, శాకరబాత్ = రు. 85-00, కేసరిబాత్ = రు. 90-00, 1/4సోలదోసె = రు. 35-00

తి. తి. దేవస్థానం.

రు. 500/- వ్యక్తిగత ధర్మనిధిని భక్తుల మూలంగా ఏర్పాటుచేసి ఒక్కొక్కదానిపై వచ్చే వడ్డీతో 20 లడ్డులు లేదా 15 వడలను, ఆ గృహస్థు అనుకున్న రోజున, బీదలకు ఉచితంగా పంచిపెట్టే పథకాన్ని, అదేవిధంగా మరొక రు. 500/- నిధిపై వచ్చే రు. 40/-తో గృహస్థు అనుకొన్న రోజున, క్యూలైన్లలోని యాత్రికులకు ఉచితంగా అన్నపుపొట్లాలుపంచేపథకాన్ని ఏర్పాటుచేసేందుకు సూత్రప్రాయంగా ఆమోదించటమైనది.

తిరుమల శ్రీవారిఆలయంలో అంగప్రదక్షిణం చేసేవారికి, ఇప్పటివలే ఒకసారి మాత్రమే గాక ఉదయం 3 గం॥ 4 గం॥ మధ్యలో ఏ సమయంలోనైనాసరే అనుమతించాలని నిర్ణయించటమైనది.

యాత్రికావసరాల దృష్ట్యా దేవస్థాన కార్యాలయాలు ఇప్పుడున్న వేళలలోనే పనిచేయాలని తీర్మానించటమైనది.

తిరుపతి తిరుమలలో పురావస్తుప్రదర్శనశాలలను నెలకొల్పాలని తీర్మానిస్తూ పథకాన్ని ఆమోదించటమైనది.

ఉద్యోగంలో ఉంటూ, కర్తవ్యాన్ని నిర్వహిస్తూ మరణించిన ఉద్యోగుల అంత్యక్రియలకు రు. 500/- విరాళం మంజూరు చేస్తూ ప్రభుత్వపు యం. యస్. 104/- జి. ఎ. (ఎ. ఆర్. & టి.) 3-2-78 ఉత్తరువును దేవస్థానానికి కూడ వర్తింపజేయ నిర్ణయించటమైనది.

చిత్తూరు జిల్లాలో వెల్లూరులో కాక ఇతర ప్రాంతాలలో పనిచేస్తున్న దేవస్థాన ఉద్యోగులకు (సమాచార కేంద్రాలు, ఆంధ్రాశ్రమం, ఋషీకేశ్, న్యూఢిల్లీ, మినహా) నెలకు రు. 15/- తగ్గకుండా రు. 75-/ మించకుండా మూలవేతనంలో 10% ప్రత్యేక వేతనముగా ఇచ్చేందుకు నిర్ణయించటమైనది.

తిరుమలలో దేవస్థాన కార్యకలాపాలకు సంబంధించిన సమావేశాలు తప్ప, ఇతర సమావేశాలు గాని, యాత్రికులకు ఇబ్బంది కలిగించే ఆడంబరపు వివాహాలను కాని అనుమతించరాదని నిర్ణయిస్తూ ఈ విషయంగా తగిన చర్య తీసుకోవలసిందిగా కార్యనిర్వహణాధికారిని కోరటమైనది.

శ్రీ వేంకటేశ్వర కళాక్షేత్రానికి ఇకముందు శ్రీ వేంకటేశ్వర కళాభారతిగా పేరుంచేందుకు నిర్ణయిస్తూ తాత్కాలికంగా ఆ కార్యక్రమానికిగాను రు. 2 లక్షలు మంజూరు చేయటమైనది.

శ్రీ వేంకటేశ్వర జూనియర్ కళాశాలలోని అంధవిద్యార్థులకు పాఠాలు చదివే వారికిచ్చే భత్యం (రీడర్ ఛార్జీ) ను నెలకు రు. 30/- నుండి రు. 60/- కి పెంచటమైనది.

శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యం అనే నృత్య నాటకాన్ని తయారు చేసేందుకు గాను న్యూఢిల్లీలోని నాట్య బాలెట్ సెంటర్ వారికి రు. 1,54,600/- ఆర్థిక సహాయం చేయటమైనది.

మద్రాసు విశ్వవిద్యాలయ తెలుగు విభాగంలో, ఇతర పరిశోధకులతో సమానంగా రెండు విద్యార్థి వేతనాలు కల్పించటమైనది,

అన్నమాచార్య ప్రచార ప్రణాళిక క్రింద అన్నమయ్యకథ అనే సంగీతరూపకాన్ని లాంగ్ ప్లే రికార్డులతో తయారు చేయించాలని నిర్ణయించటమైనది.

తిరుమల తిరుపతి దేవస్థానం వారి గ్రంథప్రచురణలన్నింటిని రాష్ట్రంలోని పబ్లిక్‌లైబ్రరీలకు ఉచితముగా సరఫరా చెయ్యాలని తీర్మానించడమైనది

★

# నిర్వాహక మండలి నిర్ణయాలు

6—7—79

శ్రీవారి లడ్డు ప్రసాదాన్ని ఇకనుండి పాలిథిన్ సంచులకు బదులుగా లోగడవలె కాగితపు సంచులలోనే వేసి అమ్మాలని నిశ్చయించటమైనది.

దేవస్థానం ముద్రణాలయాన్ని విస్తృత పరిచేందుకు, ఇప్పుడున్న ముద్రణాలయాన్ని కేవలం దేవస్థాన పరిపాలనకు సంబంధించినవాటి ముద్రణకుపయోగించాలని, పరిశోధనసదుపాయాదులతో సహా అన్ని ఆధునిక ప్రక్రియలు, సదుపాయాలుగల వేరొక ముద్రణాలయాన్ని, గ్రంథప్రచురణల కేర్పాటుచేయాలని నిర్ణయిస్తూ అందుకుగాను అలిపిరి వద్ద 10 ఎ. స్థలాన్ని కేటాయించటమైనది.

దేవస్థానం ముద్రణాలయమునకుగాను కాగితం మడిచే యంత్రానికి గాను రు. 60,000/- మంజూరు చేయటమైనది.

ఆలయం సదస్సులలోని కార్యక్రమాలను కొండకు వచ్చి పోయే యాత్రికులు వినేందుకు వీలుగా తిరుమల నుండి తిరుపతిలో అలిపిరివద్ద గాలిగోపురం వరకు తీగలద్వారా దూరశ్రవణ యంత్రాలను ఏర్పాటు చేసేందుకుగాను రు.1,00,000/- మంజూరు చేయటమైనది

తిరుచానూరులోని పద్మావతి అమ్మవారి ఆలయంలో ఆర్జిత తిరుప్పావడాసేవ ప్రారంభించేందుకు, రుసుము రు. 1500/- గను, 12మందికి సేవ దర్శించేందుకు అనుమతించాలనీ నిర్ణయించటమైనది.

# వార్తాలహరి

## హిందూధర్మంపై వేసవిపాఠశాల.

ధార్మిక ప్రబోధంపట్ల దేశంలోని యువతరంలో ఆసక్తిని పెంపొందించేందుకు దేవస్థానంచేస్తున్న ప్రయత్నాలు అందరికీ తెలిసినవే! విశిష్టమైన భారతీయ దృక్పథాన్ని యువతరంలో ప్రబోధించి వారి మానసిక వికాసానికి తోడ్పడేందుకు, ధార్మిక నైతిక ఆధ్యాత్మిక విలువలను సూక్ష్మాతిసూక్ష్మరూపంలోనైనా అందించి వారి హృదయాలను ప్రభావితం చేసేందుకుగాను అందుకు ముఖ్య ఆధారమైన ఉపాధ్యాయులకు భారతీయ ధార్మిక సిద్ధాంతాలలో తగిన శిక్షణ గరిపేందుకు గాను దేవస్థానం వేసవి పాఠశాలలను తిరుమల తిరుపతిలలో నిర్వహిస్తున్నది. అలాంటి వేసవి పాఠశాలనొకదాన్ని హైదరాబాద్‌లోకూడా 15-5-79నుండి 29-5-79 వరకు దేవస్థానం నిర్వహించింది. వేదాంత వర్ధనీ సంస్కృత కళాశాల ప్రాంగణంలో హిందూధర్మ ప్రతిష్ఠానం సహాయోగంతో కళాశాల అధ్యక్షులు శ్రీ గొడవర్తి శ్రీ రామమూర్తిడైరెక్టర్‌గాపక్షంరోజుల పాటు ఏర్పాటైన ఈ కార్యక్రమంలో ఆంధ్రప్రదేశ్ దేవాదాయమంత్రి శ్రీ పి. వి. చౌదరి ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. రాష్ట్ర ఉన్నత విద్యాశాఖ డైరెక్టర్ శ్రీ వి. రామచంద్రన్ అధ్యక్షత వహించారు. సభకు స్వాగతం చెప్తూ శ్రీ శ్రీరామమూర్తి ఈకార్యక్రమఅవసరాన్ని గురించి వివరించి పాఠశాలల విద్యాప్రణాళికలో మత ధార్మిక విషయాలు పొందుపరచినపుడు ఆ విషయాలపై విద్యార్థులకు జిజ్ఞాస పెరగడమేగాక వారి ప్రవర్తనకూడా ధర్మబద్ధమౌతుందన్నారు. సభాధ్యక్షులు శ్రీ రామచంద్రన్ ఉపాయజ్ఞుడైన ఉపాధ్యాయుడు ధార్మిక విషయాలను సందర్భానుసారంగాసులభ శైలిలో బోధించ వచ్చునని అన్నారు

ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖ పూర్వాధ్యక్షులు డాక్టర్ దివాకర్ల వెంకటావధాని గురుభక్తియొక్క విశిష్టతను సోదాహరణంగా వివరించారు. శ్రీ మటింగంటి శ్రీరంగాచార్య శ్రవణం అన్నదానిని గురించి శ్రీ కేశవపంతుల నరసింహాశాస్త్రి ధర్మానుష్ఠానాన్ని గురించి ఉపన్యసించారు.

ఈ విధంగా 29-5-79వరకు జరిగిన కార్యక్రమాలలో సర్వశ్రీ బి. ఆర్. శాస్త్రి, పుల్లెల శ్రీరామచంద్రుడు, ఎస్. బి. రఘునాథాచార్య, జి. వి. సుబ్రహ్మణ్యం, డి. అర్క సోమయాజి, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, డోంగ్రే వీరేశ్వరశాస్త్రి, సన్నిధానం లక్ష్మీనారాయణశాస్త్రి, ముకురాలరామారెడ్డి, ఓగేటి అచ్యుత రామశాస్త్రి, ఎన్. కృష్ణమూర్తిశాస్త్రి ఎస్. విశ్వనాథశాస్త్రి, పి. బి. వేదాంతాచార్య, కె. సీతారామాంజనేయులు, ఇరివెంటి కృష్ణమూర్తి, కె. సుప్రసన్నాచార్య, వైద్యరత్న ప్రద్యుమ్నాచార్య, తిరుమల రామచంద్ర వి. రామానుజాచార్య. కె. లక్ష్మణమూర్తిశర్మ, ఎస్.వి. జోగారావు, ప్రసాదరాయ కులపతి, రేమళ్ళ సూర్యప్రకాశశాస్త్రి, లంకా సీతారామశాస్త్రి, కె. హెచ్. నరసింహశాస్త్రి, ఎం. చంద్రశేఖరశాస్త్రి, కృష్ణాచార్య వర్కేడ్కర్ డా. కె. కమలవంటి ప్రముఖులు పాల్గొన్నారు. ఈ శిక్షణ శిబిరాన్ని దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్, ఉపకార్య నిర్వహణాధికారి శ్రీ నరసింహారావు, ఇంకా అనేక ప్రముఖులు సందర్శించారు.

29-5-79న జరిగిన శిక్షణ శిబిర సమాపనోత్సవ కార్యక్రమానికి ఆంధ్రప్రదేశ్ న్యాయశాఖామంత్రి శ్రీ నాదెండ్ల భాస్కరరావు అధ్యక్షత వహించి ఈ ధార్మిక ప్రచార కార్యక్రమాన్ని ప్రశంసించారు. శ్రీ స్వామీ విరూపాక్షానంద తమ స్నాతకోపన్యాసంలో వేదాల ప్రామాణ్యాన్ని గురించి ప్రసంగించారు, మానవసేవను మాధవసేవగా భావించాలని ప్రబోధించారు. అన్నమాచార్య ప్రాజెక్టుగాయని శోభారాజు కచ్చేరి శ్రీ సి. వి. శేషాచార్యుల వందన సమర్పణతో ఈకార్యక్రమం సమాప్తమైనది.

వేదికపై దేవాదాయమంత్రి శ్రీ పి. వి. చౌదరి, సర్వశ్రీ దివాకర్ల, శ్రీరామచంద్ర, శ్రీరామమూర్తి.



## పురావస్తు ప్రదర్శనశాలలు

తిరుమల తిరుపతి ప్రాంతం అతి పవిత్రమైన ప్రదేశమేగాక చారిత్రకంగాకూడా

చాలా ప్రఖ్యాతిచెందినది. ఇక్కడ దేవాలయాలలో ప్రతి గోడమీద అనేక శాసనాలు, కళావిశేషాలు కన్పించడమేగాక భౌగోళిక శాస్త్రరీత్యాకూడా ఈ ప్రాంతాలు చాలా పురాతనమైనవని ఇటీవల పరిశోధనలలో వెల్లడైంది. ఇంతటి ప్రాముఖ్యంగల ఈ ప్రదేశంలో పురావస్తు ప్రదర్శన కేంద్రానికి గల ఆవశ్యకతను గుర్తించిన దేవస్థానం త్వరలో తిరుమల తిరుపతిలలో ఒక్కొక్క పురావస్తు ప్రదర్శనశాలను ప్రారంభించనున్నది. దేవస్థానం దేవాలయాలకు సంబంధించిన ఒక ప్రదర్శనశాల నవంబర్ 1 తేది నాటికి ప్రారంభం కావచ్చు. తిరుమలపై నెలకొల్పే ఈ ప్రదర్శనశాల శ్రీవారి ఆలయానికి ఎదురుగావున్న వెయ్యిస్తంభాల మంటపంలో ఏర్పాటౌతుంది. ఇందులో తిరుమల భౌగోళిక వృక్ష సంబంధ విశేషాలు, తిరుమల తిరుపతి దేవస్థాన దేవాలయాలకు సంబంధించిన వాస్తు శిల్పకళా విశేషాలు ఏర్పాటు చెయ్యబడుతవి. ఇవిగాక అపూర్వమైన నాణాలు,ఆభరణాలు దేవతల వస్త్రాలంకరణలు, దంతం లేదా దారువులలో చిత్రాలు ఆకర్షణీయంగా ఏర్పాటౌతవి.

ఇక రెండవది తిరుపతిలో కచ్చేరి నమ్మాళ్వార్ ఆలయంలో ఏర్పాటౌతుంది. ఇది కేవలం వైఖానసాగమానికి సంబంధించిన అన్ని విషయాలను అంటే ఆలయస్థలనిర్ణయం, వాస్తుపురుషమండలం, ఆలయభేదాలు, విగ్రహాలు, ఉత్సవాలు, మొదలగు వాటికి సంబంధించిన పూజా విధులు దీనిలో ఉంటవి. ఇందులోని విషయాలను బొమ్మలద్వారా రేఖాచిత్రాల ద్వారా, ఛాయా చిత్రాల ద్వారా ప్రాచీన కళాఖండాల ద్వారా సుబోధకం చేసే సంకల్పం వుంది. సెంట్రల్ ఆర్ట్ మ్యూజియం క్యూరేటర్‌గా వున్న శ్రీ ఏ. వి. జయచంద్రన్‌ను దేవస్థాన పురావస్తుశాలల ప్రత్యేకాధికారిగా నియమించడం కూడా జరిగింది.




న్యాయశాఖ మంత్రి శ్రీ ఎన్. భాస్కరరావు గారు ప్రసంగిస్తున్న దృశ్యం ↑

ఇటీవల గుంటూరులో ఏర్పాటు చేయబడిన దేవస్థాన గ్రంథప్రదర్శనశాల నిర్వాహకులతో దేవస్థాన ఉపకార్యనిర్వాహణాధికారి శ్రీ యన్. నరసింహారావు ↓



(4 వ పేజీ తరువాయి)

ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

రాహువు వలన పాపప్రవృత్తి, శని వలన వివాదాలు, లేదా అనారోగ్యం, ఆధ్యాత్మిక ప్రవర్తన, గురువు వలన అనారోగ్యం, ఆందోళన, లేదా ప్రయాణం; ప్రయాస, బుధుని వలన ధనం, నూత్న వస్త్రాలు, జయం, సంతాన యోగం, కుజుని వలన భార్యతో వివాదం, ఉదర లేక నేత్ర బాధ, రవి వలన 17 వ తేదీవరకు అనారోగ్యము, భార్యకు అసంతుష్టి. తరువాత కాలములో ధన నష్టం లేదా అనారోగ్యం. లేదా నిరాశా ప్రవృత్తి, శుక్రుని వలన మాసాంతమున ధనము, నూత్న వస్త్రాలు లేదా శృంగారము లేదా గృహం లేక పుణ్యకార్యాలు

మకరం

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ఠ 1.2 పా)

రాహువు వలన ధనము, శని వలన భార్యా బిడ్డలనుండి వేర్పాటు, గురుని వలన శృంగారము, లేదా ధనము, బుధుని వలన వివాదాలు, కుజుని వలన జయము, ధనము, రవి వలన 17 వ తేదీ వరకు ఉదరబాధ, ప్రయాణం. తరువాత అనారోగ్యం లేదా భార్య కసంతుష్టి, శుక్రుని వలన 18 వరకు స్త్రీల మూలముగా ఆందోళన. తరువాత కాలంలో నూత్న వస్త్రాలు లేదా శృంగారం లేదా గృహము.

కుంభం

(ధనిష్ఠ 3,4 పా, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా)

రాహువు వలన వివాదాలు. శనివలన ప్రయాణం. గురువు వలన మనశ్శాంతికి భంగము, భార్యకుఅసంతుష్టి. బుధునివలన జయం లేదా గౌరవము కుజుని వలన శత్రువుల మూలంగా లేదా అనారోగ్య కారణంగా లేదా కుమారులు కుమార్తెల మూలంగా ఆందోళన. రవి వలన 17 వ తేది వరకు దృఢారోగ్యము తరువాత ప్రయాణం. ఉదరబాధ, శుక్రునివలన 18 వరకు అనారోగ్యం లేదా అవమానం. ఆ తరువాత స్త్రీల మూలంగా ఆందోళన.

మీనం

(పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి.)

రాహువు వలన ధనము. శని వలన ధనం, లేదా శృంగారము. గురువు వలన ధనము, నూత్నవస్త్రాలు, లేదా సేవక జనము, లేదా శృంగారం లేదా సంతాన యోగం, లేదా వాహన ప్రాప్తి, బుధునివలన భార్య బిడ్డలతో తగాదా కుజునివలన జ్వరం, లేదా పుదరబాధ లేదా దుష్ట సహవాసముల మూలంగా ఆందోళన. రవివలన 7వ తేదివరకు అనారోగ్యం శత్రువులపై జయం, శుక్రుని వలన 18వరకు పెద్దల ప్రశంస, బంధువుల రాక, ధనము, స్నేహితులు లేదా సంతానము, తరువాత అనారోగ్యము, అవమానము.

*

యాదగిరిగుట్ట లక్ష్మీనరసింహస్వామి దేవస్థాన కార్యనిర్వహణాధికారిగా నియమితులైన శ్రీ యన్. నరసింహారావు బదులు తి. తి. దేవస్థాన ఉపకార్య నిర్వహణాధికారిగా శ్రీ జి. టి. నాయుడు పదవి స్వీకరించారు.

## చందాదారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రిక చందాదారులలో దిగువ పేర్కొన్న సంఖ్య వారి చందా **30–9–79 తేదీకి అంతమగును.** చందాదారులు ఈ విషయమును గమనించి M. O. ద్వారా దిగువ పేర్కొనిన ప్రకారము మనియార్డరు కూపనునందు తమ చందా సంఖ్య పూర్తి విలాసమును పేర్కొని, త్వరలో చందా పంపనియెడల ఆ తేది దరిమిలా పత్రిక పంపబడదు.

చందాదారుల నంబర్లు మార్చబడినవి. కొత్తనంబర్లు దిగువ పేర్కొనబడినవి. తమకు పంపిన పత్రిక అడ్రసు పేపరుమీద నున్న నంబరును క్రొత్త నంబరుగా గమనింప ప్రార్థన.

63 87 159 199 205 313 336 351 380 383 386 388 390 392 393 394 413 531 534 540 546 547 to 551 553 554 556 557 558 579 607 751 752 768 772 773 774 775 776 778 780 to 784 786 788 789 790 792 793 794 to 798 1462 1466 1467 1469 1470 to 1479 1481 to 1494 1497 to 1562 1566 1567 1587 to 1606 1608 to 1613 1615 1617 to 1620 1622 to 1627 1645 1647 to 1662 1664 to 1677 1715 1723 1750.

గమనిక :– (1) సప్తగిరి చందాలు 15 తేదిలోగా చేరునట్లు పంపవలెను. ఆతరువాత చేరిన చందాలకు మరునెలనుండి మాత్రమే పత్రిక పంపబడును.

(2) కొత్త చందాదారులు కూపనులో 'కొత్తచందా' అని పేర్కొనవలెను. పాత వారు కూపనులో తమ చందా సంఖ్య నమోదు చేయవలెను.

(3) సప్తగిరి చందాలు ఈ క్రింది అడ్రసుకే తమ పిన్‌కోడ్ తెలియజేస్తూ పంపవలయును.

సప్తగిరి మాసపత్రిక సం॥ చందా రు. 6/–

ఎడిటరు
పబ్లికేషన్ సెక్షన్
ప్రెస్ కాంపౌండ్, తిరుపతి 517501.

*Edited and Published on behalf of T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T. T. D. Press by M. Vijayakumar Reddy, Manager T. T. D. Press Tirupati-517501*

# తిరుమల యాత్రికులకు సదుపాయములు

* * *

- అన్ని వర్గాలవారికి అందుబాటులో ఉండేటట్లు ఉచిత పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలతో ఆవాస సౌకర్యం.
- శ్రీవారిని దర్శించు యాత్రికుల క్యూషెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు.
- క్యూ షెడ్లలోనే కాఫీబోర్డువారి అల్పాహార సదుపాయం.
- సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
- యాత్రికులు వెలుపలకు రానక్కరలేకుండా క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం.
- ఆంధ్రప్రదేశ్ పాలసరఫరా సంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
- యాత్రికులు చదువుకునేందుకు దేవస్థానం ముద్రిత గ్రంథాలు. స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
- క్యూలోని యాత్రికులకు విసుగులేకుండా ఉండేందుకు టెలివిజన్ ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం.
- క్యూషెడ్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7 వ మైలువద్ద వైద్యసదుపాయం.
- సామానులు, పాదరక్షలు భద్రపరచుకొనేందుకు ప్రత్యేక సౌకర్యం.
- తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటో సౌకర్యం.

## ఉచిత బస్సుసదుపాయం

- దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు ముఖద్వారంలో పేష్కారుస్థాయి అధికారి సిబ్బంది.
- క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి, సిబ్బంది.
- యాత్రికుల సామానులను భద్రంగా తిరుమలకుచేర్చే సౌకర్యం ఏర్పాటైంది. తిరుపతిలో ఏ సత్రములో నైనాగాని, టోల్‌గేట్ వద్దగాని తమసామాగ్రి అప్పగించి రసీదుపొంది ఆ రసీదు తిరుమలసెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్ దగ్గర కౌంటర్ లో ఇచ్చి సామాగ్రి పొందవచ్చును.
- దుండగులనుండి యాత్రికులను కాపాడేందుకు, తిరుమలకు వెళ్ళేదోవపొడుగునా రాత్రింబవళ్ళూ పోలీసు గస్తీ ఏర్పాటుచేయబడింది.
- దారిపొడుగునా మంచినీటి సదుపాయం ఉన్నది.
- రాత్రిపూటగాని, తెల్లవారుఝామునగాని కొండకు వెళ్ళదల్చుకొన్నవారికి వీలుగా మంచికాంతి శక్తిగల దీపాలు ఏర్పాటైనవి.
- వివిధప్రాంతాలనుండి వచ్చేయాత్రికులకు బోధపడేందుకుగాను తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో, దేశంలోని ముఖ్యభాషలలో విచారణ కార్యాలయాలు.
- ప్రత్యేక కాటేజీలలోని అదనపు సౌకర్యాలు అంజనాద్రినగర్, శేషాద్రి, గరుడాద్రి, శంకుమిట్ట కాటేజీలలో కూడ ఏర్పాటైనవి.

దేవస్థాన ప్రయత్నాలలో ఇవి కొన్నిమాత్రమే!

గమనిక: తిరుమలలో 2–4–79 నుండి తపాలాకార్యాలయము రాత్రి 8–30 గం॥ వరకు పనిచేస్తున్నది. ఇది గాక ప్రధాన తపాలాకార్యాలయము రాత్రి 10–30 నుండి 1–00 గం॥ వరకు పనిచేస్తుంది. శ్రీ వేంకటేశ్వరస్వామి వారి భక్తుడు అన్నమాచార్యుల తపాలాముద్రను కోరినవారు, తమ కార్డులు, కవర్లపై ముద్రించుకోవచ్చును.



# కంచి వరద సన్మానం

**10-8-79**

కాంచీ క్షేత్రంలో వెలసిన శ్రీ వరదరాజస్వామి మూలమూర్తికి ఇంతకుముందు అత్తిచెట్టుతో తయారుచేసిన దారురూపం వుండేది. ఆలయంలో నూత్న మూలవిరాట్ ప్రతిష్ఠ తరువాత ఈ మూల మూర్తిని అనంత సరసు అనే పుష్కరిణి నడుమ ఒక అరలో నిక్షేపించి ప్రతి నలభై సంవత్సరాల కొక తడవ భక్తజనాలు దర్శించి తరించేందుకుగాను వెలుపలకు తీసుకొచ్చి పూజాదులు నిర్వహించడం జరుగుతున్నది.







సుమారు నలభై సంవత్సరాల తరువాత ఇటీవల బైటకు తీసుకురాబడిన ఈ అత్తిగిరి వరదరాజ స్వామివారికి పట్టుశాలువా సమర్పించాలని తిరుమల తిరుపతి దేవస్థానం నిర్ణయించింది. తదనుగుణంగా రు. 2,500 విలువ గల 24 మూరల పట్టుశాలువా (మేల్చట్), 1500 రూపాయల వెల చేసే 12 మూరల ఉత్తరీయం, ఇదిగాక 18 మూరల జరీపట్టువస్త్రాదులను శ్రీ వేంకటేశ్వర స్వామివారికి, తిరుచానూరులో పద్మావతి అమ్మవారికి ధరింపజేసిన అనంతరం దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్ ఆధ్వర్యంలో ఊరేగింపుగా బయలుదేరి 10-8-79 సాయంత్రం 5 గంటలకు

(3 వ కవరులో)



కొండంత పొడవుతోడ కోనేటిరాయఁడు వీఁడె
నిండుకొని రథ మెక్కి నిలుచున్నవాఁడు.

పాతాళవాసులైన బలురక్కసులమీఁద
యేతులఁ బరపెఁ దేరు యిదె దేవుఁడు
ఆతల జలధి చొచ్చినట్టి దానవులమీఁద
ఘాతతోడఁ దోలె నదె కడు రభసమున.

ఆకాశము దూరినట్టి యదటు దైత్యులమీఁద
దాకతో నడపించెఁ బంతాన దేవుఁడు
దీకొని యష్టదిక్కులఁ దిరిగి యసురలపై
భీకరముగా మోగించె బిరుదులు మెరసి.

ధరమీఁదఁ గలిగిన దనుజకోట్ల నెల్ల
సొరిది శ్రీవెంకటేశుఁడు పారఁదోలెను
గరిమ నలమేల్మంగ నురముసఁ బెట్టుకొని
తిరము కొలిపెఁ దేరు దిక్కులెల్ల గెలిచి.

అన్నమాచార్య సం. 10—181

# సప్తగిరి


సెప్టెంబరు 79

సంపుటి 10 సంచిక 4

విడిప్రతి 0-50 పైసలు

సం॥ చందా రు. 6-00



గౌరవసంపాదకులు:

శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్

ఐ. ఏ. ఎస్,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2322

ప్రచురణకర్త – సంపాదకుడు:

కొ్రటపాటి సుబ్బారావు

ఎమ్. ఏ.,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2254

ముద్రాపకుడు,

ఎమ్. విజయకుమార్ రెడ్డి,

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2340


## విషయసూచిక



* కొన్ని అనివార్య కారణములవలన 'శ్రీనివాస ప్రబంధము' 'వరాహపురాణం' ప్రకటింపబడలేదు

# సంపాదకీయము

మనిషిని మంచి మార్గాన నడిపించేది మతం. మనిషి సంఘజీవి. మనిషి నడతలోని మంచి చెడుల ప్రభావం సమాజంమీద ఉంటుంది. కనుక మతం లేని సమాజం కాని, సమాజం లేని మతంగాని మనిషికి తృప్తి నివ్వలేవు. కనుకనే మన ప్రాచీనులు మత సమాన ప్రతిపత్తిగల వ్యవస కు పునాదులేర్పరచారు. ఆనాటి వారి దృష్టిలో ఈ సంకుచితత్త్వంలేదు. మానవుని మనుగడ శ్రేయస్సులే వారి ధ్యేయాలు. అందువల్ల తమ ప్రతి తాత్త్విక చింతనకు, ఆధ్యాత్మిక స్ఫూర్తితోపాటు సమాజ సంక్షేమాన్ని కూడా పొందుపరచి, పర్వతంనుండి పరమాణువువరకు పరివ్యాప్తమైన అనంత జీవ తత్త్వారాధనకు సామాజిక సమ్మేళనాలద్వారా వీలు కల్పించారు. ఈ విషయాన్ని, కాస్త పరిశీలిస్తే నదీపుష్కరాలు ముంజేతి కంకణం లాగా ద్యోతకం చేస్తవి.

అసలు పుష్కరాలకు నదులకు సంబంధం ఏమిటి? జీవశబ్దఖ్యాతుడు, సమస్త ప్రాణాధారుడు అయిన బృహస్పతి పన్నెండు రాశులలో ఒకదానిలో ఒక్కొక్క సంవత్సరం నిలిచి, వదలిన రాశిని మళ్ళీ చేరేందుకుపట్టే 12 సంవత్సరాలకాలాన్ని పుష్కరం అని పిలిచారు. అలాగే రవి అంటే సూర్యుడు జలదాత. శాస్త్ర రీత్యాకూడా అంతే. రవి గురులుఏకరాశి స్థితులైయున్న మొదటి 12 దినాలమహత్తర కాలాన్ని పర్వదినాలుగా నిర్ణయించారు. దీనితోకూడా దేశంలోని సౌభాగ్యదాయకాలైన జీవనదులను 12 స్వీకరించి ఒక్కొక్కగురు సంచారరాశిని ఒక్కొక్క నదీపుష్కరంగా నిర్ణయించారు. ఆ పుష్కరకాలంలో నదీస్నానం పితృదేవతా తర్పణాదులు ముక్తిహేతువులనే పారలౌకిక ప్రయోజనంతోపాటు పరస్పరావగాహన, సంస్కృతి పరిరక్షణలేకాక సజీవ సామాజికాభివృద్ధి సిద్ధిస్తాయి. ఇంతటి విశాల దృక్పథంతో మనీషు లేర్పరచిన బహుళ ప్రయోజనాత్మక కార్యక్రమాలలో పాల్గొని ధార్మిక సంస్థలు కూడా ఆర్ష ధర్మసారాన్ని అందరి అందుబాటులోకి తీసుకు రావటం తమ కర్తవ్యంగా భావిస్తుంటాయి.

గౌతమ మహర్షి గోహత్యా పాతకాన్ని తప్పించేందుకు దివినుండి భువికి దిగి మందాకినే గోదావరిగా ప్రవహిస్తున్నది. మహరాష్ట్రంలో నాసిక్‌వద్ద జన్మించి ఆంధ్రప్రదేశ్‌లో పాపికొండల తర్వాత సాగర సంగమంచేసే ఈ పవిత్రనదీమతల్లి మొత్తం ఐదురాష్ట్రాల ప్రజలను పవిత్రులను చేస్తున్నది. ఆగస్టు నెలాఖరున, రవిగురువులు సింహరాశిస్థితులు కావటంతో ఈ నదికి పుష్కమహోత్సవం, కొవ్వూరు నుండి కోటిలింగాల వరకు యాత్రికనగరంగా మారటం జరుగుతున్నది.

ఇంతటి మహదవకాశాన్ని, తిరుమల తిరుపతి దేవస్థానం ఆస్తికజనారాధనకు వినియోగించుకుంటున్నది. శాశ్వత ప్రాతిపదికపైన దేవస్థానంపేరిట రాజమండ్రిలో ఒక స్నానఘట్టాన్ని ఏర్పాటుచేసింది.

సుబ్రహ్మణ్య మైదానంలో, భారీవ్యయంతో ఏర్పాటైన మహనీయ కళారంజిత ప్రతిరూపం, శ్రీ వేంకటేశ్వరాలయం, తిరుమలను దర్శించ ఆసక్తులై కూడా అశక్తులైనవారికి చేరువైన మహత్తరావకాశం. ఈ ఆలయ పరిధులలో, ధర్మరక్షణసంస్థ ఆధ్వర్యంలో తొలికోడికూతనుండి మునిమాపువేళవరకు జరిగే భక్తిరస కార్యక్రమాలు పాపపంకిలమైన మనస్సును ప్రక్షాళనంచేసి మనస్సును మాధవుని మీదకు మరలింపజేసే పరమనాదతరంగాలు. అతి స్వల్పధరకు లభించే అమూల్యగ్రంథాలు పరమాత్మ భావనావిష్కరణ పథసోపానాలు. ఈ రకంగా మానవుల ఆధ్యాత్మిక పురోగతిలో, తగిన సేవ చేసే అదృష్టం దేవస్థానానికి దక్కింది.

ఏదోఇంత చేయగలిగామన్న తృప్తిమాత్రమేగాని, నిజానికి నిరాడంబరంగా ముందుచూపుతో ఇలాంటి సందర్భాలను ఏర్పరచిన మహర్షుల, మానవమలినాలు తమలో నింపుకొని మంచి జీవనాలను పంచిఇచ్చే నదీమతల్లుల, ముందు మనం తలపంచవలసిందే. వారి ఆరాటంలో నూరవ పాలు మనకుంటేచాలు. మన ఆధ్యాత్మ విజ్ఞానపతాకను మళ్ళీ దశ దిశల ఎగరవేయవచ్చు.

# నిర్వాహక మండలి నిర్ణయాలు

4—8—79

అన్నమాచార్యకీర్తనల శిక్షణను, ఇప్పుడున్న హరికథల శిక్షణ తరగతులలోనే చేర్చే అవకాశాన్ని పరిశీలించవలసినదిగా కార్యనిర్వహణాధికారిని కోరటమైనది. ప్రభుత్వ సంగీతకళాశాలలో ప్రముఖ సంగీతశిక్షకులకు, అన్నమాచార్య కీర్తనల శిక్షణలకుగాను ఒక్కొక్కరికి రు. 75/- విద్యార్థి వేతనం, వారికి శిక్షణ గరిపేందుకు రు. 75/- ప్రత్యేక బహుమానం శిక్షకులకు యిచ్చే అవకాశాన్ని గూర్చి పరిశీలించి, ప్రణాళిక తయారు చేయవలసిందిగా కార్యనిర్వహణాధికారిని కోరటమైనది.

దేవస్థాన ఇంజినియరింగ్ విభాగంలో 4 సహాయస్థపతుల ఉద్యోగాలు కల్పించటమైనది.

దేవస్థానం నిర్మించిన శ్రీ వేంకటేశ్వర వైభవం చిత్రాన్ని, లాభాలలో తగు భాగం పద్ధతిన, ఆంధ్రప్రదేశ్‌లో విడుదలకు తీసుకొనవలసిందిగా ఆంధ్రప్రదేశ్ సమాచార ప్రజాసంబంధశాఖ డైరక్టర్ జనరల్‌ను కోర నిర్ణయించటమైనది.

అవంతిపురం శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయానికి విగ్రహాలను విరాళంగా ఇచ్చేందుకు అంగీకరించటమైనది.

నెల్లూరు పట్టణంలో నవాబ్ పేటలోని ఉదయవర్లసన్నిధికి మైక్ సెట్‌ను (1) మంజూరుచేయటమైనది.

కంచికామకోటి పీఠంవారు హైదరాబాదులో నిర్వహించే వేదగానపరిషత్ వేదభాష్య, ఆహితాగ్ని సదస్సుల నిర్వహణకు సహాయంగా రు. 30,000/- విరాళం మంజూరు చేయటమైనది.

తిరుమల తిరుపతి దేవస్థాన పురావస్తు సంపద పరిరక్షణ, నిర్వహణల విషయంగా భారత ప్రభుత్వపు పురావస్తుశాఖ డైరక్టర్ జనరల్ పంపిన నివేదిక ప్రకారం విద్యార్థుల శిక్షణతోసహా, తగిన చర్యలు తీసుకోవలసిందిగా దేవస్థాన కార్యనిర్వహణాధికారిని కోరటమైనది.

శ్రీవారి ప్రసాదాలను విమానం ద్వారా సరఫరాచేసి, మద్రాసు, హైదరాబాద్, బెంగళూరులలోని దేవస్థాన సమాచార కేంద్రాలలో వారానికొకసారి విక్రయించాలని నిర్ణయించి, ఏయే ప్రసాదాలు పంపిణీ చేయవలసింది. ప్రస్తుతం ఉన్న ధరలతో పాటు రవాణా ఖర్చులు కలిపి ఏ ప్రసాదం ఎంతవెల అన్నవిషయం దేవస్థాన కార్యనిర్వహణాధికారికి వదిలివేస్తూ ఈ పథకాన్ని త్వరలో ప్రారంభించవలసిందిగా కార్యనిర్వహణాధికారిని కోరటమైనది.

ఉరిశిక్ష విధించబడిన ఖైదీలకు ఒక్కొక్కరికి రెండు లడ్లు, ఒక వడ, ఒక పొట్లం కలకండ, మహాప్రసాదం పొట్లం గల రెండు పాకెట్లు వర్ణమతవివక్షత లేకుండా పంచిపెట్టాలని నిర్ణయించటమైనది.

ఇందుకు ప్రారంభంగా, ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాలలోని కారాగారాల నుండి వివరాలు సేకరించి, దేవస్థాన సమాచార కేంద్రాల ద్వారా ఆయా కేంద్రాల జైళ్ళలోని ఖైదీలకు శిక్ష అమలుకు ముందురోజున స్వయంగా అందుకునే విధంగా ఏర్పాటుచేయ కార్యనిర్వహణాధికారిని కోరటమైనది.

వైద్యాలయాల్లో తీవ్రఅస్వస్థతలో ఉన్న రోగులకొక్కొక్కరికి ఒక మహాప్రసాదం పొట్లం అందజేయాలని, దేవస్థాన ఉద్యోగి నివసించే ప్రతి ప్రదేశంలోను ఆ ఉద్యోగి వారానికొకసారి వైద్యాలయాలను ఇందుకుగాను సందర్శించాలని; ఇవిగాక ఈ ప్రసాదం ఏ వైద్యాలయానికైనా అభ్యర్థనమీద పోస్టుద్వారా పంపగలమన్న విషయాన్ని విస్తృత ప్రచారం చేయాలని తీర్మానించటమైనది.

40 సంవత్సరాలకొకసారి భూమిమీదకు దర్శనానికి తీసుకురాబడుతూ ప్రస్తుతం దర్శనమిస్తున్న శ్రీ కంచి వరదరాజస్వామివారికి 'మేల్చట్' ను సమర్పించేందుకు నిర్ణయించటమైనది.

లోగడనే ప్రకటించబడిన శ్రీవారి ప్రసాద దాననిధి పథకానికి 'శ్రీ వేంకటేశ్వర నిత్యప్రసాద దానధర్మాదాయ పథకం' గా పేరుంచుతూ ప్రతి గృహస్థు పేరు ఆయారోజులలో శ్రీవారి కొలువులో చదివేందుకు ఆమోదిస్తూ, ఈ పథకాన్ని 1-11-79 కి బదులుగా 1-10-79 నుండి ప్రారంభించాలని, ప్రసాద వినియోగాన్ని 1980 ఉగాది నుండి పంపిణీచేయాలని, 500 రూపాయల నిధికి 20 లడ్లు, ఇలా ఇరవై ఇరవై వంతున 1000, 1500 లడ్లవరకు పెంచాలని, ఈ పథకంక్రింద రు. 10 వేలు అంతకుపైన చెల్లించిన గృహస్థుల కుటుంబంలోని ఐదుగురిని ఆయా దినాలలో ఉచితదర్శనానికి అనుమతించడం జరుగుతుందని, ప్రతి గృహస్థు, హిందూ కేలండర్ ప్రకారం ఏవైనా మూడు రోజులలో ఒకరోజు పంపిణీ జరపవలసిందిగా కోరుకొనవచ్చునని, రోజుకు రెండువందల లడ్లు వచ్చే వరకూ అంచే

(39 వ పేజీలో)

# గాయత్రి - సంధ్యా వందనము

శ్రీ సత్రం వెంకటరమణయ్య,
కడప.

" న గాయత్ర్యాః పరం మంత్రం
న మాతుః పరందైవతమ్ "

గాయత్రి కంటే శ్రేష్ఠమైన మంత్రం మరి యొక్కటి లేదు, అట్లనే తల్లికంటే మిం చిన దైవములేదు.

స్కాంద పురాణములో "గాయత్రీ ప్రముఖాన్మంత్రా న్యోగినః సనకాదికాన్" అని వచింపబడియున్నది. మరియు

శ్లో॥ న బ్రాహ్మణో వేదపాఠాత్, నశాస్త్ర
పఠనాదపి।
దేవ్యాస్త్రి కాలమభ్యాసాత్ బ్రాహ్మణః స్యాద్ది
నాన్యథా॥

వేదశాస్త్రములు లెస్సగా అభ్యసించిన మాత్రమున బ్రాహ్మణత్వము సిద్ధింపదు. గాయత్రి నుపాసించుటచే మాత్రమే బ్రాహ్మ ణత్వము సిద్ధించును

పూర్వము, ఇప్పటికిని, కొంతమంది బ్రాహ్మణులు గాయత్రి నుపాసించి దేదీప్య మానమైన తేజస్సుచే వెలుంగు చుండిరి, చున్నారు. వారి ముఖమున దివ్యతేజస్సు తాండవమాడు చుండును. అందులకే వారిని భూసురులనిరి. భూసురులు అనగా భూమియందు దేవతలు. కాళిదాసు దేవీదశ శ్లోకీస్తుతిలో బ్రాహ్మణులను "శాపాయుధ హస్తులు" అని వర్ణించియున్నాడు. అనగా వారికి కోపము వచ్చిన వారియొక్క తప శ్శక్తి చేత శపించెడివారు. వారి శాపములు తప్పక ఫలించెడివి. హరిహర బ్రహ్మాదులు కూడ వారి శాపములను మరల్పజాలరు. భగవంతుడైన మహా విష్ణువు కూడ 'బ్రాహ్మణో మమ దేవతా' అని చెప్పి యున్నాడు. అంతియేకాదు భాగవతములో "మహీసురుల సమిద్ధనిర్మల పాదనలిన రజోవితానములు భక్తిహాటక నవరత్న కోటీరమునదాల్తు" అని చెప్పియున్నాడు. అనగా బ్రాహ్మణుల యొక్క పాదముల లోని మట్టి కణములను నేను నా బంగారు కిరీటమునందు దాల్తును అని వచించి యున్నాడు. అదే భాగవతములో భరతో పాఖ్యానములో భరతుడు విప్రుడుగా జన్మించెను. అప్పుడు రహూగణుడను రాజు అతనితో ఇట్లనెను.

తే॥ తప్పుసైరింపు, నే యమదండనమునకు,
హరుని శూలమునకు,
వజ్రాయుధమున కనలచంద్రార్క ధనద
శస్త్రములకు వెఱవ విప్రున కే మదివెఱచి
నట్లు. ॥

చూచితిరా, నాడు బ్రాహ్మణులకు ఎంత గౌరవ మర్యాదలు ఔన్నత్యముగలవో.

బ్రాహ్మణులకు సన్ధ్యావన్దనము నిత్య కర్మములలో చేరినది. బ్రాహ్మణుని, బ్రాహ్మణత్వమునకు గాయత్రియే ఆధా రము. కాబట్టి అవశ్యమాచరించి తీరవల యును. నేడు చాలామంది వారివారి విధు లను, వేదచోదితమైన నిత్యకర్మానుష్ఠాన ములను, నడవడికను, వదలుకొని, వారి కున్నట్టి గొప్పతనమును, శ్రేష్ఠత్వమును, పోగొట్టుకున్నారు. పెక్కుమంది బ్రాహ్మ ణులు నిస్తేజులైపోయినారు. ముఖమున బ్రహ్మతేజస్సు క్షీణించిపోయినది. తమ కున్న గౌరవప్రతిష్ఠ, మర్యాదలు, ఔన్న త్యము దిన దినమునకు దిగజారి పోవు చున్నవి. ఏలనన వారు నిత్య నైమిత్తిక ముగా చేయవలసిన నిత్య కర్మయగు సంధ్యోపాసన, గాయత్రీ ఉపాసన చేయక పోవుటయే కారణము. సమాజములో హేళనకు పాత్రులైనారు. అంతియేకాక, నిష్ఠాపరులైన వారిని చూచి అవహేళన చేయుచున్నారు. ఇది యెంతయో శోచ నీయము. ఈ సంధ్యావందనము, గాయత్రీ ఉపాసన చేయుటవలన మన పాపములు ఎప్పటి పాపమప్పుడు నశించిపోయి, పుణ్య ము చేకూరును. మరియు సన్ధ్యావందనము చేయనిదే ఏ కార్యము చేసినను, ఎన్ని పూజలుచేసినను, ఎన్ని వ్రతములు చేసి నను, అవన్నియు నిష్ఫలములే, అని శాస్త్రములు నొక్కి చెప్పుచున్నవి.

శ్రీరాములవారు విశ్వామిత్రుని, ఈ గాయత్రి విషయమై ప్రశ్నించడము, అందు లకు ఆయన ఇచ్చిన సమాధానముచూచిన గాయత్రి యొక్క ప్రాముఖ్యము, గొప్ప తనము బోధపడుచున్నవి.

" శ్రీరామ ఉవాచ :—
విశ్వామిత్ర మహాప్రాజ్ఞ గాయత్రీ మంత్ర
పారగ
శతమష్టోత్తరం నామ్నాం గాయత్ర్యాబ్రూహి
మోక్షదమ్.

విశ్వామిత్ర :—
సాధుపృష్టం త్వయా రామ రఘువంశసము
ద్భవ
గాయత్ర్యాశ్చైవ సావిత్ర్యా సరస్వత్యా
స్తవంశుభమ్.
శృణువక్ష్యామి తత్త్వేవ నామ్నా మష్టోత్తర
శతమ్



అక్కారాంపల్లివద్దగల శ్రీ వేంకటేశ్వర పూర్‌హోమ్‌లో నూతనంగా అమర్చబడిన టెలివిజన్ సెట్టును జూలై 21వ తేదిన దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ ప్రారంభించారు.

## దళితజీవుల ముందడుగు

పూర్‌హోమ్ నివాసులు వృత్తివనుల శిక్షణపథకంక్రింద తయారుచేసిన వస్తువులలో కొన్నింటిని వారికే బహూకరిస్తున్న కార్యనిర్వహణాధికారి. దేవస్థానం సీనియర్ మెడికల్ ఆఫీసర్ డా॥ వై. ఆర్. ధనలక్ష్మి ప్రక్కనున్నారు. కుష్ఠువ్యాధి కారణంగా వెలివేయబడ్డవారిని, సమాజాని కుపయోగ్యులుగా, తీర్చిదిద్దే కార్యక్రమం దేవస్థానం చేపట్టింది.



పరతాం పాతక హర మజ్ఞాన తిమిరాపహమ్
ప్రతిగ్రహాదన్నదోషాత్, పాతకాదుపపాతకాత్
గాయత్రంత్రాయతే యస్మాద్గాయత్రీత్యభిధీయతే
తతః శృణుమహాభాగ సర్వాన్కామానాప్స్యసి,
తస్యపుణ్యఫలం వక్తుం బ్రహ్మణాపి న శక్యతే
ప్రాతఃకాలేచ మధ్యాహ్నేసాయాహ్నే వా
ద్విజోత్తమాః
యే పఠంతీహ లోకేఽస్మిన్ సర్వాన్కామాన
వాప్నుయుః

మరియు పెక్కుమంది యజ్ఞోపవీత మును అగౌరవ పరచుచున్నారు. యజ్ఞో పవీతము ఎంత పవిత్రమైనదో చూడుడు.

శ్లో॥ సత్యజేదాత్మనః సూత్రం బ్రాహ్మం
బ్రహ్మనిర్మితమ్"

బ్రహ్మచే నిర్మింపబడినట్టియు, బ్రహ్మ స్వరూపమైనట్టిదియు అగు యజ్ఞోపవీత మును, ఎన్నడును వదిలివేయరాదు. మనలో కొందరు దానిని శరీరమునకు బరువనియో లేక ఎందులకో తీసివేయు చున్నారు, లేదా అవి కనుపడకుండా నడుముకు చుట్టుకొనుచున్నారు. మర ణానంతరము దహన కర్మలో వస్త్రము సహితము తీసివేయుదురు. కాని యజ్ఞోప వీతము పవిత్రమైనది, మిక్కిలి శుద్ధమైనది ఆయుర్వృద్ధి కలిగించునది. శుభప్రద మైనది. ఓజస్సు బ్రహ్మతేజస్సు కలిగించు నది. బ్రాహ్మణలక్షణ రూపమైనది. అటు వంటి యజ్ఞోప వీతమును పైచెప్పిన రీతిగా అనాదరించుచు ఎంతటి మూర్ఖత్వమునకు పాలుపడుచున్నారో! చూడుడు, కాల మహిమ.

సన్ధ్యావన్దనమును, ఆ మంత్రములకు గల అర్థములు తెలుసుకొని, త్రికాలము లందు, వేళతప్పక, ఆచరించినచో, వారు ఇహపరములందు సర్వశుభముల బడయు

(34 పేజీలో చూడుడు)

# శ్రీ అన్నమాచార్య సంకీర్తనామృతము

శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి

(గతసంచిక తరువాయి)

అవ; భవరోగమును పరిహరించుటకు భగవంతుడే తగినఔషధమనుచున్నాడు-

64

శంకరాభరణము

కొనరో కొనరో మీరు - కూరిమిమందు
ఉనికి మనికి కెల్ల - నొక్కటే మందు
॥పల్లవి॥

1. ధ్రువుఁడు గొనినమందు - తొల్లియుఁ బ్రహ్లాదుఁడు
చవిగా గొనిన మందు - చల్లనిమందు
భవరోగములు వీడి-పారఁగఁ బెద్దలుమున్న
జవకట్టికొనిన ని-చ్చలమైనమందు ॥కొనరో॥

2. విలిచి నారదుఁడుగొ-నినమందు జనకుఁడు
గెలుపుతోఁగొని బ్రతి - కిన యామందు
మొలచినాలుగుయుగ-ముల రాజులు ఘనులు
కలకాలముగొని - కడగన్నమందు ॥కొనరో॥

3. అజునకుఁ బరమాయు - వైయొ? నగిన మందు
నిజమై లోకములెల్ల - నిండినమందు
త్రిజగములు నెఱుఁగ-తిరువేంకటాద్రిపై
ధ్వజమెత్తెఁ గోనేటి - దరినున్నమందు
॥కొనరో॥ (5-140)

జనులారా! ప్రేమ స్వరూపుడైన భగవంతుడు అను ఔషధమును మీరు చేకొనుడు. సుఖముగా లోకమున జీవించుటకిది యొక్కటే తగిన యౌషధము.

పూర్వము ధ్రువుడీ మందు సేవించెను. ప్రహ్లాదుడీ మందును మిక్కిలి ప్రీతితో స్వీకరించెను. ఇది యెట్టి ఉద్వేగమును గలిగింపని చల్లనిమందు. సంసార రోగమును పరిహరించుకొనుటకై పూర్వము మహనీయులైన వారు పలువురు శాశ్వతమైన యీ మందును తమ స్వాధీనము గావించుకొనిరి.

ఈ మందునే నారదుడు శ్రద్ధతో సేవించెను. విదేహాధిపతియైన జనకుడు విజయోత్సాహముతో ఈ మందునే స్వీకరించి బ్రహ్మానందముతో జీవించెను. వారు వీరననేల? నాలుగు యుగములకు జెందిన నరపతులు, మహాత్ములు జీవించినంత కాలము ఈ మందునే సేవించిముక్తులైరి.

ఈ మందే బ్రహ్మదేవునకు పరమాయువై విలసిల్లినది. ఇదే సత్యస్వరూపమై భువనములెల్ల నిండియున్నది. కోనేటి గట్టుననున్న ఈ మందే ముల్లోకము లెఱుంగునట్లు నావలె భవరోగమును పరిమార్పగల మందింకొకటి లేదని శ్రీ వెంకటాద్రిపై ధ్వజమెత్తిచాటినది. ('ధ్వజమెత్తి' అనుపాఠమైనచో ధ్వజమెత్తి చాటుచు కోనేటి గట్టున నున్న మందు అని భావము.)

విశే: మనుజులు వివిధములైన శరీర రోగములకు పలురకములైన మందులు వాడుదురు. కాని శరీరము శాశ్వతము గాదు. అది ఎప్పుడైనను పతనమునొందక తప్పదు. అజ్ఞానమునకు మారురూపమైన సంసార మను రోగమున్నంతవరకు జీవుడు మఱల మఱల శరీరములు దాల్చుచు విడచుచు నుండవలసినదే. కాన జన్మజరామరణములతో గూడిన భవరోగమును దూరమొనర్చుకొనుటకై వివేకవంతుడు ప్రయత్నించవలెను. అందుకు తగిన మందు పరమాత్ముడొక్కడే ఆయన అనుగ్రహమునకై పాటుపడుటే ముక్తికి సరియైన త్రోవ.

ధ్రువుడు, ప్రహ్లాదుడు, నారదుడు, జనకుడు మున్నగు మహనీయులు భగవంతుని ఆశ్రయించుటవలననే ముక్తులైరి.

ప్రహ్లాదనారదపరాశరపుండరీక
వ్యాసాంబరీష శుకశౌనక భీష్మదాల్భ్యాన్।
రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి॥

అన్నట్లు ప్రహ్లాద నారదాదులగు పరమ భాగవతులను స్మరించి వారు చూపిన త్రోవనే పయనించవలెను.

యోగజ్ఞులైన యాజ్ఞవల్క్యాది మునులు చెప్పినట్లు కృష్ణుడు అను అమృత మొక్కటే భవరోగమును పరిహరించు పరమౌషధమని కులశేఖరుడు వచించెను —

హే లోకాః। శృణుత ప్రసూతిమరణ
వ్యాధేశ్చికిత్సామిమాం
యోగజ్ఞా స్సముదాహరంతి మునయో
యాం యాజ్ఞవల్క్యాదయః।
అంతర్జ్యోతి రమేయమేక మమృతం
కృష్ణాఖ్య మాపీయతాం
తత్పీతం పరమౌషధం వితనుతే
నిర్వాణమాత్యంతికమ్॥

(ము-మా-17)

(ప) ఉనికి మనికికి = ఉండుటకు బ్రదుకుటకును
1. జవకట్టికొనిన = పొదిగికొనిన, స్వాధీనము గావించుకొన్న, నిచ్చలము = నిశ్చలము.

## తిరుమలలో వివిధములైన కాటేజిల దినసరి అద్దెలు

1-12-78 నుంచి మార్చబడినది.

కనుక యాత్రికులు గమనింప గోరుతున్నాము.

| కాటేజీపేరు | రోజుకి అద్దె |
|---|---|
| 1. హెచ్. ఆర్ గవియప్ప కాటేజి. | రు. 100/- |
| 2. నారాయణగిరి కాటేజీలు<br>1 నుండి 4; 13 నుండి 20. | 40/- |
| 3. ట్రావెలర్స్ బంగళా ప్రాంతం లోపల వైపువి, 1 నుండి 8; ఎ నుండి జి 3-వ వరుస 1; సి. యం. సి. 16; వి. వి సి. 6; ఎస్. ఎస్. సి. కె. వి. ఆర్. వి. వి. సి. 1: వి. వి. సి. 8; టి. బి. సి. 10. | 30/- |
| 4. పై కాటేజీలలో ఎ. భాగం. | 18/- |
| బి. భాగం. | 12/- |
| 5. ట్రావెలర్స్ బంగళా బయట వైపువి.<br>వి. వి. సి; యం. బి. సి; ఎ. టి. సి. | 25/- |
| 6. పై కాటేజీలలో ఎ. భాగం; | 15/- |
| బి. భాగం. | 10/- |
| 7. టి. బి. కాటేజీలు ( 3 వ వరుస ఒక్క గది గలవి. ) | 10/- |
| 8. శ్రీ వేంకటేశ్వర అతిథి భవనం | |
| ఎ. పెద్దగదులు | 35/- |
| బి. మూలగదులు | 25/- |
| సి. మిగిలిన గదులు | 20/- |

కార్యనిర్వహణాధికారి.

మరియు వ్యామోహమును శమింప జేయునది, ముని మనోవృత్తులను ప్రవర్తింపజేయునది. రాక్షసేంద్రుల కార్తిగల్గించునది, ముల్లోకములకు సంజీవనమైనది, భక్తులకు మిక్కిలి మేలు గూర్చునది. భవభయమును విధ్వంసము జేయునది, శ్రేయస్సు గూర్చునది అగు శ్రీకృష్ణుడు అను దివ్యౌషధమును పానము జేయుమని ముకుందమాలా కారుడు తన చిత్తమును హెచ్చరించెను.

వ్యామోహ ప్రశమౌషధం
మునిమనోవృత్తి ప్రవృత్త్యౌషధం
దైత్యేంద్రార్తికరౌషధం
త్రిభువనీ సంజీవనైకౌషధమ్।
భక్తాత్యంతహితౌషధం
భవభయప్రధ్వంసనైకౌషధం
శ్రేయః ప్రాప్తికరౌషధం
పిబ మనః శ్రీకృష్ణ దివ్యౌషధమ్॥

(ము. మా—24)

భగవంతుని, భగవన్నామమును దివ్యౌషధముగా వర్ణించుచు అన్నమయ్య పాడిన పాట లింకను కొన్ని గలవు —

'వేద వేద్యులు - వెదకేటి
ఆది నంత్యములేని - ఆ మందు'- (5-2)
'వేదమంత్రమింకనేల-వేరువెల్లంకులునేల
పుడమిధరుడు మాకు-భవనౌషధము'
(5-286)

'అన్నిటికి నిది పర - మౌషధము
వెన్నుని నామమె - విమలౌషధము
(11-P 43)

ఇత్యాది సంకీర్తనము లిట్టివే.

(సశేషము)

# కామాక్షి

జ్ఞానప్రాప్తికి సాక్షాత్ ఆ పరాశక్తి యనుగ్రహమొక్కటియె చాలును. ఆ అంబికయే మాయచే బ్రహ్మమును కానకుండజేసి ఈ విశాలవిశ్వముగ గనుపింపజేయుచున్నది. ఈ ప్రపంచపు లీలనుండి విడుదలపొంది, సంసారబంధములనుండి జననమరణచక్రమునుండి విముక్తులమై మనము బ్రహ్మముగనె కావలయుననిన ఎవరు ఈ మాయను సృజించెనో ఆ మహామాత అనుగ్రహమును పొందగలిగిననె అయ్యది సాధ్యమగును.

'మాయా' = ఏది లేదో అది. లేనిది ఎట్లు ఈ ప్రపంచక్రీడను జరిపించుచున్నది? అది ఎప్పుడూ లేనిదికాదు. స్థిరముగనుండునదియును కాదు. జ్ఞానప్రాప్తి పర్యంతము మాయ యుండుచునేయుండును. అందాక నానావిధములగు వస్తువులనుజూచి అవన్ని నిత్యములనియె తలంతుము. వానిపై ఆశాద్వేషములను పెంచుకొని పలువిధములగు కర్మములను జేయుచుందుము. ఆ పరాశక్తి నుపాసించి జ్ఞానమును పొందగలిగినచో నానావిధములుగ భాసించు ఈ విశ్వమంతయు ఒకే పరాశక్తియొక్క వేరు వేరు రూపములే అని అనుభవపూర్వకముగ తెలిసికొనగలము. నిత్యపరివర్తనమొందుచు, నశించుచునుండు ఈ నామరూపాత్మకములగు వస్తువులపై ఆశ, ద్వేషము అనునవి అపుడు పర్వడనేరవు. కాన వీని కాధారమై ఎప్పుడు నెట్టి పరివర్తనమును జెందని ఆ పరజ్ఞానమున మన మనసును మనము లయింపజేయవలెను. అపుడు ఈ ప్రపంచమే మన సృష్టిలో లేకుండనుండును. ఏది లేకుండ నుండునో అది అనగా మాయయే మనల నింతదనుక కీలుబొమ్మలను జేసి ఆడించుచున్నది.

మాయకు కారణమైన బ్రహ్మశక్తి అగు ఆ జగదంబికయే జ్ఞానమును కూడ నొసగగలదు. ఆమె అనుగ్రహమే అందులకు కారణమున్ను. ఇంతవర మాయ చేయుచునే దానినుండి విముక్తి నొందజేయు కరుణయు ఆమెయె కటాక్షించుచునుండును. మాయాలోకమున మనము సృష్టించుకొను కష్టములకు, దుఃఖములకు మన మనస్సు, ఇంద్రియములు ముఖ్యకారణములు. ఇంద్రియసుఖములలోనే మనసును ప్రవర్తింపజేసి సహజమయిన ఆత్మసుఖమును మనము మఱచి యున్నాము. ఇంద్రియములకు మనసునకు మనము దాసులమైయున్నాము. వీటిని సృష్టించినది మాయ. ఆ మాయయే

(30వ పేజీలో)



శ్రీ టి. పి. భాష్యకారాచార్యులు,
తిరుపతి.

# భక్తివినాసన్మార్గముగలదే?

(గత సంచిక తరువాయి)

శ్లో॥ ఇతీదం కీర్తనీయస్య కేశవస్య మహాత్మనః।
నామ్నాం సహస్రం దివ్యా నామశేషేణ ప్రకీర్తితమ్॥
య ఇదం శృణు యాన్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్।
నాశుభం ప్రాప్ను యాత్కించిత్సోఽ ముత్రేహ చ మానవః॥

అని విష్ణు సహస్రనామ ఫలశ్రుతి. భగవంతుని సహస్ర నామములను కీర్తించిన వారికి, తత్కీర్తనలను విన్నవారికి అశుభములు కల్గవు. కోరిన కోర్కెలు నెరవేరును.

'మేఘావృతుడైన సూర్యుడు వాతఘాతముచే మేఘములు విచ్చిపోగా నెట్లు ప్రకాశించునో అట్లు అనంతుడగు భగవత్సంకీర్తనము వలన పాపౌఘముల నుండి జీవుడు ముక్తుడై ప్రకాశించును.' అని శ్రీమద్భాగవతప్రమాణము. అవధరింపుడు.

'సంకీర్త్యమానో భగవాననంత:
శ్రుతానుభావో వ్యసనం హి పుంసామ్।
ప్రవిశ్యచిత్తం విధునోత్యశేషమ్
యథాతమోఽర్కోఽభ్రమివాతివాతః॥
— శ్రీమద్భాగవతము 12-12-47.

కలి కల్మష నివారణమునకు శ్రీకృష్ణ సంకీర్తన మొక్కటే తగిన మార్గము. శ్రీకృష్ణసంకీర్తనము వలన జీవుడు ముక్తసంగుడై పరమును పొందగలడని భాగవత మతము.

శ్లో॥ కలేర్దోషనిధే రాజన్నస్తిహ్యేకో మహాన్గుణః।
కీర్తనాదేవ కృష్ణస్య ముక్తసంగః పరం వ్రజేత్॥
—శ్రీమద్భాగవతము 12-3-51.

రామనామ సంకీర్తనము భవతారకమని భక్తుల అభిప్రాయము. రామనామ సంకీర్తనముచేసి తరించిన భక్తులెందరోగలరు. ప్రాచీనులలో రామకథను గానంచేసి వాల్మీకాదిమహర్షులు తరించినారు. శబరి, జటాయువు రామనామ సంకీర్తనముతో తరించిరి. శ్రీరామపదసేవానిరతుడు, నిరంతర రామనామసంకీర్తనాతత్పరుడునగు వాయునందనుడు రామసంకీర్తనము జరుగుచోట నివసించుచుండునని ఆర్యుల నమ్మకము.

యత్ర యత్ర రఘునాథ కీర్తనమ్
తత్ర తత్ర కృత మస్తకాంజలిమ్।
బాష్పవారి పరిపూర్ణ లోచనమ్
మారుతిం నమత రాక్షసాంతకమ్॥

శ్రీరామనామ సంకీర్తనము జరుగుచోట హనుమంతుడు కైమోడ్చి కన్నులనానందబాష్పములు కురియుచుండగా పులకితాంగుడై పరికించుచుండునట. ఆహా! ఏమి ఆ మహనీయుని రామభక్తి.

శ్రీవైష్ణవ సంప్రదాయమున సంకీర్తనము ప్రధానస్థానమును ఆక్రమించుకొన్నది. ఆళ్వారులందరు శ్రీమన్నారాయణుని కీర్తించినవారే. వారి పాటలు నాల్గువేలయి నాలాయిర దివ్యప్రబంధమనుపేర సుప్రసిద్ధములయినవి.

శూడికొడుత్తనాచ్చియార్ సంకీర్తనమువల్లనే రంగధాముని యర్థాంగియైనది. ఇప్పటికిని తమిళదేశమున శ్రీవైష్ణవులీమె పాడిన పాశురములను కీర్తించుచు 'పైయత్తు యిన్త పరమనడిపాడి నెయ్యుణ్ణోమ్ పాలుణ్ణోమ్ నాట్కాలే' నీరాడుట సంప్రదాయము.

'ఓఙ్గి యులగళన్ద వుత్తమన్ పేర్‌పాడి
నాఙ్గళ్ నమ్బావైక్కుచ్చాట్రి
నీరాడినచో వ్యాధిదుర్భిక్షాద్య మంగళములుండవని వైష్ణవ భక్తులకు నమ్మకము.

'రామనామము జన్మరక్షక మంత్రం
తామసము జేయక భజింపవే మనసా'

అని తారకనామ భజనచేసి తరించిన తెలుగు కవులెందరో గలరు. కోదండపాణిని భజించు వారలకు దండపాణి భయముండదని భాగవత మతము.

'తారక మంత్రము కోరిన దొరికెను
ధన్యుడనైతిని ఓరన్నా'

అని సంతోషముతో చిందులు త్రొక్కిన కంచెర్ల గోపన్న రామదాసు బిరుదాంకితుడై ప్రసిద్ధిపొందినాడు

## స్మరణము

ప్రతివ్యక్తి సంగీతజ్ఞుడుగాడు. సంకీర్తనమునకు కొన్ని అర్హతలుండవలెను. స్వరరాగతాళజ్ఞానముండవలెను. కంఠశుద్ధి గావలెను. మూగలకు సంకీర్తనము గగన కుసుమము వంటిది, ఏ అర్హతలతోను పనిలేనిది స్మరణము.

'నామస్మరణాదన్యోపాయం నహిపశ్యామో భవతరణే।
రామహరే కృష్ణహరే తవ నామ వదామి సదా నృహరే॥

'ప్రభూ! నీ నామ స్మరణమునకన్న వేరు ధన్యోపాయంలేదు. ఈ భవసాగరమును తరించుటకు నీ నామ స్మరణమే శరణ్యము. కనుక రామా, కృష్ణాహరే యని నీ నామమునే సర్వధా స్మరింతును.' స్మరణము పూర్తిగా మనస్సంబంధి. దీనికి మూగ బధిర వివక్షతలేదు. సర్వకాల సర్వావస్థల యందును చేయదగినదీ స్మరణమొక్కటే! స్మరణమువల్లనే నోరులేని గజేంద్రుడు, జటాయువు తరించినవి.

(31 వ పుటలో చూడుడు)

శ్రీ సింగనమల్ల రాధాకృష్ణయ్య
సిమెంటునగర్

# గణపతి - ఆరాధన

ఏ కార్యమైనా నిర్విఘ్నంగా పరిసమాప్తి చెందాలంటే "గణపతి" మహాదేవుని పూజించడం మన భారతీయ సాంప్రదాయం. గణపతి ఆరాధన నేపాల్‌కు విస్తరించింది, ఇచ్చట "రక్త గణపతి" ఆలయ ముంది; సాగరములు దాటి జావా వరకు ప్రాకింది. ఇచ్చట "కాపాలిక గణపతి" ఆలయము కలదు, టిబెట్టులోని "బుద్ధగణపతి" ఆలయము, మెక్సికోలోని "వినాయకాలయము" ముఖ్యమైనవి. మరియు బర్మా, సయామ్, జపాన్, బోర్నియోలలో కూడ గణపతిని పూజింతురు.

వినాయక చవితి అటు ఉత్తర భారత దేశంలోనూ, ఇటు దక్షిణ భారతదేశం లోనూ విధిగా ఆచరింపబడే పండుగ. ముఖ్యంగా తమిళులు ఈ పండుగను అత్యంత ఆసక్తితోనూ, భక్తి ప్రపత్తులతోనూ ఆచరిస్తారు, వారు గణపతిని "పిళ్ళైయార్" అంటారు.

వైదిక యుగంలోనూ, పౌరాణిక యుగంలోనూ గణపతి పేరు వాడుకలో నున్నది. పురాణాలలోని అనేక కథల ప్రకారం ఆతడు విఘ్నాల కధిపతి, గణపతి విఘ్నాలను కలిగించనూ గలడు. వాటిని తొలగించనూ గలడు. 'గ' అనగా బుద్ధి; 'ణ' అనగా విద్య లేక వివేకము; 'పతి' అనగా అధిపతి, కనుక "గణపతి" అనగా విద్యాబుద్ధులకు 'అధిపతి' అని అర్థము. త్రిపురాసుర సంహార కాలములో శివుడు గణపతిని పూజించి విజయము పొందినట్లు తెలియుచున్నది. ఆ సమయంలోనే శివుడీతనిని సకల శుభారంభ వేళల పూజనీయునిగా నిర్ణయించాడు. ఆ నాటినుంచి అందరు ప్రతి కార్యారంభంలోనూ విఘ్నేశ్వరుని ముందు పూజించుట ఆచారమైనది.

శ్రీకృష్ణుడు జాంబవంతుని దగ్గరనుంచి శ్యమంతక మణిని సంపాదించడం కోసం బయలుదేరినపుడు; ఇంద్రుడు వృత్రాసుర సంహారానికి పూనుకొన్నపుడు; భగీరథుడు గంగను భూమిపైకి తెచ్చుటకు ప్రయత్నించినపుడు; ధర్మజుడు కురుక్షేత్ర భూమిని యుద్ధమునకు సన్నద్ధుడైనప్పుడు విఘ్నేశ్వరుని ప్రార్థించి తమ తమ కార్యములు నిర్విఘ్నంగా కొనసాగించిరని తెలుస్తోంది.



గణపతి ఏనుగు తలను, ఏకదంతమును పెద్ద బొజ్జను కలిగి యున్నాడు. ఈ దేవుని జన్మ వృత్తాంతమును గురించి అనేక కథలు ప్రచారంలో వున్నాయి. పూర్వం ఏనుగుతల కలిగిన 'గజముఖు' డనే రాక్షసుడు దేవతలందరిని బాధిస్తూ వుండేవాడు వారు ఇతని బాధలు భరించలేక శివుని కడకేగి మొరపెట్టుకొనిరి. శివుడు ఏనుగుతల కలిగిన మహావీరుని (గణపతి) సృష్టించి ఆతని ద్వారా గజముఖుని చంపించాడు. నాటినుండి దేవతలందరూ వినాయకుని యెడ భక్తి ప్రపత్తులు కల్గి ఆతని ముందు గుంజిళ్ళు తీయుచుండిరి. ఈ ఆచారము నాటినుండి కొనసాగి నేడు వినాయకుని గుడిముందు గుంజిళ్ళు తీయడం ఆచారమైపోయింది

ఒకనాడు పార్వతీదేవి స్నానం చేయబోతూ ఒక పిండి బొమ్మను చేసి ప్రాణం పోసి ఇంటిముందు కావలియుంచి ఎవ్వరినీ లోనికి రానీయవద్దని చెప్పి వెళ్ళింది. ఆ బాలుడు శివుని కూడా లోనికి రానీయలేదు. శివుడాగ్రహించి తన శూలముతో ఆతని శిరస్సు తెగవేశాడు. విషయము తెలిసిన పార్వతీదేవి ఆ బిడ్డకు ప్రాణము పోయుమని శివుని ప్రార్థించినది. ఆయన తన భటులను పంపి ఉత్తర దిశగా తల వుంచి నిద్రించుచున్న ఏనుగుతల నొక

శ్రీ సి. పూర్ణచంద్
తిరుపతి

దానిని నరికించి తెప్పించి, దానిని ఆ బొమ్మతలగా అమర్చి ప్రాణంపోశాడు. ఆ బిడ్డడే వినాయకుడని మరొక కథ చెబుతోంది.

గణపతి తొలుత ఓ ద్రావిడ దేవుడని సూర్యుని ఆరాధించిన తొలి మానవులు ఈయనను కొలిచారని ఒక అభిప్రాయం. మూషిక వాహనం ఎక్కిన గణపతి రాత్రిని పారద్రోలుతున్న సూర్యుడనే వాదన లేకపోలేదు. ఇక్కడ మూషికం రాత్రికి చిహ్నం. ఏనుగుతల, ఎలుకవాహనం గల ఈ దేవుడు జంతువుల ఆరాధన నుంచి ఆవిర్భవించాడని ఓ నమ్మకం.

గణపతిని గురించి ఇంకా కథలు ఇలా చెప్తాయి — రజతాద్రి పై పార్వతీపరమేశ్వరులు విహరిస్తూ వుండగా ఆ కొండ క్రిందనున్న సరస్సులో ఏనుగులు కామకేళి

(29వ పేజీలో చూడుడు)

# ప్రత్యేక దర్శనం టిక్కెట్లు

**శ్రీవారి దర్శనపు రూ. 25/- ప్రత్యేక దర్శనపు టిక్కెట్లు ఆంధ్రాబ్యాంకువారి ఈ క్రింది శాఖలలో లభిస్తవి.**

## — ఆంధ్రప్రదేశ్ —

అనంతపురంజిల్లా
- అనంతపూర్

కడపజిల్లా
- కడప
- ప్రొద్దుటూరు

పశ్చిమ గోదావరిజిల్లా
- ఏలూరు
- భీమవరం
- తణుకు

తూర్పుగోదావరిజిల్లా
- రాజమండ్రి
- కాకినాడ (మెయిన్)
- రామారావుపేట (కాకినాడ)

నెల్లూరుజిల్లా
- నెల్లూరు

ప్రకాశంజిల్లా
- ఒంగోలు
- చీరాల

చిత్తూరుజిల్లా
- చిత్తూరు
- తిరుపతి (మెయిన్)
- బాలాజీనగర్ (తిరుపతి)
- హుజూర్ ఆఫీసు అనుబంధ కౌంటరు (తిరుపతి)
- కాళహస్తి

విశాఖపట్నంజిల్లా
- విశాఖపట్నం (మెయిన్)
- మహారాణీపేట (విశాఖపట్టణం)
- విజయనగరం

కరీంనగర్ జిల్లా
- కరీంనగర్

కర్నూల్ జిల్లా
- కర్నూలు

ఖమ్మంజిల్లా
- భద్రాచలం
- ఖమ్మం

క్రిష్ణాజిల్లా
- విజయవాడ (మెయిన్)
- గాంధీనగర్ (విజయవాడ)
- గవర్నర్ పేట (విజయవాడ)
- మచిలీపట్నం

గుంటూరుజిల్లా
- గుంటూరు (మెయిన్)
- బ్రాడీపేట (గుంటూరు)
- తెనాలి

హైదరాబాదుజిల్లా
- హైదరాబాదు (మెయిన్)
- హిమయత్ నగర్
- చిక్కడపల్లి
- ఖైరతాబాదు
- విజయనగర్ కాలని
- సికింద్రాబాదు
- మారేడ్ పల్లి

వరంగల్ జిల్లా
- వరంగల్

మెదక్ జిల్లా
- సిద్దిపేట

మహబూబ్ నగర్ జిల్లా
- మహబూబ్ నగర్

నల్గొండజిల్లా
- నల్గొండ

నిజామాబాద్ జిల్లా
- నిజామాబాద్

అదిలాబాద్ జిల్లా
- అదిలాబాద్

## — రాష్ట్రేతర ఆంధ్రాబ్యాంకు శాఖలు. —

- పాట్నా
- టాటానగర్
- అహ్మదాబాద్
- బరోడా
- సూరత్
- బెంగుళూర్ (ఎస్.ఆర్. రోడ్)
- చామ్‌రాజ్ పేట (బెంగళూర్)
- బళ్ళారి
- గంగావతి
- రాయచూరు
- హోసపేట
- త్రివేండ్రం
- ఎర్నాకులం (కొచ్చిన్)
- భోపాల్
- జైపూర్
- జబల్ పూర్
- బొంబాయి (మెయిన్)
- చెంబూరు (బొంబాయి)
- మాతుంగ (బొంబాయి)
- నాగపూర్
- భువనేశ్వర్
- బర్హాంపూర్
- రాయగడ
- పూరీ
- రూర్కేలా
- మద్రాసు (మెయిన్)
- మైలాపూర్
- టి. నగర్
- షెనాయ్‌నగర్
- కోయంబత్తూర్
- మధురై
- సేలం
- తిరుపూర్
- కలకత్తా
- బాలిగంజ్ (కలకత్తా)
- ఖరగ్ పూర్
- దుర్గాపూర్
- చండీఘర్
- కన్నాట్ సర్కస్ (న్యూఢిల్లీ)
- కరోల్ బాగ్ (న్యూఢిల్లీ)
- రామకృష్ణాపురం (న్యూఢిల్లీ)
- లక్నో
- అలహాబాద్
- వారణాశి
- లూధియానా

# వేదాంత దేశికులు

శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి,
అలిఘర్

(గత సంచిక తరువాయి)

దివ్యప్రబంధ కర్తలైన ఆళ్వారుల దివ్య చరిత్రను సూక్ష్మముగా తెలిసికొనుట యుక్తము, నావశ్యకమునై యున్నది. ఆళ్వారులందఱు శ్రీ వైష్ణవమునకు చెందిన సాధువులు. చరిత్రదృష్టిలో వీరందఱును పల్లవరాజుల కాలమునకు చెందినవారు. తమిళదేశమందలి తామ్రపర్ణి, వైగై, పాలార్, కావేరి నదీ ప్రాంతముల అవతరించినవారు. ఈ జీవనదులు దక్షిణ భారతమున ప్రవహించి, జనుల మనస్సును, శరీరమును చల్లపడజేయునట్లే ఆళ్వారుల భక్తిప్రవాహముకూడ అందఱి హృదయములను చల్లపఱచి సంతోషపెట్టును. భక్తియే ముక్తికి దారి, భక్తికి అందఱును అధికారులు అను భాగవత తత్త్వమును బోధించి చెప్పి మార్గదర్శకులైన మహాత్ములు వారు.

ఆళ్వారులలో ప్రసిద్ధికెక్కినవారు పండ్రెండుగురు. వీరందఱును, తమ ప్రబంధములందు, పరమాత్మని సౌలభ్య, సౌశీల్య, సౌందర్యాతిశయములకు అర్చావతారమే ముఖ్యచిహ్నమని నుడివి యున్నారు.

వీరిలో మొదటి ముగ్గురు 1. పోయ్‌గై యాళ్వార్ 2. పూదత్తాళ్వార్ 3. పేయాళ్వార్. వీరి జీవితములు ఒకే సంఘటనమున ముడిపడియున్నవని చెప్పుదురు. పోయ్‌గై యాళ్వార్ కమల పరాగమందును పూదత్తాళ్వారు మాధవీ కుసుమమందును, పేయాళ్వారు కెందామరయందును అవతరించిరి. పుష్పజాతకులైన ఈ ముప్పురు మహాత్ములు అవతరించిన తక్షణమే జ్ఞాన భక్తి వైరాగ్యయుక్తులైరి. దీనికి పరమాత్మను గ్రహమే కారణము. అటుపిమ్మట వారు గ్రామైక రాత్రముగా తిరుగుచు తిరుక్కోవిలూరు అను నూరికి ఒకరాత్రే ఏకకాలమందు ఒక్కొక్కరుగా (ఒకరికి తెలియకుండ నింకొకరు) వచ్చి యుండిరి. ఒక విచిత్రసన్నివేశమున ముప్పురు ఒక్కచో చేరిరి. ఆ రాత్రి ఝంఝూవాతము రేగి మేఘములు వర్షము క్రుమ్మరింప నారంభించినవి. మొదట పోయ్‌గైయాళ్వారు, రాత్రి చీకట్లో ఒక మంటపమందు వచ్చి నిద్రించిరి. కొంత ప్రొద్దయిన తరువాత పూదత్తాళ్వారులు అదే మంటపమునకు వచ్చి "తమ కొక్కరికి స్థలము కలదా?" అని ప్రశ్నించిరి. ఇరువురు కూర్చుండుటకు మాత్రము స్థలము కలదు. రండి కూర్చుందము" అని ఇరువురుకూర్చుండిరి. మఱి కొంత సేపటికి పేయాళ్వారు వానలో తడిసివచ్చి, ఆశ్రయము కోరిరి. అప్పుడు వారిరువురు ఇద్దరు కూర్చుండు స్థలములో ముగ్గురు నిలుచుండవచ్చును అని చెప్పి వారిని ఆహ్వానించిరి. వారు ముప్పురు ప్రక్క ప్రక్కల ఒత్తుకొని నిలుచుండిరి. చీకట్లో ఒకరి మొగము ఇంకొక్కరికి కానరాకుండెను, బైట వాన జోరున కురియ నారంభించెను. చలికి ఒకరిని ఒకరు ఒత్తుకొనుచు 'మీరు ఎవరు?' 'మీరు ఎవరు' అని ప్రశ్నించుకొనిరి. అప్పుడు ఒకరు తాము భగవచ్ఛేషభూతుల మనిరి. వారిలో ఒక్కరువాసుదేవుని దాసుల మనిరి. మూడవవారు రాముని దాసులమనిరి, ఇట్లు ముగ్గురు మాటలాడుచుండగా మఱెవ్వరో ఒత్తుచున్నట్లుగా, చేతికి చిక్కక జారిపోతున్నట్లునాయెను. ఇట్లు తమను ఒత్తినతడు పరమాత్ముడని వారు తమ యోగదృష్టిచే తెలిసికొనిరి ఆ ఆనందానుభవముచే సంతోషించి పాడిరి ఇట్లు పాడిన ఒక నూరు పద్యములలో తాము అనుభవించిన సందర్భమును గుఱించి వారు వివరించి యున్నారు. ఇదే దివ్య ప్రబంధము దీనికి తిరువందాది అనిపేరు. అట్లు అయో నిజులైన ముగ్గురు మహాత్ములు, పరమాత్మని నిర్హేతుక కటాక్షముచే శుద్ధ సత్త్వ యుక్తులై, భక్తి వైరాగ్యములతోకూడిన భగవంతుని గుణామృత పానము చేయుచు కాలము గడిపిరి

తిరుమళిశై యాళ్వార్ : వీరుతిరుమళిశై అను దివ్యస్థలములో అవతరించి తిరువాళర్ అనువారి రక్షణ యందుండిరి. వీరు పుట్టగనే స్తన్యపానాది భోజనముల నాశింపక భవద్గుణైక ధారకులై దొడ్డభక్తులైరి. పరమాత్ముని దివ్యమంగళ విగ్రహ సౌందర్యాతిశయమును అనుభవించి తిరుచ్ఛంద విరుత్తం, నాన్ముకన్ తిరువందాది అను దివ్య ప్రబంధములను గానము చేసి యున్నారు. వీరు తమకృతిలో "నేను ద్విజులలో పుట్టలేదు. నాకు నాల్గు వేదముల జ్ఞానములేదు. ఇంద్రియ నిగ్రహము లేదు. శ్రీహరి పాదపద్మములు తప్ప నాకు తెలిసినది వేఱొక్కటి లేదు. దేవా! నీ శ్రీచరణములే నాకుదిక్కు" అని గానము చేసియున్నారు. జగత్తంతయును భగవంతుని శరీరము దాని ఆత్మయే అతడు. జగత్తును సృష్టించి, దాని యందవతరించినను, దేనికిని సంపృక్తము కాని సూక్ష్మ వస్తువే పరమాత్మ అని తత్త్వము వియా

పించి యున్నారు వీరి ప్రబంధములో భక్తి భావముతో బాటు తత్త్వచింతనా విషయము కూడ సమ్మిళితమై యున్నది.

తిరుమళిశై యాళ్వారుల చరిత్ర అద్భుతమైనది. ఆశ్చర్యకరమైన సంఘటనలెన్నియో అందు ఇమిడియున్నవి. ఒకసారి తమకు పాలు ఇచ్చుచున్న వృద్ధ దంపతులకు యౌవనము వచ్చునట్లుచేసిరి. రోగముచే బాధపడుచున్న వృద్ధ వారాంగనను అప్సరఃస్త్రీ సమ సుందరినిగా గావించిరి. వేదాధ్యయనమందు నిమగ్నులై యున్న విప్రులు తాము నిలిచిన స్థలము జ్ఞాపకమునకు రాక ఘర్షణపడుచున్నప్పుడు, మఱొకసారి పార్వతీ పరమేశ్వరుల రాకను వీరు గమనింపకయే పరిహాసమాడి పరమశివుని కోపమునకు గుఱియైరి కుపితుడైన పరమశివుడు తన ఫాలనేత్రమును తెఱువగా తాము అంగుష్ఠము కొననుండి అగ్ని ప్రజ్వలింపజేసి ఫాల నేత్రాగ్నిని అణచిరి ఆళ్వారుల భగవదనుభవమునకు శివుడాశ్చర్యపడి వీరికి "భక్తిసారుడు" అను పేరిడి, పొగడి తిరోహితులైరి. అని దివ్యసూరి చరిత్రము తెలుపుచున్నది. వీరు నాన్ముగన్ తిరువందాది తిరుచ్చంద విరుత్తం అను దివ్య ప్రబంధములను గానము చేసియున్నారు.

> శక్తి పంచమయ విగ్రహాత్మనే
> శుక్తి హార జిత చిత్తహారిణే
> ముక్తిదాయక మురారిపాదయోః
> భక్తిసారమునయే నమో నమః ॥

### నమ్మాళ్వారులు

వీరు బహుప్రసిద్ధులు. వీరికి శ్రీశఠారి, శఠకోపముని, మారన్ - మొదలగు పేరులు గలవు వీరు ప్రపన్నజన కూటస్థులని ప్రసిద్ధులై యుండుటచే "కులపతేః వకుళాభి రామం" అను పేరు కూడ రూఢి కెక్కినది మా కులస్థుల కందరికని శ్రీ శఠారియే సర్వవిధబంధువని యామున మునులు పొగడియున్నారు. శ్రీమన్నారాయణుని చరణారవింద యుగళరూపమై భక్తజనుల శిరస్సుపై నుంచదగిన శఠారి మూర్తినే ఉత్సవాదులందు భగవంతుని దివ్యమంగళ విగ్రహమునకు మాఱుగా పూజించు పద్ధతిగలదు.

శఠారి మునివర్యులు తామ్రపర్ణీనదీతీర మందలి ఆళ్వార్ తిరునగరి అను దివ్య క్షేత్రమున అవతరించిరి. పుట్టినతోడనే శిశువు కన్ను తెఱవక స్తన్యపానాదికము లేవియు లేకనే బలముగా ఏపుగా పెరుగుచు వచ్చెను. కారుకాపురాధీశుడట్లున్న శిశువునకు మారన్ అను నామకరణము గావించెను. దేవస్థానం దగ్గఱనున్న చింతచెట్టుకొమ్మకు తొట్టి కట్టి అందులో శిశువునుంచి ఊగింప మొదలిడిరి. ఇట్లే పెరిగి పెద్దయైఅక్కడనే పద్మాసనస్థుడై మౌనము వహించి యోగధ్యానములో కుడిచేత జ్ఞానముద్ర వహించి పదునారు వత్సరములు పెరిగిరి. ఇట్లుండగా మధురకవి అను ఇంకొక ఆళ్వారులు ఉత్తర దేశమునకేగి గంగాస్నానమాడి, అక్కడ ఉండగా ఒక రాత్రి ఒక ద్యోతేజఃపుంజము ఆకాశమున గానబడియె. అది తమను పిలుచునట్లు వారికి తోచెను దానిని అనుసరించుచు ప్రయాణించిరి. అది వారిని ఆళ్వార్‌తిరునగరికి తీసికొనివచ్చి మాయమయ్యెను. వారు అచ్చటి జనులను విశేషము లేవని ప్రశ్నించిరి. వారు ఆయనకు చింతచెట్టు క్రింద అద్భుతతేజస్సుతో కూడియున్న బాలకుని చూపించిరి. బాలకుడు కన్ను తెఱచిన మాటలాడవలెనని మధురకవి చాల ప్రొద్దు ప్రయత్నించిరి ఏమియు ప్రయోజనము లేకపోయెను. బాలకుడు కంటిని తెఱవనే లేదు.

( సశేషము )

# శ్రీకృష్ణుడు - లోకసంగ్రహము

సక్తాః కర్మణ్యవిద్వాంసో అనుథా
కుర్వంతి భారత
కుర్యాద్విద్వాన్ తథాసక్త శ్చికీర్షుర్లోక
సంగ్రహమ్॥
— భగవద్గీత

భగవంతుడు లీలామానుషవిగ్రహుండై యవతరించినపుడు తన దివ్యత్వమును మరుగుపరచి కేవల మనుష్య కృత్యముల నిర్వర్తించుచు నీ యవతారోద్దేశములను పూర్తిచేయుట యెల్లరికి విదితము. ఇట్టి యవతారము లెల్ల దేశములయందు నెల్ల కాలములయందు కులాచార పరిస్థితులఁ బరిగణింపక కేవల ధర్మరక్షణార్థమై వెలు వడుచుండును. వీనిలో శ్రీకృష్ణావతార మొకటి. ద్వాపరాంతమున సంభవించిన దగుటవలన గలియుగమున ముఖ్యముగ గమనింపఁదగినదై వన్నె కెక్కెను.

ఇందలి కృష్ణలీలలు కొన్ని సందర్భములయందు మానుషాతీతములు మాత్రమే కాక దైవాతీతములుగను స్ఫురించుట వలనను, కొన్ని వేళలయందు మనుష్యనీతిని కూడ నతిక్రమించుటవలనను, శ్రీకృష్ణుని యందు మందమతులు దోషారోపణచే యుచు కృష్ణభక్తికి దూరీకృతులగు చున్నారు వారి పురోభాగిత్వమునకు వారి వారి పుణ్యభాగ్యములే కారణము గానోపు. అద్భుతము సొంతముగ నర్థమగుటకు దానుగూడ నద్భుతశక్తి సామర్థ్యములఁ గలవాడు కావలెను. సమకాలీనులైన బల రామార్జున వసుదేవాదినరులకును బ్రహ్మేం ద్రాది సురలకు నగమ్యమైన భగవల్లీల నామూలాగ్రమన్వయించుకొనుట దుర్లభ మనుటకీ క్రింది శుకవాక్యమే ప్రమాణము.

ఏవం విధాన్యద్భుతాని కృష్ణస్య
పరమాత్మనః ।
వీర్యాణ్యనంత వీర్యస్య సంత్య నంతాని
భారత ॥
(భాగ 10–85–58)

మనుష్యులకు భక్తిబోధకములుగను ముక్తిదాయకములుగ నుండుట కొరకు కొన్నిపట్ల భగవంతుడే స్వయముగా మనుష్యధర్మములకు లోబడి కష్టదుఃఖ ముల ననుభవించుట నైతము గలదు అట్టి తరుణములయందు దానాచరించు లీలలు లోకసంగ్రహములని పై శ్లోకమున నిరూపింపబడుచున్నవి. అందుల కుదాహ రణముగా జరాసంధ యుద్ధమున బలుమారు గెలుచుటయు, క్వచిత్పలాయనమును వర్ణించుచు

శ్రీ వి. పక్కీరారెడ్డి
పులివెందుల

మనుష్య దేహినాం చేష్టా మిత్యేవ మనువర్తతే
లీలా జగత్పతే స్తస్య ఛందతః పరివర్తతే
(విష్ణుపురాణము 5–22–15)

భగవంతునకు జయమేమిటి? పరా జయమేమిటి? తల్లిచే రోకటగట్టబడు టయు సత్యామతల్లిచే జరణ కమల పూజ గొనుట నిట్టివే.

ఈ లోక సంగ్రహదీక్ష శ్రీకృష్ణుని విద్యాభ్యాసమున నెట్లు ప్రకాశించినదో తెలు పుట యీ వ్యాసోద్దేశము

## గురుకులవాసము

కంసవధానంతర ముగ్రసేనునికి బట్టము గట్టి గర్గులచే నుపనీతుడై విద్యాభ్యాసము నకు, దల్లిదండ్రులచే గాశీపురికి సాందీ పని సన్నిధి కంపబడెను. అక్కడ

అఱువది నాలుగు విద్దెల
నఱువది నాల్గైన కళల యందలి సారం
బఱువది నాల్గు దినముల నె
యఱగొరలేవి లేని యట్లు లందరి జనకా

(శ్రీ గర్గభాగవతము మధురా ఖండము 277 పద్యము) ఈ విధముగా రామకృష్ణులు అచిరకాలములోనే సాంగ చతుర్వేదాధ్యయ నమును, చతుష్షష్టి కళాభిజ్ఞతయు నార్జించి రని వర్ణించుటలో సంశయముల సాధ్యమా యన్న సాధ్యమనుటకు శ్రీ భాగవతమున

సర్వంత ద్విజుధ శ్రేష్ఠా సర్వవిద్యా ప్రవర్తకా
సకృన్నిగద మాత్రేణ తౌ సంగృహతుహిర్నృపా
(10–45–37)

అనునది సమాధానము.

సమస్త విద్యలకు సృష్టికర్తయైన భగ వంతుడు నేర్చుకొనవలసిన దేమున్నది. ఒకరు నేర్పవేమున్నది కాశీకేల బోవల యును. మధురలో నుపాధ్యాయులులేరా? పాఠశాలలులేవా? కృష్ణుడు శ్రీమంతుడు కాడా? ఇంటికి వచ్చి చదువు చెప్పమనిన నేవత్తును, నే వత్తునని యెందరురారు? సాందీపనియే సకుటుంబముగా కాశి వదలి రాడా? చదువు కొఱకు గష్టపడవలెనా? అను సంశయాకులచిత్తులకెల్లరకును సమాధానము

గురోరనుగ్రహేణైవ పుమాన్ పూర్ణః
ప్రజాయతే
భాగ 10–81–43

అని సదురువుయొక్క విశేషానుగ్రహ సంపాదనమున కావశ్యకమైన సోపాన ముగా గురుకులవాస మభివర్ణితము.

2. కళాభ్యాస మావశ్యకమా? ఇది రెండవ సందియము - సర్వజ్ఞునకు శాస్త్రా భ్యాసమా? గోపికా క్రీడల యందును రాసక్రీడల యందును నాబాల గోపాల మాకర్షింప జాలిన వేణుగాన లోలునకు సంగీత కళాభ్యాసమా? పరివారము మొదలు ప్రభువువరకు దునుమాడిన కంస మర్దనునకు ధనుర్విద్యాభ్యాసమా? కాళంగి మర్దనునికి నృత్యమునేర్పుటయా? దావాగ్ని

(27వ పేజీలో చూడుడు)

# శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, తిరుమల

## వివిధ ఆర్జిత ఉత్సవముల ధరల వివరములు.

### దర్శనములు

1. స్పెషల్ దర్శనము రు. 25

ఈ టికెట్టు తిరుమలలోనూ, దేశంలో ఆంధ్రాబ్యాంకువారి వివిధశాఖలలోను లభించును ఈ టిక్కెట్టు వారిని సుప్రభాత సమయంలోనూ, సర్వదర్శన సమయంలోను అనుమతించటం జరుగుతుంది ఈ టిక్కెట్టు వారిని సర్వదర్శన సమయంలో ధ్వజస్తంభము వద్ద గాక మహా ద్వారంవద్ద క్యూలో చేర్చటం జరుగుతుంది.

### సేవలు

| | | |
|---|---|---|
| 1 | ఆమంత్రణోత్సవము | రు. 200 |
| 2. | పూలంగిసేవ | రు. 60 |
| 3. | అభిషేకము (పులికాపుసేవ) | రు. 450 |
| 4. | గంబురగిన్నె | రు. 250 |
| 5 | పునుగుగిన్నె | రు. 100 |
| 6. | జాఫ్రాగిన్నె | రు. 100 |
| 7. | కస్తూరిగిన్నె | రు. 100 |
| 8. | సహస్రకలశాభిషేకము | రు. 2500 |
| 9. | తిరుప్పావడ | రు. 5000 |
| 10. | కోవిల్ ఆళ్వారు తిరుమంజనం | రు. 1745 |
| 11. | ఐనా మహల్లో డోలోత్సవం | రు. 1000 |

### ఉత్సవములు

| | | |
|---|---|---|
| 1. | వసంతోత్సవము | రు. 2500 |
| 2. | కల్యాణోత్సవము | రు. 1000 |
| 3. | బ్రహ్మోత్సవము | రు 750 |

### వాహనములు

1. సర్వభూపాలవాహనములో వజ్రకవచసేవ 72 + 1 (హారతి) రు. 73

2 బంగారుగరుడ, కల్పవృక్ష, పెద్దశేష, సర్వభూపాల, సూర్యప్రభ ఒక్కొక్కదానికి 62 + 1 (హారతి) రు. 63

3. వెండిగరుడ, చిన్నశేష, చంద్రప్రభ, ఏనుగు, గుఱ్ఱం, హంస, హనుమంత వాహన సేవ ఒక్కొక్కదానికి 32 + 1 (హారతి) రు. 33

### అన్నప్రసాదములు (కౌలుసోల)

| | | |
|---|---|---|
| 1 | దధ్యోదనము | 40 |
| 2. | పులిహోర | రు. 50 |
| 3. | పొంగలి | రు. 55 |
| 4. | చక్కెరపొంగలి | రు. 65 |
| 5. | సాకరబాత్ | రు. 85 |
| 6. | కేసరిబాత్ | రు. 90 |
| 7. | పాయసము | రు. 85 |
| 8. | సీరా | రు. 155 |

### పడుల ప్రసాదములు

| | | |
|---|---|---|
| 1. | అప్పము | రు. 230 |
| 2. | లడ్డు | రు. 450 |
| 3. | వడ | రు. 250 |
| 4. | పోళీ | రు. 225 |
| 5. | దోసె | రు. 100 |
| 6. | తేనెతొళ | రు. 200 |
| 7. | సుఖియం | రు. 200 |
| 8. | జిలేబి | రు. 450 |

### నిత్యసేవలు

| | | |
|---|---|---|
| 1. | నిత్యకర్పూర హారతి | రు. 21 |
| 2. | నిత్యనవనీత హారతి | రు. 42 |
| 3. | నిత్య అర్చన | రు. 42 |

షరా :– సహస్ర కలశాభిషేకము ప్రతి బుధవారమునను, తిరుప్పావడ ప్రతి గురువారమునను జరుగును. మిగిలిన వివరములకు ఈక్రింది చిరునామాకు వ్రాయవచ్చును.

1. ఆమంత్రణోత్సవమునకు 5 గురికి మారుగా ఇద్దరికి మాత్రమే అనుమతి 3, 4 సేవలకు ఇద్దరికి, 5, 6, 7 సేవలకు ఒక్కొక్కరికి మాత్రమే అనుమతి.
2. ప్రతిదినం మధ్యాహ్నం 1-00 గం॥ 8-00 గం॥ లోపల సర్కారు లేదా ఆర్జిత కళ్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, వాహనసేవలు, సర్కారు డోలోత్సవం (ఉయ్యాల) (సర్కారు లేక ఆర్జిత ప్లవోత్సవం, మంగళవారంనాడు) జరుగుతవి.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,
తిరుమల తిరుపతి దేవస్థానం
తిరుపతి 517501

# తిరుమల
# బ్రహ్మోత్సవం

ఒక ఆలయ ఘనతగానీ ప్రాముఖ్యత గానీ ఆ ఆలయ ఉత్సవాల వైభవం, అది ఆకర్షించే యాత్రిక సంఖ్యాసముదాయం, వారి తీరుతెన్నులు – వీటిపై ఆధారపడి వుంటున్నవనేది సర్వసాధారణ విషయం. ఈ దృష్టితో చూస్తే తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామి బ్రహ్మోత్సవాలు స్వామివారి ప్రసిద్ధికి తగ్గట్టుగానే తరతరాలుగా నిర్వహి పబడుతుండిన వని చెప్పవచ్చును.

'అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు' అన్న ప్రశస్తి ఆనాడూ ఈనాడూ ఒక్క ఏడుకొండల స్వామి యందే సార్థకం కావడానికి, కలియుగ దైవమైన శ్రీనివాసుడు భక్తులపాలిటి సాక్షాత్ కొంగుబంగారం అనడానికి, స్వామివారి బ్రహ్మోత్సవాలు ప్రత్యక్ష నిదర్శనాలు.



* * *

[ బ్రహ్మోత్సవం ప్రతిఏటా జరుగుతుంది ఊరంతా ఉత్సాహంతో, కళకళలాడుతుంది. ఆ ఆనంద సంరంభంలో గతాన్ని మరచిపోవటం మన స్వభావం. అప్పటి నాటికి నేటికి ఎంత వ్యత్యాసం ఉన్నదో – ఈ వ్యాసం వివరిస్తుంది. ]

॥ సం ॥

ఆంగ్లం: ఎ. కరుణాకరన్,

అనువాదం: బి. సుధాకర్‌రెడ్డి.

అసలు బ్రహ్మోత్సవ మన్న పేరు వీటికి ఎలా వచ్చింది? బ్రహ్మదేవుని చేత నెలకొల్పబడి నిర్వహింపబడినవి గాన ఇవి బ్రహ్మోత్సవములైనవని శ్రీ వేంకటాచల మహాత్మ్యాది పురాణాలు ప్రకటిస్తున్నవి.

తిరుమల బ్రహ్మోత్సవాలలో కొన్ని విశేషాంశాలు గమనార్హాలు. ఇతర ఆలయాలలో మాదిరి కాకుండా తిరుమల బ్రహ్మోత్సవాలలో సాయంత్రం పూట ధ్వజారోహణం జరుగుతుంది. ఉత్సవ ప్రారంభాలకు పూర్వం ప్రతినిత్యం నింపాదిగా పెరియపెరుమాళ్ తిరువారాధన నిర్వహింపబడటం మరొక విశేషం. వైఖానస ఆగమశాస్త్రవిధుల ప్రకారం అంకురార్పణ, కంకణధారణ జరగడం, బలిఆవరణంలోని అష్టదిశలకూ, అష్టదిక్పాలకులను స్వామివారిఅనుమతితో ఆహ్వానించడం మరికొన్ని విశేషాలు, ఈ అష్టదిక్పాలకుల ఆహ్వాన ఉత్సవం మరి ఏ ఇతర ఆలయంతోనూ సాటిలేనిదిగా వుంటుంది. బంగారు ధ్వజస్తంభంపై గరుడ కేతనాన్ని ఆవిష్కరించడం కూడా నేత్రోత్సవంగా వుంటుంది ఇక పురవీధులలో జరిగే రథోత్సవం చూచి తీరవలసిందే!



ఆనందనిలయం

ఇక ఈ బ్రహ్మోత్సవాల గతచరిత్రను గురించి కొంత పరిశీలిద్దాం. ప్రాచీనకాలంలో తిరుమల అన్నది కాకులుదూరని ఒక కారడివిగానూ, పట్టపగలే క్రూరమృగాల స్వైరవిహారానికి నిలయంగానూ వుంటుండేది. ఐనప్పటికి తిరుమల ఆలయానికి పోషకులైన ఆనాటి స్థానికరాజులు స్వామివారి సేవలో ఏమాత్రం ఏమరుపాటులేక క్రీ. శ. 966 సం॥తో ప్రారంభించి ఒక రాజు తరువాత మరొకరు స్వామివారికి బ్రహ్మోత్సవాలను ఏర్పరస్తూ వచ్చారు. క్రీ. శ. 1583 నాటికి స్వామివారి బ్రహ్మోత్సవ ఉభయములు పదకొండైనవి.

కొప్పుట మాహేంద్రవర్మ ఏలుబడి కాలంలో సత్తివితంకర్ ప్రభువు పట్టపురాణి సమవాయి తిరుమల ఆలయంకు మనవాళపెరుమాళ్ వారి విగ్రహాన్ని సమర్పించింది. వేంకటాచలంపై తిరువిలం కోయిల్‌లో కామార్చన అనంతరం క్రీ. శ. 966 సం॥ జూన్‌నెల 8 తేది శుక్రవారంనాడు ఈవిగ్రహ సమర్పణ జరిగివుండవచ్చును. పురట్టాసి నెలలో తొమ్మిదిరోజులపాటు జరిగేమామూలుఉత్సవాలతో బాటు వాటికి రెండురోజులు ముందుగా మనవాళ్ పెరుమాళ్‌కు సమవాయి రాణి ఊరేగింపుఉత్సవం జరపించినట్లు శాసనాలలో గలదు దీనిని బట్టి క్రీ శ. 10 వ శతాబ్దం నాటినుంచే స్వామివారి ఆలయవార్షిక ఉత్సవాలు పెరట్టాసినెలలో జరుగుతుండేవని మనం గ్రహించవచ్చును.

విజయగండ గోపాలదేవర్ అనే క్రీ. శ. 1254 సం॥ నాటి తెలుగుపల్లవరాజు కాలంలో ఈచిత్తిరై ఉత్సవం (బ్రహ్మోత్సవం) ఒకటి జరుగుతూ వుండినట్లు శాసనాధారాలవల్ల తెలుస్తోంది. (శిలాశాసనం నెం. 127 ఎస్.టి )

తిరుమల ఆలయంలో మూడవ రాజరాజుకు సామంతరాజైన వీరనరసింగదేవుడు పంగుణి ఉత్సవంను, నాల్గవ బ్రహ్మోత్సవం ప్రారంభించినట్లు మరొక శాసనంవల్ల తెలుస్తోంది. (శాసన నెం 230 జి. టి,). ఆరాజే తాను స్వర్ణ తులాభారం తూగగా వచ్చిన బంగారాన్ని స్వామి వారి విమానం తదితరవాటికి మెరుగుపూతకై అర్పించినట్లు ఆ శాసనం ద్వారానే వెల్లడౌతోంది. త్రిభువన చక్రవర్తి శ్రీతిరువేంకటనాథ యాదవరాయలు క్రీ. శ. 1328 ప్రాంతంలో స్వామివారికి ఆడితిరునాళ్‌ను (బ్రహ్మోత్సవం) ప్రారంభించినట్లు ఇంకొక శిలాశాసనం ప్రకటిస్తోంది.

శ్రీవేంకటేశ్వరస్వామివారి ఉత్సవమూర్తులైన మలైకునియనిన్టపెరుమాళ్, (మలయప్పన్) నాచియార్‌ల గురించిన ప్రస్తావన మొదటిసారిగా టి. టి. 102 నెంబరు శిలాశాసనంలో కనిపిస్తోంది.

మలయప్పన్, నాచియార్ ఉత్సవమూర్తుల ఏర్పాటు తరువాత కాలంలోనే అంటే క్రీ. శ. 1339 సం॥ నుంచి బ్రహ్మోత్సవ దినముల సంఖ్య మారినట్లు భావించవలసి వస్తోంది.

శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాపదేవరాయ మహారాయలు ఆరవ బ్రహ్మోత్సవాన్ని ఆశ్వయుజంలో జరిపినట్లు క్రీ. శ. 1429 సం॥ నాటి శిలాశాసనం వెల్లడి చేస్తోంది.

హరిహరరాయల వారి పేరుతో స్వామివారికి మాసి-తిరునాళ్ కైంకర్యం జరిపేందుకు వారి పక్షాన ముల్లై తిరువేంకట జీయర్ శ్రీభండారంకు (ఆలయనిధి) వంద పణాలను చెల్లించినట్లు టి. టి. నెం. 103 శిలాశాసనంద్వారా విదితమౌతోంది. ఇది ఏడవ బ్రహ్మోత్సవమని చెప్పవచ్చును.

తిరుచ్చుకనూర్ (తిరుచానూర్) స్థానత్తార్‌లో ఒకరైన అనంతశయనర్ 15-12-1445 సం॥లో ప్రతి అంకురార్పణ రోజున, తిరువేంకట ముడైయన్ సుళియంపడి సంప్రీత్యర్థం, తీర్థవారి దినంరోజున అధివాసంలో తిరుక్కణ్ణామడై పూజనిమిత్తం మూడువందల నర్పణాలను శ్రీభండారంకు చెల్లించినట్లు ఈ సేవలు ఏడు తిరుక్కొడితిరునాళ్‌లలో జరగాలని కోరినట్లు క్రీ. శ. 1446 నాటి 17 నం. జి. టి. శిలాశాసనం వల్ల తెలుస్తోంది. ఏడు తిరుక్కొడి తిరునాళ్ అన్న పదంద్వారా అప్పటికి బ్రహ్మోత్సవాలసంఖ్య ఏడు అని నిర్ధారింపబడుతోంది. క్రీ. శ 1446 నాటి మరొక శిలాశాసనంకూడా దీనిని ధృవీకరిస్తోంది.

కోయిల్ కెల్వి ఎంపెరుమానార్ జీయర్ నామాంకితమైన 17-2-1446 నాటి శిలాశాసనంద్వారా అంకురార్పణం తరువాత పదకొండవరోజున పుష్పయాగం పేరుతో ఒక నూతన ఉత్సవం ఏర్పాటైనట్లు విశదమౌతోంది. బ్రహ్మోత్సవాల సమయంలో స్వామివారికి సంరక్షకులుగా పనిచేసిన



హంసవాహనం

అష్టదిక్పాలక దేవతలు విధి పరిసమాప్తితో సెలవు గైకొనే దినంగా ఇది ప్రసిద్ధమైంది. పై శాసనాలలోని సంఖ్యలతో తారతమ్యాన్నిబట్టి బ్రహ్మోత్సవ దినముల సంఖ్య పదినుంచి పన్నెండువరకు పెరిగినట్లు స్పష్టమౌతోంది. ఈ ఉత్సవ దినాలసంఖ్య ఆ తదనంతరం పదమూడుకు పెరిగింది. బ్రహ్మోత్సవకాలంలో పుష్పయాగ ఉత్సవాన్ని కందాడై రామానుజ అయ్యంగార్ కొనసాగించినట్లు క్రీ. శ. 1495 నాటి ఒక శిలాశాసనం పేర్కొంటున్నది. శక్రత్తాల్‌వార్ సాయంసమయ పురవీధి మహో

త్సవం ఒకటి వుండినట్లు క్రీ. శ. 1446 నాటి ఒక శాసనం బయట పెడుతున్నది.

శ్రీవారి ఆలయంలో ఉయ్యాలసేవను గురించి ఆలయపాకశాల దక్షిణపు గోడమీదవున్న క్రీ. శ. 1230నాటిఒకచిన్న శాసనపుముక్కవల్ల తెలుస్తోంది. చిత్రమాసంలో అన్నావూంజల్ జరిగేదట! అంటే బ్రహ్మోత్సవంలో కొన్ని దినాలలో ఉత్సవమూర్తిని దేవేరులను మండపంలో ఉయ్యాలలో ఊపడంఅని. అది ఇప్పుడు బ్రహ్మోత్సవాలలో దాదాపు నిత్య కార్యక్రమం అయిపోయింది. అలాగే కీ.శ 1476న శ్రీ శఠగోపనరసింహరాయ మొదలియార్ వేయిం

సింహవాహనం





చిన శాసనంలో డోలామహోత్సవాన్ని గురించిన వివరాలు, చిత్రిమాసం బ్రహ్మోత్సవంలో మొదటి ఏడురోజులలో డోలోత్సవ నిర్వహణను గురించి పేర్కొనబడింది ఇంతేగాక ఎనిమిది బ్రహ్మోత్స వాలకు అయ్యేఖర్చును భరించేందుకు దాతలు ముం దుకు వచ్చేవారని క్రీ.శ 1514 నాటి శాసనం తెలుపు తోంది. ఇప్పటి కర్ణాటక రాష్ట్రంలోని శివసము ద్రానికి చెందిన త్ర్యంబకదేవుడు ప్రతి బ్రహ్మోత్స వంలోనూ ఎనిమిది కల్యాణ దినాలకుగాను నాయక తళిగె ఏర్పాటుచేసేందుకు క్రీ.శ 12-10-1517న

తొమ్మిది బ్రహ్మోత్సవాలుగాగా 4 - 11 - 1535 నాటికి మల్లరసర్ నగరిగళ్ దేవేరులకు శ్రీవారికి నివేదనకు అయ్యే అప్పపడిలిభక్ష్యాను ధరించేందుకు ముందుకురావడంతో బ్రహ్మోత్సవాలసంఖ్య పదికి పెరిగింది అలాగే క్రీ. శ. 15?? నాటికి ఉత్సవదినాలసంఖ్యకూడా 10 నుండి 13 కి పెరిగింది.

శ్రీవీరప్రతాప అచ్యుతమహారాజుల కాలంలో తిరుమల ఆలయధర్మకర్తలు కార్తీకమాసం బ్రహ్మోత్సవంలో వనభోజన నిర్వాహణకు

సర్వభూపాలవాహనం





కల్పవృక్షవాహనం

మోరాండై గ్రామాన్ని దానంచేసినట్లు తెలుస్తోంది. ఇదేవిధంగా కోయిల్ కెల్విపడ తిరువేంకట జీయర్ తొమ్మిది బ్రహ్మోత్సవాలలో శ్రీవారి, దేవేరుల నివేదనకుగాను తొమ్మిది ఇడ్లీ పడుల శాసనం వేయించినట్టు తెలుస్తోంది. ఈ తొమ్మిది బ్రహ్మోత్సవాలలో కల్యాణోత్సవదినాలలో నివేదనకుగాను తొమ్మిదిఇడ్లీ పడులనుఇచ్చి ఉంబరకోన నివాసిరామానుజదాసర్ ఈ తిరువేంకటజీయర్ తో చేరినట్లుకూడా 3-7-1545 నాటిశాసనంతెలుపుతోంది.

క్రీ శ. 1530 నాటికి అచ్యుతరాయ బ్రహ్మోత్సవం అనే పేరుతోగల బ్రహ్మోత్సవంతో సహా



మోహినీ అవతారం

# శ్రీవారి బ్రహ్మోత్సవ కార్యక్రమం

★

| తేది | వారం | పగలు ఉత్సవములు | రాత్రి ఉత్సవములు |
| --- | --- | --- | --- |
| 22-9-79 | శని | — | సేనాధిపతి ఉత్సవము, అంకురార్పణము |
| 23-9-79 | ఆది | తిరుచ్చిఉత్సవం ధ్వజారోహణము | పెద్ద శేషవాహనము |
| 24-9-79 | సోమ | చిన్న శేషవాహనము | హంసవాహనము |
| 25-9-79 | మంగళ | సింహవాహనము | ముత్యపుపందిలి |
| 26-9-79 | బుధ | కల్పవృక్ష వాహనము | సర్వభూపాలవాహనము |
| 27-9-79 | గురు | మోహినీ అవతారోత్సవం | మకరకంఠి, లక్ష్మీహార, సహస్రనామావళ్యాది ఆభరణములతో, గరుడోత్సవము |
| 28-9-79 | శుక్ర | హనుమద్వాహనము<br>సాయంకాలము వసంతోత్సవము | గజవాహనోత్సవము |
| 29-9-79 | శని | సూర్యప్రభ వాహనము | చంద్రప్రభ వాహనము |
| 30-9-79 | ఆది | రథోత్సవము | అశ్వ(గుఱ్ఱం)వాహనము |
| 1-10-79 | సోమ | పల్లకీ ఉత్సవము, తీర్థవారి అవభృథోత్సవము. (చక్రస్నానం) | ధ్వజావరోహణోత్సవము |

ప్రఖ్యాత గాయక భక్తుడు తాళ్ళపాక తిరుమలయ్యంగార్ పేరిట శాసనం వేయించారు. ఈ సందర్భంగా శ్రీవారు దేవేరులు తాళ్ళపాకవారి మండపంలో ఉయ్యాలలో వేంచేసియుండగా వనభోజన మహోత్సవం జరిగేది అచ్యుతరాయ మహారాయల కాలంలో కృష్ణరాయపురానికి చెందిన వడమలై భట్టు బ్రహ్మోత్సవకాలంలో శ్రీవారి తెప్పోత్సవ సమయంలో కోనేటి పొడుగున స్వామివారికి దేవేరులకు సుఖియపడి నివేదనకుగాను వరహైన్ పణాలను దేవస్థాన ఖజానాకు చెల్లించినట్లు శాసనమున్నది. పదిరికుప్పంకుచెందిన బాచిరసయ్య శ్రీవారి బ్రహ్మోత్సవ సమయంలో జరిగే తొమ్మిది తెప్ప ఉత్సవాలకుగాను తొమ్మిది అప్పపడులను ఏర్పాటు చెయ్యడం జరిగింది. కనుక బ్రహ్మోత్సవాలనేవి ఏ ఒక్క నెలకో పరిమితంకాక ఆడి, అవణి, పొరటాసి, అల్పిసి, కార్తిక, తై, మాసి, పంగుణి, చిత్రి-అంటే సంవత్సరంలో తొమ్మిది నెలలలో ఈ బ్రహ్మోత్సవాలు జరిగేవి. ఐతే పొరటాసి కార్తిక, తై, ఫంగుణి బ్రహ్మోత్సవాలలో మాత్రమే రథోత్సవం జరిగేది. ఇవి ఇలావుండగా తాళ్ళపాక పెద తిరుమలయ్యంగారు రెండువేల బంగారునాణేలు ఖజానాకుచెల్లించితనపేర పదమూడు రోజులపాటు ఆణి మాసంలో బ్రహ్మోత్సవం జరిగే ఏర్పాటు చెయ్యడంతో బ్రహ్మోత్సవాలు క్రీ.శ. 153[illegible] నాటికి పదికి చేరుకున్నవి.

ఈ బ్రహ్మోత్సవాలలో విశేషం ఆలయ కార్యక్రమాలలో జరిగే ప్రతి ప్రక్రియ ఒక విశిష్టమైనదిగా పవిత్రమైనదిగా గుర్తింపబడటం. ఉత్సవాలకు ముందురోజు కోవిల్ ఆళ్వార్ తిరుమంజనం అనే పేర ఆలయాన్ని నీరు, సుగంధ ద్రవ్యాలతో పరిశుభ్రం చేస్తారు. ఆసందర్భంలో మూలమూర్తికి తొడుగువేసి మిగిలిన ప్రదేశాన్ని కర్పూరం చందనం వస్త్రాలతో అద్ది కొంతకాలం తరువాత కడిగివేయడం జరుగుతుంది.

క్రీ శ. 1535 నాటికి వున్న పది బ్రహోత్సవాలకు పది తిరుమంజనోత్సవాలు వుండేవి. తిరుపతికి చెందిన వంగపురం నారాయణచెట్టి నాలుగు వత్తుల పంచామృతం, ఒక వత్తుపానకం ఏర్పాటుచేశారు. ఇది శ్రీవారిపైన కప్పు తొలగించిన తర్వాత నివేద



గరుడవాహనం

నకుగాను. గులాబినీటితో లఘుతిరుమంజనం తర్వాత నివేదనకు ఒక ఇడ్లీ పడి కూడా ఏర్పాటైంది.

పురటాసి మాసంలో జరిగే బ్రహ్మోత్సవ సమయంలో పల్లవోత్సవం, అన్నప్రసాద నివేదన, బీదలకు వస్త్రదానం, తిరుమల ఆలయం ముందున్న నీటి తొట్టి నిర్వహణాదులకుగాను మహా మండలేశ్వర చిట్టి లేశ్వర మహారాజు మూడు గ్రామాలను దానం చేశారు.

సదాశివ మహారాయల కాలంనాటికి ఈ బ్రహ్మోత్సవాలు పదకొండైనవి. తిరుమలలో చిత్ర బ్రహ్మోత్సవ సమయంలో వసంతోత్సవాన్ని అమ్మన్ రామా

నుజ జీయర్ నిర్మించిన వసంత మండపంలో వసంతోత్సవం జరిపేందుకుగాను నొట్టకార వేంకటయ్యర్ అనేవారు 4-11-1614లో ఒకశాసనం వేయించారు. ఈ వెంకటయ్యాన్ కుమారుడు నారాయణన్ బ్రహ్మోత్సవంలో వసంతోత్సవనవమి జరిపేందుకు అన్ని బ్రహ్మోత్సవాలలో చివరి రోజున కమ్మతంచే నిర్మింపబడిన వసంత మండపంలో శ్రీ వారిని దేవేరులను వుంచేందుకుగాను నిధులను ఏర్పాటు చెయ్యడం జరిగింది.

## వాహనోత్సవాలు

క్రీ. శ, పదవశతాబ్ద ప్రారంభందాకా ఉదయం

### గజవాహనం



సాయంత్రం కూడా ఊరేగింపులు జరుగుతూవున్నా ఏ దేవతకు ఈ ఊరేగింపులు జరిగాయన్న విషయం మాత్రం తెలియదు. బ్రహ్మోత్సవాల అన్ని దినాలలో కూడా తిరుచ్చి లేదా మకరతోరణమే వాహనంగా ఉపయోగింపబడేది వీరనరసింగ యాదవరాయలు తిరుమల శ్రీగోవిందరాజస్వామికి నాలుగు ముఖాల దారురథాన్ని తయారు చేయించారు. ఈ రథోత్సవం పురటాసి, ఫంగుణి బ్రహ్మోత్సవాలలో ధ్వజారోహణం మొదలు ఎనిమిదో నాడు జరుగుతుండేది. ఆ నాటి సాయంత్రం అశ్వవాహనం మీద ఊరేగింపు జరిగినట్లుగా 28-12-1491 నాటి శాసనంవల్ల తెలుస్తోంది.

క్రీ శ. 1614 తర్వాత వెండి శేషవాహనాన్ని శ్రీకృష్ణుని 50 రోజుల ఉత్సవాల సందర్భంలో మొదటిరోజున రాత్రివాహనంగా మాత్రం ఉపయోగించడం జరిగింది. తరువాత దినాలలో రాత్రిపూట ఉత్సవమూర్తి, దేవేరులకు గరుడవాహనం మీద ఊరేగింపు జరిగేది. క్రీ శ 1530 వరకు ఈ గరుడ వాహనాన్ని ఏరోజునా వుపయోగించినట్లు దాఖలాలు లేవు

సూర్యప్రభ, వైకుంఠ విమానం అనేవి క్రీ. శ 1564 తర్వాతనే కన్పిస్తున్నవి. హంస, గజవాహనాలను గురించి 1583 నాటి శాసనంలో కనిపిస్తోంది. నొట్టకార వేంకటయ్యాన్ శ్రీవారికి రజత శేషవాహనం సమర్పించినట్లు క్రీ శ. 1614 నాటి శాసనంలో వున్నది క్రీ. శ 1628లో మట్లకుమార అనంతరాయ భూపాలుడు బంగారు అశ్వవాహనాన్ని రజతిగజ వాహనాన్ని, సమర (సర్వ) భూపాల వాహనాన్ని సమర్పించినట్లు తెలుస్తోంది. ఉత్సవాల ప్రారంభం తెలిపేందుకు బాణాసంచా ప్రేల్చడం అనేది ఒక సంప్రదాయంగామిగిలిపోయింది. దీనికిగాను క్రీ.శ. 1583లో ఎట్టూర్ తిరుమల నంబికుమార తాతాచార్య ఇరవై రేఖాపొన్నులను పెణలిబాణం అనే మందు సామగ్రికి గాను ఇచ్చినట్లు శాసనమున్నది.

ఏపేరునజరిగినా ఏవూరులో జరిగినా, ఉత్సవమన్నది ఐహికంగా, అంతోఇంతో భుక్తిదాయకం పారలౌకికంగా పరమాత్మావిష్కరణానికి పరమ సోపానం. తరాలు తరాలు మారుతున్నా ఏ అవాంతరాలు లేక సాగే ఈ అధ్యాత్మిక జ్యోతి ఆరనిది; ఏ నాటికీ మారనిది. *

# నవనిధులు-చతుర్దశ మన్వంతరములు

పద్మినీ మంత్రముచేత సిద్ధించిన నవ నిధులు స్వారోచిష మనువు స్వాధీన మయ్యెను. సమయమనుసరించి ఆ నిధులీ ప్రకారముగా వాడబడుచున్నవి.

మొదటిది పద్మనిధి: సత్వగుణ ప్రధానము. బంగారు వెండి మొదలగు లోహములను కొనుట, అమ్ముటకును, దేవాలయ నిర్మాణములు జీర్ణోద్ధారములకు నిది వాడవలయును.

**2 వది మహాపద్మనిధి:** ఇది కూడ సాత్త్వికమైనది. పద్మ రాగ ప్రవాళ మౌక్తికములను వృద్ధిచేయుచు, యజ్ఞ యాగాది క్రతువులకు బనికి వచ్చును.

**3 వది మకరనిధి:** తమస్సు గుణము కలది. ఆయుధ పరిజ్ఞానము కలవారికి తోడ్పడుచు, రాజుల సంపదలకు బనికి వచ్చుచుండును. అపాయకరమైనది. జాగరూకతతో మెలంగవలయును.

**4 వది కచ్ఛప నిధి:** తామస ప్రవృత్తి. ఇతరులపై నమ్మకములేక తన సంపదను దాచుకొని తానును అనుభవించక జేయును.

**5 వ నిది ముకుందనిధి:** రజో గుణముతో గూడినది. ఎప్పుడు రాజకీవితో వీణాది సంగీతనిపుణుడై, నట విట గాయకులతోగూడి బయటి ప్రపంచమే తెలియనీయకుండును.

**6 వది నంద నిధి:** ఇది రజస్తమో గుణములు గలది. సకల సంపదల నంద జేయుచు మానావమానములపట్ల పట్టుదల, అతిథి అభ్యాగతుల నాదరించుచు పట్టు విడుపులను సరిజూపుచుండును.

**7 నీలనిధి:** సత్త్వ రజస్సులు గలిగినది. విలాస వస్తువులపై మోజు, చెరువులు, నదులు, వ్యాహ్యాళి, ఫల వస్త్రములపై ప్రీతి. ఎప్పుడును సంచారము గలుగ జేయుచుండును.

**8 శంఖనిధి:** ఈ నిధి చాలా విచిత్రముగా బనిచేయుచుండును. తామస రాజసములతో నిండుకొని పిలిచినపుడు మాత్రమే బలుకుచు వయ్యారముగా గులుకుచు తాను మాత్రమే దినుచు ఇతరులవిషయం గ్రహింపనిదిగా జేయుచుండును.

**9 శైలనిధి:** ఇది మరీ విపరీతమైననిధి. ఈ నిధి సర్వకాలము స్వేచ్ఛా పరి వర్తనమై గన్నులుగానక యితరులనుదూషింప జేయుచు, ఆఖరులో యాతనా బాధలను సిద్ధింపజేయును. ఇవన్నియు నవనిధులు. ఒక్కొక్క నిధికి యొక్కొక్క స్వభావము సిరిసంపద కలవాడెల్ల యీ గుణములు కలవాడై యుండును.

ఇక మన్వంతరము లేమిటో తెలియ నగును.

### ఔత్తమ మన్వంతరము

ఉత్తముడు వీరుడగు రాజు. ఒకానొకని 2వ భార్య బహులను త్రాగిన మత్తుచేత ఆమె నెవడో అడవిలో విడచెను. ఆ సంపన్ను డీవీరుని యొద్దకువచ్చి అయ్యా! నా భార్య నెవడో యపహరించినాడు. వాని విషయమును దెలుసుకు రమ్మని కోరెను. ఆమెను జూడని యీతడు ప్రజారక్షణము బాటించి అడవిలో యొక మున్యాశ్రమమును జేరి వేడుకొనెను. ఆ ముని దివ్యదృష్టితో జూచి యుత్పాల వనమున అద్రి సుతుడను రాక్షసుని వద్ద యున్నట్లు చెప్పెను. రాజుత్తముడు వెంటనే అక్కడకు వెళ్ళెను. రాక్షసుడాతనికి మర్యాదలుచేసి, విషయమెఱింగి సుశర్మ గొప్పమంత్రవేత్త. ఆతనియాగాది క్రతువుల హవిస్సు మాకందలేదు. ఇది తప్ప నా యందెట్టి తప్పులేదనెను. ఉత్తముడింగిత జ్ఞానము కలవాడై అడివిలో విడిచిన భార్యను సంపన్నునికడ జేర్చెను. ఉత్తముని సద్గతికై మన్వంతరాధినేత ఔత్తముడు బుట్టెను. అందుచేతనే ఆ మన్వంతరము కా పేరు వచ్చెను.

### రైవత మన్వంతరము

ఋతువాక్కను మునికి ప్రలోభుడను దుర్మార్గుడు తనయుడు. ఎవరేమి చెప్పి


శ్రీ భాస్కరపంతుల మాణిక్యశర్మ
హైదరాబాద్


నను వినువాడుగాడు. మూర్ఖచిత్తుడు. రేవతి నక్షత్రము చివరి పాదమున బుట్టిన దోషమని రేవతిని నేలపై బడుమని ఆక్రోశించెను. ఆ నక్షత్రము బడిన చోట గొప్ప సరస్సు. దానికి రైవతమని పేరు వచ్చెను. అచ్చట నొక కన్య బుట్టెను. ప్రముచుడను సిద్ధికాయుడు ప్రలోభుని సత్యవరిష్ఠు నొనర్చి కన్య నిచ్చి ఋతువాక్కును సంతోష బెట్టెను. వేదశ్రీ సుధామ మొదలగు వారీతని సంతతి. చిరస్థాయిగా రైవత మన్వంతర మను పేర నిలచినది.

### చాక్షుసము :

చక్షు బ్రహ్మకు కలిగిన సంతానమే చాక్షుష మన్వంతరము. పూర్వాపర జన్మలను దెలుపునట్టి కాలము. 1 సంవత్సరము బసికందు. ఇక తానారురోజులు మాత్రము జీవింతును. కాన నాకే యుపచారము చేయవలదని చెప్పెను. తల్లిదండ్రులు దుఃఖించిరి. వారు తపస్సుచేసి బ్రహ్మను

(28 పేజీలో చూడుడు)

# భాగవతము నందలి భక్తులు

(గత సంచిక తరువాయి)

8. ప్రహ్లాదుడు.

ప్రహ్లాద నామోచ్చారణము చేతనే మనస్సున కాహ్లాదము గల్గును. పరమభాగవత శ్రేషులలో నితడు ప్రథమగణ్యుడు మాతృగర్భము జొచ్చి మన్నది మొదలుగా చిత్త మచ్యుతుమీద చేర్చిన సద్గుణ గరిష్ఠుడు. సర్వాంతర్యామియగు శ్రీహరి విషయమున నితనికి గజేంద్రునకు వలె 'కలడో లేడో' అను సంశయ మెప్పుడును కలుగలేదు. 'చక్రి ఇందు గలడు అందులేడు' – అనెడు సందేహము వలదని యితని మాట. తండ్రియాజ్ఞచే రక్కసులు తన్ను బాధింపగా ప్రహ్లాదుడు శ్రీమన్నారాయణుని మాటి మాటికి – "ఓ పన్నగశాయి! యో దనుజ భంజన! యో జగదీశ! యో మహాపన్న శరణ్య! యో నిఖిల పావన! యంచు" – నుతించెనే గాని ఆర్తుడై కన్నులనీరు నించుట, భయకంప సమేతుడగుట చేయలేదు. శ్రీహరిపై నీ పరమ భాగవతునకు గల యచంచల భక్తియట్టిది. భక్తకోటికి ప్రహ్లాదుని సంస్మారము తలమానికము. అది పూర్వ జన్మ పరమ భాగవత సంసర్గ సమాగతంబైన ముకుంద చరణారవింద సేవాతిరేకము. మూర్తీభవించిన హరిభక్తియగు నితడు పరమేశ్వర నామామృతపానముచే పరవశుడై ప్రపంచమునే మఱచిపోవును. సర్వకాల సర్వావస్థలయందును ప్రహ్లాదునకు హరినామ స్మరణమే జీవనాధారము చూడుడు.

"పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్
భాషించుచున్ హాస లీ
లా నిద్రాదులు సేయుచున్ తిరుగుచున్
లక్షింపుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృత
స్వాద సం
ధానుండై మఱచెన్ సురారిసుతుడే తద్విశ్వ
మున్ భూవరా!"
(7–123

అశాశ్వతమగు ప్రపంచమును శాశ్వతమనినమ్మి అజ్ఞులు విష్ణుభక్తి విరహితులై ప్రవర్తించు చున్నారనియు, అట్టివారికి హరి ప్రబోధములు తలకెక్కవనియు నీ విజ్ఞానఖని వచించుమాట లెంతటి మహోన్నత సత్యములో యరయుడు.

శ్రీ డి. నాగసిద్దారెడ్డి,
తిరుపతి.

ఎ)" అజ్ఞుల్ కొందరు మేము తామనుచు
మాయంజెంది సర్వాత్మకుం
ప్రజ్ఞాంభ్యవరాన్వయ క్రమములన్ భాషింప
గానేరరా
జిజ్ఞాసాపథమందు మూఢులుగదా! చింతింప
బ్రహ్మాది వే
దజ్ఞుల్, తత్పరమాత్ము విష్ణు నితరుల్
దర్శింపగా నేర్తురే!
(7-148)

బి "అచ్చపు చీకటింబడి గృహవ్రతులై
విషయ ప్రవిష్టులై
చచ్చుచు పుట్టుచున్ మరల చర్విత చర్వణులైన వారికిం
జెచ్చెర పుట్టునే? పరులు చెప్పిననైన
నిజేచ్ఛనైన నే
మిచ్చిననైన కానలకు నేగిననైన హరి
ప్రబోధముల్" —
(7-181)

భక్తుల దివ్యానుభవము వారికిమాత్రమే విదితము. భగవంతునితో వారు పాడుదురు, ఆడుదురు, మాటాడుదురు, వారి యనుభూతులు పైయుక్తిక మగుట వలన సామాన్యులు నమ్మలేరు. ప్రహ్లాదుని పరమానుభూతి యిట్టిది.

ఎ)" శ్రీవల్లభుడు తన్ను చేరిన యట్లైన
చెలికాండ్ర నెవ్వరి జేరమరచు
నసురారి తన మ్రోల నాడిన యట్లైన
నసుర బాలురతోడ నాడమరచు
భక్తవత్సలుడు సంభాషించి నట్లైన పర
భాషలకు మారు పలుక మరచు
సురవంద్యు తనలోన జూచిన యట్లైన
చొక్కి సమస్తంబు చూడ మరచు
హరి పదాంభోజ యుగచింత నామృతమున
నంతరంగంబు నిండినట్లైన నతడు
నిత్య పరిపూర్ణుడగుచు నన్నియును మరచి
జడత లేకయు నుండును జడుని భంగి"–
(7–122,

మరియు నతడు —

బి)" వైకుంఠ చింతావివర్జితచేష్టుడై యొక్కెడు
నేడుచు నొక్కచోట
అశ్రాంత హరిభావనారూఢచిత్తుడై యుద్ధ
తుడై పాడు నొక్కచోట
విష్ణుడింతియగాని వేరొండులేదని యొత్తిలి
నగుచుండు నొక్కచోట
నలినాక్షుడను నిధానముగంటినేడని యుబ్బి
గంతులు వైచు నొక్కచోట
పలుకు నొక్కచోట పరమేశు కేశవు
ప్రణయ హర్ష జనిత బాష్పసలిల
మిళిత పులకుడై నిమీలిత నేత్రుడై
యొక్కచోట నిలిచి యూరకుండు" –
(7–124)

ఈ యనుభూతిని పట్టిచూడ "పునర్విశ్లేష భీరుత్వం పరమాభక్తి రుచ్యతే" – యను పరమభక్తి లక్షణము ప్రహ్లాదుని పట్ల సమగ్రముగ నన్వయించుచున్నది.

ప్రహ్లాద చరిత్రమున నాసుర భాగవత లక్షణములకు జరుగు సంఘర్షణము వ్యక్తము. ప్రహ్లాదుడు మాతృ గర్భము నందే నారదోపదేశముచేత పరమ భాగవతుడై జన్మించినవాడు. హిరణ్యకశిపుడు

(28 వ పేజీలో చూడుడు)

(15వ పేజీ తరువాయి)
భక్షునికి యోగాభ్యాసమా? గోవర్ధనోద్ధర ణానంతరము శరీర సాధన విద్యయా? ఇంపు విద్య నేర్చుట యనగా విద్యల నుద్ధరించుటకు సకృత్స్మరించుట యని యర్థము.

## గురుశుశ్రూష

అనుగ్రహార్ణవమునకు ముఖ్య సోపాన మైన శుశ్రూష యిందభివర్ణితము. గురు శుశ్రూషకు ప్రబల నిదర్శనము, కుచేలో పాఖ్యానమున వర్ణింపబడి యున్నది. శ్రీ నామ శ్రీధాముల పరస్పర సంభాషణ యందు తామొకరాత్రి ఇంధనార్థ మడవికి బంపబడుటయు, నారాత్రి యకాల వర్ష పాతము వలన బడిన కష్టములును, రాత్రి యంతయు నచ్చటనే గడుపుటయు మరునా డుదయము గురువు వెదకికొనుచు వచ్చు టయు తమరి విద్దరినిఁ జూచి మెచ్చుకొని యాశీర్వదించుటయు నను కథా భాగమున ధేనువుల సగోపముగా రక్షించుటకు గోవర్ధనమెత్తి యింద్రునికి గర్వభంగ మొనర్పంజాలిన దేవుడు కుచేలుని కొఱకు కుచేలునితో గూడ నొకరాత్రి యడవుల నికుమల బడుట గురు శుశ్రూషా సంగ్ర హార్థము లీల కాక యదార్థ మనిపించు కొనునా? ఇందుపదేశింప బడులోక సంగ్రహ సూత్రమేమన.

నాహమిజ్యా ప్రజాతిభ్యాం తపసోఽశ మేన వాతుష్యేయం సర్వ భూతాత్మ గురు శుశ్రూష యాయథా (భాగ 10-81-34)

ఇట్టి శుశ్రూష గురువైన సాందీపని యందేకాక సతీర్థుడైన కుచేలుని యందు నైతము నిజ బ్రాహ్మణ్యమును వెల్లడించు టకు సాక్షి కుచేలునివాక్యము 'శుశ్రూషయా పరమయా' పాద సంవాహనాదిభిః పూజితో దేవదేవేన విప్రవరేన దేవవత్" (భాగ 10-81-18)

## గురుదక్షిణ

ఇందమానుష కళాభ్యాసమున కాదర్శ ముగ నమానుష దక్షిణార్పణము మృత పుత్ర పునరుజ్జీవన విధానమున వక్కాణింప బడినది.

ఇట్టి పునరుజ్జీవన శక్తి కితర నిదర్శ నములుగ మృతులైన తన యన్నల దెచ్చి తల్లికి నివేదించుటయు, మృతులైన బ్రాహ్మణ పుత్రుల దెచ్చుటయు, లోనుగా నితరములుగలవు. ఇందలి యర్థ సంగ్ర హము జనులెల్ల రట్టి శక్తి సంపన్నులుగా గలరని కాని యట్టి గురుదక్షిణలిచ్చి యప ర్ణులు గాగలరని కాని యుద్దేశములేదు యథాశక్తి యథాభక్తి గురు సంప్రీణనము నకు సూత్రప్రాయముగా

"ఇయదేవ హి సచ్ఛిష్యైః కర్తవ్యా గురు నిష్కృతిః
యద్వై విశుద్ధ భావేన సర్వార్థాత్మార్పణం గురౌ"
(భాగ 10-81-41)

గురు వనువర్తింపవలసిన తుష్టికి నిద ర్శనము "ఇంకను గోరగాదగిన దేదియో యాజ్ఞ యొసంగుదన్న నేశంకయు లేక యిట్లులను. సాధువులై శిగువత్సలార, యే యంకిలి లేక నాకు దగినట్లుగ నీ దక్షిణ లిచ్చినారుగా యింక గోఱంత యుండదగు నీప్సిత ముండునే సుంతయేనియున్"

## సతీర్థానురాగము

ఇది కుచేలోపాఖ్యానమున నిండియు న్నది. కుచేలుడు భక్తుడును దాను భగ వంతుడును నను భావము మరుగు బఱచి సంభాషణ యంతయు సతీర్థానురాగమునే వెల్లడించుచున్నది. అడవికిబోయి తపస్సు జేసి ధనము తెమ్మని పంపక శ్రీకృష్ణు సభకు బురిగొల్పుటకు గుచేలుని సాధ్వీ మనము నందీ దీపమే ప్రకాశించుచుండెను శ్రీకృష్ణుడును మిత్రుని ప్రథమ దర్శన మున ద్రుపద ద్రోణులవలెకాక యెదురేగి యతిధి సత్కారంబులం బూజించి తన్నుం బరివేష్టించియుండు భార్యాబంధు వర్గము నకు నైతము కించి దసూయా జనకంబు లగు స్వపర్యం కోపావేశ పాదసంవహన పరస్పర నర్మాలాపా చరణంబులకీ పూర్వ ప్రేమయే యపూర్వ కారణమయ్యెను అటుకుల భక్షించినంత మాత్రమున దివ్యసంపద లనుగ్రహించుట దేవ మహి మను సూచింపదగు కాని —

"క్వచిద్గురుకులేవాసం బ్రహ్మన్ స్మర
సినౌయతః"

అను ప్రశ్నయే యమృతధారా వాహిని యనదగు. ఎంతటి దరిద్రుడైనను కృష్ణుఁ డైనను బాల్యస్నేహితుల మరువక పూర్వ జన్మ సుకృతమువలె ప్రీతితో స్మరించు చుండుట సర్వజన సహజము. ఈ కృష్ణ కుచేలుల సమాగమ నందును కృష్ణుడభి వర్ణించిన నీతి,

"కేచిత్కుర్వంతి కర్మాణి కామైరహతచేతసః
త్యజంతః ప్రకృతీర్దైవః యథాహం లోక
సంగ్రహమ్" (భాగ 10-81-30)

ఈ నైష్కర్మ్యముతో సమానముగ మేళ గించిన భక్తియోగము "పత్రం, పుష్పం, ఫలం తోయం. యోమే భక్త్యా ప్రయ చ్ఛతి తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః"

శ్రీనిధి యిట్లు నన్ను బచరించి ఘనం బుగ విత్తమేమియు, నీ్నని తెఱుగు గాన బడె, నెన్న దరిద్రుడు సంపదంధుడై, కానక తన్ను జేరడనికాక శ్రితార్తిహరుండు సత్కృపాంభోనిధి సర్వవస్తు పరిపూర్ణునిఁ గా నను జేయకుండునే

(పోతన భాగవతము. 10-1019)

క్వాహం దరిద్రః పాపీయాన్ క్వకృష్ణశ్రీనికేతనః
బ్రహ్మబంధురితి స్మాహం బాహుభ్యాం పరిరంభి
తః

ఇవియే సతీరానురాగ నికేతనమున కేతనము నెగ్గి యున్నవి

ఇట్టి లోకోత్కృష్ట గుణశీలములకు నిధి యైన శ్రీకృష్ణపరమాత్మ "ప్రదీపవచ కర్మణి" యని కంఠోక్తిగా స్తుతించిన సూత్రమునకు మౌక్తిక ప్రాయమైన విద్యా భ్యాస ఖండము.

కాశీవాస కళాభ్యాస శుశ్రూషా దక్షిణాదిషు
లోకసంగ్రహ ఏవస్యాత్తం వందే దేవకీ సుతమ్

(25వ పేజీ తరువాయి)
మెప్పించి ఆ పసికందును బ్రహ్మాంత వానిగా జేయించిరి ఉగదేశాధీశుని గూతురు వై దర్భినిచ్చి పెండ్లి జేయించిరి. అనంత సుమేధ మొదలగువారి కాలము అయి నను చాక్షుష మన్వంతరము వేర ప్రసిద్ధి గలిగెను.

## వైవస్వత మన్వంతరము

సూర్యునికి మరియొక పేరు వివస్వ తుండు. ఈతడు సంజ్ఞాదేవికి సుపుత్రుడు. సూర్యుని వేడిమి తట్టుకొనుటకై ఛాయా దేవి సృష్టింపబడెను. ఛాయాదేవి సంతా నము యముడు, శని, తపతి సంతానము. ఉగ్రశక్తి తగ్గించ విశ్వకర్మ సూర్య కిరణ ములను సానబట్టెను. చక్ర శక్తి శిబిక మొదలగు యుగ్ర శస్త్రములుగా మారెను – అశ్వ-రూపములతో సూర్యు తుండు సమయమున బుట్టినవారు అశ్వినీ దేవతలై దేవ వైద్యులైరి. ఈ విధముగా మహోగ్ర రూపములతో నేడు వైవస్వత మన్వంతరముగా విజృంభించెను.

## సావర్ణిక మన్వంతరము

సంజ్ఞాదేవి స్థానమున వచ్చిన ఛాయా దేవి పుత్రుడు సూర్యసావర్ణి. ఈతని సంతానములో ఋశ్యశృంగ, వ్యాస, గాలవాదిమహామునులు. ఈయుగములో అనేక నూతన భావములు ద్యోతకము లగు చుండెను.

దక్షసావర్ణి మన్వంతర మనగా సుధ ర్మాది గణదేవతల ప్రత్యామ్నాయులే సవనాది తేజోమూర్తులు. ఈ మూర్తు లెప్పుడు ప్రచండ తపశ్శక్తులు కలిగి యుండినారు. వీరికి మూలదేవత దక్ష సావర్ణి, అందులకే ఆ యుగమున కా పేరు వచ్చినది.

## బ్రహ్మసావర్ణి మన్వంతరము

ఇది మంచి కాలము శాంతికాములైన గణములిందు ముఖ్యములు. సుకృతి హావిష్మంతుడు మొదలగు రాజులు యశో ధనులు. వీరికి మూలపురుషుడు పదవ మనువు బ్రహ్మ సావర్ణి.

ధర్మసావర్ణి, రుద్రసావర్ణి – ఈ యుగ ములలో ధర్మబద్ధమైన కాలము ధర్మ సావర్ణి.

## రౌచ్యమన్వంతరము

రుచియను వేదపూర్ణుడు సంసార విరక్తి గలిగి దేశ దేశములను దిరుగు చుండగా వరుణుడను తాపసి సంసార మార్గము నందుంచి ప్రబోధాత్మకముగా చేయగోరి మాలిని యను తన గూతురు నిచ్చి పెండ్లి జేసెను వారికి రౌచ్యు డుదయించెను. బృహస్పతి, తత్త్వదర్శి మున్నగువారి తరము మంచియుగమని పేరు

ఆఖరుగా పదునాలుగవ మన్వంతరము భౌత్యము. పంచభూతములు భౌత్యుని యన్నతికి గడగడ లాడుచుండెను. కామరూపులగు వారిని హతము జేసెడి కాలము. గురువునకై ఎట్టి దుస్సంఘట నములకైనను వెనుకాడని భౌత్యుడు పరా క్రమమున శుచి, మేధావి. గంభీరాది మహాముని అవతరించిరి. ఇది గూడా ధర్మయుగము జ్ఞానోదయము ఈతని కాలముననే విస్తరిల్లినది దేవర్షియగు నారదుడు కర్మపరిపాకమునకై వైష్ణవ భక్తిని చాటుచుండెను 14 మన్వంతర ములలో అనేక విషయములను గాథలుగా జెప్పుచు ప్రతి యుగములో బ్రహ్మ సృష్టి కర్తయై సత్య ధర్మరక్షకుడై యున్నాడు.

హయగ్రీవ, దత్తాత్రేయ నరనారాయ ణాది అవతారములు విష్ణ్వవతారాలే. భక్తియోగము విష్ణులీలకు ప్రధాన ఘట్టము. అవతారాది విధినిర్వహణములు. పరమాత్మకు ప్రీతిపాత్రము. తన ప్రజా కుటుంబము నెప్పుడు గాపాడుట ఆతని సంకల్పము. ప్రజలెప్పుడు విధి క్రమము లను దాటకుండుట నాతని వాంఛ. "సర్వతోమాధవః పాయాత్" అనుట చిరకాలస్మరణ ఆవశ్యకమైనది జగత్తే తాను తానే జగత్తై వెలసెను.

ఓం తత్సత్

---

(26వ పేజీ తరువాయి)
విష్ణుని ద్వారపాలకులగు జయ విజయు లలో నొకడై యుండి శాపవచనమున రాక్షసుడైనవాడు ఇరువురునుహరిభక్తులే. ఇరువురి యాకాంక్షయు హరిని చేరుటయే. కాని సాధన మార్గములు భిన్నములు. హిరణ్యకశిపు డనంత తత్త్వజ్ఞాన సంప న్నుడు. హిరణ్యాక్ష మరణముచేత వగచు తల్లికతడు బోధించిన తత్త్వోపన్యాసము వాని విజ్ఞాన సంపదకు పరాకాష్ఠ. దానిని రాక్షసావేశము కప్పివైచుటచే విరోధ మార్గమున విష్ణుని చేరుటకు ప్రయత్నించి నాడు ప్రహ్లాదుని జన్మసంస్కార మట్టిది కాదు. భక్తులను రక్షించుటకై పరమేశ్వ రుడు స్వయముగ నవతరించిన దితని విషయముననే. ప్రహ్లాద చరిత్రము భాగ వత ధర్మమునకు పట్టుగొమ్మ. విజ్ఞాననిధి యగు నితనికి విష్ణుతత్త్వము కరతలా మలకము. 'సర్వం విష్ణుమయం జగత్'- అని నమ్మి సమస్తము భగవదర్పిత మొనర్చిన వానికి సర్వేశ్వరుడు పెరటి కల్పకమను పరమార్థము ప్రహ్లాదచరిత్రము వలన వెల్లడియగు చున్నది. ప్రహ్లాద హిరణ్యకశిపుల గమ్యమొక్కటేయైనను దారులు భిన్నములు. రెండు విరుద్ధశక్తుల పరస్పర సంఘర్షణ ద్వారమున నుత్తమ మెయ్యదియో వివరించు ప్రహ్లాదచరిత్రము భాగవత పురాణ మణిహారమున నాయక రత్నము.

(వశేషము)

(11వ పేజీ తరువాయి)
జపుపుట వారి కంట పడింది. వారిపుడు కామాసక్తులై ఏనుగ రూపములు ధరించి కోరికను తీర్చుకున్నారు. ఆ సందర్భంలో గౌరి గర్భము ధరింపగా పుట్టిన శిశువే వినాయకుడని తమిళమున గల "తేవార" గీతముల వలన తెలియు చున్నది.

వినాయకుడు ఏకదంతుడు. మహాభారతం వ్రాయడానికి వ్యాసమహర్షి వినాయకుని వ్రాయసకాడుగా నియమించు కొన్నాడట. అప్పుడు గణపతి తన దంతము నొక దానిని నూడబెరికి దానితో భారతము ను రచించినందున ఏకదంతుడైనాడు; ఒకసారి పరశురామునితో యుద్ధము చేయునపుడు దంతము విరిగి పోవుట చేత గణపతి ఏకదంతుడైనాడని మరొక కథ వలన తెలుస్తోంది. ఈతనికి "లంబోదరు" డనే పేరుకూడ వుంది. ఇతను భోజన ప్రియుడైనందువల్ల పెద్ద పొట్టకల్గి యున్నందున ఆతనికీపేరు వచ్చింది.

నవగ్రహాలతోను, సప్తమాతృకలతోను వున్నప్పుడు గణపతి నిలుచుని వుండాలని "సుప్రభేదాగమమం" చెప్తోంది. "ముద్గలపురాణం" లో గణపతి యొక్క ఇరువదిరెండు పేర్లు ప్రస్తావించబడ్డాయి. "శిల్పసార" శాస్త్ర ప్రకారం ముప్పది రకములైన గణపతి విగ్రహాలున్నాయి. సాధారణంగా గణపతిని "సమభంగ" (నిలబడియున్న) మరియు "ఆసీన" (కూర్చొనియున్న) పద్ధతిలో చూపుతారు. ఈతని తొండము మామూలుగా ఎడమప్రక్కకు తిరిగి వుంటుంది. విగ్రహాలు కొన్ని తొండము కుడివైపుగా వున్నట్టు కూడా చెక్కబడి వున్నాయి. సామాన్యంగా ఈతనికి రెండు కండ్లు మాత్రమేవున్నా ఆగమ శాస్త్రాలు మూడు కండ్లు వున్నట్టుగా చెబుతున్నాయి. నాలుగు చేతులుండుట సర్వసాధారణమైన విషయము, కాని కొన్నిచోట్ల పదునాలుగు చేతులు చూపబడినాయి. ఆ చేతులందు పాశము, అంకుశము, లడ్డుముద్ద మొద లగునవి వుండును. ఈతని ఉదరమునకు పాము చుట్టుకొని వుంటుంది. ఈతని వాహనము మూషికము

భారతీయ శిల్పంలో ఐదవ శతాబ్దంలో గుప్తుల శిల్పంలో గణపతి సాక్షాత్కరించడం మనం గుర్తించదగ్గ విషయం. నాటి నుండి నేటివరకు ఆయన రూపలావణ్యాలు దాదాపు ఒకేలాగే వుండడం మరోవిశేషం. ఐదవ శతాబ్దానికి చెందిన ఓ గణపతి శిల్పం "భుమారా" యందలి గుప్తుల దేవాలయంలో దొరికినది. ఈయనకు గంటలతో కూర్చిన హారమున్నది. ఆరవ శతాబ్దానికి చెందిన మరొక "భుమారా" శిల్పంలో గణపతి శక్తి సమేతుడై నాలుగు చేతులు కలిగి యున్నాడు.

అతి ప్రాచీన శిల్పాలలో గణపతి విగ్రహానికి కిరీటం లేదు, నిజమైన ఏనుగుతల వుండేది. భుమారా, దేవగడ్, ఉదయగిరి లోని గుప్తుల నాటి శిల్పాలలోను; విజయవాడ మొగుల్రాజపురము లోని విష్ణుకుండిన శిల్పాలలోను; బిక్కవోలులోని తూర్పు చాళుక్య శిల్పాలలోను ఈ లక్షణాలు చూడవచ్చు కిరీటంతోను మరియు నాలుగు చేతులతోను వినాయకుని విగ్రహాలను పల్లవ, చోళ, కళ్యాణిచాళుక్య హొయసల, కాకతీయ, విజయనగర శిల్పాలలో చూడవచ్చును.

గణపతి హిందువులకే గాక జైనులకు; బౌద్ధులకు కూడా పూజనీయుడు, గుప్తుల కాలపు బౌద్ధశిల్పాలలో గణపతిని చూడవచ్చు. ఉత్తర భారతదేశం, నేపాల్, టిబెట్ లలో గణపతి బౌద్ధుల దేవుడుగా 'నృత్తగణపతి' రూపంలో వర్ణచిత్రాలలో కనిపిస్తాడు.

ఇతడు బాలగణపతిగా, తరుణగణపతిగా, మహాగణపతిగా, భక్తిగణపతిగా, ఉచ్ఛిష్ట గణపతిగా, విఘ్నరాజగణపతిగా హేరంబ గణపతిగా విగ్రహాలు కూడా పలుచోట్ల వున్నాయి. వీనిలో శక్తిగణపతి, లక్ష్మీగణపతి విగ్రహాలకు ప్రక్కన దేవి విగ్రహాలు కూడా చెక్కబడి వున్నాయి. ఉచ్ఛిష్ట గణపతి దేవిని ఎడమ తొడపై కూర్చొనబెట్టుకొని బాణము ధనుస్సు, పాశము, అంకుశము, హస్తము లలో ధరించి వుండును. హేరంబ గణపతి విగ్రహము ఐదు తలలతో, సింహమును వాహనంగా కలిగి విచిత్రముగా యుండును.

వినాయకుడు అజన్మబ్రహ్మచారి, అయినా కొందరు ఇతనికి సిద్ధి, బుద్ధి అను భార్యలున్నట్లు చెబుతూవుంటారు. దీనికి కారణం కొన్ని గణపతి విగ్రహముల ప్రక్కన దేవి విగ్రహము వుండడమేనని చెప్పవచ్చును. (లక్ష్మీ గణపతి, శక్తి గణపతి)

ఈ విధంగా గణపతిపూజ విశ్వవ్యాప్తమైంది. ఈ దేవుడు మొదట "యక్షనాగ" సంబంధి అయివుంటాడని కొందరి ఊహ "బ్రహ్మవైవర్త" పురాణం ఇతడు "కృష్ణుని" ప్రతిరూపమని కూడా చెబుతున్నది. *

---

### విజ్ఞప్తి

గ్రంథ సమీక్షకు పుస్తకాలు పంపే వారు రెండు ప్రతులు పంపుతూ సమీక్షార్థం అని వ్రాసి పంపాలి.

॥సం॥

---

(9 వ పేజీ తరువాయి)
వానిని శుద్ధమొనర్చి ఇంద్రియవ్యాపార ముల నుండియు జీవుని ముక్తునొనర్చుట కొఱకే సాక్షాత్ కామాక్షిగ నవతరించెను.

'కామాక్షీవిలాసము' మార్కండేయ పురాణమున నిట్లు వర్ణింపబడియున్నది. రుద్రుడు తన తపమునకు భంగమొనరించెనే అని కోపించి కాముని అనంగుని జేసెను. రతీ ప్రార్థనమునకు సంతుష్టయగు పార్వతి తన కృపాకటాక్షమున అనంగునకు ప్రాణములను ప్రసాదించుటయేగాక ఆమె మాత్రమనుభవింపదగు దేహమును గూడ మన్మథునకు అనుగ్రహించెను.

కామముండవలెను. లోకముండవలయును. వీనిని క్రమపఱచి వికాసోన్ముఖమగు వాని మూలముగనె వానిని క్రమముగ శోషింపజేసి తుదకు ఏకోన్ముఖమగు నట్లు జేయుటయే సరసము. లోకములేదు కామములేదు అని మౌనముగ దక్షిణామూర్తిగనే ఉండిపోయిన తన లీలావిలాసమునకు అవకాశములేదని భావించిన దాబ్రహ్మశక్తి. ఆ భావమునకు (కామమునకు) అక్షము (Axis) గ నుండిన శక్తియే కామాక్షి.

భూదేవికి నాభిస్థానముగ తొండమండలము గలదు. దానిని అలంకరించుచు ఉన్నది కాంచి. ఆ పరమపవిత్రమగు కాంచీనగరమును తన విలాసస్థానముగ జేసికొని ఆ బ్రహ్మశక్తి, కామాక్షి ప్రాదుర్భవించెను. మఱల తన సన్నిధానముననె రుద్రుని, కాముని శత్రువులను జేసి యెదుర్కొనజేసెను. దాన నేర్పడినవే కామకోటి విమానము, రుద్రకోటి విమానము.

ముందు నేను నిటలాక్షము నొకింత తెఱచి చూచిన మాత్రనె భస్మమయిన ఈ మనసిజున కింతపొగరా, అని కుపితుడయిన రుద్రమూర్తి ఒక్కసారి హుంకరించెను. అంతమాత్రముననె ఆతనినుండి కోటిరుద్రులు హుంకరించుచు వెలువడిరి.

కామవిలాసమె తన లీలావిలాసమునకు అధారమని తలచిన ఆ పరాశక్తి కామవిజయమును సంకల్పించి కటాక్షవీక్షణముల నించుక ప్రసరింపజేసెను. అందుండి కాముసిప్రతినిధులుగ కామలోకకోటి యుదయించిరి. వారు ఆ కోటి రుద్రుల నొక్కత్రుటిలో జితోస్మి అని అనిపించి తరిమివేసిరి.

అంతయు పరాశక్తి లీలావిలాసమె ఏకముగనున్న ఆ మూలశక్తియె శివశక్తులై జరిపిన వినోదము. అదియె ఈ లోకసృష్టికి ఆధారము.

ఆనాటి మూలరుద్రుడె ఏకాంబ నాథుడు (ఏకామ్ర, ఏకాంబ్రనాథుడు) అలనాటి ఆకోటిరుద్రులు ఏకాంబనాథుని మూలస్థాన విమానమును ఆశ్రయించి నేటికి నచటనే ఉండిపోయిరి. కావుననే అది రుద్రకోటివిమానము.

కాముడు బ్రహ్మశక్తియగు ఆ దేవి నేత్రాంచలము నాశ్రయించెను. కాముని అక్షమునందు గలిగి ఆ దేవి అలనాటి నుండియు కామాక్షి అయ్యెను. ఆమె భ్రూభంగమాత్రమున జన్మించిన ఆ కామకోటి ఆ దేవి గర్భగృహ విమానమున చోటుచేసికొనిరి తదాదిగ నది కామకోటి విమానమయ్యెను.

పై పురాణార్థమునెగాక మఱికొన్ని తత్త్వార్థముల నిందులకు చెప్పుచుందురు. సూర్యచంద్రులు తమ గమన విశేషముచే నా విమానమును జుట్టివచ్చుచు నా దేవి నారాధించుచుందురట. ఈ విమానమునకు మఱియొక ముఖ్యత్వమును గలదు. కంచిలోని తక్కిన విమానము లన్నియు (శివాలయ, విష్ణ్వాలయములవి) నీ కామాక్షి విమానమునకే అభిముఖములయి యుండునట్లు నిర్మింపబడియున్నవి.

కాంచీమహానగరమున 1008 శివాలయములును, 108 విష్ణుక్షేత్రములును గలవు. విష్ణ్వాలయము లన్నిటియందును తాయార్లు (అమ్మవారి) సన్నిధి ప్రత్యేక ప్రత్యేకములుగ స్థాపింపబడి యున్నవి. కాని శివాలయములన్నిటికినిచేర్చి కామకోటి క్షేత్రమున కామాక్షి సన్నిధి మాత్రమేయుండుట విశేషమని విజ్ఞులు పేర్కొందురు.

విమానము=విశేషమగు మానము = కొలత; పరిమాణము. ప్రాణమునకు హృదయ చలనము, సంగీతమునకు తాళము మంత్రములకు స్వరము ఎంత ప్రధానమో దైవీశక్తికి, ఆలయముల లోని దైవీశక్తికి విమానములు అంత. శిల్పశాస్త్రమునందు ఈ మానము చక్కగా వర్ణింపబడియున్నది. (Space) విషయార్థమును వివరించుచు ఆ దైవీశక్తికి ప్రాకారమింత; అర్ధ - మహామండపాదులింత; గోపుర - ధ్వజస్తంభము లింతేసి, విగ్రహమింత, అని వానివాని పరిమాణములు చెప్పబడియున్నవి. ఆయా పరిమితులతోనే ఆయా దవ్యమూర్తముల దివ్యశక్తులు బహిర్గతములగుచు రక్షణ కృత్యమున కాలంబనములై, లోకక్షేమమునకు సాయపడుచుండును. కావుననే మూలమూర్తికి గల స్థాపవిశేషము విమానమనబడుచున్నది. ఆ దివ్యశక్తులను ప్రసరించుచు నుండు విమానములను కాపాడుటకు తామ్రమో, రజతమో, సువర్ణమో సాయపడుచుండును. సువర్ణ వర్ణ పరిశోభితములగు విమానములు మన పుణ్య భారతమున నెన్నియో గలవు. చిదంబరములోని పొన్నంబలము, శ్రీరంగము ప్రణవ విమానము, మన తిరుమలేశుని ఆనందనిలయము వానిలో కొన్ని.

శక్త్యాలయములలో దేవియే ప్రధాన మూర్తముగ నుండి నలుదిశలలో గోపుర ప్రాకారాదులచే పరిశోభించుచు రాజిల్లు ఆలయము కంచిలోని కామాక్షి ఆలయము. ఆమె విమానము సువర్ణ పరిశోభితమై యుండుట లోకసంతారకము.

శక వర్షము 1315 లో ఆషాఢ శుద్ధ
(32 వ పేజీలో)

(10 వ పేజి తరువాయి)

శ్లో॥ హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలమ్।
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా॥

అని నారద పురాణము ఘోషించుచున్నది

'తస్య వాచకః ప్రణవః।
తజ్జప స్తదర్థభావనమ్॥

అని పాతంజల యోగ సూత్రములు.

ప్రణవ జపము యోగమునందు ప్రధాన స్థానమునాక్రమించుచున్నది. ప్రణవమే భగవంతుడు. 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' మ్మని గీతాశాస్త్రము.

'ఓమిత్యేత దక్షర మిదం సర్వం
తస్యోపవ్యాఖ్యానం భూతం భవద్భవిష్యదితి
సర్వమోంకార ఏవ। యచ్చాన్యత్త్రి కాలా తీతం
తదప్యోంకారఏవ॥

అని మాండుక్యోపనిషన్మంత్రము. కనుక ఓంకారరూపుడగు పరబ్రహ్మ తత్త్వమును యోగులు స్మరించవలెనని పతంజలి శాసించినాడు.

నిత్యసంధ్యావందనమున బాహ్యాభ్యంతర శుచికై

'అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోపి వా।
యస్స్మరేత్పుండరీకాక్షం సబాహ్యాభ్యంతరం శుచిః॥

అని పుండరీకాక్షస్మరణము చేయుట సర్వ జన సంప్రదాయము.

శ్లో॥ తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ।
మయ్యర్పిత మనోబుద్ధిర్మామే వైష్యస్య సంశయమ్॥
—భగవద్గీత8-7.

సర్వకాల సర్వావస్థల యందును పరమాత్మనే స్మరించుచు స్వధర్మమును వీడక చరించువారు పరమాత్మనే పొందెదరని గీతావాక్యము.

శ్లో॥ అనన్య చేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః।
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్త స్య యోగినః॥
—భగవద్గీత8-14

నిత్యము వాసుదేవుని స్మరించు వారలకు అతడు సులభుడై తన దివ్యధామము నొసంగును. ఇందు సందేహము లేదు. ఆ శ్రియఃపతి దివ్యమంగళ విగ్రహమును నిత్యము స్మరించువారికి అదే రూపముగల్గి వైకుంఠ ధామమున దివ్యపదము లభించు నని శాస్త్రము.

శ్లో॥ యస్య స్మరణ మాత్రేణ జన్మసంసార బంధనాత్।
విముచ్యతే నమ స్తస్మై విష్ణవే ప్రభ విష్ణవే॥

శ్రీమన్నారాయణుని మనసారా ఒక్కసారి స్మరించిన చాలును. సంసార బంధనములు తొలగి జన్మ సాఫల్యము నంద గలడు.

'నారదస్తు తదర్పితాఖిలాచారతా తద్వి స్మరణే పరమవ్యాకులతేతి' అని నారద వచనము.

## పాదసేవనము

'పరమ యోగులకు పరిపరి విధముల
వరమొసగెడి నీపాదము
తిరువేంకటగిరి స్థిరమని చూపిన
పరమపదము నీపాదము
బ్రహ్మకడిగిన పాదము పర
బ్రహ్మము తానను పాదము'

అని పరమ భాగవతోత్తముడగు శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యులు శ్రీ వేంకటేశ చరణారవిందముల సేవించి ధన్యుడైనాడు.

శ్రీ వైష్ణవ సంప్రదాయమున శ్రియఃపతి చరణ సేవయే పరమతారకము. అది యే మోక్షమునకు మార్గము. శ్రీనివాసుని తిరుపతి సేవలో ధన్యులైన మహా పురుషులు వైష్ణవ సంఘమునందనేకులు.

పరమ పవిత్రమగు జాహ్నవీనది యే పాదములనుండి పుట్టుచున్నదో యే దివ్య చరణములు యోగిజన హృదయ పద్మమున స్థిరనివాసము నేర్పరచు కొన్నవో యే చరణ కమలములు కలుముల లే మకర కమలములచే నొత్తబడుచున్నవో ఆ శ్రీనివాస చరణకమలముల శరణువేడి సేవించు జీవుడు సంసార చక్రమున జిక్కనేరడు.

'మన్మూర్ధ్ని కాళియ ఫణే వికటాటవీషు
శ్రీవేంకటాద్రిశిఖరే శిరసిశ్రుతీనామ్।
చిత్తేఽప్యనన్యమనసాం సమమాహితౌ తే
శ్రీవేంకటేశః చరణౌ శరణంప్రపద్యే॥'

శ్రీ వేంకటేశ్వర చరణములు నా శిరస్సున కలంకార ప్రాయములు అవి కాళియఫణిపై నర్తించిన దివ్యపాదములు. యోగి హృదయములందు స్థిరముగా వికసించునట్టివి. శ్రుతిసూక్తులచే పొగడబడు శ్రియఃపతి చరణములనే శరణుగోరుచున్నాను. అని శ్రీవైష్ణవాచార్యులు కీర్తించినారు.

శ్రీ వేదాంతదేశికులు పాదుకాసహస్రమున శ్రీరామపాదుకల మహామహిమోపేత గుణములను పొగడినాడు. పాదుకలకుగల మహిమయే అనంతమైన ఆపాదుకల ధరించుపాదములెంత మహిమోపేతములో యెవరు వర్ణించగలరు.

'భద్రాణి దేవిః జగతాంపతిపాదయిష్యా
ప్రాగేవ యేన భవతీం భరతోఽభ్యషించత్।
మన్యేకపీశ్వర విభీషణయోర్యథావత్
సన్తన్యతే స్మృతత ఏవ కిలాభిషేకః॥'
—శ్రీమత్పాదుకాసహస్రము.

'శత్రుమ్శిఖుకాలే వస్తున్నైచ్చేవిత్త్వా
పొత్రామరై యడియే పోత్రుమ్బొరుళ్ కేళాయ్

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం

### నారాయణవనం.

★

### నిత్యకార్యక్రమ వివరాలు

| | | | |
|---|---|---|---|
| సుప్రభాతం ఉ॥ | 6-00 నుండి | | 6-30 |
| విశ్వరూపదర్శనం | 6-30 | .. | 8-30 |
| తోమాలసేవ | 8-30 | ,, | 9-00 |
| కొలువు, అర్చన | 9-00 | ,, | 9-30 |
| శాత్తుమొర & గంట | 9-30 | ,, | 10-00 |
| సర్వదర్శనం | 10-00 | , | 11-30 |
| 2-గంట, అష్టోత్తరం (ఏకాంతం) | 11-30 | .. | 12-00 |
| తీర్థ్మానం | 12-00 | | |
| సర్వదర్శనం సా॥ | 4-00 | | 6-00 |
| తోమాలసేవ, అర్చన (ఏకాంతం) | 6-00 | .. | 7-00 |
| రాత్రి కైంకర్యం | | | |
| శాత్తుమొర | | .. | 7-00 |
| సర్వదర్శనం | 7-00 | , | 8-45 |
| ఏకాంతసేవ | 8-45 | ,, | 9-00 |

### ఆర్జితాదుల వివరాలు

| | | | |
|---|---|---|---|
| అర్చన, అష్టోత్తరం | .. | రు. | 3-00 |
| హారతి | .. | రు | 1-00 |
| కొబ్బరికాయకు | .. | రు | 0-50 |
| సహస్రనామార్చన | ... | రు. | 5-00 |
| పూలంగి (గురువారం మాత్రం) | ... | రు. | 1-00 |
| అభిషేకానంతర దర్శనం (శుక్రవారం) | | రు. | 1-00 |

పెట్రమ్ మేయ్త్తుణ్ణు ఙ్కులత్తిల్ పిఱన్దు నీ
కుట్రేవలెఙ్గళై క్కొళ్ళామల్ పోగాదు
ఇట్రైప్పఱైగొళ్వానన్ఱుకాణ్ గోవిన్దా
ఎట్రైక్కుమేఴేఴ్పిఱవిక్కుమ్ ఉన్దన్నోడు
ఉట్రోమేయావోముమక్కేనామ్ఆట్చెయ్వోమ్
మట్రైనఙ్గామఙ్గళ్మాట్రేలో రెమ్బావాయ్'

—తిరుప్పావై 29.

'తెల్లవారుజాముననేవచ్చి నీ తామరల వంటి పాదముల సేవించుచు మేము సేయు మంగళాశాసనమునువినవే! పశువులను మేపి భుజించు గొల్లలయింట పుట్టిననీవు మేముచేయు కైంకర్యములను గొనక పోరాదు. గోపాలా! ఎప్పటికిని, ఏడేడు జన్మంబులకైనను నీతోడిసంబంధమే మాకగుగాక! నీకైంకర్యమునే చేసెదము గాక! నీచరణసేవదక్క తక్కిన మా ఐహిక వాంఛలను తొలగింపుము.' అని గోదాదేవి తిరుప్పావైలో ప్రార్థించినది.

ఇదియే మన అందరి ప్రార్థన కూడా
'సంచితయేద్భగవతశ్చరణారవిందం
వజ్రాంకుశ ధ్వజ సరోరుహ లాంఛ
నాఢ్యమ్।
ఉత్తుంగరక్తవిలసన్నఖ చక్రవాల
జ్యోత్స్నాభిరాహతమహద్ధృదయాంధ
కారమ్॥
యచ్ఛౌచనిః సృత సరిత్ప్రవరోదకేన
తీర్థేన మూర్ధ్న్యధి కృతేన శివః శివోఽ
భూత్।
ధ్యాతుర్మనః శమలశైల నిసృష్ట వజ్రం
ధ్యాయేచ్చిరం భగవతశ్చరణారవిందమ్॥

—శ్రీమద్భాగవతము—3-28-21, 22.

'వజ్రాంకుశధ్వజపద్మాది శుభ చిహ్నములతో కూడుకొన్నవియును, శోభాయమానమై పొంగివచ్చు రక్తపువర్ణముతో విలసిల్లు గోళ్లనుకలిగినవియును, పరమభక్తుల హృదయాంధకారమును పారద్రోల గల వెలుగురేఖల జిమ్మునవియునగు భగవంతుని పాదములను ధ్యానింతును.'

(సశేషము)

(30 వ పేజీ తరువాయి)

దశమినాడు, తెలుగు ప్రభువగు హరిహరరాయలీ కామకోటి విమానమును బంగరురేకులతో నలంకరించి కుంభాభిషేక మొనరించెను. ఈ విషయమును కామాక్షీ సన్నిధియందున్న ఋషి గోపురము నందలి శాసనము చాటుచున్నది. కాలక్రమమున నందలి రేకులూడిపోయినవి కాబోలు మరల ఇంత కాలమునకు ప్రస్తుత కామకోటి పీఠాధిపతులగు శ్రీ జయేంద్ర సరస్వతీస్వాముల సంకల్పబలమున ఆ జగన్మాత విమానము సువర్ణాచ్ఛాదితమగుచున్నది. నారాయణి అగు ఆ బ్రహ్మశక్తికి జరుగు ఈ పవిత్ర కైంకర్య విశేషమున నారాయణుడు పాల్గొనవలయునుగద? కావుననే పరబ్రహ్మ స్వరూపుడగు శ్రీ శ్రీనివాసుడును పాల్గొనెను. కోరకుండనే చేయవలసిన ఈ పవిత్ర కార్యమునకు కోరిన వెంటనె లక్షల విలువ సువర్ణమును కార్యకర్తల మూలమున నందజేసి యానందించెను.

అద్వైత సిద్ధాంత స్థాపకులగు ఆది శంకర భగవత్పాదులీ కామకోష్ఠము నందె సర్వజ్ఞపీఠమును స్థాపించిరి నేటికిని కామకోటి పీఠమనియె యయ్యది వ్యవహరింపబడుచున్నది. ప్రస్తుత పీఠాధిపతులు జయేంద్ర సరస్వతిస్వామి. కామాక్షికి వారే సర్వాధికులు. వారి సంకల్పబలమెట్టిదో కాని ఏ నాడును కాంచీ నగరమున కనివిని యెరుగని వైభవమును నిర్వహించి లోకము ననుగ్రహించిరి. ఈ వసంత పంచమినాడు జగత్పితరులగు కామాక్షీ, ఏకాంబరుల విమాన గోపురముల కొక్కసారిగ కుంభాభిషేకములు జరుగునట్లుచేయుట ఆశ్చర్యకరము - అసాధ్యముకూడ

'తుండీ రాఖ్యేమహతి విషయే
స్వర్ణవృష్టి ప్రదాత్రీ'

అని మూక పంచవింశతి. తుండీర మండలమున నొకనాడు సువర్ణమును వర్షించిన కరుణామయికి కామాక్షికి జరిగిన ఈ కుంభాభిషేకము జగత్తునకు కళ్యాణకరమగుటలో నెట్టి సందియమునులేదు. *

# విజయదశమి - నవరాత్ర విశేషములు

జాతిమేలుగోరి జాతి సంఘటిత శక్తిని పుంజుకొని వ్యక్తి లోకోత్తర పరివర్తనను సాధించిన ఫలితమును, జాతి యభ్యున్నతికి సమర్పించి, సమహిత జీవనమును సాగించడము, నా జీవితాదర్శమును ముందుతరాలవారికి, నిదర్శనంగా చేయగను దినములు పర్వదినములు. అందు జాతీయములు, ప్రకృతిసమాజములు, పరమార్థములు, అయిన వానిలో విజయదశమి పైమూడు విశేషములచే జాతి సమైక్యతకు తార్కాణమైనది! ఈ పర్వమును గురించిన లోకోత్తర కథనములు అనేకములుగలవు!

## మహామాయ

మహాకాళిగా యవతరించి మహావిష్ణువునకు తోడై మధుకైటభుల సంహరించెను, రెండవ యవతారమున మహాదేవియై మహిషాసురుని గూల్చెను, తన మూడవ యవతారమున మహాసరస్వతియై తన దివ్యశక్తులచే శుంభ నిశుంభాదులగు లోకకంటకులగు రక్కసులను పరిమార్చి జగత్తునకు శ్రేయము చేకూర్చినది. ఇటుల మహామాయ అనేక రూపాంతరములనంది లోకోద్ధరణ గావించినది అట్టి లోకోద్ధరణ గావించిన మహామాయ రూపాంతరప్రతీకల నేర్పరచుకొనుచు (చాతుర్వర్ణములు) తమ మృత్త్యుపకరణములచే తమకనుకూలముగా నా ప్రతీకలకు ఆశ్వీజ శుద్ధ పాడ్యమి నుండి నవమి వరకు అర్చించి దశమిరోజు నాయామూర్తి ప్రతీకలను యూరేగించు దినమే విజయదశమి.

మానవుడు తనకెదురయ్యే చిక్కు సమస్యలను చక్క జేసుకొన, తనసాటి జాతిలో జీవితమును సిద్ధింప జేసుకొన విద్యాబలసంపద్వృద్ధి జేసుకోవాలి. అద్దానికై మనోవాక్కాయముల జేయు తపస్సు ఫలించాలి. ఆ ఫలితమును బడయనై విద్యాబలసంపద్వృద్ధుల దివ్యరూపముల నేర్పరచుకొని వాని నారాధించి కృతకృత్యుడు కావాలి. అది మానవ ధర్మము.

అట్టి యారాధనే ఆశ్వీజ శుద్ధ పాడ్యమి నుండి నవమి వరకు జరుగు దేవీ నవరాత్రములు. జరిపి దశమిరోజు దేవికి అనగా మూడురూపములచే జయముపొందిన ఆ దివ్యశక్తికి వీడ్కోలు చేయుటచే విజయ కారణంగా విజయదశమి పర్వమయ్యెను. అని పూర్వచరిత్రలందు గల సత్యము.

మహాశక్తి పూజ మూడువిధములు సాత్త్వికి, రాజస, తామసములు. నిరామిషమగు నైవేద్యములతో జేయునది సాత్త్వికమనియు, బలులొసగి, సామిష నైవేద్యముతో జేయునది రాజసమనియు, జపహోమ విరహితమై సురామాంసాదులతో జేయు పూజ తామసమని ముప్విములు. ఇందుముఖ్యముగా, భారతదేశ వాసులు సాత్త్వికవిధానము ననుసరించియే దేవిని యారాధింతురు. ఈ పూజలు తొమ్మిది రాత్రులు జేయుదురు. అట్లు చేయలేనివారు, 3, 5, 7, 1 రాత్రి పూజించవచ్చును. నవమి నుండి 10 వరకు ఏకరాత్రమని, మూడు రాత్రులనిన 7 వ దినం నుండి దశమి వరకు, 5 వ దినము నుండి దశమి వరకు దేవిపూజలుచేసిన మేలగునని మార్కండేయ పురాణాంతర్గత దేవీమహాత్మ్యము విశదించును. దేవీ పూజ, శ్రీచక్ర పూజ సరస్వతీ పూజలు. సరస్వతీ పూజను చేయువారుమూలానక్షత్రయుక్తసప్తమి నాడు పుస్తకములును దేవి ప్రతిమను పెట్టి వానియందు దేవిని యావహింపజేసి అష్టమి నవమి యందు హోమాదులుచేసి

శ్రీ గాధిరాజు
మహబూబనగరము.

సాత్త్వికి విధానమున నైవేద్యముల నివేదించి దశమినాడు శ్రవణనక్షమున - రాజలాంఛనములతో దేవిని యూరేగించి వీడ్కోలు యుత్సవము చేయవలెను. ఈ



విధముగా నవరాత్రములు. దశమి ఉ[illegible] యార్చనముల యనంతరము, పౌరజనులు సమైక్యతతో సంఘీభావముతో నందరును అతియుత్సాహముతో గూడి మేళ తాళములతో నూరేగుచు పుర పొలిమేరదాటి శమీవృక్షమును పూజించి మరల నదే యుత్సాహమున పురమున ప్రవేశించవలయును. ప్రవేశించిన యనంతరము నేక

రించుకొని వచ్చిన (జమ్మి) శమీపత్రమును తనకన్న పెద్దవారి చేతిలో పెట్టునపుడు

శ్లో॥ శమీశమయతే పాపం - శమీశత్రు వినాశనీ
అర్జునస్య ధనుర్ధారీ - రామస్య ప్రియ దర్శనీ"

అని వారికి నమస్కరించ వలయును. ఆశీస్సుల నందుకోవలయును అట్లు చేసిన యాసంవత్సరమంతయు సంతోషంగా సంతృప్తికరంగా జీవితము గడచునని పూర్వుల యభిప్రాయము. శ్రీరామచంద్రుడు లోక కంటకుడగు రావణుని నిహతుని జేయుటకై శ్రవణ నక్షత్రయుక్త దశమినాడు దండు వెడలెననియు పురాణ ప్రసిద్ధ కథనములు గలవు. అంతే గాక జాతి సమైక్యతకు చక్కనిపర్వము విజయ దశమి। విద్యావంతులు, వ్యాపారస్థులు, కృషీవలులు, మొదలగు వారు తమ సాధనోపకరణముల ఆరాధించి వేల్పుల ముందు వానిని నిలిపి వృత్తి విజయము గలుగ నారాధింతురు. ప్రకృతిసిద్ధంగా మనకీ పర్వము యాత్రాగమనమునకు గూడా యుత్తమ మనియును చెప్పుదురు. ఆనాట, రాజులు దిగ్విజయ యాత్రకు బయలుదేరువారు. బయలుదేరే ముందు దశమినాడు అపరాజిత పూజనమొనరించి, సీమోల్లంఘన జేసి శమీపూజ యొనరించి దేశాంతర గమనము జేసేవారు. దిగ్విజయమును సాధించే వారు।

ప్రకృతి సిద్ధంగా గూడాను మనకీ పర్వము సుపర్వమే। దసరాయుత్సవ సమయమునకు చాతుర్మాస్యములు ముగియును। వర్షఋతువులో వర్షములు కురిసి దేశమంతయు కర్దమ మయమై చీమలు, దోమలు, ఈగలు, రోగములు మానవుని వేధించును. ఈపర్వము నాటికి శరదృతువు రాకతో నేలపై బురద యారిపోవును, జలములు తేటపడును ప్రవాహముల వేగము తగ్గును, కీటకముల బాధ కొంత తగ్గును. నదుల వేగము తగ్గును ప్రకృతి రమణీయముగా నుండును। క్షేత్ర దర్శనమునకు, పాండిత్య ప్రదర్శనమునకు, వ్యాపారవిశేషమునకు విదేశగమనమునకు. ఈ దినము సుదినమందురు అంతియే గాక మానవుడు యుత్తమార్థమును గడించనై ప్రకృతియందు దివ్యత్వమును ఆరోపించి దేవతగా నారాధించి సిద్ధిని బడయుచుండును. అట్టి పరమార్థమును బడయుటకు నిదర్శనముగా ఈ విజయదశమి పర్వమొక మహాపర్వముగా నెంచదగును. *

---

( 6 వ పేజీ తరువాయి)

చున్నారు. ఈసన్ధ్యావన్దనమును గురించియు గాయత్రీ దేవతను గురించియు విపులముగా తైత్తరీయోపనిషత్తునందుగలదు. మరియు మద్దులపల్లె వెంకటసుబ్రమణ్యశాస్త్రి గారిచే యజుర్వేద సన్ధ్యావందనమునకు రచించిన ధర్మశాస్త్ర టీకాతాత్పర్యము నందును, శ్రీ గరిమెళ్ల వీరరాఘవులుగారి "గాయత్రి" అను ప్రథమ ద్వితీయ భాగములందును, మరియు వారి యొక్క "సంధ్యోపాసన" అను గ్రంథమునందును, శ్రీనగరంపల్లె వెంకటప్పల జగన్నాధరావు రచించిన ''గాయత్రీకల్పము'' న విస్తరముగా, మనస్సునకు అద్దునట్లువివరించి యున్నారు.

ప్రాతఃసన్ధ్యా వన్దనమునకు కాలము బ్రాహ్మీముహూర్తమున అనగా సూర్యుడు ఉదయించుటకు ముందు మూడు ఘడియలు అనగా నక్షత్రములుండగనే ప్రారంభించి సూర్యోదయము అయిన తరువాత ఆరు ఘడియల లోపల ముగించవలెను. మాధ్యాహ్న సంధ్య సూర్యోదయము అయిన తరువాత ప్రొద్దుతిరుగక మునుపే 15 ఘడియలలోపల చేయవలెను. సాయంకాల సన్ధ్యావన్దనము సూర్యుడు అస్తమించుచుండగా ప్రారంభించి నక్షత్ర ఉదయము అయిన తరువాత ముగించవలయును.

సన్ధికాలమున ఆరాధింప తగిన దేవత సన్ధ్యాదేవత. ఆ దేవత సూర్యమండలాన్తర్గత చిచ్ఛక్తి యగు గాయత్రీదేవి. మన వేదములు మనకగబడు సూర్యుని ''బ్రహ్మస్వరూప ఉదయే, మధ్యాహ్నేతు మహేశ్వరః అస్తకాలేస్వయం విష్ణుః త్రిమూర్తిస్తు దివాకరః'' అని వర్ణించి యున్నారు. అట్లనే ఈ గాయత్రీ దేవి ఉదయమున గాయత్రీ నామము తోను, మధ్యాహ్నమున సావిత్రీ నామముతోను, సాయంకాలమున సరస్వతీ నామముతోను ఉండునట్టి దేవత. ఈమెయే ఉదయమున "బాల'' గాను మధ్యాహ్నమున "రుద్రాణి'' గాను సాయంకాలమున ''వైష్ణవి'' గాను, వర్ణింపబడుచున్నది. ప్రాతః కాలమున ''ఐం పరబ్రహ్మనే సూర్యాయ ప్రాతః సంధ్యా యైనమః" అనియు, మాధ్యాహ్నమున "క్లీం, రుద్రాయ సూర్యాయ మాధ్యాహ్నిక సంధ్యాయైనమః" అనియు, సాయంకాలమున "సౌంవిష్ణవే సూర్యాయ సాయం సంధ్యాయైనమః" అనియు ప్రార్థించుచున్నాము.

# శ్రీ వేంకటేశ్వర బ్రహ్మోత్సవము

శ్రీ వేదాంతం శరచ్చంద్రబాబు
గన్నవరము

శ్రీ వేంకటపతికిని ప
ద్మావతికిని పెండ్లి శేషధరణీధరమం
దీవేళ జరుగు నోహో!
భూవలయమ్మెల్ల వేడ్కపులకింపంగన్

రారండో మహనీయులార! కనుడీ! రాజీవనేత్రుం డిలో
కారాధ్యున్ నయనాంచల స్మిత లసత్కారుణ్య
రేఖాంకుసం
చారశ్రీయుతునిం బదాంబుజసుధాసారప్రసారాను రా
గారావ ద్భ్రమరభ్రమత్ ప్రమద భక్తానీక చేతోహరున్

వేలుములకులు ప్రజలు సు
ఖాలును కష్టాలు ననక క్ష్మాస్థిత వైకుం
ఠాలంకారుని జూచిన
జాలని బ్రహ్మోత్సవాల సందడి జేరన్

తప్పటడుగులతో నప్పుడే మనుజ ప్ర
  పంచాన నడుగిడు పసితనాలు
గరువాల పంతాల ఝురులౌచు నొండొంట
  కవ్వించి పరువెత్తు యవ్వనాలు
బాటలో గతుకుల బరికించి నడచుట
  యెరిగినయట్టి నేర్పరితనాలు
రాగాల భోగాల వేగాల గోల్పోయి
  వైరాగ్య మొదవిన వార్ధకాలు
మెట్టుమెట్టున కొక్కొక్క బొట్టు నెత్తు
రోడ్చి హృదయాలు కాంతుల నురకలెత్త
ఏడుకొండలనెక్కి యీవాడ జేర
అదియు నొక దివ్య నవలోకమగుచుతోచె

కళకళలాడెం దిరుమల
బిలబిలమను జనులతోడ-పెల్లగుభక్తిన్
మిలమిల మెరసెం గన్నులు
జలజల నానందబాష్ప జలములు రాలన్

బారుల నిలిచిరి భక్తుల
పార కుతూహల విలోలభావాతురులై
చారుతరాభయ హస్తుని
కారుణ్య పయోధి పాద కమలచ్ఛాయన్

వికచాస్య! యితడటే! వకుళామనో భీష్ట
  మున పాపడైనట్టి పుణ్యమూర్తి
పద్మాక్షి! యితడటే! పద్మావతీ మనః
  ప్రణయ ధనము కొల్లగొనిన మేటి
బింబోష్ఠి! యితడటే! బీబినాంచారమ్మ
  వలపుల దోచిన వన్నెకాడు
ఎలనాగ! ఇతడటే! అలమేలుమంగమ్మ
  అనురాగ మందుకొన్నట్టి ఘనుడు

ఈతడేనటె! విరిబోణి! యిహపరముల
కరుణ సుఖశాంతు లొసగెడు కల్పతరువు
ఈతడేనటె! లలితాంగి! పాతకముల
నెల్ల హరియించు శేషశైలేశ్వరుండు

అడుగడుగున దండమిడ నాపదలదీర్చు
  కరుణార్ద్రహృదయుడే! కాంత! యితడు
వడ్డికాసుల గుంజి వరముల నొసగెడు
  వర్తకుడోయమ్మ! వనిత! యితడు
నిలువుదోపిడి జేసి పలుసంపదలగూర్చు
  బలెబందిపోటె! ఓ భామ! యితడు
తలనెల్ల గొరిగించి కలుషమ్ములంబాపు
  కొంటెదేవర సుమ్మె! కొమ్మ యితడు

ఇతడు కళ్యాణమూర్తియే సతి! యితండు
చిరుత నగవుల నమృతాలు చిలుకునమ్మ!
చలువ చూపుల వాత్సల్య మొలుకునమ్మ!
నిక్కమీతని యెద నవనీతమమ్మ!

*సూర్యప్రభంగూడి సురుచిర ప్రభలీను
    నుదయభానుని బోలు నొక్కమాటు
  గరుడవాహనమెక్కి ఘన ఘనాఘన దీప్తి
    నొప్పును వరదుడై యొక్కమాటు

*చంద్రప్రభంజేరి చంద్రికా దరహాస
    మొలికించు కరుణాళు వొక్కమాటు
  శేషతల్పమునందు శ్రీలు లీవులు మీర
    బెక్కందముల దోచు నొక్కమాటు

లీల బంగరుతూగుటుయ్యాల లోన
నూగు కన్నుల పండువుగాగ నొకట
క్షణము క్షణమున కొక యలంకారమొందు
వేంకటేశుడు మురిపాల పెండ్లివేళ

అని చెప్పుచు నొకరికినొక
రనుభావ మనస్కులగుచు నానందమునన్
గనులార్ద్రముగా భక్తిని
వినయమునన్ దర్శనేచ్ఛ వెడలిరి వేడ్కన్

* సూర్యప్రభ, చంద్రప్రభ అనునవి శ్రీ వేంకటేశ్వరస్వామి వాహనములు.

# పాలాశ వృక్ష మహిమ

హరిః ఓమ్॥ ఇషేత్వోర్జేత్వా అని శ్రీకృష్ణ యజుర్వేదమునందు ప్రథమ కాండములో ప్రథమ ప్రశ్నయందు ఈ విధముగా చెప్పబడినది. ఈ మంత్రముప యోగించియే ఉపనయన కాలమందు హోమము చేయుదురు. ఆ హోమమునే పాలాశ హోమమందురు. ఒకపాలాశ వృక్షమొక్కను తెచ్చి దర్శ ఇష్టితో పాలాశశాఖతో కూడిన దూడలనుతోలి. అనంతరము వాటిపాలను పిండి ఆపాలను కాచి. వాటిలో పాలాశవృక్ష చివర పట్టని కొద్దిగా ఆపాలయందు వేసిన దాని పుల్లటి రసముచే అది పెరుగుగామారును. ఆ పెరుగు హోమమునకు మిక్కిలి శ్రేష్ఠము.

ధరణిలో పాలాశవృక్ష అభివృద్ధి

శ్లో॥ నగాయత్ర్యాః పరమో మంత్రః।
నమాతుః పరదేవతా॥

గాయత్రీదేవికి మించిన మంత్రములేదు. తల్లికిమించిన దైవములేదు అన్నఆర్యోక్తి ప్రకారము ఈ పాలాశవృక్షమును గాయత్రి స్వర్గమునుండి ఈ భువికి కొని తెచ్చిన విధము మనకు మిగుల ఆశ్చర్య కరము. తొల్లి స్వర్గమునందు సోమలత అను ఒక మొక్కను తీసుకొని దేవతలు ఈ గాయత్రికి హోమము చేసిరి. ఆ హోమానికే సోమయాగముగా పేరు వచ్చినది. ఆ సోమలత వృక్షమునుండి ఒకపత్రము భూమిపై పడినది. ఆ పత్రము వలన ఒక వృక్షము ఉద్భవించినది. దీనికే పాలాశవృక్షమని పేరు. పాపాలను పోగొట్టి పుణ్యమును ప్రసాదించు కల్ప వృక్షముగా మానవుల కిది మిగుల వుప యోగకరమైనది.

పాలాశపత్రము బిల్వపత్రమువలె మూడుదళముల పత్రము. దాని మధ్య పత్రమే హోమమునకు మిగుల శ్రేష్ఠం. గాయత్రీదేవికి మూడు పాదములు వున్నట్లు ఈ పాలాశ పత్రమునకుకూడ మూడు దళములుండుట విశేషము. ఈ పాలాశ పత్రమునకు, గాయత్రీదేవికి గల అవినాభావ సంబంధమును వేదములో ఈ విధముగా వర్ణించిరి.

గాయత్రీ కలిగిన విధము.

దీనిని గురించి యజుర్వేద సంహిత 6 వ కాండమందు మొదటి ప్రశ్నలో 6 వ అనువాగమందు ఈ విధముగా చెప్ప బడినది. కద్రు, సూపర్ణ అను ఇద్దరు దేవతా స్త్రీలుండిరి. వారిలో ఎవరు అంద గత్తెలని పోటీజరిగినది. ఓడినవారు గెలి చినవారికి దాసోహము చేయవలయు నని పందెము కట్టిరి. దేవతలందరు సూపర్ణ కంటె కద్రూ మిగుల అందగత్తె అని ఏకస్వరముతో పలికిరి, కద్రు, సూపర్ణను చూసి నీవు దేవలోకమునుండి సోమలతను తెచ్చిన నీకు దాస్యవిముక్తి కలుగునని చెప్పెను. వెంటనే సుపర్ణ జగత్, త్రిష్టుప్ గాయత్రీ అను ముగ్గురు బిడ్డలను కలుగచేసి వారిని దేవలోకమునకు పంపెను. మొదట జగత్ అనువాడు బయలుదేరి 14 అక్షరములను కలిగిన ఛందస్సుతో మనిషివలె శరీరమును సృష్టించుకొని సురలోకమునకు వెళ్ళి అచ్చట కావలివున్న స్వాన, ప్రజ అను ఇరువురితో యుద్ధముచేసి వారితో ఓడి పోయెను. 2 అక్షరముల శక్తిని పోగొట్టు కొని తల్లివద్దకు వచ్చి చేరెను. తరువాత త్రిష్టుప్ అనువాడు పదమూడు అక్షర ముల దివ్య శరీరముతో బయలుదేరెను. వాడును యుద్ధములో ఓడిపోయెను. వాడు తన శక్తిలో 2 అక్షరముల శక్తిని కోల్పోయి తిరిగి వచ్చెను. అనంతరము గాయత్రీదేవి వెళ్ళెను. ఆ దేవి 4 అక్షర ములు కలిగిన దివ్యశక్తితో వెళ్లి స్వాన, ప్రజ, ఇద్దరితో యుద్ధముచేసి గెలుపొంది. సోమలతను తన సహోదర్లు పోగొట్టు కొన్న 4 అక్షరముల శక్తిని తీసుకొని వచ్చెను. అందువలన గాయత్రీదేవికి 8 అక్ష రముల అనుష్టుప్ ఛందస్సు కలిగెను. మొదట చెప్పిన విధముగా గాయత్రికి వున్న మూడు పాదములతో ఈ 8 అక్షర ముల ఛందస్సు కలియుటచే $3 \times 8 = 24$ అక్షరముల దివ్యశక్తిగామారెను. ఆ తల్లి సోమలతను తెచ్చునప్పుడు ఒక గంధర్వుడు అడ్డగించెను. వానిని తన దివ్యశక్తితో ఎదిరించగా వాడు ఆ దేవికి నమస్కరించి పదునాల్గు భువనములలో ఆతల్లికి, మంత్ర మునకు విశేషమహాత్మ్యము కలుగునట్లు వరమిచ్చి సోమలతనిచ్చి భూలోకమునకు పంపెను. తద్వారా తల్లి శాపమును పోగొట్టి దాస్యవిముక్తి కలిగించెను.

॥ ఓం, తత్ సత్ ॥

శ్రీ కె. ఆర్. గణపతి
తిరుమల

# ఈమాసం మీఅదృష్టం!

### మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పా)

రాహువు వలన ఆందోళన. శని వలన ధననష్టం, లేదా వివాదాలు లేదా సంతానం నుండి ఎడబాటు. గురువు వలన ధనం, నూత్నవస్త్రాలు, శృంగారం లేదా వాహనప్రాప్తి లేదా సంతానం. కుజుని వలన 14 వరకు సంతానమూలంగాగాని, అక్రమ మార్గాల ద్వారాగాని ధనం. తర్వాత కాలంలో ఉదరబాధ లేదా జ్వరం, చెడు సహవాసాలమూలంగా ఆందోళన. రవి వలన 15 తేది వరకు శత్రువులమూలంగా గానీ అనారోగ్య కారణంగాగానీ ఆందోళన. తర్వాతకాలంలో దృఢారోగ్యం, శత్రువులపై జయం. శుక్రునివలన 12 తేది వరకు పెద్దల ప్రశంస, బంధువుల రాక లేదా ధనం లేదా సంతానం. తర్వాతకాలంలో అగౌరవం, అనారోగ్యం. బుధుని వలన 15 తేది వరకు భార్యతో లేదా పిల్లలతో తగాదా. తర్వాతకాలంలో ఉన్నతపదవి లేదా విజయం.

### వృషభం

(కృత్తిక 2,3,4,పా, రోహిణి, మృగశిర 1, 2, పా.)

రాహువు వలన వివాదాలు, శని వలన ధననష్టం మిత్రుల నుండి లేదా అయినవారినుండి వేర్పాటు. కుజుని వలన 14 తేది వరకు ఉద్యోగ సంబంధమైన ఆందోళన లేదా వివాదాలు లేదా శత్రువుల మూలంగా, ఇంటిలో దొంగతనంవల్ల, అనారోగ్యకారణంగా ఆందోళన. అనంతరం కుమారులమూలంగా లేదా అక్రమమార్గాల ద్వారా ధనలాభం. రవి వలన అనారోగ్యం లేదా శత్రువులు. బుధుని వలన 15 తేది వరకు గృహసంపత్తి తర్వాతకాలంలో భార్యాబిడ్డలతో తగాదా. శుక్రునివలన మంచిస్నేహితులు బంధువులరాక. పెద్దలప్రశంస, ధనం లేదా సంతానం. గురువువలన బంధువులమూలంగా ఆందోళన.

### మిథునం

(మృగశిర 3,4 పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పా.)

రాహువువలన ధనం. శనివలన ధనం, దృఢారోగ్యం, వాహనప్రాప్తి. శుక్రుని వలన ధనం, లేదా నూత్నవస్త్రాలు లేదా శత్రువులపై జయం మంచిస్నేహితులు. గురువు వలన నిరాశ. రవి వలన 17 తేది వరకు ధనం, అధికారం. తర్వాత అనారోగ్యం. బుధుని వలన 15 తేది వరకు స్నేహితులు. తన దుష్టప్రవర్తన కారణంగా భయం. తర్వాత కాలంలో గృహసంపద. కుజుని వలన ఉద్యోగ రీత్యా లేదా శత్రువులమూలంగా ఇంటిలో దొంగతనంవల్ల లేదా అనారోగ్య కారణంగా ఆందోళన.

### కర్కాటకం

(పునర్వసు 4పా, పుష్యమి, ఆశ్లేష.)

శని, రాహువుల వలన ధననష్టం. గురువు వలన ధనవృద్ధి. కుజుని వలన ధననష్టం లేదా ఆందోళన. శుక్రుని వలన ధనం, నూత్నవస్త్రాలు, గౌరవం. బుధుని వలన ధనం, స్నేహితులు, అగౌరవం. రవి వలన 17 తేది వరకు ధననష్టం. నేత్రబాధ, మోసం. తర్వాత కాలంలో ధనం; గౌరవం.

### సింహం

(మఖ, పూ. ఫ. ఉత్తర 1వ పా.)

రాహువు వలన ఆందోళన. శనివలన అయినవారినుండి వేర్పాటు, ప్రయాణం, ప్రయాస లేదా ధననష్టం. కుమారులతో తగాదా. గురువువలన ధననష్టం లేదా వివాదాలు. శుక్రుని వలన 12 తేది వరకు శృంగారప్రవృత్తి, సుఖం తర్వాత కాలంలో ధనం, నూత్నవస్త్రాలు, గౌరవం. బుధుని వలన 15 తేది వరకు చెడు కోరేవారి తగాదాల మూలంగా ధననష్టం, తర్వాత అగౌరవం ధనప్రాప్తి. కుజుని ద్వారా 14 తేది వరకు బహుళ ధనం, ఆ తర్వాత ధననష్టం, రవి వలన 17 తేది వరకు ధననష్టం, ఉదరబాధ, తర్వాత కాలంలో ధననష్టం. లేదా నేత్ర బాధ లేదా వంచన.

### కన్య

(ఉత్తర 2, 3. 4 పా. హస్త; చిత్ర 1, 2 పా.)

రాహువు వలన ధననష్టం. శనివలన ఆందోళన. గురువువలన ప్రయాణం, ప్రయాస. శుక్రుడు 12 తేది వరకు స్తబ్దుడు. తర్వాత శృంగారం. సుఖం. బుధుని వలన 15 తేది వరకు అగౌరవం, అనారోగ్యం. తర్వాతకాలంలో తగాదాలమూలంగా ధననష్టం. కుజుని వలన ధనం, అన్నివిధాలా జయం. రవి 17 తేది వరకు స్తబ్దుడు. తర్వాత కాలంలో ధననష్టం, ఉదరబాధ, ప్రయాణం.

### తుల

(చిత్త 3, 4 పా: స్వాతి, విశాఖ 1,2,3 పా:)

రాహువు వలన ధనం. శనివలన ఆందోళన, గురువువలన అధికధనం, శుక్రునివలన 12 తేది వరకు ధనం, మంచిస్నేహితులు. తర్వాత నూత్నవస్త్రాలు. బుధుని వలన 15 తేది వరకు ధనం, స్నేహితులు, శృంగారం, వాహనాలు, సంతానం, తర్వాతకాలంలో అనా

(40వ పేజీలో చూడుడు)



హిల్‌వ్యూ గెస్ట్ హవుస్ ప్రారంభోత్సవ దృశ్యం

## హిందూధర్మరక్షణ సంస్థ

హైందవమతోద్ధరణకు, ఆర్ష సంస్కృతీ విలసనానికి పాటుపడే నిమిత్తమై తిరుమల తిరుపతి దేవస్థానం సహాయోగంతో 'హిందూ ధర్మ ప్రతిష్ఠానం' అన్న సంస్థ ఏర్పడి కార్యక్రమాలు జరుగుతున్న విషయం జనవిదితమే. క్రొత్తశాసనం ప్రకారం గత మే నెల 18 వ తేది నుంచి ఆ సంస్థపేరును 'హిందూధర్మ రక్షణ సంస్థ' గా మార్చడం జరిగింది. భవిష్యత్తులో ఈ పేరుమీదుగానే ఆ సంస్థను వ్యవహరించవలసి వుంటుంది. ఈ సంస్థ కార్యక్రమాలు 'ధర్మరక్షణ సంస్థ' అన్న శీర్షిక క్రింద సప్తగిరిలో ఇకమీదట సవివరంగా ముద్రింపబడుతవి.

## నూతన అతిథి గృహాలు

'పద్మావతీ అతిథిగృహం' 'హిల్‌వ్యూ' గెస్ట్‌హౌస్ అన్న పేర్లతో తిరుమలపై రెండు దేవస్థాన అతిథిగృహాలు పదకొండు లక్షల రూ. ఖర్చుతో నూతనంగా నిర్మాణమైనవి. ఆంధ్రప్రదేశ్ దేవాదాయ శాఖామాత్యులు శ్రీ పి.వి. చౌదరిగారు ఆగష్టు 11 తేదిన వీటికి ప్రారంభోత్సవం జరిపారు. టి.టి.డి. మేనేజింగ్ కమిటి చేర్మన్ డా. ఎన్. రమేశన్‌గారు కార్యనిర్వాహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ తదితర దేవస్థానం వుద్యోగులు, పురప్రముఖులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

పద్మావతీ అతిథిగృహం అన్నది రాష్ట్రపతి, ప్రధాని. గవర్నర్లు, ముఖ్యమంత్రులువంటి విశిష్ట వ్యక్తుల వసతి కోసరం ప్రత్యేకంగా వుద్దేశించబడింది.

## శిశుఆరోగ్య పథకము

అంతర్జాతీయ శిశుసంవత్సరాన్ని పురస్కరించుకొని తిరుమల తిరుపతి దేవస్థానం వారు తిరుపతి, తిరుమల ప్రాంతాలలో గల బాల బాలికల కోసం పెద్దఎత్తున ఒక ప్రత్యేక ఆరోగ్య కార్యక్రమాన్ని చేపట్టారు.

చిన్న పిల్లలలో సర్వసామాన్యంగా కనిపించే అంటువ్యాధులనిరోధానికి టీకాలు వెయ్యటం, బడిపిల్లలలో శ్రవణలోపాన్ని తనిఖీచెయ్యడం, పుట్టుకతో వచ్చినలేదా వాతసంబంధమైన గుండెజబ్బులకు నిరోధం కల్పించటం, కుష్ఠువ్యాధి, తదితర చర్మరోగాలను గుర్తించడంవంటి ఆరోగ్య చర్యలతోబాటు శిశుప్రదర్శనల ఏర్పాటు కూడా ఈకార్యక్రమంలో ఒక భాగంగా వుంటుంది.

శ్రీ వేంకటేశ్వర రామనారాయణ వైద్యాలయానికి సంబంధించిన వైద్యనిపుణుల బృందం ఈకార్యక్రమాన్ని నిర్వహిస్తుంది. ఆగష్టు 4 తేదిన లాంఛనంగా తిరుమలపై ప్రారంభమైన ఈఆరోగ్యపథకానికి దేవస్థానం సీనియర్ మెడికల్ ఆఫీసర్ డాక్టర్ వై. ఆర్. ధనలక్ష్మి సమన్వయాధికారిగా వ్యవహరిస్తున్నారు.

శిశుప్రదర్శనలను దేవస్థానం వుద్యోగుల పిల్లలకు మాత్రమే పరిమితం చెయ్యడం జరిగింది.

# వార్తాలహరి

ప్రస్తుతానికి ఈ సంస్థ ఇటీవలి కార్యక్రమ వివరాలను ఇక్కడ క్లుప్తంగా పొందుపరుస్తున్నాం

## గుంటూరు

ఇక్కడ సంస్థశాఖ 1978 సం॥లో ఏర్పాటైంది. జిల్లా ఆర్గనైజర్ శ్రీ హరి కిషన్‌రావు ఆధ్వర్యంలో వివిధ కార్యక్రమాలు ముమ్మరంగా సాగినవి. హిందూధర్మ విశిష్టతపైన ఉపన్యాసాలు భక్తిరసపాత్రల ఏకపాత్రాభినయాలు మొదలైన సాంస్కృతిక కార్యక్రమాలేగాక అన్నమాచార్య సంకీర్తనల కార్యక్రమం రసజ్ఞుల్ని ఆకర్షించింది. తరువాత ధూళిపాళ అర్కసోమయాజులుగారి ఉపన్యాసాలు మొదలైన కార్యక్రమాలు జరిగినవి. అన్నిటికంటె ముఖ్యంగా చెప్పుకోదగింది మే నెలలో

గుంటూరులో నిర్వహింపబడిన పారిశ్రామిక వస్తుప్రదర్శనంలో ఈ సంస్థ ఆధ్వర్యంలో ఏర్పాటైన వేంకటేశ్వరస్వామి ఆలయనమూనా ఆప్రాంగణంలో ధార్మిక గ్రంథవిక్రయం, అనేక మంది ప్రజల్ని ఆకర్షించినవి. నలభై రోజులపాటు జరిగిన ఈ ప్రదర్శనలో దేవస్థాన చలనచిత్రాల ప్రదర్శన, అన్నమాచార్య హరికథా కాలక్షేపం ఏర్పాటైనవి. ఇవిగాక హరిజనవాడలలో సేవాకార్యక్రమాలు, భజనలు, హరికథలు, ఎన్నో భారతీయ సంస్కృతిని ప్రచారం చేసేందుకు ఏర్పాటైనవి.

## కృష్ణ, ఖమ్మం జిల్లాలలో

ఆ జిల్లాల నిర్వాహకులు సర్వశ్రీ బసవరాజు సుబ్బారావు, జోస్యుల రాధాకృష్ణమూర్తి, పైజిల్లాలలో వీధివీధికి వాడవాడకూ తిరిగి హిందూధర్మాన్ని ప్రచారంచేస్తున్నారు. కృష్ణాజిల్లాహంసలదీవిలో తుఫాను బాధితుల నూతన గృహాలప్రారంభోత్సవ సందర్భంగా శ్రీ వేంకటేశ్వరస్వామి చిత్రపటం, ప్రసాదం పంచిపెట్టారు. హరిజనవాడలలో ఎన్నో కార్యక్రమాలు అమలుజరిపారు. మన పండుగల్ని గురించి చిన్న చిన్న పుస్తకాలను అచ్చొత్తించి పంచి ప్రచారం చేస్తున్నారు.

## పశ్చిమగోదావరిజిల్లా

మహాపండితులు శ్రీ కల్లూరి సుబ్రహ్మణ్య దీక్షితులు ఈ జిల్లా నిర్వాహకులు. సంస్కృతాంధ్రభాషలలో అఖండ ప్రజ్ఞానిధియైన వీరు ఇటీవల భాగవత సప్తాహం జన రంజకంగా నిర్వహించారు. పశ్చిమగోదావరిజిల్లాలోని అనేక ప్రదేశాలలో తిరిగి ధార్మిక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

## తూర్పుగోదావరిజిల్లా

స్థానిక నిర్వాహకులు శ్రీ వెంపటి కృష్ణమూర్తి అనేక కార్యక్రమాలు చేపట్టడమేగాక కొన్ని భజన సంఘాలు స్థాపించి భజనలు, హరికథలు నిర్వహిస్తున్నారు. గోదావరీ పుష్కరాలలో జరిగే ధర్మరక్షణసంస్థ కార్యక్రమాలలో వీరికి ప్రముఖపాత్రవుంది.

(వశేషము)

---

100 మంది దాతలకు తేదీలను నిర్ణయించి, ఇవి దాటినపక్షంలో మరునాడు ఏర్పాటుచేయాలని, ఇదేపద్ధతి వడలు, అన్నప్రసాదాల వినియోగవిషయంలో కూడా వర్తించాలని, పత్రికాప్రకటనల ద్వారా ఈ పథకాలకు తగిన ప్రచారం జరిపించాలని నిర్ణయించడమైనది.

తిరుమల తిరుపతి దేవస్థానంలోని వైద్యాలయాలు, ప్రాథమిక చికిత్సా కేంద్రాలు, మొదలైనవాటిని క్షుణ్ణంగా పరిశీలించి యాత్రికావసరాలదృష్ట్యా జరపవలసిన అభివృద్ధి కార్యక్రమాలు, వైద్యసిబ్బంది అర్హత, వేతనాలను క్షుణ్ణంగా పరిశీలించి సూచించేందుకుగాను రాష్ట్రవైద్యశాఖ మాజీడైరెక్టర్ డాక్టర్ మాథుర్‌ను కోరాలని నిర్ణయించడమైనది.

పదవీ విరమణ చేసి పెన్షన్ పొందుతున్న ప్రభుత్వోద్యోగుల మృతి సందర్భంగా అంత్యక్రియలకుగాను 150రూపాయలు మంజూరుచేస్తూ ప్రభుత్వంఇచ్చిన వుత్తరువును దేవస్థానం వుద్యోగులకు వర్తింప జేయడమైనది.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం రజతోత్సవాల సందర్భముగా 30 లక్షల రూపాయల నిధిని దేవస్థానం అజమాయిషీ కింద ఏర్పాటుచేస్తూ దాని మీద వచ్చే 3 లక్షలరూపాయల వడ్డీని ఈ క్రింది కార్యక్రమాల వినియోగానికిగాను కేటాయించడమైనది.

ప్రాచీనచరిత్ర, సంస్కృతి, శాసనపరిశోధన, పురావస్తు అధ్యయనాలపై ప్రత్యేక విభాగాల నిర్వహణకుగాను సాలీన నిర్వహణ వ్యయం కిందరు. 1.5 లక్షలు, తత్త్వశాస్త్రవిభాగంలో శ్రీ వేంకటేశ్వర అధ్యయనాల పేరిట ఒక ప్రత్యేక పీఠం నిర్వహణకు సాలీనా రు. 50 వేలు, లలిత కళా విభాగంలో శ్రీ అన్నమాచార్యుల సంకీర్తనలశాఖకు, ఒకరీడర్ పదవి ఏర్పాటుకు సాలీనా రు. 25 వేలు, విశ్వవిద్యాలయప్రాచ్యపరిశోధన సంస్థలో శాసనపరిశోధనపై నాలుగు పేపర్లుగల డిప్లొమా కోర్సు ప్రారంభించడంద్వారా దానిస్థాయిని పెంచేందుకు సాలీనా రు.50 వేలు పుస్తకప్రచురణల నిమిత్తం మరొక రు.25 వేల వార్షిక గ్రాంటు మంజూరు చేయడమైనది.

ఏ నిర్దిష్ట పథకాలకైతే మంజూరు చేయబడినవో, వాటికే పై మూడు లక్షల వార్షిక గ్రాంట్లు వినియోగించాలని, అంతేగాని వేరే విభాగంకు గాని లేదా అదే విభాగంలో వేరే ప్రయోజనాలకిగాని వాటిని వాడరాదని నిర్దేశించడమైనది.

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాల సంస్కృత శాస్త్ర విద్యార్థుల స్టయిఫండ్ పెంచేందుకు బదులుగా ఉచిత భోజన నివాస వసతి ఏర్పాటు చెయ్యడం మంచిదని, వీరివద్ద నుండి ఎటువంటి రుసుము వసూలు చెయ్యరాదని, ఈ విషయంగా తగుచర్య తీసుకోవలసిందిగా కార్యనిర్వహణాధికారిని కోరడమైనది.

60 రూపాయల టిక్కెట్టుమీద భక్తులను అనుమతించే ఆర్జిత పూలంగిసేవ టిక్కెట్లను రద్దుచేయడమైనది. *

(37 వ పేజీ తరువాయి)

రోగ్యం లేదా అగౌరవం కుజునివలన 14 తేదీవరకు అగౌరవం లేదా ధననష్టం తర్వాత కాలంలో అధికధనం. రవివలన 17 తేదివరకు ధనం, జయం, దృఢారోగ్యం. తర్వాత కాలంలో స్తబ్ధుడు.

### వృశ్చికం

(విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

రాహువువలన తగాదాలు. శనివలన ధననష్టం అగౌరవం. గురువువలన ధననష్టం, గౌరవభంగం కుజునివలన మాసాంతం ధననష్టం, గౌరవభంగం బుధునివలన మాసాంతం ధనం, జయం, శృంగారం, స్నేహితులు, వాహనాలు లేదా నూత్న గృహం శుక్రునివలన 12 తేదివరకు వివాదాలు, అగౌరవం తర్వాత మంచిస్నేహితులు, ధనం. రవివలన జయం, ధనం.

### ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

రాహువువలన పాపాచరణం. శనివలన వివాదాలు, లేదా అనారోగ్యం లేదా అధార్మిక ప్రవర్తన. గురువువలన ధనం, జయం, సంతానం కుజునివలన భార్యకు అసంతుష్టి. నేత్ర లేదా ఉదర బాధ లేదా ధననష్టం, గౌరవభంగం. రవివలన 17 తేదీ వరకు ధననష్టం లేదా గౌరవభంగం. తర్వాత కాలంలో జయం, ధనం. శుక్రునిమూలంగా 12 తేది వరకు ధనం, శృంగారం, లేదా నూత్న వస్త్రాలు, పుణ్యకార్యాలు తర్వాత కాలంలోవివాదాలు, అగౌరవం. బుధుని వలన 15 వ తేదివరకు ప్రయత్నాలలో వైఫల్యం, తర్వాత ధనం, శృంగారం, లేదా నూతన గృహప్రాప్తి.

### మకరం

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ఠ 1,2 పా)

రాహువువలన ఆందోళన. శని మూలంగా అయినవారినుండి వేర్పాటు గురువు కారణంగా అనారోగ్యం లేదా ప్రయాణం, ప్రయాస. కుజునిద్వారా 14 తేదివరకు ధనం, జయం, తర్వాత భార్యకు అసంతుష్టి, నేత్ర లేదా ఉదర బాధ. శుక్రునివలన ధనం, నూత్న వస్త్రాలు లేదా శృంగారం లేదా నూత్న గృహం, ధార్మిక ప్రవర్తన. రవివలన అనారోగ్యం లేదా భార్యకు అసంతుష్టి ప్రయత్నాలలో వైఫల్యం ధననష్టం, గౌరవభంగం. బుధుని వలన 15 తేది వరకు ధనం, నూత్నవస్త్రాలు, జయం లేదా సంతానం. తర్వాత నిరాశ.

### కుంభం

(ధనిష్ఠ 3,4 పా, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా)

రాహువువలన తగాదాలు. శనివలన ప్రయాణం. గురువుద్వారా ధనం, శృంగారం. కుజునివలన 14 వ తేదివరకు అనారోగ్యం లేదా శత్రుభయం లేదా సంతాన మూలంగా ఆందోళన. తర్వాత కాలంలో ధనం, జయం. రవివలన 17 వ తేదీవరకు ప్రయాణం ఉదరబాధ, అనారోగ్యం, భార్యకు అసంతుష్టి. శుక్రుని మూలంగా 12 వ తేదివరకు స్త్రీలమూలంగా బాధ తర్వాత ధనం లేదా శృంగారం లేదా నూత్నవస్త్రాలు లేదా గృహం. బుధుని వలన 15 వ తేదివరకు వివాదాలు. తర్వాతకాలంలో ధనం, జయం, నూత్న వస్త్రాలు, సంతానం.

### మీనం

(పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి.)

రాహువువలన ధనం, శనివలన దృఢారోగ్యం జయం. గురువువలన మనశ్శాంతికి భంగం. కుజునివలన జ్వరం, ఉదర బాధ, దుష్టసహవాసాలు లేదా శత్రువులు, కుమారుల మూలంగా ఆందోళన, శుక్రునివలన అగౌరవం, అనారోగ్యం. స్త్రీల మూలంగా ఆందోళన. రవివలన 17 వతేదీ వరకు జయం, దృఢారోగ్యం, తర్వాతకాలంలో ప్రయాణం. బుధుని వలన 15 వ తేది వరకు జయం, అధికారం. తర్వాతకాలంలో వివాదాలు.

## చందాదారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రిక చందాదారులలో దిగువ పేర్కొన్న సంఖ్య వారి చందా 31-10-79 తేదీకి అంతమగును. చందాదారులు ఈ విషయమును గమనించి M. O. ద్వారా దిగువ పేర్కొనిన ప్రకారము మనియార్డరు కూపనునందు తమ చందా సంఖ్య పూర్తి విలాసమును పేర్కొని, త్వరలో చందా పంపనియెడల ఆ తేది దరిమిలా పత్రిక పంపబడదు.

చందాదారుల నంబర్లు మార్చబడినవి. కొత్తనంబర్లు దిగువ పేర్కొనబడినవి. తమకు పంపిన పత్రికఅడ్రసు పేపరుమీద నున్న నంబరును క్రొత్త నంబరుగా గమనింప ప్రార్థన

25 149 170 179 204 220 227 229 231 259 261 262 263 286 290 294 301 305 309 320 323 325 328 373 376 377 378 382 385 395 397 398 400 to 403 409 410 419 555 559 to 562 564 to 570 572 to 578 580 to 583 585 586 799 800 to 80ς 807 to 814 815 816 817 819 820 822 823 824 825 827 829 to 836 838 to 853 855 to 858 860 861 862 864 865 869 872 873 874 913 1568 to 1573 1575 to1579 1581 to 1585 1616 1628 1629 1630 1632 to 1644 1679 1692 1694 to 1712 1714 1717 1726 to 1731 1733 to 1742 1746 1747 1749 1765 1770.

గమనిక :– (1) సప్తగిరి చందాలు 15 తేదిలోగా చేరునట్లు పంపవలెను. ఆ తరువాత చేరిన చందాలకు మరునెలనుండి మాత్రమే పత్రిక పంపబడును.

(2) కొత్త చందాదారులు కూపనులో 'కొత్తచందా' అని పేర్కొనవలెను. పాత వారు కూపనులో తమ చందా సంఖ్య నమోదు చేయవలెను.

(3) సప్తగిరి చందాలు ఈ క్రింది అడ్రసుకే తమ పిన్‌కోడ్ తెలియజేస్తూ పంపవలయును.

సప్తగిరి మాసపత్రిక సం॥ చందా రు. 6/–

ఎడిటరు
పబ్లికేషన్ సెక్షన్
ప్రెస్ కాంపౌండ్, తిరుపతి 517501.

*Edited and Published on behalf of T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T. T. D. Press by M· Vijayakumar Reddy, Manager T. T. D. Press Tirupati-517501*



కంచికిచేరంగా సమస్త లాంఛనాలతో ఆలయ మర్యాదలతో ఆ వస్త్రాలకు స్వాగతం, ఊరేగింపు జరిగాయి. ఆ తర్వాత శ్రీ ప్రసాద్ నేతృత్వంలో ఈ బృందం అత్తివరదుని సందర్శించి తీర్థప్రసాదాలు స్వీకరించి బహుమానం సమర్పించింది.

ఈ కార్యక్రమానంతరం జరిగిన ఇష్టాగోష్ఠి సమావేశంలో కంచి దేవస్థానం పక్షాన కార్యనిర్వహణాధికారి శ్రీ సుబ్రమణియన్ ఆలయ మర్యాదలు జరిపి తిరుమల తిరుపతి దేవస్థానానికి రెండుఛత్రాలు సమర్పించారు. దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్ కంచిలో ఒక ధర్మశాలను ఒక సమా







చార కేంద్రాన్ని నెలకొల్పే ప్రతిపాదనను వివరించారు. తరువాత తిరుమల తిరుపతి దేవస్థాన అధికార్ల బృందాన్ని ఊరి పొలిమేరల వరకు ఘనంగా తగు మర్యాదలతో సాగనంపడం జరిగింది.

*

# తిరుమల యాత్రికులకు సదుపాయములు

* * *

- * అన్ని వర్గాలవారికి అందుబాటులో ఉండేటట్లు, ఉచిత పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలతో ఆవాససౌకర్యం.
- * శ్రీవారిని దర్శించు యాత్రికులక్యూ షెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు.
- * క్యూషెడ్లలోనే కాఫీబోర్డువారి అల్పాహార సదుపాయం.
- * సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
- * యాత్రికులు వెలుపలకు రానక్కరలేకుండా, క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం.
- * ఆంధ్రప్రదేశ్ పాలసరఫరాసంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
- * యాత్రికులు చదువుకునేందుకు దేవస్థానం ముద్రిత గ్రంథాలు, స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
- * క్యూలోని యాత్రికులకు విసుగులేకుండా ఉండేందుకు టెలివిజన్ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం.
- * క్యూలైన్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7వమైలువద్ద వైద్యసదుపాయం.
  సామానులు, పాదరక్షలు భద్రపరచుకొనేందుకు ప్రత్యేక సౌకర్యం.
- * తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటోసౌకర్యం,
  ఉచిత బస్సుసదుపాయం
- * దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు ముఖద్వారంలో పేష్కార్ స్థాయి అధికారి, సిబ్బంది.
- * క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన, సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి, సిబ్బంది.
- * యాత్రికుల సామానులను భద్రంగా తిరుమలచేర్చే సౌకర్యం ఏర్పాటైంది. తిరుపతిలో ఏ సత్రంలోనైనా గాని, టోల్ గేట్ వద్దగాని తమ సామాగ్రి అప్పగించి రసీదు పొంది ఆ రసీదు తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్ దగ్గర కౌంటర్‌లో ఇచ్చి సామగ్రి పొందవచ్చు.
- * దుండగులనుండి యాత్రికులను కాపాడేందుకు, తిరుమలకు వెళ్ళేదోవపొడుగునా రాత్రింబవళ్ళూ పోలీసు గస్తీ ఏర్పాటు చేయబడింది.
- * దారిపొడుగునా మంచినీటి సదుపాయం ఉన్నది.
- * రాత్రిపూటగాని, తెల్లవారుఝామునగాని కొండకు వెళ్ళదల్చుకొన్న వారికి వీలుగా మంచికాంతి శక్తిగల దీపాలు ఏర్పాటైనవి.
- * వివిధప్రాంతాలనుండి వచ్చేయాత్రికులకు బోధపడేందుకు గాను తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో, దేశంలోని ముఖ్యభాషలలో విచారణ కార్యాలయాలు.
  ప్రత్యేక కాటేజీలలోని అదనపు సౌకర్యాలు అంజనాద్రినగర్, శేషాద్రి, గరుడాద్రి, శంకుమిట్ట కాటేజీలలో కూడ ఏర్పాటైనవి.

**దేవస్థాన ప్రయత్నాలలో ఇవి కొన్ని మాత్రమే!**

**గమనిక:** తిరుమలలో 2-4-79 నుండి తపాలాకార్యాలయము రాత్రి 8-30 గం॥ వరకు పనిచేస్తున్నది. ఇది గాక ప్రధాన తపాలాకార్యాలయము రాత్రి 10-30 నుండి 1-00 గం॥ వరకు పనిచేస్తుంది. శ్రీ వేంకటేశ్వరస్వామి వారి భక్తుడు అన్నమాచార్యుల తపాలాముద్రను కోరినవారు, తమ కార్డులు, కవర్లపై ముద్రించుకోవచ్చును.

# తిరుమలలో రాష్ట్రపతి





శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ రజతోత్సవాలను ప్రారంభించడానికి తిరుపతి విచ్చేసిన భారతరాష్ట్రపతి డాక్టర్ నీలం సంజీవరెడ్డిగారు సెప్టెంబర్ 1 తేది రాత్రి తిరుమలకు వెళ్ళి శ్రీవేంకటేశ్వరస్వామిని దర్శించి అర్చన చేశారు. రాష్ట్రముఖ్యమంత్రి శ్రీమర్రి చెన్నారెడ్డి వారి మంత్రి వర్గ సహచరులు, ప్రభుత్వాధికారులు వారి వెంట తిరుమలకు వెళ్ళారు. శ్రీవారి ఆలయంవద్ద రాష్ట్రపతికి హార్దికమైన స్వాగతం చెప్పబడింది. ఆంధ్రప్రదేశ్ దేవాదాయధర్మాదాయ శాఖామాత్యులు శ్రీ పి. వి. చౌదరి, ధర్మాదాయశాఖ కమీషనర్ శ్రీ చంద్రమౌళిరెడ్డి తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహకమండలి అధ్యక్షులు, డాక్టర్ ఎన్. రమేశన్, దేవస్థాన కార్య నిర్వాహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, శ్రీవారి ఆలయప్రధానార్చకులు శ్రీ వెంకటరమణదీక్షితులు తదితర ప్రముఖులు మంగళ తూర్యారావాలు, వేదమంత్ర ఘోషల నడుమ రాష్ట్రపతిని ఆలయంలోకి వేడుకగా తోడ్కొనిపోయారు రాష్ట్రపతికి, ముఖ్యమంత్రికి శ్రీవారి ఆలయంలో శేషవస్త్రాన్ని పవిత్రోత్సవ మాలను సమర్పణ చేశారు.

శ్రీస్వామివారిని అర్చించి గంభీర ధ్యానముద్రతో తదేకదీక్షతో ప్రార్థించిన అనంతరం రాష్ట్రపతి ఆలయ ప్రదక్షిణం పూర్తిచేసి హుండీలో స్వామివారికి ముడుపు చెల్లించారు. తిరుమల తిరుపతి దేవస్థానం యాత్రికుల సౌకర్యార్థం తిరుమలపై

(3 వ కవరు పేజీలో)







ప్రసాద్
ఐ. ఏ. ఎస్,
ర్వహణాధికారి
ంలు, తిరుపతి.
నెం. 2322

దీపావళి

తెలుగు సాహిత్యంలో

శ్రీ వేంకటేశ్వర పూర్

శ్రీ వేదాంతదేశికులు క్కినను

పట పట దిక్కులు బగ్గనఁ బగిలె

ఎగసిన గరుడని ఏపున ధాయని
జిగి దొలఁక చబుకు చేసినను
నిగమాంతంబులు నిగమసంఘములు
గగనము జగములు గడగడ వడఁకె

బిరుసుగ గరుడని పేరెము దోలుచు
బెరసి నీవు గోపించినను
సరుస నఖిలములు జర్జరితములై
తిరుపున నలుగడ దిరదిరఁ దిరిగె

ఝల్లించిన నీ పసిఁడి గరుడనిని
కెల్లున నీ వెక్కిన యపుడు
ఝల్లనె రాక్షస సమితి నీ మహిమ
వెల్లి మునుగుదురు వెంకట రమణా

అన్నమాచార్య సం. 11—235 పుట



రజతోత్సవాల సందర్భంగా శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాంగణంలో తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఏర్పాటుచేసిన ఫలపుష్పవృక్ష ప్రదర్శనను పరిశీలిస్తున్న విశ్వవిద్యాలయ మాజీ ఉపాధ్యక్షులు డా. జగన్నాథరెడ్డి-వివరిస్తున్న దేవస్థానం గార్డన్ సూపరింటెండెంట్ శ్రీ తమ్మణ్ణ.

# సప్తగిరి


అక్టోబరు 79

సంపుటి 10 సంచిక 5

విడిప్రతి 0-50 పైసలు

సం॥ చందా రు. 6-00


## విషయసూచిక



* కొన్ని అనివార్య కారణములవలన 'శ్రీనివాస ప్రబంధము' 'వరాహపురాణం' ప్రకటింపబడ లేదు


గౌరవసంపాదకులు:

శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్

ఐ. ఏ. ఎస్,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2322

ప్రచురణకర్త–సంపాదకుడు:

కొట్రపాటి సుబ్బారావు

ఎమ్. ఏ.,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2254

ముద్రాపకుడు,

ఎమ్. విజయకుమార్ రెడ్డి,

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి.

టెలిఫోన్ నెం. 2340

# సంపాదకీయము

పుత్రోత్సాహము తండ్రికి
పుత్రుడు జన్మించినపుడె పుట్టదు జను లా—
పుత్రునిఁ గనుగొని పొగడగ
పుత్రోత్సాహంబు నాఁడు పొందుర సుమతీ.

ఇది నిజంగా ముత్యం లాంటి మాట. బిడ్డ అడ్డాలలో ఉండగానే, భవిష్యత్తేమిటో తెలియకుండా మురిసిపోయే తండ్రులకు కాల ప్రభావాన్ని రూపించే ఒక హెచ్చరిక. ఈ సూత్రం వ్యక్తులకే గాదు వ్యవస్థలకు కూడా వర్తిస్తుంది. బిడ్డలకు మాదిరే బంగారు భవిష్యత్తును కలలు కంటూ ఎన్నో కార్యక్రమాలు ప్రారంభిస్తాం. కొన్ని పునాదిలోనే సమాధులైతే మరికొన్ని కొంత దూరం సాగి మధ్యలో ఆగిపోతాయి మరికొన్నిటి పర్యవసానం, ఇదా మనం ఊహించుకొన్నది అనే పశ్చాత్తాపం కల్గిస్తుంది. అన్ని అవరోధాలూ దాటి వయస్సుతో పెరిగే మనస్సు మాదిరే సుదృఢ ప్రాతిపదిక పైన విస్తరించి మూడు పూవులు ఆరుకాయలుగా రూపొందటం విత్తునాటిన వారికొక వింతతృప్తి ఎత్తు పెరిగిన వారికొక వింత అందం. ఇటీవల రజతోత్సవం జరుపుకున్న శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయాన్ని చూస్తే అక్షరాలా ఇది నిజమనిపిస్తుంది.

శ్రీ వేంకటేశ్వర కరుణా కటాక్షంతో, దేవస్థాన ధన, భవన సహాయంతో త్యాగశీలి, స్వర్గీయ టంగుటూరి ప్రకాశం సలహాతో నేటి రాష్ట్రపతి, నాటి ఉపముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి ఆధ్వర్యంలో చిన్న మొక్కగా ప్రారంభమైన ఈవ్యవస్థ డా॥ గోవిందరాజులునాయుడు, డా॥ జగన్నాథరెడ్డి, శ్రీ వామనరావ్, డా॥ సచ్చిదానందమూర్తి, డా॥ శాంతప్పల లాంటి వారి నిర్వహణ దక్షతతో అన్ని ఒడిదుడుకులు దాటి ఇటీవల రజతోత్సవం జరుపుకున్నదంటే మొక్కనుండి మాను స్థాయివరకు కాచుకొని వస్తున్న దేవస్థానానికి ఎంతో సంతోషదాయకమైన విషయం.

నిజానికి విశ్వవిద్యాలయానికి, దేవస్థానానికి అవినాభావ సంబంధం మొదట నుంచీ వున్నదే. ప్రతి ఏడూ ఈ విశ్వవిద్యాలయ నిర్వహణకు గాను కొన్ని లక్షలు దేవస్థాన నిధులలో కేటాయించటం జరుగుతున్నది. ఇందుకు తగ్గట్టు విశ్వవిద్యాలయం కూడా దేవస్థాన ఆశయాలకు అనుగుణంగా కొన్ని కార్యక్రమాలు నిర్వహించటం ముఖ్యంగా వైష్ణ ఆళ్వారులలో ముఖ్యులు తిరుప్పాణాళ్వార్ పేరిట ఒక భవనం నెలకొల్పటం, శ్రీ వేంకటేశ్వర స్వామిపై 32,000 కీర్తనలు రచించి తరించిన అన్నమాచార్యులపై ప్రత్యేకపీఠం సంకల్పం. ఈ ప్రణాళికలో కొన్ని. అయితే దేవస్థానంకూడా కళ్ళ తుడుపుసహాయం చేసి చేతులు కడుక్కోవాలనుకోవటంలేదు. ఈ విశ్వవిద్యాలయం ఒక శాశ్వత, ఆధ్యాత్మిక, చారిత్ర. విజ్ఞాన కేంద్రంగా రూపొందేందుకు సహాయ పడాలనే తపనతో ఉన్నది. ఇటీవల రు. 30 లక్షల మూలధనం ఏర్పాటుచేసి దానిపై వడ్డీని, పురావస్తు పరిశోధన, ప్రాచీనశాసనాధ్యయనం, అన్నమాచార్య అధ్యయన పీఠం, పరిశోధనా గ్రంథ ముద్రణాదులకు వినియోగించాలని విశ్వవిద్యాలయాన్ని కోరటంలో ఉద్దేశ్యం పరమాత్ముని కరుణా కిరణ ప్రసార ప్రభావితమైన ఈ విశ్వవిద్యాలయం ఐహిక, ఆధ్యాత్మిక విద్యానిలయంగా రూపొందించాలని, దీనికి దేవస్థాన ఆలయ విజ్ఞాన సంపదలు తోడై భావి నిర్మాణానికి వెలుగు దీపిక కావాలనే.

కాని, ఇటీవల రాష్ట్రపతి చెప్పినట్లు మనిషికి ఎన్ని సంపదలున్నా శీల సంపద లోపిస్తే ఉన్నవన్నీ లేనట్లే. బ్రతుకు బంగారుబాట కావాలనుకునే విద్యార్థులు మాతా పితల తర్వాత దైవసమానులైన గురువుల సామూహిక విద్యాలయాలే విశ్వవిద్యాలయమని విద్యార్థులు విజ్ఞాన భిక్షువులేగాని విద్యార్థి వేతనభిక్షుకులు కాదని గుర్తించి ఉపాధ్యాయులు సానుభూతితోను వర్తించే అవసరాన్ని గుర్తించనంత కాలం, ప్రగతి గొర్రెతోక కన్న మిన్న కాదు.

అసలు ఏ పని సక్రమంగా జరగాలన్నా అనుమానాలతో కాకుండా ఆత్మస్థైర్యంతో సుహృద్భావంతో ముందుకు సాగాలి. అందుకే పూర్వం ఋషులు కూడా ఆనోభద్రాణి యాంతు ఋతవో విశ్వతః అన్నారు. అదే మొన్న రాష్ట్రపతి వేంకటేశ్వరుని ప్రార్థించింది కూడా.

' సబ్ కో సన్మతి దే భగవాన్ '

# దీపావళి



ఈ పేరన్నంతనే చిన్నపిల్లలకు పెద్ద సంబరము; క్రొత్తఅల్లుండ్లకు దున్నకి చల్లక పండేపంట; టపాకాయలంగళ్ళ వాళ్లకు లాభసాటి బేరము; జవుళీవాళ్లకు ముల్లెమూట; దర్జీవాళ్లకు ముడుపులు చెల్లించే శివరాత్రి; అక్కడిక్కడకేగు వారికి వీథుల్లో పోవడానికి ప్రాణభయము. అన్ని వీథులలో మెరుపులతో సరసాలాడే ఫిరంగిమోతలు; సాధారణకుటుంబాల లోని యింటిపెద్దలపాలికి అప్పిచ్చువారు ఐకిచక్రవర్తులు; వారికి వడ్డీ లౌకపదార్థ మేగాదు: ప్రతియింటా పండుగవంటల పరిమళములు; ఓహో! చెప్పవలసిన దేమున్నదిలే యింక.

ఉషః స్నానానంతర మక్కడక్కడ నరకాసురవధ ఘట్టములు చదవేవారున్నా రు. ఈపండుగంతా నరకాసుర ప్రీత్యర్థమో నరకాసుర జ్ఞాపకార్థమో, నరకునకు భగ వంతుడిచ్చిన వరప్రసాదముగనో చాలా మంది భావించుట గలదు.

కానీ, ఈ పర్వమునకు నరకాసురు నకు సంబంధము గలదా? లేకున్న నీప్రథ యెట్లు వచ్చినది? దీపావళికి టపాకాయ లకు సంబంధమున్నదా? ఆ టపాకాయ లంటా నరకునిపై సత్యాకృష్ణులు ప్రయో గించిన బాణజ్యోతులేనా? అను విషయ మిందు చర్చనీయము.

ఇక్కడ 'నరక' పదము నరకాసుర వాచకముగాదు. పాపఫలముగ ననుభ వించు 'నరకము' నకు వాచకము. ఈ పర్వము నందలి చిత్రవిచిత్ర దీపకల్ప నలో టపాకాయ లెప్పుడు స్థానమును సంపాదించు కొన్నవో చెప్పలేము. ఈ నరక చతుర్దశినాడు, నరకమును బాపు కొనుటకై ఉషః కాలమున మంగళ స్నానము; ఆ నీటిని అపామార్గ (ఉత్తరేణి) యను నోషధితో ఆలోడించుటయు ఆనాడు జీవత్పితృకుడు గూడ నరక నిస్తా రణమునకై యమతర్పణము చేయవలయు ననియు ధర్మశాస్త్రములు ఘోషించు చున్నవి. నూతన వస్త్రధారణము గూడ నరక నిరాస సూచకముగ ధర్మశాస్త్రములు ప్రశంసించి యున్నవి. ప్రతి మానవునకు ఆయా సంవత్సర సంపాదిత నరకము,


శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ

తిరుపతి


స్వాతీ నక్షత్రయుక్త ఆశ్వయుజ కృష్ణ చతుర్దశియందుషఃకాల మంగళ స్నాన యమతర్పణములచే నశించి, వాడు పున ర్నవీకృతుడౌననియు, అలక్ష్మీనాశనము నకై ఆనాడు సాయంకాలము లక్ష్మీపూజ చేసి మంగళ దీపమాలిక లుంచవలెననియు ధర్మశాస్త్ర పద్ధతి. ఈ విషయములన్నియు నేడు కేవలము పంచాంగము అందు మాత్రము వ్రాతలో గన్పడు చున్నవి. ఆచారమునందు పైన పేర్కొన్న సంబరాలు. టపాకాయలు మాత్రమే మిగిలినవి.

ఇట్లుగాక పై పేర్కొన్నట్లు నరకాసుర ప్రీతియో జ్ఞాపకమో వాని కిచ్చిన వర ప్రసాదమో యనుకొనుటకు, ఏ పురాణము ధర్మశాస్త్రము గూడ నాధారముగ లేవు. ఇంతకూ వీని ప్రీతియో, జ్ఞాపకమో, వీని కిచ్చిన వరప్రసాదమో యనుకొనుటకు,

(33పేజీలో చూడుడు)

# తెలుగు సాహిత్యంలో సత్యభామ

★

సత్యభామ పేరు తెలియని ఆంధ్రుడు వుండడనడంలో అతిశయోక్తిలేదు. సీత, సావిత్రి, దమయంతి, మొదలైన పతివ్రతామతల్లులకంటె, విశిష్టమైన రీతిలో ఆంధ్రుల ఆదరాభిమానాల్ని పొందిన స్త్రీ, సంపూర్ణమైన స్త్రీత్వము మూర్తీభవించిన సన్నుతాంగి సత్యభామ. సహజకవి బిరుదాంకితుడైన పోతన చేతిలో 'బాల రసాల సాల నవపల్లవ కోమల కన్య' వలె పెరిగి నాచనసోముని యందు పదారు కళలను చిలికించి, ముక్కుతిమ్మనార్యుని ముద్దుపలుకులలో కులికి, పఠితల హృదయాలను వెన్నెలవెలుగులో తడిపి రసప్లావితం చేసిన శృంగార రసాధిదేవత సత్యభామ.

తెలుగు సాహిత్యంలో సత్యభామ పాత్ర ప్రప్రథమంగా మనకు భారతంలో దర్శనమిస్తుంది. అరణ్యపర్వంలో శ్రీకృష్ణుడు సత్యభామా సహితుడై, పాండవులను చూచునిమిత్తము వెడలును అరణ్యవాసము చేస్తున్న ద్రౌపదిని, సత్యభామ 'నీభర్తలను నీవు ఏవిధముగా వశపరచుకొంటివి?' అని అడుగగా ద్రౌపది, ఆమెకు పతివ్రతాధర్మాలను బోధిస్తుంది. ఇక్కడ సత్యభామ పాత్ర, ద్రౌపది చెప్పే పతివ్రతాధర్మాలను వినడానికి ప్రవేశ పెట్టినది తప్పిస్తే, అక్కడ ప్రత్యేక వ్యక్తిత్వమేమీ లేదు. అందులో ద్రౌపదిని ఆమె, 'నీభర్తలను మంత్ర, తంత్రముల ద్వారా వశపరచుకొంటివా?' అని అడగడం ఔచిత్యదూరము.

ఇక, పోతన, ఆమె శైశవమును ప్రస్తావించక, సర్వలక్షణశోభితయైన సత్యను సత్రాజిత్తు, మణితో కృష్ణునకు సమర్పించగా, "వానరమణి, నీకును, మాకును గలవు మణులు, కుమారీమణి మాకు" చాలునని ఆమెను వివాహమాడెను,

పోతన ఆమెలోని ముగ్ధతను, పరాక్రమాన్ని సౌకుమార్యాన్ని చిత్రించాడేతప్ప సంపూర్ణమైన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించలేదు. శ్రీకృష్ణుడు నరకాసుర వధార్థంబు వెళ్ళునపుడు సత్యభామ అతనితో యుద్ధరంగమునకు వచ్చుటకు అనుమతి వేడగా, కృష్ణుడు యుద్ధరంగాన్ని వర్ణించి, సుకుమారివైన నీవు రాలేవు, రావలదు అంటాడు. అనగా సత్యభామ ప్రియునకు ప్రియంబు జనింప దగ్గరి—

శ్రీమతి మాడభూషి జ్యోతికుమారి,
తాడేపల్లిగూడెం

దానవులైన నేమి దైత్య సమూహములైన నేమి నీ
మానిత బాహుదుర్గముల మాటున నుండగ నేమిశంక నీ
తో నరుదెంతు నంచు గరతోయజముల్ ముకుళించెమ్రొక్కెన
మ్మానిని భర్త తన్ను బహుమాన పురస్పర దృష్టి చూడగన్ ॥

ఇందు సత్యభామ అమాయకత్వము మూర్తీభవించిన ముదితగ దర్శనమిస్తుంది. యుద్ధరంగంలో తానుచూచిన భర్త పరాక్రమాన్ని సవతుల దగ్గర ప్రస్తుతించడానికే తీసుకు వెళ్ళమని అడగడంలో సత్యభామ ముగ్ధత్వం పఠితలను మురిపిస్తుంది. తనవెంట అడవులకు తీసుకు వెళ్ళనను రాముని, సీతవలె కఠినోక్తులతో తూలనాడదు సరికదా, కరకమలంబులు మొగిడ్చి మరీ ప్రార్థిస్తుంది.

యుద్ధసమయంలో వీరత్వము మూర్తీభవించిన వీరనారిగ దర్శనమిస్తుంది. ఆమె

నరకాసురునితో యుద్ధం చేసేటప్పుడు ప్రియునకు శృంగార రసాధి దేవతగా, నర కునకు వీరనారిగ దర్శన మిస్తుంది. రణ రంగంలో ఆమెచేసే వీర విహారానికి ఆశ్చర్యపోయి కవి అంటాడు, వీణచక్కగ పట్టుకోలేని కొమ్మ బాణాసనం ఏవిధంగా పూనగల్గింది? మాకులను తీగకు కూర్పగ లేని లేమ వింటికి బాణమేవిధంగా ఎక్కు పెట్ట గల్గింది, అని ఆమెలోని సౌందర్య సౌకుమార్యాలను వెల్లడించాడు.

సత్యభామ భర్తతోకలసి యుద్ధానికి రావ డంలో, సవతులందరి కంటె తాను కృష్ణుని మనస్సులో ప్రత్యేక స్థానాన్ని పొందాలనే కోరిక గూడావుంది. ఆమెకు వాంఛా పరి పూర్తి అయింది. కృష్ణుడు ఆమె పరా క్రమానికి అలరి, 'కొమ్మా! మెచ్చితి నిచ్చెద కొమ్మాభరణములు నీవు కోరిన వెల్లన్' అని అనడమేకాక 'సమ్మాన రూపంబులు, మోహన దీపంబులు దూరీ కృత చిత్తవిక్షేపంబులైన సల్లాపంబులం కళావతిం తద్దయుం పెద్దరికంబు చేసెన్' పోతన చిత్రించిన సత్యభామ మృదుమధుర మైన పదములవలె, మృదువైన నడవడి, నవనీత హృదయము కలది. తనకు కావల్సింది ప్రార్థించి పొందుతుందే తప్ప తూలనాడి లేక అలిగి సాధించదు.

నాచన సోమన తన ఉత్తర హరి వంశంలో సత్యభామ పాత్రను రేఖా మాత్రంగా చిత్రించాడే తప్ప సంపూర్ణమైన స్వరూపస్వభావాదులను చిత్రించలేదు. యుద్ధరంగంలో కేవలము వీరనారిగనే కాక, అష్టవిధములైన శృంగార నాయిక లను సత్యభామలో దర్శింప చేసాడు కవి.

సత్యభామ యుద్ధముచేసి అలసిపోగా కృష్ణుడామెను వుపలాలిస్తూ.

"చెలువ చెక్కుల నెలకొన్న చెమట తుడిచి
తరుణి నుదుట బైకొన్న కుంతలములొత్తి
రమణి కుచ మధ్యమునకు హారములు ద్రోచి
పొలతి పయ్యెద కొంగుపై బొందుపరచి"

ప్రబంధ కవితా యుగంలోని శృంగా రానికి బీజాల్ని నాటాడు సోమన. ఇక్కడ సత్యభామ ప్రబంధ నాయికగ, కృష్ణుడు ప్రబంధ నాయకుడుగ దర్శనమిస్తారు. హరివంశంలో కృష్ణుడు, సత్యభామ పై చూపించే అనురాగము, అభిమానము పోతన కృష్ణుడు చూపించలేదు.

పోతన, సోమనలచే చిత్రిక పట్టబడిన సత్యభామ ముక్కుతిమ్మనార్యుని ముద్దు పలుకులలో సంపూర్ణ సమగ్రమైన స్త్రీత్వ రూపాన్ని సంతరించుకుంది. పారిజాతాప హరణ ప్రబంధంలో, సత్యభామ పాత్రను కవి పరిచయంచేస్తూ, కృష్ణునకు ఎనిమిది మంది భార్యలున్నను అందరిని సమాన ముగ చూచియు భోజజనపాల సుతను, తరుణీమణి సాత్రాజితిని అధికమగు ప్రేమతో చనువిచ్చి మన్నించునన్నాడు. పోతనచిత్రించిన సత్యభామ ఎటువంటి దంటే, చక్కనిది, ఎలజవ్వని, మగని ప్రేమనుపొందినది, అభిమానవతి, సద్వంశ సంజాత. అందువల్లనే నారదుడు అన్న మాటలు, ఆమె అభిమానంపై, అహం కారంపై దెబ్బతీశాయి.

సత్యభామ ప్రప్రథమంగా పాఠకులకు నగరిపొంత ఒక శృంగార వనములో దర్శనమిస్తుంది. దిద్దితీర్చిన పూతేనియ ఏటి కాలువ దరిని చెంగల్వ పుప్పొళ్లు నించిన చంద్రోపలవేదిపై ఆమె తన చెలితో శౌరిగుణములను వర్ణించుచుండగా 'దక్షిణాంసకచూచకనయన ప్రకంపనయు' కల్గుతుంది. తనభర్త యితరులతో కలసి తనయెడ అపరాధమేమో చేసియుండునని అనుకుంటున్న సమయంలో చెలి వచ్చి రుక్మిణి అంతఃపురంలో జరిగిన విశేషము లన్నీ వర్ణిస్తుంది. సత్యభామ చెలికత్తె.



'ఎంతకులేదు నారదమునీంద్రుడు ?' అని ప్రారంభించి, నారదుడిచ్చిన పారిజాత పుష్పాన్ని కృష్ణుడు, రుక్మిణి కీయగా, నారదుడు, సత్యభామను కించపరుస్తూ "చక్కని దాననని, నెలజవ్వనినని, జగంబులోన పేరెక్కిన దాననని, పతియెంతయు నా కనురక్తుడనుచు దానిక్కుచు విఱ్ఱవీగుచు గణింపదు కాంతల సత్య" యింతటితొ సత్యాగర్వభంగము జరిగింది- అంటూ పేర్కొన్న విషయాలను విశదీకరిస్తుంది అగ్నికి వాయువు తోడైంది. సత్యకిది సహింపరాని అపరాధము.

అనవిని వ్రేటువడ్డ యురగాంగనయు.బలెనేయి వోయభ
గ్గన దరికొన్న భీషణ హుతాశనకీల యనంగ లేచి హె
చ్చిన కనుదోయి కెంపు తన చెక్కులఁగుంకుమ పత్రభంగసం
జనిత నవీన కాంతి వెదచల్లగ గద్గదభిన్న కంఠియై.

ఈ మాటలు వినగానే సత్యభామ వ్రేటు దెబ్బతిన్న ఆడు పామైనది. భగ్గునమండు అగ్ని మంటయినది. కన్నులెఱ్ఱ వారినవి. చెక్కులందు కుంకుమ పత్రభంగ సంజనిత నవీన కాంతి వెదజల్లినది. గద్గదభిన్న కంఠియైనది.

ప్రప్రథమమున తన చెలి పారిజాత వృత్తాంతము చెప్పగనే సత్య హృదయంలో క్రోధము, ఆశ్చర్యము ఒకేసారి జనించినవి. నారదుడు తన్ను చులకనచేసి మాట్లాడినందుకు కోపము, ఆ మాటలు తిరస్కరింపక కృష్ణుడు వినుట కాశ్చర్యము. అదీ సపత్నిముందర! సత్య యీర్ష్యాసూయా క్రోధాగ్నికి వీవనలు వీచినాయి.

అనూహ్యమగు అవమానము, దుర్భరమగు వేదన సత్యమనస్సును కలచివేసినవి. 'ఆ పుష్పాన్ని గొప్పవస్తువుగా వర్ణించి యిచ్చకమునకై నారదముని యిచ్చిన ఈయ వచ్చును. కృష్ణుడు తనకు ప్రియమైన వారికది యీయవచ్చు, కాని ఆమాటుజడదారి మెచ్చుల తలపవలె?

ఇంతలో ఆమెకొక వూహవచ్చింది. 'మునిఏమి చేయు? రుక్మిణి గొన కారణమేమి?' ధూర్తగోపాలుని పై కోపము పురుషులందరిపై ప్రసరించింది. పురుషులు శరదంబుదచల చిత్తులు వారినినమ్మరాదను సిద్ధాంతమునకు వచ్చినది. ఒకప్పుడు శౌరి హృదయాన్ని చూరగొని సర్వజన సమ్మానిత అయిన తాను యిప్పుడిట్లు హేయపు బ్రతుకు బ్రతుకుట కంటె మరణించుట మంచిదని తలంచినది.

అవమాన క్రోధ వివశ అయినప్పటికి, యీర్ష్యాసూయలచే కలచబడినను సత్య మహాపతివ్రత. పతిని ప్రాణతుల్యముగ ప్రేమించింది. తనను పతి అదేవిధంగా ప్రేమించాలని ఆమె కోరిక. ఆమెలోని యీ కోరికయే సత్యలోని యీర్ష్యాసూయలకు కారణమైనది. ఇందులో సత్యమనోవృత్తి చిత్రణ అద్భుతము.

స్వాధీన పతిక, అహంకారిణి, అమాయకురాలైన సత్యకోపగృహమున ప్రవేశించినది. 'హరిచందన కోటరమునకు నాగతరుణియు పోలె' అంటాడు కవి. కోపగృహంలో ఉస్సురుస్సురను సత్య బుస్సుబుస్సుమను నాగతరుణి.

"మాసిన చీర గట్టికొని మౌనముతోడ విరస్త భూషయై
వాసెన కట్టుగట్టి నిడువాలిక కస్తురిపట్టువెట్టి లో
గాసిలి చీకటింటి కద కంకటిపై జలదాంత చంద్రరే
ఖాసదృశాంగియై పొరలె గాఢ మనోజ విషాద వేదనన్"

ఆమె శరీరముతోపాటు మనస్సుచికాకు పొందింది. సత్యభామ మాన క్రోధ వివశతకు పరాకాష్ఠ. ఇటువంటి సమయంలో కృష్ణుడు వచ్చి తాళవృంత మొకభామిని నుండి గ్రహించి, ఆమెలోని మన్మథాగ్నిని అధికము చేసేటట్టు విసిరినాడు. శ్రీకృష్ణుడు పరిపరి విధముల ఆమెను అనునయించుటకు ప్రయత్నించి సాధ్యము కాక ఆమెపాదములకు మ్రొక్కెను.

జలజాతాసన వాసవాది సురపూజా భాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిర మచ్చో వామ పాదంబునం
దొలగం ద్రోచె లతాంగి, యట్లయగు నాథుల్నేరముల్సేయఁ బే
లుకం జెందిన యట్టి కాంత లుచిత వ్యాపారము ల్నేర్తురే?

బ్రహ్మేంద్రాది సురలచేత పూజింపబడుదైన. లతాంతాయుధుని కన్నతండ్రి కృష్ణుని శిరస్సును వామపాదముతో తన్నినది. ఎడమ కాలితో తన్నుట అవమానకరము. కవి, ఆమె వొనర్చిన కార్యమును, నాథులు నేరములు చేయగ పేరలుకనుచెందిన కాంతలుచిత విధిని నేర్తురే? అని సమర్థించినాడు.

అయినప్పటికి సత్యకోపము తీరలేదు. జంకెన చూపులచే కృష్ణుని వుపాలంభించినది. నన్నెవతెగా చూచితివని గాద్గద్యముచే యిక మాటలాడలేక యీసునపుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే, మోముపై పైటచెంగు వేసుకొని కలస్వనముతో యేడ్చినది. స్త్రీ సహజమైన స్వాభావికత. కృష్ణుడు ఆమె యేడ్పువిని సహించలేక, ఆమెను కౌగిట చేర్చి పారిజాత వృక్షాన్ని పెకలించి నీపెరటి చెట్టుగ నాటెదనని బాస చేసినాడు.

కృష్ణుడు, సత్యాసహితుడై స్వర్గలోకమునకు వెళ్ళి ఇంద్రునిచే సన్మానములను

(35 వ పుటలో చూడుడు)

# శ్రీ వేంకటేశ్వర పూర్ హోమ్

"సఖులవలన పరిచ్యుతులు
సంఘానికి బహిష్కృతులు"

పీడితప్రజానీకాన్ని ఉద్దేశించి మహాకవి శ్రీశ్రీగారు అన్న పై మాటలు కుష్ఠురోగుల విషయంలో అక్షరాలా అన్వయిస్తాయి. కుష్ఠురోగం వ్యాప్తిలో దేశంలోకి ఆంధ్రప్రదేశ్ ద్వితీయస్థానంలో వుంది. మొదటిస్థానం తమిళనాడుది. ఇక మనరాష్ట్రానికివస్తే, కుష్ఠురోగుల జనాభా అధికంగావున్న జిల్లాలలో శ్రీకాకుళం, విశాఖపట్టణం, చిత్తూరులు ప్రథమ, ద్వితీయ, తృతీయస్థానాలను ఆక్రమించాయి చిత్తూరుజిల్లా భౌగోళికంగా తమిళనాడులోని ఉత్తర ఆర్కాటుజిల్లాకు అనుబంధంగా వున్నందువల్ల ఆజిల్లాలోని కుష్ఠురోగులు చిత్తూరుజిల్లాకు వలసరావడంతో ఈప్రాంతంలో కుష్ఠురోగం ఒక అంటువ్యాధిలా ప్రబలినట్లు కనిపిస్తూ వుంది. అందుకే 'కుష్ఠురోగులకు ప్రవేశం లేదు' అన్న ప్రకటన తిరుపతిలో చాలా హోటళ్ళముందూ, థియేటర్లముందూ వెలిసింది. నిత్యం వేలాదిగా యాత్రిక జన సందోహంతో క్రిక్కిరిసలాడుతూవుండే తిరుపతివంటి పుణ్యక్షేత్రంలో కుష్ఠురోగం ఒకరినుంచి మరొకరికి అంటుకోగలదన్న భయం వుండటం సహజమే!

అయితే కుష్ఠురోగుల్ని ఇలాచీదరించుకోవడమూ, వెలివెయ్యడమూ ఒక్క తిరుపతికే పరిమితం కాలేదు. పైకి చెప్పినా చెప్పకపోయినా కుష్ఠురోగిని అసహ్యించుకోవడం, సమావేశస్థలాలనుంచి అతణ్ణి తొలగించడం లేదా తామేదూరంగా తప్పుకోవడం ప్రతిచోటా జరుగుతున్నదే! అందువల్లనే కుష్ఠువ్యాధిని ఇప్పుడొక ఆరోగ్య వైద్య సమస్యగానే గాక అతి తీవ్రమైన సాంఘిక సమస్యగానూ కుష్ఠురోగుల పునరావాసాన్ని ఒక సామాజిక బాధ్యతగానూ గుర్తించవలసి వస్తోంది.

**శ్రీ టి. సుధాకర్‌రెడ్డి**
**తిరుపతి**

వైద్యచరిత్రలోకే అతిపురాతనమైన కుష్ఠువ్యాధిచుట్టూ ఎన్నోమూఢ నమ్మకాలు అపోహలూ, అపార్థాలూ, అసహ్య, భయాలు గూడుకట్టుకొని వున్నాయి. 'పెద్ద జబ్బు' గా కుష్ఠువ్యాధిని పేర్కొనడంకద్దు. ఎంతో ఘోరమైన పాపకర్మచేసివుంటే గాని ఈవ్యాధిసంప్రాప్తించదని సామాన్యుల గుడ్డినమ్మకం. విశృంఖల శృంగారం వల్లా, సుఖవ్యాధుల తీవ్రతవల్లా ఇది దాపురిస్తుందన్నది మరొక అపోహ. కుష్ఠువ్యాధి వంశపారంపర్యంగా అల్లుకొనే శాపమనీ, అది ఆమరణాంతం నయంకాని నరకమనీ చాలామంది భయపడుతూవుంటారు. ఈ వ్యాధిని గురించిన అజ్ఞానంవల్లా, శాస్త్రీయమైన అవగాహన లేకపోవడంవల్లా సంఘంలో ఇటువంటి తప్పుడు అభిప్రాయాలు పాతుకొని పోయాయి. కుష్ఠురోగుల వికృతరూపాలు, అసహ్యచేష్టలు కూడా ఇందుకు దోహదం చేశాయి.

వాస్తవానికి కుష్ఠు అన్నది శాపంగాని పాపంగాని కాదు అది 'మైక్రో బాక్టీరియం లెప్రే' అనే సూక్ష్మక్రిములవల్ల వ్యాపించే ఒకవ్యాధి మాత్రమే! ఈ వ్యాధి ముదరడం వల్ల కాళ్ళు, చేతులు చివరికిముఖం కొరుకుకు పోవడం జరుగుతుంది. అయినప్పటికి కుష్ఠువ్యాధిని మందులతో నయంచేయవచ్చును, కుష్ఠువల్ల వికృత స్వరూపం రాకుండా ముందుగా అరికట్టవచ్చును, వచ్చిన వంకరలను శస్త్రచికిత్సలతో సరిచెయ్యవచ్చును. ఒకప్రముఖ వైద్యుడు అన్నట్లు చికిత్స లేనప్పుడు మాత్రమే కుష్ఠు విషాదరోగం గాని చికిత్స జరిగితే మాత్రంకాదు.



దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్‌కు తన చేనేత నైపుణ్యాన్ని చూపిస్తున్న ఒక కుష్ఠురోగి

కుష్ఠురోగులు అంటే వులికిపడే తిరుపతిలో ఆ కుష్ఠురోగుల వునికితో తాదాత్మ్యం చెందే సేవాసదనం ఒకటి వుండటం దైవలీలగాకనిపిస్తోంది. దాని నిర్వహణకు సాక్షాత్తూ ఆ శ్రీనివాసుడే ఆధారభూతం కావడం, మానవసేవే మాధవసేవ అన్న నీతివాక్యానికి ఆ దైవమే ప్రమాణం కావడం నిజంగా విశేషమే!

దాదాపు నాలుగు దశాబ్దాల క్రితం తిరుపతి పొలిమేరలలో సప్తగిరి ఛాయలలో అక్కారాంపల్లి అనే గ్రామంవద్ద తిరుమల తిరుపతి దేవస్థానం "శ్రీ వేంకటేశ్వర పూర్‌హోమ్" అన్న పేరుతో ఒక ధర్మ సంస్థను నెలకొల్పింది. మొదట్లో తిరుమలపై తిరుగాడే అనాథ రోగార్తులకు భిక్షకులకు ఆశ్రయ కేంద్రంగా ప్రారంభమైన ఈ పూర్‌హోమ్ అచిరకాలంలోనే కుష్ఠురోగుల చికిత్సాలయంగా పరివర్తనం చెందింది. కుష్ఠురోగుల జనాభా అధికంగా వున్న చిత్తూరు జిల్లాకు ఈనాడు ఇది ఒక వరప్రసాదంగావుంది. ఒక్క చిత్తూరు జిల్లా వారికే కాదు, ప్రాంతీయ భేదాలతో నిమిత్తం లేకుండా అన్ని ప్రాంతాల కుష్ఠువ్యాధిగ్రస్తులకు ఈనాడు ఇదొక పునర్జన్మ క్షేత్రంగా రూపొందుతోంది. తిరుమల తిరుపతి దేవస్థానంవారు నిర్వహిస్తున్న జీవకారుణ్య పథకాలకు, మానవ సేవాకార్యక్రమాలకు ఇది మకుటాయమానమని చెప్పొచ్చును.

## సంస్థ సర్వతోముఖవికాసం

ప్రారంభించిన లగాయతుగా యస్. వి. పూర్‌హోమ్‌ను 1958 సంవత్సరంవరకూ దేవస్థానంవారు నిర్వహించి ఆ తర్వాత దీనిని రాష్ట్ర ప్రభుత్వపరం చెయ్యడం జరిగింది. ఐతే అంత మాత్రాన దేవస్థానం బాధ్యత తీరిపోలేదు. పూర్‌హోమ్‌లోగల 150 రోగులకుగాను 50 మంది ఖర్చులను దేవస్థానం భరిస్తూవచ్చింది. రాష్ట్ర ప్రభుత్వం ఇక్కడొక మెడికల్ ఆఫీసర్‌ను నియమించి శస్త్రచికిత్సలకు వీలుకల్పించింది. కుష్ఠు నివారణలో వైద్య సిబ్బందికి ఉన్నతశిక్షణ ఇచ్చే పథకాన్ని ఒకదాన్ని ప్రభుత్వం ఇక్కడ ప్రారంభించింది కూడా! కాని కాలక్రమంలో ఈ పూర్‌హోమ్ నిర్వహణ లోపభూయిష్టం కావడం, అక్కడ పరిస్థితులు అధ్వాన్నంగా తయారవడం జరిగింది. ఇందుకు కలత చెందిన దేవస్థానం 1975 సంవత్సరంలో తిరిగి ఈ పూర్‌హోమ్ యాజమాన్యాన్ని తన మాతృహస్తాలతో తీసుకొంది. అప్పటి నుంచి దీని చరిత్రలో ఉజ్జ్వల ఘట్టం ప్రారంభమైనది.



వడ్రంగపు పనిలో పూర్‌హోమ్‌వాసుల ప్రావీణ్యాన్ని పరికిస్తున్న సీనియర్ మెడికల్ ఆఫీసరు ధనలక్ష్మి. కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్, ఉపకార్యనిర్వహణాధికారి శ్రీ తాతయ్యనాయుడు.

పూర్‌హోమ్ ఆవరణంలో ఒక అధునాతనమైన ఆపరేషన్ థియేటర్‌ను, ఔట్ పేషంట్ బ్లాకును నిర్మించడంతో దీనికి ఒక 'లెప్రొసోరియం' కళ వచ్చింది. 1978 మార్చి 25 తేదిన ఆనాటి ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీమతి శారదాముఖర్జీ వీటికి ప్రవేశోత్సవం జరిపారు. పూర్‌హోమ్‌లో పడకల సంఖ్యను 150 నుంచి 200 లకు పెంచడంతోనూ, ఫిజియోథెరపీ ఆక్యుపేషనల్ ఫిజియో థెరపీ, రీకన్‌స్ట్రక్టివ్‌సర్జరీవంటి అధునాతన వైద్య చికిత్సల్ని ప్రవేశపెట్టడంతోనూ ఈ పూర్‌హోమ్ స్థాయి ఇతోధికంగా పెరిగింది. చేతిపనులద్వారా శారీరకచికిత్సచేసేవిధానం క్రింద (Occupational Phisio Therapy) పూర్‌హోమ్‌లోని కుష్ఠురోగులకు వ్యవసాయం, వడ్రంగం, చెప్పులతయారీ, బుట్టలు, పేముకుర్చీల అల్లకంవంటి వృత్తి పనులలో శిక్షణ ఇస్తున్నారు. ఆయా పనులలో ప్రత్యేకంగా శిక్షణపొందిన నలుగురు సాంకేతికనిపుణులు ఇందుకు నియ

(32వ పేజీలో)

(గత సంచిక తరువాయి)

అట్లే మాట్లాడుట కిచ్చగించి బాలకుని ముందు నిలబడి 'శెత్తత్తిన్ వయత్తిల్ శిరియదు పిరన్దాల్ ఎత్తై త్తిన్ను ఎంగే కిడుక్కుమ్' "ప్రాకృతమైన శరీరములో జీవాత్ముడు పుట్టి ఏమి తిని ఎక్కడ జీవించుచున్నాడు" అని ప్రశ్నించెను. వెంటనే "అత్తై త్తిన్ను అంగే కిడుక్కుం" అపతిని అక్కడే జీవించుచున్నాడు" అనగా ప్రాకృత వస్తువైన అన్నము తిని ప్రాకృత సుఖదుఃఖముల ననుభవించి శరీరరూపమైన ప్రకృతియందే నివసించి జీవించుచున్నాడు" అని జవాబువచ్చెను. దీనిని విని మధురకవి ఆళ్వారులు ఆ బాలకుడు సర్వజ్ఞుడని తెలిసి వారిని ఆశ్రయించి ఉపచరించుచుండిరి

దివ్యప్రబంధములు. అవి ఏవి అనగా తిరువిరుత్తం (ఋగ్వేదసారము) తిరువాచిరియం (యజుర్వేదసారము) పెరియ తిరువందాది (అధర్వవేదసారము) తిరువాయ్మొళి (సామవేదసారము) వీనియందు, పరభక్తి పరజ్ఞానము. పరమభక్తిరూపకమైన మోక్షము, మఱియు నిరతిశయానంద ఫలప్రాప్తి మొదలైన విషయములు విశదముగా వర్ణింపబడినవి.

'తిరువాయ్మొళి' అనన్యసాధారణమైన దివ్య ప్రబంధము. సమస్త లోకోజ్జీవన కరమైనది. ఇది సర్వచేతనులకు పాపహరముగను సర్వ మోక్షప్రదముగను విలసిల్లుచున్నది. దీనిని ఎవరైననుసరే అనుసంధానము చేయవచ్చును. దీని పరంపరలనన్నింటిని ఈ దివ్య ప్రబంధములయందు అభివర్ణించియున్నారు.

నమ్మాళ్వారులు భగవద్విషయమునే గాక, ప్రకృతిసౌందర్యమునుకూడ చాల రమణీయమగుఫణితిలో వర్ణనగావించియున్నారు. ఏనుగులు తండములై ఏగుచుండుట, తల్లిలేడి హరిణశాబకముతో గంతులిడుచుండుట, నెమలి నృత్యమాడుట మొదలైన వర్ణనలు ఈ ప్రబంధములందు నిండియున్నవి. సదుపదేశము, క్షేత్రప్రశంస, ఇష్టదేవతారాధనము ముక్తచేతన స్వరూపము మొదలైనవిషయములు బహుస్వారస్యముతో నిరూపితములైయున్నవి. ఒక పద్యములో శ్రీ శఠారి మునులు "నా నాలుకను పరమాత్మని స్తుతికై ముడుపుకట్టి యున్నాను" అని చెప్పియున్నారు.

### కులశేఖరాళ్వారులు

వీరు తిరువాంకూరు సంస్థానాధీశులు బహుశః తొమ్మిదవ శతాబ్దమున ఉండి యుండవచ్చును. వీరు చతురంగ బలముతో నొప్పి ప్రజలను కన్న బిడ్డలవలె పాలించుచుండిరి. ఇట్లుండగా వీరియందు, పారమార్థిక చింతనముతోకూడిన భక్తికి

శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి,
ఆలిఫర్.

తగిన జ్ఞానము, జ్ఞానమునకుతగిన వైరాగ్యము కలుగ పరమాత్మని నిర్హేతుక కటాక్షము వీరిపై ప్రసరించెను. శ్రీరంగాది దివ్యక్షేత్రముల దర్శించి, అక్కడనే నివసింపవలెనని వాంఛించిరి. ముకుందమాలా స్తోత్రము వీరి భక్తి పారవశ్యమునకు గుర్తు. వైష్ణవస్తోత్రములలో దీనికి గల ప్రచార ప్రాశస్త్యములు మఱిదేనికిని లభింపలేదని చెప్పవచ్చును. ఇది అతి

## వేదాంతదేశికులు

ఇట్లుండగా ఒకరోజు శ్రీమన్నారాయణుడు తన దివ్యమంగళ విగ్రహదర్శనమును, దివ్యగుణములను శఠారిమునులకు తెలిపి ప్రకటపఱచెను. దానినిచూచిన తోడనే, ఆళ్వారులకు పరమానందమాయెను. పరమపదనాథుని ఆజ్ఞవల్లనే విష్వక్సేనులు ఏకాంతముగా వారున్న తావునకువచ్చి, పంచసంస్కారములు చేసిరి. ఇదియైనవెంటనే లక్ష్మీ భూనీలా సమేతుడైనపరమాత్ముడుగరుడారూఢుడై వారికి దివ్యదర్శనమిచ్చుటయేగాక దివ్యజ్ఞానమునుకూడ కరుణించెను. ఆ దివ్యజ్ఞానమునకుఫలమై నమ్మాళ్వారులు అమృతపరివాహరూపమైన నాల్గుప్రబంధములను, నాల్గువేదముల సారరూపముగ మధురకవుల కుపదేశించిరి. ఈ అనుభవ ప్రవాహరూపమై వారి హృదయమునుండి ఉబికివచ్చిన దివ్యసూక్తులే ఈ

యందు వివరించియున్న వేదాంతవిషయము క్రమముగా ఇట్లున్నది: కల్యాణగుణపరిపూర్ణత్వము, పర, వ్యూహ, విభవ, అంతర్యామిత్వఅర్చావతారాది మాహాత్మ్యపరిపూర్ణత్వము, విశ్వరూపత్వము, విరాడ్రూపత్వము, విభాస్వరూపాది సకల విధి స్వరూప రూపగుణ విభూతిత్వము, సకలలోక సృష్టి స్థితి కారణత్వమును. శ్రీమన్నారాయణుడు, భక్తవాత్సల్యముతో దుష్టనిగ్రహ శిష్ట పరిపాలనకై మనుష్యరూపియై భూమండలమందు అవతరించును. సకల భక్తజన హృదయము లందు అంతర్యామిత్వమున నిత్యవాసము చేయును. దివ్యపుణ్యక్షేత్రములందు అర్చావతారమూర్తియై భక్తులకారాధనార్హుడై యుండును. ఇట్లు శ్రీశఠారి మునులు, భగవంతుని అనుగ్రహముచే దివ్యజ్ఞాన పరిపూర్ణులై, తమ అనుభవ



కులశేఖర ఆళ్వారు

మనోహరమై బహుళప్రచారము గలిగి యున్నది. కులశేఖరుల వైరాగ్యభావము దినదినాభివృద్ధి కాగా, చివరికి వారు వీత రాగులై రాజ్యభారమును వీడి యోగిపుంగవులైరి. రాజ్యభారమును తనకుమారున కప్పగించి, తాము వైష్ణవభక్తులతోకూడి, శ్రీరంగమునకువచ్చి శ్రీరంగనాథుని మన స్ఫూర్తిగా దర్శించి భగవద్భాగవత మాహాత్మ్యము నెఱిగి, అందఱును ఉజ్జీవింప వలెననెడు సదాశయముతో 'పెరుమాళ్ తిరుమొళి' అనుదివ్యప్రబంధమును గానము చేసిరి. అనంతరము తిరుపతికి వచ్చి, స్వామిపుష్కరిణి యందు స్నానముచేసి శ్రీనివాసునిగూర్చి ఇట్లు వేడిరి. "నీ పవిత్రమైన తిరుమలమీద తిర్యక్ స్థావరజన్మ మేదైన ఇచ్చి, నిత్యవాసము చేయవలెననెడు నా అభిలాష పూరింపుము."

"పడియాయ్కిడందు ఉన్పవళవాయ్ కాణ్బేనె" "తిరుపతి దేవాలయమందలి గర్భగుడి తలవాకిట నిలబడి శ్రీనివాసుని మందస్మితమును చూచుటకంటె ఎక్కువ ఆనందప్రదమైనది వేరులేదు." అని అనుసంధానము చేసియున్నారు. ఈ వాకిలికి "కులశేఖరపడి" యనుపేరు ఇప్పటికిని రూఢియై యున్నది.

కులశేఖరాళ్వారులకు భగవద్విషయమందును శ్రీ వైష్ణవ భక్తులయందును ఉన్న విశేష మమతను ఎట్లైనను తప్పించి వారిని రాజ్యమందే నిలుపవలెనని మంత్రులు చాలగా ప్రయత్నపడిరి. శ్రీ వైష్ణవ భక్తులపై రాజునకు ద్వేషము పుట్టింపవలెనని రాజాంతఃపురమందలి ఆరాధ్యమూర్తి పెట్టెనుండి ఆభరణమును దొంగిలించిరని మంత్రులు వారిపై నేరము మోపిరి. చాల వెలగల రత్నహారమును దొంగిలించిన వానిని పట్టవలదా? ఇది విని రాజునకు అతి దుఃఖమయ్యెను. శ్రీ వైష్ణవు లిట్టి పనిని చేయజాలరు అను విశ్వాసము వారికుండెను. అయితే మంత్రులను ప్రతిఘటించునది ఎట్లు? చివరకు నిజమును పరీక్షించుటకై ఒక బుట్టను తెప్పించి అందు విషసర్పముంచి, శ్రీ వైష్ణవులు తాము ఈ బుట్టలో తమ చేతులుంచి సత్యమును నిరూపించుకొనవచ్చునని చెప్పెను. వారట్లే కావించి విజయము గాంచిరి. అప్పుడు మంత్రులు రాజు సమ్ముఖమందు తమ తప్పు నొప్పుకొని క్షమాయాచనము గావించిరి. దీనిచే రాజుయొక్క భగవద్భక్తియు, శ్రీవైష్ణవ ప్రతిపత్తియు హెచ్చెను. చివరకు తమ భక్తి పారవశ్యముచే దివ్యప్రబంధములను పాడి లోకోపకారము గావించియుండిరి.

ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే
తమహం శిరసా వందే రాజానం కులశేఖరం ।

## పెరియాళ్వారులు :

ఆళ్వారుల పరంపరలో తరువాతివారు పెరియాళ్వారులు. వీరికి భట్టనాథులు, విష్ణుచిత్తుడు అను పేరులు కూడకలవు. వీరు శ్రీవిల్లిపుత్తూరు అను దివ్యక్షేత్రమందు అవతరించి యుండిరి. వీరికి పూవు, పూతోట అనగా చాల మక్కువ. ఆ ఊరిలోని వటపత్రశాయి యందు వీరికి చాల భక్తి. తల్లికి శిశువు నందున్న వాత్సల్యమును వారు పొందియుండిరి. యశోదకు శ్రీకృష్ణుని యందున్నటువంటి ప్రేమయే వీరికి మఱ్ఱియాకుపై నిద్రించుచు శిశురూపమందున్న జగదీశ్వరునియందు గలదు. తల్లి యుల్లమువంటిది వారి మనస్సు. కాల దేశముల కతీతుడైన భగవంతుడు ఈ ప్రపంచపు కట్టుబాటులకు లోబడియుండునా? ఇందుచే ఏమైనను చెడు సంభవించునేమోయని వారి మనస్సు అల్లాడుచుండెడిది. ఇదియొక విధమైన భగవద్భక్తి. ఇట్టి భావమును వెల్లడించు వీరి తిరుప్పల్లాండ్ అనుదివ్య ప్రబంధము ప్రసిద్ధికెక్కినది. (సశేషము)

---

## విజ్ఞప్తి

గ్రంథ సమీక్షకు పుస్తకాలు పంపేవారు రెండు ప్రతులు పంపుతూ సమీక్షార్థం అని వ్రాసి పంపాలి.

॥సం॥

---

# దేవవైద్యులు అశ్వినీదేవతలు

ప్రవాం దంసాన్వశ్వినా వవోచమన్య
పతిః స్యాం సుగవః సువీరః ।
ఉత పశ్యన్నశ్నువన్దీర్ఘ మాయు
రస్తమి వేజ్జరిమాణం జగమ్యాం ॥
(ఋగ్వేద ౧-17-16-25)

"ఓ అశ్వినీదేవతలారా! మీ మహాత్మ్యములను వర్ణించాను. నేను వీర్యవంతుడనై, చక్కని గోగణము గలవాడనై, రాష్ట్రాధిపతినై ఇంద్రియ పాటవం కలిగి చాలకాలం జీవించి (తరువాత, యజమాని తనయింటిని ప్రవేశించినరీతిగ) వార్ధక్యమును పొందునట్లు అనుగ్రహింపుడు." ఋగ్వేదమందలి యీ సూక్తము దేవవైద్యులైన అశ్వినీ దేవతల నుద్దేశించిన ప్రార్థన.

చతుర్వేదములతోపాటు ఆయుర్వేదమునకు విశిష్టమైన స్థానమున్నది. భూలోకవాసులకు త్రిదోషముల హెచ్చుతగ్గులవల్ల పరిణమించే వ్యాధులను నివారించుటకై బ్రహ్మ యీ వైద్యవిద్యను అశ్వినీ దేవతలకు ప్రసాదించాడు. అథర్వణవేదము యొక్క ఉపవేదంగాయిది భరద్వాజ మహర్షివల్ల లోకవ్యాప్తమైనది.

సదాద్వివచనములోనే సంబోధింపబడు అశ్వినీదేవతలు వివస్వత్ మరియు సరణ్యు దంపతులకు జన్మించారు. ఈ జంట వైద్యులలో ఒకరు సోమగుణ పూర్ణులు మరొకరు తేజస్వంతులు కావటం వల్ల వీరికి ఎట్టి వ్యాధీ సోకేది కాదు.

అశ్వినీకుమారులకు నాసత్య మరియు దస్రా అనికూడా పేరున్నది. అశ్వములున్న యీ యిద్దరు దేవతలే అశ్వినీకుమారులని, ఊర్ణాభుడను ఆచార్యుని అభిప్రాయము.

సోమపాన ప్రియులైన అశ్వినీ కుమారులు నిత్యయౌవన సంపన్నులై, స్ఫురద్రూపులై మహావీరులై వెలుగుచున్నట్లు వర్ణింపబడింది. వీరు రెక్కలుగల రెండు అశ్వరాజములతో ముగ్గురు సారథులతో నడపబడు త్రికోణాకారపు బంగరు రథములో విహరిస్తుంటారు. ఋక్ స్తోత్రములతో వీరిని ప్రార్థించినచో వారు కనికరించి వ్యాధిగ్రస్తుల వద్దకు వచ్చి రోగ నివారణ చేస్తారు. గాడిదలను తమ రథానికి పూన్చెడివారని కొన్నిసూక్తములు పేర్కొంటున్నాయి.

అశ్వినీకుమారులను ప్రాతఃకాలమందే స్తుతించి హవిస్సునర్పించవలెను. ఈ దేవవైద్యుల మహిమలెన్నిటినో ఋగ్వేద సూక్తులు (116, 120) వర్ణిస్తున్నాయి.

సుకన్య శర్యాతి రాజుకుమార్తె. హాస్యప్రవృత్తిగల కూతురుపై రాజు కోపగించి ఆమెను చ్యవనుడనే ముసలిముని కిచ్చి వివాహం చేశాడు చ్యవనునితో వుంటున్న సుకన్యనుపరీక్షించుటకై వచ్చిన అశ్వినీదేవతలు, అందమూ, యౌవనముగల తమను పెళ్ళాడవలసినదిగ కోరారు. అందుకు ఆమె అంగీకరించనందున వారు సంతసించి లేహ్యామొకదానిని చ్యవనునికి ప్రసాదించారు. ఆ లేహ్యాం చ్యవనునికి యౌవనం ప్రసాదించింది. అదే కాలక్రమంలో 'చ్యవనప్రాశ్' గ ప్రసిద్ధమైనది.

రేభుడను ఋషి ఒకనాడు సంధ్యావందనం చేస్తుండగా రాక్షసులు అతనిని తాళ్ళతో బంధించి నదిలో పడవేస్తారు. రేభుడు అశ్వినీదేవతలను స్తుతింపగా వారు ప్రసన్నులై ఆపదనుండి విముక్తుని చేయుటయేకాక జలదోషములను పోగొట్టి పూర్ణారోగ్యమును ప్రసాదిస్తారు.

కక్షీవంతఋషి కుమార్తె కుష్ఠువ్యాధి పీడితురాలుకాగా అసహ్యించుకొన్న ఆమె భర్త ఆమెను వదలివేశాడు. అశ్వినీదేవతలు ఆమెను కనికరించి రోగవిముక్తురాలుగ చేయటమేకాక భర్తను తిరిగి చేరునట్లు అనుగ్రహిస్తారు. అంధత్వంతో బాధపడుతున్న కణ్వమహర్షికి దృష్టిదానం చేశారు. జ్ఞాననిధియైన వధ్రిమతి భర్త పుంసత్వం లేక బాధపడుతున్నప్పుడు ఆమె ప్రార్థన ఆలకించి ఆమెభర్తను వీర్యవంతునిగ చేయటమేకాక హిరణ్యహస్తుడను కుమారుని అనుగ్రహించారు.

అథర్వణ పుత్రుడగు దధీచికి 'మధువిద్య' అను బ్రహ్మవిద్యను ఇంద్రుడు ప్రసాదించాడు. ఈ విద్యను వేరెవరికీ వుపదేశించరాదనీ, వ్యతిరేకించిన శిరచ్ఛేదం కావింపబడుదునీ ఇంద్రుని ఆదేశం. అశ్వినీదేవతలు 'మధువిద్య'ను నేర్చుకోవాలని దధీచిని ఆశ్రయించారు. దధీచి

**శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి**
కడప:

ఇంద్రశాపమును తెలిపినాడు. అశ్వినీదేవతలు తమ వైద్యవిద్యా ప్రభావముతో దధీచి శిరస్సును కత్తిరించి గుఱ్ఱము శిరస్సును అతికించారు. దధీచి అశ్వశిరస్కుడై అశ్వినీ దేవతలకు 'మధువిద్య'ను వుపదేశించాడు. ఈ రహస్యమును గ్రహించిన ఇంద్రుడు దధీచి శిరమును ఖండించాడు. అశ్వినీదేవతలు దధీచి తలను మరల అతికించారు ఈ రీతిగ దధీచి జీవితుడైనాడు. అశ్వినీదేవతలకు మధువిద్యాప్రాప్తి కలిగింది.

ఖేలుడను రాజుపత్ని యుద్ధములో పాల్గొన్నపుడు ఆమె కాలు తెగిపోయింది. అశ్వినీదేవతలు ఆమె పాదమునకు బదులుగ ఇనుపపాదమును అతికించారు.

ఇట్లు ఆయుర్వేద వైద్య ప్రధానులుగ అశ్వినీ దేవతలు సుప్రసిద్ధులు.

*

# శ్రీగోవిందరాజస్వామి ఆలయం

## తిరుపతి

### దర్శనాదిక కార్యక్రమాల వివరాలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదయం. | 5—00 | నుండి | 5—30 | వరకు | సుప్రభాతం |
| | 5—30 | ,, | 7—00 | ,, | సర్వదర్శనం |
| | 7—00 | ,, | 7—30 | ,, | శుద్ధి |
| | 7—30 | ,, | 8—00 | ,, | తోమాలసేవ |
| | 8—00 | ,, | 8—30 | ,, | అర్చన |
| | 8—30 | ,, | 9—00 | ,, | 1 వ గంట శాత్తుమొర |
| | 9—00 | ,,మ. | 12—30 | ,, | సర్వదర్శనం |
| | 12—30 | ,, | 1—00 | ,, | 2 వ గంట |
| మ. | 1—00 | ,, సా. | 6—00 | ,, | సర్వదర్శనం |
| | 6—00 | ,, | 7—00 | . | రాత్రి కైంకర్యాలు, గంట శాత్తుమొర |
| | 7—00 | ,, | 8—45 | ,, | సర్వదర్శనం |
| రాత్రి | 9—00 | | | | ఏకాంతసేవ |

### ఆర్జితసేవల వివరాలు:

తోమాల, అర్చన ఏకాంతసేవలకు: ఒక్కొక్కరికి ఒక్కొక్కదానికి రు. 4-00.

ప్రత్యేకదర్శనం: రు. 2/- (ఒక్కొక్కరికి) హారతి: రు. 1/-

### సర్వదర్శన సమయంలో క్రింది అనుబంధ దేవాలయాలలో ఆర్జితసేవల వివరాలు.

1) పార్థసారథిస్వామి ఆలయం; 2) శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం; 3) ఆండాళ్ళు ఆలయం;
4) పుండరీకవల్లి ఆలయం; 5) శ్రీ ఆంజనేయస్వామి ఆలయం (బయట బుగ్గవద్ద)
6) సంజీవరాయస్వామి ఆలయం (హత్తిరాంజీమఠం ఎదురు)

} అర్చన: 0-75
హారతి: 0-25

### ఆర్జిత వాహనాలు

తిరుచ్చి ఉత్సవం
పెద్ద శేషవాహనం } రు. 63/-

చిన్న శేషవాహనం
గరుడ, హనుమంత,
హంసవాహనములు. } రు. 33/-

### ఆర్జితం: అన్నప్రసాదాలు (చెఱుపులు)

శీరా = రు. 155-00, పులిహోర = రు. 50-00 దధ్యోదనం = రు. 40-00, పొంగలి = రు. 55-00, చక్కెరపొంగలి = రు. 65-00, శాకరబాత్ = రు. 85-00, కేసరిబాత్ = రు. 90-00, 1/4సోలదోసె = రు. 35-00

తి. తి. దేవస్థానం.

# భాగవతము నందలి భక్తులు

(గతసంచిక తరువాయి)

8 గోపికలు

భక్తుని హృదయము భగవద్దర్శనము కొఱకు పరి పరి విధముల తహతహ లాడుచుండును. ఱెక్కలురాని పక్షి పిల్లలు తల్లిపక్షికై పరితపించినట్లు, ఆకలి గొన్న లేగదూడలు తల్లియావుపాలకై సంకటపడునట్లు, విరహ వ్యాకులచిత్త యగు సుందరి ప్రియుని కొఱకై వ్యధ పొందునట్లు, భక్తుడు భగవంతుని దర్శన మునకై వెతచెందునను నీ క్రింది భాగవత వాక్యమునకు దృష్టాంతము గోపవనితల నిర్మలభక్తి—

"అజాత పక్షా ఇవ మాతరం యధా।
స్తన్యం యథా వత్సతరాః క్షుధార్తాః।
ప్రియం ప్రి యేవ వ్యుషితం విషణ్ణా।
మనోఽర విందాక్ష దిదృక్షతేత్వామ్—"
(భాగ–6–11, 26)

రూపగోస్వామి తన 'ఉజ్జ్వలనీలమణి' గ్రంథమునందు

ఎ) "ముఖ్యరసేషుపురా యః సంక్షేపేణోదితో రహస్యత్వాత్।
పృథగేవభక్తి రసరాట్ సవిస్తరేణోచ్యతే మధురః॥"

బి) "వక్ష్య మాణైః విభావాద్యైః స్వాద్యతాం మధురారతిః।
నీతా భక్తిరసః ప్రోక్తామధురాఖ్యో మనీషిభిః॥"—

అని భక్తికి రసత్వమును ప్రతిపాదింప, భక్తిరసాయన గ్రంథమునందు మధుసూదన సరస్వతి దానిని బలపఱచినాడు. వీరిచే నిర్వచింపబడిన భక్తికి మధుర భక్తియని పేరు. మోక్షకామనతో గూడిన శృంగార మంగముకాగా భక్తి అంగిగాకలది మధురభక్తి. భాగవతమున నిది గోపకాంతలయెడ పరాకాష్ఠకు చేరినది. కృష్ణుని విషయమున గోపికల శృంగారము లౌకికమైనదిగాదు. అది సర్వ స్వార్పణముచేత ఆధ్యాత్మిక సంబంధమై యొప్పుచున్నది. దీనిని ఆత్మనివేదన మనియు ననవచ్చును. శ్రవణ కీర్తనాది నవవిధ భక్తియందు ముఖ్యాతిముఖ్యమైన యీ ఆత్మనివేదనము లేక మధుర భక్తి నవలంబించిన వారి పట్ల కృష్ణపరమాత్మ కత్యంతప్రీతి. భాగవతమునందలి ద్వాదశ స్కంధములలో ప్రత్యేక విశిష్టత కలిగిన దశమస్కంధము నందీ ఆత్మనివేదన భక్తి చక్కగ ప్రపంచితమైనది. గోపకాంత లిందు పరమేశ్వరుడగు కృష్ణభగవానుని జీవితేశ్వరునిగ భావించి అనిర్వాచ్యమగు నిర్మలభక్తిని ప్రకటించిరి. ఒకనాటి శరద్రాత్రియందు వేణుగాన పరవశలై బంధు పతిపుత్రాదుల విడచి తన్ను చేరిన గోపికలతో —

"ధ్యాన శ్రవణ దర్శన
గానంబుల నా తలంపు కలిగిన జాలున్
పూనెదరు కృతార్థత్వము
మానవతుల్ చనుడు మరలి మందిర
ములకున్" (10-983)

అని కృష్ణుడు పలుకగా — "ఏపొత్తుల నొల్లమొపురుషభూషణ దాస్యములిచ్చి కావవే" — అనుగోపస్త్రీల మధుర భక్తి యప్రతిమానము. నారద భక్తిసూత్ర, శాండిల్య భక్తి సూత్రములయందు వివరింప బడిన భక్తిమార్గములలో గుణమహాత్మ్యాసక్తిచే నారద భీష్మాదులు, పూజాసక్తిచే నంబరీషాదులు, స్మరణాసక్తిచే ప్రహ్లాదాదులు, సఖ్యాసక్తిచే నర్జునాదులు ఆత్మార్పణాసక్తిచే గోపకాంతాదులు విష్ణుసాయుజ్యమందిరి. భక్తిభావము లన్నింటనూ యాత్మనివేదనా రూపకమైన మధురభక్తి శ్రేష్ఠమైనది. శ్రవణ కీర్తన సఖ్యాదులలో భగవంతునకు భక్తునకు కొంత యెడముండియే తీరుచున్నది. మధురభక్తియందు రతిభావము మిక్కుటమగుట వలన తానారాధించు వ్యక్తియెడ ప్రేయసీ ప్రియులకువలె పరస్పరైక్యభావము సిద్ధించుచున్నది. భక్తుడు తాను ప్రేయసిననియు. పరమాత్ముడు ప్రియుడనియు భావించి ఆత్మార్పణము చేసి కొన్నప్పుడే జీవాత్మ పరమాత్మతో

శ్రీ డి. నాగసిద్ధారెడ్డి,
తిరుపతి.

నైక్యము నొందగలదు. ఈ భావము కామము కావచ్చును. లేదా క్రోధము కావచ్చును. ఏదైనను సరే అది యుత్కట ముగ తీవ్రస్థితియందున్నప్పుడే ఈశ్వరుని చేరనగును. భాగవతమునందలి నారదుని యీ మాటలు వినుడు —



మ్రోయింపకోయ్ మురళీ...

"అలుకనైన చెలిమినైన కామంబున
నైన బాంధవముననైన భీతి
నైన తగిలి దలప నఖిలాత్ముడగు హరి
జేరవచ్చు వేఱుసేయ దతడు–" (7–14)

సుదర్శన చక్రముచే ఛిన్నమస్తకుడై తేజోరూపమున శ్రీహరిలో నైక్యమైన శిశుపాలుని విరోధభావము తీవ్రదశ నందుటచేత నే వాడును శ్రీహరియందైక్యమైనాడు. కావున భగవద్విషయమున నే భావమైనను తీవ్రస్థితికి రావలెను. భాగవతమున గోపకాంతల శృంగారభావ మట్టిది. కృష్ణునియెడ వారి ఏకాగ్రస్థితి పరమావధి నందినది. తన్ను కోరివచ్చిన గోపికలతో గృహముల కరుగుడని కృష్ణుడు పల్కగా విని—

"విరహాగ్ని శిఖలతో వెడలు నిట్టూర్పులముమ్మ
రంబుల కంది మోములెండ
కన్నుల వెడలెడి కజ్జల ధారలు కుచకుంకు
మంబుల గ్రొచ్చిపాఱ
చెక్కుల జేర్చిన చేతుల వేడిమి మోము
దమ్ముల మేలి మురువుడింద
పొరిబొరిపుంఖాను పుంఖంబులై తాకు మదను
కోలల ధైర్య మహిమ లెడల
దుఃఖభరమున మాటలు తొట్రుపడగ
ప్రియములాడని ప్రియుజూచి బెగ్గడిల్లి
చరణములు నేల వ్రాయుచు సంభ్రమమున
కాంతలెల్లను వగల నాక్రాంత లగుచు–"
(10–983)

ఇట్లని మనవి చేసికొనిరట.

ఎ) నీ పాదకమలంబు నెమ్మిడగ్గఱగాని తరలి
పోవంగ పాదములు కావు
నీ కరాబ్జంబులు నెఱినంటి తివగాని తక్కిన
పనికి హస్తములు చొరవు
నీ వాగమృత ధారవిండ గ్రోలగగాని చెవుల
స్వభావల చేరి వినవు
నీ సుందరాకృతి నియతి చూడగగావిచూడ
నవ్యంబులు చూడ్కికవలు
నిన్నెకాని పలుక నేరవు మా జిహ్వ
లొల్లననుచు పలుక నోడ మీవు
మా మనంబులేల మఱపి దొంగిలితివి
యేమిసేయు వార మింక కృష్ణ–"
(10–988)

బి) నీ వడవిన్ పగల్ తిఱుగ నీ కుటిలాలక
లాలితాస్యమి
చ్ఛా విధిఁ జూడకున్న నిమిషంబులు మాకు
యుగంబులై చనుం
గావున రాత్రులైన నినుఁ గన్నుల నిండుగ
జూడకుండల
క్ష్మీవర! ఱెప్పలడ్డముగజేసె నిదేల విధాత
క్రూరుడై" (10– 049)

శ్రీహరి యొక్క క్షణము కనుమొఱంగి చనగా గోపికలు కరిని గానక తిరుగు కరేణువులవలె కాళిందీతీర వనాంతరముల నాతనిని వెదకుచు కన్పడిన ప్రతి వృక్షమును ప్రతి లతను కృష్ణునిజాడ చెప్పుమని యెంతటి యున్మత్తచిత్తలై యడుగుచున్నారో వినుడు—

ఎ) "నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపా
రసంబు పై
చల్లెడువాడు మౌళి పరిసర్పిత పింఛము
వాడు నవ్వు రా
జిల్లెడు మోము వాడొకడు చెల్వల మాన
ధనంబు దెచ్చెనో
మల్లియలార! మీ పొదల మాటున లేడు
గదమ్మ! చెప్పరే–'' (10–1010)

బి) "అంగజుడైనఁ జూడ హృదయంగముడై
కరగించువాడు శ్రీ
రంగ దురంబువాడు మధురంబగు వేణు
రవంబువాడు మ
మ్మంగజు పువ్వు దూపులకు నగ్గముచేసి
లవంగ లుంగనా
రంగములార! మీ కడకు రాడుగదా! కృప
నున్నఁ జెప్పరే–" (10–1011)

భగవద్విరహమును తృటి కాలము నైతము సహింపలేని ఇట్టి మధుర భావముచే వారు పరమేశ్వరుని కృపకు పాత్రములై యతనితో రమించి తరించిరి. సామాన్య దృష్టితో చూచు వారికి గోపికా శృంగారము ఐహిక సంబంధిగ చూపట్టును. కాని కృష్ణభగవానుని పాద సౌందర్యము నందలి మాహాత్మ్యమును గోపికలు భావించిన పద్ధతిని తిలకించినచో నందలి యంతరార్థము, తాత్త్విక దృష్టి వెల్లడియగును. చూడుడు —

ఈ చరణంబులే యిందు నిభానన! సనకాది
మునియోగ సరణి నొప్పు
ఈ పాదతలములే యెలనాగ! శ్రుతి వధూ
సీమంత వీధుల చెన్నుమిగులు
ఈ పదాబ్జంబులే యిభకులోత్తమయాన! పాలేటి
రాచూలి పట్టుగొమ్మ
లీ సుందరాంఘ్రులే యిందీవరేక్షణ! ముక్తి
కాంతా మనోమోహనములు

యీ యడుగుల రజమె యింతి బ్రహ్మేశాన
దివిజ వరులు మౌళి దిశల దాల్తు
రనుచు కొందఱలు లబ్జాక్షి దేగిన
క్రమము గనియు నతని గానరైరి–''
(10–1029)

ఉత్కటమగు కామాసక్తితో నేకాగ్రచిత్తమున ఆత్మనివేదన మొనర్చి ముక్తి నందిన గోపవనితలు మధురభక్తికి ప్రతీకలు భర్తృద్రోహ్యాశ్చప్పుడు పరవశభావమున భగవంతుడే యగుటయు జరుగుచుండును. గోపికలు దివ్యానంద పారవశ్యమున నున్మత్తచిత్తలై కృష్ణలీలలననుకరించుచు కృష్ణైక్యస్థితి నిట్లు ప్రకటించిరట.

పూతనయై యొక్క పొలతి చరింపంగ శౌరియై
యొక కాంత చన్ను గుడుచు
బాలుడై యొక భామ పాలకు నేడ్చుచో బండి
నేనను లేనుఁ బాఱదన్ను
సుడిగాలి నని యొక్క సుందరి కొనిపోవ
హరినని నర్తించు నబ్జముఖియు
బకుడ నేనని యొక్క పడతి సరంభింప
పద్మాక్షుడని కొమ్మ పరిభవించు

నెలమి రామకృష్ణులింతు లిద్దరు గాగ,
గోపవత్స గణము కొందరగుదు
రసుర వైరి ననుచు నబల యొక్కతె చిరుఁ
వసులమనెడి సతుల భరతముఖ్య!–"
(10–10–19)

(27వ పేజీలో చూడుడు)

# గోదావరి పుష్కరాలు

శ్రీ సిద్ధార్థినామ సంవత్సర భాద్రపదశుద్ధ ఽ బుధవారమునకు సరియగు 29-8-79 రాత్రి 7-15 గం॥ ప్రారంభమై గోదావరీ పుష్కరాలు జరిగినవి. అనేకమంది ప్రజానీకము దేశము నలుమూలలనుండి తండోపతండములుగా వచ్చి గోదావరి నదిలోస్నానమాచరించి పునీతులైరి. ఈ గోదావరీనది పంచగంగలలోనొకటి. "కావేరీ తుంగభద్రా చ కృష్ణవేణీ చ గౌతమీ భాగీరథీ విఖ్యాతాః పంచగంగాః ప్రకీర్తితాః గౌతమి యనగా గోదావరీనది. రాబోవు సంవత్సరములో కృష్ణానదీ పుష్కరాలు జరుగును.

ఈ పుష్కరాలు 12 సంవత్సరముల కొకసారి ఒక్కొక్కనదియందు జరుగుచుండును. ఈ పుష్కరాలు అంటేఏమి? అవి ఎందుకు జరుగుచున్నవి. దాని అభిమాన దేవత ఎవరు? వాటి ప్రాముఖ్యత ఏమి? దీని పూర్వ వృత్తాంతమేమి? ఈ విషయములు తెలిసికొనుట ఎంతో ఆవశ్యకము.

పుష్కరమునకు అనేక అర్థములు కలవు. మనకు ఈ సందర్భములో కావలసిన అర్థములు ఉదకము, తీర్థవిశేషము, పంద్రెండు. గురుబాల ప్రబోధిని అమర కోశములో 176-177 పుటలలో

"ఆపః (స్త్రీ భూమ్ని) వార్వారి సలిలం కమలమ్ జలం
పయః కీలాల మమృతం జీవనమ్ భువనం వనమ్
కబన్ధ ముదకం పాథః పుష్కరం సర్వతోముఖమ్
అమ్భోఽర్ణస్తోయ పానీయ నీర క్షీరామ్బు శంబరమ్

ఈ 27 ఉదకములకు పేర్లు అనివున్నది. మరియు రెండవ అర్థము తీర్థ విశేషము. గురుబాల ప్రబోధినిలో 818వ పేజిలో

"పుష్కరం కరి హస్తాగ్రే వాద్య భాణ్డ ముఖే జలే
వ్యోమ్ని ఖడ్గ ఫలే పద్మే తీర్థౌషధి విశేషయోః

అని వున్నది.

ఈ పుష్కరాలకు నదీజలము ప్రాముఖ్యము. జలము శివుని యొక్క అష్ట తనువులలో ఒకటి. కాళిదాసు తన అభిజ్ఞాన శాకుంతలములో ప్రార్థనాశ్లోకములో శివుని యొక్క అష్ట తనువులను మనోజ్ఞముగా వర్ణించియున్నాడు.

"యా సృష్టిః స్రష్టు రాద్యా వహతి విధిహుతం
యా హవిర్యా చ హోత్రీ యే ద్వే కాలం విధత్త శ్రుతి విషయగుణా
యాస్థితా వ్యాప్య విశ్వం యామాహుః సర్వ భూత ప్రకృతిరితియయా
ప్రాణినః ప్రాణవంతః ప్రత్యక్షాభిః ప్రపన్న స్తను భిరవతు వస్తాభిరష్టా భిరీశః

ఈ యేడును 1. జలము 2. అగ్ని 3. హోత 4, 5 సూర్యచంద్రాదులు 6. ఆకాశము 7. పృథ్వి 8. వాయువు. ఆ పరమేశ్వరుని అష్ట తనువులు. శ్రీ మహావిష్ణువు మహాప్రళయానంతరంబు, పవిత్రంబగు జలంబులపై యోగనిద్రను గైకొనుటచే జలంబులత్యంత పవిత్రంబులయ్యె. మరియు జలంబు విష్ణు పాదోదకంబగుటం జేసి జలంబులు త్రిలోక పావనంబులయ్యె. విష్ణురష్టోత్తర శత నామ స్తోత్రములో "భాగీరథీ జన్మ భూమి పాదపద్మ స్సతాం ప్రభుః।" అను నామము కలదు. మరియు ఈ సర్వప్రపంచమునకు ఆధారము జలములే ఈ విషయము నారాయణ సూక్తంబను మంత్రపుష్పములో ఈ విధముగా చెప్పబడియున్నది,

చంద్ర మండలము అమృతమయ జలము. అగ్నినుండ జలము పుట్టినది. జలములే అగ్నికాధారము. జలములే

శ్రీ సత్రం వేంకట రమణయ్య
కడప

గోదావరిలో పుష్కరస్నానానికి పరుగులు తీస్తున్న ప్రజావాహిని



వాయువునకాధారము. జలస్థానమే సూర్యునకు ఆధారము. జలములే చంద్రస్థానము. నక్షత్రములకు కూడా జలములే ఆధారము. మేఘమునకు జలములే ఆధారము. జలములే సంవత్సరమునకు ఆధారము. కావున సర్వ జగత్తుకు జలములు ఆధారమని ఎవ్వడు తెలుసుకొనుచున్నాడో వాడే జ్ఞాని.

సంసార బంధములైన దురితముల బోగొట్టు వారెవరను ప్రస్తావనమందు 'గంగా పాపం శశీతాపం' అను వచనము కలదు. మనము నిత్య నైమిత్తిక కర్మలగు స్నానాదులయందు దేవతార్చనలో కలశపూజయందు, వేదమంత్రమగు "ఇమం మే గంగే యమునే సరస్వతి........" ను పఠించుచున్నాము.

పై కారణముల వలన జలములు అతి శ్రేష్ఠములు. పరమ పవిత్రములు. సృష్టికి ప్రాణాధారము, ఏ కార్యమునకైననూ ప్రథమములో నీరు అవసరము. నీరు లేనిదే భూతకోటి జీవించలేదు. భుక్తి ముక్తులకు జలమే ఆధారము.

పంచలింగ స్వరూపములు:—

కంచిలో ఏకాంబరేశ్వరుడు, పృథ్వి లింగరూపము. జంబుకేశ్వరములో జలరూపలింగము, అరుణాచలములో తేజో లింగరూపము, శ్రీకాళహస్తిలో వాయు లింగరూపము, చిదంబరములో ఆకాశ లింగరూపము. ఈ పంచలింగరూపములు గొప్ప మహిమాన్వితములు.

పూర్వము తుందిలుడు అను జనుడు గంగాధరుని గూర్చి ఘోరతపంబుచేసెను. భర్గుండు వృషభాధిరూఢుడై సాక్షాత్కరించెను.

పరమ శివుడు తుందిలుని వరము కోరుకొమ్మనెను. తుందిలుడు సంతోషాంతరంగుడై ముకుళిత కరకములుండై అనేక విధముల ఆ పార్వతీపతిని స్తోత్రంబుచేసి ఆతని అష్టమూర్తి రూపంబులలో నుదకరూపంబు తనకను గ్రహించి, తన్ను అతనియందు ఐక్యంబు చేసికొమ్మనెను. అందులకు శంకరుండు అతనితో ఇట్లనెను "ఈ జలంబులు త్రిలోకపావనంబులు. అట్టి జలరూపంబు నా వంటి వానికే బహు తపః పరిపాకంబుచే కల్గెను. సామాన్యులకు అట్టి రూపంబు కల్గుట కష్టంబు. కాని నీవొనర్చిన ఘోర తపంబునకు మెచ్చి వేడిన వరంబిచ్చెదనని నుడివితి. నాదువరంబు అమోఘంబగుటంజేసి నీ మనోఽభీప్సితంబు నెరవేఱుగాక. త్రిభువనములలో సుప్రసిద్ధుండవై చెలంగెదవు కాక," అని వరంబిచ్చెను.

అప్పటినుండి తుందిలుడు జల రూపమున తేజరిల్లుచుండె. అతడు పుష్కరాఖ్యుండయ్యె. ఇట్లుండగా ఒకనాడు బ్రహ్మ, విష్ణువుయొక్క ఆజ్ఞానువర్తియై చరాచరాది జగములను సృష్టించుటకు జలములను శివుని వేడ, శివుడు తన కమండలములోని తుందిలుని నీటిరూపమున వెల్గువానిని పుష్కరాఖ్యుని యిచ్చెను.

పుష్కరుడు చతురానన వర్తియై కలకాలంబు లోక సృష్టిచేయుచుండును. ఒకనాడు దేవగురువగు బృహస్పతి బ్రహ్మలోకమునకు వచ్చి ఆ పుష్కరుని తన కిమ్మని యడిగెను. అందులకు ఆ వాణీపతి సమ్మతించి పుష్కరుని గురుని వశములో నుండుమని యిచ్చెను. అప్పుడు పుష్కరుడు బ్రహ్మతో నేను నిన్ను విడిచి యుండజాలను. నీవు నాతో కలిసి బుధ లోకములో యుండుమని కోరెను.

అందులకు చతుర్ముఖుడు ప్రీతితో "నిన్ను భూతపతి తనమూర్తిగా చేసెను. కావున నీవు మదిలో చింత విడువుము భూవల యములోనున్న, నిన్ను పుణ్యప్రాప్తికై సేవించుటకు దేవతలును, ఋషులును సకల త్రిభువనవాసులు చనుదెంతురు. అదెట్లనిన గీష్పతి పంద్రెండు రాసులయందు సంచరించునప్పుడు పంద్రెండు పుణ్యనదులకు పర్వ కాలంబు కల్గును. అప్పుడు ఆ నదులకు పుష్కరాలనియు పేరుకల్గి వర్తించును. గురుడు మేషంబున యుండగా గంగానదికి, వృషభంలో నర్మదకు, మిథునములో సరస్వతికి, కర్కాటక రాశియందు యమునకు, సింహములో గౌతమీ (గోదావరి) కన్యారాశియందు కృష్ణానదికి, తులలో కావేరికి, వృశ్చికమున తామ్ర పర్ణికి, ధనుస్సున సింధువునకు, మకరమున తుంగభద్రకు, కుంభమున మలాపహకు మీనమున ప్రణీతానదికి పుష్కరంబులు ఈ భూమి యందు కల్గును.

ఆ కాలములో బృహస్పతి స్వర్గము నుండి భూమికి నీతోడ వచ్చును. ఆమహా సమయములందు మేమందరముస్నానము చేయుటకై వత్తుము. ఆ మహా పుణ్య పుష్కర కాలమందు ద్వాదశ దినంబులు మొదటియందును పంద్రెండు దినంబులు తుది యందును ముఖ్యమైనవి. మిగతా పదకొండు నెలలలో ఈ పుష్కరనదుల యందు మధ్యాహ్న కాలమున గురుడును పుష్కరుడును, దేవతలును ముహూర్త ద్వయము అక్కడ చేరియుందురు. ఆ సమయములో స్నానం మొదలగునవి జరిపిన పుణ్యప్రదము వక్కాణించినారు.

అట్టి సమయమున ఆ నదులయందు జనులు భక్తితోడ శాస్త్ర విహితకర్మలు చేయ వాటి ఫలము ఇంతింతయని చెప్పుటకు వీలుకాదు. సకల పుణ్యనదులలో సంవత్సర మాచరించు స్నానము ఒక పుష్కర స్నానానికి తులతూగజాలదు. పుష్కర స్నానాలప్పుడు సువర్ణదానము మేరువుతో సమానము, గోదానమొకటిచే స్వర్గము ప్రాప్తించును. భూదానమున విష్ణులోకము కల్గును. అన్నదానంబుచే అఖిల లోకంబులవారికి తృప్తి కల్గును. తర్పణాదులచే పితృదేవతలకు గయలో పైతృకమిడిన సద్గతి లభించును.

పాపియై తల్లిని బాధించు నీచుడు జనకాజ్ఞ మీరిన జనుడు, గురువునుతిట్టిన పాపియు, తీర్థవాసులను చూచి హేళన చేసిన దుర్మార్గుడు, సోదరులను మోస పుచ్చిన కులహీనుడు, అన్యకాంతలను కోరిన దుష్టుడు, పరులను నిందించు వాడును, బ్రాహ్మణ ద్వేషియు, పరుల విత్తమును అపహరించువాడును అవిఇవి యననేల, సమస్త పాపుల పాపములు నశించును.

అన్నింటి కన్ననూ మొట్టమొదటిది విశ్వాసము, దృఢనమ్మకము. అవిలేనిచో ఏమియూ జరుగవు. పెద్దలు "స్వయం తీర్ణః పరాన్ తారయతి" అను న్యాయమున పెద్దలు తాము తరించి ఇతరులను కూడా తరింప చేయుదురు.

"నాన్య పంథా, నరాణా మఘహరణ చణో
విద్యతే ప్రాయణాయే
త్యుక్త్వా త్వాప్త్వా తపాంసి ప్రవిమల మనస
స్తేచ భాగీరథా ద్యాః
ఆనీయ స్వర్గలోకాద్భగవతి! భవతీం
ఘోర సంసార తాప
పుష్టాన్ దుష్టాంశ్చ శిష్టా నపిచ కరుణయాఽ
తారయన్ తేచ

[ శ్రీ గంగా స్తవరాజం ]

మనుష్యులకు సమస్త పాపములను పోగొట్టెడు వేరు మార్గము మోక్ష ప్రాప్తికి లేదని, తలంచి, గొప్పతపం బొనరించి, నిర్మలాంతః కరణములు కలవారై, ఆ భగీరథుడు మొదలగు రాజర్షులు గంగను స్వర్గలోకమునుండి తీసికొనివచ్చి ఘోరములైన సంసార తాపములచే దహింప బడునట్టివారలను, శిష్టులను దుష్టులను తరింపజేసి తాము కూడా తరించిరి, ప్రతినదియు గంగతో సమానమే. ప్రతి జలము గంగాజలమే.

*

## ముఖ్యగమనిక

తాళ్ళపాక అన్నమాచార్యుల కీర్తనల సంపుటాలవెల తగ్గింప బడినది.

ఒక్కొక్కప్రతి వెల: రు. 5/– మాత్రమే.

26 సంపుటముకూడా విడుదలైంది.

వివరాలకు : సంపాదకుడు,
తిరుమల తిరుపతి దేవస్థానం,
తిరుపతి.

# పుష్కరాల పురం

ఆంధ్రదేశానికి 'అన్నపూర్ణ' అన్న ఖ్యాతిని తీసుకొచ్చిన నదీమతల్లి గోదావరి గంగా, కృష్ణా, తుంగభద్రా, తదితర నదులలాగే గోదావరికూడా పరమ పవిత్రమైనదిగా ఎంచబడుతూంది. గోదావరీ స్నానం పాపవినాశకరం అని హిందువులప్రగాఢ నమ్మకం. ఆనమ్మకం తోనే దేశం నాలుగు చెరగులనుండి పన్నెండేళ్ళ కొకసారి జరిగే గోదావరీ పుష్కరాలకు లక్షలాదిగా యాత్రికులు భక్తి ప్రపత్తులతో రాజమండ్రికి తరలిరావడం జరుగుతూంది. పుష్కరపుణ్యకాలంలో తెలుగుల సాంస్కృతిక కేంద్రమైన రాజమహేంద్రవరం నిత్యకళ్యాణం పచ్చతోరణంగా విరాజిల్లుతూ వుంటుంది.

తరతరాలుగా రాజమహేంద్రవరం తెలుగు వారి సాంస్కృతిక వైభవానికి కరదీపికగా వుంటూవచ్చింది. పాత కొత్తల మేలు కలయికకు ఈ పురం పట్టుకొమ్మ గతంలోహిందూధర్మపు సిరులుపొంగినగడ్డ ఇది. నిత్యం వేదమంత్రఘోషతో వివిధాధ్వర నిర్మలకర్మదీక్షతో అనేక ఆలయాల మహోన్నత శిల్పకళాశోభతో, కవిపండిత గాయకుల కాణాచిగా కళకళలాడిన పట్టణమిది. వర్తమానంలో సైతం, నవ్యభావాలకు, సంఘ సంస్కరణాభినివేశాలకు వేదికగా భాసిల్లిన నగరం ఇదే!

రాజమహేంద్రవరానికి ఘనకీర్తిగల గత మెంతోవుంది. ఎన్నో పరాక్రమశోభిత రాజవంశాలకు పూచిన పాదు ఇది.

## రాజమహేంద్రవరం

తూర్పు చాళుక్య వంశరాజయిన శ్రీ రాజరాజనరేంద్రుడు (క్రీ శ, 1022-62) ఈ నగర నిర్మాత అని చరిత్ర చెబుతోంది. వారిపేరు మీదుగానే ఇది రాజమహేంద్రవరమన్న పేరును సంతరించుకున్నదట.

రాజరాజ నరేంద్రుడు నగర నిర్మాతయే కాదు; కావ్య నిర్మాత కూడా! తెలుగులో ఆది కావ్యమైన ఆంధ్ర మహాభారతాన్ని రాజరాజు ప్రోద్బలంతోనే నన్నయభట్టు తెలుగు వారికి జగద్ధితంగా అందించడం జరిగింది.

## రాజమహేంద్రవరం ఆలయాలు

### శ్రీ ఉమా మార్కండేయస్వామి ఆలయం – గోదావరి బండ్

ఇక్కడి శివలింగాన్ని మృకండుముని పుత్రుడు మార్కండేయుడు ప్రతిష్ఠించాడని ప్రతీతి. యమధర్మరాజ పాశబద్ధుడైన మార్కండేయుడు ఇక్కడి శివలింగాన్ని కావలించుకొని చిరంజీవియైనాడని మరొక ఐతిహ్యంవుంది. అందువల్లే ఈ శివాలయం మార్కండేయుడి పేరు మీదుగా పిలువబడు తున్నది

### శ్రీ ఉమా కోటిలింగేశ్వరస్వామి ఆలయం - కోటిలింగాల రోడ్డు

త్రిపురాసుర సంహారము తర్వాత బ్రహ్మ విష్ణువులు కలిసి ఇక్కడి కోటిలింగేశ్వరస్వామిని ప్రతిష్ఠించారని స్థలపురాణం. త్రిపురాసురుడి కోటిమంది అను

శ్రీ కె. చెంచుకృష్ణయ్యశెట్టి
తిరుపతి,

చర గణాన్ని బ్రహ్మ కోటి లింగాలుగ మార్చాడని ఐతిహ్యం. బ్రహ్మ విష్ణువులు నర్మదానదినుండి విల్లు నొకదాన్ని తెచ్చి దాంతో కోటి లింగాలను సృష్టించారని ఇంకొక కథవల్ల తెలుస్తోంది. కోటిలింగేశ్వర స్వామిని పూజిస్తే, కోటి శివ లింగా



లను పూజించిన ఫలం దక్కుతుందని జన శ్రుతి.

### లక్ష్మీ జనార్ధనస్వామి ఆలయం ధవళేశ్వరం

ధవళగిరి అని పిలువబడే ఈ క్షేత్రంలో చతుర్వేదమూర్తి స్వరూపమైన శ్రీ లక్ష్మీ జనార్ధనస్వామి వెలసి వున్నారు. వేదాలను దొంగిలించిన సోమకాసురుణ్ణి శ్రీ మహావిష్ణువు మత్స్యావతారంఎత్తి సంహరించి వేదాలనుకాపాడాడు. ధవళగిరిపై బ్రహ్మదేవుడు విష్ణువును ధ్యానించగా ఇక్కడ జనార్ధనస్వామి రూపంతో విష్ణువు ప్రత్యక్షమైనట్లు చెబుతారు. ఈ స్వామి వారి పూజా ఫలితంగా బ్రహ్మహత్యా పాతకం తొలగుతుందని ప్రతీతి.

### శ్రీ అగస్త్యేశ్వరస్వామి ఆలయం ధవళేశ్వరం

అగస్త్యమహాముని పరమశివుని అర్చించిన తావని ప్రతీతి ఇక్కడి శివలింగం స్వాయంభువు శివలింగాలలోకెల్లా పెద్దది.

త్రేతాయుగం నాటినుంచి ఈ శివ లింగం పూజలందు కొంటున్నదట. అగస్త్యుల వారిచేతనే ప్రతిష్ఠింపబడిన శ్రీ బాలాత్రిపుర సుందరీ విగ్రహం ఇక్కడ దక్షిణాభిముఖంగా వుండటం ఒక విశేషం.

### సారంగధరేశ్వరాలయం సారంగధరమెట్ట

చిత్రాంగి మాయమాటలునమ్మి రాజ రాజు తన కొడుకు సారంగధరుడికి కాళ్ళూ చేతులు నరికించగా అతడు ఇక్కడి శివలింగాన్ని కావలించుకొని, శివపంచాక్షరీ జపించి తిరిగి కాళ్ళూ చేతులు పొందినట్లు స్థలపురాణం చెబుతోంది, అందువల్లే ఈ శివాలయం సారంగధరుని పేరుతో ప్రసిద్ధికెక్కింది.



రాజమండ్రిలో స్నానఘట్టానికి ప్రారంభోత్సవం జరిపిన ముఖ్యమంత్రి డా॥ చెన్నా రెడ్డి

### రాజమహేంద్రవరం ప్రముఖులు

కాలగతిలో ఆంగ్లేయులఆధిపత్యంలో రాజమహేంద్రవరం రాజమండ్రిగామారినప్పటికీ దాని వైభవాన్ని మాత్రం అలాగేనిలబెట్టుకుంది. రాజమండ్రిలోని కళాశాలకు ప్రిన్సిపాల్స్‌గ పనిచేసిన ఆంగ్లదొరలు తెలుగువారివెలుగు వికాసాలకోసం విశేషంగా పాటుబడినారు. ప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ దామెర్ల రామారావు, కళాకారుడు నవలారచయిత శ్రీ అడవి బాపిరాజు, కోలవెన్ను కోటీశ్వరరావు వంటి వారు రాజమండ్రి కళాశాల ప్రధానాధ్యాపకులైన కౌల్‌డ్రే దొర చేతులలో సానపెట్ట బడినవారే!

రాజమండ్రి సబ్-కలెక్టర్‌గా పని చేసిన ఎమ్.ఎస్. గిల్బ్రదొర వ్యావహారిక భాషలో ఇంగ్లీషు-తెలుగు నిఘంటువును తెలుగు భాషాయోషకు కానుకచేశారు. ఇటలీదేశస్థుడైన గిల్బ్రదొర రాజమండ్రి ఆర్ట్సుకాలేజీ లైబ్రేరియన్ శ్రీ కపిల కృష్ణారావు దగ్గర తెలుగు అభ్యసించి తెలుగులో గ్రంథకర్త కాగలగడం తెలుగువారికే గర్వకారణం! ఇక అపర భగీరథుడైన సర్ ఆర్థర్ కాటన్‌దొర రాజమండ్రికేకాదు యావదాంధ్రదేశానికే ప్రాతఃస్మరణీయుడు గదా!

స్వాతంత్ర్య యోధులకుకూడా రాజమండ్రి పేరుపొందింది. స్వాతంత్ర్య పోరాటంలో పురుషులతోబాటు స్త్రీలను భాగస్వాములను చేసిన శ్రీమతి దువ్వూరి సుబ్బమ్మను రాజమండ్రి కలకాలం గుర్తుంచుకొంటుంది. అలాగే బ్రిటిషు పోలీసుల లాఠీదెబ్బలకు తన ఛాతీ నొడ్డి దారుణ హింసకు గురైన బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంకూడా రాజమండ్రి గర్వించదగిన స్వాతంత్ర్య యోధుడు.

ఆధునికయుగంలో, రాజమండ్రిలో ప్రభవించిన మహనీయులలో అగ్రగణ్యుడు శ్రీ కందుకూరి వీరేశలింగం గారు. ఆయన సాహిత్యంలోనూ, సంఘ సంస్కరణంలోనూ సవ్యసాచి. ఆధునిక

(24వ పేజీలో)

# పుష్కరాలలో దేవస్థాన ధర్మరక్షణ సంస్థ కార్యక్రమాలు

మహత్తరమైన గోదావరీ పుష్కరాల సందర్భంగా తిరుమల తిరుపతి దేవస్థానం యథాశక్తి యాత్రికులకు సేవచేసే అదృష్టాన్ని పొందింది.

యాత్రికుల సౌకర్యానికిగాను దేవస్థానం సుమారు 4 లక్షల రూపాయల వ్యయంతో మార్కండేయాలయం వద్ద స్నానఘట్టాన్ని గోదావరి ఒడ్డున రాజమండ్రిలో నిర్మించింది. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా. చెన్నారెడ్డి ఈ స్నానఘట్టానికి ప్రారంభోత్సవం జరిపారు.

ఇక ఆగస్టు 25 నుండి సెప్టెంబర్ 10 వరకు, అనేకధార్మిక కార్యక్రమాలు నిర్వహించింది. ఈ పుష్కర విశేషాలన్నిటిలోనూ, భారీవ్యయంతో, సుబ్రహ్మణ్య మైదానంలో ఏర్పాటుచేసిన విశిష్టకళారంజిత ప్రతిరూపం శ్రీ వేంకటేశ్వరాలయం, కలియుగ వైకుంఠానికి ప్రతిరూపంగా, నిలిచింది. తిరుమలదాకావచ్చి స్వామిని చూచితరించే అవకాశాలులేని వేలాదిప్రజలు ఈ ప్రతిరూపంలోస్వామిని దర్శించి ధన్యతచెందినట్లు తృప్తిపడ్డారు. శ్రీవారి లడ్డు, వడ ప్రసాదాలను కానుకలకు హుండీ కూడా యాత్రికులకు లభింపజేయటంతో తిరుమలను దర్శించినంత తృప్తిని యాత్రికులు పొందారు. రోజుకు 4 వేల రూపాయలదాకా లడ్డవిక్రయం జరిగింది. ఈ ఉత్సవ దినాలన్నిటిలోనూ యాత్రికులు బారులుతీరి వేకువ నుండి సాయంత్రం వరకు స్వామివారిని సందర్శించారు.

శ్రీవారి హుండీకూడా 5 వేల రూపాయల్ని మించి ఒక్కొక్క రోజు వసూలు చేసింది. రోజూ 10 వేల మందికి తక్కువలేకుండా శ్రీవారినిసందర్శించారు.

హిందూధర్మ రక్షణసంస్థ: ధార్మిక ప్రచారంలో దేవస్థాన సహాయోగంతో ఏర్పడ్డ హిందూధర్మ రక్షణసంస్థ ఆధ్వర్యంలో ప్రతిదినం వేదపారాయణం, ఘనస్వస్తి, ఉదయం 9 నుండి 11 వరకు మహామహులచే ధార్మికోపన్యాసాలు సాయంత్రం 3 నుండి 4-30 వరకు దేవస్థానం పౌరాణికులచే పురాణశ్రవణం, ఆ తరువాత 6-30 వరకు, ప్రఖ్యాత కథకుల హరికథా కార్యక్రమాలు జరిగాయి. ఈ కార్యక్రమాలలో సర్వశ్రీ వంగల పట్టాభి, అమ్ముల విశ్వనాథం, జి. సూర్యనారాయణ వంటి హరికథకులు, సర్వశ్రీ శ్రీ భాష్యం అప్పలాచార్యులు, బి ఆర్. శాస్త్రి దివాకర్ల రామమూర్తి, డా. అర్కసోమయాజి, వాజపేయం సుబ్రహ్మణ్యశాస్త్రి, చంద్రశేఖరపాండే, చిరంజీవి సూర్యనారాయణరాజు, బసవరాజు సుబ్బారావు ప్రభృతులు పండితులు పాల్గొన్నారు. రాజ



మంద్రికివచ్చిన అశేషప్రజానీకం అతిశ్రద్ధా భక్తులతో ఈ కార్యక్రమాలు ఆలకించారు.

దేవస్థానం ఇక్కడజరిపిన మరొక కార్యక్రమం ధార్మికగ్రంథవిక్రయం. దేవ స్థాన ప్రజాసంబంధాధికారి ఆధ్వర్యంలో, గ్రంథవిక్రయ ప్రసారశాఖలు నిర్వహించిన గ్రంథప్రదర్శన - విక్రయశాల పలువురు జనుల ఆకర్షణకు కారణమైంది.

ప్రతిదినం వేలాది ప్రజలు బారులు దీర్చి నిలబడి ఈ ఆధ్యాత్మిక గ్రంథాలను పరిశీలించి కొనుగోలు చేశారు సామాన్య జనులకు అందుబాటులో వుండే విధంగా దేవస్థానంవిడుదల చేసిన భగవద్గీత, సూక్తిముక్తావళి, పద్మావతీ శ్రీనివాసం ఇంకా ఇతరగ్రంథాలు అధికజనాదరణపొం



ఆలయ ప్రతిరూపం లోని శ్రీ వేంకటేశ్వరమూర్తి

★



శ్రీవారి హుండి

దాయి. లోగడఎప్పుడూ జరగనంత విశేషంగా అంటేసుమారు 35వేల రూపా యలవరకూ గ్రంథవిక్రయం జరిగింది. ఈ దేవస్థానకార్యక్రమాలలో పాల్గొనేం దుకు వచ్చిన కార్యకర్తలకు ఉపన్యాస కులకు తదితరులకు ప్రత్యేకమైన భోజన సదుపాయాలుకూడా దేవస్థానమే నిర్వ హించింది. ఈ వివిధ కార్యక్రమాల రూప కల్పనలో దేవస్థాన కార్యనిర్వహణాధి కారి ప్రత్యేక శ్రద్ధ వహించగా సర్వశ్రీ. డి. అర్క సోమయాజులు, రావుల సూర్యనారాయణమూర్తి, జి. శ్రీరామ మూర్తి, ఈ దేవస్థాన వివిధ కార్యక్రమాల నిర్వాహకులుగా ప్రశంసలందుకున్నారు.

దేవస్థాన గ్రంథవిక్రయ శాలలో ముఖ్యమంత్రి, దేవస్థాన కార్యనిర్వహణాధికారి







## "ఆమ్నాయ సరస్వతి"

తిరుమల తిరుపతి దేవస్థానం, కాకినాడ శ్రీమదాంధ్ర వేదశాస్త్రపరిషత్ల సమష్టి ఆధ్వర్యంలో ఆగస్టు 25 తేదిన కాకినాడ సూర్యకళామందిరంలో విఖ్యాత వేదపండితులు శ్రీ ఉప్పులూరి గణపతిశాస్త్రిగారికి 'ఆమ్నాయసరస్వతి' బిరుదు ప్రదానం జరిగింది. దేవస్థానం తరపున ముఖ్యమంత్రి శ్రీ చెన్నారెడ్డి కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్ శాస్త్రిగార్ని నూత్నవస్త్రాలతో సత్కరించారు.



(21వ పేజీ తరువాయి)

తెలుగు సాహిత్యానికి ఆయన యుగకర్తగా పేర్కొనబడుతున్నారు. ఇక సంఘసంస్కరణరంగంలో వారు దక్షిణ దేశపు రాజారామమోహనరాయ్‌గ, ఈశ్వరచంద్ర విద్యాసాగరుడుగ వినుతికెక్కారు. ప్రముఖ నవలారచయిత, నాటకకర్త శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి సాహితీ విహారానికి రాజమండ్రి ఉనికిపట్టు. వీరేశలింగంగారి ప్రతిస్పర్థి, ఉద్దండపండితుడు శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు. భావకవి పుంగవులు శ్రీ వేదుల సత్యనారాయణపంతులు, రాజమండ్రి వారే! చింతాదీక్షితులూ, గుడిపాటి వెంకటచలం రాజమండ్రిలో ఉపాధ్యాయులుగా పనిచేశారు.

తెలుగువచన రచనకు పితామహుడు నీతిచంద్రికా, బాలవ్యాకరణాది గ్రంధ ప్రసిద్ధుడు శ్రీ చిన్నయసూరికూడా రాజమండ్రిలో నివసించినవారే!

ఆంధ్రకేసరి ప్రకాశంపంతులుగారి విద్యార్థిదశ రాజమండ్రిలోనే గడిచింది. అప్పట్లో ఆయన నాటకాలుకూడా ఆడేవారు. ఆ తర్వాత రాజమండ్రిలోనే ఆయన న్యాయవాది అయ్యారు. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో పనిచేశారు. ఆలస్యంగా వచ్చేవారిని నిరోధించడానికై అప్పట్లో ఆ కాలేజీ ప్రిన్సిపాల్‌గారు కాలేజీ ముఖద్వారాన్ని మూయిస్తూవుంటే దుగ్గిరాలవారు గోడ దూకి కాలేజీలోకి గెంతేవారట! రాజమండ్రి నాటకరంగం నటరత్నాల నెన్నింటినో సృష్టించింది. ఆనాటి రాజమండ్రి నటులలో ఇమ్మనేని హనుమంతరావు నాయుడు, టంగుటూరు ప్రకాశం పంతులు, బ్రహ్మజోస్యుల సుబ్బారావు, ముప్పిడి జగ్గబాబు, అవధానుల పురుషోత్తం, జయంతి గంగన్న ప్రసిద్ధులు.

రాజమండ్రి న్యాయవాదులలో శ్రీ న్యాయపతి సుబ్బారావు అతిప్రసిద్ధుడు. ఇలా ఈ ఊరివారు ఎందరో మహానుభావులు. అందరికీ వందనములు *

(గతవంచిక తరువాయి)

అవ: పరమేశ్వరుని విశ్వలీలా విలాసము నొక నేత బేరముగా రూపించుచున్నాడు —

65

వరాళి

వాడలవాడల వెంట - వాఁడెవో వాఁడెవో,
నీడనుండి చీరలమ్మే - నేఁతబేహారి ॥పల్లవి॥

1. పంచభూతములనెడి - పలువన్నెనూలు
చంచలపు గంజితోడ - చరిసేసి,
కొంచెపు కండెల నూలి - గుణములనేసి
మంచి మంచి చీరలమ్మే - మారుబేహారి
॥వాడ॥

2. మటమాయముల చన - మగువ పసిఁడి నీరు
చిటిపొటి యలుకలఁ - జిలికించఁగా,
కుటిలంపు (జేఁతలు - కుచ్చులుగాఁగట్టి
పటవాళి చీరలమ్మే - బలు బేహారి ॥వాడ॥

3. మచ్చిక జీవు లనేటి మైలసంతలలోన
వెచ్చపు కర్మధనము — విలువ చేసి
పచ్చడాలుగాఁగుట్టి - బలు వెంకటపతి
ఇచ్చకొలఁదుల నమ్మే - ఇంటిబేహారి
॥వాడ॥

(5-175)

అదుగో! అల్లదుగో! వీథి వీథుల సందుగొందుల దిరుగుచు నీడపట్టున నుండి చీరలమ్ము నేత వ్యాపారి అల్లదుగో!

ఆ నేతగానికి పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము అను పంచభూతములే రంగురంగుల నూలు. ఆ నూలు నతడు చాంచల్యము అను గంజితో గట్టి పరచుచున్నాడు. పిదప సత్త్వరజస్తమో గుణములనెడు కండెలతో మంచిమంచి చీరలుగా నేసి మారుబేరమున కమ్ముచున్నాడు.

మాయలమారియైన అతని భార్య మధ్యమధ్య చిన్నచిన్న జగడములు చేయుచు బంగారు నీరు చిలికించి చీరలకు వన్నెలు వేయుచున్నది. ఆ నేతగాడు వక్రమునైన చేష్టలనే కుచ్చులుగా కట్టి నిలువుగను, అడ్డముగను పట్టెలు గల చీరలమ్ముచున్నాడు.

అతని బేరమున కలవాటుపడిన జీవులందరు మైల సంతలలో * జేరుదురు. అచ్చట వారివారి కర్మమను ద్రవ్యమును

# శ్రీ అన్నమాచార్య సంకీర్తనామృతము

**శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి**

క్రయముగా నేర్పఱచి పచ్చడములను తయారుచేసి వేంకటేశ్వరుడు అనెడు ఇంటిబేరగాడు తన ఇష్టమువచ్చిన ప్రకారమమ్ముచున్నాడు.

వి: నేతవ్యాపారి పలురంగులు గల నూలును గంజితో గట్టిపరచి పడుగుపేకలుగా అమర్చి వస్త్రములునేయును. అతనిభార్య వాటికి అద్దకము వేయును. కుచ్చులుగా కట్టి ఆ వస్త్రముల నతడు సంతలలో వీథి వీథులు తిరిగి అమ్ముచుండును. ఈలోక వృత్తముతో పరమాత్ముని జగల్లీలనిట కవి పోల్చుచున్నాడు.

'సర్వవ్యాపీ' అని శ్రుతి పేర్కొన్నట్లు భగవంతుడు అంతటను ఉన్నాడు గాన 'వాడలవాడలవెంట' ఉన్నాడని చెప్పబడినది. వ్యాపారి నీడలో నుండి చీరలమ్మునట్లే పరమాత్ముడు మరుగున నుండి జగన్నాటకమును నడిపించుచున్నాడు.

పంచభూతాత్మకములైన వివిధ వస్తువులే భగవంతుని నేతయందలి పోగులు. అవి సదా పరిణామశీలములై చంచలములుగానున్నవి గాన వాటి చంచలత్వమే ఇట 'గంజి'గా రూపింపబడినది.

మహామాయ యనియు, అవిద్య యనియు చెప్పబడుచున్న భగవంతుని లీలావిభూతి అష్ట ప్రకృతులు, షోడశవికారములు అనబడు ఇరువదినాల్గు తత్త్వములతో గూడియున్నది. *

ఈ తత్త్వముల కాది భూతమైన ప్రకృతి నుండియే సత్త్వ రజస్తమో గుణము లేర్పడుచున్నవి. జగద్వ్యవహారమునకు మూలములై జీవులను దేహములతో బంధించునవి ఈ త్రిగుణములే.

* సత్త్వంరజస్తమ ఇతి
గుణాః ప్రకృతి సంభవాః।
నిబధ్నన్తి మహాబాహో!
దేహే దేహిన మవ్యయమ్॥
(గీత - 14-15)

* (ప)=బేహారి=వ్యాపారి.
1. చరిసేసి=గంజితో గట్టిపడునట్లుచేసి.
2. పటవాళి చీరలు=నిలువుగనో లేదా అడ్డముగనో పట్టెలుగల చీరలు.
3. వెచ్చపు కర్మధనము=వెచ్చింపక తప్పని కర్మమనెడు ధనము.
పచ్చడాలు=వస్త్రములు

* నేత పనిలో పూర్వకాలమున మాలవారు నిష్ణాతులు. వారు చీరల వ్యాపారము చేయు సంత మైల సంత" అని రాళ్ళపల్లివారు.
(మా-శా-పా- II P. 187)

* తత్ర ప్రకృతయ స్త్వష్టౌ, వికారాః షోడశ 'అష్టౌ ప్రకృతయః షోడశకాశ్చ వికారాః' ఇతి శ్రుతేః. తత్ర అష్టౌ ప్రకృతయః ప్రకృతి మహదహంకారాః, పంచభూతాని చ......... వికారాశ్చ శబ్దాది విషయ పంచకంచ ఏకాదశేన్ద్రియాణిచ" - రామానుజ సిద్ధాంతసారః P. 62

కావుననే ఇట నూలుకండెలుగా అవి రూపింపబడినవి. పడుగు పేకలు రెండును కలసినపుడే వస్త్రములు తయారగునట్లు పంచభూతములతో త్రిగుణములు జోడై నడిచినపుడే జగల్లీలసాగుచున్నది.

మాయారూపిణియైన ప్రకృతియే లక్ష్మి. ఈమె తోడ్పాటుతోనే దేవుడు సృష్టి కార్యము నడుపుచున్నాడు. భగవంతుని పత్నియగు నీమె అప్పుడప్పుడు ప్రణయ కోపము ప్రదర్శించుచు వస్త్రముల కాకర్షణ కలుగుటకై బంగారు నీరు చిలికించుచున్నది. అనగా మాయాకాంత తెచ్చి పెట్టిన కనకము సృష్టిలో మోహకద్రవ్యమై లోభ పెట్టుచున్నదని తాత్పర్యము. లోకములో నెన్నెన్నో కుటిలపు నడతలు గలుగుటకు కారణము మనుజులకు కనకముపైగల వ్యామోహమమకారములేగదా!

సృష్టి స్థితి సంహారాత్మకమైన ఈ విశ్వలీలకు అనాది కాలమునుండి మచ్చిక పడినవారు జీవులు. వారివారి కర్మ ధనమును వెచ్చించి పాంచభౌతికములైన పదార్థముల మూలముగా వచ్చు సుఖదుఃఖాత్మకములైన ఫలములను వారను భవించుచున్నారు. ఈ విధముగా వారిచే కర్మఫలముల ననుభవింప జేయువాడు పరమాత్ముడే.

యః ఫలకర్మ కర్తా, (శ్వేతా-5-7) అని శ్రుతి ఫల కర్మములకు కర్తగా ఆయనను పేర్కొన్నది. మరియు 'ఇచ్చకొలదులనమ్మే బేహారి' అనుటచే జీవులకు కర్మల కధీనమైన ఫలములనిచ్చుచున్నను భగవంతుడు సర్వ స్వతంత్రతతో వ్యవహరించుచున్నాడని సూచింపబడినది.

> పత్రం పుష్పం ఫలం తోయం
> యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
> తదహం భక్త్యుపహృత
> మశ్నామి ప్రయతాత్మనః॥
>
> (గీత-9-26)

అను గీతోక్తి ననుసరించి జీవులు నియతాత్ములై భక్తితోసమర్పించు పత్రపుష్పాదులలో ఏ వస్తువునైన స్వీకరించి భగవంతుడు వారి వారికి తగిన ఫలముల నిచ్చుచున్నాడని గ్రహింపవలెను. "మారుబేహారి" అనుటలోని పరమార్థమిదే.

బలుబేహారి అనుటచే తన వ్యాపారమునకేమాత్రము నష్టము కలుగకుండ, అనగా తన సంకల్పమునకేమాత్రము లోపములేకుండ సమర్థతతో సమస్త జగద్వ్యవహారమును భగవంతుడు నడుపుచున్నాడని తెలియవలెను.

ఇంటిబేహారి అనుటచే 'సర్వభూతాశయస్థితః (గీత-10-20) అన్నట్లు సమస్త జీవుల హృదయములలో అంతరాత్ముడై పరమాత్ముడున్నాడని గుర్తింపవలెను.

(సశేషము)

* * *

## బాలల సంచిక

నవంబర్ నెల సప్తగిరి బాలల ప్రత్యేక సంచికగా వెలువడుతుంది.

సంపాదకుడు.

(26వ పేజీ తరువాయి)

మోక్షా సక్తులగు జిజ్ఞాసువులు. తమసర్వస్వమును భగవదర్పణ మొనర్చి యీశ్వరునితో నభిన్నమును ప్రకటించినచో మోక్షము నందుదు రనెడు పరమార్థము గోపవనితల వృత్తాంతమువలన విదితము. కృష్ణపరమాత్మని లౌకిక అలౌకిక శక్తులతో నీ గోపకాంతల కవసరములేదు. కృష్ణుడు వారికి సౌందర్యరాశి, మధుర ప్రేమాంబుధి. కృష్ణునియెడ వారు ప్రదర్శించిన భక్తి జీవాత్మ పరమాత్మతో నైక్యము నందుటకై చేయుప్రయత్నమే. భాగవతానుసారమిట్టి నిష్కల్మష ప్రేమ భక్తి మానవజీవితమునకు ఉత్తమ లక్ష్యమగుటచేతయునవసరము. మనస్సుహృదయము మాత్రమే గాక శరీరము నందలి సర్వావయవములు ఉజ్జ్వలమగు భక్తిరసముతో నిండి పొంగి పొరలినపుడే జీవుడు పరతత్త్వముయొక్క అనంతసౌందర్యము ననుభవించి యానందింపగలడు. భాగవతము నందలి గోపకాంతల వృత్తాంతమీ సత్యమును చక్కగా చాటుచున్నది అందు ప్రపంచింపబడిన భ్రమరగీతలు. జలక్రీడ, రాసక్రీడ మున్నగునవి యన్నియు మధుర భక్తి సంభరితములు.

ఇచట గోపస్త్రీలు పరకాంతలుగదా! వారితో కృష్ణుడు రమించుట ధర్మబద్ధమా యను సందేహమును కొందఱు వెలిబుచ్చినారు. అందుకు సర్వేశ్వరుడు స్వపర భేద విరహితుడని శుకమహర్షి పలికిన—

"గోపజనములందు గోపిక లందును
సకల జంతులందు సంచరించు
నా మహాత్మునకు పరాంగన లెవ్వరు
సర్వమయుడు లీల సలిపెగాక"

(10–1107)

అనుమాటలు చక్కని సమాధానము.

(సశేషము)

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

# శ్రీ వేదనారాయణస్వామివారి ఆలయం, నాగలాపురం

## ఆలయ కార్యక్రమాలు, ఆర్జిత సేవలు

### ఉదయం

| | | | | |
|---|---|---|---|---|
| సుప్రభాతం | — | 6-00 గం॥ నుండి | 6-30 గం॥ వరకు | |
| విశ్వరూప సర్వదర్శనం | — | 6-30 ,, | 8-30 ,, | |
| తోమాలసేవ | — | 8-30 ,, | 9-00 ,, | |
| సహస్రనామార్చన | — | 9-00 ,, | 9-30 ,, | |
| మొదటిగంట, బలి, శాత్తుమొర | — | 9-30 ,, | 10-00 ,, | |
| సర్వదర్శనము | — | 10-00 ,, | 11-30 ,, | |
| అష్టోత్తరనామార్చన, 2 వ గంట | — | 11-30 ,, | 12-00 ,, | |
| తీర్మానము | — | మధ్యాహ్నం 12-00 గం॥ | | |

### సాయంత్రం

| | | | |
|---|---|---|---|
| సర్వదర్శనం | — | 4-00 గం॥ నుండి | 6-00 గం॥ వరకు |
| తోమాల, అర్చన, రాత్రి కైంకర్యములు | — | 6-00 ,, | 7-00 ,, |
| సర్వదర్శనం | — | 7-00 ,, | 8-45 ,, |
| ఏకాంతసేవ | — | 8-45 ,, | 9-00 ,, |
| తీర్మానము | — | రాత్రి 9-00 గం॥ | |

### ఆర్జిత సేవలు

అర్చన రు. 3-00

హారతి రు. 1-00

# యోగ విజ్ఞానము

యోగమనగా చిత్తవృత్తినిరోధమని పతంజలిమహర్షి అభిప్రాయము. చిత్త వృత్తి నిరోధమునే అష్టాంగ యోగ మందురు. యమ, నియమ, ఆసన, ప్రత్యాహార, ప్రాణాయామ, ధారణా, ధ్యాన, సమాధులు అష్టాంగములు. ఈ అష్టాంగ యోగము పరమోద్దేశము ముక్తియే.

యోగశబ్దము ఉపాయమను నర్థ మునకూడ ఉపయోగింప బడుచున్నది. ఈ ఉపాయమనెడు అర్థమున కర్మ యోగము, భక్తియోగము, జ్ఞానయోగములు చేరును. వీని ఉద్దేశ్యము కూడ ముక్తియే. ఈ ఉపాయములు గీత యందు కృష్ణపరమాత్మచే బోధింపబడినవి. పతంజలి అష్టాంగయోగము వలననూ కర్మ, భక్తి, జ్ఞాన యోగముల వలననూ కలుగు ఫలమునందు భేదమేమి యులేదు.

యోగశబ్దము విస్తృతమైన అర్థముతో భగవద్గీతయందు వాడబడినది.

(1) సమత్వం యోగ ఉచ్యతే॥

కర్మలను ఈశ్వరార్పణముగా జేయుచూ కర్మఫలము నాశింపక, ఫల తృష్ణా శూన్యముగ జేయుచు ఆయా కర్మలందు తనకు లాభనష్టము లేవి కలిగినను సమత్వము కలిగి యుండుట "యోగము" అనబడును. సమత్వము అనగా "గుణసామ్యావస్థ" యనికూడ గ్రహింపవచ్చును. గుణములు సామ్యావస్థకు వచ్చినపుడుగాని 'తృష్ణ' నశింపదు.

2: సమాధావచలాబుద్ధిస్తదా యోగ మవాప్స్యసి॥

బుద్ధిచలింపకుండ నిశ్చలముగ నుండవలెనన్న సమాధిస్థితి కలుగవలెను. బుద్ధిజాడ్యమును నివర్తించి నిశ్చలమొనర్చు ఔషధము సమాధి యొక్కటే. అట్టి సమాధియందు అచంచలమగు బుద్ధినే యోగము (వివేకప్రజ్ఞ) అని కృష్ణపరమాత్మ నిర్వచించెను.

3. "యోగః కర్మ సుకౌశలమ్"

కర్మలను నిపుణముగా జేయుటయే యోగము. అని కృష్ణపరమాత్మ చెప్పియున్నాడు. కౌశలమ్ అనక సుకౌశలమ్ అని ప్రయోగించుటవలన ఎక్కువయైన లేక లెస్సయైన నైపుణ్యము అని అర్థమగును. కర్మలలోని కౌశలమెట్టిది? కర్మయందు అకర్మను అకర్మయందు కర్మనుచూచుట. దీనినే నైష్కర్మ్య మందురు. నైష్కర్మ్యమనగా కర్మలను విడచిపెట్టుటకాదు. బాహ్య కర్మాచరణకు కారణమైన బుద్ధియందు ఫలాపేక్ష లేకుండుట. ఫలాకాంక్ష లేని కర్మ కర్తను సంబంధింపజాలదు. బంధమును కలుగజేయని కర్మలను చేసినప్పటికిని చేయనివాని క్రిందనే జమ. "యోగః కర్మ సుకౌశలమ్" అనుదానిలో నర్థ మిదియే. అంతేకాక పై వాక్యములో కర్మ భక్తి జ్ఞానయోగములు అంతర్భూతములై యున్నవి. కర్మభక్తి జ్ఞానములు మూడున్ను పరస్పరాశ్రయణీయములు. అవి వ్యవహారముచేత వేర్వేరుగా కనుపించుచున్నవి. ఫలకాంక్ష లేకుండ కర్మ యోగము ఎట్లు ఆచరణీయమగును?

మనము ఆశింపకున్నను మనచే చేయబడు కర్మలకు ఫలములేకుండ పోదు ఫలకాంక్షారహితమైన కర్మాచరణము నకు భక్తియోగము కావలసియున్నది. భక్తిహీనునకు నిష్కామకర్మయోగము ఆచరణలో కష్టసాధ్యము. భక్తునకు సులభము. భక్తుడు తన సర్వకర్మలను భగవంతునియందు సమర్పించును. సమస్తకర్మలనేల? తనరక్షణ భారమును కూడ భగవంతునికే విడిచిపెట్టును. అందుచేత కర్మయందు అకర్మను చూచుట భక్తునకు సహజము. భక్తి కలుగవలెనన్న, జ్ఞానములేనిదే కలుగదు.

శ్రీ మంచికంటి తిరుపతి వేంకటేశ్వర్లు

ప్రత్తిపాడు

భక్తి కలుగుటకుముందు స్వస్వరూప జ్ఞానము, పరమాత్మజ్ఞానము కలిగియుండవలెను. భగవంతుని యొక్క సర్వజ్ఞత్వము తనయొక్క అహంకారము, కించిజ్ఞత్వము తెలిసికొనినచో జీవునిలోని అహంకారము నశించును. అహంకారము నశించినగాని బుద్ధినిశ్చలత్వ మొందదు. బుద్ధినిశ్చలత్వ మునకే సమాధి ఏర్పడినది. ఏ సమాధి అభ్యాసముచే బుద్ధి నిశ్చలత్వ మేర్పడుచున్నదో అట్టిస్థితి భక్తియోగము నాశ్రయించుట వలన కూడ కల్గుచున్నది కావున జ్ఞానమునకును పరాభక్తికిని భేదములేదు. కర్మ, భక్తి జ్ఞానముల యొక్కకలయికయే యోగము. కర్మ జ్ఞానముల రెంటియొక్క కలయికయే యోగమని కొందరిమతము. భక్తియను నది జ్ఞానములో భాగముగా వీరు గ్రహింతురు.

# భక్తివినాసన్మార్గముగలదే?

(గత సంచిక తరువాయి)

'బ్రహ్మదేవుడు కడిగిన జలము లేపాద సన్నిధి నుండి పుట్టినదియై ప్రవహించ శిరమునదాల్చి శివత్వమును రుద్రుడు పొందెనో, ఏ చరణములను స్మరించి నంతనే పాపసంఘముల విం్రదుని వజ్రా యుధమువలె నాశనముచేయునో. అట్టి శ్రియఃపతిచరణములనే సదా ధ్యానింతును.'

శ్రీమచ్ఛంకర భగవత్పాదులుగూడ నీ చరణసేవ సంసారసాగరమును తరియింప జేయుగాకయని అభివర్ణించినారు:

'అపార సంసార సముద్రమధ్యే
సమ్మజ్జతోమే శరణం కిమస్తి?
గురో కృపాళో కృపయా వదైతద్
విశ్వేశ పాదాంబుజ దీర్ఘనౌకా॥'

"హరిచరణా స్మరణానందమునకు సాటివచ్చునదేదియులేదు. దానిని మించి నదియులేదు. శంఖచక్రాది ఆయుధములతో శుభలక్షణుడైయున్న ఆ హరిచరణ కమలములే నిత్యములు. వాటిని తప్ప వేరెయుంగనని కులశేఖరుల వాణి.

'సరసిజ నయనే సశంఖ చక్రే
మురభిది మా విరమస్వ చిత్తరన్తుమ్।
సుఖతరమపరం నజాతుజానే
హరిచరణ స్మరణామృతేన తుల్యమ్॥
—ముకుందమాల

## అర్చనము

'నమామి నారాయణ పాదపంకజం
కరోమి నారాయణ పూజనం సదా।
వదామి నారాయణ నామ నిర్మలం
స్మరామి నారాయణ తత్త్వమవ్యయం॥
—ముకుందమాల

శ్రీమన్నారాయణ పదపంకజములకు నమస్కరింతును. నిత్యము నారాయణుని పూజనే చేసెదను. నిర్మలమైన నారాయణ నామమునే పలికెదను. శ్రీమన్నారాయణ పరతత్త్వమునే స్మరింతునని శ్రీ కుల శేఖరాళ్వారులు కృప జేసినారు

అర్చనమున పురుషోత్తముని దివ్య మంగళమూర్తిని షోడశోపచారములతో సేవించుట జరుగుతుంది అర్ఘ్యపాద్యాదులచే పాదసేవనము. అంగన్యాసకరన్యాస హృదయాది న్యాసములచేతను, సహస్ర నామాదులచే అర్చన చేయుటచేతను కీర్తన ఫలమును మూల మంత్ర జపముచే స్మరణ ఫలమును పొందుచున్నారు. అంతేగాదు కమనీయ విగ్రహ సందర్శనచే నేత్రములును, సుమధురగంధ వాసనలచే నాసికయును, నామార్చనచే జిహ్వాయు, తచ్ఛ్రవణముచే శ్రోత్రేంద్రియములును, వందనముచే కరద్వయమును, ప్రదక్షిణలచే చరణములు, సాష్టాంగ ప్రణామముచే సర్వాంగములును పునీతములగు చున్నవి.

నిర్గుణుడు, నిరాకారుడు నిరామయుడు నగు పరమాత్మకు గుణాకారారోపణ చేసిన భక్తుడు ఆ గుణ సందర్శనము చే తద్రూపమును హృదయాంకమున ప్రతిష్ఠించిన మానసిక పూజకుపక్రమించుటకీ యర్చనమే తొలిమెట్టు.

'పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః' అని నారద భక్తిసూత్రము. పూజ వలన అనురాగమేర్పడును. తరువాత ఆ యనురాగమే పరమాత్మునికి, జీవునికి మధ్య అను సంధానకర్త కాగలదు.

'ధృతోర్ధ్వపుండ్రః పరమేశితారం
నారాయణం పూజయతి స్మభక్త్యా।
అర్ఘ్యాదిభిః పౌరుష సూక్తమంత్రైః
సంప్రాప్ను యాద్విష్ణు పదం మహాత్మా॥

'అర్ఘ్యపాద్యాది షోడశోపచారములతో పురుషసూక్త విధానముగ నారాయణు నర్చించుచు మహాత్ములు విష్ణుపదమును పొందుదురని వైఖానస వాక్యము.

వారివారి వర్ణాశ్రమ ధర్మాను సారము, యోగ్యతానుసారము భగవంతునర్చించి తత్ప్రాప్తినంద వచ్చునని గీతా వాక్యము.

శ్లో॥ యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః॥
—భగవద్గీత—18—46

చంచలమైన మనసును నిశ్చలముగా నుంచుట సామాన్య మానవునికి సాధ్యము కానిపని. ఐహిక విషయలంపటుడైన

---

శ్రీ సింగనమల్ల రాధాకృష్ణయ్య
సిమెంటునగర్.

---

మానవుడు పరమాత్మయందు చిత్తమును కేంద్రీకరింప జేయుటకు యోగమొక్కటే సాధనము. చిత్తవృత్తుల నిరోధించుశక్తి యోగవిద్యకేవున్నది. (యోగః చిత్తవృత్తి నిరోధః అనిపాతంజల సూత్రము.) కాని మానవులందరు యోగులు కాలేరు. అట్టి వారి గతియేమి? అధోగతియేనా? అట్టి సామాన్యులనుద్ధరించుటకే భగవంతుడాగమ శాస్త్రములను మానవులకు ప్రసాదించినాడు. ఆగమ ప్రతిపాద్యమే అర్చామూర్తి నిర్గుణము, నిరాకారమైన పరతత్త్వము యొక్క సగుణ స్వరూపము. మానవుని రూపము పంచభూతాత్మకము. పంచభూతములు పంచతన్మాత్రాత్మకములు, అవి త్రిగుణాత్మకములు, త్రిగుణములు ప్రణవాత్మకలు. ప్రణవమే పరబ్రహ్మము. నాదబ్రహ్మము. ఆధునిక వైజ్ఞానికులు మానవుని రూపమునకు రూప రహితస్థితిని కల్పించి ఆకాశ తత్త్వమున

# శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానము, తిరుమల

## వివిధ ఆర్జిత ఉత్సవముల ధరల వివరములు.

### దర్శనములు

1. స్పెషల్ దర్శనము రు. 25

ఈ టికెట్టు తిరుమలలోనూ, దేశంలో ఆంధ్రాబ్యాంకువారి వివిధశాఖలలోను లభించును. ఈ టిక్కెట్టు వారిని సుప్రభాత సమయంలోనూ, సర్వదర్శన సమయంలోను అనుమతించటం జరుగుతుంది. ఈ టిక్కెట్టు వారిని సర్వదర్శన సమయంలో ధ్వజ స్తంభము వద్ద గాక మహా ద్వారంవద్ద క్యూలో చేర్చటం జరుగుతుంది.

### సేవలు

| | | |
|---|---|---|
| 1. | ఆమంత్రణోత్సవము | రు. 200 |
| 2. | అభిషేకము (పులికాపు సేవ) | రు. 450 |
| 3. | గంబురగిన్నె | రు. 250 |
| 4. | పునుగుగిన్నె | రు. 100 |
| 5. | జాఫ్రాగిన్నె | రు. 100 |
| 6. | కస్తూరిగిన్నె | రు. 100 |
| 7. | సహస్రకలశాభిషేకము | రు. 2500 |
| 8. | తిరుప్పావడ | రు. 5000 |
| 9. | కోవిల్ ఆళ్వారు తిరుమంజనం | రు. 1745 |
| 10. | ఐనా మహల్లో డోలోత్సవం | రు. 1000 |

### ఉత్సవములు

| | | |
|---|---|---|
| 1. | వసంతోత్సవము | రు. 2500 |
| 2. | కల్యాణోత్సవము | రు. 1000 |
| 3. | బ్రహ్మోత్సవము | రు 750 |

### వాహనములు

1. సర్వభూపాలవాహనములో వజ్రకవచ సేవ 72 + 1 (హారతి) రు, 73
2. బంగారుగరుడ, కల్పవృక్ష, పెద్దశేష, సర్వభూపాల, సూర్యప్రభ ఒక్కొక్కదానికి 62 + 1 (హారతి) రు. 63
3. వెండిగరుడ, చిన్న శేష, చంద్రప్రభ, ఏనుగు, గుఱ్ఱం, హంస, హనుమంత వాహన సేవ ఒక్కొక్కదానికి 32 + 1 (హారతి) రు. 33

### అన్నప్రసాదములు (కొలుసోల)

| | | |
|---|---|---|
| 1 | దధ్యోదనము | 40 |
| 2. | పులిహోర | రు. 50 |
| 3. | పొంగలి | రు. 55 |
| 4. | చక్కెరపొంగలి | రు. 65 |
| 5. | సాకరబాత్ | రు. 85 |
| 6. | కేసరిబాత్ | రు. 90 |
| 7. | పాయసము | రు. 85 |
| 8. | సీరా | రు. 155 |

### పడుల ప్రసాదములు

| | | |
|---|---|---|
| 1. | అప్పము | రు. 230 |
| 2. | లడ్డు | రు. 450 |
| 3. | వడ | రు. 250 |
| 4. | పోళి | రు. 225 |
| 5. | దోసె | రు. 100 |
| 6. | తేనెతొళ | రు. 200 |
| 7. | సుఖియం | రు. 200 |
| 8. | జిలేబి | రు. 450 |

### నిత్య సేవలు

| | | |
|---|---|---|
| 1. | నిత్యకర్పూర హారతి | రు. 21 |
| 2. | నిత్యనవనీత హారతి | రు. 42 |
| 3. | నిత్య అర్చన | రు. 42 |

షరా :— సహస్ర కలశాభిషేకము ప్రతి బుధవారమునను, తిరుప్పావడ ప్రతి గురువారమునను జరుగును. మిగిలిన వివరములకు ఈక్రింది చిరునామాకు వ్రాయవచ్చును.

1. ఆమంత్రణోత్సవమునకు 5 గురికి మారుగా ఇద్దరికి మాత్రమే అనుమతి 3, 4 సేవలకు ఇద్దరికి, 5, 6, 7 సేవలకు ఒక్కొక్కరికి మాత్రమే అనుమతి.
2. ప్రతిదినం మధ్యాహ్నం 1-00 గం॥ 8-00 గం॥ లోపల సర్కారు లేదా ఆర్జిత కళ్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, వాహనసేవలు, సర్కారు డోలోత్సవం (ఉయ్యాల) (సర్కారు లేక ఆర్జిత ప్లవోత్సవం, మంగళవారంనాడు) జరుగుతవి.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,
తిరుమల తిరుపతి దేవస్థానం
తిరుపతి 517501

(29వ పేజీ తరువాయి)

కలిపి తిరుగ యంత్ర విశేషము ద్వారా తద్రూపదర్శనము చేయుచున్నారు. దూర దేశములకు, దేశాంతరములకు, ఖండాంతరములకు తుదకు గ్రహాంతరములకు కూడా మానవుని బింబము ప్రయాణము చేసి సాక్షాత్కరించుచున్నది. ఇదే సూత్రమునే ఆగమ శాస్త్రములు ప్రతిపాదించి నిర్గుణుడగు పరబ్రహ్మమునకు గుణములను రూపమును కల్పించుచున్నవి. గుణయుతుడైన భగవంతు నారాధించినచో నిర్గుణతత్త్వారాధన ఫలితము కలుగదని చెప్పువారి మాటలు సత్యదూరములు. మానవుడేరూపముతో ఆరాధించినను విరాట్పురుషునికే చెందును. మానవునిరుచ్యనుసారము పరతత్త్వము నారాధించవచ్చును. అందుకే భగవంతుడు

'సహస్రశీర్షాపురుషః సహస్రాక్షస్సహస్రపాత్ ।
స భూమిం విశ్వతోవృత్వా। అత్యతిష్ఠద్దశాఙ్గులమ్ ॥

అని వేదమునందు కీర్తించబడినాడు. సహస్రాధిక స్వరూపములను కల్గిన పరతత్త్వము నే రూపభావనతో ఆరాధించిన ఆరూపముతోనే సాక్షాత్కరించును. కనుక విగ్రహారాధనము వేదవిరుద్ధమని, నింద్యమని యనువారల పలుకులు సత్యదూరములని ఆస్తిక మహాశయులు గ్రహింతురుగాక.

శ్లో॥ శ్రీవిష్ణోరర్చనం యేతు ప్రకుర్వన్తి నరా భువి ।
తే యాన్తి శాశ్వతం విష్ణోరానందం పరమం పదమ్ ॥
—శ్రీవిష్ణురహస్యము.

## వందనము

బద్ధేనాంజలినా నతేన శిరసా గాత్రైః సరోమోద్గమైః
కంఠేన స్వరగద్గదేన నయనే నోద్గీర్ణ బాష్పామ్బునా ।
నిత్యం త్వచ్చరణారవింద యుగల ధ్యానామృతాస్వాదినాం
అస్మాకం సరసీరుహాక్ష ! సతతం సమ్పద్యతాం జీవితం ॥
—ముకుందమాల

'ఓ కృష్ణా ! నిరంతరము నీ పాదములనే ధ్యానించుచు సంతోషముతో చేతులొగ్గి నమస్కరించుచు అవనత శిరస్కులమై పులకితాంగులమై, గద్గద కంఠములతో కన్నులందానంద బాష్పములు జాలువార నీధ్యానామృతము నాస్వాదించు నటుల కృపచేయుము '

వందనము భక్తివిశేషమేగాదు. భారతీయ సంస్కృతి చిహ్నము. మన సంస్కృతీ సంప్రదాయములన్నియు నీ నమస్కారము నందిమిడియున్నవి. ఆధ్యాత్మికముగా జీవుని శరణాగతి చిహ్నమే యీ వందనము. జీవుడు ఈశ్వరుని శరణుగోరుచు తన్ను దానర్పణము చేయుచు ప్రణమిల్లుట భారతీయ తత్త్వము. ఏసిద్ధాంతానుసారియైనను వందనము నంగీకరించును. జైనబౌద్ధులు సహితము వందనము భక్తి విశేషముగా నంగీకరించి తమ సంప్రదాయమున కలుపుకొనినారు.

'నమో అరిహంతాణం
నమో సిద్ధాణం
నమో ఆయరియాణం
నమో ఉవజ్ఝాయాణం
నమోలోయె సవ్వసాహూణం'

అని జైనులును

'బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి'

అని బౌద్ధులును శరణాగతి పురస్సరముగ ప్రణమిల్లుట సంప్రదాయము.

'అహం బ్రహ్మాఽస్మి' అని బోధించు అద్వైతులును జీవశరణాగతి ప్రతిపాద్యమైన వందనమును స్వీకరించినారు.

శ్లో॥ నమోఽస్తు నాళీక నిభాననాయై
నమోఽస్తు దుగ్ధోదధి జన్మ భూమ్యై ।
నమోఽస్తు సోమామృత సోదరాయై
నమోఽస్తు నారాయణ వల్లభాయై॥
— కనకధారా స్తవము

(సశేషము)



(10 వ పేజి తరువాయి)

మితులైవున్నారు. 1978 లో ప్రారంభమైన ఈ పథకానికి రాష్ట్రప్రభుత్వం తన వంతు సహాయంగా ఏటా 53 వేల రూపాయల గ్రాంటును మంజూరు చేస్తోంది.

చేతిపనులద్వారా పూర్‌హోమ్‌లోని రోగులు తయారుచేసిన వస్తువుల్ని బయట విక్రయించి తద్వారా వచ్చేరాబడిని ఆయా పేషంట్లపేరుతో బ్యాంకులలో డిపాజిట్ చేయించడానికి ఆలోచిస్తున్నట్లు దేవస్థానం కార్యనిర్వహణాధికారి శ్రీ పి వి ఆర్. కె. ప్రసాద్‌గారు చెప్పారు. ఈ సంస్థను స్వయంపోషకం చెయ్యాలని వారు సంకల్పిస్తున్నారు. పూర్‌హోమ్ పేషంట్లు హస్తకళలద్వారా ఈ ఏడాది దాదాపు 20 వేలు విలువచేసే వస్తువుల్ని ఉత్పత్తి చెయ్యడం చూస్తే, ఈ పథకం అక్కడ ఎంతగా విజయవంతమైందో అర్థమౌతున్నది.

## లోటులేని ఆప్యాయతా, ఆదరణా

ఇక్కడ వుంటున్న కుష్ఠురోగులలో స్త్రీ పురుషులతోబాటు పసిపిల్లలుకూడా వున్నారు అందరికీ ఇక్కడ అరమరికలు లేని ఆదరణ లభిస్తోంది. రోజుకు రెండు పూటలా రుచికరమైన భోజనం, పరిశుభ్రమైన వస్త్రాలు. వారానికి రెండుసార్లు శ్రీవారి ప్రసాదాలు వీరికి అందుతూ వున్నాయి. వీరి మానసిక ఆహ్లాదం కోసం వార్తాపత్రికలు, రేడియోలు, వారం వారం సినిమా ప్రదర్శనలు వుంటాయి. ఇటీవలనే కార్యనిర్వహణాధికారి ఇక్కడొక టెలివిజన్ సెట్‌ను కూడా ప్రారంభించారు. కుష్ఠురోగుల పట్ల సానుభూతిగల ఇద్దరు మెడికల్ ఆఫీసర్లూ, ఇద్దరు డాక్టర్లు, నలుగురు స్టాఫ్ నర్సులు నిరంతరం వీరి పరిస్థితిని ఒక కంట కనిపెడుతూవుంటారు. అవయవాలు కోల్పోయిన రోగులకొరకు ఇక్కడ ఒక కృత్రిమ అవయవ కేంద్రాన్ని ప్రారంభించే వుద్దేశంకూడా దేవస్థానానికి వుంది.

ఈ విధంగా కుష్ఠురోగుల బాధానివారణకు ఉడతభక్తిగా దేవస్థానం తన ప్రయత్నాలు తాను చేస్తూ వుంది. ఇంత చేసినా కుష్ఠురోగ విముక్తుడు సమాజంలో ఒక వ్యక్తిగా ఇమడలేకపోతే ఈ శ్రమంతా వృధా అవుతుంది. కుష్ఠువ్యాధి విముక్తులకు పునరావాసం కల్పించే బాధ్యతలో మనమంతా భాగస్వాములమైనప్పుడే ఈ సాంఘిక సమస్యకు తుది పరిష్కారం దొరకగలదు. *

(5 వ పేజీ తరువాయి)
స్వామి యొడిలోనే, ఏ యాయుధముల చేతనోగాక స్వామి నఖములచేతనే మరణమును సంపాదించుకొన్న హిరణ్యకశిపుని కంటె వీడేమి గొప్ప; రామ రావణుల కడపటి దినము యుద్ధములో "జేతవ్య మితికాకుత్స్థః మర్తవ్య మితి రావణః" అని యాదికవిచే పరమ పరోక్ష భక్తుడుగ పేర్కొనబడిన రావణుని కంటె వీడేమి గొప్ప? శ్రీకృష్ణుని చక్రముచేత తెగి తన తేజమునందెలయింప చేసిన శిశుపాలుని కంటె వీడేమి గొప్పయని, వీని ప్రీతినో జ్ఞాపకమునో వరప్రసాదమునో లోకము పాటింపవలెను? ఏ రాక్షసుని కయినను జన్మ తిథి నక్షత్రములు గుర్తింపబడినవా? లేక నిర్యాణ తిథినక్షత్రములుగాని గుర్తింపబడినవా? వీనికి మాత్రము ఈ ప్రత్యేక అవకాశమెక్కడిది? కాదన్నచో, శ్రీహరి వరాహావతార సందర్భమున ఆ స్వామి కరస్పర్శచే భూదేవికి పుట్టినవాడు వీడు. హిరణ్యాక్ష వధానంతరము గూడ ఉడుగని కోపముతో స్వామి భూమిని పైకెత్తెను; ఆ యాగ్రహసమయ స్పర్శచే పుట్టిన వీనికి అవలక్షణములే గలిగి ఆ హరి చేతనే నమసినాడు.

ఈ నరకాసుర వధ కథను చెప్పిన పురాణములు ప్రధానముగ మూడు. 1 విష్ణు పురాణము 2. భాగవతము 3. హరివంశము అందు విష్ణుపురాణములో నరకాసుర వధానంతరము భూదేవి. నరకునిచే హరింపబడిన అదితి కుండలములను గైకొని స్వామిని జేరి "యదాహముద్ధృతా నాథ త్వయా సూకరమూర్తినా। త్వత్స్పర్శ సంభవః పుత్ర స్తథాఽయ మయ్యాజాయత॥ పం-23. సోఽయం త్వయైవ దత్తోమే త్వయైవ వినిపాతితః। గృహాణ కుండలే చేమే పాలయాస్యచ సంతతిమ్। (పం 24) అని నిర్దాక్షిణ్యముగ చెప్పి, వీని కొడుకు భగవదత్తుడున్నాడు; వానిని కాపాడుమని వేడుకొన్నది. తరువాతి రెండుగ్రంథములు నంతే. కావున నరకుని ప్రీతి, నరకుని

---

తిరుపతిలో దేవస్థాన కాటేజీలు
దినసరి అద్దెలు

* * *

| కాటేజీ పేరు | రోజువారీ అద్దె |
|---|---|
| **శ్రీ శ్రీనివాస సత్రం** | |
| 1) రెండు పడకలు, బాత్‌రూమ్ లావేటరీ గల పై అంతస్థు గదులు. | — రు 12—00 |
| 2) నాలుగు పడకలు, బాత్‌రూమ్, లావేటరీగల క్రింది అంతస్థు గదులు | — రు. 15—00 |
| 3) ఒకే పడక, బాత్‌రూమ్, లావేటరీ గల ఎక్స్‌టెన్షన్ రూములు | — రు. 10—00 |
| **శ్రీ వేంకటేశ్వర అతిథి గృహం** | |
| రెండు పడకలు, బాత్‌రూమ్ లావేటరీ సౌకర్యాలు గల గదులు | — రు. 16—00 |
| **పద్మావతి అతిథి గృహం** | |
| 1) రెండు పడకలు, బాత్‌రూమ్, లావేటరీ సౌకర్యాలుగల ఎర్ కండిషన్డ్ గదులు | — రు. 40—00 |
| 2) రెండు పడకలు, బాత్‌రూమ్, లావేటరీ సౌకర్యం గల డబుల్ రూమ్‌లు | — రు. 30—00 |
| 3) ఒకేపడక, బాత్‌రూమ్, లావేటరీ సౌకర్యం గల సింగల్ రూములు | — రు. 20—00 |

* దేవస్థాన ధర్మసత్రాలలో పడకలు వగైరా ఏర్పాటులు లేని వసతి సౌకర్యం ఉచితమని గ్రహించ గోరుతున్నాము.

**కార్యనిర్వహణాధికారి.**

జ్ఞాపకము, నరకుని కిచ్చిన వర ప్రసాద మిత్యాదులేవీ యెక్కడనూ లేవు; అవి కారణముగ నీ పండుగ వానికి సంబంధించి నదీగాదు. ఇందలి 'నరక' పదము భ్రాంతిని గల్గించినది; చిత్రచిత్ర దీపస్థానమున టపాకాయలు నిలిచినవంతే.

మరి నేను చెప్పిన 'నరక' (పాపపల) ప్రాయశ్చిత్తముగ ఆశ్వయుజ కృష్ణ చతుర్దశి యందుషఃకాలమున స్నానము, యమ తర్పణమును. అలక్ష్మినిస్సరణ సూచకముగ లక్ష్మీపూజ, దీపమాలిక లుంచవలె ననుటకు :—

1. "ఆశ్వయుక్కృష్ణ పక్షస్య చతుర్దశ్యాం విధూదయే తిల తైలేన కర్తవ్యం స్నానం నరకభీరుణా"

2. 'కర్తవ్యం మంగళస్నానం నరైర్నిరయభీరుభిః'

3. చతుర్దశీ చాశ్వయుజశ్చ కృష్ణాస్వాత్యృక్షయుక్తాచ భవేత్ప్రభాతే। స్నానం సమభ్యజ్య నరైస్తు కార్యం సుగంధి తైలేన విభూతికామైః"

4. "ఆశ్వినస్యాఽసితే పక్షే చతుర్దశ్యాం విధూదయే కర్తవ్యం తిల తైలేన నరైర్నియ భీరుభిః"

ఇత్యాదులు కొల్లలుగ ప్రమాణింప వచ్చును. మరియు

"తైలే లక్ష్మీర్జలే గంగా దీపావళ్యాం తథా వసేత్"

"అపామార్గం భ్రామయిత్వా" "యః కుర్యాద్యమతర్పణమ్"

ఇత్యాది స్మృతి వాక్యములును లేకపోలేదు. ఆశ్వీన కృష్ణ చతుర్దశి, అమావాస్య కార్తిక ప్రతిపత్తు ఈ మూడింటికి కలిపియే దీపావళి యని నామకరణమట. "దీపావళీతి సంజ్ఞం స్యా ద్భూతాది త్రిదినం క్రమాత్" అని ప్రమాణము.

ఈ నరక చతుర్దశినాడు ఉషఃకాలమున మంగళస్నానము. ఆనాటి పగలు యమ తర్పణము ఆనాటి భోజనములో మినప ఆకుకూర, ప్రదోషమునందు లక్ష్మీపూజ దీపములు చిత్ర విచిత్రములుగ నుంచుట యనునవి ప్రధానములు. ఈ చతుర్దశీ అమావాస్యల యందు ప్రదోష సమయమున కొఱవి కట్టెలతో తమ పితృ దేవతలకు మార్గ దర్శనము చేయవలయునని యున్నది. పితృపక్షమున వచ్చిన పితరులు, మనము చేసిన శ్రాద్ధతర్పణాదులచే తృప్తులై వృశ్చికమాసము వచ్చినచో వారు మరల యమలోకమున నుండవలయును. గాన పైకి ప్రయాణమగుదురు. అట్టితరి పితృ ప్రీతికరమైన తులా మాస కృష్ణ చతుర్దశీ అమావాస్యలందు వారికి మార్గదర్శనార్థమై కొరవులు త్రిప్పి చూపవలెను. యమతర్పణమునకు మంత్రము:—

"యమాయ ధర్మరాజాయ మృత్యవే చాంతకాయచ
వైవస్వతాయ కాలాయ సర్వభూత క్షయాయచ॥
ఔదుంబరాయ దధ్నాయ నీలాయ పరమేష్ఠినే
వృకోదరాయ చిత్రాయ చిత్రగుప్తాయవై నమః॥"

ఈ పదునాల్గు పేర్లతో ఒక్కొక్కదానికి మూడేసి దోసిళ్ళ వంతున నూగులు చేర్చి సవ్యముగనే తర్పణము చేయవలయును. యముడు ప్రేతాధిపతి గాన నూగులు, దేవత గావున సవ్యముగను తర్పణము చేయవలయును. తండ్రి బ్రతికి యున్న వారు గూడ యమ-భీష్మ తర్పణములు చేయవచ్చును. చేయవలెను.

"జీవత్పిత ఽపి వా కుర్యాత్తర్పణం యమ భీష్మయోః" అని ప్రమాణము.

పై మూడు దినములందును ప్రదోష (సాయం) సమయములందు "దీపవృక్షాశ్చ కర్తవ్యాశ్శక్త్యా దేవ గృహేషుచ"

అనియున్నది. అందువలననే ఇదిదీపావళి.

ఈ నాటికిని ఘూర్జర రాష్ట్రమునందు లక్ష్మీపూజ. కొంత దక్షిణాదిన కొఱవులు చూపుట, ఆంధ్రదేశ మందచ్చటచ్చట యమతర్పణము నుండుట గమనింపదగిన విషయము లనుకొందును.

కాలముమారి దీపములకు కొరవులకు బదులుగ టపాకాయలు, దేవతా పితృతిథికి బదులు కేవలము పండుగ దినముగ, పండుగైనందున అల్లుండ్ర కధికారము మొదలగునవి సిద్ధించినవి.

(1974నవంబర్ సప్తగిరినుండి పునర్ముద్రితం)

(8 వ పేజీ తరువాయి)
పొంది, ఉద్యానవనములో ప్రవేశించి పారిజాత వృక్షమును పెకలించుటకు ప్రయత్నించగా నందనవనపాలకులు వారించారు. వారికి కృష్ణుడు జవాబీయబోతూండగా, ప్రియుని కరసంజ్ఞచే వారించి,

"వినుడు సురేశ్వరు వనపాలకులు! వార్థి
బొడమిన యీదివ్య భూరుహమున
కింద్రాణి యెవ్వతె యిద్రుండు నెవ్వడు
తోడి యిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె నతడె చేకొనుగాక
లేకతేర యిదియేమి యొకరిసొమ్మె
యిదె నాదు విభునిచే నీవదాన్య నగంబు
నొడి యించుకొని యేగు చున్నదాన

తే. బలుకు లేటికిఁ దా వీరపత్నియేని
మీశచీదేవి తనదు ప్రాణేశుఁడైన
మఘవు నిట పంపి సత్యభామావిధేయు
వలన మరలంగఁగొను బెపో వాసితనము

వనపాలకుల కవి గర్వోక్తులుగా కన్పించినను అవిగర్వోక్తులు కావు. ఆమె అట్లు తూ.చ తప్పకుండ చేయించుకొన జాలిన దిట్ట. కృష్ణుని భార్యలందరిలో ఆమె "సౌందర్యవతి, మానవతి, మహనీయ సౌభాగ్యవతి" అందువలననే సత్యభామా విధేయుడు తన పతి అని చాటుకున్నది.

తన పంతము నెగ్గించుకొనిన సత్యను నారదుడు పొగిడి, పుణ్యక వ్రతము చేయమని ప్రేరేపించెను, దీని వల్ల భర్తను తానొక్కతే పొందవలెనను ఆకాంక్షతో సత్యసిద్ధ పడెను. ఇది ఒక నెల వ్రతము. పరిచారికలతో కాకుండ సత్యభామ సవతుల యిండ్లకు వెళ్ళి వారిని పిలచి పూజించి సత్కరించాలి. సత్య అభిమానమును చంపుకొని ఆ విషమ వ్రతానుష్ఠానమునకు సిద్ధపడింది. సత్యభామకు భర్త యెడగల ప్రేమకు పరీక్ష. భర్తప్రేమను పొందుటకు ఎట్టి సాహసమైన, త్యాగమైనచేయు గుణమామెలో వున్నది ఈ వ్రతము వలన సత్యప్రేమ పునీతమైనది. భర్త అనురాగము కన్న సత్యభామ దృష్టిలో మరేమీ ఎక్కువకావు.

"కలకాల మొక్కగతిఁబూ
నలలో దారంబు మాడ్కి నతి మదిలోనఁ
మెలగెడు పురుషుడుఁగలుగుట
తొలి జన్మము నోము ఫలము తోయజనేత్ర!

అనిభావించింది. అది ప్రేమకుపరాకాష్ఠ. దాని నందుటకు అభిజాత్యాహంకారములను, ఈర్ష్యాద్వేషములను పారిజాత వాంఛను తృణప్రాయముగ త్యజింప కల్గిన పతివ్రత సత్యభామ.

పుణ్యక వ్రతము వల్ల సత్యభామకు గర్వభంగమైనదని కొందరిభావన. కానీ, భర్తను సదక్షిణా యుతముగ ధారవోసి, తన దగ్గరున్న ధనకనకవస్తు సమృద్ధినిచ్చి ప్రియుని మరలకైకొనుటలో ఆమెయే విజయాన్ని పొందినదని చెప్పవచ్చును.

ఆంధ్రప్రబంధాలలో మణిహారము పారిజాతాపహరణం కాగా, అందులో నాయికమణి సత్యభామ.

*

---

# శ్రీ వెంకటేశ్వరస్వామివారి దేవస్థానము తిరుమల

## 1–3–79 నుండి

## నిత్యపూజ, దర్శనాదికముల కార్యక్రమము

### శని, ఆది, సోమ మరియు మంగళవారములు

ఉదయము 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతము
,, 3–30 నుండి 3–45 వరకు శుద్ధి
,, 3–45 నుండి 4–30 వరకు తోమాలసేవ
,, 4–30 నుండి 4–45 వరకు బంగారు వాకిలివద్ద కొలువు: పంచాంగ శ్రవణం,
,, 4–45 నుండి 5–30 వరకు మొదటి అర్చన
,, 5–30 నుండి 6–00 వరకు మొదటిఘంట బలి మరియు శాత్తుమొర
, 6–00 నుండి మ 12–00 వరకు సర్వదర్శనము
మధ్యాహ్నం 12–00 నుండి 1–00 వరకు రెండవఅర్చన,(ఏకాంతం)
,, 1–00 నుండి 8–00 వరకు సర్వదర్శనం
రాత్రి 8–00 నుండి 9–00 వరకు శుద్ధి, రాత్రికైంకర్యము
,, 9–00 నుండి 12–00 వరకు సర్వదర్శనం
,, 12–00 నుండి 12–30 శుద్ధి

12–30 ఏకాంతసేవ

### గురువారము

### తిరుప్పావడ

ఉదయము 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతం
,, 3–30 నుండి 3–45 వరకు శుద్ధి
,, 3–45 నుండి 4–30 వరకు తోమాలసేవ.
,, 4–30 నుండి 4–45 వరకు బంగారువాకిలివద్ద కొలువు మరియు పంచాంగ శ్రవణము
,, 4–45 నుండి 5–30 వరకు మొదటి అర్చన,
,, 5–30 నుండి 6–00 వరకు మొదటిఘంట, బలి శాత్తుమొర
,, 6–00 నుండి 8–00 వరకు సళ్ళింపు, 2 వ అర్చన (ఏకాంతం), తిరుప్పావడ, అలంకరణం, ఘంట ఇత్యాది
,, 8–00 నుండి రాత్రి 8–00 వరకు సర్వదర్శనం

సాయంకాలం 8–00 నుండి 10–00 { వరకు శుద్ధి ఇత్యాది / పూలంగి సమర్పణ / రాత్రి కైంకర్యము, ఘంట }

రాత్రి 10–00 నుండి 12–00 వరకు పూలంగిసేవ
,, 1 –00 నుండి 12–30 వరకు శుద్ధి
,, 12–30 ఏకాంతసేవ

### బుధవారము

### సహస్రకలశాభిషేకం

ఉదయం 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతము
,, 3–30 నుండి 3–45 వరకు శుద్ధి
,, 3–45 నుండి 4–30 వరకు తోమాలసేవ
,, 4–30 నుండి 4–45 వరకు బంగారువాకిలివద్ద కొలువు పంచాంగశ్రవణం
,, 4–45 నుండి 5–30 మొదటి అర్చన
,, 5–30 నుండి 6–00 మొదటిఘంట, బలి, శాత్తుమొర
,, 6–00 నుండి 8–00 సహస్ర కలశాభిషేకము
,, 8–00 రాత్రి 8–00 వరకు సర్వదర్శనం
రాత్రి 8–00 నుండి 9–00 వరకు శుద్ధి ఇత్యాది
,, 9–00 నుండి 12–00 వరకు సర్వదర్శనం
,, 1 –00 నుండి 12–30 వరకు శుద్ధి
రాత్రి 1. -30 ఏకాంతసేవ

### శుక్రవారము

### అభిషేకము

ఉదః 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతము
,, 3–30 నుండి 5–00 వరకు సళ్లింపు మరియు నిత్యకట్ల కైంకర్యములు (ఏకాంతము)
,, 5–00 నుండి 7-00 వరకు అభిషేకము (రు. 450/- రు.250; రు. 100/– వారికి మాత్రమే ప్రవేశం
,, 7–00 నుండి 8–30 వరకు సమర్పణము
,, 8–30 నుండి 9–30 వరకు తోమాలసేవ మరియు అర్చన (ప్రత్యేకం) ఘంట, బలి, మరియుశాత్తుమో
,, 9–30 నుండి 10–00 వరకు రెండవ గంట, బలి, శాత్తుమొర
10–00 నుండి రాత్రి 8–00 వరకు సర్వదర్శనం
రాత్రి 8–00 నుండి 9–00 వరకు శుద్ధి రాత్రి కైంకర్యము
రాత్రి 9–00 నుండి 12–00 సర్వదర్శనం
,, 12–00 నుండి 12–30 వరకు శుద్ధి
12–30 ఏకాంతసేవ

గమనిక :– 1) పైకార్యక్రమములో సమయానుకూలముగాను ప్రత్యేక కార్యక్రమముల వలనను మార్పులు చేయబడవచ్చును. 2) సుప్రభాత దర్శనమునకు రు. 25/– టిక్కెట్టువారు మాత్రమే అనుమతింపబడుదురు. 3) రు 25/– టిక్కెట్లు తిరుమలలోనూ దేశంలో ఆంధ్రాబ్యాంకువారి వివిధ కేంద్రములలోనూ లభించును 4) ప్రత్యేక దర్శనం టిక్కెట్లు గలవారు లోగడవలె ధ్వజస్తంభంవద్దగాక మహాద్వారము క్యూలో చేర్చబడుదురు. 5) రు 200/–ల ఆమంత్రణోత్సవం టిక్కెట్టుపై తోమాలసేవ, అర్చన ఏకాంతసేవలకు మాత్రమే అనుమతి. ఇద్దరు మాత్రమే అనుమతింపబడుదురు. 6) అర్చన, తోమాలసేవ, ఏకాంతసేవలో దర్శనాంతరపు టిక్కెట్లుగాని రు. 25/ టిక్కెట్లుగాని అమ్మబడవు. పేష్కార్ ; శ్రీవారి ఆలయం, తిరుమల

# ఈమాసం మీఅదృష్టం!

## మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పా)

రాహువువలన చింత, శని ద్వారా వివాదాలు, లేదా ధననష్టం, లేదా కుమారులు కుమార్తెల నుండి ఎడబాటు. గురువు ద్వారా ధనప్రాప్తి, నూత్నవస్త్రాలు. లేదా సేవకులు, శృంగారం లేదా వాహనయోగం లేదా నూత్నగృహప్రాప్తి. కుజునిద్వారా జ్వరం లేదా ఉదరబాధ లేదా దుస్సహవాసాలవల్ల చింతలు. 17 వ తేది వరకూ రవి అనుకూలుడు. ఆరోగ్యం, విజయం ఆ తరువాత రవిద్వారా ప్రయాణం. ఉదర బాధ. శుక్రుడు అనుకూలం కానందువల్ల అనారోగ్యం, అవమానం లేదా స్త్రీ సంబంధమైన చికాకులు. బుధునివల్ల 24 వ తేది వరకూ వివాదాలు ఆ తర్వాత ధనప్రాప్తి, నూత్నవస్త్రాలు లేదా సంతానయోగం.

## వృషభం

(కృత్తిక 2,3,4.పా, రోహిణి, మృగశిర 1, 2, పా.)

రాహువుద్వారా వివాదాలు. శని వల్ల ధననష్టం, మిత్రులతో వివాదం లేదా బంధువులనుండి వేర్పాటు. గురువుద్వారా బంధు సంబంధమైనచికాకులు. కుజునివల్ల అక్రమ ధనం లేదా పుత్రులనుండి సంపదప్రాప్తి. 6 వ తేది వరకు శుక్రుని అనుకూల్యంవల్ల బంధువులరాక, పెద్దల ప్రశంస లేదా ధనం స్నేహితులు లేదా సంతానయోగం లేదా శృంగారం. ఆ తర్వాత శుక్రుడు వివాదాలకు, అనారోగ్యానికి కారకుడు. 17 వ తేది వరకు రవి ప్రతికూలతవల్ల అనారోగ్యం శత్రువులవల్ల చికాకులు తర్వాత కాలంలో రవిద్వారా ఆరోగ్యం, జయం. 24 తేది వరకు బుధుని అనుకూల్యంవల ధనం, విజయం ఆ తర్వాత వివాదాలు.

## మిథునం

(మృగశిర 3,4 పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పా)

రాహువు ద్వారా ధనప్రాప్తి, శని మూలంగాకూడ ధనం జయం, ఆరోగ్యం, సేవకులు లేదా వాహనయోగం. గురువు ద్వారా నిరాశ. కుజునివల్ల వివాదాలు, ఉద్యోగ సంబంధమైన ఆందోళన లేదా అనారోగ్యం లేదా గృహంలో దొంగతనం శుక్రుని మూలంగా స్నేహితులు, బంధువుల రాక, పెద్దల ప్రశంస. రవివల్ల అనారోగ్యం లేదా శత్రువులవల్ల చికాకులు బుధుని ద్వారా 24 వ తేది వరకు భార్యాపుత్రులతో తగాదాలు ఆ తర్వాత ధనం విజయం

## కర్కాటకం

(పునర్వసు 4పా, పుష్యమి, ఆశ్రేష.)

రాహువు ద్వారా ధననష్టం. శని వల్ల ధనాభావం. రాహు శనుల ప్రభావాన్ని గురువు పరిహరిస్తాడు. కుజునివల్ల అనారోగ్యం. శుక్రునివల్ల మిత్రులు. ధనం. నూత్నవస్త్రాలు, లేదా విజయం. రవివలన 17 వ తారీఖు వరకు ధనం. గౌరవం. తరువాత అనారోగ్యం. బుధుని వలన 24 తారీఖువరకు ధనం, ఇంటిలో వస్తుసమృద్ధి తర్వాత కాలంలో భార్యాబిడ్డలతో తగాదా

## సింహం

(మఖ, పూ. ఫ, ఉత్తర 1వ పా.)

రాహువు వలన ఆందోళన. శనివలన ప్రయాణం, ప్రయాస, లేదా ధననష్టం, లేదా కుమారుల నుండి వివాదాలు. లేదా అయినవారినుండి వేర్పాటు లేదా బంధువులకు మోసం. గురువువల్ల వివాదాలు, ధననష్టం, గౌరవభంగం. కుజుని వలన ధనాభావం లేదా భార్యకు అసంతుష్టి లేదా నేత్రబాధ లేదా అనారోగ్యం. శుక్రునివలనధనం లేదా గౌరవం లేదా నూత్నవస్త్రాలు లేదా జయం లేదా సంతానం. రవివలన 17 వ తేది వరకు ధననష్టం నేత్రబాధ, మోసం తర్వాత ధనం, విజయం, బుధుని వలన మిత్రప్రాప్తి, కాని తన ప్రవర్తన కారణంగా భయం, తర్వాత జయం, గౌరవం.

## కన్య

(ఉత్తర 2, 3, 4 పా. హస్త; చిత్ర 1, 2 పా.)

రాహువు వలన ధననష్టం, శని వలన ఆందోళన. గురువు వలన ప్రయాణం. ప్రయాస, కుజుని వలన ధనం, జయం, శుక్రునివలన శృంగారం, ధనం, గౌరవం, జయం, నూత్న వస్త్రాలు రవి వలన ఉదర బాధ, లేదా ప్రయాణం, లేదా ధననష్టం, లేదా నేత్రబాధ. బుధుని వలన 24 వ తేది వరకు అగౌరవం. తర్వాత స్నేహితులు, తన ప్రవర్తన కారణంగా భయం,

## తుల

(చిత్త; 3, 4 పా: స్వాతి, విశాఖ 1,2,3 పా;)

రాహువు వలన సౌఖ్యం. శని వలన ధనం, శృంగారం. గురువు వలన ధనం, కుజుని వలన ధనం. రవి వలన ప్రయాణం, ఉదరబాధ లేదా ధననష్టం, శుక్రుని వలన 6 వ తేది వరకు శృంగారం, ధనం గౌరవం, లేదా సంతానం. బుధుని వలన 24 వరకు తగాదాలు, చెడు సలహాల మూలంగా ధననష్టం, తర్వాత అగౌరవం.

## వృశ్చికం

(విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

రాహువు వలన తగాదాలు. శని వలన ధననష్టం, అగౌరవం. గురువు వలన ధననష్టం, గౌరవభంగం. కుజుని వలన ధననష్టం, లేదా గౌరవభంగం, రవి వలన 17 వ తేది వరకు దృఢారోగ్యం, గౌరవం జయం తర్వాత ధననష్టం, శుక్రుని వలన

(40వ పేజీలో చూడుడు)

## విశ్వవిద్యాలయ రజతోత్సవం

తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ఇటీవల రజతోత్సవం జరుపుకొంది. రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి ఈ కార్యక్రమాలలో పాల్గొనేందుకుగాను తిరుపతికి సెప్టెంబరు 1 వ తేది సాయంత్రం వచ్చి 2 వ తేది ఉదయం తిరుమలలో శ్రీవారి దర్శనం అనంతరం తిరుపతిలోని విశ్వవిద్యాలయ క్రీడాస్థలంలో ఏర్పాటైన ప్రత్యేక సభలో పాల్గొని కార్యక్రమాలను ప్రారంభించారు.

రాష్ట్రగవర్నర్, విశ్వవిద్యాలయ అధ్యక్షులు, శ్రీ కె. సి. అబ్రహామ్ విశ్వవిద్యాలయంలో విద్యార్థులకు ఉపాధ్యాయులకు వుండవలసిన సత్సంబంధాలను గురించి విద్యారంగంలో ఉన్నత ప్రమాణాలను గురించి ప్రసంగించారు. రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ చెన్నారెడ్డి ఈ విశ్వవిద్యాలయ అభివృద్ధికి కొత్తగా ఏర్పరచబోయే సాంకేతిక కళాశాలలకు యథాశక్తి ప్రభుత్వం సహాయం చేస్తుందని హామీఇచ్చారు. రాష్ట్రపతి శ్రీ సంజీవరెడ్డి శ్రీ వేంకటేశ్వర విద్యాలయం చరిత్రను సమీక్షించి ఈ విశ్వవిద్యాలయ స్థాపనకు మూల పురుషులైన స్వర్గీయ ప్రకాశం పంతులుకు నివాళు లర్పించారు.

నేటి విద్యా విధానంలో ప్రగతి ఎంతగా కన్పించినా జీవన విధానానికి అవసరమైన నైతిక మౌల్యాలకు మనం దూరమౌతున్నామని సచ్ఛీలం, త్యాగ నిష్ఠ, కర్తవ్య పరాయణత కల జాతిని రూపొందించేందుకు విశ్వవిద్యాలయాలు కేంద్రస్థానాలు కావాలని, ఎటువంటి క్లిష్టపరిస్థితులలోనైనా స్వయంగా నిర్ణయించుకోగల ఆత్మస్థైర్యం అలవరచుకోవాలనీ త్యాగశీలురవల్లనే సమాజానికి ప్రగతి అని ఉద్ఘాటించారు సభాసీనులైన మంత్రులు శ్రీ భవనం వెంకట్రామ రెడ్డి రజతోత్సవ సంచికను విడుదల చెయ్యగా, రెవిన్యూమంత్రి శ్రీ జనార్దన రెడ్డి సాంస్కృతిక ప్రదర్శనలను, దేవాదాయమంత్రి శ్రీ పి. వి. చౌదరి వస్తు ప్రదర్శనను ప్రారంభించారు. నాటి ఉపముఖ్యమంత్రి ఈనాటి రాష్ట్రపతికి గౌరవ సూచకంగా విశ్వవిద్యాలయం పక్షాన డాక్టర్ చెన్నారెడ్డి మొమెంటోను బహుకరించారు.

విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు



భారత మాజీప్రధాని శ్రీ మురార్జిదేశాయ్ సెప్టెంబర్ 18 తేదీన తిరుమలకు విచ్చేసిన సందర్భంలో వారికి దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్ స్వాగతం పలుకుతున్న దృశ్యం.

## వార్తాలహరి

డాక్టర్ శాంతప్ప తమ స్వాగతోపన్యాసంలో విశ్వవిద్యాలయం వివిధ రంగాలలో జరుగుతున్న ప్రగతికి ప్రతిబింబమని అన్నారు. విశ్వవిద్యాలయ రిజిస్ట్రార్ శ్రీ ఎం. జి. కేశవమూర్తి సభకు వందన సమర్పణచేశారు.

ఈ రజతోత్సవాలను పురస్కరించుకొని విశ్వవిద్యాలయంలోని వివిధశాఖలు తమతమ విభాగాల ప్రదర్శనలను నిర్వహించాయి. దేవస్థానంకూడా ఒక ఉద్యాన ప్రదర్శనను నిర్వహించింది. విశ్వవిద్యాలయ మాజీ ఉపాధ్యక్షులు డాక్టర్ డి. జగన్నాథరెడ్డి ఈ ప్రదర్శనను ప్రారంభించారు దేవస్థాన కార్యనిర్వహణాధికారి ఆహూతులుగా పాల్గొన్నారు.

### వేదపారాయణ పథకం

**దేశంలోని దేవాలయాలన్నింటిలోనూ వేదపారాయణదారులను నియమించే ప్రతిపాదన నొకదాన్ని సెప్టెంబర్ 1 తేదిన జరిగిన సమావేశంలో తిరుమల తిరుపతి దేవస్థాన నిర్వాహకమండలి పరిశీలిం**

చింది, హిందూమతప్రచారం దేవస్థాన ప్రధానకర్తవ్యమని టి. టి. డి. కొత్త చట్టం నిర్దేశిస్తోంది. కాబట్టి వేదపారాయణ పథకాన్ని రాష్ట్రేతరప్రాంత దేవాలయాలకుకూడా విస్తరింపచేయడం వాంఛనీయమని నిర్వాహకమండలి అభిప్రాయపడింది. దరిమిలా అన్యరాష్ట్రాలలోని ప్రసిద్ధ దేవాలయాలు కొన్నింటిని, మఠాధిపతులు పీఠాధిపతులు తదితర ధార్మిక గురువుల సక్రమ నిర్వహణలో వున్న వాటిని, ఎంపికచేసి ఆ ఆలయాలలో వేద పారాయణదారుల నియామకానికి తగిన చర్యలు తీసుకొనవలసిందిగా నిర్వాహక మండలి కార్యనిర్వహణాధికారిని కోరడం జరిగింది.

## ఆస్థానోత్సవం

అక్టోబర్ 20 తేదిన దీపావళి పర్వదినాన తిరుమల శ్రీవారి ఆలయంలో 'ఆస్థానోత్సవం' నిర్వహించ బడుతుంది. ఆ ఉత్సవపుఏర్పాట్లు నిమిత్తంగా అక్టోబర్ 19తేదిన శ్రీవారి ఆలయంలో ముఖ్యమైన ఆర్జిత సేవలు కొన్నింటిని రద్దుచేయడమైనది. 19 వ తేదిన శ్రీవారి ఆలయంలో కల్యాణోత్సవం, వసంతోత్సవం, బ్రహ్మోత్సవం, తిరుప్పావడా, సహస్ర కలశాభిషేకం, ఊంజల్ సేవ, ప్లవోత్సవం, వాహన సేవ వంటి ఆర్జిత సేవలకు అవకాశం లేదు.

## శ్రీ వేంకటేశ్వర పంచరత్నమాల

ముప్పది రెండువేల పదకవితాప్రసూనాలద్వారా తిరుమలేశుని పాదపూజ సల్పి పరమధన్యతనందిన పదకవితా పితామహుడు శ్రీ తాళ్లపాక అన్నమాచార్యుల సంకీర్తన ప్రచారాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం తన పవిత్ర బాధ్యతగా స్వీకరించి, నెరవేర్చుతున్న విషయం సర్వులకూ విదితమే!



భారత మాజీప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ సెప్టెంబర్ 6 వ తేదిన తిరుమల శ్రీవారి ఆలయాన్ని సందర్శించినపుడు వారికి ఫోటో ఆల్బమ్ బహూకరిస్తున్న దేవస్థాన కార్యనిర్వహణాధికారి మధ్యలో రాష్ట్రముఖ్యమంత్రి డా॥ చెన్నారెడ్డి.

ఆ బాధ్యతలో ఒక భాగంగా శ్రీ అన్నమాచార్యులవారి ఎన్నికచేసిన కీర్తనలు కొన్నింటిని విశ్వవిఖ్యాతినందిన కర్ణాటక సంగీతగాయని శ్రీమతి ఎమ్.ఎస్. సుబ్బులక్ష్మిగారిచే పాడించి వీటిని "శ్రీవేంకటేశ్వర పంచరత్నమాల" పేరిట ఐదు లాంగ్ ప్లే రికార్డులుగా విడుదల చేసేందుకు దేవస్థానం చర్యలు తీసుకొన్నది- వీటిలో మొదటి లాంగ్‌ప్లే రికార్డును అక్టోబర్ 1 తేది విజయదశమి పర్వదినాన తిరుమలలో శ్రీ స్వామివారికి అంకితమివ్వడం జరుగుతుంది.

ఈ లాంగ్‌ప్లే రికార్డును అక్టోబర్ 4 తేదిన భారత రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవ రెడ్డిగారు న్యూఢిల్లీలోనూ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ చెన్నారెడ్డిగారు అక్టోబర్ 6 తేదిన హైదరాబాద్‌లోనూ అక్టోబర్ 8 తేదిన భగవాన్ శ్రీ సత్యసాయి బాబా పుట్టపర్తిలోనూ విడుదల చెయ్యగలరని భావిస్తున్నారు. అక్టోబర్ 5 తేది నుంచి 12 తేది వరకూ బొంబాయి, కలకత్తా, మద్రాసు, బెంగుళూరు వంటి ముఖ్య కేంద్రాలలో శ్రీవేంకటేశ్వర పంచరత్నమాల విడుదల వారోత్సవాలు వుంటవి. లండన్, అమెరికాలలోకూడా దీని విడుదల జరుగుతుంది.

(37 వ పేజీ తరువాయి)
6 తేది వరకు ధనం, స్నేహితులు, నూత్న వస్త్రాలు తరువాత 24తేది వరకు స్తబ్దుడు. తర్వాత శృంగారం, సుఖం, బుధుని వలన 24 తేది వరకు శత్రువులు, అగౌరవం, లేదా అనారోగ్యం తర్వాత వివాదాల మూలంగా లేదా చెడు సలహాల మూలంగా ధననష్టం.

## ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

రాహువు వలన పాపాచరణం. శని వలన శత్రువులు లేదా అనారోగ్యం. గురువు వలన ధనం, జయం లేదా సంతానం. కుజుని వలన ధననష్టం, అగౌరవం, శరీరానికి హాని, రవివలన గౌరవం, ధనం, జయం, ధృఢారోగ్యం, బుధుని వలన 24 తేది వరకు ధనం, లేదా శృంగారం, లేదా వాహనయోగం, లేదా సంతానం, తర్వాత శత్రువులు అనారోగ్యం అగౌరవం, శుక్రుని వలన 6 తేది వరకు అగౌరవం, వివాదాలు 24 తేది వరకు ధనం స్నేహితులు, నూత్నవస్త్రాలు తర్వాత స్తబ్దుడు.

## మకరం

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ఠ 1.2 పా)

రాహువు వలన ఆందోళన శని వలన అయినవారినుండి వేర్పాటు గురువువలన అనారోగ్యం, ప్రయాణం, ప్రయాస, కుజునివలన భార్యతో కలహం ఉదర లేదా నేత్రబాధ. రవివలన 17 తారీఖు వరకు అనారోగ్యం లేదా ధననష్టం నిస్పృహ తర్వాత జయం, బుధునివలన ధనం. జయం, సుఖం, వాహనం, లేదా సంతానం శుక్రునివలన 6 తారీఖు వరకు ధనం, నూత్నవస్త్రాలు లేదా శృంగారం, లేదా పుణ్యకార్యం. 29 వరకు వివాదాలు, గౌరవ భంగం తర్వాత స్నేహితులు, ధనం, లేదా నూత్నవస్త్రాలు

## కుంభం

(ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా)

రాహువువలన వివాదాలు. శనివలన ప్రయాణం, గురువువలన ధనం, శృంగారం. కుజునివలన ధనం, జయం. రవివలన 17 తారీఖువరకు అనారోగ్యం లేదా భార్యకు అసంతుష్టి. తర్వాత ధననష్టం. లేదా నిరాశ. లేదా అనారోగ్యం బుధుని వలన 24 వరకు నిరాశ తర్వాత కాలంలో ధనం, జయం, శృంగారం. శుక్రునివలన ధనం, శృంగారం, లేదా నూత్నగృహం, లేదా పుణ్యకార్యం, లేదా నూత్నవస్త్రాలు.

## మీనం

(పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి.)

రాహువువలన ధనం. శనివలన ధృఢారోగ్యం, జయం. గురువువలన మనశ్శాంతికి భంగం. కుజునివలన శత్రువులు లేదా అనారోగ్యం, కుమారుడు లేదా కుమార్తెల మూలంగా ఆందోళన. రవి వలన 17 వరకు ప్రయాణం, లేదా ఉదరబాధ తర్వాత భార్యకు అసంతుష్టి లేదా అనారోగ్యం. శుక్రునివలన 6 తేది వరకు స్త్రీలమూలంగా ఆందోళన. తర్వాత శృంగారం, నూత్నవస్త్రాలు లేదా నూత్న గృహం. బుధునివలన 24 వరకు ధనం లేదా నూత్నవస్త్రాలు లేదా జయం, లేదా సంతానయోగం, తర్వాత ప్రయత్నాలలో అవరోధాలు.

※

## చందాదారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రిక చందాదారులలో దిగువ పేర్కొన్న సంఖ్య వారి చందా 31–10–79 తేదీకి అంతమగును. చందాదారులు ఈ విషయమును గమనించి M. O. ద్వారా దిగువ పేర్కొనిన ప్రకారము మనియార్డరు కూపనునందు తమ చందా సంఖ్య పూర్తి విలాసమును పేర్కొని, త్వరలో చందా పంపనియెడల ఆ తేది దరిమిలా పత్రిక పంపబడదు

చందాదారుల నంబర్లు మార్చబడినవి. కొత్తనంబర్లు దిగువ పేర్కొనబడినవి తమకు పంపిన పత్రికఅడ్రసు పేపరుమీద నున్న నంబరుకు క్రొత్త నంబరుగా గమనింప ప్రార్థన

36 39 45 54 56 62 139 141 174 254 270 304 335 405 406 407 408 416 420 588 589 590 591 592 593 594 595 596 597 598 599 600 602 604 605 606 608 616 633 859 875 876 877 947 1049 1693 1718 1719 1720 1722 1725 1744 1745 1751 1753 1754 1755 1756 1757 1758 1760 1761 1762 1764 1766 1767 1768 1769 1771 1772 1774 1775 1777 1778 1779 1780 1782 1783 1784 1785 1786 1787 1788 1789 1790 1791 1792 1793 1794 1795 1796 1797 1798 1799 1801 1802 1804 1805

గమనిక :– (1) సప్తగిరి చందాలు 16 తేదిలోగా చేరునట్లు పంపవలెను. ఆ తరువాత చేరిన చందాలకు మరునెలనుండి మాత్రమే పత్రిక పంపబడును.

(2) కొత్త చందాదారులు కూపనులో 'కొత్తచందా' అని పేర్కొనవలెను. పాత వారు కూపనులో తమ చందా సంఖ్య నమోదు చేయవలెను

(3) సప్తగిరి చందాలు ఈ క్రింది అడ్రసుకే తమ పిన్‌కోడ్ తెలియజేస్తూ పంపవలయును.

సప్తగిరి మాసపత్రిక సం॥ చందా రు 6/–

ఎడిటరు
పబ్లికేషన్ సెక్షన్
ప్రెస్ కాంపౌండ్, తిరుపతి 517501.

*Edited and Published on behalf of T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T. T. D. Press by M. Vijayakumar Reddy, Manager T. T. D. Press Tirupati-517501*

85 లక్షల వ్యయంతో నిర్మించ తలపెట్టిన "క్యూకాంప్లెక్స్" నమూనా ప్రణాళికను దేవస్థాన కార్యనిర్వహణాధికారి రాష్ట్రపతికి చూపించారు.



అనంతరం రాష్ట్ర రహదారి రవాణా శాఖవారు 35 లక్షల వ్యయంతో తిరుమలపై నిర్మించిన బస్టాండుకు రాష్ట్రపతి ప్రారంభోత్సవం కావించారు. బహుక్లుప్తంగా, నిరాడంబరంగా జరిగిన ఈ కార్యక్రమంలో రాష్ట్ర రవాణామంత్రి, రవాణాశాఖ అధ్యక్షులు తదితరులు తిరుమల యాత్రికులకు రాష్ట్ర రవాణాశాఖ చేస్తున్న సదుపాయాలను వివరించారు—ఆతర్వాత శ్రీ సంజీవరెడ్డి తిరుపతికి బయలుదేరివెళ్ళారు.

*

## ఉద్యానవిభాగ ప్రదర్శనం

శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ రజతోత్సవాల సందర్భంగా యూనివర్శిటీ ప్రాంగణంలో ఏర్పాటైన కొన్ని వైజ్ఞానిక ప్రదర్శనలలో దేవస్థానంవారి ఉద్యానవనం చూపరులను విపరీతంగా ఆకర్షించింది. తిరుమలలో గల దేవస్థానం ఉద్యానవనాలన్నింటికి ఇది ఒక ప్రతిరూపంగా కనుపట్టింది. వివిధ రకాల పుష్పజాతులతోబాటు హైబ్రిడ్ వంగ, టమేటో. మిరప వంటి కూరగాయలనుకూడా ఇందులో ప్రదర్శించారు. విశ్వవిద్యాలయ మాజీ ఉపాధ్యక్షులు డాక్టర్ డి. జగన్నాధరెడ్డిగారు ఈ ఉద్యానవనానికి ప్రారంభోత్సవం జరిపారు. ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశంపంతులు, విశ్వవిద్యాలయ ప్రథమ ఉపాధ్యక్షులు శ్రీ గోవిందరాజులునాయుడు స్మృత్యర్థంగా రెండు క్రోటన్‌జాతులకు వారి పేరిట నామకరణం చెయ్యడం జరిగింది. ఈ కార్యక్రమంలో దేవస్థానం ప్రధాన నిర్వాహకమండలి అధ్యక్షులు డాక్టర్ ఎన్. రమేశన్‌గారు కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్‌గారు ఆహుతులుగా పాల్గొన్నారు. అతిస్వల్ప వ్యవధిలో ఇంతటి శోభాయమానమైన ఉద్యానవనానికి రూపకల్పన చేసిన దేవస్థాన ఉద్యానవనాల సూపరింటెండెంట్ శ్రీ తమ్మన్న (చిత్రంలో కుడినుండి మూడవ వ్యక్తి) గారి సామర్థ్యం అందరి ప్రశంసలను అందుకోగలిగింది.



# మానవ - మాధవ సేవలు కలిసివచ్చే కలియుగ వైకుంఠ సేవ

## తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామివారిని దర్శించవచ్చే యాత్రికులకు

## అన్నప్రసాద వినియోగపథకము.

* సుమారు 1300 సంవత్సరాలకుపైగా అవిచ్ఛిన్నంగా ఆగమోక్తంగా ఆరాధన జరుగుతున్న ఏకైక దేవాలయం, శ్రీవేంకటేశ్వరాలయం బ్రహ్మోత్సవాది ప్రత్యేక సందర్భాలలో 50 లేక 60 వేలకు నడుమ, సాధారణ దినాలలో 20 లేక 25 వేలకు నడుమ, భక్తులు రోజూ దర్శించే దివ్యక్షేత్రం

* ఆసేతుహిమాచలం ఆరాధ్యదైవమైనమూర్తి శ్రీవేంకటేశ్వరుడు వేలాది భక్తులు ఆర్థిక స్తోమతలేని వారు ఉన్నదంతా వెచ్చించి శ్రీవారి దర్శనంకోసం కొండకు నడిచివస్తారు. తిరిగి తమతోపాటు శ్రీవారి ప్రసాదాన్ని తీసుకొనివెళ్ళి బంధుమిత్రులకు పంచుకోవాలన్న ఆరాటం సాధారణంగా వారికి వుంటుంది

* అటువంటి పేదయాత్రికులకు ఈ ప్రసాదాలను ఉచితంగా లభింపజేయగల్గితే అంతకుమించిన సేవలేదు.

* ఈ ఉద్దేశ్యంతోనే దేవస్థానం మధ్యతరగతి కుటుంబీకులుకూడ ఈ ధర్మకార్యక్రమంలో పాల్గొనేందుకు వీలుగా ఒక ప్రణాళికను ఏర్పాటుచేసింది. దాని ముఖ్యాంశాలు యివి .

శ్రీవేంకటేశ్వర నిత్యప్రసాద ధర్మాదాయ పథకంపేర జరిగే యీ కార్యక్రమంలో రు. 500/- "దేవస్థానం నిధి"గా యేర్పాటుచేసి ఎవరైనా పాల్గొనవచ్చును. ఈ నిధి బ్యాంకులో మూలధనంగా వుంచబడుతుంది దానిమీద సాలీనా వచ్చే వడ్డీతో ప్రతి సంవత్సరము 20 లడ్డూలు లేదా 15 వడలు లేదా 20 అన్నపు పొట్లాలను దాత పేర్కొన్న దినాన క్యూలైన్లలోని పేదయాత్రికులకు పంచటం జరుగుతుంది

* ఇది శాశ్వతనిధి కనుక ఒకసారి ఏర్పాటుచేస్తే దానిపైనవడ్డీ నిరవధికంగా వస్తూనేవుంటుంది దాత తనకు తమవారి పుట్టినతేది లేదా కల్యాణదినాలు లేదా తల్లి లేదా తండ్రి పుణ్యదినం లేదా తమకు ముఖ్యమనిపించిన తేదిని తెలిపితే ఆరోజున అతనిపేర లేదా అతడుపేర్కొన్న యితరులపేర యీ ప్రసాదం పంచడం జరుగుతుంది.

* ఆ నిర్ణీతదినాన ఉదయంపూట స్వామివారి దర్బారులో ఆదాతపేరు గోత్రం పేదయాత్రికులకు విరాళ మేర్పాటుచేసినట్లు అతని పేర ప్రసాదం పంపిణీ జరుపబోతున్నట్లు విన్నవించడం జరుగుతుంది.

* ఈ విధంగా రు. 500/- పద్ధతిన ఒక్కొక్కరు ఎన్నిరోజులకైనను యేర్పాటు చేయవచ్చును.

* ఈ విధంగా పది నిధులు లేదా ఒకేసారికి రు. 5000/- నిధి యేర్పాటుచేసినవారు నిర్ణీతదినాన సకుటుంబంగా ఆకార్యక్రమానికి హాజరుకావడమేకాక శ్రీవారిని దర్శనంచేసుకోవచ్చును.

* ఈప్రణాళికకు నిధి స్వీకరణ వెంటనే ప్రారంభమౌతుంది. ప్రసాదవినియోగం 1980 సంవత్సరంలో వచ్చే ఉగాదినాడు ప్రారంభమౌతుంది.

* శ్రీవారి దర్శనానికి వచ్చే యాత్రికసందోహంలో అతి పేదవారి సేవలో తరతమ భేదం లేకుండా అందరూ పాల్గొని శ్రీవారి ఆశీస్సులు పొందేటందుకు అపూర్వ అవకాశం.

* ఈ ప్రణాళికక్రింద చెల్లించిన డబ్బుమీద ఆదాయపుపన్నునుండి మినహాయింపు లభిసుందిగనుక దీనిక్రింద తమ విరాళములను పేర్కొని మినహాయింపు పొందవచ్చును.

* మానవసేవ, మాధవసేవ కలిసివచ్చుపుణ్యం రెండింతలుగా రాగల అపూర్వ అవకాశాన్ని ప్రతిభక్తుడు వినియోగించుకొని గోత్రం, లేదా ఇంటిపేరు, దాతపేరు, వినియోగం జరపవలసిన ప్రసాదంపేరు, వినియోగం జరపవలసిన తేది పేర్కొని విరాళాలు పంప అభ్యర్థన.

* 'విరాళాలను, ఏ బ్యాంక్ డి. డి. ద్వారానైనా కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం' పేర, మేనేజర్ ఆంధ్రాబ్యాంక్, గాంధిరోడ్డు తిరుపతి 517501 అనేవిలాసానికి పంపండి లేదా దేశంలోని ఆంధ్రాబ్యాంక్ వివిధ శాఖలలో చెల్లించవచ్చు.

**తిరుమల తిరుపతి దేవస్థానం తిరుపతి.**

# పంచరత్నమాల ఆవిష్కరణ



అక్టోబరు 1 తేది విజయదశమి పర్వదినాన తిరుమల శ్రీవారి ఆలయంలో శ్రీ వేంకటేశ్వర పంచరత్నమాల లాంగ్ ప్లే రికార్డు ఆవిష్కరణ జరిగింది.

తాళ్ళపాకవారి భాండాగారంలో (అన్నమాచార్య కృతులు లభించినచోటు) తొలి రికార్డును వుంచారు శ్రీమతి యం. యస్. సుబ్బులక్ష్మి.



శ్రీమతి సుబ్బులక్ష్మికి పంచరత్నమాల రికార్డుబహూకరణ సందర్భంలో శ్రీ చంద్రమౌళిరెడ్డి, శ్రీ రమేశన్, శ్రీ ప్రసాద్.



పంచరత్నమాల గాయని, సంగీత సామ్రాజ్ఞి సుబ్బులక్ష్మికి దేవస్థానపు సత్కారం అందజేస్తున్న కార్యనిర్వహణాధికారి శ్రీ ప్రసాద్



చుక్కలన్నింటిని నల్దిక్కుల విరజిమ్మింది
వాయువుతో సన్నాయిని పలికించిందీ
వసంతకాలం విరులను ఆడించి
సెలయేరుల గలగల నవ్వించిందీ
నీవే! నీవే! నీవే!

పక్షుల కెల్లా పరుగులు నేర్పిందీ
తరువుల కెల్లా చివురులు తొడిగిందీ
ఆకసాన హరివిల్లును పరచిందీ
నీవే! నీవే! నీవే!

పసిపాపలు పరమాత్మ నిరూపాలు
ఈ అనంతభువనం క్రీడాభవనమని
కలకాలం కమ్మగ సాగాలని
అనిపించిందీ అన్నది-
నీవే! నీవే! నీవే!

'నాగరాజ్'

# సప్తగిరి

నవంబరు 79

సంపుటి 10 సంచిక 6

విడిప్రతి 0-50 పైసలు

సం॥ చందా రు. 6-00

## విషయసూచిక



మొదటి పేజి ఛాయాచిత్రం : ఏలేశ్వరపు నరసింహారావు, బాపట్ల.

గౌరవసంపాదకులు:
శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్
ఐ. ఏ. ఎస్,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
టెలిఫోన్ నెం. 2322

ప్రచురణకర్త – సంపాదకుడు:
కొట్రపాటి సుబ్బారావు
ఎమ్. ఏ.,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
టెలిఫోన్ నెం. 2254

ముద్రాపకుడు,
ఎమ్. విజయకుమార్ రెడ్డి,
తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి.
టెలిఫోన్ నెం. 2340

గమనిక : శ్రీవారి ఆలయ దర్శన కాలాలు మార్చబడినవి. వీటి వివరాలు వచ్చే సంచికలో ప్రచురించగలము.

# సంపాదకీయము

ఏడవకు ఏడవకు వెర్రిపాపాయి
ఏడిస్తే నీ కళ్ళు నీలాలుగారు
నీలాలు గారితే నే చూడలేను
పాలైన గారవే బంగారు కనులు—

ఈ తేట పాటలో ప్రతిమాటా పొంగి పొర్లే మాతృవాత్సల్యానికి, బిడ్డ బాధ పట్ల తల్లిపడే వేదనకి సూటైన ప్రతిబింబం. నిజానికి ఏ భాషలోనైనా ఏ దేశంలోనైనా దీనికి దీటైన భావమే తల్లిప్రేమను వెల్లడిచేస్తుంది. ఇంతగా ప్రపంచమంతటా వ్యాపించిన ఈ ప్రేమ, రక్షణ, శిశువు లందరికీ లభిస్తున్నదా అంటే లేదనేందుకు, తల్లిదండ్రులు బిడ్డలపట్ల తమ కర్తవ్యాన్ని సరిగా నెరవేర్చడం లేదనటానికి నాటి నుండి నేటి వరకూ గల మన కథలలో కావల్సినన్ని ఉదాహరణలున్నై.

తల్లిదండ్రుల ప్రేమాభిమానాలకు పాత్రులైన పిల్లలు సుశిక్షితులై ఉత్తమ వ్యక్తులై లోకానికి ఆదర్శ ప్రాయులయ్యారు. రామాయణంలో మనకు తారసిల్లే ప్రతి పాత్రా చివరకు రావణుడి సంతానంతో సహా ఇలాంటి వారుగానే కనిపిస్తుంది. సంస్కారం, సామాజిక విలువల స్పృహగలిగిన తల్లిదండ్రులు తమ సంతానాన్ని పెంచిన విధానమే ఇందుకు కారణం.

కొన్ని సందర్భాలలో తల్లిదండ్రుల గారాబం మిగిలిన విలువల్ని ముంచి వెయ్యడం జరిగింది. అట్టి సందర్భాలలో పిల్లలు ఏ విధంగా తయారౌతారన్నదానికి భాగవతంలో కృష్ణ పరమాత్మయే సాక్ష్యం. ఆయన భగవంతుడన్న విషయాన్ని పక్కకుపుంచి పరిశీలిస్తే, పుట్టుకతో దేవకీసుతుడే అయినా యశోదానందవర్ధనుడుగ పరిమిత శిక్షణ గలిగిన జానపదసమాజంలో పెరిగిన బాలకృష్ణుని పట్ల "పోయెదమెక్కడికైనను, మా యన్నుల సురభు లాన మంజులవాణీ" అనే గోపకాంతల నిరసనం ఏ ఊళ్ళో ఏ దొరబిడ్డకైనా ఎదురయ్యే ఫిర్యాదే !

మన చరిత్రలో తండ్రుల పలాయన వాదంవల్లా లేదా విలక్షణ కార్యాలవల్లా వారి బిడ్డలు అనాధులన్నంత విచిత్ర పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది. ఆదుకోనేందుకు కణ్వమహర్షి, వాల్మీకిలాంటి పుణ్యపురుషులు లేకపోతే భరతుడు. కుశలవులు వేరే విధంగా తయారయే వారేమో! కాని వారి అదృష్టవశాత్తూ తర్వాతి కాలానికైనా వారు తమ తల్లిదండ్రుల అభిమానాన్ని పొందగలిగేరు.

కాని ఏ దుర్విధివల్లనో, ఆపత్తువల్లనో అనాథులు కావడంగాక కేవలం తల్లిదండ్రుల పిరికితనం, పలాయన వాదంవల్ల తాము అనాథులమైనట్లు తెలిసిన శిశువులలో ఏర్పడే మానసిక వేదన, అటువంటి శిశువులలో ఆ పెద్దలపై పేరుకుపోయే కసి అంతాఇంతాకాదు. ఉదాత్తులవల్ల, సామాజికంగా లభించిన గౌరవాలు, స్వీయ ప్రజ్ఞాపాటవాలు ఎంతటివైనా వారి మనసులో పాతుకుపోయిన ఈ మత్సరం ఒక మహాప్రళయం సృష్టించగలదని మహాభారతం రుజువు చేసింది. కానీనుడైన కర్ణుడికథే ఇందుకు పరమ నిదర్శనం. జన్మదాతల ఆదరాభిమానాలు దూరమై రాధేయుడుగా మహాభారత రణాన్ని నడిపించిన కర్ణుని మనఃస్థితి తరతరాల తల్లిదండ్రులకు ఒక చెరగని హెచ్చరిక. కన్యాపుత్రుడు, రాధేయుడు అన్న ఈ సడింపులుగాక పాండునందనుడన్న గుర్తింపు వచ్చివుంటే బహుశా భారతకథ వేరొకమలుపు తిరిగి వుండేదేమో !

ఇలా ఒకొక్క చరిత్రను గురించి ఎన్ని వ్యాఖ్యానాలైనా చేసుకుపోవచ్చును. ప్రతివిపరీత చర్యకూ కారణాలు ఎన్నింటినో చెప్పకోవచ్చు. కాని కారణం ఏదైనా శిశువుకు అన్యాయం, మానసికమైన ఆఘాతం తగిల్తే దాని నుండి కోలుకోవడం కష్టమని ఆ బాధ మితిమీరినదయినపుడు మతిపోయి ఒక్కొక్కప్పుడు అది మానవ వినాశానికే దారి తీయవచ్చునన్నది చరిత్ర చెప్పలేకచెప్పిన సత్యం.

గతమెప్పుడూ వర్తమానపు మజలీ నుండి భవిష్యత్తును చేరే బంగారుబాటకొక వెలుగుదీపిక. మరి ఇది అంతర్జాతీయంగా బాలబాలికల, భావిపౌరుల ప్రత్యేక సంవత్సరం. మొన్నటి చెడు నేటి అనుభవమై రేపటి అలవాటుగా మారకుండా వుండాలంటే ఈ సందర్భంలో ప్రతితరం తన అంతరాన్ని తరచిచూసుకోక తప్పదు.

# సంపాదకీయము

ఏడవకు ఏడవకు వెర్రిపాపాయి
ఏడిస్తే నీ కళ్ళు నీలాలుగారు
నీలాలు గారితే నే చూడలేను
పాలైన గారవే బంగారు కమలు–

ఈ తేట పాటలో ప్రతి మాటా పొంగి పొర్లే మాతృవాత్సల్యానికీ, బిడ్డ బాధ పట్ల తల్లిపడే వేదనకి సూటైన ప్రతిబింబం. నిజానికి ఏ భాషలోనైనా ఏ దేశంలోనైనా దీనికి దీటైన భావమే తల్లిప్రేమను వెల్లడిచేస్తుంది. ఇంతగా ప్రపంచమంతటా వ్యాపించిన ఈ ప్రేమ, రక్షణ, శిశువు లందరికీ లభిస్తున్నదా అంటే లేదనేందుకు, తల్లిదండ్రులు బిడ్డలపట్ల తమ కర్తవ్యాన్ని సరిగా నెరవేర్చడం లేదనటానికి నాటి నుండి నేటి వరకూ గల మన కథలలో కావల్సినన్ని ఉదాహరణలున్నై.

తల్లిదండ్రుల ప్రేమాభిమానాలకు పాత్రులైన పిల్లలు సుశిక్షితులై ఉత్తమ వ్యక్తులై లోకానికి ఆదర్శ ప్రాయులయ్యారు. రామాయణంలో మనకు తారసిల్లే ప్రతి పాత్రా చివరకు రావణుడి సంతానంతో సహా ఇలాంటి వారు గానే కనిపిస్తుంది. సంస్కారం, సామాజిక విలువల స్పృహగలిగిన తల్లిదండ్రులు తమ సంతానాన్ని పెంచిన విధానమే ఇందుకు కారణం.

కొన్ని సందర్భాలలో తల్లిదండ్రుల గారాబం మిగిలిన విలువల్ని ముంచి వెయ్యడం జరిగింది. అట్టి సంద ర్భాలలో పిల్లలు ఏ విధంగా తయారౌతారన్నదానికి భాగవతంలో కృష్ణ పరమాత్మయే సాక్ష్యం. ఆయన భగవంతుడన్న విషయాన్ని పక్కకువుంచి పరిశీలిస్తే, పుట్టుకతో దేవకీసుతుడే అయినా యశోదానందవర్ధనుడుగ పరిమిత శిక్షణ గలిగిన జానపదసమాజంలో పెరిగిన బాలకృష్ణుని పట్ల "పోయెదమెక్కడికైనను, మా యన్నల సురభు లాన మంజులవాణీ" అనే గోపకాంతల నిరసనం ఏ ఊళ్ళో ఏ దొరబిడ్డకైనా ఎదురయ్యే ఫిర్యాదే !

మన చరిత్రలో తండ్రుల పలాయన వాదంవల్లా లేదా విలక్షణ కార్యాలవల్లా వారి బిడ్డలు అనాథులన్నంత విచిత్ర పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది. ఆదుకోనేందుకు కణ్వమహర్షి, వాల్మీకిలాంటి పుణ్యపురుషులు లేకపోతే భరతుడు, కుశలవులు వేరే విధంగా తయారయే వారేమో! కాని వారి అదృష్టవశాత్తూ తర్వాతి కాలానికైనా వారు తమ తల్లిదండ్రుల అభిమానాన్ని పొందగలిగేరు.

కాని ఏ దుర్విధివల్లనో, ఆపత్తువల్లనో అనాథులు కావడంగాక కేవలం తల్లిదండ్రుల పిరికితనం, పలాయన వాదంవల్ల తాము అనాథులమైనట్లు తెలిసిన శిశువులలో ఏర్పడే మానసిక వేదన, అటువంటి శిశువులలో ఆ పెద్దలపై పేరుకుపోయే కసి అంతాఇంతాకాదు. ఉదాత్తులవల్ల, సామాజికంగా లభించిన గౌరవాలు, స్వీయ ప్రజ్ఞాపాటవాలు ఎంతటివైనా వారి మనసులో పాతుకుపోయిన ఈ మత్సరం ఒక మహాప్రళయం సృష్టించగలదని మహాభారతం రుజువు చేసింది. కానీనుడైన కర్ణుడికథే ఇందుకు పరమ నిదర్శనం. జన్మదాతల ఆదరాభిమానాలు దూరమై రాధేయుడుగా మహాభారత రణాన్ని నడిపించిన కర్ణుని మనఃస్థితి తరతరాల తల్లిదండ్రులకు ఒక చెరగని హెచ్చరిక. కన్యాపుత్రుడు, రాధేయుడు అన్న ఈ సడింపులుగాక పాండునందనుడన్న గుర్తింపు వచ్చివుంటే బహుశా భారతకథ వేరొకమలుపు తిరిగి వుండేదేమో !

ఇలా ఒకొక్క చరిత్రను గురించి ఎన్ని వ్యాఖ్యానాలైనా చేసుకుపోవచ్చును. ప్రతివిపరీత చర్యకూ కార ణాలు ఎన్నింటినో చెప్పుకోవచ్చు. కాని కారణం ఏదైనా శిశువుకు అన్యాయం, మానసికమైన ఆఘాతం తగిల్తే దాని నుండి కోలుకోవడం కష్టమని ఆ బాధ మితిమీరినదయినపుడు మతిపోయి ఒక్కొక్కప్పుడు అది మానవ వినాశానికే దారి తీయవచ్చునన్నది చరిత్ర చెప్పలేకచెప్పిన సత్యం.

గతమెప్పుడూ వర్తమానపు మజలీ నుండి భవిష్యత్తును చేరే బంగారుబాటకొక వెలుగుదీపిక. మరి ఇది అంతర్జాతీయంగా బాలబాలికల, భావిపౌరుల ప్రత్యేక సంవత్సరం. మొన్నటి చెడు నేటి అనుభవమై రేపటి అలవాటుగా మారకుండా వుండాలంటే ఈ సందర్భంలో ప్రతితరం తన అంతరాన్ని తరచిచూసుకోక తప్పదు.

# నిర్వాహక మండలి నిర్ణయాలు

27—9—79

దేవస్థానం కోరికపై హిందూ ధర్మ ప్రచారకుల శిక్షణ నిమిత్తం జగద్గురు శ్రీ కంచి కామకోటి శంకరాచార్యుల వారు రూపొందించి పంపిన ఏక వార్షిక శిక్షణ అధ్యయన ప్రణాళికను నిర్వాహక మండలి ఆమోదిస్తూ ఒక సంవత్సరం పాటు ఈ కోర్సును ప్రయోగాత్మంగా నడిపి దాని ఫలితాలను కమిటీ ముందుంచ వలసిందిగా కార్యనిర్వహణాధికారిని కోరడమైనది.

దాస సాహిత్య పరిశోధనకు, ప్రచురణకు సంబంధించిన ప్రత్యేక పథకాన్ని శ్రీ అన్నమాచార్య ప్రాజెక్టుకు దాన్ని అనుబంధించే ప్రతిపాదనను అంగీకరించడమైనది.

మూడులక్షల నలభై వేల బడ్జెట్‌తో శ్రీ వేంకటేశ్వర కళాపీఠపు మొదటిదశగా సంగీత నృత్యాది లలితకళా విభాగాన్ని ప్రారంభించేందుకు కమిటీ అనుమతించడమైనది.

శ్రీ వేంకటేశ్వర శిల్పకళా శిక్షణా కేంద్రం సూపరింటెండెంట్‌గా నెలకు రు. 1000 గౌరవభృతితో శ్రీ టి. కుమరేశస్థపతి నియామకాన్ని ఆమోదించడమైనది.

భద్రాచలం వాస్తవ్యులు శ్రీ పి శఠగోపాలాచార్యుల వారిని దేవస్థాన పాంచరాత్రాగమశాస్త్ర ఆస్థాన్ విద్వాన్‌గ నియమించడమైనది.

పాపవినాశనం ఆనకట్ట నిర్మాణార్థం మూడు ప్రత్యేక సబ్ డివిజన్‌ల ఏర్పాటుకు సమ్మతిస్తూ వీటిలో ఇంజనీర్లు తదితర సాంకేతిక సిబ్బంది తప్ప గుమాస్తాలు, అటెండర్ల వంటి పోస్టులతో అవసరం లేదని కమిటీ అభిప్రాయపడింది. ఈ పనికోసం అదనంగా వాహనాలను కొనుగోలు చేయవలసిన అవసరంలేదని భావిస్తూ ఉన్న వాహనాలతోనే పని కొనసాగించే ఏర్పాట్లు చెయ్యవలసిందిగా కార్యనిర్వహణాధికారిని కోరడమైనది.

అండమాన్ దీవుల రాజధాని పోర్టుబ్లెర్ లోగల రాధాగోవింద ఆలయాన్ని స్వాధీనం చేసుకొనే వీలులేనందుకు చింతిస్తూ ఆ ఆలయ దాన పత్రాన్ని ఆలయాధికారులకు తిరిగి ఇచ్చి వేయాలని తీర్మానించడం జరిగింది. 1979 సంవత్సరపు టి. టి డి. కొత్తచట్టంలోని ఆలయనిర్వహణ విధానాన్ని దృష్టిలో వుంచుకొని ఈ నిర్ణయం తీసుకోడం జరిగింది పోర్ట్‌బ్లేర్‌లో దేవస్థానం కల్యాణ మండపం నిర్మించే విషయం కొత్తచట్టం ప్రకారం కామన్ గుడ్ ఫండ్ కార్యదర్శితో సంప్రదించ కోర తీర్మానించటమైనది.

వేదపండిట్‌లు పనిచేసినన్ని గంటలు పూర్తికాలం పనిచేసే పక్షంలో వేద పారాయణదారులకు వేదపండిట్‌లతో సమానంగా వేతనభత్యాలు ఇవ్వవచ్చునని, వేదపండిట్‌ల మిగులు సమయాన్ని ఇతర విద్యార్థుల వేదాధ్యయనకు ఉపయోగించవచ్చుని కమిటీ అభిప్రాయపడింది.

వేదపారాయణదార్లకు ఇంతకు పూర్వపుబోర్డు మంజూరు చేసిన నూతన వేతనాలను వాటి తేదీ ఉత్తర్వునుంచి పై నిబంధనకు లోబడి కొనసాగించవలసిందిగా కార్యనిర్వహణాధి కారిని కోరడమైనది.

శ్రీ వేంకటేశ్వర స్వామివారి అభిషేకానికి వుపయోగించే పెద్దసైజు దక్షిణావర్త శంఖం నిర్మాణానికి శ్రీ స్వామివారి అలంకరణ నిమిత్తం 108 శంఖాలుగల దక్షిణావర్త శంఖమాల తయారీ ఆమోదిస్తూ శిల్పుల్ని రావించి ఈపనులు సత్వరంగా జరిగేలా చర్యలు తీసుకోవాలని కార్యనిర్వహణాధికారిని కోరడమైనది జియ్యంగార్‌ని అర్చకులను ఈ విషయమై సంప్రదించి వారి అంగీకారాన్ని కూడా పొందవలసిందిగా కార్యనిర్వహణాధికారికి సూచించడమైనది.

తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్ మేనేజరు శ్రీ ఎమ్. విజయకుమార్ రెడ్డి గారి వేతనాన్ని నెలకు రు 900–50–1450 కు పెంచడమైనది.

డాక్టర్ దివాకర్ల వేంకటావధాని గారి 'సుందర సందేశం' గ్రంథప్రతులు నాలుగువేలను కొనుగోలు చేసేందుకు అంగీకరించడమైనది.

కూచిపూడి ఆర్ట్ అకాడమీ తరఫున శ్రీ వెంపటి చినసత్యం నిర్వహిస్తున్న 'పద్మావతీ శ్రీనివాసమ్' నృత్యనాటిక ఆహార్యం మార్పు చేర్పులకు గాను పాతికవేల ఆర్థిక సహాయం చేసేందుకు అంగీకరించడమైనది.

సర్వశ్రీ నూకల చిన సత్యనారాయణ, సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్ టి. యస్. మణి అయ్యర్, మహారాజపురం సంతానంగార్లను ఆస్థాన విద్వాన్‌లుగ నియమించడమైనది.

---

39 వ పేజీలో మత్స్య-ప్రాజెక్టుకు బదులు చిన్న తరహా వ్యవసాయదారుల అభివృద్ధిసంస్థ అని చదువుకొన గోర్తాము.

# జైన, బౌద్ధములచే

మతము: పుణ్యము మోక్షప్రాప్తికి ప్రధానధర్మము. మత మనునది భగవంతుని పొందుటకు సాధనము. మతమెప్పుడు ఉత్కృష్టధర్మమును బోధించును పరమేశ్వరునితో మానవునకుగల సంబంధమే మతమని పాశ్చాత్యుల అభిప్రాయము.

" Religion is the belief in spiritual beings "

E. B. Tylor

"ప్రతిజీవియందు దేవుడు నివసించును. అన్ని మనస్సులతో నతడు యోచించును, అతడు స్వప్రకాశుడు. అతిదుమనకంటె సమీపస్థుడు. దీనిని సాధించుటే మతము"

[శ్రీ స్వామి వివేకానంద సంపూర్ణ గ్రంధావళి. సంపు. 2. పేజి 251]

ప్రపంచములో అనేక మతములు వ్యాపించి యున్నవి. ప్రతిమతములోను జగత్కర్తృత్వము, జగత్కర్తయొక్క సాకారనిరాకార తత్త్వలక్షణములు, సృష్టి యొక్క నిమిత్తోపాదానకారణములు, ఆత్మ లేక ప్రాణుల స్థితి, కర్మబంధములు తత్త్వములు, పరమేశ్వరార్చన విధి విధానములు, బంధవిముక్తి మార్గములు, ప్రాణి యొక్క ముక్తి మొదలగు విషయములను గూర్చి తెలియజేయబడి ఉన్నది,

మనుష్యులకు మతవిధులుగ ఆంతరంగిక పరిశుద్ధి, బహిరంగపరిశుద్ధి అవసరమగుటచే 'అహింస, సత్యము, శుచి, ప్రేమ' - క్షమ ఇత్యాదులాచరణీయ

శ్రీ పి. వి. సీతారామయ్య,

తిరుపతి.



# వైదికమత సంస్కరణ

ములు మనమిప్పుడు మతమని వ్యవహరించు దానిని మనపూర్వులు ధర్మమని సమయమని వ్యవహరించిరి.

వైదికమతము: వైదికమతము ఆర్యుల మతము. ఈ మతమునకు ఆర్షమతమని సనాతనమతమని, హిందూమతమని పేర్లు గలవు. వైదిక మతమునకు వేదములు, ఉపనిషత్తులు ప్రధాన ప్రామాణిక గ్రంథములు. సర్వజ్ఞుడైన పరమేశ్వరుని తెలిసికొనుటకు వేదము సాధనమని వైదిక మతస్థుల నమ్మకము పరమేశ్వరజ్ఞానమే వేదమునకు ముఖ్యప్రయోజనము. నేడు హిందువులని పిలువబడువారందరు వైదిక మతమునకు చెందినవారే, వీరిప్పుడు నేపాలు, భారతదేశములందు మాత్రమే కనిపించుచున్నారు.

" ఈ మతము (వైదికమతము) పరమేశ్వరుని ముఖము నుండి అప్రయత్నముగ పురుష నిశ్వాసమువలె వెలువడిన 'ఋగ్యజుస్సామాధర్వణ' రూపంబగు వేదరాశి నాలవాలముగా గలిగియుండుటచే దీనికి పేరు కల్గెను. వైదిక జాతికంతకును నీ వేదములు పరమప్రమాణముగ సృష్ట్యాది నుండియు నేటివరకు వలరాదు చున్నవి. వేదము పౌరుషేయమును, నిత్యమును, స్వతఃప్రమాణమును నని వేదవేత్తలందరు శాస్త్రయుక్త్యనుభవముచే బోధించుచున్నారు. అందుచేత వైదికమతమొక పురుషునిచే గల్పింపబడిన దెంతమాత్రమునుగాదు."

[శ్రుతిధర్మ సంగ్రహము. ఉపోద్ఘాతము పుట 70.]

[శ్రుతిధర్మ సంజీవని సంపు. 3. సంచి. 11-12.]

సృష్టికి పూర్వము ఒకే వస్తువుండెను.

"నా సదా సీన్నో సదా సీత్తదానీం
నా సీద్రజో నోవ్యో మాపరోయత్।
ఆసీదవాతం సధయా తదేకం
అస్మాద్ధాన్యన్న పరః కించనాస॥"

(ఋ. 10-12-9-1-2)

"సృష్టికి పూర్వము ఉన్నదియు, లేనిదియు కూడ లేకుండెను. వాయువు

(34 వ పేజీలో చూడుడు)

# శిశుసంక్షేమం - జాతికి క్షేమం

మన దేశ జనాభాలో 42 శాతానికి తక్కువ కాకుండా 6 సం॥ లోపు పిల్లలు వున్నారు. పిల్లలు అనగానే వారికీ కొన్ని ప్రాథమిక హక్కులు వున్నాయి.



మాకు మంచి తిండీ బట్టలు లేవు. మాకు సరిగ్గా చదువు చెప్పించరేం? అని కడుపున పుట్టిన పిల్లలు ఎదురు తిరిగి ప్రశ్నిస్తూంటే జవాబు చెప్పలేక తలలు వొంచుకొంటున్నవారు మన దేశంలో లక్షోప లక్షలు. వారు అడుగుతున్నవి సముచితమైన కోర్కెలే మరి!

★

శిశు మరణాల సంఖ్య తగ్గించడం, వారు రోగాలకు గురికాకుండా చూడటం, బాలలందరికీ, ఆహార విద్యా సౌకర్యాలు కల్పించడం అంతర్జాతీయ బాలల సంవత్సరపు ముఖ్యోద్దేశాలలో కొన్ని. ఈ ఉద్దేశాలను తిరుమల తిరుపతి దేవస్థానం యథాశక్తిగా నెరవేరుస్తూవుంది.

( ప్రత్యేక వ్యాసం 17-వ పేజీలో చదవండి. )

(గతసంచిక తరువాయి)

మధురలో వల్లభదేవుడను ధార్మిక రాజుండెను ఒకసారి అతడు విద్వాంసుల సభ చేయించి పరతత్త్వ నిర్ణయము చేయ నట్లు ఆజ్ఞాపించెను. అనేకవిద్వాంసులుతమ వాదమును ఆధారసహితంగా సభముందుం చిరి. వటపత్రశాయి యొక్క సిద్ధాంతు కానుగ్రహమునకు పాత్రులై యున్న ఆళ్వారులు, స్వామి యు స్వప్నమందు తమకు నియమింపబడినయట్లు సకలవేదార్థ సారమును వేదోప బృంహణములైన పురాణేతి హాసార్థములను నారాయణపార మ్యమును ఉద్ఘోషింపదగిన ప్రమాణ వచన ములను, బహుముఖముగా ఉదహరించుచు పరతత్త్వ నిర్ణయమును చాల చక్కగా ప్రతిపాదించిరి దగ్గఉనున్న విద్వజ్జను లందరు వారి వాదమును విని ఆనందపడి ప్రశంసించిరి. రాజుకూడ మిగులహర్షించి పెరియాళ్వారులను ఏనుగుమీద కూర్చుం బెట్టి అన్నిమర్యాదలతోడను వైభవయుత మైన ప్రదర్శనము గావింపించివారికి పట్టర్ పిరాన్, అను బిరుదమునుఇచ్చెను. మహా వైభవముతో కూడిన వీరి ఊరేగింపు చూచుటకు గరుడారూఢుడైన సర్వేశ్వరుడే భూనీలా సహితుడై అంతరిక్షమందు ప్రత్యక్షమగుటను ఆళ్వారులు దర్శించి దృష్టిదోషము తగులకుండుటకై మంగళా శాసనము చేసిరి. ఇటి ఈ తిరుప్పల్లాండు ప్రబంధము ప్రతినిత్యము భగవదారాధన కాలమందు పాడవలెనను విధి సంప్రదా యమున గలదు ఇట్లు సన్మానితులైన ఆళ్వారులు శ్రీవిల్లి పుత్తూరికి వచ్చి రాజు ఇచ్చిన సకల మర్యాదలను స్వామి చరణ ములనుంచి, మీనుండి ప్రాప్తించిన ధనము మీకే చేర తగినది అని ప్రార్థించి పర మాత్మని నిత్య కైంకర్య మందుంచిరి.

పెరియాళ్వారులకు శ్రీకృష్ణావతార మందు విశేషభక్తి. శ్రీకృష్ణుని అతిమానుష చేష్టితములైన బాలలీలలను యశోదాదేవి ప్రత్యక్షముగా చూచి అనుభవించినట్లు, తామును అనుభవించి, శ్రీకృష్ణునికి శైశవ మందు సంభవించిన ఆపదలకు అతిదేశక్తి యుతుడైన రక్షకుడని తెలిసియుండియు సమకాలికులవలెనే భయవిహ్వలురై అత నికి అనేక రక్షలను కట్టి, తత్త్వ నిరూప ణము గావించి శ్రీకాంతుడైన నారాయణు నికి మంగళాశాసనము చేయుటచే సకల చేతనులకును మోక్షదాయకుడని తెలియ పఱచి యున్నారు వీరి తిరుప్పల్లాండు ద్రావిడ వేదమునకు ప్రణవము వంటిది. వీరిదే మఱియొక దివ్య ప్రబంధము పెరి యాళ్వార్ తిరుమొళి. దీనియందు సర్వేశ్వ రుని సౌలభ్యము, సౌకుమార్యము మొద లైన వానికి పరసీమయైన శ్రీకృష్ణుని బాల్య వృత్తాంతమును ప్రతిపాదించిరి. ఇట్లు ఈ రెండు దివ్య ప్రబంధములను పెరియాళ్వారులు లోకోపకార దృష్టితో దయచేసియుండిరి.

గురుముఖ మనధీత్య ప్రాహ వేదానశేషాన్
నరపతి పరిక్లప్తం శుల్కమాదాతు కామః ॥
శ్వశుర మమర వంద్యం రంగనాథస్యసాక్షాత్
ద్విజకుల తిలకం తం విష్ణుచిత్తం నమామి ॥

ఆండాళ్ (గోదాదేవి) :- శ్రీవిష్ణుచిత్తులు తమ తిరునందనవనములో పెరిగిన పూవు లను తులసిని మాలకట్టి దేవతలకు నిత్య మును అర్పించుచుండిరి. తోటపనియు, వారినిత్యకృత్యము లందొక్కటి ఒకరోజు వారు పుష్పోద్యానమందు తులసిమొక్క మొదట్లో కుదురు చేయుచుండగా జనక మహారాజునకు సీతా మహాదేవి లభించిన తీరున, ఒక అందమైన పెట్టె దొరకెను. దానిని తెఱచి చూడగనే. దానియందు దేవతా స్వరూపమువలె అందమైన ఆడ శిశువు ఒకటుండెను, ఇట్లు భూమియందు చిక్కిన భూదేవియొక్క అవతార రూప మైన శిశువును పిల్లలులేని విష్ణుచిత్తుడు మిగుల ప్రీతితో పోషించిరి. శిశువుయొక్క శిరోజములు చాల ఆకర్షకములై యుండు టచే శిశువునకు కోదై అని నామకరణము చేసిరి ఇట్లు దినదినము ప్రవర్ధమానమై వచ్చుచున్న శిశువునకు ప్రారంభము నుండియే భగవత్కటాక్షముండి, పరభక్తి పరజ్ఞానము, పరమభక్తి నీనియందు స్థానము జేసికొని నిల్చెను. విష్ణుచిత్తుడు నిత్యమును తమ పూదోటలోని పూలనుండి పూమాలలు కట్టి భగవంతున కర్పించు నాచారము గలదు. వారట్లు సిద్ధపఱచిన మాలను గోదాదేవి తాను ధరించి అద్దము నందు తమ సౌందర్యమును చూచుకొని స్వామికి తాను అపురూపమైన స్త్రీనే నని నిర్ధారించుకొని అనంతరము మాలనుతెచ్చి ఇచ్చుచుండెను. ఈ విషయము విష్ణుచిత్తు నకు తెలియదు. మాలను భగవంతుని కర్పించుచుండిరి. ఒకరోజు కూతురు మాల ధరించుటను విష్ణుచిత్తులు కనిపెట్టిరి. అట్లు చేయుట, తప్పని చెప్పి అసమాధాన పడిరి. ఆరోజు భగవంతునికి మాల అర్పించనేలేదు. ఆ రోజు రాత్రి వటపత్ర శాయియ ఆళ్వారులస్వప్నమందు కనబడి "ఓయీ! విష్ణుచిత్తుడా! మీరు ఈ రోజు మాలనెందులకని సమర్పింపలేదు? మీ కూతురు ధరించుకొని, అటు పిమ్మట అర్పించుచున్న మాల చాల పరిమళయుక్త మును పరమ భోగ్యమునై యున్నది. దానినే తెచ్చి చెల్లింపుము" దీనిని విని ఆళ్వారులు పరమసంతుష్టులై ఎప్పటివలెనే తిరుమాల కైంకర్యమందు నిరతులైరి. ఆ

(33 వ పేజీలో చూడుడు)

# వేదాంత దేశికులు

శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి, ఆలిపుర్.

# శరణాగత రక్షణం

వేమన పద్యాలంటే చాలామంది పిల్లలు చెవి కోసుకొంటూ వుంటారు. అవి తేట తెలుగులో వుండటమూ శ్రమ లేకుండా పిల్లల నోటికి రావడమూ అందుకు కారణం. చిన్నారి పాపలూ మీకంతా వేమనపద్యాలు ఏవో కొన్నింటి నైనా నేర్చుకొని వుంటారుగదూ! శరణు అని మనలను ఆశ్రయించినవారిని, వారు ఎటువంటి వారైనా, చివరకు మనకు పచ్చిగా పగవారైనా సరే, వారిని కాపాడటం మన ధర్మమన్న నీతిని వేమన ఒక పద్యంలో ఇలా చెప్పాడు.

చంప దగినయట్టి శత్రువు దనచేత
చిక్కెనేని కీడు చేయరాదు
పొసగ మేలుచేసి పొమ్మనుటె చాలు
విశ్వదాభిరామ వినుర వేమ

ఈ పద్యం మీరందరూ కంఠస్థం చేయ వలసినట్టిది. అంతేకాదు, ఇందులో చెప్పిన మానవతా ధర్మాన్ని మీరు మీ నిజ జీవితంలో పాటించాలి కూడా!

ఇటువంటి నీతినే వివరించే చక్కని పద్యం సుమతి శతకంలోది ఇదిగో వినండి.

"ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాడే నేర్పరి
సుమతీ"

నీతులు చెప్పడం తేలికే! మరి వాటిని చేసి చూపెట్టినవారెవరయినా వున్నారా అంటారేమో? మన పూర్వ గాథలలో ఇటువంటి సందర్భాలు ఎన్నోవున్నాయి. ముఖ్యంగా శిబి చక్రవర్తి కథ మీకంతా తెలిసిందేగదా? డేగ బారినుండి తన శరణు కోరిన పావురాన్ని రక్షించడానికి శిబి చక్రవర్తి తన శరీరాన్నే డేగకు కోసి ఇవ్వడానికి వెనుకాడలేదు. ఇటువంటి త్యాగాన్ని ప్రదర్శించడం ఉత్తము లైన మనుషులలోనే కాదు, జంతువులలో సైతం వున్నది. అందుకు రామాయణంలో శ్రీరాముల వారు సుగ్రీవాదులకు చెప్పిన బోయవాడు - పావురాల కథ చక్కని ఉదాహరణం. ఆ కథను వినండి.

ఒక అడవిలో ఒక పావురాలజంట నివసిస్తూ వుండేది. ఒకరోజు ఒక బోయ వాడు ఆ చెట్టు దగ్గరకు వచ్చి వల పన్ని పక్కనే పొంచి వుండినాడు. ఆ సంగతి తెలియని ఆడుపావురం బోయవాడి వలలో చిక్కుకొనిపోయింది. మగ



పావురం మాత్రం చెట్టుమీదే వుండి ఆడు పావురాన్ని చూసి చింతిస్తూవుంది. బోయ వాడు వలలో చిక్కిన పావురాన్ని చంపి తీసుకుపోదామని చెట్టుదగ్గరకువచ్చాడు. ఇంతలో భయంకరమైన గాలివాన మొదలయింది. ఆ బోయవాడు చెట్టు కిందే నిలిచి చలికి గడగడ వణకసాగేడు. అతడి బాధచూసి ఓర్వలేక ఆడుపావురం మగపావురంతో "నాథా! ఇతడు మనం కాపురం వుంటున్న చెట్టు దగ్గరకు వచ్చాడు. కాబట్టి ఇతడు మనకు శరణాగతుడే! అందుచేత ఇతని చలి బాధ పోగొట్టి, సేవచేయడం మన ధర్మం" అని వలలోనుంచి పలికింది.

భార్య మాటలు విని మగపావురం వెంటనే ఎక్కడికో వెళ్ళి పుల్లలు, నిప్పు తీసుకువచ్చి చెట్టు తొర్రలో మంటను మండించగా, ఆ బోయవాడు వెచ్చగా చలి కాచుకొన్నాడు. ఆ తర్వాత బోయ వాని ఆకలి తీర్చమని ఆడుపావురం భర్తను వేడుకొంది. బోయవాని ఆకలి తీర్చే ఉపాయం తెలియక మగపావురం తననే ఆహారంగా తినమని ఆ మంటలో పడి ప్రాణాలు విడిచింది.—

చూశారా! ఆ పావురాల జంట శరణాగత సేవ ఎటువంటిదో! బోయవాడు తనను చంపడం ఖాయమని తెలిసికూడా ఆడుపావురం కేవలం అతడు తమ చెట్టు వద్దకు వచ్చినంత మాత్రాన అతడిని తమ అతిథిగా, శరణు కోరినవాడిగా భావించి తన భర్తచేత అతడి కోసం ఇంతటి త్యాగాన్ని చేయించింది.—

శ్రీరామచంద్రుడు ఈ కథను చెప్పి తనను శరణువేడిన విభీషణుని తాను రక్షించడం ధర్మమని సుగ్రీవుడితో చెప్పాడు.

— కృష్ణచైతన్య.

# చాణక్యుడి తల్లిప్రేమ

బాలల కథానిక

శ్రీ టి. సుధాకర్ రెడ్డి
తిరుపతి

చాణక్యుడు నిరుపేద కుటుంబంలో జన్మించాడు. పువ్వుపుట్టగానే పరిమళిస్తుందన్నట్లు బాల్యం నుంచే చాణక్యుడి తెలివితేటలు వెల్లడౌతూవుండేవి. చాణక్యుడి తల్లికి హస్తసాముద్రికంలోనూ, విశేషించి ఒక వ్యక్తి నోటిలోని దంతాల ఆకృతిని బట్టి అతడి భవిష్యత్తును పేర్కొనడంలోనూ కొంత ప్రవేశం వుంది. అంచేత ఆమెకు ఒకరోజు తన కన్నబిడ్డ జాతకం తెలుసుకోవాలనిపించింది.

ఒకరోజు ఇంటి ముంగిట సంస్కృత శ్లోకాలు వల్లెవేస్తున్న బాలచాణక్యుణ్ణి చేర బిలిచి దగ్గర కూర్చోబెట్టుకొని నోరు తెరవమని ఆదేశించింది అతని తల్లి. చాణక్యుడు బిత్తరపోయి తల్లి చెప్పినట్లే చేశాడు. చాణక్యుడి దంతాలను పరిశీలిస్తున్న అతని తల్లి ముఖంలో రకరకాల భావాలు–సంతోషం, సంభ్రమం, ఆశ్చర్యం, విషాదం వ్యక్తమౌతున్నాయి. చివరకు తన తల్లి కంట నీరుపెట్టడంచూసి చిన్నారి చాణక్యుడు దిగులుతో అడిగాడు "ఏమయిందమ్మా? ఎందుకేడుస్తున్నావ్?" "ఏంలేదుబాబూ! నీ జాతకం చూస్తున్నాను అంతే" అంది ఆ తల్లి కన్నీరు తుడుచుకొంటూ. "అయితే నా జాతకం బాగోలేదా" అన్నాడు దిగులుగా చాణక్యుడు. "అబ్బే, అదేంకాదు నువ్వు ఒక గొప్ప పండితుడివి, రాజకీయవేత్తవి, శాస్త్రవిజ్ఞానివి కాబోతున్నావు తండ్రీ" అంది చాణక్యుడి తల్లి సంతోషంతో. "మరయితే, ఆ కన్నీళ్ళేమిటి?" అమాయకంగా అడిగాడు చాణక్యుడు. ఆ తల్లి కాసేపు తటపటాయించి చివరికి ఇలా అంది: "బాబూ! చూడబోతే నువ్వు రాజువి కూడా అయ్యేట్లున్నావు. అందుకే నాకు చింతగావుంది" చాణక్యుడికి అయోమయంగావుంది ఇదంతా. "అమ్మా! నేను రాజునైతే నువ్వు సంతోషిస్తావుగానీ, కన్నీరు పెట్టుకొంటావా? అదేంకాదులే, ఏదో దాస్తున్నావు. నాకు చెప్పవూ?" అంటూ మారాంచేశాడు చిట్టి చాణక్యుడు. ఆ తల్లికి తన బాధను బైటపెట్టక తప్పలేదు. "నిజమే నాయనా! అయితే నువ్వు రాజువవుతావనికాదు నా చింత. రాజు కాగానే ఈ ముసలితల్లిని మర్చిపోతావేమోనని నా విచారం" అంది ఆ తల్లి కొడుకును లాలిస్తూ!

ఈ మాటలకు చాణక్యుడికి ఫక్కుమని నవ్వొచ్చింది. ఎంత తమాషాగావున్నాయ్ అమ్మమాటలు! అపురూపమైన అమ్మను కూడా మర్చిపోయే వాళ్ళుంటారా ఈ లోకంలో ఎవరైనా?

కాసేపటికి చాణక్యుడు నవ్వడంమానేసి ఆలోచనలో పడ్డాడు. "అమ్మా! నేను రాజును అవుతానని నీకెలా తెలిసిందో చెప్పు" హఠాత్తుగా ప్రశ్నించాడు చాణక్యుడు. "నీ దంతాలు ఒక ప్రత్యేక ఆకారంలోవున్నాయి బాబూ! ఇలాంటి దంతాలున్న వాళ్ళు రాజవుతారని నేను చదివాను" అంటూ అతని తల్లి బదులుపలికింది. బాలచాణక్యుడు అమాంతం కేకవేశాడు. "అయితే, నీ దిగులుకు కారణం నా దంతాలు అన్నమాట"

ఇలా అంటూనే బాలచాణక్యుడు పెరట్లోకి పరుగెత్తి అక్కడవున్న ఒక రాయిని తీసి తన దంతాలకువేసి గట్టిగా కొట్టుకొన్నాడు. ఆ దెబ్బకు ఒకటి రెండు దంతాలు విరిగిపోయి చాణక్యుడి నోటిలో రక్తం వెల్లువలయింది. కాని ఆ పిల్లవాడికి చీమకుట్టినట్టుకూడా లేదు. "అమ్మా! ఇదుగోచూడు నా దంతాలు రాలిపోయాయి. ఇక నేను రాజయ్యే యోగమూలేదు, నిన్ను మర్చిపోయ్యే పాపమూలేదు" అంటూ అమాయకంగా తల్లి దగ్గరకు పరుగెత్తుకువచ్చాడు చిట్టి చాణక్యుడు. "ఓరి నా పిచ్చి తండ్రీ! ఎంతపని చేశావురా" అంటూ ఆ తల్లి కొడుకును కావలించుకొని వలవలా ఏడ్చింది.

బాలలూ! చూశారా! చాణక్యుడి తల్లిప్రేమ ఎంత స్వచ్ఛమైందో! పెరిగి పెద్దయిన తర్వాత చాణక్యుడు రాజు కాకపోయినా చంద్రగుప్తుని రాజుచేసి కీర్తి గడించాడు. అర్థశాస్త్రం రచించి మహాపండితుడుగా రాజనీతిజ్ఞుడుగా పేరు పొందాడు.

# ప్రణవోపాసన

శ్లో॥ సర్వే వేదాః యత్పదమామనన్తి
తపాంసి సర్వాణి చ యద్వదన్తి
యదిచ్ఛంతో బ్రహ్మచర్యంచరన్తి
తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యో
మిత్యేతత్
(కఠోపనిషత్ ద్వితీయవల్లి. శ్లో. 15)

మన హైందవ మతగ్రంథములన్నియు బ్రహ్మపద ప్రాప్తికి "ఓం" కారోపాసనను పరమమైన సాధనముగ తెల్పుచున్నవి. ఓం అనెడి ఏకాక్షరోపాసన ద్వారమున జీవుఁడు సమస్త సృష్టి రహస్యము నెఱిఁగి పరమపదప్రాప్తి నొందుచున్నాఁడు. దీనికే "ప్రణవ" మని నామాంతరము. "ప్రాణాన్ సర్వాన్ పరమాత్మని ప్రణామయతి ఇతి ప్రణవః" (అధర్వశిఖోపనిషత్తు) ప్రాణులను పరమాత్మ స్వరూపమునందు ఐక్యముచేయు శక్తి గలిగినందున దీనికి ప్రణవమను నామ మేర్పడినది. అదియే ఓం కారమని పై ఉపనిషద్వాక్యమూలమున తెలియుచున్నది ఈ ఓం అనెడి ఏకాక్షరమే ద్వైతా ద్వైత, విశిష్టాద్వైతులకును్ను పరబ్రహ్మ పదప్రాప్తికి సాధనంబై యున్నది. ఈ ఓంకార ఉపాసన ద్వారమున తెలియఁబడునది ఆత్మతత్త్వము. అట్టి ఆత్మతత్త్వమును. తెలిసికొనుటకు ముందుగా, "శ్రోతవ్యో మన్తవ్యోనిధి ధ్యాసితవ్యః" అను బృహదారణ్యకోపనిషద్వాక్యము అనుసరణీయము. అనఁగా సాధకుఁడు ముందుగ ఆత్మను గుఱించి ఆర్షవాక్యములను విని, తరువాత చింతన చేసి, ఆ పిమ్మట ధ్యానమార్గము మూలమున తురీయాన్ని పొందాలి. దీనికి నిత్యానిత్య వస్తు వివేకము, ఇహాముత్ర ఫలభోగ విరాగము. శమదమాది షట్సంపత్తియు ముముక్షుత్వమునందుతీవ్రేచ్ఛయు గల్గియుండుట అవసరము.

శ్లో॥ "స్వవర్ణాశ్రమ ధర్మేణ
తసా హారితోషణాత్
సాధనం ప్రభవేత్పుంసాం
వైరాగ్యాది చతుష్టయం"

అని పై విషయమునే ఆది శంకరులు అపరోక్షానుభూతియందు పేర్కొనిరి. ముముక్షుత్వ మనఁగా బంధమునకు కారణమైన మనస్సును అంతర్ముఖం చేయవలెను. "మన ఏవమనుష్యాణాం కారణం బంధ మోక్షయోః" - అనెడి గీతావాక్యముల మూలమున బంధకారణమైన మనస్సును లోబరచుకొని నిష్కామ కర్మ ద్వారమున ఆత్మశుద్ధిని పొంది, పిమ్మట ఓంకారోపాసన మూలమున పరతత్త్వాన్ని తెలిసికొనవలెను.



అనేక శ్రుతులచే బ్రహ్మస్వరూపముగ గొనియాడబడుచున్నది యీ ఓంకారమే. "ఓ మితిబ్రహ్మ" (తైత్తరీయోపనిషత్తు) "ఓం కార ఇదం సర్వం" (ఛాందోగ్యం) "ఓం తద్ బ్రహ్మ, ఓం తద్వాయుః.... ఓం తదాత్మా...." (మంత్రపుష్పం). ఈ విధంగా ఓం కార స్వరూపం ఉపనిషత్ మూలమున పరమ పవిత్రమైన మంత్రముగ చెప్పబడుచున్నది.

"ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ
వ్యాహరన్మా మను స్మరన్
యఃప్రయాతి త్యజన్దేహం
సయాతి పరమాం గతిమ్"
(భగవద్గీత - అక్షరబ్రహ్మయోగము. 13 శ్లో.)

ఇంద్రియముల నన్నిటిని నియమించి (అనఁగా బాహ్యవిషయ గ్రహణ మొనర్పక) మనస్సును హృదయమున నిల్పి, (అనఁగా బాహ్య విషయ స్మరణమును గూడ నొనర్పక భ్రూమధ్యమున ప్రాణమును స్థాపించి, ఆత్మయోగమున వెలయుచు బ్రహ్మప్రతీకము (లేక బ్రహ్మ వాచకము)ను, ఏకాక్షరమును అగు ఓంకారము నుచ్చరించుచు, నన్ను స్మరించుచు, శరీరమును వీడి (అర్చిరాది మార్గమున) ప్రయాణ మొనర్చువాఁడు శ్రేష్ఠమగు గతిని బొందు చున్నాఁడని గీతలో భగవానుని ఉవాచ. కనుక ప్రణవము మంత్రరాజమని చెప్పనగును. నాద బిందు కళాత్మకమైన ఈ ఓం కారమును గూర్చి "సర్వే వేదాః" అని కఠోపనిషత్తు నందు నచికేతునకు ఈ ఓం కార తత్త్వము బోధింపఁబడినది. "సమస్త వేద వాఙ్మయము ఘోషించుచున్న పరపదమేదియో, చాంద్రాయణాది తపస్సుల వలన బ్రహ్మచర్యాది నిష్ఠల వలన ఏ పరమ పదం గ్రహింపఁబడుతోందో అట్టి ఆ పదం సంక్షిప్తంగా "ఓం" కారమే యని తెల్పుచున్నది.

శ్లో॥ "ఏ తద్ధ్యే వాక్షరం బ్రహ్మ
ఏ తద్ధ్యే వాక్షరం పరం
ఏ తద్ధ్యే వాక్షరం జ్ఞాత్వా
యో యదిచ్ఛతి తస్యతత్"
(కఠో. ద్వితీ. 16 శ్లో)

శ్రీ కె. వెంకట్రామయ్య,
శ్రీమతి కె. వీరలక్ష్మి
విజయనగరం

ఓం కారమే బ్రహ్మము. అదియే పరమపదంగా, సాధకుడు ఆ ప్రణవ రూపమును ఏ భావంతో ధ్యానించిన ఆ భావము నందును. "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" అనున దిచట అనుసంధేయము. ఇంకను శ్రుతి ఇలా తెల్పుచున్నది.

" ఏ తదాలం బనగ్ం శ్రేష్ఠమ్
ఏ తదాలం బనగ్ం పరమ్
ఏ తదాలం బనగ్ం జ్ఞాత్వా
బ్రహ్మలోకే మహీయతే."
(కఠో. ద్వితీయ. 17)

అనురీతి బ్రహ్మ పద ప్రాప్తికి గల సాధనములలో ఈ ఉపాసనయే శ్రేష్ఠ తరము,

వేదము సహితము ప్రణవ స్వరూపము. మొదట ఋక్, యజు స్సామ వేదముల నుండి "భూః, భువః, స్వః" అనునది ప్రభవించెను. దానినుండి అకార, ఉకార, మకారము లుద్భవించగా నేర్పడిన రూపమే ఓం కారము. ఇదియే ఏక మైన అక్షరబ్రహ్మ.

శ్లో " అకారం బ్రహ్మరూపంచ
ఉకారం విష్ణు రూపంచ
మకారం రుద్రరూపంచ
త్రిమూర్తిం ప్రణవాత్మకం"

దీని వలన సృష్టి, స్థితి, లయ కారకులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల రూపములు అకార, ఉకార, మకారములనియు, ఓం కారము త్రిమూర్తి స్వరూపమనియు విశదమగుచున్నది. అంతేగాక "అ" అనగా ఈశ్వరుడు, "ఉ" అనగా జీవాత్మ, "మ" అనగా మాయ అనియు విజ్ఞుల వివరణము. వీనిలో అకార, ఉకారములు స్వరములు. స్వతంత్రాక్షరములు 'మ' కారము వ్యంజనము. అందువలన యిది స్వరంతో కలసినపుడే పలుకుబడి నొందును. కనుక ఈశ్వరుడు జీవాత్మలో ప్రవేశించని నాడు మాయ దృగ్గోచరము కాదు. అ-మ లకు మధ్య ఉ అను వర్ణమున్నది. అనగా ఈశ్వరుడు - మాయ మధ్య జీవాత్మ యున్నది. అకార మకారములకు మధ్య నున్న ఉకారము అకారముతో కలసి ఓ అగుచున్నది. అది ఏకరూపము. అనగా జీవాత్మ, పరమాత్మలకు అభేదం తెలియబడుచున్నది. ఇప్పుడు ఓ తో వ్యంజనమైన మకారం కలసినను 'అ' లో లీనమైన 'ఉ' ను చేరలేదు- మకారము అనగా జీవాత్మ పరమాత్మవి చేరుకొనిన నాడు మాయ దానిని ఏమీ చేయలేదు. కనుక "ఓ మితి బ్రహ్మ" (తైత్తిరీయం) అని చెప్పుట వలన తద్రూపమే యగుచున్నది. అందుచే ఓం కార మాత్రముగ చెప్పబడిన దృశ్యమాన జగత్తంతయు బ్రహ్మమే యగుచున్నది. ఆ బ్రహ్మ ఓం కార మూలమున తెలియబడును.

"సర్వగ్ం హ్యేతద్బ్రహ్మా-
యమాత్మా బ్రహ్మ
సోఽయ మాత్మా చతుష్పాత్ "
(మాండూక్యం-2వ మంత్రం)

-అని మాండూక్యోపనిషత్తు చెప్పుచున్నది. అంచే ఆ బ్రహ్మ విశ్వ, తైజస, ప్రాజ్ఞ, తురీయములను నాల్గు పాదముల ద్వారమున ప్రత్యగాత్మగా చెప్పబడుచున్నది. ఆత్మయొక్క విశ్వ, తైజస, ప్రాజ్ఞులను మూడు పాదములే ఓం కారము యొక్క అక్షరత్రయమగుట వలన మొదటి దశయైన వైశ్వానరము ఓం కారములోని అకారమనెడి ప్రథమ సూత్ర మగుచున్నది. సర్వవ్యాపియైన వైశ్వానరుడు అవిద్యచే బహిర్విషయములందు జ్ఞానముతో స్థూల ప్రపంచమునందలి విషయములనే అనుభవించుచుండును. ఆత్మ స్వరూపమైన బ్రహ్మము ఈ వైశ్వానరంలో బహిర్ముఖమై 19 ముఖములతో భాసమాన మవుతుంటాడు. (జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, పంచ ప్రాణాలు, అంతఃకరణ చతుష్టయము. అనునవి 19 ముఖాలు.)

తైజసుడు ద్వితీయ పాదము. ఈతడు అంతర్ముఖుడు. అనగా స్వప్నావస్థను పొందుచున్నాడు. అనగా ఈ పాదములో ఆత్మయొక్క చైతన్యం అంతర్ముఖానుభవమును పొందుచున్నది, జాగరితావస్థ యందువలె 19 ముఖముల ద్వారమున విషయ భోగములు పొంది నట్టుగ మానసికానుభవమును పొందుటచే ఇందు ప్రజ్ఞ అంతర్ముఖమై యున్నదని గ్రహించవలెను. ఈ దశయందు జీవుడు స్వప్నమందు మానసిక రూపమైన అనుభవమును పొందుటచే స్వప్నావస్థలో తైజసుడుగ చెప్పబడు చున్నాడు.

ఇక తృతీయస్థానమైన సుషుప్త్యవస్థని పొందిన ప్రాజ్ఞుడు ఓం కారములో మకార రూపుడు. ఆత్మకి గల 19 ముఖములు ఈ దశ యందుండవు. ఈ దశలో ఆత్మ ఆనందమైనస్థితిని బొందును. జాగ్రత్స్వప్నముల యందలి అనుభూతులు, వాసనలు ఏ మాత్రమును సుషుప్తియందుకాన్పింపవు ఆనందానుభూతులు, మనోవృత్తులు లేని ఏమియు తెలియనిస్థితిని బొందును. మరల సుషుప్తి నుండి ఆత్మ జాగరితమైనప్పుడు బహిర్వాసనలు, విషయములు మరల యంకురించును. ఈ సుషుప్తి యందు ఆనందానుభూతి మాత్రము బ్రహ్మపద ప్రాప్త్యానందముకాదు. అవిద్యతో గూడిన యానందమిది.

ఇక నాల్గవ పాదమైన తురీయమందు ఆత్మ వేరుగా నుండక పరమాత్మతో
(30 వ పేజీలో)

# భాగవతము నందలి భక్తులు

(గత సంచిక తరువాయి)

## 9. కుచేలాదులు

భాగవతమున ప్రహ్లాద గజేంద్రాది భక్తుల గాథలేగాక పురంజనుడు, ప్రియవ్రతుడు, జడభరతుడు, అజామిళుడు, చిత్రకేతుడు, సుయజ్ఞుడు, అంబరీషుడు, రంతిదేవుడు, కుచేలుడు, అక్రూరుడు మున్నగు భాగవతోత్తముల చరిత్రములు ఉపాఖ్యాన రూపమున వివరింపబడి యున్నవి. వీరందరు శ్రవణ, సంకీర్తన, దాస్య సఖ్యాది భక్తిమార్గములలో నేదేనొక దాని ననుసరించి పరమేశ్వర ప్రసాదమునందిన వారే. సంసారవృక్ష స్వరూపము, శరీర సంపుటీకరణ విషయము మొదలగు వేదాంత విజ్ఞాన విషయములను పురంజనోపాఖ్యానము స్పష్టమొనర్చుచున్నది. చిత్రకేతూపాఖ్యానము ప్రధానముగ జనన మరణ స్వరూపమును నిరూపించుటయే గాక, విష్ణుభక్తులు ఇతర దైవతముల యెడ గూడ భక్తితో ప్రవర్తింపవలెనే గాని అగౌరవము చూపతగదనియు, శివ కేశవులకు తత్త్వతః భేదములేదనియు కూడ నుపదేశించును. ''జాతస్య మరణం ధ్రువమ్''అను నిజము అందరకూ విదితమే. కాని స్వజన మరణము సంభవించినపుడు దుస్సహమగు దుఃఖమును సహించి విర్లిప్తులుగ నుండువారరుదు. "బంధము దుఃఖ హేతువు. దానినుండి విముక్తి నందుటయే మోక్షము" అను నీ విషయ ప్రబోధమును సుయజ్ఞోపాఖ్యానము గొప్పగ నిర్వహించినది. ఈషణత్రయమున జిక్కి కొట్టుమిట్టాడు పెద్దవారు సైతము గుర్తింపలేని యీ నగ్న సత్యమును బాలుని నోట చెప్పించుట యీ కథ యందలి విశేషము. లౌకిక, వేదాంత విషయములు రెండును మేళవింపబడి రచింపబడిన గాథ "కుచేలోపాఖ్యానము". మానవుడు సకలైశ్వర్యములచే తులతూగుచున్నను స్నేహితులపట్ల ధనమదాంధతను (ద్రోణునియెడ ద్రుపదునివలె) ప్రకటింపరాదు. వారికి సాయపడుట తన కర్తవ్యముగా భావింపవలెను"-అనెడి సాంఘిక నీతిని గాథ బోధించుటయేగాక "జీవేశ్వరులకు తత్త్వము ననుసరించి చూడ భేదము లేదు. కాని జీవుడు సంసారబంధమున జిక్కి మాయామోహితుడై సంచరించుచుండును. అపుడతడు కుచేలుడే. కుచేలమనగా జీర్ణవస్త్రము. వస్త్రమిచ్చుట లౌకిక భోగములకు సంకేతము. అతడు సుచేలుడు కావలెనన్న హరికటాక్షమునంది తీరవలెను.'' అను నాధ్యాత్మిక రహస్యము సైతము సుబోధ మొనరించుచున్నది.

భగవంతునకు నిర్మల భక్తితో సమర్పించు లేశమాత్రమైన పదార్థమైనను పదివేలుగ నంగీకరింపబడుననియు, నీచ వర్తనుడై యతని భక్తింతగులని దుష్టాత్మకుండు. హేమాచలతుల్యంబైన పదార్థంబు నొసగినను అది పరమాత్మునకు సమ్మతంబుకాదనియు కూడ నీ యుపాఖ్యానము వలన నెఱుంగనగును.

## 10. అజామిళుడు

అజామిళుని కథయందొక వైచిత్ర్యము కలదు. "అజ=అజ్ఞానము, మిళయతి= మేళవించినవాడు అని వీని పేరున కర్థము. సార్థక నామధేయుడగు నితడు జీవితమున భ్రష్టుడు. ప్రాణోత్క్రమణవేళయందు తన చిన్న కుమారుడగు నారాయణుని పిలిచినంత మాత్రమున యమదూతల బారి నుండి తప్పించుకొని విష్ణుసాయుజ్యము నందినాడు. ఎంతటి పాపాత్ముడైనను భగవన్నామస్మరణమును ఏయుద్దేశముతో చేసి నను ముక్తుడగుననుట కితని కథ దృష్టాంతము. జన్మించిన దాదిగా పాప కార్యము లొనరించు వాడొక్క మారు విష్ణుని స్మరించినంత మాత్రమున పుణ్యుడగునా? యను సందేహమునకు విష్ణుదూతలొసగు నీ సమాధాన మెంతయు సమంజసము. వినుడు.

ఎ) "దెందంబు పుత్రువలనం
జెందిన దని తలప వలదు శ్రీపతిపే రే
చందముల పలుకగలిగిన
నందక ధరు డందు గలడు
నాథుండగుచున్ (6-121)

శ్రీ డి. నాగసిద్దారెడ్డి,
తిరుపతి,

బి) "బిడ్డ పేరు పెట్టి పిలుచుట విశ్రామ
కేలికైన మిగుల గేలినయిన
పద్య గద్య గీత భావార్థములనైన
కమల నయను దలప కలుషహరము"
(6-122)

వాఙ్మయమున నితని గాథ ననుసరించి నిగమశర్మ, విరంకుశుడు మున్నగు నజామిళునివంటి వారి చరిత్రములు ప్రసిద్ధి కెక్కినవి.

## 11. జడభరతుడు

కర్మ క్షయము గానిదే మోక్షము లభింపదనియు బంధముచే నెంతటి వాడయినను భ్రష్టుడగుననియు భరతోపాఖ్యానముద్బోధించుచున్నది అవధూతాగ్రణి యగు నీ భరతుని పరిపాలనమువల్ల మన దేశమునకు భారతదేశమను పేరు సిద్ధించినది. (శకుంతలాదుష్యంతులకుమారుడగు భరతుడు పాలించుటచే భారతదేశమను (30 పేజీలో చూడుడు)

# దశావతారములు - అన్నమయ్య

శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, ఎం. ఎ., తిరుపతి.



"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ
దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి
యుగే యుగే॥"

అని శ్రీకృష్ణుని వచనము. దుర్జనులను శిక్షిస్తూ, సజ్జనులను రక్షిస్తూ, ధర్మాన్ని నిలుపుటకై భగవంతుడు యుగయుగాల్లోను అవతరిస్తాడని భావం. "గూఢముగనున్న ఆ పరమేశ్వరుడు తాను ప్రకటితమగుటయే అవతారము."

కాలం అనాది. గడచిన అనంత కాలంలో పుట్టిన లోకకంటకులనేకులను తునుమాడి లోకంలో ప్రశాంతతను కలిగించుటకై పరమాత్ముడు ఎన్నోమార్లు అవతరించాడు. వానిలో ముఖ్యంగా చెప్పుకొని స్మరింపదగ్గవి దశావతారాలు. ఈ దశావతారాలు

"మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహోఽథ
వామనః।
రామో రామశ్చ రామశ్చ బుద్ధః
కల్కిరేవచ॥"

అని వరుసగా శ్లోకరూపంలో చెప్పబడ్డాయి. ఈ దశావతారాల్లో కొందరు బలరామావతారానికి బదులుగా కృష్ణావతారాన్నికూడా చేరుస్తారు. మరి కొందరు పెద్దలు బలరామకృష్ణుల్లో ఏ ఒక్కర్ని స్వీకరించినా ఇరువురను స్వీకరించినట్లే అని చెప్పడం కద్దు.

మన భారతీయ వాఙ్మయంలో ఈ దశావతారాలు అనేకచోట్ల అనేక గ్రంథాల్లో వర్ణింపబడ్డాయి. ప్రధానంగా మన ఆంధ్రవాఙ్మయంలో 'దశావతారాలు - వానిపరిశీలన'ను గూర్చి అన్వేషించినట్టయితే ఒక పరిశోధనా గ్రంథమే తయారౌతుందని చెప్పవచ్చు. మన జానపదవాఙ్మయంలోను, శతక వాఙ్మయంలోను, భారత భాగవతాది మహాకావ్యాల్లోను, మనుచరిత్రాది ప్రబంధాల్లోను, అనేక యక్షగానాల్లోను ఈ దశావతారాలు చాల చక్కగా చిక్కగా వర్ణింపబడివున్నాయి. పూర్వం నుంచీ జానపదుల్లో పాటలుగాను, పదకవితలుగాను, కీర్తనలరూపంలోను దశావతారాలు తెలుగునాట, తెలుగునోట అత్యంతప్రచారాన్ని పొందాయి. లలితకళల్లో చరకళలైన సంగీతసాహిత్యాల్లోనేకాక, స్థిరకళలైన చిత్రలేఖన, శిల్పకళల్లోకూడ దశావతారాలు ప్రముఖస్థానాన్ని ఆక్రమించి వున్నాయని వక్కాణించవచ్చు. అందుచేతనే ప్రతి విష్ణ్వాలయ గోపురాలమీదా, కుడ్యాల మీదా ఈ దశావతారాల శిల్పాలు, చిత్రాలు నయనానందకరంగా దర్శనమిస్తుంటాయి.



ఈ దశావతారాలు 'హరియవతార'మని కొనియాడబడిన తాళ్లపాక అన్నమాచార్యుని వాఙ్మయంలో, అంటే ఆ సంకీర్తనాచార్యుడు సృజించిన పదాల్లో అవతరించిన తీరును స్థాలీపులాకంగా పరికించడమే ప్రకృతవ్యాసలక్ష్యం.

అన్నమాచార్యుడు మనసా, వాచా, కర్మణా శ్రీ వేంకటేశ్వరుని భక్తుడు. భక్తుడేకాదు కవి, పండితుడూ, సంకీర్తనాచార్యుడుకూడ. శేషాద్రిపైన నెలకొనిఉన్న 'అభయప్రదాత' శ్రీ అలమేల్మంగావల్లభుడే ధర్మసంస్థాపనార్థమై యుగయుగాల్లో అవతరించినాడనీ, ఎన్నోఘనకార్యాలు సాధించాడనీ అన్నమయ్య భావన. ఆ భావనలోనే తన్మయుడై అన్నమయ్య అహోరాత్రాలు

ఆలాపించినాడు. ఆ ఆశుకవితాలాపనలే "సర్వమంత్ర రహస్యోద్భావనములైన" పదకవితలుగా విరాజిల్లినాయి. అందుకే అన్నమయ్య కేవలం భక్తుడుగానేగాక 'పదకవితాపితామహుడు'గా కూడ లోకంచే కీర్తింపబడ్డాడు.

తెలుగువారి దేశీయతకు అద్దంపట్టేవి పొడుపుకథలు. ఈ పొడుపుకథలు ఆబాల గోపాలంలో జిజ్ఞాసను రేకెత్తించి ఆలోచనాసక్తిని పెంపొందింపజేస్తాయి. ఉదాహరణకు

"మూడుకన్నులుండు ముక్కంటియునుగాడు
జుట్టుగలదు నెమిలి పిట్టగాదు"

అని ఆలంకారికంగా టెంకాయనుగూర్చి చెప్పబడిన పొడుపుకథలో ఒక అర్థోత్సుకత ద్యోతకమౌతుంది. ఈ పొడుపు కథల సరళిలోనే అన్నమయ్య దశావతారాలను ఈ క్రింది పాటలో ఎలావర్ణించాడో చిత్తగించండి:

రామక్రియ

ఎవ్వఁడోకాని యెఱఁగరాదు కదు
దవ్వులనేవుండు తలఁపులోనుండు ॥పల్లవి॥

ఎడయవు తనరెక్క లెగసిపోలేఁడు
కదు దాఁగు గాని దొంగయుఁ గాఁడు
వడిఁగిందు పడును సేవకుఁడునుఁ గాఁడు
వెడఁగు గోళ్లపెంచు విటుఁడునుఁగాఁడు ॥ఎవ్వఁ॥

మిగులాఁ బొట్టివాఁడు మింటికిని ఁబొడవు
జగడాలు తపసివేషములును,
మగువకై పోరాదు మరి విరక్తుఁడును
తగుఁ గాఁపు ఁబనులు నెంతయుఁదెల్లఁ దనము ॥ఎవ్వఁ॥

తరుణుల వలపించు తగిలిపైకొనఁడు
తురగముఁ దోలు రౌతునుఁ గాఁడు
తిరువేంకటాద్రిపై ఁదిరుగు నెప్పుడును
పరమమూర్తియై పరగు నీ ఘనుఁడు ॥ఎవ్వఁ॥

భగవంతుడు దవ్వులా, అవ్వులా, తలపులో, మలపులో అంతటావుంటాడు. వాడు సర్వాంతర్యామి. కాని వాడే వీడని, ఇలావుంటాడనీ, ఎరుగుట కదు అసాధ్యమనీ పల్లవిలో అన్నమయ్య వాకొన్నాడు. కాని పాట చివరి రెండు పాదాల్లో వేంకటాద్రిపై వెలసిన ఘనుడే డనీ, వాడే యుగయుగాల్లో అవతారాలెత్తాడనీ వర్ణిస్తున్నాడు అన్నమయ్య.

'ఎడయవు తనరెక్కలెగసి పోలేఁడు' అనుపాదంలో మత్స్యావతారం వర్ణింపబడింది. చేపకు రెక్కలుంటాయి. అంతమాత్రంచేత అది పక్షివలె ఎగరలేదని సారాంశం. 'కదుదాఁగుఁగాని దొంగయుఁగాఁడు'! దాక్కునేలక్షణందొంగది. తాబేలుకూడా తనతలను లోపలికి ముడుచుకొని దాక్కుంటుంది. అంతమాత్రంచేత అది దొంగగాదు. అందువల్ల పై వాక్యంలో విష్ణువు యొక్క కూర్మావతారం వర్ణింపబడింది.

"మిగులాఁ బొట్టివాఁడు మింటికినిఁ బొడవు" అని చెప్పడంలో మొదట పొట్టిగానుండి తదుపరి బ్రహ్మాండాన్నావరించిన వామనావతారం విరోధాభాసంతో వర్ణింపబడింది. 'జగడాలు తపసివేషములును' తాపసులకు శాంతం సహజ లక్షణం. కాని వేషం చూస్తే తాపసిగా వుండీ, క్షత్రియులతో జగడాలాడిన శ్రీ పరశురాము డిందు వక్కాణింపబడ్డాడు. 'మగువకై పోరాదు మరి విరక్తుఁడును' అన్న వాక్యంలో సీతకోసం రావణునితో పోరాడి జయించిన తదుపరి, సీతను త్యజించిన రామావతారమిందు స్పష్టం చేయబడింది. "తగుఁగాఁపుఁబనులు నెంతయు దెల్లఁదనము" నాగేలి ధరించిన కాపులు సేద్యం చేసి నల్లబడివుంటారు. కాని నాగేలిని ధరించిన వాడైనా, తెల్లగా వుంటాడనుటలో బలరాము డిందు పేర్కొనబడ్డాడు. 'తరుణుల వలపించు తగిలిపైకొనఁడు' అన్న వాక్యంలో త్రిపురస్త్రీలను వలపించుకొని తానుమాత్రం వారి వలలోతగలని బుద్ధావతారం స్పష్టం కావింపబడింది. 'తురగముఁదోలు రౌతునుఁగాఁడు' గుఱ్ఱంమీద సంచరించును - అంతమాత్రం చేత గుఱ్ఱపురౌతు గాదనుటలో కల్క్యావతారం వర్ణింపబడింది.

ఇట్లు అన్నమయ్యపై పాటలో కొన్ని విశిష్ట లక్షణాలద్వారా వర్ణించి దశావతారాలు తనజీవితసర్వస్వమైన శ్రీ వేంకటేశ్వరునిలో చూచి తనివి చెందినాడు.

యాచకుల కోరికలను తీర్చువారిని దాతలంటారు. కాని యాచకుల సమస్త కోరికలన్నీ నెరవేర్చెడి దానపరులు లోకంలో చాల అరుదు. అట్టి దాతను అన్నమయ్య కనుగొన్నాడు. ఆ ఉత్తమ దానపరుడు చేసిన దానాలను వల్లెవేస్తూ తద్వారా 'అల్పాక్షరాలలో అనల్పార్థ రచన' అన్నట్లుగా శ్రీమహావిష్ణువు యొక్క దశావతారాలను ఈ క్రింది పాటలో పేర్కొన్నాడు అన్నముని.

సామంతం—అవతారాలు

తానే కాకెవ్వరు మాకు దాతయు దైవము తన-
లోపఁబెట్టుకొని మాకు లోనైనవాఁడు ॥పల్లవి॥

చదివించి కూడువెట్టి జారకుండనిల్లుగట్టి
బెదురులేని బుద్ధి పిన్ననాఁడే చెప్పి
యెదిరినడిగి ద్రవ్యమిది గొమ్మనుచువిచ్చి
పదిలమై తమ్ముఁబాలించువాఁడు ॥తానే॥

మోహవియోగమ్ము మోహానురాగమ్ము
దేహవిభాగంబు దెలిపిన కలికి
ఐహికమున వేంకటాచలాధీశుఁడై సర్వ-
దేహరక్షకుఁడై తిరుగుచున్నాఁడు ॥తానే॥

'మాకు దాతా, దైవమూ నీవేనయ్యా! నీవుకాక మరెవరు మాకు దిక్కు? మమ్ము కడుపులో బెట్టుకొని

(25వ పేజీలో చూడుడు)

# భక్తివినాసన్మార్గముగలదే?

(గత సంచిక తరువాయి)

'పద్మమువంటి మోముగల లక్ష్మీదేవికి నమస్కారము. క్షీరసాగరమున జనించిన సతీమణికి నమస్కారము. చంద్రునికి, అమృతమునకు తోడబుట్టిన సాధ్వికి నమస్కారము. శ్రీ మన్నారాయణుని కిల్లాలైన తల్లికి నమస్కారము.

'దయాసముద్రాయ సదీశ్వరాయ
ధనేశమిత్రాయ సుధామయాయ।
కారుణ్యరూపాయ అయస్కరాయ
శివాసమేతాయ నమశ్శివాయ॥

శంకర భగవత్పాద కృత శివస్తుతి.

'దయా సముద్రుండును, సదీశ్వరుండును, కుబేరునికి మిత్రుడును అమృతమయుడును, కరుణాస్వరూపుడును అయస్కరుండును. పార్వతీ సమేతుండు నగు సదాశివునికి నమస్కారము.

శ్రీ సింగనమల్ల రాధాకృష్ణయ్య
సిమెంటునగర్.

శ్లో॥ ఏకేన చక్ర మపరేణ కరేణ శఙ్ఖ
మన్యేన సిన్ధు తనయామవలమ్బ్యతిష్ఠన్।
వామేతరేణ వరదాభయ హస్తముద్రాం
లక్ష్మీనృసింహ మమదేహి కరావలమ్బమ్॥

— కరావలమ్బ స్తోత్రము

'ఒకచేత చక్రమును, యింకొక చేత శంఖమును అంకస్థలమున లక్ష్మీదేవిని కలిగి వరదాభయ హస్తముద్రలతో వెలయు నృసింహుడు చేయూత నొసగు గాక!' అని చేయు యీ స్తోత్రము ఒక శరణాగతియే.

భగవత్సన్నిధాన మంతదూర ముండగనే పునః పునః ప్రణామములు చేయుచు ద్వారపాలక. వైనతేయ, విష్వక్సేనాది పరివారగణములను స్తుతించుచు ప్రదక్షిణములు సల్పి దివ్య సన్నిధిని చేరుట శ్రీ వైష్ణవ సంప్రదాయము. భగవద్రామానుజుల శ్రీ వైకుంఠ గద్యలోని క్రింది వాక్యమును పరిశీలింపుడు.

'దూరాదేవ భగవన్తం శేష భోగే శ్రియాసహాసీనం వైనతేయాదిభిః సేవ్యమానం, సమస్త పరివారాయ శ్రీమతే నారాయణాయ నమః' ఇతి ప్రణమ్యోత్థాయోత్థాయ పునః పునః ప్రణమ్యాత్యన్త సాధ్వసవినయావనతో భూత్వా భగవత్పారిషద గణనాయకైర్ద్వారపాలైః కృపయా స్నేహగర్భయా దృశాఽవలోకితః సమ్యగభివన్దితైస్తైరేవానుమతో భగవన్తముపేత్య, శ్రీమతామూలమన్త్రేణ 'మామైకాన్తి కాత్యన్తిక పరిచర్యా కరణాయ పరిగృహ్ణీష్వ ఇతియాచమానః ప్రణమ్యాత్మానం భగవతే నివేదయేత్.'

భక్తుడు భగవత్సన్నిధికి పునః పునః ప్రణామములు చేయుచు అవనతశిరస్కుడై ప్రదక్షిణములు సల్పుచు నేగవలెను. ఏక ప్రదక్షిణము, ఏకనమస్కారము నిషిద్ధము.

నమః అనగా నమస్కారమని యర్థము. ఈ పదమును వ్యాఖ్యానించుచు శ్రీ పిళ్లై లోకాచార్యులవారు —

'నమస్సు 'న' ఎన్ఱుమ్, 'మ' ఎన్ఱుమ్ ఇరణ్డుపదమ్, 'మ' ఎన్గిఱ విత్తాల్ తనక్కురియ నెన్గిఱదు; 'న' ఎన్ఱుమ్ అత్తైత్తవిల్క్కిఱదు ఆక నమః ఎన్గిఱ విత్తాల్ తనక్కురియ నన్ఱెన్గిఱదు.'

అని కృప జేసినారు. వీరి యీ వ్యాఖ్యను తెలుగున కనువదించుచు శ్రీ కాంచీ జగదాచార్య సింహాసనాధీశులగు శ్రీ ప్రతివాద భయంకరమ్ అణ్ణంగరాచార్య పూజ్యపాదులు:

"నమస్సు 'న' అనియు 'మ' అనియు రెండు పదములు. ఇది అవాంతర పద విభాగమని గ్రహించునది. 'మ' అనునది షష్ఠ్యంత 'మ' శబ్దము. 'మ' అనుటకు 'తనకు' అని యర్థము. 'నేను నా సొమ్మును కాను. నాకు నేనే స్వామిని కాను' అను నర్థము నిర్ధారింపబడినది." అని యనుగ్రహించినారు.

విశ్వరూపసందర్శనముచే ధన్యుడయిన అర్జునుడు పులకితాంగుడై సాష్టాంగ నమస్కారములు చేయుచు, చేసిన స్తోత్రము నిట స్మరించుట భవతారకము.

శ్లో॥ వాయుర్యమోఽగ్నిర్వరుణ శ్శశాంకః
ప్రజాపతి స్త్వంప్రపితామహశ్చ।
నమో నమస్తేస్తు సహస్ర కృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే॥

— భగవద్గీత–11–39

పై శ్లోకమును వ్యాఖ్యానించుచు శ్రీ మచ్ఛంకర భగవత్పాదులు నుడివిన వాక్యములు భగవద్రామానుజుల 'ప్రణమ్యోత్థాయోత్థాయ పునః పునః ప్రణమ్యాత్యన్త' అను వాక్యముల సమర్థించుచున్నవి. అవధరింపుడు.

"సహస్ర కృత్వః - పునః చ భూయః అపి నమో నమః తే బహూనో నమస్కార క్రియాభ్యాసావృత్తి గణనం కృత్వా సుఖ ఉచ్యతే. పునః చ భూయః అపి ఇతి శ్రద్ధా భక్త్యతిశయాద్ అపరితోషమ్ ఆత్మనో దర్శయతి." — శంకరభాష్యము

'భగవంతుడగు శ్రీకృష్ణునకు చేయు నమస్కారము దశాశ్వమేధావభృత స్నాన తుల్యము. అయినను దశాశ్వమేధములు చేసిన పుణ్య పురుషుడు పునర్జన్మము నందును. శ్రీకృష్ణ నమస్కారము చేసిన వారికి పునర్జన్మ నాస్తి' అను భీష్మస్తవ రాజమును స్మరింతము.

ఏకోఽపి కృష్ణస్య కృతః ప్రణామో
దశాశ్వమేధావభృథేన తుల్యః।
దశాశ్వమేధీ పునరేతి జన్మ
కృష్ణ ప్రణామీ నపునర్భవాయ॥

## దాస్యము

గుణమాహాత్మ్యాసక్తి రూపాసక్తి పూజాసక్తి'
స్మరణాసక్తి దాస్యాసక్తి సఖ్యాసక్తి వాత్స
ల్యాసక్తి
కాన్తా సక్త్యాత్మ నివెదనాసక్తి
తన్మయతాసక్తి పరమ విరహాసక్తి రూపా
ఏకస్యేకాదశధా భవతి '

నారదభక్తి సూత్రము

నారద మతాను సారముగల ఏకాదశ విధ భక్తులలో దాసులొకరు. దాస సంప్రదాయము దక్షిణ భారతమున సుప్రసిద్ధము. దీని నారంభించిన మహామనీషి పురందర దాసు. సేవక భావముతో భగవంతుని యజమానిగా కొలుచుటయే దాస సంప్రదాయము. ఇదియు నొకవిధమైన శరణాగతియే.

'తవదాసోఽహం తవదాసోఽహం దాసోఽహం తవదాశరథే' అని త్యాగరాజు కీర్తించినాడు.

శ్రీ వైష్ణవులు దాసాను దాసులు. దాసోఽహమ్మను సూత్రము శ్రీ వైష్ణవుల జీవనాడి. వారు నిత్యకింకరులు (శేషావస్థోచితాశేష శేషతైక రతిరూప నిత్య కింకరో భవ........శరణాగతిగద్య).

దాసోఽహమ్మనిన భక్తులను స్వామి తప్పక రక్షించుననుటకు గజేంద్రరక్షణము ద్రౌపదీ మానసంరక్షములే ప్రబల నిదర్శనము.

'లోకస్య వ్యసనాప నోదన కరోదాసస్య కిన్నక్షమః?' అని కులశేఖరాళ్వారుల ప్రశ్న.

(ముగింపు వచ్చే మాసంలో)

# బాలల సంక్షేమ కృషిలో దేవస్థానం

శ్రీ కంచాటి చెంచుకృష్ణయ్యశెట్టి, తిరుపతి

"బాలవాక్కు బ్రహ్మవాక్కు" అన్నది ఆర్యోక్తి. కల్లకపట మెరుగని పసిపిల్లలను పరమాత్ముడితో పోల్చడం అన్ని భాషలలోనూ అన్ని దేశాలలోనూ అనూచానంగా వస్తున్న ఆచారమే! 'పిల్లలూ దేవుడూ చల్లనివారే కల్లకపట మెరుగని కరుణామయులే' అని తెలుగులో ఒక కవి గానంచేస్తే "పాపలు మంచికి రూపాలు, దేవుడి గుడిలో దీపాలు' అంటూ ఆదేభాషలో ఇంకొక కవి పసిపాపల్ని ప్రశంసించాడు.



సరస్వతీ నమస్తుభ్యమ్ ........

ఇలా శిశువులు స్వభావసిద్ధంగా మంచివారైనప్పటికీ, సానపట్టనిదే రత్నమైనా ప్రకాశించనట్లు విద్యాబుద్ధులు గరపందే వారు అభివృద్ధికిరారు. ఒకవ్యక్తి నడతగాని జీవితంలో అతడి సాఫల్యవైఫల్యాలుగాని బాల్యదశలో అతడు పొందిన శిక్షణపై ఆధారపడివుంటవన్నది సర్వులూ అంగీకరించిన సత్యం. శిశువులకు తల్లిదండ్రులే మొదటి గురువులు. ఇల్లే వారికి తొలిపాఠశాల. కాని నేటి నవనాగరిక యాంత్రిక జీవన సరళిలో శిశువుల శిక్షణపట్ల తల్లిదండ్రుల బాధ్యతలు పరిమితమైపోతున్నవి. చిన్నారి చిరుతప్రాయం నుంచే శిశువులు ఇల్లు విడచి పాఠశాలల నాశ్రయించవలసి వస్తున్నది. ఈ పరిస్థితులలో సమాజంలో బాలల విద్యాలయాలు ఎంతో కీలకమైనపాత్రను నిర్వహించవలసి వస్తోంది.

ఎలిమెంటరీస్కూలునుంచి యూనివర్సిటీ వరకుగల తిరుమల తిరుపతి దేవస్థానంవారి బృహత్ విద్యావ్యవస్థలో బాలల విద్యాలయాలు ఆదినుంచి అధిక శ్రద్ధాసక్తులకు పాత్రమౌతూవచ్చాయి. బాలబాలికలలో సచ్ఛీలతను నైతిక విలువలను పెంపొందించే దృక్పథంతో దేవస్థానంవారు తమ స్వంత పర్యవేక్షణలో ఎన్నో పాఠశాలలను నిర్వహిస్తూవున్నారు. కేవలం నైతిక, ధార్మిక విద్యాబోధనకేగాక మానవ వ్యక్తిత్వ సర్వతోముఖ వికాసానికి అవసరమైన అన్ని విద్యలకూ, కళలకూ దేవస్థాన పాఠశాలలు వుండటం గమనార్హం. ఈ అంతర్జాతీయ బాలల సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానంవారి బాలవిద్యా మందిరాలను వాటి ప్రగతిని స్థాలీపులాకంగా పరిశీలించడం ఈ వ్యాస ప్రయోజనం.

### శ్రీ వేంకటేశ్వర ప్రాథమిక పాఠశాల — తిరుమల

చిత్తూరు జిల్లాలోకేగాక రాష్ట్రమొత్తం మీదగల ప్రాథమిక పాఠశాలలోకెల్లా ఇది చెప్పుకోదగ్గది. 1926 సం॥ లో ఇది ప్రభుత్వం వారిచే గుర్తింపబడినది. నలభైసెక్షన్లతో రెండువేలా రెండువందలమంది విద్యార్థులతో 38 మంది ఉపాధ్యాయులతో నడుస్తున్న అతిపెద్ద పాఠశాల ఇది. ఇందులో ఒకటినుంచి ఐదువరకు తరగతులున్నవి. రాశిలోనేగాక వాసిలోకూడా ఇది మేటి పాఠశాల అనడానికి రెండు సంవత్సరాలు వరుసగా ఇది రాష్ట్రంలోకి ఆదర్శ పాఠశాలగా ఎన్నికై రోలింగ్ షీల్డును పొందడమే ప్రత్యక్ష తార్కాణం.

ఈ పాఠశాలను ఇంతగా రాణింపుకు తెచ్చిన ప్రధానోపాధ్యాయులు శ్రీ వై. జ్ఞానచంద్రవర్మగారికి 1978 సంవత్సరంలో స్వర్ణ పతకం ప్రదానంచేసి దేవస్థానం ప్రతిభకు పట్టాభిషేకం చేసింది. ఈ పాఠశాల విద్యార్థి చిరంజీవి బి. ఆదినారాయణ 1977 సం॥ లో జరిగిన వ్యాసరచన పోటీలలో రాష్ట్రస్థాయిలో ప్రథమ బహుమతిని పొంది ఆనాటి విద్యామంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావుగారిచే మన్ననలను, మొమెంటోను అందుకొన్నాడు.

ఈ పాఠశాల దినదినాభివృద్ధిని గమ



ఇష్టాన్న భోజనాలను ఇంపుగా ఆరగించే చిన్నారులు

వించిన దేవస్థానంయాజమాన్యంవారు దీని నూతన భవన నిర్మాణార్థం 15 లక్షల గ్రాంటును మంజూరుచేసి సత్వరంగా భవనాన్ని నిర్మిస్తూవున్నారు.

## శ్రీ వేంకటేశ్వర వేదశాస్త్రాగమ విద్యాకేంద్రం — తిరుమల.

ఇది విశ్వవ్యాప్తమయిన విద్యాసంస్థ. 1926 సం॥ లో కేవలం వేదపాఠశాలగా ప్రారంభమైన ఈ విద్యాలయంలో ఆ తర్వాత సంస్కృత భాషా సాహిత్యాల అధ్యయనానికికూడాస్థానంకల్పించబడింది ప్రస్తుతం ఇది వేదశాస్త్రాగమ విద్యా కేంద్రంగా వెలుగొందుతూవుంది. ఈ సంవత్సరం ఈ పాఠశాలలో గల విద్యార్థుల సంఖ్య 180. విద్యా బోధకుల సంఖ్య 21 ప్రిన్సిపాల్‌గారు దీనికి ప్రధానాధికారి. పది నుండి పన్నెండేళ్ళ ప్రాయం గలిగి 5 వ తరగతి పాసయినవారికిమాత్రమే ఇందులో ప్రవేశందొరుకుతుంది. వేదము, సంస్కృత కోర్సులలో బ్రాహ్మణులకు, బ్రాహ్మణేతరులకు ప్రవేశం కలదు.

వేద విద్యలందు ఋగ్వేదము, శుక్ల, కృష్ణ యజుర్వేదములు, సామవేదము కలవు. అధర్వణ వేదాధ్యాపన లేదు. పాంచరాత్రాగమము, వైఖానసాగమము, శైవాగమము, మరియు స్మార్తాగమములు కలవు. ప్రబంధము, దివ్యప్రబంధములు కలవు. దేశంలో ఇన్ని వైదిక విద్యా శాఖలతో నడచు విద్యాకేంద్రాలలో ఇదే ప్రధానమైనది. వేదాలతోబాటు ఇక్కడ ప్రవేశ పరీక్ష వరకూ ఆరేళ్ళపాటు సంస్కృతంలో కూడా శిక్షణ ఇస్తున్నారు. ప్రవేశపరీక్ష తర్వాత ఇక్కడి విద్యార్థులు తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాలలో చేరి శిరోమణి పట్టభద్రులు అవుతున్నారు. ఈ పాఠశాలలో చదివే విద్యార్థులందరూ ఉచిత భోజన ఆవాస సౌకర్యాలను అనుభవిస్తున్నారు. విద్యాపరిపూర్తి తర్వాత వారికి ఉపాధి సౌకర్యాలను కల్పించే బాధ్యతనుకూడా ఇటీవల దేవస్థానం స్వీకరించింది. ఇక్కడ వేదవిద్యలో విద్వాంసులైన వారిని దేవస్థానంవారు వేదపారాయణదార్లుగా నియమిస్తూ వున్నారు

ఇదివరకు ఈ వేదకేంద్రంలో పది సంవత్సరాల అధ్యయనం గల క్రమపాఠి కోర్సు మాత్రమే వుండేది. కాని ఇటీవల ఆ కోర్సు పదమూడు సంవత్సరాల అధ్యయనం గల ఘనపాఠి కోర్సుగా మార్చబడింది

మొత్తం మీద సంస్కృతంలో తప్ప మిగతా అన్ని వైదిక విద్యాశాఖలలోనూ 13 సంవత్సరాల అధ్యయనం వుంది. ఇది పట్టభద్రుల స్థాయికి సమానము. లౌకిక వ్యవహారం కొరకు ఆంగ్లం, తెలుగు భాషల్నికూడా ఇక్కడ నేర్పుతూవున్నారు.

ప్రతి సంవత్సరమూ వేద విద్వత్ సదస్సువారు ఈ విద్యా కేంద్రంలో పరీక్షలను నిర్వహించి విద్యార్థులకు ఉత్తీర్ణతా పత్రాలు అందజేస్తుంటారు.

గురుకుల వాతావరణంలో నడిచే ఈ వేద విద్యా కేంద్రంలో విద్యార్థులు విధిగా కట్టు, బొట్టు, జుట్టు నియమాలను పాటించి ప్రాచీన కాలంనాటి మునిబాలకుల్ని స్మరణకు తెస్తూవుంటారు. ఇక్కడ శెలవు దినాలుకూడా ఇతర విద్యా సంస్థలకు

(23 వ పేజీలో చూడుడు)

క్రీడా పారవశ్యంలో బాల బాలికలు



(18వ పేజీ తరువాయి)

భిన్నంగా వుంటాయి. అష్టమి, చతుర్దశి, అమావాస్య లేక పౌర్ణమి, పాఢ్యమిరోజులలో వేదాధ్యయనం వుండదు. ప్రతి శుక్రవారం ప్రత్యేక పూజలు, ధార్మికోపన్యాసాలు వుంటుంటాయి. తిరుమలలోగల ఆర్ష సంస్కృతి సదస్సు కార్యక్రమాలకు దీనితో అనుబంధంవుంది. హిందూమతోద్ధారకులగు మహనీయులు కంచికామకోటి పీఠాధిపతులు, శృంగేరి జగద్గురు స్వాముల వంటివారు ఈ ఆగమ విద్యావిహారంలో ప్రత్యేక ధార్మిక కార్యక్రమాలను అనుగ్రహించివున్నారు. భారత దేశాధ్యక్షుడు, ప్రధానమంత్రి, ముఖ్యమంత్రివంటి రాజకీయ శిష్టులెందరో గతంలో ఈ విద్యాలయాన్ని సందర్శించి దీని విశిష్టతను ప్రశంసించివున్నారు.

## శ్రీ వేంకటేశ్వర మూక, బధిర మరియు అంధులపాఠశాల

ఈ పాఠశాల 1974 జూన్ 25వ తేదీన స్థాపించబడినది. గ్రేడ్ I మొదలు గ్రేడ్ IV వరకు మరియు గ్రేడ్ VI లలో మొత్తం 76 మంది విద్యార్థులు ఇందులో వున్నారు. ప్రస్తుతం మూక, బధిర విద్యార్థులేగాని అంధులెవరూ ఇక్కడలేరు. కుల మత వివక్షతలేకుండా వికలాంగులైన బాలబాలికలకందరికీ ఇందులో ప్రవేశంవుంది.

అయిదు మొదలు పది సంవత్సరాల వరకు వయసుగల బాలలకే ఇందులో ప్రవేశార్హతవుంది. ప్రిన్స్‌పాల్‌గారు దీనికి పర్యవేక్షకులు. ఏడుగురు ఉపాధ్యాయులు నలుగురు ఉపాధ్యాయినులు ఇక్కడ బాలలకు తర్ఫీదునిస్తున్నారు. అధ్యాపకులందరూ మూక బధిరుల విద్యాబోధనలో ప్రత్యేక శిక్షణపొందినట్టి అనుభవశాలురే. తిరుపతి రామ్‌నగర్‌లో విశాలమైనభవనం, హాస్టల్ సౌకర్యాలుగల ఈ వికలాంగుల విద్యాకేంద్రం దక్షిణదేశంలోగల ఇట్టి వాటిలో ప్రముఖమైందిగా చెప్పవచ్చును. ఈ పాఠశాలలో అడుగుపెట్టేటప్పుడు నోరు విప్పి మాటలాడలేని బాలలు, చెవులతో వినలేని చిన్నారులు పాఠశాలను వదిలే నాటికి చక్కగా మాటలాడుతూ చెవులారా వినగలుగుతూ తమ దురదృష్టానికి వీడ్కోలు చెప్పి ఆత్మవిశ్వాసంతో నూతనోత్సాహంతో లోకంలోకి ప్రవేశిస్తూవుంటారు. ఇక్కడ చదువు పూర్తిచేసిన వారు ఎందరో ఉద్యోగాలుచేస్తూండటం ఈ సంస్థకు గర్వకారణం. స్వయం ఉపాధి నిమిత్తం డ్రాయింగు, కుట్టుపనిలోకూడా శిక్షణ గరపడం ఈ పాఠశాల ప్రత్యేకత ఈ పాఠశాల అభివృద్ధికి దేవస్థానం వారు కొత్త ప్రణాళికలను సిద్ధం చేస్తూవున్నారు.



బాల బాలికలకు ఉచిత వైద్యసౌకర్యం

## శ్రీ వేంకటేశ్వరబాలమందిర్ - తిరుపతి

తల్లిదండ్రులులేని పేద విద్యార్థినీ విద్యార్థులకు ఉచితభోజనవసతి సౌకర్యాలు కల్పించడానికి వుద్దేశించిన ఈ బాలమందిర్ 1948 సంవత్సరంలో స్థాపించబడింది. ప్రస్తుతందేవస్థానం పాఠశాలలలో చదివే 135 మంది బాలబాలికలు ఇక్కడ ఆశ్రయం పొందుతున్నారు. ఇది ఒక స్పెషలాఫీసర్ నేతృత్వంలో పనిచేస్తున్నది. ఒక గుమాస్తా, ఇద్దరురికార్డు అసిస్టెంట్లు, ఒక అటెండర్, ఒక మేల్ మేట్రన్ ఇక్కడ గల సిబ్బంది. కుంటివారయిన పిల్లలకు సహాయకులుగా ఇదరు లేడీమేట్రన్లు కూడా వున్నారు. బాలబాలికలకు పౌష్టికాహారం, దుస్తులు మొదలు కొని ఆటపాటలవరకూ వారి సకలావసరాలనూ తీర్చే అభయధామం ఈ బాలమందిర్ ఇక్కడి విద్యార్థులంతా సోదరభావానికి, సౌజన్య సౌశీల్యాలకు, క్రమశిక్షణాయుతమైన సామూహిక జీవనానికి లోనై చక్కని అభివృద్ధిని సాధిస్తూవుంటారు. ఇందుకు నిదర్శనంగా ఈ బాలమందిర్ ఆశ్రయంలో పెరిగి పెద్దవారై దేవస్థాన సేవలో వున్న వున్నతోద్యోగులను ఎందరినో చూపవచ్చును

## శ్రీ వేంకటేశ్వర ప్రాథమికోన్నత పాఠశాల

బాలమందిర్‌కు అనుబంధంగా దాని ఆవరణంలోనే నెలవేర్పరచుకొన్న ఈ పాఠశాల 1951 సం॥ నుండి పనిచేస్తున్నది. ఒకటవతరగతినుంచి ఏడవతరగతి వరకూ 18 సెక్షన్లువున్నవి. ప్రస్తుతం 1062 మంది బాల బాలికలు ఇక్కడ విద్యాభ్యాసం చేస్తున్నారు. ఏడుగురు ఉపాధ్యాయులు, పదిహేనుమంది ఉపాధ్యాయినులు వీరికి శిక్షణ గరపుతున్నారు. అయిదు సంవత్సరాలు

పూర్తిచేసిన బాల బాలికలు ఇక్కడ చేర వచ్చును. ఈ పాఠశాల పురోభివృద్ధికోసం ప్రధానోపాధ్యాయులుగారు యథాశక్తి కృషి చేస్తున్నారు. వారి కృషికి దేవస్థానం సహకారం జతఐతే త్వరలో ఇది తిరుమలలో గల ప్రాథమిక పాఠశాలవలె ఒక బృహత్ విద్యాసంస్థ కాగలదని చెప్పవచ్చును.

### శ్రీ పద్మావతీ స్త్రీల కళాశాల వారి నర్సరీ మరియు ప్రైమరీ స్కూలు

శ్రీ పద్మావతీ స్త్రీల కళాశాలలోని హోమ్ సైన్సు డిపార్టుమెంటుకు అనుబంధంగా 1968 సం॥లో ప్రారంభమైన ఈ నర్సరీస్కూలు శిశు సంరక్షణ, బాలల శారీరక, మానసిక ఆరోగ్యం వగైరా విషయాలకు అధిక ప్రాధాన్యత నిస్తున్నది. ఒక స్కూలు ఇన్‌ఛార్జి, మరొక ఉపాధ్యాయిని ఇక్కడి పిల్లలకు అధునాతన ఆంగ్ల విద్యావిధానాలద్వారా శిక్షణ గరపుతున్నారు. బాల బాలికల ఆంగ్ల భాషా పరిచయాన్ని పరీక్షించిన పిదపనే ఇక్కడ పిల్లలనుచేర్చుకొంటారు. ప్రతి సం॥ జూన్ నెలలో కళాశాల ప్రిన్స్‌పాల్ గారు అడ్మిషన్లు జరుపుతూంటారు. జూనియర్ నర్సరీలో పిల్లలకు 3 సం॥ వయసు, సీనియర్ నర్సరీ కయితే 4 సం॥ వయసు వుండాలి. ఇది ఉచిత పాఠశాల కాదు. బోధనా రుసుము మొదలగు వివరాలు ప్రవేశ దరఖాస్తుతో బాటు ఇచ్చే ప్రాస్పెక్టస్‌లో వుంటాయి.

నర్సరీస్కూలు చదువు పూర్తయిన పిల్లలకోసం ఇదే ఆవరణంలో ప్రైమరీ స్కూలువుంది. ఇందులో ఒకటి నుంచి ఐదు వరకు తరగతులున్నాయి. తరగతికి 30 మంది చొప్పున మొత్తం 150 మంది బాల బాలికలు ప్రస్తుతం ఇక్కడ విద్యాభ్యాసం చేస్తున్నారు. ఇది ఇంగ్లీషు మీడియమ్ పాఠశాల. తెలుగు హిందీ భాషలు కూడా నేర్పుతున్నారు. ఐదు సంవత్సరాల వయసు పూర్తిచేసిన బాలబాలికలకు ప్రవేశ పరీక్ష జరిపి అందులో నెగ్గిన వారినే స్కూలులో చేర్చుకొంటారు. ఇతర ఇంగ్లీషు మీడియమ్ పాఠశాలల నుండి ఇక్కడ చేరదలచినవారు తమ స్కూలు రికార్డు షీటుతో చేరవచ్చును.

ప్రస్తుతం ఒక స్కూల్ ఇన్‌చార్జి ముగ్గురు ఉపాధ్యాయులు మాత్రమే ఇక్కడ పని చేస్తున్నారు. డ్రాయింగ్, క్రాఫ్టు మొదలగు విషయాలకు కూడా త్వరలో ఉపాధ్యాయుల్ని నియమించే ప్రతిపాదనలువున్నాయి.

క్రమశిక్షణ విషయంలో ఎటువంటి అలసత్వం లేకపోవడం ఈ పాఠశాల విశిష్టత. పిల్లలందరూ విధిగా యూనిఫారమ్ ధరించాలి. ఉదయం 9 గంటల నుండి సాయంత్రం 3 గం॥ వరకు పాఠశాల పని చేస్తుంది. పిల్లలకోసం ప్రత్యేక బస్ సౌకర్యంవుంది. అందమైన విశాలమైన భవనం, ఆటస్థలం, ఖరీదయిన ఫర్నిచర్, తదితర హంగులన్నీ ఈ పాఠశాలకు వున్నాయి. తమ పిల్లలను ఇంగ్లీష్ మీడియంలో చదివించదలచిన ఉన్నత విద్యావంతులు, ఉద్యోగస్తులు ఐన తల్లిదండ్రులకు ఈ పాఠశాల ఒక పెన్నిధిలా వుంది.

ఈ విధంగా దేవస్థాన బాల విద్యాలయాలు బాలల విద్యావ్యాప్తికోసం యథాశక్తికృషిచేస్తూవున్నాయి. పైన పేర్కొన్న పాఠశాలలేగాక శ్రీ వేంకటేశ్వర శిల్ప కళాశాల, నాదస్వర పాఠశాల, సంగీత నృత్యకళాశాల వంటివి యుక్తవయస్కులైనవారికి లలితకళలలో చక్కని శిక్షణ ఇస్తూవున్నాయి. బాలల సంక్షేమంలో విద్య తరువాత వైద్యం ముఖ్యమైన అంశం. అంతర్జాతీయ బాలలసంవత్సరం సందర్భంగా పిల్లల ఆరోగ్య పరిరక్షణ కోసం దేవస్థానం ఒక ప్రత్యేక పథకం చేపట్టడం ఇంతవరకూ ఈ కార్యక్రమం క్రింద 610 మంది బాలబాలికలకు రోగ నిరోధక టీకాలు వెయ్యడం జరిగింది. ఇది ఇంకా కొనసాగుతూనేవుంది. శ్రీ వేంకటేశ్వర పూర్ హోమ్‌లో కుష్ఠువ్యాధి గ్రస్తులైన పసిపిల్లలకు సత్వరచికిత్సలు జరుపుతూవున్నారు.

*

## అందాల బాలల పోటీ

తిరుమల, తిరుపతి దేవస్థానపు సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో నవంబర్ 8, 9 తేదీలలో తిరుమల, తిరుపతిలలో అందాల బాలల పోటీ జరుగుతుంది. వయసును బట్టి ఏడాదిలోపు పిల్లలు, ఏడాది నుంచి మూడేళ్ళ లోపు బాలలు మూడేళ్ళనుంచి ఐదేళ్ళ వయసువారు-ఇలా మూడు వయో వర్గాల కింద బాల బాలికలు ఈ పోటీలో పాల్గొనవచ్చును. దేవస్థాన ఉద్యోగుల పిల్లలకు మాత్రమే ఈ పోటీ పరిమితం. ప్రవేశ రుసుం ఏదీ లేదు. నవంబర్ 8 తేది తిరుమల ఆస్థాన మండపం హాలులోనూ, 9 తేది తిరుపతిలో కార్యనిర్వహణాధికారి కార్యాలయంలోనూ సాయంత్రం ఐదు ఆరు గంటల మధ్య పోటీలు నిర్వహించబడుతాయి. విజేతలైన బాలబాలికలకు ఆకర్షణీయమైన బహుమతులు వుంటాయి.

(14వ పేజీ తరువాయి)
రక్షించే కొంగుబంగారం నీవేనయ్యా!' అని అన్నమయ్య వేంకటేశ్వరుని 'అన్యథా శరణంనాస్తి త్వమేవ శరణం మమ' అన్నట్లు పల్లవిలో శరణు వేడి ప్రార్థించినాడు.

తదుపరి 'చదివించి' అన్న చిన్న పదంలో మొదట సోమకాసుర సంహారం, పిమ్మట వేదరక్షణచేసి వాటిని లోకులందరు చదివేటట్లు ఒనర్చిన మత్స్యావతారం పేర్కొనబడింది 'కూడువెట్టి' అన్న నాల్గక్షరాల్లో కూర్మావతారం వర్ణింపబడింది సముద్రమథనానికి కవ్వంగా మందరాద్రి ఉపయోగపడింది. అప్పుడు విష్ణువు కూర్మావతారమెత్తి దాన్నిధరించాడు. అమృతం వెలువడింది. దాన్ని దేవతలంతా కూడుగా తిన్నారని సారాంశం. 'జారకుండనిల్లుగట్టి', అందరికీ భూమే నివాసం. దాన్ని హిరణ్యాక్షుడు నీటిలో త్రోశాడు. నీటిలో జారిపోకుండా విష్ణువు వరాహావతారమెత్తి భూమిని రక్షించి నివాసయోగ్యం (ఇల్లుకట్టించుట) చేశాడని పై వాక్యానికర్థం. 'బెదురులేని బుద్ధి పిన్ననాడేచెప్పి' లో నృసింహావతారం స్పష్టంచేయబడింది. ప్రహ్లాదుడు పిన్నవాడు. తండ్రిచే బెదురు తిన్నాడు విష్ణువు నృసింహుడై ఆ చిన్నవాని బెదురు పోగొట్టాడని తాత్పర్యం. లోక కల్యాణార్థమై బలిచక్రవర్తిని మూడడుగుల నేలను 'దేహి' యని 'ఎదిరినడిగి' న వామనావతారమిందు స్పష్టం చెయ్యబడ్డది. భూమండలమంతా జయించి పగదీర్చుకొన్నవాడు పరశురాముడు. దాన్ని ద్రవ్యంగా కశ్యపునికి దానమిచ్చినపరశురామావతారం "ద్రవ్యమిది గొమ్మనుచు నిచ్చి" అన్న వాక్యంలో స్పష్టం. "పదిలమై తమ్ముఁ బాలించువాడు" శ్రీరాముడు పదిలంగా రాజ్యమేలి 'రామరాజ్య' మని కీర్తి కెక్కిన రామావతారమిందు పేర్కొనబడింది.

'మోహావియోగమ్ము' అని అనడంలో అష్టభార్యలు, పదారువేల గోపికలు వున్నప్పటికీ తాను అంటీఅంటనట్లుగా వున్న శ్రీకృష్ణావతారంయొక్క విశిష్టత ఉట్టంకింపబడింది. "మోహానురాగమ్ము" ద్వారా త్రిపురాసురుల భార్యల మానములు గుల్లసేసిన బుద్ధావతారమిందు విదితం చెయ్యబడింది. వీరు పుణ్యులు, వీరు పాపాత్ములు అని 'దేహవిభాగంబు' చేసిన కల్క్యావతారాన్ని గూర్చి చివర్లో అన్నమయ్య వర్ణించాడు.

పై పాటలో మరొక విశేషం. విద్యాదానం, అన్నదానం, గృహదానం, అభయప్రదానం, ఇతరులకై తాను యాచనచెయ్యడం, దానమివ్వడం, రక్షించడం, ప్రేమను త్యాగం చెయ్యడం, ప్రేమించడం పరులబాధను తొలగించడం వంటి గుణాలను అన్నమాచార్యుడు తెలుపుతూ ఇవన్నీ 'ఉత్తమదాత' అనబడేవాని లక్షణాలనీ ఈ పాటలో చెప్పక చెప్పుతున్నాడు

సాధారణంగా భూతాలు ఎవరినో ఒకరిని పట్టుట వాటి సహజలక్షణం. కాని అన్నమయ్య కనుగొన్న నల్లని పొడవైన వింతభూతం, వాళ్లనూ, వీళ్లనూ అనకుండా భూమికో అందరినీ పట్టిందట! అన్నమాచార్యులు క్రింది పాటలో "పెద్ద వోడలను మింగుట, ఎముకలను మోయుట, పెద్ద చేటకాళ్లు కలిగివుండుట, పోతైన మగలనుకూడా పట్టుట, పెద్దజడలు కలిగివుండుట, నల్లని మునుగుతోనుండుట, ఉత్తబిత్తల తిరుగుట, పెద్ద అంగలతో నడచుట, పరుగెత్తుట" వంటివి భూతలక్షణాలుగా చెప్పుతూ వానిలో శ్రీవేంకటేశ్వరుని దశావతారాల్ని చక్కగా నిర్దేశించినాడు.

వరాళి

పురమిదిందరిఁ బట్టె భూతము కడుఁ
బొడవైన నల్లనిభూతము ॥పల్లవి॥

కినిసి వోడమింగెడి భూతము
పునుక వీఁపు పెద్ద భూతము
కనలి కవియు చీఁకటి భూతము
పొనుగు సోమపుమోము భూతము ॥పుర॥

చేటకాళ్ల మించిన భూతము
పోటుదారల పెద్దభూతము
గాఁటపు జడల బింకపు భూతము
జూటరి నల్లమునుఁగు భూతము ॥పుర॥

కెలసి బిత్తలే తిరిగేటి భూతము
పొలుపు దాంట్ల పెద్ద భూతము
బలుపు వేంకటగిరివయి భూతము
పులుగు మీఁది మహా భూతము ॥పుర॥

'ఓడలు సముద్రాల్లోనేవుంటాయి. ఆ ఓడలను మింగే సముద్రభూతంగా చెప్పినందువల్ల మత్స్యావతారం స్పష్టం చెయ్యబడింది. పునుక అనగా పుఱ్ఱె లేదా ఎముక. ఎముకను మోస్తున్న భూతంగా వర్ణించినందువల్ల, వీపున చిప్పగల కూర్మావతారంగూర్చి చెప్పబడింది. చీకటిభూతమనగా నల్లనిభూతం లేదా చీకట్లోసంచరించే భూతమని అర్థం చెప్పవచ్చు. హిరణ్యాక్షుడు భూమిని నీళ్లలో త్రోసినప్పుడు లోకం చీకటయ్యింది. ఆ చీకట్లోనే విష్ణువు కోపోద్రిక్తుడై నల్లని వరాహావతార మెత్తాడని సారాంశం. 'ఉద్ధృతాసి వరాహేణ కృష్ణేన శతబాహునా' అని ఫలశ్రుతి. పొనుగు సోమపుమోము భూతం అనగా భయంకరమైన మొగంగల భూతం అన్నందువల్ల విష్ణువు భయంకర నృసింహుడై ప్రహ్లాద వరదుడుగా అవతారమెత్తాడని విదితం చెయ్యబడింది. తన కాళ్లతో బ్రహ్మాండాన్నంతా ఆవరించిన వామనుడు 'చేటకాళ్ల భూతం' గా చెప్పబడినాడు. పోటుమగ

# శ్రీగోవిందరాజస్వామి ఆలయం

## తిరుపతి

### దర్శనాదిక కార్యక్రమాల వివరాలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదయం. | 5—00 | నుండి | 5—30 | వరకు | సుప్రభాతం |
| | 5—30 | ,, | 7—00 | ,, | సర్వదర్శనం |
| | 7—00 | ,, | 7—30 | ,, | శుద్ధి |
| | 7—30 | ,, | 8—00 | ,, | తోమాలసేవ |
| | 8—00 | ,, | 8—30 | ,, | అర్చన |
| | 8—30 | ,, | 9—00 | ,, | 1 వ గంట శాత్తుమొర |
| | 9—00 | ,, మ. | 12—30 | ,, | సర్వదర్శనం |
| | 12—30 | ,, | 1—00 | ,, | 2 వ గంట |
| మ. | 1—00 | ,, సా. | 6—00 | ,, | సర్వదర్శనం |
| | 6—00 | ,, | 7—00 | ,, | రాత్రి కైంకర్యాలు, గంట శాత్తుమొర |
| | 7—00 | ,, | 8—45 | ,, | సర్వదర్శనం |
| రాత్రి | 9—00 | | | | ఏకాంతసేవ |

### ఆర్జితసేవల వివరాలు:

తోమాల, అర్చన ఏకాంతసేవలకు: ఒక్కొక్కరికి ఒక్కొక్కదానికి రు. 4-00.

ప్రత్యేకదర్శనం: రు. 2/- (ఒక్కొక్కరికి)  హారతి: రు. 1/-

సర్వదర్శన సమయంలో క్రింది అనుబంధ దేవాలయాలలో ఆర్జితసేవల వివరాలు.

1) పార్థసారథిస్వామి ఆలయం; 2) శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం; 3) ఆండాళ్ళు ఆలయం;
4) పుండరీకవల్లి ఆలయం; 5) శ్రీ ఆంజనేయస్వామి ఆలయం (బయట బుగ్గవద్ద)
6) సంజీవరాయస్వామి ఆలయం (హాత్తీరాంజీమఠం ఎదురు)

} అర్చన: 0-75
హారతి: 0-25

### ఆర్జిత వాహనాలు

| | | | |
|---|---|---|---|
| తిరుచ్చి ఉత్సవం<br>పెద్దశేషవాహనం | రు. 63/- | చిన్న శేషవాహనం<br>గరుడ, హనుమంత,<br>హంసవాహనములు. | రు. 33/- |

### ఆర్జితం: అన్నప్రసాదాలు (చెలుపులు)

శీరా = రు. 155-00, పులిహోర = రు. 50-00 దధ్యోదనం = రు. 40-00, పొంగలి = రు. 55-00,
చక్కెరపొంగలి = రు. 65-00, శాకరబాత్ = రు. 85-00, కేసరిబాత్ = రు. 90-00, 1/4సోలదోసె = రు. 35-00

తి. తి. దేవస్థానం.

లైన క్షత్రియులను వధించిన పరశు రాముడు 'పోటుదారల పెద్దభూతం' గా వర్ణింపబడినాడు. జడలు ధరించి పద్నాలుగేళ్లు అరణ్యావాసం చేసిన రాముడు 'గాటపుజడల లంకపు భూత' మట! బలరాముడు నీలివస్త్రాన్ని ధరిస్తా డట! 'నీలాంబరో రౌహిణేయః' అని అమరం అందువల్ల నల్లని 'ముసుగు భూతం'గా బలరామావతారం నిర్దేశింప బడింది. 'కెలసి బిత్తలే తిరిగేటి భూతం' అన్న వాక్యంలో ఉత్తబిత్తల(దిగంబరిగా) తిరిగి త్రిపురస్త్రీలను మోసంచేసిన బుద్ధావతారం వాకొనబడింది. చివరగా, గుఱ్ఱాన్నెక్కి పెద్దఅంగలతో దాటి పోయే కల్కి 'పొలుపుదాంట్ల పెద్ద భూతం' గా విమర్శింప బడినాడు.

ఈవిధంగా అన్నమయ్య, భూత లక్షణాలద్వారా దశావతారాలను వర్ణిస్తూ, ఇన్నిరకాల వికారాలను చూపించిన భూతం వేంకటగిరిపై వేంచేసి వుందనీ, పక్షిపై ఎక్కి తిరుగుతుందనీ శ్రీవేంకటేశ్వరుని ఒక వింత భూతంగా తనివితీరా వర్ణించినాడు.

భక్తకవి అన్నమాచార్యులు శ్రీవేంకటేశ్వరుని వరదహస్తాన్ని కీర్తిస్తూ హరి దశావతారాలను ప్రస్తుతించిన తీరు రీతి క్రిందిపాటలో కడు ప్రశంసనీయం.

సామంతం

ఇందరికి నభయంబు లిచ్చుఁ జేయి
కందువగు మంచి బంగారుచేయి ॥పల్లవి॥

వెలలేని వేదముల వెదకితెచ్చినచేయి
చిలుకు గుబ్బలికిందఁ జేర్చుచేయి
కలికియగు భూకాంతఁ గాఁగిలించినచేయి
వలనైన కొనగోళ్లవాఁడిచేయి ॥ఇంద॥

తనివోక బలిచేత దానమడిగినచేయి
ఒనరంగ భూదానమొసఁగుచేయి
మొనసి జలనిధి యమ్ముమొనకుఁ దెచ్చినచేయి
యెనయ నాగేలు ధరియించుచేయి ॥ఇంద॥

పురసతుల మానముల పొల్లసేసిన చేయి
తురగంబుఁ బరపెడి దొడ్డచేయి
తిరువేంకటాచలాధీశుఁడై మోక్షంబు-
తెరువుప్రాణులకెల్లఁ దెలిపెడిచేయి ॥ఇంద॥

అన్నమాచార్యులు, ఎందరికో అభయములిచ్చే శ్రీ వేంకటేశ్వరుని బంగారు చేయిని కొనియాడుతూ, ఆ హస్తము యుగయుగాల్లో ఎన్నెన్ని పనులు సాధించిందో స్మరించి, స్మరించి, తన్మయించి పోతున్నాడు.

'వెలలేని వేదములు వెదకితెచ్చిన చేయి.' సోమకాసురుడు వేదాలను అపహరించాడు. విష్ణువు మత్స్యావతారుడై వానినుండి అమూల్యములైన వేదాలను రక్షించాడని అర్థం. 'చిలుకు గుబ్బలికిందఁ జేర్చుచేయి' చిలుకుగుబ్బలి అనగా మందరాద్రి దేవదానవులు మందరాద్రిని కవ్వంగాచేసుకొని సముద్రాన్ని మథించారు. విష్ణువు కూర్మావతార మెత్తి ఆ చిలుకుగుబ్బలి మోశాడని సారాంశం. 'కలికియగు భూకాంతఁ గాఁగిలించినచేయి' లో హిరణ్యాక్షుని బారినుండి భూకాంతను రక్షించిన వరాహావతారమిందు స్పష్టం చెయ్యబడింది. 'వలనైన కొనగోళ్లవాఁడిచేయి' వాడి గోళ్లచేతులుగలవాడు శ్రీ నరసింహస్వామి. అందుచేత ఇందు నరసింహావతారం పేర్కొనబడింది. 'బలిచేత దానమడిగిన చేయి' బలిచక్రవర్తిచేత మూడడుగులనేలను దానంగాపొందిన వామనావతారమిందు స్పష్టం. 'భూదానమొసఁగుచేయి' రాజులనుండి భూమినంతా జయించి దాన్ని కశ్యపునికి దానమిచ్చిన పరశురామావతారమందు వర్ణింపబడింది. 'మొనసిజలనిధి యమ్ముమొనకుఁదెచ్చినచేయి.' రావణ సంహారార్థమై లంకకుపోదలచిన రామునికి సముద్రుడు అడ్డుగావుండినాడు. అమ్మను ప్రయోగించి సముద్రునిచే దారిప్పించుకున్న రామావతారమిందు వర్ణింపబడింది. 'నాగేలుధరియించు చేయి' ద్వారా హాలధారియైన బలరాముడు పేర్కొనబడ్డాడు. అల్లే పురసతుల మానాలను గొన్నవాడు బుద్ధుడనీ గుఱ్ఱాన్ని నడపేవాడు కలికి అనీ స్పష్టం.

ఇట్లు అన్నమయ్య దశావతారాన్ని వర్ణిస్తూ పైపనులు సాధించిందీ వేంకటాచలముపైనున్న వరదహస్తమేనని వాకొన్నాడు.

అన్నమయ్య భావనలో శ్రీ వేంకటేశ్వరుని మూర్తిమాత్రమే దశావతారాలకు చాలినదనికాదు. శ్రీ వేంకటేశ్వరుని ఏ అవయవాన్నైనా దశావతారనిర్వహణకు జోడించి కృతకృత్యుడైనాడు అన్నమాచార్యులు.

ఈవిధంగా దశావతారాలను వర్ణిస్తూ అన్నమయ్య వ్రాసిన పాట కోకొల్లలు. ఏ పాటపాడినా, ఏ భావన చేసినా, అది శ్రీ వేంకటేశ్వరునిపైనే. అదే అన్నమయ్య జీవితపరమాశయం. అందువల్లే ఆయన సృష్టించినసాహిత్యంలో అంతటా శ్రీ వేంకటేశ్వరుని లీలావినోదాలే, చిన్మయహాసాలే నిండివున్నాయి. ఆ మాదిరి వర్ణించడం ఒక్క అన్నమయ్యకే సాధ్యంఅయ్యింది. అందుకే తాళ్లపాక అన్నమాచార్యులు పరమ భాగవతోత్తముడుగా నిలిచినాడు. ఆయన జీవన్ముక్తుడు.

వేదంబులు పౌరాణిక
వాదంబులు వరకవిత్వ వాణీ వీణా
నాదంబులు కృత సుజనా
హ్లాదంబులు తాళ్లపాక యన్నమపదముల్ ॥
(చినతిరుమలాచార్యులు)

★

# శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, తిరుమల.

1–3–79 నుండి

## నిత్యపూజ. దర్శనాదికముల కార్యక్రమము

### శని, ఆది, సోమ మరియు మంగళవారములు

ఉదయము 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతము
,, 3–30 నుండి 3–45 వరకు శుద్ధి
,, 3–45 నుండి 4–30 వరకు తోమాలసేవ
,, 4–30 నుండి 4–45 వరకు బంగారు వాకిలివద్ద కొలువు: పంచాంగ శ్రవణం,
,, 4–45 నుండి 5–30 వరకు మొదటి అర్చన
,, 5–30 నుండి 6–00 వరకు మొదటిఘంట బలి మరియు శాత్తుమొర
, 6–00 నుండి మ 12–00 వరకు సర్వదర్శనము
మధ్యాహ్నం 12–00 నుండి 1–00 వరకు రెండవఅర్చన,(ఏకాంతం)
,, 1–00 నుండి 8–00 వరకు సర్వదర్శనం
రాత్రి 8–00 నుండి 9–00 వరకు శుద్ధి, రాత్రికైంకర్యము
,, 9–00 నుండి 12–00 వరకు సర్వదర్శనం
,, 12–00 నుండి 12–30 శుద్ధి

12–30 ఏకాంతసేవ

### గురువారము

### తిరుప్పావడ

ఉదయము 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతం
,, 3–30 నుండి 3–45 వరకు శుద్ధి
,, 3–45 నుండి 4–30 వరకు తోమాలసేవ.
,, 4–30 నుండి 4–45 వరకు బంగారువాకిలివద్ద కొలువు మరియు పంచాంగ శ్రవణము
,, 4–45 నుండి 5–30 వరకు మొదటి అర్చన,
,, 5–30 నుండి 6–00 వరకు మొదటిఘంట, బలి శాత్తుమొర
,, 6–00 నుండి 8–00 వరకు నళ్ళింపు, 2 వ అర్చన (ఏకాంతం), తిరుప్పావడ, అలంకరణం, ఘంట ఇత్యాది
,, 8–00 నుండి రాత్రి 8–00 వరకు సర్వదర్శనం

సాయంకాలం 8–00 నుండి 10–00 { వరకు శుద్ధి ఇత్యాది / పూలంగి సమర్పణ / రాత్రి కైంకర్యము, ఘంట }

రాత్రి 10–00 నుండి 12–00 వరకు పూలంగిసేవ
,, 1‥00 నుండి 12–30 వరకు శుద్ధి
, 1 –30 ఏకాంతసేవ

### బుధవారము

### సహస్రకలశాభిషేకం

ఉదయం 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతము
,, 3–30 నుండి 3–45 వరకు శుద్ధి
,, 3–45 నుండి 4–30 వరకు తోమాలసేవ
,, 4–30 నుండి 4–45 వరకు బంగారువాకిలివద్ద కొలువు పంచాంగశ్రవణం
,, 4–45 నుండి 5–30 మొదటి అర్చన
,, 5–30 నుండి 6–00 మొదటిఘంట, బలి, శాత్తుమొర
,, 6–00 నుండి 8–00 సహస్ర కలశాభిషేకము
,, 8–00 రాత్రి 8–00 వరకు సర్వదర్శనం
రాత్రి 8–00 నుండి 9–00 వరకు శుద్ధి ఇత్యాది
,, 9–00 నుండి 12–00 వరకు సర్వదర్శనం
,, 1?–00 నుండి 1‥–30 వరకు శుద్ధి
రాత్రి 1 –30 ఏకాంతసేవ

### శుక్రవారము

### అభిషేకము

ఉద॥ 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతము
,, 3–30 నుండి 5–00 వరకు నళ్లింపు మరియు నిత్యకట్ల కైంకర్యములు (ఏకాంతము)
,, 5–00 నుండి 7-00 వరకు అభిషేకము (రు. 450/- రు.2‥0: రు. 100/– వారికి మాత్రమే ప్రవేశం
,, 7–00 నుండి 8–30 వరకు సమర్పణము
,, 8–30 నుండి 9–30 వరకు తోమాలసేవ మరియు అర్చన (ప్రత్యేకం) ఘంట, బలి, మరియుశాత్తుమొర
,, 9–30 నుండి 10–00 వరకు రెండవ గంట, బలి, శాత్తుమొర
10–00 నుండి రాత్రి 8–00 వరకు సర్వదర్శనం
రాత్రి 8–00 నుండి 9–00 వరకు శుద్ధి రాత్రి కైంకర్యము
రాత్రి 9–00 నుండి 12–00 సర్వదర్శనం
,, 12–00 నుండి 12–30 వరకు శుద్ధి
12–30 ఏకాంతసేవ

గమనిక ;– 1) పైకార్య క్రమములో సమయాను కూలముగాను ప్రత్యేక కార్యక్రమముల వలనను మార్పులు చేయబడవచ్చును. 2) సుప్రభాత దర్శనమునకు రు. 25/– టిక్కెట్టువారు మాత్రమే అనుమతింపబడుదురు. 3) రు. 25/– టిక్కెట్లు తిరుమలలోనూ దేశంలో ఆంధ్రాబ్యాంకువారి వివిధ కేంద్రములలోనూ లభించును. 4) ప్రత్యేక దర్శనం టిక్కెట్లు గలవారు లోగడవలె ధ్వజస్తంభంవద్దగాక మహాద్వారము క్యూలో చేర్చబడుదురు. 5) రు. 200/–ల అమంత్ర ణోత్సవం టిక్కెట్టుపై తోమాలసేవ, అర్చన ఏకాంతసేవలకు మాత్రమే అనుమతి. ఇద్దరు మాత్రమే అనుమతింపబడుదురు. 6) అర్చన, తోమాలసేవ, ఏకాంతసేవలో దర్శనానంతరపు టిక్కెట్లుగాని రు. 25/ టిక్కెట్లుగాని అమ్మబడవు.

పేష్కార్ ; శ్రీవారి ఆలయం, తిరుమల

(గతసంచిక తరువాయి)

అవ:— కర్మప్రభావమును వివరించుచు తమ్ము విడిచిపుచ్చుమని ఆ కర్మమునే వేడుకొనుచున్నాడు—

66

శ్రీరాగం

ఎన్ని బాధలఁబెట్టి-యేచెదవు నీ వింక-
నెంతకాలము దాఁకఁగర్మమా।
మన్నించు మనుచు నీ-మఱుగు చొచ్చితిమిమా-
మాటాలకించవో కర్మమా। ॥పల్లవి॥

1. ప్రతిలేని దురితముల-పాలుసేయక నన్ను-
పాలించవైతివో కర్మమా।
తతితోఁడ నాత్మపరి-తాపంబు తోఁడుతను-
తగులేల చేసితో కర్మమా।
జిత కాములకుగాని-చేతికిని లోనై-
చిక్క వేకాలంబు కర్మమా।
మతిహీనులైనట్టి-మాకు నొక పరిపాటి
మార్గంబు చూపవో కర్మమా। ॥ఎన్ని॥

2. ఆసలనియెడి తాళ్ల-నంటఁగట్టుక విధికి-
నప్పగించితివిగదె కర్మమా।
వాసి విడిచితిమి నీ-వారమైతిమి మమ్ము-
వన్నె చెడనీకువో కర్మమా।
కాసుకును కొరగాని గతిలేని పనికిగా-
కాలూద నీవేల కర్మమా।
ఓసరించొకమారు-నొయ్యనే ఒకరీతి
నొల్లనని తొలగుమీ కర్మమా। ॥ఎన్ని॥

3. తిరువేంకటాచలా-ధిపుని మాయలచేత-
దెసల దిరిగినయట్టి కర్మమా।
హరి దాసులగువారి-నాదరింతువుగాక-
అంత నొప్పింతువా కర్మమా।
వరుసనేనుగమీది-వాని సున్నంబడుగ
వచ్చునా నీకిట్లు కర్మమా।
పరమపురుషోత్తముని-భ్రమతబడి నీవిట్లు
బట్టబయలైతిగా కర్మమా। ॥ఎన్ని॥

(5-187)

ఓ కర్మమా! ఎంతో కాలమునుండి మమ్ము నీవు పీడించుచున్నావు, ఇకే ఇంకను ఎంతకాలము వరకు ఎన్ని బాధల పాలు గావించి నొప్పించెదవు? నీవు పెట్టు బాధ లేమాత్రము భరించలేక మమ్ము రక్షింపుమని నేటికి మేము నీచాటు చేరితిమి. మా మాటవిని మమ్ము మన్నింపరాదా!

ఓ కర్మమా! నీవలన మే మనేకపాపముల పాలైతిమి. సాటిలేని ఈపాపముల పాలొనర్పక మమ్ము రక్షింపవైతివి గదా! నీవలన మేమెప్పటికప్పుడు దురంతమైన మనోవేదనకు గురియగుచున్నాము. ఇంత పరితాపకరమగు బంధమును మాకేల కల్గించితివి? నీవు కోర్కెలను తుదముట్టించిన విరక్తులకే లొంగుదువు. తదితరులచేతి కెప్పుడును చిక్కవు మేము మతిలేనివారము. మామీద దయదలచి మాకు గూడ ఒక క్రమము తప్పని దారి చూపరాదా!

నున్న మదుగుటకు వీలగునా? అట్లే భగవద్భక్తులను బాధించుటకు నీకు వీలు గాదు. మేము పరమ పురుషునిపై భక్తి గల్గియున్నాము. కాన నీ గుట్టు మాకు బట్టబయలైనది. నీవింక మమ్మేమియు చేయలేవు.

వి॥ జీవు లనుభవించు బాధ లన్నియు వారి వారి కర్మఫలములే. కర్మకధీనులైన వారు పలుపాపము లాచరించి పరితపించుచున్నారు. సామాన్యుల కీ కర్మ బంధము తొలగద్రోయరానిదిగానున్నది.

భర్తృహరి తన "సుభాషితత్రిశతి"లో కర్మ పద్ధతిని వివరించుచు "దేవతలు విధికి వశమై యున్నారు. విధి కర్మలకు నియతములైన ఫలముల నిచ్చుచున్నది. ఫలము కర్మ కధీనము. కాన దేవతలకు, విధికిగాక విధినిసైతము అదుపులో బెట్టుచున్న కర్మలకే నమస్కరింపదగును.

# శ్రీ అన్నమాచార్య సంకీర్తనామృతము

శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి

ఓకర్మమా! ఆశాపాశములతో మమ్ము బంధించి కర్మఫలప్రదాయకమైన విధి కప్పగించితివిగదా! మేము మా పెద్దరికములను, పేరు పెంపులను వదలుకొంటిమి. పూర్తిగా నీ కధీనుల మైతిమి. మాపై అనుగ్రహ ముంచి మా పెంపు చెడనీక కాపాడుము. కాసుకు గూడ పనికిరాని నిష్ప్రయోజనమైన పనికై ఇంచుకంత సేపైన కాలు నిలువనీయక మమ్మేల త్రిప్పెదవు? ఒకమారు ప్రక్కకొదిగి "నేను మిమ్మొల్లను" అని తొలగవలసిన రీతిని తిన్నగా తొలగిపొమ్ము!

ఓ కర్మమా! నీవు శ్రీ వేంకటేశ్వరుని మాయా ప్రభావముచే అడ్డమాక లేక సకల దిక్కులలో సంచరింతువు. హరికి దాసులైనవారిని మాత్రము ఆదరింతువే గాని తదితరులనునొప్పించినట్లు నొప్పించజాలవుగదా! ఏనుగుపైనున్న వానిని

మరియు కర్మవశముననే బ్రహ్మాండభాండములు నిర్మించు కుమ్మరిగా బ్రహ్మ, దశావతారధారిగా విష్ణువు, భిక్షాటన పరుడుగా శివుడు, గగన భ్రమణ శీలుడుగా సూర్యుడు నియమింపబడిరి. కాన ఆకర్మకే నమస్కరింప జెల్లును" అని కర్మ మహిమను కీర్తించెను.

నమస్యామో దేవాన్
నను హతవిధేస్తేఽపి వశగాః
విధిర్వంద్యః సోఽపి
ప్రతినియత కర్మైక ఫలదః।
ఫలం కర్మాయత్తం
కిమమరగణైః? కించ విధినా?
నమస్తత్కర్మభ్యో
విధిరపి న యేభ్యః ప్రభవతి॥
బ్రహ్మా యేన కులాలవన్నియమితో
బ్రహ్మాండభాండోదరే
విష్ణుర్యేన దశావతారగహనే
క్షిప్తో మహాసంకటే।

(31 వ పుటలో చూడుడు)

---

(ప) ఏఁచెదవు=నొప్పించెదవు.

1. ప్రతిలేని=సాటిలేని; తతితోడఁ=అదనుతో; తగులు=సంబంధము; జితకాములకు=కామమును జయించిన వారికి; పరిపాటిమార్గంబు=క్రమమైన త్రోవ.

2. వాసి=పెద్దరికము; ఓసరించి=ప్రక్కకొదిగి.

(11 వ పేజి తరువాయి)
(శంకర అద్వైత సిద్ధాంతము ప్రకారము) లీనమగుచున్నది. అదే ఆత్మకు పరమావధి. ఓంకార ఉపాసన ద్వారమున పొందబడే బ్రహ్మపద ప్రాప్తి ఈ స్థితియందు ప్రజ్ఞ పరమాత్మలో కలసి జ్యోతిస్స్వరూపమై నిలిచిపోతుంది. వర్ణనకు అందని మహత్తర స్థితి యిది.

"ప్రథమం తారకంచైవ
ద్వితీయం దండముచ్యతే
తృతీయం కుండలాకారం
చతుర్థం చార్థ చంద్రాకారం
పంచమం బిందు సంయుక్తం"

అను రీతిని జ్యోతిరూపకమైన పరమాత్మని సాధనద్వారమున పొందవలెను.

ఈ ప్రణవోపాసన సర్వకాలముల యందును చేయవచ్చును.

"సర్వా విఘ్నకరీ మంత్రః ప్రణవ;"
"శుచిర్వాప్యశుచిర్వా ........ జపేత్
ప్రణవం సదా ॥

ఇత్యాది వాక్యమూలమున ఈ ప్రణవోపాసన యేఅవస్థ యందైనను ఆచరింపవచ్చును" అభిధ్యాన్న మంత్రేణ యోగిన ఆసన్నతమః సమాధి లాభశ్చ ఫలశ్చ భవతి॥ అని ఉపాసన వలన యోగికి శీఘ్రముగ సమాధి లాభము ఫలము సిద్ధించుచున్నవి. కనుక నిద్రించుసమయమునకు ముందుగానైనను ఈ ఓంకార మననము చేసిన నిద్రావస్థ యందంతయు కూడ అంతరాత్మ (Subjective mind) లో అదిభాసించుచుండును. భక్తిభావముతో మనస్సునగల చెడు సంస్కారాలన్నియు నశించును కొద్దిరోజులు సాధన దీక్షగా యొనరించిన యెడల పిమ్మట అప్రయత్నముగనే ఈ ప్రణవ జపము జరుగుచుండును. ప్రణవమనే ధనుస్సుపై ఆత్మయనెడి బాణముంచి బ్రహ్మపదమనే లక్ష్యాన్ని పొందవలెను. జ్యోతిస్స్వరూపమైన ఓంకారమును ముముక్షువులు ఉపాసించిన ఆత్మోన్నతి సాధించి బ్రహ్మపద ప్రాప్తిని పొందగలరు.

నారాయణ ప్రశ్నోపనిషత్తు నందలి ఈ వాక్యములు గమనార్హములు "జ్యోతి చల్లగా వెలుగుచున్నది. ఆ జ్యోతియే నేను. జ్యోతిస్స్వరూపమగు బ్రహ్మము వెలుగుచున్నది. ఆ బ్రహ్మమే నేను. నేను ఎవ్వరినైనను ఆ బ్రహ్మ స్వరూపుడను. నన్ను నేనే హోమము చేయుచున్నాను"

"ఓమ్ ఆర్ద్రం జ్వలతి జ్యోతి రహమస్మి।
జ్యోతి ర్జ్వలతి బ్రహ్మా హమస్మి।
యోఽహ మస్మి బ్రహ్మా హమస్మి।
అహమస్మి బ్రహ్మా హమస్మి।
అహ మేవాహం మాం జుహోమి
స్వాహా।

(నారాయణ ప్రశ్నోపనిషత్తు)

ఓం శాంతిః శాంతిః శాంతిః

---

(12వ పేజి తరువాయి)
పేరు వచ్చినదని బహుళ ప్రచారమున్నది. కానిదానికాధారమున్మృగ్యము. ఇతడుపిత్రు పితామహాద్యాయాతంబగు రాజ్యంబును యథార్హంబుగ పుత్రులకు పంచియిచ్చి పులహాశ్రమంబున నివసించుచు వాసుదేవుని సేవించుచుండెను. ఒకనాడు నది యందు స్నాన మొనరించి ప్రణవోచ్చారణ మొనరించుచుండ భరతునకు సింహ గర్జనచే భీతిల్లిన జింక గర్భమునుండి జారిపడిన పసిపిల్ల దృగ్గోచర మయ్యెను. అపుడాతడు దానిని తన యాశ్రమమునకు తీసికొనిపోయి-

"అక్కటా! తల్లిబాసి హరిణార్భక మాత్తులు లేమిఁజేసియే
దిక్కును లేకయున్న నిటఁ దెచ్చితి
నా యెడ నీ మృగార్భకం
బెక్కుడు ప్రేమఁజేసి చరియింపుచు
నున్నది నాదుసన్నిధిన్
మక్కువచేసి దీనిఁగడు మన్నన లందగఁ
బ్రోతునెంతయున్ (5-103)

అని నిశ్చయించి, దానితోడిదే లోకముగ ప్రవర్తించుచు భగవద్ధ్యానమును సైతము మఱచెను. చివరకతడు మరణించునపుడు కూడ "హరిణంబుం దన యాత్మలో నిలిపి దేహంబంతటంబాసి తా హరిణీ గర్భము నంజనించి హరిణంబై" యొప్పెను. తదుపరి హరిణజన్మానంతరము అంగిరసుడను బ్రాహ్మణునకు కుమారుడై జన్మించి పూర్వజన్మ సంచిత పుణ్య పరిపాకము తిన్ను నడిపింప అవధూత చర్యావలంబియై మోక్షము నందెను. విష్ణు పురాణమున అవధూత చర్యయిట్లు వివరింపబడినది.

"సమ్మాననాపరాంహానిం యోగర్ధిః
కురుతేయతః
జనేనావమతో యోగీ యోగ సిద్ధించ విన్దతి
తస్మాచ్చరేతవై యోగీ సతాం ధర్మ
మదూషయన్
జనా యథావమన్యేరన్ గచ్ఛేయుర్నైవ
సంగతిమ్"

జింకతో భరతున కేర్పడిన బంధము కారణముగ శ్రీహరిని చేరుట కతడు రెండు జన్మముల నెత్తవలసి వచ్చెను. కావున బంధము పతన హేతువనుటకు ఈ కథ చక్కని నిదర్శనము.

## 12. అంబరీషుడు

హరి ధ్యానపరాయణుడగు నంబరీషుడు మహాభాగవతుడు. దుర్వాస మహర్షి యితనిపై నకారణముగ కృత్యను పంపగా విష్ణుని సుదర్శన చక్రముచే రక్షింపబడి, దుర్వాసుని యపరాధమును మన్నించిన సౌజన్యమూర్తి యితడు. ఎంతటి శక్తిమంతుడైనను నిష్కారణముగ తనశక్తిని ప్రదర్శింపతగడు. విశేషించి నిరపరాధులగు భగవద్భక్తులయెడ దానిని ప్రదర్శించినచో నది తనకే యెదురు తిరుగును. అహంకారమెంతటి వారికిని ననుచితము. అంబరీషోపాఖ్యాన మీ సత్యమును బోధించుచున్నది.

(ముగింపు వచ్చేసంచికలో)

(29వ పేజీ తరువాయి)

రుద్రో యేన కపాలపాణిపుటకే
భిక్షాటనం సేవతే
సూర్యో భ్రామ్యతి నిత్యమేవ గగనే
తస్మై నమః కర్మణే॥

(భర్తృహరి-కర్మపద్ధతి)

కాని కామములను తుదముట్టించి తమలో తాము రమించు స్థితప్రజ్ఞులను మాత్రము కర్మ ఏమియు చేయజాలదనుట నిస్సంశయము.

ప్రజ్ఞాస్థైర్యములేని సాధారణజనులు సత్కర్మల నాచరించి ఫలములను భగవంతునికి సమర్పించి క్రమముగా కర్మ విముక్తులు గావలసియున్నారు. ఈ కీర్తనలోని 'పరిపాటిమార్గంబు' అన్న పదముచే ఈ యర్థమే సూచింపబడినది.

"కర్మ కర్తారుఁడని కడలేనిపుణ్యముల
కర్మఫలములు తనకు గైకొలుపఁగా,
కర్మగతి దెచ్చి వేంకటవిభుఁడు మావుభయ
కర్మములఁజెరిచె నెక్కుడి దైవమితఁడు?"

(అధ్యా-సం-5-196)

అనుచోట ఈభావమునే అన్నమయ్య వివరించెను.

ఆశాపాశములకు లోనగుటచేతనే జీవు లాయా కర్మఫలముల ననుభవించుచున్నారు. కర్మ కధీనులగువారు దాని బారినుండి తొలగనిచో ఎన్నటికిని సద్గతి నొందజాలరు.

కర్మ శ్రీవేంకటేశ్వరుని మాయ కధీనము. అందుచే అది సర్వత్ర తిరుగులేక సంచరించుచు సర్వజీవులను లోగొనుచున్నది. కాని హరిభక్తిపరులను కర్మక్లేశము లంటవు. ఏనుగుపై బోవు వానిని క్రింద నున్నవాడు సున్న మడుగుట నిష్ఫలము. వాడందియ్యలేడు, వీడందుకొనలేడు. ఆ రీతిగనే ఫలాపేక్ష లేక కర్మలొనర్చు భగవద్భక్తులను కర్మఫలము లంటవు.

కాన పరమపురుషుని మీది భక్తి యొక్కటే కర్మ ప్రభావమునుండి తప్పించుకొనుటకు సులభమైన మార్గము.

* * *

(వశేషము)

## తిరుపతిలో దేవస్థాన కాటేజీలు
## దినసరి అద్దెలు

* * *

| కాటేజీ పేరు | రోజువారీ అద్దె. |
|---|---|
| **శ్రీ శ్రీనివాస సత్రం** | |
| 1) రెండు పడకలు, బాత్‌రూమ్ లావేటరీ గల పై అంతస్థు గదులు. | — రు. 12—00 |
| 2) నాలుగు పడకలు, బాత్‌రూమ్, లావేటరీగల క్రింది అంతస్థు గదులు | — రు. 15—00 |
| 3) ఒకే పడక, బాత్‌రూమ్, లావేటరీ గల ఎక్స్‌టెన్షన్ రూములు | — రు. 10—00 |
| **శ్రీ వేంకటేశ్వర అతిథి గృహం** | |
| రెండు పడకలు, బాత్‌రూమ్ లావేటరీ సౌకర్యాలు గల గదులు | — రు. 16—00 |
| **పద్మావతి అతిథి గృహం** | |
| 1) రెండు పడకలు, బాత్‌రూమ్, లావేటరీ సౌకర్యాలుగల ఎర్‌కండిషన్డ్ గదులు | — రు. 40—00 |
| 2) రెండు పడకలు, బాత్‌రూమ్, లావేటరీ సౌకర్యం గల డబుల్‌రూమ్‌లు | — రు. 30—00 |
| 3) ఒకేపడక, బాత్‌రూమ్, లావేటరీ సౌకర్యం గల సింగల్‌రూములు | — రు. 20—00 |

* దేవస్థాన ధర్మసత్రాలలో పడకలు వగైరా ఏర్పాటులు లేని వసతి సౌకర్యం ఉచితమని గ్రహించ గోరుతున్నాము.

కార్యనిర్వహణాధికారి.

## పిల్లలకథ

# శ్రీరాముడి తీర్పు

శ్రీ టి. సుధాకర్ రెడ్డి,
తిరుపతి

రామరాజ్యంలో ఒకనాడు—

శ్రీరామచంద్రుడు ఉదయాన్నే కొలువు తీర్చి కూచొనివున్నారు. మంత్రులు, సామంతులు సేనాధిపతులు తదితర ప్రముఖులతో రాములవారి కొలువు కిటకిటలాడుతూవుంది. తమతమ ఇబ్బందులను చెప్పుకోడానికి కోసల ప్రజలు ఎవ్వరూ ఆరోజు కొలువుకి రాలేదు. అయితే విచిత్రంగా ఒక గద్ద, పులుగుపిట్ట మాత్రం తగాదాపడి శ్రీరాముడి తీర్పు కోసం కొలువుకు హాజరైనాయి. అన్నగారిఆజ్ఞ ప్రకారం లక్ష్మణుడు వాటిరెంటినీసభలో ప్రవేశపెట్టాడు మీ తగాదా ఏమిటో చెప్పమన్నాడు శ్రీరామచంద్రుడు వాటినిచూస్తూ!

వెంటనే గద్ద శ్రీరాముడికి మొక్కి వినయంగా ఇలా మనవి చేసింది "స్వామీ! ఒక కీకారణ్యంలో కొండ పైని చెట్టు మీద గూడు కట్టుకొని ఎంతో కాలంగా నేను బతుకుతూవుంటే, వున్నట్టు వుండి ఎక్కడినుంచో ఈ పులుగు పిట్ట ఊడిపడి, నా గూడును ఆక్రమించి నన్ను బైటకు తరిమేసింది. పైగా గూడు తనదేనని వాదిస్తున్నది. తమరు ధర్మం తెలిసిన ప్రభువులు. స్వయంగా వచ్చి మా తగాదా పరిశీలించి నాకు న్యాయం చేకూర్చండి."

గద్ద ఫిర్యాదువిని శ్రీరాముడు పులుగుపిట్ట వైపు చూశాడు. వెంటనే పులుగుపిట్ట రాజుగార్కి అనేక నమస్కారాలుచేసి "అంతా అబద్ధం స్వామీ! ఆ గూడునాదే! నేనే కష్టపడి స్వయంగా దానిని కట్టుకొన్నాను. దురాక్రమణ చేసింది ఆగద్దే. కనుక దాన్ని శిక్షించి నా గూటిని నాకు ఇప్పించడం ధర్మం" అంటూ మొరపెట్టుకొంది పులుగుపిట్ట,

శ్రీరాముడు మంత్రుల అభిప్రాయం అడిగాడు. ఆ గూటిని చూస్తే గాని చెప్పలేమన్నారు వారు. వెంటనే మంత్రులను పురోహితులను, తగాదాపడివచ్చిన గద్దను పులుగుపిట్టను వెంటబెట్టుకొని పుష్పక విమానంలో బయల్దేరాడు శ్రీరాముడు. కీకారణ్యంలో కొండ మీద చెట్టున్న దగ్గరకు వెళ్ళి అంతా కిందకు దిగారు. అక్కడ వున్న చెట్టుని, చెట్టుపైనున్న గూటిని చూశారు. ఆ గూడు చాలాకాలం కిందటిది. "నువ్వు ఈగూటిలో ఎప్పటినుంచి వుంటున్నావు' గద్దను అడిగాడు రాముడు. భూమిమీద మనుషులు పుట్టినప్పటినుంచీ వుంటున్నానని గద్దచెప్పింది. 'మరి, నువ్వుఎంత కాలం నుంచి ఈ గూటిలో వుంటున్నావు'

ఈసారి పులుగుపిట్టను ప్రశ్నించాడు. భూమి మీద చెట్లు పుట్టినప్పటినుంచి వుంటున్నాను అందిపులుగుపిట్ట. దాంతో శ్రీరాములవారికి పరిష్కారం దొరికి సందేహం తీరిపోయింది. కాని ఆయన తన తీర్పు చెప్పకుండా మంత్రుల్ని, ఆ తగాదాను తేల్చమన్నాడు. కానివాళ్ళకు దిక్కుతోచలేదు. ఏ సాక్ష్యమూలేందే ఈ తగాదాను పరిష్కరించేది ఎట్లాగ మహాప్రభో అన్నారు వారు.

అప్పుడు శ్రీరాములవారు చిరునవ్వుతో తమనిర్ణయం బైట పెట్టారు.

"సాక్ష్యం వీటి మాటలలోనేవుంది. భూమిమీద చెట్లు ముందు పుట్టాయి. ఆ తరువాతే మనుషులు పుట్టారు. చెట్లు పుట్టినప్పటినుంచీ వుంటున్న పులుగు పిట్టే ఈ గూడును కట్టింది. కాబట్టి అదే ఈ గూటికి యజమాని. మనుషులు పుట్టాక వచ్చిన ఈ గద్ద పులుగుపిట్ట గూటిని ఆక్రమించాలనుకొంది కనుక గద్దే ముద్దాయి. దాన్నే శిక్షించాలి. ఇది నా తీర్పు" అన్నాడు శ్రీరాముడు. శ్రీరాముడి బుద్ధి కుశలతకు సమయస్ఫూర్తికి మంత్రులంతా సంతోషించారు. పులుగుపిట్టకు గూటిని అప్పగించి గద్ద తన తప్పు వొప్పుకొంది.

బాలలూ, ఈ కథలోని గద్ద మాటల లాగే మన తప్పుల్ని ఒక్కొక్కప్పుడు మన మాటలే బైట పెడుతూవుంటాయి. అంచేత తప్పుచేసినప్పుడు దాన్ని దాచక ఒప్పుకోవడమే ఉత్తమం గదూ?

✳

(7 వ పేజీ తరువాయి)

దినమునుండి గోదాదేవికి శూడిక్కొడుత్త నాచ్చియార్ అను పేరు ప్రసిద్ధికెక్కెను.

గోదాదేవి దినదిన ప్రవర్ధమానురాలై పెరిగెను. ఈడు వచ్చిన కూతురిని పెరియాళ్వారులు చూచుచు అనురూపుడైన వరుని ఎక్కడనుండి తెచ్చుట అని చింతామగ్నులైరి. బుద్ధి సూక్ష్మతగల ఆండాళ్ దేవియు దీనిని గమనించి, తాము సర్వేశ్వరునితప్ప మఱియెవ్వరిని పతిగా వరింపజాలనని తన నిశ్చయమును తండ్రి కెఱింగించెను. శ్రీరంగములోని రంగనాథుడే తమకు తగిన పతి యని తెలిపి, స్వామి యొక్క సౌందర్యాతిశయమును అప్పుడప్పుడు తండ్రి నుండి అడిగి తెలిసికొనుచుండెను పెరియాళ్వారులు సమయము చిక్కినపుడెల్ల కూతురను తన ప్రక్క కూర్చుండబెట్టుకొని భగవంతుని అపరిమిత కల్యాణ గుణములను గుఱించి వివిధముగా గానముచేసిపొగడి వర్ణించుచుండిరి. దీనిని విని ఆండాళ్‌దేవికి భగవంతుని దివ్యసుందరమూర్తి యందు విశేషమైన ప్రీతి అనుదినము వృద్ధికాజొచ్చెను.

ఇట్లుండగా కూతురు శ్రీరంగనాధుని వరించునదెట్లు? దీనిని నివారించుటెట్లు అని ఆళ్వారులు యోచించిరి. ఒకరోజు ఆండాళు స్వప్నమందు శ్రీరంగనాథుడు కనిపించి, ఆమెను వివాహమాడునట్లుగా భాసించెను. వేఱొక రోజు పెరియాళ్వారుల స్వప్నమందు భగవంతుడు కనబడి ఓయీ! నీ కూతురు గోదాదేవిని తోడ్కొని రమ్ము. నేను ఆమెను పెండ్లాడుదును. అని చెప్పి నట్లాయెను. అదే సమయమునకు సరిగా శ్రీరంగదేవాలయమునుండి సమస్త మర్యాదలు జరుపబడెను. అప్పుడు ఆళ్వారులు మిగుల నానందముతో కూతురునకు అన్ని అలంకారములుచేసి, వటపత్రశాయి స్వామివారి ఆజ్ఞను పొంది, కూతురిని పల్లకియందు కూర్చుండబెట్టి సమస్త వైభవముతోడను సకల పరిజనులతోడను శ్రీరంగనాధుని దేవాలయమునకు వచ్చిరి. ఆండాళ్‌దేవియు, దివ్యాభరణ భూషితురాలై దివ్య పీతాంబరము ధరించి, మహా వైభవముతో మెల్లగా అడుగులిడుకొనుచు రాణి ఠీవితో, పరమాత్మనందే సమర్పితమైన మనస్సు కలిగి శ్రీరంగనాథుని పాదారవిందములను చేరి, ఆత్మార్పణము చేసి అంతర్ధానము పొందెను. వెంటనే పెరియాళ్వారులకు భగవంతుని సాన్నిధ్యమునుండి తీర్థము, తిరుమాల, తిరుపరిపట్టము శ్రీశఠగోపాది సకల మర్యాదలును చెల్లింపబడెను. ఆళ్వారులు ప్రీతి విషాదములు దందడింపగా స్వస్థానమునకు తిరిగివచ్చి భగవంతుని సేవాకైంకర్యమందు నిరతులైరి. (సశేషము)



శ్రీ రంగధామేశ్వరి గోదాదేవి

---

## తిరుచానూరు శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయంలో

# ఆర్జిత తిరుప్పావడా సేవ

తిరుచానూరు, శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయంలో ఆర్జిత తిరుప్పావడా సేవను నూతనంగా ప్రవేశపెట్టడమైనది

గృహస్థులు రు.1500 రుసుము చెల్లించి ఈ సేవను జరిపించుకొనవచ్చును. మొత్తం 12 మంది వ్యక్తులను ఈ సేవ తిలకించేందుకు అనుమతిస్తారు. తిరుప్పావడా ప్రసాదంతోబాటు నాలుగో వంతు సోల లేక పది లడ్డు, వడ, అప్పం, దోసె, ప్రసాద పణ్యారాలు గృహస్థుకు ఇవ్వబడుతవి. గృహస్థుకు వస్త్ర బహుమానం కూడా వుంటుంది. భక్తులీ సదవకాశాన్ని వినియోగించుకొని తరింపవచ్చును.

**తి. తి. దేవస్థానం**
**తిరుపతి.**

(5 వ పేజీ తరువాయి)
లేదు. దీని పైదగు ఆకాశమునులేదు. ఏది దేనినెక్కడను ఆవరించి యుండలేదు. ఎవరికి ఆశ్రయమును లేదు. గహనగంభీర మగు జలములేదు మృత్యువులేదు. అమృతములేదు. రాత్రి, పగలు చిహ్నములు కూడలేవు. వేరుగా వాయువులేక తనకు తానుగా శ్వసించు నొకేయొకవస్తువుండెను. అంతకుమించి మరేమియు లేకుండెను.”

ఇట్టి నిరాకార నిర్గుణ సత్తామాత్రమైన యొకవస్తువునుండి జగత్తు ఉద్భవించినదని వేదమతము. ఆ సద్వస్తువు సమస్తాకారములను, సమస్త గుణములను ధరించి, దేవ మానవ తిర్యగాది రూపముగా వ్యక్తమైనది. సృష్టి, స్థితి, లయ కారణమైన ఆవస్తువు సమస్తమును చూచుచు, సమస్తమును వినుచు, సర్వమును తెలిసికొన్నదై సర్వులకు శరణ్యమై, శర్మదమైయున్నది. ఆశక్తినే విశ్వకర్మయనుచున్నారు. విశ్వకర్మ మహిమ విచిత్రమైనది.

“విశ్వతశ్చక్షురుతవిశ్వతోముఖో
విశ్వతో బాహురుత విశ్వతస్ప్యాత్ ।
సంబాహుభ్యాంధమతి సంపతత్రైః
ద్యావా భూమీ నయన్దేవ ఏకః ॥
(అథ. 13–2–26)

“ఆవిశ్వకర్మయొక్కడే అంతటను నేత్రములు గలవాడై, అంతటను పాదములుగలవాడై, భూమిని ఆకాశమును సృజించువాడై, అంతటను రెక్కలవంటి తన చేతులతో ధరించియున్నాడు.”

“వేనస్తత్పశ్యన్ నిహితం గుహాసీ
ద్యత్ర విశ్వంభువ త్యేకనీళం।
తస్మిన్నిదం సంచవి చైతి సర్వం
స ఓతః ప్రోతశ్చ విభుః ప్రజాసు॥”
(శుక్లయజుర్వేదీయ వాజసనేయ సంహిత 32-8)

“గుహానిహితమైయున్న ఆసద్వస్తువు (విశ్వకర్మ) నే విశ్వభువనములు శరణు జొచ్చుచున్నవి. అంతయు నందేలీనమగుచున్నది. ఆ పరమేశ్వరుడే తనచే సృజింపబడిన అన్ని వస్తువులలోను పడుగుపేక వలె వ్యాపించి యున్నాడని ఋషి తెలిసికొనుచున్నాడు.”

సృష్టి, స్థితి, లయ కారకుడైన ఆ పరమేశ్వరునే సుఖములకొరకు ఆశ్రయింపవలెనని వేదము చెప్పుచున్నది.

వైదికమత సిద్ధాంతము:—

వేద శాస్త్రములు మన శరీరములోని అంతరాత్మ ఒక్కడే దేవుడని చెప్పలేదు. చరాచరములతో కూడియున్న ఈ విశ్వమంతయు దేవుని స్వరూపమేయని చెప్పుచున్నవి. అట్టి దేవుడొక్కడేయైయుండి, సచ్చిదానంద స్వరూపుడును నిర్గుణుడును, నిరాకారుడును, జనన మరణాదులు లేక సర్వకాల సర్వావస్థలయందును నెట్టి మార్పునులేక శాశ్వతుడుగను నుండువాడునై యున్నాడు. అట్టి దేవునికే పరబ్రహ్మమని పేరు. ఆ పరబ్రహ్మమునకు వేరుగాక, అనాదిగ ఆయనతోబాటే ఆయనయందిమిడియున్న సర్వశక్తికి ప్రకృతి యనిపేరు ఆ ప్రకృతి మాయ యని, అవిద్యయని రెండు భాగములుగ గోచరించుచున్నది నిరాకారుడును, నిర్గుణుడునునగు పరబ్రహ్మ తన మాయాశక్తి వలన నామరూపములను, సర్వజ్ఞత్వమును సర్వశక్తి సామర్థ్యములను, స్వాతంత్ర్యమును పొంది, సర్వాంతర్యామియై ఈశ్వరుడుగ కనిపించును. ఆయనకే సగుణ బ్రహ్మయనిపేరు. అతడే తన సర్వశక్తి సామర్థ్యములచే నీ విశ్వమును సృష్టించి, వృద్ధి పొందించి, లయించుచున్నాడు. ఈ పరబ్రహ్మయే ప్రకృతియందలి రెండవ భాగమైన అవిద్యయందు ప్రతిబింబించి, ఆ యవిద్యచే నావరింపబడినవాడై జీవుడగుచున్నాడు. అట్టి జీవుడు తన సహజమగు సచ్చిదానంద స్వరూపము మరుగుపడుటచే దానిని తెలిసికొనలేక ఈశ్వరుని సృష్టిలో దగుల్కొని అవిద్యవలన కర్మనాచరించుచు, ఆ కర్మఫలముననుసరించిన సుఖదుఃఖములతో కూడిన జననమరణ రూపమగు ఈ సంసార చక్రమున దిరుగుచున్నట్లు భ్రాంతి చెందుచుండును. జీవులకు ఈశ్వరునికిగల సంబంధమును గూర్చిన విషయములను వేదములు తెలియజేయుచున్నవి.

పై విధముగ జెప్పిన వేదములే జీవుడు క్రమముగ అవిద్యా వశమునుండి తొలగి సచ్చిదానందరూపమగు పరబ్రహ్మ లక్షణ మును పొందువరకును జనన మరణ సుఖ దుఃఖములతో గూడిన ఈ సంసారము నుండి తొలగ జాలడనియు, జీవుడుకర్మల నాచరించి, స్వస్వరూపజ్ఞానమును సంపా దించుకొనలేక అవిద్యాబంధమును దృఢ పరుచుకొని సంసారమున మరింతచిక్కుల పాలుచేయుటకు తోడ్పడు కర్మలు అధర్మ ములనియు వర్ణించియున్నవి. అట్టి స్వ స్వరూప జ్ఞానము కలిగిన తరువాత నిర్గుణ పరబ్రహ్మలో నైక్యమగునని వేదములు చెప్పుచున్నవి. మంత్రములు మొదలగు తపోవిశేషములచేత జన్మాంతరమున మాత్రమే జీవునకు అవిద్యాసంబంధమగు ఉపాధిపోయి మాయా సంబంధమగు ఉపాధి లభించి, దివ్య శరీరముగలవాడై సృష్టి, స్థితి, సంహారములుచేయ సమర్థు డగును. బ్రహ్మ, విష్ణు, రుద్రాది పదవు లిట్టి తపోవిశేషములచేత కల్గునని "శ్రీ స్కాంద పురాణాంతర్గత సూతసంహిత యందలి యజ్ఞ వైభవ ఖండమున 'షడ క్షరవిచారము' అనునెనిమిదవ అధ్యాయ మున వర్ణింప బడినది.

వైదికమతములో యజ్ఞ యాగాది కర్మకాండ, చాతుర్వర్ణ్య భేదము ప్రధాన భూమికను నిర్వర్తించును.

ఉపనిషత్తులు:—

ఉపనిషత్తులు వేదసారమని చెప్పుదురు. కల్పింపబడిన వేదధర్మములే ఉపనిషత్తులు ఎవరెవరి మతములకు తగినట్లు వారుతమ ఉపనిషత్తులను సృష్టించుకొనిరి. ఉపనిష త్తులకు వేదాంతమని ప్రతీతి.

సర్వ భూతమైత్రి:

వైదిక మతము సర్వభూతమైత్రిని కాంక్షించును.

"మిత్రస్యమా చక్షుషా సర్వాణి భూతాని
సమీక్షే
మిత్రస్య చక్షుషా సమీక్షా మహే॥
(వాజసనేయ సంహిత. 31-18)

"సర్వ భూతములు నన్ను మైత్రితో చూచుగాక। మేము సర్వభూతములను మిత్ర దృష్టితో చూతుముగాక॥"

యజ్ఞములు:

వేదపఠనము, వేదమంత్రములతో నాచరింపబడు యజ్ఞములు కర్తకేగాక లోకమునకుగూడ శుభదాయకములు. వర్షా భావము, కరువుకాటకాదులు మొదలగు సమస్త పీడలను నివారించు యజ్ఞములను చేయుటకధికారముండియు చేయనియెడల యజ్ఞము చేయనివానిదే దోషమని తైత్తి రీయ సంహితలో చెప్పబడినది.

చాతుర్వర్ణ్యములు:

వర్ణభేదము వైదికమతముయొక్క ముఖ్య చిహ్నము. వాజసనేయ సంహిత లోను (25-2), ఋక్సంహితలోను (10-19-12) చాతుర్వర్ణ్యములు పేర్కొన బడినవి. "బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర" అనునవి చాతుర్వర్ణ్యములు.

జైన, బౌద్ధ మతముల ఆవిర్భావము నకు కారణము:

ఆర్యులు ఉత్తర హిందూస్థానమునందు నివసించుచుండిన కాలములోనే "చతుర్వే దములు, వేదాంగములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు, దర్శనములు" మొదలగు వైదిక వాఙ్మయము పరిపూర్ణ వికాసము నందినది. వైదిక మతములో స్థూలముగా మూడు దశలు గోచరించుచున్నవి.

అవి 1 వేదయుగము, 2 ఉపనిషద్యుగము 3 సూత్రయుగము. వేదములు రచింప బడిన కాలమును వేదయుగమనిరి. తరు వాత కొంతకాలమునకు ఉపనిషత్తులు రచింపబడినవి. ఉపనిషద్యుగమునకు వచ్చు సరికి వేదార్థము విస్తృతమైనది. యజ్ఞయాగాది కర్మకాండ పెరిగినది. చాతుర్వర్ణ్యవ్యవస్థ దృఢముగా పాదుకొని నది. ఆ తరువాత కొంతకాలమునకు సూత్రయుగము ఆరంభమైనది. సూత్ర యుగములో "యాజ్ఞవల్క్యుడు, గౌత ముడు, బోధాయనుడు, ఆపస్తంబుడు" మొదలగువారు సూత్రకారులుగా ప్రసిద్ధి గాంచిరి. వీరి సూత్రరచన ద్వారా హైందవ సంఘమున సంకుచితమైన కట్టుబాట్లేర్పడినవి. సంఘములోని నాలుగు వర్ణములవారు అవలంభించవలసిన జీవన విధానమును, ఆచరించవలసిన కర్మలను ప్రవర్తన నియమావళిని ఆపస్తంభమహర్షి తన సూత్రములలో వివరించెను. హైందవ సంఘములో నున్న నాలుగు వర్ణములవారి ధర్మములను ప్రతిపాదించెను. మొదటి మూడు వర్ణములవారు వేదవిహిత యజ్ఞ యాగాది కర్మలనాచరించెడివారు. వైదిక ధర్మము పైమూడు వర్ణములలోనే ప్రచా రములో నుండెను. ఆపస్తంబుని సూత్ర రచనతో వర్ణభేదము వెఱ్ఱితలలు వేసినది, సూత్రయుగము పూర్తియగుసరికి అగ్ర వర్ణములవారి అధికారము ప్రబలమైనది. ధర్మశాస్త్రములు, నిబంధనలు తమపక్షము గాను, తమ అధికారము నిరంకుశముగా సాగునట్లుగాను రచించిరి, వారి తోడ్పా టులేక యజ్ఞయాగాది కర్మలు చేయుటకు వీలులేక పోయెను. శూద్రవర్ణము వారి దురవస్థ దుర్భరముగా నుండెను. ఈ కారణముగా హైందవ సంఘములో కుల వైషమ్యము అధికము కాజొచ్చినది. అట్టి

## శ్రీ కల్యాణ వేంకటేశ్వరాలయం

నారాయణవనం.

*

### నిత్యకార్యక్రమ వివరాలు

| | | | |
|---|---|---|---|
| సుప్రభాతం ఉ॥ | 6-00 నుండి | | 6-30 |
| విశ్వరూపదర్శనం | 6-30 | ,, | 8-30 |
| తోమాలసేవ | 8-30 | ,, | 9-00 |
| కొలువు, అర్చన | 9-00 | ,, | 9-30 |
| శాత్తుమొర & గంట | 9-30 | ,, | 10-00 |
| సర్వదర్శనం | 10-00 | ,, | 11-30 |
| 2-గంట, అష్టోత్తరం (ఏకాంతం) | 11-30 | ,, | 12-00 |
| శిర్స్నానం | 12-00 | | |
| సర్వదర్శనం సా॥ | 4-00 | ,, | 6-00 |
| తోమాలసేవ, అర్చన (ఏకాంతం) | 6-00 | ,, | 7-00 |
| రాత్రి కైంకర్యం | | | |
| శాత్తుమొర | | ,, | 7-00 |
| సర్వదర్శనం | 7-00 | ,, | 8-45 |
| ఏకాంతసేవ | 8-45 | ,, | 9-00 |

### ఆర్జితాదుల వివరాలు

| | | |
|---|---|---|
| అర్చన, అష్టోత్తరం .. | రు. | 3-00 |
| హారతి ... | రు. | 1-00 |
| కొబ్బరికాయకు .... | రు. | 0-50 |
| సహస్రనామార్చన ... | రు. | 5-00 |
| పూలంగి (గురువారం మాత్రం) .... | రు. | 1-00 |
| అభిషేకానంతర దర్శనం (శుక్రవారం) | రు. | 1-00 |

పరిస్థితులలో జాతిభేదము పాటింపక, అందరికీ సమానమైన మతమును బోధింప వలెనను కోరిక కొందరికి కలిగెను. అట్టివారిలో వర్ధమాన మహావీరుడు జైన మతమును, గౌతమ బుద్ధుడు బౌద్ధమత మును బోధించిరి.

**జైనమతము:**

జినుడైన వర్ధమాన మహావీరుడు బోధించిన మతము జైనమతము. కర్మ బంధమునుండి జీవుడు విమోచనము నొం దుట మోక్షము. ఇది సమ్యక్ దర్శనము, సమ్యక్ జ్ఞానము, సమ్యక్ చరిత్రల వలన సాధ్యము. ఈ మూడింటికి త్రి రత్నము లనిపేరు. జినుని యందలి జినతత్త్వము నందలి విశ్వాసమునకు సమ్యక్ దర్శన మనిపేరు. ఇది మోక్షమునకు మొదటి మెట్టు. సంశయ, మోహ, విభ్రమ, దోష వివర్జితమును, స్వ-పరస్వరూప గ్రహణ శీలమును అయినది. సమ్యక్ జ్ఞానము. సమ్యక్చరిత్రమున "అహింస, అస్తేయము (దొంగతనము చేయకుండుట), సత్యము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము" అను పంచ మహావ్రతములు ప్రధానములైనవి.

**బౌద్ధమతము:**

శాక్యమునియైన గౌతమబుద్ధుడు బౌద్ధ మతమును బోధించెను. దేహమునశించును. జీవుడు నశించడు. జీవుడు కర్మఫలమును అనుభవించుచు నిర్వాణము కలుగు నంత వరకు పునర్జన్మ లెత్తుచుండును. నిర్వా ణము పొందుటకు జ్ఞానము, సత్ప్రవర్తన యుండవలెను. వేదములు అపౌరుషేయ ములు కావు. వేదములవలనగాని, యజ్ఞ ములవలనగాని ప్రయోజనములేదు. నిర్వా ణము పొందుటకు అందరూ సమానమైన అర్హతగలవారే. దుఃఖము కలుగుటకు కారణముతెలిసికొన్న యెడలమరి దుఃఖము కలుగదు, అజ్ఞానమే దుఃఖమునకు కార ణము గనుక జ్ఞానమువలన దుఃఖముపోయి నిర్వాణము కలుగునని బుద్ధుడు బోధించెను.

జైన, బౌద్ధమతముల ఆవిర్భావమునకు వైదికమతము, ఆనాటిసాంఘిక వ్యవస్థయే కారణము. వైదిక మతములోని పశు హింసాత్మకమైన కర్మకాండ, వర్ణ వ్యవస్థ పెచ్చుపెరిగి ప్రజాబాహుళ్యములో అసం తృప్తిని కలిగించినది. అట్టిసమయములో విప్లవాత్మకమైన 'అహింస', సర్వమానవ సౌభ్రాతృత్వము అను ధర్మములను బోధించేటప్పటికి ప్రజలలో చైతన్యము కలిగి, వర్ణ భేదము విడిచి అందరూ నూతన మతములవైపు ఆకర్షింపబడిరి. వారి దివ్య బోధ మానవ జాతి అసంతృప్తి పరి దగ్ధ హృదయాలపై పన్నీటి జల్లు అయినది. వారి విశ్వప్రేమ అన్నివర్ణముల వారిని ఆకర్షించినది. అగ్రవర్ణములవారి నిరం కుశాధికారమును ప్రతిఘటించుటకు, జీవ హింసతో కూడిన యజ్ఞయాగాది కర్మ కాండను తొలగించి, అహింసను ప్రధాన ధర్మముగా బోధించుటకు జైన, బౌద్ధ మతములు ఆవిర్భవించినవి. 'చార్వాకుడు, కపిలుడు' మొదలగు మహర్షులు వైదిక మత సిద్ధాంతములను నిరసించి నప్పటికిని వైదికమతములో నవచైతన్యమును కలి గించి, మొట్ట మొదటిసారిగా ఒక నూతన విప్లవమును లేవదీసినవి జైన, బౌద్ధ మతములని చెప్పక తప్పదు.

# ఈమాసం మీఅదృష్టం!

### మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పా)

రాహువు వలన ఆందోళన. నవంబర్ 3 తేది నుండి శని ఆనుకూల్యంవల్ల ఆరోగ్యం, విజయం. గురువుద్వారా ధనం, కీర్తి నూత్న వస్త్రాలు, శృంగారం, వాహన యోగం లేదా గృహప్రాప్తి లేదా సంతానం. కుజునివలన అనారోగ్యం లేదా ఉదరబాధ లేదా జ్వరం, లేదా దుస్సహవాసాలవల్ల కష్టాలు. 6 తేది నుండి కుమారుల, కుమార్తెల మూలంగానూ శత్రువుల కారణంగానూ ఆందోళన. 16 తేదిలోగా రవి వలన ప్రయాణం, ఉదరబాధ. ఆ తర్వాత అనారోగ్యం, భార్యకు అసంతుష్టి. శుక్రుని ద్వారా నూత్నవస్త్రాలు లేదా శృంగారం లేదా ధనప్రాప్తి. బుధుని మూలంగా నవంబర్ 23 తేది లోగా విజయం, ధనప్రాప్తి, నూత్నవస్త్రాలు లేదా సంతానం ఆ తర్వాత వివాదాలు.

### వృషభం

(కృత్తిక 2,3,4,పా, రోహిణి, మృగశిర 1, 2, పా.)

రాహువు ద్వారా వివాదాలు. శని వలన కుమారులు, కుమార్తెలనుండి ఎడబాటు లేదా వివాదాలు, మరియు ధననష్టం. గురువు వలన మనశ్శాంతికిభంగం. కుజునివలన నవంబర్ 6 తేది లోగా ధనప్రాప్తి. ఆ తర్వాత జ్వరం, లేదా ఉదరబాధ లేదా దుస్సహవాసాలవలనకష్టాలు రవివలన నవంబర్ 16 తేదిలోగా ఆరోగ్యం, విజయం. ఆ తర్వాత ప్రయాణం లేదా ఉదరబాధ. శుక్రుని మూలంగా నవంబర్ 23 తేది వరకు స్త్రీ సంబంధమైన ఆందోళన. ఆ తర్వాత శృంగారం నూత్నవస్త్రాలు అటుపై గృహప్రాప్తి బుధునివలన నవంబర్ 23 తేదివరకు వివాదాలు, ఆ తర్వాత విజయం.

### మిథునం

(మృగశిర 3,4 పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పా.)

రాహువుద్వారా ధనప్రాప్తి. శని మూలంగా స్నేహితులతో విభేదాలు, ధననష్టం లేదా బంధువులనుండి ఎడబాటు. గురువుద్వారా నవంబర్ 6 వ తేది వరకు ఉద్యోగరీత్యా, శత్రువుల మూలంగా ఆందోళన, లేదా ఇంటిలో దొంగతనం ఆ తర్వాత కుమారుల ద్వారా లేదా అక్రమమార్గాలద్వారా ధనార్జన. రవివలన నవంబర్ 16 తేది వరకు అనారోగ్యం, లేదా శత్రువుల మూలంగా ఆందోళన. ఆ తర్వాత ఆరోగ్యం, విజయం. శుక్రునివలన నవంబర్ 23 వ తేది వరకు అనారోగ్యం, అపకీర్తి. ఆ తర్వాత స్త్రీ సంబంధమైన ఇబ్బందులు. బుధునిద్వారా నవంబర్ 23 వ తేదివరకు విజయం, పదవీప్రాప్తి ఆ తర్వాత భార్యా బిడ్డలతో తగాదాలు.

### కర్కాటకం

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

రాహువువలన ధననష్టం. నవంబర్ 3 వ తేదినుండి శనివలన ధనం, పదవి లేదా వాహనయోగం, ఆరోగ్యం. గురునివలన ధనం, విజయం. కుజుని మూలంగా ఉద్యోగరీత్యా తదితర కారణాలవల్ల ఆందోళన మరియు ఇంటిలో దొంగతనం లేదా ఆరోగ్యభంగం. రవి వలన అనారోగ్యం లేదా అనారోగ్య మూలకమైన ఆందోళన. శుక్రునిద్వారా నవంబర్ 23 వ తేది వరకు బంధువుల రాక, పెద్దలప్రశంస, ధనప్రాప్తి మిత్రలాభం, సంతానప్రాప్తి, మిత్రలాభం, సంతానప్రాప్తి. ఆ తర్వాత శుక్రుని కారణంగా అనారోగ్యం, అపకీర్తి, బుధుని కారణంగా నవంబర్ 23 వ తేదివరకు భార్యాబిడ్డలతో తగాదాలు, ఆ తర్వాత ధనం లేదా గృహంలో వస్తు సమృద్ధి.

### సింహం

(మఖ, పూ. వ, ఉత్తర 1వ పా.)

రాహువువలన ఆందోళన, శనివలన ధననష్టం. గురునిద్వారా తగాదాలు, ధననష్టం, పదవీభంగం. కుజునికారణంగా ధనాభావం, అనారోగ్యం, రవివలన నవంబర్ 16 వ తేదివరకు ధనప్రాప్తి లేదా పదవి. ఆ తర్వాత అనారోగ్యం. శుక్రునిద్వారా మంచి స్నేహితులు, బంధువులరాక, పెద్దల ప్రశంస. ధనప్రాప్తి లేదా సంతానయోగం, బుధుని అనుకూల్యంవల్ల 23 వ తేదివరకు ధనం, వస్తుసమృద్ధి. ఆ తర్వాత స్నేహితుల సంయోగం, తత్కారణంగానే క్లేశాలు.

### కన్య

(ఉత్తర 2, 3, 4 పా. హస్త; చిత్ర 1, 2 పా.)

రాహువువలన ఆందోళన. గురుని వలన ప్రయాణం, ప్రయాస. శనిద్వారా ప్రయాణం, ఆందోళనలు అంతేగాక ధననష్టం లేదా అయినవారినుండి వేర్పాటు. 6 వ తేదివరకు కుజుని అనుకూల్యంవల్ల విజయం. ఆ తర్వాత ధననష్టం తదితర చికాకులు. రవి అనుకూల్యంవల్ల 16 వ తేదివరకు ధననష్టం. లేదా వంచన, లేదా నేత్రబాధ. కాని ఆ తర్వాత రవికారణంగానే ధనం, పదవీప్రాప్తి. శుక్రునివలన ధనం లేదా నూత్నవస్త్రాలు లేదా ప్రయత్నాలలో సఫలత మరియు పేరు ప్రతిష్ఠలు ఇవికాక మిత్రసమాగమం. బుధునివలన 23 వ తేది వరకు నూత్నసహవాసాలు. కాని స్వయంకృతాపరాధాలవల్ల ఆందోళన. ఆ తర్వాత ధనప్రాప్తి. అపకీర్తి.

### తుల

(చిత్త 3, 4 పా: స్వాతి, విశాఖ 1,2,3 పా:)

రాహువుద్వారా ధనప్రాప్తి. నవంబర్ 3 వ తేదివరకు ఆందోళన. గురువు

(40 పేజీలో చూడుడు)



దేవస్థాన ధార్మిక సాహిత్య ప్రచారోద్యమాన్ని వివరిస్తున్న దేవాదాయకమీషనర్ శ్రీ చంద్రమౌళిరెడ్డి. వేదికపై సర్వశ్రీ ప్రసాద్, ఉషశ్రీ, రమేశన్

## ఉషశ్రీ భాగవతావిష్కరణం

ధార్మిక సాహిత్యాన్ని జనబాహుళ్యం అందుబాటులోకి తెచ్చే పథకం క్రింద తి. తి. దేవస్థానం ముద్రించిన ఉషశ్రీ భాగవతం సెప్టెంబరు 30 తేదీన విడుదలైంది.

భాగవతకర్త ఉషశ్రీకి దేవస్థానసత్కారం అందజేస్తున్న డా॥ రమేశన్, శ్రీ ప్రసాద్.



## నవరాత్రి ఉత్సవాలు

తిరుచానూరు శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయంలో బెంగుళూరు వాస్తవ్యులు శ్రీ ఓ. జి రాజులుగారి సారథ్యంలో నవరాత్రి ఉత్సవాలు సెప్టెంబర్ 22 తేది నుంచి అక్టోబర్ 1 తేది వరకు వైభవోపేతంగా జరిగాయి. ఈ సందర్భంగా ప్రతి రోజూ సాయంత్రం 4-30 గం॥ నుంచి 7-30 గం॥ వరకు అమ్మవారి విశేష తిరుమంజనం, అలంకారం ఆ తర్వాత వేదపారాయణం నిర్వహింపబడినవి. రాత్రి 8 గం॥ నుంచి 11 గం॥ వరకు ప్రతి నిత్యం ఆలయ ప్రాంగణంలో సంగీత



తిరుమలలో ఆరోగ్య ప్రదర్శనకు కార్యనిర్వహణాధికారి ప్రారంభోత్సవం జరిపిన దృశ్యం.

నృత్య కార్యక్రమాలు ఏర్పాటైనవి. ప్రపంచం సీతారామ్‌గారి ఫ్లూట్ కచేరి, కుమారి వీణామూర్తిగారి కూచిపూడి నాట్యం, శ్రీమతి జయాకృష్ణన్ బృందం వారి గాత్రకచేరి, శ్రీ సి. కృష్ణమూర్తి బృందంవారి వీణావాద్యం, శ్రీ వి. రాజప్ప బృందం క్లారినెట్ కచేరి ఈ ఉత్సవాలలో ప్రత్యేకాకర్షణలు. అమ్మవారి ఆలయానికి కావింపబడిన విద్యుద్దీపాలంకరణ నేత్రపర్వంగా వుండింది.

## 108 వ స్వాధ్యాయ జ్ఞానయజ్ఞము

తిరుమల తిరుపతి దేవస్థానంవారి సహాయోగంతో శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ జీయర్ స్వామి పర్యవేక్షణలో 1980 సం॥ ఫిబ్రవరి 20-వ తేదినుండి 26-వ తేదివరకు తిరుమలపై 108-వ స్వాధ్యాయ జ్ఞానయజ్ఞం జరుగనున్నది. ఈ యజ్ఞానికి నాందీకార్యక్రమమైన భూశుద్ధి ఉత్సవం 1-10-79 తిరుమలలో జరిగింది. దేవాదాయ కమీషనర్ శ్రీ యం. చంద్రమౌళిరెడ్డి, దేవస్థాన అధ్యక్షులు డా॥ రమేశన్, దేవస్థానఆస్థాన పండితులు పండిత వేదాంతం జగన్నాథాచార్యుల వారు విధ్యుక్తంగా యజ్ఞవాటికను దున్నే ఘట్టాన్ని నిర్వహించారు. ఈ యజ్ఞం సహస్ర హోమ కుండాత్మకంగా వుంటుంది. ఈ పవిత్ర యాగదీక్షలో ఋత్వికులు, వేద పండితులు, కార్యకర్తలు మొత్తం 5 వేలమంది పాల్గొనబోతున్నారు.

## బ్రహ్మోత్సవములు

(16-11-79 నుండి 24-11-79 వరకు)

శ్రీ పద్మావతీదేవివారి బ్రహ్మోత్సవాలు ప్రతి ఏడూ కార్తీకమాసంలో జరుగుతూవుంటవి. ఈ బ్రహ్మోత్సవాలలో ముఖ్యమైన పంచమితీర్థం అనే తొమ్మిదవ ఉత్సవదినం అమ్మవారి జన్మదినం కావడం ఒక విశేషం. ఈ శుభదినాన (మార్గశిరశుద్ధ పంచమిన) శ్రీ వేంకటేశ్వరస్వామివారు తిరుచానూరుకు రాచమర్యాదలతో విజయంచేసి అమ్మవారికిపసుపుకుంకుమలు, తులసి పూమాలలు, నూత్నవస్త్రాలు, మధురభక్ష్యాలు సమర్పణగావించి వెళ్తారని ఐతిహ్యం తిరుచానూరు బ్రహ్మోత్సవాలలో విశిష్టమైన

ఈ ఉత్సవాలను వేలాదిగా భక్తులు తిలకిస్తూ వుంటారు.



పండిత జగన్నాథాచార్యులు యజ్ఞవాటిక దున్నుతున్న దృశ్యం.

## నియామకాలు

విజయవాడలో మిల్కుప్రాజెక్టు ఆఫీసరుగా వున్న శ్రీ టి. వేంకటేశ్వర్లు దేవస్థాన సంయుక్త కార్యనిర్వహణాధికారి పదవీ బాధ్యతలను స్వీకరించారు.

దేవస్థాన అసిస్టెంటు ఇంజనీరు శ్రీ డి. విఖనసాచార్యులను దేవస్థాన ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ గా నియమించడమైనది.



తిరుమల బ్రహ్మోత్సవంలో చిట్టిబాబు వీణకచ్చేరి

(37 వ పేజీ తరువాయి)

కారణంగాకూడా ధనప్రాప్తి. కుజుని వలన ధనం. విజయం, రవివలన ధన నష్టం, ప్రయాణం, ప్రయాస, ఉదర బాధ. 16 వ తేది తర్వాత రవివలన వంచన, నేత్రబాధలతోబాటు ధనా భావం. శుక్రునివలన ధనం, పేరుప్రతిష్టలు, గృహంలో వస్తు సామగ్రి లేదా ఆహార ధాన్యాలు. లేదా ఉద్యోగరీత్యాప్రతిష్ఠ. లేదా సంతానయోగం. బుధునిద్వారా అపకీర్తి, చెడుసలహాలవల్ల ధననష్టం.

### వృశ్చికం

**(విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)**

రాహువుద్వారా వివాదాలు. గురువు వలన ధననష్టం. శనికారణంగా ధనం లేదా శృంగారం. 16 వ తేదివరకు కుజుని ద్వారా ధననష్టం, అపకీర్తి. ఆ తర్వాత ధనం, విజయాలకు కారకుడు. రవివలన ధననష్టం. 16 వ తేది తర్వాత ప్రయాణం, లేదా ఉదరబాధ లేదా ధననష్టం. శుక్రునివలన శృంగారం, ధనం, ఆహార ధాన్యాలు, పేరుప్రతిష్టలు, సంతాన యోగం. బుధునిద్వారా అపకీర్తి, అనా రోగ్యం.

### ధనుస్సు

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

రాహువుద్వారా అధార్మిక ప్రవర్తనం. శనివలన. ధననష్టం, అపకీర్తి. గురువు ద్వారా ధనం, విజయం, ఆహార ధాన్యాలు. కుజుని కారణంగా నవంబర్ 6 వ తేదివరకు ధననష్టం, అపకీర్తి, శరీ రానికి హాని, ఆ తర్వాత ధననష్టం, అప కీర్తి. రవివలన నవంబర్ 16 తేదివరకు ఆరోగ్యం, పేరుప్రతిష్ఠలు, విజయం, ధనం, ఆ తర్వాత శని స్తబ్దుడు. శుక్రుని కారణంగా శృంగారం, నూత్నవస్త్రాలు, లేదా ధనం. బుధునివలన 23 వ తేదివరకు శత్రుసంబంధమైన ఆందోళన, అపకీర్తి, అనారోగ్యం ఆ తర్వాత ధనప్రాప్తి శృంగారం, లేదా వాహనయోగం, లేదా సంతానప్రాప్తి.

### మకరం

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ఠ 1.2 పా)**

రాహువువలన ఆందోళన, గురువు వలన అనారోగ్యం, లేదా ప్రయాణం, ప్రయాస. శనివలన వివాదాలు లేదా అనారోగ్యం లేదా పాపాచరణం. కుజునికారణంగా 6 వ తేదివరకు భార్యకు అసంతుష్టి. లేదా నేత్ర, ఉదరబాధలు ఆ తర్వాత ధననష్టం, లేదా శరీరహాని లేదా అపకీర్తి. రవివలన ఆరోగ్యం. పేరుప్రతిష్ఠలు, విజయం. శుక్రునివలన మంచిమిత్రులు, నూత్నవస్త్రాలు. ధనం, బుధునివలన ధనం, విజయం, శృంగారం లేదా వాహన, సంతానయోగాలు.

### కుంభం

**(ధనిష్ఠ 3,4 పా, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా)**

రాహువువలన వివాదాలు. గురువు ద్వారా శృంగారం, శనిమూలంగా అయినవారినుండి వేర్పాటు. కుజుని కారణంగా 6 వ తేది వరకు ధనం, విజయం, ఆ తర్వాత భార్యతో తగాదా లేదా నేత్ర. ఉదరబాధలు. రవివలన 16 వ తేదివరకు ధననష్టం లేదా అనా రోగ్యం. ఆ తర్వాత విజయం, గౌరవ ప్రతిష్ఠలు. శుక్రుని కారణంగా 23 వ తేది వరకు వివాదాలు, అపకీర్తి. ఆ తర్వాత ధనప్రాప్తి. లేదా నూత్న వస్త్రాలు లేదా మంచి స్నేహితులు, బుధునివలన 23 వ తేది వరకు ధనం. విజయం, లేదా శృంగారం, ఆ తర్వాత అపకీర్తి.

### మీనం

**(పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి.)**

రాహువువలన ధనం. గురువు కార ణంగా మనశ్శాంతికిభంగం. శనిమూలంగా ప్రయాణం. కుజుని వలన 16 వ తేది వరకు పిల్లలు లేదా అనారోగ్యం లేదా విరోధుల కారణంగా ఆందోళన. ఆ తర్వాత ధనం, విజయం. రవివలన 16 వ తేది వరకు అనారోగ్యం లేదా భార్యకు అసంతుష్టి. ఆ తర్వాత ధన నష్టం, నిరాశ, లేదా అనారోగ్యం శుక్రునివలన 23 వ తేది వరకు ధనం, ధార్మిక ప్రవర్తన లేదా నూత్నవస్త్రాలు. ఆ తర్వాత వివాదాలు, లేదా అనా రోగ్యం బుధునివలన 23 వ తేది వరకు నిరాశ. ఆ తర్వాత ధనం, విజయం లేదా నూత్న వస్త్రాలు, లేదా సంతానం. *

## చందాదారులకు విజ్ఞప్తి

**సప్తగిరి మాసపత్రిక చందాదారులలో దిగువ పేర్కొన్న సంఖ్య వారి చందా 31–12–79 తేదీకి అంతమగును. చందాదారులు ఈ విషయమును గమనించి M. O. ద్వారా దిగువ పేర్కొనిన ప్రకారము మనియార్డరు కూపనునందు తమ చందా సంఖ్య పూర్తి విలాసమును పేర్కొని, త్వరలో చందా పంపనియెడల ఆ తేది దరిమిలా పత్రిక పంపబడదు.**

**చందాదారుల నంబర్లు మార్చబడినవి. కొత్తనంబర్లు దిగువ పేర్కొనబడినవి. తమకు పంపివ పత్రికఅడ్రసు పేపరుమీదనున్న నంబరును క్రొత్త నంబరుగా గమనింప ప్రార్థన.**

3 20 26 27 31 42 48 60 64 66 73 74 88 103 104 105 107 108 145 148 150 153 155 162 175 177 198 201 206 207 230 232 233 234 236 237 264 265 266 268 269 271 272 273 274 275 A 276 277 278 278 282 283 285 285 291 292 293 295 299 300 306 307 318 321 324 331 334 348 365 387 396 404 417 421 422 424 425 426 428 429 431 433 434 436 437 438 439 440 441 444 445 446 447 454 455 459 460 487 492 538 539 563 601 610 612 613 614 621 622 624 625 626 627 628 629 664 680 878 879 880 881 882 883 884 885 886 887 888 889 890 891 893 894 895 896 898 899 900 902 903 904 905 906 907 908 910 911 912 914 915 916 917 918 919 920 921 922 923 924 925 926 928 929 931 966 970 972 973 974 975 976 97: 978 1781 1803 1806 1807 1808 1809 1810 1812 to 1832 1834 1835 1837 1838 1839 1841 to 1848 1850 to 1871 1873 to 1876 1878 to 1887 1890 to 1899 1901 1903 1905 to 1924 1926 to 1947 1949 to 1952 1954 to 1971.

*Edited and Published on behalf of T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T. T. D. Press by M. Vijayakumar Reddy, Manager T. T. D. Press Tirupati-517501*



అక్టోబరు 6 తేదీన హైదరాబాదులో పంచరత్నమాలను ఆవిష్కరిస్తున్న రాష్ట్ర ముఖ్యమంత్రి డా॥ మర్రి చెన్నారెడ్డి.



శ్రీమతి సుబ్బులక్ష్మితో ముచ్చటిస్తున్న ముఖ్యమంత్రి.



పంచ రత్నమాలను ధ్వని ముద్రితం చేసిన హెచ్. ఎం వి. కంపెనీ ప్రతినిధి శ్రీమతి సుబ్బులక్ష్మిని సత్కరిస్తున్న దృశ్యం.

# శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, తిరుమల.

## నిత్యపూజ. దర్శనాదికముల కార్యక్రమము

## 2–11–79 నుండి 29–2–1980 వరకు

### శని, ఆది, సోమ మరియు మంగళవారములు

ఉదయము 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతము
,, 3–30 నుండి 3–45 వరకు శుద్ధి
,, 3–45 నుండి 4–30 వరకు తోమాలసేవ
,, 4–30 నుండి 4–45 వరకు బంగారు వాకిలివద్ద కొలువు; పంచాంగ శ్రవణం,
,, 4–45 నుండి 5–30 వరకు మొదటి అర్చన
,, 5–30 నుండి 6–00 వరకు మొదటిఘంట బలి మరియు శాత్తుమొర
,, 6–00 నుండి మ 12–00 వరకు సర్వదర్శనము

మధ్యాహ్నం 12–00 నుండి 1–00 వరకు రెండవఅర్చన,(ఏకాంతం)
మధ్యాహ్నం 1–00 నుండి సాయంత్రం 6–00 వరకు కల్యాణోత్సవం వాహన సేవలు
,, 1–00 నుండి 9–00 వరకు సర్వదర్శనం
రాత్రి 9–00 నుండి 10–00 వరకు శుద్ధి, రాత్రికైంకర్యములు
,, 10–00 నుండి 10–30 శుద్ధి

10–30 ఏకాంతసేవ

### గురువారము

### తిరుప్పావడ

ఉదయము 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతం
,, 3–30 నుండి 3–45 వరకు శుద్ధి
,, 3–45 నుండి 4–30 వరకు తోమాలసేవ.
,, 4–30 నుండి 4–45 వరకు బంగారువాకిలివద్ద కొలువు మరియు పంచాంగ శ్రవణము
,, 4–45 నుండి 5–30 వరకు మొదటి అర్చన,
,, 5–30 నుండి 6–00 వరకు మొదటిఘంట, బలి శాత్తుమొర
,, 6–00 నుండి 8–00 వరకు సళ్లింపు, 2 వ అర్చన (ఏకాంతం), తిరుప్పావడ, అలంకరణం, ఘంట ఇత్యాది
,, 8–00 నుండి సాయంత్రం 6–00 వరకు సర్వదర్శనం

మధ్యాహ్నం 1–00 నుండి సాయంత్రం 6–00 వరకు కల్యాణోత్సవం వాహనసేవలు

సాయంకాలం 6–00 నుండి 8–00 { వరకు శుద్ధి ఇత్యాది, పూలంగి సమర్పణ, రాత్రి కైంకర్యము, ఘంట }

రాత్రి 8–00 నుండి 10–00 వరకు పూలంగిసేవ
,, 10–00 నుండి 10–30 వరకు శుద్ధి
,, 10–30 ఏకాంతసేవ

### బుధవారము

### సహస్రకలశాభిషేకం

ఉదయం 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతము
,, 3–30 నుండి 3–45 వరకు శుద్ధి
,, 3–45 నుండి 4–30 వరకు తోమాలసేవ
,, 4–30 నుండి 4–45 వరకు బంగారువాకిలివద్దకొలువు పంచాంగశ్రవణం
,, 4–45 నుండి 5–30 మొదటి అర్చన
,, 5–30 నుండి 6–00 మొదటిఘంట, బలి,శాత్తుమొర
,, 6–00 నుండి 8–00 సహస్ర కలశాభిషేకము (ఆర్జితము)

మధ్యాహ్నం 1–00 నుండి సాయంత్రం 6–00 వరకు కల్యాణోత్సవం వాహన సేవలు

ఉదయం 8–00 రాత్రి 9–00 వరకు సర్వదర్శనం
రాత్రి 9–00 నుండి 10–00 వరకు శుద్ధి ఇత్యాది రాత్రి కైంకర్యములు
,, 10–00 నుండి 10–30 వరకు శుద్ధి
రాత్రి 10–30 ఏకాంతసేవ

### శుక్రవారము

### అభిషేకము

ఉ॥ 3–00 నుండి 3–30 వరకు సుప్రభాతము
,, 3–30 నుండి 5–00 వరకు సళ్లింపు మరియు నిత్యకట్ల కైంకర్యములు (ఏకాంతము)
,, 5–00 నుండి 7-00 వరకు అభిషేకము (రు. 450/-రు.250; రు. 100/– వారికి మాత్రమే ప్రవేశం
,, 7–00 నుండి 8–30 వరకు సమర్పణము
,, 8–30 నుండి 9–30 వరకు తోమాలసేవ మరియు అర్చన (ప్రత్యేకం) ఘంట, బలి, మరియు శాత్తుమొర
,, 9–30 నుండి 10–00 వరకు రెండవ గంట, బలి, శాత్తుమొర
10–00 నుండి రాత్రి 9–00 వరకు సర్వదర్శనం

మధ్యాహ్నం 1–00 నుండి సాయంత్రం 6–00 వరకు కల్యాణోత్సవం, వాహనసేవలు

రాత్రి 9–00 నుండి 10–00 వరకు శుద్ధి రాత్రి కైంకర్యము
,, 10–00 నుండి 10–30 వరకు శుద్ధి
10–30 ఏకాంతసేవ

పేష్కార్ ; శ్రీవారి ఆలయం, తిరుమల



"నీలోత్తుంగ స్తనగిరి తటీ సుప్తముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిరస్సిద్ధ మధ్యాపయంతీ
స్వోచ్ఛిష్టాయాం స్రజినిగళితం యా బలాత్కృత్య భుంక్తే
గోదా తస్యై నమ ఇదమిదం భూయ ఏవాస్తుభూయః"

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

డిశంబరు 79

సంపుటి 10 సంచిక 7

విడిప్రతి 0–50 పైసలు

సం॥ చందా రు. 6–00

# సప్తగిరి

## విషయసూచిక



గౌరవసంపాదకులు;
శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్
ఐ. ఏ. ఎస్,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
టెలిఫోన్ నెం. 2322

ప్రచురణకర్త – సంపాదకుడు:
కాట్రపాటి సుబ్బారావు
ఎమ్. ఏ.,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
టెలిఫోన్ నెం. 2254

ముద్రాపకుడు,
ఎమ్. విజయకుమార్ రెడ్డి,
తిరుమల తిరుపతి దేవస్థానం ప్రెస్, తిరుపతి.
టెలిఫోన్ నెం. 2340

ముఖచిత్రం: గోదాదేవి

# సంపాదకీయము

"యుగాన్తేఽన్తర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః
వేభిరే తపసాపూర్వం అనుజ్ఞాతాః స్వయంభువా"

ఆధ్యాత్మిక బోధనలోనూ, పారమార్థిక చింతనలోనూ ప్రపంచంలోకే పురోగామిగా నిలిచిన పుణ్య భూమి మనది. రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక విప్లవ తరంగాలతో తలమునకలు గాకుండా నిలదొక్కు కోవడమే హైందవధార్మిక సంస్కృతి విశిష్టత హైందవధర్మం ఎంతటి సనాతనమైనదో అంతటి అధునాతనమైనదికూడా ! అందుకే ఇదొక ఆద్యంతాలు లేని అమృతప్రవాహిని. ఇది నిస్తేజమూ, నిస్సారమూ అయినప్పుడల్లా ఎవరో ఒక వేదాంతి, ఒక ప్రవక్త లేదా ఒక ఆచార్యుడు రంగ ప్రవేశం చేసి దీనికి దీప్తిని, వ్యాప్తిని కలిగిస్తూవచ్చారు. అలాంటి వారిలో శ్రీరమణమహర్షి ఒకరు.

తన పాండిత్య ప్రకర్షతో, వాదనాచాతుర్యంతో ప్రతిస్పర్థులైన మతాచార్యుల ఆట కట్టించడం గానీ, తన అనమానవేదాంత వాక్ఝురిలో సంశయాత్ముల్ని ముంచెత్తి, తనవైపు తిప్పుకోవడంగానీ, మహిమలతో మంత్రాలతో మూఢజనుల్ని వశంచేసుకోవడంగాని ఎరుగడాయన. అసలు ఆయన పెదవివిప్పి పలికితేగద ? వారికి నిరంతర మౌనమే భూషణం, కౌపీనమే కనకాంబరం ! తిరువణ్ణామలై పొలిమేరలుకూడా ఆయన దాటలేదు. మరి ఎందులోవుంది ఆయన గొప్పతనం అంటే— ఏ కృతయుగంలోనోకాదు, ఈ కలికాలంలో ఈ రోదసీయుగంలో "మహర్షి" అని పిలిపించుకొని ఆ పేరును సార్థకం చెయ్యడం వారి కొక్కరికే దక్కింది. అదే వారి విశిష్టత.

1879 సం॥ డిసెంబర్ 13 వ తేదిన మధుర సమీపంలో తిరుచూలిలో జన్మించి పెరిగిన ఒక సామాన్యవ్యక్తి 1896 లో తిరువణ్ణామలైకివచ్చి అరుణాచలేశ్వరుని ప్రభావంతో ఒక మహర్షిగా మారి యావద్ భారతదేశంలోనే గాక ఖండ ఖండాంతరాలలో ఖ్యాతినార్జించడం హిందూమతేతిహాసంలో ఒక అద్భుత రమణీయగాథ. వారు బోధించిందీ, ఆచరించిందీ అద్వైత సిద్ధాంతమే అయినా పారమార్థిక 'సత్యం' గురించిన వారి భావన, ఆ సత్యావిష్కరణకు వారు చూపినదారి మాత్రం అపూర్వమైనవి. వారు ప్రవచించినదేగాడు, రచించినదికూడా స్వల్పమే ! అయితేనేం ? వారిని దర్శించడమే భక్తులకు ఒక దివ్యానుభూతి. వారి దర్శనంతో జీవన్ముక్తికి సోపానాలు వేసుకొన్నవారూ, వారి 'మౌనం'లో సృష్టిరహస్యం తిలకించినవారు ఎంద రెందరో ! ఒక్కమాటలో చెప్పాలంటే వైదిక మహర్షుల విజ్ఞానం మూర్తీభవించిన అతీంద్రియజ్ఞానసంపన్నుడూ, అభినవ ఆదిశంకరులూ ఆయన ! ఆ మహర్షి శతజయంతి ఉత్సవం జరుపుకొంటున్న ఈ తరుణంలో వారి బోధనలు మనకు మార్గదర్శకం కావాలని కోరుకొందాం.

# ఈమాసం మీ అదృష్టం!

## గమనిక

వార్తాప్రసారాలలో సౌలభ్యం కొరకు తిరుపతి లోనూ తిరుమల లోనూ

### టెలెక్స్ సదుపాయం

ఏర్పరచడమైనది.

తిరుపతి టెలెక్స్ నెం. 403–202

తిరుమల టెలెక్స్ నెం. 403–208.

తిరుమల తిరుపతి దేవస్థానంలో ప్రస్తుతం టెలెక్స్ సౌకర్యం లభిస్తున్నది.

### మేషం

**(అశ్విని, భరణి, కృత్తిక 1వ పా)**

రాహువు వలన ఆందోళన. శని అనుకూల్యం వలన ఆరోగ్యం, శత్రువులపై విజయం, ధనప్రాప్తి. గురుని మూలంగా ధనం, సేవకులు లేదా నూత్నవస్త్రాలు లేదా వాహన సంతానయోగాలు. కుజుని కారణంగా అనారోగ్యం శత్రుబాధ లేదా పుత్రికలు పుత్రుల సంబంధమైన ఆందోళన. 16 తేది వరకు అనారోగ్యానికి, భార్య అసంతుష్టికి రవి కారకుడు అవుతాడు. ఆ తర్వాత రవివలన నిరాశ, ధననష్టం లేదా అనారోగ్యం. 17 వ తేది వరకు శుక్రుని అనుకూల్యం వలన నూత్నవస్త్రాలు లేదా ధార్మిక ప్రవర్తన. ఆ తర్వాత అప్రతిష్టకూ వివాదాలకు శుక్రుడు కారకుడు. 6 వ తేది వరకు బుధుని వలన గృహచ్ఛిద్రాలు. ఆ తర్వాత నూత్నవస్త్రాలు ధనం, విజయం, మరియు సంతానప్రాప్తి. 29 వ తేది నుండి నుండి బుధుని మూలంగా ప్రయత్నాలలో విఘ్నాలు.

### వృషభం

**(కృత్తిక 2,3,4,పా, రోహిణి, మృగశిర 1, 2, పా.)**

రాహువు వలన వివాదాలు. శని వలన ధనాభావం, లేదా తగాదాలు లేదా కుమారుల నుండి కుమార్తెల నుండి ఎడబాటు గురునివలన మనశ్శాంతికి భంగం. కుజుని వలన జ్వరం లేదా ఉదరబాధ లేదా దుష్టసహవాసాలవల్లకీడు. రవికారణంగా 16 వ తేది వరకు ప్రయాణం లేదా ఉదరబాధ, ఆ తర్వాత అనారోగ్యం లేదా భార్యకు అసంతుష్టి. మాసం ఆసాంతం వరకూ శుక్రుని ఆనుకూల్యం. తద్వారా నూత్న వస్త్రాలు లేదా శృంగారం లేదా నూతన గృహం లేదా ధనం లేదా ధార్మికప్రవర్తన 6 తేది వరకూ బుధుని కారణంగా విజయం ఆ తర్వాత 29 వ తేది వరకూ వివాదాలు. తదనంతరం మళ్ళీ బుధుని అనుకూల్యం వల్ల విజయం లేదా నూతన వస్త్రాలు లేదా సంతానప్రాప్తి.

### మిథునం

**( మృగశిర 3,4 పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పా. )**

రాహువు ద్వారా ధనప్రాప్తి. శని మూలంగా ఆయినవారి నుండి ఎడబాటు లేదా ధననష్టం. గురుని వలన నిరాశ. కుజుని కారణంగా పుత్రులద్వారాగాని లేదా అక్రమంగా గాని ధనప్రాప్తి. 16 వ తేది వరకు రవి అనుకూల్యం వలన ఆరోగ్యం విజయం. ఆ తర్వాత ప్రయాణం లేదా ఉదరబాధ. 17 వ తేది వరకు స్త్రీ సంబంధమైన తగాదాలకు శుక్రుడు కారకుడు. ఆ తర్వాత శుక్రుని అనుకూల్యంవలన నూతన వస్త్రాలు లేదా శృంగారం లేదా నూతన గృహం. బుధుని వలన 6 వ తేది వరకు భార్యాబిడ్డలతో తగాదాలు. ఆ తర్వాత 29వ తేది వరకు పేరుప్రతిష్ఠలకు బుధుడు కారకుడు. ఆ తర్వాత మళ్ళీ తగాదాలు.

### కర్కాటకం

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

రాహువువలన ధనాభావం శనిమూలంగా ధనం, సేవకులు లేదా నూత్న వస్త్రాలు మరియు ఆరోగ్యం. గురుని వలన కూడా ధనప్రాప్తి. అసూయ, అపార్థాలమూలంగా తలెత్తే ఉద్యోగ సంబంధమైన ఇబ్బందులకు కుజుడు కారకుడు. కుజుని మూలంగానే గృహంలో దొంగతనం మరియు స్వల్ప అస్వస్థత. 16 వ తేది వరకు రవి వలన వివాదాలు లేదా అనారోగ్యం ఆ తర్వాత ఆరోగ్యం విజయం. శుక్రునివలన అగౌరవం లేదా అనారోగ్యం 17 వ తేది తర్వాత స్త్రీ సంబంధమైన ఇబ్బందులు 6 వ తేది వరకు బుధునివలన ధనం, గృహంలో వస్తుసమృద్ధి ఆ తర్వాత 29 వ తేది వరకు భార్యా బిడ్డలతో తగాదాలు. ఆ తర్వాత గౌరవప్రాప్తి.

### సింహం

**(మఖ, పూ. ఫ, ఉత్తర 1వ పా.)**

రాహువువలన ఆందోళన. శనివలన

(37 వ పుటలో చూడుడు)

# మహర్షులు

భారత వేదసరోవరంలో అందమైన ఆర్షపద్మాలు అనేకంఉన్నాయి. ప్రతి ఋషిశతపత్ర సుందరుడే. "అధ్వర్యుర్వియ్యాస్తిమనుః మన్వాంతరేసదా" అనునట్టివార్తికంచేత మహర్షులు చతుర్యుగాంతమందు వేదవిప్లవము సంభవింపగా ద్యులోకమునుండి. తమ తమ యంశములతో భూమియందవతరించి, ఆవేదములనే అధ్యాపనాదులతో. పునఃప్రవర్తింప జేయుచు, పూర్వ జన్మ హేతువులైన ప్రారబ్ధమును జన్మాంతరము ప్రాప్తించుచున్నను పూర్వజన్మస్మృతితో పూర్వజన్మ నామములతో వ్యవహరించువారై, దేహాభిమాన రహితులై, మంత్రద్రష్టలై. దేహపరిగ్రహపరిత్యాగములతో, స్వతంత్రులై బ్రహ్మజ్ఞాన సంపన్నులైయొప్పుచు, మానవులకు శాంత్యానందముల బ్రసాదించువారే మహర్షులని వ్యవహరింప బడుచున్నారు.

ఈ మహర్షి లోకంలో దేవర్షులని, బ్రహ్మర్షులని. కాణ్డర్షులని, రాజర్షులని, మిశితములైయున్నారు. హరివంశములో, మరీచి, అత్రి, అంగిరసుడు, పులహ, క్రతు, పులస్త్య, వసిష్ఠాది మహర్షులు బ్రహ్మమానసపుత్రులనియు. మనుస్మృతిలో, ప్రచేతసభృగునారదులను కలిపి సప్తపై మహర్షులతో పదుగురుగా పేర్కొనబడినది. సనకసనందాదులుకూడా బ్రహ్మమానసపుత్రులేయని బృహదారణ్యబ్రాహ్మణమందు ఇట్లుగలదు. "నైషాబ్రహ్మణోతిసృష్టిః" ఇంకను వేదములయందు బ్రతిపాదింపబడిన మన్వాపస్తంబ బోధాయనాఽఽశ్వలాయన కాత్యాయన యాజ్ఞవల్క్య విఖనసవ్యాసపరాశరవాల్మీకాదులు మరికొందరు వైదికులకు సంబంధించిన వారు ఋషుల సంతతివారినేకులు గలరు. బద్ధజీవులకు జ్ఞానోపదేశనిమిత్తము సిద్ధేశులగు ఋషులు గుప్తవేషములతో సంచరింతురని శ్రీభాగవతమందలి చిత్రకేతూపాఖ్యాన కథనము. శ్రీ ఆదిశంకర భగవత్పాదుల గీతాభాష్యోపోద్ఘాతమున ఇట్లు దర్శనమైనది.

"సభగవాన్వాసుదేవ స్సృష్ట్వేదం జగత్
స్యచస్థితించికీర్షుః
మరీచ్యాదీనగ్రేసృష్ట్వా ప్రజాపతీన్ ప్రవృత్తి
లక్షణం ధర్మం గ్రాహ-
యామాస వేదోక్తం. తతోఽన్యాంశ్చసనక
సనందనాదీనుత్పాద్యనివృత్తి
లక్షణం ధర్మం జ్ఞానవైరాగ్య స్వరూపంచ
గ్రాహయామాస స ద్వివిధోహి-
వేదోక్తోధర్మః....శ్రేయోర్థిభిః అనుష్ఠీయమా
నోదీర్ఘేణకాలేన"

ఆ భగవంతుడు ఈ ప్రపంచమును సృష్టించి దానిపాలనార్థము మరీచ్యాదులైన ప్రజాపతులను సృష్టించి, వారికివేదోక్తమైన లోకప్రవృత్తి ధర్మమునుపదేశించెను సనకసనందాదులను సృష్టించి జ్ఞానవైరాగ్యలక్షణమైన నివృత్తి ధర్మమును వారికి ఉపదేశించెను. రెండు విధములైన వేదోక్త ధర్మము, కర్మరూపముగా జ్ఞానవైరాగ్యరూపముగా ధర్మరక్షణమొనర్చుచుండెను. సంఘసంక్షేమపరమైనది, ఆధ్యాత్మికాభివృద్ధిపరమైనదియగు రెండు ధర్మములను శ్రేయోభిలాషులైన అన్ని వర్గములవారు అన్ని ఆశ్రమములవారు దీనిని అనుసరించుచుండిరి. ఈమహత్తరమైన ఆదర్శము మహర్షులు మనకు ప్రసాదించిరి. మహర్షులు తమతమ తపఃప్రభావముల చేతన. ఆపరమాత్మనిశ్వాసములైయున్న వేదములధ్యయనములేకయే గ్రహించి



లోకములో బ్రకటించిరి. ఇదియే ఋషిత్వమహిత. ఇందునుగూర్చి ప్రమాణము భారత శ్లోకమునరియనగు.

యుగాన్తేఽన్తర్హితాన్ వేదాన్ సేతిహా
సాన్ మహర్షయః
లేభిరే త పసాపూర్వం అనుజ్ఞాతాః స్వయం
భువా॥

దీనికొక సాదృశ్యము — మనమొక వేవ్ లెన్‌గ్త్‌మీద రేడియో ట్యూనుచేస్తే- ఆ వేవ్ లెన్‌గ్త్‌మీద ఏ రేడియో స్టేషను యే కార్యక్రమము ప్రసారం చేస్తుందో ఆ కార్యక్రమమును రేడియో అందిస్తున్నట్లు మహర్షులు తమ తపశ్శక్తిచే ఆకాశమునుండి ఆ వేదధ్వనులను గ్రహించివాక్కుల ద్వారా పరంపరగా అందజేసిరి. సాక్షాత్కృతధర్మాలే ఋషులని దుర్గాచార్యసూక్తి

శ్రీ పండిత పరాంకుశం సత్యనారాయణ
భట్టాచార్యులు
"కొల్లిమర్ల"



బ్రహ్మోత్సవాలలో శ్రీవారి పుష్పాలంకరణ

అందువల్ల వేదమునకు శ్రుతియని ప్రసిద్ధి కావచ్చు.

"దేవానాంసధమాధః.....పథికృత్." భృగ్వత్రి వసిష్ఠాది మహర్షులకు మానవాతీతశక్తులుగలవనియు, వారు దేవతలతో కలిసిమెలిసి సంచరింతురనియు మార్గదర్శకులనియును ఈ ఋగ్వేదఋక్ వల్ల తలంచవచ్చును. కావున నేటి భౌతికవిజ్ఞానము పలువిధముల వ్యక్తివ్యక్తికి మార్పుల నొందుచుండ. అనాదినుండి నేటి దనుక నొకే విధమున నలరారుచు, తత్త్వజిజ్ఞాసువుల వ్యక్తిత్వముం ప్రకాశింపజేయుచు, విశాల విశ్వతోముఖ విజ్ఞాన సమన్వితమై ఈ పుణ్యభూమినుండి ప్రభూతములైన ఆర్షభావములు విశ్వమునందెల్లెడలముంచెత్తినవి. ఆర్ష ధర్మములు మొదట—

"కాణ్డద్వయోపపాద్యాయ కర్మబ్రహ్మ స్వరూపిణే స్వర్గాపవర్గ—
రూపాయ యజ్ఞేశాయనమోనమః ఇతిఆగమే॥

కర్మకాణ్డ జ్ఞానకాండద్వయముచేతను, ఉపపాదన చేయబడుతుందేటటువంటి కర్మబ్రహ్మ స్వరూపమైన పరమాత్మకు నమస్కారమనియర్థము. అనగా ఈశ్వరసత్తా తదుపాసన, యజ్ఞతపోదాన భగవదారాధనాది ఆత్మ వికాస సిద్ధాన్తముల వెలయించిరి. మనం ఆ పవిత్రోద్దేశ ప్రేరితులం కావాలి.

ఋషిర్దర్శనాత్ ఇతియాస్కః, ఋషిర్వేదమంత్రః తదుక్తం ఋషిణేతి దర్శనాత్ ఇతిసిద్ధాన్తకౌముదీ. ఋషస్తువేదే భృగ్వాదౌజ్ఞానవృద్ధాదిగంబరే ఇతి వైజయన్తీ, ఋషిర్వే దేవసిష్ఠాదౌ ఇతిమేదినీ ఋషయస్సత్యవచసః. ఋ-గతౌ ఇత్యమరః ఋషిచోదనేతి ఋగ్వేదః తత్త్వ ప్రకాశకైః ఋషిభిః మంత్రైః ఇతిసాయణః ఇతోపి నిర్వచనాని బహూనిసంతి.

వేదమును దర్శించుటచే జ్ఞానసారము బొందిన సత్యవాక్కుగలవారుఋషులైరనియు—

"య ఇమాభువనానిజుహ్వాదృషిః" యను ఋగ్వేద గానంవల్ల ఈ ఋషిశబ్దము సర్వోపద్రష్టయగు సర్వేశ్వరునికి తత్త్వప్రకాశకములగు దేవవేద శబ్దరాశికి ఇతర దేవతలకు వసిష్ఠ భృగ్వత్ర్యాది మహర్షులకు, జ్ఞానవృద్ధులకు, పరమహంస ఋషులకు ప్రసిద్ధవాచకమైనదని భావము. ఆర్షశబ్దము రూఢ్యర్థములో—ఆర్షం సిద్ధ సర్శనంచ ధర్మేభ్యః" (ప్ర-భా) అతీంద్రియపదార్థముల విషయమై, ఆత్మ మనస్సంయోగమువల్ల కల్గెడు జ్ఞానము ప్రాతిభమనబడును. దానినే ఆర్షమనియెదరని వైశేషిక దర్శనము.

మహాభారత శాన్తిపర్వమందు వ్యాస భగవానుడు నేను భూతభవిష్యద్వర్తమాన వృత్తాంతములను తెలిసికొనుటకై దారుణ తపస్సు చేయగా, నారాయణానుగ్రహము వలన సీతైకాలికజ్ఞానము కోరిన ట్లు ప్రాప్తించినది. కల్పాదియందేది జరిగినదో దివ్యదృష్టికి గోచరించినదన్నారు. ఆ భారతమునందె అనుశాసనమందు మహర్షుల స్వయం ప్రతిభా విశేషముల అంపశయ్యపైనుండి ధర్మరాజునకిట్లుపదేశించెను. - మహర్షులు పాపలేశము లేనివారు. పూజనీయులు. మనోవాక్కాయములందు యేకరీతిగానుండువారు. జ్ఞానవేత్తలు సుగంధ పంకములందు భోజన్నాభోజన ములయందు పట్టు కృష్ణాజినధారణయందు సమదృష్టిగలవారు. ఆహారము స్వీకరింపక బహుదినములు శరీరమును శుష్కింపజేయుదు తపస్సులతో స్వాధ్యాయములతో సంభవింపని విషయమును గూడా సంభవింపజేయగలవారుయని నుడువుచూ.

అదైవం దైవతం కుర్యు దైవతంచాప్య
దైవతమ్
లోకానన్యాన్ సృజేయుస్తే లోకపాలాంశ్చ
కోపితాః ॥

దేవత్వం లేనిచో దైవత్వమును కటాక్షించెదరు. దేవత్వముండి విగ్రవీగుచున్న

(22 వ పేజీలో)

# వేదాంత దేశికులు

శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి, ఆలిఫర్.

(గత సంచిక తరువాయి)

తొండరడిప్పొడి యాళ్వార్ : వీరు మండంగుడి అను దివ్యస్థలమందు అవతరించిరి. అవతార ప్రారంభములోనే పరమాత్మని దివ్యకటాక్షమునకు పాత్రులై శుద్ధ సత్త్వనిష్ఠులై పెరుగుచువచ్చిరి. పెరియాళ్వారులవలెనే, 'శ్రీరంగనాధుని తిరుమాలా' కైంకర్యమున నిరతులై యుండిరి. వీరిని భక్తాంఘ్రి-రేణు, విప్రనారాయణుడు, అని పిలుచుటయు గలదు. వీరు చాల గొప్పపండితులు. వేదవేదాంత పారంగతులు. బాల్యమునుండియే వైరాగ్యమనో భావముతోనున్నవారు. బ్రహ్మచర్య నిష్ఠులు. శాస్త్రాభ్యాసమునందును, భగవత్కైంకర్యమునందును, నిరతులై శ్రీరంగము దగ్గఱ పూదోటను స్థాపించి అక్కడనే స్థిరపడిపోయిరి.

శ్రీరంగదేవాలయమందు దేవదాసియైన దేవదేవియను నామె నిత్యమును, తన చెల్లెలితోడ నా తోటకువచ్చి పూవులనుకోసి మాలకట్టి భగవంతుని కర్పించుచుండెడిది. ఇట్లుండగా, ఒక దినము అక్కచెల్లెండ్రిరువురును తోటలో చెట్లనీడలో కూర్చొని వినోదముగా మాటలాడుకొనుచుండిరి. అదేసమయంలో తేజస్వియు మనోహరసుందరాకారుడునైన ఆళ్వారులు వీరి మాటలను కొంచమైనను గమనింపకుండనే తోటపనిలో నిమగ్నులై యుండిరి. వీరి దివ్యరూపమును చూచి దేవదేవికి అనురాగముదయించెను. కాని ఆళ్వారులు ఆ స్త్రీలు అక్కడ ఉండుట గమనింపకుండనే, తమ కర్తవ్యమునందు నిమగ్నులై యుండిరి. సుందరయువతులైన తాము సమక్షమున నున్నప్పటికిని, తమరిని లక్షింపకనేయున్న ఈ ఆళ్వారులు పిచ్చివారో ఏమోనని దేవదేవి చెల్లెలితో పరిహాసమాడెను. అప్పుడు చెల్లెలు, శ్రీరంగేశుని కైంకర్యమందు విరతులై విరక్తులై యుండుటచే, అక్కయొక్క హావభావ సౌందర్య విలాసాదికములొక్కటియును, వారు గమనించలేదనియు, వారిని లోబరచుకొనుట సాధ్యము కాని పనియని చెప్పెను. అట్లయ్యును, ఒక్కచో ఆమె వారిని తమవైపు ఆకర్షింపజాలనిచో తాను ఆమెయొక్క దాసినై ఆరునెలల కాలము సేవచేయగలదానను అని ప్రతిజ్ఞ చేసి తన సర్వాభరణములను తీసికొని చెల్లెలి అధీనముచేసి, ఆమెను పంపి తానొక్కతెయే తోటయందు నిలిచెను.

అనంతరము దేవదేవియు విప్రనారాయణుని యొద్దకువచ్చి తాను ఒక సాత్త్వికురాలననియు, భగవత్కైంకర్యమందు భాగినిగాగ ఆశ్రయమీయవలసినదనియువేడి తన దగుకథ చెప్పుకొని పశ్చాత్తాపమును వెల్లడించెను. ఆళ్వారులు ఆమె కోరికను మన్నించి, పూలమొక్కలకు నీరుపోసి, తిరుమాలకట్టు పనియందు నియమించిరి. తాము నిత్యమును భగవదారాధనచేసి, పూమాలనర్పించి, మాధుకరమెత్తి భగవంతునికి నివేదనపెట్టి తాము బుజునిని స్వీకరించుచుండిరి. మిగిలిన దానిని దేవదేవికి పెట్టుచుండిరి. ఇట్లు కొంతకాలము గడచెను. ఒకరోజు జోరుగా వర్షముకురిసెను. దేవదేవియు వానయందు పూర్తిగా తడిసిపోయి ఆళ్వారుల పర్ణశాలముందు నిలుచుండెను. విప్రనారాయణుడు దానినిచూచి పర్ణశాలలోనికి వచ్చి నిలుచునట్లుగా చెప్పెను. కనికరించి, తమ ధోవతిని ఆమె ధరించుటకై ఇచ్చెను. వాన ఎంతసేపటికిని నిలువలేదు. దేవదేవి మెల్లిగా విప్రనారాయణునితో మాటలాడ నారంభించెను. ఇట్లు పరిచయాభివృద్ధికాగా, వారి చరణసంవాహనము చేయుటకనుమతింపవలసినదని దేవదేవి కోరెను. బైటకుపోనవకాశము లేకపోవుటచేతను, వానకురియుచునే ఉండుటచేతను, పర్ణశాలయందు వీరిద్దఱే ఉండు నవకాశమేర్పడుటచేతను, ఆళ్వారులు దేవదేవి యొక్క కోరికను సమ్మతించిరి.

దేవదేవికి ఇప్పుడు సదవకాశము దొరికెను. దానిని ఆమె, ఉపయోగించుకొనకుండ విడచునా? వారవేశ్యాంగన, మీదు మిక్కిలి పందెమువైచి తన ప్రయత్నము సఫలము కాగోరుచున్నదాయెను. ఆమె విప్రనారాయణుని పాదపద్మములను తన మృదువైన హస్తములతో నిదానముగా ఒత్తుచు, అతివినయముగా ఆమె పాదముల కెరిగి, తన శరీరమును వారు స్వీకరించి, తన జీవితమును సార్థకపఱుపవలసినదిగా వేడెను. అట్లే హావభావ విలాసములతో మోహకరములైన ముసిముసినవ్వులతో వారి పాదములను చుంబించెను. స్త్రీ స్పర్శయే తెలియని ఆళ్వారులకు మనోవికారము పుట్టెను.

'అగ్నికుండ సమా నారీ ఘృతకుంభ సమః పుమాన్' అని చెప్పినట్లు తమయందు విద్యుద్వేగముతో కలుగుచున్న పరిణామమునుగూర్చి ఆలోచించుటకు కూడ వారశక్తులై ఆమెప్రేమకు కాముకగా

## శ్రీ వేదనారాయణస్వామివారి ఆలయం, నాగలాపురం

### ఆలయ కార్యక్రమాలు, ఆర్జిత సేవలు

**ఉదయం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| సుప్రభాతం | — | 6-00 గం॥ నుండి | 6-30 గం॥ | వరకు |
| విశ్వరూప సర్వదర్శనం | — | 6-30 ,, | 8-30 | ,, |
| తోమాలసేవ | — | 8-30 ,, | 9-00 | ,, |
| సహస్రనామార్చన | — | 9-00 ,, | 9-30 | ,, |
| మొదటిగంట, బలి, శాత్తుమొర | — | 9-30 ,, | 10-00 | ,, |
| సర్వదర్శనము | — | 10-00 ,, | 11-30 | ,, |
| అష్టోత్తరనామార్చన, 2 వ గంట | — | 11-30 ,, | 12-00 | ,, |
| తీర్మానము | — | మధ్యాహ్నం 12-00 గం॥ | | |

**సాయంత్రం**

| | | | | |
|---|---|---|---|---|
| సర్వదర్శనం | — | 4-00 గం॥ నుండి | 6-00 గం॥ | వరకు |
| తోమాల, అర్చన, రాత్రి కైంకర్యములు | — | 6-00 ,, | 7-00 | ,, |
| సర్వదర్శనం | — | 7-00 ,, | 8-45 | ,, |
| ఏకాంతసేవ | — | 8-45 ,, | 9-00 | ,, |
| తీర్మానము | — | రాత్రి 9-00 గం॥ | | |

**ఆర్జిత సేవలు**

అర్చన రు. 3-00

హారతి రు. 1-00

చిక్కిపోయిరి. ఆమెకూడ తాను ధన్యురాలనైతినని భావించి, ఆత్మార్పణము చేసికొని, విప్రనారాయణులను పూర్తిగా మార్చివైచెను.

అటుపిమ్మట విప్రనారాయణుల నడకలో మార్పువచ్చెను. దేవరకై పెంచిన పూవు, దేవదేవికి కొప్పులో తురుముటనయ్యెను. భగవంతుని సేవనిలిచి, ఆమె సేవ సాగుచుండెను. దేవదేవి తన వెనుకటి ఆభరణములను, వస్త్రములను తెప్పించుకొని, సర్వాలంకార భూషితురాలై తన గృహమునుచేరి, విప్రనారాయణులను వశపఱచుకొని యుండెను. ఇట్లు వారిరువురు, కొంతకాలము సుఖముగా నుండిరి. ఈమెకై విప్రనారాయణుడు లోకనిందను అనుభవించెను. దరిద్రావస్థయునబ్బెను. చివరకు ఆమెచే దొంగతనముకూడ వారిపై నాపాదింపబడెను. రాజు నిర్బంధమునకు లోబడి శిక్షకు గురికానున్న వీరు శ్రీరంగనాథుని కృపాకటాక్షముచే విముక్తినంది, పశ్చాత్తప్తులై తొల్లిటిస్వామి కైంకర్యమునందు తిరిగి మగ్నులైరి. తమ అపప్రవర్తనకు చాలసిగ్గిలిరి. పశ్చాత్తాపతప్తులైరి. తమ వెనుకటి వైరాగ్యజీవితమును వీటబుచ్చి, ఆడుదాని మాయామర్మములకు లోనై తమ జీవితమును వృథాజేసికొన్నందులకు చాలగావగచిరి. జీవితముపై జుగుప్స కలిగెను. వారి లౌకికప్రేమ ఇప్పుడు శ్రీరంగనాథునిపై దివ్యప్రేమగా మారెను. దేవదేవికి దాసులైనవారిప్పుడు భగవద్భక్తులకు దాసులైరి. అందుచే వారికి భక్తాంఘ్రిరేణువనుపేరు ప్రసిద్ధికెక్కెను.

ఇట్లు భగవద్భక్తికి పొలిమేరయైన భాగవతుల విషయమై భక్తాంఘ్రిరేణువు పరతంత్రులైరి.

(సశేషము)

# భాగవత సేవామహిమ

త్వద్భృత్యభృత్య పరిచారకభృత్యభృత్య।
భృత్యస్య భృత్య ఇతిమాం స్మరలోకనాథ॥

'ఓ వేంకటాచలపతీ! నీదాసదాసచరమావధి దాసదాసునిగా ఈ దాసుని తలంచి కాపాడవా!' అని కులశేఖరులు స్వామిని ప్రార్థించినారు. ఈ విధముగా కోరువారలను 'శ్రీవైష్ణవుల'ని వ్యవహరింతురు. భగవద్దాస్యముకన్ననూ భాగవతదాస్యమే మిన్న యని చాటి చెప్పునది ఈ కులాలునికథ. ఇది శ్రీ వేంకటాచలపురాణాన్తర్గతమైనది.

విజితేంద్రియుడు, త్రికాలవేదియు నగు ఆంగీరసమహర్షి యొక్క ఆజ్ఞానుసారముగా తొండమానుచక్రవర్తి, తనకు


శ్రీ యం. టి. ఆళ్వారు,
తిరుపతి




మహోపకారముగా బ్రాహ్మణసంసారమును పునర్జీవితులుగాఁ జేసిన తిరుమలాద్రివాసునకు బంగారు తులసిమాలలను అర్పించసాగెను. ఈ విధముగా మూడుమాసములు గడచిపోయినవి. కాని శ్రీనివాసుడు మౌనముద్రను వీడలేదు. అందులకు తొండమానుచక్రవర్తి ఖిన్నుడై ఒకనాడు స్వామిని "దేవా! భక్తాపరాధములను క్షమించుటయేగదా నీ కల్యాణగుణము. "కలౌ వేంకటనాయకః" అనినట్లు నీవేగదా వరదానములీయ సమర్థుడవు. నాయందు దయ చూపవా? నీ సంకల్పముచే సమస్తచరాచరములు నడచుచున్నవి. నీకు నీవేసాటి ప్రభూ! ఆ విధముగా నీ భక్తులయందు నేనే శ్రేష్ఠుడనుగదా! మరియేల మాటాడవు? భక్తునికోరిక తీర్పలేవా" అని ప్రార్థించసాగెను.

అంత ఆకాశమార్గమునుండి "ఓయీ! రాజా! నీవు చేయునది చాలచిత్రముగ నున్నదే? బ్రాహ్మణస్త్రీపుత్ర ఘాతకుడవై ఈ పాపమునుండి దాటదలచితివా? నీపైనుండు అవ్యాజకరుణచే కాపాడితిని గాని, నీగొప్పదనమునకుగాదు" అను మాటలు వినవచ్చినవి. ఆ మాటలువిని తొండమానుడు మూర్ఛిల్లినాడు. మరి కొంతసేపునకు తెప్పరిల్లి "దేవా! నీవు సర్వసమర్థుడవు. నేను భక్తితోచేయు పూజలో లోపమేమున్నది?" అని ప్రశ్నించసాగెను. దాని నెఱింగించవా? అని వెడలినాడు. అంత శ్రీనివాసుడు, తొండమాను చక్రవర్తి మనసును నిజమైన భక్తిపై మరల్చుటకు పూనుకొని నాడు

ఒకనాడు తొండమానుడు తనచే శ్రీనివాసునకర్పింపబడు తులసీమాలల వైభవమును దర్శించుటకై వేంకటాద్రికి బయలుదేరినాడు. తిరుమలలో ఎచట చూచిననూ గోవిందా! గోవింద! అను శబ్దములు ప్రతిధ్వనించుచున్నవి. భక్తులందరును శ్రీనివాసుని మహిమలను పరస్పరము తెలిసికొనుచూ ఆనందము ననుభవించుచున్నారు. తొండమానుచక్రవర్తిని జూచి అచటివారు ఎంతగనో కీర్తించినారు. తొండమాను వారల ఆశీస్సులను బడసినవాడై స్వామి పుష్కరిణియందు

స్నానమాచరించినాడు. అంత ప్రక్కననే వేంచేసియున్న ఆది వరాహస్వామిని, క్షేత్ర నియమ ప్రకారముగా తొలుత సేవించి పూజలు సలిపినాడు. పిమ్మట తనచే సమర్పింపబడుచున్న సువర్ణ తులసి మాలల కన్నులారా వీక్షించి శ్రీనివాసా నుగ్రహ మొందదలచి ఆలయమునందు ప్రవేశించినాడు 'తానొకటిదలచిన దైవ మొకటి తలచునుగదా!, అనియన్నట్లుగా దివ్యమంగళ విగ్రహుడైన స్వామి తిరు మేని యందు (దేహమునందు) తనచే సమర్పింపబడు బంగారు తులసి మాలలు కనుపించలేదు. కాని ఆ స్థానములో మృణ్మయ తులసి మాలలు స్వామిని సేవించుచున్నవి. తనచే సమర్పింపబడిన వన్నియు క్రిందబడియున్నవి. అది రాజు నకు చాల విస్మయమును కలిగించినది. ఆ మృణ్మయమాలలు చూపరులకు భూదే వియే మాలలుగామారి తన ప్రియుడైన నారాయణునకు సేవచేయు చున్నదా యనునట్లు గోచరించు చున్నవి. అవి ప్రశస్తమైన మృత్తికతో చేయబడినవి. సువర్ణ రత్నఖచితమగు స్వామి తిరుమేని యందు మట్టితో చేయబడిన మాలలు ఎట్లువచ్చెనో ఎవరికిని గోచరముకాలేదు. ఇది కలయా? లేక వైష్ణవమాయయా? ఈ విచిత్ర సంఘటన తొండమానుని కల వర పరచసాగినది. తనచే సమర్పింపబడు మాలికలు నేలకొరుగుట తనలోనుండు అపచారములను బయటకు తెలుపు చున్నవి. అంత రాజు "స్వామీ! నేనే యప చార మొనరించితిని? నీ పూజల విడచి నేనన్యుల సేవింపనే, నా ప్రజలకు నే మన సారనైననూ కీడునెంచనుగద, నే పరమ భక్తిని నీపై చూపుతుంటినే వేంకటేశ! ఈ మాలికల నీవు స్వీకరింపక బోవుటకు నేదియో యొక కారణముండియే తీరును. దేవాధిదేవా! నీ రూపు చూచు టచే నే చేసిన దోషము నాచే నెఱుంగ బడుచున్నది. నాలోనుండు గర్వమణచు టకే నీవీ రీతిగా నా కన్నులు తెరిపించి నావు. నేనే పరమ భక్తుడనని నీ వద్ద నిర్భయముగాఁ పలికితిని. ఇది చాల గర్వోక్తి యగును. నీవు శేషివి. మేము నీకు శేషభూతులము. నే మున్ను తలచి నది కేవల మాత్మవంచనయే. ఆది మధ్యాంత రహితుండవైన నిన్ను పురా తనులైన కపిలాది మహర్షులు ఎటులనో నొకటుల తమ ఆధ్యాత్మ దృష్టిచేఁ గను గొనిరి. మహర్షులచేఁగూడ బొంద నలవి గాని నీకు నే భక్తులలోకెల్ల నుత్తముడ నెట్లగుదును. దిలీప, రఘు, దశరథాది రాజాధి రాజులకన్నను నే దేనియందును నధికుడగాను. నా తదనంతరము ఎందరో భక్తులవతరించగలరు వారల యందును నేనే నీకత్యంత ముఖ్యుడని పలుకుట అవివేకము, అహంభావ పూరితముగదా, శ్రీనివాసా! నీకీ విధముగా మృణ్మయ పాత్రముల నర్పించుచు నీ పరిపూర్ణాను గ్రహమునకు పాత్రుడైన పరమ భాగవ తోత్తము డెవడు? నీ యనుగ్రహము బడసిన ఆ భాగవతునిసేవ నాకనుగ్ర హించు ప్రభూ! అని ఎంతో దీనముగా ప్రార్థించినాడు

అంత శ్రీనివాసుడా మాటల నాల కించి 'రాజా నాభక్తులు పలుతెఱగులుగా నుందురు. కొందరు నా కొండ కెంతో దూరముగా నుండి నన్నే వారి మనసున నిలుపుకొనుచు నాకు దగ్గరగుచుందురు. మరికొందరు నా వద్దనేయుండి సేవ చేసెదరు. భాగవతులగు మరికొందరు, నా దాసులగు వారలకు సేవచేయుచు వారినుండి దీవనలబడసి నా కత్యంత ప్రియతములుగా నుందురు. వీరిలో ఈ మృణ్మయ మాలికల నర్పించు కుమ్మరి నా దాసులకు సేవ జేయువాడు. ఆతని పేరు భీముడు. ఆతని భార్య తమాలిక పతివ్రతా శిరోమణి. ఆ పుణ్య దంపతులు నా కొండకు ఉత్తర దిక్కున నున్న కురు యను గ్రామంలో (నేడది రేణిగుంట సమీపమున కలదని ప్రతీతి.) అత్యంత భక్తియుక్తులై నా కొండకు వచ్చు యాత్రిక బృందములకు, కుండల నిచ్చి వారలకు తుత్పిపాసోపశమనముఁ జేయుచున్నారు. అది వారి జీవనవృత్తి అతడు స్వధర్మమునేనమ్మి, నా నామము నుచ్చరించుచూ నిత్యకృత్యములఁజేయు కర్మయోగి, అంతియేకాదు నా దాస బృందములచే కొనియాడబడిన సత్య మూర్తి ఆ భాగవతుడు నిత్యాగ్ని హోత్ర వేద పారాయణాదులఁజేయు కర్మిష్ఠులకన్నను, సకల తపములజేయు యోగులకన్నను మిన్న. విజితేంద్రి యుడు, అల్పసన్తోషి, సుఖ దుఃఖముల యందు నొకేతీరుగ నుండువాడు. లోక ముచే నిందింపబడనివాడు. తానునూలోకు లను నిందించువాడు కాదు. హర్షామర్ష ములయందు సమబుద్ధుడు. ఉదాసీనుడు అట్టి భాగవతోత్తములు పిలిచిన నేనేల పలుకకయుందును. నీ వింతకు మునుపు 'భక్తుడనని' నహంకరించితివి. రాజా! ఒకరిని మించిన పురుషులు మరి యొక రుందురుకదా! నీవు భక్తి భావ ముతో కర్మయోగివని గర్వించితివి. కాని, ఈ కులాలుడు తాను చేయున దేదియో తానే ఎరుంగడు. నా సేవ దొరుకదని కుములుచూ నన్నే ధ్యానిం చుచూ తన ధర్మం మరువక మహాత్ము లగు నా దాసులనుండి యనేకామోఘ ఆశీస్సుల బడసినవాడు. అతను చేయున దంతయు నాకు సమ్మతము. నా కర్ప

ణముగానిదేయేవస్తువునైననూయాతడు గ్రహించడు. నేను అట్టి వారలతో నాడుదును, పాడుదును, కలసి తిరుగుదును. వారల చిత్తములో నేనెల్లప్పుడు నివసించెదను. వారలతో కలిసియుండుట నాకానందదాయకము. వారలెచట యుందురో అదే నా దేవాలయము. వారలుండనిచోట నేనొక నిమిషమైననూ యుండను'' అని వేంకటేశ్వరుడు పలికిన మాటలను తొండమానుడు మహోపదేశముగా భావించినాడు. అంతట శ్రీనివాసుడు కుమ్మరి రూపునే మనసులో చిత్రించుకొనినాడు. ఆతని పాదతీర్థముతో తన శరీరము పునీతము కావలయునని కోరినాడు. అతని దర్శించని జన్మ నిరర్థకమని భావించినాడు. ఆతని దర్శనము లేనిదే మరే కార్యము చేయజాలనని నిశ్చయించి శ్రీనివాసుని వద్ద యనుజ్ఞ తీసుకొని యత్యంత భక్తియుక్తులతో 'కురు' యను గ్రామమునకు బయలుదేరినాడు. అడుగడుగున శ్రీనివాసునినామమునే తలంచుచూ, దారిలో కనబడిన వారలనందరిని కుమ్మరిదాసు గురించియే ప్రశ్నించుచూ నా గ్రామమునకు చేరికొనినాడు. ఈతని ఆతృత, మాటలు చూచువారలకు ఆశ్చర్యమును కలిగించినవి. తొండమాను చక్రవర్తికి జనులందరూ స్వాగతములు పలుకసాగినారు. కాని అవి తొండమానునకు వినిపించడములేదు. తాను మాటి మాటికి యీ కులాలుని గురించి ప్రశ్నించుచూ వారల ద్వారా ఆతని గృహమును సమీపించి. అలసటచే గృహ ప్రాంగణమున సాష్టాంగముగ ప్రణమిల్లి మూర్ఛిల్లినాడు. అచట నున్న జనులు రాజున కుపచారములం జేయ సాగిరి. తన గృహ ప్రాంగణంలో నేదియో కోలాహలముగ నున్న



బ్రహ్మోత్సవాలలో తిరుమలేశుని ఆలయ విద్యుద్దీప శోభ.

దని దలంచి భీముడు బయటకు వచ్చి జరిగిన సంగతి యంతయు తెలిసికొని భయభక్తులతో వణకుచు తన మనంబున ఈ విధముగ దలచ సాగెను – 'అయ్యో! నేనెంత దుష్కృతము చేసితినో గదా? సకల చక్రవర్తిలక్షణోపేతుడగు రాజాధిరాజు: కులాలు డనగు నాగృహము ముందఅమూర్ఛిల్లుట నాపాపపు కర్మయే! రాజులు దైవ స్వరూపులు గదా!' రాజు సంతసించిన దైవము సంతసించును గదా! నేనే యపచారమును సలిపితిని? వేంకటాద్రికి పోవువారలకు, స్వామినైవేద్యార్థమై నే కుండల నిచ్చుటమానలేదు గదా! అనివాపోవుచూదుఃఖమునుమ్రింగలేక బయటకు వెలిబుచ్చినాడు, ఈ విధముగా వాపోవు కులాలుని మాటల యలజడికి రాజు తెప్పరిల్లినాడు. తటాలున లేచి మరల కులాలుని గురించి నచట నున్న వారతో "ఓ జనులారా! మహాత్ముడగు భీమునకు నే వందనములు సమర్పింప వలయు"నని యనుచుండగనే అచట కోటి సూర్యుల కాంతిని తిరస్కరించు తేజమావిర్భవించినది. ఆ తేజము నుండి గరుడవాహనారూఢుడై లక్ష్మీ సమేతుండై శంఖచక్రాది దివ్యాయుధముల ధరించినవాడై దేవతలందరూ పుష్పవృష్టి కురిపించుచుండగా ఋషులందరు వేదఘోష చేయుచుండగా "వేంకటేశుడు" ఆవిర్భవించినాడు. అంత తొండమానుడు సాష్టాంగముగా ప్రణమిల్లి నిలబడినాడు. పిమ్మట కులాలుడు లక్ష్మీ సమేతుండగు శ్రీనివాసుని ఈ విధముగా ప్రార్థించినాడు.

"దేవా! నీ పురము వైకుంఠమును బోలిన వేంకటాద్రి, నే నుండునది పాపకూపము. నీవు అనంత కల్యాణ గుణములను కలవాడవు. నేను నీచమైనవాడను. నీకు జన్మలేదు. ఆది మధ్యాంత రహితుండవు. మేము 'జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్యచ' అను రీతిగ పుట్టుచు గిట్టుచు నుందుము. నీ కన్నులనుండి జగద్వంద్యులైన సూర్యచంద్రులుదయించినారు. నీపాదమునుండి పరమపవిత్రమగు 'గంగ' యుద్భవించినది. నీ నుండి ఈ సమస్త జగములుద్భ

(31 వ పుటలో చూడుడు)

# శ్రీ అన్నమాచార్య సంకీర్తనామృతము

శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి

(గతసంచిక తరువాయి)

అవ: భగవచ్చింతయే పాపములడంచి భవములు నశింపజేయు సాధనమని గ్రహించియు చిత్తము అందు కనుగుణముగ ప్రవర్తింప దనుచున్నాడు —

67

దేవగాంధారి

ఇన్ని చేతలకు — నిది యొకటే,
కన్నా మనసిది — కానదు గాని. ॥పల్లవి॥

1. పాతక కోటులు - భవములు భస్మీ
భూతము సేయఁగఁ - బొడ వొకటే,
శ్రీ తరుణీపతి - చింత నిజముగా
ఏతరి చిత్తం - బెఱుఁగదు గాని. ॥ఇన్ని॥

2. మరణ భయంబులు - మదములు మలిసీ
కరణము సేయఁగఁ - గల దొకటే,
హరినామామృత - మందుమీఁద రతి
నిరతము నాకిది - నిలువదు గాని ॥ఇన్ని॥

3. కుటిలములును దు - ర్గుణములును తృణీ
కృతములు సేయఁగ - గుఱుతొకటే, *
పతియగు వేంకట - పతి సేవారతి
గతి యని మతిగని - కానదుగాని. ॥ఇన్ని॥

(5-188)

భావ:— ఈ చెప్పబోవు పనులన్నిటిని నెరవేర్చుటకు ఇది ఒకటే సరియైన మార్గము. ఈ సంగతి గుర్తించియు చిత్తము గుర్తించినట్లు ప్రవర్తించదు.

కోట్ల కొలది పాపములు, జన్మములు కాల్చి బూడిద చేయుటకు తగిన సాధనమొకటే వస్తువు కలదు. అది లక్ష్మీపతి ధ్యానము. ఈ పొడవులమారి చిత్తము ఈ విషయమును నిజముగా గుర్తింపకున్నది.

చావు మూడునేమో అన్న భయమును, వయస్సు, ధనము, కులము మున్నగు వానిచే గలుగు మదములను రూపుమాపుటకు తగిన ఉపకరణ మొకటే కలదు. అది విష్ణునామమను అమృతము. నాకు ఎల్లవేళల ఆయమృతము నాస్వాదించవలెనను ఆసక్తి నిలుచుట లేదు.

పలుబాధలను, దుర్గుణములను తృణీకరించి హాయిగా నుండుటకు చేపట్టవలసిన వస్తువొకటే కలదు. అది త్రిలోకాధిపతియైన శ్రీ వేంకటేశ్వరుని సేవయందలి అభిరుచి. అదేగతియని నామనస్సు తెలిసియు తెలియకున్నది.

వి:— భగవచ్చింతనచే పాపములు, భవములు భస్మము లగును. హరినామామృతపానముచే మరణభయము మదములు తొలగును. శ్రీ వేంకటేశ్వరుని సేవచే బాధలు, దుర్గుణములు పరిహరింపబడును. ఈ విషయమును మానవులు గ్రహింపక పోలేదు. కాని మాయకులోనై ఆయా సాధనలను అనుష్ఠించలేక బాధపడుచున్నారు. అనుష్ఠించినచో తప్పక ధన్యులగుదురని తాత్పర్యము.

అవ: నిత్య కృత్యములను భగవత్పరములొనర్చి సుఖింపవలె ననుచున్నాడు -

68

శ్రీరాగం

కాకున్న సంసార - గతులేల ?
లోకకంటకములగు—లోభంబులేల? ॥పల్లవి॥

1. వినికి గనవలసినను - విష్ణు కీర్తన చెవికి
వినికి చేసిన నదియె - వేదాంతబోధ,
మనికి గనవలసినను - మధువైరిపై భక్తి
పునికి ప్రాణులకు బ్ర - హ్మోపదేశంబు.
॥ కాకున్న ॥

2. చదువు గనవలసినను - శౌరినామము దిరుగఁ
జదువుటే సకల శా - స్త్రముల సమ్మతము,
నిదుర గనవలసినను - నీరజాక్షునికిఁదన
హృదయ మర్పణ సేయు-టిది యోగనిదుర
॥ కాకున్న ॥

3. ఆనవలచిన వేంక - టాద్రీశ్వరుని కృపకు
నానసేయుటె పర - మానంద సుఖము
వాసి గనవలసినను - వైష్ణవాగారంబు
వాసిసేయుట దనకు - వైభవ స్ఫురణ.
॥ కాకున్న ॥

(11-3-114)

ఈ చెప్పబోవు కార్యములు చేయక పోయినప్పుడు సంసారములో ప్రవర్తించుటెందుకు? లోకమున కుపద్రవకరములైన లోభములచే ప్రయోజనమేమి?

ఏదేని వినవలెనని కోరిక గలిగినచో విష్ణు సంకీర్తనమును వీనుల విందుగా వినవలెను. అదియే వేదాంత ప్రబోధ శ్రవణమై శ్రేయ మొదగూర్చును. అట్లు కాక లౌకిక గాథ లెన్ని విన్నను ప్రయోజనము సున్న. ప్రయోజనవంతమైన బ్రదుకు బ్రదుకవలెనను తలంపు గల్గినచో మాధవుని పైభక్తిగలిగియుండవలెను. అభక్తియేజీవులకు బ్రహ్మోపదేశమై మోక్షము గలిగిం

(30 వ పేజీలో చూడుడు)

(ప) కన్నా మనసిది కానదు = మనస్సు గుర్తించియు గుర్తించినట్లు ప్రవర్తింపదు.

1. భవములు = జన్మములు; పొడవు = వస్తువు; ఏతరి = ఎత్తుకలది, పొడవులమారి.
2. మలిసీకరణము సేయగా = రూపుమాపగా; రతి = ఆసక్తి, నిరతము = ఎల్లప్పుడు.
3. కుటిలములు=బాధలు, తృణీకృతములు=తిరస్కృతములు. ఇరవొకటే; అను పాఠములో ఇరవు = ఆశ్రయము.

* 'ఇరవొకటే' అను ని. రే. పాఠము యతిభంగము లేనిది.

1. మధువైరి = మధువను రక్కసునకు శత్రువైన మాధవుడు.
3. వాసి = ప్రసిద్ధి, ప్రతిష్ఠ, వైష్ణవాగారంబు=విష్ణుని గుడి.

వును జీవింపజేయుటకు చేసిన శపథము భక్తుల కన్నులనుండి ఆనంద బాష్పముల కురిపింపకపోదు.

శ్లో॥ యదాహం నాభిజానామి విజయేన కదాచన।
విరోధం తేన సత్యేన మృతో జీవత్వయం శిశుః॥
— భారతాశ్వమేధము — 69-21

## ఆత్మనివేదనము

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచః॥

అన్ని ధర్మములను త్యజించి నారాయణుని శరణాగతిని పొందినవారిని సర్వ పాపములనుండి ముక్తుని గావించి భగవంతుడు మోక్షమిచ్చును. ఆత్మ నివేదనము చేసిన భక్తుని కికలోకమున నేదియు నక్కరలేదు అంతయు నా పరమాత్మదే వాడు నిమిత్త మాత్రుడై జీవితకాలమును బుచ్చి మోక్షము పొందును అట్టి భక్తునికి జయాపజయములు, మానావమానములు, సుఖదుఃఖములు లేవు.

'తత్ప్రాప్య తదేవావలోకయతి, తదేవశృణోతి తదేవభాషయతి, తదేవచిన్తయతి'
నారదభక్తిసూత్రము.

పరిపక్వము చెందిన దశలో భక్తుడు అతనినే (భగవంతునే) దర్శించును. అతని గురించియే మాట్లాడును అతనినే చింతించును అతని ధ్యాస తప్ప అతనికింకొకటి లేదు. అది పరిపూర్ణావస్థ.

'యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి
నాన్యద్విజానాతి సభూమా
అథయత్రాన్యత్పశ్యత్యన్యచ్ఛృణో
త్యన్య ద్విజానాతి తదల్పం
యోవై భూమా తదమృత మథయదల్పం
తన్మర్త్యమ్।
— ఛాందోగ్యోపనిషత్తు - 7—24

దేనిని దర్శించక (అతనిని తప్ప), దేనిని వినక, దేనిని అనుభవింపకుండు నట్టి స్థితిని 'భూమా' యని ఛందోగు లందురు.

ఆత్మనివేదన మొనరించిన భక్తవరేణ్యులు ముక్తసంగులు, అనహంకారులు, నిర్వికారులు, పరమ సాత్త్వికులు అది కడపటి దశ. వారికి పునర్జన్మలేదు వారు నిత్యానందానుభవులు.

శ్లో॥ వాసుదేవాశ్రయో మర్త్యో వాసుదేవ పరాయణః।
సర్వపాప విశుద్ధాత్మా యాతిబ్రహ్మ సనాతనమ్॥
విష్ణుసహస్రనామము—130

వాసుదేవాశ్రయులై తత్పరాయణులైన వారు సర్వపాపములనుండి ముక్తి శుద్ధులై పునరావృత్తి రహిత మోక్షపదము నందగలరు. ఆ మహానుభావునిపై యన్ని భారములు వైచిన వారి యోగ క్షేమములా పరమాత్ముడే గమనించునని గీతాశాస్త్రము.

శ్లో॥ అనన్యాశ్చింతయన్తోమాం యేజనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభి యుక్తానాం యోగక్షేమం వహామ్యహం॥

అని భగవంతుడు కృపజేసినాడు కనుక అన్నీ నా పరమేశ్వరుదేననినమ్మి ఆశ్రితః పతియగు శ్రీనివాసుని దివ్యమంత్రమును జపించుచు జన్మసాఫల్యము చేసికొందము.

'శత్రుచ్ఛేదైక మన్త్రం సకల ముపనిషద్వాక్య సమ్పూజ్య మన్త్రమ్
సంసారోత్తార మన్త్రం సముపచిత తమస్సఙ్ఘ నిర్యాణ మన్త్రమ్
సర్వైశ్వర్యైక మన్త్రం వ్యసన భుజగ సందష్ట సంత్రాణ మన్త్రమ్
జిహ్వే! శ్రీకృష్ణ మన్త్రం జపజప సతతం జన్మ సాఫల్య మన్త్రమ్॥
— ముకుందమాల

అని జపించు భక్తుల శ్రీ వేంకటేశ్వరుడు రక్షించుగాక!

వనమాలీ గదీ శార్ఙ్గీ శంఖీ చక్రీచ నన్దకీ।
శ్రీమన్నారాయణో విష్ణుర్వాసు దేవోఽభి రక్షతు॥
—సమాప్తం.—

# శ్రీ వరాహ పురాణం

శ్రీ ఏలూరుపాటి అనంతరామయ్య
గుంటూరు

(గతసంచిక తరువాయి)

## ఐదవ అధ్యాయం

అశ్వశిరుడు "పూజ్యులు మీరిద్దరూనా సందేహం ఒకటి తీర్చదగుదురు. అదితీరితే నాకు సంసారవిచ్యుతి కలుగుతుంది." అని అడిగాడు.[1]

నృపతి ఇలా అడిగేసరికి ధర్మాత్ముడు, యోగివరుడు కపిలముని యజ్వులలో ఉత్తముడైన అతనితో[2] "రాజా! పరమ ధార్మికా, నీ మనస్సులోని సందేహ మేమిటో, నీ కోరిక ఏమిటో చెప్పు. విని, తీరుస్తాను" అన్నాడు.[3]

రాజు "మునీ, మోక్షం కర్మపరునికి లభిస్తుందా, జ్ఞానికా? ఇదీ నా సంశయం నీవు అనుగ్రహిస్తే దీనిని తీర్చు" అని అడిగాడు.[4]

రైభ్యవసు బృహస్పతి సంవాదం:

కపిలుడు చెప్పాడు:

మహారాజా, ఈ ప్రశ్న బృహస్పతిని పూర్వం బ్రహ్మపుత్రుడు రైభ్యుడూ వసురాజూ అడిగారు.[5]

వసురాజు రాజశ్రేష్ఠుడు, విద్వాంసుడు, మహాదాత, బ్రహ్మవంశవర్ధనుడు. పూర్వం చాక్షుషమనువు కాలంలో ఉండేవాడు.[6]

ఆవసువు బ్రహ్మను చూడాలని ఆయన లోకానికి వెళ్లాడు. రాజా, దారిలో చైత్రరథుడనే విద్యాధరోత్తముని చూచి ప్రీతితో బ్రహ్మదేవుని కలుసుకోవటానికి వీలయిన సమయంగురించి అడిగాడు.[7]

అతడు "బ్రహ్మయింటిలో దేవసభ జరుగుతున్నది." అని చెప్పాడు.

అది విని వసువు బ్రహ్మయింటిద్వారం వద్ద నిలిచాడు.[8]

అంతలో మహాతపస్వి రైభ్యుడు అక్కడికే వచ్చాడు.

ఆ వసురాజు సంతోషించి, ముందుగా ఆయనను పూజించి "ఎక్కడనుంచి వస్తున్నావు మునీ?" అని అడిగాడు.[10]

రైభ్యుడు "మహారాజా, నేను బృహస్పతి వద్దనుంచి వస్తున్నాను. వేరేపని ఉండి ఆ దేవ పురోహితుని అడగాలని వెళ్లాను" అనిచెప్పాడు[11]

రైభ్యుడిలా చెపుతుండగానే బ్రహ్మ మహాసభలేచింది, దేవతలందరూ తమ తమ నివాసాలకు వెళ్ళారు ప్రభూ.[12]

అంతలో అక్కడ బృహస్పతి రైభ్యుని కలిసి అతనితో తనయింటికి వెళ్లాడు. వసువూ ఆయనను గౌరవంతో అనుసరించాడు.[13]

రైభ్యుడూ, బృహస్పతీ, వసురాజూ కూర్చున్నారు. రాజేంద్రా, వారు ముగ్గురూ కూర్చున్నాక ఆ[14] దేవగురువు బృహస్పతి చేరువనున్న రైభ్యుని "మహాభాగా, వేద వేదాంగపారగా, ఏమి చేయను? అని అడిగాడు.[15]

రైభ్యుడు "బృహస్పతీ, మోక్షం కర్మపరాయణునికి లభిస్తుందా, జ్ఞానికా? సంశయం అడుగుతున్నాను నీవు సమర్థుడవు. ఇదినాకు చెప్పు" అని అడిగాడు.[16]

బృహస్పతి చెప్పాడు: పురుషుడు ఆచరించేకర్మ సాధువయినా అసాధువయినా ఏది చేసినా అంతా నారాయణార్పణంగా చేస్తే అదిఅంటదు[17]

### విప్ర కిరాత సంవాదం

ద్విజోత్తమా, ఈ సందర్భంలో, (ఈ అర్థాన్ని వివరించే) విప్రకిరాతసంవాదం వినవస్తున్నది.

ఆత్రేయగోత్రకుడు ఒక ముని ఉండేవాడు. ఆయన బ్రాహ్మణుడు. వేదాభ్యాసపరాయణుడు.[18] తపస్సు చేసుకొనేవాడు. ప్రాతఃస్నానమూ త్రిషవణముచేసేవాడు. పేరు సంయమనుడు. ఆయన మునుపొక నాడు ధర్మారణ్యంలో శుభకరమైన ధన్య భాగీరథీనదిలో స్నానానికని వెళ్లాడు.[19] ఆ వివేకి అక్కడ పడుకొనివున్న ఒక పెద్దలేళ్ళగుంపును చూచాడు. వాటిని చంపటంకోసం విల్లుపట్టి అమ్ము ఎక్కుపెట్టి యముడులా వచ్చాడొక కిరాతకుడు, అతనిపేరు నిష్ఠురకుడు[20]

దానితో వేటతమకంలో ఉన్న అతనిని చూచి విప్రుడు సంయమనుడు 'భద్రా, ఈ లేళ్ళప్రాణాలతీయకు' అని వారించాడు.[21]

ఆమాట విని కిరాతకుడు చిరునవ్వు నవ్వి "ద్విజోత్తమా, నేను విడిగా ప్రాణులను చంపటంలేదు,[22] ఈ భగవానుడు పరమాత్మయే ఈ ప్రాణులతో ఆడుకొంటున్నాడు స్వయంగా, మంత్రాలతో మాయ చేయటంవంటిదే ఇదీను. సంశయం లేదు.[23] ముముక్షువులకు ఎన్నడూ బ్రాహ్మణా! అహంభావం తగదు. ఈ జగత్తంతా ప్రాణయాత్రాపరాయణమై పనిచేస్తున్నది, ఇందులో 'అహం=నేను' అన్నశబ్దం సాధువు కాదు[24] అన్నాడు.

అది విని ఆద్విజుడు, ఉత్తమవిప్రుడు సంయమనుడు ఆశ్చర్యంతో కిరాతుడు నిష్ఠురకునితో "భద్రా నీవు చెప్పేది హేతువునకు ప్రత్యక్షంగా నిలిచేదా?" అన్నాడు.[25]

అది విని ధర్మవేత్త కిరాతకుడు ఒక ఇనుపటోను తయారుచేసి దానిక్రింద నిప్పు పెట్టి మళ్లీ విప్రునితో[27] "కణెలు ముట్టించు" అన్నాడు.

అపుడు విప్రుడు నోటితో నిప్పు ఊది ఆగాడు.[28]

(25 వ పేజీలో)

# శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానము, తిరుమల

## వివిధ ఆర్జిత ఉత్సవముల ధరల వివరములు.

### దర్శనములు

1. స్పెషల్ దర్శనము — రు. 25

ఈ టికెట్టు తిరుమలలోనూ, దేశంలో ఆంధ్రాబ్యాంకువారి వివిధశాఖలలోను లభించును. ఈ టిక్కెట్టు వారిని సుప్రభాత సమయంలోనూ, సర్వదర్శన సమయంలోను అనుమతించటం జరుగుతుంది. ఈ టిక్కెట్టు వారిని సర్వదర్శన సమయంలో ధ్వజ స్తంభమువద్ద గాక మహా ద్వారంవద్ద క్యూలో చేర్చటం జరుగుతుంది.

### సేవలు

| | | |
|---|---|---|
| 1. | ఆమంత్రణోత్సవము | రు. 200 |
| 2. | అభిషేకము (పులికాపు సేవ) | రు. 450 |
| 3. | గంబురగిన్నె | రు. 250 |
| 4. | పునుగుగిన్నె | రు. 100 |
| 5. | జాఫ్రాగిన్నె | రు. 100 |
| 6. | కస్తూరిగిన్నె | రు. 100 |
| 7. | సహస్రకలశాభిషేకము | రు. 2500 |
| 8. | తిరుప్పావడ | రు. 5000 |
| 9. | కోవిల్ ఆళ్వారు తిరుమంజనం | రు. 1745 |
| 10. | ఐనా మహల్లో డోలోత్సవం | రు. 1000 |

### ఉత్సవములు

| | | |
|---|---|---|
| 1. | వసంతోత్సవము | రు. 2500 |
| 2. | కల్యాణోత్సవము | రు. 1000 |
| 3. | బ్రహ్మోత్సవము | రు. 750 |

### వాహనములు

1. సర్వభూపాలవాహనములో వజ్రకవచ సేవ 72 + 1 (హారతి) రు. 73
2. బంగారుగరుడ, కల్పవృక్ష, పెద్దశేష, సర్వభూపాల, సూర్యప్రభ ఒక్కొక్కదానికి 62 + 1 (హారతి) రు. 63
3. వెండిగరుడ, చిన్న శేష, చంద్రప్రభ, ఏనుగు, గుఱ్ఱం, హంస, హనుమంత వాహన సేవ ఒక్కొక్కదానికి 32 + 1 (హారతి) రు. 33

### అన్నప్రసాదములు (కాలుసోల)

| | | |
|---|---|---|
| 1. | దధ్యోదనము | 40 |
| 2. | పులిహోర | రు. 50 |
| 3. | పొంగలి | రు. 55 |
| 4. | చక్కెరపొంగలి | రు. 65 |
| 5. | సాకరబాత్ | రు. 85 |
| 6. | కేసరిబాత్ | రు. 90 |
| 7. | పాయసము | రు. 85 |
| 8. | సీరా | రు. 155 |

### పడుల ప్రసాదములు

| | | |
|---|---|---|
| 1. | అప్పము | రు. 230 |
| 2. | లడ్డు | రు. 450 |
| 3. | వడ | రు. 250 |
| 4. | పోళి | రు. 225 |
| 5. | దోసె | రు. 100 |
| 6. | తేనెతొళ | రు. 200 |
| 7. | సుఖియం | రు. 200 |
| 8. | జిలేబి | రు. 450 |

### నిత్య సేవలు

| | | |
|---|---|---|
| 1. | నిత్యకర్పూర హారతి | రు. 21 |
| 2. | నిత్యనవనీత హారతి | రు. 42 |
| 3. | నిత్య అర్చన | రు. 42 |

పరా :— సహస్ర కలశాభిషేకము ప్రతి బుధవారమునను, తిరుప్పావడ ప్రతి గురువారమునను జరుగును. మిగిలిన వివరములకు ఈక్రింది చిరునామాకు వ్రాయవచ్చును.

1. ఆమంత్రణోత్సవమునకు 5 గురికి మారుగా ఇద్దరికి మాత్రమే అనుమతి 3, 4 సేవలకు ఇద్దరిక్కి, 5, 6, సేవలకు ఒక్కొక్కరికి మాత్రమే అనుమతి.
2. ప్రతిదినం మధ్యాహ్నం 1-00 గం॥ 8-00 గం॥ లోపల సర్కారు లేదా ఆర్జిత కళ్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, వాహనసేవలు, సర్కారు డోలోత్సవం (ఉయ్యాల) (సర్కారు లేక ఆర్జిత ప్లవోత్సవం, మంగళవారంనాడు) జరుగుతవి.

ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు,
తిరుమల తిరుపతి దేవస్థానం
తిరుపతి 517501

# వేద సంజ్ఞ

శ్రీ చిట్టిబోయిన వేంకటేశ్వరరావు,
విజయవాడ.

జీవితమునకు, విజ్ఞానమునకు భారతీయ సృక్పథమునందుగల భావమును, ఉపనిషద్వాక్యము చక్కగా నిర్వచించినది – "ఆ నిరాకరణమ్ మేఽస్తు" – అనగా – "కేవలమైన దానిని దేనిని నాచే విసర్జింపనీయకుము. నా దృక్పథమునకు దృఢత్వమును చేకూర్చుము" – అని. ఇదే సూత్రమును మనము వేదవాఙ్మయము నర్థము చేసికొనుటయందుఁగూడ వర్తింపఁ జేసుకొనవచ్చును.

మనము దొరికినంతవరకు మంచిని (సాక్ష్యములను) పురాతనము నుండిగాని, నవీనము నుండిగాని గ్రహించి దానినాధారముగఁ జేసికొని ఋషిప్రోక్తములైన, సృష్ట్యాది విషయ పరిజ్ఞానమును గ్రహించి వానినుండి మనశక్తిని పెంపొందింపఁ జేసికొని, నిత్యజీవన సమస్యలకు పరిష్కారమార్గమును వెదుకుకొనవలసి యున్నది.

వేదజ్ఞానులు, వేదమంత్రార్థముల నుండి తాము గ్రహించిన విషయములను తమ తరువాత తరముల వారికి అందించినారు, కాలక్రమేణ వేదమంత్రములయొక్క అర్థములు మార్పు చెందియుండవచ్చును గాని, మూల మంత్రములయొక్క శక్తి, పవిత్రత మాత్రము మారవు. ఆ మంత్రములకు సంబంధించిన రహస్యములను వివరించి చెప్పెడి జ్ఞానధనులు నేడు మనకు లేనందున యవి మనకు నిగూఢముగనే మిగిలిపోయినవి.

వేదమంత్రసముచ్చయ తత్త్వవిచారమునందు జగత్ సృష్టికి సంబంధించిన యనేకానేకములైన మూలసూత్రములనేక రీతులలో నన్వయింపఁజేసుకొనవచ్చును. అందు ముఖ్యముగా – దైవ (ప్రాణశక్తి), భూత (వస్తుశక్తి) మొదలుగాగల శక్తులయొక్క కార్యములకు సంబంధించిన విషయములను తెలుసుకొనవచ్చును.

దేవ భూతాంతరములు వారివారి అంతః సంబంధములను నిత్యము దృష్టియందుంచుకొని వేదభావమును సాధనచేయవలసియున్నది ముఖ్యముగ యజ్ఞనిర్వహణయందు – దేవతలు సత్యమునకు, కాంతికి, అమరత్వమునకు – [సత్యంజ్యోతిరమృతమ్] – భూతములు లేక అసురులు అసత్యమునకు, చీకటికి, మృత్యువునకు – [అనృతమ్ తమః మృత్యుః] ప్రతినిధులు. జీవితము, జగత్తు దేవాసుర సంగ్రామ ఫలితముగ నేర్పడినవి. దేవతలకు ఇంద్రుడు నాయకత్వము వహించగ, అసురులకు వృత్రాసురుడు నాయకుడైనాఁడు. ఈ జగత్తు నావిధముగ దేవాసురమయముగా నూహింపవలసి యున్నది. నిరంతరము జరుగు దేవాసుర సంగ్రామము – వెలుతురికి చీకటికి జరుగు సంఘర్షణ – అమరత్వమునకు మృత్యువునకు జరుగు పెనుగులాటయే – యీ జగద్రహస్యము.

ఈ సృష్టికి యిద్దరు తల్లులు – దితి, అదితి. వీరిరువురినుండియే దేవాసుర సృష్టిజరిగినది. నేడు ప్రతి వేదపరిశోధకుని కెదురయ్యేది భాషాజ్ఞాన సమస్య। వేదభాషార్థములు బహు నిగూఢములు, వాని నవగాహన చేసికొనుటకెంతో మేధస్సు, విషయపరిజ్ఞానము, తపస్సు అవసరమైయున్నవి. అందుగల పద సంజ్ఞాజ్ఞానము కలిగినగాని వాని యర్థములు విశదములు గావు. ఈ సంజ్ఞా పరిజ్ఞానమునకు స్థలకాలములతో సంబంధములేదు.

ఉదాహరణకు – మాతృత్వమునకు సంజ్ఞ – ఆవు – గోమాత – సృష్టికి సంజ్ఞ – యీ యనంత విశ్వసృష్టికి మాత. దీనినిబట్టి జగత్సృష్టికి గోమాత నిలచినదనునది సువిదితము. అనగా గోమాత – అదితి – అంటే ప్రకృతి – మాతృదేవత. యీ జగత్తునందు వివిధ అద్వితీయశక్తులను సృష్టిచేసేది జగన్మాత। అదితి ప్రకృతి స్వరూపిణి. దేవతలకు తల్లి. గోవుకూడ విశ్వస్వరూపిణిజగన్మాత. తనశరీరమునుండి విశ్వమునందుగల ప్రాణికోటి నంతటిని పుట్టించునది గోవు కామధేనువు. గోక్షీరము కామ లేక ప్రజాపతి యొక్క సృష్టి తృష్ణ. ఈ సర్వ ప్రపంచము 'కామప్రయోజ్య' విధాతయొక్క సృష్టి కార్యమునకు, ప్రకృతి సాధనముగ – ఉపయోగింపబడుచున్నది తత్ కార్య సంజ్ఞయే గోమాత।।

మాతృమూర్తి లేక సృజనాత్మకశక్తియొక్క ముఖ్యసంజ్ఞ గోమాత. గోమాతక్షీర ప్రసాదిని యందువలన గోక్షీరము సృజనాత్మకశక్తిని పుష్టిని, తుష్టిని, సర్వశక్తిని యిచ్చి ఆయు

(22వ పేజీలో)



వేదభాష్య ప్రవచనం

# హిందూ దేవాలయాల శాస్త్రీయ రహస్యాలు

శ్రీ సి. హెచ్. రాజభద్రయ్య, విశ్వకర్మ
వరంగల్

ఆకాశమందున్న విద్యుత్తులాంటి దైవ శక్తిని వశపరచుకొనడానికి భూమియందు దాగియున్న విలువైన ధాతువులను కనుగొనడానికి – ఆకాశమందు నిరంతరం, సంచరించు గ్రహ – నక్షత్రాలను, వాటి శక్తిని స్వాధీన పరచుకొని విశ్వమానవ కళ్యాణమునకు ఉపయోగించుకొనుటకు జరుపుచున్న కృషి ఫలితములే మన ఆచారములు – సంస్కృతీ సభ్యతలు – మతము మొదలగునవి

మన ఋషులు మునులు ఆధ్యాత్మిక చింతనద్వారా ఘోర తపస్సుద్వారా ఈ విశ్వశక్తులను తమ శరీరమందిమిడ్చికొని సమాజ శ్రేయస్సుకై ధారబోసినారు. ఈ విశ్వశక్తులను సాధించుట జన సామాన్యమునకు అసాధ్యమైన విషయము. సాంసారిక జీవితముతో సతమతమౌతున్న వారు అడవులకుపోయి సాధించవలసిన కష్టము లేకుండా ఋషులు కనుగొన్న విశ్వశక్తిని సూక్ష్మ రూపమున దేవాలయముల ద్వారా ప్రజాకోటికి వితరణ చేయగలిగి తద్వారా ఆరోగ్యమును ప్రసాదించినారు ఈ శక్తుల వితరణ జరగడానికే దేవాలయ నిర్మాణముయొక్క ఆవశ్యకత ఏర్పడినది.

అందుకే భారతదేశం పవిత్ర దేవాలయాలుగల పుణ్యభూమిగా కీర్తింపబడినది. ఏ ప్రాంతానికి వెళ్ళినా ఏ నగరానికివెళ్ళినా ప్రకృతి దృశ్యాలతో ఆలయగోపురాలతో కళకళలాడుతూ సాక్షాత్కరిస్తాయి. దేవాలయములు పుణ్యక్షేత్రములనియు – పుణ్య తీర్థములనియు రెండు రకాలు. భౌగోళిక వాతావరణ ప్రభావము మరియు – స్థల ప్రాధాన్యతను బట్టి ఆ ప్రదేశమును పుణ్యక్షేత్రమనియును – జలము అందు కరిగియున్న ఓషధులను మరియు ఖనిజములను పరిశీలించి మానవ ఉపయోగమునకు ఆ ప్రదేశమున దేవాలయము నిర్మించి పుణ్య తీర్థములని నిర్ణయించినారు. ఖగోళసంబంధమైన గ్రహనక్షత్రాది రాశి కూటమివల్ల కలుగు ప్రభావము ఏ నక్షత్రమునకు సంక్రమించునో ఆ ప్రదేశమున ఆయా ప్రత్యేక సమయములందు ఉత్సవములనేర్పాటుచేసి దర్శింపవచ్చిన భక్తులకు ఆశక్తులు తెలియకుండా సంక్రమించు ప్రయోగములు చేసినారు

అయితే దైవదర్శనమునకు వచ్చినప్పుడు ఏకాగ్రతగలిగి – పవిత్రమైన మనస్సు గలిగి యుండవలయుననెడి నియమముగలదు. మనస్సుకూ – శరీరమునకు అవినాభావ సంబంధముగలదు. మానసిక కలతలవలన శరీరములోని జీవకణాలు – ధాతువులు – నాడీమండలము దెబ్బ తి ని నిద్రరాకపోవుట, అజీర్ణము – అతిమూత్రవ్యాధులు – మలబద్ధము – గుండె నొప్పులు ప్రేవులకు పుండ్లు – అల్సర్లు – క్యాన్సర్లు లాంటి భయంకరమైన రోగములకుగురియై మరణించే ఆస్కారముగలదు. అందుకే మనోవ్యాధికి మందులేదన్నారు పెద్దలు మనస్సును స్వాధీనమందుంచుకొనుటకు మనస్సును తేలిక పరచుటకు కనిపెట్టబడిన అమోఘమైన సాధనములు మనదేవాలయములు. దేవాలయములు చక్కని శిల్ప కళావైభవములతో నృత్యవాద్య సంగీతముతో సప్తస్వర సమ్మేళనమైన ఓంకార ప్రణవముతో కమనీయ ప్రకృతి దృశ్యాలతో కనువిందుగా కనబడుట వీటి ప్రత్యేకత. మానసిక ఆందోళనముతో నున్న భక్తుడు లేదా అనారోగ్యముతో బాధపడు భక్తుడు దేవాలయమున ప్రవేశించగానే మనస్సును వేధించుచున్న బాధలు మరచి మానసిక ప్రశాంతత చేకూరుతుంది. శారీరక పరిశ్రమను కలిగించుటకుగాను సాధారణముగా దేవాలయములను ఎత్తైన ప్రదేశములయందును ఓషధీ సంబంధమైన

పర్వతములపైనను నిర్మించినారు. భక్తులు పైకెక్కునప్పుడు ఉచ్ఛ్వాస నిశ్వాసలు గలుగుటవలన ఊపిరితిత్తులలోని చెడు వాయువును తొలగి గుండెలోను రక్త ప్రసరణమండలములోను ప్రాణవాయువు ప్రవేశించి రక్తశుద్ధి జరుగును. దేవాలయమున ప్రవేశించగానే హారతి కర్పూరపు ధూమముచేత ఊపిరితిత్తులు స్వచ్ఛమగును. మరియు సుగంధ పుష్పముల వాసనచే శరీరమునకు శక్తి కలుగును ఆరోగ్యము చేకూరును. నల్లరాతితో దేవాలయమును నిర్మించవలయుననెడి వాస్తుశిల్ప శాస్త్రము యొక్క నిబంధనలుగలవు. నల్లరాయికి దేవాలయములో విషవాయులను హరించే గుణముగలదు. గంటనుండి వెలువడు శబ్ద తరంగములు మన చెవిన పడునప్పుడు ప్రకృతిలో దాగియున్న శక్తిని చెవులద్వారా శరీరమునకుసంక్రమింపజేయును. అప్పుడు ధాతువుల లోపమును పూరించి శరీరమును ఆరోగ్యవంతముగ జేయును. ఇవి దేవాలయమునందలి శాస్త్రీయ ప్రక్రియలలోని కొన్ని మాత్రమే.

మూల విగ్రహమును పరిశీలిద్దాం - దేవతా విగ్రహమునకుముందు భాగమున నేయితో వెలుగు రెండుజ్యోతులను ప్రత్యేక కోణములలో అమర్చెదరు. గో - అనగా సూర్యకిరణము. ఈ గో ఘృతమునుండి వెలువడు వెలుతురు కిరణములు మూల విగ్రహమునకు రహస్యముగాఅమర్చబడిన వజ్రమునందు బడును. వజ్రమునందు సంచరించు భయంకర అణుసంచయము ఈ కిరణములు, మానవశరీరము భరించ గలిగిన స్థాయితో అణుశక్తిగా కూర్చబడును. (త్రికోణాకారములో కటింగ్ చేయబడిన వజ్రములు,) ఈకిరణములు అప్పుడే స్నానముచేసి ధోతీమాత్రమే కట్టుకొని దైవదర్శనమునకు వచ్చిన భక్తుని శరీరము పైబడును. అయితే ఈ అణుకిరణాలు శరీరము త్వరగా గ్రహించుటకు మనస్సు నిర్మలమై పవిత్రమై యుండవలయును. మురికిపాత్రలో మంచినీటిని పోసినచో నీరు మురికిగా తయారగును. మంచి పాత్రలో పోసినచో నీరు స్వచ్ఛముగా నుండును. కాబట్టి పవిత్ర మనస్సు - ఏకాగ్రత గలవారి శరీరము ఈ శక్తికిరణములను త్వరగా శరీరమునకు చేర్చి క్రమముగా రోగనివారణగావించి మానసిక శక్తిని పెంచును.

అందుకే దేవాలయములు పవిత్రమైన స్థానమును ఆక్రమించినవి యింతటి మహోన్నత ప్రయోగాలు చేసి మానవ మనుగడకు సర్వంత్యాగంచేసిన మహర్షులకు మునులకు మనమెంతో ఋణపడి యున్నాము.

మనదేశముపై ఏ విదేశీయులు దండయాత్ర చేసినా మన దేవాలయములను

(24పేజీలో చూడుడు)



# బ్రహ్మోత్సవం



మృదంగ విద్వాంసులు శ్రీ ఎల్లా వేంకటేశ్వరరావుకు దేవస్థాన సత్కారం అందజేస్తున్న రాష్ట్రదేవాదాయ కమీషనర్ శ్రీ చంద్రమౌళిరెడ్డి



శ్రీ నేదునూరి కృష్ణః

★

వయోలిన్ విద్వాంసులు శ్రీ టి. ఎన్. కృష్ణన్ కుమారుడు చి॥ శ్రీరామ్‌కు దేవస్థానం చేర్మన్ శ్రీ రమేశన్ అవార్డు ఇస్తున్న దృశ్యం



# వార్తాచిత్రాలు



డా॥ శ్రీ పాద పినాకపాణి గారి గాత్ర కచేరి సన్నివేశం.



త్రి సంగీతసభ

★

శ్రీ వీరగంధం వేంకట సుబ్బారావు హరికథా కాలక్షేపం.





నరస మధురంగా సాగుతున్న సామవేదగానం

(17 వ పేజీ తరువాయి)

వృద్ధిని కలుగజేయుచున్నది. ప్రకృతియందు క్షీరము సర్వవ్యాప్తి – సర్వశక్తిదాయకము గోమాత నీరమును క్షీరముగా మార్చి జగత్ శ్రేయస్సుకొఱకు ప్రసాదించుచున్నది. ఘృతము లేక వెన్న పురుష ప్రకృతికిచిహ్నము. "ఘృతేన పృధివీ వ్యుద్యతే–" (ఋగ్వేదము) భూ ప్రపంచము వెన్నతో తడుపబడుచున్నది. ఘృత, – గౌః, – పయః, – ఘృతమ్ – అను పదములు కొన్ని వందలసార్లు ఋగ్వేదములో సంజ్ఞా యుతముగ ప్రయోగింపబడినవి. నీరు అగ్నిపై చిలికితే ఆరిపోవును. కాని వెన్న చిలికితే అగ్ని ప్రజ్వరిల్లునను సత్యము సర్వత్ర విదితమేకదా! అందువలన వెన్న అగ్నియొక్క స్వస్వరూపముగ అభివర్ణితమైనది.

"ఓ అగ్నీ! నీ శరీరమువెన్న " – ఏషాతే శుక్రాతనుః యజన్" "ఓ అగ్నీ! వెన్న నీ ప్రియవాసము – "అగ్నీ! ఏతద్వా అగ్నీ ప్రియ మేధమయమ్ ఘృతమ్"

అగ్ని ప్రజాపతియొక్క ప్రధానసృష్టికి మూలము, అదే విధముగ ఘృతముకూడ! సృష్టికి మూలాధారమే! గర్భాశయమునందు నిక్షిప్తమైయుండు జీవకారణమునకు 'ఘృతము' సంజ్ఞావిశేషము.

వేదసంజ్ఞలు అనేకములు. రవి, సగరుడు, అగ్ని, ఆకాశము, భూమి, నీరు, పర్వతము, నది, ఉదయము, సాయంత్రము, పగలు, రాత్రి, గాలి, పక్షి, జంతువు, అడవి, మొదలగునవి సంజ్ఞలుగా నున్నవి. ఈ సకల చరాచర ప్రపంచమును వేదసంజ్ఞలద్వారా సులభముగ నవగాహన చేసికొనవచ్చును. నిజమునకే ప్రకృతిజనిత పదార్థమైనను, లేదా మానవ నిర్మిత పదార్థమైనను దాని ప్రకృతి ప్రయోజనములను బట్టి సంజ్ఞానామముచే బిలువబడు చుండును. ఈ సంజ్ఞాపరిభాష ప్రకృతినందు మార్పులేనిది, దేశకాల పరిస్థితులకతీతమైనది, మారనిదీను, మాత, పిత, భ్రాత, సహోదరి, పతి, పత్ని, పుత్ర, పుత్రిక, మొదలగునవి. విశ్వవ్యాపిత సంకేతపదజాలము జగత్ నిమంటువు. ఈ పరిభాషను పరిశీలకులు బాగుగనే యుపయోగించుకొన్నారని చెప్పవచ్చును. దానియొక్క తేజస్సు భూమ్యాకాశముల పర్యంతము వ్యాపించినది, దానియొక్క క్రొంగ్రొత్త యనుభవము మాధుర్యమునకు మేధావుల మనస్సులు పరవశించి పోయినవి! – అనంతమైన మధుర సంకేత పద జాలమును దర్శించి అమందానంద డోలికలలోనూగులాడిరి మేధావులు.

సృష్టింపబడిన వస్తుజాలము యొక్క ప్రకృతి ధర్మములను మనము ప్రస్తుతమను భవించుచున్నాము. ఒక్కొక్క వస్తువు ఒక్కొక్క సంకేతము సంజ్ఞ తెలిపే లేక చూపే సాధనము. సూర్యునియొక్క కిరణమంతర్గత ముగు సప్తవర్ణములనేవిధముగగలిగియుండునో నదే విధముగ ప్రకృతిజనితవస్తువు ప్రతిదియును అంతర్గతముగ ననేక ధర్మములు లేక శక్తులు గలిగియుండును

"దేవం వహంతి కేతవః".

వేదార్థ సాధన సత్యమేమనగ, మేధావుల పరిభాషాప్రమాణమునకు తత్త్వ విచారమునకు సంబంధించినంతవరకు కొన్నికొన్ని పద్ధతులను గ్రహించుట – వేదమంత్రములయందలి నిగూఢార్థములను చక్కని వస్త్రములందు చుట్టి సమాధిచేసి, దాని బాహ్యార్థములను మాత్రము కఠిన నియమావళులమధ్య కొరకరాని పరిభాషయందు నిక్షిప్తపరచినది. మనము తామేమిచెప్పిరో తెలిసిన మేధావులకు ముఖాముఖి యున్నాము. వారు విశదపరచిన సంకేతిక పరిజ్ఞానమును స్థిరబుద్ధితో సూటిగా విషయమునవగాహన మొనరించుకొని యందే పొరపొచ్చములు లేకుండ దృఢదీక్షతో సత్యాన్వేషణ బద్ధ కంకణులమై, పరిశోధనమును సాగింపవలసి యున్నది. ఉదాహరణకు "మహి" "మాతా"= మాతృదేవత, మగ్న, మటర్ అనునవి యెప్పుడు నొకే యర్థమును సూచించును. అదితి దేవమాత స్వయం – అనంతప్రకృతి. ఆమె స్వతస్సిద్ధముగా నొకేశక్తి. కాని సృష్టికార్యము నకై ఆమె సప్తరూపములు ధరించి సప్తశక్తి ప్రదాయినిగా నున్నది. జగన్మాతసప్త పుత్రులు మేధస్సు జీవితము పంచభూతములు. "వస్త్ర పుత్రాయ మాతరోవయంతి" ఆ మాతృమూర్తి తన శ్రేయస్సుకొరకు తన కొంగును విసురు చుండునని ఋగ్వేద ప్రమాణము. ఈ వేద వాఙ్మయమునందు మనము సంపూర్ణముగ సంకేత పదజాలమందు తలమున్కలై పోదుము

"వస్త్రపుత్రమాతరః" – అను పదములకు అసలైన అర్థములను తెలుసుకొనవలెను యజ్ఞమునందు ఏడుదారములతో నేసే వస్త్రమునే యుపయోగింతురు. అవి మనస్సు, ప్రాణము, పంచభూతములు పిపీలకాది బ్రహ్మ పర్యంతముగల ప్రాణులయొక్క స్థూల శరీరములకు సృష్టియాధారమైనది యజ్ఞము. ప్రతి శరీరమునకును మధ్యబిందువు సూర్యుడు లేక అగ్ని లేక మధ్యప్రాణము. ఈ సాంకేతిక జ్ఞానము సముపార్జనార్థమునకు ప్రాణవిద్యా సాధనమెంతైనను అవసరమై యున్నది.

శారీరక, జీవిక, ఆత్మిక (మానసిక) తత్త్వముల సమన్వయముయొక్క పరిపూర్ణజ్ఞానము లేనియెడల వానియొక్క సత్యాసత్యములను తెలిసికొనుట బహుదుస్తరము. ఈ మూడు తత్త్వములు ఒకత్రాటియందుగల దారములవలె (ఏడును) స్థూల శరీరమునకు మూలములు ఈ స్థూల శరీరమే యజ్ఞపశువు. భూతముద్వారా దేవతలను పూజించునదే యజ్ఞము. సూర్యుడీకార్యమునకు ప్రత్యక్ష సాక్షీభూతుడు ఆయన యజ్ఞకారకుడు గావున దేవతలాయనద్వారా స్థూలశరీరముపై తమ మహత్తును చూపుదురు. ప్రత్యక్ష సాక్షీ భూతుడైన సూర్యభగవానుని భూమి-తదితర గ్రహములవలె పదార్థ సహిత గ్రహమైనప్పటికి వేదవేద్యమైన మంత్ర సముచ్చయముచే ఆయనను అద్వితీయ దేవతా మూర్తిగను, అనంతోన్నతిగల మహానుభావునిగను; జగత్కారకునిగను అభివర్ణించి పూజించినది, 'ప్రాణః ప్రజానా ముద యత్యేష సూర్యః' "మరియు సూర్యః ఆత్మా జగతస్తశ్చ క్షు షేశ్చ"

విశ్వ కుహరము నందుగల మధ్యస్థ బిందువునకు సూర్యుడు సంకేతముగ నున్నాడు. ఆ బిందువు విశ్వమునకు మూలాధారమైనది. అట్లే యజ్ఞమునకుగూడ మూలాధారమైనది. యజ్ఞమును "అయమ్ యజ్ఞోభువనస్యనాభి" యందురు. యజ్ఞము జగత్తునకు నాభి వంటిది. అని యందురు. ఎక్కడైతే మధ్య బిందువుండునో నాభియుండునో అక్కడ తత్సంబంధమైన నియమిత మండలముండును. నాభిమండలము నొకదానికి సంబంధముకలిగి ఒక నియమిత సూత్రావళి ననుసరించి, ఒకటికొకటిగ నుండును. ఆ విధముగ నాభికి మండలము కవచముగ ఒక తోడుగ పేర్కొనబడు చున్నది.

అదే సూత్రప్రకారము సూర్యభగవానుడు వైవస్వతుడుగ పేర్కొనబడుచున్నాడు ఆయన కిరణములు విశ్వమునకు బంగారు వస్త్రము. ఈ వస్త్రము సప్తదారముల ప్రోవులతో నేయబడినది. జీవి, ఆత్మ మరియు పంచభూతములు. ఆ వస్త్రమునందు సప్త ప్రోవులు! ఆ వస్త్రమే యజ్ఞము! అదే జీవితమునకు మూలాధారమైన మూడు సూత్రములు. "ఇమమ్నో అగ్ని ఉపయజ్ఞ మేహి పంచాయ్యమ్ త్రివృతమ్ సప్తతంతుమ్ —

ఆ మూడు సూత్రముల విజ్ఞానమే "త్రైవిద్యాం". మూడు వేదమంత్రములు జీవితమునకు మూలాధారమైనవి. వీనికి ముఖ్య సంకేత ప్రత్యక్షదైవము పురాణపురుషుడు సూర్యభగవానుడు. "త్రయీవాఏషా విద్యా తపతి" సూర్యుడు యీ సకల చరాచర ప్రపంచమునకు కామాభూతుడు. ఆత్మ-వాక్కు-మనస్సు-ఉచ్ఛ్వాసనిశ్వాసలకు కారణభూతమైనవి. "ఏతన్మయోవా అయమాత్మావఙ్మయో మనోమయః" ఇక్కడ శ్వాస (ఊపిరి) అనగా ప్రాణము, వాక్కు, భూమ్యాకాశముల మధ్య గల పంచభూతములకు మూలాధారమైనవి. వాక్కు-భూమి-శరీరము-వాక్కు వ్యాప్తిచెందినంత భూమికూడ వ్యాప్తిచెందును. 'జస్యైవ వాచః పృథివీ శరీరమ్ యవత్యేవ వాక్తావతి పృథివీ'

సూర్యభగవానుడు మనస్సు, జీవము, పదార్థములతో జగత్సృష్టి చేసినాడు. ఆ మూడును మూడు వేదసంజ్ఞలుగా యేర్పడినవి. సూర్యభగవానుని వేదప్రాముఖ్యమును పరిపూర్ణముగ గ్రహించుట బహుదుర్లభము. ఈ సకలచరాచర జగత్తునకును పిపీలకాది బ్రహ్మపర్యంతమునకును, సూర్యభగవానుడే సృష్టి స్థితిలో కారకుడు-ప్రజాపతి. సూర్యభగవానుడు మూడుమూర్తులుగ నవతరించి తన తేజో పుంజములతో నితరదేశములను సృష్టిగావించినాడు.

జగత్సృష్టికి కారణభూతుడైన సూర్యభగవానుని వేదభాషా సంజ్ఞయందు "త్రివృత్యజ్ఞా" అని సంబోధింపబడినది. ఇంద్రునికి అగ్నికి సంకేతము సూర్యభగవానుడని బృహద్దేవతా వివరణము. "సూర్యుడు వాయువుతో కలిపి నీటిని ఆవిరిగా మార్చి భూమియందు వర్షము కురిపించును అందువలన ఆతడింద్రుడైనాడు.

అగ్ని భూమిపైన ఇంద్ర వాయువులు మధ్యస్థముగను సూర్యుడాకాశము నందును మనకు ప్రత్యక్ష దైవములుగా నున్నారు.

ఇంకొక యుదాహరణము తీసికొందము సావిత్రికథ ప్రథమముగా సవితా లేక సూర్యునికి సంకేతముగ అభివర్ణింపబడిన చక్కని కథ సూర్యుని కిరణశక్తికి 'సావిత్రి' అని పేరు. వేదసంజ్ఞా విజ్ఞానమును భారతీయ తత్త్వనిర్మాణ ప్రజ్ఞానిధులెంత చక్కనికథగ కల్పించి వివరించినారో గమనింపదగినది ప్రథమముగా జగత్తునందు సూర్యభగవానుడు ఆయన అనంతమైన శక్తిచే జీవుల నుద్భవింపజేసినాడు, అది అధిదైవిక ప్రాథమిక శక్తి, అన్ని స్థలము లందు అన్ని కాలము లందు యేకధాటిగ జరిగిన సృష్టి సత్యము. అటుపైన జగత్తుయొక్క సృష్టిసత్యములు వేదమంత్రములు శ్లాఘించెను. "సవితా" సృష్టి యందుగల సకల జీవులకు తన శక్తిని పంచి



వేదవేద్యునికి వేదపండితుల నీరాజనం

యిచ్చుచుండును. తరువాత పురాణసాహిత్యము "సావిత్రీ ఉపాఖ్యానము-అను చక్కని కల్పిత గాథను అల్లినది. అఖరున-అది ప్రతి సంవత్సరము 'వటసావిత్రీదినము' గ రూపొందింపబడి ప్రతిసంవత్సరము నుత్సవము జరుపబడుచున్నది. ఆ దినమున నుపవాసముచేసి ఆ కథను పవిత్రముగ చెప్పుకొనుచుందురు.

జైమినీయ ఉపనిషత్ బ్రాహ్మణమునందు సవితా - సావిత్రి మొదలగు శక్తి ప్రసాదితములైన నామములు పండ్రెండు పేర్కొనబడినవి.

(1) మనస్సు - వాక్
(2) అగ్ని - పృథివీ
(3) ఆయుః - అంతరిక్షము
(4) ఆదిత్యాః - దయే:
(5) చంద్రమ - నక్షత్రాణి
(6) అహః - రాత్రిః
(7) ఉష్ణమ్ - శీతమ్
(8) అభ్రమ్ - వర్షా
(9) స్తనయిత్ను - విద్యుత్
(10) ప్రాణః - అన్నమ్
(11) వేదః - ఛంధాంసి
(12) యజ్ఞః - దక్షిణా.

పై ద్వంద్వ భావము లొకదానికి వ్యతిరేకముగ నొకటి పనిచేయును. అనగా ఋణ, ధన ప్రకృతులలో నివి పనిచేయును. భార్యాభర్తల తత్త్వములతో పనిచేయును. అట్లుచేసి మిథున ప్రక్రియద్వారా శక్తి యుత్పాదనముచేసి, సృష్టి కార్య కారకమగుచున్నవి. ఆ విధముగ నవి యజ్ఞక్రతువును నెరవేర్చి సృష్టి కార్యమునకు దోహదమగుచున్నది. "యజ్ఞో వై ప్రచోదయతి స్త్రీ చైవ పురుషశ్చ ప్రజానాయతః -"

ఇది అగ్నికి సోమరసము, అహుతినొసగుటద్వారా సృష్టి కార్యమునకు దోహదము చేయుట - శివ సతి సంగమము, అగ్ని సోమ కలయిక పార్వతీ పరమేశ్వరుల ప్రణయము.

పురాణకథయందుగల సత్యవంతుడు సూర్య భగవానుని అంశ; ఆయన సంకేతము సావిత్రి ఆయనశక్తి అంశ - సూర్యుని సత్య - సవ - 'సత్య ధర్మా' అందురు.

అనంత కాలమునందు నిరంతరము ప్రయాణము చేయు సూర్యభగవానుడు సత్యసంధుడు సాక్షీభూతుడు. భూమ్యాకాశములకు సాక్షీభూతుడు "సత్యమత్సతత్" - సూర్యభగవానుడు ఆ విధముగ సత్యనారాయణమూర్తి; యజ్ఞనారాయణుడు అయి సత్యమునకు యజ్ఞమునకు కారకుడు సాక్షీభూతుడు అయివున్నాడు. ఆ విధముగ సత్యము యజ్ఞము అనునవి యే కార్థతను సాధించుచున్నవి.

సూర్యుడు జగత్ అశ్వమేధమునకు తురగము - "ఈషావా అశ్వ మే ధో యయిూషా సూర్య: తపతి". సత్యవంతుడు అశ్వప్రేమిగ పేర్కొనబడినాడు. అతడశ్వ చిత్రములను గీయుట, మట్టితో గుర్రపు బొమ్మలను చేయుట యందు ప్రీతిగలవాడు. అశ్వశాస్త్రమునందు పండితుడు. అశ్వహృదయము నెఱిగినవాడు. అందువలన అతనికి "చిత్రాశ్వుడని" పురాణ ప్రసిద్ధి గలిగినది. "బాలాస్స్వాశ్వాప్రియాశ్చస్య క్రౌల్యశ్వంశ్చ మృణ్మయాన్ చిత్రేపి - ఇచలి ఖల్యశ్వంశ చిత్రాశ్వ ఇతిచోచ్యతే."

ఇకపోతే సత్యవంతుడు సావిత్రిని వివాహమాడిన తదుపరి నతనికొక సంవత్సరము మాత్రమే నాయుర్దాయముగలదు. ఆమె అతని శాపమును పోగొట్టవలెను. సూర్యుడు గోచార రీత్యా పండ్రెండు రాసులయందును నొకపరి సంచరించి వచ్చుటకొక సంవత్సరకాలము పట్టును. దీనికి సంకేతముగనే సత్యవంతుని వివాహనంతరకాలమున నొక సంవత్సరముగ నిర్ణయింపబడినది. అశ్వమేధ సంవత్సరము మృత్యుదేవుడైన యమధర్మరాజు భయంకరమైన మృత్యువునకు సంకేతము "ఘోర ప్రాణాన్ని" — దానికి శాంతిక్రతువును పవిత్రముగచేసి ప్రసన్నము చేసుకొనవలసియున్నది. అఘోర - శివ - అదే సావిత్రి చేసినది. ఈ కథాక్రమమునందు యువరాజు సర్పదష్టుడైన (సర్పము మృత్యువునకు సంకేతము) రాజకుమారి సప్తక్రతువుల (సప్తఋ్వరః) అనుగ్రహముచే మరల రాజకుమారుని బ్రతికించుకున్నది. (అదితి, మహి, మాతా) సప్తమాతృకలయందు ప్రప్రథమురాలైన అదితి అమరత్వమును ప్రసాదించును. జీవమునిచ్చును. సృష్టికిమూలము.

సంజ్ఞా పరిజ్ఞానముతో వేద పరిశీలనచేస్తూపోతే అనేక స్థాయిలయందనంతమైన అనేక గాథల నుండి అమూల్యమైన ఆణిముత్యముల వంటి జ్ఞాన సంపద లభిస్తుంది. ప్రస్తుతము సంజ్ఞాపరిజ్ఞానముతో వేద పరిశీలనచేయు పద్ధతిని సూచించుట మాత్రము జరిగినది.

※

---

(19 వ పేజీ తరువాయి)

నేలమట్టం చేసేవారు. వారి ఆచారములను భాషను — మనపై రుద్దడముచేత మనదేవాలయములందుగల శాస్త్రీయరహస్యములు ఆధ్యాత్మిక రహస్యములు మనకు తెలియకుండా పోయినాయి. అప్పటినుండి సమాజం అస్తవ్యస్తముగా అయోమయంగా తయారయి - దురాచారములు చేయుట యందు - హత్యలు దోపిడీలు - మానభంగాలు చేయుటయందు పాప భీతి లేక విచ్చలవిడిగా అస్తవ్యస్తమైపోయింది నేటి సాంఘిక పరిస్థితి.

పూర్వం ఉదయం లేవగానే స్నానమాచరించి భక్తితో దేవాలయంముందు నిలిచి దైవదర్శనాలనై తపించేవారు. ఏవిధముగా దేవాలయమునకు వెళ్ళుట మానుకుంటూ వచ్చినారో ఆ విధముగా నానారోగములకు గురియై యిప్పుడు ఉదయం లేవగానే ఏ దవాఖానాముందో - ఏడాక్టరుయింటిముందో డాక్టరు దర్శనమునకై తహతహలాడుచున్నారు. ఈ విధముగా దేవాలయముల స్థానం ఆసుపత్రులు ఆక్రమించినవి. శాస్త్ర విజ్ఞానం అభివృద్ధియగుచున్న నేటి రోజులలో రోగులు సంఖ్య తగ్గవలెకాని అలాకాక ఆసుపత్రులు - ఆసుపత్రులకు డాక్టర్లు డాక్టర్లకు రోగుల సంఖ్య పెరుగుచునేయున్నది. మరి ఈనాటి శాస్త్ర విజ్ఞానమంతా ఏమైనట్లు? రోగం ముదిరిన తర్వాత ఎంత గొప్ప డాక్టరున్నా - ఎన్ని ఆధునిక ఔషధములువున్నా ప్రాణాన్ని కాపాడ లేదు - అదేవిధముగా తుది ప్రాణాలతో ఏదేవుణ్ణి ప్రార్థించినా ఎంతమహిమగల దేవాలయమునకు వెళ్ళినా ఫలితం శూన్యమే మరి. అంత మాత్రాన దూషణ భూషణలు పనికిరావు.

(15 వ పేజీ తరువాయి)

మంట వచ్చేసరికి ఆయినుపబోనుసందులలో నుంచి మంటలు వస్తుంటే కాదంబి గోళంలా ధగధగలాడింది.[29] నిప్పు ఒక చోటనే ఉన్నా, ఇనుప(బోను) సందుల నుంచి విడివిడిగా వేలకొలదీ అగ్నిజ్వాలలు వెలికి వచ్చాయి [30]

అప్పుడు కిరాతకుడు విప్రునితో "మహా మునీ, ఒకజ్వాలను తీసుకో మిగిలిన జ్వాలలను ఇక్కడ ఆర్పుతాను" అనిచెప్పి వెంటనే నిండు నీటికడవను మంటలోకి విసిరి వేశాడు. తక్షణమే అగ్ని మును పటిలా ఆరిపోయింది.[32]

ఆ తరువాత కిరాతుడు ఆ బ్రాహ్మణ తపోధనునితో "భగవానుడా, ఈ అగ్ని నుంచి నీవు తీసుకున్న మంట ఇవ్వు. దానితో మాంసం తెచ్చుకొని (వండుకొని) తింటాను" అన్నాడు.[33]

ఇలా అనగానే విప్రుడు ఇనుపబోను చూచేసరికి అక్కడ అగ్ని లేదు. మొదలు పోయేసరికి పోయింది.[34]

అపుడు బ్రాహ్మణముని సిగ్గుతో మౌనం వహించాడు.

ఆమీద కిరాతకుడు[35] సజ్జనోత్తమా, ఇక్కడ అంటించిన నిప్పు చిలవలు పలవ లయింది. మొదలుపోతే పోయింది. ద్విజా ఆలాగే ఇదీను.[36] ప్రకృతిలో వుండిన ఆత్మ ప్రాణులకు ఆశ్రయమవుతుంది, దాని వికృతివల్ల జగత్తు ఉద్భవిస్తుంది. ఇది జగత్తు స్థితి.[37] ముద్ద తీసుకొనేరీతిని దీనికి విహితమైన వ్రతమంతా ఆత్మకు కూర్చి ఆచరించేవాడు క్షీణించడు" అని చెప్పాడు.[38]

రాజసత్తమా, బ్రాహ్మణునికి కిరాతకుడు ఇలా చెప్పేసరికి ఆకాశంనుంచి అతనిమీద పుష్పవృష్టి కురిసింది.[39] కామ గమనంగల బహురత్న దివ్య ముఖ్యమహా విమానాలు కనిపించాయి బ్రాహ్మణోత్తమునికి.[40] వాటి అన్నిటిలోనూ ఉత్తమ కామ రూపంతో కిరాతకుడు నిష్ఠురకుడు కనిపించాడు.[41] అద్వైతవాసనతో సిద్ధుడై యోగబలంతో బహుశరీరములు ధరించిన అతనిని చూచి విప్రుడు సంతోషించి తన ఆశ్రమానికి వెళ్ళాడు.[42]

ద్విజోత్తమారైభ్యా, వసు రాజా, స్వజాతి కర్మ ఆచరించే వానికికూడా ఈ విధంగా జ్ఞానం కలుగుతుంది, ముక్తికలుగుతుంది. ఇది నిశ్చయం'[43]

(అని బృహస్పతి చెప్పగా) రాజా, అశ్వశిరా, రైభ్యవసువులు సందేహములు తీరి బృహస్పతి యింటినుంచి తమతమ ఆశ్రమాలకు వెళ్ళారు.[44]

కనుక, రాజేంద్రా, నీవుకూడా ప్రభువును నారాయణదేవుని ఆరాధిస్తూ స్వదేహంలో అభేదంతో ఆయనను చూడు[45]

అని చెప్పిన కపిలుని మాట విని రాజు అశ్వ శిరోవిభుడు జ్యేష్ఠ పుత్రుని ధన్యుని స్థూలశిరుడనే అతనిని పిలిచి, తనరాజ్యంలో అభిషేకించి నైమిశారణ్యానికి వెళ్ళిపోయాడు. వరారోహా, ధరణీ, అక్కడ యజ్ఞశరీరుడయిన శ్రీహరిని తపస్సుతోనూ యజ్ఞమూర్తి స్తవంతోనూ ఆరాధించాడు.[47]

## యజ్ఞపురుష (నారాయణ) స్తోత్రం:

(అని వరాహస్వామి చెప్పగా విని) ధరణీదేవి "మహాభాగా! రాజు అశ్వశిరుడు యజ్ఞశరీరుడైన నారాయణునిస్తోత్రం ఏ విధంగా చేశాడో ఇది నాకు చెప్పు మళ్లీ" అని అడిగింది.[48]

### వరాహస్వామి చెప్పాడు:

ఇంద్ర శివసూర్యాగ్నిచంద్రరాజ మరుదనేక రూపివి యజ్ఞశరీరుడవు అయిన శ్రీహరికి నీకు నిత్యమూ నమస్కారం.[49] మహాభయంకరములైన కోరలూ, చంద్ర సూర్యనేత్రములూ కలిగి, సంవత్సరమూ రెండయనములూ కుక్షిగా కలిగి, దర్భలు లింగములుగా రోమములుగా కలిగి, ఉగ్ర శక్తిశాలీ, సనాతనుడూ అయిన యజ్ఞపురుషునికి నమస్సు.[50] దివికీ భువికీ నడుమగల భాగమూ సర్వదిక్కులూ తన శరీరంతో వ్యాపించిన ప్రశంసనీయుడు శాసకుడు, జగత్సృష్టికర్త అయిన ఆ జనార్దనునికి నమస్సు.[51] ఆ యజ్ఞపురుషుడు సురాసురులకు అజయ్యుడు. జయం కోసం ప్రతియుగంలోనూ తన ఆది శరీరాన్ని సృజిస్తుంటాడు. ఆయన అనాది. అట్టి పరమేశ్వరునికి నిత్యమూ వందనం[52] ఆ ఉగ్రతేజస్వి జయంకోసం మాయామయమై నిర్మలమై తెల్లనైన చక్రం ధరించాడు. శార్ఙ్గశంఖాదులున్న చతుర్భుజుడు. అట్టి యజ్ఞమూర్తికి నిత్యమూ ప్రణతి[53] ఆయన ఒకచోట వెయ్యి శిరస్సులు ధరించి ఉంటాడు. ఒకచోట మహాపర్వత సమానకాయంలో ఉంటాడు. ఒకచోట త్రసరేణు సమానుడుగా ఉంటాడు. అట్టి యజ్ఞపురుషునికి సదా ప్రణామం[54] ఆయన చతుర్ముఖుడై సమస్తమూ సృజిస్తాడు. పాలించటానికి రథాంగపాణీ, నశింపజేయటానికి కాలాగ్ని సన్నిభుడూ (శివుడూ) అవుతాడు. అట్టి యజ్ఞమూర్తికి నిత్యమూ వందనం[55] సంసార చక్రం తిరుగుతుండటం కోసం సర్వగతుడైన ఆ పురాణ పురుషుని యజిస్తుంటారు. ఆ అప్రమేయుని యోగులు ధ్యానిస్తుంటారు. ఆ యజ్ఞమూర్తికి నిత్యమూ నమస్సు[56] చక్కగా చూడదగిన నీ తత్త్వం మనస్సుకు నేను బాగా అర్పించుకొన్నప్పుడు వేరేదీ లేదు. అనే బుద్ధి స్థిరమవుతున్నది. అందువల్ల విశుద్ధభావం ఏర్పడుతున్నది.[57]

అని పలుకుతున్న అశ్వశిరునిముందు అగ్నిప్రభా సమానమైన తేజస్సు ఆవిర్భవించింది. దానిలో బుద్ధిని ఉంచి ప్రవేశించి రాజు యజ్ఞమూర్తిలో లీనమైనాడు[58]

[: ఇది వరాహపురాణంలో ఆదికృత వృత్తాంతం. రైభ్యచరితంలో కర్మజ మోక్ష నారాయణస్తోత్ర నిరూపణం అను ఐదవ అధ్యాయం:] (సశేషం)

# సప్తగిరి

## తిరుమల తిరుపతి దేవస్థానముల మాసపత్రిక.

★

సప్తగిరి మాసపత్రికలో వ్యాపార ప్రకటనలు ఈ దిగువ కన్పరచిన రేట్ల ప్రకారముప్రచురించబడును.

### ఒక్కొక్క ప్రకటనకు

| | | | | | |
|---|---|---|---|---|---|
| లోపల పేజీలో: | పూర్తి పేజి | .... | .... | రు. | 80/– |
| | అర్థ పేజి | .... | .... | రు. | 50/– |
| | పావు పేజి | .... | .... | రు. | 30/– |
| కవరు పేజీలు: నాల్గవ పేజి | 1 రంగులో | .... | .... | రు. | 200/– |
| | 2 రంగుల్లో | ... | ... | రు. | 250/– |
| | 3 రంగుల్లో | ... | .. | రు. | 300/– |
| లోపల 2 వ పేజి 3 వ పేజి | 1 రంగులో | .... | . | రు. | 150/– |
| | 2 రంగుల్లో | . | ... | రు. | 200/– |
| | 3 రంగుల్లో | .... | .... | రు. | 250/– |
| ప్రత్యేకస్థలము లోపల పేజీలో | 1 మొట్టమొదటి పేజి | .... | .... | రు. | 150/– |
| | 2 చివరి పేజి | .... | .... | రు. | 110/– |
| | 3 వార్తల పేజికి ఎదురు పేజి | | 1 పేజి | రు. | 100/– |
| | | | ½ పేజి | రు. | 60/– |

### సాంకేతిక సమాచారము

| | | | |
|---|---|---|---|
| స్క్రీన్: | కవరు పేజీలు | .... | 80 నుండి 100 |
| | లోపల పేజీలు | .... | 80 |
| పేజిపరిమాణము (బ్లాకులకు) | పూర్తి పేజి | .... | 24 సెం మీ × 19 సెం. మీ |
| | అర పేజి | .... | 12 సెం. × 19 సెం. మీ |
| | పావు పేజి | .... | 6 మీ × 19 సెం. మీ |

ప్రకటనకు సంబంధించిన విషయములు, బ్లాకులు, సంస్థలవారే సరఫరా చేయవలయును.

గమనిక: 1. 4 వ కవరు పేజి తప్ప మిగిలిన పేజీలలో 6 నెలసరి సంచికలకు ముందుగా డబ్బు చెల్లించి స్థల నిర్ణయము చేసుకొనువారికి ప్రకటన రేట్లపై 10% ను, 12 సంచికలకు స్థల నిర్ణయము చేసుకొనువారికి 15% శాతమును ముదరా ఈయబడును.

2. ఈ వ్యాపార ప్రకటనల విషయము ముందు తెలుపక, కారణములు తెలుపకయే ఏ ప్రకటననైనను నిరాకరించు హక్కు సంపాదకునకు కలదు.

కార్యనిర్వాహక అధికారి,

**తిరుమల తిరుపతి దేవస్థానం.**

# భాగవతము నందలి భక్తులు

శ్రీ డి. నాగసిద్దారెడ్డి,
తిరుపతి.

(గత సంచిక తరువాయి)

## 13. రంతిదేవుడు

రంతిదేవుడు తన సర్వస్వమును దీనులకు దానముజేసి పేదవాడైన త్యాగమూర్తి. నలుబది యెనిమిది దినములు అతడన్న పానీయములు లేక తపించుచు నొకనాడు-

" నెయ్యి పాయసంబు నీళ్లను కలిగిన
బహు కుటుంబ భార భయముతోడ
వలసి నీరువట్టు నాకలియును మిక్కి-
లొదవఁ జూచి కుడువ నుత్సహించె"
(9-644)

నట. ఆ సమయమున నొక బ్రాహ్మణుడు ఆపై నొక శూద్రుడు, అటుపై కుక్కల గుంపుతో మరియొకడు వరుసగా వచ్చి అన్నాతురులై యతనిని యాచింప నతడు తనకు లభించిన పదార్థ మందరకును పంచి పెట్టెను. చిట్టచివరకొక ఛండాలుడు చనుదెంచి-

" హీనుడ చండాలుండను
మానవ కులనాథ! దప్పిమానదు నవలం
బోనేర, నీకుఁ జిక్కిన
పానీయము నాకుఁ బోసి బ్రతికింపగదే"
(9-645)

అని దీనాలాపములతో నర్థించెను. వాని దైన్యస్థితికి జాలిపడిన రంతిదేవుడు వానితో-

" అన్నములేదు కొన్ని మధురాంబువులున్నవి త్రావుమన్న రా
వన్న, శరీరధారులకు నాపదవచ్చిన వారి యాపదల్
గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుట కంటె నొండుమే
లున్నదె నాకు దిక్కు పురుషోత్తము డొక్కడ సుమ్ము పుల్కసా"
(9-647)

అని పలికి తనకడ నున్న కొంత జలమునుకూడా వానికి త్రాగనిచ్చెను. రంతిదేవుని త్యాగమునకు బ్రహ్మాదులు సైతము సంతసమంది ప్రత్యక్షముకాగా వారి నతడు కోరినది సదా నారాయణభక్తి తన్ను వీడకుండునట్లుగ మాత్రమే. ఇట్టి రాజు త్యాగభక్తిచే శ్రీహరిని మెప్పించి యతని దయకు పాత్రుడై పరమపదంబునకు జనియెను. దీనులకు దానము చేయుటలో కులభేదప్రసక్తి లేదనియు నిస్వార్థ త్యాగముచే దేవతలు సైతమానందితురనియు నీ కథవలన తెలిసికొనదగు విశేషము-

ఇట్లు భాగవత పురాణమునందలి వివిధ భక్తుల గాథలు విజ్ఞాన తేజః పుంజములను వెదజల్లుచు సర్వజనాళిని సంసారతాపత్రయాది ఐహిక బంధములనుండి మరల్చి ఆధ్యాత్మిక మార్గమును ప్రబోధించుచు భగవదున్ముఖుల నొనర్చుచున్నవి.

భారతీయాధ్యాత్మిక జీవిత సర్వస్వము, భగవద్భక్తి ప్రతిపాదకము, ప్రవృత్తి నివృత్తి మార్గనిరూపితమునకు భాగవత పురాణ రహస్యమును తెలిసి పలుకుట కులికైన తమ్మి చూలికైన నసాధ్యము. అందుచే-

" నీ పాద కమలసేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును
తాపస మందార! నాకు దయసేయగదే!"

అని భాగవతమున ప్రతిపాదింపబడిన శ్రీకృష్ణపరమాత్మునకు అంజలి ఘటించి నమస్కరించుటకన్న నధికములేదు.

" శ్రీమద్భాగవతం పురాణమమలం యద్వైష్ణవానాంప్రియం।
యస్మిన్ పారమ హంస్యమేక మమలం జ్ఞానం పరం గీయతే
తత్రజ్ఞాన విరాగ భక్తి సహితం నైష్కర్మ్యమా విష్కృతమ్
తచ్ఛృణ్వన్ విపఠన్ విచారణపరో భక్త్యావిముచ్యేన్నరః॥
(భాగ 12-13, 18)

శుభమ్

---

ఈ వ్యాసరచనకు సంప్రదింపబడిన గ్రంథములు:—

1. సంస్కృతాంధ్ర భాగవతములు.
2. దేవీభాగవతము.
3. వాయుపురాణము.
4. బ్రహ్మాండపురాణము
5. పద్మపురాణము.
6. నారదీయము.
7. ఉపనిషత్తులు (12)
8. సంస్కృత వాఙ్మయ చరిత్ర - శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు.
9. ప్రథమాంధ్ర మహాపురాణము - డా॥ జి వి. సుబ్రహ్మణ్యంగారు.
10. పోతన - శ్రీ విద్యారత్న నిడదవోలు వేంకటరావుగారు.
11. భక్తియోగము - స్వామి వివేకానంద.
12. భక్తపోతన - మహాభాగవతరచన శ్రీ ఖండవల్లి సూర్యనారాయణశాస్త్రి గారు.
13. భాగవతానుశీలనము డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తి.
14. ఆంధ్రభాగవతవిమర్శ - డా॥ ప్రసాదరాయకులపతి.
15. మహాభాగవతోపన్యాసములు.
16. ప్రాక్పశ్చిమతత్త్వశాస్త్రచరిత్ర.
17. సంస్కృతభారతము - మున్నగునవి

కృతజ్ఞతలు :— నా యీ భాగవత పురాణమును గూర్చిన సుదీర్ఘవ్యాసమును ధారావాహికముగ తమ 'సప్తగిరి' యందు ప్రకటించిన సంపాదక మహాశయులకు వానమస్సులు.

# శ్రీగోవిందరాజస్వామి ఆలయం

## తిరుపతి

### దర్శనాదిక కార్యక్రమాల వివరాలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదయం. | 5—00 | నుండి | 5—30 | వరకు | సుప్రభాతం |
| | 5—30 | ,, | 7—00 | ,, | సర్వదర్శనం |
| | 7—00 | ,, | 7—30 | ,, | శుద్ధి |
| | 7—30 | ,, | 8—00 | ,, | తోమాలసేవ |
| | 8—00 | ,, | 8—30 | ,, | అర్చన |
| | 8—30 | ,, | 9—00 | ,, | 1 వ గంట శాత్తుమొర |
| | 9—00 | ,, మ. | 12—30 | ,, | సర్వదర్శనం |
| | 12—30 | ,, | 1—00 | ,, | 2 వ గంట |
| మ. | 1—00 | ,, సా. | 6—00 | ,, | సర్వదర్శనం |
| | 6—00 | ,, | 7—00 | ,, | రాత్రి కైంకర్యాలు, గంట శాత్తుమొర |
| | 7—00 | ,, | 8—45 | ,, | సర్వదర్శనం |
| రాత్రి | 9—00 | | | | ఏకాంతసేవ |

### ఆర్జితసేవల వివరాలు:

తోమాల, అర్చన ఏకాంతసేవలకు: ఒక్కొక్కరికి ఒక్కొక్కదానికి రు. 4-00.

ప్రత్యేకదర్శనం: రు. 2/- (ఒక్కొక్కరికి) హారతి: రు. 1/-

### సర్వదర్శన సమయంలో క్రింది అనుబంధ దేవాలయాలలో ఆర్జితసేవల వివరాలు.

1) పార్థసారథిస్వామి ఆలయం; 2) శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం; 3) ఆండాళ్ళు ఆలయం;
4) పుండరీకవల్లి ఆలయం; 5) శ్రీ ఆంజనేయస్వామి ఆలయం (బయట బుగ్గవద్ద)
6) సంజీవరాయస్వామి ఆలయం (హత్తిరాంజీమఠం ఎదురు)

అర్చన: 0-75
హారతి: 0-25

### ఆర్జిత వాహనాలు

| | | | |
|---|---|---|---|
| తిరుచ్చి ఉత్సవం, పెద్దశేషవాహనం | రు. 63/- | చిన్నశేషవాహనం, గరుడ, హనుమంత, హంసవాహనములు. | రు. 33/- |

### ఆర్జితం: అన్నప్రసాదాలు (చెలుపులు)

శీరా = రు. 155-00, పులిహోర = రు. 50-00 దధ్యోదనం = రు. 40-00, పొంగలి = రు. 55-00,
చక్కెరపొంగలి = రు. 65-00, శాకరబాత్ = రు. 85-00, కేసరిబాత్ = రు. 90-00, 1/4సోలదోసె = రు. 35-00

తి. తి. దేవస్థానం.

# మహానంది

వర్ణనాతీతమైన ప్రకృతి సౌందర్య శోభతో మనోహరమైన శిల్పసంపదతో విరాజిల్లే మహానంది క్షేత్రం కర్నూలు జిల్లాలోని నంద్యాలకు సమీపంలో ఉంది. నంద్యాల నుండి ఈ క్షేత్రానికి రెండు మార్గాలున్నాయి. నంద్యాల చెరువుమీదుగా బండ్లలో ప్రయాణం చేయుటకు అనువైన దారి ఒకటి. ఈ దారి పొడవునా జొన్న, వేరుసెనగ పంటచేలు ఆహ్లాదాన్ని కలిగిస్తాయి: రెండో దారి 15 మైళ్ళ రహదారి వెంబడి. గాజులపల్లి రైల్వేస్టేషన్‌లో దిగి వచ్చే ప్రయాణీకులు ఈ మార్గం వెంబడి రావలెను. ఈ దారి కిరువైపులా ఉన్న అరటి తోటలు కనుల పండుగ చేస్తాయి. అల్లంత దూరాన నల్లమల అడవులు కనిపిస్తుంటాయి. మహానందికి ఒకమైలు దూరంలో పాలేరు వాగు ప్రవహిస్తున్నది.

మహానందీశ్వరాలయాన్ని గురించి ఒక స్థలపురాణముంది. ఈ క్షేత్రంలో వల్మీకము (పుట్ట)చే కప్పి వేయబడి ఒక స్వయంభూ లింగముండేది. ఇచ్చటికి దగ్గరలో ఉన్న పల్లెల నుంచి పశువుల కాపరులు చాలమంది ఆల మందలతో ఇచ్చటి అడవికి వచ్చేవారు. ఒక ఆవు ప్రతిరోజు మంద విడిచి ఈ పుట్ట వద్దకు వచ్చి లోపల ఉన్న ఈశ్వరునికి పాలిచ్చి వెళ్ళేది.

అనుదినము ఎండిన పొదుగునుచూచి యజమాని ఆశ్చర్యపోయేవాడు. కొద్ది రోజుల తరువాత యజమాని విసుగుచెంది, కారణం తెలుసుకోగోరి, ఒకనాడు రహస్యంగా ఆవును వెంబడించాడు. యథాప్రకారం ఆవు వల్మీకము చెంతకువెళ్ళి తన పొదుగును వల్మీకముపై ఉంచి నిలిచింది. ఈశ్వరుడు ప్రీతితో పాలు ఆరగించసాగాడు. పాలు త్రాగుతున్నది ఈశ్వరుడేయని తెలియని యజమాని ఉక్రోషంతో చేతిలో ఉన్నదుడ్డుకర్రతో గోవుమబాదాడు దెబ్బతిన్న కలవరపాటుతో పరుగులంకించుకున్న ఆవు తనవెనుక కాళ్ళతో వల్మీకాన్ని తొక్కి వేయడమేగాక ఈశ్వరుని తలపై ఆనవాళ్ళు ముద్రించింది. ఈనాటికీ ఈ గిట్టల గుర్తులు శివలింగంపై ఉన్నాయని పూజారులు చూపుతారు.

ఈనాడు మనకు కనిపించే మహానందీశ్వరాలయం బాదామి చాళుక్యుల (క్రీ. శ. 550 - 753) చే నిర్మించబడింది. బాదామి చాళుక్యులు నిర్మించిన దేవాలయాలు ప్రస్తుత కర్నాటక రాష్ట్రంలోని ఐహోళె, బాదామి, పట్టడకల్ గ్రామాలలోను, ఆంధ్ర దేశంలోని అలంపూరు, సత్యవోలు. గ్రామాలలోను కలవు మహానందీశ్వరాలయంలో గర్భగృహము, దాని మీద విమానము, గర్భాలయానికెదురుగా మంటపము, ఈ రెంటికీ నడుమ చిన్న అంతరాళము ఉన్నాయి. విమానం పిరమిడు ఆకారంలో ఉండి అగ్రభాగాన ఆమలక శిల (గుండ్రంగా గుమ్మడికాయ ఆకారంలో ఉన్నశిల) చేత అలంకృతమై ఔత్తరాహిక శైలిలో ఉంది.

శివాలయానికి ప్రక్కన భ్రమరాంబ ఆలయం కలదు. ఈ అమ్మవారిని కామేశ్వరీదేవి అనికూడా అంటారు. విగ్రహం మిక్కిలి గంభీరమైనది. నాలుగు భుజాలు పై రెండు చేతుల్లోను తామర పువ్వులున్నాయి. దేవి యెదుటి శ్రీ చక్రం శంకరాచార్యుల వారి ప్రతిష్ఠ అని ప్రతీతి. దేవాలయ ముఖ మంటపం యిటీవల కట్టినది. భైరవజోస్యుల మహానందయ్యగారి ప్రేరేపణవల్ల యీ ముఖ మంటపం నిర్మాణమయింది. ఇందలి కళ శ్రేష్ఠమైనది.

ఆలయ ప్రాంగణంలోనే ఉన్న రామాలయం సుమారు ఇరవై ఏళ్ళ క్రితం నిర్మించబడింది. ఈ ఆలయంలో అపూర్వమైన శిల్పసంపదను చూడవచ్చు. మంటపం పైభాగాన పద్మం మధ్య మయూరము నధిష్ఠించిన కుమారస్వామిని శ్రీవళ్ళి దేవసేనలతో చూడవచ్చును

ఆలయం లోపల, వెలుపలకూడ కోనేరులు కలవు. ప్రాకారం లోపల ఉన్నది రుద్రకుండము. దీని తూర్పుభాగంలో ఉన్న నంది నోటినుంచి పుష్కలంగా వెలువడే పుణ్యతీర్థం ఈ కోనేళ్ళగుండా ప్రవహించి బయట ఉండే అరటితోటలకు నీటి వసతిని కలిగిస్తున్నది. దైవదోణధార, శ్రీశైలధార, నరసింహధార, నందితీర్థం, కాశీతీర్థం అనే పంచధారలు మూలవిరాటు క్రిందనుంచి ప్రవహించి ఈ కోనేళ్ళను నింపుతుంటాయి. ఈ నీరు స్ఫటికంలా స్వచ్ఛంగా ఉంటుంది. అతి మధురమూ ఆరోగ్యప్రదము. ఇది ఎన్నడూ ఎండిపోని జీవధార. పైనుంచి కోనేటి అడుగు భాగంఅద్దంవలె కనిపిస్తుంది. ఈ కోనేరు అరవయి అడుగుల చతురం కలది. నలువైపులా గుమ్మాలు, లోపికి మెట్లు ఉన్నాయి. ఎల్లప్పుడూ నాలుగున్నర అడుగుల నీరుంటుంది. మునిగిపోతామనే భయంలేదు. అందరూ యథేచ్ఛగా స్నానాలు చేయవచ్చు. ఈ కోనేటిలో ఒక్కసారి మునిగితే ఐహికబాధలన్నీ తొలిగిపోతాయి. కోనేటి మధ్యలో ఓరాతి మంటపం ఉంది. దీనిలో అయిదు శివ లింగాలు ప్రతిష్ఠించబడ్డాయి. యెల్లరూ

డా॥ వేమూరి కామేశ్వరరావు
తిరుపతి

(12 వ పేజీ తరువాయి)

చును. భగవదితరములైన పదార్థములపై భ్రాంతిపడి జీవించువాని జీవితము నిజమైన జీవితము గాదు.

చదువవలెనని వాంఛయున్నచో శ్రీ హరి నామమును మాటిమాటికి నోరార చదువ (జపించ) వలెను. అట్లొనర్చుటే సకల శాస్త్రములచే సమ్మతమైన చదువై విద్యాఫలమైన అమృతత్వమును సిద్ధింప జేయును. "విద్యయాఽమృతమశ్నుతే" అని శ్రుతి నిర్దేశింపవలెనని భావన గల్గినచో హృదయమును ఇతర వస్తువుల నుండి తొలగించి పద్మనేత్రునకు సమర్పింప వలెను. అట్లుచేయుట యోగనిద్ర యనబడును. అట్లుకానిది తమోగుణము పైకొనుటచే గల్గు తామసిక నిద్రయే యగును.

ఆశపడవలసినచో కృపానిధియైన శ్రీ వేంకటేశ్వరుని దయకాశపడుటే యుక్తము. దానిచే పరమానందసుఖము గలుగును. తదితరములపై పెంచుకొన్న ఆశ జీవుని బద్ధుని జేయును.

లోకములో ప్రతిష్ఠ నొందవలెనని తలంపు గల్గినచో విష్ణ్వాలయమును ప్రతిష్ఠించి ప్రతిష్ఠ నొందవలెను. అది తన వైభవమును స్ఫురింపజేసి మేలు చేకూర్చును. ఇతర నిర్మాణములచే గలుగు పేరు ప్రతిష్ఠలు శాశ్వత సుఖము నొసంగ జాలవు.

వి:— లౌకిక గాథల వినికి, హరిభక్తిలేని బ్రదుకు, భగవత్తత్త్వబోధములేని చదువులు, తామసికమైన నిద్ర, లౌకిక వస్తువులపై ఆశ, భగవత్పరములుగాని కార్యములచే గలుగు ప్రసిద్ధి జీవుని పరమాత్మునికి దూరమొనర్చును గావున నిష్ప్రయోజనము లగుచున్నవి. కాన వాటిపై లోభము వదలి జీవితమును పరమాత్మ పరమొనర్చి సుఖింపవలెనని తాత్పర్యము.

'నామ స్మరణా దన్యోపాయం
నహి పశ్యామో భవతరణే'

అని పెద్దలు చెప్పినట్లు సంసార తరణమునకు భగవన్నామ కీర్తనమునకన్న సులభోపాయములేదు. మరియు సర్వస్వమును భగవత్పరము జేయుటే భక్తికి పరమావధి. కావుననే ప్రహ్లాదు డిట్లన్నాడు.

కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి
దేవ దేవుని జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి! హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి.
(భాగ — 7-169)

(సశేషము)

---

మహానంది

(29 వ పేజీ తరువాయి)

యథేచ్ఛగా అభిషేకం చేసుకోవచ్చు. కోనేటి కుడ్యముల మీద గణపతి, నటరాజు, వరాహావతారం మున్నగు శిల్పాలు చెక్కబడ్డాయి.

మహానందికి చుటుపట్ల పదిమైళ్ళ పరిధిలో ఎనిమిది శివాలయాలు కలవు. ఇక్కడున్న నందులు నవనందులుగా ప్రసిద్ధిచెందాయి. ఇవే మహానంది, ప్రథమనంది, బ్రహ్మనంది, విష్ణునంది, సూర్యనంది, సోమనంది, శివనంది, గరుడనంది మరియు నాగనంది. ఇవన్నీ స్వయంవ్యక్త లింగాలని ప్రతీతి.

ప్రధానాలయం వెనుక చిన్నగుడులు మూడు ఉన్నాయి. ప్రతిదానిలోనూ శివలింగమున్నది. వీటి సమీపంలోనే శిలా నిర్మితములైన కొన్ని అల్పప్రాసాదము లున్నవి ఇట్టి అల్పప్రాసాదములు సత్యవోలు, ద్రాక్షారామము మొదలగు దేవాలయాల్లోకూడా ఉన్నవి.

మహానందీశ్వరాలయ విమానము (గర్భాలయ ఉపరి భాగం) పట్టదకల్‌లోని పాపనాథ, గళగనాథాలయ విమానములను అయిహోళిలోని దుర్గాలయం, మహాకూటేశ్వర, హుచ్చి మల్లి గుడుల విమానములను పోలియున్నది. ఇవన్నియు బాదామి చాళుక్యులు నిర్మించినవే.

మహానందిలో ఏడుశిలా శాసనముల దాకా ఉన్నవి, వీటిలో కొన్నింటిలిపి క్రీ. శ. 8లేక 9 శతాబ్దాలది. కాని ఇవి ఆలయనిర్మాణము ఎప్పుడు జరిగినది తెలుపుటలేదు. మహానంది పరిసర ప్రాంతాలలోని శాసనాలనుబట్టి ఈ ప్రాంతము మొదటి విక్రమాదిత్యుడు, మొదటి వినయాదిత్యుల రాజ్యంలో చేరి ఉండేదని తెలుస్తోంది. పై ఆధారాలను బట్టి వాస్తుశైలినిబట్టి మహానందీశ్వరాలయం క్రీ. శ. ఏడో శతాబ్దంలో నిర్మించబడిందని చెప్పవచ్చు.

ఆలయం వెనుకనే దట్టమైన నల్లమల అడవి. ఆలయం ఏపుగా పెరిగిన మామిడి, నేరేడు, చింత, కొబ్బరి వృక్షాలలో పరివేష్టించబడి ఉంది.

★

11వ పేజీ తరువాయి)

వించినవి. సాగరతనయ; పద్మావతి నీధర్మ పత్నులు మీ అవ్యాజ కరుణా కటాక్షములు మానవులపై సదా యుండుగాక! మిమ్ము పొందనుపాయము లుండునని భావించుట మాత్రమే, ఉపాయములతో నిన్నెవ్వరును సేవించజాలరు. నీ అవ్యాజ ప్రేమయే నీవనుగ్రహించుటకు కారణము శ్రీమన్నారాయణా! అనంతగుణగంభీరుండవైన నీకు ఈ దాసుడేపాటి యుపచారముల చేయగలడు? మేము మట్టిని కలుపుతూ మలినముతో కూడిన వారలము. వేదాదుల చదువ నర్హత లేనివారము. కరుణించి ప్రసన్నుడవు కమ్ము! శ్రీనివాసా! నీ కనన్య భక్తితో విందుసేయనే విదురమహాశయునికాదుగదా! శబరి మాతవలె నిశ్చయముగ మనసు నిలుప లేనివారలము. ప్రహ్లాద నారద పరాశరాదులవలె నిరంతరము నీ నామ స్మరణ సేయవలెనన్న మా బుద్ధి కుదురుగ నుండదుగదా! దేవా! నీ దాసాను దాసులకు కుండల నిచ్చుటకన్న వేరొకక్రియ నేనెఱుంగనే! మరి దాసు నెట్లు కాపాడెదవో ఓ వేంకటాచలపతీ! అంతా నీ అవ్యాజ కరుణయే నాకు మార్గము జూపుగాక!" అని పలుకుచు దివ్యమంగళమైన స్వామిరూపు చూచుచు స్తబ్ధుడయ్యెను. అంత లక్ష్మీమాత శ్రీనివాసుని ఈ విధముగా ప్రశ్నించినది. 'నాథా! నీ లీలలత్యద్భుతములు. ఎవరీ భక్తుడు? ఈతనికి నీపై నింత భక్తి కుదురుటకు కారణమేమి? దైవీసంపత్తుతో కూడిన నీ భాగవతుని నీవేమి చేయదలచితి'వనియడుగగా జగన్నాటక సూత్రధారియగు నారాయణుడు అతని గురించి సమస్తమొక చిఱునవ్వుచే దెలియజేసి చెంతనున్న గరుడుని పిలిచి ఈ విధముగా నాజ్ఞాపించినాడు.

వైనతేయా! ఈ కులాలుడు. దివ్యమగు నా రూపమును జూచి స్తబ్ధుండయినాడు. అతని లబ్ధస్మృతునిగాఁజేసి నా వద్దకు తీసుకొని రమ్ము. అతని నే నాలింగనము గావించుకొనెద'నని పలికి (ఇట మనకు చక్కని శ్రీవైష్ణవ సాంప్రదాయ గర్భితభావము తేటతెల్లమగును. అదెట్లన, ఆచార్యుని యనుగ్రహము వలననే జీవులు దేవుని సన్నిధానమునకు చేరెదరని! కనుకనే శ్రీవైష్ణవదేవాలయములలో తప్పక ఆచార్యులయొక్కయు పన్నిద్దరాళ్వారుల యొక్కయు విగ్రహము లుండును. వారల సంపర్కము లేనిదే ఆ దేవాలయములు "దివ్య దేశములు" అని పిలువబడవు. ఆ విధముగ దివ్యదేశములని పిలువబడునవి మన దేశములో తిరుపతి 'శ్రీరంగము' కంచి మొదలుగాగలవి నూట ఎనిమిది కలవు. వాటినే దివ్య తిరుపతులని వ్యవహరింతురు. అట్టి దివ్య తిరుపతులలో నుండు స్వామి, ఆచార్యులయొక్కయు ఆళ్వారుల యొక్కయు మనసులలో నుండుటచే వారలకువంత గౌరవము. అట్టివారలచే సంస్కరింపబడి జీవుడు దేవుని వద్ద కైంకర్యము జేయుటకు నర్హుడగును. అట్లే ఇట గరుడుడు గొప్ప ఆచార్యుడు అందులకే నేటికిని విష్ణ్వాలయములలో 'గరుడాళ్వారుల' సన్నిధిని సేవించి ద్వారపాలకులకు నమస్కరించి లోనికేగు ఆచారము కలదు. కావుననే గరుడుని స్పర్శద్వారా కులాలునకు దివ్యత్వంకలిగినది.) ఆలింగనము జేసుకొనెను. అంత కులాలుడు——అమితానందమునకు తావలేక శ్రీనివాసుని పలురకములుగా స్తుతించ సాగెను. అంత తమాలిక లక్ష్మీ వేంకటేశులకు ప్రణమిల్లి ఈ విధముగా ప్రార్థించినది. 'ఓ ఆది దంపతులారా! మేము మా నిత్యకృత్యములుదప్ప వేరొక మంత్రములుగాని పూజలుగాని నేర్వలేదు. మీకు ఏ విధముగానుపచారముల సేయవలయునో అంతకంటెను మే మెఱుంగము. కాని, దేవా! నేడు మా యథాశక్తిగా పదార్థముల నీకు నైవేద్యము గావించెదము. మీరు నేడు తప్పక యారగించి మీ దాసాను దాసులగు మాకోరిక నెరవేర్చియనుగ్రహింపుడని ప్రార్థించినది. అంత మహాలక్ష్మి యా కోరిక తీర్చుమని శ్రీనివాసునడిగినది. పిమ్మట లక్ష్మీనారాయణులు అమితానందముతో ఆదంపతుల భక్తిప్రపత్తుల జూచుచూ మందస్మిత వదనారవిందులై పదార్థములన్నింటిని భుజించినారు

దీనినంతయు తిలకించుచున్న తొండమానుడు తనకు పూర్వజన్మసుకృతముచే ఈ భగవద్భాగవత సంబంధము కలిగినదని ఆనందించినాడు. అంత శ్రీనివాసుడు గరుడుని ద్వారా పుష్పక విమానమును తెప్పించినాడు అచటనున్న దేవతలు సిద్ధులు పరమ భక్తగణములగు నిత్యసూరులందరు కుమ్మరి దాస దంపతులను వేనోళ్ళ కీర్తించుచుండగా శ్రీనివాసుడు కిరీటమును శంఖ చక్రములను ఊర్ధ్వ పుండ్రములను కులాలునిచే ధరింపజేసినాడు (ఇట చిత్రమైన భావమొకటి పరిస్ఫుటమగును. శ్రీమన్నారాయణుడగు వేంకటాచలపతిని నెవడు త్రికరణశుద్ధిగా స్మరించునో అట్టివానికి వేంకటేశ్వరుడు తన పదవిని ఇచ్చివేయుటయందు బద్ధశ్రద్ధుడగునని - ఎట్లన మనము విష్ణ్వాలయములలో దీనిని గమనింపవచ్చును భగవంతుని ద్వారపాలకులకు, కూడను నాలుగు చేతులు, వాటియందు నారాయణునివలె శంఖచక్ర గదాద్యాయుధములను ధరించియుందురు కాని స్వామికిని

వీరలకు నగల భేదము యొక్కటే. స్వామికి కుడివక్షస్థలి లక్ష్మియుండును. వీరలకు వుండదు ) అంత దేవదుందుభులు మంగళ వాయిద్యములు మ్రోగగా కులాలుడు పుష్పక మధిరోహించెను. ఆదిలక్ష్మి కులాలుని భార్యయగు తమాలికను తన ముక్తాహారముతో అలంకృతురాలుగా జేసి విమానము నధిరోహించుటకు నను మతించెను. ఆ పుణ్యదంపతులు శ్రీని వాసుని వద్దయు లక్ష్మివద్దయు తొండ మాను చక్రవర్తి వద్దయు పురజనుల వద్దయు మంగళాశాసనములు పలుక బడినవారలై నిత్యసూరి పదమును పొందిరి.

అంత తొండమానుడు శ్రీనివాసునకు నమస్కరించి ఈ విధముగా ప్రశ్నించ సాగెను. 'దేవా! కలిధ్వంసక! నారాజ్య ములోనుండు కులాలునకు నిత్యసూరి పద మును కలిపించితివి. దాసుడనగు నాకు యేనాడు ఈ భవబంధమునుండి విముక్తి కలిగించెదవో కదా!' అని ప్రార్థించగా శ్రీనివాసుడు తొండమానునితో ఓ రాజా! కులాలుడు ప్రతిదినము నా దాసులకు చేయు తన కృత్యము లన్ని టిని ముగించుకొని చివరకు ఒక చిన్న మట్టి ముద్దతో పుష్పమును అందముగా జేసి "శ్రీ వేంకటేశార్పణమస్తు" అని ప్రతిఫలాపేక్ష లేక నాకు సమర్పించు చుండెను. నీవు కేవలము నాకు ప్రత్యు పకారమను భావనతో జేసితివి. కావున నీవు ఈ దేహమును త్యజించి దివ్య దేహ మును బొంది నన్నే పూజించుచు అంత్య మున తిరుగులేని నాధామమును పొంద గలవు" అని అనుగ్రహించి సకల దేవతా గణ మనుసరించగా అంతర్థాన మొందెను. కొంతకాలమునకు తొండమానుడు స్వామి పుష్కరిణిలో స్నాన మాచరించి తన దేహమును వదలి దివ్య దేహముతో స్వామిని ప్రార్థించి దివ్యధామమును చేరు కొనెను.

ఇట కుమ్మరికి రాజునకు చాలా భేద ముకలదు. కుమ్మరి భగవద్దాస సేవ చేయుచు శీఘ్రముగా వైకుంఠమునకు చేరగలిగినాడు. రాజు తాను, రాజాను భవముతో భగవంతునికి బంగరు హార ముల సమర్పించుచూ నహంకరించి భగ వంతుని వేడినప్పటికిని మరుజన్మయందే మోక్ష సామ్రాజ్యమున కర్హుడయ్యెను. భగవంతుని పూజకన్న భాగవతుని పూజ మిన్న. భగవదపచారముకన్న ఆ భగ వంతుని సేవించు భాగవతాపచారము సహ్యము కానిది. కావున మనము భగ వద్భక్తుల యందు, భగవంతునియందును శ్రద్ధాళువులమై వేంకటాచలపతి యను గ్రహమునకు పాత్రుల మగుదుముగాక!



తిరుమల బ్రహ్మోత్సవంలో శ్రీమతి ఎం. ఎల్. వసంతకుమారి గారి కచ్చేరి

ఇది పరమ పవిత్రమగు కథ. దీనిని వినినవారు చదివినవారు పవిత్రులగు దురు. వారల మనసు పాపపు చింతనల నుండి విముక్తియగును. ఈ కథను తెలి యుట వలన వేంకటాచలపతి ప్రీతి మంతుడై మనలను సదాకాపాడగలడు. ఆ స్వామి అవ్యాజ కరుణకు పాత్రులగు దుము గాక:

* ఈ కులాలుని వృత్తాంత మంతయు తిరు మలగిరులకు పోవుకాలిబాటయందు, ఆరంభము లోనే ఉన్న శిల్పముల ద్వారా నేటికిని చూడ వచ్చును. (కుమ్మరి దండము, చక్రము, కుండలు మొ॥)

# ధర్మరక్షణసంస్థ కార్యక్రమాలు

హిందూ ధర్మరక్షణ సంస్థ పైలెట్ ప్రాజెక్టు కింద గుంటూరు జిల్లాలో ఏడు గ్రామస్థాయి ధర్మరక్షణ సంస్థా కేంద్రాలు ఏర్పాటైనవి. తాడికొండ, మోటపాక, గణపవరం, మల్లెంపూడి, సుదిమెళ్ళ, కొల్లిపర గ్రామాలలో ఇవి పనిచేస్తున్నవి. డిసెంబరు నెలాఖరుకు ఇలాంటి వాటిని 60 వరకు స్థాపించాలని గుంటూరు శాఖ సంకల్పిస్తూ వుంది.

ధర్మరక్షణ సంస్థ కళాకారుడు శ్రీ వంగల పట్టాభి భాగవతార్ ఇటీవల గుంటూరు జిల్లాలో వివిధ ప్రాంతాలలో హరికథా గానం చేసి శ్రోతలను విశేషంగా ఆకర్షించారు.

దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ 23 వ తేది గుంటూరు కార్యాలయాన్ని సందర్శించి 24 వ తేదిన తాడికొండలో గ్రామస్థాయి కేంద్రానికి ప్రారంభోత్సవం జరిపారు. ధర్మరక్షణ సంస్థశాఖల కార్యక్రమాలను మెరుగుపరిచేందుకుగాను శ్రీ ప్రసాద్ ఈ సందర్భంగా సూచనలను చేశారు. తాడికొండ కేంద్రంలో బాలబాలికల సుప్రభాత పఠనం కార్యనిర్వహణాధికారి ప్రశంసకు పాత్రమైంది.

అక్టోబరు 25 వ తేదిన గుంటూరులో శ్రీ మాజేటి గురవయ్య ఉన్నత పాఠశాలలో శ్రీ ప్రసాద్ ప్రసంగిస్తూ బాలలకు నైతిక విలువల బోధనావశ్యకతను నొక్కి చెప్పారు. సుప్రభాతపోటీకు తయారవుతున్న 250 మంది విద్యార్థులు శ్రీ ప్రసాద్ ముందు సుప్రభాతగానం చేశారు.

అక్టోబరు 28 వ తేదిన గుంటూరుశాఖ వారు నిర్వహించిన సుప్రభాత, స్తోత్ర పఠన పోటీలకు వెయ్యిమందికి పైగా బాలబాలికలు హాజరైనారు. 1980 సం॥ జనవరిలో మరలా సుప్రభాత పోటీలను నిర్వహించాలని గుంటూరు శాఖ యోచిస్తున్నది.

హిందూధర్మరక్షణసంస్థ ఆశయాలు, సంస్థ కేంద్రాలను నిర్వహించేందుకు సూచనలు తదితర అంశాలపై, గుంటూరుశాఖ కరపత్రాలు ప్రకటించి ప్రచారంచేస్తున్నది. ధర్మరక్షణసంస్థ కార్యాలయాలను స్థాపించ దలచుకొన్నవారు, హిందూధర్మ రక్షణ సంస్థ, సహాయ కార్యదర్శి గుంటూరుకు వ్రాసి సవివరమైన పారాలు పొందవచ్చును.

★

---

(18 వ పేజీ తరువాయి)
వానిని భ్రష్టునిగాను, ప్రతి సృష్టియు, అవసరమైన లోకపాలకులను అదుపులో నుంచుటకు తపశ్శక్తితో శపించి వైచెదరు గాన, జాగ్రత్తనుమాటని హెచ్చరించెను.

ఇందు కుండధరోపాఖ్యానము నిదర్శనము — భవభూతిమహాకవి ఉత్తర రామ చరితమున ఇలాప్రయోగించిరి. "అవ్యాహతజ్యోతిరార్షం తే చక్షుఃప్రతిభాతి"

సాంగ చతుర్వేద తపోయోగా దృష్టిః- సాంగములతో చతుర్వేదముల నధ్యయనముచేసి తపోనిష్ఠనొందెనేని ఋషి యని తన కల్ప సూత్రమందు భగవద్విఖనసులు శెలవిచ్చిరి. ఈ కల్పసూత్రమునకు సర్వతంత్ర స్వతంత్ర శ్రీనివాసదీక్షితులుభాష్యము సాగించిరి. అందు ఋషి వ్యవస్థ ఇట్లున్నది.

"ఊర్ధ్వరేతా స్తపస్యుగ్రో నియతా శీన సంశయః"
శాపాను గ్రహయోశ్శక్తః సత్యసంధో భవేదృషిః

ఋషినిరంతరం ఈశ్వరీయకైంకర్యములలో నిమగ్నుడగుటవల్ల వాని దృష్టి అధః ప్రవృత్తిగాదు. అనగా, కామమునకుగురికాదన్నమాట. "తపశ్చాస్మి" యను గీతానుసారం తపస్సేధనముగా కలిగియుండును. ఆహారాన్ని నియమంగా తీసుకోవడం. ఆహారనియమంలేకపోతే జీవితం నిష్ప్రయోజనం. మానవున కాహారం మెయిన్ స్విచ్‌లాంటిది. "ఆహారశుద్ధౌ సత్వశుద్ధేధృవాస్మృతిరితి శ్రుతేః" ఆహార నియంలేనివాడు ఇంద్రియనిగ్రహంలేనివాడన్నమాట. అట్టివాడు భగవ దనుగ్రహానికి పాత్రుడుకాలేడు "సంస్కార జన్యం జ్ఞానం స్మృతిః ఇతి తర్కసంగ్రహే" ఆహారాను భవంవల్ల సంస్కార మేర్పడు తుంది. అందువలన కలిగిన గుణుతు. అంటే జ్ఞానము కలుగుటకు ఆ యాహారమే యని ఫలితార్థము. తినుటకొరకు జీవించువాడు బద్ధుడు. జీవించుట కొరకు తినువాడు ముక్తుడని అనుభవజ్ఞులన్నారు. ఈ నియమం మహర్షికి ప్రధానమట. అందుకే ఋషి సంశయములేని నియతాశ్శీశాపాదుల ద్వారా ఒకరిని ఉద్ధరించడం అనే ఈ రెండు శక్తులు గలవాడై ఉండాలి. ఉన్నది కన్నది విన్నది యున్నట్లుగ బలుకుటయును తన ఆత్మోన్నతికి అడ్డు లేకుండా పరోన్నతికి భంగం కలుగకుండా మాట మనస్సు కలిగిన సత్యసంధతగా యుండుటను ఋషి వ్యవస్థగా తెలుసుకున్నాము. యోగ దర్శనమందు - ఈశ్వరరుచిగా మహర్షుల ధ్యానించిన చిత్తమందు రజస్తమములు పోయి చిత్తము సత్త్వమయమై యేకాగ్రతనొందు నటయును మనుష్యజాతి ఉత్తమమైనదా? కాదా? అను ప్రశ్న వచ్చినప్పుడు పశువుల కంటే ఉత్తమమైనదని దేవతల కంటెను ఋషులకంటెను ఉత్తమముకాదని చెప్పవలెనని బోధింపబడినది. దిలీప చక్రవర్తి వశిష్ఠ మహర్షితో అన్నమాటను కనుడు.

"దైవీనాం మానుషీణాంచ ప్రతికర్తాత్వమాపదామ్।
హవిరావర్జితం హోత స్త్వయావిధివ దగ్నిషు॥

ఓ మహర్షీ రాజ్యములో దైవికములు మానుషములగు ఆపదలు రాకుండా నీవు నివారించుచున్నావు. విధ్యుక్తములుగా అగ్నులయందు నీవు సమర్పించిన హవిస్సును బట్టి వర్షాభావముచే శోషించు సస్యములకు వర్షము కురియుచున్నది. కాన మహర్షుల యాజ్ఞాను వర్తులయినచో సకల పురుషార్థము సమకూడు. జన్మ సాఫల్యమగు. లోకమునకు మహోపకారమగు.

సృష్టి తొలినాళ్ళ నుండి నేటి వరకు మనిషి పొందిన మనః పరిణితికి వికాసానికి గ్రాసవాసస్సులే పరిమితి గారాదు. "యద్విధేయం తత్ స్తుత్యమ్" యను న్యాయము ననుసరించి వేదముల గ్రహించి మహర్షులు జెప్పిన స్మృత్యాది ధర్మముల మన మాచరించుట ప్రథమ కర్తవ్యము పాలకుడు దేశాన్ని సురక్షితముగ ఉంచుకోగల గాలంటే - అధర్వణోక్తి "బ్రహ్మచర్యేణ తపసారాజా రాష్ట్రం విరక్షతి" ఇంద్రియ నిగ్రహము తపస్సు వీటి వల్లనే ననియున్నది. తపస్సు అంటే ముక్కుమూసుకొని కూర్చుండుటయేగాక స్వధర్మ వర్తిత్వమే తపస్సుయని భారత భావము. అంటే నిశ్చయదృష్టి కలిగి నీతిని బాగా ప్రయోగించాలన్న మాట. అట్టి వానికి ప్రజలు వశంవదులై ఉంటారు. గమనించవలసిన విషయం మరొకటి —

"కృతాని యాని కర్మాణి దైవతైర్మునిభి స్తధా
న చరేత్తాని ధర్మాత్మా శ్రుత్వాచాపిన కుత్సయేత్
ఇతి వేదాన్త దర్శనే"

దేవతల చేతను మహర్షులచేతను జేయబడిన కార్యములను ధర్మవేత్తయగువాడు జేయరాదనియు గర్హింప గూడదనియు తమకు విధించిన కార్యములనే జేయుచు శుభముల నొంద వలయునని వేదాన్త దర్శన లక్ష్యము. విశ్వామిత్రాది కొందరు మహర్షులు. యేమిజేసినా వారికి తేజోబల మున్నది. అవసరమైతే స్వర్గాన్నే సృష్టించాడు అలాంటి తేజోబలం మనకులేదు. గనుక ఆ విషయం మనకొద్దన్నారు. సామాన్య మానవులు వారి అనుసరణ ఆత్మ వినాశ హేతువగునని పూర్వ మీమాంస మాట. పచ్చికుండలో నీరుంచిన కుండ విచ్చిపోవును. ఆ నీరే కాల్చిన కుండలోపోసిన యెడల చెక్కు చెదరదు. ఇట్లభిజ్ఞుల సుద్దులు॥

" తేషాం తేజోవిశేషేణ ప్రత్యవాయోన విద్యతే ఇత్యాప స్తంబమహర్షి రువాచ "

ఆనాటి మహర్షుల విశ్వాసాలు దేశీయాలు సార్వకాలికాలు అనేందుకు తార్కాణము శ్వేతాశ్వతరోపనిషద్రుషి యెలుగెత్తి చాటినది తిలకించుడు.

"ద్వాసువర్ణా సయుజా సఖాయా సమానం వృక్ష పరిష స్వజాయతే।
తయోరన్యః పిప్పలగ్ం స్వాద్వత్త్యనశ్న న్నన్యో అభిచాకశీతి॥

అందమైన రెక్కలు కలిగి యెన్నడు నెడబాయని సఖ్యముగల రెండుపక్షు లొక చెట్టునందేయున్నవి. అందొకటి తియ్యని వని తలచి ఆ చెట్టు ఫలముల దినుచున్నది. రెండవది తినక ప్రకాశించుచున్నది. ఇందు చెప్పబడిన పిప్పల అంటే బోధివృక్షము. లేక దేహము. అందలి పక్షులు జీవాత్మ, పరమాత్మలు. జీవాత్మకర్మఫల మనుభవించుచున్నది. పరమాత్మకర్మ మనుభవింపదు. క్రైస్తుమత గ్రంథమైన బైబిల్ పాత నిబంధనలో - సృష్ట్యారంభమునకు నిమిత్తమును వివరించును. మొదట "ఆదమ్" అను పురుషుడు 'ఈవ్' అను స్త్రీయు సృజింపబడి వారిరువురు నొక చెట్టుక్రింద యుండిరని యున్నది. ఇందలి పరమాత్మయే ఆదాము. జీవుడే ఈవు. పిప్పలవృక్షమే ఆపిల్‌చెట్టు. ఆ చెట్టు పండ్లను సైతాన్ ప్రోద్బలముతో ఈవు తిన్నదని అదే మానవజాతికి కడగండ్లకు కారణమైనదని చెబుతారు. వారే ఆదిమ జంట అంటారు.

" మన్యుర్జాయామావహతు సంకల్పస్య గృహాదధి "

ప్రకృతి పురుష ప్రస్తావనజంటగా వేదములోను కలదు. మరియు జీవులందరు స్త్రీ ప్రాయులని భగవంతుడే పురుషుడని యును విష్ణు పురాణాది కొన్ని హిందూ గాథలు. ఇందనేక దృక్పథములు గలవు. సాధారణముగ జీవాత్మ పరమాత్మల సంబంధాన్ని మనలో దాంపత్య భావానికి పోల్చడం ఉంది. మధురభక్తిగా ఇస్లాం సూఫి సంప్రదాయంలో కనిపిస్తుంది. "ఆదమ్" నిషిద్ధఫలాన్ని తినడు "ఈవ్" తింటుంది. ఇంతవరకు పై ఉపనిషద్రూపాంతర సామ్యం కనిపిస్తుంది. ఇంతకు తెలియదగిన దేమంటే క్రైస్తవ ఇస్లాం మతము మొదలైనవి పుట్టటానికి యెంతో కాలము పూర్వమే ప్రపంచంలో ఆర్ష మతము ఉండేదని బింబ ప్రతిబింబ న్యాయములో కనిపించే వాస్తవిక విషయాలన్నీ ఒకనాడు ప్రపంచమంతటను వ్యాపించి యున్న ఋషి ధర్మశాస్త్ర ప్రాభవాన్ని ఉగ్గడిస్తాయి

దీనికి ప్రోద్బలంగా – ది విజన్ ఆఫ్ ఇండియా యను గ్రంథంలో - మానవజాతి మాతృదేవిగా మన యాచారములకు ప్రారంభశక్తిగా భారతదేశము కనిపించుచున్నదని శ్రీమాక్స్ ముల్లరు మహాశయులు నొక్కివక్కాణించిరి.

పూర్వకల్పపు గర్మమును విద్యను యనుభవమును నుత్తరకల్పము నందలి ప్రజలకు గరపుటకు మహా పురుషులను బరమేశ్వరుడు నియమించునని మత్స్య పురాణంలో గాంచగలం. వారే క్రాంత దర్శకులగు మహర్షులు. వారి ఘనతలు కోకొల్లలు. అందు వ్యాస మహర్షి ఘనతలు కొన్ని సంధింతుము ——

" అనంతావై వేదాః " యని యున్న వేదమును విభాగముచేసెను. గాంధారికి బుత్రశతోత్పత్తికి వరమిచ్చెను. బ్రహ్మ సూత్రముల బురాణముల రచించెను. తన యనన్యసాధారణ తపశ్శక్తిచే ధృతరాష్ట్రునకు యుద్ధమృతులంజూపి పరస్పర సంభాషణాదుల జరిపించెను. ఖాత్యంధునకు దృష్టినప్పుడనుగ్రహించెను. సంజయునకు యుద్ధవార్తలు దెలుపుటకు దివ్య దృష్టియొసంగెను. తన్ను తలచినవారికి యోగశక్తిచే ప్రత్యక్షమగుచు వచ్చెను. యాజన్మసిద్ధుడై స్వయంప్రతిభావిరాజితుడై లోకోద్ధరణదీక్షాధురంధరుడై మునిజనమూర్ధన్యుడై విలసిల్లెను

హిందూ విజ్ఞానమంతయు మహర్షుల వల్ల వ్యక్తమైనది. ఆర్షధర్మసర్వోత్కర్ష ఏమి? అంతర్జగ ద్వికాసముతో లోక వైభవనికాసము. వ్యక్తి కుటుంబసమాజ రాష్ట్రములందొక్కొక యావశ్యకతాపూర్తితో విజ్ఞానసంస్కృతులను పెదజల్లిరి. ఇందువల్ల ఈ దేశము సప్తదేశములందలి మానవకోటికి గురుపీఠమయ్యెను. మరియు పిరికితనము వదలవలెననియు వీరతాహ్వానము, తత్త్వాన్వేషణము, నిశ్శ్రేయసగర్భితాభ్యుదయవాంఛ, ఆత్మస్థైర్యము. అమృతభావచింతన, అభయపదోపాసన, దృఢనిష్ఠ, వ్యక్తిగతస్వార్థమునువిడచి లోకశాంతియే కోరుటను ప్రపంచంలో దేనికీ మనం బద్ధులంకాకూడదనియు. ధనదారిద్ర్యములు సుఖదుఃఖములు, జీవనమరణములు, మహత్వాఽల్పత్వములు, గుణాఽగుణములు, పృథివిలోనున్నవి. లేక వీనికి అతీతమైనవి. ఏవీ మనలను బంధింపగూడదనియు, విశ్వాత్మకమైనప్రేమనుమనము పొందాలియనునదియే మహర్షుల ఉత్కర్షయాశయములు. బాగుపడువారికి భాగవతంలోమాట తెలియదగియున్నది అది ఇది.

" నైషావరావరమతిర్భవతో వముస్యాత్ జంతోర్వథాత్మసుహృదో జగత స్తథాపి।
సంసేవయాసురతరోరివతే ప్రసాదః సేవానురూపముదయోనవరావరత్వమ్॥

# శేషశైలవాస! శ్రీనివాస!

ఆ. వె. పాల సంద్రమందు। పవ్వళించెదవీవు
త్రాగ నీరులేక। తపనమాకు.
లోకమిట్టులేద్వ। లోకేశ నిద్రేల?
శేషశైలవాస! శ్రీనివాస!

ఆ. వె. ప్రజల నోళ్ళుగొట్టి। పాప పరిహారంగ
నీకు గూడ కొంత। నిచ్చుచుంద్రు!
పాపు పు ధనమేల। పాపాల హారణా!
శేషశైలవాస! శ్రీనివాస!

ఆ. వె. తిరపతెళ్ళి యొకడు। తిప్పెమ్మ కనిపింప
తిరిగి దాని చుట్టు। తిరుగవచ్చె!
నిన్ను జూడమరచె। నీచాతి నీచుండు
శేషశైలవాస! శ్రీనివాస!

ఆ. వె. నిలువుదోపిడిచేసి। నీలాగె కొందఱు
కాలరెత్తి పైకి। తిరుగుచుంద్రు
వెళ్ళు శైలులోకి। వెఱ్ఱివెంగలి వాడు
శేషశైలవాస! శ్రీనివాస!

ఆ. వె. చచ్చినోడికేల। సన్నాయి మేళమ్ము
చచ్చు కవితకేల। చాలగొప్ప!
చచ్చినోడు రాడు! చచ్చుకైత మనదు!
శేషశైలవాస! శ్రీనివాస!

ఆ. వె. కుక్కనక్క కూడ। నొక్కపోలిక నుండు
అరపులరసి చూడ। వేరువేరు
మనుషులందు మంచి। మనుషులు వేరయా!
శేషశైలవాస! శ్రీనివాస!

ఆ. వె. తఱుకుండొకండు। రఱుకుడననుచు
శిక్షనొసగసాగె। కక్షకొఱది
భిక్షవేయగానె। భక్షించి నవ్వెను!
శేషశైలవాస! శ్రీనివాస!

శ్రీ గన్ను కృష్ణమూర్తి,
నారాయణచేడు.

భగవంతుని కెవ్వరి పట్లను రాగద్వేషములు గాని ఉత్తమాధమ భేదములుగాని లేవు. ఏలనన సర్వసృష్టికిని భగవంతుడే ఆత్మయు సుహృత్తును. ఐన దైవానుగ్రహము ఎల్లర యెడల నొక్క రీతిగనే యుండదేల? యనుశంక కలుగవచ్చు. కల్పవృక్షమైనను తన్ను సేవించి ఏ ఏ కోర్కెలుకోరిన వారికి ఆయా ఫలములనే ఇచ్చునట్లు దైవమున్నూ తన్ను మనసారా సేవించి తమ కర్మలద్వారా భగవత్ప్రీతికరములైన మార్గములనే అనుసరించుండు వారికి సత్ఫలితముల నొసగుచున్నాడు. అంతియేగాని భగవంతుని కెవ్వరి యెడలను పక్షపాతములేదు. జీవుల కర్మలలోని మంచి సెబ్బరలున్ను భక్తి లోపమున్నూ మాత్రమే వారి వారికి కలుగు ఫలితములకు భౌతికములకున్ను కారణము. మన జీవితతత్త్వమును అర్థము చేసుకొనవలెనన్నచో శ్రీ భాగవత భావము నరయుట అత్యావశ్యకము,

కావున ఆర్ష జ్ఞానముంటే ఈ జీవితము విశ్వము ఆనందము, సుందరమై గోచరిస్తాయి. ఈశ్వరార్పిత సర్వాత్మమైన జీవి భూతలానికి రమ్యోజ్జ్వల భూషణమై ప్రకాశిస్తాడు. జనసామాన్యానికి చతురాశ్రమాది సరణి సోపాన శ్రేణిలాంటిది. మనమంతా పరమేశుసిబిడ్డలమే. మనదంతయు నొకే సమిష్టి కుటుంబమే. మనమే జాతి మతస్థులమైనను మనకాతడొకడే దైవము యని జూచువాడే మనుష్యులలో బుద్ధిమంతుడని మహర్షుల సంక్షిప్త ఉపదేశ సారము. ఇట్టి ప్రపంచశాన్తి నొసంగు ఆర్ష విజ్ఞానము అవలంబనీయము.
"అస్తు"

ధనాభావం. గురునికారణంగా వివాదాలు, అగౌరవం, ధననష్టం. కుజునిమూలంగా శరీరహాని. 16 తేదివరకు రవివలన అనారోగ్యం, ఆ తర్వాత అనారోగ్యం లేదా వివాదాలు. శుక్రునివలన 17 తేదివరకు బంధువులరాక, పెద్దలప్రశంస, లేదాధన ప్రాప్తి మరియు సంతానయోగం, మిత్రుల కలయిక ఆతర్వాత అనారోగ్యం, అగౌరవం 6 తేది వరకూ బుధుని అనుకూల్యం వలన స్నేహితులు. స్వీయదుష్ప్రవర్తన వల్ల ఉద్యోగ సంబంధమైన ఆందోళన. ఆ తర్వాత 29 తేది వరకు గృహంలో వస్తుసమృద్ధి. ఆ తర్వాత భార్యా బిడ్డలతో తగాదాలు.

### కన్య

(ఉత్తర 2, 3, 4 పా. హస్త; చిత్ర 1, 2 పా.)

రాహువు వలన ఆందోళన. శని ప్రాతికూల్యం వలన అయినవారి నుండి ఎడబాటు లేదా ప్రయాణం, ప్రయాస లేదా ధననష్టం లేదా పిల్లలతో తగాదాలు, శరీరహాని. గురుని మూలంగా ప్రయాణం, ప్రయాస కుజుని కారణంగా ధనాభావం, లేదా భార్యకు అసంతుష్టి లేదా నేత్రబాధ, అనారోగ్యం. రవివలన 16 వ తేది వరకు పదవి, ధనప్రాప్తి. ఆ తర్వాత అనారోగ్యం శుక్రుని వలన 17 తారీఖు వరకు మంచి మిత్రులు, అధికారయోగం. ఆ తర్వాత పెద్దలప్రశంస, ధనప్రాప్తి లేదా సంతాన యోగం. వివాదాలువచ్చినా, 6 వ తేది వరకు బుధుడు ధనప్రాప్తికి కారకుడు ఆతర్వాత మిత్రసమాగమంస్వీయ దుష్ప్రవర్తన కారణంగా పై అధికారుల భయం 29 తేది తర్వాత బుధునివలన గృహంలో వస్తు సమృద్ధి.

### తుల

(చిత్ర 3, 4 పా: స్వాతి, విశాఖ 1, 2, 3 పా:)

రాహువువలన సంపద. గురువుద్వారా కూడా ధనప్రాప్తి. కుజుడుకూడా ధనం, విజయాలకు కారకుడు. ఐతే శని మూలంగా ఆందోళన. రవి ప్రాతికూల్యం వలన 16 తేది వరకు ధననష్టం లేదా ఇతరుల చేతిలో వంచన లేదా నేత్రబాధ. ఆ తర్వాత పదవి, ధనప్రాప్తి, ఆరోగ్యం, విజయం. శుక్రుడు నెల అంతా అనుకూలుడు. 17 తేది వరకూ శుక్రునిద్వారా ధనం, పేరుప్రతిష్టలు, లేదా నూత్న వస్త్రాలు, విజయం, ఆ తర్వాత మంచి సహవాసాలు, అధికారప్రాప్తి. బుధుని మూలంగా ధనం ప్రాప్తించినా, 6 తేది వరకూ గౌరవభంగం. ఆ తర్వాత మిత్ర సమాగమం, స్వయంకృతాపరాధం మూలంగా పై అధికారుల పట్ల భయం ఆ తర్వాత గృహంలో వస్తుసమృద్ధి.

### వృశ్చికం

(విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

రాహువు వలన వివాదాలు, గురుని వలన అధికారచ్యుతి, ధననష్ట జనితమైన ఆందోళన. కుజుని సానుకూలత వలన ధనసమృద్ధి, విజయం. శని ద్వారా ధనం, శృంగారం. రవి వలన 17 తేది వరకు ధననష్టం, ప్రయాణం, ప్రయాస లేదా ఉదరబాధ. ఆ తర్వాతకూడా ధననష్టం, లేదా ఇతరుల చేతిలో వంచన లేదా నేత్ర బాధ. శుక్రుడు నెల అంతా సానుకూలుడు. 17 తేది వరకూ ధనధాన్యాలు, వస్తు సమృద్ధి లేదా సంతానం. ఆ తర్వాతకూడా ధనం, కీర్తి, లేదా నూత్న వస్త్రాలు, విజయం. బుధుని వలన 6 తేది వరకు చెడునడవళ్లు, వివాదాల మూలంగా సంభవించే ధననష్టం. ఆ తర్వాత 29 తేది వరకూ ధనం, దానితోబాటు అపకీర్తి. ఆ తర్వాత మిత్రసమాగమం, ఉద్యోగ సంబంధమైన ఆందోళన.

### ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

రాహువు వలన ఆధార్మికప్రవర్తన గురునివలన ధనధాన్యాలు, కీర్తి, విజయం, సంతానం. కుజుని కారణంగా అపకీర్తి లేదా ధననష్టం. శని మూలంగా వివాదాలు లేదా ధననష్టం. రవి వలనకూడా ధననష్టం, లేదా ప్రయాణం, ప్రయాస లేదా ఉదరబాధ. శుక్రుని అనుకూల్యం వలన

(చివరి పేజీలో)

## వరుణ జపం

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆధ్వర్యంలో నవంబర్ 7 తేదినుండి ఆరు రోజులపాటు తిరుమల పుష్కరిణి వద్ద వరుణ జపం నిర్వహించబడినది. ఈ సందర్భంగా శ్రీ వేంకటేశ్వరస్వామివారికి అభిషేకములు జరుపబడినవి. 45 మంది పండితులు వీటిని వేదోక్త విధిని నెర వేర్చారు వరుణ జపం కొనసాగుతూ వుండగనే తిరుమల, తిరుపతి ప్రాంతాలలో ఎడతెరిపిలేని భారీ వర్షాలు ప్రారంభమైనవి. వీటి ఫలితంగా గోగర్భండామ్‌లో ఇటీవల అడుగంటిపోయిన నీటిమట్టం 13 అడుగుల ఎత్తుకు పెరిగి కొండపై నీటి కొరత ప్రమాదాన్ని నివారించింది.

### బాలల పోటీలు

అంతర్జాతీయ బాలల సంవత్సర వేడుకగా తిరుమల తిరుపతి దేవస్థానం, సంస్థ ఉద్యోగుల పిల్లలకోసం 'అందాల బాలల పోటీలు' రెండింటిని నిర్వహించింది. నవంబర్ 8 వ తేది తిరుమలలో ఆర్ష సదస్సులోనూ 9 వ తేది తిరుపతిలో కార్య నిర్వహణాధికారి కార్యాలయంలోనూ ఇవి జరిగాయి. తిరుమలలో 100 మంది, తిరుపతిలో 60 మంది, బాలబాలికలు వీటికి హాజరయినారు. శ్రీ వేంకటేశ్వర రామనారాయణ్ రుయాఆసుపత్రిశిశువైద్య నిపుణురాలు డాక్టర్ ఇందిరాబాయి, తిరుపతి పురపాలకసంఘ ఆరోగ్య శాఖాధికారి డాక్టర్ రంగారావు, తిరుమల ప్రయివేట్ డాక్టర్ శ్రీరామయ్యగారలు న్యాయ నిర్ణేతలుగ వ్యవహరించారు.

విజేతల పేర్లు:

**తిరుమలపోటీ**

(1) సంవత్సరంలోపుబాలలు

మొదటి బహుమతి:

చి॥ నాగ శ్రీనివాసచక్రవర్తి

రెండవ బహుమతి;

చి॥ బేబి

1 నుండి 3 ఏళ్ల లోపలివారు

మొదటి బహుమతి

చి॥ మహేష్

రెండవ బహుమతి

చి॥ జి. శ్రీనివాసరావు



## వార్తాలహరి

3 నుండి 5 ఏళ్ళలోపలివారు

మొదటి బహుమతి

చి॥ ఎన్. నాగమణి

రెండవ బహుమతి

చి॥ పి. ప్రేమకిరణ్

**తిరుపతిపోటీ**

ఏడాదిలోపు పిల్లలు

మొదటి బహుమతి

చి॥ కృష్ణచైతన్యకుమార్

రెండవ బహుమతి

చి॥ శ్రీ చరణ్

1 నుండి 3 ఏళ్ళలోపలివారు

మొదటి బహుమతి

చి॥ హేమలత

రెండవ బహుమతి

చి॥ విజయలక్ష్మి

3 నుండి 5 ఏళ్ళ లోపలివారు

మొదటి బహుమతి

చి॥ రామేశ్వరి

రెండవ బహుమతి

చి॥ సి ఆర్. నరసింహం

తిరుపతిలో శ్రీమతి గోపికాప్రసాద్, తిరుమలలో శ్రీ ఎన్. మునుస్వామి నాయుడు (ఉపకార్య నిర్వహణాధికారి) పోటీలలో గెలుపొందిన బాలబాలికలకు బహుమతులను ప్రదానం చేశారు. దేవస్థానం సీనియర్ మెడికల్ ఆఫీసర్ డాక్టర్ వై. ఆర్. ధనలక్ష్మి, దేవస్థాన సంక్షేమ శాఖాధికారి శ్రీ ఎం. రామకృష్ణయ్య ఆధ్వర్యంలో నేత్రపర్వంగా జరిగిన ఈ బాలల పోటీల నిర్వహణకు స్థానిక మెడికల్ కాలేజీ విద్యార్థులు, జూనియర్ డాక్టర్లుకూడా యథాశక్తిగా సహకరించారు.

## దక్షిణావర్త శంఖం

శ్రీ వేంకటేశ్వర స్వామివారి అభిషేకార్థం దేవస్థానంవారు సేకరించిన దక్షిణావర్త శంఖానికి నవంబర్ 1 వ తేదీన క్షీరాబ్ధిద్వాదశి శుభదినాన పవిత్రీకరణ పూజ జరిగింది. స్వర్ణకవచంతో అలంకృతమైన ఈ శంఖంతో ఆ మరుసటి దినాన వేద మంత్రాలతో స్వామివారికి క్షీరాభిషేకము జరిపారు. దేవస్థానం వారివద్దగల అపూర్వ వజ్రాలను ఈ శంఖానికి అమర్చగలమని దేవస్థాన నిర్వాహక మండలి అధ్యక్షులు శ్రీ ఎన్. రమేశన్ గారు వెల్లడించారు. శ్రీవారి అలంకరణ నిమిత్తం 108 చిన్న శంఖాలతో తయారవుతున్న 'దక్షిణావర్త శంఖమాల' ను రథసప్తమి శుభ దినాన స్వామివారికి సమర్పించడం జరుగుతుందని వారు తెలియజేశారు.

## పలమనేరులో కార్తీక దీపోత్సవం.

5-11-79 వ తేది పలమనేరులో శ్రీ కాశీ విశ్వేశ్వరస్వామి దేవాలయ కోనేరునందు కార్తీక పౌర్ణమినాడు దీపోత్సవము జరిగినది. పుణ్యస్త్రీలు అందరూ కోనేటియందు దీప గుచ్ఛములను నీటియందు వదలిరి. ముందుగా పలమనేరు జిల్లా పరిషత్ బాలికోన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయురాలైన శ్రీమతి చంద్రమ్మ తొలి దీపం వదిలారు. తరువాత చిత్తూరు జిల్లా "హిందూ ధర్మరక్షణసంస్థ" కార్యదర్శిగారైన శ్రీ కృష్ణాజీగారు కార్తీక దీపమాహాత్మ్యాన్ని గురించి ఉపన్యసించారు.

## ప్లవోత్సవం

తిరుపతి శ్రీ కపిలేశ్వరస్వామివారి ఆలయంలో డిసెంబర్ 30 తేది ఆదివారం నాడు శ్రీ విఘ్నేశ్వర చంద్రశేఖరస్వామి వార్లకు, డిశంబర్ 31 తేది సోమవారం నాడు శ్రీ సుబ్రహ్మణ్యస్వామివారికి, 1980 జనవరి 1 తేది మంగళవారం శ్రీ కపిలేశ్వర స్వామికి ప్లవోత్సవ కైంకర్యం జరుగుతుంది.



గోదావరి పుష్కరాలలో తిరుమల తిరుపతి దేవస్థాన పుస్తక ప్రచురణ, విక్రయ విభాగం ఒక పుస్తక ప్రదర్శన నిర్వహించింది. ఆ శాఖ సిబ్బందితో శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి (దేవస్థాన ప్రజాసంబంధశాఖాధికారి)

## ముఖ్యగమనిక

---

తాళ్ళపాక అన్నమాచార్యుల కీర్తనల సంపుటాలవెల తగ్గింపబడినది

ఒక్కొక్కప్రతి వెల: రు. 5/- మాత్రమే.

26 వ సంపుటముకూడా విడుదలైంది.

వివరాలకు: సంపాదకుడు,
తిరుమల తిరుపతి దేవస్థానం,
తిరుపతి.

17 తారీఖు వరకు శృంగారం, సంతోషం ఆ తర్వాత ధనధాన్యాలు లేదా పేరు ప్రతిష్ఠలు, వస్తుసమృద్ధి మరియు సంతానప్రాప్తి 6 తేది వరకు బుధుని ప్రభావం వలన ధనం, శృంగారం లేదా మంచి సహవాసాలు, వాహనయోగం లేదా సంతాన ప్రాప్తి, ఆ తర్వాత 29 తేది వరకు శత్రు సంబంధమైన ఆందోళన, లేదా అపకీర్తి లేదా అనారోగ్యం, ఆ తర్వాత చెడుసలహాలు, తగాదాల మూలంగా ధననష్టం

మకరం

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ఠ 1.2 పా)

రాహువు వలన అనారోగ్యం. గురుని వలన కూడా అనారోగ్యం లేదా ప్రయాణం, ప్రయాస, కుజుని కారణంగా ప్రమాదంలో శరీరహాని లేదా ధననష్టం లేదా అపఖ్యాతి. శని మూలంగా అనారోగ్యం లేదా తీవ్రమైన తగాదాలు లేదా అధార్మిక ప్రవర్తన. 17 వ తేది వరకు రవి వలన ఆరోగ్యం, విజయం కాని ఆ తర్వాత ధననష్టం లేదా ప్రయత్నాలలో ఆటంకాలు. శుక్రుని ద్వారా 17 వ తేది వరకు ధనం లేదా నూతన వస్త్రాలు ఆ తర్వాత శృంగారం, సంతోషం బుధుని వలన 6 వ తేది వరకు ధనం, విజయం, లేదా శృంగారం లేదా నూతన గృహం ఆ తర్వాత 29 వ తేది వరకు ధనం స్నేహితులు, శృంగారం లేదా వాహనయోగం, సంతానప్రాప్తి, ఆ తర్వాత అనారోగ్యం లేదా వివాదాలు లేదా అపకీర్తి.

కుంభం

(ధనిష్ఠ 3,4 పా, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పా)

రాహువు వలన వివాదాలు. గురుని ద్వారా శృంగారం, కుజుని కారణంగా భార్యతో తగాదా లేదా నేత్రబాధ లేదా జ్వరం. శని మూలంగా అయినవారినుండి వేర్పాటు. రవి వలన విజయం పేరు ప్రతిష్ఠలు, ఆరోగ్యం ధనప్రాప్తి. 17 వ తేది వరకు శుక్రుని ద్వారా ధనం, స్నేహితులు మానసిక ఆహ్లాదం, ఆ తర్వాత ధనం లేదా నూత్న వస్త్రాలు. బుధుని వలన 6 వ తేది వరకు నిరాశ ఆ తర్వాత ధనం, విజయం లేదా శృంగారం, నూతన గృహం, ఆ తరువాత అనారోగ్యం లేదా వివాదాలు లేదా అపఖ్యాతి.

మీనం

(పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి.)

రాహువు ద్వారా ధనాభావం. గురుని వలన మనశ్శాంతికి భంగం. కుజుని కారణంగా విజయం, ధనసమృద్ధి. శని మూలంగా ప్రయాణం. రవి వలన 17తేది వరకు అస్వస్థత, ఆ తర్వాత విజయం, సంతోషం. శుక్రుని వలన 17 తారీఖు వరకు అపకీర్తి, లేదా వివాదాలు. ఆతర్వాత స్నేహితులు, సంతోషం. సౌభాగ్యం బుధుని వలన 6 తేది వరకు విజయం, నూతన వస్త్రాలు లేదా సంపద, సంతానం. ఆ తర్వాత 29 తేది వరకు నైరాశ్యం. అటుపై సంపద, సఫలత.

★

## చందాదారులకు విజ్ఞప్తి

సప్తగిరి మాసపత్రిక చందాదారులలో దిగువ పేర్కొన్న సంఖ్య వారి చందా 31-1-80 తేదీకి అంతమగును. చందాదారులు ఈ విషయమును గమనించి M. O. ద్వారా దిగువ పేర్కొనిన ప్రకారము మనియార్డరు కూపనునందు తమ చందా సంఖ్య పూర్తి విలాసమును పేర్కొని, త్వరలో చందా పంపనియెడల ఆ తేది దరిమిలా పత్రిక పంపబడదు.

చందాదారుల నంబర్లు మార్చబడినవి. క్రొత్తనంబర్లు దిగువ పేర్కొనబడినవి. తమకు పంపిన పత్రికఅడ్రసు పేపరుమీదనున్న నంబరును క్రొత్త నంబరుగా గమనింప ప్రార్థన.

10 15 21 57 77 176 210 223 228 241 260 267 280 297 418 427 448 450 452 461 462 481 518 619 630 631 632 634 635 636 638 638 639 640 641 643 644 645 646 654 685 901 927 933 to 938 940 to 946 948 to 953 (952A) (954 A) 956 957 959 962 964 965 968 969 971 979 to 932 984 985 987 to 990 992 993 994 997 to 1001 1776 1877 1972 to 1989 1991 to 2018 2022 to 2056 2058 to 2090 2092 to 2104 2106 2108 2110 to 2122 to 2124 2141 2143 to 2147 2149 to 2168 2170 to 2173 2175 to 2189

గమనిక :- (1) సప్తగిరి చందాలు 15 తేదిలోగా చేరునట్లు పంపవలెను. ఆతరువాత చేరిన చందాలకు మరునెలనుండి మాత్రమే పత్రిక పంపబడును.

(2) క్రొత్త చందాదారులు కూపనులో 'క్రొత్తచందా' అని పేర్కొనవలెను. పాత వారు కూపనులో తమ చందా సంఖ్య నమోదు చేయవలెను.

(3) సప్తగిరి చందాలు ఈ క్రింది అడ్రసుకే తమ పిన్‌కోడ్ తెలియజేస్తూ పంపవలయును.

సప్తగిరి మాసపత్రిక సం॥ చందా రు. 6/-

ఎడిటరు
పబ్లికేషన్ సెక్షన్
ప్రెస్ కాంపౌండ్, తిరుపతి 517501.

*Edited and Published on behalf of T. T. Devasthanams by K. Subba Rao, M.A., and Printed at T. T. D. Press by M. Vijayakumar Reddy, Manager T. T. D. Press Tirupati-517501*

# తిరుమల యాత్రికులకు సదుపాయములు

★ ★ ★

* అన్నివర్గాలవారికి అందుబాటులో ఉండేటట్లు ఉచిత పరిశుభ్రమైన సత్రాలు, లేదా సరసమైన రేట్లకు కాటేజీలతో ఆవాస సౌకర్యం.
* శ్రీవారిని దర్శించు యాత్రికుల క్యూషెడ్లలో గాలి, వెలుతురుగల విశాలమైన ఏర్పాటులు.
* క్యూ షెడ్లలోనే కాఫీబోర్డువారి అల్పాహార సదుపాయం.
* సరసమైన ధరలకు అన్నపుపొట్లాల అమ్మకం.
* యాత్రికులు వెలుపలకు పోనక్కరలేకుండా క్యూలదగ్గరే మరుగుదొడ్డి సౌకర్యం.
* ఆంధ్రప్రదేశ్ పాలసరఫరా సంస్థచే స్వచ్ఛమైన పాలవిక్రయం.
* యాత్రికులు చదువుకునేందుకు దేవస్థానం ముద్రిత గ్రంథాలు స్వామివారి, అమ్మవారి చిత్రపటాల అమ్మకం.
* క్యూలోని యాత్రికులకు విసుగులేకుండా ఉండేందుకు టెలివిజన్ ప్రదర్శనం, భక్తిసంగీత ప్రసారం.
* క్యూలైన్లలోను, తిరుమలకుపోవు కాలిబాట 7 వ మైలువద్ద వైద్యసదుపాయం.
* సామానులు, పాదరక్షలు భద్రపరచుకొనేందుకు ప్రత్యేక సౌకర్యం
* తిరుమలలో సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసునుండి వివిధప్రాంతాలకు ఆటో సౌకర్యం.

## ఉచిత బస్సుసదుపాయం

* దళారీలనుండి వంచకులనుండి తప్పించేందుకు ముఖద్వారంలో పేష్కారుస్థాయి అధికారి సిబ్బంది.
* క్యూషెడ్లలోని యాత్రికుల ఫిర్యాదులు విచారించేందుకు కావలసిన సౌకర్యములకుగాను పేష్కారు స్థాయిలో మరొక అధికారి, సిబ్బంది.
* యాత్రికుల సామానులను భద్రంగా తిరుమలకుచేర్చే సౌకర్యం ఏర్పాటైంది. తిరుపతిలో ఏ సత్రములోనైనాగాని, టోల్ గేట్ వద్దగాని తమసామాగ్రి అప్పగించి రసీదుపొంది ఆరసీదు తిరుమలసెంట్రల్ రిసెప్షన్ ఆఫీస్ దగ్గర కౌంటర్ లో ఇచ్చి సామాగ్రి పొందవచ్చును.
* దుండగులనుండి యాత్రికులను కాపాడేందుకు, తిరుమలకు వెళ్ళేదోవపొడుగునా రాత్రింబవళ్ళూ పోలీసు గస్తీ ఏర్పాటుచేయబడింది.
* దారిపొడుగునా మంచినీటి సదుపాయం ఉన్నది.
* రాత్రిపూటగాని, తెల్లవారుఝామునగాని కొండకు వెళ్ళదల్చుకొన్నవారికి వీలుగా మంచికాంతి శక్తిగల దీపాలు ఏర్పాటైనవి.
* వివిధప్రాంతాలనుండి వచ్చేయాత్రికులకు బోధపడేందుకుగాను తిరుమల సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసులో, దేశంలోని ముఖ్యభాషలలో విచారణ కార్యాలయాలు.
* ప్రత్యేక కాటేజీలలోని అదనపు సౌకర్యాలు అంజనాద్రినగర్, శేషాద్రి, గరుడాద్రి, శంకుమిట్ట కాటేజీలలో కూడ ఏర్పాటైనవి.

దేవస్థాన ప్రయత్నాలలో ఇవి కొన్నిమాత్రమే!

గమనిక: తిరుమలలో 2–4–79 నుండి తపాలాకార్యాలయము రాత్రి 8–30 గం॥ వరకు పనిచేస్తున్నది. ఇది గాక ప్రధాన తపాలాకార్యాలయము రాత్రి 10–30 నుండి 1–00 గం॥ వరకు పనిచేస్తుంది. శ్రీ వేంకటేశ్వరస్వామి వారి భక్తుడు అన్నమాచార్యుల తపాలాముద్రను కోరినవారు, తమ కార్డులు, కవర్లపై ముద్రించుకోవచ్చును.

# మానవ - మాధవ సేవలు కలిసివచ్చే కలియుగ వైకుంఠ సేవ

## తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామివారిని దర్శించవచ్చే యాత్రికులకు అన్నప్రసాద వినియోగపథకము.

* సుమారు 1300 సంవత్సరాలకుపైగా అవిచ్ఛిన్నంగా అనిమేషంగా ఆరాధన జరుగుతున్న ఏకైక దేవాలయం, శ్రీవేంకటేశ్వరాలయం. బ్రహ్మోత్సవాది ప్రత్యేక సందర్భాలలో 50 లేక 60 వేలకు నడుమ, సాధారణ దినాలలో 20 లేక 25 వేలకు నడుమ, భక్తులు రోజూ దర్శించే దివ్యక్షేత్రం.

* ఆసేతుహిమాచలం ఆరాధ్యదైవమైనమూర్తి శ్రీవేంకటేశ్వరుడు. వేలాది భక్తులు ఆర్థిక స్తోమతలేని వారు ఉన్నదంతా వెచ్చించి శ్రీవారి దర్శనంకోసం కొండకు నడిచివస్తారు. తిరిగి తమతోపాటు శ్రీవారి ప్రసాదాన్ని తీసుకొనివెళ్ళి బంధుమిత్రులకు పంచుకోవాలన్న ఆరాటం సాధారణంగా వారికి వుంటుంది.

* అటువంటి పేదయాత్రికులకు ఈ ప్రసాదాలను ఉచితంగా లభింపజేయగల్గితే అంతకుమించిన సేవలేదు.

* ఈ ఉద్దేశ్యంతోనే దేవస్థానం, మధ్యతరగతి కుటుంబీకులుకూడ ఈ ధర్మకార్యక్రమంలో పాల్గొనేందుకు వీలుగా ఒక ప్రణాళికను ఏర్పాటుచేసింది. దాని ముఖ్యాంశాలు యివి :

శ్రీవేంకటేశ్వర నిత్యప్రసాద ధర్మాదాయ పథకంపేర జరిగే యీ కార్యక్రమంలో రు. 500/- "దేవస్థానం నిధి"గా యేర్పాటుచేసి ఎవరైనా పాల్గొనవచ్చును. ఈ నిధి బ్యాంకులో మూలధనంగా వుంచబడుతుంది. దానిమీద సాలీనా వచ్చే వడ్డీతో ప్రతి సంవత్సరము 20 లడ్డూలు లేదా 15 వడలు లేదా 20 అన్నపు పొట్లాలను దాత పేర్కొన్న దినాన క్యూలైన్లలోని పేదయాత్రికులకు పంచటం జరుగుతుంది

* ఇది శాశ్వతనిధి కనుక ఒకసారి ఏర్పాటుచేస్తే దానిపైనవడ్డీ నిరవధికంగా వస్తూనేవుంటుంది. దాత తనకు తమవారి పుట్టినతేది లేదా కల్యాణదినాలు లేదా తల్లి లేదా తండ్రి పుణ్యదినం లేదా తమకు ముఖ్యమనిపించిన తేదిని తెలిపితే ఆరోజున అతనిపేర లేదా అతడుపేర్కొన్న ఇతరులపేర యీ ప్రసాదం పంచడం జరుగుతుంది.

* ఆ నిర్ణీతదినాన ఉదయంపూట స్వామివారి దర్బారులో ఆదాతపేరు గోత్రం పేదయాత్రికులకు విరాళమేర్పాటుచేసినట్లు అతని పేర ప్రసాదం పంపిణీ జరుపబోతున్నట్లు విన్నవించడం జరుగుతుంది.

* ఈ విధంగా రు. 500/- పద్ధతిన ఒక్కొక్కరు ఎన్నిరోజులకైనను యేర్పాటు చేయవచ్చును.

* ఈ విధంగా 20 నిధులు లేదా రు. 10,000/- నిధి యేర్పాటుచేసినవారు నిర్ణీతదినాన సకుటుంబంగా ఆకార్యక్రమానికి హాజరుకావడమేకాక కుటుంబ సభ్యులు 5గురు శ్రీవారిని దర్శనంచేసుకోవచ్చును.

* ఈప్రణాళికకు నిధి స్వీకరణ వెంటనే ప్రారంభమౌతుంది. ప్రసాదవినియోగం 1980 సంవత్సరంలో వచ్చే ఉగాదినాడు ప్రారంభమౌతుంది.

* శ్రీవారి దర్శనానికి వచ్చే యాత్రికసందోహంలో అతి పేదవారి సేవలో తరతమ భేదం లేకుండా అందరూ పాల్గొని శ్రీవారి ఆశీస్సులు పొందేటందుకు అపూర్వ అవకాశం.

* ఈ ప్రణాళికక్రింద చెల్లించిన డబ్బుమీద ఆదాయపుపన్నునుండి మినహాయింపు లభిస్తుందిగనుక దీనిక్రింద తమ విరాళములను పేర్కొని మినహాయింపు పొందవచ్చును.

* మానవసేవ, మాధవసేవ కలిసివచ్చేపుణ్యం రెండింతలుగా రాగల అపూర్వ అవకాశాన్ని ప్రతిభక్తుడు వినియోగించుకొని గోత్రం, లేదా ఇంటిపేరు, దాతపేరు, వినియోగం జరపవలసిన ప్రసాదంపేరు, వినియోగం జరపవలసిన తేది పేర్కొని విరాళాలు పంప అభ్యర్థన.

* విరాళాలను, ఏ బ్యాంక్ డి. డి. ద్వారానైనా 'కార్యనిర్వహణాధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం' పేర, మేనేజర్ ఆంధ్రాబ్యాంక్, గాంధిరోడ్డు తిరుపతి 517501 అనేవిలాసానికి పంపండి లేదా దేశంలోని ఆంధ్రాబ్యాంక్ వివిధ శాఖలలో చెల్లించవచ్చు.

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.